గూలఁ దిట్టై మేధావిశిష్టు. అప్ప.౨.౩౬౯.
౨. భూఖండము. (వా.)

**కండోష్ఠము.** సం. వి. అ. పుం. శూకకీటము,కంబళిపురుగు, గొంగళిపురుగు. (దీనిని స్పృశించిన మిక్కిలి దురద గలుగును.)

**కంత**=క్రంత². (బ్రా.) వి. ౧. రంధ్రము.
క. తొమ్మిదికంతలలి త్తికి, నిమ్మగుసొమ్ములును గలము నేటికిఁ జెపుమా,నమ్మకు దేహము నా దని ... వేమ. ౧.౭౮౭.
౨. సందు.
గీ. బాగులే యిట్టిసెలఁ వైనప్రాపు గల్గి, యల్పులకు లొంగి తిరుగ లేమయ్య మేము,కర్మమా మాకు గజ మెక్కి కంతఁ దూఱ. సిం.నార. ౬౬. (నిర్ధారకప్రయోగములు లేవు.)

**కంతము.** సం. విణ. (అ.ఆ.అ.) సుఖయుక్తము, హాయిగా నుండునది.

**కంతి**=కణిఁతి.వి.(సం. గ్రంథిః.) ౧.గడ్డవలెఁబుట్టెడురోగవిశేషము.
(ముసలిజంగమయ్యవర్ణనము) సీ. వణఁకెడు శిరమును బెణఁకెడుగమనంబు భగ్నదంతావళి పక్కకంతి. చెన్నబ.౨.౭౯. ఆం.భా. ౨.౭౪.
౨. బొప్పి, బుడిపి.
ద్వి. దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౩.

**కంతు.** వి. గడువు, నిర్ణీతకాలము. (శ. ర.)

**కంతుఁడు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు.
గీ. కంతుఁడును నీ విధుండు నొక్కంతవారు. నైష. ౮. ౧౭౯.

**కంతువు.** సం. విణ. (ఉ.) సుఖము కలవాఁడు. వి. ఉ. పుం. ౧. హృదయము. ౨. గాదె.(వై. ని.)

**కంథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చింపిగుడ్డలను గూర్చి కుట్టినబొంత. ౨. మట్టిగోడ. ౩. గ్రామము,ఊరు.

**కంథటిక.** సం. వి. ఆ. స్త్రీ. కంథ, బొంత. (వై. ని.)

**కంథరి.** సం. వి. ఈ. స్త్రీ. వాఁడిముండ్లు గలయొకానొకవృక్షము.

**కంథారి.** సం=కంథరి.

**కంథావాటము.** సం. వి. అ. పుం. ప్రాకారము. (త్రి. ని.)

**కంద.** వి. (సం.కందః. త. కంద్తై.) కందమొక్క, సూరణము!.
గీ. కంద యన సూరణాఖ్యయా గరళకంఠ. ఆం. భా. ౨. ౭౧.
గీ. ... ఉల్లి కంద,పసుపుఁదోఁటలు ... నీలా. ౨. ౫౭.
ఏ. కందదుంప.
గీ. ఇంత బతిమాల మా కేల యెట్టు లైనఁ,గాని శుభకంద కందకు లేనిదూల,బచ్చలికి నేల గల్గు నోపరమపురుష. సిం. నార. ౫౯.
సీ. కంద పసుపు మొదల్గాఁగలయవి యేకవచనమై నిజమూలవాచ్యము లగు.ఆం.భా.౨.౪౧.

**కందఁబాఱు**=కందు¹. (కందన్+పాఱు.) (నల్లపడు)
సీ. లలితముక్తాహారగుళికాకలాపంబు ప్రాణానిలంబునఁ గందఁబాఱె. నైష. ౨. ౧౧౯.

**కందకము.** వి. అగడిత, పరిఖ.

**కందగుడూచి.**సం.వి.ఈ.స్త్రీ.ఒకదివ్యసులిప్పతీఁగ.

**కందటము.** సం. వి. అ. న. తెల్లకలువ, శ్వేతోత్పలము.

**కందనకా(గా)య.** వి. గుండెకాయ.
వ...కారిజమున్ గందనకాయ క్రొవ్వు మొదలగు మిగుల మెత్తనిపలలభిత్తంబు లందుఁ గ్రందుకొనన్ గ్రుక్కి. మనుచ. ౪. ౬౦. ఆం. భా. ౨. ౧౩౨. ఆము. ౪.౨౩.

**కందన(ణ)ము.** వి. మల్లబంధవిశేషము, ఘుప్పది రెండువిన్నాణములలో నొకటి.
హంస.౧ ౨౦౬.ప్రబంధ.౭౭.ఆం.భా.౨.౨౧౯.

కందఫల. సం. వి. ఆ. స్త్రీ. పొట్టికాఁకర, చిఱుకాఁకరకీ.

కందబహుళ. సం. వి. ఆ. స్త్రీ. త్రిపర్ణికావృక్షము.

కందము[1]. వి. (సం. స్కంధః. ప్రా. ఖంధో) పశువుల మూఁపు, మూఁపురము.

ఉ. కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు...భార. విరా. ౫. ౬౯.

(ఇట్టిపోతులు) ఆ. కప్పు నెట్టి వెన్ను కందంబు సమముగాఁ, బొదలి జోళ్లు గట్టి పోరుచుండి, మలయుఁ గాని పోవు మానిసిఁ బొడగన్న. నునుచ. ౪. ౨౩. ప్రబంధ. ౧౩౩.

కందము[2]. వి. (చి. ని-సం. స్కందకమ్ = ఆర్యావృత్తభేదము-విల్యమ్సు. సం. వి. అ. పుం-అని శ. ర.) మాత్రాబద్ధపద్యవిశేషము, జాతులలో నొకటి.

క. కందములఁ బ్రాసగణయతు, లందముగాఁ గవిత నెంద ఱల్లరు వినుసీ, కందంబులు రసవన్మా, కందంబులు ... కవిచా. ౧౦.

సా. కందము చెప్పినవాఁడు కవి, పందిని బొడిచినవాఁడు బంటు.

కందము. సం. వి. అ. పుం. న. ౧. కందగడ్డ. ౨. గడ్డ. ౩. నీరుల్లి. ౪. గ్రంథి, కంతి. ౫. తామరదుంప. పుం. ౧-నీటిని ఇచ్చునది-మేఘము. ౨. యోని రోగభేదము.

కందమూలము. సం. వి. అ. న. మూలకము, ముల్లంగికీ.

కందర. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుహ. ౨. గుహవంటికనుమ.

కందరము. సం. వి. అ. పుం. న. ౧. గుహ. ౨. గుహాకారముగ నుండుకొండలనడిమిప్రదేశము, కనుమ. పుం. అంకుశము. న-జలముచేత నేలఁ జీల్చుకొనివచ్చునది-౧. అల్లము. ౨. అంకురము, మొలక.

కందరాకరము. సం. వి. అ. పుం - గుహలకు స్థానము-పర్వతము.

కందరాలము. సం. వి. అ. పుం. ౧. గర్దభాండవృక్షము, గంగరావికీ. ౨. ప్లక్షము, జువ్వికీ. ౩. కొండగోనుగుకీ.

కందరి. సం. వి. ఈ. స్త్రీ = కందర.

కందరికము. వి. కంథాస్తరణము, నర్తకులుకూర్చుండుటకు వేసికొనుబొంత. అం. భా. ౨. ౭౬౭.

కందరోద్భవ. సం. వి. ఆ. స్త్రీ - గుహలలోఁ బుట్టినది-౧. క్షుద్రపాషాణభేదికీ. ౨. గుహూచీభేదము, ఒకజాతి తిప్పతీఁగ.

కందరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. గుహూచీభేదముకీ.

కందర్పకూపము. సం. వి. అ. పుం. ఆఁడుగుఱి.

కందర్పజీవము సం. వి. అ. పుం-మన్మథవికారమును పెంచునది-పనసచెట్టు.

కందర్పభోగులు. సం. వి. అ. పుం. బ. ధాన్యభేదము.

వ. వెండిగుండ్లు బొంతమడమలు కూటికుప్పలు కారుసంపెఁగలు కందర్పభోగులు గజపతిలాగీలు బొందడీలు. ప్రబంధ. ౧౧౨.

కందర్పము. సం. వి. అ. పుం. (సంగీ.) ధ్రువకభేదము.

శ్లో. త్రయోవింశతివర్ణాంఘ్రి ర్ధ్రువః కందర్పసంజ్ఞకః (కల్ప.)

కందర్పముసలము. సం. వి. అ. పుం. మగగుఱి.

కందర్పశృంఖలము. సం. వి. అ. పుం. ఒకానొక రతిబంధము.

శ్లో. నారీపదద్వయం న్యస్య కాంతస్యోరుద్వయోపరి, కటిం చోద్దోలయే దాశు బంధః కందర్పశృంఖలః. (రతిమంజరి.)

కందర్పుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

కందలత. సం. వి. ఆ. స్త్రీ. మాలాకందముకీ.

కందళము. వి. ఎద్దుమీఁపుపైవేసెడుగంత. (బ్రౌ. శ. ర.)

కందళ(ల)ము. సం. వి. అ. పుం. న. ౧. నవాంకురము, క్రొత్తమొలక. ౨. అవ్యక్తమధురధ్వని. ౩. ఉపరాగము, సూర్యచంద్రులగ్రహణము. ౪. అపవాదము, నింద. ౫. కపాలము. ౬. కదళీభేదము, ఒకా

నొకఅరఁటికి.(కల్ప.)పుం.౧.బంగారు.౨.కలహము;వాగ్యుద్ధము.3. కందగడ్డ.

**కందళి(ళీ).** సం.వి. ఈ. స్త్రీ. ౧. పెక్కెము. ౨.గుల్మభేదము, ఒకవిధమైనపాద. 3. ఒకజాతి లేడి. ౪. నవాంకురము, క్రొత్త మొలక. ౫. అవ్యక్తమధుర ధ్వని. ౬. ఉపరాగము, సూర్యచంద్రుల గ్రహణము. ౭. అపవాదము, నింద. ౮. కపాలము ౯.తామరగింజ. ౧౦. అరఁటికి. (కల్ప.) వి. న్ .పుం. ఒకజాతిలేడి. (క్షీరస్వామి.)

**కందళించు.** సం. అ. క్రి. ౧.అంకురించు, మొలచు. (బ్రా. శ.ర.) ౨. వికాసము నొందు; సంతసించు.

గీ. సకియ మది నెంచి తమి మించి సంభ్రమించి, కరము లడరించి తెరవంచి కందళించి,పొంచి తిలకించి పులకించి పొలుపుఁ గాంచి, కాంచె రోహిణి చంద్రుని గాంచినట్లు.బిల్హ.౨.౭౪.

శా. ఎండే డెందము కందళించు రహిచే ... మనుచ. ౨. ౬౨.

**కందళికము**=కందళము.

సీ. గూటపుఁదిరుగుళ్లఁ గొలికిదా మెనత్రాళ్లఁగం దళికముఁ గోలె కదురుకోల.హంస.౫.౯౮. (శ. ర. పా.)

**కందళితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. వికసించినది, విరిసినది. ౨. మొలకెత్తినది; పయికివచ్చినది.

**కందళీకుసుమము.** సం. వి. అ. న. ౧. శిలీంధ్రము, పుట్టగొడుగుకి. ౨. అరఁటిపువ్వు.

**కందవర్ధనము.** సం.వి.అ.పుం.సూరణము,కందగడ్డ.

**కందవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁగాఁకరకి.

**కందశాకము.**సం.వి.అ.న.దుంపకూర.(కంద, మొ.)

**కందసారము.** సం. వి. అ. న. ఇంద్రునితోఁట, నందనము. (త్రి. ని.)

**కందాయము.** వి. జ్యేష్ఠమాసము మొదలు నాలుగేసిమాసములకాలము.

సీ. ఆయతి కారు కందాయ మనంగ జ్యేష్ఠాది మాసచతుష్టయంబు దనరు.ఆం. భా. ౧.౯౬.

**కందారి.** వి.ఒకానొక చెట్టు, తీక్ష్ణకంటకకి.(శ.ర.)

**కందార్హము.** సం. వి. అ. పుం. కందగడ్డ.

**కందాలువు.** సం. వి. ఉ. పుం. ౧. కాసాలువుకి. ౨. భూమికందము, త్రిపర్ణికకి.

**కంది.** వి. సస్యవిశేషము, తువరికి.ఆం.భా.౨.౨3౫. ౭. ధాన్యవిశేషము. భీమ. 3. ౫౭.

**కంది.** సం. విశ. (న్. నీ. న్) గడ్డ కలది. వి.న్. పుం. కందగడ్డ. ఈ. స్త్రీ. కంతి, మాంసగ్రంథి.

**కందిరి.** సం. వి. ఈ.స్త్రీ.సోఁకుడుముడుఁగు మొక్క, అత్తపత్తికి.

**కందు**[1]. అ. క్రి.(క.కందు.) ౧.తప్తమగు;తాపమునొందు.

క. కందు గలపసిఁడి గాఁచినఁ,గంది వివర్ణమయినట్లు కౌరవుకాయం,బొందఁగ వివర్ణమై కడు, వందె మనస్తాపహవ్యవహదాహమునన్.భార. సభా. ౨. ౮౯.

క ...ధృతి చెడి, కంది మునీంద్రుండు దానిఁగవయం దివిరెన్. భార. ఆది. ౪. ౪౪.

౨. నొచ్చు.

గీ. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి, పువ్వుఁదేనియఁ గొనియెడుపోల్కి నెదురు, గందకుండఁగఁ గొనునది కార్యఫలము.భార. ఉద్యో. ౨. ౫౭.

ఉ...అరిం బ్రజల్,గందఁ గొనండు ... ఆము. ౨. ౪౦.

3. వివర్ణత నొందు.

(క) తేజోవిహీన మగు.

గీ. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొందినట్లు,గంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు. భార. ఉద్యో. ౨. ౧౦౭.

(చ) మ్లానమగు, వాడు.

ఆ. ఆతనికరతలద్వయామర్దితమ్ములై, కందియును మహాసుగంధకుసుమ, తతులు తొంటియట్ల తమకంపువిడువక,యుండు నతని తేజ మున్న తంబు. భార. ఆర. ౨. ౧౯౬.

ఉ. అంటినఁ గందు మేను...హరి. ఉ. ౭. ౨౧.

(ట) మలినమగు.

గీ. కందు వారలనిట్టూర్పు గాడ్పు వేఁడి, ముకుర ములు చారుమోహనమూర్తి యనఁగఁ,బరఁగు దమయంతి చేతిదర్పణముదక్క.. నైష.౧.౬౨.

(త) ఎఱ్ఱపడు.

సీ. గ్రాహదంష్ట్రాటంకికాశిఖాగ్రము సోఁకి కంది నజఘునభాగంబుతోడ. గీ. వచ్చి తనకట్టె దురనున్నవానిఁ బుత్త్రుఁ, గాంచె ... కాశీ. ౪. ౬౯.

(వ్యవ)కోపముచేత వాని మొగము కంది కంనగడ్డ యైనది.

౪. క్షీణించు, తగ్గు; కృశించు; పోవు; నశించు.

క. కొనియాడుఁ బితృగణంబులు, గొనియాడు బుషివ్రజంబు గురుసమ్మదముల్,జనియించు వేల్పులకుఁ గం,దని పెంపున నరుఁడు గోవు దానము సేయన్. కాశీ. ౨. ౧౯.

గీ. ఇంక నిచ్చోట నుండిన నేమికీడు,పుట్టునో యొండుచోటికిఁ బోవ వలయుఁ,బూరియు ను నీరుఁ గడుఁ బతివోయెఁ బసులు,కందుచున్నవి మన కేలయిందునుండ. వి.పు.౭.౧౪౫.

గీ. పచ్చటామానికంబులపళ్లెరములఁ, బచ్చగందనికూర లేర్పడమిఁ జూచి,పెట్ట రని పెండ్లిపెద్దలు పెడముపెట్టి. నైష. ౬. ౧౨౨.

గీ. పచ్చ గందని పైరుల...దశా. ౧. ౧౧౩.

౫. కోపించు.

చ. అనిమిషనాథుఁ డిట్టిపనికై ననుఁ బంపెఁ దదీయకార్య మే,యనువునసైనఁ జేసి హృదయంబున సంతస మందఁ గందునో,మునివరు మోసపుచ్చుటకు ముందఱ నిల్వ నతండు రేఁగినె,మ్మనమునఁ గందునో చనుట మానితినేని బలారి గందునో. చిత్రభా. ౨. ౧౧౨. భాగ. ౭. ౩౨౦.

విణ. నల్లనిది, కృష్ణవర్ణముకలది.

సీ. చెంగావివలిపంబు చెలువార ధరియించి దళముగా మేన గందంబుఁ బూసి,కందుదుప్పటి గప్పి యందియ డాకాలఁ గీలించి...వచ్చెనొకఁడు. ద్వా. ౧౦. ౭౩.

వి. ౧. నల్లమచ్చ, కళంకము.

సీ. ఇందుబింబముమీఁదికందుచందంబునఁ గురులు నెమ్మొగమున నెరసియుండ. భార.విరా. ౨. ౧౩౭, ౫౨.

౨. మాలిన్యము; నలుపు.

క.కందు గలపసిఁడి గాఁచినఁ, గంది వివర్ణమయి నట్లు...భార. సభా. ౨. ౨౯.

శా.నీడ ల్వాఱుపసిండి మేడలపయి న్నీలాలకల్ పుట్టచెం,డాడన్ దాఁకినకందుగానిళశియం దంకంబు గాదు... రాజశే. ౧. ౪౫. ఆం. భా. ౧. ౧౦౭.

౩. సంతాపము; దుఃఖము.

క...మది,కం దంతయుఁ బాపి ... నా. పంచ. ౪. ౯౯.

శా. ...మదికం దెల్లన్ దెగన్ బుచ్చఁగా, నీ పెం పార్యజనంబు మెచ్చ ధృతి కుస్థైర్యంబు గావింపవే. నిర్వ. ౯. ౭౭.

౪. దోషము; లోపము.

గీ...కందు లేని,యెల్లసిరులకు నెల్లయై ... కళా. ౧. ౧౦౭.

గీ. కందు లేనిమనీషి...సీతారా. ౨. ౧౫౦.

చ ... పుష్టి యేమియుం,దనువునఁ గందు చూపమి...పరమ. ౨. ౧౭౩.

౫. సెగ, కాఁక, తాపము. ఆం. భా. ౧. ౪౯.

జః-కందఁబాఱు, కందువాఱు.

కందు². (క. కంద.) బిడ్డ, శిశువు; కొదమ, పిల్ల.

క.రాముఁడు దనుజులతో సంగ్రామము సేయం

గఁ గలఁడె కందు గదా... మొ. రా. బాల. ౪౬.

గీ. నిసు వనంగను బిల్ల నా నిసుఁ గనంగఁ, గూన యనఁ గందు నాఁగను గొదమ యనఁగఁ, దిర్యగర్భకములు గాను దెలియవలయు. ఆం. భా. ౨. ౯౯.

**కందుఁడు.** వి. (సం. స్కందః.) కుమారస్వామి.

గీ... కందుఁడు కొమరసామి, యనఁగ గుహనామధేయంబు లమరు సాంబ. సాం. ని. దేవ. ౭.

**కందుకము.** సం. వి. అ. పుం. న. ౧. చెండు, బంతి. ౨. తలగడ, దిండు.

**కందురీఁగ.** వి. (కందురు[1] + ఈఁగ)=కందురు[1]. ఆం. భా. ౨. ౯౫.

**కందురు[1]**= కడుఁదురు, కణుఁదురు. (సం. గంధోలీ, గండోలీ.) ఎఱ్ఱతుమ్మెద, కందురీఁగ. (శ. ర.) జ: కందురీఁగ.

**కందురు[2].** వి. తృణవిశేషము. ప్రబంధ. ౨౦౧.

**కందువ.** వి. ౧. ప్రదేశము, స్థానము.

క.... ఈ, లోకమున నిట్టిచరితం, బేకందువనైనఁ గలదె యెవ్వరికైనన్. నిర్వ. ౧౦. ౭౭.

(క) నివాసస్థానము.

ఉ.... ధర్మముల కెల్లను గందువ ధర్మరాజు ... నైష. ౪. ౩౫.

మ. దయకుం గందువ దానకేళి కిర వంతశ్శుద్ధికిన్ జన్మభూ, మి... రామా. ౧. ౯౨.

(చ) సంకేతస్థలము.

ఉ. కోటలు బొమ్మరిండ్లు మఱి కొండలు తావలు దివ్యదృష్టికిన్, గాటుకలంధకారములు గాఁ జని కందువపట్లఁ బాంసులా, పాటలగంధులొంది రుపభర్తలతో మణితాదు లైనజం, జాటము లేనికూటముల సాహసకల్పలతాఫలంబులన్. కవిక. ౪. ౧౦౩.

(ట) ఏకాంతస్థలము, రహస్యస్థలము.

క. అందులఁ బగినగృహంబుల, కందువ లన్నియును వెదకఁగా నొకచోటన్, జందనపు మందసంబునఁ, గుందనపుంగిన్నె గాంచి కొని చని దానిన్. వైజ. ౪. ౭౨.

౨. జాడ, ఆనవాలు, గుఱుతు.

(అశ్వత్థామ) మ. పరవీరావళియిండ్లకందువ లెడం బాటించుచుం బోయినన్. భార. సౌ. ౧. ౧౬౧.

వ. అచ్చోటికి పెద్దలవలనం గందువ యెఱింగి చని తత్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించిరి... కాశీ. ౨. ౪౨.

౩. మర్మము, కీలు.

క. ఛందోలంకారాదుల, పొం దెఱిఁగిన నెద్ది లేక పొసఁగదు కవితా, సుందరత శక్తి యది యా, కందువ తెగ నెఱుఁగువాఁడె కవివరుఁ డెందున్. కావ్యా. ౩. ౭౭. కాశీ. ౧. ౭.

౪. తెగ, సంఘము.

లయగ్రాహి.... నిలింపమునిబృందములు... దితినందనులతోడన్, బొందుపడ సంధి యొకచందమునఁ జేసి రిరుకందువలవారు... వి. పు. ౧. ౧౭౩.

౫. చమత్కారము.

గీ. కలికిచూపుల మాటలకందువలను, జేరిక లొనర్చి మేకొనఁజేసి వాని, నెనసి యప్పుడె దేవరయిల్లు సడుక, యిల్లు గావించె నంతఁ బూర్ణేందువదన. శుక. ౨. ౪౩౧.

ఉ. కాయజుచూపు లమ్మదుర కందువమాటలఁ బుష్పలావికల్. విజ. వి. ౧. ౧౪. ఆం. భా. ౩. ౩౨.

౬. ఋతువు, కాలము.

మ. ఇవముంగందువలన్ జలంబునను నట్టెండల్ వెసం గాయువే, సవులన్ బంచమహాగ్నిమధ్యమున... నిల్చి చేసెఁ దపమున్ ... పి. శకుం. ౨. ౧౧౨.

సీ. వానకందువను దివారాత్రములు జలధారల బయళులఁ దడియుచుండి. నిర్వ. 3. ౬3.

౨. శపథము, ప్రతిజ్ఞ.

చ... ఋశ్యమూకమునఁ గందువ సేయనె యగ్ని సాక్షిగా, శపథము చేసి తప్పి యిట సంతత దారరతానుభూతి మోహపడుచున్న వాఁడవు... భా. రా. కిష్కిం. ౪.౭౫.

౩. కౌశలము, నేర్పు.

వ... సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకందువసైరంధ్రి చెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁ బనిచిన ...భార. విరా. ౪. ౭౯.

శ్లో. ఆచచక్షే హయజ్ఞానే సైరంధ్రీ కౌశలం తవ. సం. భార. విరా. ౩౭. ౧౧.

కందువచుట్టము=ప్రియబంధువు.

క. కందువచుట్టమవై మది,కందంతయుఁ బాపి మీఁదఁ గలభాగ్యము నా,కందించి మనుపఁ దలఁచితి...నా. పంచ. ౪. ౯౯.

కందువదృష్టి=దివ్యదృష్టి.

(చ్యవనుఁడు)ద్వి.పొందారఁ గరుణతోఁ బూఁబోఁడి నెత్తి, కందువదృష్టిని గడఁగి లోఁ జూచి, ప్రతిపక్షదమనుండు ... పుత్రుండు నీకు, నగుఁగాక కాళింది యనుచు దీవించె. రం. రా. బాల. ౭౦ పా. ౨౭ పం.

**కందువాఱు**=కందు[1].(కందు[1]+పాఱు)అ. క్రి. (మలినమగు)

సీ. కందువాఱినమించుగచ్చుటద్దమువోలె విధుమండలము కాంతి వీడుకొనఁగ.హర.౭.30. (వివర్ణత నొందు.)

వ.వెలవెలఁబాఱె మేఘ మరవిందవిరోధియుఁ గందువాఱె నా,వలపడెఁ గల్పశాఖి ... నరస. ౨. ౭౦. (కలంకము కలదియగు అని రెండవయర్థము.)

**కందువు.** సం. వి. ఉ. పుం. స్త్రీ. ౧. పెనము. ౨. నూలుబంతి. 3.పాకశాల, వంటయిల్లు. (శే.ని.)

**కందుశాల.** సం. వి. ఆ. స్త్రీ. వేఁపుడుపని చేయు శాల.

**కందెన,కందియన.** వి. బండియిరుసునకుఁ బూయుమసి.

సీ.బండికందెనతోడఁ బ్రతివచ్చుమైచాయ నీలిపచ్చడముతో మేళవింప. నైష. ౭. ౯3.

క. ఇరుసునఁ గందెనఁ బెట్టక,పరమేశ్వరుబండియైనఁ బాఱదు సుమతీ. సు. శ. 30.

ఆ. తెఱఁగు లరసి పువ్వుఁదేనెకందెన వెట్టి.వీర. ౨. ౯౪.

సీ. ... కందియనలు పూసి గుజ్జంబులు పూన్చి మీఁద, నాయుధంబులు నించి ... వ. సం. ౧౨. ౭౮౪.

('బండికన్నులకుఁ బట్టించుచమురు' అని ఆం. భా. ౨. ౨౦౨.)

**కందెఱ.** వి.(కన్ను+తెఱ)నేత్రచ్ఛదము,ఱెప్ప.

మ.మఱినాఁ డంధకవృష్ణిభోజయదుసామంతాగ్రణీసేన గం,దెఱగా...కొం,ద అమాత్యుల్ దనుఁ జుట్టి రా నమరె నాస్థానంబునన్ గృష్ణుఁడు...ఉ. హరి. ౨. ౭౪.

**కందోటము.** సం. వి. అ. పుం. తెల్లగలువ. న. నల్లగలువ. (కల్ప.)

**కందోతము.** సం. వి. అ. పుం. కుసుదము, తెల్లగలువ.

**కందోద్భవ.** సం. వి. ఆ. స్త్రీ. గుహూచీభేదము, గడ్డగలతిప్పతీఁగ.

**కంధము.** సం. వి.అ.పుం.౧. మేఘము.౨. ముస్తె.

**కంధర(ము).** సం. వి. ఆ. స్త్రీ-శిరస్సును ధరించునది-మెడ.

**కంధరము.** సం. వి. అ. పుం. ౧-నీటిని ధరించునది-మబ్బు, మేఘము. ౨. ముస్తె. 3. మారిషశాకము, నీటిచిత్తికూర.

**కంధి.** సం. వి.ఇ.పుం-జలము దేనియం దుండునో అది-సముద్రము,కడలి. స్త్రీ-తల దేనిపై నుండునో అది- మెడ.

**కంప.** వి. పొదుము, కంటకాదిభారము.

వ...కంపమండలు త్రోచి...మనుచ. ర. ౩౭.

సీ. వాట మా దవనంపుఁదోఁటకంపనెలుగు తోలఁగి పో నెవ్వరో త్రోచినారు. శుక. ౧. ౨౧౭. ఆం. భా. ౨. ౩౯.

ఉదా: ప్రత్తికంప, ముండ్లకంప.

కంపగట్టు=కంచెవేయు.

క...చెట్టు చేమలు,కానంబడ నటకి కంపగట్టిన పిదపన్. విప్ర. ౨. ౧౯.

కంపకోట=వెదురు మున్నగువాని చే తోఁట మొదలగువాని రక్షణార్థము చుట్టు ఏర్పఱుపఁబడిన ఆవరణము, ప్రాచీనము.

కంపగోడ=కంపతో గోడవలెచుట్టు ఏర్పఱచిన కంచె. (బ్రౌ.)

కంపతోడుగు=కంపలకట్ట. (సేద్యగాండ్రు చల్లినగింజలు కప్పువడుటకై పొలముపైఁ బెట్టి దీని నీడ్తురు.)

గీ. కంపతోడు గీడ్చిన ట్లేదు కానఁ జన్న, తెరువెఱుంగుచు...మనుచ. ర. ౫౮.

కంపవెట్టు = కంపలుగలదిగాఁ జేయు; పాడు పెట్టు.

సీ. పొంచి యెంతయుఁ దోఁడఁబుట్టినదానిల్లు కంపవెట్టినమహాఘనుఁడు వీఁడు. బిల్హ. ౨. ౬౫.

**కంప.** సం. వి. ఆ. స్త్రీ. కంపము, వణఁకు, కదలిక.

**కంపనము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧.వడఁకునది, కదలునది. ౨. వడఁకించునది, కదలించునది. వి. అ. పుం. ౧. శిశిరఋతువు. ౨. అస్త్ర భేదము. ౩. సన్నిపాతజ్వరవిశేషము. ౪. వడఁకుట.

**కంపనీయము.** సం. విశ. (అ. ఆ. అ.) కంపింపఁజేయఁదగినది.

**కంపమానము.** సం. విశ. (అ.ఆ. అ.) కంపించుచున్నది.

**కంపము.** సం. వి. అ. పుం. వణఁకు, కదలిక.

**కంపరము.** వి. ఛాటి, పాడె, శవవాహనము.

ద్వి. సన్నుతి మ్రొక్కి-నసతి నేఁడు సచ్చె ... నీ దీవనయుఁ దప్పునే యని వారు, పాదముల్ విడువక పలవరింపంగ ... కంపరం బవనిపై దింపించి ...బస. పు. ౫. ౫౨౩ పం.

**కంపలక్ష్మము.** సం. వి. న్. పుం.గాలి, వాయువు.

**కంపాకము.** సం. వి. అ. పుం-చలించునది-గాలి.

**కంపించు.** సం. అ. క్రి. వడఁకు, చలించు.

మ. అతిఘోరంబు తమోభిధాననరకం బందుండి దుష్కర్ము లు,గ్రతమశ్శీతనిరుద్ధులై యొఱలుచున్ గంపించుచున్. మార్క. ౨.౬౬.

**కంపితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. వణఁకినది, కదలినది. ౨.వణకింపఁబడినది,కదలింపఁబడినది. వి. అ.న. ౧. కదలిక, వడఁకు. ౨.వడఁకించుట, కదలించుట.

**కంపితవ్యము.** సం=కంపనీయము.

**కంపిరుగుడు.** వి.(కంపు+ఇరుగుడు) భస్మగర్భము. (చి. ని-కంపుటిరుగుడు. శ. ర.)

**కంపిలు(ల్లు).** సం. అ. క్రి. వణఁకు,కదలు.

మ. విని దైత్యేంద్రుఁడు మిన్ను ముట్టి సకలోర్వీభాగముం గంపిలన్,మనుజేంద్రుం దృణలీలఁ ద్రుంతు నని ... సీతావి. ౩. ౧౧౬.

**కంపిల్లము.** సం. వి. అ. పుం. రోచనిఅనుఓషధి. శాలిగ్రామనిఘంటువు. ౧౭౩ పా.

శ్లో. కంపిల్లే రోచనీ గుండా రక్తాంగశ్చంద్రకః క్కశౌ. (వై. ని.)

శ్లో...కంపిల్లోరక్తచూర్ణకః (రాజని.)

**కంపు.** వి. (క. కంపు.) ౧. గంధము, వాసన.

చ. ...కం పెఱుఁగఁ జాలదు నాసిక జిహ్వయున్ జవుల్,గొన వెర వేదు..నేఁ దొఱఁగినన్.భార.అశ్వ.౨.౩౧.(నేను=మనస్సు.)

క....ప్రియ మగుకంపు...భార. ఆను.౫.౬౩.

౨. సుగంధము, సువాసన.

ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక,భూ రుహాదులందుఁ బుట్టినట్టి,పుష్పములఁ బ్రి యంబుఁ బొంది కైకొండ్రు నిర్జరులు పూజ నములఁ గురువరేణ్యా. భార. అను. ౪. ౫. బస. పు. ౪. ౨౮౭ పం.

౩. దుర్వాసన, దుర్గంధము. (చూ. కంపుఁదుమ్మ, కంపు టెలుక.)

గీ. కప్పరంపుఁగుదుటఁ గస్తూరియొరపుతో,నుల్లి నాటి చందనోదకములఁ, జెంప దాని కున్న కంపు వాయనిభంగి, నెంత యైన నిల్వ దింతి మనసు. ద్వా. ౧. ౯౪.

సా: ఎవరికంపు వారి కింపు.

జ: కంపిరుగుడు, కంపుఁదుమ్మ, కంపు టెలుక.

**కంపుఁదుమ్మ.** వి. (కంపు+తుమ్మ) విట్టదిరముళీ. (శ. ర.)

**కంపుటెలుక.** వి. (కంపు+ఎలుక) గంధమూషిక, చుంచు (చి.ని-కంపెలుక. శ. ర.)

**కంపె=కుంపె.** వి. (క. గంపె-శ. ర. బ్రౌ. లనుబ ట్టి పరుషాదిగా గ్రహింపఁబడెను.) తాంబూల పాత్రము.

సీ. తాంబూలపాత్రంబు తబు కంచనంగను గం పె యంచనఁగను గుంపె యనఁగ. గీ. జాల పల్లిక యనఁగను...ఆం. భా. ౨. ౧౬౬.

**కంప్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కంపిం పఁజేయఁబడుచున్నది.

**కంప్యము.** సం=కంపనీయము.

**కంప్రము.** సం. విణ. (అ. ఆ. అ.) వడఁకునది, కదలునది.

**కంబమయ్య.** వి. (కంబము+అయ్య)-స్తంభము న వెలసిన అయ్య- నృసింహమూర్తి.

సీ. ఒకటి యాజమునకు నున్నదందురు గాని కా రెనుపోతును గాన మెచట, నలకంబమయ్య దా నైనదే మోకాని సింగ మెక్కటియైన సె లల లేదు. యయా. ౧. ౧౦౬.

**కంబము.** వి. (సం.స్కంభః. ప్రా. కంభో. క.కం బం. త. కంబ) ౧. స్తంభము, రాడు.

సీ...పంకంబులోనికంబంబు తర్కము...నైష. ౭. ౭౩. పారి. ౧. ౪౯.

౨. మల్లపరికరవిశేషము.

సీ. తత్సాధనంబులై తగుఁ గంబము కోణతే ... ఆం. భా. ౨. ౨౦౭. ప్రబంధ. ౮౨.

జ. కంబమయ్య, కంబమురాయఁడు,కంబవల్లి.

**కంబమురాయఁడు.** వి. (కంబము+రాయఁడు) కంబమయ్య,నృసింహమూర్తి.యయా.౧.౧౨౦.

**కంబరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంపృక్త ము,కలసినది. ౨. చిత్రవర్ణముకలది. వి.అ.పుం. చిత్రవర్ణము.

**కంబళకము.** సం. వి. అ. పుం. న. కంబళి, ఉన్ని వస్త్రము.

**కంబళపురీషము.** సం.వి. అ.న-కంబళికి అంటిన మలమువలె నెంతశోధించినను విడువనిది-ఒకా నొకలిట్టు. (తెనుఁగుగ్రంథములందే కనఁబడు చున్నది.)

ద్వి. మటుమాయలాఁడు కంబళపురీషంబు,పటి కిరింతలపిల్లి పట్టినదొమ్మ,సుద్ధకష్టం డని చూ పఁబు దెగడ. ద్వి. హరిశ్చ. ఉ. ౪౯౪.

**కంబళ(ల)ము.** సం. వి. అ. పుం. ౧. కంబళి. ౨. (ఉన్నితో నేసిన) ఉత్తరీయము. (పయిని నైచు కొనుసాలువు, మొ.) ౩. గంగడోలు. ౪. కంబ ళిపురుగు. ౫. ఏనుఁగుపక్కెర, ఏనుఁగుమీఁద వేయుచిత్రకంబళము.౬.ఒకజాతిలేడి.న.నీరు.

**కంబళి(డి).** వి. (సం. కంబళః. క. కంబళి) కం బళము, గొంగళి.

సీ. ... చనును గంబ. గీ. లంబు గొంగడి యనఁ గను గంబళి యన. ఆం. భా. ౨. ౧౫౭.

సీ. పిల్లఁగ్రోవులు నెక్కు_వెట్టినవింట్లు కంబళ్లు దు
ప్పట్లును వల్లెత్రాళ్లు. శుక. ౨. ౫౪౫.
చ...కంబడిచింపులు...సారంగ. ౧. ౧౧౬.
వ...కటియకంబడిప్రాఁత. ఆము. ౪. ౩౫.
కంబళిపురుగు=కంబళివలె నుండునొకానొక పు
రుగు, గొంగళిపురుగు. (శ. ర. వా.)
జ: కంబళిపండు.

**కంబళి(లి).** సం.విణ. (న్. సీ. న్.) కంబళము క
లది. వి. న్. పుం. ఎద్దు. ఈ. స్త్రీ. ఒకజాతియూఁ
డులేడి.

**కంబళి(లి)క.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిన్నకంబళి.
౨. ఒకజాతియూఁడులేడి.

**కంబళిపండు.** వి. (√కంబళి.) పట్టుపురుగుచెట్టు
పండు. (శ. ర.)

**కంబళీ(లీ)యము.** సం. విణ. (అ.ఆ.అ.) కంబ
ళికి సాధనమైనది. (ఉన్ని.)

**కంబవల్లి.** వి. (√కంబము.) ౧.వడుగుకడపటిది
నమునఁ జేయు స్తంభపూజ మున్నగుసంస్కార
విశేషము. (శ. ర-వడుగుకడపటిదినము. అని.
ఆం. భా. ౨. ౧౭౮.)
౨. వివాహముకడపటిదినమునఁ జేయుసంస్కా
రవిశేషము.
సీ. యాజ్ఞికుల్ దక్షిణ లర్పింప రాజులై రుల్లసద్గ
తిఁ గంబవల్లినాఁడు. రా. వి. ౫. ౮౦.

**కంబి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దర్వి, గరిఁటె; తెడ్డు.
౨. వెదురుకమ్మి.

**కంబు.** వి. (క. త. కంబు.) సజ్జపైరు, గంటెపైరు.
బ. ధాన్యవిశేషము, సజ్జలు, గంటెలు.

**కంబు.** సం. వి. ఉ. పుం. న. కంబువు, శంఖము.
ఉ. ...శృం,గారపువేణి వేణి యొడికంబగుకం
బు గళంబు కొమ్మకున్. ప్రబంధ. ౩౧౬.

**కంబుక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అశ్వగంధ, పెన్నే
రుగ్. ౨. కంఠము.

**కంబుకంఠ.** సం. వి. ఆ. స్త్రీ=కంబుకంఠి.

**కంబుకంఠి.** సం. వి. ఈ. స్త్రీ. శంఖమువంటికంఠ
ము గలయూఁడుది;ఆఁడుది.

**కంబుకము.** సం. వి. అ. పుం. ౧. సంపు,శంఖము.
౨. కంఠము.

**కంబుకాష్ఠ.** సం.వి.ఆ.స్త్రీ.అశ్వగంధ, పెన్నేరుగ్.

**కంబుగ్రీవ(ము).** సం. వి. ఆ. స్త్రీ. శంఖమువలె
మూఁడు రేఖలు గలకంఠము.

**కంబుపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. శంఖపుష్పిగ్.

**కంబుమాలిని.** సం. వి. ఈ. స్త్రీ. శంఖపుష్పిగ్.

**కంబువు.** సం. విణ. (ఉ) చిత్రవర్ణముకలది,కర్బు
రము. (ఊ.) పరద్రవ్యాపహారి, దొంగిలించు
వాఁడు.వి.ఉ పుం.చిత్రవర్ణము.పుం.న.౧.శంఖ
ము, సంపు. ౨.కంఠము. ౩. సంపుగాజు, శంఖ
వలయము. ౪. నత్తగుల్ల. ఉ, ఊ. స్త్రీ. ౧. కంఠ
ము. ౨. గొట్టమువంటియెముక, నలకము.

**కంబూకము.** సం. వి.అ.పుం.కండనము,తవుడు.

**కంబోజము.** సం. వి. అ. పుం. ౧. శంఖభేదము.
౨. గజభేదము. ౩. దేశభేదము. ౪. పున్నాగ
ము, సురపొన్నగ్.

**కంబ్వోతాయి.** సం. వి. న్. పుం-శంఖమువలెఁ
దెల్లనిపూర్వకాయముగలగ్రద్ద-గరుడపక్షి, బొ
ల్లిగ్రద్ద.

**కంభువు.** సం. వి. ఉ. న. ఉశీరము, వట్టివేరు,బొ
రుగడ్డివేరు.

**కంయము.** సం.విణ. (అ. ఆ. అ.)సుఖాన్వితము,
హాయిగా నుండునది.

**కంసము.** సం.వి. అ.పుం. న. ౧. కంచు. ౨. పాన
పాత్రము. ౩. ఆఢకము,మానవిశేషము (కే. ని-
ద్వ్యాఢకము అని నై. ని.)౪. హంస. (కే. ని.)

**కంసకారుఁడు.** సం.వి. అ.పుం. కంచుపనిచేయు
ఒకానొకజాతివాఁడు, కంచరి.

**కంసారాతి.** సం=కంసారి.

**కంసారి.** సం. వి. ఇ. పుం-కంసుని పగవాఁడు-కృష్ణుఁడు.

**కంసాల.** వి. స్వర్ణకారజాతి.

ఆ....కం,సాలజాతివాఁడు చాలఁ గీడు. భోజరా. ౫. ౩౨౨. (ఇటస్థిరవర్ణమునకు ముందు బిందువు కనఁబడుచున్నది.)

**కంసాలి.** వి. (క.కంసాళిక.)స్వర్ణకారుఁడు.

సీ. స్వర్ణకారాభిధ పరఁగుఁ బారసి యగసాలి సొన్నారి కంసాలి యనఁగ. ఆం. భా. ౨. ౨౯౮.

**కంసాస్థి.** సం. వి. ఇ. న. కంచు, కాంస్యము.

**కంసికము.** సం. విణ. ( అ. ఈ. అ. ) కంసమనెడి మానవిశేషముచేతఁ గొనఁబడినది.

**కంసీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కంచునకు సంబంధించినది. ౨. కంచుపాత్రకుఁ బనికి వచ్చునది.

**కంసుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుని మేనమామ, ఒకానొక మధురాపురపురాజు.

**కకందము.** సం. వి. అ. పుం. బంగారు.

**కకపాల**=కక్కపాల. (సం. కక్షపాలః. ప్రా. కక్షపాల) ౧. బైరాగులు చంకను ధరించెడుసంచి.

సీ. కకపాలవెలిబూది గన్నులలోఁ బ్రామి బాధింతు రప్సరఃపల్లవకుల. హర. ౫. ౧౦.

సీ. కకపాల కేదారకటకముద్రితపాణిఁగుఱుచలాతాముతోఁ గూర్చిపట్టి. మనుచ.౧. ౫౯. ఆం. భా. ౨. ౧౭౭.

౨. మంగలపొది. ఆం.భా. ౨.౩౦౧.

**కకపిక**=కకాపిక, కకవిక, కకావిక. విణ.(సం. కాకపికాః. ప్రా. కాకపికా, కకవికా) చెల్లాచెదరు, మిక్కిలి చెదరినది.

ద్వి. వికవిక లేలె నివ్వెఱ లకుముకులు, కకపిక లాయెఁ దక్కక పికవాణి. అ. మ. క. ౨. ౧౧౫ పొ. ౨౦ పం.

కకపికపడు=చలించు.

క. ఒకపాటికలిమిచేతను, గకపికపడ కప్పలేక కనకాభరణాం, శుకములగరగరికల నిం,చుక తక్కువ గాక యతఁడు సుఖమున నుండుగ్. హంస. ౫.౧౫. ( గర్వించు-అని భావము.)

**కకవిక**=కకపిక.

విణ. (తాఱుమాఱు, వ్యత్యస్తము.)

క. ఒకయూరికి నొకకరణము, నొకతీర్పరి యైనఁ గాక యొగిఁ దఱుచైనన్, గకవికలు గాక యుండునె, సకలంబును...సు. ౪.౨౨.

(క్షుభితము, కలఁత నొందినది.)

చ. ప్రకటభవద్గభీరతపఁ బారము లేదన నేల నాదుదై,ర్యకళిక చే గణింతు ననియద్రి సముద్భ్రమణచ్ఛలంబునం, గకవిక చేయఁగాఁ దలఁచి గంతులు వేయఁ గలంగ కబ్ధి దాఁ,బకపక నవ్వినట్లు కనుపట్టె వికీర్ణపయఃకణప్రభల్. లక్ష్మీ. ౨. ౭.

**కకాపిక**=కకపిక.

విణ. (చెల్లాచెదరు.)

చ. ఇరువదిచేతుల న్వివిధహేతితతుల్ గొని యొక్కపెట్ట కిం,కరులపయి న్నిగిడ్చినఁ గకాపిక లైరొకకొందఱు...ఉ.రా.౩.౩౩౫.

చ. పొలుపుగ రంగధామునకుఁ బువ్వులతోఁట యొనర్చి తొంటి నా,కలిగినపాతకంబులు కకాపికగా విడనాడి బ్రహ్మనే,త్తలఁ గని ముక్తిఁ గాంతు...విప్ర. ౨. ౧౬. వరాహ. ౩. ౫౯. రా. వి. ౫. ౧౫.

**కకావిక**=కకపిక.

విణ.(చెల్లాచెదరు )

ఉ. ఈడితశక్తి సంగజగతీశ్వరుసైనికు లట్ల చెండుబెం,డాడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగి య,వ్వీడతఁ బాఱఁజొచ్చుటయు...కళా. ౭. ౫౭.

(క్షుభితము, కలఁత నొందినది.)

గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క
వేఁపొక్క మగఁడున్న బాగు దెలిసి, యక్క
యిది యేమి చోద్యమో యనుచు మిట్టిపడి
కకావికరై యొండుకడకుఁ జేరి. శుక. ౧.
౨౨3.

**కకుంజలము.** సం. వి. అ. పుం. చాతకపక్షి.

**కకుందరము.** సం.వి. అ.న. పిఱుఁదుమీఁదిగుంట.

**కకుత్తు.** సం. వి.ద్. పుం.స్త్రీ.౧ ప్రధానము, శ్రేష్ఠము. ౨. ఎద్దుమూఁపురము. 3. రాజచిహ్నము. (ఛత్రచామరాది.)

**కకుత్స్థుఁడు.** సం.వి. అ.పుం-అసురులను జయించుటకు వృషభరూపుఁ డగు ఇంద్రుని కకుత్తు (మూఁపు)ను ఎక్కినవాఁడు-శశాదుని పుత్త్రుఁడగు పురంజయుఁడు.

**కకుదము.** సం. వి. అ. పుం. న. ౧. ప్రధానము, శ్రేష్ఠము.౨.ఎద్దుమూఁపురము.3.రాజచిహ్నము. (చామరాది.) ౪.హస్తిమేఢ్రము.

**కకుద్మంతము.** సం. విశ. (త్. ద్మతీ. త్.)గొప్ప మూఁపురము గలది. వి. త్. పుం. ఎద్దు.

**కకుద్మతి.** సం. వి. ఈ. స్త్రీ.౧.పిఱుఁదు.౨.మొల.

**కకుద్మి.** సం. విశ.(న్.నీ.న్.) మూఁపురముగలది. వి. న్. పుం. ౧. మూఁపురము గలయెద్దు. ౨. రైవతుఁ డనురాజు.

**కకుద్మికన్య.** సం. వి.ఆ. స్త్రీ-రైవతునికూఁతురు-రేవతి.(ఈమె బలరామునిభార్య.)శిశు.౨.౨౦.

**కకుప్పు.** సం. వి. భ్. స్త్రీ. ౧. దిక్కు. ౨. శోభ, కాంతి. 3. సంపెఁగదండ, చంపకమాల. ౪. పర్వతశిఖరము. ౫. శాస్త్రము. ౬. ప్రాణము. ౭.వాక్కు.

**కకుభ.** సం. వి. ఆ. స్త్రీ=కకుప్పు.

**కకుభము.** సం. వి. అ. పుం. ౧. వీణకు అమర్చిన సొఱకాయ. (వీణాప్రాంతవక్రకాష్ఠ మని కొందఱు-శబ్దగాంభీర్యమునకై వీణాదండముక్రింద నమర్పఁబడిన చర్మావనద్ధదారుభాండము అని మఱికొందఱు.)౨. ఏఱుమద్దికి.

**కకుభాదని.** సం.వి.ఈ. స్త్రీ. నలి,గువ్వగుత్తి,కపోతాంఘ్రికి.

**కక్క.** వి. (క. కక్క) పినతండ్రి. (వా.)

**కక్కపాల**=కకపాల.

(యోగులు మున్నగువారు చంకను దాల్చెడుసంచి)

గీ. కక్కపాలయుఁ గక్షభాగమునఁ బూని,...
ధరణిపతిపాలి కేతెంచెఁ దపసి యొకఁడు.
విక్ర. ౨. ౯౨.

**కక్కరము.** విశ. (సం. కర్కరః) కఠినము, మోటైనది.

ద్వి.ఎక్కుడు ముడిగిబ్బ యెమ్ములు సొమ్ము,కక్క
రం బగుతోలు కట్టెడువలువ. ద్వి.భాగ. ౪.
(శ. ర.)

జః కక్కరించు.

**కక్కరించే.** అ. క్రి.(√కక్కరము) మొఱుఁగు; పెద్దకేకలు వేయు.

(జంగమయ్యను) చ. కనుఁగొని డాయ వచ్చి
శునకంబువిధంబునఁ గక్కరించి యి, ట్లను...
చెన్నబ. ౨. ౩౦. (ప్రయోగాంతరము మృగ్యము.)

**కక్కసపె(వె)ట్టు.** స.క్రి. (కక్కసము+పెట్టు) బాధపెట్టు.

వ. ఇక్కరణి రక్కసులం గక్కసవెట్టి కాకుత్
స్థుం డొక్కఘటికాచతుష్టయంబున ధను
ష్టంకారఘోరంబుగా శరాసారంబు నిగిడించిన. రామా. ౭. ౧౯౨.

**కక్కసము.** విశ. (సం. కర్కశః. ప్రా.కక్కసో. త.కక్కచం.) ౧.కఱకు,వాఁడియైనది, తీక్ష్ణము.

గీ. కక్కసపువంకగోరులఁ ద్రొక్కిత్రొక్కి, కఱ

కుముక్కున నందంద కలచికలచి. పాండు. ౪. ౨౩౯.

౨. కఠినము, మొనైనది.

ఉ. అక్కట ధర్మమే గురునియాత్మజుఁ బట్టి ర
మింప నెంచ నీ, కెక్కడఁ బుట్టె నీమమత
యిప్పని శుక్రుఁడు విన్నసైఁచునే, నిక్కము
మోహ మున్న నతనిం గని వేఁడి పరిగ్రహిం
పుమీ, కక్కసపుందనంబు కొలఁగా దని సారె
కు బుద్ధి సెప్పినన్. ఉ. రా. ౭. ౩౩౧.

౩. క్రూరము, ఘోరము.

ఉ. మ్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి
ఘూకముల్, గాకముల న్వధించె నిది కక్క
సపుంబని నిర్వహించు టె, ట్లీకడ ... వేం.
పంచ. ౩. ౧౧.

౪. ఇఱుకైనది.

ద్వి. కక్కసంబైన యిక్కడ నీవు మేము, నొం
డొరులకు మన మొద్దికై సరదు, కొండము ర
మ్మంచు...ద్వి. పరమ. ౧. ౪౪పా. ౬ పం.

వి. ౧. దుష్కరత్వము.

క. ఒక్కనివిరివికిని దొరల్, పెక్కండ్రే నొ
క్కనొకనివెంబడి ననుఁగుల్, పెక్కండ్రు ని
లువఁ బనులకుఁ, గక్కసమగు దింప నుంపఁ
గాఁ గాకుండున్. ఆము. ౪. ౨౧౪. (వ్రాఁ
తప్రతి పా.)

౨. కాఠిన్యము, నిర్బంధము; తైక్ష్ణ్యము.

సీ. చండభానుఁడు కక్కసముఁ జేసి మున్ను దా
మహి కిచ్చునప్పులు మరలఁ గొనియె. వైజ.
౧. ౯౭. (రెండర్థములకు నిదే యుదాహర
ణము.)

వ...తమ్మునమ్ముదుసళ్లు ముందటికి నూకి యక్క
క్క మ్రొక్కవే మనపాలివేలు పని బుజ్జగిం
చియు బొమలుగొని జంకించియు...కక్క
సాన నిట్లు మ్రొక్కించి. ఆము. ౪. ౩౫.

౩. కశాభేదము, ఒకవిధమైనకొరడా.

చ. అది గని సైనికుల్ కడుభయంబునఁ జేరి మ
హోపలంబులో, నదికినరీతి నున్న నవనాళ్వ
ము ధే యని కక్కసంబులన్, సదసదగాఁగ
వ్రేసియును జాటులఁ జెట్టియు నేమి చేసి
యున్, గదలుపలేక... జై. భా. ౪. ౭౭.

జ: కక్కసపడు, కక్కసపెట్టు, కక్కసించు,
కక్కసిల్లు.

కక్కసించే. స. క్రి. (√కక్కసము) బాధించు,
హింసించు.

ఉ....జనకపుత్రి నదల్పులఁ గక్కసింపఁగాఁ,
బోయెడిరాక్షసీనిచయముం గని క్రమ్మఱఁ
బిల్చి రాఘవప్రేయసికై దశాననుని పేరడఁ
గం గలఁ గంటిఁ బోకుఁడీ, యాయమత్రోవ
నంచుఁ ద్రిజటాహ్వయదానవి మాన్చెఁ ద
త్త్వరల్. రామా. ౬. ౧౭౨.

గీ. కదిసి కురువీరు లభిమన్యుఁ గక్కసింప, నిక్కు
జిగి నొక్క మొగిఁ బెక్కుకుక్క లెక్కి, పి
క్కప్రక్కయు...చిక్కించుకొన స్రుక్కి
నక్కిటియును. రా. వి. ౩. ౬౬.

కక్కసిల్లు. అ. క్రి. (√కక్కసించే.) నిండు, క్రి
క్కిఱిసియుండు.

ద్వి....పృథివి యాకసము, కక్కసిల్లఁగ నంతు
గలిగె నచ్చోట. ద్వి. సారంగ. ౧. ౧౫పా.
౯ పం.

కక్కి[1]. వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ. కక్కి కొక్కిస డొక్కర ... నృసింహంబు
నాది యగుముప్పదిరెండు విన్నాణంబులనా
ణెంబు పరీక్షించి... హంస. ౧. ౨౦౬.

కక్కి[2]. వి. (క. కక్కి.) పినతల్లి. (వా.)

కక్కిత. వి. మల్లులవిన్నాణములలో నొకటి.
ప్రబంధ. ౯౭.

కక్కిరిబిక్కిరి. విశ. తాఱుమాఱు. (శ. ర.)

**కక్కు**[1]=క్రక్కు. (క.త.కక్కు)స. క్రి. (కడుపు లోనిది) వెలిపుచ్చు; వెడలించు.

ఉ. ... సయించునె కక్కినకూడు క్రమ్మఱన్. నైజ. ౨. ౧౦౦. (సహించు-ముద్రి.)

సీ.... సభలో నులూకుని బంచి యాడించినపరుసఁదనము,కక్కించి...భార.భీష్మ.౨.౩౯౮.

వి. కక్కుట, వాంతి; కక్కినపదార్థము. (బ్రౌ.)

జ: కక్కుఁదెవులు, కక్కుడు, కక్కువాయి.

**కక్కు**[2]. వి.(√కఱకు?) అంపము మొదలగువాని పల్లు.

క. కక్కులకొడవలిపోలెన్.భోజరా. ౪. ౬౦. పి.శకుం. ౪. ౭౬.

**కక్కుఁదెవులు.** వి. (కక్కు[1] + తెవులు) వాంతి రోగము.

**కక్కుడు.** వి.(√కక్కు[1]) కక్కుట (బ్రౌ,శ.ర.)

**కక్కుఱితి(ర్తి)**=కక్కూఱితి. వి.(క.కక్కులితె. త. కక్కురీతి.) లోభము, ఆశ.

క. పొం దొందనిపలుకులు పలు,కం దగునే యోడి యకట కక్కుఱితిమెయిన్. హరి. ఉ. ౩. ౨౩౭.

చ...కడుపుఁగక్కుఱితిన్... ప్రభా.౧.౧౧౭.

చ.కిఱుకులఁబెట్టి వీరి నడకించి తొలంగెదమన్న వట్టికక్కుఱితియ కాని దైవ మనుకూలము గాదు...జై. భా. ౬. ౨౩౪.

కక్కుర్తిపడు=ఆశపడు. శివరా.౩.౭౨.

జ: కక్కుఱితికాఁడు.

**కక్కుఱితి(ర్తి)కాఁడు**=కక్కూఱితికాఁడు విశే. (√కక్కుఱితి) లోభి.

క. కక్కుఱితికాఁడు కార్యము, చక్కటి యెఱుఁగండు...నా. పంచ. ౧. ౩౨౦.

**కక్కులము.** సం. వి. అ. పుం. వకుళము, పొగడ చెట్టు.

**కక్కువాయి.**వి.(√కక్కు[1])కాసరోగవిశేషము.

గీ...మిరియంబుఁ బిప్పలియును, గాసహరవస్తువులు గొనఁగక్కువాయి,దగ్గు లెల్లను శాంతించు...చికి. (చి.ని.)

**కక్కూఱితి(ర్తి)**=కక్కుఱితి. వి. (లోభము, ఆశ.)

క. వల దిటువలెఁ గక్కూఱితి, పలుకులు పలుకంగ... సారంగ. ౨. ౧౦౯.

ద్వి. కడుపుఁగక్కూర్తికిఁ గర్మకాండంబు,తడయక పెట్టుతంత్రంబును గాదు. ప్రభులిం. ౧. ౫. పా. ౨౧. పం.

కక్కూర్తిపడు=ఆశపడు.

సీ. కక్కూర్తిపలుపరే గాఢతపోరూఢుఁ డగు మండకర్ణుఁ డంతవాని. చంద్ర. ౨. ౭౪.

జ: కక్కూఱితికాఁడు.

**కక్కూఱితి(ర్తి)కాఁడు.** విశే. (√కక్కూఱితి) లోభి.

ద్వి. కడఁగి పీనుఁగుమీఁదఁ గంచంబు పెట్టికుడువఁగాఁ జూచు కక్కూర్తికాఁ డితఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౪౫౨పం. సుద. ౨.౬౫.

**కక్కెర**=క్రక్కెర. వి.(సం. క్రకరః.ప్రా.కఅరో) పక్షివిశేషము.

సీ. కొక్కెరల్ కక్కెరల్ గువ్వలు ... రసిక. ౧. ౬౭. (కర్కరేటువు-అని. ఆం. భా. ౨. ౯౨.)

**కక్కోలకము.** సం. వి. అ.న.౧. తక్కోలపుచెట్టు నుండి కలుగుపరిమళద్రవ్యము. ౨. స్థూలమరీచము,చలువమిరియము.

**కక్కోలము.** సం. వి. అ. పుం. గంధద్రవ్యము నిచ్చువృక్షవిశేషము, తక్కోలవృక్షము. న. ౧. తక్కోలఫలము. ౨. తక్కోలపుచెట్టునుండిపుట్టినగంధద్రవ్యము.

**కక్ఖటము.** సం. విశే. (అ. ఆ. అ.) కఠినమైనది.

**కక్ఖటి.** సం. వి. ఈ. స్త్రీ. కఠిని,బలపము.

**కక్తె.** వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ....డొక్కరము నుత్తరడొక్కరము కక్తె కొక్కెన కుమ్మరింపు ... మల్లుపు. ౩. ౬౯. ప్రబంధ. ౭౮.

**కక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧.చంకయందు పుండ్లు లేచునట్టి యొకరోగము. ౨. ఏనుఁగునడుమను గట్టుమోకు. ౩. కాంచి, మొలనూలు. ౪. కాసె. ౫. గోడ. ౬. నడుము. ౭. ప్రకోష్ఠము, తొట్టికట్టు; ఇంటిలోపలిభాగము, అంతఃపురము. ౮.సామ్యము, సాటి. ౯. చంక. ౧౦. పోటి, స్పర్థ. ౧౧. (జ్యోతి) సూర్యాదిగ్రహములు సంచరించుమార్గము. ౧౨. వెనుకప్రక్క దోఁపుకొనుచీర మొదలగువానికొంగు, కచ్చ. ౧౩. వస్త్రాదులఅంచు. ౧౪. నడికట్టు. ౧౫. నడుమను దట్టిమొదలగునవి కట్టుట, మధ్యబంధనము.౧౬.పూర్వపక్షసిద్ధాంతములలో నొకపక్షము. ౧౭. స్పర్ధాపదము,వివాదస్థానము. ౧౮.రథభాగము,రథమండలిఅంతస్తు. ౧౯. గురివెందీ.

**కక్షధరము.** సం. వి. అ. న. మూఁపుయొక్కసంధిస్థానము.

**కక్షపము.** సం. వి. అ. పుం. ౧. కచ్ఛపము,తాఁబేలు. ౨. కుబేరుని నవనిధులలో నొకటి.

**కక్షపాల.** సం.వి. ఆ. స్త్రీ.(ఇది సంస్కృతనిఘంటువులందుఁ గానరాదు.) కకపాల, సన్యాసులు చంకనుదాల్చుసంచి.

గీ. అక్షమాల సువస్తులకక్షపాల. సారంగ. ౩. ౧౮౧. చెన్నబ. ౨. ౨౯.

**కక్షము.** సం. వి. అ. పుం. ౧. వెనుకదోఁపుకొనెడి దోవతికొంగు, కచ్చ.(వై. ని.) ౨.తీఁగ,లత.౩. గడ్డి,కసవు;ఎండుగడ్డి.౪.ఎండినయడవి.(త్రి.ని) ౫.చంక.౬.రాజాంతఃపురము. ౭. ప్రక్క, పార్శ్వము.౮.ఇంటిగోడ.౯.నాకాంగము.౧౦.కాంచి, మొలనూలు.౧౧.దున్నపోతు. ౧౨.కచ్ఛము, జలప్రాయప్రదేశము. ౧౩.పాద. ౧౪. పాపము. ౧౫. చొరరానిఅడవి. (కే. ని.)

**కక్షరుహా.** సం. వి. ఆ. స్త్రీ-జలప్రాయప్రదేశమున మొలచునది-నాగముస్తీ.

**కక్షశాయము.** సం. వి. అ. పుం- ఎండుగడ్డిమీఁద పరుండునది-కుక్క.

**కక్షశాయువు.** సం. వి. ఉ. పుం=కక్షశాయము.

**కక్షాపటము.** సం.వి. అ. పుం. కౌపీనము, గోఁచి.

**కక్షావేక్షకుఁడు.** సం. వి. అ. పుం. ౧. అంతఃపురపాలకుఁడు. ౨. ఉద్యానపాలకుఁడు. ౩. రంగాజీవుఁడు.(చిత్తరువు వ్రాయువాఁడు;నటుఁడు.) ౪. జారుఁడు, విటకాఁడు. ౫. కవి. ౬. ద్వారపాలకుఁడు.

**కక్షోత్థ.** సం. వి. ఆ. స్త్రీ. భద్రముస్తీ.

**కక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రకోష్ఠము,తొట్టికట్టు. ౨. ఇంటిలోపలిభాగము. ౩. మేడయొక్క అంతస్తు. ౪. మొలనూలు, కాంచి. ౫. ఏనుఁగునడుమను గాని గుఱ్ఱమునడుమను గాని కట్టెడి మోకు. ౬. వ్రేలు. ౭. ఉత్తరీయము, బైరవాసము.

**కగ్గము.** వి. (సం. ఖడ్గః. ప్రా. పా. ఖగ్గో) కత్తి, ఖడ్గము.

గీ. కలువనెచ్చెలికానికిఁ గన్నతండ్రి, గట్టుపట్టికి దృఢవజ్రకవచ మగుచు, వెలయుఁ బగ్గంపుఁగగ్గంపువిప్పుఁగంటి, సామినగరంబు ధరక్షీరసాగరంబు. ఘుటికా. ౧.౮౩. (పగ్గంపుఁగగ్గంపువిప్పుఁగంటిసామి=పాశాయుధుఁ డగు దేవతాశ్రేష్ఠుఁడు, వరుణుఁడు.)

**కగ్గు.** అ. క్రి. వివర్ణమగు.

(క) నల్లపడు.

(సురరాజు) చ. అరిగి పయోరుహాసనుపదాంబురుహంబుల వ్రాలి తత్తఱో, గరిమను పేరు చెప్పి తనకగ్గిన కైదువు సూపి యద్ధరా, వసపఝఁ బో

యి వజ్రమును వమ్మయి దీప్తిఁ దొలంగె దేవ నీ, వరమున...కసు. ౧. ౨౧౦. (చూ. ౨౧౯.)

(చ) కందు.

ఉ. కగ్గినచెక్కులుం జెమట గాఱెడు మోములు వాడివత్తులై, తగ్గిన మేనులుఁ ... విప్ర. ౨. ౫౩.

విణ. వివర్ణమైనది.

ద్వి. నుగ్గునూచంబులై నుఱుములై జడిసి, కగ్గులై మ్రగ్గులై కకపికలగుచు, నీవిధంబున మాగధేంద్రసైన్యంబు. అ.మ.క. ౩. ౧౭౨పా.౧౫పం.

కచ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడేనుఁగు, హస్తిని.

కచంగనము. సం. వి. అ. న. కరశూన్యహట్టస్థానము, పన్ను లేనిఅంగళ్లుఉండుచోటు. (వాచ.)

కచంగలము. సం. వి. అ. పుం. ౧. సముద్రము.౨. కచంగనము. (త్రి. ని.)

కచపక్షము. సం. వి. అ. పుం. కేశసమూహము.

కచపాశము. సం=కచపక్షము.

కచము. సం. వి. అ. పుం. ౧.తలవెండ్రుక, కేశము. ౨. కట్టు,బంధము. ౩.ఎండినపుండు. ౪.మబ్బు. ౫. కురువేరు*.

కచహస్తము. సం=కచపక్షము.

కచాకచి. సం. అవ్య. ఒండొరులజుట్టులు పట్టుకొని చేయునది (యుద్ధము-ఇది తెలుఁగున ఒండొరులజుట్టులు పట్టుకొనుచు అనునర్థమున ద్రుతాంతముగాఁ బ్రయుక్తమై యున్నది.ఇట్లే కేశాకేశి, మొ.)

క. ఆహవము చేసి రంగజ, మోహాంధులు గడిమి మెఱసి ముష్టీముష్టిఁ, బాహాబాహిఁ గచాకచి, సాహసముఁ జలంబు దివిజసంఘము వొగడన్. కాశీ. ౫. ౧౫౦.

కచాచితము. సం. విణ. (అ. ఆ. అ.) వెండ్రుకలు విరియఁ బోసికొన్నది, వికీర్ణకేశము.

కచాటురము. సం. వి. అ. పుం. దాత్యూహము, కూకురుగుండెపక్షి.

కచామోదము. సం. వి. అ. పుం. వెండ్రుకలకుఁ బూసికొనుకొకగంధద్రవ్యము.

కచికు=ఖచిక్కు.

వి. (పాడుచుటయందగుధ్వనికి అనుకరణము.)

ద్వి. చికటారిఁ గొంది కచిక్కునఁ బొడిచె. విష్ణు. ఉ. ౪. ౮౭. (శ.ర.)

కచుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతికొడుకు.

కచువు. సం. వి. ఉ. స్త్రీ. ఒకజాతిదుంప.

కచేలము. సం. వి. అ. న. లేఖ్యపత్త్రములను గట్టెడునూత్రాదికము, వ్రాతప్రతులయాకులను గాని కాగితములను గాని ఒకటిగాఁ గట్టుదారము మొదలగునది.

కచోరము. వి. (సం. కచ్చూరకః) కచ్చూరము*. (దీనినే గంధకచోర మందురు.)

కచ్చే. వి. (సం. కచ్ఛః) ౧. వెనుకదోఁపుకొనెడు దోవతికొంగు.

ద్వి. నెడనెడఁ దనకచ్చ వీడఁగఁ బాటి.ద్వి.హరిశ్చ. ఉ. ౧౧౦౭.

౨. గోఁచి, గుహ్యాంబరము.

సీ. మొలఁ గచ్చకట్టుపై మలఁగినపచ్చనినునుఁ గొంగు దిండుగా నులిచి చుట్టి. హరి. పూ. ౭. ౧౩.

౩. ఒట్టి, కాసె.

ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్లును జేతులు, వ్రేల మత్తగజములీల మెఱయ...మల్లు నెత్తివైచె. భార. విరా. ౨. ౧౭.

౪. ఉపస్థేంద్రియము.

గీ...కచ్చ, యన నుపస్థాఖ్య చెలఁగు...ఆం.భా. ౨. ౧౩౬.

జ: కచ్చకాఁడు, కచ్చించు౨.

కచ్చేకాఁడు. వి. (√కచ్చే)-కాపీనవంతుఁడు-ముని.

గీ. ఆలములు లేమి డొక్క వెన్నంటికొనఁగఁ, దెలివి గలకన్నుదోయి గుంటలు పడంగ...అచ్చటికి వచ్చె వేలుపుఁగచ్చకాఁడు. కువల. ౫. ౮౦.

**కచ్ఛటము.** సం. వి. అ. న. గజపిప్పలీ.

**కచ్ఛడము[1].** వి. (సం. కచ్ఛటికా. క. కచ్ఛట.) కౌపీనము, గోఁచి.

గీ. జమిలి మొలత్రాట నినుపకచ్ఛడ మమర్చి. విక్ర. ౨. ౯౨.

గీ. ... ఇనుప, కచ్ఛడా ల్గట్టుకొనుముని ప్రుచ్చు లెల్ల. మనుచ. ౨. ౭౩.

**కచ్ఛడము[2].** వి.దూది లోనగునవి తెచ్చెడిబండి. (శ. ర.)

కచ్ఛడపుబండి=పెద్దగట్టిబండి. (బ్రౌ.)

**కచ్ఛరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కుత్సితమైనది. ౨. ముఱికిగలది, మలినమైనది. వి. అ. న. తక్రము, మజ్జిగ.

**కచ్ఛి[1].** వి. సాలెవాఁడు లాకకొయ్యలను పడుగునందుఁ జొప్పించెడుసందు. (శ. ర.)

**కచ్ఛి[2].** వి. కచ్ఛిదేశపుగుఱ్ఱము.

సీ. ... దేశభేదహయాభిధలు హరబ్బి తురికి కచ్ఛి యనంగఁ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౯౬.

**కచ్ఛించు[1]=కచ్చు[1].** స. క్రి. గవ్వలాటమున్నగు ఆటలలో కాయల నడపు. (శ. ర.)

**కచ్ఛించు[2].** అ. క్రి. (√కచ్చు) కచ్ఛకట్టుకొను, కచ్ఛబిగించుకొను.

క. కచ్ఛించి మల్లు లిద్దఱు, మచ్చరమున లావు మెఱయ మత్తకరులు రెం, డిచ్చఁ జనుదెంచుచాడ్పున, నచ్చటికే తెంచి నిలిచి రధిపతి యెదురన్. హరి. పూ. ౯. ౬౫.

ద్వి. అచ్చెరు వొందఁ గేకాంతరామయ్య, కచ్ఛించుకొని యంకకాఁడునుబోలె...ఆర్చి బొబ్బిడి పొంగి...బస. పు. ౬. ౫౭౯ పం.

**కచ్ఛిక.** వి. కాలినపిడుక. ఆం. భా. ౨. ౨౪౨.

**కచ్ఛితము.** విణ. (సం. ఖచితః.) హెచ్చుతగ్గులు లేకుండ సరిగా నుండునది.

**కచ్చు[1]=కచ్ఛించు[1].** స. క్రి. గవ్వలాటమున్నగు ఆటలలో కాయలనడపు. (శ. ర.)

**కచ్చు[2].** వి. గర్వము, బింకము.

సీ. అరవిందములకచ్చు లడఁగించుజిగి హెచ్చు నాయతం బగుకన్నుదోయిలోడ. మనుచ. ౬. ౧౦౨.

సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁబాఱె యస్తాచలంబుపై నత్తమిల్ల, వరుసతో నోషధీవల్లీమతల్లులకాంతివైభవలక్ష్మికచ్చు వదల. గీ. భానుకిరణంబు లొకకొన్ని ప్రాఁకె నభము. కాశీ. ౧. ౧౨౨.

౨. డాలులు.

సీ. గెలువనిరాజుకు బలుగచ్చులును మెండు... వేఙు. శ. ౧౭.

(మల్లులు)వ.... పెచ్చుమల్లాడియుఁ, గచ్చులు సేసియు. ప్రబంధ. ౭౬.

కచ్చుఁదనము=గర్వము, ఔద్ధత్యము.

గీ. చిలువ మేపరి తలఁపులోపలనె వచ్చి, వినతుఁడై యిచ్చఁగల కచ్చుఁదనము హెచ్చ, నేమి కార్యంబు ఘటియింతు నెఱుక సేయుఁ, డని న...సమీర. ౬. ౧౪౧. (చూ. ౧౪౪.)

జ: కచ్చుకొను.

**కచ్చు[3].** వి. ౧. ఱేకు, దళము.

ఉ. ... అల్లు ము, ద్రించినజాడఁ దెల్పె సుదతీమహనంబు పరిచ్ఛదచ్ఛటా, కంచుకితోత్పలంబుతుదకచ్చునఁ జిక్కి యచంచలాకృతిన్. వసు. ౪. ౧౩౩.

౨. సిగబంతి.

గీ. భానుబింబంబు వొడిచెఁ బ్రభాతలక్ష్మి, కబరిభారంబుమీఁది చెంగల్వకచ్చు. కాశీ. ౩. ౨౩౬.

కచ్చే[4]. వి. (సం. కాంక్షా.) అపేక్ష, కోరిక.

(పుండరీకేక్షణుఁడు) సీ. క్షీరోదమధ్యస్థలీరత్న నగగుహాగర్భనివాసంబుకచ్చు వదలి... గీ. పుండరీకునిమానసాంభోజపేఠి,మిండతుమ్మెదయై యుండు నిండుకొలువు. పాండు. ౨. ౧౧.

కచ్చేకొను. అ. క్రి. (√కచ్చే[2]) పట్టుపట్టు,పంతముపట్టు.

గీ...పట్టుపట్టె, ననెడిమాటకుఁ దగుఁ గచ్చుకొనె ననంగ. ఆం. భా. ౩.౧౭౯.

గీ. అమరపతికొల్వునకు వచ్చె సుమశరుండు, కలుకపాలిండ్లగయ్యాళితలిరుఁబోండ్ల, యారజపుబేరజపుఁజేఁత లపుడు చూపి, కచ్చుకొని దూఱు చెప్పంగ వచ్చుకరణి.చంద్రా. ౩. ౨౭.

క.ఉచ్చైశ్శ్రవమగుశనపై,విచ్చలవిడినెక్కురాలువృద్ధశ్రవుఁడై, హెచ్చెనని వేల్పు తేజిం, గచ్చుకొని హసించు వీటఁ గల్గుహయంబుల్. చమ. ౧. ౩౦.

కచ్చేవాసము. వి. ఇండ్లకు వేసెడు పెద్దవాసము. (శ.ర-దూలములో చొన్పినవాసము. అని బ్రౌ.)

కచ్చె[1](చ్చియ). వి. (సం. కక్షా) ౧. కలహము.

చ. మఱియొకయుక్తి రక్కసులు మన్నిగొనంగను వారిలోన నొం,డొరులకుఁ గచ్చెపుట్టుటకు నొక్కనిచేడియ నొక్కఁ డొందన, క్కఱ జనియింపఁ జేయవలె ... పార్వ. ౨. ౧౨౫.

౨. విప్రలాపము, విరోధోక్తి.

గీ. ...కచ్చె పగటు కంట,సమ్ము నాఁగను విప్రలాపమ్ము చెలఁగు. ఆం. భా. ౧. ౧౧౬.

జ: కచ్చెపోతు.

కచ్చె[2](చ్చియ).వి.(సం.కచ్ఛః)కచ్ఛ భేదము,ఒక విధ మైనబట్టమడత.

సీ...కచ్ఛ భేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె,చుంగు రింగు నెఱిక చింగు నెఱి యనంగ...ఆం. భా. ౨. ౧౫౩.

కచ్చెపోతు. విశ. (√కచ్చె[1]) కలహశీలుఁడు.

కచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కౌపీనము, గోఁచి.

శ్లో.కచ్ఛా కచ్ఛటికా కక్షా పటీ కౌపీనమిత్యపి. (త్రి. ని.)

౨. చీరిక, ఈలపురుగు. ౩.వారాహి, సప్తమాతృకలలో నొకతె.

కచ్ఛటికా. సం. వి. ఆ. స్త్రీ. కౌపీనము, గోఁచి. (త్రి. ని.)

కచ్ఛపము. సం. వి. అ. పుం. ౧- ముఖపుటమును శరీరములోఁ జొనుపుకొని రక్షించుకొనునది;కప్పెరవంటి మేనిచిప్ప చేత తక్కిన అంగములను రక్షించుకొనునది-తాఁబేలు. ౨. కుబేరునినవనిధులలో నొకటి. ౩. మల్లబంధవిశేషము.

కచ్ఛపి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుతాఁబేలు. ౨. సరస్వతియొక్క వీణె. ౩. క్షుద్రరోగభేదము, మొటిమ.

కచ్ఛము. సం. వి. అ. పుం. న-నీటితోఁ గప్పఁబడినది-కసెను, జలప్రాయ ప్రదేశము, అనూపము. పుం. ౧. తటము, దరి. ౨. నౌకాంగము, పడవ యొక్క యొకానొకభాగము. ౩. వెనుకదోఁపికొనెడిదోవతికొంగు,కచ్చ. ౪.కూర్మకర్పరము, తాఁబేటిచిప్ప. (వాచ.) ౫. తున్నకము, నంది వృక్షము.౬.ఒకానొకదేశము. ౭.కూర్మపాదము, తాఁబేటికాలు. (కే.ని.)౮. ప్రక్క.౯.గోఁచి. (కే.ని.)

కచ్ఛరుహా. సం.వి.ఆ.స్త్రీ -జలప్రాయప్రదేశమున మొలచునది-దూర్వ, గఱికె.

కచ్ఛుఘ్ని. సం. వి. ఈ. స్త్రీ-గజ్జినిపోఁగొట్టునది- ౧. పటోలము, చేఁదిపొట్లకాయ. ౨.హపుషాభేదము, విత్తుబోడశరము. (చూ. కచ్ఛువు.)

కచ్ఛుర. సం. వి. ఆ. స్త్రీ. ౧.గంట్లకచోరము౯. ౨. శూకశింబి, దూలగొండి౯. ౩. వాఁకుడు౯. ౪.దురాలభ, తీఁటకసింద౯. ౫.గ్రాహిణీవృక్షము, కేగడిదూలగొండి౯.

కచ్ఛురుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గజ్జిగలవాఁడు. ౨. జారుఁడు.

కచ్ఛువు. సం. వి. ఊ. స్త్రీ. (ఉకారాంతముకూడనని-కల్ప,విల్యమ్సు.) విచర్చిక, గజ్జి.

కచ్ఛూమతి. సం. వి. ఈ. స్త్రీ. శూకశింబి, దూలగొండి౯.

కచ్ఛూరకము. సం.వి.అ. పుం. గంధకచోరము౯.

కచ్ఛోటిక. సం. వి. ఆ. స్త్రీ. ౧.కచ్ఛ,వెనుకదోఁపికొనెడిదోవతికొంగు. ౨. బట్టయొక్క అంచు.

కచ్ఛోరము. సం. వి.అ.న. శటి,గంట్లకచోరము౯.

కజము. సం. వి. అ. న-నీటఁ బుట్టినది-పద్మము, తామరపువ్వు.

కజాతము. సం=కజము. చమ. ౨. ౪౩.

కజాయము=కజ్జము[1].

శా...కజాయంబు లిం,దెన్నే నున్నవి క్రొత్తయట్టికల...పాండు. ౪. ౨౭౬.

కజ్జ=కజ్జము[1].

క...ఒకచకోరిక,కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడువం జేసెన్. కకు.౩. ౧౦౪. (ప్రయోగాంతరములేదు.)

కజ్జము[1]=కజాయము,కజ్జ, కజ్జాయము. వి.(సం.ఖాద్యం. ప్రా. ఖజ్జో) ఖాద్యము,భక్ష్యము;భక్ష్యవిశేషము, అపూపము.

సీ. కజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు ధృతరాష్ట్రసుతుఁడు పుత్తేర...భార. ఉద్యో.౩. ౧౭౦.

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పు ఘృతముల్ గజ్జంబులున్ బిండివం,టలు... జై. భా. ౬. ౯౨.

గీ...అపూపాభిధానమ్ము దనరుఁ గజ్జ,ముప్పమప్పచ్చి కజ్జాయ మనఁగ. ఆం. భా. ౨. ౨౫౪.

కజ్జము[2]=కర్జము.వి.(సం.కార్యం)కార్యము,పని.

ద్వి. బిజ్జలునకు వినిపింపంగ నతఁడు,కజ్జ మెంతేనియుఁ గలదు...బస.పు. ౬.౬౩౬ పం.

కజ్జలధ్వజము. సం.వి.అ.పుం-కజ్జలము ( = మసి) ధ్వజముగాఁగలది-దీపము.

కజ్జలము. సం. వి. అ. న. ౧. కాటుక, అంజనము. ౨. సిరా. ౩.దీపపుమసి. ౪. మేఘము. ౫. ఉత్పలము, కలువ. (కే. ని.)

కజ్జలరోచకము. సం.వి. అ.పుం. న. దీపస్తంభము.

కజ్జలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రసము గంధకము కలిపి నూఱినముద్ద. ౨. సిరా. ౩. దీపపుమసి. ౪. ఒకజాతిచేఁప.

కజ్జాయము=కజ్జము[1].

గీ. బళిరె కజ్జాయ మయ్యారె పాయసములు.రా. వి. ౨. ౧౦౫. ఆం. భా. ౨. ౨౫౪.

కజ్జీరము=కజ్జూరము.

ఉ. ... ఖ,ర్జూరము కజ్జురం బనఁగ శోభిలు ... ఆం. భా. ౨. ౭౯.

కజ్జూరము=కజ్జీరము. వి. (సం. ఖర్జూరః. ప్రా. ఖజ్జూరో.) ఒకానొకఫలవృక్షము, పేరీఁదు౯.

మ. సురపాన్నల్ కలిగొట్లు చందుగులు కజ్జూరంబు లబ్బెంపలున్. యయా. ౫. ౪౯.

కట=అకట. అవ్య. (సం. కష్టం. ప్రా. కట్ఠం.) (సంతాపమును దెలుపును.)

ఉ. జీవముఁ బాయువాఁడఁ గట చిత్తజుబారికి నోర్వ వచ్చునే.విక్ర.౩.౪౬.దళకు.౬.౯౯.

కటంకటము. సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. బంగారు. ౩. చిత్రమూలము౯.

కటంకటుఁడు. సం.వి.అ.పుం. ౧.విఘ్నేశ్వరుఁడు. ౨. శివుఁడు.

**కటంకటేరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧.పసుపుకీ. ౨.మ్రాని పసుపుకీ.

**కటంబకుఁడు.** సం. విశ. (అ. బికా. అ.) కూరలు వండువాఁడు.

**కటంబము.** సం. వి. అ. పుం. ౧. వాద్యము. ౨.బాణము.

**కటంభర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రసారిణి,గొంతెమ గోరుకీ. ౨. కటుకరోహిణికీ. ౩. కలంబిక,తీఁగ బచ్చలికీ. ౪. గలిజేరు, పునర్నవకీ. ౫. మూర్వ, చాఁగకీ. ౬. హస్తిని, ఆఁడేనుఁగు. ౭. కప్ప. ౮. మణిసిల.

**కటంభరము.** సం. వి. అ. పుం. ౧. జ్యోతిష్మతి, మానేరుకీ. ౨. శ్యోనాకవృక్షము, దుండిగముకీ.

**కటకట[1].** అవ్య=అకట. ('కట'కు ఆమ్రేడితరూపము.)

(సంతాపమును దెలుపును)

చ...కృష్ణుఁడు లేనిపిమ్మటం,బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక నేఁ, గటకట పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో. భాగ. ౧. ౩౭౩.

వి. ౧. బాధ,కష్టము.

చ. ...అలంత నధ్వగుల్, కటకటఁ జెంది వంద వడగాడుపు వీవఁగఁ జొచ్చె హెచ్చుగన్. ధర్మ. ౨. ౧౨౦.

౨. కోపము. (చూ. కటకటపడు.)

జ: కటకటపడు.

**కటకట[2].** వి. కొఱుకుపట లోనగువానియందలి ధ్వనికి అనుకరణము.

ద్వి.గొటగొట గోండ్రించి కోఱ లొండొంటిఁ, గటకటఁ దాఁకింప గర్భంబు గలఁగి. నవనాథ. ౩. భా. (చూ. ౪. ర-గోండ్రించు.)

**కటకటప(ఁబ)డు.** అ. క్రి. (√కటకట[1]) ౧.కష్టపడు, బాధపడు, సంతాపపడు.

(కపులు) క. ఇటువలె వెదకియుఁ దమత్రిప్పట గురువిరహితులమంత్రపతనం బెటు లట్లట మటమై పోఁ జొచ్చినఁ, గటకటపడి ... రామా. ౬. ౬౪.

క...మనమున మిక్కుటమై పెరిఁగెడు వెతలం, గటకటపడి యిట్లనుచున్ దగన్ దనలోనన్. రసిక. ౪. ౯.

క...క్రవ్యాదుల,క్రందున నీవీను లిపుడు కటకటఁబడవే. భార. ద్రో. ౨. ౩౩౫.

౨. కోపపడు.

క. అలయక యందఱుఁ జెప్పం,గలయంతయుఁ జెప్పి రతఁడు గటకటఁబడి యక్కొలువు వెడలిపోయెం దమ్ములు కర్ణుఁడు రాజలోకముం దో నరుగన్. భార. ఉద్యో. ౪. ౮౦.

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కిట్లనియె...భార. విరా. ౪. ౯౭.

శ్లో. ఇ త్యేవంవాదినంద్రోణం కర్ణః క్రుద్ధోఽభ్యభాషత. సం. భార. ౪౦. ౨౮.

వ. గురుం డప్రీతుండయ్యును గటకటంబడక యతనితో ని ట్లనియె. భార. ద్రో.౧. ౩౮౯.

**కటకటము.** సం. వి. అ. న. సముద్రమునఁ బుట్టిన యుప్పు.(వై. ని.)

**కటకటా**=అకట.

గీ. కటకటా యనునపుడ గద్గదిక వొడమె. మనుచ. ౩. ౯౧.

సీ. కట్టా యనంగను గటకటా యనఁగఁ గటా యనంగ బహార్థమై యొసంగు.ఆం.భా.౩.౬౭.

**కటకటాలు.** వి. బ. ఇనుపయూఁచలు లోనగువానిచే ఏర్పఱచెడియడ్డు. (శ. ర.)

**కటకము.** సం. వి. అ. పుం. ముష్టి,పిడికిలి. పుం. న. ౧.కడియము,వలయము.౨.పర్వతమధ్యభాగము, కొండనడుము. ౩. హస్తిదంతమండనము,ఏనుఁగు కొమ్మునకు వేసెడుపొన్ను. ౪. సముద్రలవణము.

౫. రాజధాని. ౬. శిబిరము,దండు విడియుచోటు. ౭. చాఁప, కటము. ౮. ఓఢ్రదేశపురాజధాని. ౯. సైన్యము.

**కటకరము.** వి. ఒకానొకమృగము, కడఁతి, గంధర్వము.

సీ....గంధర్వ మాను గడంతి కటకర మంచనఁగాను. ఆం. భా. ౨. ౯౫.

**కటకసరులు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. బంగారుతీఁగలు గంగాజలమ్ములు కస్తూరినిగరాలు కటకసరులు. హంస. ౪.౧౨౮. ప్రబంధ. ౧౧౨.

**కటకాముఖము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

శ్లో. తర్జనీమధ్యమామధ్యే పుంఖోంగుష్ఠేన పీడ్యతే, యస్మిన్ననామికాయోగః స హస్తః కటకాముఖః. (శృంగారదీపిక.)

**కటకారుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు.

శ్లో. శూద్రాయాం వైశ్యతశ్చౌర్యాత్ కటకార ఇతి స్మృతః. ఔశనసస్మృతి.(కటకరుఁడు-అని. వై: ని.)

**కటకోలము.** సం. వి. అ. పుం.పతద్గ్రహము,తమ్మపడిగము.

**కటఖాదకము.** సం. వి. అ. పుం.౧.గాజుపాత్ర.-శవమును తినునది-౨. నక్క. ౩. కాకి.

**కటఖాదకుఁడు.** సం. విణ. (అ. దికా. అ)-గడ్డికూడ తినువాఁడు-సర్వభక్షకుఁడు, నియమములేక అన్నియును తినువాఁడు.

**కటపెట.** వి. ౧. వానచినుకులు రాలుటయందగు ధ్వనికి అనుకరణము.

క. కటపెట తోటతోట రాలెడు,పొటపొటచినుకుల ధరిత్రిపాడ నట్టుపడఁగ, సొటసొట నాఁకట సోలుచుఁ, దటతటపడు చాతకములదైన్యము వాసెఁగ. వైజ. ౨. ౧౪౬.

౨. (దంతములు)ఒరయుటయందగుధ్వనికి అనుకరణము.

ద్వి. కఠినోరుదంష్ట్రలు కటకెట నొరయ. ద్వి. భాగ. ౭. స్కం. (శ. ర.)

**కటనము.** సం. వి. అ. న. ఇంటికప్పు.

**కటప్రువు.** సం. విణ. (ఊ.ఊ.ఉ.) ౧.తనయిచ్ఛవచ్చినట్లు నడచుకొనువాఁడు, కామచారి. ౨. జూదమాడువాఁడు. వి. ఊ. పుం. ౧-నలతృణమున సంచరించునది - కీటభేదము. ౨.శివుఁడు. ౩. రాక్షసుఁడు. ౪. విద్యాధరుఁడు. స్త్రీ. ఖేలగతి, విలాసగమనము. (కే. ని.)

**కటప్రోథము.** సం. వి. అ. పుం. న. పిఱుఁదునందలియున్నతప్రదేశము.

**కటభీ.** సం. వి. ఈ. స్త్రీ.౧.మాసేరు,జ్యోతిష్మతీ. ౨. అపరాజిత,సోమిదమునీ.

**కటమర.** మి.వి.(కటము+మర-'కటుమర'అని. శ.ర.) హనువు,చెక్కిలిమీఁదిభాగము.

సీ. ... హనువు కటమర యంచనఁగా నొప్పు ...ఆం. భా. ౨. ౧౪౩.

సీ. తళుకుఁజెక్కులు వెల్లఁదనము మెల్లనఁ దాల్చెఁ గనరానికటమరల్ పెనుపు నొందె. చంద్రా. ౧. ౬౮.

సీ. గండభాగంబులఁ గటమరలందును బరియసిఁజొనుప నప్పగతుఁ డార్చె. భోజసుతా. ౪. ౧౦౫.

**కటమాలిని.** సం. వి. ఈ. స్త్రీ. కల్లు,మద్యము.

**కటము.** సం. వి. అ. పుం. న. ౧-మదజలము కురియునది-ఏనుఁగుచెక్కిలి. ౨.వలయము,కడియము. ౩. నల మనెడితృణము. ౪. చాఁప.౫. కాలకూటవిషము. ౬.గ్రామాదులప్రాంతప్రదేశము. ౭.సమయము. ౮.తృణము,గడ్డి.౯.శవము.౧౦. శవరథము, పాడె. ౧౧. శ్మశానము. ౧౨. జూదమున పాచికలుపడుటయందలిభేదము.(మృచ్ఛ.

౨.౯.)౧౩. మొల.౧౪. పిఱుఁదు. ౧౫. చెక్కిన
మ్రాను.స.౧.సముద్రలవణము.౨.సాంటి.(వై.ని)

**కటప్రణుఁడు.** సం. వి. అ. పుం. భీమసేనుఁడు.
(త్రి.ని.)

**కటశర్కర.** సం.వి ఆ. స్త్రీ. ౧.ఒకానొకయోషధి.
౨. ముక్తాఫలము, ముత్తియము.

**కటా**=అకట.

మ...కీర్తింపఁగాఁ,దగునీసంతతి కీడునం దొడ
రెనే దైవంబుచెయ్దిం గటా. నిర్వ.౫.౧౦౩.
ఆం. భా. ౩. ౬౮.

**కటాక్షము.** సం. వి. అ. పుం. అపాంగదృష్టి, కడ
గంటిచూపు.

**కటాక్షించు.** సం. స. క్రి. ౧. కడగంటఁజూచు.
వ....కూర్మిరాణి యైననారాయణిం గటాక్షించి
హీనస్వరంబున....వరాహ. ౨. ౬౫.
౨. అనుగ్రహించు.
(వ్యవ) నన్నుఁ గటాక్షించి వదలిపెట్టినాఁడు.

**కటాయనము.** సం. వి. అ. న. వీరణమూలము, అ
వురువేరు.

**కటాయించు.** స. క్రి. ఎగఁబెట్టు, ఎగవేయు,
(ఋణాదులు) అపహరించు.
సీ. పైక మీఁజాలక బాకీ కటాయించి యొఱగొ
డ్డెములఁ బల్కుచుండినామొ. రంగా. ౨.
౧౮౧.

**కటారము**=కటారి.

(బాఁకు.)

వ. ...గదల నడిచియుఁ గటారంబులఁ బొడిచి
యు...కరవాలంబుల వ్రేసియు. భాగ. ౧౦.
ఉ.౪౧౭.(చి.ని.పా-'కుఠారంబుల' ముద్రి.)

**కటారి(రు).** వి. (సం.కఠారః. క.కటారి.)కత్తి;
బాఁకు.

క. ఈరేడుజగములం దిఁక,నేరీ నీరీతిగోతు లె
న్నికఁగను నో,య్యారీ తీరగుకులుకుమి,టా
రీ వలఱేనివేల్కటారీ నారీ.రసిక.౩.౭౧.
చ....భర్తయుఁ, శరమొకఁ డేయఁ ద్రెళ్ళక
నెస న్నిగుడన్ నఱకెన్ గటారున౯. ఉ.
రా. ౮. ౪౧౬, ౨౧౧.

జ: కటారికత్తియ, కటారికాఁడు.

**కటారి(రు)కత్తియ(త్తె).** విఙ. (√కటారి.)
కటారికలది (ఆఁడుది.)
చ...ఒక్కొకతటిం బువుఁబోండ్లు కటారికత్తి
యల్. కళా. ౧. ౩౧.

**కటారి(రు)కాఁడు.** విఙ. (√కటారి.) కత్తికల
వాఁడు.
చ. బిరుదుకటారికాండ్రు...కళా. ౭. ౧౦౧.
ఉ...చంపఁగ వచ్చుకటారుకానిచం,దాన...
కాళ. ౨. ౧౪౦.

**కటారుఁడు.** సం. వి. అ. పుం. ౧. కాముకుఁడు.
౨. పట్టణవాసి.

**కటాలుఁడు.** సం. విఙ. (అ. ఆ. అ.) వికృతమగు
చెక్కిళ్లుకలవాఁడు.

**కటాహము.** సం. వి. అ. పుం. ౧. బూరెలమూఁ
కుడు మొదలగు మూతివెడల్పుగలపాత్రము,బా
ణలి; పెనము. ౨. తలపుర్రె. ౩. తాఁబేటివెన్ను
చిప్ప. ౪. అప్పుడే కొమ్ములువచ్చుచున్న గేదె
దూడ. ౫. మట్టిదిబ్బ. ౬. చెవులు గలగంగాళ
ము.౮.చేట. ౭.ఒకానొకదీవి.౯.నరకభేదము.

**కటి.** సం. విఙ. (న్. నీ. న్.)కటముగలది. వి.న్.
పుం. ఏనుఁగు. ఇ, ఈ. స్త్రీ-వస్త్రాములచేతఁ గ
ప్పఁబడునది-౧.మొల. ౨. పిఱుఁదు. ఈ. స్త్రీ.
పిప్పలి.

**కటిక**[1] వి. ౧=కట్టిక. (చూ. కటికది, కటికవాఁ
డు[1].) ౨. మల్లసాధనవిశేషము. ఆం. భా. ౨.
౨౦౮.

జ: కటికది, కటికవాఁడు[1].

**కటిక**[2]. వి. (సం. ఖట్టికః. క. కటిక.) మాంసవిక్రేత, మాంసమమ్మువాఁడు. (శ. ర.)
విశ. క్రూరము. (చూ. కటికతనము.)
జః కటికతనము.

**కటికతనము.** వి. (√కటిక[2]) క్రూరత్వము.
క. ఈకాంతారములోపల, నేకాంతమ యున్న వాఁడ వెవ్వఁడ వకటా, నీ కీవ యడుచుకొని యెద, వీకటికతనంబు మానవేయని కరుణన్. 
గీ. వ్రేసికొనసీక పట్టిన వ్రేటు లుడిగి. వా. రా. ౨. ౧౯౩, ౧౯౪.

**కటికది.** వి. (√కటిక[1]) వేత్రహస్త.
సీ. పరిహాసకులు నటుల్ బయకాండ్రు మొగసాలఁ గాచినా రని తెల్పుకటికదాని. ఉ. రా. ౪. ౨౨౩.

**కటికన.** వి. మల్లసాధనవిశేషము.
సీ. తత్సాధనంబులై తగుఁగంబము కొణత కటికన లోడి సంగడము బాల. గీ. సంగడము నీలిగోతా మనంగఁ గొన్ని. ఆం. భా. ౨. ౨౦౭. (వ్రాఁత ప్రతి, బ్రౌ. పాఠములు.)

**కటికమెకము.** వి. ఖడ్గమృగము. (చి. ని, శ. ర.)

**కటికవాఁడు**[1]. వి. (√కటిక[1]) వేత్రహస్తుఁడు.
వ. బంగారుజలపోఁత బెత్తంబులనటన ఘటిల్లఁ గటికవారు సారెకు బరాబరి సేయుచు నేఁగుదేర. కళా. ౭. ౬౯. యయా. ౧. ౧౦౦. ఆం. భా. ౨. ౧౮౪.

**కటికవాఁడు**[2]. వి=కటిక[2]. మాంసవిక్రేత.
గీ. కటికవాఁ డన మాంసికాఖ్యగను జెలఁగు. ఆం. భా. ౨. ౨౮౬. (వ్రాఁత ప్రతి.)
గీ. కటికవానిల్లు నాఁటికిఁ గన్న పెట్టె. భల్లా. ౧. ఆ. (శ. ర.)

**కటికి.** విశ. ౧. అధికము, మిక్కుటము, మితిమీఱినది.
ఆ... మేను, కంప మొందఁ గనలు గదిరినకటికిన, వ్వొసక మెసఁగ నన్న కిట్టు లనియె. భార. ద్రో. ౨. ౨౭౬.
౨. కఠినము, గట్టిది; క్రూరము.
సీ.... కటికి నేల... భార. ఆది. ౬. ౧౭౮.
గీ. గట్టి కటికి యనంగఁ గన్పట్టు దృఢము. ఆం. భా. ౩. ౨౩.
చ.... పం, డిరి సిరియాలునిన్ గటికి డెందమునం దరశాత్ము లిద్దఱున్. హర. ౨. ౧౨౦.
౩. తీక్ష్ణము; సహింపరానిది.
క. మిటమిటనికటికియెండం, బటపటపటఁ బగిలి పాయవడినవెదురులన్. చంద్ర. ౧. ౧౫౨.
ఆ. ఏను సాధ్వి ననుచు నెల్లవారలు నన్ను, సన్నుతింతు రనుచు సంతసింతుఁ, గాని నడుమ నిట్టి కటికినిందలు పుట్టె, యడవిఁ ద్రోచు రాముఁ డనుచు నెఱుఁగ. ఉ. రా. ౬. ౨౮౦.
౪. సాంద్రము, దట్టమైనది.
గీ.... కటికిచీకటి... శుక. ౨. ౧౮౯.
గీ.... కటికిమబ్బు... హంస. ౩. ౩౯.
౫. కేవలము.
(వ్యవ) వాఁడు కటికిమెతుకులు తినుచు కాలక్షేపము చేయుచున్నాఁడు. కటికియుపవాసము. కటికిలంకణము.

**కటిత్రము.** సం. వి. అ. న-కటిని గాపాడునది-
౧. కాంచి, మొలనూలు, ఒడ్డాణము. ౨. మొలకు కట్టుదట్టి.

**కటిప్రోథము.** సం=కటప్రోథము.

**కటిమాలిక.** సం. వి. ఆ. స్త్రీ. మొలనూలు, ఒడ్డాణము.

**కటిల్లకము.** సం. వి. అ. పుం. కాఁకరకాయ.

**కటిశృంఖల.** సం. వి. ఆ. స్త్రీ. మొలత్రాడు; పటకా.

**కటిసూత్రము.** సం. వి. అ. న. మొలత్రాడు; ఒడ్డాణము; కాసె.

కటీతలము. సం.వి.అ.పుం. మొలను దోఁపుకొను పంకకత్తి, న్యుబ్జఖడ్గము.(త్రి. ని.)

కటీప్రోథము. సం=కటప్రోథము.

కటీరము. సం. వి. అ. పుం. న. ౧. గుహ. ౨. జఘనము, స్త్రీలమొలముందటిభాగము.3.నితంబము, పిఱుఁదు. ౪. కటి,మొల. (విల్యమ్సు.)

కటుంభర. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి॥.

కటుక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కటుకరోహిణి॥. ౨. తాంబూలి,తమలపుఁదీఁగ. 3.రాజిక, నల్లావ॥. ౪. చేఁదుసొఱ॥. ౫. కుస్తుంబురువు,కొత్తిమిరి॥.

కటుకందము. సం వి.అ.పుం- గాటు కలమూలము కలది-శిగ్రువు, మునగ॥. పుం. న. ౧. అల్లము॥. ౨. నెల్లుల్లి॥.

కటుకత్రయము. సం. వి. అ. న. సొంటిపిప్పలి మిరియములు.

కటుకఫలము. సం. వి. అ. పుం. కక్కోలము,చలువమిరియము॥. న. కక్కోలపుకాయలనుండి చేయఁబడుపరిమళద్రవ్యవిశేషము.

కటుకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కారముగలది,గాటుఅయినది. ౨.తీండ్రమయినది,తీక్ష్ణము. 3. అప్రియము, ఇంపుకానిది. ౪. ఉగ్రము, భయంకరము. ౫. పరుషము, నిష్ఠురము. ౬. నికృష్టము,చెడ్డది. (ఈయర్థమున సమాసాంతమున నే యుండును. ఉదా:దధికటుకము=చెడ్డపెరుఁగు. తక్రకటుకము=చెడ్డమజ్జిగ)వి.అ.పుం.౧.పొట్లు॥. ౨.సుగంధితృణము॥.3. కుటజము,కొండమల్లె॥. ౪. జిల్లేడు॥. ౫. రాజసర్షపము,నల్లావ॥. ౬.కారము. న. కటుకత్రయము,సొంటిపిప్పలిమిరియములు.

కటుకరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. కషాయాదులందుపయోగింపఁబడు నొకప్రసిద్ధమైనఓషధి.

కటుకాలాబువు. సం. వి. ఊ. స్త్రీ.౧.కజాతి చేఁదుసొఱ॥.

కటుకీటము. సం. వి. అ. పుం-గట్టిగా కుట్టునది-దోమ.

కటుకు[1](క్కు). వి.కొఱుకుటయందగుధ్వనికి అనుకరణము.

చ. కటుకునఁ బండ్లచేఁ గొఱుకఁగా నొకరత్నము గింజమాడ్కి ముంౘదటఁ బడియెన్ ... ద్వా. ౧౨. ౯.

వ.... పంటి కడ్డపడఁ గటుక్కునం గొఱికి ... చంద్రా. ౨. ౮౪.

కటుకు[2]. విణ. క్రూరుఁడు, కటికి.

క. కటుకున్ రక్కసిగొంగకు ... అచ్చ. భా. ౧౪ పా.

కటుక్వాణము. సం. వి. అ. పుం. టిట్టిభము, లకుముకిపిట్ట.

కటుగ్రంథి. సం. వి. ఇ. న. ౧. సొంటి. ౨.పిప్పలీమూలము. (కల్ప.)

కటుచాతుర్జాతకము. సం. వి. అ. న. నాలుగు కారపుద్రవ్యములసముదాయము. (ఏలకులు,ఆకుఁబత్రి, లవంగపుపట్ట,మిరియములు.)

కటుచ్ఛదము. సం. వి. అ. పుం. ౧. గ్రంథితగరము॥. ౨. నందివర్ధనము॥.

కటుతిక్త.సం.వి.ఆ. స్త్రీ.కటుతుంబి,చేఁదుసొఱ॥.

కటుతిక్తకము. సం. వి. అ. పుం. ౧. భూనింబము, నేలవేము॥. ౨. శణము, జనము॥.

కటుతుండి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కాకిదొండ॥. ౨. చేఁదుబీఱ॥.

కటుతుంబి. సం. వి. ఈ. స్త్రీ. ఇక్ష్వాకువు, చేఁదుసొఱ॥.

కటుత్రయము. సం. వి. అ. న - మూఁడుకారపుద్రవ్యములు-సొంటిపిప్పలిమిరియములు.

కటుదళ. సం. వి. ఆ. స్త్రీ. కర్కటి, దోస॥.

కటునిష్పావము. సం. వి. అ. పుం. ఏటికాపున పైరగు నొకజాతిఅనుముక్.

కటుపత్త్రము. సం.వి.అ.పుం. ౧.పర్పాటకముక్. ౨. సితార్జకము, తెల్లగగ్గెరక్.

కటుపత్త్రిక. సం.వి. ఆ. స్త్రీ.కంటకారి,వాఁకుడు.

కటుఫల. సం. వి. ఆ. స్త్రీ. శ్రీవల్లీవృక్షము.

కటుఫలము. సం. వి. అ. పుం. ౧. చేఁదుపొనక్. ౨. చలువమిరియముక్. ౩. చేఁదుపొట్లక్.

కటుబీజ. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలిక్.

కటుభంగము. సం. వి. అ. పుం. సొంటి. (కల్ప.)

కటుమంజరిక. సం.వి. ఆ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేనుక్.

కటుమోదము. సం. వి. అ. న. ఒకానొకసుగంధిద్రవ్యము,జవ్వాది.

కటురము. సం. వి. అ. న. తక్రము, మజ్జిగ.

కటురవము. సం. విశ. (అ. ఆ. అ.) పరుషధ్వని కలది. వి. అ. పుం. ౧. కప్ప. ౨. పరుషధ్వని.

కటురోహిణి. సం.వి. ఈ.స్త్రీ. కటుకరోహిణిక్.

కటువార్తాకి. సం. వి. ఈ. స్త్రీ.శ్వేతకంటకారిక, తెల్లవాఁకుడుక్.

కటువు. వి. (సం. ఖాటిః) పాడె. (శ. ర.)

కటువు. సం. విశ. (ఉ. ఉ, ట్వీ.ఉ.) ౧. కారము గలది (రసము).౨. పరుషము, ఇంపుకానిది, అప్రియము. (మాట.) ౩. సువాసనగలది. ౪. దుర్గంధమైనది, చెడుకంపుకొట్టునది. ౫. మచ్చరముగలది, దీర్ఘక్రోధముకలది. ౬. తీంద్రమయినది, వాఁడిమిగలది. వి. ఉ. పుం. ౧. కారము. (షడ్రసములలోనొకటి) ౨. గుగ్గిలముక్. ౩. వెల్లుల్లిక్.౪. వెలిగారము. (వై.ని.) స్త్రీ. ౧. కటుకరోహిణిక్. ౨. నల్లావక్. ౩. ప్రేంకణము, మోరటిక్. న. ౧.అకార్యము. ౨.దూషణము.

కటుస్నేహము. సం. వి. అ. పుం. ౧. గౌరసర్షపము, తెల్లావక్. (రాజని.) ౨. ఆవ, సర్షపముక్. (త్రి. ని.)

కటూత్కటకము. సం. వి. అ. న. సొంటి.

కటూత్కటము. సం. వి. అ. న. ౧. అల్లముక్. ౨. త్రికటుకము, సొంటి పిప్పలి మిరియాలు. (వై. ని.)

కటోదకము. సం. వి. అ.న. తిలోదకము. (సం. భాగ. ౭. ౨.౧౭.వ్యాఖ్య.)

కటోరము. సం. వి. అ. న. పాత్రభేదము.

కటోలము. సం. విశ. (అ. ఆ. అ.) కారమైనది. వి. అ. పుం. కటురసము, కారము.

కటోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. మాలలువాయించు వీణె.

కటోలి. సం. వి. ఈ. స్త్రీ. మాలది, చండాలస్త్రీ.

కటోలుఁడు. సం. వి. అ. పుం. చండాలుఁడు, మాలవాఁడు.

కట్ట[1]. వి.(√కట్టు.క.కట్టె.)౧.ఒకటిగా చేర్చికట్టినవస్తుసముదాయము; గుంపు.

సీ....దర్భ,కట్టము జలపూర్ణకలశంబుఁ బువ్వులు మఱచి వచ్చితి నేటిమకుఁగు నోర.భార. అను. ౨. ౪౪౬.

క. కైదువకట్టలు...రా.వి. ౨. ౩౨.

వ....కట్టలుకం గట్టలువడ నేయుకట్టెఁడిమరుని యంపసెలకట్టియల...వసు. ౨. ౧౪౦.

౨. చెఱువులోనగువానిగట్టు, ఒడ్డు, తీరము; సేతువు, ఆనకట్ట.

(తటాకఫలశ్రుతి)ఆ....కట్టఁ,దగినతెరువు లిడిన సుగతి గలుగు. భార. అను. ౩. ౩౩౦.

ఆ. ... ఎకిమీఁడు,దండుతోడఁ గడలిఁ దఱియ నరిగి,కట్టఁ గట్టఁ దివురుపట్టునఁ జెలఁగి యు, న్నీరుకుప్ప పొంగి నింగి ముట్టె. అచ్చ. రా. యు. ౭౩.

కట్ట[2]=అకట. (శ.ర, బ్రా.)

కట్టకడ. వి. (కడ+కడ-క.కట్టకడ) మిక్కిలికడ.
క....నిఖిలా,శలకట్టకడలకు...లక్ష్మీ. ౨.౪౯.

కట్టడ. వి. (√కట్టు. త. కట్టళై.) ౧.ధర్మము,విధి.
క.ఇది ధర్మం బపలీనుల,కిది విధి మాతాపితృప్రహీణుల కహహా, యిది కట్టడ తిరిపరులకు. కాశీ. ౬. ౫౨.
౨. నియమము, కట్టుపాటు, ఏర్పాటు.
క.ఏయేకట్టడ లెవ్వరి,కాయాకట్టడలు తప్పకధిపతి ప్రజలన్, నాయమునఁ బ్రోవ వలయుఁగృ,పాయుతుఁడై లెస్కరాదిబాధ లుడుపుచున్. కళా. ౬. ౨౬౪, ౭. ౧౦౦. ఆం. భా. ౨. ౧౬౪.
౩. తీరు,విధము.
క. వీరలమునివేషంబుల,కారణమునఁ గాక యొడలికట్టడయు ముఖ, శ్రీరామణీయకంబుమ,హీరమణునియట్ల కాదె యిరువుర కరయన్. నిర్వ. ౧౦. ౧౨౦.
ద్వి. ఈచక్కఁదనమును నీసేర్పు పెంపు,రాచకట్టడ వీఁడె రాజు గానోపు. ద్వి. సిం. భాగ. ౩. ౪౯. పా.
౪. ప్రకృతి, స్వభావము.
చ....ఏఱులు నిండి పాతీనం,గతుకఁగఁ జూచుఁ గుక్కలనకట్టడ మీఱక యెందు భాస్కరా. భా. ౪. ౫.
౫. ప్రతిఫలముగా నిచ్చుద్రవ్యము.
సీ. చేతి కైదేసివేల్ శివరాయలవరాలసెలకట్టడలపటాణీల్గ్రీబు,లు...రా. వి. ౫. ౧౩.
సీ. నిరుపమతమతపఃపరమపుణ్యంబులు కట్టడయైనళృంగారవతులు. ... గీ. వచ్చి రచ్చరలనిమిషస్వామికడకు. కవిక. ౭. ౪౫.
విశ. నియమితము,ఏర్పాటైనది.
గీ...రాజు,లరికి నిచ్చినకన్నియ లడఁకువలను, గదిసి కట్టడయగునూడిగములు సేయఁ, బచ్చసింగంపుగద్దియపైఁ జెలంగె. యయా. ౧.౯౭.

కట్టడచేయు. స. క్రి. (√కట్టడ.) ౧.నియమించు, ఏర్పాటుచేయు; ఆజ్ఞాపించు.
ద్వి....తల్లులవెనుకఁ దోడ్తేరఁ,గడఁక వసిష్ఠునిఁ గట్టడచేసి.రం. రా. అయో. ౧౩౬పా. ౩౧పం.
గీ. అంత నయ్యారిదౌర ముత్తియపులఁ జూచి, తెమ్మని సువేషు దవ్వులదీవి కేఁగు, మనుచుఁ గట్టడసేయఁగా...శుక. ౨. ౨౧౦.
౨. దయచేయు,అనుగ్రహించు.
గీ....నిన్ను...బహుధనాధీశ్వరత్వంబుఁ బ్రార్థనంబు, సేయుచున్నాఁడఁ గట్టడసేయు మయ్య. ఉ. రా. ౧. ౨౫౫, ౨. ౧౯౫.

కట్టడము. వి. (√కట్టు-క. కట్టడ. త. కట్టడమ్.) ౧. గృహాదికము. (బ్రా, వా.) ౨. కట్టనము,బంధము, కూర్పు.
ఉదా: కట్టడపుఁగాసులపేరు. కట్టడపుముద్దులు.

కట్టడి=కట్టిడి. వి. (√కట్టు.) ౧.నియతి,భాగ్యము.
గీ. అలరుఁ గట్టిడి బవిసి దయ్యంబు బైసి,కట్టడియనంగ నియతిగాఁ గాలకంఠ. ఆం. భా. ౧. ౯౯.
౨. ఆజ్ఞ.
గీ. నేను నీసమ్ముఖంబున నిలిచి యున్న, వారిలోపల నొకఁడనై వలయుపనికి,నిందు నందును దిరిగెద నిదియ నాదు,మనవి కట్టడి గావింపుమనిన నతఁడు. దశా. ౨. ౧౨౬.
౩. (దేవతాప్రసాదరూపమైన) నియమితద్రవ్యము.
చ. లలనరో యెందు నీ వీక గులామునకుం జనపద్దు మాకు ని,చ్చలు పెరుమాళ్ళకో వెలఁ బ్రసాదముకట్టడి సాగివచ్చు నా,తెలియ ప్రసాదమీవు సతతంబుఁ బసాపడుము...వైజ. ౨. ౧౨౭.
౪. నియమము, కట్టుపాటు.
ఉ..కావ్యములమర్మము గానఁగ లేక దుర్మతుల్,

కా వనఁ గాని యెట్టికడఁ గట్టడిఁ జెప్పఁగ
నేరరు...ద్వా. ౧. ౧౬.

కట్టడికట్ట=చెలియలికట్ట, వేల.

చ. కడలిగముల్ గడుం దొనఁకి కట్టడికట్టలు
దాఁటి పాఱఁగా...అచ్చ. రా. యు. ౧౬౨.

కట్టనము=కట్నము. వి. (√కట్టు-క. కట్టణ, కట్న. త. కట్టణ.) ౧. బంధము, కూర్పు; కుట్టిమము. (చూ. కట్నము.)

సీ...ఉక్కుటులుల, రాకట్టనపు పెడల్ గైకొని
నఱకుట...హరి. ఉ. ౨. ౧౬.

౨. వస్త్రము.

గీ. కప్పడ మనంగఁ గోక నాఁ గట్టన మన, వస్త్ర
నామంబు చెలఁగును...ఆం. భా. ౨. ౧౫౫.

౩. కానుక, ఉపాయనము.

సీ....సుత్రామపౌత్రునకు... దుకూలమాల్య, పరి
లేపనములు నుపాయనంబుగ నిచ్చి... గాం
డీవికిని మేలుకట్టనంబు లమర్చి ... జై. భా.
౭. ౧౦౫.

కట్టరము. వి. నాట్యబంధము.

సీ. కంట యంచనఁగను గట్టర మనఁగను నాట్య
బంధం బొప్పు...ఆం. భా. ౧. ౧౩౦.

కట్టా=అకట.

క. జెట్టిదపువగలఁ బొగులుచుఁ, గట్టా నీ విట్టుడ
య్యాఁగాఁ దగునె చెలీ. నీలా. ౨. ౭౬.

శా. కట్టా దాయలపంచనుండఁ దగవే కౌరవ్య
వంశాగ్రణీ. భాగ. ౧. ౩౧౧. ఆం. భా. ౩. ౬౭.

కట్టాణి. వి. (కడు+ఆణి.) మిక్కిలిగుండ్రని ప్రశ
స్తమౌక్తికవిశేషము.

సీ...కట్టాణిముత్యాలకంఠమాల. భీమ. ౧. ౧౧౬.

సీ. కట్టాణిచాకట్లు...ఇందు. ౧. ౭. హంస. ౧.
౨౧౬.

కట్టాయితము. విశే. (కడు+ఆయితము.) సంసిద్ధ
ము, సన్నద్ధము.

గీ. అట్టియెడ సైన్య మెల్లఁ గట్టాయితంబు, చేసి
... ఉ. హరి. ౨. ౭౫.

వి. సన్నద్ధమైనసైన్యము.

సీ. అసమాస్త్రుఁ డఖిలంబు నడకించు బొమ్మలు నా
త్మసంభవునికట్టాయితములు. గీ. నాఁగఁ బొలు
పారు నొకకోటివలినముఖులు. భాగ. ౬. ౪౪౫.

కట్టాయితపడు=సంసిద్ధమగు.

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక
యరుగుఁ గావున నతనిం, జుట్టుసువలెఁ గొని
చని పతి, కట్టెదురం బెట్టి కౌశికంబులు నిలి
చెన్. వేం. పంచ. ౩. ౧౫౭.

కట్టించు. స. క్రి. (√కట్టు.) కట్టఁజేయు.

(గృహతటాకాదులు-నిర్మింపఁజేయు.)

సీ. కట్టింపలేనైతిఁ గమలకాసారంబు నిలుపంగ
లేనైతిఁ దులసివనము. కాశీ. ౩. ౭౧.

క....నలుచే సేతువు ప్రియంబునం గట్టించెన్.
ఉ. రా. ౧. ౧౨౩.

(బంధింపఁజేయు.)

సీ. కావేరిఁ గట్టించెఁ గార్పాసరాసుల నుబ్బి
చోడుఁడు మెచ్చ నొక్కతాత. హర. పీఠి.
౧౦.

కట్టిఁడి. విశే. (కట్టు+ఇఁడి.) క్రూరము, నిర్దయము.

క. అట్టేల రాక తక్కుం, గట్టిఁడియే యాలతాం
గి కామాతురు నన్, బెట్టి యచట దానికి మ
న, సెట్టు నిలుచుఁ దగవు విడువ నెట్టులు నే
ర్చున్. భార. విరా. ౨. ౨౯౭.

ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె న
నంగ విన్న నా, కట్టిఁడిపీను లేమి వినుకాతి
య కోర్వవు...భార. భీష్మ. ౧. ౬౫.

శా. ... కానం దెర్వులు గట్టి యేఁగు ప్రజలం గ
ట్టిండి యై దోఁచి ... పాండు. ౫. ౭౫.

౨. (త. కట్టాణి.) దిట్ట, ప్రౌఢుఁడు.

క. ఆదికవుల వాల్మీకుల, వేదవ్యాసులఁ దలంచి
వివిధాగమసం, వేదితఁ గట్టిఁడి యగుకవి, తా

దక్షవిలాసుఁ గాళిదాసు నులింతుఁ. వాల్మీ. ౧. ౯. (ఈపదము ఉభయపళిలోఁ జేర్పఁబడెను. కావ్యా. ౭. ౬౯.)

కట్టిక=కటిక 1. వి. (సం. కాష్ఠికః. ప్రా. కట్ఠిఅ. క. కట్టిగెయవ.) వేత్రహస్తుఁడు; వేత్రహస్త.

ద్వి. కోఁలికట్టికలు సాఁగు బళా యనంగ, నేతాము వలెఁ దారుఁ డేలెంచి మ్రొక్క.-రం. రా. కిష్కి-౦. (౪. ర.)

సీ. కటికవాండ్రనఁగను గట్టిక లనఁగను బణిహారు లనఁగను బరఁగుచుండు, వేత్రహస్తాభిధ ...ఆం. భా. ౨. ౧౦౮.

జ: కట్టికవాఁడు.

కట్టికవాఁడు. వి. (√కట్టిక)=కట్టిక.

ద్వి. దేవ హెచ్చరిక దైతేయారి యనుచు, శీవిమై మున్ను కట్టికవారు నడువ. అ. మ. క. ౫. ౨౪౧ పా. ౧౨ పం.

కట్టిడి=కట్టడి.

(భాగ్యము, నియలి.)
ఆం. భా. ౧. ౯౯.

కట్టిపెట్టు. స. క్రి. (√కట్టు.) ౧. బంధించు.

(వ్యవ)వాఁడు దూడను రాటికి కట్టిపెట్టినాఁడు.

౨. విడిచిపెట్టు, చాలించు, మాను.

సీ. సర్వదైవతసమర్చలు గట్టిపెట్టంగఁబడియెఁ బూర్తంబులపనులు సమసె. హరి. పూ. ౧. ౧౦౦.

గీ. ...కాని తలఁపులు గట్టిపెట్టి. జై.భా.౧.౬౩.

ఉ....నీ,మాటలు గట్టిపెట్టి చనుమా మునవచ్చినత్రోవచొప్పునన్. రసిక. 3. ౮౫.

3. అణఁచు.

సీ. భానుమళ్కులవీరభద్రాన్న దేవేంద్రగర్వసంరంభంబుఁ గట్టిపెట్టి. గీ...ఏలించెఁ దెలుఁగుభూమిఁ,దననిజస్వామి నల్లాడధరణినాథు, బళిరె యతియేటిలింగనప్రభువరుండు. భీమ. ౧. ౬౨.

౮. కప్పిపుచ్చు, దాఁచు.

క. మునిముచ్చులార మీ చే,సినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా,ననుఁ దఱిమిలి రిఁక నే మియు, ననకుఁడు నాతోఁడిదొంగ లైరిరి మీరుఁ. ప్రభా. ౫. ౭౦.

సీ. మునిపత్ని యన కహల్యను బట్టఁడే నీదుసహపాఠి యగుపాకశాసనుండు. గీ. ఇట్టిమీహారినడతలు గట్టిపెట్టి,యమ్మనేఁజెల్ల న్యాయంబులాఁడె దౌర. శశాం. 3. ౭౧.

౫. (ఇల్లు మొదలగునవి) నిర్మించు.

గీ. చప్పరం బొండె గుడి యొండెఁ జవిక యొండెఁ,గలుమఠం బొండె నిల్లొండెఁ గట్టిపెట్టి, బ్రహ్మయోగీశ్వరుని నుంచుభక్తి నెవ్వఁ, డతఁడు మాన్యుండు పూజ్యుండు నగులితముగ. భీమ. ౬. ౫౫.

(వ్యవ)ముసలివానికి ఈచిన్నపిల్లను గట్టిపెట్టినారు (=వివాహముచేసినారు.)

కట్టు. స. క్రి. (క. త. కట్టు.) ౧. బంధించు.

ఆ. వరము వడసియైన శరము ప్రయోగించి,పట్టఁజేసియైనఁ గట్టియైన, వనధి దాఁట నెట్లు వచ్చుఁబో...భా. రా. యు. ౧౮.

సీ. శరభంబులైనను సరభసంబుగఁ గిట్టి మాటకట్టుగఁగట్టు మొక్కలములు. గీ.గలిగి శస్త్రాస్త్రనిపుణులై కరము మెఱసి. విక్ర ౧. ౭౭.

క. ... పట్టికి యుపరా,ట్పట్టము గట్టెఁ ధరాధిపతి ... రా. వి. ౨. 3౨.

౨.(వస్త్రాదులు) ధరించుకొను,కట్టుకొను; కట్టు.

శా. ఎట్టెట్రా మనుజేంద్రు చేలములు మీ కీఁబాడియే మీరలుం, గట్టం బోలుమ రే...భాగ. ౧౦. పూ. ౧౨౫౭.

సీ. పొరలాడఁ బెంథూళి బ్రుంగినవలు పూడ్చి పలుచనినూల్నవల్కలముఁ గట్టి. గీ. పూఁటపూఁటకు నుపచారములు ఘటింప. జై. భా. ౬. ౭౫.

౩. (ఇంద్రియాదులను) నిరోధించు.

క. పట్టెననేక వ్రతములు, పెట్టె మహీదేవులకు నభీష్టాన్నంబుల్, కట్టె నుపవాసములచే, మెట్టెన్ బుణ్యస్థలములు మెలఁతలు దానన్. వరాహ. ౨. ౧౭౬.

క.మగవాఁడ ననుచు నున్నా,వగునగు నేఁగడుపు గట్టి యప్పలు మిగులన్,దిగిచి యిటు వండి పెట్టినఁ, బొగులవు కుంభంబుమీఁదిపొట్టేలు క్రియన్. శుక. ౩. ౨౭౯.

౪. ఆరోపించు, మోపు.

క. దోషరహితకన్యకపై, దోషంబులు గట్టి రిత్త దూషించినయా, దూషకుని నూఱుమడుఁగులు, దోసానుగుణముగ భూపతులు గొనవలయున్. విజ్ఞా. ఆచా. ౧౦౮.

క. కనికరము లేక వానిం,గని కరము నిరాపసిందఁ గట్టం దగునే. సారంగ. ౩. ౫౧.

౫. ఘటిల్లఁజేయు, కలిగించు.

మ. ... తెగువన్ దుర్భాష లిట్లాడి యీ,కొలనా కేటికిఁ గట్టె దమ్మ. సారంగ. ౨. ౧౦౨.

సీ.సిరిగట్టు నాకును సిరిగట్టునెల వప్ప... చంద్రా. ౨. ౪౫.

౬. కూడఁబెట్టు.

క. ...మున్,గట్టినకర్మఫలంబులు,నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. భార. ఆది. ౫. ౫౮.

౭. (దండ, పద్యము, మొ.) కూర్చు.

గీ. వీణ వాయింపఁ బొగడంగ విరులు గట్ట,నేర్చునట్టిది యొకరిత... కాశీ. ౫. ౩౧౬.

క. కరకుశలత మెఱయ మాలికలు గట్టి తగన్. విప్ర. ౨. ౩౦.

గీ. కవితముఖమున రగణంబుఁ గట్టునపుడు. కావ్యా. ౭. ౧౩.

ద్వి. ... ముదితసద్భక్తి సమ్మోదంబు మహిమ,పదములుగాఁ గట్టి పాడెడువారు.పండితా.దీక్షా. ౫౫ పా. ౧౦ పం.

౮. (ఇల్లు మొదలగునవి)నిర్మించు.

మ. ... కట్టినతదీయాగారము ...భా. రా. ఆర. ౧. ౧౧౪.

౯. మూయు, కప్పు.

ఉ. ... వీటికిం,గావలి నెట్టి పొంద్రవిభుకన్నులు గట్టి ప్రలంబవైరికిన్, సేవ యొనర్చి ... ఉ. హరి. ౨. ౯౮.

౧౦. అడ్డగించు, నిరోధించు.

సీ. ... త్రోవలు గట్టి నరులఁ జంపుచుఁ దద్ధనంబులెల్ల,సంగ్రహించుచు...హ. వరాహ.౩.౪౦.

సీ. చేతులచేత రేవాతోయములఁ గట్టి యొకయిన్ని యవ్వల కుబుకనీక. దశా.౬. ౭౦.

౧౧. చెల్లించు.

ఉదా: వాఁడు పరీక్షకు సొమ్ము కట్టినాఁడు.
ఇంటిపన్ను కట్టినాఁడు.

౧౨. విధించు.

ఉదా: అధికారులు పొలమునకు హెచ్చుపన్ను కట్టినారు.

౧౩. మూటకట్టు.

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు నెట్టి కట్టి నపారివిళంగాయగమియు. ఆము. ౨. ౯౭.

వ. నారంగళ్ళంగి బేరభంగంబులతోఁ గట్టినకలమాన్నంపుఁజల్ది పోఁకపొత్తులం గుడువ ... ఆము. ౪. ౩౫.

అ. క్రి. ౧. అగు, ఏర్పడు.

ఉ. అక్కడ నిక్కడ న్నిలిచి రత్తతి గుంపులు గట్టి వాసరల్. భా. రా. యు. ౯౧౯.(గుంపులుగట్టి=గుంపులుగా నేర్పడి.)

గీ. జోళ్లు గట్టి పోరుచు... మనుచ. ౪. ౨౩.

గీ. ... కుంతలములు ... జడలుగట్టె ... హర. ౪. ౧౦.

౨. నిబద్ధమగు.

గీ. కట్టు విఙ్మాత్రములు పొంగుఁగడుపు ... మార్క. ౨. ౩౪.

వి. ౧. బంధనము, బంధించుట; బంధనసాధన మగు త్రాడు, మొ.

ఉ. కట్టినఁగట్టుఁగాక హరి కట్టడచేసినఁ గేలు మున్నుగాఁ, గట్టక వెన్క నేమిటికిఁ గట్టె విహంగవరేణ్యుఁ డిట్టులిం, కెట్టు నమస్కరింతు హరి కే నని కన్నుల మ్రొక్కఁ గాని యా, కట్టున కింతయైనను వికారము నొందఁడు దైత్యుఁ డత్తఱిన్. దశా. ౫. ౧౧౯.

సీ. ... సత్యం బనుకట్టునఁ దగఁ గట్టుపడి ... హరి. ఉ. ౭. ౩౦.

గీ. ... ఇనుపకట్ల మ్రానిముంతలు ... శుక. ౨. ౩౬౦.

౨. మితి.

క. ఏడ స్త్రీకొలమింటం, జూడను ముంగురులు గూడుచుం గొనబున ని, ట్లీడేరి కట్టు దప్పిన, చేడియ కిఁక నైనఁ బెండ్లి సేయం దగదే. యయా. ౩. ౧౦౦.

౩. ఆకృతివిశేషము, కూర్పు.

ఉదా: మీసకట్టు, మొ.

ఉ. ... పయ్యెదకొంగొకకొంత జాఱి చన్కట్టు లలాటలోచనునికన్నులు మూఁటికి విందుసేయఁగన్. హర. ౫. ౪౭.

౪. వస్త్రధారణము.

సీ. కాళ్లయొప్పిద మాఁడుకట్టనుజ్జ్వలను సేయంగ ... భార. విరా. ౧. ౨౨౯.

౫. తొట్టికట్టు, కక్ష్య, గృహాంతర్భాగము. (శ.ర.)

౬. (దేశకాలముల) భాగము.

ఉదా: సీతుకట్టు.

గీ. గొల్లపడుచులు చని గుంపుగూడి చూడ, తోలు దామెనత్రాడును లీలతోడ, నీడ్చికొని వచ్చి దమయింటియెదురుకట్లఁ, దనరుయమళార్జునంబులఁ దగులఁ బెట్టి. వి. పు. ౭. ౧౩౭.

చ. ... ఓర్తు లతాంగి యేఁపెదు, రకట్టున ముంగిటం గనవు గాంద్రయుఁ బుచ్చుచు ... కాశీ. ౬. ౨౬౨.

౭. ఉడికినకందిపప్పులోనగువానిరసము, యూషము.

ఉదా: కందికట్టు, పెసరకట్టు, మొ.

ఆం. భా. ౨. ౨౫౧.

౮. నిబంధనము, కట్టుపాటు. (శ.ర.)

కట్టినది=గర్భిణి. (స్త్రీపశువు)

సీ. ... గర్భిణి చెలువందుఁ గట్టిన దన. ఆం. భా. ౨. ౨౬౩.

కట్టిపడుపు=నిర్బంధించికుడుపు, అవశ్యమనుభవింపఁజేయు.

క. తొలిజన్మంబునఁ జేసిన, కొలయును బుణ్యంబుఁ గట్టికుడుపక యున్నే. సారంగ. ౨. ౩౩. రసిక. ౩. ౯౩.

చెవినిల్లుకట్టుకొని చెప్పు(పోరు)=అదేపనిగాఁ జెప్పు, ఎప్పుడును వెంతనుండి చెప్పు.

క. న్యాయం బన్యాయం బని, కూయిడి చెవి నిల్లుగట్టుకొని చెప్పంగా, నేయోజ న్వినకుండున్, మాయావులమాట లెట్టిమహిపతి యైనన్. వేం. పంచ. ౧. ౫౩౩.

వాడుకలోని ప్రయోగవిశేషములు:-

౧. వారు నాపై కట్టుకట్టిరి. ౨. నామందుతో జ్వరము కట్టినది. ౩. కుఱుపునకు పిండికట్టు కట్టినాఁడు. ౪. ఈబట్టకు విలువ కట్టుము. ౫. ప్రయోగము చేసి వాని నోరు కట్టివేసిరి. ౬. ఆమాటతో వాని నోరు కట్టినది. ౭. ఈ కార్యములో వాఁడు నడుము కట్టుకొని పని చేసినాఁడు. ౮. దెబ్బతగిలి తలకు బొప్పికట్టినది. ౯. చేనికి నీరు కట్టుము. ౧౦. అతఁడు వారిపైఁ గత్తి కట్టెను. ౧౧. నాకీయుపకారము చేసి పుణ్యము కట్టుకొనుము. ౧౨. అంతపాపము కట్టుకొనకుము. ౧౩. చదరంగమున వానియాట కట్టినది. ౧౪. వాని కిక్కడ తాటాకులు కట్టిపంపిరి. ౧౫. వానిని బొమ్మకట్టి ఏకుచున్నారు. ౧౬. నీవు ఎక్కడకు ప్రయాణము కట్టినావు. ౧౭. నాపైవారందఱు కక్షకట్టిరి. ౧౮. మామిడి

కాయ బెంక కట్టినది. ౧౯. చేతులు కట్టుకొని నిలుచున్నాఁడు. ౨౦. అన్న అప్పులు తమ్ముఁడు కట్టుకొన్నాఁడు. ౨౧. బండికట్టును. ౨౨. అత నిపాట ఈవేళ రక్తికట్టలేదు. ౨౩. నూలిపళ్లెము పాఁకుడు కట్టినది.

జ:-కట్టు[1], కట్టడ, కట్టడచేయు, కట్టడము, కట్టడి, కట్టనము, కట్టించు, కట్టేఁడి, కట్టిడి, కట్టిపెట్టు, కట్టుఁగంబము, కట్టుఁగొంగు, కట్టుఁగొమ్మ, కట్టుఁగొయ్య, కట్టుఁగొఱ్ఱు, కట్టుఁగోక, కట్టుఁబోతు, కట్టుకథ, కట్టుకొను, కట్టుగడ, కట్టుగుండు, కట్టుగొబ్బె, కట్టుబోన, కట్టుపడు, కట్టుపఱచు, కట్టుపాటు, కట్టుబండి, కట్టుబడి, కట్టుమట్టు, కట్టుమామిడి, కట్టుమ్రాను, కట్టువ, కట్టువర్గము, కట్టెడ, కట్నము, కట్లగుదియ, కట్లజెట్టి, కట్లవండ, కట్లపాము, కట్లపురుగు, కట్లబల్ల, కట్లమారి, కట్లసంచి, కట్లసరి.

**కట్టుఁగంబము.** వి. √ కట్టు. (ఏనుఁగుమున్నగువానిని) బంధించెడి స్తంభము, కట్టుఁగొయ్య.

సీ. కట్టుఁగంబము డుంతిగంధద్విపమునకుఁ బ్రణవాక్షరము పరబ్రహ్మమునకు. కాశీ. ౫. ౧౩౫.

వ. ... తోలుపట్టెడలు మెడల నమరం బసుపార్చి కట్టుఁగంబములకుం దార్చి బంధించిన... జాగిలంబులనుం గాంచి... మనుచ. ౪. ౨౬.

**కట్టుఁగొంగు.** వి. (కట్టు+కొంగు) కోకయొక్క కట్టుకొను చెఱఁగు.

చ. ప్రిదిలినకట్టుఁగొంగు సవరించి ... దశా. ౩. ౭౯.

క. ... గగుర్పొడిచెం జను, కట్టొకయిసుమంత వీడెఁ గట్టుంగొంగుకై. విజ. వి. ౨. ౧౬౭.

**కట్టుఁగొమ్మ.** వి. (√కట్టు) ఆనకట్ట, సేతువు. (శ. ర.)

**కట్టుఁగొయ్య.** వి. (√కట్టు) మేఁకి, కళ్లమునఁ బశువులను గట్టుటకై పాఁతినగుంజ; పసువులను గట్టుటకు పాఁతినగుంజ.

గీ. గుంజ నాఁగను గట్టుఁగొయ్య నాఁగను మేధి... ఆం. భా. ౨. ౨౩౪.

సీ. కట్టుఁగొయ్యకుఁ జేరి కామధేనువు దప్పెఁ గానవచ్చిన పెన్నిధాన మడఁగె. కాశీ. ౪ ౧౧౧.

**కట్టుఁగొఱ్ఱు**=కట్టుఁగొయ్య (శ. ర.)

**కట్టుఁగోక.** వి. (√కట్టు) మొలను ధరించెడు వస్త్రము, అంతరీయము.

**కట్టుఁబోతు.** వి. (√కట్టు) దయ్యాలపోతు, ప్రయోగము చేయువాఁడు.

**కట్టుక.** వి. (పశ్వాదుల) గర్భస్రావము.

సీ. చనును గర్భస్రావసంజ్ఞ కట్టుక యన. ఆం. భా. ౨. ౨౬౪.

**కట్టుకథ.** వి. (√కట్టు) కల్పితకథ.

**కట్టుకరపాని.** వి. రోగవిశేషము, ఒకవిధ మగుకరపాని.

గీ. మూఁడుదినములు గొన్నను మోహరంపుఁ, గట్టుకరపాని యాశ్చర్యకరము గాఁగఁ, బోవుఁ బథ్యంబు నుప్పును బులుసుఁగాదు, అన్నమును వేఁడినీళ్లైన నర్హమగును. (చికి-చి. ని)

గీ. ఉల్లి పసయును నిల్లింద యొసఁగఁ గూర్చి, యామిదంబున వండి యంగాంగలేప, నం బొనర్పంగఁ ద్రావింప నాశ మగును, గట్టుకరపాని తన పైనగుట్టు విడిచి. (చికి- చి. ని.)

**కట్టుకొను.** స. క్రి. (√కట్టు) ౧. బంధించుకొను.

సీ. నిలుచుండి చంక చేతులు కట్టుకొనువాఁడె కొలువరా రేమంచుఁ గెలయ సాగె. కుచేల. ౨. ౨౪. (చంక చేతులు కట్టుకొను=చంకలలో చేతులు చేర్చికొను, విధేయత చూపు.)

౨. (వస్త్రాదికము) ధరించు, తాల్చు.

ఉ.... మాకు మా, మంచలలోనఁ గట్టికొన మంచి పటంబులు లేవు... భాగ. ౧౦. పూ. ౧౨౫౫.

చ...చూచి రా, నెఱకలు గట్టుకొన్న మఱి యేం
డ్లును బూండ్లును బట్టు...మనుచ.౧.౭౩.

౩. పెండ్లియాడు.

ఉదా: చూచి చూచి కానిదానిని కట్టుకొ
న్నాఁడు.

౪. అనుభవించు, (లాభాదులను) పొందు.

ఆ. రాముపెనుక సకలరాజ్యసంపదలతో, నరుగు
మీవు శూన్య మైనపురము, భరతుఁ డేలనిమ్ము
పాపమ్ము సిద్ధించెఁ, గైక దీన నేమి కట్టుకొని
యె. భా. రా. అయో. ౬౦.

వ....ఏమిఫలంబుఁ గట్టుకొంటివి... జై. భా.౭.
౧౭౫.

౫. సంపాదించుకొను; తెచ్చిపెట్టుకొను.

వ....మాతృశిరంబు గొట్టి కీర్తి గట్టుకొమ్ము ... ద
శా. ౬. ౨౫.

గీ...ఊరివారి, కొలయునెడరుల కెల్లఁ దా నుమ్మ
లికము, గట్టికొని కుందునట్టులుగాదె వత్స.
భార. శాం. ౬. ౩౨౦.

ఆ. నిష్ఠురంబు లెల్ల నీకొఱ కి ట్లేను, గట్టికొంటి
...భా. రా. అయో. ౨౭౨.

కట్టుగడ. విశ.(√కట్టు)కూడఁ బెట్టినది, సంచితము.
(ధాన్యాది-శ.ర, బ్రా.)

కట్టుగడచేయు=నిలువచేయు. (బ్రా.)

కట్టుగడసరకులు=నిలువ చేసినసరకులు. (బ్రా.)

కట్టుగుండు. వి. (√కట్టు.) ౧. ఱాళ్లను బ్రద్దలుకొ
ట్టుటకై ఉపయోగించుగుండు. (ఇది పిరంగిగుం
డు వంటిది.)

సీ....కొండ గొట్టెడుకట్టుగుండ్లరవము. పరమ.
౫. ౪౦.

క. సుమదళయుగళీమధ్య, భ్రమరం బది చూడు
పడఁతి పథికస్వాంతా, హమికోపలహతికై
సిరి, కొమరుండు ఘటించుకట్టుగుండును బో
లెన్. చంద్రా. ౪. ౨౧౪.

౨. తూనికఱాయి.

ద్వి. వారికిఁ గొలువంగ వలసినకొల్చు, కొలిచి
మాడలు కట్టుగుండులఁదూఁచి. ద్వి. పరమ.
౬. ౪౮౦. పా.

కట్టుగొఱ్ఱె. వి. (√కట్టు) వధకై గుంజకు కట్టిన
గొఱ్ఱె. (బ్రా.)

కట్టుదొన. వి. (కట్టు + దొన-క. కట్టుదొణె.) కో
నేఱు, చెఱువు.

సీ.తనచరిత్రామృతంబునకు ముజ్జగములజనులవీను
లు కట్టుదొనలు గాఁగ. చంద్రా. ౫. ౧౪౭.

కట్టుపకాసు(సి). విశ. ధీరుఁడు; శూరుఁడు.

చ. కనుఁగొని పార్థుతుం డపుడు గట్టుపకాసయి
వీఁకఁ దాఁకినం, దునిమె నతండు తద్ధనువు...
భార. భీష్మ. ౨. ౩౭౨.

ఉ. కట్టుపకాసి దీర్ఘదృఢకాయుఁడు తత్ప్రతి
హారపాలకుం, డు...నిర్వ. ౪. ౫౪.

ఉ...రావుతుల్, గట్టుపకాసులై నరునిఁ గప్పిరి
శక్తులఁ దోమరంబులన్. భార.శల్య.౧.౭౭.
హరి. పూ. ౧. ౪౭.

(చి.ని, శ.ర. ఇట్లుపరుషాదిరూపము గ్రహించె
ను. బ్రా, భా. ల. వ్యా. సరళాదిరూపము గ్రహిం
చెను. గట్టువలెఁ బ్రకాశించువాఁడు, పర్వతధీ
రుఁడు అని. భా. ల. వ్యా. ఇంకను విచార్యము.)

కట్టుప(వ)డు. అ. క్రి. (√కట్టు) ౧. బద్ధమగు.

సీ....సత్యం బనుకట్టునఁ దగఁ గట్టువడి...హరి.
ఉ. ౭. ౩౦.

ఉ. వల్లభుఁ డిట్లు కట్టుపడువార్త చెవింబడ గుం
డె జల్లనన్, దల్లడమంది...దశా. ౫.౧౨౭.

వ....త్రాళ్లం గట్టువడి...మనుచ. ౪. ౨౭.

౨. నిరుద్ధమగు; ఆఁగు, విరమించు.

వ. ఎవ్వలనను జరియింపరాక యేదెసల మెలంగు
ద్రోవలుఁ గట్టువడియె...హరి.పూ.౧.౧౦౨.

సీ....ఖచరులత్రోవలు గట్టువడియె. ఉ. రా. ౧.
౨౧౫.

సీ. భస్మాంగరాగంబుపని కట్టువడఁజేసి కస్తూరి తోడ శ్రీగంధ మలఁదు. హర. ౫. ౫.

౩. తక్కువయగు, న్యూనమగు.

క. స్వామిహిత మొప్పఁగను సం,గ్రామమునన్ శరపరంపరలు పయిఁ గురియం,గా మృతిఁ బొందినశూరుఁడు, భూమీదాతకుఁ బ్రభావమునఁ గట్టువడున్. భీమ. ౫. ౬౫.

కట్టుప(వ)ఱచు. స. క్రి.(√కట్టుపడు)కట్టుపడఁ జేయు.

(అరికట్టు, నిరోధించు.)

సీ.అహికులాధిపు వ్రాసి యంత్రించి దక్షిణగంధ వాహునిరాక కట్టువఱతు. కవిక. ౩.౧౧౦.

గీ. మీఁదిగాడ్పుఁ గ్రిగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు గట్టువఱచి...పి.శకుం. ౨. ౧౧౩.

కట్టుపాటు. వి. (√కట్టుపడు.) ౧. కట్టుపడుట. ౨. ఏర్పాటు, నిబంధనము.

కట్టుబండి. వి. (కట్టు+బండి ) సరకులబండి.

ఉ...మొన్న మేరుగిరిపాటినిశాచరి నంతచేసె నేఁ, డేపునఁ గట్టుబండి నిటె యింపఱు చూడఁగ నింతచేసె...వి. పు. ౭. ౧౨౧.

చ.తఱుఁగనిధాన్యముల్ పసులదాఁటులుఁ దోఁటలుఁ గట్టుబండులున్ ... తత్పురి శూద్రుల కొప్పు నెప్పుడున్. విక్ర. ౧. ౭౬.

కట్టుబడి. వి. (√కట్టు.)సేవచేయుటకైభృత్యులు మున్నగువారికి శాశ్వతముగా నిచ్చుమాన్యము.

సీ.. ఇగురుకైజీతంపు టెక్కటీలకు గుజ్జుపఱుపు మామిడిఁ గట్టుబడిగఁ జేసి. చంద్రా.౪.౮౪.

కట్టుబడిపన్ను = భూమిమీఁదఁ జెల్లింపఁదగిన యొకవిధమైనపన్ను. (వా.)

కట్టుమట్టు. వి. (√కట్టు.) ౧. (పశ్వాదులను) బంధించుచోటు.

సీ. కట్టుమట్టుననుండి కదలించినఁ జెలంగుభీకర శుండాలబృంహితములు. విక్ర. ౪. ౭౮.

సీ. కావించె నెవ్వఁడు కట్టుమట్టుగ హస్తతలము సంతతదాతృతాసురభికి.ఉదయనోదయము. ౧. ౫౬.

౨. నివాసస్థానము.

(రజతాద్రివర్ణనము.) గీ. కాననీ మెట్టు మోక్షంబుకట్టుమట్టు. వరాహ. ౬. ౮౭.

సీ. పాకారిముఖ్యదిక్పాలకనిలయంబు గ్రహతారకంబులకట్టుమట్టు. ఝల్లా. ౩. ఆ. (శ. ర.)

౩. కట్టుపాటు,ఏర్పాటు.

వ. ... దుష్టనిగ్రహశిష్టపరిగ్రహంబుగా నప్పట్టనంబు సుగ్రీవాజ్ఞ నడవం గట్టుమట్టు చేసి... రామా. ౫. ౩౨౫. (శ.ర.పా.)

(శేషాద్రివర్ణనము) వ. ...అట్టిచుట్టు కైదువజగజెట్టికి విడిదిప ట్టైనపెట్టఁబెట్టుపెట్టుగట్టుకట్టుమట్టుదిట్టతనం బెట్టిదనిన...రా. వి. ౧. ౨౮.

కట్టుమామిడి. వి. (√కట్టు.) చిలుకలు మున్నగు పక్షులు కొఱుకకుండ పండ్లకు బుట్టలు కట్టినమామిడి. (శ.ర-అంటుమామిడి. బ్రౌ.)

కట్టుమ్రాను. వి. జౌ. (√కట్టు-త. కట్టుమరం.) తెప్ప,ప్లవము. (శ.ర,బ్రౌ.)

కట్టువ. వి. (√కట్టు) వెలుగు, కంచె.

సీ. ఆటతిప్పలు ద్రచ్చి పాటబండులు గూల్చి కట్టువ లన్నియుఁ గాడుచేసి. అచ్చ. రా. సుం. ౯౫. (కట్టవ. వా.)

కట్టువర్గము. మి.వి. (√కట్టు) కట్నముగా నిచ్చు వస్త్రసముదాయము.

చ....వజ్రపుం, గడియములున్ సుహాసులచోకాటపుఁజౌకళికట్టువర్గముల్, గడుఁ బ్రియమొప్ప నిచ్చి...సుక. ౧. ౧౩౫.

క.... మేనక, కనవద్యము కట్టువర్గ మాపట సురనా,థుని చే నిప్పించి ముసుం,ను ...చంద్రా. ౩. ౫౦.

**కట్టె(ట్టియ).** వి. (సం. కాష్ఠం. ప్రా. కట్ఠా. క. కట్టిగె. త. కట్టై.) ౧. కాష్ఠము, పుడుక, చిదుగు.

గీ. పూవు ముడిచినపురవీథిభూమియందుఁ, గట్టె మోవంగ వలసినకారణమున. భీమ. ౨. ౧౦.

ద్వి. పట్టభద్రునికూర్మిపట్టికి వేల్మి, కట్టెలు మోవంగఁ గట్టఁడే నీకు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౩౪.

క. ఆవేశ్యకు నీళ్లు కట్టియలు నే మోతుక్. సైజ. ౨. ౨౭. భార. విరా. ౧. ౭౮.

౨. దండము, కఱ్ఱ.

క. కట్టియఁ జేకొని డేగం, బట్టి యుబుసుపోకఁ బొలము మట్టినఁ జాలుక్, దొట్టినక్రొవ్వులు గలయవి, చెట్ట డిచినఁ జేటెఁ డేమి చెప్పంబులుఁగుల్. మనుచ. ౪. ౨౪.

౩. బాణము, అమ్ము.

ఉ. కట్టియ వైచె నెన్నుదుకు గాఁడ భవత్తనయుండు మాద్రిలేఁ, బట్టిని... భార. శల్య. ౧. ౩౭౭.

వ. హనుమంతు నిరువదిగజకట్టియల గవాక్షుక్ బదిములుకుల నొప్పించి... అచ్చ. రా. యు. ౩౬౪. అచలా. ౧. ౨౦.

జ: కట్టెగుఱ్ఱము, కట్టెపండు, కట్టెవిఱుపుమాట.

**కట్టెగుఱ్ఱము.** వి. (√కట్టె.) కఱ్ఱను గుఱ్ఱముగా భావించి యాడుకొనుఆట, బాలక్రీడావిశేషము.

సీ. కాలికంచంబును గట్టెగుఱ్ఱము... గీ. తాటియాకులచిలుకలు త్రాళ్ళపాము, లకట యగచాట్ల ప్రాతనై యాడుకొనుచు. హంస. ౩. ౧౪౬.

**కట్టెడ.** వి. (√కట్టు.) ఎడనెడకట్లు గలసర్పవిశేషము, కట్లపాము. (శ. ర.)

**కట్టెపండు.** వి. (√కట్టె.) గింజలుతీయనిచింతపండు. (బ్రౌ.)

**కట్టెపాఁపర.** వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

**కట్టెవిఱుపుమాట.** వి. (కట్టె+విఱుపు+మాట.) ఫుల్లవిఱుపుమాట, పరుషవచనము, కఠినోక్తి.

**కట్నము**=కట్టనము.

(బంధనము, కూర్పు.)

సీ. శ్రీవత్సలక్ష్మంబు జేజేలరాజాలికట్నంబుజగలిహాంకంబు నెఱప. దశా. ౨. ౨౮౧.

(కుట్టిమము, నెలకట్టు.)

సీ. పచ్చఱాకట్నంబు పచ్చికప ట్టని నెడనెడ మునివ్రేళ్ళ నడచిపోవు. దశా. ౧. ౨౭౨.

(కానుక; కానుకగానిచ్చెడివస్త్రము; వస్త్రము.)

చ. ... ప్రియంబునఁ గట్నము లిచ్చి దూతలం బనిచి ... ప్రబంధ. ౧౭౪.

శా.... అవ్విభుం, గానం బోవలెఁ బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానికల్, మానే రొప్పప్పఁగఁ గూడఁ బెట్టుఁడు... భాగ. ౧౦. పూ. ౧౨౦౮.

ద్వి...జంగమం బరుదెంచి యడుగ, నెట్టికట్నంబైన నిచ్చి మ్రొక్కుచును, నావస్త్రముల వారలడుగవచ్చినను, లేవన కందిచ్చులింగసంపదను. బస. పు. ౪. ౧౯ పం.

**కట్ఫలము.** సం. వి. అ. పుం. శ్రీపర్ణిక, దేఁకుశీ.

**కట్ల.** వి. (సం. ఖట్వా.) ౧. కట్లమంచము, యాప్యయానము, మంచపుడోలి.

సీ. కట్ల యంచనఁగను గట్లమంచ మనంగ యాప్యయానాభిధ యలరుచుండు. ఆం. భా. ౨. ౨౦౧. (ఈయర్థమున 'కట్టె' అని శ. ర, బ్రౌ.)

౨. ఒకానొకతీఁగ, ఖట్వాకీ. (శ. ర.)

**కట్లంక.** వి. వరుసడ్లపై నుంచెడియొంటిగుడ్డ. (శ. ర, బ్రౌ.)

**కట్లగుదియ.** వి. (√కట్టు) ఆయుధవిశేషము, ముసుండి, కొయ్యగుదియ. (శ. ర.)

**కట్లచెట్టు.** వి. (√కట్టు?) ఒకానొకచెట్టు, శంఖినికీ.

సీ.... చెలఁగు శంఖిని కట్లచె ట్టనంగ. ఆం. భా. ౨. ౬౨.

**కట్లజెట్టి.** వి. (√కట్టు) కట్లుగలజెట్టి.

గీ. పుట్ట వెడలి నభోభిత్తిఁ బట్టుకక్ర, కార్ముకపు

పెద్దపలువన్నెకట్లజెట్టి, దైననడచెడుకాళ్ల గుం పనఁగ గాలి,కార్కొని దిగంతముల వానకాళ్లు నడచె. ఆము. ౪. ౯౯.

**కట్లదండ.** వి.(√కట్టు)ఎడనెడబంగారుకట్లుగాని నెండికట్లుగాని గ్రుచ్చిననల్లపూసలసరము.

చ.మినమిన లీను మేను నెఱమించులకొంచెపుటం చుఁగమ్ములుం, గొనబగుముద్దుమోము సమకొన్న మెఱుంగులకట్లదండయుక్...మించ... శుక. ౩. ౧౦౫.

**కట్లపాము.** వి. (√కట్టు)మేనిపైకట్లవంటిచాఱలు గలయొకజాతిపాము.

**కట్లబల్ల.** వి.(కట్లు+బల్ల)కత్తెరకాళ్లమడుపుబల్ల. (బ్రౌ,శ.ర.)

**కట్లమంచేము**=కట్ల. (౧. అర్థము.)

**కట్లమారి.** విశే. (కట్లు+మారి.) కట్లు (బంధనము లు)పొందుస్వభావముకలది.

(స్తనవర్ణనము.) సీ. సముదగ్రకలశముల్ చక్ర వర్తులటంచు మొట్లమారులసరి మొనపఁద గునె,కిన్నెరకాయలు వన్నెవాసివి యంచుఁ గట్లమారుల నుద్దిఁ గట్టఁ దగునె.చంద్రా. ౪. ౧౨౭.

**కట్లసంచి.** వి. (√కట్టు) చుట్టు అఱ లేర్పఱచి క ట్టినినిడుపాటిగుండుసంచి. (శ.ర.)

**కట్లసరి.** వి=కట్లదండ.

సీ....ఉడ్డబుడగలు కట్లసరులు...గీ. అమర,దు డ్డెతనమునఁ దిరుగుగాడు రెడ్డిసాని. హంస. ౪. ౧౩౮.

**కట్లె(ట్లియ)** వి. (క. కట్లె) బంగారు వెండి ము న్నగునవి తూఁచుటకుపయోగించుగురిగింజ,మొ.

సీ....కట్లెనానగుఁదులామానగుంజాదికములు. ఆం. భా. ౨. ౩౦౦.

ఆ. కంతుఁ డిరువురందుఁ గలకూర్మి లొక్కించ, చూచి కట్లె వైచి తూఁచుకొనఁగ. కవిక.౩. ౧౯౩.

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచా లొరగ ల్లు కట్లెలుక్. శుక. ౧. ౪౨౦. భీమ.౨.౭౭.

కట్లెసంచి=కట్లెలుంచుకొనుసంచి.

చ.కమటము కట్లెసంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణముల్,ధమనియు శ్రావణంబు...హంస. ౨. ౧౮౧.

**కట్వాంగము.** సం. వి. అ. పుం. శ్యోనాకము,దుం డిగముక్.

**కట్వరము.** సం. విశే. (అ. ఆ. అ.) నిందితము,తిర స్కరింపఁబడినది. వి. అ. న. ౧. పెరుఁగుమీఁది నీరు. ౨. తక్రము,మజ్జిగ. ౩. వ్యంజనము.(కూర, పచ్చడి, మొ.)

**కట్వి.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణిక్.

**కఠమర్దుఁడు.** సం. వి. అ.పుం.శివుఁడు. (త్రి.ని.)

**కఠము.** సం. వి. అ. పుం. ౧. కఠశాఖ, యజుర్వేద మండలియొకభాగము.౨.ఒకానొకయుపనిషత్తు.

**కఠరము.** సం. విశే=కఠినము.

**కఠశ్రోత్రియుఁడు.** సం. వి. అ. పుం.కఠశాఖను అధ్యయనము చేసినవాఁడు.

**కఠాకువు.** సం. విశే. (ఉ.) పరోత్తాపి, ఇతరము లను బాధించునది.వి.ఉ.పుం.౧.సూర్యుఁడు. ౨. అగ్ని. ౩. కపి,కోఁతి. ౪. పక్షి. ౫. శిల్పి. ౬. జి ల్లేడుక్. ౭. చిత్రమూలముక్.

**కఠారము.** సం.వి.అ.పుం.౧.ఖడ్గము,కత్తి.(కే.ని.) ౨. బాఁకు.

వ. కఠారకుఠారగదా దండభిండివాలకరవాల శూలముసలముద్గరతోమరచక్రాదినానాయు ధపరివృతబాహుదండుఁడును. వీర.౪.౫౪. (శ.ర.పా.)

**కఠారుఁడు.** సం. వి. అ. పుం. శిల్పి. (కే. ని.)

**కఠాహకము.** సం. వి. అ. పుం. దాత్యూహము, కూకుడుగుండెపక్షి.

**కఠి.** సం. వి. ఈ. స్త్రీ.౧.కఠశాఖాధ్యయనము చేసిన

స్త్రీ. ౨. కఠశాఖాధ్యయనము చేసిన వాని భార్య.

**కఠింజరము.** సం. వి. అ. పుం. ౧. నల్లగగ్గెరకీ. ౨. తులసికీ.

**కఠిక.** సం. వి. ఆ. స్త్రీ. బలపము,సుద్దముక్క, మొ.

**కఠిన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. స్థాలి, వంటపాత్ర. ౨. పటికబెల్లము.

**కఠినపృష్ఠము.** సం. వి. అ. పుం. తాఁబేలు.

**కఠినము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గట్టిది. ౨. క్రూరము,దయలేనిది. ౩. నిష్ఠురము,పరుషము. (మాట,మొ.) ౪. మిగుల బాధించునది. (రోగము, మొ.) ౫. స్తబ్ధము,కొయ్యవాఱినది. వి. అ. న. స్థాలి,వంటపాత్ర.

**కఠిని.** సం. వి. ఈ. స్త్రీ. వ్రాఁత కుపయోగించు బలపము,సుద్దముక్క, మొ. (సం. నైష. ౧౦.౮౬.)

**కఠిల్లకము.** సం=కటిల్లకము.

**కఠిల్లు(ఠీలు)** వి. కఠినము లగు పదార్థముల సంఘర్షణమువలనఁ గాని తుపాకి మున్నగునవి ప్రేల్చుట వలనఁ గాని కలుగుధ్వనికి అనుకరణము.
మనుచ. ౪. ౩౭. ప్రబంధ. ౭౮౮.

**కఠుఁడు.** సం. వి. అ. పుం. ౧. వైశంపాయనుని శిష్యుఁడగు ఒకముని. ౨. కఠశాఖను అధ్యయనము చేసినద్విజుఁడు.

**కఠేరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కష్టజీవి.

**కఠోర(ల)ము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కఠినము,గట్టిది. ౨. క్రూరము,దయలేనిది. ౩. తీక్ష్ణము, వాఁడియైనది. (ఉదా:-కఠోరసూర్యకిరణములు.) ౪. పూర్ణము,నిండు.
శ్లో. కఠోరతారాధిపలాంఛనచ్ఛవిః. శిశు. ౧. ౨౦.
శ్లో. కఠోరగర్భ గుర్వీం. ఉ. చ. ౧. ౪౯.

**కడ.** వి. (సం. కాష్ఠా. ప్రా. కట్ఠా. క. కడె. త. కడై) ౧. దిక్కు,దిశ.
గీ. నిచ్చలంబుగఁ జెల్వెద వచ్చికడల, నెన్నఁ దగి... పుడమిలోపల మిథిల నాఁ బ్రోలు వెలయు. నీలా. ౧. ౨౬.
ఉ.... బాణముల్ ... నల్గడం, బాఱఁగ నేసి... ఉ. హరి. ౩. ౫౮.
౨. దిక్కు, గతి, ప్రాపు. (చూ. కడచెడు.)
౩. స్థానము, స్థలము, ప్రదేశము.
ఆ.... అరుగు మొండుకడకు ... భార. ఆది. ౪. ౨౨౮.
ద్వి. కమలసంభవుఁడున్నకడకుఁ దా మేఁగి. రం. రా. బాల. ౩౮ పా. ౮ పం.
౪. పార్శ్వము, ప్రక్క; వంక, వైపు,పక్షము.
సీ. హయము క్రేళ్లుఱుకునో యని రెండుకడలందు వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు. కళా. ౭. ౭౨.
క. వెలయంగ నశ్వమేధం,బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం,దులనిడి తూఁపఁగ ... భార. ఆది. ౪. ౯౪.
ద్వి. కడిమి నప్పుడు కుంభకర్ణుండు రెండు,కడల వారికిఁ జూడఁగడు నుగ్రుఁడగుచు. రం. రా. ఉ. ౭౭ పా. ౧ పం.
౫. సమీపము, దగ్గఱ.
క.... వివేకశూన్యుల,కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే. భార. ఆది. ౩. ౧౪౯.
ఆ. కొప్పు పట్టి యీడ్చికొని వచ్చె ధర్మజు, కడకు నింద్రసుతుఁడు కడిమి మెఱసి. భార. ఆది. ౭. ౪౪.
౬. అంతము, తుద; అవధి, మితి, మేర.
చ.... శాపమునకుం గడ యెన్నఁడు నాకుఁ జెప్పుఁడా. వరాహ. ౭. ౮౭.
గీ. మగనిపోకకుఁ గడలేనిదిగులు పొదువఁ,గామమంజరి యెంతయుఁ గళవళించి. విక్ర. ౬. ౧౧౯. నీలా. ౨.౧౦.
౭. దూరము, దవ్వు.
మ. ... పార్శ్వమున న్నిల్వ మదాంధుఁ డంద్రు

కడ నిల్వక మేదకసం దండ్రు ... మల్లభూ. నీతి. ౪౧.

శ్లో. ధృష్ట పార్శ్వే భవతి చ వసన్ దూరతో౽ప్య ప్రగల్భః. సం. భర్తృ. నీతి. ౪౧.

క. కడనుండి పెక్కుమాటలు, నుడువంగా వచ్చుఁగాక నూల్కొనియెడుపల్, కడగండ్లఁ బడఁగ వచ్చునె, విడువక యెవ్వారికయిన నెలఁదుకలారా. నీలా. ౨. ౧౧౧. (కడనుండి=పైగానుండి, సంబంధము కలిగించుకొనకుండి)

౮. దరి, ఒడ్డు.

సీ. వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ గడఁ జేర్చుప్రోఁకుడుఁగడపుఁజేయి. పారి. పీఠి. ౨౪.

౯. కాలము, వేళ.

గీ. దివమునను సంజకడ యంచు దివ్వె లెత్తు. శుక. ౨. ౫౬౧.

౧౦. మరణము, చావు.

వ. కయ్యంబునఁ బాఱఁబాఱఁ గాయంబు గాయంబు సేసి వెఱవేఁకిఁ గొలిపినకాకక్షశ్రు నామధేయచండాలుకరాళవేషంబు గన్నులం గట్టిన ట్లుండఁ గడఁ గనుట నిట్టికరాళవేషంబు గలిగెఁ గైశికీగానఫలదానంబున దీని మానుపవే... ఆము. ౬. ౭౬. (వ్రాఁతప్రతి పాఠము.)

౧. ఇది ద్రుతాంతముగా నుండి "అందు, ఎడ, విషయమున, వలన" అనునర్థముల నిచ్చును.

క. చెడు తెరు వాకౌరవ్యుల, కడ నిలుచుం గాక మనకుఁగ్రొర్యం బేల్గా. భార. ఉద్యో. ౩. ౯౧.

ద్వి. ... ఇంటికడ విందు గుడిచి ... రం. రా. బాల. ౫౩ పా. ౧౫ పం. విప్ర. ౩. ౬౧.

చ.... సుం, దరికడ నాసనేయు నిను ... దళను. ౯. ౨౧. (సుందరికడ=సుందరియెడ.)

సీ. నాలుగుమొగములవేలుపు మొదలుగ నెవ్వని కడ నుదయించె జగము. హరి. ఉ. ౫. ౧౦౭. (ఎవ్వనికడ=ఎవ్వనివలన.)

విశ. ౧. అంత్యము, చివరది.

ఉదా: కడజాతి, కడసారి, మొ.

౨. అన్యము, ఇతరము.

గీ. అడరుఁ దక్కటి యెడ కడ కడమ తక్క, వేఱు పెఱ యన నితరాఖ్య మారసైరి. ఆం. భా. ౩. ౨౪.

ఆకడ=అవతల, అవ్వల.

క. శాకమహీజముపేరను, శాకద్వీపంబు నాఁగ సన్నుతి కెక్కెన్, లోకస్తుత యాదీవికి, నా కడ దుగ్ధాబ్ధి మెఱయు నంతియ విరివిన్. వి. పు. ౩. ౭౬.

వ. ఉత్తరాభిముఖుండవై చనంజన హిమవంతం బక్కొండ కాకడ బహుకూటశోభితం బగు హేమకూటం బవుల ఋషభాచలంబు ... పొలుచు... భా. రా. యు. ౧౧౯౧.

కడకుఁబొమ్మను=దూరముగాఁబొమ్మను; మించు.

క. కుమ్మెలు దాఁకినబంగరు, బొమ్మరములయెమ్మెఁ గడకుఁ బొమ్మనురేఖా, సమ్మిళితస్తనకుంభత, టమ్ము దిటమ్ముగను జూపి డగ్గఱ్ఱి కతోన్. సారంగ. ౨. ౨౩౦.

కడలుద్రొక్కు=వ్యభిచరించు.

గీ. పెనిమిటికి నేల కడలుత్రొక్కినలతాంగి. కవిరా. ౨. ౩౪.

జ: కట్టకడ, కడకట్టు, కడకడ, కడకడలి, కడకన్ను, కడకాలము, కడకాలు, కడకుఁబోవు, కడకొంగు, కడకొత్తు, కడకొఱవి, కడగండ్లమారి, కడగండ్లు, కడగట్టు, కడగొట్టు, కడగోరు, కడచను, కడచుక్క, కడచెడు, కడచేయు, కడచేరుచు, కడజాతి, కడతల, కడతెగు, కడతేర్చు, కడతేఱు, కడనుంచు, కడపల, కడబంతి, కడముట్టు, కడయేనుఁగు, కడయేలిక, కడరాలు, కడ ఱెప్ప, కడవన్నె, కడవాఁడు, కడవీను, కడవెళ్లు, కడవోవు, కడవ్రేలు, కడసంజ.

**కడంకరము.** సం=కడంగరము.

**కడంకరీయము.** సం=కడంగరీయము.

**కడంగము.** సం. వి. అ. పుం. ఒకవిధమగుమద్యము.

**కడంగరము.** సం. వి. అ. పుం. మాషముద్గాదికాష్ఠము. (సిద్ధాంతకౌముది.)

**కడంగరీయము.** సం. విశ.(అ.ఆ.అ.) మాషముద్గాదికాష్ఠమును తినునది. (ఆవు, గేదె, మొ.)

**కడంబము.** సం. వి. అ. పుం. ౧.శాకనాడిక,కూరకాఁడ. ౨. అగ్రభాగము,కొన.

**కడంబి.** సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలికీ.

**కడ(ణ)ఁక.** వి. (√కడఁగు.) ౧. పూనిక, యత్నము; ఉత్సాహము.

సీ. ప్రతిబంధదురితంబు వాసి పోవుండినఁ గాశికేఁగెదు నట్టికడఁక లేదు.కాశీ. ౩. ౬౯.

ఉ. శ్రీకలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణవామభాగము, ల్గైకొని కొల్వ నారిఁ గడఁక న్గదకన్నులకాంతిఁ దేర్చి... విజ. వి. పీఠి. ౨.

ద్వి.పణిహారులను బిల్వఁ బంచి యాక్షణమె, కణఁకతోఁ గల్యాణకటకంబునందు.పండితా. దీక్షా. ౮౧ పా. నీలా. ౧. ౮౯.

౨. ధైర్యము; స్థైర్యము.

చ. కరమున నీవు విల్లు గొని కాండముఁ బూనిన మూఁడులోకముల్, కరము భయంబు నొందుఁ గడఁక న్నిను మార్కొన నెవ్వఁ డోపు ... ఉ. రా. ౧. ౧౫౫.

చ.అతిమి రమాకుమారుఁ డపు డగ్రతలంబున వచ్చి నిల్చిన, ట్లతిముతిఁ దోఁచినం గువలయాక్షి వడంకి కడంక దూలి నై,మఱచి ... వసు. ౩. ౧౭౯.

సీ. స్థైర్యయత్నంబులు చనుఁ గడంక యనంగ. ఆం. భా. ౩. ౪౬.

౩. ఉదుటు, ఉద్ధతి, గర్వము.

ఉ. స్రుక్కక భూమిభృత్కులవిరోధికడంక నడంచి యిమ్మెయిన్, దక్కక హేతిధారి సచితం బగుకార్యము నిర్వహించి... రాఘవ. ౨. ౧౧౦.

౪. చేష్ట, వ్యాపారము.

ఆ...అంతరంగ మవశతఁ బొందిన,కరణ నింద్రియములకడఁక దక్కె.భార.విరా.౫.౧౧౩.

౫. విధము, రీతి, పోలిక.

శా. ... పైఁ జందురుం డొప్పఁగాఁ,గాసెన్ వెన్నెల పిండిచల్లినకడంకం గల్వపూఁబండునై. యయా. ౫. ౧౦౯.

సీ. జడఁ జిక్కుదయ్యంబుచందంబునను కొట్టి విడిచినభూతంబుకడఁకతోడ... గీ.ఎనసి చరియించు వీట నా హేమరేఖ.హంస.౧.౨౨౦.

౬. సంతోషము.

సీ. కైరవకాననోత్కరములు కడుఁ గుందఁ గంజపుంజంబులు కణఁక నొంద...గీ. పూర్వపర్వత మెక్కె నపూర్వదీప్తి,మండలం బైనమార్తండమండలంబు. విక్ర. ౨. ౧౦౭.

౭. ఆధిక్యము, అతిశయము.

ఉ. కావఁగ దిక్కు లేమిఁ గడఁకన్ మొఱవెట్టఁ దొడంగె వేదముల్. దశా. ౧. ౨౭౫.

**కడఁగించు.** స. క్రి. (√కడఁగు) కడఁగఁజేయు. (ప్రోత్సాహపెట్టు, ప్రేరేఁచు.)

క. సమరమునకుఁ బురికొల్పుచు,మముఁ దలఁచిన సుల్లికట్టుమాటలఁ దచ్చి,ర్త్యము లుడికించుచుఁ బాండవ,సమితిం గడఁగించువారచట నెవ్వారొకో. భార. ఉద్యో. ౪. ౨౪౨.

**కడ(ణ)ఁగు.** అ. క్రి. ౧. ఉద్యమించు, యత్నించు, పూను; ఉత్సహించు.

(దుర్యోధనుఁడు భీమునితో ననినమాటలు)

గీ....విప్రులవలనఁ బుట్టి,రైరె సక్షత్రియప్ర

భు లవని గావఁ,గడఁగి యీజన్మములు నిట్లు
కావె వినఁగ. భార. ఆది. ౬. ౫౯.

ఉ. మజ్జన మార్పఁ గల్పకుసుమంబులు గూర్పఁ
గడంగి రమ్మెదన్. వసు. ౫. ౮౩.

(కీచకుఁడు) క. చిడిముడిపడుచు నెమక నవఁ,
గడఁగుచు హారములు చక్కఁగాఁ ద్రోయు
చు మల్లడిగొనుచు...భార.విరా.౨.౧౧౪.

౨. సాహసించు, తెగు.

క. కిమ్మీరమర్దనుచే,నిమ్మెయి నోటాడఁ బెక్కు
లేటులు వడి దర్ప మ్మెడలి మూర్ఛ మునిఁగి
యుఁ, గ్రమ్మఱఁ గురునాథుఁ డెట్లు గడఁగె
నొ యనికిన్. భీష్మ. ౨. ౪౦౬.

క. పడుదడు గట్టుక బూదుడు,వొడుదడు బోఁ
బడుచుఁ గాక తొలుత మొన సొరం,గొడు
కుం బడుచట కెవ్వఁడుఁ,గడఁగునె నాయ
ట్టిహాపకర్ముఁడు దక్కన్. భార. ద్రో. ౨.
౧౪౨.

౩. ధైర్యముతో నిలుచు.

మ. ... పాండవులు మోహాంధుండు భీష్ముండు
గే,శవ నీవుం గడఁగుండు నాకు నెదురై సం
గ్రామరంగంబునన్. భార. సభా. ౨. ౬౩.

గీ. అగ్గలించి నామెదుర బాహుప్పళించి,కడఁ
గఁ జాలెడుమల్లుఁ గాన నెందు. భార. వి
రా. ౨. ౮.

౪. కవియు, తలపడు.

క. ...మగధవిభుఁడు జో,డుదు విల్లుఁ దేదు ఘ
నకే,కనమును గొని కడఁగె శార్ఙ్గధరుపై నొ
కఁడున్. హరి. ఉ. ౧. ౧౧౨.

క. కవ్వడి యొక్కఁడ కంటిరె, చివ్వనఁ జేరువ
మిరంచు నేర్పడఁగా నిం,దెవ్వరుఁగడంగలే
రవి,త్రెవ్వివడినధనము లెత్తేఁగితిమి లోఁ తె
ల్లన్. భార. హూ: ౧౭౧.

౫. అతిశయిల్లు, వర్ధిల్లు. (ఈ యర్థమున నిది తెం
చు పాదపూరకము)

సీ. మోహంబువలనఁ బై ముసురు లోభంబు లో
భావేశమునఁ గామ మగ్గలించుఁ,గామంబు
పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు క్రోధంబున వై
ర మెంతయును బెరుఁగు. భార. ఆర. ౪.
౨౭౭.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుచు దీపంబు,దెట్టు
లుండు జ్ఞాన మట్టు లుండుఁ, దెలిసినట్టివారి
దేహంబులందును... వేమన. ౧. ౯.

క. గణపానహతులచేతను,వణఁకి గిరుల్ తరుల
తోడ వసుధం బడియెన్,గణఁగి వసుంధర
గిరులును, ఫణిపతిపైఁ బడియెఁ గమఠపతి
పైఁ బడియెన్. వీర. ౪. ౭౧.

౬. ఉపక్రమించు,ప్రారంభించు,తొడఁగు.

క. ... అమృతాబ్ధిన్ మథింపఁ గడఁగిరి కడి
ఖిన్. దశా. ౨. ౧౯౩. పారి. ౧. ౧౦౪.

జ: కడఁక, కడఁగించు.

కడ(ణ)ఁజి. వి. గోకర్ణమృగము,ఒకజాతిదుప్పి.

సీ. ... గోకర్ణనామం బగుచు గణంజు కడఁజు
నా...ఆం. భా. ౨.౭౫.

కడ(ణ)ఁతే. వి. కడకంటికి ప్రక్కగా నుండుచో
టు,శిరఃపార్శ్వము.

గీ....క,డంత యనఁగ శిరఃపార్శ్వ మంత కాతి.
ఆం. భా. ౨. ౧౪౪.

క. పెనుఁగడఁత దొడ్డయుత్తళ,ముగ నైచిన నరఁ
డు మూర్ఛ మునిఁగి...భార.శల్య.౧.౩౭౧.

ద్వి. కనుఁగొనఁ జెక్కిళ్లఁ గణఁతలఁ గడక,నెన
యబూడిద మెత్తుకొని...పండితా. దీక్షా.
౪౦ పా.

కడ(ణ)ఁతి. వి. గంధర్వమృగము.

సీ....గంధర్వ మాను గడంతి ... ఆం. భా. ౨.
౭౫.

మ.పులులం ద్రుంచి కడంతులం దునిమి...సుక.
౧. ౧౮౬.

చ:..దు,ప్పులు కణఁతు ల్క్రాటు ల్చెవులపోతులు
కొర్నవగండ్లు ఘల్లుకం,బులు...ఆదిగాఁ,గల
మృగరాజి...కాళ. ౩. ౪౭.

కడఁబడు. అ. క్రి. (కడమ+పడు-శ. ర.) తగ్గు;
పోవు.

క. హరి సూకరరూపంబున,హరిణాదిమృగాకృ
తుల మహర్షులజంబై,హరిసుతుఁడు పూజ్యు
లైయుం,దరి వారలగౌరవము కడంబడియె
నోకో. వేం. పంచ. ౧. ౧౭౬. (శ.ర.పా.)

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబ
డుఁ గొంతైనఁ గౌశికుబుూను. ద్వి. హరి
శ్చ. ఉ. ౨౧౧.

క. పడగలఁ గలరత్నంబులు, గడఁబడ నోడ లు
డుక దంష్ట్రికలు పాడిపాడి గాఁ,గడుబాముల
పుజ్ లోనై,గడుసరిపాములు తొలంగ ...
దశా. ౪.౧౭౩. (ఇట'పడిపోవు,రాలిపోవు'
అనిభావము.)

కడక(గ)ట్టు. స. క్రి. (కడ+కట్టు.) ౧. నిర్ణయిం
చు, నిశ్చయించు.

క. మునుమున్న కాదె యార్యులు, వినుతనిజజ్ఞాన
దృష్టి విధిఁ దిరముగఁ గ,న్గొని కడగట్టినవా
ర్తి,తనియాప్తుశభావ చేష్టితము లఖిలములుజ్.
హరి. పూ. ౭. ౧౩౭.

వ....అద్దేవి యశ్రుపూర్ణనయనయై యిట్టిశోకం
బు నా కనుభవింపను మద్గర్భంబులకు నిట్టిపో
కలం బోవను మున్న కడగట్టిన లెఱంగు నీ వే
మి సేయు దని యుచితంబుగాఁ బలికె ...
హరి. పూ. ౫. ౧౩౫.

౨. విధించు, నియమించు.

చ. దిరిసెనపువ్వుకంటె గణుతింపఁగ మెత్తని
మేనుఁదీఁగె యీ,తరుణికి నిట్టికోమలి లతా
తరుసేచన మాచరింపఁగాఁ, గరుణ యొకింత
లేక కడగట్టె మునీంద్రుఁడు మాట లేటికిజ్.
పి. శకుం. ౨. ౬౨.

వి. నిర్ణయము, ఏర్పాటు.

వ. ... ఇందులపువ్వులకుం గలపరిమళం బెందు
లపువ్వులకుఁ గల దని మునుముట్టి మాయ వె
ట్టం గడకట్టు చేసికొని యప్పట్టి గదలి యా
సురషాన్న క్రిందికిం జనుదెంచి ... విక్ర:
౭. ౬౧.

కడకడ. వి. (కడ+కడ) - చివరదిక్కు - ఈశాన
దిక్కు.

క: కడకడయొడయనిముంగై,కడియపుసొమ్మైతఁ
బండుగామిడి మన్నం,బడఁతుకకై యిమ్మా
నిసి,యొడ లూనినవాఁడుసున్నో యుక్కు వ
లిప్పజ్. అచ్చ. రా. బాల. ౯౭.

కడకడలి. వి. (కడ+కడలి.) పశ్చిమసముద్రము.

క. వడి నీకీర్తులఁ బోలెడి,కడిమిం దనకంచు దె
లుపు గావలసిచుమీ,కడకడలియెడలఁ గ్రుం
కును, వెడవిల్తునిమామ యోబవిభునరసింహా.
నరస. ౫. ౭౭.

క. కడకడలి వేఁడివెలుఁ గను,జడదారి వడి స్మ
నుంగఁ జని జేగుఱుప,చ్చడ మాఱఁ గట్టెదరి
ననఁ,బడమట నెఱసంజ నిండె...యయా. ౨.
౬౯.

కడక(గ)న్ను. వి. జా. (కడ+కన్ను.) అపాంగ
ము, నేత్రాంతము.

క....నరుకడక,న్నరుణం బగుటయుఁ దద్రుచి,
పర్ణంపరలతోన నిగిడె బాణచయంబుల్.
భార. భీష్మ. ౨. ౩౦౫.

గీ. వీని వీక్షింపు కడగంటివీక్షణమున. నైష. ౫.
౧౪౦. ఆం. భా. ౨. ౧౪౪.

కడకము. సం. వి. అ. న. సముద్రలవణము.

కడకాలము. ఐ. వి. (కడ+కాలము.) అంత్యకా
లము, మరణసమయము.

ఉ. త్యాగము భోగముజ్ సలిపి దైవగతిం గడ
కాల మైన ఖ,ట్వాగతుఁడై తనూభవుల దగ్గఱ

నఖ్వరఁ బిల్చి యిట్లనన్. ద్వా. ౯. ౯౭.
చ. కని యదలించి మోసి చెడుగా కడకాలము
సేరె నెక్కడం,జనియెను... వేం. పంచ.౧.
౨౬౪.

**కడకాలు.** వి. ఔ.(కడ+కాలు) పాదము;పాదా
గ్రము.
ఉ. ... దేవకి గన్న యావ్వరన్, బరుషవిశాల
ఘోరశిలపైఁ గడకాళులు పట్టి వ్రేసి యా,
సురముగఁ జంపెఁ గంసుఁడు ...హరి. పూ.
౫. ౧౦౬.
క. కడకా లొకత్రాఁచుపాము గడఁకం గఱ
చెన్. వేం. పంచ. ౧. ౧౧౬.
ఉ. ... అమో మగనిం గడకాళ్లఁ ద్రోచి నేఁ,
డీవసుధేశునిం గలయ నెంచితి వెట్లు...శుక.
౧. ౭౦. (కడకాళ్లఁద్రోచు=నిరసించు.)

**కడకుఁబోవు.** అ. క్రి. (√కడ.) బహిష్ఠయగు, ము
ట్టగు.
సీ. మును తాను గడకుఁబోయినదినం బాదిగాఁ
దెచ్చుక దినమును దినము లెన్ను.దశా.౬.౫౩.
ఇట్లే:-కడకేఁగు.
సీ. అంటుగై కొనిరొ ముట్టమ్యెఁ జెఱఁగుమాసెఁ
గడకేఁగె నింటికిఁగాకపోరొ, ననఁగ దూర
స్థుఁ డనరు... సాం. ని. మాన. ౨౯.

**కడకొంగు.** వి. (కడ+కొంగు.) కొంగుచివర, అం
చలాగ్రము.
సీ.కట్టినపులితోలుకడకొంగు సోఁకి యాఁబోతు
రత్తడి చిట్టుబుట్టు మనఁగ. హర. ౫. ౧౬.

**కడకొత్తు.** స. క్రి. (కడకు+ఒత్తు.) దూరీకరించు,
నిరసించు.
చ.అడుగడుగంటఁ ద్రొక్కుఁ జిగురాకుల బాఁ
కుబఁ గేరు నారు నె,న్నడ కడకొత్తు హంస
మిథునమ్ములఁ దమ్ములనోము మోము.చంద్రా.
౪. ౧౭౩. (ఇట ఔపమ్యవాచకము.)
పాండు. ౪. ౨౨౦.

**కడకోలవి.** వి. (కడ+కోలవి.) ౧.కాలఁగా మిగి
లినకట్టె.
ద్వి. పొంత యొల్కులలోనఁ బొడవతి కాలి,
కొంత చిక్కిన కడకోలవులు దెచ్చి, కుజు
ప్రోగుగా నిడి కొడుకు నం దుంచి. ద్వి.
హరిశ్చ. ఉ. ౨౦౫౬.
౨. కాలఁగా మిగిలి పొగయుకట్టె.
క.జ్ఞాతులు దమలోఁ బొందినఁ,జేతోమోదమున
వెలిఁగి చెలువొందుదు ర,న్నీతిం బాసిన విగ
తవి,భూతిం గడకోలవులట్ల పొగయుదు
రధిపా. భార. ఉద్యో. ౨. ౨౭౫.

**కడగండ్లమారి.** విశే. (కడగండ్లు+మారి.) కష్టశీ
లుఁడు. (శ. ర.)

**కడగండ్లు.** వి. బ. (కడ+కండ్లు.శ.ర-కడ+గం
డ్లు?) ఇక్కట్లు, ఇడుములు.
సీ. తలఁగనికడగండ్లఁ దగిలి చట్టైయున్న చాన
నేదిననెఱజాణరాయ.అచ్చ.రా.అమో.౯౩.
ఉ....కానకు రాఘవుండు పోఁ,గా నిపు డింత
వుట్టెఁ గడగం డ్లనువార్తలు మిన్నుముట్టె
బి,ట్టైనగ రెల్ల గొల్లుమన...చం.రా.౪.౮౫.

**కడగట్టు.** వి. (కడ+గట్టు) చక్రవాళపర్వతము.
గీ. తావిగుబ్బలికడగట్టుతావులందు,నప్పసం బు
ప్పతిల్లుచు మెప్పుఁ గన్న, యట్టికొరవంజు
లెల్ల మాసుట్టలయ్యె. ప్రబంధ. ౧౬౦.

**కడగొట్టు.** అ.క్రి.(కడ+కొట్టు) నశించు,చచ్చు.
మ. కెడసెం దుప్పులు డింక వేసె నెలుఁగుల్ గి
ట్టెం బులుల్ సింగముల్, కడగొట్టెన్ ...
సారంగ. ౧. ౧౦౭.
విశే. కడపటిది, చివరది, చిన్నది.
చ....అందఱకున్ గడగొట్టుచెల్లెలై, మనుజవరే
ణ్యవుట్టై నొకమానినిరుక్మిణినాఁబ్రసిద్ధయై.
భాగ. ౧౦. పూ. ౧౬౮౫.
ద్వి.శివదేవుఁ డన నొక్కశివభక్తియుతుఁడు,ను

విషయుఁ దానుఁ బొర్గూరి శేఁగుచును, రూ
పించి కడగొట్టుపాపఁ దారింటి,కాపిడి...
బస. పు. 3. ౯౦౭ పం.

కడగొట్టువాఁడు=కడపటివాఁడు, కనిష్ఠసోద
రుఁడు. ఉ. రా. ౭. ౩౨౧.

**కడగోరు.** వి. దే. (కడ+గోరు)కొనగోరు, నఖా
గ్రము.
ద్వి. కాటుకకన్నీరు కడగోర దిద్ది. నవ. ౨. ౯౦
పా. ౧౭ పం.

**కడచే(స)ను.** అ. క్రి.(కడ+చను)౧.మరణించు,
చచ్చు.
సీ. జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీట
డఁగె నులూకుండు మడిసె సకల,సంశప్తకు
లు గడచనిరి ... భార. శల్య. ౧. ౯. భార.
శాం. ౨. ౪౭౯.
౨. నశించు, పోవు.
ఆ. ... శక్తి యెల్లను గడచన్న, నలఁడు నేల వ్రా
లె నలిరయమున. భార. అను. ౧. ౯౯.
రగడ. ఎఱుఁగక చేసితి నిపు డపచారము, శర
ణన్నను గడసనదె విచారము. ఉ. రా. 3.
౯౨.
3. కడచు, గతించు.
వ. ... నీవాక్యంబులు నిక్కంబు లగు నైనను
గడచనినదానికి శోకం బేల. భా. రా. యు.
౯౭౧.
సీ. సంజప్రొద్దునపుండి సవశేయి కడసన సమ్ముఖం
బునఁ గొల్చి సంవసించు. పాండు.౪.౨౭౬.
౪. ముగియు, సమాప్తమగు.
క. అనఘా యీయజ్ఞము విధి,సనాథబుద్ధిం బ్రప
యోగసంపూర్ణంబ,య్యును గడచన నేరదు
నదు,మన యుఘుగున భూసురోత్తమనిమి
త్తమునన్. భార. ఆది. ౨. ౨౦౯.
క. కొడుకులనిధనమునకు నా,కడఁగినహాయమే
ధమఖము కడచనమికి నేఁ,గడుదుఃఖితుండ

నయ్యెదఁ, దడయక నీ విపుడు దీనిఁ దలఁగు
ము కడఁకన్. భార. ఆర. 3. ౬౭.
౫. కొనసాగు, నెఱవేఱు.
క. పూనిక కడచన విప్ర,కన్నెన ప్రార్థనము సేసి..
విప్ర. ౨. ౧౯.
౬. అపారమగు, అనంతమగు.
సీ. గోత్రాచలము లెత్తుకొని వచ్చి కడచన్నర
త్నాకరముఁ గట్టె రాఘవుండు. కు. సం.౧.
౫౨.
ద్వి. మడఁతి యీరెండె యిమ్మనుజేసు చేతఁ,గడ
చన్న మన్ననఁ బడసినయతఁడు. బస.పు.౨.
౯౧ పం. (ప్రాతప్రతిపాఠము.)
స. క్రి. దాఁటు, అతిక్రమించు.
క.వననిధి నవలీలం గడ,చనువాని ప్రసాద మొం
ది సతులు గృహంబులో,ధనములు నఖిలసుఖం
బులు,మన మారం గాంతు రోలి మర్కటు
లెల్లన్. భా. రా. కిష్కిం. ౭౬౬.
సీ. ఏదేవుని జమాయ నెవ్వాఁడుఁ గడసన నేరఁ
డు తనమేని నీడఁబోలె. పాండు. ౪. ౫౧.
కడచన్నపసిఁడి=ప్రశస్తమైనబంగారము, మేలి
మిబంగారము. (బ్రా.)
ద్వి. కడచన్న(వన్నె?) పసిఁడియుఁ గట్లెయుఁ
దూఁచు, నెడ సువర్ణాంతరం బెఱుఁగరాకు
న్నె. పండితా. వాద. ౧౯౨ పా.

**కడమే.** స. క్రి. (త. కడత్తు.) ౧. (నదీసముద్రాదు
లను)దాఁటు, తరించు.
గీ. అలసుమంతుని వీడ్కొని యర్కకులవంశ,ఘను
లు గంగాతరంగణిఁ గడచి ... రామా. ౫.
౭౭. భార. ఉద్యో. ౪. ౬౫.
౨. ఉల్లంఘించు, జవదాఁటు; దాఁటు, అతిక్ర
మించు.
ఆ. వేదవిహితవిధుల నాచరించుట యూర్ధ్వ,గతి
కిఁ దెరువు విధులఁ గడచి యెందు,నాఁగఁబ
డినవాని లోఁగక చేయుట, యధమగతి

మార్గ మనిరి మునులు. భార. ఆది. ౩. ౨౨౦.

మ. కొడుకుల్ భక్తివిధేయు లౌదురుగదా కోడం
డ్రు మీవాక్యముల్, గడవం జాలక యుండు
రా ... భాగ. ౧. ౨౬౭.

క. వడిగొని కౌరవు లొండొరుఁ, గడవఁగ మును
చనిరి ... భార. ఆది. ౬. ౬౭.

సీ. కనకంబు పెనుఁగోట విసువీథిఁ గడవంగ...
హరి. ఉ. ౨. ౧౬౨.

గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి.
పారి. ౧. ౧౦౫.

౩. తొలఁగించుకొను, తప్పించుకొను.

తరువోజ. ఏనును బ్రజలును నీ ధర్మసతియు నే
యుపాయంబున నిబ్బారిఁ గడవఁ, గా నేర్తు
మెయ్యది కర్జంబు...భార. ఆది. ౬. ౨౪౭.

గీ...వారి, వారికర్మఫలంబు లవశ్యభుక్తి, కారణం
బులు గా కెందుఁ గడవ వశమె. వి.పు.౧.౨౧.

వ. ...గండంబులం గడచితిమి...హర.౨.౨౭.

౪. మించు, అతిశయించు.

వ....సహదేవుం డాశ్శైనేయు నుద్దేశించి మిమ్ము
ను బాంచాలురం గడచినబంధువులు మాకు
ను మమ్మును మిమ్మును మిగిలినబాంధవు లా
పాంచాలురకును వారలకంటె మాకంటె నె
క్కుడుసుహృజ్జనులు మీకును లేకునికి దె
ల్లంబు...భార. ద్రో. ౫. ౩౭౧.

చ. కొఱవులవేఁడిమిం గడచుఘోరపుఁబల్కులు
కర్ణరంధ్రముల్, చుఱచుఱఁ దాఁకి పాతి మ
దిఁ జాఁడిన...భా.రా. యు. ౭౨౭. భార.
శాం. ౧. ౮౯.

అ. క్రి. ౧. చచ్చు, మరణించు.

గీ. కడచినప్పుడు క్రిము లొండెఁ గాక లొం
డెఁ, గుక్కలొండెనియును భుక్తిఁ గొనెడు
దేహ, మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగ
వలదె. కాశీ. ౬. ౮౩.

సీ. ధ్రువపసిస్తారుంధతులఁ దనుచ్ఛాయయుఁ గా
ననివాఁ డేఁటిలోనఁ గడచు. జై. భా. ౮.
౯౮.

౨. నశించు, పోవు.

సీ. అలివేణివదనచంద్రాతపంబునఁ గాని కడచు
నే మోహాంధకారభరము. భాను. ౪. ౨౫.

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వమునవె, కడ
చె ధైర్యంబు...శివరా. ౩. ౩.

౩. గతించు, జరిగిపోవు.

ఉ....తే, న్మారయఁగా బయల్పడనియట్లుగ నుం
డెడువత్సరంబునుకా, జేరువచేరువం గడచె
... భార. విరా. ౩. ౧౦౬.

వ...దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షం
బులు చనియె మాసంబులు పోయె....సార.
౭. ౧౧.

౪. తొలఁగిపోవు.

గీ. ఇటువలె ననేకగతుల నారటము నొంద, గగ
నభారతి వానిపైఁ గరుణవొడమి, యడలకు
కుమార నీ కిది గడవ నేర, దట్లునిఁ బూర్వ
వృత్తాంత మెల్ల వినుము. సారంగ. ౩.౧౨౨.

౫. మేరమీఱు, మితిమీఱు; మర్యాదనతిక్ర
మించు.

క. కడు ననురక్తియు నేర్పును, గడఁకయుఁ గల
వారి నుఱక కడవఁగ నెగ్గుల్, నొడివెడువివే
కశూన్యుల, కడ నుండెడునంతకంటెఁ గష్టము
గలదే. భార: ఆది. ౩. ౧౪౯.

సీ. ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖా
చంక్రమక్రియఁ గడవఁ జనక. ప్రభా. ౨.౩.

మ....వైదేహి నేఁ, గడవం దెచ్చితిఁ దప్పు గా
వుమని లంకారాజ్య మొప్పించి ... ఎ, ద్యో
డ కైనం జనుమా ... భా. రా. యు. ౫౦౧.

౬. కడముట్టు, పారమునొందు.

క. కడవం గఱచినవాఁ డీ, పదు చనుచుం బురు
టియిల్లు పడఁతుక నెడలెకా. మార్క. ౫.
౩౦౪. (కడవంగఱచినవాఁడు=పూర్ణముగా
నేర్చినవాఁడు.) విక్ర. ౧. ౨౦.

౭. సుఖముగాఁ గాలము గడపు; మర్యాదతో కాలము గడపు.

క. నీ వేమి కోల యొనర్చితి,వీవగ నది సోఁకు డగుచు నేఁచఁ దొడంగె, న్వేవేగఁ దత్ప్రతి క్రియఁ,గావింపక యున్న నెట్లు కడచెద నని నక్. శుక. ౧. ౫౩౪.

క. ఏ నింతనాఁటినుండియు, మానవతులలోన నిగుల మానవతినినై,యీనాఁటికిఁ గడచితి నిఁక,నానోఁచిననోము లే మొనర్పం గలవో. శుక. ౧. ౪౦.

౮. మనుగడ సుఖముగా సాగు,జీవనము బాగుగా జరుగు;సుఖముగా జరుగు.

(వ్యవ) వానికి పండ్రెండురూపాయలతో నెట్లు కడచుచున్నదో తెలియదు.

అక్కడఁ గడపకయే యీయూరు వచ్చినాఁడు.

పూఁటకుఁ గడవనివాఁడైనను దుర్వ్యయములు మానుట లేదు.

నేను లేకుండ వానికిఁ గడవదా యేమి?

జీతము స్వల్ప మగుటచే వానికి సంసారము కడచుట లేదు.

౯. ఎక్కువగు, హెచ్చగు, మీఱు.

(కృత్రిమహంస నెక్కి ఆకాశమునఁ బోవురాచకన్నెయొక్క స్వయంవరమునకు వచ్చినరాజులవర్ణనము) క. వడి గల్గి హంసగతికిం,గడవఁ బఱచువారు...భోజరా.౫.౭౮.(చూ.౫ ౧౭)

కడచిచను=కడచు.

వ...మన్వంతరంబు లాఱును గడచిచనియె. వి. పు. ౪. ౪.

జ:కడతెంచు,కడపిపుచ్చు,కడపు,కడపుఁజేయు, కడవఁబడు,కడవఁ బెట్టు.

కడచుక్క. వి. (కడ+చుక్క)-కడనక్షత్రము-రేవతి. (శ. ర.)

కడచెడు. అ. క్రి. (కడ+చెడు) దిక్కుమాలు, గతిలేకయుండు.

క. విని కినిసి కపిలదేవుఁడు,ఘనహుంకృతి సేసె నంతఁ గడచెడి వా ర,మ్మునికోపదహనసాత్కృతులై,ధనులై పడి రచట సగరతనయులు పెలుచన్. జాహ్నవీ. ౨. ౮౨.

కడచేయు. స.క్రి.(కడ+చేయు)విడుచు,వదలు.

ద్వి. మ మ్మెల్లఁ దండ్రులమాఱుగా నెన్ని, సమ్మతి నలుఁ బ్రాణసఖుఁగా వరించెఁ,గావున నా సలఁ గడచేసి మరల,దేవలోకమున కేతెంచితిమి...ద్వి. నల. ౨. ౬౫౯.

కడచేరుచు(ర్చు). స. క్రి. (కడ+చేరుచు)=కడ తేర్చు.

(-దరిచేర్చు-కృతార్థునిచేయు)

క.... కౌరవులకు-మేటి వీవ :కావున నీ వీ,భారంబు పూని మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా.భార.ఉద్యో.౪.౧౫౫.

కడజాతి. వి. (కడ+జాతి) చివరకులము,చండాలజాతి.

ఉ. ఈకడజాలినాలి కిహిహీ మహిదేవుఁడు చిక్కె...పాండు. ౩.౯౫.(చూ.౩.౮౮.)

(విశ్వామిత్రవర్ణనము) సీ. కడజాతికేనియాగము నిర్వహించినయకుటనఘుటనావిహారహారి. చం. రా. ౨. ౫౭.

కడతల. వి. (కడ+తల) చివరప్రదేశము.

వ.... కౌరవరాజధాని యైనకరినగరంబుకడతల హలాగ్రంబున జొనిపి యప్పుట ఖేదనవిస్తారం బగుగడ్డ భుజాగర్వమర్వారుండై పెకలించి...భాగ. ౧౦. ఉ. ౫౮౭.

కడతెంచు. స.క్రి.(కడచు+తెంచు-స్వార్థమున) కడచు, దాఁటు.

ద్వి.అసమాన మైనయయ్యమున మార్గంబు,విడిచి నఁ గడతెంచి వేవేగ గొల్ల,విడిపట్టునడు నందువిడిపట్టు సొచ్చి. అ. మ. క. ౨౨ పా. ౧౩ పం.

**కడతెగు.** అ. క్రి. (కడ+తెగు) ముగియు, సమాప్తమగు.

క. ఉడుమండలంబు దాఁకను, నడి నేఁగిలిఁ గోట దాఁట వచ్చునో యంచుం, గడతెగక యంతకంతకుఁ, బొడవయ్యెను నాకు దాఁటి పోరాదయ్యెన్. వైరా. ౨. ౧౧.

**కడతేర్చు(ఉచే)** స. క్రి. (√కడతేఱు) కడతేఱఁజేయు.

(చంపు, వధించు)

క. విని గురుసుతుఁడు పది, దినములఁ గడతేర్తు ననియె ధీరవిచారా. భార. ఉద్యో. ౪. ౪౧౪. (చూ. ౪. ౪౦౩.)

క.... దానవు, కపటము గాఁ దెలిసి వానిఁ గడతేర్చుటయున్. జై. భా. ౫. ౧౪౬.

(పోఁగొట్టు)

గీ. వారియఘములు గడతేర్చి వాంఛితములఁ, గరుణ నొనగూర్చు... ఉ. రా. ౪. ౨౭.

(కొనసాగించు, నెఱవేర్చు; నిర్వర్తించు.)

సీ. తొడఁగినపని చలం బెడపక యతిదుష్కరంబైనఁ గడతేర్చు ప్రభువులార. భార. విరా. ౩. ౨౧.

గీ. జనకుని ప్రతిజ్ఞఁ గడతేర్తు నని తలఁచి. ఉ. రా. ౩. ౧౧౩.

గీ. ... బంతి, తేర్లదొర వేల్మి నెఱిఁ గడతేర్చియున్న. అచ్చ. రా. బాల. ౭౩.

(కృతార్థతనొందించు)

(కుంతి కృష్ణునితో నన్నమాటలు) వ. అలఘువిచార నాయలఁత యూర్పుము నన్ గడతేర్పు మెమ్మెయిన్. భార. ఉద్యో. ౩. ౨౦౧.

**కడతేఱు.** అ. క్రి. (కడ+తేఱు) ౧. చచ్చు, మరణించు; నశించు.

చ.... కుంభకర్ణుఁ డా, దిగఁ గలవీరు లెల్లఁ గడతేఱి రనేకులు శూరశూన్యమీ, నగరము..: భా. రా. యు. ౧౧౨౩.

గీ... వారిదేహంబులు నస్మదాది, దేహములఁ బోలెఁ దుదిఁ గడతేఱు... కాశీ. ౬. ౭౬.

౨. పోవు, గతించు.

సీ. పరహితంబులు దానపరతలఁ గడతేఱె నరతవ్రతోపవాసములు పొలిసె. హరి. పూ. ౧. ౧౦౦.

ఉ.... అట్లకా, దే విరహజ్వరంబు కడతేఱునె యీచలిమందులందు... భోజరా. ౩. ౨౪౯.

వ.... కన్నులకళ క్తి కడతేఱె... కాశీ. ౪. ౧౪౨.

౩. నెఱవేఱు, సిద్ధించు.

ఉ. ముందటియట్ల యుంకఁ బదుమూఁడుదినంబులమాత్రకున్ భవ, న్మందిరవాస మియ్యకొనం గడతేఱు మదీయవాంఛ... భార. విరా. ౩. ౬౨.

క. విను మేను జేయఁబూనిన, పనులం దొకటి గడతేఱెఁ బాపాత్ముసుయో, ధనుఁ బొరిగొని తలఁ దన్నుదు, నను రెండవపనియుఁ దీర్చ నగెద నెలమిన్. భార. కర్ణ. ౩. ౨౨౫.

౪. బాగుపడు; వర్ధిల్లు; బ్రతుకు.

చ. వలపున స్త్రీలబుద్ధి వినువారొకరేఁ గడతేఱి నట్టివా, రలు గలరా... సారంగ. ౩. ౬౬.

చ.... ఎవ్వరుం బడనిపాట్లకు లోనయి ప్రత్యయార్థమై, యడరెడుచిచ్చుఁ జొచ్చి యతియత్నమునన్ సుఖ మింత చెందినం, గడపట జానకీసతికిఁ గాఁపురముం గడతేఱదాయెఁగా. ఉ. రా. ౬. ౩౨౨.

సీ. అనుపమాకృతిఁ జూచి ఘనుఁడౌ ననిరి గాని కడతేఱుఁడని నాఁడె నుడువరైరి... గీ. అంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. సారంగ. ౩. ౧౦౨.

ఉ.... చంద్రభాస్కరులి దేని యకారణవైరమిట్లు నా, దిక్కునఁ జూపినారు కడతేఱఁగనిత్తునె యింక వారల, న్నిక్కి లిశక్తి మీఱఁ

దిగమ్రింగెద నంచుఁ బరిప్లవింపఁగన్. దశా. ౨. ౩౮౨. అచ్చ. రా. యు. ౧౧౫.

౫. కృతార్థతనొందు.

వ. ... ఆర్తజనశరణ్యుండ వగునీనిమిత్తంబునఁ గడతేఱఁగలదాన నగుట నాకల తెఱం గెఱిం గించెద దత్తావధానుండవై యవధరింపుము. విప్ర. ౩. ౧౧.

సీ. ...కడతేఱె ననఁ గృతార్థం బయ్యె ననుట కొప్పు. ఆం. భా. ౩. ౯౪.

౬. ముగియు, సమాప్తమగు, కడచను.

సీ. ...పూర్ణచంద్రుండు మలినుఁ, డై కానవచ్చిన నాయువు సంవత్సరంబునఁ గడతేఱు రాజ ముఖ్య. భాగ. శాం. ౬. ౧౨౬. (శ. ర, ప్రాంతప్రతిపాఠములు.)

కడనుంచే. స. క్రి. (కడన్ + ఉంచు) పరిత్యజించు, వదలివేయు.

సీ. పంకజాతాసనప్రతిపత్తిఁ గడనుంచి మృగ రాజపీఠిపై మే ల్ఘటించి. గీ. రాజవేషంబు గాంచుభారతి యటంద్రు, మట్లసంతమహీ నాథు మతిసనాథు. కను. ౧. ౧౩.

ఇట్లే:-కడఁద్రోచు.

గీ. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి, తాదివి ద్యోక్తధర్మజాతమును దొంటి, పగిదిఁ గడఁ ద్రోచి నీస్వరూపము భజింతు. సీతారా. ౩ ౩౦. ఉ. హరిశ్చ. ౧. ౬౮.

కడప[1]=గడప. వి. (√కడచే. త. కడప్పు.) ఇంటి గడప, దేహళి.

గీ. కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద, జక్కి మీఁదను గూర్చుండ జాడగాదు. కాశీ. ౨. ౮౫.

కడప[2]=కడిమి. వి. (సం. కదంబః.) కడిమిచెట్టు.

సీ. కడపపూఁదేనియఁ గడుపారఁ గొని మ్రోసి తిరుగు తేఁ దేఁటుల తెరలికయును. హరి. పూ. ౯. ౬౭.

గీ. కడిమి కడప యటం చనఁబడుఁ గదంబ, ము...ఆం. భా. ౨. ౪౬.

కడపల. వి. ఔ. (√కడ) అంతము, చివర.

వ. ... శతసహస్రసంఖ్యలయేండ్లు చరియించి యుం గుక్షిలోఁ గడపల గానఁడయ్యె. హరి. ఉ. ౯. ౯౭.

గీ. ఏది మొద లేది కడపల యేది మధ్య, ము... భీమ. ౬. ౮౪.

గీ. ఇన్ని చేసినఁ గడపట నింటిలోనఁ, ద్రావుడు వు లేదు పాపంబె తగిలెఁ గాని. వరాహ. ౮. ౮౬.

విశే. చివరది, కడపటిది.

క. కడపటిభూములు నడు మగు, నడుభూములు కడపలగు...హరి. ఉ. ౯. ౪౦.

గీ. కర్కటం బాది చాపంబు గడప లైన, యా ఱుమాసంబులును దక్షిణాయనంబు. వి. పు. ౩. ౧౮౦.

చ. కడపటినాఁడు...కళా. ౨. ౫౨.

కడపటికొండ=చక్రవాళపర్వతము. వేం. పంచ. ౧. ౮.

కడపలచేరు=అంతమునొందు, పోవు.

సీ. చాతకంబులపిపాసలు కడపలచేరెఁ గాంతా రవహ్నులగర్వ మడఁగె. భాగ. ౧౦. పూ. ౮౫౩.

కడపిపుచ్చే. స. క్రి. (కడపి+పుచ్చు.) ౧. పంపు.

(క) అపాయమునుండి తప్పించి పంపు.

వ. ... నికటప్రదేశంబున నున్నపింగాక్షుండు ... తీవ్రమార్గణంబులు నిగిడించి లుంటాకు లం దోలి యోటవడకుండ సార్థవాహులం గడపిపుచ్చి. కాశీ. ౪. ౬౪.

(చ) అభీష్టము నెఱవేర్పక పంపు.

గీ. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడ పిపుచ్చిన నూర్ధ్వలోకములు. దప్పు. భార. ఉద్యో. ౧. ౧౬౧.

౨. (కాలము) వెళ్లఁబుచ్చు.

ఆ. అలతొంగియుఁ దన కప్పటి క్రొక్కంత, గర్భ
జననశంక గలదటంచుఁ, జెప్పి సిద్ధసుతుని
సిద్ధునికిఁక యేఁ, గలయ నవ్వ ననుచుఁ గడపి
పుచ్చె. కళా. ౫. ౧౨౧.

౩. కప్పిపుచ్చు, మఱుఁగుపఱచు.

వ. అంత నావాగ్దేవి యావిధంబున నొదవినకళా
మర్మభేదనసాప్రాజ్యసంపదనుభవావస్థ మాన
లాఘవశంక నప్రకాశంబుగాఁ గడపిపుచ్చు
టకు నుపాయంబుఁ జింతించి. కళా. ౫.౧౭.

కడపు. స. క్రి. (√కడచే) ౧. చంపు, వధించు; కూల్చు.

శా. తిన్నం డంతట దేవదేవునకు భక్తిం దృప్తిఁ
గావింప నా, సన్న గ్రావమహాటవుల్ దిరిగి దం
ష్ట్రాటంకకోటీపుట, చ్ఛిన్నక్ష్మాజవరాహము న్గ
డపి కాల్చెన్ ... కాళ. ౩. ౮౬.

చ... ప్రహస్తుఁ డుగ్రుఁడై, కరముసలంబునం గ
డపె గ్రక్కున వేవురయక్షులన్ ...ఉ.రా.
౩. ౩౬.

ద్వి. ముదితకో యాతండు మొగి క్రోలు దొలిపి,
మద్దులఁ గడపినమహితశౌర్యుండు. సిం.
భాగ. ౩. ౪౯ పా.

౨. పోఁగొట్టు; తొలఁగించు.

సీ... నానాండజముల ప్రాణములు గడపి. కాళ.
౩. ౪౭.

గీ. భువనసంక్షోభకారి యై పుట్టె నొక్క, కడిఁ
దియుత్పాత మది నీవు గడపవలయు. కాశీ.
౨. ౬౯.

గీ. ... నేఁటియాపద గడపవలయు. నా.పంచ.
౧. ౨౨౦.

౩. (పైకి) పోఁజేయు, ఎక్కించు.

చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహా
శిలఁ గొండమీఁదికిన్, గడపఁగ భార మ
చ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁ ద్రోవఁ
గాఁ, గడుసులభంబు... నా.పంచ. ౧.౧౦౭.

౪. ఉల్లంఘించు, మీఱు.

ద్వి. గాధేయమునిమాట గడపక శబ్ద, వేధిబాణ
ముల నవ్వేడమాయ లడఁచి. రం.రా.బాల.
౨౭ పా. ౨౩ పం.

౫. (త. కడత్తు) ఈయకపోవు; పోవు.

ఉ. పట్టపురాజ నంచు నొడఁబాటులు దప్పను
భూజనంబులన్, గట్టియుఁ గొట్టియున్ బ
హుముఖంబుల నర్థము గూడఁబెట్టనే, పట్టు
న నర్థులం గడప... భోజరా. ౩. ౧౩౭.

క. అడిగినయప్పుడ చెచ్చెరఁ, గడపినఁ బోనవ్వ
యేను గడుదుర్మతినై, పడఁతి నను నిలిపి భి
క్షం, బిడక కడు నవజ్ఞఁ జేసి తేల మనము
నన్. భార. అర. ౫. ౧౩.

గీ.... నరవరుండు, వేఁడ మణి యీక కడపుట
వెఱ్ఱితనము. వరాహ. ౫.౧౩. కాశీ. ౭.౧౩౯.

౬. దాఁటించు, తరింపఁజేయు.

గీ. కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి. పారి.
౪. ౪౯.

౭. (గట్లుమొదలగువానిని) దాఁటించు, మీఱఁ
జేయు.

(కపటద్యూతవర్ణనము) సీ.... ఎక్కుదాయంబు
లయెడలు గడపి. దశకు. ౫. ౬౪.

౮. నడపు.

క. అమరేంద్రసుతుఁడు తనకుం, గమలాక్షి సు
భద్ర రథము గడపఁగ ...భార. ఆది. ౮.
౨౦౨.

క... మత్స్యగంధి యనఁగా ధర్మా, ర్థంబుగఁ దన
తండ్రినియోగంబున నయ్యమున నోడ గడ
పుచు నుండెన్. భార. ఆది. ౩. ౩౪.

వ. చంద్రసూర్యులం గాలంబు గడప నియోగిం
చి... భీమ. ౪. ౧౫౧.

౯. జరపు, వెళ్లఁబుచ్చు.

గీ. కడపితే రాత్రి సులభసౌఖ్యంబుగా మ, నం

బు గాఢప్రసన్నమే యంబుజాక్ష. భార. శాం. ౨. ౮.

గీ. దర్పితేల్వాలవాతాపిదమన మీరు, పెక్కుకాలాలు గడపినపెద్దలు...వరాహ. ౯. ౧౩౨.

౧౦. విడిచిపెట్టు, వదలు.

సీ. బిరుదులనైనను బిడికివాండ్రనునైనఁ జంపుచోఁ గడపఁడు జనుఁడు నేర్పు, లావును మర్త్యునిచావు మాన్పఁగ లేవు రణ మొనర్చినఁ గాని రాదె మరణ, ము... భార. స్త్రీ. ౧.౨౫.

(కుంతికర్ణునితో నన్నమాటలు.) చ...గొంతిహృదయంబున శోకము నివ్వటిల్ల ని, ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్పునే, యనుపమసత్యవిస్ఫురణ నాడినమాట మఱాకుమన్న నీ, యనుజుల నల్వురం గడపు మర్జును చేఁతకుసమ్మతించితిన్. భార. ఉద్యో. ౮. ౬౦.

౧౧. పాఱఁద్రోలు, తఱుము.

గీ. అచటి నెలయాండ్రు రంభాదులైన నొరయఁ, గాసెకొంగున వారించి కడపఁ గలరు. మను చ. ౧.౫౦.

ద్వి. కనకంపుఁదీఁగెలఁ గడపుబాహువులు, నృదుపల్లవంబుల మిగులుహస్తములు. ద్వి. నల. ౧. ౭౩౩. (ఇట ఔపమ్యద్యోతకము)

కడపుఁజేయి. వి. (కడపు + చేయి) చుక్కాను, అరిత్రము.

సీ. వైరసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ గడఁ జేర్చుప్రాఁకుడుఁ గడపుఁజేయి. పారి. పీఠి. ౨౮.

కడబంతి. వి. (కడ + బంతి) పంక్తియొక్కచివర.

సా: వడ్డించువాఁడు తనవాఁడైనచో కడబంతిని గూర్చున్నను లోపమురాదు.

కడమ. వి. (త. కడై) ౧. కొఱఁత, వెలితి, లోటు.

సీ. అన్న కుమార నీయట్టిసత్పుత్రుండు గలుగ మా కేమిటఁ గడమ సెపుమ. భార. ఆర. ౫. ౧౧౫.

చ....గుణము వర్ణన లర్థము శబ్ద మొప్పు నే, కడమయు లేదు మత్కృతికి...రుక్మాం. ౧.౨౬.

౨. శేషము, మిగులు.

క. మొదలనె నాకుం గలిగిన, యది శంఖసువర్ణనాంకనాదిసహితమై, పొదలెడిప్రపత్తి యొకఁ నడ, పెదఁ గడమయు ... పరమ. ౮. ౧౮౦.

(చూ. ౧౩౬. కడమ:- శేషకృత్యముఅనిభావము.)

౩. కడ, అంతము, తుద.

గీ. అనిన సర్వాపరాధి నే నధిపతనయ, నీవు పుణ్యాత్మకుండవు నీకుఁ దప్పు, మోప నే నెంత వాఁడ నాపాపమునకుఁ, గడమ లే దంచుఁ జాఁగిలఁబడియెఁ గుంభి. భోజరా. ౫. ౩౧౭.

విశే. ౧. న్యూనము, తక్కువయైనది, కొఱఁతపడినది.

ద్వి. ఒక్కటి కడమగా నొగి నూఱుమాయ, లక్కడివారిచే ననువుగా నెఱిఁగి. రం. రా. ఉ. ౫౬ పా. ౧ పం.

సీ. రమణీయనూతనరతిరహస్యములకుఁ గామశాస్త్రంబులు గడమ లయ్యె. పి. శకుం. ౩. ౨౧౯.

౨. శేషించినది, మిగిలినది; అన్యము, ఇతరము.

క. కడమకథ నుడువు మనినం, బడఁతికి శుకలోకపట్టభద్రుఁడు తెలిపెన్. శుక. ౧. ౧౨౯.

వ. ... కుంతియును దానిరెండుభాగంబులు చేసి యం దొక్కభాగంబు భీమునకుం బెట్టి తక్కినభాగంబు కడమకొడుకులుం దానును గుడుచు. భార. ఆది. ౬. ౨౩౭. ఆం. భా. ౩. ౨౮.

జ: కడఁబడు, కడమపడు, కడమపెట్టు.

కడమప(వ)డు = కడఁబడు. అ. క్రి. ౧. కొఱఁతపడు, న్యూనమగు.

వ. ఒక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు కడమపడియె మఱియు నొక్కబంధనంబు

సంధించి వలగొనిన నంతియ కొంటించె య
య్యె. భాగ. ౧౦. పూ. ౩౮౪.

గీ. కడమపడఁ బల్కుఁ బల్కు లాకస్మికముగ, మగువ మదిరారసోన్మాదమహిమవలన. కవిక. ౪. ౧౬౩.

క. ఏ వెంటఁ గడమపఱుపక, దేవా మను సంతరించితివి నీపాలం, జా వగుట దమకుఁ దగునటు, గావున భక్షింపు వనరఁగా నేమిటికిన్. వేం. పంచ. ౧. ౫౨౬.

౨. శేషించు, మిగులు.

గీ. కదిసె రథ్యముల్ వేయింటిఁ గడమపడక, యుండఁ జించి...హరి. ఉ. ౭. ౨౧౮.

గీ. అట్లు సైనుల వధియించి యచటఁ గడమపడినవసతులు వడఁద్రోచి ... కేయూర. ౨. ౧౦౯.

౩. అసంపూర్ణమగు, ముగియకుండు.

వ. చెఱువు కడమపడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువ దనియు...చెప్పి పంప నారాణివాసంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపు ద్రవ్యంబు దెచ్చి...ఆము. ౪. ౫౩.

**కడమపెట్టు.** స. క్రి. (√కడమ.) మిగుల్చు.

గీ. ... ఆపత్త్రికాప్రకార మేమియు నీ వింకఁ గడమపెట్ట, కంతయును నాకు నెఱిఁగింపు ... ప్రభా. ౩. ౧౪౮. ప్రబోధ. ౯. ౪.

**కడముంత**=కడవముంత. (వా, శ. ర.)

**కడముట్టు.** అ. క్రి. (కడ+ముట్టు.) సమాప్తమగు, ముగియు; నిశ్శేషమగు, సంపూర్ణమగు.

సీ. తనసేవగాఁ బురందరుఁడు గట్టించు కెంపుల హజారము కడముట్టెనొక్కొ. కళా. ౩. ౧౩౦.

ద్వి. నేఁటితోఁ గడముట్టె నే కాశికుంపు, గాటంబుగా నల్పు కపటనాటకము. ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౫౫.

గీ. శత్రువు ఋణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమపెట్టక కడముట్ట నడఁపవలయు. ప్రబోధ. ౯. ౪.

కడముట్టఁబడు = పారంగతుఁడగు, అవ్వలియొడ్డు చేరు.

గీ. సమధికం బైనసంసారజలధియందు, మునుఁగుచును దేలుచును గడముట్టఁబడని, జనుల కెల్లను మత్పాదసరసిజములు, తెప్ప యై యుద్ధరించు నిందీవరాక్షి. భీమ. ౫. ౧౭౦.

**కడయేనుఁగు.** వి. (కడ+ఏనుఁగు.) దిగ్గజము. అచ్చ. రా. బాల. ౩౮.

**కడయేలిక.** వి. (కడ+ఏలిక.) దిక్పాలకుఁడు. అచ్చ. రా. అర. ౯౮.

ఇట్లే:-కడయొడయుఁడు. అచ్చ. రా. సుం. ౧౫౯.

**కడయొత్తు.** వి. (కడ+ఒత్తు.) గృహవిశేషము యొక్క చుట్టుగోడయందలి కంబములమీఁది దూలము. (శ. ర.)

**కడరాలు.** వి. (కడ+ఆలు-ఇది 'పేదరాలు' వంటిది.) కడజాతిస్త్రీ, చండాలస్త్రీ.

ద్వి. నెలయంగఁ బెనిమిటివెనుక నిట్లుండ, వలవదా కడరాలివర్తన మొప్పఁ, గడుసాంగ మయ్యె నీగరితభక్తియును. పండితా. దీక్షా. ౪౨ పా.

**కడతెప్ప.** వి. (కడ+ఱెప్ప.) కనుఱెప్పయొక్క కొన.

సీ. కడఱెప్ప లొరయంగఁ గనుదమ్ములర మోడ్చి...నైష. ౯. ౯.

**కడలి.** వి. (కడలు+ఇ=అలలుకలది-క. త. కడల్.) సముద్రము, మున్నీరు.

గీ. కపటమత్స్యంబవై నీవు కడలినడుమ. నైష. ౮. ౧౨౦.

**కడలికూఁతురు.** వి. (కడలి + కూఁతురు) లక్ష్మి, సిరి. ఆం. సం. దేవ. ౧౦.

**కడలిరాయఁడు.** వి. (కడలి + రాయఁడు) ౧-సముద్రములలో గొప్పది-క్షీరాబ్ధి,పాలసముద్రము.

సీ....కడలిరాయలలోఁతుఁ గన్నగబ్బి. గీ... మందరంబు. మనుచ. ౫. ౪౬.

౨-సముద్రప్రభువు-నీటిఱేఁడు, వరుణుఁడు. ఉ. రా. ౧. ౩౧౭.

**కడలివెన్న.** వి. (కడలి + వెన్న) చంద్రుఁడు.

౪గడ. కడలివెన్నయు వేఁడివేలుపు గాడ్పు నగ్గియు నెల్లగాములు...నీవె...అచ్చ. రా. యు. ౭౪. ఆం. సం. దేవ. ౧౫.

**కడలు.** వి. (బ. కడళ్లు,కడవలు) తరంగము, అల.

సీ. తూలెడుపయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలుచందంబునఁ గడలుకొనఁగ. హరి. పూ. ౯. ౧౪౪.

(రావణుఁడు) క...అమరబలమునకుం గీ,డ్పడక నిలిచి మెఱసెను బలు,కడళ్ల కెదు రైన బాతికరణిం దిరమై. నిర్వ. ౭. ౧౩౪.

సీ...జలధులు నలిరేఁగి కడవుల నధ మెక్కఁగ డఁగె ననఁగ. హరి. పూ. ౬. ౧౭౩.

జ: కడలి,కడలికూఁతురు,కడలిరాయఁడు,కడలివెన్న,కడలుకొను, కడలుకొలుపు, కడలెత్తు,కడలొత్తు.

**కడలుకొ(ల్కొ)ను.** అ. క్రి. (కడలు + కొను.)

౧.అతిశయించు.

క. ఉత్తర నలంకరింప ను,వాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేం,ద్రోత్తముఁడు నెయ్యగల చెలి,కత్తియలం బుచ్చెఁ బ్రీతి గడల్కొనంగఁ. భార. విరా. ౫. ౩౮౮.

క. అని ప్రియము గడల్కొనఁ బ,ల్కిన...సారంగ. ౨. ౮౭.

౨. పొంగు,ఉప్పొంగు.

ఆ. ... కథ వినంగ నాపఁ గౌతుకంబు, మనము నిండి గడలుకొనుచున్నది...భార. ఉద్యో. ౩. ౪౧౨.

౩. వ్యాపించు. (ఈయర్థమున 'కడ + లు + కొను'-అనియుఁ జెప్పవచ్చును.)

మ...గద్దెహం దెడలి వీఁకం గేసరంబుల్ గడల్కొన ... పొల్పొందెం దె నంభోజముల్. భార. ఉద్యో. ౨. ౧౧౦.

౪. కలుగు.

గీ...నిద్ర రేపు మాపు,మానియుండిన జాడ్యంబు మేనఁ బొడముఁ,గన్నుఁగవయందు నరుణిమ గడలుకొనును. దశా. ౨. ౧౩౮.

**కడలుకొలుపు.** స. క్రి.(√కడలుకొను.)౧. వ్యాపింపఁజేయు. (ఈయర్థమున కడ + లు + కొలుపు-అనియుఁ జెప్పవచ్చును.)

గీ. గఱులు సారించు మీసలు గడలుకొల్పు ... మీస,వేషి పెన్నిట నిగమగవేషి యగుచు. భాగ. ౮. ౬౧౯.

౨. కావించు,కలిగించు.

సీ.రతిదేవి నెవ్వఁగు రారాపుఁజన్నులు గడకన్నలకు నింపు గడలుకొలుప...గీ.ఉక్కడిఁడయి. యేతెంచె నుక్కు మిగిలి,కలికిగారాబు చెలికాఁడు కలికిమరుఁడు. నైష. ౬. ౪౧.

సీ. నడునెత్తి మట్టిపాలిడి తాలిక లొనర్చి కడలుకొల్పినగొప్పజడలదిండు. శుక. ౨. ౩౨.

**కడలెత్తు.** అ. క్రి. (కడలు + ఎత్తు) పొంగు, తరంగితమగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లుచదలేఱు కడలెత్తి ధాత్రి నెల్లొవ్వడిచి పాఱి. కాశీ. ౫. ౧౧౨.

క. కడలెత్తి మ్రోయ నెఱచును,జడనిధు లినుఁ డెండగాయ శంకిలు...భా. రా. బాల. ౧౨౭.

**కడలొత్తు.** అ. క్రి. (కడలు + ఒత్తు) ౧. తరంగితమగు,పొంగు.

మ. సెలయేఱుల్ గడలొత్తఁ జేయుచును...కాననమారుతంబు తనకుఁ వాంఛానురూపం

బుగా, నలఘుస్వేదవినోదనం బొసఁగఁగా నాసీనుఁడై...హరి. ఉ. ౧. ౫౭.

ఉ ...లో,నూనినరోషవార్ధి గడలొత్తఁగ నిట్లని పల్కె- భూవరా. భాగ. ౧౦. ఉ. ౩౨౮.

౨. వ్యాపించు. (ఇట-కడ+లు+ఒత్తు. అనియుఁ జెప్పవచ్చును.)

సీ. కరమూలములజిగి గడలొత్తి వల్లుక్కు-చో పొంతకాంతుల నొత్తరింప. హరి. పూ. ౭. ౧౬౭.

**కడవ.** వి.(సం.ఘటః. ప్రా. ఘడో)కుండ,కుంభము.

ఆ. తిండిపోత నీకు ఖండనం బేటికిఁ,గడవఁ జేరి మనసుకాంక్ష దీఱ,నోపుకొలఁది మ్రింగి యూరక నీ వింటి,కడవ యుండు మింక నడిచి పడక. భార. ద్రో. ౪. ౨౩౯. (కడవ:-అన్న పుకుండ అనిభావము.)

కడవచెవులపోటరి=కుంభకర్ణుఁడు. అచ్చ. రా. యు. ౨౨౮.

జ: కడముంత, కడవతీటు, కడవముంత, కడవబాయి.

**కడవఁడు.** వి. (క.కణవ,కణబ.) మగగుఱ్ఱము.

క. వంచించి ప్రాణవల్లభ,గొంచక తా నుత్తరకురుకుంభినిఁ బంచా,రించినగోడిగయై వ,ర్తించువిధము యోగదృష్టిఁ దెలిసి కడవఁడై.

క...సంజ్ఞా,కంఖాణిం జేర నరిగి కామాతురతన్. నరాహ. ౫. ౯౫, ౯౬.

**కడవఁబడు,కడవఁగఁబడు.**అ. క్రి. (√కడచే-స్వార్థమున 'పడు')-దాఁటిపోవు-౧. శేషించు, మిగులు.

క. నడుకట్ట లిసుకతిప్పలు,మడుగు దరులు వాఁకలును గ్రమంబున నొకడుం, గడవఁబడకుండఁ గృష్ణుఁడు,పడఁతులకును యమున యాట పట్టుగఁ జేసెన్. హరి. పూ. ౭. ౩౭.

౨. గతించు,కడచు.

క. వెడపనికి నాలిఁ జంపం,గొడుకుఁ బనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం, గడవంబడునొకొ పని యని,కడు నెనఁ జనుదెంచె నప్పుకణము లు దొరఁగన్. భార. శాం. ౫. ౨౮౧.

గీ. అటుల నిజగృహాముున కేఁగి యబ్జవదన,పగలు గడవఁగఁబడుటయుఁ బార్థివేంద్రు, కేళిగృహమున కరుగునవ్వేళ... శుక. ౩. ౩.

**కడవఁబెట్టు.** స. క్రి. (√కడచే.) ౧.తొలఁగించు.

క. ఆపదఁ గడవం బెట్టఁగ,నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా,కీపుట్టువునకుఁ జాండు, క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. భార. ఉద్యో. ౩. ౬.

౨. (కష్టాములనుండి) దాఁటించు.

గీ. ... మీదయాసుకృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁబెట్టుసన్నె. భార. ఉద్యో. ౧. ౧౦౬.

**కడవడించు=కళవళించు.** అ. క్రి. కలఁతపడు.

ద్వి.ఎడసెడఁ గడవలోఁ బడఁ గడచుచునుఁ,గడవడించుచు భుజంగము విజృంభింప. బస.పు. ౬. ౪౩౦ పం.

**కడవతీటు.** వి. (√కడవ.) ఘుమము, వాద్యవిశేషము. (శ. ర- కడునతీటు అని. చి. ని, బ్రా.)

**కడవన్నె.** వి. (కడ+వన్నె.) ౧. (బంగారముయొక్క-) చివరవన్నె, పదియాఱవవన్నె; పదియాఱవవన్నెబంగారము.

సీ. కడవన్నెలసుఘుబంగరుకోట ... దశా. ౧. ౨౬౨.

సీ. కడవన్నెగిండ్లొకో గజనిమ్మపండ్లొకో సుదతీలలామవక్షోరుహములు. ఇందు. ౨. ౧౯౭.

కడవన్నెగుబ్బలి = కనకాద్రి, మేరుపర్వతము. ఉ. రా. ౭. ౧౧౦.

**కడవముంత=కడముంత.**వి.(కడవ+ముంత) చిన్న మట్టిపాత్రము. హంస. ౫. ౧౧.

**కడవబాయి.** వి. (కడవ+బాయి.)కుమ్మరి కడవలు చేయుట కుపయోగించెడుబాయి. హంస. ౫.౯.

**కడవసము**—కడాసము, కళవసము, కళాసము. వి. ధార్యచర్మము, ధరించుటకుపయోగించు తోలు.
క. కడవసములుఁ గోలలుఁ గ, ప్పడములు వీరల ధనంబు ... భార. ఆది. ౭. ౨౨౫.
చ. జడలను బెంచుచుం గడవసంబులు గట్టుచు ... భూమి జనించినట్టియూ, నృపుఁడను గాను ... పార్వ. ౧. ౧౪.

**కడవాఁడు.** విశ. (కడ+వాఁడు) ౧-సమీపమందుండువాఁడు-సేవకుఁడు.
(నకులుఁడు ధర్మరాజుతోనన్న మాట) క...నా తొంటివిధం, బామసుజేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు ... భార. విరా. ౧. ౯౬.
(౨-క-అర్థమునకుఁగూడ నిది యుదాహరణము.)
౨-చివరవాఁడు-(క) కనిష్ఠుఁడు.
సీ. గారాపుమీతల్లికడవాఁడఁ గాని నేగణుతింపఁ గడవాఁడఁ గాఁ జుమయ్య. మనుచ. ౪. ౪.
(ఇటసోదరులలోఁ గనిష్ఠుఁడు అనిభావము. ఇది 3. అర్థమునకుఁగూడ నుదాహరణము)
(చ) అంత్యజుఁడు, చండాలుఁడు.
మ. జడుఁడో భిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానాఢ్యుఁడో సిద్ధుఁడో, కడవాఁడో యనుచు౯.... మల్లభూ. వైరా. ౯౬.
శ్లో. చండాలః కిమయం ... సం. భర్తృ. వైరా. ౯౬.
3-దూరపువాఁడు - అన్యుఁడు, పెఱవాఁడు. (చూ. ౨. అర్థము.)

**కడవీను.** వి. (కడ+వీను) చెవితుద.
మ. పదియాఱ్వన్నెపసిండిపట్ట మపనీపాలావతంసంబునె, న్నుదుటం గట్టె లతాంగి యొత్తు కడవీనుల్ సోఁక నే ర్వొప్పఁ గా... నైష. ౬. ౫3.

**కడవెళ్లు.** స. క్రి. (కడ+వెళ్లు) దాఁటు, తరించు.
గీ. విరహవారిధి నేఁ గడవెళ్లు టెపుడు. ప్రభా. 3. ౧౨౪.

అ. క్రి. సమాప్తమగు. (శ. ర.)

**కడవోవు.** అ. క్రి. (కడ+పోవు) ఉడిగిపోవు.
క. ... పాయం బొకనాఁ, డుడివోవుట గలిగిన మది, గడవోదుగదే మనోజగర్వం బెపుడు౯. శివయోగ. ఉ. 33 పా.

**కడవ్రేలు.** వి. బో. (కడ+వ్రేలు) చిటికెనవ్రేలు, కనిష్ఠిక.
(శివుఁడు) చ. ...శీతవసుధాధరకన్యకముద్దుఁగేలుదా, మరకడవ్రేలు పట్టుకొని మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై. కాళ. 3. ౧౨౦.

**కడసంజె.** వి. (కడ+సంజ.) సాయంసంధ్య, మలుసంజ. కళా. ౭. ౧౦.

**కడాని(నీ).** వి. ౧. బంగారము, కాంచనము.
ఉ. మేలికడానిడాల్వ్రాయలు మీఱెడుజాబిలి తాలమేడలో. నీలా. ౧. ౧.
క. చిత్తజుఁ డనుదొమ్మరి లాఁ, గెత్తి పడిం దూఁతి చనఁగ నిడినకడానీ, బెత్తపువలయములో యన, విత్తరితాటంకయుగము బెడఁగై తోఁచె౯. చం. రా. 3. ౭౯.
౨. మేలిమిబంగారము.
చ. మిసుకుఁగడానిబంగరుపు మేడలసోరణగండ్లచెంట. నీలా. ౧. ౨౯. ఆంభా. ౨. ౨౭౯.

**కడారము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. పింగళవర్ణము కలది, కపిలవర్ణముకలది. ౨. గర్వించినది. 3. నిస్సారము. వి. అ. పుం. ౧. పింగళవర్ణము. ౨. రూక్షత్వము. 3. సూలము. ౫. జలము.

**కడారుఁడు.** సం. వి. అ. పుం. భృత్యుఁడు.

**కడాసము**—కడవసము.
సీ... ధార్యచర్మనామము కడాసము కడవస మన ...ఆం. భా. ౨. ౧౭౭. (ప్రాఁత ప్రతిపాఠము.)

**కడి**[1]. వి. ౧. కబళము, ముద్ద; (గోమయాది) పిండము.
సీ. కమలజాండము నొక్కకడి చేసికొని మ్రింగ

నరుచెంచుచున్న కాలాంతకుండో. భా. రా. యు. ౧౪౬౭.

గీ. కడెఁడు మెతుకులకై యింతకష్టపడెడు. వచే ల. ౨. ౧౧౨.

క. కడి మాడ చేయుభోజన,మిడుమము భిక్షాట నంబి డేలా నీకున్. ధర్మ. 3.3౯.(కడిమాడ చేయు:-మిక్కిలి విలువగల అనిభావము.) శేష. ౧. ౧౦౦.

(వ్యవ) ఆవు రాత్రినాలుగు పేఁడకళ్లు వేసినది.

౨. ఆహారము, తిండి.

క.తడి గంట నెపుడుఁ దఱుఁగక,కడి వఱుఁగఁగ వడియుఁ దజేఁగి గాసిన్ బుడమిన్,బడినఁ గ నరాక మంచపుఁ, దొడుగఅలై రట్టె రుజల తో నేమందున్. మనుచ. 3. ౧3౧.

ఓరెంపుఁగళ్లు=అన్న పిండములు.

ఆ.కలఁక మీఅ మిగులఁ గన్నీరు నించుచుఁ,గొం తఁడవు నొగిలి యంత జతన,మెఁనర నువులు నీళ్లు నోరెంపుఁగళ్లను,మొదలుగలుగుచెయ్యు లదనఁ జేసి. అచ్చ. రా. అయో. ౧౧౨.

జ: కడికంచము, కడిగొను, కడియెత్తు.

కడి². వి. సువాసన,సుగంధము.

సీ. కబళపరిమళక్షుత్యర్థములయందుఁ గనుపట్టు చుండును గడి యనంగ. ఆం. భా. 3. ౬౧.

౨. దుర్గంధము.

(గజవర్ణనము) సీ. కడి వోవ నొడళులు గడిగి న వాశ్వత్థపల్కలరసములు వఱలఁ బూసి. కు. సం. ౧. ౯౭.

జ: కడివోవు.

కడి³. వి. క్షతి,గాయము. ఆం. భా. 3. ౬౧.

కడిఁది. విశే. (క. త. కడిదు) ౧.గొప్పది,అధికము; పెద్దది.

చ...ఉన్మదకరినైన సుగ్రమృగనాథునినైనను గిట్టి మిట్టి పట్టిడముగఁ గాఁఁ గేలను గడిం దిమగంటిమి.యుల్లసిల్లఁ బట్టుదు...భార. విరా. ౧. ౯3.

ఉ....కడిందిగ స్రుక్కి...హరి. ఉ. ౨. ౬౭.

సీ....కడిఁదిబొమ్మ...రామా. ౬. ౧౧౪.

ద్వి. కడిఁదికొమ్ములపోటు ... రం. రా. సుం. ౨౪౪ పా. ౧3 పం.

౨. గంభీరము,లోఁతైనది.

(రాముఁడుసముద్రునితోనన్న మాట) ద్వి. కడ గానరానినీకడిఁది చిత్తంబుఁ, బడయుటకై నేను బడియున్న వాఁడ. రం. రా. యు.3౦౭ పా. ౬ పం.

ద్వి. కడిఁది-చిత్తంబు చెదరంగ... రం. రా.యు. 3౦౭ పా. ౧౬ పం.

3. కఠినము, తీక్ష్ణము; దారుణము.

ఉ. భావములో నదంభ యగుభక్తికి సంతసమం దుఁడోండె నొం,డే విధియింపుఁ డిప్పడ కడిందిగ దండము దప్పు గల్గెనేన్. నైష. ౪. ౧౧3.

చ...కడింది వేసవిన్. ఆము. ౨. ౬౪.

చ....పుప్పొడి నీపదాంబుజం,బెటువలె నోర్చె నమ్మ తరుణీ తగునమ్మ కడింది చెయ్దముల్. వసు. 3. ౧౨౧.

౪. అసాధ్యము, అశక్యము.

సీ...అవిచారముఖ్యంబు గాన లోకంబు మెప్పిం చుట కడిఁదిగాదె. నిర్వ. ౧౦. ౧౪౨.

ఆ. నవసి పావసి యనుదినముఁ బరప్రేష్యులై, యునికి దేఁప నర్థమునకచూవె, యట్టిదుఃఖ లబ్ధమైనయయ్యర్థంబు,విడుచు టెవ్విధము నఁ గడిఁదిగాదె. భార. అర. ౬. ౧౧౧.

వి. ౧. కడిమి, శౌర్యము.

సీ...కడిమి యుక్కు కఱపు గట్టి కడిఁది. గీ.నాఁ గ శౌర్యాభిధానంబు గాఁగఁ జెలఁగు. ఆం. భా. ౨.౨౨౧.

౨. ఆపద, ఇక్కట్టు.

క. పడిఁ బోయి మీర టిప్పటి,కడిఁదికి నేమాంస

మైన గ్రక్కునఁ గొనిరం, డెడనేయ కనుచు
ననిపిన...నా. పంచ. ౧. ౩౭౬.

కడిఁదిజడదారి=ధూర్జటి, శివుఁడు.

(చంద్రవర్ణనము) గీ. కడిఁదిజడదారిసిగపూవు
గళలప్రోవు. కృ. శకుం. ౧. ౨౨.

**కడికంచేము.** వి. (కడి[1]+కంచము) భోజనపాత్రము, అన్నము తినుకంచము.

(శివవర్ణనము) చ. కలువలరాజు పువ్వు కడికంచ
ము బ్రహ్మకపాలము....వీర. ౨. ౭౫.

**కడికండ(ము)లు.** వి. బ. (కండ[2]లు+కండ[2]లు-క. కడికణ్ణ) ఖండఖండములు, ముక్కముక్కలు.

మ...తురంగాంగముల్, గడికండంబులు చేసి...
భార. ద్రో. ౫. ౧౧౪.

సీ. కడికండలుగ వీనికంఠంబు వ్రేయుండు గర
సానఁ బట్టినఖడ్గధార. కాశీ. ౩. ౧౫౨. కాళ.
౨. ౫౯.

**కడిగొను.** స. క్రి. (కడి1+కొను.) కబళించు, మ్రింగు.

క. చిచ్చుఁ గడిగొనఁగ వచ్చునె, చిచ్చఱచూ
పచ్చుపడినశివునకుఁ దక్కన్. భాగ. ౮.
౨౪౬.

**కడితము.** వి.(సం. ఘట్టితమ్. ప్రా. ఘడిత. క. కడిత. త. కడిదమ్) గుడ్డమీఁద జిగురుతోఁ గలిపిన మసి పూసి నల్లపఱిచి అట్టలుగాఁ జేసి వానితో నేర్పఱిచిన లెక్కలపుస్తకము. (పలకమీఁదవలె నే యీ యట్టలమీఁద బలపముతో వ్రాయుదురు)

ఉ. డక్కఁగ వ్రాసిలి మ్మను పటమ్మునయందు
సుశర్మపాపముల్, లెక్క యెఱుంగరాదు
లవలేశము వానికి నట్టివ్రాఁతయం, దక్కజ
మిప్పు డొక్కటియు నక్షరరూపము లేదు
దేవ నేఁ, డక్కడితంబు గట్టియిడినట్టుల
యున్నది కప్పు దేఱుచున్. పాండు. ౫. ౭౦.

సీ. కపణముల్ నాళ్ళము ల్గలకట్లసంచిగోతము లె
క్కకడితంబు ... హంస. ౨ ౨౭౬ (రూ. కణితము. బ్రా.)

**కడితి**=కణితి. వి. గోకర్ణమృగము, కడఁజు.

వ...అడవులు చొరంబాఱుపిడికడితికదుపున
రవడికి వితిగి పడినవిటపివిటపంబులన్....
మనుచ. ౪. ౩౭.

మ...మృగ్గౌ వృకవ్రాతముల్ గడుతుల్ చిక్క
గజాళి చొక్క...సారంగ. ౧. ౧౦౭.

**కడితులము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కడిమి[1]**(డ్మి). వి. (√ కడు—త. కడుమై) ౧. బలము; పరాక్రమము, శౌర్యము.

గీ...నాకడిమి వినుము...

ఉ. క్రచ్చఱ నొక్కరక్కసుఁడ కాఁడు సురా
సురు లెల్ల నొక్కఁడై, వచ్చిన నీవ చూడఁ
గ నవార్యబలోన్నతిఁ జేసి వారలన్, వ్రచ్చి
వధింతు...భార. ఆది. ౬. ౧౯౭, ౧౯౯.

క. ఆరాజమణికుమారుఁడు, మారుఁడు సౌందర్య
మునఁ గుమారుఁడు కడిమిన్. రసిక. ౧. ౫౩.

మ...సురేశ్వరుని గడ్మిం గిట్టి తున్మాడ నో, పినపు
త్రుం దగ నిత్తు నీకు...భా. రా. బాల. ౪౭౬.
ఆం. భా. ౨. ౨౨౧.

౨. దండోపాయము.

గీ. ఏఱు నిలుపఁ గే లొగ్గుట యుచ్చకంబు, మత్త
కరిఁ గెరలించుట మాయచేఁత, కొండ నెది
రించి తగరు డీకొనుట కడిమి, కాన నధికుని
యెడ మేలు దాన మండ్రు. కవిక. ౨. ౩౭.

౩. ఆధిక్యము, గొప్పతనము; అతిశయము.

చ. వెరవున లావునం గడిమి ధీరమునం బోలు
పొందురాచదే, వర...యయా. ౨. ౧౨౮.

గీ. కినిసి యొఁకటికడిమి నయ్యనిలసుతుఁడు.
ఉ. రా. ౫. ౧౦౧.

విశ. అధికము, పెద్ద.

రగడ. కలిగొట్లుప్రాఁకువేడ్క లె నీకుఁ దఱ చె

దను, నలినాక్షి కడిమిగండమున కే వెఱచెద
ను. మనుచ. ౩. ౭౪.

**కడిమి**[2]. వి. (సం. కదంబః) నీపము, కడపచెట్టు.

గీ. కడిమి చిగిరించె... పాండు. ౪. ౨౧.

గీ. కడిమిపూఁదోఁటలో నాడుగరితఁ దలఁతు.
అచ్చ. రా. ౧. ౨.

**కడిమిడి.** విణ. పచ్చికకలది (నేల.)

వ. ... పచ్చనికడిమిడిపట్టునన్ జటాయువుం
దలంచి దర్భపూలంబుగాఁ బిండంబు వెట్టి
...భా. రా. ఆర. ౨. ౩౮౪.

శ్లో. శకునాయ దదౌ రామో రమ్యే హరితశా
ద్వలే. సం. రామా. ఆర. ౬౭. ౩౪.

**కడియ(డె)ము.** వి. (సం. కటకం. ప్రా. కడఓ. త.
కడయమ్. క. కడగ.) ౧. వలయాకారముగా
నుండు హస్తభూషావిశేషము; పాదభూషావిశే
షము.

సీ. కడియంపుఁబాములు కకపాలలో నున్న భూ
తి మైఁ జిలికిన బుస్సు రనఁగ. హర. ౫. ౧౬.

ఉ. మేలిపసిండి గాజులస మేలపుఁ బచ్చల కీల్కడెంపు డా, కేలు మెఱుంగుగబ్బిచనుఁ గ్రేవ
కుఁ దార్చుచు... విజ. వి. ౧. ౮౯.

సీ. ఇసపక డెంబులు.... ఉ. హరి. ౪. ౧౫౮.

సీ. కాలికడియ మమర. పారి. ౪. ౮౬.

౨. భక్ష్యవిశేషము.

వ. ...పచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జ
లును వడియంబులుం గడియంబులును.. కాశీ.
౮. ౧౭౫. (చి. ని. పా.)

కడియపుటట్టు = కడియమువలె వర్తులాకారమైన
భక్ష్యవిశేషము.

చ. .. నడుఁకక బాల్యచాపలమున న్దనపిమ్మటి
వ్రేలఁ జొక్కఁపుఁ గడియపుట ట్టటంచుఁ
ద్రిజగజ్జను లచ్చెరువంది చూడ నక్కడపటి
కొండ హంపు లెఱుఁగం దవిలించి నటించు
శూలి పెన్గొడుకు... వేం. పంచ. ౧. ౮. కళా.
౮ ౭౧.

**కడియెత్తు.** అ. క్రి. (√కడి[1]) - ముద్దయెత్తు - భోజన
ముచేయు.

క. అత్తదయామతిఁ దనకడ, నత్తమిలక నిద్రపో
వదహరహమందున్, బొత్తునఁ గుడువక తాఁ
గడి, యెత్తదు తజ్జనని యింత కేమయ్యెనొకో.
రాజ. చ. ౨. ౩౪. శివ. సా. ౪౮౯.

**కడిలము.** వి. వృక్షవిశేషము. (శ. ర.)

**కడివోవు.** అ. క్రి. (కడి[2] + పోవు) ౧. - వాసనపో
వు - వాడిపోవు.

క. పడఁతికిఁ గన్యాసర్గం, బెడలినఁ గొఱయగు
నె వెండి యెవ్వరికైనం, గడివోయినపువ్వులు
మఱి, ముడుచునె రసికుఁడగు వాఁ డవోసు
వివేకా. భోజరా. ౪. ౨౨౪.

క. కలయఁ గడివోయి యెందుం, జలితములై రా
లె నాకసం బనుమ్రానం, గలపుష్పము లనఁదా
రక, ములు గానఁగరాక యడఁగిపోయెం దో
డ్తోన్. హరి. పూ. ౭. ౧౬౨.

౨. తఱుఁగు, తగ్గు; చెడు.

ద్వి. అలికంబు సెమరింప దలకలు కమర, వెలవ్వ
గడివోవ డెసఁగదు దప్పి. ద్వి. హరిశ్చ. పూ.
౨౪౧౪.

గీ. సంతతము గడివోని వాసనలు గలుగు, పారిజా
తమహీజపుష్పములు ముడిచి. వి. పు. ౭. ౧౨౨.

చ. పసఁతి కుమారచంద్రకరపల్లవసుం దన
చన్నుదోయిపై, నిడి పులకించి కన్నుఁగవ
యింపుక యించుక మోడ్చి వెండియుం,
జిడిముడిపాటుతో నలని చెక్కులు నొక్కు
చు మోము ద్రేళులం, బుడుకుమ నుండెఁ దా
ల్మిగడివోయిన నింపుకలజ్జలావునన్. ఉ.
హరి. ౫. ౨౦౨. (వీరేశ. పా.)

**కడిసెలము.** వి. మత్స్యవిశేషము. హంస. ౪. ౧౭౮.

**కడు.** ప్ర. అవ్య. (వృత్తియందచ్చుపరమైనపుడు
'డు' 'ట్టు' గామాఱును - ఉదా: కట్టెఱక, కట్టె

ట్టి,కట్టెదుర- 'కడునిమ్ముగా' మున్నగుపట్ల 'కడు'వ్యస్తపదముగా గ్రహించునది.) అత్యంతము, మిక్కిలి.

మధ్యాక్కర. కడునిమ్ముగా దున్న...భార. ఆర. ౧. ౨౩౫.

క. కడునధికుతోడఁ దొడరినఁ,బొడిచిన నొడిచినను బురుషపురుషగుణంబే, ర్పడుఁగాక హీను నొడుచుట, కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెపుమా. భార.సభా.౧.౧౨౩.

ఉ....కడుగారవంబునన్. పారి. ౧. ౭౭.

చ....పలుదమ్మికెంపులా,జిగితలుపుల్ గడు న్నెఅయుఁ జెన్ను దలిర్పఁగఁ బ్రోల నెల్లెడన్. నీలా. ౧. ౩౦.

రగడ. కట్టంపము....కుచేల. ౧. ౨౩.

గీ....కట్టడుఁగు...కాశీ. ౪. ౧౮౧.

ద్వి. కట్టర్మి...పండితా. పురా. ౧౨౩. పా.

క. కట్టలుక...నీలా. ౧. ౪౯.

చ....కట్టెదురు...భార. విరా. ౧. ౧౨౯.

(ఇట్లే ఇతరములు గ్రహించునది.)

జ. కట్టాణి,కట్టాయితము, కడిమి1, కడుకొను, కడుపేదు.

కడు(ణు)ఁదురు. వి. (సం.గండోలీ.) కందుకీఁగ.

సీ. కడుఁదుకీఁగయుఁబోలె పడిఁదోలి కలచి యాకస్తూరిదుప్పుల గావుపట్టు. సారంగ. ౧. ౯౨.

సీ. కడుఁదుర్లనిడుతుట్టెగతిఁ జొంగతోఁ బాండుగత మించుకపిలకూర్చంబువాని. అను. ౬. ౧౯. (వ్రాఁతప్రతి. పా.)

వ...,దండశూకంబువలనం బరగృహవాసంబును నూర్ణనాభివలన సంసారపరిత్యాగంబును గణుందురువలన లక్ష్యగతిజ్ఞానంబు పిడుపకుండుటయును ననం గలవీనిగుణంబు లెఱింగి... భాగ. ౧౧. ౯౯.

కడుకొను. అ. క్రి. (√కడు) ౧. అతిశయించు, నెండుకొను. (ఈయర్థమునఁ బాదపూరణముగాఁ గూడ నుండును.)

క. వెలయాలివలపు కడుకో, వెలకు న్వగ లేకవాఁడు వెసఁజీకటులన్, గలవారియిండ్లచెలులకుఁ,గలవారపుసొమ్ము వెరఁజి గైకొనఁ జొచ్చెన్. శేష.ధ. ౮. ఆ. (శ. ర.)

క. పుడమియు రాజ్యము బంధుల,విడిచి మృగావళులఁ గలిసి విపినంబులలోఁ,గడుకొని మాయ ట్లిడుమలఁ,బడినసరులు గలరె యొరులఁ పరమమునీంద్రా. భార. ఆర. ౨. ౮.

౨. కడఁగు,పూను, యత్నించు; ఉత్సహించు.

చ. ... ఎట్టులుం,గడుకొని శత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతిమై. భార. ఆది. ౬. ౧౧౭.

క. కడఁగి వృకోదరుఁ డసురం,బడఁగ వడిన్ వైచి వామపానంబునఁ జే,డ్పడ వానిఱొమ్ముఁ దాఁచెం,గడుకొని యసురయును లేచి కడు నుద్ధతుఁడై. భార. ఆది. ౬. ౩౦౦.

(కుస్తరోగియన్నమాటలు) చ. కడుకొని కామినీజనులకౌఁగిట నేమనియుండువాఁడ నా,కొడుకులఁ బొత్తునం గుడుపఁ గొంకక యేమని పిల్చువాఁడ...భోజరా. ౧. ౧౦౮.

కడుగు(ద్గు). స. క్రి. (త. కళువు) క్షాళనముచేయు,శుభ్రముచేయు; ప్రక్షాళించి తొలఁగించు; తొలఁగించు.

గీ. గౌతమీవారిఁ దరవారిఁ గడిగినాఁడు.కాశీ. ౩. ౩౦.

చ. అడుగులు గడ్గి...భార. అశ్వ. ౮. ౨౨౩.

(వ్యవ)కాళ్లబురద కడిగి వేసికొనుము.

సీ. కడుగు నెవ్వనికీర్తి కార్తికతిథినిశానాథబింబంబునెన్నడిమికందు. నైష. ౪. ౧౦౫. వసు. ౧. ౬౨.

వి. బియ్యము నున్న గునవి కడిగిననీరు, తండుక్షాళనము, కుడితి.

సీ. తండులక్షాళనోదకము రాజిల్లును గుడితి యనంగను గడు గనంగ. ఆం. భా. ౨. ౭౩౧౦.

కడిగి పెట్టు = కడిగివేసిన ట్లేమియు లేకుండఁ జేయు.

గీ. తులసిపోఁగులు మొదలుగాఁ గడిగిపెట్టి, చిక్కు బాకీలు పిదప నిశ్శేషపతిచె. నిరం. ౨. ౧౧౬. ('లడ'లకు ప్రాసము.)

(వ్యవ) వానికి ఇల్లంతయుఁ గడిగిపెట్టినాఁడు= ఇంటిలోనియాస్తి యంతయు వాని కిచ్చివేసినాఁడు.

జః కడుగుడు.

కడుగుడు. వి. (√కడుగు) ౧. కడుగుట. ౨. వడఁగట్టుట, శోధనము.

సీ....వడఁగట్టు గాలింపు కడుగు డేసు. గీ. పలుపనఁగ శోధనాభిధ పరఁగుచుండు. ఆం.భా. ౨. ౭౩౨.

కడుజు=కణుజు (శ. ర.)

కడుపు(ప్పు). వి. (సం. గర్భః. ప్రా. గబ్భో)

౧. ఉదరము, కుక్షి, పొట్ట.

క...ఎచ్చోటఁ గడుపుఁ బ్రోతునొ యనుచున్. భార. విరా. ౧. ౨౬౮.

క....పానీయంబుల్, గడుపారఁ ద్రావె... వేం. పంచ. ౧. ౩౬౩.

చ....దనుజుప్రేవులు తోఁడుచు గాడ్పుకడ్పులో,గునుకులు కోఁడుచున్ వరుణుగుండియఁ దేఁడుచు...కవు. ౫. ౧౨౩.

ఆ...పేదమై,కడుపుకొఱకుఁ బాతకములు చేసి, కారవమునఁ గూలు... కేయూర. ౩. ౭౯౩. (కడుపుకొఱకు=ఉదరపోషణార్థము.) హరి. పూ. ౫. ౨౨౧.

౨. గర్భము, చూలు.

ఉ... జారుశశిఁ బొందికటా కడు పేల దెచ్చుకొం,టెగ్గు దలంపఁగా వలదె ... భాగ. ౯. ౩౭౮.

౩. గర్భాశయము.

క...లేడికడుపునఁ బులి పుట్టునె...భార.ఆది. ౬. ౫౮.

(వ్యవ)వాఁడు నన్ను తనకడుపునఁ బుట్టినబిడ్డకంటె ఎక్కువగా చూచుకొనుచున్నాఁడు. (కడుపునఁబుట్టినబిడ్డ=ఔరసుఁడు.)

౪. గర్భస్థపిండము, భ్రూణము.

క. దైతేయకామినీసం,ఘాతముమగ మొలక లైనకడుపులు డిగ సం,కేలించినట్లు చక్రము, పాతాళంబునకు నరుగుఁ బ్రతిపక్షాసిన్. ఉ. హరి. ౩. ౧౫౭.

చ. కడుపులు దింప...శుక. ౨. ౭౪.

గీ. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు,దీప్తగర్భంబు మెల్లన తిగిచి యోగ,నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ,గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁబడఁగ. భాగ. ౧౦. పూ. ౬౨.

౫. సంతతి, సంతానము.

(వ్యవ) నీయమ్మకడుపు చల్లఁగా మంచిమాట చెప్పినావు.

గీ. సిరియు వాణియు మొద లైనసురపురంధ్రు, లఖ్యుఁ గడుపును జల్లఁగా నభిలషించి,నియమమునఁ గొల్తు రెవ్వని నిత్యకలన,నట్టిభీమేసునినుఁ గొల్తు మహరహంబు. భీమ. ౪. ౧౨.

కడుపంటు=కడుపు (ఆఁకలిచే వెన్నునకు) అంటుకొనిపోవు.

గీ. పెంటవొగ్గర్లలోఁ గడుపంటి కృస్తు,చలనములఁ గ్రుక్కుజీర్ణోకుపుల...ఆము. ౬.౧౩.

కడుపుఁ గక్కుతిలి (కక్కుర్తి) = ఉదరపోషణాశ.

చ. కడుపులఁబట్టి యేము సరసంబును బోదము వానిపీటికిన్,గను మతి చాలమిం గడుపుఁ

గక్కు-తిలిక సురలోకనాథ... ప్రభా. ౧.
౧౧౮.

సీ. కడుపుఁగక్కుర్తికిఁ గావికోకలు కట్టి య
తుల మంచును భిక్షు లడుగువారు. దశా. ౧౦.
౧౦౬.

కడుపుచల్లకదలకయుండు=శ్రమపడకుండు.

క. మ్రొక్కెదము సామి నీదయ, నెక్కడనుం
బ్రొద్దు పాడుచు మెలఁగక నీవే, దిక్కని
యుందుము దాయలు, గ్రక్కు-తిలక గడుపు
చల్లకదలకయుండక. రామా. ౨. ౭.

కడుపుచేటు:-ప్రసవవేదనలక్క- తల్లికి కన్నం
దులకు ఫలము లేదనిభావము.

గీ. కోరి గంగాజలంబులు గ్రోలఁ డేని, కలుగ నే
టికిఁ దల్లులకడుపుచేటు. జాహ్నవి. ౧. ౪౯.

కడుపుఁజిచ్చు=కడుపుమంట, ఆఁకటిబాధ.

వ.... ఏ నశనంబుఁ గానక గానకకన్నయిక్క-
న్నియక.... కనికరం బుడిగి కడుపుఁజిచ్చు
నను మ్రింగం దలుముకొనివచ్చి... మనుచ.
౫. ౨౭.

కడుపునిండిన బేరము=అక్కఱలేని బేరము, వేడు
కబేరము. (వా.)

కడుపుకూడు = ఆఁకటికి చాలినంతమాత్రము
తిండి.

ఆ. ఏను గట్టివాలుదాన నా కెవ్వరు, కడుపుకూ
డు నెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలు
దు రట్టివా, రలకుఁ బనులు నేసి ... భార.
విరా. ౧. ౭౯౮.

కడుపు(చ్చు)నపఁబెట్టు=(శిసువులకు)ఉగ్గుపెట్టు.

సీ. వేఁపాకు గోరంటవిత్తులు పాగ నైచుఁ బోరు
మాన్పుచుఁ గడుపునపఁ బెట్టు. ఇంను. ౨.
౧౫.

గీ. మదమునను గడ్పునపఁ బెట్టి మూలిజిడ్డు, మో
మునను మేనఁ జమికే... హరి. పూ. ౫. ౯౯౪.

(సా) కడుపులోఁజేపెట్టి కలఁచినట్లు.

ద్వి. కడుపులోఁ జేనెట్టి కలఁచినకైటెనఁ, గడుభ
యంబునఁ బొంది కన్నీరు దొరఁగ. ద్వి.
హరిశ్చ. ఉ. ౧౭౨౬.

కడుపుమీఁదఁగొట్టు=వృత్తిచ్ఛేదముచేయు, జీవ
నాధారముపడఁగొట్టు. (వా.)

కడుపుఁగట్టుకొను=(లోభాదులచే) తిండిమాను
కొను. (వా.)

కడుపులోఁబెట్టుకొను=౧. ఆదరించు. ౨. మఱవ
కుండు, జ్ఞప్తిలోనుంచుకొను. ౩. వెల్లడింప
కుండు.

కడుపుకందవిత్తగు = కందవిత్తువలె కడుపు మి
క్కిలి ఫలించు, వంశవృద్ధియగు.

క. అడుగఁగ వలసినయది యే, నడుగుదు విశదము
గ మొదల నాచిలుక య దె, క్కడిది యిటుఁ
దేక యేటికి, విడిచితి నీకడుపుకందవిత్తుగ
హంసీ. ప్రభా. ౪. ౪౧.

జ: కడుపుబ్బు, కడుపుమంట, కడుపూఁద.

కడుపుబ్బు. వి. (కడుపు+ఉబ్బు.) ౧. కడుపుఉ
బ్బరించెడి యొకరోగము, ఆనాహము. (ఇందు
మలమూత్రబంధము కలుగును.)

సీ. కడుపుబ్బు నాఁగను నడఁకు నానాహాఖ్య. ఆం.
భా. ౨. ౧౨౮.

౨. ఈర్ష్య.

ఉదా: వాఁడు నన్ను తిట్టి తనకడుపుబ్బు తీర్చు
కొన్నాఁడు.

కడుపుమంట. వి. (√కడుపు.) ౧. కడుపుబాధ;
క్షుద్బాధ.

ఉ. అక్కట దోసతోఁట యిది యైనఁ దదీయ
ఫలంబు లమ్మి యా, డొక్కనుసాఁకఁగోరితిఁ
గడు న్నడు రేలను వచ్చి యెవ్వరో, మక్క-
పలేక నాకడుపుమంటయుఁ బుచ్చికొనంగఁ
బూని యా, చక్కెరవంటిపండ్లు తినసాగి ర
టంచుఁ గృశించు నెంతయుక. శుక. ౩.
౨౭౯.

౨. ఈర్ష్య.

ఉదా: నాకు లాభమువచ్చినదని వానికిఁ గడుపు మంట.

కడుపూఁద. వి. (కడుపు+ఊఁద.) ౧. మలమూత్రములు బంధించి కడు పుబ్బరించెడుపసురోగవిశేషము.

ఆ. నరిడి పుప్పు కప్ప నావురు గడుపూఁద,యదురుఁద్రిక్కు యనఁగ నడరె మఱియుఁ,దెవుళులెన్నియేనిఁ దవిలి యెంతయు మహో,గ్రంబులయ్యెఁ బసుగణంబునందు. హరి.పూ. ౬. ౭౫.

౨. కడుపుబ్బు, ఈర్ష్య. (శ. ర.)

కడుపేడు. వి. (కడుక్ + పేడు) మేదరవాఁడు కట్టుకట్టెడుసన్ననిపెడుసపేడు. (శ. ర.)

కడువు=కడుగు.

గీ. ఆజ్యతైలాభ్యుపేతభాండావళులకు, నేళ్లనీళులనొండె వేన్నీళ్లనొండెఁ,గడువ బాతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి.మార్క.౩.౨౫౪.

కడ్డాయము. వి. (క. కడ్డాయ. త. కట్టాయం.) బోము, బలాత్కారము. (శ. ర, బ్రౌ.)

కడ్డి(డ్డీ).వి. (సం. ఖటికా. ప్రా. ఖడిఆ. క. కడ్డి.త. కట్టి) ౧. బలపపుఁగోపు, పలకపుల్ల. (శ. ర.)

౨. పాళము, బంగారుమున్నగువానికడ్డీ,శలాక.

గీ. కడ్డి యనఁగ సలాక నాఁగను శలాక, యమడు...ఆం. భా. ౨. ౨౭౪.

కడ్డివత్తి=అగరువత్తి.

క. ధూపంబు కడ్డివత్తులు,దీపంబు నొసంగి...శుక. ౨. ౩౯.

కధాను. వి.శస్త్రచాలనభేదము, కత్తివిసరులలో నొకటి.

వ....కధాను ధాణు దారు ఝాటు మొదలుపమునాలుగువిసరులు...ప్రబంధ. ౭౭.

కణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకానొకయోఁగ,కుంభీరమక్షిక. ౨. పిప్పలికి. ౩. జీరకము,తెల్లజీలకఱ్ఱ.

కణఁకు. వి. అగ్గి, నిప్పు.

గీ. సారిది విహరించుకపులోకచోటఁ గూడి,కడిఁది చలిచేత మేనులు గడు వడంక,రాత్రి మెఱుఁగారుఖద్యోతరాజిఁ జూచి, కణఁకు గాఁబోలు నని నీకు గాఁచుచుండ. నా. పం చ. ౧. ౯౫.

కణ(డ)ఁజే(ము). వి. (సం. గంజః. క. కణజ) ౧. ధాన్యాదులు దాఁచుకొనుకొట్టు; గాదె; పాణక.

గీ. ... అహితికాలుఁ,డోలి గోపురమును వంటసాలయుఁ గణఁ,జంబుఁ గట్టించుటకు మనసమునఁ దలఁచె. పరమ. ౫. ౪౬.

ద్వి. కణఁజంబు లాదిగాఁ గలుగుసంపదలు,గణుతింపఁ జోద్యంబు గాఁగ ... నవనాథ. ౨. ౧౫౭. పా. ౫. పం.

సీ. అఖిలవస్తువులధాన్యములకణంజలు...హంస. ౨. ౧౩౭.

సీ. కాయధాన్యంబులకణఁజముల్ బియ్యంపుగరిసెలు దినుసులుగలకొటార్లు. హంస. ౨. ౨౨౬.

సీ. ఈగిచే యాఁగినఁ బ్రోగైనపంటకు జగములన్నియుఁ గడఁజాలుగానె. కమ.౧. ౧౭౯.

౨. పాఁతఱ.

చ. అలవిబుధాలయాహినిలయంబుల నెప్పుడుఁ దోడఁబుట్టువుల్, దలకొని యుండఁగా గరిసెలక్ గణఁజంబుల నెత్తరామిచే, నిలిచిన కుప్పకావలికి నిల్పుదు రప్పురిఁ గొంగుబత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబుపాసంగువేలుపుక్. చంద్రా. ౧. ౨౫.

౩. ద్రవద్రవ్యములు పోసికొనుట కుపయోగించెడుపాత్రము, గంగాళము.

సీ.ఆమునిదొర తేసియలకణఁజంబులు వనలక్ష్మీసా

భాగ్యమునకు నెడలు. గీ. ... అనఁగఁ దగిన యలరుగుంపులు ... ఉ. రా. ౬. ౧౧.

**కణగుగ్గులువు.** సం. వి. ఉ. పుం. ఒకవిధమగు గుగ్గిలము, మహిపాక్షము. (మహిసాక్షి.)

**కణజీరకము.** సం. వి. అ. న. క్షుద్రజీరకము, చిన్న జీలకఱ్ఱ.

**కణజీరము.** సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ.

**కణపాయి.** సం. వి. న్. పుం=కణయము.

**కణభక్షుఁడు.** సం. వి. అ. పుం=కణాదుఁడు.

**కణభము.** సం. వి. అ. పుం. కీటభేదము. (ఇది కుట్టినయెడల మంట పుట్టును.)

**కణభుక్కు-(జుఁడు).** సం. వి. జ్. పుం=కణాదుఁడు.

**కణము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. నూక. 3. లేశము, సూక్ష్మాంశము. (ఉదా: సికతాకణము, జలకణము.) న. మహిపాక్షము. (మహిసాక్షిగుగ్గిలము.)విణ.అ.పుం.సూక్ష్మమైనది. (అమరము.)

**కణయము.** వి. వాయుస్కంధము, వాయుపథము.

ద్వి. విలసిల్లఁగా నందు వివిధ మేఘములు, గలుగు నారెండవకణయంబుఁ గడచి... ఆయేనవకణయంబుఁ గడచి. రం. రా. ఉ. ౬3 పా. ౧3, ౧౭ పం.

**కణయము.** సం. వి. అ. పుం. ౧.శరభేదము, ఆయుధవిశేషము. (శే. ని.)

వ. కణయకంపనముసలముద్గర... ప్రముఖప్రహరణంబులు. ఉ. హరి. ౪. ౨౧3.

౨. క్రతుభేదము. (శే. ని.)

**కణలాభము.** సం. వి. అ. పుం. ౧. తిరుగలి. ౨. నీటిసుడి.

**కణసరము.** వి. శ్యేనవిశేషము, ఒకజాతి డేఁగ.

సీ. కన్నెలేడులమీఁద గాటంపుబీరంపుఁ గణసరంబులఁ జొన్పి గండడంచి. రసిక. ౧. ౧౧౫. ఆం. భా. ౨. ౯౦. (కడసరము అని చి. ని, శ. ర.)

**కణాటీనము.** సం. వి. అ. పుం. ఖంజనము, కాటుకపిట్ట. (మందపిచ్చుక అనికొందఱు.)

**కణాటీరము.** సం=కణాటీనము.

**కణాదుఁడు.** సం. వి. అ. పుం. వైశేషికసూత్రకర్తయగునొకఋషి.

**కణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వనజీరకము, అడవిజీలకఱ్ఱ. వి. ఇ. పుం. ధ్వని.

**కణింతి**=కంతి.

గీ. ... కంతి కణింతి ... అనంగను బొసఁగు గ్రంథి. ఆం. భా. ౨. ౭౪.

**కణిక.** వి. (సం. కణికా.) ౧. బలపము. ౨. నిడివియైనముక్క.

ఉదా: అక్షింతలకణిక, సుద్దకణిక.

చెఱకుఁగణిక=చెఱకుముక్క. ద్వి.పరమ. ౧. ౪౪ పా. ౧౬. పం.

**కణిక.** సం. వి.ఆ. స్త్రీ. ౧. అణువు,నలుసు, లేశము, అతిసూక్ష్మాంశము. (జలకణిక, మొ.) ౨. సూచి, సూది. 3. జీలకఱ్ఱ. ౪.గోదుమరవ. ౫.అగ్నిమంథనము, నెల్లికి. ౬. తూలిక. ౭. కూణిక, వీణెబిరడ.

**కణికము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. అణువు, నలుసు, 3. గోదుమరవ. ౪. పటవాసకము, బుక్కా.

**కణితము.** సం. వి. అ. న. ఆర్తస్వరము, కుయ్యి, మొఱ్ఱ.

**కణితి**=కడితి.

స్రగ్ధర. తుండించెన్ మన్నుఁబిల్లన్ దునిమెఁగణుతులన్ ద్రుంచెఁ జివ్వంగిమూఁకన్. యయా. ౨. 3౨. చంద్రా. ౨. ౧౪.

**కణిశము.** సం. వి. అ. పుం. న. సస్యమంజరి, ఎన్ను, కంకి.

**కణిష్ఠము.** సం. విణ. (అ.ఆ.అ.) అత్యంతసూక్ష్మమైనది, సూక్ష్మతమము.

**కణీకము.** సం. విణ. (అ.ఆ.అ.) చిన్నది, అల్పము.

**కణీచి.** సం. వి. ఇ. పుం. ౧. నినాదము, ధ్వని. ౨. అశ్వము, గుఱ్ఱము. ఇ, ఈ. స్త్రీ. ౧. పూచినలత. ౨. గురివెందకీ. ౩. శకటము, బండి. ౪. మనస్సు. ౫. ఆఁడుగుఱ్ఱము.

**కణీయము.** సం. విణ. (స్. యస్. స్.) సూక్ష్మతరము.

**కణుజు**[1]=అణుజు, అడుజు. వి. శ్యేనభేదము.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిద్ద, జాలె జలకట్టె కణుజు వేసడము శైరి, కురుజు ... అను డేగకొలము. పి. శకుం. ౧. ౧౧౦.

**కణుజు**[2]. వి. పగడములు తూఁచెడుమానవిశేషము.

గీ. పరఁగును బ్రవాళనామంబు పగడ మనఁగఁ, బవడ మనఁగ సిరాజి నా వానియెత్తు, కణుజనంగను విలసిల్లుఁ బ్రణతభక్త, భూరిభవభంగ శ్రీమాతృభూతలింగ. ఆం. భా. ౨. ౨౮౮.

**కణుదురు.** వి. వృక్షవిశేషము. హంస. ౪. ౧౧.

**కణేర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణేరము.** సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగు.

**కణేరువు.** సం. వి. ఉ. పుం=కణేరము. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణ్వము.** సం. వి. అ. న. ౧. పాపము. ౨. భూషణము, అలంకారము.

**కణ్వుఁడు.** సం వి. అ. పుం. ఒకానొకముని. (శకుంతలను బెంచినవాఁడు.) విణ. (అ.ఆ.అ.) ౧. బధిరుఁడు, చెవిటి. ౨. మేధావి, బుద్ధిమంతుఁడు.

**కత**=కద[2]. వి. (సం. కథా. ప్రా. కధా. క. కతె. త. కత్తం.) ౧. వృత్తాంతము, సమాచారము, సంగతి.

క. ... కొడుకులకత వినియెద ... భార. ద్రో. ౪. ౨౨౮. రామా. ౭. ౧౭౨.

క. అప్పుడు మనుబోఁట్లకతల్, చెప్పఁగ నేమిటికిఁ దారసిలి వేత్రధరుల్, రొప్పఁగఁ జనియెన్ నిలువక, యప్పరమేష్ఠియును నచటి కతిదూరమునన్. కళా. ౨. ౮౧.

౨. చరిత్రము; కథ; చేష్ట, చర్య.

గీ. ... అచ్చతెనుఁగు, బాసచే నిప్పుడే నొనర్పఁగఁ దొడఁగిన, నీల యనుపేరఁ దేజున నివ్వటిల్లు, నింతిపెండిలికతతెఱఁ గెట్టు లనిన. నీలా. ౧. ౨౩.

క. కతలుగ మాసంసార,స్థితు లెల్లను జెప్పె ... మనుచ. ౩. ౧౨౭.

గీ. కడమ పన్నియు నిఁక నేల కతకుఁ గాళ్లు, ముంతకుఁ జెవులుఁ గల్పింప ముజ్జగములఁ, బఱుపుఁజవరాండ్రకును దృణప్రాయ మహహ. సుద. ౪. ౨౫.

క. కొడుకువయి నీకుఁ గడుఁ బ్రే,ముడి గావునఁ గతకుఁ గాళ్లు ముంతకుఁ జెవు లీ,వడిగెదవు రాజ నీ కె,క్కుడియభిమాన మని పలుకఁ గాంతుం డలుకన్. సారంగ. ౩. ౧౭.

(నృసింహమూర్తినిచూపి ప్రహ్లాదుఁడు తండ్రితోననినమాట.) చ. ... ఇంక నీ,కతలను మాని యివ్విభు నగణ్యకృపానిధి నాశ్రయింపు... నృసింహ. ౫. ౭౬.

౩. లోకోక్తి, సామెత.

గీ. ... పులి పేదపడినఁ బసుల,వాండ్రె యెక్కుడి రనుకత వచ్చె నాకు. ఉ. హరి. ౪. ౧౦౨.

**కతరాజు**=కథలుచెప్పుటలో నేర్పరి.

క. ... నీకిది చెప్పం,గా వలయు నెయ్యెందు మి

గులఁ గత రాజవు నీ,వోపరటూరత్నమ ...
ప్రభా. 3. ౭౯.

జ: కతకారి, కతపత్త్రము, కతలకాచి.

కతకము. సం=కతము.

కత(ల)కారి. విశే. (కత+కారి.) కథలు చెప్పుట యందు నేర్పరి; నేర్పరి, గడుసరి.

గీ. జనపతిని జేరఁ బోనీక దినదినము, కతలు చెప్పఁగ సాగి తోకతలకారి. హంస. ౫. ౨౩౭.

ఉ. కంతుపతాణియుం గతలకారితనంబున విూఱి యిట్లనున్. శుక. ౨. ౨౩౬.

ద్వి. నెఱ వైనపెద్దలు నేరనియట్టి,కఱవులు గఱచె నీకతకారిబిడ్డ. అ. మ. క. ౧. ౩౪ పా. ౨౩ పం.

కతన. వి. (క. కత.) కారణము, కతము. (దీనికి వృత్తియందే-అం దైనను తృతీయాంతముగానే-ప్రయోగములు కలవు )

క. ... నీ,కతనన్ సుఖవసతి మాకుఁ గలిగెఁ గుమారా. రామా. ౪. ౫౨.

క. అసగ్గారియుఁ బుణ్య,స్త్రీసంభాషణము దనకుఁ జెందినకతనం, జేసి వివేకజ్ఞానవి,కాసంబున నుల్లసిల్లి కాననభూమిన్. వి. పు. ౪. ౩౪౧. భార. విరా. ౩. ౧౯౦.

కతపత్త్రము. మి.వి. (√కత.) ప్రమాణపత్త్రము.

సీ. కతపత్త్ర మిడపచ్చుఁ గలగాంచునపు డైనఁ గోరికఁ బరకాంతఁ గోరఁ డనుచు. పాండు. ౧. ౬౩.

కతము. వి. కారణము, హేతువు.

మ. ... రాజపుడు దీనసాన్వంతుఁ డై వర్తిలం,గత మేమి ... చం. రా. ౪. ౩౦.

క. నీకతమున నఖిలధారణీరాజ్యము నా, కేకాధిష్ఠిత మగు... భార. ఆది. ౬. ౧౪౦.

క. క్రమమున నీచేసినప్ర,శ్నములకుఁ బ్రత్యుత్తరంబు సమ్మతి నత్యు,త్తముఁ డెవ్వఁ డిచ్చు నతనికతమునను శాపాంత మగు బుధస్తుతే నీకున్. భార. అర. ౪. ౧౨౩.

కతమిచ్చు=గుఱుతిచ్చు, సూచించు.

క. రతిపతి హళాహళిం దన, యాతి ధైర్యగనంబు కొల్లలాడెనటంచున్, గతమిచ్చుకరణి నిచ్చున్, బతి యొకతెలనాకుమడఁపు ప్రాణేశ్వరికిన్. రామా. ౪. ౧౬౯.

చ. మొగము మొగంబుఁ గూర్చి బలుముచ్చటఁ బక్షపుటాంతరంబులన్, బిగియఁ గవుంగిలించి తనప్రేయసిముంగలఁ జంచుపాళికా, విగళితనాళదంభమున వేగనె రాఁ గతమిచ్చి యేఁగె లో, నొగులుచు నొక్కజక్కవ యినుండు నసం దదధీనవృత్తియై. వసు. ౪. ౯.

కతము. సం. వి. అ. పుం. చిల్ల, ఇందుగుకీ.న.చిల్లగింజ, ఇందుగుకాయ.

కతలకాచి. విశే. ( కతలు+కాణాచి. ) పెక్కుకథ లెఱిఁగినది.

క. నినుఁ గతలకాచి యని పే,ర్కొను నావచనంబు నిజ మగు స్తగువా. వేం.పంచ.౧.౫౫౪.

కతిపయము. సం. విశే. (అ. ఈ. అ.) కొంత,కొంచెము పరిమాణముగలది; కొన్ని. (ఇది జాతివాచకముతో సమసించునపుడుతఱచు ఉత్తరపదముగా నుండును. ఉదా: బ్రాహ్మణకతిపయులు (=కొందఱు బ్రాహ్మణులు) ఉదశ్విత్కతిపయము (=కొంతమజ్జిగ.) శ్లో. కతిపయసహకారపుష్పరమ్యః. సం. కిరా. ౧౦. ౩౦.-ఇతరముతో సమసించునపుడు పూర్వపదముగా నే యుండును. ఉదా: కతిపయప్రయత్నములు.

శ్లో....కతిపయదినస్థాయిహంసా దశార్ణాః. మేఘ. ౧. ౨౩.)

కతివిధము. సం. విశే.(అ. ఆ. అ.) ఎన్నివిధములు కలది. .

**కతుకు**=గతుకు[1], గతుకు. స. క్రి. ౧. తిను, భుజించు.
క. కతికిన వటుక చటుంచు, న్నతిమంతులు పలుకు
పలుకు మాబోఁటులకున్, స్తుతికంటె హె
చ్చు...పార్వ. ౫. ౭౨.
౨. కుక్క మొదలగునవి నాలుకతో కొంచెము
కొంచెముగా త్రాగు.
చ...ఏఱులు నిండిపాఱెనం, గతుకఁగఁ జూచుఁ
గుక్క లనకట్టెక మీఱక యొండు భాస్క
రా. భా. ౪. ౫.

**కతుక్కు**=కటుక్కు. వి. కొఱుకుటయందగుధ్వ
నికి అనుకరణము.
ఆ. ఒక్కనక్క వలె గతుక్కనఁ గొఱికి తా, న
వలఁ జనఁగ వెంటఁ దవిలె బలము. శుక. ౧.
౧౨౨. (శ. ర.)

**కత్తరి**. విశే. ౧. నానావర్ణములు గలది, శబలము.
ఉదా: కత్తరియావు, కత్తరియెద్దు. (శ. ర.)
౨. వర్ణసాంకర్యము గలది.
క. ఉత్తమసతి శూద్రులతోఁ, జిత్తజసుఖకేళి
వాంఛఁ జేసినఁ బ్రాయ, శ్చిత్తమున శుద్ధిఁబొం
దును, గత్తరి పురుషునకుఁ బాయు గర్భం బై
నన్. విజ్ఞా. ఆచా. ౧౧౨.
జ: కత్తరించు[1], కత్తరిగలయు, కత్తరిల్లు.

**కత్తరించు**[1]. స. క్రి. (√కత్తరి) చలింపఁజేయు,
ఆడించు; తొలఁగించు.
ద్వి. మిన్నక చూచును మెఱ విరుచుకొనుచుఁ,
గన్నులార్పుచుఁ జెవుల్ గత్తరించుచును.
పండితా. పర్వ. ౩౭౧. పా.
చ. మఱపునఁ గత్తరించి మదమానములం జూఱ
వుచ్చి మెచ్చుఁ జాఁ, గఱగొని క్రోధకామ
ముల గండడఁగించి...ఉ. హరి. ౪. ౭౨.

**కత్తరించు**[2]. స. క్రి. (√కత్తెర[1]) కత్తిరించు, ఖం
డించు.
వ. ఇట్లు మహసూసము సేయుపాయకంబులు...
చరణంబులు తొలిచియుఁ జర్మంబు లొలిచి
యు బాహుదండంబులు గత్తరించియు బయ
ళ్లకు నొత్తరించియు...ఉ. హరి. ౧. ౧౪౮.

**కత్తరిగలయు**. అ. క్రి. (√కత్తరి.) మిశ్రమగు,
కలసిపోవు; సంకరమగు.
క. ఎఱిఁగింపకున్న సతు లని, తెలియంగా రాదు
నాఁచుఁదీఁగెలు జడలున్, జలరుహములు
మొగములు నళి, కులభంబులుఁ జూపుఁజా
లుఁ గత్తరిగలయన్. రాజ. చ. ౨. ౧౫౯.
క. పెరుఁగును వడ్లును గలిపిన, కరణిన్ వర్ణాశ్ర
మములు కత్తరిగలయున్. జై. భా. ౮. ౨౧౩.

**కత్తరిల్లు**. అ. క్రి. (√కత్తరి.) చలించు.
గీ. కటము లద్రువంగ మీసాలు గత్తరిల్ల. నైష.
౭. ౪౬.

**కత్తలాన**=కత్తలాని.
(వర్మితవాజి, కవచముతొడిగినయశ్వము.)
సీ. ... వర్మితవాజి యాఁ గత్తలాని యనంగఁ
గత్తలాన యనఁగాను. ఆం. భా. ౨. ౧౯౬.

**కత్తలానము**=కత్తలాని.
(అశ్వాదివాహనము)
మ. కలుఁగున్నాయపుఁ దేజికిన్ భయము మైఁ గా
న్పించునీశానుసా, మ్మునుం దమ్మునికత్తలాన
ము రయంబుల్ మీఱ రావించి నూ, రెలసం
బర్వనఁ బోవువానిఁ గని గౌరీకాంత సారెం
గిలా, కిల నవ్వ న్మద మొంచువంశిముఖునిం
గీర్తించి నర్తించెదన్. కువల. ౧. ౨.

**కత్తలాని**=కత్తలాన, కత్తలానము, కత్తళఁడు, క
త్తళా. వి. (√కత్తళము. సం. కర్తలాణః?) వ
ర్మితాశ్వము, కవచముతొడిగినయశ్వము; అశ్వా
దివాహనము.
సీ....వర్మితవాజి యాఁ గత్తలాని యనంగఁ గ
త్తలాన యనఁగాను...ఆం. భా. ౨. ౧౯౬.
ఉ. అందలికత్తలానిగమి...అచ్చ. రా. బాల.

౩౭. (ఇట తెల్లనిగొరిజలుఁ దోఁకయు నెండ్రుకలును గలనల్లగుఱ్ఱము అని శ. ర.)

సీ. తెలుగంటికల్కి ముద్దియ లూడిగపుఁజెలుల్కాఁడీఁదిబొబ్బ మెకంబు కత్తలాని. రసిక. ౧. ౨.

**కత్తళఁడు**=కత్తలాని. (చి. ని, శ. ర.)

**కత్తళ(ల)ము.** వి. కవచము.

ఉ. ...పాం,చాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ,పాలక పుచ్చఁ గత్తళము...భార. శల్య. ౨. ౩౫.

శ్లో. నాహత్వా సర్వపాంచాలాన్ విమోక్ష్యే కవచం విభో. సం. భార. శల్య. ౩౨. ౨౩.

ఆ. కత్తలములు మూపుగములు ... అచ్చ. రా. అర. ౭.

జ: కత్తలాన, కత్తలానము, కత్తలాని, కత్తళఁడు, కత్తళా, కత్తళీఁడు.

**కత్తళా**=కత్తలాని.

(అశ్వాదివాహనము.)

సీ. రమణీయ మైనట్టిరాచిల్క కత్తళా విలసిల్లుడ గరకావిళ ముపడగ. గంధ. ౬.

**కత్తళీఁడు.** విశే. (√కత్తళము) వర్మితుఁడు, కవచముతొడిగినవాఁడు (చి. ని, శ. ర.)

**కత్తి.** వి. (సం. కర్త్రీ. క. త. కత్తి.) ౧. ఆయుధవిశేషము (ఖడ్గము, ఛురిక, మొ.); ఆయుధము.

వ. ...శూలంబుల ఫాలంబులు వొడిచియుఁ గత్తుల నెత్తులు పగిలించియు బల్లెంబుల సెల్లంబులు నొగిలించియు...విక్ర. ౪. ౯౧.

స్రగ్ధర. ఖడ్గిన్ జెండాడు మ్రాఁకుల్ కవుఁగిటి కోలఁదుల్ కత్తి నొక్కొక్క ఘాతన్. మనుచ. ౪. ౧.

గీ. కత్తివాతులలో నూరు గాచి తిరిగి, యాడు మురుపాళెములఁ గాంచె నాలువేల, వాని లోనిపిశాచముల్ పచ్చిపచ్చి,పొదువ నన్నింటిఁ దునుకలప్రోవు చేసె. ఉ. హరి. ౧.౧౮౦.

(కత్తివాతులు = దూసినకత్తులు, విచ్చుకత్తులు.)

సీ....కైదువ యనఁగను గత్తి యనఁగ, నాయుధ మొప్పు...ఆం. భా. ౨. ౨౧౧.

౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కెస...గీ. అంజ మెడపట్టు నాఁగఁ జెన్నలరుచుండు,ముప్పదియురెండు విన్నాణములకుఁ జేష్ట. ఆం. భా. ౨. ౨౧౯.

౩. ఒకదినములో ఒకఁడు సస్యము కోయుటకు సరిపడు భూమి అని కొందఱు (బ్రౌ.)

౪. నలుపదియొకరములపదునాల్గుకుంటలభూమి. (బ్రౌ.)

**కత్తులునూఱు**=కలహమునకు కాలుద్రువ్వు.

ఉ. కాయజుఁ డాకపై నలిగి కత్తులునూఱుచు నుండు ... కళా. ౭. ౩౫.

జ: కత్తికాసు, కత్తిగంటము, కత్తిగొంటు, కత్తిపిడిక, కత్తిపీఁట, కత్తిపేరిమెకము, కత్తిమందు, కత్తిమీఁదిసాము, కత్తివాతికూపు, కత్తులబోను.

**కత్తికాసు.** వి. (√కత్తి.) వడ్లవానిపనిముట్టు, గీఁతకట్టె.(బ్రౌ, వా.)

**కత్తిగంటము.** వి. (√కత్తి.)ఒకవైపున కత్తిగాను ఒకవైపున గంటముగాను నుపయోగించు వ్రాతపనిముట్టు.

గీ. ముదుకతలపాగయును బాహుమూలమందుఁ, గవిలె చర్మపుటొరలోనికత్తిగంట, మలఁతినీర్కావిదోవతు లమర గ్రామ,కరణ మేతెంచి రెడ్డిచెంగట వసించె.శుక. ౨. ౪౧౬.

**కత్తిగొంటు.** విశే. (√కత్తి.)-కత్తివలె తీక్ష్ణమైనది-క్రూరస్వభావము గలది.

ఆ. కత్తిగొంటువైన యత్తగంతు. కు. సం. ౧. ౧౩౫.

**కత్తిపిడికి.** వి. (√కత్తి.) కత్తిపిడి, కత్తులబుట్ట. (శ.ర.)

**కత్తిపీట.** వి. (√కత్తి.) కూరలు మొదలగునవి కోయుటకు కత్తియమర్చిన పీట.

**కత్తిపేరిమొకము.** వి. (√కత్తి.) ఖడ్గమృగము. ఉ. రా. ౬. ౩౯౦.

**కత్తిమందు.** వి. (√కత్తి.) ౧. కత్తి మొనకు పూయు వన్నెను. (శ. ర.) ౨. కుసుంభపుష్పము. (శ. ర.) ౩. పిడిలో కత్తి బిగించుట కుపయోగించు నొకానొక జిగురు. (వా)

కత్తిమందుచెట్టు=కత్తిమందు చేయుట కుపయోగించు చెట్టు.

**కత్తినీఁదిసాము.** వి. (√కత్తి.) మిక్కిలి జాగరూకతతో చేయవలసినపని, అపాయకృత్యము.

క. దౌర నయ్యేవనని కోరుదు, రరయఁగ జను లెవ్వరైన నా పెనుబెడఁద, ల్పరికింపఁ దొరతనపు, న్సరవు ల్మఱి కత్తినీఁదిసాములు సుమ్మీ. కువల. ౪. ౭౨.

**కత్తియ(త్తె).** అప. మత్వర్థమునను స్వార్థమునను వచ్చు ఒకానొక స్త్రీప్రత్యయము.

ఉదా: అందకత్తియ(త్తె)=అందముకలది, సుందరి.

ఉదా: చెలికత్తియ(త్తె)=చెలి.

**కత్తియ(త్తె)ము.** వి. ౧. అంకెలయడ్డబంతి. (శ.ర.) ౨. బారు, బంతి, వరుస.

సీ. ... ఘన మైన చెఱకువింగాణిబద్ద, చల నైన కొదమతేఁటులకత్తెములనారి ... గంధ. ౬.

**కత్తిరించే=కత్రించే.** స. క్రి. (√కత్తెర[1]. క. కత్తరిసు.) కత్తెరతో భేదించు; భేదించు, ఖండించు.

గీ. కత్తెరల నొడ్డి యూణము గ్గత్తిరించి. ప్రబంధ. ౬౬౭.

సీ. నిగిడి పూఁతేఁకు బాగుగఁ గత్తిరించినగడ్డంబు కొన నొమ్ముఁ గమ్మిరింప. వైజ. ౬. ౯౩.

గీ. కత్తిఁ దుస్తుకు బిరానఁ గత్తిరించి. చంద్రా. ౨. ౭౭.

**కత్తిరిల్లు(లు).** అ. క్రి. (√కత్తెర[1]) ఛిన్నమగు

గీ. భటుఁ డొకఁడు వింటఁ జాఱుకొంటఁ బంది నేయ, మిట్టిపడి మిందమెఱసినట్టులై తూఁటి, యది భయదనుర్ఘురారావ మడర నతని, రెండు తొడలును వెసఁ గత్తిరిలఁగఁ జంపె. శుక. ౧. ౧౬౧.

**కత్తివాతిఖూపు.** వి. (√కత్తి) అర్ధచంద్రబాణము

క. అంగదుఁ డట్టులు నొచ్చుట, నంగనలును ననిలసుతుఁడు కొండకునియ వై, చెంగత్తి వాతిఖూపున, నింగలములు నెవరఁ ద్రిశిరుఁ డెడ నది త్రుంచెన్. భా. రా. యు. ౯౯౭.

ఇశ్లే:-కత్తివాలియమ్ము, మొ.

ఆ. వాఁడిదైనకత్తివాలియమ్మున గొని, పగతుశిరము చెక్క లెగయ గొట్టెను. భార. ఆర. ౬. ౨౪౦.

శ్లో. ఏవముక్త్వా సటా స్తస్య పంచ చక్రే వృకోదరః, అర్ధచంద్రేణ బాణేన ... సం. భార. వన. ౨౬౩. ౧౦.

**కత్తులబోను.** వి. (√కత్తి) కత్తు లమర్చినఒకవిధమైనబోను.

చ. గడలు గుదాళ్లు వగ్గములు కత్తులబోనులు గడ్డపాఱలున్, వడిఁ గొని మేటిదొమ్మరులు వచ్చిరి ... చెన్న. ౨. ౨౦౯.

**కత్తువ.** వి. ౧. నీటిలోని మన్ను కెల్లగించెడు గసిక, సేద్యమున కుపయోగించు నొకవిధమైనపనిముట్టు. (శ. ర.) ౨. గనిమ, మడికి చుట్టు నేర్పఱచిన చిన్నకట్ట, సేతువిశేషము. ఆం. భా. ౨. ౮.

**కత్తృణము.** సం. వి. అ. న. ౧. నిమ్మగడ్డి, కామంచిగడ్డి. ౨. నాఁచు. ౩. కుటి, గడ్డిఋల్లు. (కే.వి.)

**కత్తెర[1].** వి. (సం. కర్తరీ. ప్రా. కత్తరీ. క. త. కత్తరి.) కత్తిరించుట కుపయోగించు సాధనవిశేషము.

వరమ. ర. ౧౮౪. ఆం. భా. ౨. ౫౯౭.

జ: కత్తిరించు[2]. కత్తిరించు, కత్తిరిల్లు, కత్తెరకాఁడు, కత్తెరకాలు, కత్తెరగడ్డము, కత్తెరచీల, కత్తెరదొంగ, కత్తెరబావిలీ, కత్తెరవాసము, కత్రించు.

**కత్తెర[2].** వి. (సం. కృత్తికా. ప్రా. కత్తికా.) ౧. కృత్తికానక్షత్రము.

సీ. పూచినకొఱవిపూఁ బోవరింటిచందానఁ గత్తెర యొక్కచోఁ గదలకుండె. గీ. ... మూఁకుటిచెలువు దాల్చి, హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు. కాశీ. ౧. ౧౩౮.

౨. భరణిమూఁడునాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుఁ డుండుకాలము. (శ. ర.)

కత్తెరకాపు=మొక్కలు కత్తెరలో కాచుకాపు.

జ: కత్తెరవంగ.

**కత్తెరకాఁడు.** వి. (కత్తెర[1]+కాఁడు- క. కత్తరికళ్ల=జేబులుకత్తిరించిదొంగతనము చేయువాఁడు) కత్తెరదొంగ; మోసగాఁడు.

సీ. ఎడకానితనములు నడుపుకత్తెరకాండ్రకిచ్చకంబులు గాఁగ మెచ్చు లొసఁగి. ప్రబంధ. ౬౭౪.

**కత్తెరకాలు.** వి. (√కత్తెర[1].) అంచలపుకాళ్లకు అడుగున పోటిగా అమర్చెడు మార్పుకాలు. (శ. ర.)

**కత్తెరగడ్డము.** వి. (కత్తెర[1]+గడ్డము.) కత్తిరించిన గడ్డము, కత్తెర వేసినగడ్డము.

సీ. కత్తెరగడ్డంబు కటువుజుంజుముమీసములు... శుక. ౨. ౧౮౧౨.

**కత్తెరగాయము.** వి. గవాక్షవిశేషము. (శ.ర.)

మ. పుఱిచుట్టు న్నిశరుండు పాకముఁడు నుత్తభోజాంధకు ల్గాచి కత్తెరగాయంబుల గండ్లముంగడలసంబెం గొమ్మకొమ్మ న్నిరం, శర ము॥ పాపనదీవె లెత్తి...ఉ.హరి. ౨. ౯౪.

**కత్తెరచీల.** వి. (√కత్తెర[1].) మీటమొక్కయు మునుమొక్కయు చీలవదలి రాకుండ దానిచివర రంధ్రమున అడ్డముగా వేసెడుచీల. (శ. ర.)

**కత్తెరదొంగ.** వి. (√కత్తెర[1].) జేబులు మున్నగునవి కత్తిరించి దొంగతనము చేసెడుచోరుఁడు.

**కత్తెరబావిలీ.** వి. (√కత్తెర[1].) స్త్రీకర్ణభూషావిశేషము. (గ్రా.)

**కత్తెరవంగ.** వి. (√కత్తెర[2]. సం. కర్తారికా.) ఒకవిధమైనవంగ, పెద్దవంగకాయ.

సీ. ... కత్తెరవంగ యనఁగఁ గర్తారిక దనరుచుండు. ఆం. భా. ౨. ౪౯.

**కత్తెరవాసము.** వి. (√కత్తెర[1].) ఎదురెదురుగా కత్తెరవలె నుంచెడువాసము. (శ. ర.)

**కత్థన.** సం. వి. ఆ. స్త్రీ.=కత్థనము.

**కత్థనము.** సం. విశే. (అ. ఆ. అ.) తన్నుఁదాను పొగడుకొనునది. వి. అ. న. తన్నుఁదాను పొగడుకొనుట, ఆత్మశ్లాఘనము.

**కత్రి.** వి. జక్కిణి అనునాట్యముయొక్క అంగవిశేషము.

సీ. లాఁగు మైసిరియుఁ బల్లటియుఁ గత్రియు బెక్కు విలసిల్లుజక్కిణివిధ మొకర్తు. ఉ. రా. ౬. ౧౩౯.

**కత్రించు**=కత్తిరించు (√కత్తెర[1].)

సీ. రేరాజుపోల్కిఁ గత్రించుసంచపురేకుబొట్టును నొసలికిఁ బొందుపఱిచి. పాద్మ. ౫. ౧౭౭. రం. రా. యు. ౩౪౧. హ. ౧౮౫౦.

**కత్సవరము.** సం. వి. అ. న. స్కంధము, మూఁపు.

**కథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కత; చరితము. ౨. చెప్పుట, కథనము. ౩. ఒకజాతిగద్యగ్రంథము. (కాదంబరి, మొ- చూ. ఆఖ్యాయిక.)

శ్లో. కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితం,క్వచిదత్ర భవేదార్యా క్వచి ద్వక్త్రాపవక్త్రకే. ఆదౌ పద్యై ర్నమస్కారః ఖలాదే ర్వృత్తకీర్తనమ్. సా. ద. ౬. 333.

కథంకథికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)-ఏమియేమి అనియడుగువాఁడు-ప్రతివిషయమును గుఱించియు ప్రశ్నించుస్వభావముగలవాఁడు; ప్రష్ట, అడుగువాఁడు. (త్రి. ని.)

కథంభూతము. సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టిది, ఎటువంటిది.

కథంవిధము. సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టివిధముగలది

కథకుఁడు. సం. విశే. (అ. థికా. అ.) ౧. వాచకుఁడు, చెప్పువాఁడు. ౨. కథలుచెప్పువాఁడు.

కథనము. సం. వి. అ. న. చెప్పుట.

కథనీయము. సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁదగినది.

కథనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పువాఁడు.

కథయత్. సం. శత్రు. చెప్పుచున్న.

కథయమానుఁడు. సం.విశే. (అ. ఆ. అ.) చెప్పుచున్నవాఁడు.

కథయితృ. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) కథకుఁడు, చెప్పువాఁడు.

కథయితవ్యము. సం=కథనీయము.

కథానకము. సం. వి. అ. న. పెక్కు-చిన్నకథలు గలగ్రంథము. (బేతాళపంచవింశతి, మొ.)

కథానాయకుఁడు. సం. వి. అ. పుం. ఏపురుషుని గుఱించి ముఖ్యముగా కథచెప్పఁబడునో వాఁడు, కథలో ప్రధానపురుషుఁడు.

కథాపీఠము. సం. వి. అ. న.కథా ప్రస్తావసూచకమగు గ్రంథముఖము, పీఠిక, ఉపోద్ఘాతము.

కథాప్రసంగము. సం. వి. అ. పుం. ౧. కథాసందర్భము. ౨. కథచెప్పుట.

కథాప్రసంగుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. జల్పాకుఁడు, వదరుఁబోతు. ౨. విషవైద్యుఁడు.

కథాప్రాణుఁడు. సం.వి.అ.పుం. కథలుచెప్పి జీవనము చేయువాఁడు.

కథాముఖము. సం. వి. అ. న. ప్రస్తావన, పీఠిక.

కథాశేషుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)-ప్రజలు తన్ను చెప్పుకొనుటమాత్రమే మిగులుగాఁ గలవాఁడు, కీర్తిశేషుఁడు-మరణించినవాఁడు. (ఇట్లే-కథావశేషుఁడు.)

కథించు. సం. స. క్రి. చెప్పు.

క. అనుటయు వైశంపాయనుఁ, డనఘా లెస్స కథ యడిగి తచ్యుతశుభలాం,ఛననామధామమాత్మ్యం,గొనియాడి కథింతు నీదుకోరిక యలరన్. హరి. ఉ. ౫. ౧౦3.

కథితపదత. సం. వి. ఆ. స్త్రీ. (అలం) పునరుక్తి అనెడిదోషము.

కథితము. సం. విశే. (అ. ఆ.అ.) చెప్పఁబడినది. వి. అ. న. కథనము, చెప్పుట.

కథీకృతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కథగా చేయఁబడినది. ౨-కథయందుమాత్రమే నిలిచియున్నది-మృతము, చచ్చినది.

కథేరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. వంచకము, మోసపుచ్చునది. ౨. కథకము, చెప్పునది. వి. అ. పుం. పక్షి. (కే. ని.)

కథోద్ఘాతము. సం. వి. అ. పుం. నాటకమందలి ప్రస్తావనా భేదము.(ఇందు సూత్రధారునివాక్యము విన్నపిదప ప్రథమపాత్రము రంగమునఁ బ్రవేశించును.)

కథ్యమానము. సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁబడుచున్నది.

కథ్యము. సం=కథనీయము.

**కద్.** సం. కుత్సితార్థకము "కు" అనుఅవ్యయమునకు తత్పురుషసమాసమున అజాదిపదములు పరమగునపుడును రథ వద త్రి శబ్దములు పరమగునపుడును వచ్చెడియాదేశము. (ఉదా: కదభ్యాసము, కదాచారము, కదన్నము, కదగ్ని, కద్రథము, కద్వదుఁడు, కత్త్రివర్గము.)

**కద**[1] (దా)=కా[2], కాదా, కాదె, కదె, కదన్న, కదమ్మ, కదయ్య, కదవె, కదరె, కదవయ్య, కదరమ్మ, కదరయ్య, మొ. (√అగు-కాదు+ఆ=కాదా. దీనిలో 'దా' లోపించి 'కా' అనురూపము అయ్యెను. 'కాదా' అనుదానిలో 'కా' పైదీర్ఘము హ్రస్వముగా మాఱి 'కదా' అయ్యెను. 'కదా, అనుదానిలో తుది దీర్ఘము హ్రస్వమయి 'కద' అని సిద్ధించెను. 'కద' పై 'వు,రు' వర్ణకంబు లేకత్వ బహుత్వంబులఁ గ్రమముగా నవును. వానికి నిత్యముగా ఎదాదులను ప్రయుక్తములగును. 'కాదు'నకు ఎదాదులను ప్రయుక్తములై 'కాదె, కాదే' మున్నగురూపములు సిద్ధించును. 'కాదె, కాదే' మొదలగువానినుండి 'కదె, కదే' మొదలగునవి సిద్ధించును. ఇందు 'అమ్మ' స్త్రీవిషయమునను 'అయ్య, అన్న' పుంవిషయమునను వచ్చును.) అవ్య. ఇది సందర్భానుసారముగా ప్రసిద్ధి, నిశ్చయము, సంతాపము, ప్రార్థనము, ప్రశ్న మున్నగువానిని సూచించును. కొన్నిచోట్ల ఊఁతపదముగా నుపయోగింపఁబడును.

(ప్రసిద్ధికి)

చ.... ఏ,గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా. విజ. వి. ౧. ౧౮౫.

(నిశ్చయమునకు)

గీ. అతివచియునవ్వు వీక్షించునప్పుడు కద, యా శరచ్చంద్రచంద్రిక యింపౌనప్పు. ఉ. రా. ౪. ౧౭౨.

క... నేఁడు గదా మ,న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడ నైతిన్. మనుచ. ౧. ౬౧.

(సంతాపమునకు)

క. వైరిమదకుంభికుంభవి,దారణదారుణకృపాణధారలు పతిఘా,కారములు కందమూలో,ద్ధారములకుఁ బాలుపడెఁ గదా నీకరముల్. హర. ౭. ౧౮.

(ప్రశ్నమునకు)

క. కనుఁగొని యిది గద మందర,మని యడిగిన ... దశా. ౨. ౧౪౮.

ఉ... నా,రంగములార మీకడకు రాఁడు గదా కృప నున్నఁ జూపరే. భాగ. ౧౦. పూ. ౧౦౧౧.

(ప్రశంసకు)

సీ. అడరుమంటలు గ్రక్కఁన ట్లున్నయది గదా వప్రరత్నప్రభావళులచేత...

వ. అనుచు నయ్యసురవరివృఢపురవరసౌభాగ్యంబు నగ్గించి... రామా. ౬. ౧౧౪, ౧౧౫.

(ఊఁతపదముగానుండుటకు)

గీ. వేషభీషణదానవవితతిలోనఁ, దల్లడంబునఁ బెదవులు దడుపుచున్న,సాధ్వి రఘువీరగేహినిఁ జక్కఁ జూచి,యవునో కాదో కదా యని యనిలసుతుఁడు. రామా. ౬. ౧౩౦.

జ: కదమ్మ, కదయ్య, కదరయ్య, కదరె, కదవమ్మ, కదవయ్య, కదవె, మొ.

**కద**[2]=కథ.

(వృత్తాంతము.)

క. మొదల నొకవేరువానిం,గద లరయఁగఁ బనిచి పిదపఁ గార్యము నేయం,బదిల మని పలికె శరభుఁడు, పదపడి మైందుండు నట్ల పలికె... భా. రా. యు. ౧౭౨.

**కదంబకము**=కదంబము.

విశే. (మిశ్రము.)

చ.... విపులకేశముల్, ముడివడనుండఁ దీర్చి విరులుం గురువేరుఁ గదంబకంబుగాఁ, బొడవుగఁ గొప్పువెట్టి... నా. పంచ. ౯౨౭.

**కదంబకము.** సం=కదంబము.

**కదంబపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ.-కడిమిపూలవంటి పూలుకలది-ముండికావృక్షము, బోడతరముకీ.

**కదంబము.** విశే. (సం. కదంబః. క. కదంబ. త. కదంబం.) మిశ్రము.

సీ. పన్నీటితోఁ గదంబము చేసి పూసినమృగనాభిపస రాచనగరు దెలుప. ఆము. ౨. ౭౫.

వి. యక్షకర్దమము, కలపము.

సీ. యక్షకర్దమసంజ్ఞ నలరుఁ గదంబమ్ము కలపము నాఁగను...ఆం. భా. ౨. ౧౬౩.

ఉ. కమ్మకదంబ మేల చెలిఁ గౌఁగిటఁ గూర్చనఁ జాలు...రా. వి. ౪. ౯౨. ప్రబంధ. ౧౮.

(వ్యుత్పత్తియందు వైకల్పికముగా అంత్యవర్ణలోపము.)

కదంబకావులు=మిశ్రమైనకావిరంగు గలబట్టలు.

వ. అట్టిచందంబునఁ జందనగంధులును జందనకావులును బట్టెడకావులును జెంగావులును గదంబకావులును గరకంచులును బొమ్మంచులును...ద్వా. ౩. ౨౦౬.

జ: కదంబకము, కదంబించు.

**కదంబము.** సం. వి. అ. పుం. ౧ కడిమిచెట్టు. ౨. తెల్లావాలు. (వి. ని.) ౩. ఆవాలు. ౪. దేవతాళము, డాపరడంగిచెట్టు. ౫. సమూహము.

**కదంబి.** సం. వి. ఈ. స్త్రీ. దేవతాళము, డాపరడంగిచెట్టు.

**కదంబించే.** అ. క్రి. (√కదంబము.)కూడుకొను, కలియు; అంటుకొను.

సీ. కర్పూరశకలసంగతవీటికాచర్వణములఁ జక్కెరపానకములవలన,మిసిమితావులఁ గదంబించుగండంబుల...విప్ర. ౨. ౫౨.

వ....పంకరుహకుముదకువలయకహ్లారషండంబులం బండతండంబు లగుతావులఁ గదంబించుచావులును...పి. శకుం. ౧. ౮౬.

గీ....అవ్వనజగంధి,మేనిజవ్వాదిపస గదంబించునొడలు,కడిగికొని వార్చి ప్రవరుండు గాగ్రహపల్య,వహ్ని నిట్లని పొగడె ... మనుచ. ౨. ౭౪.

స. క్రి. మిళితముచేయు, కలుపు.

సీ. గంబూర మించఁ గదంబించి కొండలు కలికికన్నియలు బాగా లొసంగ. భాను. ౨. ౪౯.

వ....కుంకుమరసంబునఁ గదంబించినపచ్చిపసపునలుంగు సమర్చి...ప్రబంధ. ౫౬౯.

**కదకము.** సం. వి. అ. న.-(పైని) మేఘమువలె నుండునది-వితానము, మేలుకట్టు.

**కదధ్వము.** సం. వి. న్. పుం. కాపథము, చెడుత్రోవ.

**కదనము.** సం. వి. అ. న. ౧. వధ, మారణము. ౨. యుద్ధము. ౩. మర్దనము. ౪. విహ్వలత్వము. ౫. పాపము.

**కదన్న**=కద[1].

శా. ...మున్నగ్రాటవీభూములం, దన్నం గొల్తు గదన్న...భా. రా. యు. ౫౮౪.

**కదన్నము.** సం. వి. అ. న. తినఁగూడనికూడు.

**కదపత్యము.** సం. వి. అ. న. దుస్సంతానము,చెడ్డసంతానము.

**కదభ్యాసము.** సం. వి. అ. పుం. దురభ్యాసము, చెడ్డయలవాటు.

**కదము.** వి. (సం. స్కంధః. ప్రా.కంద.హిం.ఖదమ్) అశ్వగతివిశేషము, అస్కందితము.

(వ్యవ) అతఁడు గుఱ్ఱముచే బాగుగా కదము త్రొక్కింపఁగలఁడు.

**కదము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీళ్లనిచ్చునది. ౨. సుఖము నిచ్చునది. వి. అ. పుం. మేఘము.

**కదమ్మ**=కద[1].

(సంతాపమునకు)

ఉ. అంచెలు గట్టి కాలితోడుసై చననీవుగదమ్మ ప్రోదిరా,యంచలు...మనుచ. ౫. ౬౧.

**కదయ్య(య్యా)**=కద[1].

(ప్రార్థనకు)

క....కారుణ్యము, నాదెస నుంపంగదయ్య నరనాథమణీ. దశా. ౧. ౧౫౪.

**కదరము.** సం. వి. అ. పుం. ౧. అంపము. ౨. ఉల్లోచము, మేల్కట్టు(సై. ని.) 3. వెలిచంద్ర, శ్వేతఖదిరముకే. ౪. పాదమునఁ గలుగుక్షుద్రరోగ భేదము. ౫. పాలవిఱుగుడు.

**కదరమ్మ(మ్మా)**=కద[1].

(సంతాపమునకు)

గీ. ...మనలఁ, దలఁచి యమ్మక చెల్ల యన్నెలఁది యెంత,పంతనడలెనో కదరమ్మ యింతులార. రసిక. ౪. ౪౪.

**కదరయ్య(య్యా)**=కద[1].

(ప్రార్థనమునకు)

గీ...మాపద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ,గూర్పఁగదరయ్య మిము వేఁడుకొనెదఁ గాక. సారంగ. ౨. ౧౭౦.

**కదరె(రే)**=కద1.

(సంతాపమునకు)

గీ. ఎంత బడలెనో కదరె యయ్యొమ్మెకాఁడు. రసిక. ౪. ౧౭౭.

శా. ...ఈ,వ్యాజస్వాంతుఁడు రుక్మి యుబ్బఁగదరే యత్యంతసంతుష్టుఁడై. రుక్మి. ౨.౭3.

**కదర్థన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హీనపఱచుట, కీడ్పఱచుట. ౨. పీడించుట.

**కదర్థనము.** సం. వి. అ. న=కదర్థన.

**కదర్థితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. అధఃకరింపఁబడినది, కీడ్పఱుపఁబడినది.

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తేర్న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్. భర్తృ. నీతి. ౭౭.

౨. బాధింపఁబడినది. 3. దుష్టము, చెడ్డది. ౪. కొఱమాలినది, నిరర్థకము.

**కదర్థ్యమానుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) ౧. హీనపఱుపఁబడుచున్నవాఁడు, కీడ్పఱుపఁబడుచున్నవాఁడు. ౨. పీడింపఁబడుచున్నవాఁడు.

శ్లో. శరై రజస్రం కుసుమాయుధస్య,కదర్థ్యమానస్తరుణీ త్వదర్థే. సం. నైష. ౮. ౭౫.

**కదర్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పిసినిగొట్టు, లోభి.

**కదలాడు**=కదలు. (√ కదలు.)

(చలించు.)

చ. ... మద్దికాయలు కడుం గదలాడఁగ ముద్దుగాఱుపొం,దిక జిగిపాలబుగ్గలును... కల్గియింపొదవుఁగా సుతుబాల్యము... కవిరా. ౨. ౪౭.

**కదలారతిపళ్లెరము.** వి. (√కదలు.) ఒకవిధమైన ఆరతిపళ్లెము.

వ....హల్లకినీపల్లవాధరామతల్లికలు పూనినజాళువాకదలారతిపళ్లెరంబులసొంపున ...హల్లకస్తోమంబు లుల్లాసంబు పల్లవింపఁజేయ... చంద్రికా. ౪. ౬౮. (వివాహాదిశుభసమయములందు వధూవరాదులు ప్రవేశించునెడహరిద్రాజలాదులతోఁ గూడిన శట్టలలో నెత్తునారతికి'కదలారతి' యని ప్రసిద్ధి-వ్యాఖ్య.)

**కదలించే**=కదలుచే.

గీ. పట్టెఁ గదలించె నసియార్చెఁ బాఁటెగల్చె, నెత్తె...తాల్చె నవలీల నిట్లు మందరనగంబు. హర. ౬. ౪౪.

**కదలిక.** వి. (√కదలు) కదలుట.

(చలనము)

గీ. కదలికల జాఱుజిలుఁగుఁబయ్యెదలతోడ. పరమ. ౪. ౧౦౧.

(యాత్ర, ఏఁగుట, చనుట.)
ఆం. భా. ౨. ౨౧౯.
(యత్నము)
క. ఇది వేళ గాదు చొరఁబడి, వెదకఁగ నని
యున్నయతనినెరవు త్రిలోకా,భ్యుదయాం
కురార్పణం బీ,కదలిక యీడేర్తు నన్నగతి
రవి గ్రుంకెన్. రామా. ౬. ౧౦౬.

**కదలు.** అ. క్రి. (క. కదలు. త. కడల్) ౧. చలించు; అస్థిరమగు.
వ. ఒయ్యొనొయ్యనం గదలుతూఁగుటుయ్యెలలం
గన్ను మొగిచియున్న విలాసినీవిలాసులును
...పారి. ౨. ౫౨.
క... కదలనిసిరులం, గేరుచుఁ గుంభకుఁడనియె
డి,పేరిటిగొల్లవారి యొకఁడు పేర్మిఁ జెలం
గున్. నీలా. ౧. ౮౭.
౨. బయలుదేఱు, ప్రయాణమగు.
మ.... మాయాబలంబున నోడింపఁగ నుత్సహిం
చి కదలెన్ భూరిప్రతాపంబునన్. భా. రా.
యు. ౧౨౭౮.
గీ. కాశికాక్షేత్రమున కేఁగఁ గదలిరపుడు, కో
ర్కులిగురొత్త బృందారకులును మునులు.
కాశీ. ౨. ౩౨.
౩. దండెత్తు.
గీ.... మిన్నును నేలయు గ్రక్కతిలఁగ, గాటమై
యెల్లి వానిపైఁ గదలపలయు. రాజ.చ. ౨.
౫౯.
౪. నడచు.
ఆ. కాలఁ జెప్ప లిడక కదలరాదు. వి. పు. ౨.
౨౪౫.
౫. వెళ్లు, పోవు; పాఱిపోవు.
క. కట్టెఁడి యగుమనుమను నను,గ ట్టిడి యొప్పిం
చి యెందుఁ గదలెద వింకన్. సారంగ. ౨.
౯౭.
గీ. పఱచె వెళ్లెను బయనెత్తె జరిగె నుఱికెఁ, గదలె
ననఁ బాఱె ననుమాట గాఁ జెలంగు. ఆం.
భా. ౩. ౮౬.
సీ. వెలవెలఁ బాఱి మోములు లావులు చలింపఁ
గదలె దిక్కులకునై గరుడకులము. దశా. ౨.
౬౦.
౬. పోవు, నశించు.
సీ. పఱి మొయిల్గప్పినఁ బాడఱి నునుఁ గాంతి గద
లినయమృతాంశుకళ యనంగ. భార. విరా.
౧. ౨౯౮.
౭. యత్నించు.
గీ. నరుఁడు గాండీవమున నొంకు నారిఁగూర్చి,
యతివఁ దెగటార్తు నను చుఁ గట్టలుకతోడఁ,
దీవ్రశరబాణ మొకటి సంధించి యేయఁ,గ
దలఁ గన్గొని పల్కె నాకాశవాణి. జై. భా.
౫. ౧౨౨.
వి. ౧. కదలిక, చలనము.
గీ. పండ్లు వేర్వాసి కదలు చూపకయ యున్న.
కాశీ. ౩. ౮౮.
ఉ.... చిత్తరువో కరువో యనంగ గం,డారపు
బొమ్మవోలె నచటం గదలించుక లేక యుం
డఁగన్. ఉ. హరి. ౧. ౬౦.
౨. ప్రయాణము, యాత్ర.
చ. పొదికి నభోవిహారమునఁ బువ్వును బోలెన
లంగకుండ న,మ్మదనసమానుఁ బట్టికొని మాన
వదానవదేవకోటికిం,గద లెఱుఁగంగనీక చ
ని కాంచె నుపానతిఁ జిత్రరేఖ యా,ముదిత
వు రాకపోక లొకమాఁడుముహూర్తము
లయ్యె నయ్యెడన్. ఉ. హరి. ౫. ౧౦౯.
ఆం. భా. ౨. ౨౧౯.
జః కదలాడు, కదలారతిపల్లెరము, కదలించు, క
దలిక, కదలుచు, కదలుడు, కదలుపరువడి, కద
లు మొన.

**కదలుచే(ల్చే)=కదలించే** స. క్రి. (√కదలు)
కదలఁజేయు.

(చలింపఁజేయు.)

గీ. కరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రా
మకృష్ణులు శైశవరతులఁ దగిలి. భాగ. ౧౦. పూ. ౨౧౯.

ఉ... లేఁతచేతం దనరారువీణియఁ గదల్చుచు
నల్లన సారె మీటుచుఁ. జాహ్నవీ. ౪. ౧౭.

కదలుడు=కదలిక.

(యాత్ర, ప్రయాణము.)

ఆం. భా. ౨. ౨౧౯.

కదలుపరువడి. వి. (√కదలు.) ముప్పదిరెండువి
న్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము.

వ. ఎడమఱుగుపరువడి కుడియఱుగుపరువడి కద
లుపరువడి ... నృసింహంబును నాది యగు
ముప్పదిరెండువిన్నాణంబులనాఁటెంబు పరీ
క్షించి. హంస. ౧. ౨౦౬. ప్రబంధ. ౭౭.

కదలుమొన. వి. (√కదలు) మల్లబంధవిశేషము.
ప్రబంధ. ౭౭. హంస. ౧. ౨౦౬.

కదళ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పృశ్ని, కోలపొన్నకీ.
౨. బూరుగుకీ. ౩. డింబిక, దుండిగముకీ.

కదళకము. సం=కదళము.

కదళము. సం. వి. అ. పుం. ౧. అరఁటిచెట్టు. (వై.
ని.) ౨. కోలపొన్నకీ. (మే. ని.)

కదళి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అరఁటిచెట్టు. ౨. వైజ
యంతి, టెక్కెము. (దీనికిఁ గట్టువస్త్రము అరఁ
టియాకువలెనుండును). ౩. ఒకజాతిలేడి. వి.
న్. పుం. ఒకజాతిలేడి. (క్షీరస్వామి.)

కదళిక. సం. వి. ఆ. స్త్రీ=కదళి.

కదళీదండము. సం. వి. అ. పుం. అరఁటిబొంది,
అరఁటిదూఁట.

కదవమ్మ(మ్మా)=కద[1].

(సంతాపమునకు)

గీ. కమ్మవిలుకానితూపులఁ గ్రమ్ముకొఁక, ముమ్మ
రంబయ్యెఁ గదవమ్మ ముద్దుగుమ్మ. ఇందు. ౩. ౯.

కదవయ్య(య్యా)=కద[1].

(ప్రార్థనమునకు)

గీ. కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి. నైష. ౧. ౧౦౭.

మ. అమరు ల్విష్ణునిఁ జేరి పంక్తివదనుం డత్రాసి
యై గాసిసేయ మరుల్లోకము సంచలించె
నిఁక మమ్మాపన్నులం బ్రోవ నా,యమరు
ల్కి నె కెదురే జయింపఁగదవయ్యా... ఉ. రా.
౧. ౭౮.

కదవె(వే)=కద[1].

(ప్రార్థనమునకు)

సీ. చెన్నారుచిన్నారివన్నెలక్రొన్నెల నగఁ జా
లు చిఱునవ్వు నవ్వఁ గదవె. రసిక. ౪. ౧౪౨.

శా. ... తెల్పఁగదవే యేతత్పురావృత్తముఁ.
దశా. ౧. ౨౨౭.

కదించే=కదియించే. (√కదియు.)

(బంధించు, బిగించు; అతుకు.)

చ. తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూ
ర్చుచునున్నవాఁ డిసీ, పలువ మఱెంతనే
ర్ప రని భర్తకుఁ జూపి దురుక్తు లాడినఁ.
హంస. ౨. ౨౧౪.

ఉ.... అరర మ్మొగి మూసి గడెఁ గదించి మో,
దమ్మున రెట్టఁ బట్టికొని దర్పకకేళికి సంభ్ర
మించినఁ. హంస. ౪. ౭౩.

చ. కరఁగను బోఁతఁబోయఁగను గ్రాఁచి కదిం
పను గమ్మి దీయఁగా...సొరిది విచిత్రచిత్ర
ముగ సొమ్ములు సేయ నతండు నేరిచెఁ.
హంస. ౨. ౧౭౨.

(కట్టుకొను, ధరించు)

ఉ. దిద్దిన నాభినామము కదించినమేల్మడిచీర
చీర్ణమూ, నిద్దపుఁబూఁత పుష్పములు నించి
ముడించినకొప్పు ... ఒప్పఁగా, ముద్దియ వ

చ్చి హంసమణిసుందర నిల్చె ... హంస. ౨. ౧౭౫.

కదింద్రియము. సం. వి. అ. న. పటుత్వము లేని యింద్రియము.

కదియఁబడు=కదియు. అ. క్రి. (√కదియు-స్వార్థమున 'పడు'.)

(కలియఁబడు.)

(మాలి) క. పఱతెంచి కదియఁబడి యే, డ్తెఱ వ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి యత్తఱిఁ జక్రంబున హరి పెడ,మఱి నైచెను దనుజు ననుజుమస్తకము తెగన్. నిర్వ. ౩. ౨౭.

ఉ. అత్తఱి మాళవుండు గదియంబడి తోమరచక్రరాజి ను, న్మత్తగజేంద్రు నొంచి...దశకు. ౧౨. ౬౫.

(కలుగు.)

చ. తడఁబడు మాట గద్గదిక దాఁగొను నిల్చిన చోట నిల్వరా,దడుగులఁ దొట్రుపాటు గదియంబడు ...మరు లెత్తినయాఁటదానికిన్. పవల. ౩. ౧౦౦.

కదియించు=కదించు. స. క్రి. (√కదియు) కదియఁజేయు.

౧. ఘటించు, చేర్చు; ఖచించు;లగ్నము చేయు.

వ. అంజలిపుటంబు నిటలంబునం గదియించి. కాశీ. ౫. ౧౧౪.

ఉ. ఎత్తి దృఢాంకపాళిఁ గదియించి...శుక. ౧. ౧౩౯.

చే. ... తమ్మికెం,పులు గదియించినట్టిజిగిపుత్తడి ముక్కలిపీఁటమీఁద...నీలా. ౧. ౬౧.

క. ఆవిభుపై నాహాలఁతియు, భావము గదియించె...హరి. ఉ. ౩. ౭.

౨. గ్రహించు, పట్టుకొను.

సీ. కరమునఁ బాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని. అని. ౨. ౯౧.

౩. దగ్గఱఁజేర్చు, సమీపింపఁజేయు.

గీ. ఉరగములయొద్దు వాపి యయ్యుత్పలాక్షి, యానఘుర్యులు గదియించి రవనిభుజుల. నైష. ౪. ౩౧.

౪. కట్టు.

చ. ...గాండివం,బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగయుగ్మమున్. భాగ. ౧౦. ఉ. ౧౨౯౨.

౫. రచించు, కూర్చు.

క. మృదుమధురరచనఁ గావ్యము, గదియించిన యట్లు తత్త్వగాఢార్థము చెప్పదు...వాసిష్ఠ. ౧. ౧౪.

౬. బంధించు, బిగించు.

గీ. తలుపు గదియించి రతికేళి సలుపుచుండె. హంస. ౨. ౨౦౬.

కదియు. అ. క్రి. (తె. కది.) ౧. కలియు, కూడు.

(శమీవృక్షవర్ణన.) సీ. కపటలాండాంటితోఁ గదియుచు నెడములు మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని. భార. విరా. ౧. ౧౬౨.

౨. సమీపమునకువచ్చు.

మధ్యా. ఎదురను దవ్వులఁ జూచినపాడవు లెల్లఁ దక్షిణమ,కదియఁగా నవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ బిఱుఁద,నిది దినేశ్వరురథమో యనూరుఁడో యిసఁ డంచు నపుడు, హృదయమునను గడువిస్మయం బందె నిష్వాకుకులుఁడు. భార. ఆర. ౨. ౧౬౯.

మ. కదిసె న్నగ్న మటంచు మంత్రులు దొరల్... చను దెంచి. మనుచ. ౪. ౪౯.

౩. తగులు, తాఁకు, అంటు.

క. మొదలిటియాఱును సోఁకిన, మృదుపకములఁ గడుగ శుద్ధి మీఁదటియాఱుం, గదిసిన నీరను గడిగిన, విదితంబుగ శుద్ధి యండ్రు విద్వజ్జనముల్. విజ్ఞా. ఆచా. ౪౩.

సీ. కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి... నైష. ౫. ౯.

గీ. బాలశైవాలమంజరీ జాలకంబు, లిందుమతి
యొప్పు మఱచేతులందుఁ గదియ. నైష. ౨.
౧౪౧.(కదియన్=స్పృశస్పర్శమగునట్లుగా,
గట్టిగా.)

౪. కలుగు.

క. యదువంశతిలక పేనికి,నిది జయకాలంబు పె
నఁగ నేటికి హరిచే, నొదవు నపజయము పే
నికిఁ, గదియు శుభము నీకు నచిరకాలమునం
దున్. అని. ౩. ౧౧౪.

గీ. లేమ చిన్నారిలేఁగౌను లేమి పూన, ససుర
వక్త్రంబులందు దైన్యంబు గదిసె. దశా. ౨.
౩౦౧.

స. క్రి. ౧. డీకొను, ఎదిరించు.

ఉ...నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం, డా
లములో నను గదిసి యంతకపాశిపు భేరయు
క్తుఁడై, తోలుపులంబడెన్. ... ఉ. హరి.
౧. ౬౧.

౨. పొందు, (రతియందు) కూడు.

ద్వి. కామాంధుఁ డై తల్లిఁ గదిసినయతఁడు, ను
డుగక సుర ద్రాగుమం డెడునతఁడు. ద్వి.హ
రిశ్చ. ఉ. ౬౫౯.

౩. చేరు, సమీపించు.

క.కృతనిశ్చయుఁ డగు శేషుని,ధృతరాష్ట్రుం డనె
డుఫణి గదిసి యిట్లను సం,చితవస్తుజాలము
లలో, వితరణుఁడు నొసఁగరానివియు లే వె
చటన్. జై. భా. ౭. ౬౦.

సీ. పడిఁ బోవుచోఁ బోఁకముడి జాఱ నిలక శీ
ఘ్రముగ గవాక్షంబు గదిసె నొకతె. ఇందు.
౬. ౫.

జ: కదించు, కదియఁబడు, కదియించు,కదుపు.

కదుకొను. అ. క్రి.(కదుసు[1] + కొను?.కదుసు+
కొను-అని శ. ర.) అతిశయించు.

(నీళ) చ. కదుకొని వేఁడిబాష్పములు గ్రమ్మి
పయింబయిఁ బర్వి భీతిమై,నదరుచు...భా.
రా.యు. ౨౩౪౬.

కదుపు. వి.(√కదియు-సం.కదంబం.త.కదుప్పు)
౧. (సజాతీయపశుపక్ష్యాదుల) సంఘము; గోగ
ణము; పశుసంఘము; సంఘము.

ద్వి. ... మహామృగంబుల ఘనపక్షితతుల, బలు
వడిఁబుట్టించి పంచిన నవియు నొండొండ గ
దుపులై యురవడిఁ బఱచి, పండిన చేలెల్ల
బయలుగా మేసి. ద్వి. హరిశ్చ పూ. ౪౯౧
పం.

గీ...మంద,కదుపు పటు పనఁ జెలఁగుగోగణము.
సాం. ని. తిర్య. ౭౩.

క.కదిసినబలములు విచ్చినఁ,గదుపులఁ జెదరంగ
నీక గాండీవి వెసం,బొదివి యట కడపె నవి
యును, గొదకొని తమపాలను సొచ్చె గోపా
లురతోన్. భార.విరా.౪.౨౭౧, ౧.౨౭౯.

గీ. ... సమజము కదుపు పన నలరుచుండు. ఆం.
భా. ౨. ౧౦౦.

సీ. గమిపొఁజు మొత్తము గదుపు... బృందాఖ్య
యను. సాం. ని. మాన. ౩౭.

ఎనుపకదుపు. ఆము. ౪. ౧౨౩.
చిల్కకదుపు. ఉ. రా. ౬. ౨౭.
తుమ్మెదకదుపు. నైష. ౮. ౧౪.
పందికదుపు. ఉ. హరి. ౪. ౨౫.

కదుపుకట్టు=మందగాఁజేరు, గుంపుకూడు.

గీ. కలిగి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు,పు
లులకూనలు జింకపిల్లలు మృగేంద్ర, పోత
కంబులు నాలఁత్రేపులును గదుపు, గట్టికొని
కూడిమాడ నక్కజముఁ జెంది. పి. శకుం.౨.
౪౯.

(ఇట్లే-కదుపులుకదుపులుగట్టు.)

క. కదుపులుకదుపులుగట్టుచు, మది లజ్జాపర
తఁ జనిరి మాంత్రికులధిపా. నిరం. ౪. ౭౩.

కదుము. స. క్రి. (క. కదుబు) ౧. ఆక్రమించు.

చ. వదనము చెంగలింప నిడువాలికకన్నులవాడు దీఱ స,మ్మదమును నుబ్బునుం బెరయ ముత్పులకల్ తనువల్లి నిండఁ ద,గదిమినపంచసాయకవికారము లించుక కట్టిపెట్టి య,మ్మదవతిఁ జేరి యావృపకుమారుఁడు కౌఁగిటఁ జేర్చి యిట్లను౯. వి. పు. ౬. ౯౩.

౨. అదుము, అణఁచు.

సీ. ఒకరాసుతుఁడె చాలు నుద్వేలశక్తి దిక్పాలురఁ గదిమి కప్పములుగొనఁగ. దశా. ౧. ౭౯.

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమె౯ గుఱ్ఱంపుఁబౌఁజు గగ్గులకాడై, చెదరంగ గంధగజముల, మన మడఁచెం జండవీరమండలిఁ దాఁకె౯. కాశీ. ౨. ౪౧.

వి. దెబ్బ తగిలినచోట నెత్తురుపేరుకొని వాఁచు వాఁపు, బొప్పి.

గీ. గాద మనఁగను బొప్పినాఁ గదుము నాఁగఁ, దగును ఘాతభవగ్రంథి... ఆం. భా. ౨. ౧౩౦.

కదురు[1]. అ. క్రి. ౧. కలుగు.

సీ. ఇచ్చట దిక్కు లే రెవ్వరు నా కనుభయమున మేనఁ గంపంబు పుట్టఁ, జేయంగ నేమియు పాయంబులేమి నాననమున వెల్లఁదనంబు గదుర. భార. విరా. ౨. ౩౩.

క. మేలై పచ్చిన మెత్తురు, కాలవశతఁ జేసి కీడు గదిరిన నతనిం, గేలి యొనర్చుచుఁ జూతురు, నాలిసతులమాట లంత నమ్మంగలదే. భోజరా. ౪. ౧౪.

౨. అతిశయించు, హెచ్చు.

చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు విల్లు ద్రెళ్లిడిం, దునిమి ... భార. విరా. ౫. ౧౭౬. (చూ. ౧౭౨.)

(అర్జునుఁడు) క.... ధర్మసుతునివిడి, దల కరిగెను మోము వెల్లఁదనమునఁ గదుర౯. భార. ద్రో. ౨. ౨౩౧.

౩. వ్యాపించు, పర్వు.

క. కెలఁకుల మీఁదను దూరము, పలుమఱుఁ జూడంగఁ జనదు పయనంబునఁ గో, డెలకాఁడి యంత దవ్వెడ, గలుగఁగ ముందఱను దృష్టి గదురఁగ వలయు౯. వి. పు. ౪. ౨౪౬.

సీ. కనుఁగవ మెఱుఁగులు గదిరినముందఱ పుష్పపహారంబుపోలుపు దాల్ప, వేనలికప్పు పర్వనమీఁదు నీలదుకూలంబు మేల్కట్టుకొమరు వడయ. భార. విరా. ౧. ౩౦౮.

౪. విజృంభించు.

చ. ప్రిదులనిశౌర్యసంపదలఁ బెట్టినదండలు ద్రెవ్వకే కడుం, గదురుచు హుంకరించుచును... ఐదుపదిసేయక పోరిరి ... కళా. ౮. ౧౦౦. (శ. ర. పా.)

జ: కదుకొను, కదురుకొను.

కదురు[2]. వి. (క. కదురు. త. కదిర్.) నూలువడికెడుసాధనము, తర్కువు, తంత్వాధారసూచిక.

క. పడిదారము చెవులుం ద్రొ,క్కుడుపలకయు దిండు కదురు గుంజలునుం ద్రొ, క్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు, పుడుకయునుం గలుగురాట్నములు గైకొనుచు౯. శుక. ౪. ౪౧౯. ఆం. భా. ౨. ౫౯౪.

కదురుకొను=కదురు[1].

(అతిశయించు.)

వ... నిదుర గదియమిఁ గెంజిగిం గదురుకొనుకనుఁడలును ... చంద్రి. ౪. ౧౦౭.

(కవియు, పైఁబడు.)

సీ. శాకినీభూతపిశాచ బేతాళముల్ కహకహకహమంచుఁ గదురుకొనిన. దశా. ౪. ౨౧౩.

కదుష్ణము. సం. విణ. (అ. ఆ. అ.) కోష్ణము, నులివెచ్చనిది, ఇంచుక వేఁడికలది. వి. అ. న. నులివెచ్చన, ఇంచుక వేఁడిమి.

కదె(దే)=కద[1].

(ప్రసిద్ధికి)

క. పెనిమిటిని జెంది కొడుకులఁ, గనియెనుగదె

దేవయాన కణఁ కెట్టిదియో. యయా. ౪. ౮౩.
క. లీలమెఱుం జాఱునాసని,కోలెమ్మిటందు వి
 డిచి ఘోరధ్వనిజం,ఘాలుండై పంపెఁ గదే,
 త్రైలోక్యమునకు మనోజ్ఞశరశుభవార్తన్. హ
 రి. ఉ. ౮. ౨౮౨.

(ఆశ్చర్యమునకు)

క. ఇసుమంత గాని లేఁ డీ,పసిబాలుఁడు ...
 బహుభక్ష్యరాసులు, మెసఁగెడి విసువఁడు
 ప్రతుష్టిమేకొనఁడు గదే. పాండు. ౮. ౧౮౦.

కద్ది. వి. (క. కద్ది=కోరిక.) అనురాగము? సంగతి?

ఉ. అద్దముఁ జూచి బిట్టులుకు నానతిఁ జేసిన సం
 చలించు న,మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చ
 టచేసిన యంతనుండి యి, క్కద్ది నెవెంగి
 చందురుని గానఁగనీరు పికంబు గూయ న,
 న్నిద్దపుప్రోలి మాన్పదురు నెచ్చెలు లిచ్చ
 యెఱింగి నిచ్చలున్. కావ్యా. ౧. ౬౮. (ప్ర
 యోగాంతరము లేదు.)

కద్దుము. విణ. దట్టము. (శ. ర.)

క. ఎద్దులు మఱుఁగులుగాఁ జని,కద్దుములై చేరు
 పెన్నెకంబుల నాలో,నుద్దవిడి నొంచి రలవు
 న,నద్దిర యని యయ్యియాలి యబ్బురపడఁ
 గన్. యయా. ౨. ౧౮. (శ. ర. పా. "గద్ద
 ులై" ముద్రి.)

కద్రథము. సం. వి. అ. పుం. చెడ్డరథము.

కద్రుణము. సం. విణ. (అ. ఆ. అ.) పింగళవర్ణము
 కలది.

కద్రువ. సం. వి. ఊ. స్త్రీ. కశ్యపునిభార్య, నాగ
 మాత.

కద్రువు. సం. విణ. (ఉ.) పింగళవర్ణము కలది. వి.
 ఉ. పుం. పింగళవర్ణము.

కద్వదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుర్భాషలా
 డువాఁడు.

కద్వరము. సం. వి. అ. న. దధిస్నేహము. (త్రి. ని-
 పెరుఁగుమీఁదిమీఁగడ? "మజ్జిగలేట" అని
 విల్యమ్సు.)

కనఁబడు=కానఁబడు. అ. క్రి. (కనన్+పడు) అ
 గపడు, కనుపట్టు; గోచరించు.

మధ్యా... అవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ
 బిఱుఁద.... భార. ఆర. ౨. ౧౬౯.

చ.... మేలు కనంబడ నెచ్చ నూర్చ న,మ్మనపతి
 నాదరించి వసుమంతుఁడు దా నలనాఁటివే
 కువన్. శుక. ౧. ౯౯. (మేలుకనంబడన్=
 వలపుగోచరించునట్లు.)

కనకకర్పూరము. సం. వి. అ. పుం. వెలిగారము.

కనకతెప్పెట. మి. వి. పటుహము. (శ. ర.)

కనకదండము. సం. వి. అ. న. ౧. బంగారుదండ
 ముకలరాజచ్ఛత్రము. ౨. బంగారుదండము.

కనకన=గనగన. వి. మండుట ప్రకాశించుట రా
 లుట మున్నగువానియందగు అనుకరణము.

వ. మండువేసవిం గనకన మండునగ్నిముఖంబు
 నడుమన నిలిచి... హర. ౮. ౧౮.

క. కనకన వెలుఁగుచు నిదిగోఁ,గగనమ్యో౦ గన
 కతరణి గరుడధ్వజమున్. దశా. ౧. ౧౮౨.

క.... కనకనఁ, గనుఁగొనలన్ నిప్పు లురలఁగా
 ...సుక. ౨. ౨౪౨.

కనకనలాడు=కనకనమను. (వా.)

జ: కనకనమను.

కనకనమను. అ. క్రి. (కనకన+అను) ౧. మిక్కిలి
 మండు.

క. నినుఁ జూడఁ గలిగినప్పటి,యవుమోహం బిం
 తలోనె యధికవ్యథయై, కనకనమనఁ జొ
 చ్చెఁగదే,మనమున సీతాశిరోగ్రమాణిక్యం
 బా. రామా. ౭. ౧౮. (మిక్కిలి బాధించు
 అనిభావము.)

౨. మిక్కిలి ప్రకాశించు.

క. కనుఁగొనఁ దివుదు నభీష్టము, కనుఁగొనలం

దివురులొత్తఁగా నెక్కి రొగిలె, గనకనగో పమితను లై, కనకనమనుసౌధవీథికలకుఁ గడఁకలె. లక్ష్మీ. 3. ౬౫.

కనకనికషము. సం. వి. అ. పుం. ఒరగంటిమీఁద గీఁచినబంగారుగీటు. మేఘ. ౧. ౩౭.

కనకపత్త్రము. సం. వి. అ. న. చెవికిఁ బెట్టుకొనెడి ఒకవిధ మైనబంగారునగ.

కనకపలము. సం. వి. అ. పుం-బఁగారువన్నెగల మాంసముగలది-మత్స్యభేదము. (వాచ.) న. నాలుగుకర్షములయెత్తుబంగారు.

కనకప్రభ. సం. వి. ఆ. స్త్రీ. ౧-బంగారువంటి కాంతిగలది-మహాజ్యోతిష్మతి, పెద్దమాసేరుతీఁగ. ౨. బంగారముయొక్కకాంతి.

కనకప్రసవ. సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చమొగలిచె.

కనకమయము. విశ.(అ. ఈ.అ.) బంగారుది, సువర్ణవికార మైనది.

కనకము. సం. వి. అ. న.బంగారు. పుం.౧. సంపెఁగచె. ౨. ఉమ్మెత్తచె. ౩. కాంచనాలముచె. ౪. కృష్ణాగురువు, నల్లఅగలు. ౫. నాగకేసరముచె.౬. మోదుగుచె. ౭. కాసమర్దము, కసింద. ౮. కడిమిచె. ౯. కణుగుగ్గులువు, మహిషాక్షము.

కనకరంభ. సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకదళి, పచ్చఅరఁటిచె.

కనకాక్షి. సం.వి.ఈ. స్త్రీ.ఆఁడుగుడ్లగూబ. (వై.ని-పైఁడికంటి అని శ. ర.)

కనకాచలము. సం. వి. అ. పుం. బంగారుకొండ, మేరువు. (ఇట్లే: కనకాద్రి, కనకగిరి, కనకశైలము, మొ.)

కనకారము. సం వి. అ. పుం. కోవిదారముచె.

కనకాలుక. సం. వి. ఆ. స్త్రీ. భృంగారము,బంగారుగిండి.

కనకాహ్వము. సం. వి. అ. పుం. ౧. ఉమ్మెత్తచె. ౨. నాగకేసరముచె.

కనకాహ్వయము. సం=కనకాహ్వము.

కనఖలము. సం. వి. అ. న. గంగాతీరమున హరిద్వారసమీపముననున్న తీర్థవిశేషము; ఆతీర్థము దగ్గఱనున్న ఒకానొకపర్వతము.

కననము. సం. విశ. (అ. ఆ. అ.) కాణము, ఒంటికన్నుగలది.

కనరు. అ. క్రి. కోపపడు.

వ...పొరలుచుం దెరలుచు వనరుచుం గనరుచు నొగులుచుం బొగులుచుఁ గసరుచుం గొసరుచు...పి. శకుం. ౩. ౧౯౧.

వి. ౧. కోపము.

సీ. కొలువు గాచినవానిఁ గూర్మి చూపినవాని సుతునిగా హితునిగాఁ జూడవలయు. గీ. ఇట్టివారలపైఁ బ్రేమ పెట్టుకోక,కనరు పెట్టినమనుజుఁడు గనఁడు కీర్తి. వేణు. ౭౯.

గీ. కన రనంగను గస రనఁ దనరుఁ గోప,ము... ఆం. భా. ౧. ౧౩౫.

౨. (క. కనరు.) వెగటు.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయుక్తైలాఘ్రాణోత్తర... ఘూరస్వన, ధ్ధారాధూపితశుష్యదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో,ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం,తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్. ఆము. ౨. ౬౮.

౩. (కందగడ్డలోనగువానియందలి) నస, దురద. (శ. ర.)

విశ. వెగటైనది.

(వ్యప) కూర కనరుగా నున్నది.

కనరెక్కు=వెగటైనడగు.

(వ్యవ) వంకాయకూర కనరెక్కినది.

కనరువోవు=కాటువోవు, వెగటగు.

సీ. కనరువోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి
సేయవచ్చుమీఁగడలతోడ. పి. శకుం. ౧.
౧౩౫.

**కనలించే.** స. క్రి. (√కనలు.) కనలఁజేయు.
(కోపింపఁజేయు.)

గీ. చూచి యిట్లను భూపాలసుతులతోడ,నన్నుఁ
గనలించి బ్రదుకఁగన్నారు లేరు.ఉ. హరి.
౪. ౬౦.

ఆ. మనసు రాదు నాకు మానినీమణులార ...
పొందు, కాకయున్న నన్నుఁ గనలింప కూ
రక, యుండుఁడు...చంద్రా.౨. ౧౪౯.

**కనలు.** వి. (క. కనలు.) కోపము.

చ....కన్నులం,గనలునఁ గెంపుపెం పడరఁగా
నసురాధముఁ డాక్షణంబునన్. హరి. ఉ.
౪. ౫౨.

చ. చిలుపనికమ్మఁదేనియలు చిప్పిలి హస్తము
లస్తకంబునన్, నిలువక జీరువాఱునెడ నీ
యతిసాంద్రపరాగము ల్గదా,యలరులవింటి
జోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ,
గలిగెడునంచు వేకనలు గైకొని మాఱె
విభుండు కేతకిన్. నైష. ౧. ౯౨.

శ్లో. ధనుర్మధుస్విన్నకరోఽపి భీమజా,పరం ప
రాగైస్తవ ధూళిహస్తయన్,ప్రసూనధన్వా
శరసాత్కరోతి మా,మితి క్రుధాఽకృశ్యత
తేన కేతకమ్. సం. నైష. ౧.౮౧. ఆం. భా.
౧. ౧౩౫.

విణ. మండునది. ('వి. మంట' అని శ. ర.)

సీ. అలుఁగులఁ బొడిపించి యహికోటిఁ గఱపిం
చి కరులచేఁ ద్రొక్కించి కనలుటగ్గిఁ, ద్రో
యించి...నృసిం. ౪. ౧౭౮.

అ. క్రి. ౧. మండు, జ్వలించు.

సీ. అనలకణంబులు గనగనఁ గనలంగ దారుణం
బైనయారౌరవంబు. మార్క. ౨. ౪౯.

మ. ...అయ్యుత్క్షము లీక్షణచ్ఛటల నగ్నిజ్వాల
లొక్కుమ్మడిం,గనలం గన్గొని వానిపైఁ గవి
సెఁ దీక్ష్ణవ్యూఢశృంగంబులై. హరి. పూ. ౬.
౧౪౭.

౨. తపించు.

క. అని మది విరహానలమునఁ, గనలుచు దైన్య
మునఁ బల్కుకామాతురు న,మ్మునిముచ్చ
నాదరింపక, కనుఁగవ నదలించి పలికెఁ గా
మిని పెలుచన్. సురా. ౭౭.

సీ. కట్టెండతాఁకునఁ గనలి యంగము చెడి కం
దినను సిచాయ గలుగు మేను. సురా. ౫౭.

౩. కోపించు.

గీ. ధర్మనందనుపలుకులు దనకుహృదయ, తాప
మొనరింప మోమున దైన్య మొంద, నున్న
పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ,గనలి
శౌరితో గద్గదకంఠి యగుచు. భార. ఉద్యో.
౩. ౧౦౦.

గీ. కంటికొనఁ గెంపు గదురంగఁ గనలి చూచి,
పదము దెగి పడ శపియించె బాలు నతని.
కాశీ. ౪. ౨౬౬.

జ: కనలించు.

**కనాతిగోడ.** వి. (హిం. కనాత్.) వసననిర్మితకు
డ్యము, బట్టతో నేర్పఱచినగోడ.

గీ. రంజిలుఁ గనాతిగోడ సరాతి యనఁగ,వస
ననిర్మితకుడ్యభావంబు గాను. ఆం. భా. ౨.
౧౫౯. (ప్రాఁత ప్రతిపాఠము.)

**కనారిలు.** అ. క్రి. (త. కనఱల్.) ౧. కోపగించు,
క్రోధయుక్తమగు.

చ. యమునకుఁ దానె పెద్దయముఁడై భయ మొం
దక రావణుండు సం,యమునికిఁ బోయె నిం
క నెటు లైనను మంచిది మర్త్యకోటిబ,న్న
ము గడతేఱె నింతటఁ గనారిలి వేల్పులమీఁ
దఁ జూపు వి,క్రమము... ఉ. రా. ౩. ౩౧౪.

౨. తపించు.

ఉ. ఇందునిభాస్యఁ గాంచి విను మింతి శతక్రతుఁ డిచ్చ నిక్క శతా,నందము లొంది పొంద జననం బితఁ డొందుట నేఁ డిఁకక్క శతా, నందుఁ డనం దనర్చు నిజనందను లందఱు నన్యజాతు ల,న్నం దలవంపులై మది గనారి లెఁ గాన నొకండు పల్కెడిన్. సమీర. ౧. ౨౨౦.

**కని.** సం. వి. ఈ. స్త్రీ. కన్య. కావ్యాద. 3. ౧౧౧.

**కనికరము.** వి. (త. కణికరం.) ౧. కరుణ, దయ.

క. దైవికమున నొక నేరమి,గావించిన నిట్లు విడువఁగాఁ దగ వానే,సేవకుని నన్ను మునులా,రా వలదా యింత కనికరంబైన మదిన్. వరాహ. ౧౦. ౮3. నీలా. ౧. ౮3. ఆం. భా. ౧. ౧3౧.

౨. కరుణము, శోకము.

క. తనకుం దనయులు లేమికిఁ,గనికర మందుచును...భల్లా. 3. ఆ. (శ. ర.)

సీ.వలరాచరాచవాఁ డలికాక్షుకను వెచ్చఁ గరఁగినయలకనికరపుఁజోటు. మనుచ. ౨. ౯.

జ: కనికరించు.

**కనికరించే.** స. క్రి. అ. క్రి.(√కనికరము). కరుణించు. (చూ. కరుణించు.)

(వ్యవ) వానిని కనికరింపరాదు.కనికరించి నావిన్నప మాలింపుము.

**కనిపట్టు.** స. క్రి. (కని+పట్టు-త. కండుపిడి.) వెదకిపట్టు;(క్రొత్తగా) కనుఁగొను, తెలిసికొను.

చ. పరిమెయిఁ బాఱి వానిఁ గనిపట్టి వడిం బెడకేలు గట్టి తె,చ్చిరి...భార. శాం. 3. ౫౦౫.

ఉదా: కొలంబస్సు అమెరికాను కనిపట్టెను. పాశ్చాత్యులు మొన్న మొన్న నే విమానములను కనిపట్టినారు. ('కనిపెట్టు' వా.)

**కనిపి(న్పి)ంచే**=కానిపించు. స. క్రి. (√ కను) కనఁజేయు.

(ప్రసవింపఁజేయు.)

(అప్సరోవర్ణనము.) సీ. పలుకువాల్గములయాఁకలి దీర్చు చలుప యేమగుపలఁ గనిపించుమంత్రసాని. చంద్రా. 3. ౧౦౧.

(పొందఁజేయు, ఘటిల్లఁజేయు.)

మ.తనకర్మంబె శుభాశుభస్థితులు తత్తద్వేళలన్ బ్రాణికిన్, గనిపింపం బరు లెవ్వ రిందులకనంగా లేక మిథ్యా విమో,హనిరూఢాత్మకులై హితాహితమనీషాయత్త భేదప్రక,ల్పనలం జిక్కెడు రల్పులు...సమీర. ౧. ౨౨౮.

(చూపు)

చ.కనుఁగవఁ గట్టినట్టిపసుకం దలఁగించి మృగాళి నెల్లఁ గ్రన్ననఁ గనిపించి పో విడిచిన స్వైర వొప్పఁగఁ బాఱి మూఁగిమూఁ,గి నిగిడి లాఁచి పట్టికొనెఁ గీడ్పడఁగాఁ బెనులేటి గుంపులన్, వినుతపరాక్రమంబు లగువేఁట సివంగులు రాజు మెచ్చఁగన్. చిత్రభా. 3. ౧౫౧.

మ. వినిపించెన్ హరి పాంచజన్యరవ ముద్వేల ప్రభాచక్రమున్, గనిపించెన్ సురదానవావళికి రక్షస్స్వామిమాయాళి లే,దనిపించెన్ క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళి చేఁ, దనిపించెన్ దృణరాజి రాజితభుజా తేజంబు శోభిల్లఁగన్. దశా. ౨. ౮౦౦.

అ. క్రి. కనఁబడు, అగపడు.

సీ. వినుఁగెంపుఁబతకంబు గనిపింప సురదీర్ఘికా చేలయై మించె గగనలక్ష్మి. ఉ. రా.౧.౧3౬.

మ. కలలో దేవర చెప్పె రేయి యెదుటం గన్పించి నెయ్యంబు వా,టిల ... శుక. ౨. ౮౧౫.

**కనియు.** అ. క్రి. కమియు, పరిపక్వమగు.

చ....ఎట్టి దెప్పుడుం,గనియఁగఁ బండి యుండు...భార. ఆర. ౭. ౪౮౫.

క. మును లేతెంచిరి చిత్తము, లనురాగరసాబ్ధి

నోలలాడఁగఁ దపముల్, గనియంగఁ బండెఁ
దమ కని, యనుపమభద్రు బలభద్రుననుజునిఁ
జూడరె. హరి. ఉ. ౩. ౧౬౧.

**కనిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨. ఒకానొక నాయిక. ౩. తమ్ముని భార్య. ౪. చెల్లెలు.

**కనిష్ఠకము.** సం. విణ. (అ. ష్ఠికా. అ.) మిక్కిలి యల్పమైనది, కడుఁ జిన్నది. వి. అ. న. శూకతృణము, గింజలమీఁదముండ్లుగల ధాన్యపుమొక్క.

**కనిష్ఠము.** సం. వి. అ. న. కూప్యమను భూలవణము. (శే. ని.)

**కనిష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. చిటికెనవ్రేలు.

**కనిష్ఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అతిహీనుఁడు, మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవిష్ఠుఁడు. వి. అ. పుం. తమ్ముఁడు.

**కనీని.** సం. వి. ఈ. స్త్రీ=కనీనిక.

**కనీనిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨. కంటినల్లగ్రుడ్డు.

**కనీయసము.** సం. వి. అ. న. రాగి.

**కనీయుఁడు.** సం. విణ. (స్. యసీ. స్.) ౧. మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవీయుఁడు. వి. స్. పుం. తమ్ముఁడు.

**కనీసము.** విణ. (సం. కనీయస్.) అధమము. (శ. ర.)

**కను.** (దీనికి 'కానక, కానక, కానమి, కానని, కానఁడు' మున్నగువిశేషరూపములుకూడ సిద్ధించును.) స. క్రి. ౧. చూచు.

క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది గాదు... భార. ద్రో. ౩. ౧౯౭.

సీ. కానరే కానలలోన లోకోత్తరు నని మ్రాని మ్రానికి నరిగియరిగి. భార. ఆర. ౨. ౯౪.

౨. ప్రసవించు, (బిడ్డను) కాంచు.

చ. ... ననుం గని కుంతి యెంతయుం, జెడ నది వైచిపోయె... భార. ఉద్యో. ౪. ౩౩.

ఉ. కానక కన్నకూఁతు... దశకు. ౯. ౬౭.

౩. ఎఱుఁగు, తెలియు.

గీ. శారదాదేవివరమున సకలలోక, వర్తనంబులు కానంగ వచ్చుమాకు, భానుమతిమచ్చఁగన్న ట్టు భావవీథి. విక్ర. ౩. ౧౨౫.

క. ...అప్పలుకునం, గనియెను దనపలుకు దప్పుగా నతఁడు మదిన్. భార. సౌ. ౨. ౭౪.

వ. క్రమంబునఁ దనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండం దత్సమీపగమనంబున కుపాయంబు గానక బహుకాలంబు గడపి... కళా. ౨. ౬౭.

క. భిన్నాసురాస్త్రములచవిఁ, గన్నమురాహిత శిలీముఖములపు డనిలో, మున్నెఱుఁగనిసురవీరుల, క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁ దొడంగెన్. పారి. ౫. ౬.

ఉ. ...ఓ, కన్నియ నీయెడం గలుగుగౌరవ మే యెడఁ జూచి కాన... పారి. ౧. ౬౫. (చూచి కానను=చూచియెఱుఁగను, చూడలేదు.)

౪. పొందు, పడయు; (భాగ్యమును) పొందు.

గీ. తల్లి నీకులగోత్రసౌందర్యములకుఁ, దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ, మయ్యె నీదుగర్భమునవాఁ డఖిలభువన, వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. భార. ఆది. ౪. ౬౧.

ఆ. ఎక్కుడలమునఁ బుట్టిరేని బహుసు, తుండు నతికృపాన్వితుఁడు వేయునెలలపై, బ్రదికిన తఁడుఁ గంద్రు త్రిదశపదము. భార. అను. ౨. ౬౪.

ఆ. రాఘవత్వమందు రణసరోలీలలఁ, గ్రాలుచున్న నిన్నుఁ గన్నులారఁ, జూడఁ గంటి జన్మసుఖమెల్లఁ బొడగంటి, ముదముతోడఁ జేరి మ్రొక్కఁగంటి. ఉ. హరి. ౬. ౧౧౯.

౫. ఆశ్రయించు, శరణుచొచ్చు.

శా. ...జనకకన్యక వేగ యొప్పించి లో, కై

త్రాణుని రాముని౦ గనుము...భా. రా.సుం. ౪౪౭.

ఉ.ఎట్టు ఘటిల్లు సంధి గడు నె గ్గొనరించిననన్ను నేల చే,పట్టు నతండు నావలదు ప్రాంజలియై తనుఁ గన్నమీఁద ని,ట్టట్టనువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁడు ... భా. రా. యు. ౭౭౭.

వి=కన్ను. చూ.

(నేత్రము.)

క. మఱి యైదు వేలయేఁడులు, తెఱచినకను మూయ కినునిదెస చూచుచు...ఉ.రా.౨.౧౬౪.

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిలి బోటులు చెప్పి చూపఁ గ,న్విచ్చి ... అచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. పి. శకుం. 3. ౨౧౨. భార. ద్రో. ౫. ౧౬.

(చెఱకు లోనగువానిగనుపు,పర్వము. 'పర్వము క్రిందిగుంట' అని శ. ర.)

సీ.కను గలవింటఁ జొక్కపుఁజవుల్ పుట్టించి... వసు. 3. ౫3.

విణ. అల్పము. (చూ. కను-చీకటి, మొ.)

కంటవత్తిడుకొను=ఏమఱకుండు, జాగరూకత తోనుండు.

గీ. పట్టికూడును వేన్నీళ్లు పెట్టి యొజ్జ,గలుగువిద్యంబు లిప్పించి వలఁతియైన,వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని,గంటవత్తిడుకొని పైరికప్రభుండు. పాండు. 3. ౫౬.

కంటికిఱెప్పలీల:-మిక్కిలి జాగ్రత్తతో అని భావము.

ఉ....జో,కొట్టిరి జోల వాడి రెడఁ గూర్కినఁ గంటికి ఱెప్పలీల న,ట్టిట్టెడ గాక కాచిరి మహీవరమందిరమందగామినుల్. రామా. 3. ౧3౨.

కంటినొప్పి=పీడ.

(నక్కపులితో నన్నమాట.) గీ.ఎలుఁగులకు వేరు విత్తు దుప్పులకు గండ,మేదులకు మిత్తి లేళ్లకు నెదురుచుక్క, కాసరంబులపాలిటికంటినొప్పి, యసదు గాదుగదా భవదన్వయంబు. శుక. ౨. ౨౭3.

కంటిలోనినెరసు:-మిక్కిలి బాధించుటకు దెలుపునవు దుపమానముగా ను పయుక్తము.

గీ. నీవు నాదాయతోఁ గూడి నీచబుద్ధి, బుద్ధిసెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు,కడఁగి నీమంత్రులును నీవుఁ గంటిలోని, నెరసుసరవిగ నున్నారు నిశ్చయముగ. మొ. రా. యు. ౧. ౨౦.

కంటివింటివజీరు=ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. కంటివింటివజీర ముక్కంటివింటి, వంటిసిరులగు నీమచ్చెకంటిసిరులు, దంటపుచశైలములు నటువంటి వగుట, నంటరాకుము నీజన్మ మాఱ మార. ముకుంద. 3. ౬౯.

కనిపెంచువయసు=సంతానము కనుటకుఁ దగిన వయస్సు.

క. కని పెంచువయసుగాదే,తన కేటికి లేక పోవుఁ దనయుం డిఁక నీ,కునుసీజననికినుత్తమ, తనయులు గల్గుటకుఁ జరువు దగఁ గావింతుక్. దశా. ౬. ౪౫.

కనుఁగొ(న్గొ)లికి=కంటికొలికి.

మ. లొలియిక్కల్ పరికింపఁ గన్గొలుకులందున్ నీరు నించున్...ఉ. రా. ౪. ౧౫౭.

కనుఁగో(న్గో)న=కంటికొన.

మ. ...ఉ,గ్గడు వై కోక్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం దంద్ర యెక్కుడు దోఁచెం గమనీయదౌహృదపరిక్షోభంబునన్ బొల్తికిన్. హరి. ఉ. 3. ౧౭౦.

కనుఁగ్రేవ=నేత్రాంతము, క్రేఁగన్ను.

మ....రోషమదసంగీభూత చేతస్కుఁడై, కనుఁగ్రేవన్ మిసుఁగుర్లు సాలఁ బొడమంగా... భాగ. 3. ౬౬౨.

కనుఁజాటు=రహస్యము.
ద్వి. ఘనతపోమహిమచేఁ గన్నయాత్మజుని, గ
నుఁజాటుగా నుండఁగను జాటువెట్టి. రం.
రా. ఉ. ౯౨. పా. ౧౪ పం.
క. కనుఁజాటుతిండి నడిపిన,పసులం గండలును
బెరిఁగి...శుక. ౨. ౨౦౭.

కనుగట్టు=కన్నుమూయు; మాయచేయు.
సీ. కనుగట్టి గాంగేయగర్భు డాఁగుడుమూఁత
లాడించె వత్సాపహరణవేళ. పాండు. ౩.
౧౭౮.

కనుచూపుమేర=చూపు అనునంతదూరము.
క. కనుచూపుమేర దానిం,గనుఁగొని యమ్మగువ
యగునో కాదో యనుచుం,జనుదెంచి ...
శుక. ౨. ౫౬౬.

కనుచూఱయొసఁగు=కనుచూఱగా ఇచ్చు, య
థేచ్ఛముగా చూడ వీలగునట్లు చేయు.
గీ. చూపఱుల కెల్లఁ దనుఁ గనుచూఱ యొసఁగి,
వేగ పఱతెంచి చూచె భూవిభు నొకర్త.
కవిక. ౩. ౧౪౧.

కనుదాఁపురము=కనుఁజాటు,కనుమఱుఁగు.
గీ. అయినయాఱళ్లు నాడికో ళ్లయినవమ్మ,కాఁగల
ట్టిది యే మైనఁగాని కలదు,ఇంక నీకనుదాఁ
పురం బేల పొమ్ము, అంబుజాతాక్షి పక్వబిం
బాధరోష్ఠి. గంధ. ౬౭.

జ: కంట[1], కనఁబడు, కనిపట్టు,కనిపించు,కనుఁ
గడ, కనుఁగాపు, కనుఁగొను, కనుఁబ్రాము,
కన్నది,కన్నయ్య,కన్నవిటి, కన్నాఁగు, కన్నా
కు, కన్ను, మొ.

కనుఁగ(న్గ)డ. వి. (కను+కడ.) కంటికొన, కడ
కన్ను.
ఉ. ఆనతమౌళియై యటులు ప్రార్థనసేయుమునీం
ద్రు శాంబరీ,మానుషవేషధారి దయమానమన
స్థితి బిగ్గ నవ్వుచున్, వీనులఁ దాఁకుకన్గడల
వేమఱుఁ జూచుచుఁ బల్కుఁ జిల్కుపూఁ,
దేనియసోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడుమేలి
పల్కులన్. పాండు. ౪. ౧౧౨.

కనుఁగాపు. వి. (కను+కాపు.) కనుసంజ్ఞకై కా
చుకొనియుండు సేవకుఁడు.
ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునున్ గనుఁ
గాపులట్లు ము,వ్వెట్టియుఁ జేసి చేసియును
వేసరి...హర. ౩. ౧౧.

కనుఁగొ(న్గొ)ను. స.క్రి. (కను+కొను.) ౧. చూ
చు; పరీక్షించు.
మ....పౌ,త్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు
నింద్రుం గ్రేణిసేయంగ నే,చినవెంపొప్పఁ
గ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునన్ బోరి
కిన్. భార. భీష్మ. ౧. ౯౪.
ఉ. ఎందును నిట్టిరూపు నరు లెవ్వరుఁ గాంచిరె
నాక కాదు సం,క్రందననూతికిం దగిలి కన్గొ
నఁజాలదె....భార. విరా. ౨. ౨౬.
వ. ఇట్లిరువురుం బ్రవర్తించిననర్తనంబులు కనుం
గొని విక్రమార్కుం డిట్లనియె. విక్ర. ౨.
౯౨.
౨. తెలిసికొను, ఎఱుఁగు.
సీ. జనునవిశ్వాసంబు కనుఁగొని మెలఁగుట వి
శ్వసనీయుని వేర్పఱుచుట.గీ...వలదు పతికి.
ఆము. ౪. ౨౪౨.
గీ. తెల్లవాఱుట గన్గొనియెల్లవారు.నీలా.౩.౪౬.
౩. పొందు, పడయు.
చ....దీనిఁ దాల్చి యి,ప్పడఁతులలోఁ గనుం
గొను మపారమహోమహిమానుభావముల్.
పారి. ౧. ౬౧.

కనుఁబాటు. వి. (కను+పాటు.) ౧.దృష్టి,చూపు.
గీ. శివుని కనుఁబాటు దాఁకనిచిత్తభవుఁడొ.
విక్ర. ౮. ౪౨.
౨. దృష్టిదోషము.
సీ.సుదతి నీమై చక్కఁ జూచుట·కో డేఁసఁ గనుఁ

బాటు వోరయునో యని తలంచి. భార. విరా. ౨. ౪౭.

**కనుఁబె(న్బె)ంటి.** వి. (√కను.) కాఁగలప్రయోజనమును సూచించు నొకానొక పక్షి, జీలుగుపిట్ట.

వ...గబ్బులుఁగు గాలి కనుంబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబు లై యున్నయవి. ఆను. ౬. ౬౬.

సీ. గొంగడి కక్కెర గొక్కెర గోరువంక పూరేడు కనుఁబెంటి నీరుకాకి. హంస. ౩. ౧౨.

సీ. వంగపండును గోరువంక కప్పెట సొట్టిపిట్ట పావురము కన్బెంటి మూఁగ, మొదలుగాఁ గల్గుపులుఁగులు....సుద. ౩. ౧౯౪.

**కనుఁబ్రాము, కన్నుఁబ్రాము, కన్ప్రాబము.** స. క్రి. (కను+ప్రాము.) కనుపులుము, మోసపుచ్చు.

క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహి వగుట నోర్వక నిన్నుణ్, గనుఁబ్రామి సంహరించిన, ననుఁ జెందునె దుష్కృతంబు నగచరతిలకా. రామా. ౫. ౩౧౬.

ఉ. ఆవసుదేవుఁ డెంతయు రయంబున నర్భకు నెత్తుకొంచుఁ దాఁ, గావలియున్నకంసునధికారుల నందఱఁ గన్నుఁబ్రామి దు,స్థావృతగేహముణ్ వెడలి....పద్మ. ౯. ౯౩.

శా. శ్రీరత్నాకరకన్యకారమణుఁ డారీతిణ్ జగన్మోహనా, కారోదార వధూవిలాసముల రక్షశ్శ్రేణిఁ గన్బ్రామి...దశా. ౫. ౩.

**కనుక(న్క).** అవ్య. ద్రు. ౧. కావున, కాఁబట్టి.

గీ. తొలుత మాటలుపడి పుల్లసిలినవాఁడు, గనుకఁ గొంకుచు...విప్ర. ౪. ౮౭.

౨. వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును.

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలమును, జేసిననాతపంబు రహిఁ జెందక నిష్ఫల మా...ఉ. రా. ౮. ౮౬.

౩. "చుమీ" అనునర్థ మిచ్చును.

సీ. తడికాళ్లతోఁ ద్రొక్కెడవుచుమీ యిదె కుశాస్తరణ మాత్మధ్యానసమయ మయ్యె, నెడలేదు వేష్టువ లిట రమ్ము ముట్టెదు గనుకఁ బ్రాతస్స్నానమునకు వలయు. విప్ర. ౩. ౭౭.

౪. అవధారణార్థకము.

సీ. బింబోష్ఠి నేఁ గన్కఁ బీతాంబరమ నైన మెఱసియుండుదుఁ గదా మేనినిండ. భాగ. ౧౦. ఉ. ౨౧౨.

**కనుకట్టు.** వి. (√కను.) ౧. కన్నులకుఁ గట్టెడు కట్టు, గంత.

వ....పద నగ్గలించి కూయుచుణ్ గడుపు నకనకంబడణ్ గనుకట్టుతోడ మోములు మలంచుచు...మనుచ. ౪. ౨౭.

౨. ఇంద్రజాలవిద్యావిశేషము.

సీ. మేఁత లొసంగినఁ బూఁతలు పూసినఁ గనుకట్లొనర్చిన గాత లిడిన, మందులు పెట్టిన ...మంత్రతంత్రములఁ బన్నిన...ప్రబంధ. ౭౩౮.

**కనుక(న్క)ని.** వి. ౧. సంభ్రమము; వెఱపు, భయము.

చ. ఘనుఁడు వృకోదరుండు దనుఁ గట్టలుకం దలపడ్డకోటికా, స్యనితురగంబులం దునిమి సూతునికంఠముఁ ద్రుంచి నైచి తీ,వ్రనిశితమైనప్రాసమున వానియురంబుఁ బగిల్చి చంపినం, గనుకనిఁ బాఱె భీతి యొసఁగంగఁ దదీయచమూసమూహముల్. భార. అర. ౬. ౨౩౧, అశ్వ. ౪. ౧౨౩.

క. దినదినమున కతిపమదిణ్, ఘనగరిమణ్ మరుఁడు దఱుమఁగా రతులతతిణ్, దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁ బోలెణ్. కళా. ౭. ౧౫౮. (చూ. ౧౫౫.)

వ. తత్పరిజనంబు లందఱు నశనిపాతంబున బెదరి

చెదరినట్లు గనుకనిం బఱచి రయ్యేకస్తంభ హర్మ్యంబును దక్షుపవిషాగ్ని దగ్ధం బయ్యె ...భార.ఆది. ౨. ౨౦౦.

శ్లో. భయాత్పరిత్యజ్య దిశః ప్రపేదిరే. సం. భార. ఆది. ౪౪. ౪.

ఉ. సిగ్గునపం బికాపికలు...శంకలకుఁ గన్కని ... అగ్గజయానపం బతికి నయ్యె యథేష్ట రహఃప్రసంగముల్. కవిక. 3. ౨౪౯. (కన్కని:-భయహేతువు.)

౨. తీవ్రత; అభినివేశము, పట్టుదల.

క. తనకొడుకుఁ బెక్కురథికులు, గనుకని నొప్పింప...చిత్రభా. ౭. ౯౭.

చ. కనుకనిఁ దెల్లవాఱుదనుకన్ రతిగోరెడు పల్లవాళి మే,ల్గనుఁగొని...వసుచ. ౨. ౧౧౨.

ద్వి. ...మాప్రాణంబులైన, విడుతుము గాక మా మడికూటివృత్తి,విడుతుమే యిది యేటివిపరీతవృత్తి, యనుచు బోయలు లేచి కనుకనిఁ బలుక. బస. పు. ౭. ౪౭౦పం. భా. రా. బాల. ౪౬౭.

3. జాగరూకత.

చ....ఆత్మపత్నులకుఁ గోర్కిగ నావరపాయసాన్నముం, గనుకని రెండుభాగములుగా నొనరించి తగంగ నందులోన్. భా. రా. బాల.౧౪౪.(కనుకని:-సరిగాఅనిభావము.)

చ. వనములఁ గొండలన్ గుహల వాఁగుల బావులఁ బల్వలంబులన్, ఘనతృణసీమలన్... పురంబులం,గనుకనిఁ జూచుచున్ వెదకి కానక చెచ్చెర వచ్చి...భా.రా.బాల.౬౨3.

**కనుకను(కన్గను.)** వి. ఔ. (కను+కను) ప్రతినేత్రము.

ద్వి. అనుచండ వాయువు లందంద విసరెఁ,గనుకను పెంధూళి గప్పె...రం. రా. బాల. ౭౭ పా. ౨౨ పం. (కనుకను=కంటిని కంటిని= అందఱకన్నులను.)

**కనుగ(న్గ)ంటన్**=కన్నార, ప్రత్యక్షముగా.

మ.... అంభోజగర్భాదులున్, దముఁ గావన్ హర లెమ్ము లె మ్మనిరివో తాఁ జూచి కన్గంట న,య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. భాగ. ౮. ౨3౯.

చ....ఈశ్వరుఁ గనుగంటఁ జూచిరఁట వారమృతాత్ములు గావు డొప్పదే. వ. సం. ౭. ౯౯౪.

ద్వి. కఱకంఠుమూర్తిఁ గన్గంట వీక్షించి. బస. పు. ౪. ౪౦౭పం.

**కనుకలి.** వి. (కను+కలి). చూపు, దృష్టి.

చ. వినుకలిచేతనే విరహవేదన నామది నింత వర్ధిలెన్, గనుకలి నట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం,బునఁ గడు నింతకెంత పరిపూర్తి వహించునో...ప్రభా. 3. ౨౫.

క. అనుమాన మేల నిజ మీ,ననఁబోఁడియె రుక్మబాహునందన యలనా,వినుకలియును గనుకలియును, మనమునఁ దలపోయ నైకమత్యముఁ గాంచెన్. చంద్ర. 3. ౧౪౫.

**కనుకుట్టు.** విశ. (√కను)-నేత్రబాధకుఁడు-బాధకుఁడు.

(చంద్రోదయవర్ణనము.)చ....విరాలికల్కిప్రో, గులకనుకుట్టు...రా. వి. 3. ౯.

**కనుకుట్టుఁదనము.** వి. (√కనుకుట్టు.) ఈర్ష్య.

వ...అవ్వదినెలు దమమఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబు గావింపం దలంచి...భోజరా. ౬. ౧౨౫.

**కనుకూ(గూ)రుక-(రుకు).** అ. క్రి. (√కను.) కనుమూయు, నిద్రించు.

చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గను
మూర్కొచుండ...రామా. ౨. ౯౭.

క. చని తత్కాళీగేహం,బున నొకమగనాలికూ
టమునకై కనుగూ,ర్కని యొక్క జారుతో
నిం,పునఁ బొదలుచు నుత్తరంపుమాల రమిం
చెన్. శుక. ౩. ౬౧౨. చంద్రా. ౩. ౪౯.

**కనుకూలి.** వి. ధాన్యరూపమైనకూలి. (శ. ర.)

**కనుగ(గ్గ)లుగు(ల్గు).** అ. క్రి. (కను+కలుగు.)
జాగరూకుఁడగు, అప్రమత్తుఁడగు.

ఉ. ఏమఱి రక్షసాలనిమృగేంద్రుని నక్కయుఁ
గోలుపుచ్చు సం,గ్రామములోనఁ గన్గలిగి
కానక తక్కిన నాశిఖండిచే,నీమనుజేంద్రుఁ
గోల్పడమె...భార. భీష్మ. ౧. ౭౦.

గీ. వింత పుట్టినఁ గనుగల్గి చింతసేయ,కుంట ...
వలదు పతికి. ఆము. ౪. ౨౫౨.

**కనుగి(గ్గి)లుపు=కనుగొలుపు.**
స. క్రి. (కనుసైగ చేయు.)

సీ. అని పల్కి క్రమ్మఱఁ జనఁజూచుచో దీవి
ఱేఁడు జోదులఁ గన్గిలిపి యదల్చు,టయు
...అచ్చ.రా. యు. ౧౨౫.

**కనుగి(గ్గి)లుపు=కనుగొలుపు.**
అ. క్రి. (కనుసైగ చేయు.)

వ...కన్నియ మొఱంగి యచ్చెలులు విభునకుం
గనుగిలిపి యొండొరు లోక్కొక నెపంబున
నొయ్యనొయ్యం జనిరి. రామా. ౪. ౧౫౬.

వి. కంటిని ఒకవిధముగాఁ ద్రిప్పుట.

సీ. కన్గిలు పనఁగను గన్గీటు విలసిల్లు...ఆం. భా.
౩. ౨౯.

**కనుగీ(గ్గీ)టు=కనుగొలుపు.**
స. క్రి. (కనుగొలుపు, కనుసైగ చేయు.)

సీ. అతఁడు మాండవ్యమహామునిప్రవరుని గను
గీటె నీ నెఱుంగవె యటంచు. హరిశ్చ. ౧.
౧౩౧. విప్ర. ౪. ౭౫.

వి. కనుగిలుపు. ఆం. భా. ౩. ౨౯.

**కనుగుఁజేఁప.** వి. మత్స్యవిశేషము. (శ. ర.)

**కనుగొ(గ్గొ)లుపు(ల్పు)=కనుగిలుపు,కనుగిలు
పు, కనుగీటు.** అ. క్రి. స. క్రి. (కను+కొలుపు)
కనుసైగ చేయు.

వ. నీమది నెఱుంగుదురు గాదె యనునెడ నీపవ
మాలిక కనుగొలిపి యెగఁగొలిపినఁ గలవాణి
మఱియు నిట్లనియె. మృ. వి. ౨. ౧౭.

క...తనమ్రోలం,గనుపట్టుననుఁగుఁబట్టిఁ గనుగొ
ల్పుటయున్....నీలా. ౧. ౭౪.

**కనుగ్రుడ్డు.** వి. (కను+గ్రుడ్డు.) నేత్రగోళకము.

క. ...మాయగోవు పడుచుం,గనుగ్రుడ్లం దిరుగ
వేసి కాలముచేసెన్...వరాహ. ౧౦. ౪౦.

క. అనినన్ విని తనయిరువది,కనుగ్రుడ్లన్ నిప్పు
లురలఁగాఁ ద్రిప్పుచు న,జ్జనకనృపాలాత్మ
జపై,ననిమిషరిపుఁ డపుడ చంప నలిగియు
నచటన్. రామా. ౬. ౧౬౭.

**కనుచీకటి=కనుమబ్బు.** వి. (√కను.) సంధ్యా
కాలమందలి లేఁజీకటి. (శ. ర, వా.)

**కను(న్ను)నీరు,కన్నీరు.** వి. (√కను). అశ్రువు.

సీ. కనునీళ్లు పులిమికొంచును బానశాలలో ము
చు గట్టించునమర్త్యకులము. కువల. ౩. ౨౦.

శా. తోరం బౌకనునీరు చన్నుఁగవయందున్
జాఱి జాల్వాఱఁ గ,న్యారత్నంబు ప్రసూ
నతల్పమునఁ దాపార్తిన్ వెసం దూలెడిన్.
ఇందు. ౨. ౧౭౭.

చ...కన్నునీరు గొ,బ్బున వెడలంగ...భోజరా.
౪. ౧౬౭.

వ....అలుక కన్గొనలకెలంకులం దొలంకఁ గన్నీ
ఱు మున్నీరై ప్రవహింప...రామా.౫.౧౭౩.

క. కన్నీరొలుకఁగ పగచిన,నన్నరపతు లెల్ల
నేడ్చిరి...భార. ద్రో. ౧. ౨౯.

**కనుప(న్ప)ట్టు.** అ. క్రి. (√కను.) చూపట్టు, కనఁబడు; గోచరమగు.

ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావిమో కనన్. భార. విరా. ౩. ౧౯౨.

మ. ఉడుమార్గం బఖిలంబు నున్ననయి శాణోత్తేజనం బొంది పుల్కడుగంబడ్డనిశాతఖడ్గము క్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨. ౨౫.

చ. ...పా, యనియనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు...పారి. ౧. ౧౧౭.

**కనుప(న్ప)డు.** అ. క్రి. (కను+పడు.) చూపట్టు, కనఁబడు.

క. అని సిద్ధురాలు సెప్పినఁ, బొనపొనగా భ్రమలు చెందఁ బులకలు వొడమెన్, మనసిజశిఖి యెనసినచోఁ, గనుపడుధూమాంకురములగతి నృపుమేనన్. హంస. ౧. ౬౫.

సీ. పాంకంబుగా నూనె పంకించి సవరంబుకుప్పెగన్పడ గొప్పకొప్పు వెట్టు. శుక. ౩. ౩౫౮.

**కనుపా(న్పా)ప, కంటిపాప.** వి. (కను+పాప.) నేత్రావయవవిశేషము. (కంటిలోని ప్రతిమ-శ.ర.)

మ. కనుపాపల్ పయిఁ ఱెప్పలన్ గదియ...మనుచ. ౫. ౭౮.

ఆ. స్థూలము కనుగ్రుడ్డు సూక్ష్మంబు కన్పాప, కంటిపాప నుండుఁ గారణంబు, కారణమున బ్రహ్మకళ వెలుంగఁగవలె, విశ్వ...వేమన. ౧. ౯౮.

**కనుపాలవిత్తులు.** వి. బ. కుళుత్థాంజనము. (శ.ర.)

**కనుపు(న్పు)=గనుపు.** వి. వెదురు చెఱకు లోనగువానియందు నెడనెడ నేర్పడియుండు గ్రంథి, పర్వము.

సీ...కన్ను కనుపు గంటు గను పంచనఁగఁబర్వ, మమరు...ఆం. భా. ౨. ౬౮.

గీ. జగతి ధర్మార్థకామమోక్షంబు లనఁగ, వఱలు నాలుగుకనుపులచెఱకుఁగోల, యాది తుది నీరసంబు మధ్యద్వయంబు, సార మంత్రు కుయుక్తి దుర్జనులు గలిగి. దశా. ౧౦. ౯౯.

(అండలమువర్ణనము.) సీ. శిరసెత్తు మునివ్రేలిపరుస కన్పులు గల్గుబలుకొమ్ము మగరాలపసుల పైఁడి, సింహలలాటంబు...దశా. ౬.౧.౨౯.

కనుపులవిలుకాఁడు = చెఱకువిల్తుఁడు, మన్మథుఁడు.

క. కను మూసినఁ గను విచ్చినఁ, గనుపులవిలుకాని వ్రాయఁ గణఁగిన నేవే, ల్పును దలఁచిన రాపట్టియ, కనుపట్టెడు నెట్టు లోర్వఁగలఁ గలకంఠీ. రా. వి. ౮. ౨౨.

జ: కనుపుకొట్టు, కనుపులగుండ్లు.

**కనుపుకొ(గొ)ట్టు.** స. క్రి. (కనుపు+కొట్టు.) ఖండించు; సంహరించు.

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్నకవ్వడిం గనుంగొని. భార. ద్రో. ౩. ౧౫౯.

వ. కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల డొక్క యని యేరుపాటు లేక పండం దఱిగినయట్లున్నయెడలును... భార. భీష్మ. ౩. ౨౮౭.

వ...అప్పుడమి ఱేనిముందట నిలిచి పని యేమి పనుపు మనిన నతండు ప్రీతుండై కళ్యపాటులం గనుపుగొట్టు మని పనిచిన నది వార లున్నెడ కరిగి పోయె...భార. అను. ౩. ౨౨౦.

**కనుపులగుండ్లు.** వి. బ. (కనుపులు+గుండ్లు) మణిమయమైనహస్తభూషావిశేషము. (శ. ర.)

**కనుపె(న్పె)ట్టు.** స. క్రి. (కను+పెట్టు). ౧. ఆలోచించు, పరిశీలించు.

గీ. పరుఁడ నగునాకు నక్షరపురుషునకును, భేదమేమియు లేదు కన్పెట్టి చూడఁ, గలదె వేఱెంచుకయిన లోకమున ముఖ్య, బింబమునకును దత్ప్రతిబింబమునకు. సీతారా. ౨. ౧౦౨.

౨. కాచు, రక్షించు.

క. అట్టిశఠి విభుఁడు మాలో,నిట్టటు సేయుమ నవున్కి నీసొమ్ములు గ,న్నెట్టుకొనియున్న వారము,పట్ట వెఱచి యింక మీకు భారంబని నన్. పరమ. ౩. ౫౩.

అ. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు.

ఉ.....బెట్టు కూ,పెట్టుచు నిట్లు పోరఁ గనుపెట్టుక యొక్కరుఁ డుండి....ఆము. ౬. ౨౦. కళా. ౫. ౧౯౭.

**కనుపొట్టలు.** వి. బ. (√కను). కంటిఱెప్పలు. (వ్యవ) వానికనుపొట్ట లుబ్బినవి.

**కనుబడి.** వి. (√కను). ౧. రాబడి.

సీ. ఒకచాయఁ గరణకుల్ సకలదేశంబుల కనుబడికవిలెలు వినికి సేయ. భోజసుతా. ౧. ౧౧౮.

౨. ఉత్పత్తి. (శ. ర.)

**కనుబేటము.** వి. (కను + బేటము - క. కణు = కన్ను, బేటము = వలపు, మోహము.) చక్షుఃప్రీతి, చూచుటవలనఁగలుగు అనురాగము.

మ. కనుబేటంబున గాట మైనహృదయగ్లానిం బయోజాస్య యి,ట్లునికి న్నెచ్చెలు లిచ్చ నొర్చి తమలో నూహించి శీతక్రియల్, పొనరింపన్ సమకట్టి... దశకు. ౩. ౧౨౩.

క. ...ప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురికా,దట నపుగుదెంచి యొకచెం,గట నుండెన్ దెలియరాని కనుబేటమునన్. ద్వా. ౧౨. ౩౦. కు. సం. ౧౦. ౩౯౭.

**కనుమ.** వి. (క. కణమె.) ౧. రెండుకొండలనడిమి సందుత్రోవ; కాంతారము.

ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ,లార్పఁ బనిచి కనుమలందు నిలువ, వేఱు వేఱ యేర్చి విలుమందిఁ బనిచి... ఆము. ౩. ౨౭.

వ. భల్లుకంబులయాక్రోశంబులం బెదరి గుములు పాసి యిఱుకటంపుఁగనుమ తెరువులం బఱచుతఱి బలుపలుఁగుటాత్రొక్కటంబులం గిట్టలు పగిలి... చాఁపకట్టుగాఁ బడుసారంగంబులకు నిర వైనపట్లును...చంద్రా. ౨. ౯౮.

సీ. ... కనుమ యనినఁగాంతారమగు ... ఆం. భా. ౨. ౯.

౨. సందు; బిలము, కన్నము.

వ. ప్రవాహంబు నిజప్రవహణగుణంబు విడువక ప్రవహణద్వారంబు వెదకుచుం జిరకాలంబు నిలిచియేనియుం గనుమ గలిగినఁ బ్రవహించుచందంబున....కవిక. ౮. ౧౨౦.

సీ. కన్న మనంగను గనుమ యనంగను గ్రంత యనందగు...ఆం. భా. ౧. ౧౮౫.

చ. అని నియమించి దానిశిర మంజక యొక్కకరండనిగ్రహం, బనువుగఁజేసి యాఖునకమప్పుడ పోయె ననంతరంబు లో,చనములు విచ్చి చూచి మది సంతసమున్ వగపుం దలిర్ప నా,కనుమన తాను నేఁగి భుజగం బొకబొక్క వసించి యాత్మలోన్. కేయూర. ౮. ౧౧౦.

**కనుమబ్బు** = కనుచీకటి. (కను + మబ్బు.)

ఉ. ...పల్లవా,లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుమబ్బునఁ డక్కుఁ బెట్టి తు,చ్ఛాంగన రథ్య నేఁగె నెదురై పతి కన్నులు గోరగింపఁ గన్. వేం. పంచ. ౧. ౨౮౬.

**కనుమ(న్మ)రి** = కమ్మరి, కరుమలి. వి. ఇనుపపనివాఁడు, అయస్కారుఁడు.

సీ. కమ్మరి కనుమరి కరుమలి యనఁగాను మీఱుచుండును నయస్కారసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౭౮.

ద్వి. మును జీవ మనులోహమునకు జ్ఞానాగ్ని, నొనరఁగఁ బద నిచ్చు కనుమరి యతఁడ. బస. పు. ౮. ౬౬ పం.

వ. కన్మరి...దా. శా. ౮. ౧౩౭౮.

**కనుమఱుఁగు(వు).** వి. (√కను.) ౧. ఆటంకము.

ద్వి. ననుఁ గాంచఁ గోరుసీనవ్యదృష్టికిని, గను

మఱుఁ గింతయుఁ గలుగదు బసవ. ప్రభు. ౮. ౧౧౨ పా. ౮ పం.

౨. కన్నులకుఁ గట్టెడిగంత.

ఉ. చెంగటఁ బాలుఁ జేల్లఁ గని చేతులసన్నల నె
డ్లనిల్పి సి,వ్వంగులబండ్లు డించి లేగ వానికిఁ
గన్మఱుఁగుల్ దెరల్చి యా,ముంగలఁ బాఁ
జూపుటయు...యయా. ౨. ౧౬.

కన్మఱువుసేయు=కనఁబడకుండఁజేయు.

ఉ. చేరువవానిఁ గన్మఱువు సేయుచు...చీకు
వాలు పెం,పారె జగంబు బెగ్గలము నచ్చెరు
పాటును బొంద సాంద్రమై. దశకు. ౬. ౬౦.

**కనుమఱుపడు.** అ. క్రి. (కనుమఱుఁగు+పడు) కంటికిచాటగు, దాఁగుకొను.

క. కని కడపిపుచ్చువారును, గనుమఱుపడువా
రుఁ బరులఁ గనుఁగొనువారుం. కు. సం. ౨. ౨౧౪.

**కనుమాపు.** వి. (కను+మాపు) కొంచెముమాయుట.

కనుమాపుమాయు=కొంచెముమాయు.

ద్వి. కలకల మని పక్షిగణములఱంతు,గలిగెఁ జం
ద్రునికాంతి గనుమాపు మాసె. ద్వి. సారంగ. ౩. ౯౯ పా. ౬ పం.

**కనుమాయ.** వి. (కను+మాయ) కనుకట్టు.

గీ. రంగమధ్యంబునందుండి రాజుదెసకు,నుఱుకు
కృష్ణు వేగస్ఫూర్తి యొక్కరుండుఁ, గాన లే
కున్కిఁ గనుమాయకరణి యయ్యెఁ, గంసు
ముందర నిలుచుండఁ గనిరి పిదప. హరి. పూ. ౯. ౧౩౪.

**కనుము[1].** వి. (వృత్తియందు'ము'వర్ణమునకు 'ప' వర్ణమువచ్చును.) శిరము, కొల్లుకీ.

సీ....కనుపపూబంతి...శివరా. ౧. ౬౧.

గీ. కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్నచోటు.
మనుచ. ౨. ౯. హంస. ౪. ౮౮.

**కనుము[2].** వి. మకరసంక్రమణ గ్రహణ శవదహన గ్రామదహనశక్త్యుత్సవదినములకు తరువాతిదినము.

**కనుమూయు.** స. క్రి. (√కను). వంచించు.

సీ. కపురంపుఁబలు కంచుఁ గనుమూసి కటకటా
బూది గప్పిననిప్పుఁ బాదుకొల్పి. గీ. ...వె
తలఁ బెట్టంగఁ బని యేమి వెలఁదులార. చంద్రా. ౮. ౧౬౭.

**కనుమూ(న్మూ)సిగంత.** వి. (√కను.) ౧. కన్నులు కప్పుటకై కట్టెడితోలుబిళ్ల.

సీ. చంద్రికాపాయికంచంబులోపలిరాయి కౌశి
కావళికిఁ గన్మూసిగంత. గీ. ...అరుణుఁ డుద
యించె...చమ. ౩. ౮౦.

౨. దాఁగిలిమూఁతలు, కన్నులు గప్పియాడెడు ఒకానొకఆట.

మ. ...ఓ,మనగుంటల్ కనుమూసిగంతె నలుగం
బాలాట లోనైనఖే,లనముల్ మీఱంగ బోట్ల
తో నలరు బాలారత్న మెల్లప్పుడుం. కళా. ౬. ౨౦౨. ఆం. భా. ౨. ౩౦౭.

**కనుమొ(న్మో)ఱఁగు.** స. క్రి. (√కను.) వంచించు.

మ. సిరి నొక్కప్పుడు కన్మోఱంగి హరి దస్వైరం
బ్రహర్షించును,ర్వరకుం....ఆము. ౧. ౨.

**కనుమోడ్చు(డుచే)** = కన్ను మొగుచే. (√కను.)

(నిద్రించు.)

గీ. పన్నగనగాధ్యుఁ డే నింత కన్నుమోడ్చు,
తఱిని గలలోన నెదుటఁ బ్రత్యక్షమయ్యె.
రా. వి. ౧. ౧౪.

**కనుమోసము.** వి. (√కను.) చూపుతప్పు, దృష్టి ప్రమాదము, లక్ష్యము తప్పుట.

క. వాసవనందనుఁ డెంతయు,గాసిలి యున్నాఁ
డు మనలఁ గని యించుకయుం,దా సైరణ
సేయఁడు గను,మోసము లే కొక్కమొగిన
మసరఁగవలయుం. భార. విరా. ౮. ౨౩౦.

**కనుతెప్ప.** వి. (కను+తెప్ప.) కంటితెప్ప.
సీ. కనుతెప్ప లిడ నెఱుంగనిచూడ్కిఁ జూచు
చు జిగివీఁపుదోఁప బోరగిలఁబడుచు. కవిక. ౧. ౫౪.

**కనువిందు.** వి. (కను+విందు) నేత్రోత్సవము, కన్నులపండువు.
క. దినముఁ గనువిందు చేయఁగ, మునిగృహముల
వన్యభోజ్యములఁ దృప్తుండై, మనుతనయుం
డు... కకు. ౧. ౧౬౦. శుక. ౧. ౨౭౪.

**కనువినికి**=కన్నువినుకలి. (కను+వినికి.)
సరసిజవృత్తము. కప్పఁగఁ దోలుఁ గొప్పున
జాలుఁ గనువినుకులయొడికములగుసరులుఁ.
యయా. ౨. ౪౬. అచ్చ. రా. సుం. ౧౭౧.

**కనువెచ్చ.** వి. (కను+వెచ్చ) కంటివేఁడిమి.
సీ. వలరాచరాచవాఁ డలికాతుకనువెచ్చఁ గ
రఁగినయలకనికరపుఁజోటు. మనుచ. ౨. ౯.
విణ. నులివెచ్చ. (శ.ర.)

**కనువెలుఁగు.** వి. (కను+వెలుఁగు) కంటికి వెలుఁగు. (కంటికి వెలుఁగువంటిది, మార్గదర్శకము అని భావము.)
క. కనువెలుఁగు నీవు గా నీ, వెనుక భవస్మతమ
యూఁది వీరలు నేనుం, జనుదెంచెద మాఱు
ట నెల, కొన వృషభముపజ్జ నడచుగోవులభం
గిఁ. భార. ద్రో. ౧. ౬౬.
చ. అనిమిషవాహినీతనయుఁ డస్త్రగురుండును
నీకు నెప్పుడుం, గనువెలుఁగై చరింతురు వికర్ణుఁడు గర్ణుఁడు దుస్సనేనుఁడుఁ, నిను నొక
యప్డుఁ బాయరు... భార. శల్య. ౨. ౪౦౩.
క. ఆవెలుఁగు గనువెలుంగుగఁ, దా వెలసినపుణ్య
మూర్తి ధర్మసుతుం డే, లా వెఱచు రణము
నకు... భార. ద్రో. ౧. ౧౦౦.

**కనువేఁదుఱు.** వి. (కను+వేఁదుఱు)-కనుపిచ్చి-చూచినమాత్రమున నే యావస్తువుపైఁగలిగినవల పు, వెఱ్ఱివలపు.
ఉ ....ఇంలకనువేఁదుఱు సెల్లునటమ్మ యింతికిఁ. మనుచ. 3. 33.

**కన్చెదరు.** అ. క్రి. (కను+చెదరు). చెల్లాచెదరగు.
మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ము
ల్దరం గూలెఁ గ, న్చెదరెఁ సైన్యము వ్రాలె
బాహువులు త్రెస్సె న్మాంసముల్ రాలెనం,
గదముల్.... కువల. ౨. ౧౪౬.

**కన్దెఱ.** వి. (కను + తెఱపి. ఇది వాతెఱవంటిది.)
కనుతెప్ప.
మ. మఱునాఁ డంధకభోజవృష్ణియదుసామం
తాగ్రణీసేనగం, దెఱ గా సాత్యకి రాముఁ
డుద్ధవుఁడు హార్దిక్యుండు లోనైనకొం, దఱ
మాత్యుల్ దనుఁ జుట్టి రా నమరె నాస్థానం
బునం గృష్ణుఁడు ... ఉ. హరి. ౨. ౭౪. (కంటికి తెప్పవంటిది-రక్షకము అనిభావము.)
విణ. (కను+తెఱచు) నేత్రములను తెఱచునట్లు చేయువాఁడు, నేత్రోన్మీలకుఁడు.
గీ. అఖిలజగములకన్దెఱ యగుచు జనస, మాజకర
పుటహృదయసరోజములకు, ముకుళనంబును
జృంభణంబును నొనర్చి, భానుబింబంబు పూ
ర్వాద్రిపై వెలింగె. భార. విరా. ౨. ౨౪౧.
గీ. సృష్టికన్దెఱ తొలుసంజచెలిమికాఁడు...అరుణుఁ డుదయించె ... కాశీ. ౧. ౧౨౧. (చి. ని. పా)

**కన్న.** ప్ర. ద్రు. (కు+అన్న) కంటె. (ఇది పంచమీవిభక్తి ప్రత్యయము.)
క. నిన్నుఁ జెఱగొన్నహైహయు, కన్నఁ దోర్వీ
ర్య మెక్కు డగుభార్గవుఁ, ల న్నిర్జించినరా
ముని, కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁ
డే. చమత్కారరామాయణము. అప్ప. 3. ౨3౭.
ఉ. ...చంద్రుప్రతికోటి మొగం బెలదేటిధాటిక, న్నం గడుమేటి వేణి పులినంబులసాటి

పిలుండయారె...విజ. వి. ౧.౧౪౦. ప్రబో ధ. ౪. ౩౬. వసు. ౨. ౪౬.

కన్నకొడుకు. వి. ఔరసపుత్త్రుఁడు. ఆం. భా. ౨. ౧౧౧.

కన్నగాఁడు. వి. (కన్నము + కాఁడు) ఖనకుఁడు, కన్నము వేసి దొంగిలించు దొంగ.

మ. తలపోయం దమపంచలిన్నియలమీఁదన్ జంగముల్ వోలె నిచ్చలుఁ దొంగుండెడు కన్నగాండ్రు విని రాజద్వారముల్ సొచ్చి కా, వలి కాండ్రం గనుఁ బ్రామి. కాళ. ౪. ౫౨.

సీ. అంపవోయిన కాంత బొంక శంకించు నే కత్తి యేమటిలు నే కన్నగాఁడు. రామలిం. ౧౧౧. ఆం. భా. ౨. ౨౯౧.

కన్నడ[1]=కన్నడవు, కన్నడుగు. వి. ఉపేక్ష; అనాదరము, తిరస్కారము.

క. లాలన సేయవు నన్నుం, గేళీసంగతుల బుజ్జగింపవు నీపై, హాళిం జిక్కిటిఁ గన్నడ, యేల దయం జూడ వాఁలి నే మునినాథా. విప్ర. ౩. ౭౭.

కన్నడ చేయు, కన్నడ యొనర్చు=ఉపేక్షించు; తిరస్కరించు.

ఉ. ఆసరసీరుహాక్షిపయి నాసల నాసరివారు నవ్వను, బ్బాసిల ధైర్యలక్ష్మి విడిచి వాసనవింటివజీరు నమ్ములన్, గాసిలుచున్న వాఁడ ననుఁ గన్నడ చేసె విధాత యయ్యయో, దోసము గాదొకో తనపుఁ దొయ్యలి నీయక యిట్టు లేచుటల్. అహ. ౨. ౭౧.

సీ. ఒకనిమాటున వైరి నుక్కడంగించిననరు శౌర్య మెన్నఁ గన్నడయొనర్చి. చంద్రా. ౧. ౨౧.

జ: కన్నడించు[1], కన్నడీఁడు[1].

కన్నడ[2]. వి. (సంగీ) ఇరువదినాలుగు స్త్రీ రాగములలో నొకటి.

గీ. ...పూర్వ, గౌళ సారంగ మంగళ కౌశికులును, గన్నడయుఁ జాయయును గౌళ కడు నపూర్వ, మైనభల్లాతకియును నారాయణియును, గ్రమత నిరువది నాల్గు స్త్రీరాగములును. ప్రబంధ. ౯౪. హంస. ౪. ౧౨౩.

కన్నడగౌళ. వి. (√కన్నడ[2] ?)-సంగీ- రాగములలో నొకటి.

ఉ. భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా, గౌరి బిళాహురి లలిత కన్నడగౌళ ముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరి బేగడా, యారభి రామఖల్లి మొద లైతగు రాగము లింపు మీఱఁగన్. చెన్న. ౨. ౨౩౬.

కన్నడము. వి. (సం. కర్ణాటః, క. కన్నడవు, త. కన్నడం-వృత్తియందు వైకల్పికముగా మువర్ణలోపము.) ౧. కర్ణాటదేశమందలివారు మాటలాడు భాష, కర్ణాటభాష.

గీ.... అఱవమ్ము తెనుఁగు, కన్నడం బన మఱియిట్లు కొన్ని దేశ, భాషలై యొప్పు... ఆం. భా. ౧. ౧౧౦.

౨. కర్ణాటదేశము.

ఉ. కన్నడరాయ యక్కడవఁ గప్పు ప్రియా పరిభుక్తభాక్కృఙ్. ఆము. ౧. ౧౪.

జ: కన్నడించు[2], కన్నడీఁడు[2].

కన్నడ(త)వు=కన్నడుగు. వి. కన్నడ, ఉపేక్ష; తిరస్కారము.

కన్నతవుసేయు = తిరస్కరించు.

గీ. కన్నతవు సేయుఁ గచ్ఛపాకారగరిమఁ, గరిమ రాతకయాన నీచరణమహిమ. వసు. ౪. ౭౬.

కన్నడవు చేత=ఉపేక్ష చేయుట.

మ. మొగమోటంబున నుండఁగాఁ జనదు నంబుల్ దుండగీ లింత కేఁ, పగిదిన్ వచ్చు సువర్ణపాత్రము గణింప న్నీంద్రచే నాగతిం, దగఁ జెప్పింపక నీవు కన్నడవు చేతం బట్టి ప్రార్థించినన్, మిగులం గొర్లుదుఁ గాక తాను

... కొనఁజాన్మో యన్న భీతాత్ముఁడై. చిత్ర. ౫. ౨౧.

**కన్నడి.** (క.కన్నడిగ.)వి=కన్నడీఁడు౨. (శ. ర.)

**కన్నడించు¹.** స. క్రి.(√కన్నడ¹.)ఉపేక్షించు. (శ. ర.)

**కన్నడించు².** స.క్రి.(ఇది 'తెలిఁగించు'వంటిది?-√ కన్నడము) కన్నడభాషలోనికి మార్చు. (ప్రా.)

**కన్నడీఁడు¹.** విశే. (కన్నడ¹+ఈఁడు.) ఉపేక్ష చేయువాఁడు. (శ. ర.)

**కన్నడీఁడు².** వి. (కన్నడము+ఈఁడు.) కన్నడ దేశపువాఁడు, కర్ణాటకుఁడు.

సీ. కన్నడీఁ డనఁగను గర్ణాటకుం డొప్పు...ఆం. భా. ౨. ౧౦౩.

సీ. ఆరెలు గన్నడీలరవలుం దెలుఁగులుఁ దనబిరుదందియం దగిలి కొలువ. ద్వా. ౧. ౪౨.

**కన్నడుగు(ఘువు)**=కన్నడవు.

కన్నడుగు(ఘువు)సేయు=ఉపేక్షించు; తిరస్కరించు.

క. ఇన్నాళ్లు నన్ను మిక్కిలి,మన్నన గావించి చాల మంచిన నీవే,కన్నడుగుసేసి తే మని, విన్నప మొనరింతు నీకు విబుధాధిపతీ. వాల్మీకి. ౩. ౩౩.

సీ. కరభోరుయుగళ నీకలికిలేఁదొడలు భద్రకరంబు లన నుచితంబులమ్మ. గీ. కంతుచక్కఁదనంబు జయంతుసొగసు, నలపసంతునివింత యొయారిపంతు, కన్నఘువుసేయునారాయవన్నెకాని,బిగువుకౌఁగిలి నీకు లభించెనేని. చమ. ౨. ౯౭.

**కన్నది.** వి. (కన్న+అది.) తల్లి, మాత.

సీ....అమ్మ కన్నది,తల్లి యవ్వ నా మాత పేళ్లమరు. సాం. ని. మాన. ౩.

**కన్నపె(వె)ట్టు.** అ. క్రి.(కన్నము+పెట్టు) కన్నము వేయు.

క. మీనీటిమ్రుచ్చు లేవురు,మానీటం గన్నపెట్టి మణిభూషణముల్,గోవతనంబునఁ దెచ్చిరి. దశకు. ౪. ౨౪.

స.క్రి. కన్నము వేసి దోఁచుకొను; అపహరించు.

ఉ. ... తక్కనట్టినా, నాధనసంపదాఢ్యసదనంబులు నిత్యము కన్నపెట్టుచుక్, సాధువిధిం బ్రవర్తిలఁగఁ జల్పె దినంబును వైష్ణవార్చనల్. పరమ. ౪. ౧౯౫.

గీ. ఫాలలోచనఫాలకరాళనేత్ర,కీలికీల లనంగ మిక్కిలి తపోగ్నిఁ, దనరియున్నారు వీరల ధైర్యధనము, కన్నపెట్టఁగఁ జాలఁడు కంతుఁ డనుచు. ఘటికా. ౨. ౧౪౭.

**కన్నపోవు.** అ. క్రి.(కన్నము+పోవు) కన్నపెట్టఁబడినదియగు.

వ. నాగపట్టనప్రసిద్ధబుద్ధాయతనంబు గన్నపోయె. పరమ. ౫. ౧౫.

**కన్నమిడు.** స. క్రి. (కన్నము+ఇడు). ౧. కన్నము వేసి దోఁచుకొను.

మ. ఒకనాఁ డేగురుదొంగ లంతికమునం దొప్పారుమందారనా,మక మాదుర్గము లీలనేలెడు మహాక్ష్మాపాలుఁ డాజీవర,త్నకుక న్యాసదనంబు కన్నమిడువాంఛక్ వచ్చి...ద్వా. ౧౦. ౧౧౫.

౨. కన్నము కలదానినిగాఁజేయు.

క. మామందిరంబుకుడ్యం,బే మిరువురుఁ గూడి కన్నమిడి యడుగులచొ, ప్పేమియు నెఱుఁగక యుండం,గా మాటితి మప్పు డేను గడుసుత్సుకతక్. దశకు. ౬. ౬౨.

**కన్నము.** వి. (క. కన్న). రంధ్రము, బిలము; దొంగలు త్రవ్వెడుసొరంగము.

ఉదా: ఎలుకకన్నము.

ద్వి. గడియకన్నంబును గడపకన్నంబు. బస.పు. ౫. ౩౪౦.

జ: కన్నగాఁడు, కన్నపెట్టు, కన్నపోవు, కన్నమిడు.

**కన్నయ్య[1].** వి. (కన్న+అయ్య.) తండ్రి, జనకుఁడు.

సీ...తండ్రి,యబ్బ కన్నయ్య నాయన యయ్య యప్పన జనకాఖ్య లగు...సాం.ని.మాన.౩.

**కన్నయ్య[2].** వి. (సం. కృష్ణః.ప్రా. కణ్హో-కన్నఁడు +అయ్య) కృష్ణుఁడు. (శ. ర.)

**కన్నర.** వి. (త. కణ్ణరావి=౧. దుఃఖము. ౨. దురవస్థ.) దురవస్థ; దుఃఖము, కష్టము. (కన్నఱ అని చి. ని, శర. కాని తమిళమును బట్టియు 'కన్నరె' క్రిందనీయఁబడిన యనుప్రాసమునుబట్టియు సాధురేఫముతో గ్రహింపఁబడినది.)

ఉ.అన్న మునీంద్రపుత్త్ర మృగయాక్రియ యింతకుఁదెచ్చె నన్ను ము,న్నెన్నిట నోమి కాంచిరొ సమిద్ధతపఃఫలసార మైనయు,ద్యన్నయశీలు నిన్నుఁ దలిదండ్రులు వారెట నున్నవారొ యీ,కన్నర చూడఁ బాలయితిఁగా విధి నేవిధి దూఱ నేరతుఁ. రామా. ౨. ౪౧. (కన్నడ-ముద్రి.)

క. మన్నులు రేఁగఁగ నేనుఁగు,మన్నీఁ డడవిఁబడి యెండమావులు ద్రావం, గన్నరఁ బఱచుచు నడియా,స న్నొగులుచు వ్రాలి సోలి జాలిం బడుచుఁ. వాల్మీకి. ౧. ౯౫.

జ: కన్నరి.

**కన్నరి.** విణ. (√కన్నర) దుఃఖితుఁడు.

(గరుడుఁడు) వ...నిర్జరులు జర్జరులుగా మేఘంబులు మోఘంబులుగాఁ గిన్నరులు గన్నరులుగా భూతంబులు భీతంబులు గా...అరుగునట్టియెడ...ఉ. హరి. ౬. ౨౮.

**కన్నవిటి.** విణ. (కన్ను+అవిటి.) చీకు,అంధుఁడు.

క. చెవిటికి శంఖధ్వని క,న్నవిటికి దీపంబు షండుఁ డగుపురుషునకుఁ, యువతియు ఖలునకు నుపకృతి,శవమున కిడుభూషణములు జగతి వృథ యగుఁ. భల్లా. ౪౮. (శ. ర.)

**కన్నాఁగు.** అ. క్రి. (కన్ను+ఆఁగు) నిద్రించు.

శా. అన్నా లక్ష్మణ భ్రాతృవత్సల దురంతాయాసఖిన్నుండవ,య్యున్నిద్రారహితుండవై యకటా ము న్నగ్రాటవీభూములం,దన్నం గొల్తు గదన్న నేఁడు రణశయ్యఁ భూవిభుండుండఁగాఁ, గన్నాఁగం దగునయ్య నీనిదురక్షుంగాలం బయోధ్యంగదా.భా.రా.యు.౫౮౪.

**కన్నాకు.** వి. (కను +ఆకు-ప్రౌఢవ్యాకరణము.) తములపాకులకట్టయందు మొదట నుండెడియాకు. (శ. ర.)

విణ. శ్రేష్ఠము; ముఖ్యుఁడు; నాయకుఁడు;అగ్రేసరుఁడు.

సీ. ...కన్నాకు మేల్బంతి ... ఆణి యంచనఁ దనరు శ్రేష్ఠము ...ఆం. భా. ౩. ౧౫.

క. చెన్నొందఁగఁ దనయింటికిఁ,గన్నాకయి మెఱసియుండుగాదిలితనయుఁ,జన్నములు సేయ నడవిన,యున్నాఁ డని విని దశాస్యుఁ డుద్యోగమునఁ. నిర్వ. ౫. ౧౨౮.

క. కన్నాకు మనకు భీష్ముఁడు...భార. భీష్మ. ౧. ౭౬.

సీ. ఎగుచుకూఁతలు ముట్టె యెత్తి బిట్టాలించి గమికిఁ గన్నాకయి గాలి యరయు. మనుచ. ౪. ౪౨.

**కన్నాత.** వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

సీ... మెడలపైఁ గన్నాత లిడి...ప్రబంధ.౯౬.

సీ. కన్నాత చాంగణ కందణంబు...గీ...అంజమెడపట్టు నాఁగఁ జెన్నలరుచుండు,ముప్ప

దియు రెండు విన్నాణములకుఁ జేళ్లు....ఆం. భా. ౨. ౨౦౯.

బ. ౧. రతిబంధవిశేషము.

సీ. కన్నాత లాఁగించి కాంతుమోము గదించి సారెసారెకు మోవిఁ జప్పరించి. శశాం. ౩. ౯౭.

౨. మల్లవిద్యావిశేషము.

సీ. కన్నాతలు పుటము లగ్గస్తాలు మండీలు దాళాలు డింకీలు దండెములును,లాఁగు లనంగను రాజిల్లుఁ దద్భేదనామధేయంబులు... ఆం. భా. ౨. ౨౦౪.

కన్నియ(న్నె)=కన్య. వి.(సం.కన్యా. క. కన్నె.)

౧. కన్యక, వివాహముకానిబాలిక; స్త్రీ.

సీ. కన్యాభిధానంబు కన్నె కన్నియ కన్య యన మూఁడుపేళ్లచే నమరి యుండు. ఆం. భా. ౨. ౧౦౬.

సీ. మునిదత్త మగుమంత్రమున గొంతి కన్నియనాఁడు వేడుక దిననాథుఁ దనకుఁ,బ్రత్యక్షముగఁ జేసి పడయుట...భార. శాం.౧.౧౬.

క. అచ్చిన్నికన్నెసోయగ, మచ్చెలువుం జిల్వచెల్వలందును మఱియ, య్యచ్చరచేడియలందును,నిచ్చలుఁ బరికింపఁ గలుగ.నేర దొకపుడున్. నీలా. ౧. ౫౮.

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలో నలసత్యభామ క,న్నన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన వింటఁ గాని యో,కన్నియ నీయెడం గలుగుగౌరవ మెందునుఁ జూచి కాన...పారి. ౧. ౬౫.

౨. కూఁతురు, పుత్త్రిక.

ఉ. పంచినకోపమున్ సమయభంగభయంబును నగ్గలించి యు,ల్లంబు పెనంగొనంగఁ బతులం దగ సభ్యులఁ జూచుమాడ్కి రూ,క్షం బగు చూడ్కి నాద్రుపదుకన్నియ నూచి ... భార. విరా. ౨. ౧౩౯.

ద్వి. కన్నెల నూర్వురఁ గడురూపవతులఁ,గనియె ... రం. రా. బాల. 33 పా. ౧౦౫౦.

విశ. ౧. మొదటిది, ప్రథమము. (చూ. కన్నెకయ్యము, మొ.)

౨. లేఁతది.

సీ. చిన్నికొమ్మల నించుకన్నెమామిడిచెట్టుఁ జేర్చి నీకును మెచ్చు సేయఁగలను. విప్ర. ౩. ౧౯.

వ. ఆసమయంబునఁ జెన్నలరుకన్నెవెన్నెలల వెన్నెలపులుఁగు లలముకొన్నచిన్నెల...ఘటికా. ౨. ౧౮౬.

౩. క్రొత్తది.

సీ.ధళుధళుక్కున నింగిఁ దాటించెఁ బలుమాఱు నీరాళ్లగొందిఁ గన్నియమెఱుంగు. పాండు. ౪. ౨౧.

క. ...కీర్తివిభవా,న్వితవిను మాకన్నెపాటని యథార్థగతిన్. హ. స. ౨.౬౪. (హరిశ్చంద్రకథయందు.)

కన్నెకూర్మి=ప్రథమానురాగము.

గీ. మాననీయశశాంకకోమలము లైన, యామినీసమయములుఁ బర్యంకములును, సాక్షులుగనొందు పలపంత జనవిభుండు,కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ. నైష. ౧.౭౮.

కన్నియతటి, కన్నియనాఁడు = కన్యగానున్నపుడు.

సీ. మంత్రబలంబున మార్తాండువరమునఁ గన్నియతటి గొంతి గన్నవాఁడ,వు ... భార. ఉద్యో. ౪. ౨౯.

సీ. కన్నియనాఁడు భాస్కరుని రావించితి వరమంత్రబలమున వచ్చి యతఁడు,సంప్రీతినొసఁగంగ జన్మించినాఁడవు...భార.ఉద్యో. ౪. ౫౯.

జ: కన్నియలేడి, కన్నెకయ్యము, కన్నెగోవు కోఁత, కన్నెబావి, కన్నెఱికము.

3. పలుకుటయం దగుననుకరణము.

క. మును గడియారంబునఁ గట్టిన పెనుజేగంటర
వము తే యనునెడ గ్రక్కున భోజుం డడు
గెత్తినఁ,గని నిలునిలు మనుచు బొమ్మ కల
కలఁ బలికెన్. ద్వా. ౨. ౧౭.

సీ. కలకలఁ బల్కుచిల్కలకొల్కిఁ దమజాతి
గాఁబోలు నని చిల్కకదుపు పొదువ. ఉ.
రా. ౬. ౨౭.

౪. నొప్పిగలిగించుటయం దగుననుకరణము.

చ ... కాయజునమ్ములగాయము ల్మదిం, గలకల
నొంప యామములు కల్పములై చెలి యుం
డె ఖిన్నతన్. అని. ౨. ౪౯.

కలకలలాడు=వికాసము కలదియగు.

ఉదా:-వాని మొగము కలకలలాడుచున్నది.

**కలకలము.** సం. వి. అ. పుం. ౧. గుంపునందుపు
ట్టినపెద్దమ్రోఁత, అలబలము.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు,
గొనుచు నులివు మిగులఁ గూడఁబాఱి,నృత్త
శాలఁ జొచ్చి రత్తఱి నాకల,కల మెఱింగి
కీచకవ్రజంబు. భార. విరా. 3. ౪.

౨. వీణాదులధ్వని.

క. తలిరాకుఁబోఁడి యొక్కతి,జలకమునకు వేళ
యనుచు శౌరికి వీణా,కలకలములఁ గలకల
నగు,పలుకుల మెల పొలయ విన్నపముఁ గా
వించెన్. పారి. ౨. ౫.

3. సజ్జరసము, నల్లమద్దిజిగురు, ధూపద్రవ్యవిశే
షము.

**కలకూజిక.** సం. వి. ఆ. స్త్రీ. కులట,ఱంకుటాలు.

శ్లో. ... లంజనీ తు స్యాల్లంజికా కలకూజికా.
(త్రి. ని.'కలకూలికా'అని పాఠాంతరము.)

**కలక్వాణము.** సం. వి. అ. పుం. ౧. దాత్యూహ
ము, కూకురుగుండెపెట్ట.౨.అళి,తుమ్మెద. (కే.ని.)

**కలగర.** వి. భృంగరాజము, గుంటకలగరకు.

ఆం.భా.౨. ౬౯. ('గలగర'అని బ్రా, చి. ని.)

**కలగలపు(ల్పు).** వి.(కలపు+కలపు.) ౧. కలుపుఁ
గోలుతనము.

సీ.పలువికారంబులఁ గలగల్పుఁజూపుల రాకపో
కల బయల్ ప్రాఁకఁజేయు. పాండు.3.౬౨.

౨. కొన్నికూరగాయలుకలిపివండినకూర.

సీ. ఒకకొన్నికలగల్పు లొకకొన్ని బజ్జులు ...
పాండు. ౪. ౧౮౪.

కలగలపు(ల్పు)నెయ్యి=నూనె మొదలగునవి కలు
పుటచే స్వచ్ఛముకానినేయి.(వా.)

**కలగుండు[1].** వి. (కలఁగుధాతువుయొక్క భావా
ర్థకరూపమగు 'కలఁగుడు' అనునది వర్ణవ్యత్య
యముచేత నీరూపము నొందియుండును.) కలఁ
త, క్షోభము.

కలగుండుగొను=క్షోభపడు, కలఁతనొందు.

ఆ. చేదిమగధకేకయాదిసేన,లెల్ల బెదరఁ దరలఁ
దల్లడపడఁ గల,గుండుగొనఁగఁ జేసెఁ గుంభ
జుండు. భార. ద్రో. ౧. ౨౯3.

సీ. జలరాసు లేడును గలగుండుగొని యొడగడ్డల
పై దొరగడలు దొడర. హరి.ఉ. ౯.౨౨౦.

కలగుండగు=క్షోభపడు, కలఁతనొందు.

మ. కలగుండై నెల వేది యిట్లు వరటాకారండ
వాదిద్విజా,వళి ఘోషించుటకన్న మున్న
... వసు. ౨. ౧౪౨.

కలగుండిడు, కలగుండు చేయు, కలగుండు(డ్లు)
వెట్టు=క్షోభపెట్టు, కలఁచు.

క. సొలవక నిలువక మఱియును, గలదిక్కుల నె
ల్ల లంకఁ గలగుండిడి...భా. రా.సుం.౧౧౫.

('వెదకుటచేత కలఁతనొందించు'అనిభావము.)

చ... కొన్నిదినము లేఁగ భీకరవనీకిటి యొ
క్కటి పక్కణంబులో, మదమునఁ జొచ్చి
యందుఁ గలమానవులన్ గలగుండు సేయు
చున్. చెన్న. ౨. ౭౭.

సీ. సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దాను

గురుసైన్యములఁ గలగుండువెట్ట. భార.భీష్మ. 3. ౬౪.

వ.... సురాసురం బైనజగంబు బిసతంతుగుణం బైనకోదండంబునం గలగుండ్లువెట్టునిట్టిజగ జెట్టియుం గలండే. హర. 3. ౯3.

కలగుండువ(ప)డు=కలఁగు, క్షోభపడు.

క. నిజసింహనాదమున న,గ్గజములు గుండియలు వగిలి కలగుండువడన్, విజయాగ్రజుఁ డ ల్లేచి... భార. భీష్మ. ౨. ౨౦౭.

వ...గుటగుటార్భటుల భటులం గలగుండుపఱ చి...రా. వి. 3. ౬౫.

**కలగుండు**[2]. వి. గండశైలము, కొండనుండి జాఱి పడ్డపెద్దఱాయి.

కలగుండుప(వ)డు=కలగుండ్లుకలదియగు.

సీ.కలగుండువడి కుంచెఁ గులమహీధరపంక్తు లా కులపాటొందె నఖిలతరులు. రామా. ౫. 3౧౨.

సీ. సకియురోజములసాటికి గహ్వరముఁ బూని కుధరపాళిక కలగుండువడియె. చంద్రి. 3. ౧౫.

**కలగూటులు**. వి. బ. (క.కల=కలిసిన.గుండ=సే వకుఁడు)వివిధసేవకులు. (ఈయర్థ మింకను విచా ర్యము.)

సీ. కలగూటు లొక్కవంకను దొలంగుచునుండ గొండ్లికాండ్రును గెలంకుల నటింప. విక్ర. ౫. ౧౦.

**కలగూర**. వి. (కలపు+కూర.) కలిసియున్న పలుర కములఆకుకూర, మిశ్రితనానావిధపత్రశాకము. (చి. ని.)

ఉ.కూలికి నూనె లంటి కలగూరలకై పాలమెల్లఁ జుట్టి ... వ్రాలుడుప్రొద్దుతోడ గృహవాటికిఁ జేరు నతండు నిత్యమున్. శుక.౨.3౬3.

జ: కలగూరగంప.

**కలగూరగంప**. వి. (కలగూర+గంప.) విషయ సాంకర్యము.

సీ...అత్రిమాని. గీ. శాస్త్రసాహిత్యములు మాకె చాల జిత మ,టంచుఁ గలగూరగంప సేయకు ము బాద,రాయణ కవిత్వసందర్భరసము ని లుపు,మనుచు దౌవారికద్వార మపుడు దాఁ టె. బహు. ౧. ౧౧౦.

**కలగొను**[1]=కలఁగు. అ. క్రి. (కలఁక+కొను.) క్షోభించు, వ్యాకులపడు.

గీ. పక్షిమృగజాతు లెల్లను భ్రమసి యిట్టు,న ట్టుఁ గలగొని చెదరె...భార.విరా.౪.౧౬౯. (శ. ర. పా.)

**కలగొను**[2].అ. క్రి. (కలపు+కొను) వ్యాపించు, క్రమ్ము.

చ. కలుషముతోడ లోకములు గాల్చుమహాప్ర ళయానలంబుపైఁ,గలగొని సప్తవారిధులు గ ప్పినభంగి మహేశువీర్య మ,గ్గలముగ నష్ట హోదయుని గ్రక్కున ముంచిన నాఁడె ... కు. సం. ౧౦. 3౭3.

చ. ... ఎక్కువివర్ణతతోన లోపలం, గలగొనె నారటంబు పులకంబులతోఁ బొడతెంచెఁ గంపమున్. ఉ. హరి. ౫. ౧౧౨. (శ. ర, వీ రేశ.పాఠములు.)

స. క్రి. కలియు, కూడు.

క. అలనాఁటినుండి ద్విజునిం, గలగొని యిట రాక యుండెఁగా దానికి నా, యిలవేల్పె యిలువేలుపు, బలభేదన యేమి చెప్పఁ బని యున్న దిఁకన్. నిరం. ౪. 3౧.

సీ. ఎలమావిలతలపైఁ గలగొనఁ దారుచుఁ జెలఁ గుచిల్కలకల్కిపలుకులకును. మార్క.౫.౭.

కలగొనన్=౧. బాగుగా, చక్కఁగా.

క. నెల నిండుటయును దనయి,ష్టుల కన్నము వె ట్టి పుణ్యుఁ డురుతరజన్మం,బులఁ బొందక హరిపదమునఁ, గలగొన బహుకల్పశతము

గాఁపురముండుట౯. పద్మ. ౧౧. ౫౦.నవ.౧. ౧౭౯. ౪౩౦.

౨. అంతటను; నల్దెసలకు.

ఆ.కడుపులోన నుండి కలగొనఁ బాఱెడు,విబు ధవైరిగురుఁడు వెడలకుండు, నట్లు గాఁగఁ దెరువు లన్నియు మూసి...అంగజన్మరిపుఁడు. భార. శాం.౫.౪౭౨.

చ. చెలువలు మట్టిమ్రానిపయిఁ జిల్కలు మూవి రమింప వానిను,క్కులు గని మట్టిపండు లని కోయఁగఁ బోయిన వారిహస్తముల్,ద లిరులు సావి కీరములు దండడిఁ గుట్టిన ముగ్ధ లందఱుఁ౯,గలగొనఁ బాఱి రో యిదియ కా టులమ్రా ననుచు౯ భయంబున౯. కు. సం. ౯. ౩౧౬.

**కలఘోషము.** సం. విణ. (అ. ఆ. అ.) అవ్యక్త మధురధ్వని గలది.వి. అ.పుం. ౧.కోయిల. ౨.అ వ్యక్తమధురధ్వని.

**కలజోవ్వి=కలుజోవ్వి.**

సీ. పతిమేన మకరికల్ వ్రాయని వేర్లను వే ళ్లే కలజువ్వి వేర్లు గాక. అహ. ౩. ౭౯.

వ. ... కలజువ్వి నెమ్మి జమ్మి మొదలగుతరుల... ఇందు. ౨. ౬౦.

**కలటము.** సం. వి. అ. న. ఇంటికప్పు.

**కలధౌతము.** సం. వి. అ. న. ౧. వెండి. ౨.బంగా రు. ౩. ఇం పైనస్వరము. (ఈయర్థమున 'కలధౌ తం కలధ్వనౌ' అని వి. ని. లో నపుంసకలింగము గాను 'కలధౌతం రౌప్యహేమ్నోష్షండస్త్రీస్తు కలధ్వనౌ'అని వై.ని.లో స్త్రీలింగముగాను కనఁ బడుచున్నది.)

**కలధ్వని.** సం. విణ.(ఇ)అవ్యక్తమధురధ్వని కలది. వి. ఇ. పుం. ౧. అవ్యక్తమధురధ్వని. ౨. పావుర ము. ౩. నెమిలి. ౪. కోకిలము.

**కలన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గ్రహణము, పట్టుకొను ట. ౨. జ్ఞానము. ౩. ఆదానము, స్వీకరించుట. ౪. ఆమోచనము, తొడుగుట, ధరించుట. ౫. అవమోచనము, సడల్చుట. (వాచ) ౬. చేత, పని. (విల్యమ్సు)

**కలనము.** సం. వి. అ. పుం. వేతసము, ప్రబ్బలి౯. న. ౧. చిహ్నము. ౨. దోషము. ౩. గ్రహణము, పట్టుకొనుట. ౪. గ్రాసము, కబళించుట. ౫. జ్ఞా నము. (వాచ)

**కలనాదము.** సం. విణ. (అ.ఆ.అ.)కలధ్వని కలది. వి. అ. పుం. ౧. రాజహంస. ౨. కలధ్వని.

**కలనితబిసి.** వి. (√కలను) - కలహప్రియుఁడైన ముని-నారదుఁడు.

కలనితబిసితల్లి=నారదునితల్లి, సరస్వతి.

క. పలుకుఁజెలి లచ్చికోడలు, కలనితబిసితల్లి తూఁటిగాసపుఁదేజీ, గలబోటి యనఁగ భా షా,జలజాక్షికిఁ బేరులౌ...ఆం.భా.౧.౪౨.

**కలను=కలఁకు[1].** వి. దే. (బ.కలఁకులు-దీని 'ను' వర్ణమునకు ఏకవచనమందు వికల్పముగాను బ హువచనమందు నిత్యముగాను బిందుపూర్వక 'కు'వర్ణము ఆదేశముగా వచ్చును. ఇట్లే: కెలను, కొలను, కొఱను, మొ.) ౧. (సం. ఖలమ్.) స్థాన ము, ప్రదేశము.

క. ఇంటం దెవులునఁ జచ్చుట,కంటెను బాపం బు లొండు గలవె నృపులకు౯, బంటకలను పొలికలనిది,గంట నిధానంబు గంట గాదే మనకు౯. భార. భీష్మ. ౧. ౯౯.

ఆ. ఏబలంబు దనకు నెక్కుడు గలిగె న,బ్బలము నేల పోరుకలను గాఁగ,నినుఁడు సీతుగాలి వెనుకగా మొన నడ,పించి పొడువ సంభ వించు జయము. భార. శాం. ౩. ౬.

క. దురమునకు న్మథురయుఁ బుష్కరముఁ బ్ర యాగంబుఁ దగినకలఁకులు మీా కే,దురపగు నది గొను మనె హరి...ఉ. హరి. ౪. ౨౦౩.

౨. (సం. ఖలమ్.) కళ్లము. మార్క. ౪. ౧౦౨.

క. పాల మిల్లు లోఁట గ్రామము, కలను పసులు మేయుకొఱను గాల్చిన నృపకాం,తలతో సంగము చేసినఁ, గలయం బిరి సుట్టి వానిఁ గాల్పఁగ వలయుకా. విజ్ఞా. ప్రా. ౧౦౪.

శ్లో. క్షేత్రవేశ్మవనగ్రామవివీతఖలదాహకాః, రాజపత్న్యభిగామీ చ దగ్ధవ్యాస్తు కటాగ్నినా. యాజ్ఞ. వ్యవ. ౨౭౨.

౩. (సం. ఖలః.) యుద్ధము.

క. పలభుక్కుల కన్యవన్యఫలభుక్కులకుకా, గల నయ్యె ...రామా. ౮. ౫౪.

క. అరద మిదె వచ్చె వచ్చిరి,దురమునకుం గడఁకఁ గదలి దోర్బలగర్వ,త్వరితులగుమ నిదె నక్తం,చరవీరులు గలని కరుగ సమయం బని నక్. భా. రా. ఆర. ౧. ౧౮౦. ఆం. భా. ౨. ౨౨౨.

కలనినక్క = పోరిలో నిజంబుకమువలె అశుభమును గోరువాఁడు.

గీ. కలనినక్కైనయధికారి గలనృపతికి, నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. ఆము. ౪. ౨౩౭.

కలనుచెప్పు = యుద్ధమును ప్రకటించు, ఉభయపక్షములవారును యుద్ధము చేయుద మని చెప్పుకొను.

వ. కలను చెప్పి మొనలఁ దీర్చి కదిసినసమయంబున...దశకు. ౨. ౧౦.

వ. రెండు తెఱంగులవారును గలను చెప్పి ... దశకు. ౧౨. ౫౩.

జ: కలనితపసి, కలనుదిండితపసి.

కలనుదిండితపసి. వి. (√కలను)-కలహాశనముని-నారదుఁడు.

గీ. అప్పనంబుగ నానేర్చునట్లొనర్పఁ, గడఁగు నిప్పున్నియపుబలుకబ్బమునకుఁ, గత తెఱంగెట్టు లన్న ము న్గలనుదిండి,తపసిఁ గని కల్లుకానుపుతపసి పలికె. అచ్చ. రా. బాల. ౨౭.

కలప. వి. ౧. నాఁగలి.

సీ. కలప యనంగను హాల మొప్పు...ఆం. భా. ౨. ౨౩౧.

౨. ఇల్లు కట్టుకొనుట వంట చేసికొనుట మున్నగుప్రయోజనములకుపయోగించుదారుసామగ్రి. (వా.)

జ: కలపతాల్పు.

కలపడము. వి. (√కలయు) ఒకటితో నొకటి కలయుట, మిశ్రణము; మిశ్రితపదార్థము.

రగడ. కలపడంబులు గలయ వీచొక్కంపుఁగస్తురిరస్తువీ తెలు. సుక. ౧. ౧౩౩. (శ.ర.పా.)

కలపతాల్పు. వి. (√కలప)-హాలధరుఁడు-౧. బలరాముఁడు. ౨. శూద్రుఁడు, కాఁపు. (శ. ర.)

కలపన. వి. (√కలపు.) ౧. కలపుట, మిశ్రణము.

ద్వి. కలయంగఁ బన్నీటఁ గపురంబుతోడఁ, గలపనసేసినకలపంబు మెత్తి. ద్వి. పరమ. ౫. ౪౧౭ పా. ౧ పం. (కలపనసేయు=కలపు.)

౨. కలహము. (చూ. కలపనగంప.)

కలపనఁబిండి. వి. (కలపడము+పిండి) క్షోభము.

క. కలసెదఁ బతి నతేఁ డిచ్చట, మెలఁగుట మా తండ్రి విన్న మేలగునే ప్రే,వులలోన సురియఁ ద్రిప్పిన,కలపనఁబిం డైనఁ జెలిమికత్తెలు నగరే. ఉ. హరి. ౫. ౧౬౩. (శ. ర.)

కలపనగంప. విణ. (√కలపన.) కలహశీలుఁడు.

చ. కలపనగంప యీతపసి కాలును నోరును బాదు గాన కెవ్వలనఁ బరిభ్రమించుచు నుపాయపుఁ బ్రేలరిమాట లాడి ధీ,రులమది కైన నూరక విరోధ మొనర్చుచు నుండు...హరి. పూ. ౫. ౯౨.

కలపము. వి. (√కలపు-త. కలప్పు.) ౧. కలపుట.

సీ. సచ్చందనముకంటెఁ జందనంబునఁ గలపంబు చేసినకప్పురంబుకంటె. పి. శకుం. ౪. ౧౪౬. కలపంబుచేయు=కలపు.)

క. తలయం టె నొక తె ఱేనికిఁ,గలపంబునఁ జే
సి తావి గల్గిననూనెకా. యయా. ర. ౯౫.

౨. యక్షకర్దమము, లేపనద్రవ్యవిశేషము.

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తను
వున నలఁదుదు ననువు గాఁగ. భార. విరా.
౧. ౧౦౫.

సీ. యక్షకర్దమసంజ్ఞ యలరుఁ గడంబన్ను కలప
ము నాఁగను...ఆం. భా. ౨. ౧౬౩.

**కలపు**=కలుపు. స. క్రి. (√కలయు) చేర్చు, ఏకీ
భవింపఁజేయు.

సీ. గోధూమసేవికాగుచ్ఛంబు లల్లార్చి ఖండశ
ర్కరలతోఁ గలపి కలపి. నైష. ౬. ౧౨౦.

కలపికొను=కలయునట్లు చేసికొను.

గీ...అహితులఁ గలపికొనుట,ధర్మ వని రిది నయ
విరుద్ధంబు గాదె. భార.ఆది.౮. ౩౮.

వ...అని యనేక ప్రకారంబుల...గిరిపతి నమ్ము
నిపతులు యథోచితవచనంబులం గలపికొని
...కు. సం. ౭. ౯౬౬. ('లోఁబఱుచుకొ
ని' అని భావము.)

వి. కలయిక.

ఆ...ఇరువురమనముల,కలపు పూర్వసుకృతఫల
ము సుమ్ము. మార్క. ౫. ౭౨.

**కలబంద.** వి. ఘృతకుమారి, ఒకానొకమందు మొ
క్క. (శ. ర, వా.)

సీ. ... వెట్టికుందెన మంచికుందెన కలబంద గు
వ్వగుత్తి. హంస. ర. ౧౦.

('కలుబంద'అని ఆం. భా.౨. ౬౫, చి. ని.)

**కలభము.** సం. వి. అ. పుం. ౧. కరిశాబకము,
ఏనుఁగుపిల్ల. (అమరము—ఐదేండ్లయీడుగల
యేనుఁగుపిల్ల అని వాచ. ముప్పదియేండ్లయీ
డుగల యేనుఁగు. వై. ని.)౨.ధుత్తూరము, ఉన్మ
త్తకీ.

**కలమము.** సం. వి. అ. పుం. ౧.ఒక జాతివరిపైరు.
(ఇది జ్యేష్ఠమాసమున విత్తఁబడి మార్గశీర్షపుష్య
ములందుఁ గోయఁబడును.) ౨. లేఖిని, వ్రాసెడు
కలము. ౩. అంకురము, మొలక. (వై. ని.)

**కలమరి.** విశ. (కలము[1]+అరి) ఓడ యెక్కి పో
వువాఁడు.

గీ. రథికునకుఁ గలమరికి సారథియుఁ గర్ణ,ధా
రుఁడును బోలె...భార. శాం. ౫. ౫౮౯.

**కలము[1].** వి. (త. మ. కలమ్) నావ, ఓడ,పోతము.

సీ.కలముపైఁ గీలించి గాలి కెత్తినచాఁపవోలె
మిన్నంతయు బూరటిల్లె. భార. ఉద్యో.
ర. ౧౧౬.

క. తులువలు గొందఱు నిన్నదిఁ, దలఁపరు నెఱి
దంట లెల్లఁ దమి నీయడుగుం,గలమునఁ బు
ట్టువుమున్నీ, రలరఁ గదిరి ముట్టఁ గడతు ర
న్నిట ఱేఁడా. అచ్చ. రా. యు. ౬౩.ఆం.
భా. ౧. ౧౫౭.

జ: కలమరి.

**కలము[2].** వి. (త. కలమ్.) పండ్రెండుతూములపరి
మాణము.

గీ. అంత నారాజగోవిందుఁ డధికభక్తి,నల్లునకు
నాఁడుబిడ్డకు నరణ మిచ్చె, ముదముతోడ
మున్నూటఱువదికలముల, హేమతండులము
లు జను లెల్లఁ బొగడ. పరమ. ౩. ౧౫౬.

**కలము[3].** వి. (సం. కలమః. హిం. కలమ్.) లేఖని,
వ్రాఁతకుపయోగించుసాధనము.

సీ. ... కలమను కలము నాఁగను దనర్చు. ఆం.
భా. ౨. ౧౮౯.

కలపకట్టియ=(కలము+ కట్టియ) వ్రాసెడుకల
ము. (శ. ర.)

**కలము.** సం. విశ. (అ.ఆ.అ.) ౧. అజీర్ణము, అఱు
గనిది. (పదార్థము)౨.అవ్యక్తమధురము.(ధ్వని)

వి. అ. పుం. ౧.కోలి,రేఁగుకీ.౨.సాలము,మద్దికీ. న. రేతస్సు.

**కలముఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**కలయ.** అవ్య. ద్రు. (√కలయు.) ౧. అంతటను; బాగుగా, పూర్ణముగా; మిక్కిలి, అధికముగా.

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని ... భార. ఉద్యో. ౪. ౨౩౯.

చ. కలయఁగ దుర్నిమిత్తములు గానఁగ నయ్యె మదీయచిత్తముం,గలఁగెడు ... భార. ద్రో. ౨. ౨౨౬.

వ. నారదుం డమ్మహనీయద్విజులం గలయం గ నుంగొని... భార. శాం. ౧. ౨.

గీ. బాలుఁ డొక్కఁడు కొండొకకోల సేతఁ, బ ట్టుకొని యేను రక్కసిఁ గిట్టి చంపి,చులుకఁ గా వత్తు మీ రేడ్వ వలవ దనుచుఁ, గలయ నూరార్చెఁ దనతొక్కుఁబలుకు లొప్ప. భార. ఆది. ౬. ౨౬౦.

ద్వి. కను మూసి తల వంచి కలయ లజ్జించి,ఘన తరశోకాశ్రుకలితాస్యుఁ డగుచు. బస. పు. ౩. ౧౧౪౭ పం.

**కలయంపి=కలాఁపి.** వి. ౧. స్థలశుద్ధికై గోమయ ములోఁ గలిపి చల్లెడునీరు; కస్తూరిమున్నగునవి కలిపి చల్లెడునీరు.

సీ. వరుస నేనుంగులు గురిసినదానధారావళి ద గుకలయంపి గాఁగ. భార. విరా. ౩. ౭౪.

సీ. లక్ష్మికెంగేలిలీలారవిందమ్మునఁ గలయంపి చిలి కించుఁ గమ్మఁదేనె. భీమ. ౩. ౬౨.

క. కలపడగ లెత్తి కస్తురి, కలయంపులు చల్లి యాణి గలముత్తెపుము,గ్గులు వెట్టి వీదివీదు లఁ,గలయంగా మేలుకట్లు గట్టిరి వేడ్కన్. యయా. ౪. ౧౫౨.

౨. గోముఖము, అలుకుపట.

సీ. కలపడంబు కలాఁపి కలయంపి చానపి యన గోముఖాఖ్య లైయలరుచుండు. ఆం. భా. ౨. ౨౩.

**కలయఁబడు.** అ. క్రి. (కలయన్ + పడు-స్వార్థ మున)౧.కలియు,కూడు;ఎడను లేకుండ కూడు.

గీ. మధురగాననినాదముల్ మయిలక్రోల్లు, వెల యఁ బూరించునాదముల్ గలయఁబడఁగ. భా. రా. బాల. ౬౮౭.

గీ. కలయఁబడి మూఁపు మూఁపునఁ దలఁగఁద్రో య,రానిసందడి నడుచుపౌరవ్రజంబు, నర యుచు...జై. భా. ౩. ౬౨.

౨. కలఁబడు, కవియు.

క. కలయఁబడి పోరఁ దొడఁగిరి, బలరిపువృత్రు లకు వారు పాటి యనంగన్. భా. రా. యు. ౭౫౫.

**కలయిక.** వి. (√కలయు- త. కలప్పు.) కూడిక, సంబంధము; సంగమము, కూటమి.

క. అడవుల నవయుతపస్వికిఁ, గడుసౌఖ్యమె కోరుసతికిఁ గలయిక తగునే. పాండు. ౫. ౧౭౩.

గీ....అమ్మోహనాంగి, జాతివారాంబుజేక్షణల్ సైత మింత,నేర రనిపించెఁ గలయికయారజ ముల. శుక. ౪. ౨౬. ఆం. భా. ౨. ౧౭౮.

**కలయు=కలియు.** స. క్రి. ౧. చేరు, కూడు.

వ. నీలాంబరుండు ...పేరోలగంబున నున్నసీర వర్ణుం గలసె. ఉ. హరి. ౩. ౧౦౭.

౨. పొందు.

సీ. తల్లిదండ్రులఁ జంపి ధన మెత్తికొని పోయి చె లఁగి తొత్తులపొత్తు గలయువాఁడు. దశా. ౧౦. ౧౦౫.

౩. (రతియందు) కూడు, రమించు.

గీ. వలపు గలిగిననిండుజవ్వనిని వనిని,గలయుకం టెను సౌఖ్యంబు గలదె వేఱె.దశా.౩.౨౪.

చ. ... అన్నపాలునిం, గలయఁ దలంచి మేనన

యగారము గీల్కొనఁ జేసి ... శుక. ౧. ౫౪౮.

అ. క్రి. (తె. కల.) ఏక మగు, ఏకీభవించు.

క. అన్నరపాలుఁడు డానన్, జన్నమునకు వచ్చి నట్టిజగతీశులు భ, క్తి న్నమ్రులైరి దేహము, లు స్నేలయు ముదము మనములుం గలయం గన్. భార. శాం. ౨. ౫౮౩.

క. ఇత్తెఱంగున నయ్యిరువుర, చిత్తముగలి నొడలు గలసి సిద్ధాంతపరా, యత్తు లగుమునులయెలుకకు, విత్తై చెలువారె జమిలివేల్పని తెలుపన్. ఉ. హరి. ౨. ౧౭౭.

(వ్యవ) వారిలోఁ గలసి నీవును నన్ను బాధింపకు.

కలసి మెలసి=౧. స్నేహములోఁ గూడి.

క. తగుమాటలఁ జిత్తంబులు, సిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగుగోష్ఠిన్, సొగియించుచునెడ ముకుందుని, మగువకు శచి యిట్టులనియె మంజులఫణితిన్. హరి. ఉ. ౮. ౧౯౨.

వ... పరస్పరసమేతంబు లగుపౌరజానపదజనంబులు కలసి మెలసి నడచునెడ... ఆము. ౮. ౩౪.

౨. రతియందుఁ గూడి.

వ...కలికితనంబునన్ గలసి మెలసి రతాంతంబునం బరిశ్రాంతి యడంగ నంగణంబుల నిలిచి ...మనుచ. ౩. ౫౭.

జ: కలఁబడు, కలగలపు, కలగూర, కలగూరగంప, కలగొను[2], కలపడము, కలపన, కలపనఁబిండి, కలపనగంప, కలపము, కలపు, కలయ, కలయఁబడు, కలయిక, కలవంటకము, కలవడు.

కలరవము. సం.వి.అ.పుం.౧.అవ్యక్తమధురధ్వని. ౨. పావురము. ౩. కోకిలము.

కలలజము. సం. వి. అ. పుం. రాళము, సజ్జరసము.

కలలము. సం. వి. అ.పుం. న. ౧. గర్భపిండము; గర్భాధానము పిదప ఏకరాత్రకాలపాకము నొందినగర్భభూతశేతోవికారము. ౨.మావి, గర్భవేష్టనచర్మము. ౩. తామ్రకలశము. ౪. కిట్టము. ౫. లోహమలము. న. ౧. ఎముక. ౨. తోలుసంచి (శే.ని.)

కలవ. వి. (√కలయు?) ౧. కలయుట. (శ.ర.) ౨. కలసినయిసుకయు సున్నమును. (శ.ర.) విణ. కలసినది. (శ.ర.)

కలవంటకము. వి. (కలపు+వంటకము) పెక్కుపదార్థములు కలిపి చేసినవంటకము, మిశ్రాన్నము. (పులియోగిరము, దధ్యోదనము, మొ.)

గీ. అనరెఁ బుప్పొడి దిప్ప లైయంతనంత, మెట్టదామరపాకులమీఁద జాతి, పైఁడిచూలాలి వేవిళ్లు వాయఁ దోఁట, కలిమిచెలి వెట్టుకల వంటకంబు లనఁగ. యయా. ౮. ౯.

సీ. కలవంటకం బనఁగాను మిశ్రాన్నంబు... ఆం. భా. ౨. ౫౪౭.

సీ. మీఁదిమీఁగడ మాత్రమే గ్రహించినదధియంటి నైచినకలవంటకములు. గీ. కొతికి విడిచినయార్గాయ... పాంచా. ౮. ౪౯. ఆము. ౫. ౧౮౩.

కలవడము. వి. గోముఖము, అలుకుట.

సీ. కలవడంబు కలాఁపి కలయంపి చానపియన గోముఖాఖ్యలైయలరుచుండు. ఆం. భా. ౨. ౫౩. (బ్రా, ప్రాతప్రతి. పా.)

కలవడు. అ. క్రి. (కలపు+పడు.) కలయు.

క. కలవడి మాటలఁ బ్రియముల, నలయింపక యీవులందు నాదరణమునన్, గలకాలంబు పదాతుల, నలవున వశగతులఁ జేయ నగు నరపతికిన్. రుక్మా. ౩. ౬౮. (శ. ర.)

కలవరపడు. అ. క్రి. (కలవరము+పడు.) కలఁతపడు.

ద్వి. కలవరపడి పొర్లి కన్నులు దెఱచి, తలవర్లఁ గానక తల్లడించుచును. ద్వి. సారంగ. ౨. ౭౩పా. ౪పం.

కలవరపాటు. వి. (√కలవరపడు) ౧. క్షోభపడుట, కలఁత. ౨. చాంచల్యము.

క. జలచరములు తలచూపక, కలవరపాటునఁ జె
లంగుఁ గన్నులసమశేణ్. విప్ర. ౨. ౪౪.
(రెండర్థములకు నిదే యుదాహరణము.)

**కలవరపోవు.** అ. క్రి. (కలవరము+పోవు) కలవర
పడు. (శ. ర.)

**కలవరము.** వి. (త. కలవరం.) ౧. కలఁత, క్షోభ
ము. ౨. చింత. (శ. ర.) ౩. స్వప్నభాషణము,
కలవరింత.
సీ...కలవరిం పనఁగను గలవరింతే యనంగఁ గల
వర మనఁగను గళవళ మన, స్వప్నభాషణము
గా జరుగుచుండును...ఆం. భా. ౧. ౧౪౨.
జ: కలవరపడు, కలవరపాటు, కలవరపోవు, కల
వరించు, కలవరింత, కలవరింపు.

**కలవరించే.** అ. క్రి. (√ కలవరము.) ౧. కలఁత
నొందు, క్షోభపడు.
(దివాంధము) గీ. కంఠఘూత్కారముల దిశల్
గలవరింప, గర్వదుర్ల్లోకమునకుఁ గాకమునక
నియె. వేం. పంచ. ౩. ౧౩౪.
గీ. ఒదిఁగి యలమందసములోన నున్న రాజ, క
న్యకామణి మేల్కాంచి కలవరించి, బహు
విధంబుల విలపించె...శుక. ౧. ౩౭౪.
౨. (నిద్రామోహాదులచే) మై మఱచి పలుకు.
గీ. కలవరించియుఁ గృష్ణాఖ్య తెలిసియున్న, య
పుడుఁ గృష్ణాఖ్య యేమఱినట్టివేళ, యందుఁ
గృష్ణాఖ్య దక్కంగ నంగనలకు, రాదు వేఱొ
కవాక్యంబు రసనతుదికి. హరి. పూ. ౭. ౨౦.
చ. గజపతి వచ్చె నంచు నొకగంధగజంబు గు
ఱించి యొక్కెఁడ, క్కజపడి పల్కినన్వె
ఱచి కాననభూమికి వీటిఁ బాఱె దా, రి జడ
త నిద్రలోఁ గలవరింప నిజోక్తియ నేర్చి కీ
రము, ల్గజపతి వచ్చె నా విని కలంగుదు రీతని
శత్రు లచ్చటన్. నైష. ౫. ౧౩౩.
సీ. చెలరేఁగి రాయంచ చేరువ మెలఁగుచోఁ గలి
కిఁ గెన్నడ లంచుఁ గలవరించు. అచ్చ. రా.
అర. ౯౫. (శ. ర. పా.)

**కలవ(ల్వ)రించుకొను**=కలవరించు-(స్వార్థమున
'కొను').
(కుంభకర్ణునినిద్రావర్ణనము.) సీ. కిన్నరాదులఁ
గిట్టి గెలుచునాందోళంబు మించఁ బల్మఱుఁ
గల్వరించుకొనుచు. ఉ. రా. ౨. ౭౫.

**కలవరింత.** వి. (√ కలవరించే) కలవరించుట.
(-నిద్రామోహాదులచే-మైమఱచి పలుకుట; మై
మఱచి పలికినపలుకు.)
వ... భవదీయ వదనవర్ణనాసంబంధికథలయందు
నాకుఁ గలవరింతలు సంతతంబును గలుగుట
నిజంబైనయది...కళా. ౫. ౫౩.
గీ. తనరుపులకలు కలవరింతలును మాట, వీడుపా
టులు చెలులకు నెఱిఁ గొనర్ప. కళా. ౬.
౨౧౪.
గీ. ఉద్వాహనకేళిఁ జింతింపు చునికిఁ జేసి, పలుకు
నిద్దురలోఁ బెండ్లికలవరింత. శుక. ౨. ౧౬౧.
వ. ఇది యేమయ్యా నెండియు మదాళయుందు
ను మధురలాలసయును గళాపూర్ణుండు నం
చుఁ బలుకుచున్నవారు దేవరకు నిప్పుడు
నవియు కలవరింతలై యున్నవి. కళా. ౫. ౫౩.
ఆం. భా. ౧. ౧౪౨.

**కలవరింపు**=కలవరింత.
(స్వప్నభాషణము.)
ఆం. భా. ౧. ౧౪౨.

**కలవింకము.** సం. వి. అ. పుం. ౧. చటకము, పిచ్చు
క. ౨. కూఁకటిమూఁగ అనుపక్షి. ౩. కళంకము,
కఱ. ౪. కళింగవృక్షము, నెమిలియడుగుకి.

**కలశ(స)జన్ముఁడు.** సం. వి. న్. పుం-కలశమందుఁ
బుట్టినవాఁడు-అగస్త్యుఁడు.

**కలశ(స)ము.** సం. వి. అ. పుం. న. ౧. ఘటము, కుండ.
(వై. ని-'కలశాబ్ధి'మున్నగుచోట్ల 'తరికుండ' యని
యర్థము.) ౨. గుడిమీఁద నుండుకలశాకారశిఖ

రము. (విల్యమ్సు). పుం. ద్రోణము, పరిమాణవిశేషము. (కే. ని.)

**కలశా(సా)బ్ధి.** సం. వి. ఇ. పుం-అమృతమథనకాలమున తరికుండగా నుపయోగింపఁబడినసముద్రము-పాలసముద్రము.

(ఇప్లే: కలశపాథోరాశి, కలశోదధి, మొ.)

**కలశి(సి).** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పెరుఁగుఁ జిలుకుకుండ. (కే. ని.) ౨. కలశము, కుండ. (వై. ని.) ౩. పృశ్నిపర్ణి, కోలపొన్నకీ.

**కలహంస(ము).** సం. వి. అ. పుం. ౧. ధూసరవర్ణము లయిన ఱెక్కలు గలిగినహంస. (హలా. ని.) ౨. రాజహంస. (కే. ని.)

**కలహంసుఁడు.** సం. వి. అ. పుం. శ్రేష్ఠుఁడైనరాజు. (కే. ని.)

**కలహకారి.** సం. విణ. (న్. ణీ. న్.) జగడగొండి. (ఇప్లే: కలహకారుఁడు, కలహకృత్తు, మొ.)

**కలహప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. శారిక, గోరువంక.

**కలహప్రియుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) కలహమందు ప్రీతి గలవాఁడు. వి. అ. పుం. నారదుఁడు.

**కలహము.** సం. వి. అ. పుం. ౧. జగడము, వివాదము. ౨. యుద్ధము. ౩. కత్తిమొఱ. (కే. ని.)

**కలహాంతరిత.** సం. వి. ఆ. స్త్రీ. ముందు కోపముచే ప్రియునివిడనాడి వెనుక పరితాపమునొందునాయిక.

**కలహాశనుఁడు.** సం. వి. అ. పుం-కలహభోజనుఁడు-నారదుఁడు.

**కలహించె.** సం. అ. క్రి. జగడమాడు.

క. కులకాంతతోడ నెప్పుడుఁ, గలహింపకు...
సు. శ. ౩౭. వరాహ. ౩. ౯౮.

**కలాంకురము.** సం. వి. అ. పుం. సారసము, బెగ్గురుపక్షి. (త్రి. ని.)

**కలాఁపి**=కలయంపి. (కలఁత + ఆఁపు-సంధినివర్ణలోపవర్ణవికారములు. శ. ర.) ఆం. భా. ౨. ౨౩.

**కలాకులము.** సం. వి. అ. న-కొంచెముగా త్రాగినను వ్యాకులపెట్టునది - హాలాహలవిషము. (వాచ.)

**కలాచి.** సం. వి. ఈ. స్త్రీ. ముంజేయి మొదలు మోఁచేతివఱకు నుండుప్రదేశము, ప్రకోష్ఠము.

**కలాచిక.** సం. వి. ఆ. స్త్రీ=కలాచి.

**కలా(ళా)దుఁడు.** సం. వి. అ. పుం. స్వర్ణకారుఁడు, కమసాలి.

**కలానునాది.** సం. వి. న్. పుం. ౧. చటకము, పిచ్చుక. ౨. తుమ్మెద. ౩. కపింజలము, కముఁజు. ౪. చాతకము, వానకోయిల.

**కలాపకము.** సం. వి. అ. పుం. ౧=కలాపము. ౨. ఏనుఁగు మెడత్రాడు, ఏనుఁగు మెడసంకెల. న. ౧. ఏకవాక్యముగా నున్నశ్లోకచతుష్టయము. ౨. నెమిళ్లు పురివిచ్చుకాలమున చెల్లింపఁ దగుఋణము. ౩. సొంటి. ౪. స్వాదుకటులిక్తకషాయమిశ్రిత మైనరుచి. (వై. ని.)

**కలాపన**=కలాపము. వి. కలఁత. (శ. ర-'కలహము, జగడము' అని చి. ని.)

**కలాపము**=కలాపన. (శ. ర, చి. ని.)

**కలాపము.** సం. వి. అ. పుం. ౧. సమూహము, గుంపు. ౨. మయూరపింఛము, నెమిలిపురి. ౩. భూషణము. ౪. తూణము, అమ్ములపొది. ౫. వ్యాకరణభేదము, కాతంత్రము. ౬. మొలనూలు, కాంచి. (మే. ని.)

**కలాపి.** సం. విణ. (న్. నీ. న్.) కలాపము కలది. వి. న్. పుం. ౧. నెమిలి. ౨. మహాదేవుఁడు, ఈశ్వరుఁడు. (కే. ని.) ౩. ప్లక్షము, జువ్వికీ. ౪. నెమిళ్లు పురి విచ్చుకాలము.

**కలాపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విదగ్ధుఁడు, ప్రౌఢ. వి. చంద్రుఁడు. (మే. ని.)

**కలాయనుఁడు.** సం. వి. అ. పుం. నర్తకుఁడు. (కల్ప.)

**కలాయము.** సం. వి. అ. పుం. గుండ్రనిసెనగలు. (బటానీలు.)

**కలాలాపము.** సం. వి. అ. పుం. తుమ్మెద.

**కలాలి.** వి. (హిం. కలాల్) కల్లుసారాయి లమ్ము వాఁడు. (శ. ర.)

**కలా(ళా)వంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్.) అఱువదినాలుగు కళలు తెలిసినవాఁడు. వి.త్. పుం. చంద్రుఁడు.

**కలా(ళా)వతి.** సం. వి. ఈ. స్త్రీ. తుంబురునివీణ. (వై. ని.)

**కలావికము.** సం. వి. అ. పుం. కోడి. (త్రి. ని.)

**కలావికలము.** సం.వి.అ.పుం.చటకము, పిచ్చుక.

**కలాహకము.** సం.వి.అ.పుం.కాహళము.(శాకా)

**కలి.** వి. పులియఁబెట్టినకడుగు.

సీ. కూరాడు కలి నాఁగ మీఱు ధాన్యామ్లము ...ఆం. భా. ౨. ౨౫౦.

గీ. నీరినడుము దెంప... కలియుఁ ద్రచ్చివెన్న గొనఁగ...కు. సం. ౭. ౧౩౪.

క.కలియును నూనెయు బలె మును,కలయక క్షీ రోదకములకరణిం గొంతే,యులుఁ గౌరవు లిపు డెనసి స,కలనృపులను గూర్చినారు కరి నగరమునన్. చిత్రభా. ౬. ౮౭.

చ...కలవుకాల మెఱుంగక పూసబొట్టు లం,బ లి కలినీళ్లుఁ జందనపుమానికఁ గొల్చినమాళ్లు గర్గి శో,ఖిలుదురు రెడ్డిబిడ్డలు కుబేరునిపిల్ల లనంగ నచ్చటన్. శుక. ౨. ౮౦౬. (కలినీ ళ్లు=కలి.)

సా: కలి పోసి నాన్చినగ్రచ్చకాయలు.

సీ. కలి వోసి నాన్చినగ్రచ్చకాయలభంగిఁ గోలు మాలినట్టిదృగ్గోళకములు. కాశీ. ౩. ౧౩౭.

సా: కలి పోసినవెనుక నుట్లు గనుఁగొనుట.

–కలి పోసినప్పటికిని పెరుఁగు పోయుదు రనుచ ట్టియాసతో ఉట్టివంక చూచుట–కార్యము మిం చినతరువాతఁగూడ పట్టియాస పెట్టుకొని యుం డుట.

క. అలయింపఁగలంతయు న, న్నలయించితి చా లు మందరాద్రికిఁ జని య,మ్మలహరుఁ గొలి చెద నేలా, కలి పోసినవెనుక నుట్లు గనుఁ గొనఁగ నృపా. రుక్మా. ౮. ౭౫. సారంగ.౨. ౧౨౨.

**కలి.** సం. వి. ఇ. పుం. ౧. కృతాదిచతుర్యుగము లలో తుదియుగము. ౨. జగడము, కలహము. ౩. యుద్ధము. ౪. విభీతకము, తాండ్రకా.౫.పా చికప్రక్కలలో ఒక్కచుక్కయున్నప్రక్క. ౬. శూరుఁడు. ౭. కలిపురుషుఁడు. స్త్రీ. కళిక, మొగ్గ.

**కలింగలు.** వి. (త. కలిఙ్గల్) అలుఁగు, పరీవాహ ము, చెఱువు లోనగువానిలో నెక్కువగా నుండునీరు పోవుటకు నేర్పఱచినదారి. (శ.ర.)

**కలింజము.** సం. వి. అ. పుం. కిలింజకము, చాఁప.

**కలిక.** సం.వి. ఆ. స్త్రీ. ౧. మొగ్గ.౨.వీణామూలము. ౩. కళ.

**కలికము.** వి. శైత్యనివారణార్థము కంటికి వేసెడు మందు. (శ. ర.)

సా: ఆప్రాంతమున బియ్యము కలికమునకైనను దొరకవు. (కొంచె మైనను దొరకవు అని భా వము.)

విణ. స్వల్పము, తక్కువది.

క. కలికపుమానిసి యని నీ,తలఁపున నిపుడల్ల నేలతాలుపుమిన్నన్, జులుకఁగఁ జూచెద వతనిన్, గెలువఁగ నీపంటివారికిం దర మగు నే. అచ్చ. రా. యు. ౨౧.

కలికారకము. సం. వి. అ. పుం. ౧. పూతికము, నె మిలియడుగుళ్ళ.(వై.ని.) ౨. ఘామ్యాటము, కూఁ కటిమూఁగకిట్ట.

కలికారకుఁడు. సం. విశ. (అ. రికా. అ.) కలహ కారకుఁడు, కలహము కలిగించువాఁడు. వి. అ. పుం. నారదుఁడు.

కలికారము. సం=కలికారకము.

కలికారుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) కలహము కలిగించువాఁడు, జగడగొండి. వి. అ. పుం. నా రదుఁడు.

కలికి(ల్కి). వి. ౧. మనోజ్ఞురాలగుఆఁడుది; ఆఁ డుది.

గీ... కలికి యనఁగఁ, గొంగతలయాఁక దంట యుఁ గోమలియును, బొలుచును...ఆం.భా. 3. ౬౨.

వ. అని పలికి యక్కలికి తేనియ లొలుకుపూము లుకుల జగుకుఁ బుట్టించునించువిలుతు నుద్దే శించి...మనుచ. 3. ౪౫.

సీ. ప్రాఁబల్కుఁగల్కిపాపటకు సిందూరమై యె వ్వానిపదకాంతి యెసక మెసఁగు. గీ... అట్టి హరి వీనె...ఉ. రా. ౫. ౬౯.

౨. కొంగతలయాఁక. ఆం. భా. 3. ౬౨.

విశ. ౧. మనోజ్ఞము, అందమైనది.

సీ. దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ గలి కికాటుకలకుఁ గానివావి. గీ. చేసి ... ఉ. హరి. 3. ౧౪౭.

చ. చిలుకలకొల్కి కల్కి యొకచేడియ...మ నుచ. ౫. ౬3.

౨. దంట, నేర్పరి. ఆం. భా. 3. ౬౨.

కలికితురాయి = కొంగతలయాఁకలతో చేసిన శిరోభూషావిశేషము.

సీ. కనకపుష్పముల నొప్పినకుసుంబాపాగ రా ణింపఁగల్కితురాయి మెఱయ. వేం.మా. ౧. ౧3౪.

జ: కలికితనము.

కలికితనము. వి. (√కలికి)

(దిట్టతనము, నేర్పు.)

గీ. అత్తెఅంగునరేఖయు నవ్విధంబు, గఱువచం దంబు నమ్మెయికలికితనము, నట్టిచెన్ను నసై రంధ్రియంద కాక, కలనె యొరులకు...భా ర. విరా. ౨. ౬౭.

సీ. ఉత్తరప్రత్యుత్తరోక్తినైపుణశక్తి గర్వంబు సూపినకలికితనము. నైష. ౭. ౧౬౦.

కలిగి(గ్గి)ంచే. స. క్రి. (√కలుగు) కలుగఁజే యు.

(ఉండఁజేయు; నిలుపు)

చ. అడఁగఁగనీక శంతనునియన్వయముం గలి గించి తీవ...భార. ఉద్యో. ౧. 3౭3.

గీ...భార్య లిత్తెరువునందు, నడవరే యోర్చి న్ దుమనమున నింత, యెఱిఁగి కలిగింపు వసు వేయు నేల తల్లి. భార. అశ్వ. ౪. ౬౯.

(ఇట 'బ్రతికింపుము' అని భావము.)

(వ్యక్తపఱుచు)

సీ... జనియించి యాబ్రహ్మ సకలసృష్టి, కాది భూతములుగ వేదముల్ నాలుగు గలిగించె నపుడు...భార. శాం. ౬. ౪౭౯.

(పుట్టించు, సృజించు)

ద్వి. వివిధభంగులవిందు వేడ్కఁ గావింప, వల యుఁ గావున నీవు వలయువస్తువులు, గలిగిం పు మనవుడుఁ గామధేనువును. రం. రా. బా ల. ౫3 పా. ౧౯ పం.

(లభింపఁజేయు)

సీ. వలసినవస్తు లవ్వారిగా శిబిరంబునందె కల్గిం చుమహావిభూతి. ఉ. రా. ౪. ౧౪౬.

కలిగొట్టు. వి. పాటలళ్ళ.

రగడ. కలిగొట్లు ప్రాఁకువేడ్కలె నీకుఁ దఱ చె

దను, నలినాక్షికడిమిగండమున కే వెఱచెద
ను. మనుచ. ౩. ౭౪.

(నిదాఘదినవర్ణనము) సీ. కలిగొట్టుచెట్టుగుంపు
ల కింటిచుట్టంబు గాలి మేపరికి వాకట్టుమం
దు. చంద్రా. ౨. ౧౬. ఆం. భా. ౨. ౪౭.

**కలితనము.** వి. (సం. కలిత్వమ్. క. కలితన - ఇది 'రాజుతనము' వలె మిశ్రపద మనియుఁ జెప్ప వచ్చును.) ౧. శూరత్వము, పరాక్రమము.

క. అనిలజునియత్వముఁ గూల్చినయప్పుడు
ళల్యునిం గలితనము మెఱయం,దనయంపవె
ల్లిచే ముంచె నకులుతమ్ముండు నీదు సేన దలం
కన్. భార. శల్య. ౧. ౧౬౨.

గీ. చెలులు పగతురు నెవ్వని చెలితనంబు,కలిత
నంబుఁ గీర్తింతురు కడఁగి యెపుడు. మా
ర్క. ౨. ౨౬౯.

౨. సామర్థ్యము.

చ.తలఁపరసాతలాంతరగతక్షితిఁ గ్రమ్మఱ నిల్పి
నట్టిసీ,కలితన మెన్న విస్మయము గాదు ...
భాగ. ౩. ౪౩౩.

౩. చాతుర్యము, నేర్పు.

క. కలితనమునఁ జని యలనా,పలుసుంబంతంబు
చెల్లుబడిగా రెడ్డిన్, గలసి యొక ముడుపుఁ
గైకొని, పిలిచిన నీ కిత్తు నేరపెట్టుము మగ
నిన్. వేం. పంచ. ౪. ౪౯౪. కృ. శకుం.
౨. ౧౧౫.

**కలితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. విదితము, తెలియఁబడినది. ౨. పొందఁబడినది. ౩. ఛేదింపఁబడినది. ౪. సంఖ్యాతము, లెక్కింపఁబడినది. ౫. గృహీతము, పట్టుకొనఁబడినది. ౬. ఉక్తము, చెప్పఁబడినది. ౭. విచారితము, అరయఁబడినది. ౮. బద్ధము, కట్టఁబడినది. ౯. మిశ్రితము, కలిసినది. ౧౦. సంపన్నము, (ధనాదులతో)కూడినది.

**కలితి(ల్తి).** హిం. వి. స్వచ్ఛము కానిది, మిశ్రితము. (శ. ర.)

**కలిద్రుమము.** సం. వి. అ. పుం. విభీతకము, తాండ్రకాయ.

**కలిపొత్తి.** వి. గాయములు మున్నగునవి కాఁచుట కుపయోగించుగుడ్డముక్క.

మ. మకరాంకానలతప్యమానకుచకుంభద్వంద్వ
మధ్యస్థల,ప్రకటస్వేదజలప్లుతాంబుజదళప్రా
తంబు లొప్పారె ద,ర్పకశస్త్రంబుల గాఁడి
పాఱునవలాభావంపుబల్గాయ మా,దుక
గాఁపంగఁ జెలుల్ ఘటించుకలిపొత్తుల్ వో
లె నప్పట్టునన్. చంద్రా. ౪. ౧౨౬.

**కలిమము.** వి. మాంసము.

వ...తిత్తొలిచి గాలి గొన నైచినపుక్క కలిమం
బుఁ గనుంగొని...భార. శాం. ౩. ౨౪౫.

(శ.ర, ప్రాఁతప్రతిపా-'కడిమము' ముద్రి.)

**కలిమారకము.** సం. వి. అ. పుం. పూతికము, నెమిలియడుగు.

**కలిమాలకము.** సం=కలిమారకము.

**కలిమాల్యము.** సం=కలిమారకము.

**కలిమి(ల్మి).** వి.(√కలుగు) ౧.కలుగుట;ఉండుట.

క. మృతుఁడయి క్రమ్మఱ సంజీ,వితుఁడయ్యె ని
తండు కరము విస్మయ మిది భూ,నుత యిట్టి
మహిమ కలిమికిఁ,గత మెయ్యది యాన తిమ్ము
కారుణ్యమునన్. భార. ఆర. ౪. ౧౪౯.

సీ. మిముఁ గన్నమాత్రన విమలాత్మ బోధంబుకలి
మి నాకొంటిభాగ్యంబు గాదె. మార్క. ౩.
౩౬౨.

గీ. శాస్త్ర మను పేరియధికలోచనము కలిమి.
నైష. ౧. ౪౭.

సీ. సతికల్మి లేములు సన నిశ్చయింపక సంశయం
బునఁ బోవఁ జాలఁ గినిసి,పొండని వెడఁ

గఁ బుత్తెంచుఁ గ్రమ్మఱ...భా.రా.కిష్కిం.
౭౨౪.

౨. సంపద, ఐశ్వర్యము, సిరి.

క. కలిమియు చుట్టలఁ జేర్పుం, గలిమియ చెలులను ఘటించు...భార. శాం. ౧. ౫౧, విరా.
౧. ౧౪౦. ఆం. భా. ౨. ౨౧౦.

(ఇంద్రునిమాటలు.) చ...నా,కలిమి నిజోదరై
కభృతికార్యకదర్యతఁ జిన్నఁబోయెదుర్.
నైష. ౩. ౧౩.

సా: కలిమిలేములు కావడికుండలు.

౩. పుట్టుక.

ఉ.పౌరులు మానవేంద్రునకుఁ బాత్రుఁడు గల్మికి
మిన్ను మోసి సాం,పారఁగఁ జేసి రుత్సవ
ములు...మార్క. ౯. ౨౦౬.

౪. తటస్థించుట.

చ...నీ, వనఁగ జనార్దనుం డనఁగ నారయ భేద
ము లేదు కావునన్, విను వినిపింతు మాపని
యు నీదు ప్రసంగమునున్న కల్మియున్.ప్ర
భా. ౨. ౫౦.

౫. అగుట.

క. ఆబుషియాగమనం బపు,డారసి చని చెప్పి
రంబుజాక్షునకు బహి,శ్చారిణు లగుపరిచా
రిక, లాకీలిని జెప్ప నతనియానతికల్మిన్.
కళా. ౨. ౧౪.

కలిమి గలవాఁడు=౧. ధనికుఁడు. ౨. కుబేరుఁ
డు. వరాహ. ౬. ౯౯.

కలిమికొండ. వి. (కలిమి+కొండ) శ్రీశైలము.

గీ. కలిమికొండకు నేతెంచి నిలిచి తనుచు,వింటి
ముక్కంటి నినుఁ గనుఁగొంటి మంటి. ద్వా.
౯. ౧౫౨.

కలిమిచెలి. వి. (√కలిమి) లక్ష్మి.

గీ. అమరెఁ బుప్పొడికుప్పలై యంతనంత,మెట్ట
దామరపాకులమీఁద జాతి, పైఁడిచూలాలి
వేవిళ్లు వాయఁ దోఁట,కలిమిచెలి వెట్టుకల
వంటకంబు లనఁగ. యయా. ౪. ౯. (తోఁ
టకలిమిచెలి=వనలక్ష్మి.)

ఇట్లే: కలిమిగుబ్బెత, మొ. దశా. ౧. ౧౬౪.
కలిమితొయ్యలి. చంద్రి. ౨. ౩౪.
కలుములనవలా. అచ్చ. రా. బాల. ౬౩.

కలిమిచూపులపూఁబోఁడి= కటాక్షప్రసారము
చేత సంపదల నిచ్చుస్త్రీ, లక్ష్మి.

గీ. కలిమిచూపులపూఁబోఁడి కలశజలధి, నర్థిఁ
గొలువుండె రత్నసింహాసనమున. హర. ౬.
౭౯.

కలుముల చెలి=లక్ష్మి. ఆం. భా. ౧. ౪౧.
కలుములదొర=విత్తేశుఁడు, కుబేరుఁడు. అచ్చ.
భా. ౩. ౩౬.

కలిమిదండుగ. వి.(కలిమి+దండుగ.) నేరము లే
కున్నను ధనవంతునియొద్ద రాజు పుచ్చుకొనెడి
ధనము. (శ.ర.)

కలియు=కలయు.

అ. క్రి.(-బంధుత్వ మైత్ర్యాదులచే-ఏకమ
గు; చేరు.)

సీ. ఈరాజబింబాస్య కారణంబుగ నద్రికులను
దేవకులంబుఁ గలియుఁ గాక. హర.౪.౬౪.

గీ.కలిసి యొకకొంతసేపు శృంగాటకముల,నగరి
దెసఁ జూచుచునె మంతనంబు లాడి,చనిరి
విద్వాంసు లిండ్లకు...ఆను. ౪. ౯.

(వ్యవ) వారు ఒకరితో నొకరు కలిసి వెళ్లుచు
న్నారు.

స. క్రి. (రతియందు కూడు.)

క. ఎక్కువకులం బతనికిని, నిక్కపుటా లైన
దాని నీచకులుం డీ,సెక్కఁగ బలిమిం గలి
సినఁ,దక్కొని చంపుటయె రాజధర్మం బెం
దున్. విజ్ఞా. ప్రా. ౧౦౭.

నేలఁగలియు=నశించు, ధ్వస్తమగు.

ఆ. యాగకర్త లేనియాగంబు చెల్లునే, కలయ
గర్వ మెంత గలిగి యున్న, శిరము లేనితను

వు చెలరేఁగి యాడునే, పాలియుఁ గాక నే
లఁగలియుఁ గాక. వీర. ౪. ౧౩.

(ఇష్టే:అవనిఁగలియు,కాటఁగలియు,గంగలోఁ
గలియు, మొ.)

జ:కలువు[1],కలువుఁగోలు,కలువుఁగోలుతనము.

**కలియుగమహిమలు.** సం. వి. న్. పుం. బ. ధా
న్యవిశేషము.

వ... జున్నుఁబ్రాలు చిన్నిచుక్కలు కళింగలు
వంగవరులు జగన్నాథప్రియములు రామల
క్ష్మణులు కలియుగమహిమలు కాసరలు...
అనుమాటవాలుగువగలవైరులు ...ప్రబంధ.
౧౧౨.

**కలిలము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గహనము,
చొర రానిది ౨. మిశ్రము, కలిసినది. వి. అ.న.
౧. కాలుష్యము. ౨. సమూహము. ౩. శరీరము.
౪. పాపము. ౫. గాంభీర్యము. ౬. జీవాధిష్ఠిత
మగు శుక్రశోణితములముద్ద. (శే. ని.)

**కలివ(ల్వ)డగ.** వి. ఉత్సవసమయములం దెత్తెడు
ధ్వజము, జెండా.

క.కలధౌతహర్మ్యములపైఁ, గలివడగలు గలయ
నెగసి క్రాలె...కు. సం. ౭. ౪౩.

సీ. సితలోచనద్యుతుల్ సెదరి దిక్కులయందుఁ
బొలయుకల్వడగలపొలుపు గాఁగ. కు. సం.
౧౨. ౭౬౫.

**కలివి**=కలివె.

వ.... నేరేళ్ల మారేళ్లఁ గలువుల బలువులఁ గొడి
సెల నొడిసెల నందునుల నిందుగుల ... పి.
శకుం. ౨. ౧౪.

**కలివిరి.** వి. వృక్షవిశేషము.

సీ. కలివిరి గుండ్రయు గ్రచ్చ...హంస. ౪. ౯.

**కలివె(ల్వె).** వి. కరమర్దము, ఓఁకకి.

సీ.... కలివె,పంటులుఁ దొడివెందపండ్లుఁ దుమ్మి
కిపండ్లు జానపంటులు గంగరేనుపండ్లు. కాశీ.
౩. ౬౯.

ద్వి....వెలఁగ,కాయలు రేఁబడికాయలు గసివె,
కాయలు...పండితా. పర్వ. ౩౪౯ పా.

సీ. ... కలివె నాఁ గృష్ణపాకఫల మమరు. ఆం.
భా. ౨. ౫౧.

ద్వి. దేవదారువు కల్వె దేవకాంచనము. ద్వి. సా
రంగ. ౨. ౭౯ పా. ౨౦ పం.
(యా. కలివియ - చి. ని.)

**కలిహారి.** సం. వి. ఈ. స్త్రీ. లాంగలి, తరిగొబ్బి.

**కలు[1]**=కల్లు[1]. వి.(ఇది 'ఇలు'శబ్దమువంటిది-చూ.
ఇల్లు[1]-సం. కల్యా. ప్రా. కల్లా. క. కళ్,కళ్లు.)
మద్యము, సుర.

క. పలువురకుఁ బుట్టి నిచ్చలు, గలు ద్రావుచుఁ
బెరిఁగి యెట్లు గఱుతురు శీలం,బులు...భార.
కర్ణ. ౨. ౪౯.

మ.కలు ద్రావం బని పూనుయావవులు ఖడ్గాఖడ్గిఁ
బాటింతురే, కలఁగంబాఱుట గాక ... ఉ.
హరి. ౪. ౧౩౨. రామా. ౨. ౯౭.

**కలు[2]**= కల్లు[2]. వి. (ఇది'ఇలు'శబ్దమువంటిది.చూ.
ఇల్లు[1]-క. కల్, కల్లు. త. కల్.) ౧. శిల,రాయి.

ఉ.అల్పపుబుద్ధిలోఁడ నకటా కలుకోటలమాత్రే
కేను సం,కల్పము ము న్నొనర్చితిని గాని మ
ణీమయముల్ రచింప సం,కల్ప మొనర్చినం
దిరముగా నెఱవేర్తునె కా ... పరమ. ౫.
౯౬.

సీ. ఇందుబింబముఁ జూచి చెందుప్పఁగలు పావి
యఱు లెత్తి నాకంగ నాసపడిన. కాశీ. ౩.
౧౨.

సీ. ఏను గ్రేఁగంట నొక్కించుక చూచినఁ గలు
డెంద మైనను గరఁగు ననిన. నృసిం. ౨. ౫౬
(శ. ర. పా.)

౨. బండిచక్రము.

సీ. ఆది మనోమయం బగునొక్కచక్రంబుఁ గ
ల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ, గల్పించి యా

బండికలు దొల్చె సత్యలోకంబుననుండియా
కమలగర్భుఁడు...కాశీ. ౧. ౭౭.

కలుగుండు=తాలిగుండు. ఆము. ౧. ౬౫.

జ: కలుఁగానుగు, కలుక్రాంత, కలుఁగచ్చ, కలు
గానుఁగ, కలుజువ్వి.

**కలుఁగానుగు.** వి.(కలు² + కానుగు) త్రాయంతిక.
(శ. ర.)

**కలుఁగు(ల్గు).** వి. ౧. రంధ్రము, కన్నము.

గీ... వల్మీకజంబు,నెలుకకలుఁగుది గానిమన్నె
మకి పట్టి,యురుగునది శౌచ మొనరింప నవని
సురుఁడు. కాశీ. ౪. ౧౯౩.

౨. గుహ; గుహవలెఁ దొలిచినరంధ్రము, సారం
గము.

క. కడుపడి నక్కలుఁగు మొగం, బడు కొక్కటి
ద్రోచి వెనుకపను లాతని కేర్పడఁ జేసివీడు
నేరినఁ,గడఁకం బజ లెల్ల నన్నుఁ గనుఁగొని
యెలమిన్. అచ్చ. రా. కిష్కి౦. ౨౭. (శ.
ర. పా.)

క. తమవారిం బిలిచిన వైశమ చని వా రంద
ఱుం బొలసు మేపరిక,ల్గు మొగం దాపినపెను
తా,యి మొగిం బడఁదన్ని లోనికేఁగి కడం
కన్. అచ్చ. రా. యు. ౭౭౪.

కలుఁగు(ల్గు)కానుపుతపసి = వల్మీకసంభవుఁడు,
వాల్మీకిముని. అచ్చ. రా. బాల. ౨౭.

కలుఁగులా(ల్లా)యపుఁదేజి = మూషకవాహన
ము. శశాం. ౪. ౯౦, కుపల. ౧. ౭.

**కలుఁజో.** వి. ౧. తాకట్టు, శిలాబంధము. (చి. ని.)

సీ. కలుఁజుతాకట్టు నాఁగను శిలాబంధమూ...
ఆం.భా.౧.౧౬౨. (శిలాబద్ధమూ. ముద్రి.)

(చెఱువు లోనగువానినీరు పోవుటకు తాతితోఁ
గట్టినమార్గము. శ. ర.)

౨. నూతిగోడ.

గీ. ఓరఁ గలుఁజులు వడి తాప లూడి ప్రాఁచి,
బూరటిలి నీరు గననీక పూరి మొలచు,బావు
లును గల్గు నచట భూపాలసుతులు, చేరి యొ
కచోట నలంత వసించునంత. చంద్ర. ౩.
౭౫.

**కలుకుక్క.** వి. మనస్సు నొచ్చుటయందలియనుకర
ణము.

చ. కఱకుఁదనంబులోఁడఁ గనుఁ గందనియాత్మఁ
దలంపవైతి వి,త్తెఱఁగు వినం గలుకుక్క మన
దే పగవారిమనంబు...సారంగ. ౩. ౪౦.

**కలుక్రాంత.** వి. (కలు² + క్రాంత) త్రాయంతీలత,
కలుఁగానుగుక. (శ. ర, చి. ని.)

**కలుగ(గ్ర)చ్చ.** వి.(కలు² + గచ్చ)ఒకవిధమైన
గచ్చక. (శ. ర.)

**కలుగానుఁగ(గు).** వి. (కలు² + గానుఁగ) తాలి
గానుఁగు.

క. చెఱ కొకటి గలుగఁగా మఱు, చెఱకున్ లో
నైతి మనుచుఁ జెఱకులగమి నేఁ,తఁ గలు
గానుఁగ లాడుదు,రెఱఁగి ప్రజల్ సుగుణు
లన్నరేంద్రునివీటన్. రామా. ౧. ౧౨౭.

**కలుగు(ల్గు),కలువు.** అ. క్రి. (దీనికి 'కల,లే' అ
నురూపములగు నని యెఱుంగునది.)౧.అగు.

ఆ. ఏను జాల వృద్ధ నెవ్వఁడు నా కిప్డు, గన్య ని
చ్చు నెట్లు గలుగుఁ జెండ్లి. మార్క.౭.౧౫.

క. అని చెప్పెనఁ గలదు కలదు, నిను నట్ల వచించి
యందు నిలిపితి నని యా, యనిమిషవిభుం
డు చారుని, ననుపుచుఁ బిలిపించె రంభ నచ
టికి వేగన్. కళా.౨.౧౬౭. (కలదుకలదు=
జౌనౌను.)

౨. ఉండు; నిలుచు.

ఆ. ఏను గలుగ వెఱవ నేటికి నేనలఁ, గాతు నీవు
మెచ్చఁ గౌరవేంద్ర. భార. ఉద్యో. ౭.
౨౦౩.

ఉ. ... నీ, కేఁ గలుగంగ సంపదల కేల విచార
ము పద్మగంధి...ఉ. హరి. ౧. ౬౭.

వ. ... పలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁ డక్షౌహిణులకుం గలిగె ... భార. ఉద్యో. ౧.౨౨౫.(కలిగె=చాలి యున్నవి.)

ఉ. చిత్తజుఁ డల్గి తూపు మొనచేసినఁ జేయఁగ నిమ్ము పైధ్వజం,బెత్తిన నెత్త నిమ్ము పచియింౘెదఁ గల్గినమాట గట్టిగా...విజ. వి.౩.౧౫. (కల్గినమాట=ఉన్నమాట, నిజమైనమాట.)

(పరిక్షిజ్జననము.) వ. ఇట్లు పుండరీకాక్షుండు పాండవసంతానంబు కలిగించె...భార.అశ్వ. ౩.౨౦౧.(కలిగించెన్=నిలిపెను)

౩. చాలు, ఓపు, సమర్థమగు.

చ.విరటుఁడు సూచుచుండ నిను వేవురముండట నట్లు ద్రోవ నొ,క్కరుఁడును గాదు గూడ దనఁ గల్గెనె...భార. విరా. ౨. ౨౫౭.

సీ. ఏకాండశిఖరాగ్ర మీక్షించినంతన భవబంధములఁ బెడఁబాపఁ గల్గు. విక్ర. ౧. ౯౭.

౪. పుట్టు.

క. ఆదంపతులకు సుకృత,ప్రాదుర్భావమున మంత్రిభాస్కరుఁడు దయా,పాదితబాంధవనికరమ,హోదయుఁ డగుజన్నమంత్రియును గల్గిరొగిన్. విక్ర. ౧. ౩౯.

క. నేసి మఱి తాన క్రమ్మఱ,గ్రాసము గొను నేఁత పురువుగతి నీకలుగం, జేసిన యీవిశ్వమును ర,మాసఖ మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. కవిక. ౬. ౧౭౨.

ఉ.అన్నవపట్టి నిన్ గనినయన్న వసుంధర సింధుజాతిలో, వన్నియ కెక్క నీవు గలువన్ నియతోన్నతిఁ గాంచెఁ దంద్రియున్. వసు. ౫. ౧౫.

౫. కలది యగు; కలవాఁ డగు.

ఆ...ధరామరేంద్ర,వరులఁ దనుపు మఖిలవసుమతీప్రజ కెల్లఁ, గరుణ కలుగుమమ్మ కమలనేత్ర. భార. ఆది. ౮. ౪.

సీ. ఆరాధనముసేయు మత్తమామల నెప్డుఁ బరిజనంబులమీఁదఁ గరుణ గలుగు. నైష. ౭. ౯.

శా. నామీఁదం గృప యెప్డుఁ జాలఁ గల వన్నా యేను శోకాగ్నియం,దీమాడ్కిం బడఁగా నుపేక్ష నగునే...హరి. పూ. ౭. ౩౮.

౬. సంభవించు; లభించు, ప్రాప్తించు, దొరకు.

మ. బహుబాధల్ బడఁ గల్గు నంచుఁ దమలో భాషింపఁగా...హర. ౨. ౧౯.

సీ. దండపాణిని ఢుంఢి దక్షిణామూర్తిని గాలభైరవుఁ గొల్వఁ గలుగదయ్యె. కాశీ. ౫. ౬౮.

క. పరఁటెఁడురసంబు గలుగం, గరయంత్రం బాడ నెన్నిగడలు వలయు న,న్నిరసాలకాండకంబుల్...హర. ౨. ౧౦.

ఆ. తలిరుఁబోఁడి మంచిదానవు గలిగితి, ట్లుకుగుదెంతు రమ్మ యధిపుమనసు, విరస మయ్యెనేని వెర వెద్ది మఱి చక్కఁ,జేయ నీవ చింతచేసి చూడు. ప్రభా. ౫. ౧౯.

౭. అర్హమగు, తగు.

క. ఈయునికి వారకాంతకు, నాయమె యిది యాఁడుతోడుసు నాఁటికి నాయం, బాయెనిఁకం గలకాలము,పాయక యత్తపసిగొడవఁ బడఁగాఁ గలదే. విప్ర. ౪. ౧౭.

ఉ. సిరినొక్కప్పుడు కన్మొఱంగిహరి దన్ జేరన్ బ్రహర్షించును, ర్వరకు న్వంచనఁ గూడఁగాఁ గలుగుభాస్వచ్చంద్రశాలాపరం,పర లయ్యెన్ బఱ పైనయెవ్వనిఫణాపంక్తుల్..., ఆము.౧.౨.

౮. కడచు, గతించు.

క. అనుటయు నమ్ముని యిట్లను,వనజాయతనేత్ర నీవు వచ్చి ముహూర్తం,బును లేదు పోవఁ దమకిం,చిన నే మని నీకుఁ బ్రియము చెప్పదు గరిమన్. వి. పు. ౨. ౨౮.

స. క్రి. పొందు.

సీ.శ్రమమునకై యేను సకలాంబకములు నెక్కుడువెన నేయ నయ్యెడకు నొక్క, యాఁశెయ్య యుఱికి నాయజ్ఞానమున నంపతాఁకునఁ

గూలుకు దానిఁ గలుగు, బ్రాహ్మణుం డధిక
కోపంబున నిది హోమధేనువత్సం బిట్లు దీని
కల్య,నిహతంబుఁ జేసితి నీవు నావచనశల్యం
బున నిహతుండ వగుము... భార. కర్ణ. ౨.
౯౦.

శా. కానం గానిశరీరముం గలమహోగ్రగ్రాహ
ము౯...భార. ఆది. ౫. ౨౫౭.

(ఈక్రిందిపరశురామపంతులవారి కవిత్వమునం
దు ఈధాతువు సబిందుకము గాఁ గన్పట్టుచున్న
ది.కాని దానిసాధుత్వము చింత్యము.)

లయగ్రాహి. సంగముసు భంగముఁ గలుంగ కొక
భంగిని వెలుంగుచను నే నని కనుంగొనుము
పత్నా. సీతారా. ౨. ౧౩౩.

ఉ...ఆ,లీల ననేకజీవులు గలింగి జగంబులు
నిండి యుండిరి ...మనోహరశతకము. ౭.

ఉ...నీ,పాలఁ గలుంగు మోక్షము...మనోహర
శతకము. ౩౧.

సుగంధివృత్తము. రామ రామ రామ రామ రా
మ రామ యంచుఁ ద,న్నామకీర్తనంబుఁ జే
సిన౯ గలుంగు మోక్షము౯. సీతారా. ౧.
౬౭.

ఉ. వీనులకంటిజన్నిదము వ్రేలెడుబొజ్జ గలుం
గుగుజ్జువాఁ,డే నొనరించుకావ్యమున కెప్పు
డవిఘ్నము సేయుఁగావుత౯. శుకచ. ౧.
౧౫.

జ: కలిగించు, కలిమి, కలిమికొండ, కలిమిచెలి,
కలిమిదండుగ.

**కలుచే.** వి. (సం. కలుషమ్. ప్రా. కలుస.) ౧.కలఁత,
క్షోభము. (చూ. కలుచపడు.)

౨. దోషము.

క. కలుగుం దోఁపమి యమవసఁ,గలుగునె యం
తటనె యమృతకరునకు నాశం,బలఘుపరవ
స్తువునకుం, గలదె యభావంబు మనసు గాన
నికలుచ౯. భార. శాం. ౮. ౧౮౩.

౩. క్రోధము.

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యవఃఖడ్గాహి
పైవచ్చుచోఁ, జలనం బించుక లేక యీతని.
రిపుత్మాపాలసంభూత మో, చెల హస్తాంబుజ
హాంగుళీమయమహాసిద్ధౌషధీపల్లవాం,చలము
ల్తేసె భజించు జాంగలికత౯ సంగ్రామరం
గంబుల౯. నైష. ౫. ౧౫౭.

జ: కలుచపడు.

**కలుచేపడు.** అ. క్రి. ($\surd$కలుచే) కలఁతపడు.

వ. ... తద్వధోపాయంబున కుపాయం బూహిం
చి యెద్దియుం గానక కలుచపడి పెలుచ నం
తిపురంబు వెలువడి కొలువుకూటంబునకు వ
చ్చి...నృసిం. ౫. ౮.

గీ. అంబునిధితీరమునఁ గులాయం బమర్చి,కొని
కలంగుచుఁ డిట్టిభి గ్రుడ్లఁ బెట్టి, పాదిగ నే
మఱిపాటులే కదనఁ బదనఁ,గలుచపడకుండ
నొండొంటిఁ గలపికొనుచు. వేం. పంచ. ౧.
౬౨౦.

**కలుచే(ల్చే).** స. క్రి. మోహించు,వలచు.

చ. కలువక కల్చినట్లు తమకం బెవ లేకయుఁ
గల్గినట్లు...తా నొరుఁ గల్వమి నేర్పు వేశ్య
కు౯. కు. సం. ౭. ౧౮౨.

గీ. ... కలిచె నా నలరు వలచె, ననుట...ఆం.
భా. ౩. ౯౬. ('కలచె' అపముద్రితము.)

జ: కలుపు[2].

**కలుజే(ల్జే)వ్వి=కలజువ్వి.** వి. (కలు[2]+జువ్వి.)
కూటపర్కటి, కొండజువ్వి.

గీ ... ప్లక్షసంజ్ఞ,నివ్వటిలు జువ్వి యనఁ గలుజు
వ్వి యనఁగఁ, గూటపర్కటి యగుచు ...
ఆం. భా. ౨. ౮౮.

ఉ. ... నో,ళ్లువ్విపులూరఁ ద్రేల్చి చము రట్టి
పడం గఱుకుట్లు గాల్చి క,ల్జువ్వులనీడ నొ
క్క పరిశుద్ధశిలాతలభూమి నందఱు౯. కాళ.
౩. ౫౦.

సీ. కలుజువ్వి వావిలి గండువావిలి యేఱుమద్ది మద్దియును...హంస. ౪. ౧౧.

కలుపు[1](ల్పు). స. క్రి. (√ కలియు) చేర్చు, కూర్చు.

గీ. అఖిలలోకైకనాథ నీయట్టిరూప, విక్రమౌదార్యశౌర్యవివేకనిలయు, నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ, గడుపు చల్లనికాంతలఁ గలుపు నన్ను. ఉ.హరి. ౨. ౭౫.

సీ. సంప్రణయక్రోధజంపతినివహంబుఁ గలుప వచ్చినచెలికాఁ డనంగ. గీ...వ,సంత మేతెంచె సంతతోత్సవ మెలర్ప. విక్ర. ౫. ౩.

వి. ౧. కలయిక.

సీ. సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపైఁ గన్ను వైచిన కన్నెకలుపుమరులు. నైష.౭. ౧౫౧.(కన్నెకలుపు=ప్రథమసంగమము.)

౨. పైరుమున్నుగువానిలోఁ గలిసి మొలచినగడ్డి, మొ.

గీ. మెలపుతోఁ జెట్లపాదులకలుపు దీయు, నెమ్మి దోహదధూపధూమమ్ము లిడును. నైజ. ౨. ౧౨౧.

సీ. పైరు మునుఁగ గాద బలిసినచేలలోఁ దెరలక కలుపులు దీసి తీసి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

సీ. ... కలుపు నాఁ బెరుఁగుచు గాద మొప్పు. ఆం. భా. ౩. ౫౧.

౩. దధి, పెరుఁగు; మిశ్రదధి.

క. కలు పనఁ బెరగు దధికిన్. ఆం.సం.నానా. ౧.

గీ...కలు పన, మిశ్రదధి యొప్పు... ఆం. భా. ౨. ౨౫౯.

కలిపికొను=చేర్చుకొను.

వ. ...ధర్మంబులు దేటపడ నను గ్రహించుచుం బుయిలోటవాపి నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ జేయుటం జేసి కొంకక యింకను నడిగెదను...భార. అను. ౩. ౨.

కలుపు[2](ల్పు). వి. (√కలుఁచే) మోహము,వలపు.

సీ. కర మర్థి నినుఁ జూచి కనుకలిఁ గలిచినపడఁతులకల్పు నిష్ఫలము గాఁగ. కు. సం. ౫. ౫౫౩.

కలుపు(ల్పు)ఁగోలు. వి.(√కలుపు[1])మైత్రి,ఐకమత్యము.

మ. నవపుంజుట్టము లెంద ఱేని గల రింటన్ వారు మాకై చలం,బునఁ బోరాడుదు రట్టివారలకుఁ గల్పుంగోలుఁ బుట్టింప నిం,పున మన్నింపవె నిత్యవైరము మృగంబు ల్మాని మేల్పొంద మ,న్ననఁ గావించినమంత్ర మైన మణియైనన్ మూలికైన న్మసీ.చంద్రా.౩.౧౦౭.

కలుపుఁగోలుతనము. వి.(√కలుపుఁగోలు) ఐకమత్యము.

వ. ... నటత్తటిద్వల్లీమతల్లియుంబోలె నుల్లసిల్లి యల్లిబిల్లిఁ దెచ్చుకోలువలపు దెలుపుకలుపుఁగోలుతనంబులు సలుపుచు ని ట్లనియె.రామా. ౫.౧౩౪.(ఐకమత్యపుఁజేష్టలు అని భావము)

కలుము. వి. కలుషగంధము.

ఆ. కలుము నాఁగఁ గలుషగంధ మభవ.ఆం.భా. ౧. ౧౦౬.

కలువ(ల్వ). వి. (సం.కైరవమ్. క.కలువె.) ఉత్పలము, కువలయము.

సీ.సొగసువాలు మెఱుంగుఁజూపు లాశావీథికలఁ గల్వవిరి మేలుక ట్లమర్ప. ఉ. రా. ౨.౧౨౪. నైష. ౩. ౧౬౬. ఆం. భా. ౧. ౧౬౪.

జ: కలువకంటి, కలువగొంగ,కలువ చెలి, కలువడము, కలువ ఱేడు, కలువలదొర, కలువవిందు, కలువవిల్తుఁడు.

కలువ(ల్వ)కంటి. వి. (√కలువ.) కలువలవంటి కన్నులు గలయాఁడుది, కువలయాక్షి; స్త్రీ.

సీ. చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగనీటఁ గాలభైరవు నొక్క కలువకంటి. భీమ. ౫.౧౧౩.

గీ. పుడమిలోఁపల మగవాఁడు పూని తనకుఁ, గో ర్కి యగుకల్వకంటిఁ గైకొనుచు నుండు. నీలా. ౨. ౭౭.

కలువగొంగ. వి. (కలువ + గొంగ) - కలువలకు శ త్రువు - సూర్యుఁడు.

సీ. కలువగొంగకు లేనిబలువగం గనుజీనివలువ రింగులు పైని గలుగువాని. ప్రబంధ. ౨౦౨.

ఇశ్లే: కలువ(ల)దాయ, మొ.

సీ... కలువదాయ, కూనతూ పేసి... అచ్చ. రా. యు. ౨౪౨. (కలువదాయకూనతూపు = యా మ్యాస్త్రము.) అచ్చ. రా. యు. ౭౯.

కలువచెలి. వి. (కలువ + చెలి.) కుముదబాంధవుఁ డు, చంద్రుఁడు.

గీ. కలువచెలియును బూవుదండలును మంచి, గంధమును గేళిసౌధంబుఁ గలికి మోముఁ, గా ముకునకు వికారంబు గలుగఁ జేయు. భర్తృ. ౨. ౨౯.

ఇశ్లే: కలువలయనుఁగు, మొ.

గీ. కలువలయనుంగు దూర్పుగుబ్బలిని బొడమె. అచ్చ. రా. అయో. ౧౨.

గీ. ...కల్వలయనుంగు. అచ్చ. రా. బాల. ౯౪. కలువలచెలిరేక = చంద్రరేఖ.

ద్వి. కలువలచెలిరేక కనకశలాక, తలిరులే మొ క్క మేల్ తళుకులచుక్క. మృ. వి. ౨. ౬౩.

కలువ(ల్వ)డము[1]. వి. (కలువ + వడము - సం. కై రవపటః. త. కలువటమ్.) ఉత్సవాదులందు ధ్వజ స్తంభాదులకు వ్రేలఁ గట్టెడుకలువపూదండ, ప్రా లంబమాలిక.

ద్వి. విరులచప్పరములు విరచించువారు, పురవీ థిఁ గేతనంబులు నిల్పువారు, కలువడంబులు మేలుగాఁ గట్టువారు. రం. రా. అయో. ౨౨ పా.

ద్వి. కలువడంబులు గట్టి కాంచనదండ, కలితప తాకలు గ్రందుగా నెత్తి. ద్వి. పారిజ్ఞ. ౨౨౯పం.

కలువ(ల్వ)డము[2]. వి. వితానము, మేలుకట్టు.

గీ. కలువడము చందువా మేలుకట్టనంగ, నతిశ యిల్లు వితానాహ్వయములు సాంబ. సాం. ని. మాన. ౧౯.

కలువ(ల్వ)ము. వి. మందు నూఱెడిరాయి. (శ. ర)

కలువ(ల్వ)ఱేకు. వి. (√కలువ) కువలయదళము.

సీ. కలువఱేకులయేపు ఖంజనంబులరూపు నిరసిం చువాల్చూపునీటుదాని. ఉ. రా. ౨. ౨౬౬.

(బ) పిఱుఁదులమీఁది నఖక్షతములు, ఉత్పలపత్ర ములు.

సీ. ...పిఱుందుపైఁ గానుపించిన యవి కల్వఱే కు, లనఁగ నెసఁగు... వేంక. మాన. ౭౫.

కలువలదొర. వి. (కలువలు + దొర) చంద్రుఁడు.

క. కనికరము లేక తనచక్కనికరముల గాసిఁ బెట్టెఁ గలువలదొర... రా. వి. ౪. ౪౪.

ఇశ్లే: - కలువలరాయఁడు, మొ. ఉ. రా. ౭. 3౫౬.

కలువఱేఁడు. దశా. ౨. 3౦౨.

కల్వలసామి. ముకుంద. ౨. ౧౨ 3.

కలువలఱేనితోడు = లక్ష్మి. ఆం. భా. ౧. ౪౧.

కల్వరారాయి = చంద్రకాంతశిల. అచ్చ. రా. బాల. ౨౧౪.

కలువ(ల)విందు. వి. (కలువ + విందు) కుముద బాంధవుఁడు, చంద్రుఁడు.

గీ. గరముతోఁబుట్టువగుటనో కలువవిందు, కం దు దనయందుఁ దాల్చె లక్ష్మణకుమార. రా మా. ౬. 3౦. విక్ర. ౭. ౧౦౨.

కలువవిల్తుఁడు. వి. (√కలువ) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు. సానందో. ౫. ౯౧ పా.

కలుషము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆవిలము, క లఁగఁబాఱినది. ౨. మలినము. 3. గర్హితము, నింది తము. ౪. అసమర్థము, చాలనిది. ౫. కృష్ణము, నల్ల

నిది. వి.అ.పుం. ౧.మహిషము, దున్నపోతు. ౨. నలుపు. (కే.ని.)న. ౧. మురికి, మాలిన్యము. ౨. పాపము.

**కలుషించు.** సం. అ. క్రి. కలఁగఁబాఱు, కలఁత నొందు; కోపించు.

సీ. ... బ్రహ్మఋషుల నేడ్వుర సృజియించి వారిఁ, గని నన్నుఁబూజింపుఁడనిన నాసంయము లాత్మలోపలఁ బరమాత్మఁ గొలువఁ, గలుషించి వైకారికస్వరూపుఁడు పద్మజన్ముండు మద్వ్యభిచారకారు.గీ.లారకాన దురాచారులారకాన,కితవకృత్యంబు లిట్లు చేసితిరి మీరు,బ్రహ్మవిజ్ఞానగర్వంబు పదటిపాలు, గావలయు నందు ఘోరంబుగా శపించె. వరాహ. ౫. ౧౨.

**కలుషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కలఁగఁబాఱినది, కలఁగినది. ౨. పాపయుక్తము.

**కలుసుఁగూర.** వి. (కలుసు + కూర) అనుపుగా వండినకూర.

సీ. కలుసుఁగూరలును బజ్జులుఁ దియ్యచేరులుఁ బంచదారలు నానవాలు జున్ను. జై. భా. ౩. ౫౦. (శ.ర. పా.'పులుసుఁగూర' ముద్రి. పా.)

**కల్కనము.** సం. వి. అ. న. శఠత్వము.

**కల్కఫలము.** సం. వి. అ. పుం. దానిమ్మ.

**కల్కము.** సం. విణ. (అ. ఆ. అ.) పాపి, దుష్టము. వి. అ. పుం. న. ౧. దంభము, కపటము. ౨. పాపము. ౩. విష్ఠ, పురీషము. ౪. కిట్టము, గులిమి మొదలగు దేహమలము. ౫. నెయ్యి నూనె లోనగువానిని కాఁచి పక్వము సేయునపుడు వానియందు వైచెడుఓషధిద్రవ్యవిశేషము; నెయ్యి నూనె లోనగువానియందు అడుగున నిలిచినమడ్డి. ౬. మురికి. ౭. తురుష్కమనెడుగంధద్రవ్యము. ౮. చూర్ణము, పొడి.౯.విభీతకము, తాండ్ర.

**కల్కి.** సం. విణ. (న్. నీ. న్.) కల్కముకలది.వి. న్,ఇ. పుం. విష్ణుదేవునిపదియవయవతారము.

**కల్జే.** వి. కంసాలి, వడ్రంగి, మొ.

సీ. వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్జుని త్తము రంజకానిపాలు. రామలిం. ౨౩.

**కల్పకము.** సం.వి.అ.పుం. ౧=కల్పము.౨.కచ్చూరము,కచోరము. ౩. కల్పవృక్షము.

**కల్పకారుఁడు.** సం. వి. అ. పుం. ౧. కల్పసూత్రకారుఁడు(కాత్యాయనాశ్వలాయనాది).౨.మంగలి. (వాచ.)

**కల్పకుఁడు.** సం. విణ. (అ.ల్పికా.అ.)౧.కల్పించువాఁడు, రచించువాఁడు. ౨. ఆరోపించువాఁడు. వి. అ. పుం. మంగలి, నాపితుఁడు.

**కల్పన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నిర్ణయము, ఏర్పాటు. ౨. రచన; చేఁత, చేయుట. ౩. కైసేఁత, అలంకరించుట. ౪. ఆరోపణము, లేనిది మోపుట. ౫. లేనిది నిర్మించుట, క్రొత్తగాఁ గలిగించుట. ౬. ఊహ, భావన. ౭. (న్యాయ) వ్యతిరేకవ్యాప్తిజ్ఞానాధీన మగుఅనుమాన భేదము. ౮. (మీమాంస)అర్థాపత్తి యనుప్రమాణవిశేషము.౯.ఎక్కుటకై ఏనుఁగు నాయితముసేయుట.

**కల్పనము.** వి. కలాఁపి, కలయంపి.

సీ. పూనీరు కలువపుప్పొళ్లను దంపించి నునుపు మీఱంగఁ గల్పనముఁ జల్లి. ల.వి. ౫. ౨౨.

**కల్పనము.** సం.వి. అ. న. ౧.ఏర్పాటు,నిర్ణయము. ౨. రచన;చేఁత, చేయుట. ౩.ఛేదనము,కత్తిరించుట. ౪. ఆరోపము,లేనిది మోపుట. ౫. సాలెవానిమగ్గము. (వై. ని.)

**కల్పని.** సం. వి. ఈ. స్త్రీ-కత్తిరించుసాధనము-కత్తెర.

**కల్పనీయము.** సం=కల్ప్యము.

**కల్పనుఁడు.** సం. వి. అ. పుం. ప్రపౌత్రునియొక్క ప్రపౌత్రుఁడు. (వై.ని.)

**కల్పపాలుఁడు.** సం. వి. అ. పుం. శౌండికుఁడు, గ వుండ్లవాఁడు. (హలా. ని.)

**కల్పమానము.** సం.విణ. (అ.ఆ.అ.) కల్పించుచున్నది.

**కల్పము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉచితము, తగినది. ౨. సమర్థము, ఓపినది, చాలినది. ౩. ఈషదసమాప్తిని సూచించును. (ఉదా: విద్వత్కల్పుఁడు=పూర్ణముగా విద్వాంసుఁడు కానివాఁడు. ప్రభాతకల్పము, దీపకల్పము, మొ-ఇది యీయర్థమున ప్రత్యయము.) వి.అ.పుం.౧. న్యాయము. ౨. వికల్పము, పక్షాంతరము. ౩. విధి. ౪. వైదికవిధానములను దెలుపుశాస్త్రభేదము. (ఇది ఆశ్వలాయనాపస్తంబబోధాయనకాత్యాయనాదిసూత్రరూపముగా నుండునొక వేదాంగము.) ౫. సంకల్పము, ఉద్దేశము. ౬. ప్రళయము. ౭. బ్రహ్మదినము. (మనుష్యమానమున నాలుగుయుగములును వేయిమాఱులు తిరిగి వచ్చినచో బ్రహ్మకొకపగలు అగును. బ్రహ్మయొక్క దివాభాగమున జగత్తు చేష్టాయుక్తమగును. అతని రాత్రిభాగమున జగత్తు నిశ్చేష్టమై యుండును.) ౮. విభీతకము, తాండ్రకాయ. ౯. కల్పవృక్షము. ౧౦. మద్యవిశేషము.

**కల్పయత్.** సం. శత్రు. కల్పించుచున్న.

**కల్పయిత.** సం=కల్పిత.

**కల్పయితవ్యము.** సం=కల్పితవ్యము.

**కల్పలత.** సం. వి. ఆ. స్త్రీ. కల్పవృక్షము.

**కల్పవృక్షము.** సం.వి. అ.పుం. ౧. కోరినవస్తువు లిచ్చెడిదేవవృక్షసామాన్యము, వేల్పుమ్రాను.
శ్లో...కల్పద్రుమాణామివపారిజాతః. సం.రఘు. ౬. ౬.
౨. దేవవృక్షవిశేషము (ఇవి అయిదు:-మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము) - ఇట్లే: కల్పతరువు, మొ.

**కల్పాంతము.** సం. వి. అ. పుం ప్రళయము, త్రుంగుడు.

**కల్పి.** సం.విణ. (న్.నీ.న్.) ౧.రచించువాఁడు. ౨. ఆరోపించువాఁడు. వి. న్. పుం. మంగలవాఁడు.

**కల్పించే.** సం. స. క్రి. ౧. సృజించు.
గీ. బహుళజలమధ్యమునఁ జెనుఁబాఁపపాన్పు,
పైరజశ్శక్తి గైకొని పవ్వళించి, లీల నఖిల
లోకములు గల్పించు వినయ,ధుర్య నారా
యణాఖ్యచతుర్థమూర్తి. మార్క. ౧. ౧౧౫.
౨. రచించు. (శ. ర.) ౩. (లేనిది) కలిగించు, పుట్టించు.
(వ్యవ) ఇది కల్పించినకథ కాని నిజమైనది కాదు.

**కల్పిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ)=కల్పకుఁడు.

**కల్పితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. రచితము; చేయఁబడినది. ౨. వ్యంజితము, స్ఫుటపఱుపఁబడినది. ౩. ఆరోపింపఁబడినది, కల్పనచేయఁబడినది. వి. అ. పుం. ఎక్కుటకు ఆయత్తము చేయఁబడినయేనుఁగు.

**కల్పితవ్యము.** సం=కల్ప్యము.

**కల్ప్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కల్పింపఁబడుచున్నది.

**కల్ప్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. రచింపఁదగినది. ౨. ఆరోపింపఁదగినది. ౩.అనుష్ఠింపఁదగినది.

**కల్మషము.** సం.విణ. (అ.ఆ.అ.)౧.పాపము గలది. ౨. మలినము, మురికి గలది. వి. అ. పుం. న. ౧. పాపము. ౨. హస్తపుచ్ఛము, మనికట్టుక్రింది చేయి. ౩. మాలిన్యము. ౪. మడ్డి మొదలగుమలినపదార్థము. పుం. నరకభేదము.

**కల్మాషకంఠుఁడు.** సం. వి. అ. పుం. ఈశ్వరుఁడు.

**కల్మాషపాదుఁడు.** సం. వి. అ. పుం. ఒకరాజు.

**కల్మాషము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. చిత్రవర్ణముకలది. (అమరము-నలుపు తెలుపు కలిసినవన్నె గలది. వై.ని.) ౨. నల్లనిది.వి. అ. పుం. ౧.చిత్రవర్ణము. (అమరము-నలుపు కలిసిన తెలుపు. వై.ని.) ౨. నలుపు. ౩. గంధశాలి, ఒక జాతివరిక్.

**కల్మాషి.** సం. వి. ఈ. స్త్రీ-నల్లనిది-యమునానది.

**కల్మాషుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

**కల్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సుర, మద్యము. ౨. హరీతకి, కరకక్.

**కల్యజగ్ధి.** సం.వి.ఇ.స్త్రీ. ౧. ప్రాతఃకాలమున భుజించుట. ౨. ప్రాతరాశము, చలిది.

ఇశ్లే:- కల్యాశము, మొ.

**కల్యము.** సం.విశ.(అ.ఆ.అ.) ౧.రోగము లేనిది,నిరామయము. ౨. సజ్జము,ఆయితమైనది, సిద్ధమైనది. ౩. సమర్థము, నేర్పరి. ౪. ఉపాయము కలది. (మాట) ౫. శుభమైనది.(మాట) ౬. ఏడమూకము, చెవిటిమూఁగ.వి.అ.న. ౧.ప్రత్యూషము, వేకువ.౨. నిన్న. (కే.ని.) ౩. (జ్యోతి)లగ్నము. ౪. మధువు, కల్లు.

**కల్యవర్తము.** సం.వి.అ.పుం. ప్రాతరాశము.(త్రిని)

**కల్యాణబీజము.** సం.వి.అ.న. మసూరము,చిఱుసెనగక్. (రాజని.)

**కల్యాణము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. అక్షయము, నాశము లేనిది. ౨. శుభయుక్తము;శుభకరము.వి.అ.న. ౧.ఉత్సవము, పండుగు. ౨. బంగారు. ౩.శుభము, మంగళము; వివాహము.

శా. ... రుక్మిణీకల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్. భాగ. ౧౦ పూ.౧౬౮-౨. (రుక్మిణీకల్యాణంబు=రుక్మిణీ వివాహకథ అని భావము.)

కల్యాణ మగు=పెండ్లియాడు.

గీ. అంబమాంబికఁ గల్యాణ మైననాఁడె, వాసి గలకీర్తిలక్ష్మికి నేసవెట్టె.పాండు.౧.౪౧.

**కల్యాణి.**సం.విశ.(న్.నీ.న్.) కల్యాణము గలది.వి. ఈ.స్త్రీ. ౧.మాషపర్ణి,కారుమినుముక్. ౨.గోవు. ౩. (సంగీ)రాగభేదము. ౪.భూమి. ౫.పార్వతి.

**కల్యాణిక.** సం.వి.ఆ.స్త్రీ. మనశ్శిల,మణిసిల.

**కల్యాణిని.** సం.వి.ఈ.స్త్రీ.బల,ముత్తవపులగముక్.

**కల్యా(ల్య)పాలుఁడు.** సం.వి.అ.పుం. శౌండికుఁడు, గవుండ్లవాఁడు.

**కల్ల.** వి. (క.కళ్. త.కళ్లమ్.) ౧.అసత్యము,అనృతవచనము.

ఆ.వె. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల, దబ్బు తక్కు టక్కు తవలి తవలి, తసుకు నసుకు దుద్దు తటవట తవతవ, సట హుళిక్కి నానసత్య మభవ. ఆం. భా. ౧. ౧౧౬.

౨. తప్పు, నేరము, అపరాధము.

మత్తకోకిల. కల్ల లే దని విన్నవించుట గాదు వల్లభ యీతనిం, బ్రల్లదుం డెగఁ జూచి లేని ...మా, తల్లిదండ్రులు పుత్రశోకము దాల్చి చిక్కుదు రీశ్వరా. భాగ. ౧౦ పూ. ౧౬౭.

గీ. కాశికాపట్టనద్రోహిఁ గావు మభవ, విశ్వపతి దూషితునిఁ బ్రోవు విశ్వనాథ, కల్ల చేసితిరక్షింపు కాలకంఠ, యనుచుఁ బ్రార్థించు భీమనాయకునిఁ దపసి. భీమ. ౩. ౧౯౩.

౩. పరుషవచనము.

సీ. తనతల్లి విసివి నిన్నను గొన్ని కల్ల లాడుటయు నే వెళ్లిపోవుటయుఁ గలదు.పరమ.౩.౫౭.

౪. భంగము, హాని.

వ. ఈధర్మానకు ఎవ్వరు కల్ల తలంచినారు పంచమహాపాతకాలు చేసినదోషమును పొందుదురు: ౧.౫౯౩. గు. జి.అమీనాబాదుశాసనము.

(యముఁడు తనకింకరులతో నన్నమాట.)గీ.శ్రీనాథ గిరీశ లక్ష్మీపతి త్రిపు,రారి వసుదేవసూ

నఁడ త్ర్యక్షు యనుచు, జపము సేయుదు రె
వ్వ రావిపులపుణ్యా,ఘనులఁ గదిసినప్పుడ మీ
కుఁ గల్ల వచ్చు. కాశీ. ౩. ౧౬౧.
౫. లోఁటలోనగుదాని వెలుఁగు, కట్టువ.
సీ. ... ప్రాచీనసంజ్ఞలు పరఁగుచుండు. గీ. వెలు
గు కల్ల యనంగను ... ఆం. భా. ౨.౧౨.
విశ. ౧. అసత్య మైనది, అనృత మైనది.
మ. గుణమా సెబ్ర వివేకమా నహి మనోగూఢత్వ
మా లేదు భాషణమా కల్ల విచారమా తవళి
వంశాచారమా నాస్తి ... హంస. ౫. ౧౧౧.
సీ. పాలు పిండని గొడ్డుబర్రె కాసులు మెండు కల్ల
పసిండికిఁ గాంతి మెండు. వేణు. ౧౭.
౨. పరుషము. (శ. ర.) ౩. మాయాకల్పితము;
మాయావి.
ఆ. పునుకతాల్పువిల్లు మునిమెఁ దాటకఁ జంపె,
ఖరునిఁ దేర్చె వాలిఁ గడవఁబనిచెఁ, గల్లజిం
కఁ ద్రుంచె గండగొడ్డలితాల్పు,గరువ మడఁ
చె నతనికడిమి యనదె. అచ్చ. రా. యు.
౫౭.
క. విను మేము కల్లసారెలు, గొని కపటపునెత్త
మాడుమశలతఁ గా దొ,ప్పనివారి నేపడంచు
ట, ఘనబాహుస్వైరకేళిఁ గాని దురాత్మా.
భార. శల్యా. ౨. ౭౮౧.
ఆ. అపుడు మొసలి వేల్పుటలివపమై తనతోఁటి,
కతయు నచట నున్నకల్లతపసి, తెఱఁగు నత
నితోడ నెఱిఁగించి పసిఁడిలే,రెక్క వేల్పు
ప్రోలి కేఁగె నంత. అచ్చ. రా. యు. ౪౧౭.
కల్లవెల్లి యగు=చెల్లాచెదరగు.
(రతివిలాపము.) గీ. అరితికాఁ డైనపూవిల్తు న
ట్టె కొట్టె,కల్లవెల్లిగఁ జేసె నాకాఁపురంబు.
పార్వ. ౩. ౧౧౭.
ద్వి. ఎదురను బసి గుబ్బి మేనుంగు బండి, యది
యేమి సోద్దెమో కదియంగ వెఱచు, నల్లంతఁ
బొడగని చల్లన నవసి,కల్లవెల్లై పాలు ...
బస. పు. ౮. ౩౮ పం.
జ: కల్లతనము, కల్లరి, కల్లరితనము, కల్లరీఁడు,క
ల్లరుజు, కల్లవాఁపు, కల్లవాటు, కల్లసేయు.
కల్లతనము. వి. (కల్ల+తనము) ౧. వంచన, మోసము.
ఉ. కల్లతనంబు గాక పొడగట్టినపూర్వపురీతి
నేఁడు నా, యుల్లమునందు నుండుము ...
భాగ. ౬. ౫.
ఉ. గట్టిపచేఁతలుం బసలుఁ గల్లతనంబులు నీవు
పుట్టఁగాఁ, బుట్టినవి ... పారి. ౧. ౧౨౭.
౨. నేరము, తప్పు, అపరాధము.
గీ. అధిప సంకల్పవైషమ్య మగుటఁ జేసి, హోత
కల్లతనంబున నువిద గలిగె,నైనఁ గలిగింతు నీ
కుఁ బ్రియాత్మజునిని,నీవు మెచ్చంగఁ జూడు
నా నేర్పుబలిమి. భాగ. ౯. ౧౮.
ద్వి. నృపునితో నొండను రెండుగాఁ జెప్పి, క
పట మేర్పడఁ బెట్టి కల్లతనంబు, నీమీఁద
మోపుట నిక్కంబు ... నవనాథ. ౧. ౫౫ పా.
౧౭ పం.
౩. దుశ్చేష్ట, చెడుతనము.
గీ. అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ,
యీవు పానరించుదుర్వృత్త మెఱిఁగె నేని,
కల్లతనములు పలుమాఱుఁ గప్పిపుచ్చు, నట్టి
నామీఁదఁ జంపంగ నలుగకున్నె. కాశీ. ౮.
౯౦.
(మూలము:-ఆచ్ఛాదయామి తే నిత్యం పశ్యా ర
గ్రే కుచేష్టితమ్.)
క. అల్లుండ్రఁ గూఁతు లందఱుఁ, బొల్లమతిం బి
లిచి తెచ్చి పూజన లిడుచుఁ, గల్లతనంబున
దక్షుఁడు, చెల్లింపఁ దొణంగెఁ గ్రతువు శివ
రహితముగ. వీర. ౧. ౯౭.
కల్లము. వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి,
మల్లబంధవిశేషము; రతిబంధవిశేషము.
సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కిస ... గీ ...
నాఁగఁ జెన్నలరుచుండు,ముప్పదియు రెం

మ...కన్న గాండ్రు విని రాజద్వారముల్ సొచ్చి
కా,వలికాండ్రం గనుఁబ్రామి ... కాశ. ర
౫౨.

కావలివాఁడు=కావలికాఁడు.(కావలి+వాఁడు.)

ఉ. కావలివారిఁ దోలి యెసకంబున గోవులఁ బ
ట్టికొంటి నం,చీవెడమాట లేల ... భార.
విరా. ర. ౧౯౨.

కావలుఁడు= కావరుఁడు. విశే. కావలము గల
వాఁడు.

(మదము గలవాఁడు, గర్వి.)

ఉత్సా.పోరి చూచి సత్తికన్ను బొత్తికన్ను నిం
గితా,కారముల నెఱుంగు దీవు కావలుండవై
యహం,కారవృత్తి నీకునల్కక న్నెఱింగి త
ప్పఁబో,నేర వైతి...కు. సం. ౫. ౫౫౯.

ద్వి. రావణుఁ డట ఘోరరణకళాకేళిఁ, గావ
లుఁ డగుచు దిక్పాలుర నెల్లఁ, బఱచినలో
ల్లింటిభంగముల్ ... రం. రా. సుం. ౨౭౧.
పా.౧౫. పం.

ఉ. కావలుఁ డైనవీఁడు తగుకార్యముపట్టునె వీ
నికెమ్మెయిం,జావు నిజంబు...భార. విరా.
౨.౭౯.(ప్రాఁతప్రతి పా-కావలమైన.ముద్రి.
భాల. వ్యా.)

కావలె=కావలయు. (చూ.వలె.)

(అవశ్యక మగు.)

(వ్యవ) ఆపుస్తకము నాకుఁ గావలెను. ఇమ్ము.

(గర్హణమును దెలుపును)

ఉ... భవిష్యదర్థముల్, గాననినా మనంబునకుఁ
గావలె నిట్టివిషాదవేదనల్. నరస. ౨. ర౭.

కావా. వి. (హిం. కావా) అశ్వములమండలాకార
గతి.

క. అపనములఁ గీరావలి,యావలితగతిన్ భ్రమిం
చునందం బలరెన్,గావా తిరిగెడుమారుని,
మావులు నా నపుడు నికటమండలగతులన్.

కెద్దనభద్రాపరిణయము. ౧. ర౧పా.(ప్రాఁత
ప్రతి.)

కావారము. సం. వి. అ. న. శైవాలము,నాఁచు.

కావారి. సం. వి. ఈ. స్త్రీ. గడ్డి మన్నగువానిచే
నిర్మింపఁబడినగొడుగు. (త్రి. ని.)

కావి. వి. (క. త. తు. కావి) ౧. ఎఱుపు.

గీ. కావి జా జెఱ్ఱన యెఱుపు జేవురు తొవ,రనఁ
గ రక్తాఖ్య నెలయు...ఆం. భా. ౧. ౧౦౯.

౨. కాషాయవస్త్రము, ఎఱ్ఱబట్ట.

సీ. కావి యంచనఁగను గాషాయమై యొప్పు...
ఆం. భా. ౨. ౧౫ర.

(వేశ్య) సీ. కమలాతనూజరాగరసంపునడబావి
జలజాస్త్రుటెక్కెంపుసన్నకావి. వైజ. ౧.
౧౦౨.

ఉ. ఇందునిభాస్య మైతొడవు లేల ధరింపవు
నున్నకావు లీ,నెందును మాన లేవు దెలు పే
టికిఁ గట్టితి...పారి. ౧. ౧౧౫.

విశే. ఎఱ్ఱనిది, అరుణము.

గీ...పోటులఁ దొరఁగురక్తాంబుధార,లంగ మె
ల్లను గప్పిన నప్పు డొప్పెఁ, గావిసెలయేఱు
లెల్లెడఁ గలయఁ బర్వఁ,బొలుచుకులపర్వతం
బుచాడ్పున నతండు. భార. శల్య. ౨.౧౦౧.

వ...కావి యగుమోవియు...హర. ౩. ౨౩. వి
క్ర. ౧. ౧౩౬.

జ: కావిగొను, కావిగోఁచిదారి, కావితాలుప్ప,
కావిబాయి.

కావించే. స. క్రి. (√అగు) కాఁజేయు,అగునట్లు
చేయు.

౧. కలిగించు, లభింపఁజేయు.

క. సేవితమై జనులకు నది, గావించు ననూనధర్మ
కామార్థంబుల్. భార. అర. ౨. ౨౫౩.

౨. చేయు, చలుపు.

క. దురితము కావించి తొలఁగుదునె పరమున
కున్. ఆము. ౩. ర౭.

గీ. చంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి, వట్టి
మ్రాఁకులఁ జిగురులు పుట్టునట్టు. విక్ర. ౧.
౧౧౨.

౩. సిద్ధముచేయు.

గీ. ఓగిరంబులు గావించు నొప్పు గాఁగ. కాశీ.
౩. ౨౧౨.

౪. సృజించు; నిర్మించు; రచించు.

సీ. ప్రళయకాలంబున జలముల విష్ణుండు యోగని
ద్రారతి నొందిమేలు,కాంచి లోకంబులు గా
వింపఁ దలఁప నహంకార మెసఁగె...భార.
శాం. ౬. ౪౭౯.

సీ. పెలుచ నల్లిండ్లు నిల్పెద నన్న నదలించుఁ
జెలువు గావింప నెంచినను గసరు. విప్ర.
౩. ౧౫.

క. నీ విప్పు డాంధ్రభాషం, గావించుచు నున్న
చంపుకావ్యమ్ము...వి. పు. పీఠి. ౨౫.

౫. నెఱవేర్చు, సఫలము చేయు.

మ...భవదిష్టం బేను గావింతు...పారి.౪.౧౨.

౬. ఆరోపించు.

గీ. మిత్త్రభేదంబు సేయ నమిత్త్రుఁ డెవ్వఁ,డట్లు
సౌమిత్త్రికిని గోప మడర నన్ను, నహితుఁ
గాఁ జెప్పినాఁడొ నాయందు దోష, మొం
డు గావించి యాతండు మందువాఁడొ.భా.
రా. కిష్కిం. ౪౫౩.

కావిగొను. అ. క్రి. (కావి+కొను) ఎఱ్ఱనగు,ఎఱ్ఱ
పడు.

క. ఈవిధమున నతికరుణము,గా వనరుహనేత్త్ర
కన్నుఁగవధవళరుచుల్,గావిగొన నేడ్చి...
మనుచ. ౨. ౭౧.

కావిగోఁచిదారి=కావితాలుపు. వి. (కావి+గోఁ
చి+దారి) సన్న్యాసి. ఆం.భా.౨.౧౭౬.

ఇక్లే:-కావిపుట్టగోఁచులసామి. ఆం. సం. మాన.
౨.

కావితాలుపు(ల్పు). (కావి + తాలుపు) స
న్న్యాసి, కాషాయధారి. (శ. ర.)

కావిరి. వి. ౧. నలుపు, కృష్ణవర్ణము.

ఉ. నావుడు రోషవహ్నివలనం బొగ రేఁగినభం
గి మోమునం, గావిరి పర్వ నంగమునఁ గంప
ము నివ్వటిలంగ...ఉ. హరి. ౫. ౨౧౬.

౨. పొగవంటి నల్లనిపదార్థము. (ఇది ఉత్పాత
ములలో నొకటి.)

ద్వి. కప్పు మీఱినయట్టికావిరి విరిసెఁ,గప్పె నల్గ
డలఁ జీకట్లు సాంద్రముగ. ద్వి. పరమ. ౨.
౧౧౫. సౌ. ౯పం. (చి. ని. పా.)

సీ. తేరివాజులు మ్రొగ్గె దెసలఁ గావిరి గప్పె బ
హుచిత్త్రమేఘముల్ బయల నిండె. భా.రా.
అర. ౧. ౧౭౨.

తోటకము. మొరసెన్ సురగోముఖవాద్యత
తుల్,నెరసెన్ మలయానిలలోలగతుల్,విరి
సెన్ బలుకావిరి నల్దెసలన్,గురిసెన్ విరుల
గ్గురులగ్నమునన్. సమీర. ౨. ౧౨౨.

విణ. నల్లనిది.

ద్వి.కావిరిచీకటుల్ గవిసె లోకముల.విష్ణు.పూ.
౩ ఆ. (శ.ర.)

కావిరిబొట్టు. వి. (కావిరి + బొట్టు) పీడాపరిహా
రార్థము శిశువులకు పెట్టెడునల్లనిబొట్టు.

సీ. ఫాలభాగంబుపైఁ బరఁగుకావిరిబొట్టు కా
ముని గెల్చినకన్ను గాఁగ. ఆ... బాలలీలఁ
బ్రౌఢబాలకుండు, శివునిపగిది నొప్పె శివు
నికిఁ దనవును, వేఱు లేమిఁ దెల్ప వెలయు
నట్లు. భాగ. ౧౦. పూ. ౨౯౭. ("కావలి
బొట్టు" పాఠాంతరము అని శ. ర-అప్పుడు
కావలిగా నుంచుబొట్టు అని వ్యుత్పత్తి.)

కావిటాయి. వి. (కావి+టాయి) ఎఱ్ఱనిసుద్దటా
యి, జేగుఱుటాయి. (శ. ర.)

కావిళము. వి. చేఁప? మొసలి?

సీ. రమణీయ మైనట్టిరాచిల్క_కత్తళా విలసిల్లుడ
గరకావిళముపడగ. గంధ. ౧. ౬. (డగరకా
విళము=మగకావిళము.)

కావు[1]. వి. ౧. రోదనధ్వని కనుకరణము.

క...చంటిపాపఁడు, కాటుకకన్నీరు దొరుఁగఁ
గావున నేడ్చెన్. వేం. పంచ. ౪. ౪౪౪.

ఉ. ఎత్తిలికావుకావు రని యేడ్చి తదీయపయో
ధరాగ్రముల్, కుత్తుకదాఁకఁ బీల్చికొని...
హరి. పూ. ౫. ౧౫౦.

కావు[2]. వి. ౧. తిలకవిశేషము.

(క) దొంగలు తా మితరులకుఁ గనఁబడకుండు
టకై పెట్టుకొనెడుతిలకము.

సీ...కావుబొట్టు, జిలుఁగుఁగన్నుఁగత్తి బలపం
బు... వేం. పంచ. 3. ౧౯౯.

గీ. కావు ములుబంతి సికముల్లు గద్దగోరు...ధరిం
చి. ప్రబంధ. ౨౫౯.

(చ) దయ్యాల విడిపించుమాంత్రికులు ధరించె
డుతిలకము.

క. కందుబలుకావుఁ బెట్టుక, చెందొవరామాం
త్రికుండు చీకటిదయ్యా,లం దఱుమ బూదిఁ
జల్లిన,పొందిక వెన్నెల చెలంగె బుధులు ను
తింపన్. ప్రబంధ. ౨౨.

-ట-(త.కావు)పిల్లలకు రక్షార్థము పెట్టుతిలకము.

సీ. కనుదోయిఁ దిన్నగాఁ గాటుక దీరిచి నుదు
టిపై నునుఁగావు కుదురుకొల్పి.చంద్రా.౨.3.

౨. బొట్టు, తిలకము.

సీ. తెల్లజిల్లెడు వేరు పిల్లారిది వెగూఁడు గాజుటద్ద
ము కావుకరపటంబు. బహు. ౫. ౧౨౯.(కా
వుకరపటము=బొట్టుపెట్టె, స్త్రీలు తిలకాది
సామగ్రి యుంచుకొనెడు పెట్టె.)

3. వశీకరణముకై పెట్టుకొనెడియంజనము.

శా...చెలి నేత్రాబ్జంబుల న్వాళ్యల,క్ష్మీమూలం బగు
కావు నించె నన నుంచెం గజ్జలం బింతికిన్.
వసు. ౫. ౧౧౭.

కావు[3]. వి. పాఁతఱ లోనగువాని పైకప్పు.

వ... ఎసరుగాఁ దేట లగు లేటినల్లలు గుమ్మరించి
లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుఁ
గప్పి. మనుచ. ౪. ౬౦.

క. ఇం దుండి పోఁగువాఱుం,డం దందు న్వలల
నొడ్డుఁ డవ్వలియోదా,లం దుండి కావు గ
ప్పుఁడు,ముండటఁ గెలఁకులను నిలిచి యున్న
రక మెయిన్. కవు. ౪. ౨౨.

కావువేయు=గాలి చొరకుండ గడ్డి మున్నగునవి
కప్పి పచ్చికాయలు పండ వేయు.

(వ్యవ) వేయిమామిడికాయలు కావు వేసినారు.

కావువచ్చు=కావు వేయుటచే పండు.

(వ్యవ) బుట్టిలో పండ్లు కావువచ్చినవి. కావున
తీయవచ్చును.

కావుట=కావుడు. (√అగు) వి.అగుట. (ఇది అగు
ధాతువుయొక్క భావార్థకరూపము.)

చ...ఇది సిద్ధము గావు డెఱంగి భక్తి నెవ్వఁ
డు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుచు
నల్ల నోడుదున్. భార. ఆది. ౧. ౧౩౭.

క. జీవుఁడు మత్స్యము వేతుఁడు, గావు దెఱుఁగ
వలయు దృఢముగా...భార.శాం.౬.౩౭౫.

కావుడు=కావుట.

చ...వారమృతాత్ములు గావు డొప్ప దే.కు.సః.
౨. ౭౯౪.

కావుత=కాత. ద్రు. అగుధాతువుయొక్క ఆశీరా
ద్యర్థకప్రత్యయాంతరూపము.(ఇది ప్రాయికము
గా ఆశీరర్థమున తద్ధర్మార్థకక్రియలకు అనుప్ర
యుక్త మగును.) ఆశీరర్థకము.

ఉ... అంబ కృతిప్రభుఁ బ్రోచుఁగావుతన్. శ
శాం. ౧. ౧౫.

ఉ...శాంబకీ,భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టసు
ప్రతిపాది గావుతన్. మనుచ. ౧. ౨.

కావున=కాన. అవ్య. ద్రు. (√ అగు) హేతువు
దెలుపును.

ఉ. పోరిత మైన నింతకును బుట్టు మహాపద గా పునర్ధరి, శ్రీరమణాగ్రగణ్యా గణుతించి యవశ్యము పొం దొనర్పవే. భార. ఉద్యో. ౩. ౨౬౨.

కావృకము. సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. చక్రవాకము, జక్కవ. ౩. పీతమస్తకపక్షి, పచ్చతల గలయొక జాతిపిట్ట. (కల్ప)

కావేరము. సం. వి. అ. న. కుంకుమపుష్పి.

కావేరి. సం. వి. ఈ. స్త్రీ. ౧-కవేరపుత్రి-దక్షిణ హిందూస్థానమందలి యొకనది. ౨. వెలయాలు, వేశ్య. ౩. పసుపుచెట్టు.

కావ్యా. సం. వి. ఆ. స్త్రీ. ౧. పూతన, ఒకరాక్షసి. ౨. బుద్ధి. (మే. ని.)

కావ్యము. సం. వి. అ. న. ౧. కవికృత మగుగ్రంథము, కబ్బము. ౨. సుఖము.

కావ్యలింగము. సం. వి. అ. న. ఒకానొకఅర్థాలంకారము.

కావ్యార్థాపత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకయర్థాలంకారము.

కావ్యుఁడు. సం. వి. అ. పుం. శుక్రుఁడు.

కాశకము. సం. విశ. (అ. శికా. అ.) ౧. ప్రకాశించునది. ౨. ప్రకాశింపఁ జేయునది. వి. అ. పుం. కాశము, రెల్లుగడ్డి. (కల్ప)

కాశగర్భము. సం. వి. అ. పుం. అశ్వవాలకతృణము, ఒకవిధ మగు రెల్లుగడ్డి.

కాశము. సం. వి. అ. పుం. న. రెల్లుగడ్డి. న. రెల్లుపువ్వు. పుం. ౧. ప్రభ. ౨. తుమ్ము. ౩. కాసము, దగ్గు.

కాశాదని. సం. వి. ఈ. స్త్రీ. కాసరకి. ఆం. భా. ౨. ౭౦. (ఇది సంస్కృతనిఘంటువులలోఁ గానరాదు.)

కాశాల్మలి. సం. వి. ఇ. స్త్రీ. కూటశాల్మలి, కొండబూరుగుచెట్టు. (కల్ప.)

కాశి. సం. విశ. (న్. నీ. న్.) ౧. ప్రకాశశీలుఁడు, ప్రకాశించువాఁడు. (ఈయర్థమున సమాసాంతమున నుండును.) ౨. కాసరోగము కలవాఁడు. వి. ఇ, ఈ. స్త్రీ. వారాణసి, గంగాతీరమందలి ఒకప్రసిద్ధనగరము. ఇ. పుం. ౧. సూర్యుఁడు. ౨. ప్రకాశము.

కాశిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాశి. ౨. పాణినిసూత్రములకు వామనజయాదిత్యులు చేసినవృత్తివిశేషము.

కాశికము. సం. విశ. (అ. ఆ, ఈ. అ.) కాశియందు పుట్టినది, మొ.

కాశీనాథుఁడు. సం. వి. అ. పుం. విశ్వేశ్వరుఁడు, శివుఁడు.

కాశీప్రయాగలు. సం. వి. అ. పుం. బ. ధాన్యభేదము. ప్రబంధ. ౧౧౨.

కాశీస(శ)ము. సం=కాసీసము. (వాచ.)

కాశు(సు)వు. సం. వి. ఊ. స్త్రీ. ౧. శక్తిరూపమైనఅస్త్రము. ౨. వికల మగువాక్కు, స్పష్టముకానిమాట. ౩. రోగము. ౪. బుద్ధి. ౫. దీప్తి, కాంతి.

కాశూ(సూ)కారము. సం. వి. అ. పుం-కాసువును(=వికలవాక్కును) కలిగించునది-గువాకము, పోఁకచెట్టు.

కాశూల. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

కాశ్మద్విపము. సం. వి. అ. పుం. గంభారి, గుమ్ముడుచెట్టు.

కాశ్మరి. సం. వి. ఈ. స్త్రీ. గంభారి, గుమ్ముడుచెట్టు.

కాశ్మర్యము. సం. వి. అ. పుం=కాశ్మరి.

కాశ్మీరజన్మము. సం. వి. న్. న. కుంకుమపువ్వు.

కాశ్మీరము. సం. విశే. (అ. ఈ. అ.) కాశ్మీరదేశ సంబంధమైనది. వి. అ. పుం. ఒకానొక దేశము. న. ౧. కుంకుమపువ్వు. ౨. టంకము, కాసెయులి.

కాశ్మీరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గుమ్ముడు. ౨. కపిల ద్రాక్ష. (రాజ. ని)

కాశ్మీర్యము. సం. విశే. (అ. ఆ. అ.) కాశ్మీరదేశ మందున్నది; కాశ్మీరదేశమందు కలిగినది. వి. అ. న. కుంకుమపువ్వు.

కాశ్యపము. సం. వి. అ. న. మాంసము.

కాశ్యపి. సం. వి. ఇ. పుం. ౧. అనూరుఁడు. ౨. గరుడుఁడు. ఈ. స్త్రీ. భూమి.

కాశ్యపుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) కశ్యపునకు సంబంధించినవాఁడు. వి. అ. పుం. ౧. ఒకానొక ఋషి. ౨. కణాదుఁడను ముని.

కాశ్యపేయుఁడు. సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. గరుడుఁడు. ౩. వేల్పు, త్రిదశుఁడు. ౪. రాక్షసుఁడు.

కాశ్యము. సం. వి. అ. న. మద్యము.

కాషము. సం. వి. అ. పుం. ఒరగల్లు.

కాషాయము. సం. విశే. (అ. ఈ. అ.) కషాయవర్ణము గలది, ఎఱ్ఱనిది, కావివన్నె గలది. వి. అ. పుం. కషాయవస్త్రము, కావిబట్ట.

కాష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ౧. దిక్కు. ౨. పదునెనిమిది ఱెప్పపాట్లకాలము. ౩. సీమ, అవధి, మేర. ౪. స్థితి, ఉనికి. ౫. ఉత్కర్షము, అతిశయము. ౬. మ్రానిపసుపు. ౭. కశ్యపుని భార్యలలో నొకతె.

కాష్ఠకదళి. సం. వి. ఈ. స్త్రీ. అడవియరఁటి.

కాష్ఠకము. సం. వి. అ. న. అగరువు, అగలు.

కాష్ఠకీటము. సం. వి. అ. పుం. జీర్ణమగు మ్రాని యందు కనఁబడు నొకపురుగు, మ్రాను తొలుచు పురుగు, ఘుణము.

కాష్ఠకుట్టము. సం. వి. అ. పుం. పక్షిభేదము, వడ్రంగిపిట్ట, మ్రానిపోటుపులుఁగు.

కాష్ఠకుద్దాలము. సం. వి. అ. పుం. ఓడలోనినుజికి గోఁకుటకై కఱ్ఱతో చేసినగుద్దలి.

కాష్ఠజంబువు. సం. వి. ఊ. స్త్రీ. నేలనేరేడు.

కాష్ఠతంతువు. సం. వి. ఉ. పుం. మ్రానియందు కనుపట్టుసన్ననితంతువువంటిపురుగు.

కాష్ఠతక్షుఁడు. సం. వి. అ. పుం. వడ్రంగి.

కాష్ఠదారువు. సం. వి. ఉ. పుం. దేవదారువు.

కాష్ఠద్రువు. సం. వి. ఉ. పుం. పలాశము, మోదుగు.

కాష్ఠపాటల. సం. వి. ఆ. స్త్రీ. సితపాటల, తెల్లకలిగొట్టు.

కాష్ఠపాటలి. సం. వి. ఈ. స్త్రీ=కాష్ఠపాటల.

కాష్ఠమఠి. సం. వి. ఈ. స్త్రీ. చితి, సొద.

కాష్ఠమల్లము. సం. వి. అ. పుం. శవయానము, పాడె.

కాష్ఠము. సం. వి. అ. న. కఱ్ఱ.

కాష్ఠమౌనము. సం. వి. అ. న. సంజ్ఞలచేతనైనను స్వాభిప్రాయమును దెలుపని మౌనము.

కాష్ఠలేఖకము. సం. వి. అ. పుం. కాష్ఠకీటము, మ్రాను తొలుచుపురుగు.

కాష్ఠలోహి. సం. వి. న్. పుం. ఇనుము మున్నగు లోహములపొన్నుతో కూడిన మ్రానిగుదియ.

కాష్ఠవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కటుక, కటుకరోహిణి.

కాష్ఠశారిబ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లసుగంధిపాల, తెల్లమామెన.

**కాష్ఠాంబువాహిని.** సం. వి. ఈ. స్త్రీ. ఓడలో చొచ్చిననీళ్లను వెలికి పాఱఁబోసెడుదొన్నె వంటిమ్రానిబొక్కెన.

**కాష్ఠి.** సం. విణ. (న్. నీ. న్.) బహుకాష్ఠయుక్తుఁడు, కఱ్ఱలు మిక్కుటముగాఁ గలవాఁడు.

**కాష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకట్టె, చిదుగు.

**కాష్ఠికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ)=కాష్ఠి. వి. అ. పుం. కట్టెలమోపరి.

**కాష్ఠీల.** సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటికి.

**కాష్ఠీలము.** సం. వి. అ. పుం. రాజార్కము, రాచజిల్లేడుకి.

**కాష్ఠోదుంబరిక.** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, కాకిమేడికి.

**కాస**=కాసె[1].

గీ. బొమిడికంబులు వెట్టి జోళ్లమరఁ దాల్చి, చల్లడంబులు దొడిగి కాసలు బిగించి, జముదళంబులు చెక్కి బల్లెములు పూని, వెడలి రప్పుడు పెక్కండ్రు వేఁటకాండ్రు. కవిరా. ౨. ౮౧.

శా. చల్లాడంబులమీఁదటన్ బిగువుకాసల్ కట్టి ...అని. ౪. ౩౪. (శ. ర. పా.)

జ: కాసించు.

**కాసందీవటిక.** సం. వి. ఆ. స్త్రీ. వేళవార భేదము, ఒకవిధ మగువంటసంబారము.

**కాసఘ్నము.** సం. విణ. (అ. ఈ. అ.) కాసమును హరించునది.

**కాసఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. కంటకారి, వాకుఁడుకి.

**కాసజిత్తు.** సం. వి. త్. స్త్రీ. భార్గి, బారంగికి.

**కాసనాశిని.** సం. వి. ఈ. స్త్రీ. కర్కటశృంగికి.

**కాసమర్దకము.** సం. వి. అ. పుం. కసిందకి.

**కాసమర్దనము.** సం. వి. అ. పుం. పటోలము, చేఁతిపొట్లకి.

**కాసమర్దము.** సం. వి. అ. పుం. పీతపుష్పి, కసిందకి.

**కాసము.** సం. వి. అ. పుం. క్షవథువు, దగ్గు.

**కాసర**=కాఁచర. వి. కాశాదనికి.

గీ...కాసర యనఁ గాఁచ,ర యనఁ గాశాదనీస మాహ్వాయ మగు భవ. ఆం. భా. ౨. ౬౦.

వ...అెల్లులసిల్లెఁ గాసర గాచె దోస దోరగిలంబాఅె...కాశీ. ౩. ౨౩.

**కాసరము.** సం. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.

**కాసరలు.** వి. బ. శాలిధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

**కాసలనా(ల్నా)డు.** వి. ఔ. (సం. కోసలః?) ఒకానొక దేశము. (ఇందుండి వచ్చినబ్రాహ్మణులను కాసలనాటివా రందురు.)

ఉ...ఆ, కాసలనాటివారికనకాంగిని జూచితి నీళ్లరేవునన్. వీథి. ౧౪.

క. కాసల్నాటను శ్రేష్ఠుఁడు, మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు...క్రీడా. ౪౪.

**కాసా.** వి. దాసీసంతతి.

సీ. సాదువిశ్వేశ్వరశర్మమాన్యంబుల నెలమిఁ గాసాలంజె కిచ్చినావు. చంద్ర. వి. ౧. ౩౨.

**కాసారము.** సం. వి. అ. పుం. సరస్సు, కొలను.

**కాసారి.** సం. వి. ఇ. పుం. కాసమర్దము, కసిందకి.

**కాసాలువు.** సం. వి. ఉ. పుం. కాసకందము, కోంకణదేశప్రసిద్ధ మగుఆలుకభేదము, ఒకజాతిగెనసుదుంప.

**కాసి.** సం. విణ. (న్. నీ. న్.) కాసరోగి, దగ్గు కలవాఁడు.

**కాసించు.** స. క్రి. (√కాస) కాసెగా కట్టు; కట్టు, ధరించు.

సీ. కరకంచువలిపెంబు గట్టిగాఁ గాసించి వెలిత్రాడు కాసెపై బలయఁ జుట్టి. ద్వా. ౬. ౪౫.

సీ. పులితోలు పచ్చడంబుగ మొలఁ గాసించి స
ర్వాంగములను భస్మంబుఁ బూసి. ద్వా. ౮. ౧౦౪.

**కాసీఁడు.** వి. (కాసె²+ఈఁడు) కాసెవాఁడు, జాతిపనివాఁడు.

ద్వి. సున్నంబు నిటిక రాసులుగఁ బెట్టించి, పను
లు సేయంగ నుప్పరలఁ గాసీల. ప్రభు. ౩. ౮౨ పా. ౧౩ పం.

గీ...ఒక్క, నాఁడు కాసీల కిట్లను నయము మీ
ఱ. పరమ. ౫. ౪౮.

**కాసీసము.** సం. వి. అ. న. కాశీసము, ఉపధాతుభేదము, అన్న భేది. (వాచ)

**కాసు.** వి. ౧. పదునొకండుఅణాల యెత్తు గలబంగారపునాణెము.

ఉదా: కాసులపేరు.

౨. (సం. కాచః. క. త. కాసు) దుగ్గాణిలో పదియవపాలు, దమ్మిడిలో నైదవవంతు. (దుగ్గానిలో నాల్గవభాగము. శ. ర)

గీ...తనకుఁ దా నచ్చినట్టి, కాసు పదివేలనిష్క
ముల్ గాఁ దలంచి. భాగ. ౧౦ ఉ. ౯౬౫.

ద్వి. మరగి చొచ్చినయట్లు మత్తపోవనము, సు
రుఁగక చొచ్చి కాసుగ నన్నుఁ గొనక. ద్వి. హరిశ్చ. పూ. ౧౧౯౮. (కాసుగఁగొనక:- అణుమాత్రమైనను లక్ష్యముసేయక.)

గీ. తావు గాసంతె చాలు...రా. వి. ౨. ౭౦.
(కాసంత=కొంచెము.)

౩. పైకము, ధనము.

గీ. చల్లఁగాఁ జేతికా సెల్ల డుల్లి ... నిరం. ౨. ౧౨౮.

**కాసె¹(సియ)=కాస.** వి. (సం. కచ్ఛా) ౧. కాసెకోక, దట్టి.

మ. జిగిమైసొంపును దమ్మిమైమఱువు డాచేఁ గ
ల్వచేకత్తియుఁ, సిగఁ బూమొగ్గలతాయెతుల్
చిగురుఁ గాసెం జెక్కినం జాలఁ బొల్పగుచు
న్నేడఁగి తేఁకువంకియును జాయల్ మీఱఁ
గాఁ బూవుఁదీఁ, గెగుడెం దావలరాచయొం
టరి కడుం గేరించుచుం జిమ్మినన్. యయా.
౫. ౭౪.

క... కట్టె బిగియం, దనకాసియ వారిరాశి దాఁ
టెడు తెగువన్. రామా. ౬. ౮౩.

౨. కచ్ఛభేదము, కుచ్చెల.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల
కుచ్చె...అనంగ... ఆం. భా. ౨. ౧౫౩.

జ: కాసెనిలుకడ, కాసెపోయు.

**కాసె².** వి. ౧. జాతిపనివాఁడు.

సీ. గ్రావకారుఁడు కాసె కాసెవాఁ డనఁదగు ..
ఆం. భా. ౨. ౨౮౪.

౨. రాయి తొలిచెడుపని. (శ. ర.)

జ: కాసీఁడు, కాసెయులి, కాసెవాఁడు.

**కాసెనిలుక(ల్క)డ.** వి. (√కాసె¹) మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ...గళకత్తెరయు నృసింహంబును గాసెనిలు
కడయు ననుముప్పదిరెండువిన్నాణములును
...ప్రబంధ. ౭౮. హంస. ౧. ౨౦౬.

సీ. కాసెనిల్కడ గళకత్తెర జోడింపు నరసింగ
ము...గీ. అంజమెడపట్టు నాఁగఁ జెన్నలరు
చుండు, ముప్పదియు రెండు విన్నాణముల
కుఁ బేళ్లు. ఆం. భా. ౨. ౨౦౯.

**కాసెయులి.** వి. (కాసె²+ఉలి.) టంకము, రాయి తొలుచుట కుపయోగించుపనిముట్టు.

ఆ. గట్టురాలఁ దెచ్చి కాళ్లఁ జేతులఁ ద్రొక్కి,
కాసెయులులచేత గాసిచేసి, మొరపరాల
కెఱుగుమొప్పెల సేమందు, విశ్వ...వేమన.
౩. ౨౩౮.

గీ...టంక మొప్పగును గాసెయులి యనఁగ
...ఆం. భా. ౨. ౩౦౦.

కాసెవాఁడు=కాసీఁడు. (√కాసె².)

సీ. గ్రావకారుఁడు కాసె కాసెవాఁ డనఁ దగు... ఆం. భా. ౨. ౭౦౪.

కాసెపోయు. అ. క్రి. (కాసె¹+పోయు)-వస్త్రము-గోఁచివలె వెనుక చెక్కు-. (శ. ర.)

కాస్మర్యము. సం. వి.అ.పుం.గంభారి, గుమ్ముడుకి.

కాహళ. సం. వి.ఆ.స్త్రీ.కాహళవాద్యము,బాకా.

కాహలా(ళా)పుష్పము.సం వి.అ.పుం. దుత్తూరము, ఉన్మత్తకి.

కాహళ(ల)ము. సం. విశ.(అ.ఆ.అ.) ౧. అసభ్యము, పామరము. (మాట.) ౨. చుక్కు-ము, ఎండినది. ౩. ఖలము, చెడ్డది. ౪. భృశము, పెల్లయినది. వి. అ. పుం. ౧. పిల్లి. ౨. కోడి. ౩.శబ్దము, సద్దు. న. ౧. అవ్యక్తవాక్యము. ౨.బాకా.

కాహళ(ల). సం. వి. ఆ. స్త్రీ. ౧. పెద్దఢక్కు-. ౨. బాకా. (వై. ని.)

కాహళి(లి). సం. వి. ఇ. పుం. శివుఁడు. ఈ.స్త్రీ. ౧.కాహళ, బాకా. ౨. జవ్వని, యువతి, తరుణి.

కాహళి(లి)క. సం. వి. ఆ. స్త్రీ. కాహళి, బాకా.

కాహళి(లి)కుఁడు. సం. వి. అ. పుం. కాహళి యూఁదువాఁడు.

క. త్రికవులకుఁ జతుష్కు-వులకుఁ,బ్రకటంబుగ నెందు నీవ రాజ వనుచుఁ గౌ,తుకమునఁ గాహళికునిపో,లికఁ దాఁ దద్బిరుదకాహళి కపూరించెన్. పరమ. ౪. ౫౧.

కాహి. సం. వి. ఈ. స్త్రీ.కుటజము, కొడిసెచెట్టు.

## కి

కి=కు. ప్ర. ద్రు. (షష్ఠీవిభక్తియందు 'ఇ, ఈ, ఐ, లకు తరువాత ప్రాయికముగా 'కి' యును మిగిలినయచ్చులతరువాత 'కు'ను వచ్చును. ఉదా: హరికి, స్త్రీకి, పైకి-ప్రాయికమనుటచే 'నీకు, ఈకు, మీకు' ఇత్యాదులయందు రాదు.)

౧. సంబంధసామాన్యమును తెలుపును. (ఈయర్థమున క్రియతో నన్వయముండదు.)

క...కరుణా,నిపుణుఁడ వై నీమఱఁదికి, నపరాధశతంబు సైఁపు మయ్య యుపేంద్రా.భార. సభా. ౨.౪౯. (మఱఁదికి=మఱఁదియొక్క-)

౨. సంబంధవిశేషమును దెలుపును.

(క) స్వస్వామిభావసంబంధము.

(వ్యవ) వాని కైదు మేడ లున్నవి.

(చ) అవయవావయవిభావసంబంధము.

(వ్యవ) పక్షికి ఱెక్కలు రెం డుండును.

(ట) జన్యజనకభావసంబంధము.

(వ్యవ) అతని కిద్దఱు కొడుకులు గలరు.

(త) తృతీయావిభక్త్యర్థకము.

చ...బుక్కభూ,పతికి సముండు లేఁడు తలఁపఁగా భువనంబున నేగుణంబులన్. కళా. పీఠి. ౨౧. (భూపతికి=భూపతితో.)

మ. సిరికిన్ జెప్పఁడు...భాగ. ౮. ౯౬. (సిరికి=సిరితో.)

క...అతఁడు దండ్యుఁ డండు రవనీపతికిన్.భార. అను. ౪. ౧౩౬. (అవనీపతికి=అవనీపతి చేత.)

(ప) చతుర్థీవిభక్త్యర్థకము. ఆము. ౪.౧౪౩.

(వ్యవ) ఇది తలనొప్పికి మంచిమందు. (తలనొప్పికి=తలనొప్పి పోవుటకొఱకు.)

(గ) పంచమీ విభక్త్యర్థకము.

క...దాని కధికము గలదే.భార.శాం.౬.౪౯౯. (దానికి=దానికంటె.)

క. ధర్మసుతుఁ డొడ్డి శకుని క,ధర్మస్థితి నోటువడియె...భార. సభా. ౨. ౨౪౯. (శకునికి= శకునివలన)

(జ) సప్తమీవిభక్త్యర్థకము.

గీ. ఎఱుకు విలువిద్యకలిమికి హీనుఁ డయ్యెఁ,

బార్థునకు...భార. ఆది.౫.౨౮౪.(విలువిద్య కలిమికి=ధనుర్విద్యాసంపద్విషయమున.)

(డ) నిర్ధారణార్థకము, లోపల.

గీ. అన్నదానంబు ధర్మంబు లన్నిటికిని, ముఖ్య ము...భార. అను. ౪. ౨౭౬.

(ద) పైకి, మీఁదికి; పైని, మీఁద.

గీ. కరికి లంఘించుసింహంబుకరణి మెఱసి. భా గ. ౧. ౨౨౨.

గీ...ఇది చాల నబల దీని,కలుగఁ జనదు...భా ర. ఆది. ౬. ౨౧౭.

మఱికొన్ని ప్రయోగవిశేషములు.

ఆయూరి కీయూరు అయిదు కోసులు.

వానికి వీఁ డెంతో వీనికి వాఁడును అంతే.

మాటిమాటికి లేచిపోకుము.

**కింక**=కినుక. వి. (√కినియు[1]) ౧. కోపము.

ఉ. పంకజనాభ మాపడినపాటులు రాజ్యము గోలుపోకయుం,గింకకు మూలమై...భార. ద్రో. ౩. ౧౩. భాగ. ౧౦ ఉ. ౨౬౫.

౨. బాధ, పీడ.

ఉ. పంకరుహంబకుండు మదిఁ బాయక లో వె తఁబెట్ట నాత్మప,ర్యంకలతాంతకోరకము లాతనికొప్మెఘుఁగారుతూపులై, కింకలఁ బె ట్టఁగా...వి. నం. ౨. ౨౦.

౩. రోగము, తెగులు. ('పసులను మేఁకలను చం పెడురోగవిశేషము' అని శ. ర. 'మారిమొదలై న అంటురోగము' అని బ్రౌ.)

గీ... తెవులు, కింక నా రోగసంజ్ఞయై కెరలు చుండు. ఆం. భా. ౨. ౧౨౪.

కింకపట్టు=పోరుపెట్టు.

(వ్యవ)పిల్లవాఁడు కింకపట్టి యేడ్చుచున్నాఁడు

కింకనీళ్లుతీయు=పిల్లలు పోరుపెట్టుట మానుటకై ఎఱ్ఱనీళ్లు దిగఁదుడిచి పాఱఁబోయు.

(వ్యవ)పిల్లయేడ్చుచున్నది. కింకనీళ్లుతీయుము.

**కింకరి.** సం. వి. ఈ. స్త్రీ. కింకరునిభార్య.

**కింకరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పరిచారకుఁ డు, సేవకుఁడు, దాసుఁడు.

**కింకిణి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. క్షుద్రఘంటిక,చి ఱుగంట; గజ్జె. ౨. వికంకతవృక్షము, పుల్లవెలఁ గ. ౩. ఘంటారవ, గిలకచెట్టు, గిలిగిచ్చ. ౪. పుల్లద్రాక్ష.

**కింకిణీకము.** సం. వి. అ. పుం. చిఱుగంట; గజ్జె. (శ్లో. కింకిణీకవిభూషితాన్. హరివంశము.)

**కింకిర.** సం. వి. ఆ. స్త్రీ. రక్తము, నెత్తురు.

**కింకిరము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది. వి. అ. పుం. ౧. గుఱ్ఱము. ౨. కోయిల. ౩. తుమ్మెద. ౪. ఎఱుపు, రక్తవర్ణము. ౫. ఏనుఁగుకుంభస్థలము.

**కింకిరాటము.** సం=కింకిరాతము.

**కింకిరాతము.** సం. వి. అ. పుం. ౧. చిలుక. ౨.కో యిల. ౩. అశోకవృక్షము.

**కింకిరాతు(టు)ఁడు.** సం.వి.అ.పుం. మన్మథుఁడు.

**కింకిరాలము.** సం.వి. అ.పుం. బర్బూరము,తుమ్మ.

**కింకిరి.** వి. (√కింక ?) ౧. కోపము, కింక. (చూ. కింకిరిపడు.) ౨. ఏవ, రోఁత; రోఁతపని.

ఉ. పంకజముఖ దొంఅంగి తదుపాంతచరన్నఖ పప్రసక్తికిన్,గొంకిరుపాదిరూపములకన్ జనునాథునివింతయక్కు-పైఁ, గింకిరి గాఁగ లచ్చి తిలకించి యజస్రము నుండుఁగాక ని, శ్శంకఁ జళుక్యవిశ్వమనుజప్రభుపుణ్యకటా క్షదృష్టులన్. కావ్యా. ౧. ౨.

ద్వి. అప్పుడు నందనుఁ డాయోగివరుని,చీరపైఁ గింకిరి చేయు గోరక్షుఁ, జేర రమ్మని పిల్చి చేతికిఁ బుత్రు, నిచ్చి గోరక్షక యీతోఁతఁ గడిగి, తెచ్చి యి మ్మనుటయు ... నవ. ౪. ౧౩౯ పా. ౪ పం.(కింకిరిచేయు:-విస్టించు, మలవిసర్జనముచేయు అనిభావము.)

జ: కింకిరిపడు, కింకిరిపాటు.

**కింకిరిపడు.** అ. క్రి. (కింకిరి+పడు.) ౧. కోపించు.

క. అతఁ డెంత రేఁగి తిట్టిన, మతిఁ గింకిరిపడక యపుడు మా టాడక యూ, నత యగుచు న స్పతివ్రత, యతని నతిశ్రేష్ఠుఁగాఁగ నాత్మఁ దలఁచుచుఁన్. మా ర్క. ౨. ౧౫౮.

ద్వి. భరతుండు నాకంటె భక్తుండు మీకు, నత నిఁ బట్టముగట్టుఁ డాత్మఁ గైకేయి, కృత కంబులకు నింకఁ గింకిరిపడకు. రం. రా. అ యో. ౧౧౪ పా. ౧౭ పం.

౨. అసూయపడు.

ద్వి. జగతిలోపల హరిశ్చంద్రభూవిభుఁడు, పొ గడొందె నేమి తాఁ బొగడొందఁ డేమి, బొంక కుండిన నేమి బొంకిన నేమి, కింకిరి పడి పరికింప నా కేల. ద్వి. హరిశ్చ. ఉ. ౨౭౧౩ పం.

౩. రోఁతపడు, ఏవగించు.

ద్వి. అడరుదుర్గంధాన కణుమాత్రమైనఁ, గింకిరి పడక శంకింపక ధైర్య, మింకక చండాలు నింటికి నేఁగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౮౪ పం.

**కింకిరిపాటు.** వి. (√కింకిరిపడు) కింకిరిపడుట. (కోపపడుట, కోపము.)

సీ. నగుమొగంబుల కాని నాతి నీదెస నెప్డుఁ బ తులకుఁ గింకిరిపాటు లేదు. భార. అర. ౫. ౨౯౧. ఉ. హరి. ౩. ౧౪.

**కింకిరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. (విల్య మ్స.)

**కింక్షణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) - ఒకక్షణము పోయిన నేమి యని యనుకొనువాఁడు, కాల మువిలువ తెలియనివాఁడు - సోమరి, అలసుఁడు.

**కింగళింపు.** వి. మల్లవిద్యాసంబంధ మగుషోడశో పవీతములలో నొకటి. హంస. ౧. ౨౦౬.

**కింగాణి.** వి. కొలగానిపని.

ద్వి. కింగాణి మును చేయ దంగన చూడు. ద్వి. భాగ. ౪. ౧౧౦౪. (బ్రౌ.)

**కింగిరి.** విణ. అల్పము. (శ. ర.)

**కించే.** వి. మనోవ్యథ.

ఉ... ఈతని కుత్తరంబు నే, నెవ్వగ నిత్తుఁ జిత్త మున కేమియుఁ దోఁపదు కించ పుట్టె... సా నందో. ౩. ౩౮.

**కించిజ్జ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కొంచెము తె లిసినవాఁడు, అల్పజ్ఞానము గలవాఁడు.

**కించిత్కరము.** సం. విణ. (అ. ఈ. అ.) కొంచె ము చేయునది, కొంచెము ఉపయోగించునది.

**కించిత్తు.** సం. అవ్య. అల్పము, ఇంచుక; అల్పముగా.

(వ్యవ) ఇందు లాభము కించిత్తయినను లేదు.

క. కొంచక వేఁడుము తగ న, ర్పించెద నిపు డెద్ది నీయభీష్టము నాకున్, గించిత్తయిన మనోథ న, వంచన మిచ్చోట లే దవశ్యం బనినన్. జై. భా. ౭. ౨౧౯.

క. కించిత్తు నల్లి కుట్టిన, మంచమునకుఁ బెట్లు వ చ్చు మహిలో సుమతీ. సు. శ. ౩౯.

గీ. ఏల కించిత్తు న స్నెంచఁ డితఁ డటంచు. దశా. ౬. ౧౧౧.

**కించిన్మాత్రము.** సం. విణ. (అ. ఆ. అ.) కొంచె పాటిది.

**కించిలికము.** సం=కించులుకము. (కల్ప)

**కించే=క్రించే.** విణ. (సం. కించిత్. ప్రా. కించి.) అల్పము, నీచము.

వ... ఆజ్ఞాభంగంబు గావించునక్కించు నొక్కిం చు కంతయు విచారింపక పట్టుకొనిపోయి మత్పురోహితులముందఱం బెట్టి రండు... జై. భా. ౪. ౧౨౨. ఉ. రా. ౪. ౧౬౩.

కించులుకము. సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱ, వానపాము.

కింజము. సం. వి. అ. న. కింజల్కము, అకరువు.

కింజలము. సం. వి. అ. పుం=కింజము.

కింజల్కము. సం. వి. అ. పుం. కేసరము, అకరువు. న. ౧. ఆకాశము. (వై. ని.) ౨. నాగకేసర పుష్పము. (కల్ప)

కింతుఘ్నము. సం. వి. అ. పుం. బవాదికరణములలో నొకటి. (రూ. కింస్తుఘ్నము. విల్యమ్స్.)

కిందముఁడు. సం. వి. అ. పుం. పాండురాజును శపించినయొకానొకఋషి.

కిందాసుఁడు. సం. వి. అ. పుం. కుత్సితుఁడగుదాసుఁడు.

కిందు=క్రిందు. (క. త. మ. కీఱు.)

(వశము, అధీనత.)

ద్వి. చేకొని నామాటఁ జేసితి గాన,నీకింద రాజ్యంబు నిత్యమై యుండు,ననుచు నాపూరుని నభిషిక్తుఁ జేసి. రం. రా. ఉ. ౧౩౩ పా.

కింపచానుఁడు. సం=కింపచుఁడు.

కింపచుఁడు. సం. విశ. (అ. ఆ. అ.)-కొంచెము వండుకొనువాఁడు-లోభి, పిసినిగొట్టు.

కింపాకము. సం. వి. అ. పుం ౧. విషముష్టి, ముసిఁడి చెట్టు. ౨. మహాకాలము చెట్టు.

కింపాకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.)-తక్కువమనఃపరిపాకము గలవాఁడు-మూఢుఁడు.

కింపురుషము సం. వి. అ. పుం. భారతాదివర్షములలో నొకటి.

కింపు(పూ)రుషుఁడు. సం. ౧=కిన్నరుఁడు. ౧.అర్థము. (కే. ని.)

శ్లో. పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి, ప్రియాముఖం కింపురుషశ్చుచుంబ. సం. కు. సం. ౩. ౩౮.

౨. దేవయోనివిశేషము.

శ్లో. గంధర్వకింపూరుషకిన్నరా జగుః. సం. భాగ. ౮. ౨౧. ౨౧.

కింపురుషేశ్వరుఁడు. సం. వి అ. పుం. కుబేరుఁడు.

కింప్రభువు. సం. వి. ఉ. పుం. కుత్సితప్రభువు.

కింభర. సం. వి. ఆ. స్త్రీ. నలి యనుగంధద్రవ్యము, గువ్వగుత్తుకచెట్టు.

కింరాజము. సం. విశ. (న్. న్, ఆ, జ్ఞీ. న్.)కుత్సితరాజు గలది. (దేశము.)

కింరాజో. సం. వి. న్. పుం. కుత్సితరాజు.

కింవదంతి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. జనశ్రుతి, లోకప్రవాదము. (కల్ప)

కింవరాటకుఁడు. సం. వి. అ. పుం-ఒకగవ్వ పోయిన నేమి అనుకొనువాఁడు, డబ్బు విలువ తెలియవాఁడు-అతివ్యయము చేయువాఁడు.

శ్లో. నృపతే కింక్షణో మూర్ఖో దరిద్రః కింవరాటకః. హితో. ౨. ౯౧.

కింశారువు. సం. వి. ఉ. పుం. ౧. సస్యశూకము,వరిమున్నగువానిముల్లు, యవాద్యగ్రము. ౨. బాణము. ౩. రాపులుఁగు.

కింశుక. సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి, మానేరు, ఎక్కుడుతీఁగచెట్టు.

కింశుకము. సం. వి. అ. పుం. ౧-చిలుకముక్కువంటి పువ్వులు గలది-మోదుగుచెట్టు.౨.నందివృక్షము.

కింశులుకము. సం. వి. అ. పుం. మోదుగు, పలాశముచెట్టు.

కిక(కా)కిక. వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము.

చ. కికకికనవ్వెరి...భల్లా. ౨ఆ. (శ. ర.) చంద్రా. ౨. ౧౨౭, ౩. ౬.

చ...మఱుంగున నష్టు సుగ్రహుం,డునికి యె
ఱుంగమి న్నగిరియె నుండఁగ లే కితఁడుం గి
కాకిక౯. కళా. ౭. ౧౭౧.

**కికి.** సం. వి. ఇ. పుం. కొబ్బెరచెట్టు. ఇ, న్. పుం.
ఈ. స్త్రీ. పాలపిట్ట.

**కికీదివము.** సం. వి. అ. పుం=కికీదివి. (రూ. కికీది
వము. కల్ప)

**కికీదివి.** సం. వి. ఇ. పుం. చాషము, పాలపిట్ట.
(రూ. కికిదివి, కికిదీవి, కికీదీవి.)

**కికురించే=**కిక్కురించే. స. క్రి. (√ కికురు) ౧.
మోసపుచ్చు, వంచించు.

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల,
మేలిభక్ష్యరాశి మెసఁగు నొకఁడు. భాగ.
౧౦ పూ. ౮౯౬.

సీ. కికురించి రిచ్చి పుచ్చుకొనుచో టులవార లాఁ
కకు లోను గా కప్పు లీక. మనుచ. ౩. ౧౨౯.
సారంగ. ౨. ౧౧౩.

౨. పోఁగొట్టు, హరించు.

సీ. చెలువ వేనలి చిమ్మఁజీకటిఁ గికురింపఁ జంద్ర
సూర్యుల నుంచెఁ జామ యొర్తు. వసు. ౪
౧౧౬.

అ. క్రి. తప్పించుకొని తిరుగు, నక్కినక్కి తి
రుగు.

క. తీపు గలకజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి
పుచ్చుకొని త్రోపాడం, బైపడి యది గొని
యొక్కఁడు, క్రేపులలో నిట్టు నట్టుఁ గికురిం
చు నృపా. భాగ. ౧౦ పూ. ౮౪౭.

**కికురింత=**కికురింపు. వి. (√ కికురించే) ౧. మోస
ము చేయుట; మోసము.

గీ...కికురింపు కికురింత యనఁగఁ జెల్లు, వంచన
కరణ మగుచు...ఆం. భా. ౨. ౭౯౨.

౨. దాఁగుట. (చూ. కికురింతలాట.)

**కికురింతలాట.** వి. (కికురింతలు + ఆట) దాఁగిలి
మూఁతలాట.

సీ. స్వర్భాల లా చెట్లశాఖలచాటున సంతరింతు
రు కికురింతలాట,లు...చెన్న. ౪. ౩౭౭.

**కికురింపు=**కికురింత. ఆం. భా. ౨. ౭౯౨.

**కికురు=**కిక్కురు[1]. వి. వంచన, మోసము.

సీ...వంచన మెసంగు. గీ. జుడుఁగు క్రుక్కు కి
కురు పిక్కు జుణుఁగు మొఱఁగు, డనఁగ...
ఆం. భా. ౨. ౭౯౨.

జ: కికురించు, కికురింత, కికురింతలాట, కికురిం
పు, కికురువెట్టు, కికురువొడుచు.

**కికురువె(పె)ట్టు.** స. క్రి. (√ కికురు). కికురించు,
వంచించు; త్రోసివేయు.

గీ. దశరథకుమార నీవిడుతప్పుటడుగు, లుల్లమున
నమ్మఁగాఁ జాల మొండు రెండు, తప్పుటడు
గుల మును జగత్త్రయముఁ గొంటి, బలిఁ గికురు
వెట్టి యని బుధుల్ పలికి రపుడు. రామా. ౩.
౧౮౪.

ఆ. అతని చేత నున్న యమృతకుంభము నూచి, కె
రలు వొడిచి సురలఁ గికురువెట్టి, పుచ్చుకొనిరి
యసురపుంగవు లెల్లను, మాఱు లేనిబలిమి
మానవేంద్ర...భాగ. ౭. ౨౯౪.

**కికురువొ(పొ)డుచే=**కికురించే.
స. క్రి. (వంచించు.)

క. పోరుదురు కికురువొడుచుచుఁ, దూఱుదురు
భయంబు లేక తోరపుటిరవుల్, జాఱుదురు
ఘనశిలాతటి, మీఱుదు రెన్నంగ రాని మెలఁ
కువల నృపా. భాగ. ౧౦ పూ. ౮౩౧.

**కిక్కస.** వి. త్రోవివంటి తృణవిశేషము, నలుము.

సీ. కిక్కస యనఁగఁ బెంపెక్కును నలసంజ్ఞ...
ఆం. భా. ౨. ౭౪.

**కిక్కిశము.** సం. వి. అ. పుం. క్రిమివిశేషము. (ఇది
కేశనఖదంతములకు హాని కలిగించును.)

**కిక్కురించే=**కికురించే. స. క్రి. (√ కిక్కురు[1]).
వంచించు, మోసపుచ్చు.

ఆ. చేతికొండ యొకనిచే నిచ్చి తలనున్న, కొం
డదొంతి కుదురుకొన నమర్చి, మగుడ నడుగ
వాఁడు నగచయల్ నగ వానిఁ, గిక్కురించి
పోయి వెక్కిరించు. భా. రా. యు. ౨౬౪.

ద్వి. కిన్నరబ్రహ్మయ్యఁ గిక్కురించితివో, కన్నడ
బ్రహ్మయ్యఁ గను మొఱఁగితివో. పండితా.
మహిమ. ౩౦౬ పొ.

కిక్కురింత=కికురింత. (√కిక్కురించే)

కిక్కురు[1]=కికురు. వి. మోసము, వంచన. (చూ. కి
క్కురువెట్టు.)

జ: కిక్కురించు, కిక్కురింత, కిక్కురువెట్టు.

కిక్కురు[2]. వి. అల్పమైనకంఠధ్వని కనుకరణము.
కిక్కురుమనక=నిశ్శబ్దముగా.

క. కిక్కురు మన కమృతంబుం, గ్రుక్కలు పెట్టు
దురు సురలు...హర. ౬. ౧౨౨. వేమన. ౩.
౧౦౫.

కిక్కురువెట్టు=కికురువెట్టు. స. క్రి. (కిక్కురు[1]+
పెట్టు) వంచించు, మోసపుచ్చు.

ఉ. చక్కఁదనంబు జవ్వనము జాణతనంబును
గల్గితివిఁ బెం, పెక్కినదాన నంచు నొకయిం
చుక గర్వము పర్వ నన్నిటుల్, గిక్కురువె
ట్టఁ జూచెదు చెలీ పదమా మువ మార నింక
నా, చక్కెరవింటివంటునుఁ జాయలకోరుల
నేమి యయ్యెదో. రసిక. ౩. ౯౦.

కిక్కెస. అవ్య. ద్రు. గట్టిగా, బిగియునట్లు.

దండకము...భయభ్రాంతుఁడై పాఱ నుంకించు
నక్కించుఁ గంసుం ద్రిలోకీనృశంసు న్ని
యుద్ధక్రియాపద్ధతిం గిక్కెసన్ గొంకు క్రో
ల్నొక్కి...పారి. ౩. ౩౯. (ప్రయోగాంత
రము లేదు. వి. మిక్కిలి కదియిక అని శ.ర.)

కిశి. సం. వి. ఇ. పుం. కోఁతి. (త్రి.ని.) స్త్రీ. సృగా
లిక, కొంకనక్క, చిన్నజాతినక్క.

కిగ్గాడి. విశే. (సం. కీకటః. క. కిగ్గ్=అల్పము.) అల్ప
ము; నీచము; పనికిమాలినది, అప్రయోజకము.

గీ. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాశ్వ, హయ
ము దాఁటించినట్టివాఁ గల్లయదిగో, నాఁటి
కది యబ్బురము గాని వీటిలోని, నేఁటికిగ్గా
డిగుఱ్ఱాలు దాఁటుచుండు. కళా. ౮. ౧౩౩.

ఉ...కీ, లూడినయందెలోడ బిగి యూడినతాలి
మితోడ వచ్చెఁ గి, గ్గాడియుఁ బోలెఁ గాను
గవి గాఁడిఁ గలయ్య నృపాలువీటికిన్. సు
ద. ౩. ౪.

సీ. తనవిడిదికి రంభ నసువవై తని తిట్టుకిగ్గాడి
యసురకుఁ గేలు మొగిచి. ప్రభా. ౧. ౭౮.

సీ. అప్రయోజకసంజ్ఞ యలరుచుండును గొఱ
గానివాఁ డనఁగఁ గిగ్గాడి యనఁగ. ఆం. భా.
౩. ౨౭.

జ: కిగ్గాడికాఁడు.

కిగ్గాడికాఁడు=కిగ్గాడి. (కిగ్గాడి+కాఁడు-స్వార్థ
ము) (అప్రయోజకుఁడు.)

క. కిగ్గాడికాండ్రె యెపుడుం, దగ్గరిసంపదలఁ
బొదలఁ దా మని యకటా, బగ్గన మండెడు
...శుక. ౩. ౨౮౦.

కిచే. వి. ౧. (పక్షులు కోఁతులు లోనగువాని) కూఁ
తయందగుధ్వని కనుకరణము. (దీని యామ్రేడి
తరూపము కిచకిచ.)

ద్వి. అచలంబుపైకి గుం డనక చెట్టనక, కిచకిచ
ధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు, నెగఁబ్రాఁకి
యెక్కుచో...రం. రా. కిష్కిం. ౧౯౮ పొ.
౨౫ పం.

౨. చక్కిలిగింత.

ఉదా: వీఁడు నాకు కిచకిచలు పెట్టుచున్నాఁడు.

౩. చక్కిలిగింతవలనఁ గలుగుజలదరము.

(వ్యవ) చక్కిలిగింత పెట్టినచో పిల్ల కెంలో కిచ
కిచ.

కిచకిచలాడు, కిచకిచమను=కిచకొట్టు.

జ: కిచకొట్టు.

కిచేకొట్టు. అ. క్రి. (కిచ + కొట్టు). కిచకిచమని ధ్వని చేయు.

ద్వి. కిచకిచ ధ్వనులలోఁ గిచకొట్టుకొనుచు. రం. రా. కిష్కిం. ౧౯౧ పా. ౨౫ పం.

సీ. పూవుగుత్తులవంటిపూపచన్నులు గోళ్ల నదిమినఁ గిచకొట్టునట్టివేళ. శుక. ౧. ౨౧౧.

కిచుకు. వి. ధ్వనివిశేషమున కనుకరణము. (ఆమ్రేడితరూపము 'కిచుకుకిచుకు')

(పాము.) వ...నీరంబున ననర్గళప్రచారంబునఁ బేరెంబులు వాఱుచు నొడిసి యొడిసి బడలు పడం గఱచి కిచుకుకిచుకు రనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులన్ భక్షించి... వేం. పంచ. 3.320.

కిచ్చడి. వి. (క. త. కిచ్చడి. హిం. కిచిడీ.) నానావస్తువులు చేర్చివండుచిత్రాన్నవిశేషము.

వ...చారులుఁ దియ్యగూరలుఁ బచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జులును... కాశీ. ౭. ౧౫౫.

సీ. సద్యోఘృతంబులుఁ జక్కెర లుక్కెఱల్ పచ్చళ్లు కిచ్చళ్లు పాయసములు. ఉ. రా. ౬. ౧౨౨.

కిచ్చిలి. వి. (క. కిచిలి. త. కిచ్చిలి.) ఒకజాతినారింజకే. (బ్రౌ)

కిటకిట. వి. (త. కిడుకిడు) పండ్లుకొఱుకుట మున్నగువానియందగుధ్వని కనుకరణము.

వ...జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని...మనుచ. ౪. ౧౯.

సీ. శ్రుతులు విజ్జోడైనచోఁ దంత్రి బిగువుగాఁ దీడించి కిటకిట బిరడఁ ద్రిప్పు. వైజ. ౧. ౧౧౫. దశా. ౨. ౨౬.

క. అటు నిటును జుణిఁగి మెల్లఁగఁ, గిటకిట యని మేను వడఁకఁ గికురించి కుభృత్కటకతటవిటపివిటపచ్ఛటముఱుఁగున కేఁగి డాఁగి శంకరుఁ డంతన్. పార్వ. ౪. ౧౨౪.

కిటకిటమను=కిటకిటయనుధ్వని చేయు.

క. కిటకిటమన రదనపటలి గీఁటుచుఁ బలికెన్. దశా. ౬. ౧౨.

కిటకిటలాడు = క్రిక్కిఱిసియు, సమ్మర్దముగానుండు.

(వ్యవ) అక్కడ జనులు కిటకిటలాడుచున్నారు. అతనియిల్లు బిడ్డలతో ఎప్పుడును కిటకిటలాడుచుండును.

కిటి. సం. వి. ఇ. పుం. సూకరము, పంది.

కిటికీ. వి. (హిం. ఖిడ్కీ.) గవాక్షము, సోరణము. (శ. ర, వా)

కిటిభము. సం. వి. అ. పుం-పందివలె నల్లగా నుండునది-౧. శేశకీటము, పేను. ౨. నల్లి. ౩. పాముకాటువలనియుపద్రవవిశేషము.

కిటుకు. వి. ౧. అకార్యము, దుష్కృత్యము.

చ. కటకట మిమ్మువంటిగుణగణ్యులఁ బుణ్యులఁ జెప్పరానిసం,కటములఁ బెట్టి యెట్టికొఱగాములు చేసితిఁ బెక్కు నాకు నీ,కిటుకున నేమి మేలు కలిగెన్...వి. పు. ౭. ౯౪.

౨. కపటము.

సీ...కపటాఖ్య విలసిల్లు గబ్బి గొరు,గబును కైపు కిటుకు కాదు డబ్బు కవుడు దంబనంగ... ఆం. భా. ౧. ౧౩౮.

౩. మర్మము, రహస్యము.

(వ్యవ) రామునకు విభీషణుఁడు లంకలోనికిటుకు లన్నియును చెప్పెను.

౪. చిక్కు.

ద్వి. కపటనాటకుఁ డైనకాశికుఁ డాత్మఁ, గృపమాలి నినుఁ బట్టి కిటుకులు వెట్టి. ద్వి. హరిశ్చ. పూ. ౧౯౭౨ పం.

కిట్టకము. సం=కిట్టము.

కిట్టము. సం. వి. అ. పుం. న. (వై.ని.) మలసామాన్యము.

(క) దేహమలము.

శ్లో.వసా శుక్రమ సృజ్మజ్జా కర్ణవిణ్మూత్రవిణ్ణఖాః, శ్లేష్మాశ్రుదూషికాస్స్వేదో ద్వాదశైతే నృణాం మలాః. (అమరసుధ.)

(చ) లోహాదిధాతుమలము, చిట్టెము.

(ట) నూనె మొదలగువానియడుగుమడ్డి.

కిట్టవర్జితము. సం. వి. అ. న. శుక్లము, రేతస్సు.

కిట్టాలము. సం. వి. అ. పుం. ౧. తామ్రకలశము, రాగిపాత్ర. ౨. లోహమలము, ఇనుపత్రుప్పు.

కిట్టికోల. వి. ఇజికించుటకుఁగా నొకతట్టు కొనలఁ జేర్చికట్టి చిన్నకోలలతో నేర్పఱుపఁబడినసాధనము. (శ. ర.)

కిట్టిమము. సం. వి. అ. న. క్షారోదకము, ఉప్పునీరు.

కిట్టు. స. క్రి. ౧. చంపు.

ఉ. కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం,బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ...భార. కర్ణ. ౩. ౨౬౧.

౨. సమీపించు, కదియు.

చ...ఉగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బె,ట్టిదముగఁ గాలఁ గేలను గడిందిమగంటిమియుల్లసిల్లఁ బట్టుదు...భార. విరా.౧.౮౩.

గీ...కిట్టెను డాసెను గదిసెఁ గవిసెఁ, జేరె డగ్గఱె ననఁ దారసించె ననఁగ, వెలయు...ఆం. భా. ౩. ౧౨౪.

సక్రి. అక్రి. కవియు, తాఁకు.

మ. మురదైత్యుండు... దేవవ్రాతముం గిట్టి ము,ష్కరుఁ డై కుండలముల్ హరించె... ఉ.హరి. ౧. ౮౫.

(దుర్యోధనుఁడు ద్రోణునితో నన్నమాట.)

మ...భీమాగ్రజుం డాజిఁ గి,ట్టినఁ బట్టం గడునగ్గమైనయెడఁ గ్రేడింతెప్డు...భార. ద్రో. ౧. ౩౮౮.

సీ. ఉద్భటప్రతిభటవ్యూహంబుపైఁ గిట్టి యస్త్రశస్త్రముల నూటాడఁ గోరు. కృ. శసం. ౩. ౮౩.

కిట్టుకొను=చేరుకొను.

క.కుజుమూఁకలు గూడఁ గిట్టికొని తమలోనఁగా.

వ. మదీయవృత్తాంతంబు చెప్పికొనుచున్నంత. దశకు. ౬. ౧౧౦, ౧౧౧.

కిణము. సం. వి. అ. పుం. ౧. కఠినవస్తుస్పర్శముచే హస్తాదులందు కాచెడికాయ. ౨. శుష్కవ్రణము, ఎండినపుండు, గాయపుకాయ. ౩. మాంసపుగ్రంథి, కంతి.

కిణి. సం. వి. ఇ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేనుకీ.

కిణిహి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అపామార్గము, ఉత్తరేనుకీ. ౨. కటభి,నల్లగినియకీ. ౩. తెల్లగినియకీ.

కిణ్వము. సం. వి. అ. పుం. న. సురాబీజముకీ. న. ౧. పాపము. ౨. మద్యము చేయుట కుపయోగించునానావస్తుసముదాయము. ౩.పిణ్యాకము, తెలికపిండి.

కిత. వి. దేవతార్పణముకై కళ్లమున నొకదెసనుబోసెడుమూఁడుదోసిళ్లధాన్యరాశి. (శ. ర.)

కితవము. సం. వి. అ. పుం.దుత్తూరము,ఉమ్మెత్తకీ.

కితవుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. వంచకుఁడు, మోసగాఁడు. ౨. ఖలుఁడు, దుష్టుఁడు. ౩. ఉన్మత్తుఁడు,పిచ్చివాఁడు. వి. అ. పుం. జూదరి.

కిత్తనార. వి. చాఁగనార.

కిత్తలి. వి. (క. కిత్తళె. తు. కిత్తలి) కిచ్చిలికీ. (బ్రౌ)

కిత్తి=కిత్తు.(శ. ర, చి. ని.)

సీ. అలికనేత్రుముకిత్తి యాఁజ్యమానమై యెప్ప
లసందుల నిప్పు లుమిసె. హర. ౭. ౭౯.

కిత్తు. వి. (ప్రా-క. త. కిచ్చు.) అగ్గి, నిప్పు.
సీ. నీటిబిడ్డఁడు కిత్తు నిప్పు...సాం.ని. దేవ.౧౨.
వేంక. దేవ. ౧౪. ఆం. భా. ౧. ౪౮.

కిదుకు. అ. క్రి. మూలుగు.
సీ. మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గను విచ్చి
త్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి. భాగ.
౧౦ పూ. ౨౨౫.

క. నిదురించినశిశు వాఁకొని, కిదుకుచుఁ జను గో
రికెరలి కిసలయవిలస, న్మృదుచక్రచాపరే
ఖా,స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్
దండిన్. భాగ. ౧౦ పూ. ౨౫౦.

ద్వి. వత్తు నేనును నన్ను వదలక తిగిచి, యెత్తు
కొమ్మనుచుఁ బెల్లైసఁగు దైన్యమునఁ, గిదు
కుచుఁ జిన్నికెంగేలఁ బైకొంగుఁ, గదియిం
చి బుడిబుడికన్నీరు దెచ్చి. ద్వి. హరిశ్చ.
పూ. ౨౩౪౨ పం.

కినియు[1]. స. క్రి. అ. క్రి.(క.కినిసు).౧.కోపించు.
గీ. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి,నను
నయించి రాధేయునిఁ గినిసి ప్రియము, దోఁ
పఁ దా నిట్టు లనియె...భార. ఉద్యో. ౧.
౨౫౫.

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగునచ్చటివృద్ధజనంబు
లెల్ల నో,రెత్తక యూరకుండిరి మహీశ్వరు
చిత్త మెఱుంగ కున్కఁ దా,నొత్తి కుమారు
లం గినియ నోపఁడ ... భార. ఉద్యో. ౧.
౩౪౬.

చ. అనిమిషనాథ ముఖ్య బదరికాశ్రమతాపస
పంక్తిముందటన్,గినిసి ప్రతిజ్ఞ చేసి రణకే
ళికి నప్పుడ పోవువాఁడనై, పనివడి నేఁద
లంచితి సుపర్ణుని...ఉ. హరి. ౧. ౧౩౭.

చ...భవ, తనయుఁడు గంధసింధురవితానము పై
నడరించి భీమసేనుని గినియించె...భార.
ద్రో. ౧. ౩౧౦.

సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప నది
శార్ఙ్గి తేజంబునందు డించె. పారి. ౫. ౩౦. వ
రాహ. ౧౧. ౧౦.

౨. ద్వేషించు.
గీ. అఖిలవిషయానభిస్నేహుఁ డగుచు శుభము,
నొంది మఱియక యశుభంబు నొంది కినియ,
కుండు నెవ్వాఁడు సమత నప్పుండితుండు,
సంస్థితప్రజ్ఞుఁ డగు సూరిజనవరేణ్యా. సీతా
రా. ౩. ౧౪౨.

శ్లో. యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభా
శుభమ్, నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్ర
తిష్ఠితా. గీత. ౨. ౫౭.

జ: కింక, కినుక[1],కినుకకాఁడు,కినుపు,కినువడు.

కినియు[2]. స. క్రి. సమీపించు. (ప్రా, శ. ర.)
గీ. కినిసి పాణినాళీకంబు సోనుపుటయును,నంత
లోఁబడ కదియు మోహ ప్రకటన,మాని త
న్నినిచినయతిమానతుంగ,తరు నెనసి తోన
గ్రహణగోచరతఁ దొఱఁగె.హ.న. ౨. ౪౭.
(నలపక్షమున)

జ: కినుక[2].

కినుక[1](న్క)=కింక.
వి. (కోపము, అలుక, కనలు)
చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు
విల్లు ద్రెళ్ళిడిం, దునిమి...భార. విరా. ౫.
౧౭౬.

గీ. అనిన విని కిన్కఁ బూనినయలఁతినగవు, చె
లువు మొగమున,కొకక్రొత్తపొలు పొనర్పఁ,
బుండరీకాక్షుఁ డగు పెల్లఁ బోయి యప్పు,
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు.
భార. ఉద్యో. ౩. ౩౬౪.

సీ...కినుక యనంగను గిన్క యనఁగ...గీ...త
వరుఁ గోప,ము...ఆం. భా. ౧. ౧౩౪.

కినుక². వి. (√కినియు²) అల్లాడుట.

చ...అవ్వికచపంకజలోచన పాంథ యిందు ర,
మ్మనుటయు నిల్లు చేకొనెద వద్దిర మత్పతి వ
చ్చువేళ నీ,కినుకలు సాగ విచ్చట జగే యన
నాతఁడు భీతచిత్తుఁడై. శుక.౩.౧౯౬.(చూ.
౧౯౪.)

కినుకకాఁడు. విశే. (√కినుక¹) కోపము గలవాఁ
డు, కోపశీలుఁడు. (శ. ర.)

కినుపు. వి. (√కినియు¹) కోపము.

క. అని సామంతులపంతపుఁ,బెనుగాడ్పులఁ దరత
రంబు పెరిఁగెడునసురే,శునికినుపుఁగడలి మొ
రసెనొ, యనఁ దగి ప్రస్థానభేరి యంతట
మ్రోసెన్. కవిక. ౨. ౧౪౩.కాశీ.౪. ౧౪౭.

కినువ(న్వ)డు. అ. క్రి. (కినుపు + పడు) కోప
పడు.

క. జన్నములు సేయునెడఁ బ,క్వాన్నంబులు
గుడుచు చుండు మధిపతి నిన్నున్, జన్నియ
విడిచె రణమునతఁడే, మిన్నక కినువడక పొమ్ము
మీగృహమునకున్. భార. విరా.౪.౨౧౭.

చ. జనకునిఁ గన్నఁ గిన్వడుదు సభ్యుల బంధులఁ
గాంచినం గడున్, గనలుదుఁ దల్లిదిక్కునను
గౌరవబుద్ధి యొకింత లేదు నా,వు... హరి.
పూ. ౯. ౭౧.

కిన్నర. సం. వి.ఆ.స్త్రీ.ఒకజాతివీణె. (విల్యమ్స.)

ఉ...మేల్కిన్నరఁ జెంతఁ జేరి యొకకిన్నర
కంఠి యొసంగ నయ్యెడన్. చంద్రికా. ౨.
౯౪.

కిన్నరకంఠ. సం. వి. ఆ. స్త్రీ=కిన్నకంఠి.

కిన్నరకంఠి. సం. వి. ఈ. స్త్రీ-కిన్నరులకంఠస్వర
మువంటికంఠస్వరము గలది-మధురకంఠముగల
స్త్రీ; స్త్రీ.

శ్లో. కిమిదం కిన్నరకంఠి సుప్యతే. సం. రఘు.
౭. ౬౪.

కిన్నరము. సం. వి. అ. న. భారతాదివర్షములలో
నొకటి.

కిన్నరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వీణాభేదము. (కే.ని,
నై. ని.) ౨. కిన్నరస్త్రీ.

సీ. తతనాదకసమీరహతకిన్నరీరుతుల్ కిన్నరీరు
తులు నేకీభవించె. వసు. ౧. ౧౪౯.

కిన్నరుఁడు. సం. వి. అ. పుం. ౧. నరముఖమును అ
శ్వశరీరమును గలదేవయోనివిశేషము.

శ్లో. బింబోష్ఠం బహుమనుతే తురంగవక్త్ర,శ్చుం
బంతం ముఖమిహకిన్నరం ప్రియాయాః.శిశు.
౪. ౩౭.

౨. దేవయోనివిశేషము.

శ్లో. గంధర్వాకింపూరుషకిన్నరా జగుః. సం.భాగ.
౭. ౨౦. ౨౦.

కిన్నరేశుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

కిన్నెర. వి. (సం. కిన్నరా) వీణావిశేషము.

(సరస్వతీవర్ణనము.) సీ. శృంగారకుసుమంబు
చిన్నిచుక్కలరాజు పసిఁడికిన్నెరవీణ పట
కుఁదోడు. నైష. ౧. ౫.

సీ. వదరుపల్కులు గాక తుది సాటివచ్చునే కి
న్నెరకాయ లీచన్నుఁగవకు.హంస.౧.౨౧౨.

కిప్యము. సం. వి. అ. పుం. పురీషమున పుట్టుక్రి
మి భేదము.

కిమిచ్ఛకుఁడు. సం. విశే. (అ. చ్ఛికా. అ)-భోజ
నాదిసమయములందు-ఏమికావలెను ఏమికావ
లెను అని అడుగువాఁడు.

శ్లో. సుమనోమోదకై రన్నైర్భక్ష్యైరన్యైన చ భూ
రిణా,గోభిర్వస్త్రైశ్చ రాజేంద్ర వివిధైశ్చ కిమి
చ్ఛకైః. సం. భార. శాం. ౩౬.౧౭.(కిమిచ్ఛ
సి కిమిచ్ఛసి ఇతి పృచ్ఛద్భిః-వ్యాఖ్యా.)

**కీముకా(ఖా)బు.** వి. (హిం.కంఖ్వాబ్) బంగారు పువ్వులతోఁ గాని వెండిపువ్వులతోఁ గాని కుట్టినవిలువ గలయొకవిధమైనపట్టుబట్ట.

చ.కసుకుఁబసిండికట్ల పుజగాపయితాణి మెఱుంగుఁగండెపూ,వులకిముకాబుజంటిహరువుల్ బడఁగొట్టువెడందపావడల్ ... మల్లుపు. ర. ౧౮.

సీ. పులితోలుసరిగపూవులహెచ్చుకిముఖాబు గొప్పతమాసుగా నొప్పఁజేసి.పార్వ.౫.౧౪౯.

**కీముడు.** విశే. కొంచెము, అల్పము.

సీ. సైకంబు కొంచెము సన్నంబు తోడెము చిలు కిము డనదు లే చిఱుత లేఁత. గీ. కొద్ది యన్న వనంగను గొంఱలు వల్ప,ము... ఆం. భా. 3. ౧౬.

**కీమ్మను.** మి. అ. క్రి-ప్రశ్నవేయు-నోరెత్తు, మాటాడు. (దీనికి వ్యతిరేకమందే ప్రయోగము.)

సీ. కళలు వెచ్చము గాని కలువవెచ్చెలికానిమురువుఁ గిమ్మనదీని మోమువాని. సారంగ. 3. ౧౦౮.

ఉ...ఇందుబింబముల్, గిమ్మనదీదు మోము... మనుచ. 3. ౬.(ఇట ఔపమ్యవాచకము.)

**కిమ్మీరము.** సం. విశే. (అ. ఆ.అ.) చిత్రవర్ణము గలది, నానావర్ణములు కలది. వి. అ. పుం. ౧. చిత్రవర్ణము. ౨.నాగరంగము,నారింజకాయ.

**కిమ్మీరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక రాక్షసుఁడు. (వీఁడు భీముని చే హతుఁ డయ్యెను.)

**కీమ్మ=ఇమ్ము**[1]. (౧. అర్థము. చూ.) ప్రీతి.

ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిది మీఁగడతోఁ బెరుంగు చొ,క్కమ్మగుజున్నుఁబాలు చిలుకల్ మిసి దీసినవెన్నముద్ద వె,చ్చమ్ముల కైదునాల్గుదివసాలకు మాడలముల్లె లిమ్మెయిం, గిమ్ములఁ దెచ్చి యిచ్చు రతికిం బతిమాలుచుఁ బిల్చు నిచ్చలున్. హంస. ౨. ౧౧౧.

**కీయాహము.** సం.వి.అ.పుం.ఎఱ్ఱగుఱ్ఱము.(వై.ని.)

**కియ్య.** వి. (కిందు+య) అక్షరముక్రింద వ్రాయు యకారము.

గీ...కియ్య యనఁగ, నడరుసు యకారనామంబు...ఆం. భా. ౨. ౧౮౭.

**కియ్యవడి=కియ్య.** వి. అక్షరము క్రిందియకారము. (శ. ర.)

**కిరకము.** సం. వి. అ. పుం. పందిపిల్ల.

**కిరకుఁడు.** సం. వి. అ. పుం. లేఖకుఁడు, లేకరి. (వాచ.)

**కిరడు.** వి. బెస్తలు సవారి మోయునపుడు నడచునడకలలో నొకటి. ప్రబంధ. ౬౦౫.

**కిరణమాలి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**కిరణము.** సం. వి. అ. పుం.మయూఖము,వెలుఁగు.

**కిరత్.** సం. శత్రు. ౧. కప్పుచున్న. ౨.చిమ్ముచున్న, చల్లుచున్న. 3. హింసించుచున్న.

**కిరము.** సం. విశే. (అ. ఆ. అ.) విక్షేపకము, చల్లునది.వి. అ. పుం. ౧. పంది. ౨. విష్ఠాదులు విసర్జించుప్రదేశము, మఱుఁగుదొడ్డి.

**కిరాటిక.** సం. వి. ఆ. స్త్రీ. శారిక, గోరువంక.

**కిరాటుఁడు.** సం.వి.అ.పుం.౧.వైశ్యుఁడు,కోమటి. ౨. మ్లేచ్ఛుఁడు.

శ్లో...ద్వే తు కిరాటస్స్యామ్లేచ్ఛే వణిజి చాపి. (కే. ని.)

**కిరాతకము.** సం. వి. అ. పుం. నేలవేముచెట్టు.

**కిరాతతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేముచెట్టు.

**కిరాతము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక దేశము. ౨. ఒకజాతి చేప. 3. భూనింబము, నేలవేముచెట్టు.

**కిరాతి.** సం. వి. ఇ. స్త్రీ. గంగ. ఈ. స్త్రీ. ౧. కిరాత

స్త్రీ, బోయత. ౨. కుంటెనకత్తె. 3. దుర్గ. ౪. గంగ.

**కిరాతిని.** సం. వి. ఈ. స్త్రీ. జటామాంసికి.

**కిరాతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పొట్టివాఁడు. వి. అ. పుం. ౧. నెమిలిపించెము ధరించి యడవి యందు తిరిగెడిబోయ, ఎఱుకు. ౨. మ్లేచ్ఛుఁడు.

**కిరి.** సం. వి. ఇ. పుం. ౧-నేలను త్రవ్వునది-పంది. ౨-నీళ్లను చిమ్మునది- మేఘము. స్త్రీ. అటని, ధను ష్కోటి (వై. ని.)

**కిరీటము.** సం. వి. అ. పుం. న. మకుటము, రాజులు తలను దాల్చు భూషణవిశేషము.

సా: కిరీటముపెట్టినతలకు సుళ్లడుగ నేల.

క. చెలులార మీదువిద్యా,విలసనములమహిమ నేఁడు వింతగఁ జూడన్, వలెనె కిరీటము వెట్టిన,తలకున్ సుళ్లడుగఁ బోవఁ దగునే యెందున్. వాల్మీకి. 3. ౬౭.

**కిరీటి.** సం. విణ. (న్. నీ. న్.) కిరీటము దాల్చినవాఁడు. వి. న్. పుం. ౧. ఏనుఁగుయొక్క దంతమూలము. (వై. ని.) ౨. అర్జునుఁడు.

**కిరీటిక.** సం. వి. ఆ. స్త్రీ. జీవక మనెడిగంధద్రవ్యముకి.

**కిరీటిపచ్చ.** వి. (కిరీటి + పచ్చ-కిరీటిశబ్దముగారుడశబ్దభవము అని శ.ర.) గరుడపచ్చ, మరకతము.

సీ. గోమేదకంబులకుట్టిమంబులతోఁ గిరీటిపచ్చలవితర్దికలతోడ. వరాహ. ౪. ౧౧౧. ద్వి.పరమ. 3. ౨౪౪ పా.

**కిరుదెస.** వి. (సం. గృధ్రసీ.) రొండియందు కలుగునొకవాతరోగము.

సీ. గృధ్రసి పేరగుఁ గిరుదెస యనఁగను...ఆం. భా. ౨. ౧౨౬.

**కిరుసు.** వి. (త. కిరుచు.) ఇరుప్రక్కల వాయి గలిగి వాట మగునొకవిధమైనకత్తి.

గీ. అనుచుఁ జెల్వపుఁజెంగల్వయరిదికిరుసు, దురుసుమాస్టీని బదరి యయ్యరుసుపట్టి,గురుసుమద్యోతనుని దూఱి గరుసు మీఱి, పేరెములు వాఱెడుమరుత్కుమారు నని యె.కుసల. ౪. 3౧. (చెంగల్వయరిదికిరుసుమరుసుమాస్టీఁడు= చెంగల్వకత్తిగాఁగల మొనగాఁడు, మన్మథుఁడు.)

గీ. విరహినెత్తుట జొత్తిల్లుకిరుసు లనఁగ, నరుణతరుణప్రవాళంబు లచటచటఁ, గ్రమ్మబుతురాజు నిండోలగంబుచేసె, మదనసేనాధిపత్యసంపదలఁ బొదలి. కార్తిక. ౪.౫౮పా.

కిరుసుఁగత్తి=కిరుసు. కళా. ౭. ౧౨.

కిరుసుఁగైదువు=కిరుసు. చంద్రా. ౨. ౭౫.

**కిర్మి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పలాలము, గింజలేని వరిపోఁచ, మొ. ౨. గృహము. 3. స్వర్ణపుత్తళిక, బంగారుబొమ్మ (మే.ని.)

**కిర్మీరత్వక్కు-(చము).** సం. వి. చ్. పుం.నాగరంగము, నారింజకి.

**కిర్మీరము.** సం=కిమ్మీరము.

**కిర్మీరితము.** సం. విణ. (అ. ఆ. అ.) చిత్రవర్ణము గలదిగాఁ జేయఁబడినది.

**కిర్మీరుఁడు.** సం. వి. అ. పుం=కిమ్మీరుఁడు.(వాచ)

**కిఱుకిఱు.** వి. రథనేమిధ్వన్యనుకరణము. (శ.ర.)

**కిఱు**[1]**=కిఱ్ఱు.** (చూ)

జ: కిఱుఁజెప్పు.

**కిఱు**[2]**=చిఱు.** విణ. (క. కిఱు) అల్పము. (దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

సీ. నూఁగారు వొదలుమేనులతోడ నెరకునైకిఱుకూఁత లిడ నాలకింప లేదు. వేం. పంచ. ౧. ౨౮౭.

ద్వి... మోవి,కెందలిరాకుమైఁ గిఱునవ్వు నెఱ

య్యా. ద్వి. పరమ. ౨. ౮౪ పా. ౧౫పం.(చి. ని.పా.)

కిఱుంజెప్పు=కిఱ్ఱుంజెప్పు.వి.(కిఱు[1] + చెప్పు.)కిఱ్ఱుమని ధ్వనిచేయుచెప్పు.

మ. తతి నాక్రాంతసమస్తలోక బలిదైత్యధ్వంసి యోదేవ నీ,యఱకా లుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబులో నొత్తినం,గుఱుగు ఱ్ఱంచెడసంది బిట్టొఱలునఘోరాహి నీయంఘ్రికిన్,గిఱుంజెప్పైనవిధంబు నామనములోఁ గీలించినట్లయ్యెడున్. నైష. ౭. ౧౨౫. చెన్న. ౩. ౩౧.

కిఱుకు = కిఱ్ఱు. వి. చెప్పులు మున్నగువానిధ్వని కనుకరణము.

ద్వి. కిఱుకుంజెప్పులు...అ. మ. క. ౧. ౪౯పా. ౧౭ పం.

క. అన విని వా రిది యగు నని, చనుటయు నానాఁటికేయి శయ్యాపయి న్నా,థుని ప్రక్కనుండి తమిరేఁ,గినఁ జిత్తిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్. శుక. ౨. ౧౨౪.

కిఱుదు. విశ. (క. కిఱుదు) న్యూనము, తక్కువ.

గీ. ఒకట నుదయాద్రి కస్తాద్రి కొక్కజంగ, దాఁటఁ జాలియుఁ గిఱుదుగా దాఁటి యోడె, దానవుఁడు...దశా. ౭. ౧౪.

చ. యతివరులార నీలనిషధాద్రులు తక్కినవర్షభూధర,ప్రతతులలోన మిక్కిలియుఁ బ్రస్తుతి గన్నవి లక్షయోజనా,యతములు వీనిఁ గూర్చి కిఱు దైనవి చాఁపున హేమకూటప,ర్వతమును మంచుఁగొండయును ద్వాదశవింశతియోజనంబులన్. వరాహ. ౧౦. ౧౦౭.

జ: కిఱుదుకట్లు.

కిఱుదుకట్లు. వి. బ. (√ కిఱుదు) కుమ్మరవాఁడు కుండలపై చేయునొకవిధమైనపని.హంస.౫.౧౩.

కిఱ్ఱు. వి.చెప్పులు మున్నగువానిధ్వని కనుకరణము. (వృత్తియందు వికల్పముగా ద్విత్వలోపము.-చూ. కిఱుంజెప్పు, కిఱ్ఱుంజెప్పు.)

సీ. నిద్దమౌ కుచ్చులయుద్దాలు గిఱ్ఱని మ్రోయఁగా నుల్లాసమునఁ జెలంగి. ద్వా. ౧౦. ౭౩.

గీ. పాదములఁ గిఱ్ఱుకిఱ్ఱని పలుకుచుండుకుచ్చు లుద్దాలు...హంస.౩.౯౦. శుక. ౩. ౪౫౩.

గీ. గమనజవమున నుఱ్ఱాడుకావ డదరి,కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ గేళి సల్ప. హంస. ౧. ౧౭౨.

సీ. తలుపు కిఱ్ఱనకుండ...కాశీ. ౪. ౧౦౧.

జ: కిఱ్ఱుంజెప్పు, కిఱ్ఱుంబాగాలు, కిఱ్ఱుగానుఁగత్రిప్పుళ్లు.

కిఱ్ఱుంజెప్పు=కిఱుంజెప్పు.(కిఱ్ఱు + చెప్పు)

ఇట్లే:- కిఱ్ఱుమెట్టు. (శ.ర.)

కిఱ్ఱుంబాగాలు. వి. బ. (కిఱ్ఱు+పాగాలు) కిఱ్ఱు పావుకోళ్లు. వైజ. ౨. ౪౫.

కిఱ్ఱుగానుఁగత్రిప్పుళ్లు. వి. బ. (కిఱ్ఱు+గానుఁగ + త్రిప్పుళ్లు.) బాలక్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానుఁగత్రిప్పుళ్లు గుఱ్ఱపెక్కుడు మంటిగూండ్లు...హంస.౩.౧౪౬.

కిలకించితము. సం. వి. అ. న. (కిల=అలీకేన.కిం=ఈషత్. చితం=రచితం.కల్ప) స్త్రీలశృంగారచేష్టావిశేషము, అభీష్టతమసంగమమువలని యుబ్బుచేఁ గలుగు స్మితాదులకూడిక.

శ్లో. స్మితశుష్కరుదిత హసితత్రాసక్రోధశ్రమాదీనామ్, సాంకర్యం కిలకించితమభీష్టతమసంగమాదిజాధ్ధర్షాత్. సా. ద. ౩. ౧౦౧.

కిలకిల=కిలాకిల. వి. (క. కిలకిలా) నవ్వుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. (ఇది 'కిల' కు ఆమ్రేడితరూపము.)

క. కలువలు కిలకిల నవ్వెన్.సారంగ.౨.౧౬౨.

చ...బలె, సకినలకూఁకలన్ గిలకిల న్నగుమోహనశయ్య నున్నెడన్...వసు. ౬. ౭౪.

సీ. వలసినయెడకుఁ గమ్మలు వ్రాయువ్రాయసంబు లవారిగంటాలకిలకిలలును. కువల. ౨.౧౧౦.

చ...గ్రక్కున బాహువు లప్పళించుచుఁ, గిల కిల నార్చుచుఁ జెలఁగి శేరుచు...ఉ. రా. ౭.౧౩౦.

సీ. చెలఁగుచుఁ గిలకిలల్ గులుకుకో వెలలకు... యయా. ౪. ౧౫, ౫. ౭౧.

జ: కిలకిలమను, కిలకిలలాడు, కిలకొట్టు, కిలారించు, కిలాడుచు.

**కిలకిల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హర్షధ్వని. ౨. వీరుని సింహనాదము.

**కిలకిలమను**=కిలకిలలాడు. (కిలకిల+అను-వా)

**కిలకిలలాడు.** అ. క్రి. (కిలకిలలు+ఆడు) కిలకిల మనిధ్వని చేయు.

చ...సారెసారెకుం,గిలకిలలాడుచు న్నగులఁ గేకలు గొట్టుదు రింతె కాని...నీలా. ౨. ౭౧.

చ...దీనితోఁ,గిలకిలలాడుచుఁ మదనకేళిఁ బెనంగెడిభాగ్య మెన్నఁడో.మృ.వి.౨.౬౨.

**కిలకొట్టు.** అ. క్రి. (కిలకిల+కొట్టు.) కిలకిలధ్వని చేయు.

ద్వి. చెలికత్తియలపెండుఁ జేరఁ జీరుచును, గిల కొట్టి యంతలోఁ గేరి నవ్వుచును. ద్వి. పరమ. ౨. ౫౮ పా. ౧౪ పం.

సీ...కిలకొట్టి నవ్వి న వ్వాలయఁజేసి. చంద్రా. ౨. ౫. ఘటికా. ౨. ౧౧౪.

**కిలము.** సం. వి. అ. పుం. ఆట, క్రీడ.

**కిలరము**=కిలారము. వి. పసువులమంద.

వ... శ్రీభీమేశ్వరమహాదేవరకిలరమున చామియబోయువంటియయు ... కొమ్మబోలతల్లియయు బెరసినబోలవసమునం బెట్టిన ఎడ్లు ౫౦... ద.శా. ౪. ౧౦౧౨.

వ. ... శ్రీభీమేశ్వరమహాదేవరకిలరమున...బెట్టిన ఇన్నఎడ్లు౫౦ ...ద.శా. ౪.౧౦౧౭.

**కిలాకిల**=కిలకిల.

(నవ్వుటయం దగుధ్వని కనుకరణము.)

మ ... గౌరీకాంత సారెం గిలా,కిల నవ్వ న్మదమొందుదంతిముఖునిం గీర్తించి నర్తించెదన్. కువల. ౧. ౭.

చ... నలకూబరుఁ డేమి నేరమే, పలుకవె యంచు బొమ్మచెయి వట్టిన రంభ నగుం గిలాకిలన్. దశా. ౧. ౭౫.

**కిలాటము.** సం. వి. అ. పుం. ఇగురఁ గాఁగి గడ్డకట్టినపాలు.

**కిలాటి.** సం. వి. న్. పుం. వెదురు. ఈ. స్త్రీ=కిలాటము.

**కిలాతము.** వి. గుజ్జు.

ఉ. విన్నన నేఁగుతామరలవిందు కిలాతపునీడ లెప్పుడున్, వెన్నెలరాచతాలఁ గని వెళ్లక నీళ్ల మునింగి యున్న వీ,మన్ను లటంచుఁ జెంచెలలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁ బోవుదు రిండ్లపట్లకున్. యయా. ౨. ౩౯.

**కిలారము**=కిలరము, కీలరము, కీలడు, కీలారము. వి. పసువులమంద.

సీ...అడరు గోవు,లమ్మ మంద యనఁ గిలారమ్మునా...ఆం.భా. ౨.౨౬౧. ద.శా.౪.౧౦౧౦.

జ: కిలారి.

**కిలారి**=కీలారి. వి. (కిలారము+ఇ) గొల్లవాఁడు.

సీ...గోపాలకుం డొప్పు గొల్లవాఁడు, గొల్లఁడు కీలారి గొల్ల కిలారి పసులగాపరి యనంగ... ఆం. భా. ౨. ౨౬౧.

**కిలారించే**=కిలారుచే.అ.క్రి. (√ కిలకిల)౧.కిలకిల మనిధ్వని చేయు. (శ.ర.)౨.బొబ్బరించు.

వ...పండ్లు గొఱుకుచు నార్భటించుచుం గిలారించుచు దక్షిణోత్తరసముద్రంబు లుప్పొంగి

ఘోషించుచు వచ్చుభంగిఁ బోయు మండ ...
వేం. మా. 3. ౮౨.

కిలారు మే(ర్చు)=కిలారించే.
(బొబ్బరించు)
ఉ.సింగము గాలివెంబడిన చేరి కురంగముఁ బట్టు
నట్లు చం,ద్రాంగదు జీవములో గొని కిలార్చెద
బెట్టుగ నిన్నుఁ దీర్చెదఁ జా.చంద్రా. ౬.౧౦౨.
సీ. దేవతల్ డయ్యంగ దిక్కులు వ్రయ్యంగ న
ప్పటప్పటికిఁ గిలార్చుకొనుచు ... ఉ. రా.
౭. ౧౨౦.

కిలాసఘ్నము. సం. వి. అ. పుం-కిలాసరోగమును
పోఁగొట్టునది-ఆఁగాకరకాయ.

కిలాసము. సం.వి.అ.న. క్షుద్రకుష్ఠరోగము,సోబె.

కిలాసి. సం. విశే. (న్. నీ. న్.) సిధ్మలుఁడు, సోబె
రోగము గలవాఁడు.

కిలింజకము. సం=కిలింజము.

కిలింజము. సం. వి. అ. పుం. ౧. చాఁప,కటము.
౨.కాశాదిరజ్జువు,అల్లుమన్నగువానిలో పేనిన
త్రాడు. 3. సూక్ష్మదారువు. (త్రి. ని.)

కిలిమము. సం. వి. అ. న. దేవదారువుచెట్టు.

కిలు(ల)ము=చిలుము.(బ్రౌ,వా-క.కిలుబు,కిలబు.)

కిల్బిషము. సం. వి. అ. న. ౧. పాపము. ౨. అప
రాధము, తప్పు. 3. రోగము. (హేమ.ని.)

కిల్లా. వి. (హిం. ఖిల్లా. క. కిల్లె.) కోట.
శా.లాడూఖానుకుమంద మొక్కరుఁడె కిల్లా లె
ల్ల లగ్గల్ గొనెన్. రంగా. ౨. ౮౮.
క.హల్లాసేయుదు బొబ్బిలి,కిల్లా తజ్జయము నీకుఁ
గీల్కొల్పుదు...రంగా. ౨. ౫౮.

కిల్లాకు. వి.(కిల్లా+ఆకు? కిల్ల+ఆకు.శ.ర-త. కిళ్లా
క్కు.) ఖండపత్రిక, చీటి, పుర్జీ; ఆజ్ఞాపత్త్ర
ము.
సీ...కిల్లాకు చీటి,యన ఖండపత్త్రిక యలరును...
ఆం. భా. ౨. ౧౭౭.
ఉ...మనువంశచంద్రుకి,ల్లాకునఁ బంపు నేతురు
మహాహిసురాసురలోకపాలకుల్. ఉ. హరి
శ్చ. ౮. ౨౧౭.
సీ. మకుపులు చుట్టియేర్పడఁగ గోరులు వెట్టి
లలి మీటు మరునికిల్లాకు లనుచు. శకాం. ౨.
౭౬.
క. ముల్లోకంబుల నేలుదు, బల్లిదుఁడను గింకరు
లు సుపర్వులు నాకుం,గిల్లాకుపంపు నేయన్.
రామా. ౫. ౧౭౭.

కిల్లి. వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నా
ణములలో నొకటి, ఒకవిధమైన జెట్టిపట్టు.
సీ...సరిబిత్తరము కిల్లి. గీ. చాగు సమసీసము త
డకాల్ సందుసీస, మంజమెడపట్టు నాఁగఁ
జెన్నలరుచుండు, ముప్పదియు రెండువిన్నా
ణములకుఁ బేళ్లు. ఆం.భా. ౨. ౨౧౯.('కిర్లి'
బ్రౌ, శ.ర. పా.)
వ...చేవయుఁ గందనంబును గిల్లియుఁ దుట్టును బ
రిపోటును...మల్లుపు.3.౬౯. ప్రబంధ.౭౭.

కివకివ. వి. కోకిల పావురము మున్నగుపక్షులధ్వని
కనుకరణము.
వ...కివకివఁ గూయు కోయిలలయారజంబులకు
ను...కువల. ౧. ౧౭.
సీ. కిచకొట్టబకదారికివకివల్ చెవిఁ గుల్కి...
శుక. ౧. ౨౧౮.

కివ్వు. అ. క్రి. మడియు, చచ్చు. (బ్రౌ)

కిశ(స)రము. సం. వి.అ.పుం.న. సుగంధద్రవ్యభే
దము.

కిశోరము. సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱపుపిల్ల;శిసువు,
శాబకము. (ఉదా:- సింహకిశోరము, మార్జాల
కిశోరము.) ౨. తైలపర్ణియనుఓషధి.

కిశోరుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) పదునొకండే
డ్లకు పదునైదేండ్లకు నడుమనుండువయసు కల
వాఁడు. (వాచ.) వి. అ. పుం. సూర్యుఁడు.

**కిష్కింధ.** సం. వి. ఆ. స్త్రీ. వానరరాజధాని.

**కిష్కుపర్వము.** సం. వి. న్. న- కిష్కువు ఎడము గలకణుపులు గలది-౧. చెఱకుꣳ. ౨. వెదురుꣳ. ౩. పోటగళ్ళము, కిక్కసకసవుꣳ.

**కిష్కువు.** సం. విణ.(ఉ.)కుత్సితుఁడు.వి.ఉ.పుం. స్త్రీ. ౧. జేన, వితస్తి. ౨. నలువదిరెం డంగుళములకొలఁది. ౩.మూర. ౪. ప్రకోష్ఠము,ముంజేయి. (మే. ని, వై. ని.)

**కిసమస.** వి. వ్యథ, బాధ.

క. గుసగుసలుపోయి వలపుల,కిసమస లని తెలిసి రసికకిసలయపాణుల్, బిసకిసలకుసుమవిసరము,వెస మసలక తెచ్చి శిశిరవిధిలాలస లై. విజ. వి. ౩. ౩౭.

**కిసరు.** వి. (క. కిసరు.) దృష్టిదోషము.

చ.కిసలయపాణి లేఁతనునుఁగెంజిగురాకు మెఱుంగుమోవికిꣳ, గిసరు దొలంగిపోవలసి కేళివనాంతరలక్ష్మి బోటియై,మసిఁ జిటిబొట్టుపెట్టె ననుమాడ్కిఁ దదాననవాససంపదꣳ, భసలకిశోరకంబు గనుపట్టెడు నల్లదె పల్లవాధరా. రాజ. చ. ౨. ౧౪౪.

ద్వి. ఎన్నిక శాస్త్రంబు లింతియ కాని, యన్నిశాస్త్రములు రావా మీకు ననుచుఁ, జదివింపవచ్చినశాస్త్రుల నెల్లఁ, జదివింపఁగాఁ జూచి సతియును బతియుఁ,గిసరు దాఁకకయుండఁగించిత్తు నొసల,మసిబొట్టుఁ బెట్టి ముమ్మాఱుఁ దూపాడువ. ప్రభు. ౨. ౪౨పా. ౨౩ పం.

కన్కిసరు=ఒకరికలిమిని చూచి సహింపలేమి, చూపోపమి.

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం, గొసరి జను ల్వార్ధిసీరు గ్రోలితి వీసీర్, ససికై మా కిమ్మని క, న్కిస రుడుగం గావ నప్పగించెడుమాడ్కిꣳ. ఆము.౪.౧౭౫.

**కిస(శ)లము.** సం. వి. అ.న. పల్లవము,చిగురాకు. (త్రి.ని.)

**కిస(శ)లయము.** సం=కిసలము.

**కిసాలము.** సం. వి. అ. న=కిసలయము.

సీ. తరుణారుణాంశుబంధురరసాలకిసాలపటలివత్క్షఃకౌస్తుభంబు గాఁగ. ఇందు. ౨. ౪౨.

**కిసాలు.** వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము. (బ్రా)

సీ. కౌనుపై నలరారునూనూఁగునూఁగారు ననఁగఁ గస్తురిరేఖ యనుచుఁ దుడుచుఁ,దరుణులలోనాటతమిఁ గిసాలున నవ్వి చెలి చల్లువిరులఁ చేతు లొడ్డు. మృ. వి. ౧. ౯.

**కిసిమిసి.** వి. (హిం. కిష్మిష్) లఘుద్రాక్షꣳ.

వ...తిన్న నిసురపొన్న గున్నలనీడలజాడలఁ గిసిమిసితీవలత్రోవల నెత్తమ్మికొలంకులకెలంకుల వచ్చివచ్చి... మృ.వి. ౨. ౫౫.

**కిసుక.** వి. (సం. కృషిః) కృషి, సేద్యము.

సీ...కృషిసంజ్ఞ మీఱుఁ గిసుక దుక్కి యన... ఆం.భా. ౨.౨౩౩. (ప్రమాణాంతరము కనఁబడలేదు.)

## కీ

**కీఁచే.** వి. (కోఁతులు మున్నగువాని) ధ్వని కనుకరణము.(దీనికి ఆమ్రేడితరూపము 'కీఁచుకీఁచు')

చ...వేదనꣳ, వనచరకాంత బెట్టులికి నాథునిꣳ కౌఁగిలి వాసి కీఁచుకీఁ,చని కడు బమ్మరించు...భోజరా. ౫. ౯౪.

జ: కీఁచుబిళ్ల, కీఁచుబుఱ్ఱ, కీఁచురాయి.

**కీఁచేబిళ్ల.** వి. (√కీఁచే.) అదిమినపుడు కీఁచుకీఁచనునట్లు లోపల ఈల్లుపెట్టి కుట్టిన బటువుతోలుగుడ. (శ. ర.)

**కీఁచేబుఱ్ఱ(ఱ).** వి. (√కీఁచే)అదిమినప్పుడు కీఁచుకీఁ చని ధ్వనిచేయుతలగడ.

**కుందువడు.** అ.క్రి.(కుందు + పడు) కుందునొందు. (డిల్లపడు)

వ... కొందఱు దుష్టమతులు లేమిఁ గుందువడిన భర్త నధిక కార్పణ్యంబు పచరించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితివఱుతురు... కాశీ. ౨. ౭౯.

(బాధపడు, పీడ నొందు.)

సీ. కలికిగుబ్బలపెంపుఁ గనఁ జాలఁ దమి గాంచి కోకముల్ రాజాచేఁ గుందువడియె. చంద్రి. 3. ౧౪.

**కుందువు.** సం.వి.ఉ.పుం. మూషికము. స్త్రీ. ఒకానొకగంధద్రవ్యము, కుందురువుకీ. (కల్ప)

**కుందె(దియ)న.** వి. ౧. ఉలూఖలభేదము, ధాన్యము దంపెడుఱోలు, కుంది.

ఉ. భాసురరక్తిమైఁ గలమపాళికిఁ గుందెన నించి కంకణౌఘాసమనిస్వనాళి వెలయంగ నయోగ్రము లూని సువ్వి సువ్వీ సువి సువ్వి లాలి యని వింతగఁ బాడుచు దంచి పుణ్యగో,త్రాసురకామినుల్ సతిశిరంబున సుంకులు చల్లిర త్తఱిన్. చంద్రి. ౬. ౧౬.

ఉ. విప్పుగుతమ్మికుందెనల వేడుక నర్కకరప్రభాంగనల్, పుప్పొడిరాజనాలు వలపుల్ వెదచల్లఁగ నించి సారెఁ జాల్, దప్పక దంపనెత్తుముసలచ్ఛటలో యనఁ జూడ వింతయై, యొప్పెఁ దదంతరాళపతదుత్పతదుద్ధతషట్పదావళుల్. ల. వి. ౪. ౧౨౭.

గీ. కుంది కుందెన యనఁగను గొఱలు వ్రీహ్యు, లూఖలము...ఆం.భా. ౨.౨౩౯.

౨. కూర్చుండ లేనిపసిబిడ్డలు కూర్చుండుటకై యేర్పఱచు నొకవిధ మగుతొట్టె.

సీ. పసిఁడికుందియనలోపలఁ బట్టుపొత్తులయొత్తు న నొఱగి కూర్చుండ నేర్చె. వి పు.౭.౧౨౪.

3. ఒకానొక చెట్టు. (శ.ర.)

**కుందెనగిఱె.** వి. (√కుందు) కుందెనగుడి, బాలక్రీడావిశేషము.

సీ. ... గుడుగుడుగుంచాలు కుందెనగిఱె. హంస. 3. ౧౪౬.

**కుందెనగుడి.** వి. (√ కుందు.) కుందెనగిఱె, బాలక్రీడావిశేషము.

సీ. 'చిట్లపొట్లాకాయ సిరిసింగణావత్తి గుడుగుడుగుంచాలు కుందెనగుడి. కాళ. 3. 33.

**కుందెలు=కుందేలు.** వి. ఔ. (చూ. కుందేటికొమ్ము) శశము, చెవులపిల్లి.

ఉ... వంటయిల్, కుందెలు సొచ్చె ... భార. ఆది. ౬. ౧౫౬.

ఆ. వేఁటకానియిల్లు వెఱవక కుందెలు, సొచ్చినట్టు లెదిరి వచ్చి తీవు. కు. సం. ౧౨.౮౬౭.

జ: కుందెవల.

**కుందెవల=కుందేటివల.** వి. (కుందెలు+వల)

క. మెడవల సన్నపువల త్రోఁ, పుడువల డొంకవల మింటనుక్కిడివల దాఁ, టుడువల సింగిలవనుకువ, లెడవల కుందెవల లాదు లెసఁగెడిపలలున్. హంస. ౪. ౧౫౪.

**కుందే(దె)టికొమ్ము.** వి. (కుందేలు+కొమ్ము.) ౧. శశశృంగముకీ.

గీ... కుందేటికొమ్మనంగఁ, బరఁగు శశశృంగనామంబు గరళకంఠ. ఆం. భా. ౨. ౬౬.

౨. శశవిషాణము, చెవులపిల్లికొమ్ము; చెవులపిల్లికొమ్మువంటిది. (అసంభవమును దెలుపును.)

గీ. తిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చుఁ, జేరి మూర్ఖులమనసు రంజింప రాదు. భర్తృ.నీతి. ౪.

మ. వసుధన్ గుందెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబునన్. మల్లభూ.నీతి.౫.

గీ. ఆచకోరాక్షి నిలు వెల్ల సాభిలాషఁ, దివి

వీక్షింపఁ గలిమి కుందేటికొమ్ము. తపతీ. ౨. ౬౦.

కుందేటితాల్పు. వి. (√ కుందేలు) శశధరుఁడు, చంద్రుఁడు.

గీ. వచ్చి యవ్వేఁడివేలుపువంగడంపు, నేల మొలత్రాటినిండుఁగుందేటితాల్పు, ప్రోల నిల్చి కరంబు ప్రేముడి దలిర్ప, వెరవుతోఁ బల్కెఁ గేలుఁదామరలు మొగిచి. అచ్చ.రా. యు.౧౪౫, ౫౧౦.

కుందేటివల. వి. (కుందేలు + వల). కుందేళ్లను పట్టుకొనుట కుపయోగించువల.

వ...దొడ్డివల లేటివల కుందేటివల పందివల... మొదలుగా వలయువలలును...కాశీ.3.౪౬.

కుందేలు. వి=కుందెలు.

గీ. జనకుఁ డగుమగ్ధవార్థి కుచ్చైశ్శ్రవంబు, గలిగె నైరావణంబును గలిగె నట్టి,తనకు గారాబుఁ బట్టికి వనజవైరి, కొక్కకుందేలు గలుగుట యువిద యరుదె. నైష. ౮. ౧౮౩.

గీ.... చెవుల,పోతు కుందే లనంగను ఖ్యాతి గాంచు, శశసమాఖ్యలు...ఆం.భా.౨.౮౫.

గీ... కుందేళ్ల నుందురువుల...మనుచ.౪. ౫౧.

జ: కుందేటికొమ్ము,కుందేటితాల్పు,కుందేటివల.

కుంపటి. వి. (క.కుంపటి. త.కుంపిడుసట్టి) అంగారధాని, నిప్పు లుంచెడుపాత్రము.

క. నీమగని తేజమున ను,ద్దామశమసమగ్రుఁ డనఁగఁ దగి కుంపటిలోఁ, దామర మొలచినక్రియఁ ద,న్వీ మునినిభుఁ డైనసుతుఁడు నీ కుదయించున్. నృసిం. 3. ౧౨౩.

క.... కుంపటిలోఁ,దామరలుం బోలె నట్టిశతి నొప్పారెన్. ఆము. ౨. ౬౯. ఆం. భా. ౨. ౨౪౧.

కుంపె=కంపె. వి. తాంబూలపాత్రము.

సీ. తాంబూలపాత్రంబు తబుకంచనంగను గంపె యంచనఁగను గుంపె యనఁగ. ఆం.భా. ౨. ౧౬౬.

కుంపెన. వి. కర్ణభూషావిశేషము.

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన రావిరేక మ ర్వనఁగఁ గర్ణ,భూషావిశేషము ల్పొల్పు...ఆం.భా. ౨. ౧౪౮.

కుంపెరుఁగు. వి. (కుండ+ పెరుఁగు- శ. ర.) ద్రప్సము, దధిభేదము.

గీ. కుంపెరుఁగు నాఁగ ద్రప్స మగును... ఆం. భా. ౨. ౨౪౯.

కుంబ. సం.వి.ఆ.స్త్రీ. ౧. యజ్ఞభూమికి చుట్టునిడిన కంచె. ౨. ముదు గయినశాటిక.

కుంభ. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

కుంభకము. సం. వి. అ. పుం.౧. ఊపిరి బిగఁబట్టుట. (ప్రాణాయామమున కిది యొకయంగము.) ౨. స్థాలి, కుండ.

కుంభకర్ణుఁడు. సం. వి. అ. పుం-కుండలవంటి చెవులు కలవాఁడు-ఒకానొకరాక్షసుఁడు, రావణునితమ్ముఁడు.

కుంభకామల. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతికామాల రోగము.

కుంభకారము. సం. వి. అ. పుం. కుక్కుభము, గంపపులుఁగు, అడవికోడి.

కుంభకారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కుమ్మరిపెండ్లాము; కుమ్మరది. ౨.కుళత్థిక, అడవిఉలవలు. 3. కుళత్థాంజనము. ౪. మణిసిల.

కుంభకారిక. సం. వి. ఆ. స్త్రీ=కుంభకారి.

కుంభకారుఁడు. సం. వి.అ. పుం-కుండలు చేయువాఁడు-కులాలుఁడు, కుమ్మరి.

కుంభఘోణము. సం. వి. అ. పుం.తంజాపురమండలమందలి యొకప్రసిద్ధపట్టనము. (ఆ. ని.)

**కుంభచక్రము.** సం. వి. అ. న. (జ్యోతి) చక్ర భేదము, కుంభాకారచక్రము. (ఇది ప్రయాణ మందలి శుభాశుభములను దెలుపును.)

**కుంభతుంబి.** సం. వి. ఈ. స్త్రీ. అలాబూ భేదము, ఒకజాతిసొఱకీ.

**కుంభదాసి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కుంభిక, తీఁగ పాఁచి, నాఁచుకీ. ౨. కుట్టని, కుంటెనకత్తె.

**కుంభపాదుఁడు.** సం. విణ. (అ. పదీ. అ.) శ్లీపద రోగి, ఏనుఁగుకాలివాఁడు.

**కుంభము.** సం. వి. అ. పుం. ౧. ఘటము, కుండ. ౨. ఏనుఁగుకుంభస్థలము. ౩. (జ్యోతి) ఒకానొక రాశి. ౪. ఇరువదిద్రోణములకొలత. ౫.(యోగ) ప్రాణాయామముయొక్క అంగవిశేషము, కుంభ కము.(దీనియందుశ్వాసము నిరోధింపఁబడును.) ౬.హృదయరోగవిశేషము. ౭.౧.గుగ్గిలపుచెట్టు. ౨. త్రివృత్తు, తెల్లతెగడకీ. (కల్ప.)

**కుంభముద్ర.** సం. వి. ఆ. స్త్రీ.(యోగ) ఒకానొక ముద్ర.

శ్లో.దక్షాఙ్గుష్ఠం పరాఙ్గుష్ఠే క్షిప్త్వా హస్తద్వయేన తు,సావకాశామేకముష్టిం కుర్యాత్సా కుంభ ముద్రికా. (వాచ)

**కుంభయోని.** సం. వి. ఇ. పుం-కుండయందు పుట్టి నవాఁడు-౧. అగస్త్యుఁడు. ౨. ద్రోణుఁడు. ౩. వశిష్ఠుఁడు. (కల్ప)

**కుంభల.** సం. వి. ఆ. స్త్రీ. బోడతరముకీ.

**కుంభసంధి.** సం. వి. ఇ. పుం.ఏనుఁగుకుంభస్థలముల నడిమిసందు, విదువు. (త్రి. ని.)

**కుంభాండము.** సం. వి. అ. న. గుమ్మడికీ.

**కుంభాండి.** సం. వి. ఈ. స్త్రీ. బూడిదగుమ్మడి, తెల్ల గుమ్మడికీ.

**కుంభాధిపుఁడు.** సం. వి. అ. పుం. శనిగ్రహము.

**కుంభాభిషేకము.** సం. వి. అ. పుం. క్రొత్తగా గుడి కట్టించి యందు ప్రతిష్ఠచేసినవిగ్రహమునకు కుంభమునం దుదకము నిండుగఁ బోసి మంత్రపూత మయినయాయుదకముచేత చేయించెడు స్నానము.

**కుంభి.** సం. విణ. (న్. నీ. న్.) కుంభము కలది. వి. న్. పుం. ౧. ఏనుఁగు. ౨. కుంభీరము, మొసలి. ౩. కులాలుఁడు, కుమ్మరవాఁడు. ౪. గుగ్గిలముకీ. ౫. విషకృమిభేదము. ఈ. స్త్రీ. ౧. ఉఖ, వంటకుండ. ౨. భూపాటలి, నేలకలిగొట్టు; కలిగొట్టుకీ. ౩. కుంభిక, తీఁగపాఁచి, నాఁచుకీ. ౪. కట్ఫలము, పినగుమ్ముడుకీ. ౫. పర్పటము, పాపటకీ. ౬. పరివ్యాధము, నీటిప్రబ్బకీ.

**కుంభించు.** సం. స. క్రి. (ఊపిరి)బిగఁబట్టు,ఆఁపు.

వ...మఱియు నిడయందుఁ బూరించి కుంభించి పింగళనాడిని విడిచి మరలఁ బింగళనాడిఁ బూరించి కుంభించి యిడయందు విడువవలయును...వేం. మా. ౩.౯౪.

**కుంభిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧.తీఁగపాఁచి,నాఁచుకీ. ౨. పాటల, కలిగొట్టుకీ. ౩. ద్రోణపుష్పి,తుమ్మికీ. ౪. ఒకానొకనేత్రరోగము. ౫. వేశ్య. ౬. కట్ఫలము, పినగుమ్ముడుకీ.

**కుంభిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. భూమి, నేల. ౨.కరిణి, ఆఁడేనుఁగు. ౩. జయపాలవృక్షము, క్షుద్రదంతికీ.

**కుంభిపాకి.** సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, పినగుమ్ముడుకీ. (కల్ప)

**కుంభిలుఁడు.** సం. వి. అ. పుం. ౧. దొంగ. ౨.శ్లోకార్థమును దొంగిలించువాఁడు.౩.శాలమత్స్యము, వేగముగా పోవునొకజాతిచేఁప. ౪.శ్యాలుఁడు, పెండ్లాముతోడఁబుట్టినవాఁడు.

**కుంభీకము.** సం. వి. అ. పుం. ౧. పున్నాగముకీ. ౨. కుంభిక, తీఁగపాఁచి, నాఁచుకీ.

కుంభీకుఁడు. సం. వి. అ. పుం. నపుంసక భేదము.

కుంభీధాన్యకుఁడు. సం. వి. అ. పుం=కుంభీధాన్యుఁడు.

కుంభీధాన్యము. సం. వి. అ. న. సంవత్సరమునకు చాలునంత కుండలలో నిలువచేసుకొన్న ధాన్యము.

కుంభీధాన్యుఁడు. సం. వి. అ. పుం. సంవత్సరమునకు కావలయునంత ధాన్యము కుండలలో నిలువ చేసికొను గృహస్థుఁడు.

కుంభీనసము. సం. వి. అ. పుం. పాము.

కుంభీనసి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రావణునిపినతల్లి కూఁతురు. (లవణాసురునితల్లి.) ౨. ఆఁడుపాము.

కుంభీపాకము. సం. వి. అ. పుం. నరకవిశేషము. (ఇందు ఆవమండలికుండలవలె పాపులు కాల్పఁబడుదురు.)

కుంభీరకుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

కుంభీరమక్షిక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి ఈఁగ.

కుంభీరము. సం. వి. అ. పుం. నక్రము, మొసలి.

కుంభీరాసనము. సం. వి. అ. న. (యోగ) ఆసన భేదము.

శ్లో. పాదోపరి పదం దత్త్వా శీర్షోపరి కరద్వయమ్, తిష్ఠేద్దణ్డాకృతిర్భూమౌ కుమ్భీరాసనముచ్యతే. (వాచ.)

కుంభీరుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

కుంభీలకుఁడు. సం=కుంభీరకుఁడు.

కుంభీలము. సం=కుంభీరము.

కుంభీలుఁడు. సం. వి. అ. పుం. ౧. కుంభిలుఁడు, దొంగ. ౨. శ్లోకార్థమును దొంగిలించువాఁడు. (వై. ని.)

కుంభుఁడు. సం. వి. అ. పుం. ౧. వేశ్యాపతి, విటుఁడు. (వై. ని)

౨. కుంభకర్ణునికొడుకు.

కుకభము. సం. వి. అ. న. మద్యము. (కల్ప)

కుకరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కుణి, ఈచవోయిన చేతులు కలవాఁడు.

కుకీలము. సం. వి. అ. పుం-భూమికి మేకువంటిది-పర్వతము, కొండ. (త్రి. ని.)

కుకుందరము. సం. వి. అ. న. స్త్రీలపిఱఁదిమీఁది గుంట. పుం. కుక్కపొగాకు.

కుకుటము. సం. వి. అ. పుం. బూరుగు, శాల్మలి.

కుకురము. సం. వి. అ. పుం. ౧. కుక్కురము, కుక్క. ౨. గ్రంథిపర్ణము, గండిపనము. ౩. దశార్హదేశము.

కుకూటి. సం. వి. ఈ. స్త్రీ, న్. పుం. శాల్మలి, బూరుగు.

కుకూలము. సం. వి. అ. పుం. తుషానలము, కుష్మ, ఉముకనిప్పు. న. ౧. గసిక నాటినగుంట. ౨. కవచము.

కుకోలము. సం. వి. అ. పుం. కోలి, రేఁగు.

కుక్క. వి. (సం. కుక్కురః. ప్రా. కుక్కుర. త. కుక్కన్, కుక్కల్.) వేఁపి, శునకము.

క. వెడగోఁతల నెత్తు రోలుకఁ, బడఁద్రోచిన వచ్చి కుక్కపదుపు వెనుకకు, జడిసెఁ గబళింప నొల్లక ... భార. శాం. 3. ౧౦౮.

గీ ... కంకటి మైలచీరఁ, బఱచి విడె మొల్లరే యంచుఁ బలుకరింపఁ, గుక్కకూఁతుర వలదంచు వెక్కిరించు. శుక. ౨. ౪౧౭. (ఇట నిందావాచకము.) ఆం. భా. ౨. ౭౮౦.

ఇట్లే: -కుక్కలకొడుకు.

సా: కుక్కతోఁక పట్టుకొని గోదావరి యీఁదినట్లు.

విశే. అల్పము, నీచము. (ఇది 'కాకి' వంటిది)

ఉదా: కుక్కపొగాకు.

జ: కుక్కగొడుగు, కుక్కగొట్టె, కుక్కచ్చు, కుక్కతొలసి, కుక్కపాల, కుక్కబూరుగు, కుక్కమూతిపిందె, కుక్కమేడి, కుక్కలకట్టు, కుక్కల్లి, కుక్కవాయింట.

కుక్కగొడుగు. వి. (√కుక్క) ఛత్రాకము, పుట్టగొడుగుగీ. (శర, వా.)

కుక్కగొట్టె. వి. (√కుక్క) అడవిగొట్టె. (బ్రౌ)

కుక్కచ్చు, కుక్కయచ్చు. వి. (కుక్క + అచ్చు) కుక్కయాకృతి గలవాఁత, కుక్కముద్ర.

క. చంపినవానిని సరిగాఁ, జంపుట లగు విప్రుఁడైనఁ జంపక పతిత,త్సంపదఁ గొని తలగొఱిగి ప,దంపడి కుక్కచ్చు వేసి దండింపఁ దగుఙా. విజ్ఞా. ప్రా. ౬౪.

గీ. కల్లజూదరి మెడఁ బాసికలు దగిల్చి, కుక్కయచ్చిడి దండుగఁ గొనుట నీతి.విజ్ఞా. ప్రా. ౪౧.

కుక్కతొలసి. వి. (√ కుక్క) ఫణిర్జకము, మరువము గీ.

ఆ. తొలసి కుక్కతొలసి తోరపువాఁడుము, గలగరయును గుంటగలగరయును. చికి. ౨.(చి. ని-కుక్కతొళసి. శ.ర.)

కుక్కపాల. వి. (√ కుక్క) వటపత్రిగీ. (వన్యలతావిశేషము. ఇది పాలతీఁగను బోలి యుండును ఆకులు మాత్రము సోగవట్రువలై యుండును. చి. ని.)

సీ ... కుక్కపా లన వటపత్త్ర పరఁగుచుండు. ఆం. భా. ౨. ౬౬.

కుక్కబూరుగు. వి. (√కుక్క) ఒకజాతిబూరుగుగీ. హంస. ౪. ౧౧.

కుక్కముల్లు. వి. దద్రురోగవిశేష ము. (బ్రౌ)

కుక్కమూతిపిందె. వి. (√ కుక్క) కాపుడిగిన పుడు కలిగెడు కుక్కమూతివంటిమూతి గలపిందె. (శ. ర.)

ఉదా: చెట్టు చెడుకాలమునకు కుక్కమూతిపిందెలు పుట్టును.

కుక్కమేడి. వి. (√కుక్క) కాకోదుంబరిక, కాకిమేడిగీ. (శ. ర.)

కుక్కలకట్టు. వి. (√ కుక్క) చోరసాధనవిశేషము,కుక్కలు మొఱుఁగకుండఁ జేయువస్తువిశేషము. చెన్న. 3. ౨౯౪.

కుక్కల్లి. వి. (కుక్క + అల్లి) వన్యవృక్షవిశేషము. (చి. ని.)

కుక్కవాయింట. వి. (√ కుక్క) శ్వానబర్బరముగీ.

గీ. కుక్కవాయింట నాఁగఁ జెంపెక్క శ్వానబర్బరాభిధ... ఆం. భా. ౨. ౨౬౭. (బ్రౌ. పా.)

కుక్కి. వి. త్రాళ్లు వదులై పల్లముపడినమంచము; అల్పఖట్వ.

ఉ. ...నీవు ని,స్తేజము నొంది యల్పునిగతిం గొఱమాలినకుక్కిమీఁద నీ,యోజ ననాథుపాటువడ నోగిత మైతె మదీయవల్లభా. భోజరా. ౫. ౨౭౭.

క. కుక్కలలో శబరులలోఁ, గక్కెరచిమ్మటులలోనఁ గార్కొఱులలోఁ, బక్కణముగుడిసెనడుమను, గుక్కిపయిం జచ్చె నెటఁడు ఘోరవ్యాధిఙా. శివరా. ౪. ౪౬. ఉ.హరిశ్చ. ౪. ౧3.

సీ. ...రాజిలు నల్పఖట్వ కుక్కియనంగ...ఆం. భా. ౨. ౧౬౪.

విణ. నిమ్నము, లోఁతైనది.

ద్వి. ఆకుక్కినూతిలో నారీతి నున్న,యాకవిసుతఁ గాంచి యద్భుతం బంది. ద్వి. భాగ. ౯స్కం. (శ.ర.)

జ: కుక్కివడు.

కుక్కిదము. విణ. (త్రుక్కు?) క్రిక్కిఱిసినది; దట్టము, సాంద్రము.

ఆ. ఉవిదమానసమున నుప్పొంగి పలరసం, బొక్కపెట్టతఱిమి కుక్కిదంబు, గాఁగ నిండి తాల్మికట్టవిసెనో యన, వెడలెనశ్రువారి వెల్లిగొనుచు. కు. సం. ౫. ౬౦౬.

ఉ. తారకుఁడుఁ భుజాబలమదంబున షణ్ముఖు మీఁద నేసె నా, నారుచిరాస్త్రసంహతి రణంబునఁ గ్రిక్కొని కుక్కిదంబు గాఁ.కు.సం. ౧౨. ౯౧౫.

కుక్కివడు. అ. క్రి. (కుక్కి + పడు) కుక్కియగు, నేఁతసడలి పల్లమగు, దిగఁబడు.

ఆ. కుక్కివడిన మిగులఁ గొంగోడువోయినఁ, గుఱుచయైన విఱిగి కొంచెమైన, మలినమైన నేఁత పలుచనైనను నల్లు,లున్న నుల్కమంచ మొప్ప దండ్రు. వి. పు. ౪. ౨౧౫.

కుక్కుటకము. సం=కుక్కుటము.

కుక్కుటకుఁడు. సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు, నిషాదస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు.

కుక్కుటధ్వజుఁడు. సం. వి. అ. పుం‒కోడిపడగవాఁడు‒కుమారస్వామి.

కుక్కుటమండపము. సం. వి. అ. పుం. (కాశియందున్న) ముక్తిమండపము.

కుక్కుటమస్తకము. సం. వి. అ. పుం. చవ్యము.

కుక్కుటము. సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. కుక్కుభము, అడవికోడి. (వాచ)

కుక్కుటవ్రతము. సం. వి. అ. న. భాద్రపదశుక్లసప్తమియందు చేయువ్రతవిశేషము. (ఇది సంతానార్థము స్త్రీలు చేయుదురు. దీనినే లలితాసప్తమీవ్రతము అనియు అందురు.)

కుక్కుటశిఖము. సం. వి. అ. పుం. కుసుంభవృక్షము, కుసుమచెట్టు.

కుక్కుటాండము. సం.వి.అ.న.కోడిగ్రుడ్డు.

కుక్కుటాసనము. సం. వి. అ. న. (యోగ) ఆసనభేదము.

శ్లో. నిజహస్తద్వయం భూమౌ పాతయిత్వా జితేన్ద్రియః, పద్భ్యాం బద్ధం యత్కరోతి కూర్పరద్వయమధ్యగం, సవ్యాపసవ్యయుగళం కుక్కుటాసనముచ్యతే. (రుద్రయామళము‒వాచ.)

కుక్కుటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. దంభచర్య, కపటపునడవడి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుకోడి. ౨. శాల్మలి, బూరుగు.

కుక్కుటీవ్రతము. సం=కుక్కుటవ్రతము.

కుక్కుభము. సం.వి.అ.పుం. అలజము, గంపపులుఁగు, అడవికోడి.

కుక్కురము. సం.వి. అ. పుం. కుక్క. న. గ్రంథిపర్ణి, గండివనము.

కుక్కురవాక్కు. సం.వి.చ్.పుం‒కుక్కవలె ధ్వనిచేయునది‒సారంగమృగము, ఒకజాతిలేడి.

కుక్కురి. సం.వి.ఈ.స్త్రీ. ఆఁడుకుక్క.

కుక్షము. సం వి.అ.పుం. ఉదరము, కడుపు. (కౌముది.)

కుక్షి. సం.వి.ఇ.పుం. ౧.జఠరము, కడుపు. ౨.మధ్యభాగము. ౩. కత్తిఱొఱ.

కుక్షింభరి. సం.విణ.(ఇ) ఆత్మంభరి, స్వోదరమాత్రపూరకుఁడు.

కుక్షిరంధ్రము. సం.వి.అ.పుం. నలము, కిక్కసకసవు.

**కుక్షిశూలము.** సం.వి.అ.పుం.న.కడుపులోఁ గలి గెడురోగవిశేషము. (వాచ)

**కుఖనకము.** సం.వి. అ.పుం-భూమిని త్రవ్వునది-౧. ఎలుక. ౨. పంది.

**కుగ్రామము.** సం.వి. అ. పుం. పల్లెటూరు. (రాజు గాని ఆహితాగ్ని గాని వైద్యుఁడు గాని ధనికుఁడు గాని నది గాని లేనియూరు-విల్యమ్సు.)

**కుచండి.** సం.వి.ఈ.స్త్రీ. మూర్వాలత, చాఁగ.

**కుచందనము.** సం. వి. అ.న.౧-వాసన లేనిచందనము-ఎఱ్ఱగంధము,రక్తచందనము. ౨. కుంకుమపువ్వు. ౩. పత్త్రాంగము, రక్తచందనమువలె నుండు కాష్ఠవిశేషము.

**కుచఫలము.** సం.వి.అ.పుం. దానిమ్మ.

**కుచము.** సం.వి.అ.పుం. స్తనము, చన్ను.

**కుచరుఁడు.** సం.విణ.(అ.ఆ.అ.) పరులదోషములను చెప్పువాఁడు.

**కుచాంగేరి.** సం.వి.ఈ.స్త్రీ.చుక్కకూర.

**కుచాగ్రము.** సం. వి. అ. న. చూచుకము, చనుమొన.

**కుచితము.** సం.విణ.(అ.ఆ.అ) పరిమితము,కొలఁది పాటిది.

**కుచేల.** సం. వి. ఆ. స్త్రీ. విద్ధకర్ణి, చిఱుబొద్ది.

**కుచేలము.** సం. వి. అ. న. ౧-భూమికి వస్త్రమైనది-సముద్రము.

శ్లో. కాచాయ నీచం కమసీయవాచా, మోచాఫలస్వాదుముచా న యాచే, దయాకుచేలే ధనదత్కుచేలే,స్థితేఽకుచేలేశ్రితమాకుచేలే.

౨. కుత్సితచేలము.

**కుచేలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)మాసినట్టిగాని చినిఁగినట్టిగాని వస్త్రములు కట్టువాఁడు. వి. అ. పుం. ఒకానొకఋషి, శ్రీకృష్ణునిమిత్త్రుఁడు.

**కుచ్చెల**=కంచెల.

చ. కలువలు కొప్పున న్నగు మొగంబునఁ గస్తురి బొట్టు పట్టుకుచ్చెలయును జంద్రకావిఋకు సాపనివల్వయు మైరహింపఁగా. శుక. ౧. ౮౯.

**కుచ్చెలి**=కుచ్చెలి. వి. కోలి, రేఁగు.

సీ. కుచ్చెలి యంచనఁ గుచ్చెలి యనఁగను గోళి యటన్నను గోలి యొప్పు. ఆం. భా. ౨.౭౪. హంస. ౪. ౧౩౨.

**కుచ్చెలిగంత.** వి. యోగులును యోగినులును ధరించెడుబొంత.

ఉ....వెలివన్నెపట్టునూలుకుచ్చులు గల్గి యొప్పుతనకుచ్చలిగంతయుఁ గక్షపాలలో,నచ్చపురల్నపేటి నిడినట్టి మహాఘుటికాప్రకాండముల్‌.పరమ. ౧. ౧౮౧.

సీ...గుబ్బ,చనుదోయి వన్నెకుచ్చలిగంత డాపలికరమునందు విభూతికక్షపాల.రాజ.చ.౨. ౯౪.

**కుచ్చెలిబొంత**=కుచ్చలిగంత.

సీ. నలువగుకలువమొగ్గలు జడల్గా నాఁచుపాలు పైనకుచ్చలిబొంత గాఁగ. గీ. జోగురాలును బోలెను సొబగు మీఱు,కొలను గాంచికి మదిలోనికోర్కు లలర. యయా. ౩. ౫౬. పరమ. ౧. ౧౮౯.

**కుచ్చితము.** విణ. (సం. కుత్సితః. ప్రా. కుచ్ఛిఓ. క.కుచ్చిత. త.కుచ్చితమ్.) నీచము, అల్పము, కుత్సితము.

ఆ. వలయుపదవియందు నిలిచి నారాజ్యమం,తయును జక్కఁబెట్టి నయము విక్రమంబు నడపునంతమానిసి నై యుండి, కుచ్చితంపు బ్రదుకు కోరఁ దగునె. భార. విరా. ౧.౨౮౨.

సీ. ...అధిప నీపలికినయట్లు కరముఁ, గుచ్చితంబైనట్టి కోమటికులమున జన్మింపు మీ వని శా

పమిచ్చి. మార్క. ౭. ౨౩౬. ఉ. హరి. ౪. ౩౦౧.

౨. నీచత్వము, కుత్సితత్వము.

ఉ. కుచ్చితమేమి గూడు సమకూడినరాజ్యము వీటిఁబుచ్చఁగా, వచ్చినలాభ మేమి... వేం. పంచ. ౩. ౧౩౭.

**కుచ్చితుఁడు.** విశే. కుజనుఁడు, దుష్టుఁడు.

గీ. కటకటీ యడిగొట్టు పలుక యేతెరిగ రాసు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. ౩. ౭.

ఉ. అచ్చటఁ దొల్లి పార్వతి వయస్యలలో జలకేళిఁ దేలఁగాఁ, గుచ్చితులైన రక్కసులు కొందఱు కామినులై జలంబులోఁ, జొచ్చిన నిందుఁ జొచ్చి పురుషుల్ నిజమిట్టులె యాదురంచు లో, హెచ్చినకిన్క నట్లు శపియించి తిరోహిత యయ్యె నయ్యెడన్. ఉ. రా. ౪. ౧౬౩.

**కుచ్చిళ్లు.** వి.బ. (కుచ్చెళ్లు. శ.ర - కుచ్చిలి. చి. ని.) బాలికాక్రీడావిశేషము. (ఇదియే గూఢమణిక్రీడ యండ్రు అని చి. ని.)

మ. దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం బొమ్మపెండిండ్లు గు, జ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చిళ్ గీరనంగింజ లో, మనగుంటల్ కనుమూసిగంత నలుగంబాలాట లోనైనఖే, లనముల్ ... కళా. ౬. ౨౦౨.

**కుచ్చె.** వి. (సం. గుచ్ఛః. ప్రా. గుచ్ఛ. క. త. మ. కుచ్చు. తు. కుచ్చి.) ౧. పువ్వులు మొదలగువానిగుత్తి.

సీ. ...కుచ్చని గుత్తి యన గుచి యనఁగ గుచ్ఛాఖ్య దనరు. ఆం. భా. ౨. ౮౦.

౨. పట్టు మున్నగువానికుచ్చు.

ఉదా: పాలకీకుచ్చు, కుచ్చుపాగా, మొ.

(బ) ౧. స్త్రీలు జడయందు చేర్చి అల్లుకొనెడిభూషణవిశేషము. (శ.ర.)

సీ. బటువుముత్యములపాపటబొట్టు రాకిడి జడబిళ్లలును గుచ్చులడరి వెలుఁగ. వేం. మా. ౧. ౧౩౦.

౨. కొనచెవి నుంచుకొనెడిభూషావిశేషము. (శ. ర.)

జ: కుచ్చుమీను, కుచ్చులమెకము.

**కుచ్చుమీను.** వి. (√కుచ్చె) పెద్దతోఁక గలచేఁప. (చి. ని, శ. ర.)

**కుచ్చులమెకము.** వి. (కుచ్చులు+ మెకము) చమరీమృగము. (శ. ర.)

**కుచ్చె.** వి. ౧. కుచ్చెల, పింజె, మడత.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గానె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె, చుంగు రింగు నెఱికచింగు నెఱి యనంగ...ఆం. భా. ౨. ౧౪౩.

౨. కెంపుపని.

సీ..: కెంపుపని కుచ్చె యనఁగ వెలయు. ఆం. భా. ౨. ౨౭౭.

**కుచ్చెతీయు.** స. క్రి. (రత్నములను) సానఁబట్టు. (శ. ర.)

**కుచ్చెల.** వి. (బ. కుచ్చెలలు, కుచ్చెళ్లు - సం. కచ్ఛః.)

౧. కుచ్చె, పింజె, మడత.

చ.... సరిగంచుచల్వకు, చ్చెల లపరంజిమెట్టియల జీరఁగ నందెలు మ్రోయ సోయగం, బొలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తముచిత్తము తత్తఱింపఁగన్. ఉ. రా. ౬. ౧౬౧.

మ. తళుకుంగుబ్బలఁ బైఁట వేయు మని కాంతల్ దూఱ హాలామదా, కలితస్వాంత యొకర్తు వేగ జిలుఁగుంగుచ్చెళ్లకొం గెత్తి గు, బ్బలపైఁ గప్పిన బైలువడ్డజఘనప్రాంతంబు వీక్షించి ... దశా. ౮. ౧౨౩. ఆం. భా. ౨. ౧౪౩.

౨. పావడ, గాగర.

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతాబుపని మీ
ఱుచెంగావిరంగారుచీరఁ గట్టి. హంస. ౧. ౧౨౦.

౩. పిడుకలు చొప్ప మొదలగువాని ప్రోఁగు, రాశి.

గీ. ... రుబ్బు, ఱోలు పిడుకలకుచ్చెల దాలిగుం
త, దనర నిరతంబు వెలయు నాతనిగృహంబు.
శుక. ౨. ౪౦౫. (పిడుకలకుచ్చెల=పిడుకల గూడు.)

సీ. ... కుచ్చెల యన రాశి కొలుచుచుండు. ఆం. భా. ౨. ౨౩౦.

౪. ఎనిమిదిగొఱ్ఱులకొలఁది, భూపరిమాణవిశేష ము. (శ్రా.)

కుచ్చెలి=కుచ్చెరి. ఆం. భా. ౨. ౭౪.

కుచ్ఛము. సం. వి. అ. న. కుముదము, తెల్లగలువ. (వాచ.)

కుజంభ(భి)లుఁడు. సం. వి. అ. పుం. కన్నపుదొంగ, సంధిచోరుఁడు.

కుజనుఁడు. సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

కుజప్రియము. సం. వి. అ. పుం-కుజగ్రహమునకిష్టమైనది-విద్రుమము, పగడము.

కుజము, సం. వి. అ. పుం-భూమినుండి పుట్టునది-చెట్టు.

కుజలము. సం. వి. అ. న. పులికడుగు.

కుజవారము. సం. వి. అ. పుం. మంగళవారము.

కుజుఁడు. సం. వి. అ. పుం-భూపుత్త్రుఁడు-౧. నరకాసురుఁడు. ౨. అంగారకుఁడు.

కుజ్ఝటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. పొగమంచు. (విల్యమ్సు)

కుటంకము. సం. వి. అ. పుం. ఇంటికప్పున కుపయోగించుగడ్డిలోనగునది.

కుటంగకము. సం. వి. అ. పుం. ౧. ఛది, పటలము, ఇంటికప్పు. ౨. ఆకులు లోనగువానిచే ఆచ్ఛాదితమైనగృహభేదము.

కుటచము. సం. వి. అ. పుం. కుటజము, కొండమల్లెకి. (వాచ.)

కుటజము. సం. వి. అ. పుం. ౧. కొండమల్లె, కొడిసెచెట్టు. ౨. అగస్త్యవృక్షము, అవిసెకి.

కుటజుఁడు. సం. వి. అ. పుం-కుండయందు పుట్టినవాఁడు-౧. అగస్త్యుఁడు. ౨. ద్రోణుఁడు. ౩. వశిష్ఠుఁడు.

కుటన్నటము. సం. వి. అ. పుం. శ్యోనాకము, దుండిగముకి. న. కైవర్తీముస్తకము, కైవడిముస్తెకి.

కుటపము. సం. వి. అ. పుం. ౧. ఇంటితోఁట. ౨. ధాన్యమానవిశేషము, కుడవము. న. పద్మము.

కుటపుఁడు. సం. వి. అ. పుం. ముని.

కుటము. సం. వి. అ. పుం. న. కలశము, కుండ. పుం. ౧. దుర్గము, కోట. (కల్ప.) ౨. చెట్టు. ౩. గృహము; క్షుద్రగృహము, గుడిసె. (శే. ని.) ౪. కొండ.

కుటరము. సం. వి. అ. పుం. తరిగంబము, చల్లరాడు.

కుటరుణ. సం. వి. ఆ. స్త్రీ. త్రివృత్తు, తెగడకి.

కుటరువు. సం. వి. ఉ. పుం. ౧. పటగృహము, డేరా. ౨. ఒకజాతిసింహము. (వై. ని.)

కుటలము. సం. వి. అ. న. పటలము, ఇంటికప్పు.

కుటహారిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి, పనికత్తె.

కుటాక. వి. పక్షివిశేషము.

సీ. కూఁకటికువ్వె కుటాక కళ్కు కరడు నల్లచ్చి
కాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్లని పక్షిశ్రేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

కుటి. సం. విశ. (ఇ) కౌటిల్యము కలవాఁడు. (వై. ని.) వి. ఇ. పుం. ౧. దేహము. ౨. చెట్టు. ఇ, ఈ. స్త్రీ. ౧. కౌటిల్యము, వంకర. ౨. గుడిసె. ఈ. స్త్రీ. ౧. కుంభదాసి, నీళ్లు మోయుపనికత్తె. ౨. మురయనుగంధద్రవ్యముకి. ౩. మద్యము. (హేమ. ని.) ౪. చిత్రగుచ్ఛము, పలురంగులు గల

పూలగుత్తి. ౫. ఇనుము. (వై. ని.)

కుటిచరము. సం. వి. అ. పుం-(జలములో) వంకర గా నడుచునది-జలసూకరము. (వాచ.)

కుటితము. సం. విణ. (అ. ఆ. అ.) కుటిలము, వంకరైనది.

కుటిరము. సం. వి. అ. న. కుటీరము, క్షుద్రగృహము. (కల్ప)

కుటిల. సం. వి. ఆ. స్త్రీ. ౧. నది.(హేమ. ని.) ౨. స్పృక్క-యనుగంధద్రవ్యముకే. (మే. ని.)

కుటిలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧.వంకరైనది; మెలికలు తిరిగినది. ౨. ఋజువు కానిది, కపటము కలది. (ఉదా: కుటిలహృదయుఁడు, మొ.) వి. అ. న. తగరపుష్పము, నందివర్ధనపుపూవు.

కుటీచకుఁడు. సం.వి. అ. పుం-గుడిసెలో నుండుటచేతనే తృప్తి నొందువాఁడు - సన్న్యాసిభేదము. (కుటీచకుఁడు బహూదకుఁడు హంసుఁడు పరమహంసుఁడు అని సన్న్యాసులు నలువురు.)

కుటీరము. సం. వి. అ. పుం. గుడిసె.

కుటుంగకము. సం=కుటంగకము.

కుటుంబము. సం. వి. అ. పుం. న. ౧. పోష్యవర్గము, పెండ్లాము బిడ్డలు లోనగువారు. ౨. బంధువు, చుట్టము. 3. జ్ఞాతి. ౪. సంతతి, సంతానము. ౫. నామము, పేరు. (వాచ.) ౬. వర్గము, సమూహము.

కుటుంబి. సం.విణ. (న్. నీ. న్)కర్షకుఁడు, దున్నుకొని బ్రదుకువాఁడు.(కల్ప.) వి. న్.పుం.గృహస్థుఁడు. (కల్ప.)

కుటుంబిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మగఁడును బిడ్డలును గలస్త్రీ. ౨. కుటుంబములసమూహము.

కుటుఁడు. సం.వి.అ.పుం. శిలాకుట్టకుఁడు,జాలుమ లుచువాఁడు. (శే.ని.)

కుట్టకము. సం.వి. అ.పుం. (గణిత) గుణకాంకవిశేషము.

కుట్టకుఁడు. సం.విణ. (అ.ట్టికా.అ.) ఛేదించువాఁడు.

కుట్టడము. వి. (√కుట్టు.) కుట్టుపని.

సీ. అవికకుట్టడపుఁదోరపునిగ్గుజంటీలు తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ. శుక. ౧. ౨౦౦. (శ.ర.పా.)

కుట్టన. సం.వి.ఆ.స్త్రీ=కుట్టనము.

కుట్టనము. సం.వి.అ.న.౧.ఛేదనము. (చెక్కుట,మలుచుట, మొ) ౨.కుత్సనము, నిందించుట. 3.ప్రతాపనము, కాఁచుట, వెచ్చచేయుట. ౪. గుణనము,గుణించుట.

కుట్టని. సం.వి.ఈ.స్త్రీ. ౧. కుట్టిని, కుంటెనకత్తె.౨. ఛేదనసాధన మగుకత్తిపీట,మొ.

శ్లో. కుట్టనీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ, పంచసూనా ఇతి ఖ్యాతాస్తాభి స్స్వర్గం న గచ్ఛతి.

కుట్టనీయము. సం=కుట్టయితవ్యము.

కుట్టమితము. సం. వి. అ. న. దంతపీడనాదులచే కోపభావ మభినయించినను లోపల మిక్కిలి యానందము పొందునట్టిస్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.

శ్లో. కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేపి సంభ్రమాత్,ప్రాహుః కుట్టమితం నామ శిరఃకరవిధూననమ్. సా. ద. 3. ౧౧౧.

కుట్టయత్. సం. శత్ర. ఛేదించుచున్న.

కుట్టయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదించుచున్నది.

కుట్టయిత. సం. విణ. (ఋ.త్రీ.ఋ)=కుట్టకుఁడు.

కుట్టయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.

కుట్టహారిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి, పనికత్తె.(హ లా. ని.)

కుట్టాకము. సం. విణ. (అ. ఈ. అ.) ఛేదించునది.

కుట్టారము. సం. వి. అ. పుం. కొండ. న. ౧. రతి. ౨. కంబళము.

కుట్టారుగ. వి.(కుఱు+ఆరుగ)క్షుద్రకోద్రవముళ్. (బ) ధాన్యవిశేషము.

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దిం త్రిణీపల్లవో,త్కరముం గూడఁ బొరంటి నూనియలలోఁ గట్టావికుట్టారుగో,గిరముల్ మెక్కి...ఆము. ర. ౧౩ర.

కుట్టావలు. వి. బ. (కుఱు + ఆవలు) సర్పవిశే షము. (శ. ర.)

కుట్టితము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడి నది.

కుట్టిని. సం=కుట్టని.

కుట్టిమము. సం. వి. అ. పుం. న. ౧. శిలారత్నాది నిబద్ధభూమి, నెలకట్టు. ౨. కుటీరము, గుడిసె. పుం. దానిమ్మశ్.(రా.ని.)

కుట్టీరము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదకము. వి. అ. పుం. కొండ.

కుట్టు. స.క్రి.(త.కుత్తు.)౧. (వస్త్రపర్ణాదులు)కుట్టు.

వ. ... మూరకొక్కండును జేనకొక్కండును గాఁ గుట్టినడొల్లుటుల్లార ఉల్లసిల్లఁ బల్లించి నపల్లంబులపై...ఆము. ర. ౩౪.

సీ. నునుఁబోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమితోడ ... ఆము. ౧. ౭౬.

౨. (చీమ, తేలు, తుమ్మెద, మొ.) కుట్టు.

గీ. మధువుఁ గొన నుత్సహించినమనుజుఁ బట్టి, కుట్టె నిర్జించుమధుకరకులమునట్లు. భార.ఆర. ౧. ౨౪౧.

౩. గ్రుచ్చు.

వ. ...పిశితఖండంబు లొండొండ యుప్వెత్తుగా నాఁబొత్తరలం గట్టియు గదులు గుట్టియు ...మనుచ. ర. ౬౦.

ర. (చెవులు, మొ.) కుట్టు.

ఉదా: ఆపిల్లవానికి చెవులు కుట్టినారు.

౫. (అంకురము మున్నగువానిని) పొడుచు.

చ. గుమురులు గట్టి యీరికలు గుట్టి ప్రవాళము వట్టి కింకతో,నమలక మ్రింగి... ఆమనిని కే యుఁబవల్ వడిఁ గూయుఁ గోవెలల్. కు. సం. ర. ర౬౩.

వి. ౧. సీవనము, కుట్టుట; కుట్టినదారము.

సీ. జంటముత్తెపుఁగుట్టుజంటిసైకల నంటి చిగి గుబ్బచన్నులు పిక్కటిల్ల.ఉ.రా.౬.౧౩౧.

ఉ. గుత్తపుఁదాపితాలవికకుట్టు పటుక్కున వి చ్చె రంభకున్. కృ.శపం. పీఠి. ౧.౮౦.

౨. (కడుపులో పుట్టెడు) నొప్పి, బాధ.

క. అడుకులు దిన్నట్లగునే,కడుపునఁ గుట్టె తీవ పుసుగడుఁ బఱచితి నాఁ,డొడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మడుఁగవలసె నిప్పు డొకసాత్యకిచేన్. భార. ద్రో. ర. ౮౯.

క. తలనొప్పి కడుపుఁగుట్టుం,బలుగుఱుపుం గాళ్ల తీపు పాటించుచు...శుక. ౨. ౨౦౫.

౩. ప్రొయ్యిలో క్రిక్కిఱిసియుండుబూడిదలో నగునది. (శ. ర.)

ర. కుట్టఁగా ఏర్పడి శరంధ్రము.

(వ్యవ) చెవికుట్లు మూసికొనిపోయినవి.

జ: కుట్టడము, కుట్టుకాఁడ, కుట్టుచేఁడు,కుట్టుదా కు, కుట్టుడు,కుట్టుతేలు,కుట్టుపోయు,కుట్టునూ.

కుట్టుకాఁడ. వి. (√కుట్టు) కుట్టుపోఁగు. (శ. ర.)

కుట్టుచేఁడు. వి. (√కుట్టు) కొరడా ?

చ. గురుసతిఁ గూడుకట్టునకుఁ గొంకనిమోహు వియోగినీసము,త్కరములకీడు చూచుటకు దర్పకురేఁ పెడుకుట్టుచేఁడు తె,మ్మెరలకుఁ దోడు చిత్రగతి మిన్నులఁ బాఱెడుమాయ

లాఁడు పెన్నిరు లనుపోడు కాలుకొని యే ర్చువెలుంగులవీడు వీఁడువో. వరాహ. ౪. ౨౪.

కుట్టుడాకు. వి. (కుట్టుడు+ఆకు) కుట్టినవి స్తరాకు.

కుట్టుడు. వి. (√ కుట్టు) కుట్టుట. (శ.ర)

కుట్టుతేలు. వి. (కుట్టు + తేలు) ౧. క్షుద్రుఁడు. ౨. కంటకము, ముల్లు.

గీ. కుట్టుతేలనఁ గంటకక్షుద్రు లగుదు,రు... ఆం. భా. ౩. ౪౬. (ప్రాంత ప్రతిపా.)

కుట్టుపోఁగులు. వి. బ. (√ కుట్టు) చెవులకు పెట్టుకొనుఉంగరమువంటి వట్టిపోఁగులు. (శ. ర.)

కుట్టుపోయు. స. క్రి. (కుట్టు + పోయు) కుట్టు. (శ. ర.)

కుట్టుసురు. వి. (కుఱు+ఉసురు) కొంచెము మిగిలియున్న ప్రాణము. (శ. ర.)

కుట్టూరుపు(ర్పు). వి.(కుఱు+ఊరుపు) కొంచెము మిగిలియున్నయూర్పు, కొనయూపిరి.

కుట్టె(ట్టియ). వి. గుదస్థానము. (శ. ర.)

కుట్మ(డ్మ)లము. సం. విణ. (అ. ఆ. అ.) విరియునది,వికసించునది.వి. అ. పుం. ౧. మొగ్గ; అరవిరిమొగ్గ. ౨. మొగ్గవంటిబాణపుములికి. ౩.నరకవిశేషము. (ఇందలివారు యంత్రరజ్జువులచే పీడితు లగుదురు-వాచ)

కుట్మ(డ్మ)లితము. సం.విణ.(అ.ఆ.అ.)జాతకుట్మలము, మొగ్గలుకలది;సగమువిరిసినమొగ్గలుకలది. (వాచ)

కుట్యమానము. సం. విణ. (అ. ఆ. అ) ఛేదింపఁబడుచున్నది.

కుట్యము. సం=కుట్టయితవ్యము.

కుట్ర. విణ. అల్పము.

ఉ. ... వెడంద సోగ యై,నట్రిలుకన్నుదోయి నిడువాలుఁగురుల్ బటువుంబిఱుందు లేఁ,గుత్రనుమంగవుల్ గలుగుకోమలి యై యది ప్రోల నిల్చినన్. విజ. వి. ౨. ౪౬.

౨. భయంకరము, ఘోరము.

శా. ఓసామీ యిటువంటికొండదరిలో నొంటింబులుల్ సింగముల్, గాసిం బెట్టెడుకుట్రనట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడ నే,యాసం గట్టితి వేటిగడ్డ నిలు ... కాళ. ౩. ౬౫.

వి. మాయపన్నుగడ, ద్రోహబుద్ధితో చేసెడుపన్నిక. (బ్రౌ.)

ఉదా:- వారందఱును కలిసి వానిపై కుట్ర పన్నుచున్నారు.

కుట్రపువాఁడు. వి. కుట్టుపని చేయువాఁడు, సౌచికుఁడు. (శ.ర, బ్రౌ.)

కుఠరము. సం.వి.అ.పుం. ౧.కుటరము,తరిగంబము. ౨. తుంగముస్తెకి.

కుఠాకువు. సం.వి.ఉ.పుం.దార్వాఘాటము,వడ్రంగిపిట్ట.

కుఠాటంక. సం.వి.ఆ.స్త్రీ=కుఠాటంకము.

కుఠాటంకము. సం.వి.అ.పుం. కుఠారము,గొడ్డలి.

కుఠారకము. సం.వి. అ.పుం. చిన్నగొడ్డలి.

కుఠారము. సం.వి.అ.పుం. ౧.పరసువు, గండగొడ్డలి; గొడ్డలి. ౨. చెట్టు. (కల్ప)

కుఠారి. సం.వి.ఈ.స్త్రీ. గండగొడ్డలి.న్.పుం-గండగొడ్డలి కలవాఁడు-పరసురాముఁడు.

కుఠారువు. సం.వి.ఉ.పుం. ౧.చెట్టు.౨.కోఁతి.౩. శస్త్రకారుఁడు,కైదువులుచేయువాఁడు.(వాచ)

కుఠి. సం.వి.ఇ.పుం. ౧.చెట్టు. ౨. కొండ.

కుఠికము. సం.వి.అ.పుం.కుష్ఠము, చెంగల్వకోష్టుకి.

కుఠేరకము. సం.వి.అ.పుం.౧.నందివృక్షము.౨. శ్వేతతులసికి. ౩. పర్ణాసము, నల్లగగ్గెరకి.

**కుఠేరజము.** సం. వి.అ.పుం. శ్వేతతులసికి.(కల్ప)

**కుఠేరము.** సం.వి.అ.పుం. ౧. అగ్ని. ౨.పర్ణాసము, నల్లగగ్గెరకి. ౩. శ్వేతతులసికి.

**కుఠేరువు.** సం.వి.ఉ.పుం. చామరవాతము, వింజామర వీచుటవలన పుట్టుగాలి.

**కుడంగము.** సం.వి.అ.పుం.న.పొదరిల్లు.(వై.ని.)

**కుడతా.** హిం.వి.చొక్కా. (శ.ర-కుడితిని.వా.)

**కుడవము.** సం.వి.అ.పుం.ధాన్యమానవిశేషము,మానిక. (ఇది ప్రస్థములో నాల్గవవంతు-రూ. కుడపము.)

**కుడి.** వి. (√కుడుచు-క. త. మ. కుడి.) ౧.కుడుపు, ఆహారపదార్థము. (చూ. కుడిముట్టు.)

క. కడుపున కందియునంచని, కుడి...నా.పంచ. ౪.౧౦౦.(శ.ర.పా-కుడుపుల.ము ద్రి.)

౨. కుడిభాగము.

క. వేదండముతొండముసరి, కోదండముఁ దివియ నెడమఁ గుడి నిబిడజ్యా,నాదము రోదసి నిండఁగ, భేదించుక్ గండశిలలఁ బృథుబాణములక్. మనుచ. ౪. ౯.

గీ. తొడరి బడిబడి నెడవింటఁ గుడియెడమల, నడరి వడి నేయుకతివేల్పుకొడుకు ... నీలా. ౩. ౧౫.

విశ. వామేతరము, దక్షిణము, వలపలది.

ఉదా:-కుడిచేయి, కుడికాలు, కుడివైపు, మొ.

సీ.తామరపగవాఁడు దయితుండుఁ గూడి నీబడి చూపుఁ గుడిచూపుఁ బరిఢవింప. ఉ. హరి. ౧.౧౧౯. భీమ. ౬. ౬౭.

**కుడి.** సం.వి.ఇ.పుం. దేహము.

**కుడితి.** వి.బియ్యము లోనగువానికడుగునీరు.

సీ. తండులక్షాళనోదకము రాజిల్లను గుడితి యనంగను గడు గనంగ. ఆం. భా. ౨. ౨౫౦.

సీ. వలఁ బడ్డమీను కైవడి నిప్పు ద్రొక్కినకోఁతి భాతిని వెఱ్ఱిగొన్నకుక్క,పద్ధతిఁ గుడితిలోఁ బడినమూషికమట్లు శ్లేష్మంబులో నీఁగలీల... చంద్ర. వి. ౧. ౯౨.

ఉదా:-మినుపకుడితి, మొ.

**కుడినీరు.** వి. (కుడి+నీరు) త్రావఁ దగినజలము, పానీయము.

ద్వి. ఎడనీరు నెడనెడ నింపుసొంపైన, కుడినీరు వరుసఁ జేకొనుచు వడ్డింప. అ. మ. క. ౫. ౨౪౯ పా. ౫ పం. దశా. ౭. ౨౭౮.

చ.తళుకుఁబసిండియోవరులు దంతపుఁజావడులర్చనాగృహం,బులు గుడినీరుమేడలును భోజనశాలలు...దాఁటి...వసు. ౪. ౭౨.

**కుడిపి.** విశ.(సం.కురూపి)కురూపి,అంగవికలుఁడు.

క. గ్రక్కున వెలువడి తనచేఁ,జిక్కలగుదివిరోలెనున్న సురుచిరహారం, బక్కుడిపియయుఱువైచుచుఁ,దక్కక చేతంద్రఁ బ్రాలు తలపైఁ బోసెన్. భోజరా. ౫. ౩౪౧.

**కుడిపించు.** స. క్రి=కుడుపు. (√కుడుచు) (తినిపించు)

గీ. హరిణవత్సంబులకు మీరు కరుణతోడఁ,బాయసాన్నంబు గుడిపింప భక్తిఁ జూచి.హర. ౧. ౭.

**కుడిమివాఁడు.** వి. ౧. పామువాఁడు. ౨. విషవైద్యుఁడు. (బ్రా.)

**కుడిముట్టు.** వి. (కుడి+ముట్టు) భోజనపాత్రము, కంచము.

క. తొడవులు చివికినయెమ్ములు, గుడిముట్టు కపాల మిల్లు గుడి ముడియెద్దె,క్కుడు ... కు. సం.౭.౮౭౦.

**కుడియెడమగుపరువడి.** వి. (√కుడి) పండ్రెండు పరువడులలో నొకటి. ('పదునాల్గువిసరులలో నొకటి' అని హంస.౧. ౨౦౬.)

వ...ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి...

మొదలుగాఁ గలపదిరెండుపరువడులును...
ప్రబంధ. ౭౭.

కుడియోరభృంగి. వి. వి. (√కుడి) పంద్రెండు దండలలో నొకటి.

వ...ఎడమయోరభృంగి కుడియోరభృంగి భృంగపటలము... మొదలుగాఁ గలపదిరెండుదండలును... ప్రబంధ. ౭౭.

కుడిశము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

కుడుక. వి. (త.కుడుక్కై.) ౧.పాత్రము. (గిన్నె, మొ.)

క. కుడిచేత మాంసఖండము, లెడకేలను మద్యరసహిత మగుకంచుం,గుడుకయు ధరించి ముదమున,వడవడఁకులు గొనుచు నతఁడు వచ్చెం గుడికిన్. శివరా. ౪. ౩౭.

ద్వి. కడుపారఁ జనుఁబాలు గుడిపి పసిండి,కుడుకతో వెండియుఁ గొన్ని చే నిచ్చు.బస.పు. ౬. ౧౨౦ పం.

క. చాలఁగ నిచ్చలు వెన్నయుఁ,బాలుం గుడుకగొని తల్లి పట్టికి సెలవిన్, ప్రేలిడి యింతింతియకాఁ, గ్రోలించును వెరవుతోడ రుచి గొలుపుక్రియన్. హరి.పూ.౫.౧౯౩.('గుడుక' ౪.ర.పా.)

౨. తక్కెడశిట్ట, తక్కెడసిబ్బి.

గీ. గువ్వ యున్నట్టికుడుక యెక్కుడుగఁ దూఁగ, మాంసఖండంబు కుడుకలో మఱియు నించి, మఱియు న ట్లైన నీక్షించి మదిఁ జెలంగి, త్రాసుపై నిల్చెఁ దాన యద్ధరణివిభుఁడు. శేష. ౨. ౭౬.

కుడుచే(డ్చే). స.క్రి.(క.మ.త. కుడి)౧.తిను,భుజించు.

సీ....భీమ,దవ్వులఁ జూచి నిత్యము నాకు నియమించి కొనివచ్చుకూ డేల కుడిచె దీవు. భార. ఆది. ౬. ౫౯౨.

సీ. పన్నిరంబులఁ గుడ్చుబ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు సమిద్ధమతులు. భార.అర.౫.౩౦౬.

ఆ. మెసవెఁ దినియెఁ గుడిచె మెక్కె బోనేసెను, నమలె నారగించె నా భుజించె, ననుటకాఖ్య లగుచు నలరారుచుండును. ఆం. భా. ౩. ౧౧౭.

౨. త్రాగు, పానముచేయు.

ద్వి. మంచి గొ వ్వెపనకమండలువునను, గొంచకయుంచి తాఁ గుడుచునాపాలు, వాచేరఁ బట్టి భూవరకుమారునకు, వాచవిగా సిద్ధవరుఁడు ద్రాగించి. ద్వి. సారంగ.౨.౯౭పా. ౧౬పం.

సీ. మును మహీధేనువుచను వత్సమై కుడ్చి వస్తుసంపూర్ణమై వఱలువాఁడు. కు.సం.౭.౯౬౫.

చ...పాలు తమ కిచ్చునె యెచ్చట నైన లేఁగలన్,గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నును గాక భాస్కరా. భా.౪.౪.

౩. (సుఖదుఃఖాదులు) అనుభవించు; పొందు, చెందు.

గీ.కర్మఫలములు గుడిచినఁ గాని పోవ,వంటివానిఁ బ్రాయశ్చిత్త మపహరించు. భార. అను. ౫. ౧౧౬.

గీ. ...లొంటి,యట్ల యిడుమలఁ గుడువఁ బో నుడువ వలయు. భార. విరా. ౩. ౯౦.

వ...పితృధనం బగురాజ్యంబు ... ఈరెండుదెఱంగులవారికిం బంచి కుడువం దగుటయు... భార. ఉద్యో. ౧. ౧౨.

సీ. మేదినీనృపతి..క్రూరుఁ డగు నేని లోకంబు బెగడు గుడుచు. భార. శాం. ౨. ౧౭౭.

వ...మరులు గుడిచినపోల్కి...కాశీ.౨.౧౩౭.

కుడిచికూర్చుండి=తినికూర్చుండి, నిర్వ్యాపారముగా, పనిలేక, నిర్నిమిత్తముగా; పొగరెక్కి.

గీ. కుడిచికూర్చుండి క్రొవ్వునఁ బుడమి నేన్ని

పడఁతిఁ దెచ్చుట నిట్టిచేడ్పాటు లాదవె. అచ్చ. రా. యు. ౪౫౨.

గీ. ఆగడంబున బ్రహ్మస్వ మపహరించి, తెచ్చి పుణ్యంబు సేయంగఁ దివురు పెల్లఁ, గుడిచి కూర్చుండి శిలఁ దెప్పకొయ్యఁ జేసి, జలధి లో నీఁదులాడంగఁ దలఁచినట్లు. జై. భా. ౧. ౬౮.

గీ. కుడిచికూర్చుండి వెతఁ దెచ్చికొంటి మొక టి, యెన్న నెక్కడిద్వారక యెక్కడిగద, సాంబ లివి విన్నఁ బెనుచేటు స్వామిచేత, ననుచులకుఁ బగవీడఁట యాపురంబు. ప్ర భా. ౪. ౧౬.

జ: కుడి, కుడిసీరు, కుడిపించు, కుడిముట్టు, కుడి యదుగుపకుపడి, కుడియోరభృంగి, కుడుపరి, కు డుపు.

**కుడుపరి.** విణ. (కుడుపు + అరి) కుడుచువాఁడు.
(తినువాఁడు, భుజించువాఁడు)

సీ. తెలికడలిని గరువలికుడుపరిదొరపఱపుపయి నిదురఁ గొటలునుతీయ. అచ్చ. రా. ఆర. ౧౧౪.

**కుడుపు(డ్పు).** స. క్రి. (√కుడుచే.) కుడుపఁజేయు, కుడిపించు.
(అనుభవింపఁజేయు.)

క. ... అతులపుణ్యవతిఁ గృష్ణను మీ, వా రెల్లఁ జూడఁ బఱిచిన, క్రూరపుఁబాపము ఫలంబు గుడుపక యున్నే. భార. ద్రో. ౫. ౩౦.

వి. (తె. కుడిప్పు) ౧. భోజనము; భోజనపదార్థము.

గీ. కుల్యయందుఁ ద్రిరాత్రంబు గుడుపు దక్కి, శౌచి యై యఘమర్షణజపముఁ జేసి, యశ్వ మేధఫలముఁ బొందు ననఘ నరుఁడు. భార. అను. ౨. ౭౭.

క. కడుపునఁ బుట్టినకూరిమి, కొడుకుకుఁ సుకుమారమూర్తిఁ గులవర్ధనునిఁ, మెడఁ గోసి చంపి వంజూడు, గుడుపుల జోగులకుఁ బెట్టుక్రూరులు గలరే. హర. ౨. ౭౫.

క. బడబాగ్న్యనలాగస్త్యులు, కుడిచినకుడు పఱు గఁ జేసి కుశలప్రదుల, య్యొడు మాకు ననుచు వలచేఁ, గడుపు నిమిరి చదువ గట్టికంఠ్లుం గ మరుకఁ. విజ్ఞా. ఆచా. ౭౨.

వ... గనగననినిప్పులం జముకు చిప్పిలం గాల్చిన కమ్మకఱకుట్లుం జట్రాతిపయి గాత్రేనికిం గు డుపు పెట్టి... మనుచ. ౪. ౬౦. (ఇట నైవేద్య ము అని భావము.)

౨. అనుభవించుట, భుక్తి.

గీ. కొంచె మైనను దగఁ బంచి కుడుపు మేలు. భార. ఉద్యో. ౨. ౪౭.

క. కుడుపుం బత్త్రము సాక్షియుఁ, గడు మేల్ రెండైన మే లొకటియైనను మేఁ, లాడఁబడ నివి లేకున్నను, జెడ విడువక సత్య మర్థిఁ జేయిం పఁదగుకఁ. విజ్ఞా. వ్యవ. ౩౨.

గీ... మెసవుట యారగింత, యారగింపు కుడుపు నాఁగ నలరు భుక్తి. ఆం. భా. ౨. ౨౬౦.

౩. జీవిక, జీవనోపాయము.

వ... గంధచర్చావీటీచర్వణభూషణాంబరధారణం బెల్ల నన్యునికొఱకుఁ గాని యాత్మార్థం బు గాదు పడపు గుడుపు గాఁ బరఁగుపడం తుల కిది మర్యాద... జాహ్నవీ. ౪. ౫౪.

కట్టికుడుపు=బంధించి అనుభవింపఁజేయు, తప్పకుండ అనుభవింపఁజేయు.

క. తొలుజన్మంబునఁ జేసిన, కొలదియును బుణ్యంబుఁ గట్టికుడుపక యున్నే. సారంగ. ౨.౩౩.

కుడుపుడుగుట=పస్తు, ఉపవాసము.

ఆ. దైన్యమునకుఁ ద్రోవ దలఁప నసైన్యంబు, కుక్షి వంచనంబు గుడుపుడుగుట, బుద్ధి యైనయట్లు భోగింప నేర్చుట, సార మైనబోధిసత్త్వమతము. నైష. ౭. ౭౫.

**కుడుము.** వి. (క. కుడుబు, కడుంబు) మోదకము, భక్ష్యవిశేషము.

క. ఎదిరిం దమయట్టుల కా,మది౯ దలఁచిన౯ బొ
నఁగుఁ గాక మాకుం గుడు మిం,డిదె మీరు
ప్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన మనసు
పాండు చక్కఁంబడు నే. భార. ఉద్యో. ౧.
౩౧౨.

సీ...కుడు మన మోదకం బడరు...ఆం. భా. ౨.
౨౫౬.

కుడుముల తిండికాఁడు = మోదకభక్షకుఁడు, వి
నాయకుఁడు. ఆం. సం. దేవ. ౧౨.

**కుడ్యమత్స్యము.** సం. వి. అ. పుం. గృహగోధిక,
బల్లి. (కల్ప)

**కుడ్యము.** సం.వి.అ.న. ౧.భిత్తి, గోడ. ౨. లేపనము,
పూఁత. ౩.కౌతూహలము. (మే. ని.)

**కుణంజము.** సం. వి. అ. పుం. వనవాస్తూకము౯.
(వాచ.)

**కుణంజరము.** సం.వి.అ.పుం. చక్రవర్తికూర౯.

**కుణకము.** సం.వి.అ.పుం. పిల్ల.

వ....మఱియు నాభరతుండు నిత్యనైమిత్తిక క్రి
యాకలాపంబు నిర్వర్తించునెడ నంతనంత
లేచి హరిణకుణకంబుం జూచుచు... భాగ.
౫. ౧. ౧౦౫.

వ....లస్య హావా వైణకుణక ఉచ్చైస్తరాం త
స్మి౯ కృతనిజాభిమానస్య. సం. భాగ. ౫.
౮. ౫.

**కుణపము.** సం.విశ.(అ.ఆ.అ) ౧.కుత్సితము, చెడ్డ
ది. ౨. పూతిగంధి, కంపుగొట్టునది. వి. అ. పుం.
౧. శవము,పీనుఁగు. ౨.అస్త్రవిశేషము. ౩.కృమి,
పురుగు. న. పూయము, చీము. (మే.ని.)

**కుణపి.** సం.వి.ఈ.స్త్రీ. విట్కారిక, పీతిగోరువంక.

**కుణము.** సం.వి.అ.పుం. కాకి.

**కుణి.** సం.విశ.(ఇ)కుకరుఁడు, ఈచవోయిన చేతులు
గలవాఁడు. వి. ఇ. పుం. ౧.నందివృక్షము. ౨. వి
కలహస్తము, ఈచవోయిన చేయి. (కే. ని.)

**కుణిందము.** సం.వి.అ.పుం. శబ్దము.

**కుతకుత.** వి. ఉడుకుట మొదలగువానియందలిధ్వని
కనుకరణము.

(వ్యవ) అన్నము కుతకుత ఉడుకుచున్నది.
వేసఁగిలో శరీరము కుతకుత లాడును.

**కుతగుఁడు.** విశ. దుష్టుఁడు ?

ద్వి. వ్రతతత్పరతఁ బ్రీతి వర్తింపుచుండఁ, గుతగు
లై జైనులు గూడి యయ్యార, భక్తుఁ డొ
క్కఁ డితని౯ బాఱఁగఁదోలు, యుక్తులెట్లని
పెక్కు లూహించి చూచి. బస. పు. ౬.
౨౩౩ పం.

**కుతనువు.** సం. విశ. (ఉ.) కురూపి, వికృతదేహ
ము గలది. వి. ఉ. పుం. కుబేరుఁడు.

**కుతపము.** సం. వి. అ. పుం. ౧. ఎద్దు. ౨.నువ్వులు.
పుం. న. ౧. వాద్యవాదకసామగ్రి. (వై.ని.) ౨.
మేఁకబొచ్చులో నేసినకంబళి. ౩. దర్భ. ౪. ప
గటియొక్క పదునేనుభాగములలో నెనిమిదవ
భాగము.౫. దేహళి, కడప. (కే.ని.)

**కుతపుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుఁడు. ౨.
సూర్యుఁడు. ౩. అగ్ని. ౪. భాగినేయుఁడు, తో
డఁబుట్టినదానికొడుకు. ౫. అతిథి.(కే.ని.)

**కుతి.** వి. (క. కుది) శోకము, దుఃఖము.

సీ...చుమ్మ కుతి జాలి చూకురుకస్తి నా శోక
మొప్పు. ఆం. భా. ౧. ౧౩౫. (ప్రాంతప్రతి,
వ్రాతప్రతి పా.)

**కుతిక**=కుతుక, కుత్తిక, కుత్తుక. వి. కంఠము, గొం
తు.

ఆ. కుతికఁ బిసికి చంపి గురువు ప్రాణముఁ గొని,
యావు నఱికి భ్రూణహత్య చేసి, నట్టినరులు
రౌధ మనునరకంబున౯, బడుదు రవధి లేని
పాపములను. వి. పు. ౩. ౧౧౨.

క...కుతికబంటితోయములు...శేష. ౪.౯౪.

గీ. కుతిక మోఘ౯ంగ నెత్తురుల్ గ్రోలి క్రోలి. దశా. ౨. ౪౩౫.

జ: కుతికంటు.

**కుతికంటు**=కుత్తుకంటు. వి. (కుతిక+అంటు) నాగవల్లినాఁడు పెండ్లికొమార్తకు మెడను గట్టెడి యాభరణవిశేషము.

సీ. ఉల్లిపూసలపేరు హురుముంజిముత్యాల కుతికంటుదాపునఁ గొమరుమిగుల. కవిరా. ౨. ౧౭౨.

సీ...కంఠభూషావిశేష. గీ.మాను గుతికంటు... ఆం. భా. ౨. ౧౪౭.

**కుతికిలఁబడు**=కుదికిలఁబడు. అ. క్రి. (కుతికిలన్ + పడు) క్రుంగఁబడు, కూలఁబడు.

వ...మేర మీఱన్ దిన్నయెరల నన్నుకొని యరగన్ను వెట్టి బోరకడన్ బొటమరింపన్ గూరుకుచున్ గుతికిలం బడునవియును... మనుచ. ౪. ౨౬.

ద్వి. మసలక యాతనిమణికట్టు పట్టి, కుదియఁదాఁకించినఁ గుతికిలఁబడియె. పల్నాటివీరచరిత్రము. ౨౫౧. (బ్రౌ.)

**కుతికిలు**=కుదికిలు. (చూ. కుతికిలఁబడు.)

జ: కుతికిలఁబడు.

**కుతినీ**=కుత్తిని. వి. (హిం. ఖుతినీ.) ఒకవిధ మగు పట్టుబట్ట.

సీ. కుతినీగుడారు తప్కాఁబసిండికుండలు జరబాజుచందువా...రసిక. ౩. ౧౪౧.

సీ. చందువా ముత్యాలజాలీలు కుతినీతలాడ దంతపుఁబావజోడు...రసిక. ౪. ౪. ప్రబంధ. ౬౦౫.

**కుతిల(ము)**=కుదిల. వి. బాధ, దుఃఖము.

సీ. విను నృపాలక యాళ్లవెంబడి దేవరగుళ్లపంచలఁ జేరి కుతిల గుడిచి. హరిశ్చ. ౪. ౧౯౧.

ఆ. అనుచు వెచ్చనూర్చు నయ్యింతిలోఁ బుట్టు, మతము లుగ్గడించుఁ గుతిల కుడుచు, మరలి పోవఁ జూచి విరహాగ్నిశిఖలచేఁ, దిరుగు మరులుకొనుచు దివిజవిభుఁడు. పద్మ. ౩. ౨౧.

చ. అతఁడును బుత్రపౌత్రవిలయంబునఁ బుట్టిన శోకవహ్నిచే, వెతవడి ప్రాణముల్ విడువవేఁడుచు నుండె నటన్న వానికిన్, మఱి నిజమయ్యె నేని మనమన్కితమంతయుఁ దీఱునాత్మకున్, గుతిలము మాను నాఖిలునకున్ మృతి గల్గదు గాని యేమిటన్. ప్రబోధ. ౫. ౫.

ఉ. ధీరుల నింద్రముఖ్యు లగుదిక్పతులం గుతిలాలఁ జెట్టున, వీరుఁడు బాణుఁ డేమిటికి వియ్యపుటిచ్చకుఁ దెచ్చు మర్త్యులన్. ఉ. హరి. ౫. ౧౫౭.

జ: కుతిలగొను, కుతిలపడు, కుతిలపఱుచు, కుతిలపాటు, కుతిలవెట్టు.

**కుతిలగొను**. అ. క్రి. (కుతిల+కొను) కుతిలపడు, బాధపడు, దుఃఖపడు.

ఆ...దైత్యరాజతనయ, దొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంగి నూతిలోనఁ గుతిలగొనఁగ. భాగ. ౯. ౫౨౩.

**కుతిలపడు**=కుదిలపడు. అ. క్రి. (కుతిల+పడు) బాధపడు, దుఃఖపడు.

క. మితి గడచిన ఋణదాతలు, వెత వెట్టఁగ నూరు చొరక వెలివెలిఁ దిరుగున్, దతిఁ గూడు లేక యాఁకటఁ, గుతిలపడు నతండు గుప్పకుత్తుకతోడన్. పాండు. ౩. ౨౦.

క. అడుగక యున్నను నాలిం, గొడుకుల రక్షింపలేక కుతిలపడుచు నెప్పుడుఁ బేదలనుగలనరు, నెడ రుడుపఁగ వలయు ... భార. అను. ౨. ౩౪౦.

సీ...అద్దేవదేవుఁడు పోషకుఁడు సువ్వె మది వేల కుతిలపడఁగ. వేం. పంచ. ౨. ౧౬౭.

**కుతిలపఱుచు**. స. క్రి. (√కుతిలపడు.) బాధపడఁజేయు, బాధించు.

క. పాపంబు లేని కులసతిఁ, గోపంబునఁ గుతిలప

ఱుచుకుత్సితునకుఁ ద,త్పాపంబులు బహుతరపరి, తాపం బిహపరములందు దరికొల్పు నృపా. హరి. ఉ. ౯.౭౭.వరాహ.౪.౧౭.

**కుతిలపాటు.** వి. (√కుతిలపడు)బాధ.

సీ. ఎఱుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్క-గొనినయప్పుడు గలకుతిలపాటు. యయా. ౧. ౨౩.

**కుతిలపె(పె)ట్టు.** స. క్రి. (కుతిల + పెట్టు) పీడించు, బాధపెట్టు.

ఆ...అరాజకత్వ,దోషజాత మైనదురిత బాహుళ్యంబు, కుతిలపెట్ట భూమి యతలమునకుఁ, బోవ ...భార. శాం. ౨. ౪౯.

సీ. కయ్యాన జక్కులగ మికాని ముక్కంటిఁ గుతిలపెట్టుటయు నీకతనఁ గాదె. యయా. ౩. ౯౩.

**కుతుక**=కుతిక.

సీ. చేత ముమ్మొనవాలు చిలువసూడిగములు నొసల మిక్కిలికన్ను విసపుఁగుతుక. రాజ. వి. ౩. ౧౯౦.

**కుతుకము.** సం. వి. అ. న=కౌతుకము.

**కుతుపము.** సం. వి. అ. పుం. చేతిసిద్దె. పుం. న. కుతపకాలము. (కల్ప.)

**కుతువు.** సం. వి. ఊ. స్త్రీ. సిద్దె.

**కుతూణకము.** సం. వి. అ. పుం. బాలురనేత్రరోగవిశేషము.

**కుతూహలము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రశస్తము, శ్రేష్ఠము. ౨. ఆశ్చర్యకరము, అబ్బురము. వి. అ. న. ౧. కుతుకము, అనుభవింపనిద్రవ్యమునందలియభిలాష. ౨. (అలం)నాయికకు మనోజ్ఞవస్తువును జూచుటయందుఁగల లోలత్వము. ౩. సంతోషము. ఉ. చ. ౧. ౨౦.

**కుతూహలి.** సం. విశే. (న్. నీ. న్.) కుతూహలము గలవాఁడు.

**కుతూహలితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)=కుతూహలి.

**కుతృణము.** సం. వి. అ. న. కుంభి, నాఁచుకీ.

**కుత్కీలము.** సం. వి. అ. పుం. కుకీలము,కొండ.

ఉ. వీలక కాలజిత్ప్రముఖవీరులు మున్న కుశాకుగాహలిన్, గూలిరి రక్తధారలు బుగుల్లొన లత్మణుమ్రోల ధాతుకుత్కీలము నాల్గవంకల నతిత్వరమాణసమీరవర్తనో, న్మాలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటి కైవడిన్. జై. భా. ౬. ౧౭౭. అప్ప. ౩. ౧౨౬.

**కుత్తిక**=కుతిక. (క. కుత్తిగె.)

గీ. హత్తి మిత్తిచందంబున హత్తి వెడఁద,కత్తిఁ గుత్తికను బిశానఁ గత్తిరించి, సత్తి మత్తిల్ల బలిచేసె సత్తి నొక్కఁ, డవనిపతి యిచ్చ మేలుమే లనుచు మెచ్చ.చంద్రా. ౨. ౪౭.

**కుత్తిని**=కుతినీ.వి.(త.కుత్తిని.) ఒకరకముపట్టుబట్ట.

సీ. రత్నకంబళ్లు సూరత్తుకుత్తినిపట్టువెంళ్లు నేమంతిపూఁజెండ్లు గంద,వొడులు ధూపములు పుప్పొడులు...సానందో. ౧. ౧౭ పా.

**కుత్తుక(ము)**=కుతిక. వి. కంఠము.

క. ... శోకము,గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. భార. భీష్మ. ౨. ౩౬౪.

లయగ్రాహి...కుత్తుకలబంటి యగు నెత్తురులు దోయిళుల,నెత్తి చవిఁ గ్రోలుచును...భార.స్త్రీ. ౧. ౭.

ఉ.ఒత్తుగ మాంసము న్నములుగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్,గుత్తుకబంటిగా మెసఁగి ... హరిశ్చ. ౧. ౧౪౦.

సీ. నిరసనకాష్ఠసన్నిభకరంబులతోడఁ గడుఁబొడు వౌ కుత్తుకములతోడ. శ్రీరం. మా. ౧౦. ౨౦. ఆం. భా. ౨. ౧౪౧.

ఒక్కకుత్తుకగు. (చూ. ఒక.)

జ: కు త్తుకంటు.

కుత్తుకంటు=కుతికంటు. (కుత్తుక+అంటు)

(అగడ్త వర్ణన) సీ. ధర కుంకుమాంకకంధరఁ డా ల్చికొన్నకట్టాణిపూసలకుత్తుకం టనంగ. రా. వి. ౧. ౬౨.

కుత్స. సం.వి.ఆ.స్త్రీ. నింద, దూఱు.

కుత్సకుఁడు. సం. విశే. (అ.త్సికా. అ.) నిందించువాఁడు.

కుత్సన. సం.వి.ఆ.స్త్రీ.నిందించుట,దూఱుట.

కుత్సనము. సం. విశే (అ.ఆ.అ.) నిందించునది. వి. అ. న. నింద, దూఱు; నిందించుట, దూఱుట.

కుత్సనీయము. సం.విశే. (అ.ఆ.అ.) నిందింపఁదగినది.

కుత్సయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిందించుచున్నది.

కుత్సయిత. సరి.విశే.(ఋ.త్రీ.ఋ)=కుత్సకుఁడు.

కుత్సల. సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

కుత్సించే. సం. అ. క్రి. రోఁతపడు.

సీ. కుత్సింప కుం డెట్టు లుత్సర్గవిణ్మూత్రలాలాద్రవశ్లేష్మజాలమునకు. కాశీ. ౪. ౧౭.

స. క్రి. దూఱు. (బ్రౌ, శ. ర.)

కుత్సితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిందితము, దూఱఁబడినది. ౨. నికృష్టము, కీడ్పడినది. వి. అ. న. ౧. నింద, దూఱు. ౨. కుష్ఠము, చెంగల్వకోష్టుకి. ౩. ఋణము, అప్పు. (శే. ని.)

కుత్సితవ్యము. సం=కుత్సనీయము.

కుత్స్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

కుత్స్యము. సం=కుత్సనీయము.

కుథ. సం. వి. ఆ. స్త్రీ.కుథము,ఏనుగుమీఁదఁ బఱచెడిచిత్రకంబళము,

కుథము. సం. వి. అ. పుం. దర్భకి. పుం. న. ఏనుఁగుమీఁదఁ బఱచెడిచిత్రకంబళము.

కుథాకువు. సం. విశే. (ఉ) పరోత్తాపి, ఇతరులను తపింపఁజేయువాఁడు. వి. ఉ. పుం. ౧. కోఁతి. ౨. సూర్యుఁడు.

కుదప. వి. రొంపిదుక్క. (శ. ర.)

కుదరము. సం. వి. అ. పుం. గుబ్బము. (వై. ని.)

కుదాలము. సం. వి. అ.పుం-భూమిని చీల్చునది-కుద్దాలము, గుద్దలి.

కుదికిలఁబడు=కుతికిలఁబడు. అ. క్రి. చదికిలఁబడు, పిఱ్ఱలు నేల నానునట్లు కూలఁబడు.

ద్వి. తలకొన్నకోప మంతట నిల్వ లేక, వెఱచి వాపోవుచు వెసఁ బాటి తండ్రి, మఱుఁగు చొచ్చినసుకుమారుఁ గుమారుఁ, గుదికిలఁబడ రెట్టఁ గుదియించి తిగిచి. ద్వి.హరిశ్చ.ఉ. ౯౦౧ పం. పండితా. పురా. ౯౩ పా.

కుదికిలు=కుతికిలు. అ. క్రి. పిఱ్ఱలు నేల నానునట్లు కూలఁబడు.

వ...అచ్చో రవకు వాసుదేవుండు సీసకంబునం బొడిచిన శైనేయుండు కుదికిలి గదను డాకేలఁ దాపించిన...ఉ. హరి. ౩. ౬౪. (వీరేశ. పా.)

ద్వి. ఒక్కఁడు గుదికిల నుర్విపైఁ ద్రోచె. ద్వి. హరిశ్చ. ఉ. ౯౪౯ పం.

జ: కుదికిలఁబడు.

కుదినము. సం. వి. అ. న. ౧-భూభ్రమణముచేతఁ గలుగుదినము - సావనదినము, సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయమువఱకు పట్టు కాలము. ౨. చెడ్డదినము.

కుదియి(ది)ంచే=కుదుచే. స. క్రి.(√కుదియు) కుదియఁజేయు.

౧. అదుము, నొక్కు.

సీ. కుచము లురంబునఁ గుదియించి క్రమమున ని
 జేసినకౌఁగిట నింపొనర్తు. భార. విరా. ౨.
 ౩౧౦.

౨. తగ్గించు.

క. అనృతభయము నాజిజయముఁ, గొనియెడుత
 మకంబు పెంపు గుదియింపఁగఁ బాం,డున
 రేంద్రున గ్రతనయుం, డనుమానము వాయఁ
 బెట్టి యస్త్రగురునితోన్. భార. ద్రో. ౫. ౩౧౪.

ఆ. మొదలఁ బెనిచి పిదపఁ గుదియింప నెవ్వాఁ
 డుఁ, దనదులోంటిహీనదశఁ దలంపఁ, డలు
 గుఁ గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ, బెని
 చి వేళవేళఁ బనులు గొనుము. అను. ౪.
 ౨౦౮.

౩. అడ్డగించు, ఆఁపు.

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయ
 ట్లపోలెఁ గురువర దైన్యా,స్పద మగువిష
 యోల్లాసముఁ, గుదియించును యోగసిద్ధిగురు
 హృద్బలుఁడున్. భార. శాం. ౫. ౫౮౨.

శ్లో. తదేవచ మహాస్రోతో విష్టమ్భయతి వారణః,
 తద్వద్యోగబలం లబ్ధ్వా వ్యూహతే విష
 యాన్ బహూన్. సం. భార. శాం. ౩౦౬.
 ౨౩.

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే నాకసము
 నఁ గుదియించితి నా, యరదంబు హాంతకును
 న,చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరకయుం
 డన్. భార. ఉద్యో. ౪. ౩౧౬.

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి
 మనసుచాంచల్యంబు మాన్చునదియు. కాశీ.
 ౭. ౧౧౯.

౪. నియమించు, లొంగఁజేయు, వశపఱచు.

క. ... మనసు దూలకయుండన్, మృడ వినుము
 బుద్ధిఁ గొని యె,క్కుడునిష్ఠను వలయు దా
 నిఁ గుదియింపంగన్. భార. అను. ౪. ౨౦౮.

గీ. అనఘ శబ్దాదివిషయంబులందుఁ దగిలి, యి
 చ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు,
 బుధుఁడు దత్స్వభావముఁ దనబుద్ధి నెఱిఁగి,
 యేమఱక వానిఁ దగఁ గుదియింప వలయు.
 భార. ఆర. ౫. ౮౮.

శ్లో. ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్య
 సంశయమ్, సంనియమ్య తు తాన్యేవ తతస్సి
 ద్ధిమవాప్నుయాత్. సం. భార. ఆర. ౨౧౫.
 ౨౧.

౫. బిగించు, బిగఁబట్టు.

ఉ. ఇంచుక కేలవాగె గుదియించిన సంభ్రమ
 దాఁటుచున్ జమా,యించిన నేల గ్రక్కు
 దల నిట్టటుగా వడిఁ ద్రొక్కుచున్ దువా,
 ళించిన గట్టు గుట్టనక లెక్కకు మిక్కిలి ద
 వ్వు వాఱుచున్, మించినవారువంబు లట
 మీఱుచుఁ ద్రిమ్మరు నెన్నియేనియున్. య
 యా. ౧. ౧౦.

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ సంతృప్తుఁ
 డై కాంతుఁ డిం,పూనన్ వాగె గుదించినన్
 బురుషకప్రోన్నమ్రపూర్వాంగమై, కానంగాఁ
 బడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్కాశ్వ
 సం,తానస్పర్ధను మిన్ను ప్రాఁకెడు క్రియన్
 దా నెంతయుం జూడ్కికిన్. ప్రభా. ౨. ౩౭.

౬. మరలించు, త్రిప్పు.

సీ. ...ఏ నెట్లు పలికితి వది యట్ల కాక తప్పదు
 మహీశ, యెన్నఁడుఁ గావున నిచ్చినశాపంబు
 కుదియింప నెమ్మెయిఁ గొలఁది గాదు. మా
 ర్క. ౭. ౨౦౪.

౭. దుఃఖపెట్టు.

ద్వి. పగ్గెల నిచ్చలు బాములఁ బెట్టి, యిడుమలఁ
 గుదియించి యించుక సేపు, నెడపక పనులు
 సేయించుచు నుండె. ద్వి. హరిశ్చ. ఉ.
 ౧౨౦౯ పం.

౮. అణఁచు.

క. ... కోపో,ద్దీపితు లై వారలయా,టోపముఁ
గుదియించి రతిపటు ప్రదరములన్. భార. భీష్మ. ౩. ౧౩౦.

సీ. అలసతఁ జూపునొయ్యారంపునడపులు వనమయూరములగర్వముఁ గుదింప. జై. భా. ౮. ౭౩.

**కుదియు.** అ. క్రి. ౧. క్రుంగు, దిగఁబడు.

ఆ. ...కడును వ్రేఁగు,గలుగునట్టివంటకట్టియ మోపట్టు, గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. భార. అశ్వ. ౩. ౭౨.

సీ. తనయున్నగిరి బెట్టు తాఁచి బిట్టెగసిన నది శేషపడగలఁ గుదియ నదుమ. భా. రా. ఆర. ౨. ౧౧౮.

౨. ఆఁగిపోవు; ఉపశమిల్లు.

సీ. మది నిగిర్చినమాట మగువ నీ పెంపునఁ గుదిసి నానాలుకతుదికి రాదు. భార. విరా. ౨. ౪౭.

క. మరుదస్త్రమేయ గుహ్యక,శరమున వారించె నతఁడు సరభసముగ ను,ద్ధురశిఖిబాణం బేసిన,గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. భార. ఉద్యో. ౪. ౩౨౫.

౩. వెనుదీయు, జంకు.

ద్వి. తెంపు మీఱఁగ నాశ దెగఁ గోసి దీనిఁ,గొంపలోపల వెళ్లఁగొట్టుదు ననుచుఁ, గుదియక కరతిత్తి గొని దాని వ్రేయ, నది చెడిపోవను నందంద మోఁదె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౨౮ పం.

౪. తగ్గు.

ద్వి. కుదియనికడకతోఁ గోరి యాకాశ,నది నాడఁ బోయిననాగకన్యకలు,చని చని మగుడ రసాతలంబునకుఁ, జనుదెంచుగతి వర్ష జలధార లమరె. రం. రా. కిష్కిం. ౨౧౯ పా. ౨౯ పం, అయో. ౧౨౩ పా. ౮ పం.

౫. చెడు, పాడగు.

సీ. నెట్టెంబు సుట్టిన నెమ్మిపించెముదండకొనరేక యొక్కింత కుదియకుండ. హర. ౬. ౪౫.

౬. నశించు, పోవు.

ద్వి. ... చన్నులవిూఁదఁ,గాఱెడుకన్నీరుఁ గరపల్లవమునఁ, గదిసినచెక్కును గలికిలేనవ్వు, గుదిసినచూపును ...ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౮౦ పం.

౭. వ్యర్థమగు, పనికిమాలినదగు.

(వజ్రాయుధము) క. అది యొకఁడుఁ జేయఁజాలక, విదళితశైలమగుతనదువిలసన మచటం,గుదియుట తనకుం దెలిసిన, మద మఱి గిరిభేదికడకు మగుడం జనియెన్. భార. అను. ౧. ౨౫౮.

౮. కుందు, దుఃఖించు.

(చంద్రోపాలంభనము.) చ. ...పాంథకోటి నా,పదఁ గుదియంగఁ జేయునది పౌరుషరేఖయటంచు నెంచవే. కకు. ౩. ౧౧౬.

౯. సంకుచితమగు, ముడుఁగు.

ద్వి. పవనుఁడు కోపంబు పట్టలేకప్పు,డవయవంబులఁ జొచ్చి యాతలోదరులఁ, గుదియంగఁ దిగిచినఁ గుబ్జలై...రం. రా. బాల. ౩౩ పా. ౨౮ పం.

గీ. ...దృష్టి చక్కఁగా నిలిపి పిడికి,లించి కరములు తాఁ గుదియించి గునుకు,పరువునను దాఁటె బలుఁడు తొంబదియడుగులు. దశా. ౯. ౧౩.

కుదియఁబట్టు, కుదియఁగఁబట్టు = బిగియఁబట్టు.

గీ. కూల్చి వాలంబు మెడఁ జుట్టి కుదియఁబట్టి, జన్మభూమికి బలి ద్రిప్పి సకలభూత,కోటి వినుతింపఁ బెల్లార్చి కూఁకలిడఁగ,విసరివైచిన హతుఁ డయ్యె విహ్వలించి. మైరా. ౩. ౬౩.

ఆ. మేఁకఁ గుదియఁబట్టి మెడచన్ను గుడిచిన, నాఁకలేల దీఱు నాశ గాక. వేమన. ౧౨౨.

(శ్రా)

వ. ...లేచ్చయూసామజంబులం జూచి యేచిన
నెఱం బాఱుతమయెక్కిరింత లెక్కకొని వా
గె లిరుగేలం గుదియఁబట్టిన నిలువ కయ్యు
త్సవం బీక్షింప వచ్చిన ప్రజలం ద్రొక్కుచుం
బోవ...ఆము. ౪. ౩౫.

చ. ...మానసం,బనుతురగంబు బోధమహితాత్మ
వివేకపునూలిత్రాట న,ల్లన కుదియంగఁ బట్టను
దలంచుచు ... భాగ. ౧౦ ఉ. ౧౨౨౬.

కుదియఁబడు=దిగఁబడు, కూలఁబడు.

(వార్ధకవర్ణనము.) సీ.యౌవనస్తంభహైన్యంబున
దేహంబు గుమిలి గుడారు నాఁ గుదియఁబ
డఁగ. దశా. ౨.౧౩౯. (దుర్బలమగు అని భా
వము.)

ఆ. పాటిపీఁపు నీఁచవోయిన చేతులుఁ,గుదియఁ
బడ్డమెడయుఁ గుందుకాళ్లు, గుజ్జుపాదవు నై
నకోమలి నొక్కతె, గంధపాత్రహస్తఁ
గాంచె నెదుర.పద్మ.౯.౭౧.(కుదియఁబడ్డ
మెడ=పొట్టిమెడ.)

కుదియఁబెట్టు=క్రుంగఁజేయు, కూల్చు.

సీ. జముదాడి నుడుగక జముదాడి యుడిపించి
గుదియ నేఱులఁ ఱేనిఁ గుదియఁబెట్టి. అచ్చ.
రా. యు. ౪౮౪.

జః కుదియించు.

కుదిర. వి. (సం. కుదరః. క. కుదిరె.త.కుదిరై. తు.
కుదురె. మ. కుతిర.) గుఱ్ఱము.

సీ. వెలిపట్టునిద్దంపుఁదళుకులపుట్టంబు మెలపారు
పులుఁగుఖంజనులకుదిర.కవిస. ౧ ఆ. (శ.ర.)

కుదిరిక. వి. (√కుదురు) ౧. అమరిక, పొందిక. ౨.
నిలుకడ. ౩. నెమ్మది, స్వస్థత.

ఉదా: వాఁడు కుదిరిక లేనివాఁడు.
కుదిరిక లేనివానికి చదువురాదు.
మనస్సునకు అణుమాత్రపుఁగుదిరికయు లేదు.

కుదిల=కుతిల. (చూ. కుదిలపడు, మొ.)

జః కుదిలపడు, కుదిలపఱచు.

కుదిలపడు=కుతిలపడు. (చూ.కుదిలపఱచు.)

కుదిలపఱ(ఱు)చే=కుతిలపఱచే.(√కుదిలపడు)

(బాధపెట్టు.)

సీ. నృపతిపై మఱి యామినీచరపతి యెనుబదిచి
ల్కు లడరించి కుదిలపఱిచె. రసిక. ౬.౩౪.

సీ. బ్రహ్మాదులకుఁ జేయరాని కైంకర్యంబు లీడేఱ
నిట్లు రంగేశ్వరునకు, నొనరించి బుద్ధిమంతు
లు గాక వీరలు కూలికై నన్నిట్లు కుదిలపఱ
చు,చున్నారు...పరమ. ౫. ౪౭.

కుదిలించే. స. క్రి. (√కుదులు) విదుర్చు.

వ ..పాదపాద మని సౌవిదల్లులు హస్తపల్లంబులు
పట్టి తివిచిన నప్పంకజాక్షి కంకణఝుణఝుణ
త్కారంబుగాఁ గెంగేలు కుదిలించి తివిచి
కొని...కాశీ. ౬. ౨౨౮.

కుదిలిక. వి. (√ కుదులు) కుదులుట. (శ. ర.)

కుదుకనగోలు. క్రి. విణ అన్యాయ్యముగా?(వి.
వంచన-శ. ర.)

(హరిశ్చంద్రుఁడు నక్షత్రకునితో నన్నమాటలు.)

ద్వి...ఇంకనైనఁ, గుదుకనగోలు గైకొనక నా
ధనము వదలుము...ద్వి.హరిశ్చ.ఉ.౧౨౭౬.

ద్వి. ఆలిని బుత్రుని నంగడిఁ బెట్టి, కాలకౌశికుఁ
డనుకష్టునకమ్మి,కూర్చినధన మెల్లఁ గుదుకన
గోలు, నేర్పునఁ గైకొంటి. ద్వి.హరిశ్చ.ఉ.
౧౩౨౮ పం.

కుదుచే=కుదియించే.

(అణఁచు, పోఁగొట్టు.)

సీ. నాకాధిపతి యైననహుషుని తేజంబు గుదిచి
పాముగ భూమిఁ గూలనై చె. భా. రా. అర.
౧. ౭౬.

(బిగఁబట్టు;నొక్కు.)

గీ. తోఁకఁ ద్రొక్కినభుజగేంద్రువీఁక సటలు, గు
దిచి పెటికినసింగంబుకొదమమాడ్కి, దండ

తాడనకుపితో గ్రపుండరీక, భంగిఁ గృష్ణుండు రోషించి పలికె నిట్లు. చిత్రభా. ౬. ౧౬౫.

సీ. ఖలభేదికరి దొడ్డి పట్టఁ జే సాఁచుడు శివునూతి వెనఁచి చే సేతఁ బట్టి, కుదిచి రాఁ దిగుచుడు...కు.సం.౧౦.౪౩౧.యయా.౨.౨౪. (బంధించు)

క. నాపాదంబులు గుదిచిన, పాపంబున...దళకు. ౩. ౧౧౨. (చూ. ౩. ౧౩.)

కుదుచుకొను=విలవిలఁ గొట్టుకొను, తన్నుకొను.

ఆ. చేతఁ దొడికి క్రిందిసెలవి కేలను బట్టి, యసమలీల ముష్టి విసరి పొడువఁ, గులిశనిహతిఁ గూలుకొండ కైవడి నిలఁ, గూలి కాళ్లు గుదుచుకొనుచుఁ జచ్చె. పద్మ. ౯. ౧౯౩.

**కుదుప[1].** వి. వంచన, మోసము.

చ. ఎఱుఁగనియట్ల యున్న నసురేశ్వరుఁడప్పుడు గాలుఁ జేయు లా, వతి రభసంబునం గుదుప నక్కడ నిక్కడ నూడఁ జూచి మై, గిఱుపఁగ నవ్విశక్తి యెఱిఁగించుట నెమ్మదిఁ గోరి వానిమై, నుఱుసుఱ స్రుక్క నొక్క బలసూదనసూనుఁడు ప్రక్కదాపునన్. నిర్వ. ౮.౭౪. (శ.ర.)

**కుదుప[2].** వి. (నెత్తురు, పెరుఁగు, మొ.) పేరుకొన్న ముద్ద. (చిన్న ముద్ద.చి. ని-దుర్మాంసఖండము. శ. ర-రూ. కుదప. బ్రౌ, వా.)

క. అత్తఱి వెన్నెలచేఁ దళు, కొత్తున జాండమున బుక్షయుక్చంద్రుఁడు భా, స్వత్త క్రకలశిఁగుదుపల, మొత్తముతోఁ దేలువెన్న ముద్దం బోలెన్. బహు. ౩. ౫౮.

**కుదుపు.** (బ్రౌ, వా.) స. క్రి. కదలించు.

ఉదా: బండి కుదుపుచున్నది.

పొగపులో వేసి కూర కుదిపినారు.

వి. కదలిక, చలనము.

ఉదా: బండికుదుపుచే నడుము నొప్పి పెట్టినది.

**కుదుము.** వి. కందు, పాప.

క...తలమాసు(సి?) వోని నెత్తురుకుదుమున్, నేనానిఁ జేసి రజ్జున, దానవపతిమీఁద నడవఁదగునే నీకున్. కు. సం. ౧౦. ౫౩౦. ('ముద్ద' అని వ్యాఖ్య. ప్రయోగాంతరము లేదు. 'కందున్' అనియు ననవచ్చును.)

**కుదురు.** అ. క్రి. (క. కుదురు. త. కుదిర్.) ౧. కుదురుపడు, నెలకొను.

సీ. గుబ్బపాలిండ్లను గుదిరెఁ గ్రొంజెమటలు లీలైనచెక్కిళ్లు తెలివి దప్పె. గంధ.౨౧౨,౧౪౮.

౨. సరిపడు, పొసఁగు.

ఉదా: వానికిని వీనికిని సంధి కుదుర లేదు. వీనితో బేరము కుదురదు. ఆమె మెడకు ఈపట్టెడ కుదుర లేదు. వైశ్వదేవమునకును వారపుభోజనమునకును కుదురదు. ముసలిమగనికిని పడుచుపెండ్లామునకు నెట్లు కుదురును.

౩. స్థిరపడు.

ఉదా: మొన్ననే వానికి పెండ్లి కుదిరినది.

౪. లభ్యమగు, దొరకు.

ఉదా: వానికిఇంతవఱకును ఇల్లు కుదిరినదికాదు. ఆవిద్యార్థి కింకను వారములు కుదుర లేదు.

౫. చక్కఁబడు, బాగుపడు.

ఉదా: వానికి వ్రాఁత యింతవఱకు కుదురలేదు.

౬. ఉపశమిల్లు, మాను.

క. మందు దినఁ గుదురు రోగము. వేమన.౧.౬౦.

సీ. అతని పేరురమున నంటి కుమ్మక గాని గుబ్బెపొగ రెట్లు గుదురు నమ్మ. కలు. శ. ౧౯.

వి. జా, అనా. ౧. పాదు, ఆలవాలము.

క. పెనుఁగుదుట నిడిన మాత్రం, బున నవమాలికయుఁ బోలెఁ బొలుపొంది రతం, డును నస్నిగ్ధయు నేకా, సనమున నున్నపుడు నాల్ననౌభాగ్యమునన్. భార. విరా. ౫. ౪౦౨.

సీ. ఈనీరజాననదాన కుదురు చేసి వలయులీక ము లెల్ల మొలవఁ బెట్టె. కు. సం. ౮ ౭౫౦.

సీ. క్రొవ్వారుజవ్వాదికుదురునఁ బెరిఁగినచేమంతి యన్నదే కోమలాంగి. విక్ర. ౪. ౧౯.

౨. మొదలు, మూలము.

సీ. కులపర్వతంబులు కుదురులు కదలి సంఘులు వాసి తటములు దునిసి పడఁగ. హరి. ఉ. ౯. ౨౨౦.

సీ. కుదురు నిండినచిన్నిగుబ్బచన్నులమీఁదము త్యాలత్రిసరంబు ముసవుఁ జూప. భీమ. ౧. ౧౦౮.

౩. వంశము. (బ్రా)

(వ్యవ) వారందఱును ఒక్కకుదుటిలోనివారే.

౪. ఆస్పదము, స్థానము; ఆశ్రయము, ఆధారము.

ఉదా: ఇంతసేపటికి వానిప్రాణములు కుదుటఁబడినవి.

గీ. ఓపి ధర్మార్థకామంబు లొకటి నొకటి, నాశ మొందింపకుండంగ నడప వలయుఁ, గాక ధర్మంబు సెడ నర్థకామములను, గోరుపురుషుండు నిందకుఁ గుదురు గాఁడె. భార. శల్య. ౨. ౩౦౨.

క. ఆనెలఁత భాగ్య మెట్టిదొ, కాని ప్రవాసైక వృత్తిఁ గాంతుఁడు చనినం, దా నుండెఁ బుట్టినింట మ, నోనిగ్రహమునకు నెల్లనుం గుదురగుచున్. భోజరా. ౩. ౬౪.

క. కోపము గల్గినచోటను, బాపము వర్తిల్లుఁ బాపపరులకుఁ గోప, వ్యాపారంబులె తోఁచును, గోపము పాపంబు నొక్కకుదురై నడచున్. వి. పు. ౧. ౧౯.

క. కరితురగరథపమితిఁ బొం, పిరివోయెడు నాదులక్ష్మి పెంపున కెల్లన్, సరసిరుహవదన నీవ కుదురుగా నొనరించెదం గుతూహల మెసఁగన్. భార. విరా. ౨. ౧౨౨.

౫. నెలవు, ఉనికిపట్టు.

ద్వి. వే యేల తగ బసవా యనఁ బరఁగు, నీయక్షరత్రయం బిటు లొక్కమాటు, చదువు నెవ్వం డేని ముదముతో నతని, వదనంబు శివునకుఁ గుదురు తాను...బస. పు. ౧. ౧౦౩ పం.

చ. అలఘువినూత్నరత్నముల కన్నిటికిం గుదురై నరోహణా, చలపతిరీతి నీ వఖిలసద్గుణరాసుల కాలవాలమై...విక్ర. ౪. ౧౪.

౬. అగసాలెవానికుంపటి.

గీ. బొమ్మయను పేరియగసాలె పూఁటచెలిని, గోరి యలరించుటకుఁ జవుల్కుడుటఁ గాంచి, నీట ముంచినమేటివన్నియపసిండి, పూదె యనఁ గ్రుంకుకడలిలోఁ బ్రొద్దు వ్రాలె. నీలా. ౩. ౩.

౭. చుట్టకుదురు. (బ్రా.)

౮. నిలుకడ, స్థైర్యము, స్వస్థత.

ఉదా: వానిమనసున కెంతమాత్రమును కుదురు లేదు.

౯. కుదిరిక, పొందిక.

మ. ... ఈ మేనిలోఁ, గుదురీకన్నులబెళ్కు లీ తళుకుఁగిల్లో ప్పున్నశృంగారము...ఉ. రా. ౪. ౧౯౦.

౧౦. వరుస.

క. అరచందమామ నేలిన, దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్, బరువంపుమొల్లమొగ్గల, దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్. విజ. వి. ౨. ౭౮.

విశే. ౧. స్థిరము, కదలనిది.

క. కుడితొడపై వామపదం, బిడి యితరముమీఁద నితర మిడి నిశ్చలతం, గడుఁ గుదురై కూర్చుండుట, పుడమి న్వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా. కళా. ౪. ౧౪౪.

ఉదా:- వాఁడొకచోట కుదురుగాఁ గూర్చుండఁడు.

జ: కుదిరిక, కుదురుకొను, కుదురుకొలుపు, కుదురుచు, కుదురుపడు, కుదురుపఱుచు, కుదురుపాటు, కుదురుసేయు.

**కుదురుకొ(ర్కొ)ను.** అ. క్రి. (√కుదురు) ౧. నెలకొను, ఉండు; ప్రవర్తిల్లు.

సీ. కేతకీతతిఁ గల్గుకృతవికాసస్ఫూర్తి కుందవాటి కలప్పైఁ గుదురుకొనియె. కవిక. ౨. ౬౧.

క. ఉదరము లోకంబులకును, సదనం బగు పెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిం, గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసముక్రియన్. భాగ. ౮. ౨౪౫.

ఉ. వన్నియ మీఱ నన్నగరివాడలమేడలఁ గ్రీడలం గుదు,ర్కొన్న మెఱుంగుమిన్నలతకూనలకుం జెలు లై నిలింపవి, ద్యున్నిభదేహళిత్తు రళితుండవియుక్తవితీర్ణిభూరుహా,త్పన్నసమగ్రసౌరభనితాంతలతాంతగుళుచ్ఛకచ్ఛటల్. వేం. పంచ. ౧. ౯౨.

౨. స్థిరపడు, పాదుకొను; స్వస్థమగు.

చ. కుదురుకొనెన్ గిరీంద్రములు కూర్మకులాగ్రణి జీవనస్థితిం, బొదలె...విక్ర. ౨. ౭౦.

(రెండర్థములకును ఇదియే యుదాహరణము.)

౩. నిలుచు, నిలుకడ గలిగియుండు.

సీ. అడవిలోఁ గడుపడి యుడుగనియడుగులు కదలక యాచాయఁ గుదురుకొనెనె. వాల్మీ. ౨. ౧౨౧.

౪. కలుగు.

గీ. అధ్వగులు కోడిగములకై యాకు లెల్లఁ, ద్రెంచి శాఖావితానము ద్రుంచి వైవ, మోడుపడియుండె నది నిల్వ నీడ పట్టుఁ, గొమ్మయును లేమి తనయందుఁ గుదురుకొనఁగ. శుక. ౩. ౪౩౯.

**కుదురుకొలుపు(ల్పు).** స. క్రి. (√కుదురుకొను) నిలుపు, నెలకొల్పు.

గీ. తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ, గురుకులంబున సత్కీర్తి గుదురుకొలుపు. జై. భా. ౧. ౬౧.

గీ. మానసాంబుజకర్ణికామధ్యమునను, గొన్ని దినములు శశిమౌళిఁ గుదురుకొల్పి, మీఁదిగాడ్పుఁ గ్రిఁగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు గట్టువఱపి తగను. పి. శకుం. ౨. ౧౧౩.

సీ. కనుదోయిఁ దిన్నగాఁ గాటుక దీరిచి నుదుటిపైనునుఁగావు కుదురుకొల్పి. చంద్రా. ౨. ౩.

**కుదురుచే(ర్చే).** స. క్రి. (√కుదురు) కుదురఁజేయు.

(ఉపశమిల్లఁజేయు, మానుపు.)

ఉదా: ఆవైద్యుఁడు మూఁడుదినములలో వానికి వ్యాధి కుదిర్చినాఁడు.

**కుదురుప(ర్ప)డు.** అ. క్రి. (కుదురు+పడు) ౧. స్థిరపడు.

సీ. మత్పాదభక్తి యాత్మను జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు గుదురుపడును. దశా. ౧. ౨౨౨.

౨. కట్టుపడు.

గీ. పరమమునిమానసాలానబంధనమునఁ, గుదురుపడ కుండుయాదవకుంజరంబు. పారి. ౫. ౮౦.

౩. తేలు, స్వస్థమగు.

చ. వెలలి హజార మాన్యపతి వేల్పులు దవ్వగు దాఁకఁ జూచి మూ,ర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి...కవు. ౪. ౧౬౧.

౪. నెలకొను.

సీ. కుదురుపడెను నెలకొనెను డెక్కొనెనన సేకార్థములు గాఁగ నెసఁగుచుండు. ఆం. భా. ౩. ౯౯.

**కుదురుప(ర్పా)టు(ఱ)చు.** స. క్రి. (√కుదురుపడు.) ౧. నెలకొల్పు, నిలుపు.

సీ. భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱిచె. పారి. పీఠి. ౧౮.

క. అన విని కిరీటి కర్ణను, తునిమ స్తము రథముపైఁ

గుదుర్పఱచి మదిం, గనలుచు ...జై. భా. ౩. ౩౮. (ఇట'పెట్టుకొను'అని భావము.)

గీ...ఎదఁ దాల్మి గుదురుపఱుపఁ,జాల కసురులు పఱచి రిత్వాకుతిలక. ఉ.రా. ౩.౩౪౭.

౨. ధరించు, తాల్చు; పెట్టు, అమర్చు.

సీ....ఎదఁ బున్కసరములు కుదురుపఱిచి.నీలా. ౧.౧౩.

సీ. కీలుఁగొప్పునఁ బైఁడి గేదంగి రేకులు గొనలు గానంగరాఁ గుదురుపఱచి. నైష. ౮. ౧౧౨.

౩. కలిగించు, ఘటించు.

సీ. వసివాడు దేరియున్న సరోజరాజికిఁ గుముద సౌభాగ్యంబుఁ గుదురుపఱిచి. కవిరా. ౫. ౨౧౮.

**కుదురుపాటు.** వి. (√కుదురుపడు) స్థైర్యము,నిలుకడ.

గీ. కొసర నెఱుఁగనికూరిమి కుదురుపాటె,ఱుఁగనిదిట్టంబు నిలుక డెఱుఁగనిమనము,నై పతికిఁ దమి రేఁచె నత్యధిక లీల, నంగనామణి నూతనసంగమంబు. చంద్రా. ౬. ౧౪౮.

**కుదురుసే(చే)యు.** స. క్రి. (√కుదురు)చక్కఁజేయు, బాగుపఱుచు.

సీ. ప్రేలివంకరమాత్ర వీఁగ నొత్తఁగ లేఁడు కుదురుసేయఁ గలండె గూనువీఁపు. రామలిం. ౭౩.

**కుదులు.** అ. క్రి. ౧. (నిద్రనుండి మేలుకొనునపుడు) కదలు.

ద్వి. నాపతి భూపతి నాపాటుఁ జూడ,నోపక నాచీర నొకసాము చించి, యది కట్టి నను విడనాడి పోయినను, గుదులుచు నే మేలుకొని లేచి విభుని,గానక యేడ్చుచు...ద్వి. నల. ౪. ౨౨౨.

౨. అదురు, చలించు. (శ. ర.)

జ: కుదిలించు, కుదిలిక, కుదులుకొను.

**కుదులుకొను.** అ. క్రి. (√ కుదులు-స్వార్థమున 'కొను') ౧. కంపించు, వడఁకు.

క. అది యత్తెఱఁగున నలనిం, గదియంబడనిచ్చి వెఱపు గలదానిగలిౘ్, గుదులుకొను నేల బుసకొ,ట్టెద వను నే నెట్లు చేపడిలి నను నడలుౘ్. వేం. పంచ. ౪. ౫౦౨.

౨. విలవిలఁగొట్టుకొను ?

ద్వి ... బాలుఁ,బడవైచి కుదులుకోఁ బదముల నూఁది, మెడ ద్రొక్కి...నవ. ౪. ౧౩౯ పా. ౧౧ పం.

చ...వెలంగమ్రానితోఁ, జదియఁగ నొక్కపెట్టుగొని చంపెఁ గుమారుఁడు వేఁగ రక్కసుం, గుదులుకొనంగ బాలకులు కో యని యార్వ నఖర్వలీలతోౘ్. భాగ. ౧౦ పూ. ౪౩౫.

**కుదువ.** వి. (త. కుదువై.) ౧. తాకట్టు, ఆధి.

సీ. తాకట్టు కుదువ యుద్దర వారకం బీ డనంగ ను నాధి చెలంగుచుండు.ఆం.భా.౨.౨౯.

సీ. ధనవారములు చోరతతులపా లయ్యెను సామ్ములు కుదువను సాగసి చనియె. శుక. ౨. ౩౬౦.

౨. న్యాసము, దాఁచుకొన్న ధనము.

గీ. కుదువ యనఁగను నుపనిధి పొదలు శర్వ. ఆం. భా. ౨. ౨౬౭.

కుదువపెట్టు=తాకట్టుపెట్టు,ఆధివెట్టు.

సీ. విత్తంబు చాలనివిభవంబు కొఱగాదు కుదువ పెట్టఁగ రాదు కుందనంబు. రామలిం.౪౯.

**కుదృష్టి.** సం..విణ. (ఇ) కుదృష్టికలవాఁడు. వి.ఇ. స్త్రీ. ౧. దుర్బలమగుచూపు. ౨. దృష్టిదోషము,కనుఁబాటు. ౩. పాషండాదిదర్శనము, అవైదికసిద్ధాంతము.

**కుదేహుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) కుత్సితదేహము గలవాఁడు. వి. అ. పుం. కుబేరుఁడు.

**కుద్దాల(ర)ము.** సం. వి. అ. పుం-భూమిని చీల్చునది-౧.గుద్దలి. ౨. కోవిదారము, కాంచనము.

కుద్రంక(గ)ము. సం. వి. అ.పుం. ౧. కావలికా చుటకై మంచెమీఁదఁ గట్టినయిల్లు.

కుద్రవము. సం. వి. అ. పుం. కోద్రవము, ఆరుగలు, ఆర్లు.

కుధరము. సం. వి. అ. పుం-భూమిని ధరించునది-కొండ.

కుధాన్యము. సం. వి. అ. న. కుత్సితధాన్యము. (ఆర్లు, చామలు, కొఱ్ఱలు, మొ.)

కుధ్రము. సం.వి. అ.పుం-భూమిని ధరించునది-కొండ.

కునఖము. సం.వి.అ.పుం.గోళ్లకు పుప్పి కలిగించెడి రోగవిశేషము.

కునఖి. సం. విణ. (న్. నీ. న్.) కునఖరోగము గలవాఁడు.

కునటము. సం. వి. అ.పుం. శ్యోనాకభేదము,ఒకవిధమగుదుండిగముఁ.

కునటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మణిసిల. (నేపాలదేశపుమణిసిల. వై. ని.) ౨. ధన్యాకము, దనియాలు. 3. నైపుణ్యములేని ఆటకత్తె. (కల్ప.)

కునదిక. సం. వి. ఆ. స్త్రీ. చిన్నయేఱు. సం.పంచ. ౧. ౨౬.

కునలి. సం. వి. న్. పుం.అగస్త్యవృక్షము,అవిసెఁ (త్రి. ని.)

కునాభి. సం. వి. ఇ. పుం. ౧. వాత్య, సుడిగాలి. (త్రి. ని, వాచ.) ౨. నిధిభేదము.

కునాశకము. సం. వి. అ. పుం. యాసము, తీఁటకసిందఁ.

కునాళిక. సం. వి. ఆ. స్త్రీ. పక్షిశాల. (వై.ని.)

కునికిపడు. అ. క్రి. నిద్రచే తూఁగిపడు. (చూ. కునికిపాటు.)

కునికిపాటు. వి. (√కునికిపడు) నిద్రచే తూఁగిపడుట, ప్రమీల, తంద్ర.
(వ్యవ) కూర్చుండి వాఁడు కునికిపాట్లు పడుచున్నాఁడు.

కునిస్టి. విణ. కుంటివాఁడు.
సీ. ఖంజుఁడు కుంటి నాఁగఁ గునిస్టి నాఁగఁ దోఁచును...ఆం. భా. ౨. ౧౨౨.

కునుకు(న్కు). అ. క్రి. ౧. నిద్రచే తూఁగు, తూలు.
ఉదా: వాఁడు కూర్చుండి కునుకుచున్నాఁడు.
౨. తగ్గు, నిస్తేజమగు.
ఉదా:- దీపము కునుకుచున్నది ఎగసనఁ ద్రోయుము.
వి. అల్పనిద్ర.
సీ. ధన మున్న నృపవహ్నితస్కరభయచింతఁ గునుకు కంటికి రాక కుందుచుండు. రామలిం. ౭.
ఆ. ఈతఁ డనెడుమాట లెల్ల బూటకములు,కూలి సేయుచుండి కున్కుఁ జెందె. చెన్న. 3. ౪౨౫.
(దుర్జనవర్ణనము) సీ. చోర నేమఱించి ముంచు కొను ప్రవాహంబు కునుకువట్టినఁ జుట్టుకొను దవాగ్ని. రామలిం. 3౧.
జ: కునికిపడు, కునికిపాటు.

కున్న=కున్నె, కూన. వి. (సం.కుణకః. క.కున్ని.త. కుంచు. తు. కిన్ని.) బుడుతఁడు, శిశువు.
క. నిన్నింతవానిఁ జేసిన, యన్నాలుగుమోములతఁడు హరిపాక్కిటియం, దున్నవెలిదమ్మియీనిన,కున్న యగుట తెలిసి విడువు కోపము తండ్రీ. నృసిం. ౪. ౨౭.
ద్వి. పున్నెంబు నేసినపాలఁతులు నెలల, నెన్నఁదొమ్మిది మోచి కున్నలఁ గంద్రు. బస. పు. ౧. 3౫౯ పా.

జః కున్నఁడు.

కున్నఁడు. వి. (√ కున్న) బాలుఁడు, బిడ్డఁడు. (బ్రౌ, శ.ర.)

కున్నె=కున్న.

ఉ. వెన్నెలవన్నెలాఁడి సెలవి న్నెలకో ల్పెడు నవ్వుఁబువ్వుచాల్, క్రొన్నెలకున్నెలాగునఁ దళుక్కను నిక్కనయన్నునెన్నొసల్, పె న్నెలమన్నెలందమును చేర్కొను బిత్తరిమో ముఁదమ్మియుఁజ్, మి న్నెలమి న్నెలంతతలమి న్నమిటారపుఁగౌనుదీఁగయుఁజ్. రా. వి. ౪. ౯౧.

కుపకము. వి. శకటభేదము.

ద్వి. కొల్లారుబండ్లును గుపకపుబండ్లు,గొల్లెనలందు నెక్కొనుచాఁపబండ్లుఁ, గర మర్థిలో నెక్కి...ద్వి. భాగ. ౨. ౩౭ పా.

వ... ద్రౌపదీప్రముఖవధూజనంబులనుం దక్కనుం గలభరతభార్యల నందలంబులను గుపకంబుబండ్లను నిడికొని...భార. ఆశ్ర.౨.౨౭.

(ప్రాంతప్రతులపాఠము.)

కుపథము. సం. వి. అ. పుం. కానిత్రోవ, చెడ్డదారి.

కుపసము=కుప్పసము.

(అవిక)

సీ.గురుపత్ని నా కొక్క కుపసంబుఁ గుట్టుము చలిగాలి యొడలిపైఁ బొలయకుండ. కాశీ. ౭. ౪౦.

(పాముకూసము)

ద్వి. తనరారునాయంపతండంబుఁ జూడు, కుపసంబు లూడ్చినక్రూరసర్పముల, నుపమింప ననువులై యొడియు రాఘవుని. రం. రా. యు. ౩౮౪ పా. ౯ పం.

కుపితుఁడు. సం.విణ.(అ.ఆ.అ) కోపించినవాఁడు.

కుపిని. సం. వి. న్. పుం. కైవర్తుఁడు, జాలరి, చేఁపలవాఁడు. (త్రి. ని.) ఈ. స్త్రీ. చిన్న చేఁపలను పట్టువల, మావు. (విల్యమ్సు)

కుపీలువు. సం. వి. ఉ. పుం. కాకేందువు, కాకితుమికి.

కుపూయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కుత్సితుఁడు, అధముఁడు, నిందితుఁడు.

కుప్ప[1]. వి. (క. కుప్ప. త. కుప్పల్) ౧. (ధాన్యము మన్ను మున్నగువాని) రాశి, ప్రోగు.

ఉదా: వడ్లకుప్ప, మట్టికుప్ప, పేఁడకుప్ప, మొ.

సీ. చక్రవాకంబులచందంబు గొనివచ్చి కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి. భార. విరా. ౨. ౫౨.

గీ. ప్రోక యనఁ బ్రోవనంగను బ్రోగు నాఁగఁ, గుప్ప యన రాసి యనఁగను గువ్వ యనఁగ,రాశి యగు...ఆం. భా. ౨. ౧౦౧.

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులుం, గుప్పలు గాఁగఁ జుట్టునను గూర్పఁగ...భీమ. ౨. ౧౩౯.

కుప్పలుగట్టు=కుప్పలుగా నేర్పడు, ప్రోగులుగా నేర్పడు.

ఉ...పెక్కులు త్రెళ్లెఁ బీనుఁగుల్,కండలుఁ బ్రేవులుం గలిసి కాలువలై యెసలారె నెత్తురుల్, కుండలచారుహస్తములు కుప్పలుగట్టెఁ బురంబువీథులజ్. కేయూర. ౨. ౧౧౬.

కుప్పలుగొను=కుప్పలగు, రాసులగు.

ద్వి...రాక్షసులఁ,జప్పళ్లు తఱుదుగా సంగ్రామభూమిఁ, గుప్పలుగొన సురల్ గూల్చుటఁ జూచి. రం. రా. ఉ. ౭౭ పా. ౧౦ పం.

కుప్ప తెప్పలుగా=ప్రోగుప్రోగులుగా.

గీ. కప్పురపుగంది వనిలోనఁ గలయ మొలఁగుఁ, గప్పురపుటంటిబోదెల నుప్పతిల్లి, కుప్ప తెప్పలుగా రాలుకప్పురంబుఁ,దననగపుఁగప్పురంబును దడఁబడంగ. మృ. వి. ౨. ౧౫.

కుప్పలుఱుకు= కుప్పలుకుప్పలుగా ఉఱుకు; మిక్కిలి వ్యాపించు.

సీ. తాటంకమణిభానుధాళధళ్యంబులు చెక్క

ఉద్దములపైఁ జిందులాడ, నవ్యహారప్రభా నై
గనిగ్యంబులు కుచపర్వతంబులఁ గుప్పలుబు
క. చిత్రభా. ౨. ౭౬.

జః కుప్పఁగూర, కుప్పకోలుగొను, కుప్పగూలు, కుప్పగూల్చు, కుప్పతించు, కుప్పతిలు, కుప్పనఁగూర, కుప్పనఁగూరు, కుప్పవడు.

**కుప్ప²**. వి. (ఇది ప్రతు లన్నిటియందును పరుసాది గాఁ గనఁబడుచున్నది. కుప్ప?) పాణివిశేషము. (ఇది 'పుడిసిలి, కమికిలి' వంటి మానవిశేషము.)

సీ ...పాణివిశేషంబు పరఁగును గమి, కిలి కుప్ప లప్ప పట్టిలి యన...ఆం. భా. ౨. ౧౪౧.

**కుప్పఁగూర(లు)**=కుప్పనఁగూర. క్రి. విశే. (√కుప్ప¹). కుప్పకుప్పలుగా, ప్రోగుప్రోగులుగా.

చ. ఎడగని యబ్బలంబు గడు నేడ్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రముల్, గడువడిఁ గుప్పఁగూరగఁ జలంబునఁ బైఁ దొరఁగింప ... భార. ద్రో. 3. ౧౫౨.

గీ. నీవు భీష్మునకలికినఁ బోవ దేను, గలుగ నెఱపేల యతనిపైఁ గవియు మెయిది, కొని మదీయబాణంబులఁ గుప్పఁగూర, పఱపి కూల్చెద నీతనిఁ బటురయమున. భార. భీష్మ. 3. 33౫.

మ. ...సముద్యద్వేగుఁడై తోలి తొ, ప్పఱఁ బెట్టెన్ శరజాలమున్ బిఱుదఁ గుప్పంగూర నాటించుచున్. నిర్వ. ౫. ౮౭.

చ. హిమగిరిసానుదేశమున నెక్కుడు వైభవము ల్లసిల్ల యజ్ఞము దగఁ జేసి భూమిసురసంఘము లెల్లను దృప్తిఁ బొంద హేమమొసఁగెఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁడై కనత్సువర్ణమయగృహక్రియోపకరణప్రకరంబులు నిచ్చె భక్తితోన్. భార. అశ్వ. ౧. 3౧.

**కుప్పకోలుగొను**. అ. క్రి. (√కుప్ప¹) నిండుకొను, మెండగు.

వ... ఆర్తరవంబులు కుప్పకోలుగొన గర్జించు తెఱంగు లెఱింగికొని ... కంచివీరశరభకవికృతహరిశ్చంద్రోపాఖ్యానము. 3.౬౧.(బ్రౌ)

**కుప్పగూలు**. అ. క్రి. (కుప్ప¹+కూలు) కుప్పగా కూలు, ప్రోగుగా పడు.

సీ. అస్తోకతరతారకస్తోమములతోన గోపురంబులమణుల్ గుప్పగూల. భా. రా. యు. ४౯౭.

ఉ. వాహనసూతయోధరథవర్గము లొక్కటఁ గుప్పగూల నా, కోహకపాతముల్ బెరయ ద్రోయుచు దంతుబు మ్రొగ్గ... భా. రా. యు. ౫3౧.

సీ. మీఱుచు నేట్లామకారుపోతులకొమ్ముచప్పళ్లఁ బులుఁగులు కుప్పగూల. యయా. ౧. ४४.

**కుప్పగూల్చు**. స. క్రి. (√కుప్పగూలు) కుప్పలుగాఁ బడవేయు, రాసులుగాఁ గూల్చు.

గీ. నిరతిశయముగ నాప్పలు నింగి ముట్టఁ, గుప్పగూల్చె నిశాచరకోటి నపుడు. భా. రా. యు. ౧౯౬౫.

ద్వి. సేనాసమేతుఁడై చెలఁగి ప్రేరేప, వానినాతనిసేన వడిఁ గుప్పగూల్చె. రం. రా. ఉ. ౭४ పా. ౨४ పం.

**కుప్పట**. వి. ఒకవిధమైనకూలి? (ఇది 'కూలి' శబ్దమునకు అనుప్రయుక్తమై కన్పట్టుచున్నది.)

క. ఆయిండ్లఁ గూలి కుప్పట, లాయముగా నొరుల నధీనరయై మనునొకవ, స్థీయసి వేఁగినమబ్బులోఁ, బాయనితమి మ్రొక్కి నిలువఁబడి యిట్లనియెన్. వేం. పంచ. ౫. ४3.

**కుప్పటగురిగింజే**. వి. బాలక్రీడావిశేషము.

సీ. దాఁగిలిమూఁతలు తేనుబిల్ల యాలంకి కుప్పటగురిగింజ కొండకోఁతి. హంస. 3. ౧४౬. (బ్రౌ. పా. 'గుబ్బటగురిగింజ' ముద్రి. పా.)

**కుప్పతించే**. స. క్రి. (√కుప్ప¹) కుప్పలుగా పడఁజేయు.

మ...క,న్గొలుకుల్ నిప్పులఁ గుప్పతింప...సమీర. 2. ౧౨2.

**కుప్పతిలు(ల్లు).** అ.క్రి.(√కుప్ప[1]) కుప్పలు గాఁ బడు,ప్రోగుగాఁ బడు.

క. అప్పుడు కన్నుల నిప్పులు,గుప్పతిలఁగఁ గెరలి పండ్లు గొఱుకుచు వాఁ డా,చొప్పునన వచ్చి నన్నిటఁ, దప్పక వీక్షించి ప్రల్లదంబునఁ బలికెన్. వేం. పంచ. ౧. ౬౦2.

కుప్పతిలఁబడు=కుప్పతిలు.

ఉ. కూలినభద్రనాగములు కుప్పతిలంబడు తేరులున్ ధరన్,వ్రాలెడుఘోటకంబులు నవారణ మ్రగ్గెడువీరయోధులున్...జై.భా.౪.౪2.

**కుప్పనఁగూర(లు)=కుప్పఁగూర.** క్రి.విశే. కుప్ప కుప్పలుగా, ప్రోగు ప్రోగులుగా.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం,గుప్పనఁగూర వఱపనరుఁ, డప్పరుసఁదనమున కోర్చి యతఁడు పెనంగన్. భార. కర్ణ. ౨. ౭౯౭.

క. అప్పుడు సతియును బతియును, నొప్పుగ సమదృష్టి నుండి రుచితానసులై,కుప్పనఁగూరలుగా మరుఁ,డప్పువ్వులకోల లేయ నద నయ్యెననన్. భోజరా. 2. ౧౨౪.

**కుప్పనఁగూరు.** స.క్రి.(√కుప్ప[1]) గుంపుగూడు.

ఉ. అప్పుడు శౌరిఁ జూచు ప్రమదాతిశయంబు హృదంతరంబులం, జిప్పిల సంభ్రమించి కయిసేయుతెఱంగయథాతథంబు గాఁ,గుప్పనఁగూరి యొండొరులఁ గూడఁగ నీక కడంగి వేలుపుం, గప్పురగందు లెక్కిరి ధగద్ధగితో న్నతహర్మ్యరేఖలన్. పారి. 3. ౧౧.

**కుప్పము.** వి. (క.కొప్ప.త.కుప్పమ్.) ౧.గ్రామము, ఊరు.

సీ. ఊరు కుప్పము గ్రామ మొప్పు ... ఆం. భా. ౨. ౨3.

౨. పల్లెవాండ్రగూడెము, బెస్తపల్లె. (శ.ర.)

**కుప్ప(లు)వడు.** అ.క్రి.(√కుప్ప[1])౧. కుప్పగాఁ గూడు, ప్రోగగు, పుంజీభవించు.

క. నరపతి గని యరు దందఁగ,ధరఁ బ్రేవులు గుప్పవడఁగఁ దనుఁ గొట్టినచు,ల్లరముపతికి గ అచుక తా,సరిచావుగఁ జచ్చె నొక్కజాగిల మచటన్. చంద్రా. ౨. ౯౮.

క. అప్పుడు తపసులు తమలో, డెప్పరమా తీరె నేమిటికి నీక నిచటం, గుప్పలువడి నిలువఁ గ రం,డెప్పటి తావులకె పోద మిందఱ మనుచున్. వరాహ. ౧౦. 3౮. అచ్చ. రా. యు. ౯౦.

౨. స్తంభించు.

సీ. కాళ్లు కుప్పవడంగఁ గదలఁజాలక యట్టె నిడుముసుం గిడి శయనించు చెలువ. దశా.౮.౮౪.

**కుప్పసము=కుపసము,కుబుసము[1],కూసను.** వి. (సం. కూర్పాసః. ప్రా. కుప్పాసో. క. కుప్పస. త. కుప్పాయమ్.) ౧.కంచుకము.

(క) చొక్కా.

సీ. తపసుఁ గ్రొవ్వాఁడి బెబ్బులికో అ చేయమ్ము గుత్తంపు టెలుఁగుతో లుక్కుప్పసంబు. చంద్రా. ౨. 3౭.

క. తొడిగినకుప్పస మూడ్చిన,పడువున నారాజు మేన పసియించినయా,కడిఁదిరుజ ల్లెల్లఁ బాసిన,నొడ లొప్పె సువర్ణభాతి నుజ్జ్వల మగుచున్. భోజరా. ౧. ౧3౭.

ఉ. వెన్నెలకుప్పసం బిడినవింతవిలాసము వావెకెక్కఁగాఁ, గిన్నరకంతి యొత్తు మరుకీర్తియుఁ బోనిపటీరపంకము, న్విన్నను వొప్పఁగా నలఁదె నిద్దపుఁజాయ మెఱుంగునం బదా,ర్వన్నె పసిండితోడ నొరవచ్చు నృపాలునియంగకంబులన్. నైష. ౬. ౪౦. (వెన్నెలకుప్పసము = వెన్నెలవంటి సన్నని తెల్లచొక్కా.)

(చ) ఱవిక.

ఉ. కుప్పసము ల్విడల్చి వలిగుబ్బల నొత్తిరి...అధీశు...కామినుల్. ఆము. ౫. ౧౦౮. రా. వి. ౫. ౭౫.

౨. పాముకూసము.

క. మంగళచరిత్ర యగుసీ, తాంగన నపవాదభీతుఁ డగునాఁకుఁ ద్యజింపంగ నగు నేఁడు దుష్టభు,జంగము తనప్రాఁతకుప్పసం బూడ్చుగతిఁ. జై. భా. ౬. ౮౨. విప్ర. ౧. ౭౫. ఆం. భా. ౧. ౧౮౯.

**కుప్పి**[1]. వి. అవాక్పుష్పి, సదాపకీ.

ఆ. కుప్పియాకు నూఱి గొంతుపోఁకం తేసె, మూఁడుదినము లియ్య ములుచయుఁన, చలువ వేఁకి దీఱు ఛర్ది గాకున్నను, నిది విచిత్ర మనుచు నెల్ల రనఁగ. చికి. (చి. ని.) హంస. ౮. ౧౦.

**కుప్పి**[2]=కుప్పె.

సీ...కాచము విలసిల్లు గా జనంగఁ, బింగాణి కుప్పికుప్పియ కుప్పె యనఁగను దత్కృతచషకాఖ్య తనరుచుండు. ఆం. భా. ౨. ౨౯౦.

**కుప్పించు.** అ. క్రి. (క. కుప్పిసు.) ౧. దూఁకుటకు ముందు కాళ్లు కదియఁబట్టి నేల నదుము.

సీ. బిట్టూని కుప్పించుపృథుపాదములవడి శేషాహిఫణములు సెదరిపాఁ. భా. రా. సుం. ౫౧౯.

(మాయాకురంగము) సీ. చందురునిట్టితో సమరంబునకు నేఁగుపగిదిఁ గుప్పించి యుప్పర మెగయును. భా. రా. ఆర. ౨. ౫౩.

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ. భాగ. ౧. ౨౨౨.

౨. దుముకు, దూఁకు.

మ...అంఘ్రు లిఱియంగాఁ బెట్టి బిట్టూఁది గ్ర, క్కున నక్కొండ యడంగఁ ద్రొక్కి పయికిం గుప్పించి లంఘించుచోఁ. రామా. ౬. ౯౩.

వ...అప్పాలదిండి యొడయఁడు కొండపైనుండి కుప్పించుకోదమసింగంబు తెఱంగునఁ బుడమి కుఱికి...అచ్చ. రా. యు. ౩౯౫.

సీ. ఉప్పరం బెగసి వే కుప్పించి రథరథ్యరథికులఁ దుముకుగా రాచి వైచు. రాజ. చ. ౨. ౭౫.

**కుప్పిగంతు.** వి. (√కుప్పించు?) చిన్నదుముకు, చిన్నగంతు.

శా...ఈవీటఁ బోరాడుటల్, వ్రేతల్ నూడఁగఁ గుప్పిగంతు లిడుటే వీక్షింపు గోపార్భకా. భాగ. ౧౦ పూ. ౧౩౩౭.

సీ. అబ్ధి లంఘించినహనుమంతు ముందఱ గణనకెక్కునె కుప్పిగంతు లెల్ల. హరిశ్చ. ౧. ౧౮౬.

(బ) బాలక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడిగుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు. గీ. ఆదిగా శైశవక్రీడలాడిరపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

జ: కుప్పిగంతుగొను.

**కుప్పిగంతుగొను.** అ. క్రి. (కుప్పిగంతు+కొను) దుముకు, గంతువేయు.

ఆ. వ్యోమకేశుజడలనుండి యవ్వాహిని, కుప్పిగంతు గొనినఁ గ్రుంగె ధరణి. భోజరా. ౭. ౩౯.

**కుప్పీలు.** వి.బ. బాలికాక్రీడావిశేషము. (శ.ర.)

**కుప్పె(ప్పియ)**=కుప్పి[2]. వి. (సం. కూపీ. క. త. కుప్పి.) ౧. కాచాదిపాత్రవిశేషము.

గీ. గాజుకుప్పెలఁ గస్తూరికాజలంబు, కర్ణికారాంబపై నించెఁ గర్ణమోటి. భీమ. ౫. ౧౧౫.

వ. ...కప్పురంపుఁగుప్పెలం గొప్పరించినసరసమధురసంబులు...పారి. ౨. ౫౨.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుమ దీపం బ, బెట్టులుండు జ్ఞాన మట్లు లుండుఁ, దెలిసినట్టివారి దేహంబులందును... వేమన. ౧. ౯.

౨. గిండి లోనగువానిమీఁదిమూఁత.
క. చాలఁగ నమృతము వాలుఁడు, గ్రోలుటకై ని
నిచి కనకకుంభంబులపైఁ, నీలపుఁగుప్పెలు
నిలిపిన,పోలికఁ జను మొనలఁ గప్పు పాలఁతి
కి నొప్పెన్. నృసిం. ౩. ౧౩౨.
౩. సవరమునకు మొదట నుండు గ్రంథి.
గీ.అడర బెడఁ గైననిడువాలు జడ సడల్చి,కుప్పె
గన్పడ సవరంపుఁగొప్పుఁ బెట్టి, మురియు
ముంగిట నిలుచుండి మొలకనగవు,లెసఁగ వి
టభాగ్యరేఖ యా హేమరేఖ. హంస. ౧.
౨౧౬.
గీ. కడియములు కెంపురవలయుంగరము వెండి,
కుప్పెసవరంబు కుంకుమాపుకూనలమ్మ,చీర...
శుక. ౨. ౪౧౧.
౪. గొడుగుమీఁదిగుబ్బ, బొగడ.
ద్వి. పెద పెద్దపసిఁడికుప్పెలు మీఁద నొప్పఁ, బ్ర
విమలం బగునెనుబది వేలసంఖ్య,ధవళాతప
త్రముల్ దనుజులు పట్ట. రం.రా.యు.౩౪౯
పా. ౨౨ పం.
౫.ఇత్తడి లోనగువానిలోఁ జేసి యెద్దుకొమ్ముకొ
నఁ దగిల్చెడితొడుగు. (శ. ర.)
౬. కత్తియొఱకు చివర నమర్చుతొడుగు.
సీ. కోశాంతకోశాదిగుప్తిభూషలు కుప్పె యన
నరడాయన నగుఁ గ్రమముగ. ఆం.భా. ౨.
౨౧౫.
౭. (ఔషధముయొక్క) ఉండ.
(వ్యవ) వసంతకుసుమాకరము కుప్పెలుకట్టి య
మ్ముచున్నారు.
జ: కుప్పెకోల.

కుప్పెంట. వి. హరితమంజరి, మూరుకొండకీ. (శ.
ర, వా.)

కుప్పెకోల. వి. (కుప్పె+కోల.) బాణవిశేషము,
క్షుద్రకము. ('అలుఁగు లేని బాణము' అని బ్రౌ.)
సీ. కవిసిన నతఁడు వికర్ణురథ్యంబులఁ గూల్చి
యాతనిపయిఁ గుప్పెకోల,లిరువది నాటింప
...భార. భీష్మ. ౨. ౩౯౩.
వ...సాత్యకి తఱిమి మనమొన నుఱుము చేయం
దొడంగిన ద్రోణుండు మార్కొని యిరువదే
నుకుప్పెకోలల నతనిచేత నేటులువడి ...
భార. ద్రో. ౩. ౨౭౦.
శ్లో. సాత్యకిః పంచవింశత్యా క్షుద్రకాణాం స
మార్పయత్. సం. భార. ద్రో. (శ. ర.)
ద్వి. అప్పటనుండి యాయతనుండు నృపునిఁ, గు
ప్పుచున్నాఁడు పూఁగుప్పెకోలలను. ప్రభు.
౬౬ పా. ౨౦ పం.

కుప్యత్. సం. శత్రు. కోపగించుచున్న.

కుప్యము. సం. వి. అ. న. వెండి బంగారు కాక
తక్కినలోహము.

కుప్యశాల. సం. వి. ఆ. స్త్రీ. వెండి బంగారు కాక
తక్కినధాతువులచే పాత్రాదులు చేయుకొట్టు,
కాంస్యాదిపాత్రనిర్మాణశాల.

కుప్రియము. సం. విశ. (అ. ఆ. అ.)జఘన్యము,
అధమము, నింద్యము. (హలా. ని.)

కుప్లవము. సం. వి. అ. పుం. తృణాదులచే నిర్మిత
మగు తెప్ప.

కుబుసము[1]=కుప్పసము.

(చొక్కా.)

ఆ. పుణ్యపాపకర్మపుంజనిబద్ధమై, తొడిగినకుబు
సంబువడువు దాల్చి, జీర్ణ మగుచు నుండుచె
నఁటిదేహంబున,యందు నీవు మమతఁ బొం
ద వలదు. మార్క. ౩. ౧౦౪.

(నిలువుటంగీ.)

గీ. కావికుబుసంబు జలకుండికయును బూని. మ
నుచ. ౧. ౫౯.

(పాముయొక్కకూసము; చర్మము.)

సీ. కుప్పస మనఁగను కుబుసం బనంగను గంచుక
నామంబుగాఁ జెలంగు. ఆం.భా. ౧.౧౪౭.

సీ. కుబుసంబు విడిచినకోడమనాగము శేవదోన వెడల్చినపువ్వుఁదా పుసరణి. పరమ. ౨. ౩౧.

(వాసుకివర్ణనము) సీ. పగిలి బీఁటలువాఱి తగడై త్తెఁ గుబుసంబు తోరంపువెల్లుల్లితునుకలట్ల. భీమ. ౪. ౧౩౦.

ఉ. ... మహా,భీలముగాఁగ వ్యాళవిభుఁ బెన్బులుఁ గీడ్చినమాడ్కి నీడ్చె న,బ్బాలిశుఁ గాలభైరవుఁడు పైకుబుసం బొకపోరువెత్తఁగన్. పాండు. ౪. ౨౯౪.

కుబుసము². వి. తలుపునకు క్రిందుమీఁదుల నుంచెడికూచము. (శ.ర-తలుపు ఉతక.అని బ్రౌ.)

కుబేరకము. సం. వి. అ. న. కుత్సితదేహము,కురూపము. (వై.ని.) పుం. నందివృక్షము.

కుబేరాక్షము. సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము.

సీ. క్రీడించు నొకవేళఁ దోడిబాలురఁ గూడి యక్షిణగతిఁ గుబేరాక్షకేళి. పాండు. ౪. ౧౩౪.('వెన్నెలకుప్పలయాట'అని వ్యాఖ్య)

కుబేరాక్షి. సం.వి.ఈ.స్త్రీ.పాటల,కలిగొట్టుకీ.

కుబేరాద్రి. సం.వి.ఇ.పుం. కైలాసము.

(ఇట్లే: కుబేరగిరి, మొ.)

కుబేరుఁడు. సం.విశ.(అ. ఆ. ఆ.) కుత్సితదేహము గలవాఁడు. వి.అ.పుం.ధనదుఁడు,పైఁడిఱేఁడు. (ఇతఁడు విశ్రవసునకు ఇలబిలయందుఁ బుట్టినవాఁడు. రావణునకు సవతితల్లికొడుకు. మూఁడు కాళ్లును ఎనిమిదిపండ్లును మెల్లకన్నును గలవికృతదేహమువాఁడు-కల్ప)

కుబ్జ. సం.వి.ఆ.స్త్రీ. కంసునిగట్టువాలు,కంసునినగరి సైరంధ్రి.

కుబ్జకంటకము. సం. వి. అ.పుం. శ్వేతఖదిరము,వెలిచంద్రకీ. (రా. ని.)

కుబ్జకము. సం. వి. అ. పుం. ౧. తినిశము, నెమ్మికీ. ౨. మిక్కిలి పరిమళము గలపువ్వులతోఁ గూడిన వృక్షవిశేషము, గోజ్జఁగకీ. (ఇదియే 'గులాబి' అని యొకరు.)

కుబ్జము. సం. వి. అ. పుం. ౧. గూను. ౨. వంపుకత్తి. ౩. అపామార్గము, ఉత్తరేనుకీ.

కుబ్జిక. సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిదేండ్లయీడు గలకన్య.

కుబ్జుఁడు. సం. విశ. (అ. ఆ. అ) గడుసుఁడు,గూనువాఁడు.

కుబ్రము. సం. వి. అ. న. ౧. వనము, అడవి. ౨. హోమకుండము. ౩. కుండలము. ౪. తంతువు. ౫. శకటము, బండి. ౬. గృహము.

కుబ్రహ్మ. సం. వి. న్. పుం=కుబ్రహ్మఁడు.

కుబ్రహ్మఁడు. సం. వి. అ. పుం. కుత్సితబ్రాహ్మణుఁడు.

కుభృత్తు. సం. వి. త్. పుం. ౧-భూమిని భరించువాఁడు-రాజు. ౨-భూమిని భరించునది-కొండ.

కుమారకము. సం. వి. అ. పుం. తిక్తశాకము, ఉలిమిరిచెట్టు.

కుమారజీవము. సం. వి. అ. పుం. పుత్రజీవకవృక్షము.

కుమారపాలనుఁడు. సం.విశ. (అ. ఆ. అ.) పిల్లలను రక్షించువాఁడు. వి. అ. పుం-పిల్లవాఁడుగా నుండి ప్రజాపాలనము చేసినవాఁడు-శాలివాహనుఁడు.

కుమారభృత్య. సం. వి. ఆ. స్త్రీ. (వైద్య) కుమారరక్షణోపాయము, బాలకులను బెంచువెరవు.

కుమారము. సం. వి. అ. పుం. ౧. చిలుక. ౨. వరుణవృక్షము, ఉలిమిరికీ. ౩. సింధునదము. ౪. బాలగ్రహభేదము. ౫. శుద్ధసువర్ణము, చొక్కపుబంగారు.

కుమారయువు. సం. వి. ఉ. పుం. యువరాజు.

కుమారవాహి. సం. వి. న్. పుం. నెమిలి.

కుమారవ్రతము. సం. వి. అ. న. నిత్యబ్రహ్మచర్యము, మరణపర్యంత ముండు బ్రహ్మచర్యనియమము.

కుమారసువు. సం. వి. ఊ. స్త్రీ-కుమారస్వామిని కన్నది-౧. పార్వతి. ౨. గంగ. పుం. అగ్ని.

కుమారి. సం. విశ. (న్. ఈ. న్) =కుమారులుగల వాఁడు.వి.ఈ.స్త్రీ. ౧.కూఁతురు. ౨.కన్య, పెండ్లి కానిపడుచు. ౩.ఆఁడులేడి.(వై.ని.)౪.పార్వతి. ౫. నదీభేదము. ౬. శ్యామాపక్షి. (రా. ని.) ౭. జంబూద్వీపముయొక్క అంశ మగుకుమారికాఖండము. (కన్యాకుమారి. హేమ. ని.) ౮.నవమాలిక, విరజాజి. ౯.ఘృతకుమారి, కలబంద. ౧౦. అపరాజిత, విష్ణుక్రాంత. ౧౧. పిన్న గోరంట. ౧౨.పీతసహ,పచ్చగోరంట. ౧౩.పెద్దయేలకి. ౧౪. కుస్తుంబురువు, కొత్తిమిరి. (శే. ని.)

కుమారిక. సం.వి.ఆ.స్త్రీ=కుమారి. వి.

కుమారిలు(ల్లు). అ. క్రి. ౧. కుములు, రాఁజు.

ఆ. జ్ఞాతికులము నూర్చి నూతఁ బోయక నాదు, డెంద మించుకైన డిందుపడదు, కానరాదు గాని లోనఁ గుమారిలు,చున్న దిపుడు రోష హుతవహంబు. ప్రబోధ. ౨. ౬౮.

౨. (లోలోపల) తపించు, ఉడుకు.

క. మానవతి యిట్లు మానని, మానక్రోధములచేఁ గుమారిలి చింతా,ధీనగతి నుండ...పారి. ౧. ౧౧౪.

ఉ. మాను దురంత వేదనఁ గుమారిల నేల పసిండి కొండవి,ల్కానివర ప్రసాదమునఁ గల్గినవానికి హాని వచ్చునా. సారంగ. ౩. ౨౭౬. ప్రభా. ౩. ౧౨౪.

కుమారుఁడు. సం. విశ. (అ. ఈ. అ)-అందమున మన్మథుని క్రిందుపఱచువాఁడు- సుందరుఁడు. వి. అ. పుం. ౧. కొడుకు. ౨ (నాట్యోక్తియందు) యువరాజు. ౩. స్కందుఁడు, కొమరసామి. ౪. అయిదేండ్లలోపలిబాలుఁడు. ౫. అశ్వారకుఁడు, గుఱ్ఱపువాఁడు.

కుమారోపవాహము. సం. వి. అ.పుం-కుమారస్వామి రెండవవాహనము-కుక్కుటము, కోడి.

కుమాలకము. సం. వి. అ. పుం. సౌవీరదేశము.

కుమి=కుమ్మి. వి. కుసూలవిశేషము, ధాన్యాదు లుంచుకొనునొకవిధమగుపాణక.

సీ...కుసూలాభిధ గాదె యనంగను గరిసె యనఁగఁ, గీ. దద్విశేషసమాఖ్యలు దనరుచుండుఁ, గొట్టు కూటు పాడక కుమి బొట్ట యనఁగ. ఆం. భా. ౨. ౨౪౦.

కుమిలించే. స. క్రి. (√కుములు) కుములఁజేయు. (ఉడికించు.)

సీ. చెలిపాదములఁ బెట్టి చిగురులు గుమిలించి ఘనభీతిఁ గనెఁ బికకంఠి యొకతె. చంద్రా. ౪. ౧౬౫.

కుముఖము. సం. వి. అ. పుం. సూకరము, పంది. (వై. ని.)

కుముటు. వి. ౧. కాసభేదము.

గీ...కాసంబు పేరు దనర్చుచుండు,నుబ్బస మనం గ దగ్గన నుక్కిస మనఁ,గాసభేదము కుముటు నాఁగను దనర్చు. ఆం. భా. ౨. ౧౨౬.

౨. వాంతికి ముందు కంఠబిలమున నెత్తువికారము. (శ. ర.)

అ.క్రి.వాంతికి ముందు కంఠమున వికార మెత్తు. (శ. ర.)

కుముద. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంభారి, పెనుగుమ్ముడు. ౨. కుంభిక, నాఁచు. ౩. సాలపర్ణి, ముయ్యాకుపొన్న. ౪. కట్ఫలము, పినగుమ్ముడు. ౫. ధాతకి, ఆరె.

కుముదఖండము. సం. వి. అ. న. ౧. కుముదషండము, తెల్లగలువతంపర. ౨. తెల్లగలువతునక.

కుముదఘ్ని. సం. వి. ఈ. స్త్రీ - కలువలను చంపునది - ఒకానొక విషక్షీరవృక్షము.

కుముదబాంధవుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

కుముదము. సం. వి. అ. పుం. న. (శే. ని.) ౧. కైరవము, తెల్లగలువ. ౨. రక్తపద్మము, ఎఱ్ఱదామర. ౩. రూప్యము, వెండి. ౪. దమనకము, బ్రహ్మజట యనెడియోషధిꣳ. పుం. ౧. నిరృతి దిక్కునందలి యేనుఁగు. ౨. కర్పూరము. ౩. శివునిశంఖము.

కుముదాకరము. సం. వి. అ. పుం. కలువ లుండు చోటు. (సరస్సు, మొ.)

కుముదాభిఖ్యము. సం. వి. అ. న. వెండి.

కుముది. సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, పినగుమ్ముడుꣳ.

కుముదిక. సం. వి. ఆ. స్త్రీ=కుముది.

కుముదికము. సం. విశ. (అ. ఆ. అ) కుముదములు గలది. (సరస్సు, మొ.)

కుముదిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగꣳ. ౨. తెల్లగలువ లుండుచోటు. (కొలను, మొ.) ౩. తెల్లగలువతంపర, కుముదసమూహము.

కుముదినీనాయకుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, కలువలఱేఁడు.

కుముదుఁడు. సం. విశ. (ద్). ౧. సంతోషహీనుఁడు. ౨. కృపణుఁడు, లోభి. వి. అ. పుం. ౧. ఒకానొకవానరుఁడు. ౨. ఒకానొకనాగుఁడు. (వీనిచెల్లెలు కుముద్వతి రామపుత్త్రుఁడగుకుశునిభార్య.) ౩. ఒకానొకదైత్యుఁడు.

కుముద్వంతము. సం. విశ. (త్. ద్వతీ. త్.) చాల కుముదములు గలది. (సరస్సు, మొ.)

కుముద్వతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగ. ౨. తెల్లగలువలసమూహము. ౩. తెల్లగలువ లుండుచోటు (సరస్సు, మొ.) ౪. ఒకానొకనది. ౫. కుశునిభార్య. (కుముదనాగునిచెల్లెలు.)

కుములు. అ. క్రి. ౧. రాఁజు, రవులు.

సీ. పూరజం బని చాల భొంకించి యమ్మోకు మిలి నిగ్గులు దేరుకుమ్ము గుప్పి. చంద్రా. ౪. ౧౮౭.

౨. (లోలోపల) తపించు, ఉడుకు.

గీ. సవతి యాడినమాటలు సారెఁ దలఁచి, కొనుచుఁ జేర్చినదుఃఖాగ్నిఁ గుములు చుండె. భాగ. ౪. ౨౨౮.

ద్వి. వాలుఁగన్నుల నీళ్లు వఱదలై పాఱఁ, గోడుకున్నచందంబుఁ గుములుచుఁ జూచి. ద్వి. సారంగ. ౨. ౭౨ పా. ౧౮ పం.

క. అని బుజ్జగించి యొయ్యన, నెన రంటినమనముతోడ నెచ్చెలి పలుకఁ, దనలోఁ గుములుచు నీమం, తిని పై నిగనిగ వెలుంగు నెలఁగని పలికెꣳ. చంద్రా. ౫. ౭౨.

౩. సడలు, బిగివీడు.

సీ. యౌవన స్తంభ హైన్యంబున దేహంబు కుమిలి గుడారు నాఁ గుదియఁబడఁగ. దశా. ౨. ౧౩౯.

కుమ్మకు. వి. (హిం. కుమ్మక్.) సహాయము, లోడు. (శ. ర - 'కుమ్మక్కు' అని వా.)

కుమ్మర. వి. కుండలు మున్నగునవి చేసి జీవించెడి జాతి, కులాలజాతి.

ఉదా: కుమ్మరవాఁడు, కుమ్మరది, మొ.

విశ. నలుపు, నల్లనిది.

ఉదా: కుమ్మరగువ్వ, కుమ్మరపానిక, మొ.

కుమ్మరస్వరూపములు = కుమ్మరి చేయుకుండలు మున్నగుపాత్రములు. (బ్రౌ)

జ: కుమ్మరగువ్వ, కుమ్మరచెట్టు, కుమ్మరత, కుమ్మరపురుగు, కుమ్మరపానిక, కుమ్మరపోలికి, కుమ్మరసాన, కుమ్మరసారె, కుమ్మరసారెచుక్క, కుమ్మరావము, కుమ్మరి.

**కుమ్మరగువ్వ.** వి.(కుమ్మర+గువ్వ.)పక్షి విశేషము, ఖంజరీటము. (శ. ర.)

**కుమ్మరచెట్టు.** వి. (√కుమ్మర) ఒకానొక చెట్టు.(శ. ర, బ్రౌ.)

**కుమ్మరత.** వి. (కుమ్మర+త) కుమ్మరది, కులాలస్త్రీ. (శ. ర, బ్రౌ.)

**కుమ్మరపురుగు(రువు, ర్వు).** వి. (√ కుమ్మర) కుమ్మరవానివలె ఎల్లప్పుడు మట్టిలో నుండుపురుగు, యమకీటము.

ఉ. కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపు ర్వని యందురే కదా. (భట్టుమూర్తిచాటువు.)

**కుమ్మరపానిక.** వి. (కుమ్మర+పానిక) కృష్ణముంజముకీ.

సీ...కుమ్మరపానిక నాఁగను గృష్ణముంజ మొప్పు. ఆం. భా. ౨. ౬౪.

**కుమ్మరపోలికి(ల్కి).** వి. (కుమ్మరపోలిక-శ. ర.) వృక్షవిశేషము.

సీ...గుమ్మడు మోవి తపసియుఁ గుమ్మరపోల్కి గుగ్గిల మెజ్జిపోల్కి వేగి. హంస. ౪. ౧౧.

**కుమ్మర(రి)సాన=కుమ్మరసారె.** వి.(కుమ్మర+సాన) కులాలచక్రము. (బ్రౌ)

సీ. ఘనవర్తులావర్తగర్తభాగముల దిర్దిరను గుమ్మరసానరీతిఁ దిరుగు. దశా. ౧. ౧౯౫.

**కుమ్మర(రి)సారె=కుమ్మరసాన.** వి. (కుమ్మర+సారె) కులాలచక్రము, కుమ్మరవాఁడు కుండలు చేయుట కుపయోగించుచక్రము.

గీ. ధాత్రి కుమ్మరిసారెవిధమునఁ దిరిగె. భార. ఉద్యో. ౪. ౧౧౬.

చ. ... అత్తురగ ముల్మకచక్రనయావలంబిసై, తిరుగురయంబుచేత నెడ త్రెవ్వక కుమ్మరిసారెచాడ్పునం, బరఁగె... ప్రభా. ౨. ౩౪.

ఉ. కుంభిని దిద్దిరం దిరిగెఁ గుమ్మరిసారెవిధంబునన్ ...హరిశ్చ. ౧. ౧౭౧.

(బ) బాలక్రీడావిశేషము.

సీ. తుమ్మెదరేఁపుల్లు కుమ్మరసారెలు బందారుబసవన్న పత్తికాయ. గీ...ఆడుకొనుచు.హంస. ౩.౧౪౬.

**కుమ్మరసారెచుక్క.** వి-కులాలచక్రాకృతి గలనక్షత్రము-విశాఖానక్షత్రము. (బ్రౌ, శ.ర)

**కుమ్మరావము.** వి.(కుమ్మర+ఆవము)కుమ్మరి కాల్చుట కేర్పఱచినకుండలు లోనగువానిదొంతర.

గీ. చక్రి పాదమంగఁ బార్థివస్థానమయ్యె, నోరి మీవంశమందుఁ దాఁ గోర్వఁ జాలు, వారిఁ జూపుము కుమ్మరావమున రాగి,మంత లేఁబఁగఁ గలవె నీకింత యేల. ఉ. హరి. ౩. ౪౭. రా. వి. ౫. ౯౯.

**కుమ్మరి.** వి.(కుమ్మర+ఇ-సం. కుంభకారః. ప్రా. కుంభఆరో, కుంభారో. క. కుంబఱ, కుంబాఱ) కుంభకారుఁడు, కుమ్మరవాఁడు.

సీ. ఇంక నాల్గావంబు లిడనైతిఁగా యంచుఁ గుమ్మరి నెమ్మదిఁ గుందికొనఁగ. శుక. ౨. ౫౬౩. ఆం. భా. ౨. ౨౭౨.

కుమ్మరి కొకయేఁడు గుదె కొకపెట్టు=కుమ్మరి యొకయేఁడు పడినశ్రమము ఒక్కకఱ్ఱదెబ్బతో వ్యర్థమగును.

క. ఇది పెక్కేఁడులు పట్టెన్,సదనంబులు గట్టనాకు శంభునికొఱకున్, దుదిఁ గుమ్మరి కొక యేఁడును,గుదె కొక పెట్టన్నమాటకున్ సరి వచ్చెన్. కాశి. ౨.౯౯.

కుమ్మరి కొకయేఁడు గుదియ కొకనాఁడు=కుమ్మరి యొకయేఁడు చేసినపని కఱ్ఱ ఒక్కనాఁడు చెఱుపఁ గలదు.

ఆ. గతము చేసినట్టికర్మబంధము లన్ని,విరిసిపోవు సత్యగురునివలన,కుమ్మరి కొకయేఁడు గుదియకు నొకనాఁడు. వేమన. ౨. ౧౨౭.

**కుమ్మరించే=క్రుమ్మరించే.** స. క్రి-కుమ్మరిలఁ జేయు-

కుండ మున్నగువానినుండి జలాదిపదార్థములను అధికముగా వెలువఱుచు; మిక్కుటముగా వెలువఱుచు.

మ. తనతోయం బినరశ్మి లెత్త నిల వాత్యారేణు మూర్తి న్నహేం,ద్రునకుం జెప్పఁగ మ్రుచ్చఁ బట్టి దివమందు న్విల్ఘటింపన్ భయం,బునఁ దద్రశ్మిసహస్రము న్వెస డిగెంబో డాఁగివే గుమ్మరిం,ప ననన్ ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బు లన్వొల్లిపై. ఆము. ౪.౭౩. (వ్రాఁతప్రతి పా.)

వ... గంధపాడిపాలుపును గుమ్మరించుభమ్మిల్లమల్లికాహల్లకవాసంతికాజాతికేతకీకుందకుసుమ గంధంబులును...భీమ. ౧.౧౧౮.

సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చట్లు రాఁ జుట్టి దొమ్మియూర్పులతావి గుమ్మరించి. కవిక. ౪. ౧౬౬.

(వ్యవ) బిందెలోని అన్న మంతయు చాఁపలో కుమ్మరించినాఁడు.వర్షము కుండలతో కుమ్మరించినట్లు కురియుచున్నది. వండినకూర యంతయు వానికే కుమ్మరించినాఁడు.

జ: కుమ్మరింపు, కుమ్మరిలు.

కుమ్మరింపు. వి. (√కుమ్మరించే.) ౧. కుమ్మరించుట. (బ్రౌ.) ౨. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.హంస.౧.౨౦౬.ఆం.భా. ౨. ౨౦౯.

కుమ్మరిలు(ల్లు)=క్రుమ్మరిలు.అ. క్రి.(√కుమ్మరించే) కుండలు లోనగువానినుండి జలాదులు ఒక్కసారి గాపడు; రాలు. (శ.ర.)

సీ. ... మిడిగ్రుడ్డుల నిప్పులు కుమ్మరిలఁగ. హరి. పూ. ౫. ౧౪౯. (శ. ర. పా.)

కుమ్మి=కుమి. వి. కుసూలవిశేషము, ఒకవిధ మగుపాణక.

(లోభివర్ణనము) సీ. మూసి ము ల్లడిచి కుమ్ములకొబ్బిపై మెత్తు లూడ్వఁడు పస్తైన నుండుఁగాని. పాండు. ౪. ౧౪౯.

చ. పడఁతిరో నిత్యమైమగుగుభక్తుల కన్న మొసంగి కాని వే,కుడువవు నీగృహంబునను గుమ్ములు గాదెలు లేవు... చెన్న.౪.౯౯.పండితా.దీక్షా. ౪౪ పా.

కుమ్ము[1]=క్రుమ్ము. స క్రి. (క. త. కుమ్ము.) ౧.నలఁగఁ గొట్టు; దంచు.

సీ. గోడలు ప్రాయంగఁ గుమ్మి గందంబున మేదించినట్టిజవ్వాదియదుసు. యయా. ౧. ౪౮.

గీ. భూసురక్షేత్రము హరించుబుద్ధి నెవ్వఁ, డడ్డపెట్టును వానిని యమునిదూత, లినుపరోళ్లను బడవైచి యినుము గాఁగఁ, గుమ్ముచుందు రు సతతంబు గోడు కుడుప. శేష. ౩. ౩౮.

క. తమ్మాకు రెండుపట్టలు,కుమ్మి యజాక్షీరములను గూర్చి వడిచి చా,రొమ్ముగఁ ద్రిదినంబులు గొనఁ,బమ్మినరేచీక పెల్లఁ బాయున్ వేగన్. చికి. (చి. ని.)

౨. పొడుచు.

సీ. ఈవంకి నేవంక నే వంకవోకుండఁ గోటానఁగోటులు గుమ్మినాను. ష. చ. ౨. ౫౯.

ఉదా: ఆవు నన్ను కుమ్మినది.

వి=కుమ్మె. పోటు, దెబ్బ.

సీ. గుబ్బకుమ్ముల నెదల్ గుమ్మెలువోఁ గ్రుమ్మి గట్టిగా బిగియారఁ గౌఁగిలించి. ఘటికా. ౨. ౧౧౬.

గీ. ప్రతిబలము వ్రేయుతిరుగుడుకాళ్లకలనఁ,గుమ్ములానినబంగారుగోడలు... కువల. ౩.౧౭.

జ: కుమ్ముపురువు, కుమ్ములాడు.

కుమ్ము[2]. వి. పొట్టునిప్పు, కుసూలము.

సీ. పూరజం బని చాల బొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరుకుమ్ము గుప్పి. చంద్రా. ౪.౧౬౮.

ఆ. చేతరాసియయినఁ జించలం బయినను, గుమ్మునందుఁ గ్రుక్కి సమ్మదమునఁ,గట్టఁ బొలిసి

పోవుఁ గరి నపవిత్రంపు,గడ్డ లైన నీరు గా
ఱుచున్న.చికి. (చి. ని.) ఆం. భా. ౨.౨౮౨.
కుమ్ముగాఁచు=కుమ్ముదగ్గఱ చలి పోవుటకై శరీర
ము కాఁచుకొను.
గీ.అత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,గాఁ
చుచోటికి మకరసంక్రాంతివేళ. శివరా. ౪.
౨౭.
కుమ్ముపురువు(గు). వి. (√ కుమ్ము1.) ఒకజాతిపు
రుగు.
గీ. కుమ్ముపురువు చిక్కు పురువు గుంతపురువు.ప్ర
బంధ. ౧౩౦.
కుమ్ములాడు=క్రుమ్ములాడు. అ. క్రి. (కుమ్ము1లు +
ఆడు) పోట్లాడు, పోరు.
గీ.అత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,కాఁ
చుచోటికి మకరసంక్రాంతివేళ. శివరా. ౪.
౨౭.
సీ. కూలె నొక్కమ్మడిఁ గొమ్ముకత్తులకొద్దిఁ గుమ్మ
లాడి మదాంధకుంజరములు. చంద్రా. ౬.
౭౫.
కుమ్ముసుద్ది. వి.సంకేతవృత్తాంతము,గూఢార్థము గ
లవృత్తాంతము. (శ.ర, బ్రౌ.)
కుమ్మె=కుమ్ము1. వి. పోటు, పొడుపు; నొక్కు.
క. కుమ్మెలు దాఁకినబంగరు,బొమ్మరములయొమ్మెఁ
గడకుఁ బొమ్మనురేఖా,సమ్మిళిత స్తనకుంభత,
టమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తికలోఁ. సా
రంగ. ౨. ౨౩౦.
ఉ. క్రమ్మి చతుష్కరిం జమురు కాలువలై ప్రవ
హింప రోమపుం,గుమ్మెలఁ శార్కృభూజము
లు గూకలు వత్తులు గా ముఖంబునం,దుమ్ము
లు రేగ మై మఱచి దున్నుచు ముస్తలఁ దె
చ్చి కుంజముల్,గొమ్ములఁ జిమ్ముదాని నొక
ఘోరవరాహముఁ గాంచి యాత్మలోఁ.
వేం. పంచ. ౨. ౧౦౫.

సీ. క్రొవ్వాఁడికొనగోటికుమ్మెలు బిగియించు చెం
పపెట్టు కపోలసీమ వెలుఁగ. చంద్రా. ౫.
౨౭.
కుమ్మెలువోవు=నొక్కులుపడు; గంటులువడు.
సీ. బిగువుఁగౌఁగిళ్లచేఁ బ్రియుబాహుపుర లొ
త్తి కుమ్మెలువోయినకుచతటములు. ప్రభా.
౫. ౬౨.
సీ. గుబ్బకుమ్ముల నెదల్ గుమ్మెలువోఁ గ్రుమ్మి గట్టి
గా బిగియారఁ గౌఁగిలించి. ఘటికా. ౨.
౧౧౬.
చ. ఎఱుఁగదు లేఁతమోవిచిగు రెంతయుఁ గుమ్మె
లువోవ నొక్కుటల్. శకాం. ౩. ౯౬.
కుయి=కూయి. వి. మొఱ.
ఆ. ఎట్లు బ్రదుకువార మెందుఁ జేరెదువార,మ
ధిప వినఁగఁ దగదె యాడుకుయులు. భాగ.
౧౦ పూ. ౯౯౫. కృ. శకుం. ౩. ౧౮౭.
విణ. రక్షకము. (చూ. కుయిపోవు.)
జ: కుయిపోవు, కుయోమొఱ్ఱో.
కుయిపోవు. అ.క్రి.(కుయి + పోవు) రక్షకముగా
పోవు.
సీ. పసులకై కుయిపోయి పరులశస్త్రములచే నని
లోన సమసినయట్టివాఁడు. గీ. దినకరాత్మజు
నిపురంబునకు రాఁడు. రుక్మా. ౨. ౧౧౧.
కుయోమొఱ్ఱో=కుయ్యోమొఱ్ఱో.
ద్వి. రక్కసిపలెనె ధారణి పిక్కటిల్ల, మొక్క
లంబునఁ గుయోమొఱ్ఱో యనంగ.ద్వి.సారం
గ. ౩. ౧౫౮ పం.
కుయ్యి=కూయి.
(మొఱ, ఆర్తధ్వని.)
ఆ. అనద నైతి నిచట నాలికు య్యాలింపుఁ, దక్క
ట మీరు గలుగ నాక్రమించి, నన్నుఁ గట్టి
నూతనవందను లిమ్మెయి,వెఱపు లేక భంగపఱ
చువారు. భార.విరా.౩.౧౯.

(దీనాలాపము; అల్పవచనము.)

క. కుయ్యాడక నాముందఱ,గయ్యమునకుఁ గాలుదువ్వఁ గడఁగెను దీనిన్, దయ్యాలకు బలి వెట్టెద, ప్రయ్యాలుగా నఱికి యెల్లవారును జూడన్. మొ. రా. సుం. ౭౦.

క. ఇయ్యెడవి వీని నేబలు, దయ్యంబులు ప్రేసె నొక్కొ తెరలక యుండన్, డయ్యఁ డొకింతయు మనతోఁ, గుయ్యన నొల్లండు కన్నుఁ గొన తెఱవంగన్. వాల్మీ. ౨. ౧౨౦.

జ: కుయ్యిడు, కుయ్యో మొఱ్ఱో.

కుయ్యిడు=కూయిడు. అ. క్రి. (కుయ్యి+ఇడు.) _కోపాములచే _ కేకలువేయు, అఱచు; మొఱపెట్టు.

ద్వి.అంత్యజుఁ డంత్యజుఁ డనుచుఁ గుయ్యిడెద, రంత్యజునకుఁ జోర నది యెట్లు వచ్చు.పండితా. దీక్షా. ౮౩ పా.

మ. అవు బావా యమృతంబు ముందు మనదైత్యశ్రేణికిం బంతునో,దివిజుల్ కుయ్యిడకుండ ముం దొసఁగి యందే కొంత తర్వాత దా,నవదైత్యాసురరాక్షసావళులకున్ వడ్డింతునో ... దశా. ౨. ౩౫౮.

ఉ. కుయ్యిడశక్తి లే దుదరగోళములోపల నున్నవాఁడ ది,క్కెయ్యది...భాగ. ౧. ౨౮౦.

స. క్రి. మొఱవెట్టియడుగు.

క. ఆఁకట మలమల మాఁడుచుఁ, దేఁకువ చెడి చేతు లొగ్గి దీనత్వమునన్,గాకముగతి వాపోవుచు, గోకర్ణక్షేత్రజనులఁ గుయ్యిడఁ దొడఁగెన్. బ్రహ్మో. ౨. ౬౮.

కుయ్యోమొఱ్ఱో(ఱో)=కుయోమొఱ్ఱో. వి. (భయదుఃఖాదులందు చేయు) ఆర్తధ్వనియొక్క అనుకరణము.

ఉదా: కొట్టక పోయినను వాఁడు కుయ్యోమొఱ్ఱో యనుచున్నాఁడు.

మ...ఈ,శునిదౌవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి కుయ్యోమొఱో,యిను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపు మం చంబుజా, ననముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్. భాగ. ౮. ౨౧౯.

కురంక(కు)రము. సం. వి. అ. పుం. సారసపక్షి, జెగ్గురుపిట్ట.

కురంగకము. సం=కురంగమము.

కురంగనాభి. సం. వి. ఇ. పుం.మృగనాభి,కస్తూరి.

కురంగమము. సం. వి. అ. పుం. కురంగము,జింక.

కురంగము. సం. వి. అ. పుం. ౧. జింక. ౨. ఇంచుకంత యెఱుపువన్నె గలపెద్దయిఱ్ఱి.

శ్లో. కురంగ ఈషత్తామ్రస్స్యాద్ధరిణాకృతికో మహాన్.( అ. ని)

౩. కోఁతి. న. ౧.వెండి. ౨. తీర్థభేదము.

కురంగాక్షి. సం. వి. ఈ. స్త్రీ. లేడికన్నులవంటి కన్నులు గలస్త్రీ; స్త్రీ.

కురంగి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడులేడి.

కురంగిక. సం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి, పిల్లపెసరకి.

కురంజి.వి. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి.

సీ... సలలిత బిలాహరి కురంజి ధన్యాసి...హంస. ౫. ౧౨౩. ప్రబంధ. ౯౫.

కురంజియోమము. వి.ఒకానొకయోమము.(శ్రా, వా.)

కురంటకము. సం=కురంటము.

కురంటము. సం.వి.అ.పుం.పీతఝింటి,పచ్చపువ్వులగోరంటకి.

కురంటిక. సం.వి.ఆ.స్త్రీ. పచ్చపువ్వులగోరంటకి.

కురండము. సం.వి.అ.పుం.౧. సాకరుండవృక్షము. ౨. అండవృద్ధి, బుడ్డ.

కురక. సం.వి.ఆ.స్త్రీ. సల్లకి,అందుగుకి.

కురచిల్లము. సం.వి.అ.పుం. కర్కటము, ఎండ్రి.

**కురటుఁడు.** సం.వి.అ.పుం. చర్మకారుఁడు, మాదిగ వాఁడు.

**కురము**[1]=**కురుము**[1]. వి. పసువులకుఁ గలుగు శీతరోగము. (శ.ర.)

**కురరము.** సం.వి.అ పుం.ఉత్క్రోశము, పక్షివిశేషము.(లకుముకిపిట్ట అని కొందఱు. పెన్నడపులుఁగు అని కొందఱు.)

**కురరాంఘ్రి.** సం.వి.ఇ.పుం. దేవసర్షపము.

**కురరి.** సం.వి.ఈ.స్త్రీ. ౧. స్త్రీపక్షివిశేషము.(ఆఁడులకుముకి అని కొందఱు. ఆఁడు పెన్నడపులుఁగు అని కొందఱు.) ౨. మేషి,ఆఁడుగొఱ్ఱె.(వై.ని.)

**కురవకము.** సం.వి.అ.పుం. ౧.ఎఱ్ఱగోరంట. ౨.ఎఱ్ఱచేమంతి.

**కురస.** సం. వి. ఆ. స్త్రీ. గోజిహ్వా, బెండ.

**కురసము.** సం.విణ. (అ.ఆ.అ.) చెడ్డరసము గలది. వి.అ.పుం. ౧.మద్యవిశేషము. ౨.చెడ్డరసము.

**కురాడ(ళ)ము.** వి. మంచపుపందిరిగుడ్డ.

ఉ. పట్టుతలాడయున్ హళఁదిపచ్చనునుంబఱపింద్రగోపపుం, బట్టుకురాడముం ...కన్న యానృపతిమంచముపై సతు లుంచి రచ్చెలిన్. పాంచా. ౫. ౧౦.

చ. బటువులు తాపితాపఱపుపట్టుతలాడయు మీఁదఁ జల్వదుప్పటి పయిఁ జప్పరంపుజిగి బంగరువ్రాతకురాళముం గుఱం,గటఁ బడి గంబుఁ గంచుదివెగంబుఁ గల్గినపట్టెమంచము,త్కటరుచి నించ మించురతిధామముఁ జేరితి నిర్భయంబునన్. శుక. ౪. ౨౨. చంద్రా. ౪. ౭౦.

**కురాసాని.** వి. ఒకానొకదేశము.

మ. అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహల్యన్ గురాసాని పు,చ్చలువో దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిం గీర్తిపు,ష్కలసస్యం బిడి యేకధాటి బలిరా కట్టించి తౌ దృష్టికే, దులఖానోగ్రకపాల మర్థపహరిద్భూభాంగలక్ష్మీశ్రేణికన్. ఆము. ౧. ౪౨.

కురాసానిగందవొడి = కురాసానిదేశసంబంధమైనబుక్కా.

ఉ. ఆనగరంబుగంధవహుఁ డంగడివీథుల నాడుచుం గురా,సానిపిసాళిగందవొడి సన్నపుఁగుంకుమపూవుఁబోఁచ లే,మేనియుఁ జొచ్చి యెత్తికొని యిచ్చకు వచ్చినత్రోవఁ బోవఁగా,నా వని కట్టి పెట్టి యొకఁడైన మఱుంగిడఁ డెంత ముద్దొకో. కకు. ౧.౧౩౯.

కురాసానియోమము=కురాసానిదేశములోఁ బుట్టుఓమము.

గీ. చనుఁ గురాసానియోమ మం చన యవాని, కాభిధ...అం.భా.౨.౫౭. ప్రబంధ.౬౪౦.

**కురాహము.** సం. వి. అ. పుం. నల్లనిపిక్కలును ఇంచుక తెల్లనివన్నెయుఁ గలగుఱ్ఱము. (కల్ప.)

**కురి.** సం. వి. ఈ. స్త్రీ. తృణధాన్యభేదము.

**కురిచీ(ర్చీ).** వి. (క. త. కుర్చి. హిం. కుర్సీ.) కూర్చుండుట కుపయోగించునున్నతపీఠవిశేషము.

సీ...పట్టివేళ్లసురఁటీలు మేలైవ్రేఁడికురిచీలు... రసిక. ౧. ౬౧.

కురిచీపీఁట=కురిచీవలె ఎత్తుకాళ్లు గలపీఁట. మృ.వి. ౩. ౭౫.

**కురిడి.** వి. లోపల నీరింకినకొబ్బెర. (శ. ర, బ్రౌ. 'కురిడీ' వాడుక.)

**కురిమిండ.** వి. ఒకవిధ మగునత్తగుల్ల, శంబూకవిశేషము.

సీ...నత్త,గుల్ల చుట్టుకుగుల్ల కురిమింద నాఁచుడుగవ్వ ముఱుండము కాకిచిప్ప. హంస.౪. ౧౮౬.

**కురిమిడి.** వి. మడిచుట్టు వేసినకట్ట, గనిమ. (శ.ర, బ్రౌ.)

**కురియించే,కురించే.** స. క్రి. (√ కురియు. ఇది కుదియించు,కుదించు-కదియించు, కదించు వంటిది.) ౧. వర్షింపఁజేయు, కురియఁజేయు.

మధ్యా. భూమి కనావృష్టి యైన... లేనదివ్యపృథుసాయకముల,సామజావలి నేయునట్లు మేఘసంచయముల నేసి, భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధిఁ బొంద.భార.ఆర. ౩.౨౦౮.

చ. ...వేలుపుం, గొమిరెలు కల్పభూజనవకోరకముల్ గురియించిరో యనన్. విక్ర. ౪. ౨౦౪.

క. పరుసఁదనము మెయి నరి గొనఁ, జోరఁ దగదది పొదుఁగు గోయుచొప్పగు విను పాల్గురియించుకొనఁ దలంచిన, నరయ వలదె గోవుఁ బ్రజయు నట్టిద యధిపా. భార. శాం.౨. ౨౯౯. (ఇట 'పుష్కలముగా నిచ్చునట్లు చేయు' అని భావము.)

ఉ. అంతఁ బతివ్రతాగుణమహత్త్వముఁ జూచి సురల్ ప్రమోదిత,స్వాంతత యొప్పఁ గ్రొవ్విరులవానఁ గురించిరి భామమీఁద ... భోజరా. ౫. ౩౨౩.

చ. ... దేవత లెల్ల వారిపై,సుకరముగాఁ గురించి రతిచోద్యముగా నమృతంపువర్షముల్. సీతా. బి. ౪. ౧౫౦.

**కురియు(ర్యు).** అ.క్రి. ౧. వర్షించు.

సీ. వలసినయప్పుడ వానలు కురియుట సస్యసమృద్ధి ప్రశస్త మయ్యె. భార.ఆది. ౫.౩.

క. మినుమినుకుమినుకు మనియెం, బెను మినుకుల బరణి ధరణి బిట్టూటాడెన్,వననిధులు విరిసెఁ గురిసెన్, గనగనగన మనుచు నిప్పుకలు గుప్పలుగన్. పాండు. ౫. ౧౭౭.

మ. చెవికిం గేలివసంతకోత్పలదళశ్రీలై కపోలంబులన్, నవకాలాగురుపత్త్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై, ధవళాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుల్, నవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్. శివరా. ౨. ౫౭. (ఇట 'అధికముగా వ్యాపించు' అని భావము.)

చ. ఉడుగక యేడురాత్రులు మహోద్ధతి వానలు గుర్యఁ జూచి...పద్మ. ౯. ౨౩౧.

ద్వి. శివదుందుభులు మ్రోయ దివిఁ బుష్పవృష్టి యవిరళంబై కుర్య నంత భర్గుండు. పండితా. దీక్షా.౪౭ పొ.

౨. (జీర్ణమైనగృహాదులు) ఉఱియు.

ఉదా: ఆయింటిపెణక కురియుచున్నది.

స. క్రి. వర్షింపఁజేయు, కురియించు.

వ. నందినియు...అంగవిక్షేపంబున నంగారవృష్టిఁ గురియుచు...భార. ఆది. ౭. ౧౦౬.

చ...వాఁ,డుపలమహోగ్రవర్షము నుమద్ధతిమైఁ గురిసెన్ గుమారుపై. నిర్వ. ౧౦. ౨౬.

సీ. పలుకంగ నేర్తురు పాటలాధరముల మొల్కలేనగవులు ముద్దు గురియ. భీమ. ౧. ౯౪. (ఇట 'అధికముగా కలిగించు'అని భావము.)

వ...విశ్వామిత్త్రు నతిప్రీతిం బూజించి వానికిని వానిసేనకును నభిమతంబు లైనయాహారంబులు గురియ నందిని యనుతేనహోమధేనువుం బంచిన...భార.ఆది. ౭. ౯౫. (ఇట 'అధికముగా నిచ్చు' అనిభావము.)

చ. సురలకుఁ గల్పభూరుహముచొప్పునఁ గోరినకోర్కులన్నియుం,గురియుదు వీవు నీలపమగోచర మిట్టిదనంగ...హరి.ఉ.౨.౧౫౬.

(ఇట 'అభీష్టార్థములను పుష్కలముగా నిత్తువు' అని భావము.)

మహాస్రగ్ధర... రుష నయ్యమరాగ్రేసరుం డంపమ్రబ్బుల్,ధృతిమై బాల్వానఁ గుర్యన్ ...అప్ప. ౪. ౨౩౩ పొ.

జ: కురియించు.

**కురీరము.** సం. వి. అ. న. మైథునము.

కురుంటకము. సం.వి.అ.పుం. కురంటకము, పచ్చ గోరంటఁ.

కురుంటము. సం=కురంటము.

కురుంటి. సం.వి.ఈ.స్త్రీ. ౧.దారుపుత్తలిక, కఱ్ఱబొమ్మ. ౨. బ్రాహ్మణి, బ్రాహ్మణునిభార్య. (విల్సన్సు)

కురుండము. సం=కురుంటము.

కురుంబ. సం.వి.ఆ.స్త్రీ. ద్రోణపుష్పి, ఏనుఁగుతుమ్మిఁ.

కురుంబము. సం.వి.అ.న.జంబీర భేదముఁ.(వాచ.)

కురుంబి. సం.వి.ఈ.స్త్రీ. సైంహళీవృక్షము,సింహళపిప్పలిఁ.

కురుంబిక. సం.వి.ఆ.స్త్రీ. ౧.సైంహలి, సంహళపిప్పలిఁ.౨.ద్రోణపుష్పి,ఏనుఁగుతుమ్మిఁ.

కురుజే. వి. ౧. దూలము మీఁదిగుజ్జు.

చ....మదనచేతులచాతురి నెయ్యపుంగురుం,జువిదలు దార్చ విష్ణుపద మొత్తుఁ బురిꣳగృహలక్ష్మి నూత్నతꣳ. ఆము. ౨. ౧౭.

౨. (క.కురుజు) స్థిరరథము, రథమువలె ఎత్తుగా కట్టినయొకవిధమైనకట్టడము. (మంచె-శ.ర)

సీ. ...కురుజు నా స్థిరరథ మగు.ఆంభా.౨.౧౬.

చ.పసిఁడికురుంజులꣳ మెలఁగుబంగరుబొమ్మలఁ జూచు దేవతా,ప్రసవసుగంధులꣳ ధ్వజపరంపరఁ బిల్చి వివాహవీటికా,విసర మొసంగ ... వసు. ౫. ౬౬.

చ. అరు దటు చూడఁగా నమరె నంచులఁ గ్రందుగఁ గుందనంపుఁ బెꣳ, గురుఁజులమీఁదఁ దార్కొనినక్రొత్తగుపుత్తడిబొమ్మ లెల్లెడꣳ, సారిదిని ఁనిసోబనపుసొంపు గనుంగొన వచ్చినట్టియ,చ్చరపువుఁబోండ్లచందమునఁ జక్కఁదనంబులసొంపు పెంపునꣳ. యయా. ౪. ౧౫౩.

సీ. శృంగారము లెసంగ బంగారపు మెఱుంగుఁ బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుప.సారంగ. ౨. ౧౯౦.

ఉ. అప్పుడ వారు తీర్పరుల నందులకుꣳ సమకూర్ప జాళువా, యొప్పులకుప్పలై మెఱయుచుండెడు మేరువులుꣳ గురుంజులుꣳ,జప్పరముల్ వితానములు సర్వము నాయితపెట్టి ... విజ. వి. ౨. ౮౯.

విశ. (క. కుఱుజు) వామనుఁడు, గుజ్జు, పొట్టివాఁడు.

సీ. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక ...తింగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩. (బ్రౌ. పా.)

కురుకందకము సం. వి. అ. న. మూలకము, ముల్లంగిఁ.

కురుకు=కూరుకు. వి. నిద్ర.

గీ...కూర్కొన నిదుర నా నిద్దు రనఁగఁ, గురుకనఁగ నిద్ర ... ఆం. భా. ౧. ౧౪౧. (బ్రౌ. పా.)

కురుక్షేత్రము. సం. వి. అ. న. ఒకపుణ్యక్షేత్రము. (ఇది ఇప్పటిఢిల్లిప్రాంతమున నున్నది.ఇందే భారతయుద్ధము జరిగెను.)

కురుక్షేత్రయోగము. సం.వి.అ.పుం. ౧. (జ్యోతి) యోగభేదము. (ఒకసావనదినమందు తిథిత్రయము నక్షత్రత్రయము యోగత్రయము కూడి యుండుట.)౨.కురుక్షేత్రమందు మృత్యువు కలుగు ననిసూచించు గ్రహయోగభేదము.

కురుచిల్లము. సం. వి. అ. పుం. కర్కటము, పీత, ఎండ్రి.

కురుజాంగలము. సం=కురుక్షేత్రము. (వాచ)

కురుజే. వి. చిన్నకంట్లము. (శ. ర.)

కురుజే. వి. ౧. ఒకజాతి డేగ.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు, జాలె జలకట్టె కఱుజు వేసడము బైరి,కురుజా

నోరణ మను డేగకొలముసాళు,వములఁ బిలు
పుకు వేఁటకు వచ్చువాని. పి.శకుం.౧.౧౧౦.

౨. ఈఁకలు రాల్చినపక్షి.

గీ. గూఁటిగు వ్వన నణు జనఁ గురు జనంగ,నీఁ
కరాల్చినపక్షి యా నిందుమాళి. ఆం. భా.
౨. ౯౫.

3. ఒకవిధమైనబాణసంచు.

వ... కురుజులు కుండబిలుసులు సంపెంగపూల
బిలుసులు... మొదలైనబాణవిద్యలవైఖరులు
...హంస. 3. ౨౯.

**కురుజుతేనె.** వి. ఒకరకపుతేనె.(స్వచ్ఛ మైన తేనె.
బ్రౌ.)

గీ. కురుజు తేనెయుఁ గా దిది కుసుమరసము. శ
శాం .3. ౪3.

వ. ... మసురతేనె పూఁదేనె జుంటితేనె పుట్ట
తేనె కట్టుతేనె కురుజుతేనె...ప్రబంధ.౧౧౨.

**కురుటి.** సం. వి.న్. పుం. గుఱ్ఱము.

**కురుడి.** వి. (సంగీ) స్వరస్థాయిభేదము.

ద్వి. కురుడి మోడామోడి పారి రవాళంబు...అ
దిగా సాగయుతాయములు... బస. పు. 3.
౯౪౨ పం. ('కురడ మోడామోడి పారి ధు
వాలంబు' ప్రాఁతప్రతి.౭౧ పొ. ౧౪ పం.)

**కురుత.** వి. ఒకవిధ మైనచేఁప. (బ్రౌ)

**కురుతము.** సం. వి. అ. పుం. ౧. పెద్దవెదురుగంప.
౨. పెద్దధ్వని.

**కురునదిక.** సం.వి.ఆ.స్త్రీ. చిన్న యేఱు.

**కురుప.** వి. అజాజీవుఁడు,మేకలవాఁడు.

గీ. ... కురుప యనఁగఁ,దగును మేఁకలవానిపే
రు...ఆం. భా. ౨. ౨౫౪.

**కురుపిశంగిల.** సం.వి.ఆ.స్త్రీ.గోధ,ఉడుము.

**కురుబిల్వము.** సం. వి. అ. పుం. పద్మరాగమణి,
కెంపు.

**కురుము**[1]=కురుము. వి.పసురోగవిశేషము. వస. ౧.
౪౧ పొ. ౧ పం.

**కురుము**[2]. వి. (క.కుఱుంబ,కుఱుబ.) ౧. గొఱ్ఱెబొ
చ్చుతో కంబళ్లు నేయుగొల్లజాతి.
ఉదా: కురుమవాఁడు. (శ. ర.)
౨. నిడు పైన గొఱ్ఱెబొచ్చు. (బ్రౌ)
కురుమపొట్టేలు = దేహమునందు నిడుదబొచ్చు
గలమగగొఱ్ఱె. ప్రబంధ. ౧33.

**కురుమము.** సం.వి.అ.పుం. ౧. శిల్పి.౨.భాజనము,
పాత్రము. (కే.ని.)
కురుమగొఱ్ఱె=దేహమునందు నిడుదబొచ్చు గల
గొఱ్ఱె. (చి.ని,బ్రౌ-కురుపగొఱ్ఱె-శ.ర.)

**కురురాజు.** సం.వి.అ.పుం. దుర్యోధనుఁడు.

**కురురాట్టు.** సం.వి.జ్.పుం.దుర్యోధనుఁడు.

**కురులము.** సం. వి. అ.పుం. ఫాలస్థితచూర్ణకుంతల
ము, ముంగురులు.

శ్లో. తే లలాటే భ్రమరకాః కురులా భ్రమరా
కాః. వై. ని. కే. ని.)

**కురులి.** సం.వి.ఈ.స్త్రీ.లక్ష్యవేధము,(విలుకాండ్రు)
బాణములతో లక్ష్యమును గుఱిచూచి కొట్టుట.
(కే.ని.)

**కురులు.** వి.బ.(సం.కురులః.ప్రా.కురిలో.క.కురుల్.
త.కుఱుళ్.) ౧.అలకములు;శిరోజములు,తలవెం
డ్రుకలు.

సీ. అలకలు కురు లన నలరును బహుతచే...ఆం.
భా. ౨. ౧౪౫.

సీ. ఇందుబింబముమీఁదికందుచందంబునఁ గురు
లు నెమ్మొగమున నెరసియుండ. భార. విరా.
౨. ౧3౮, ౧౫౬.

సీ ...కొదమతేఁటులఁ గేరుకురులవాఁడు.నీలా.
౧. 33.

సీ. కొప్పు మెల్లన విచ్చి కురులు చిక్కుడలించి
తల యంటె నేర్పుతోఁ బొలఁతి యొర్తు
యయా. ౪. ౯౯.

జ: కుఱువేరు.

కురువ. వి. (క. కుఱుప=కొండ.) మెరక, ఉన్నత స్థలము? (కొండమీఁద నేర్పడినకాలిత్రోవ. శ. ర, ప్ర.)

ద్వి. మెల్లన సాగుచు మెట్టుమెట్టుచును, గొల్ల ముల్ డిగ్గచుఁ గురువ లెక్కుచును.పండితా. పర్వ. ౩౭౮ పొ.

కురువకము. సం=కురవకము. (వాచ)

కురువడములు. వి. బ. ధాన్యవిశేషము.

సీ. నివ్వరుల్ ... కురువడాల్ కంటసరులు హంస. ౪. ౧౨౭.

కురువర్షము. సం.వి.అ.న.ఉత్తరకురుభూమి.(నవ వర్షములలో నొకటి.)

కురువిందము. సం.వి.అ.పుం.౧.కోలతుంగముస్తె, నిడుముస్తెకీ. ౨.మాషము,మినుములు. ౩. దర్పణము, అద్దము.౪.హింగుళము, ఇంగిలీకము.౫.వ్రీహివిశేషము. ౬.పద్మరాగమణి.

సీ. సలలితమత్తకోకిలలోచనద్యుతి నలరారుఁ గురువింద మనెడికెంపు. రత్నపరీక్ష. ౧౧.

కురువి(బి)స్తము. సం. వి. అ. పుం. పలమెత్తుస్వర్ణము, నాలుగుకర్షములయెత్తుబంగారము.

కురువు. సం. వి. ఉ. పుం. ౧. అజమీఢునిమనుమఁడగునొకచంద్రవంశపురాజు. ౨. ఒకానొకఋత్విక్కు. ౩. జంబూద్వీపమండలినవవర్షములలో నొకటి. ౪. అన్నము. ౫. కంటకారిక, వాఁకుడుకీ. ౭. ఒకదేశము. (కే. ని-ఇది డిల్లిప్రాంతమున నున్నది.)

కురువృద్ధుఁడు, సం.వి. అ.పుం. భీష్ముఁడు.

కురువేరు. వి. (కురులు+వేరు-క. కుఱువేరు.) కేశము, హ్రీబేరముకీ.

గీ. ... హ్రీబేరవాచకముగఁ, బొసఁగుఁ గురువేరనంగ...ఆం.భా.౨.౬౧.

సీ. కల్వారేకులమిద్దెఁ గావించి యాచుట్టుఁ గురువేరువడి గట్టి విరులతేనెఁ,బూసి...యమా. ౫. ౯౭. ఉ.రా. ౩. ౨౦౧.

కురూపము. సం.విణ. (అ. ఆ. అ.) వికృతరూపము గలది. వి.అ.న. వికృతరూపము.

కురూప్యము. సం.వి.అ.న. రంగము, తగరము.

కుర్కుటము. సం. వి. అ.పుం.కుక్కుటము,కోడి.

కుర్కురము. సం.వి.అ.పుం. కుక్క.

కుర్ణజము. సం.వి.అ. పుం. కులంజనవృక్షము,దుంపరాష్ట్రముకీ.

కుర్దనము. సం=కూర్దనము.

కుర్పరము. సం. వి. అ. పుం. ౧.కూర్పరము,మోఁచేయి. ౨. జానువు, మోఁకాలు. (మే.ని.)

కుర్వత్. సం. శతృ. చేయుచున్న.

కుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ) చేయుచున్నవాఁడు. వి. అ. పుం. భృత్యుఁడు, పనిచేయువాఁడు.

కుఱంగలి. వి. ఔ. సమీపము, చేరువ.

వ. అనిన గంధర్వుండు పెద్దయుం బ్రొద్దు విచారించి యిచ్చోటికిఁ గుఱంగట నుత్కచం బను పుణ్యతీర్థంబునం దపంబు నేయుచున్నవాని ధౌమ్యుం డనుబ్రాహ్మణుని...భార. ఆది. ౭. ౧౫౬.

చ...అక్కుఱంగట శోకజాస్రువులుఁ గోయను నేడ్పులు నుప్పతిల్లెడుఁ. జై.భా.౧.౫౩.

విణ. సమీపస్థము, చేరువైనది.

వ...ప్రభాసం బనుతీర్థంబునకుఁ జని యందులకు ద్వారావతిపురంబు కుఱంగలి యని వి ని...భార. ఆది. ౭. ౧౬౩.

క. చాలఁ గుఱంగటిమడుఁగుల,గాలాపు న్వేఁటలాడఁగా దొరకినబ,ల్మీలు చవిఁ దేల్చె నపుడా,పాలెంబునడిగినబక్కబంప్రొతులనుఁ.

కువల. ౨. ౧౦౯.

**కుఱకుఱ.** విణ. (√ కుఱ్ఱ) అత్యల్పము, మిక్కిలి తక్కువైనది.

క. కుఱకుఱవేలుపుఁదెఱవలఁ, జెఱపట్టినయటు లె తెలివి చెడి రామునితో,నుఱక పగ దెచ్చుకొంటివి,కొఱవిం దల గోఁకుకొనఁగఁ గోరెడుకరణిన్. అచ్చ. రా. సుం. ౫౦.

క. ఈకవితాదోషోత్కర, మేకడ నీ వొసఁగు మాడ్కి నియ్యక ఖలులౌ, నాకుఱకుఱదాత లకు మ,హాసుకవు లొనర్చుకృతులయందు వ సించున్. నరస. ౪. ౪.

క. పఱతెంచి వనము వెఱుకుటు, కుఱకుఱరక్క సుల నొక్కకొందఱఁ గేలన్, విఱుచుట యిటు చిక్కుట ని,న్నెఱుకపడం జూచు టకుఁ జుమీ దనుజేశా. రామా. ౬. ౨౩౪.

:**కుఱు.** విణ. (క. త. కుఱు-వృత్తియందు 'కుఱుచ' శబ్దముయొక్క అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. అచ్చులు పరమగునపుడు 'ఱ' వర్ణమునకు 'ద్విరుక్తటకారము' ఆదేశ మగును. ఉదా: కుఱుమొల్ల, కుట్టుసురు, మొ.) పొట్టి.

సీ...అరుణాయతాక్షుఁడై కుఱుగద్దబిల్లఁ బ్రకోష్ఠమునిచి. ఆము. ౪. ౫౭.

సీ. దూడలు పెనుమావకోడెలు కుఱు గాఁడిగిత్తలు...శుక. ౨. ౪౦౭.

క్రి. విణ. కొంచెముగా.

ద్వి. ముఱముఱమని పట్టుఁబుట్టంబు విడిచి,కుఱుమాసి యున్నట్టికోకను గట్టి. ద్వి. సారంగ. ౩౫పా. ౬౨౨ పం.

కుఱుమాపు(డు)=కొంచెము గా మాసినది.

సీ. నిసువుపై పసుపునూనియజిడ్డు లంటినచిటికమ్మికుఱుమాపుఁజీరతోడ. శుక. ౪. ౩౭.

క. వలపలిదిక్కున కించుక, మలఁగం గాఁ దుఱుమిడి కుఱుమాపుడుఁబుట్టం,బలవడఁ గట్టి జరఠవ,ల్కలమున నెవ్వేఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. భార. విరా. ౧. ౨౯౧.

వ... సంధ్యాకాలంబున మసకమసకచీకటిం గుఱుమాపుడుంబుట్టంబు ముసుంగువెట్టుకొని ...నైష. ౬. ౧౪౧.

**కుఱుకు.** వి. ప్రోగు, రాశి.

మ.కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబులై,పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపన్ బ్రస్తుతింపన్ సురల్.భార. ద్రో. ౪. ౭౩.

ద్వి. కొఱఁకులు మాని పక్షులు గూండ్లు సేరెఁ,గుఱుకులు గట్టె చీకురువాయు లడరె. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౪౨ పం. భార.స్త్రీ.౨.౩.

**కుఱుకొను.** అ.క్రి.త్వరపడు.(ఆంధ్రధాతుమాల.)

సీ. ...కుఱుకొని కుఱుఁగలి కుఱుపు వ్రణము... అప్ప. ౨. ౧౯౬.

**కుఱుగడ.** వి. (కుఱు+గడ) ఒకానొక యుద్ధసాధనము.

వ. ... విఱిగి పడినకుఱుగడలును...జై.భా.౫.౨౦.

**కుఱుచ.** వి. (క.కుఱు మ.) ౧.అచిర కాలము,అల్పకాలము.

వ....ప్రాణభయంబు మనుష్యుల మగువాకు నేఁడైన మీకు మఱునాఁడైన నవలినాఁడైనఁ దుద యుగాంతంబునం దైన నిడుపుగుఱుచలనెప్పుడుఁ దప్ప దంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి...ఆము. ౬. ౩౧.

౨. హ్రస్వ మైనయచ్చు.

క. కుఱుచలపైయరబిందులు, నెఱయఁగ నూఁదినను జెల్లు... ఆంధ్రభాషాభూషణము. ౫౬.

౩. అశ్వగతి భేదము.

చ. పతి యలతేజి నెక్కి నరపాలురు గొల్వ హయాధిరోహపాం,డితి సరిదాఁట్లు జోడనలు నిబ్బరమున్ రవగాలు వేడెముల్, జవనము

మీఁఱఁ జూపి కుఱుచల్ వడి నూకి మలంచి
వైచుచుఁ, జతురులు మెచ్చఁగాఁ జనియె
శైలనివాసులు ద్రోవ నూపఁగన్. చంద్రా.
౨. ౭౦.
సీ. ఇలమీఁదఁ దనయాజ్ఞ చెలియలికట్టగా నిలిపి
నగతిఁ గుఱుచలను మలఁచి. ప్రబంధ. ౧౮౪.
౮. న్యూనత, కొదవ.
సీ. ... లొచ్చు కొద కడమ, కుఱుచ యొచ్చెము
తగ్గు కొంచెము తక్కువ కుందు కొదవ లో
ను కొద్ది యనఁగ, మెఱయు న్యూనత పేళ్లు...
సాం. ని. మాన. ౮౦.
విశ. (వృత్తి యందు దీనికి కొన్ని యెడల అంత్య
వర్ణలోపము - చూ. కుఱు.) ౧. హ్రస్వము, పొట్టిది;
చిన్నది; లఘువు, చులుకనిది.
సీ. కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుకొన్నతఱ
టులు మఱి చుంచుతలలు నమర. భార. ఆర.
౧. ౩౦౦.
సీ. కుఱుచ కొట్ర కురుఁజు...గీ...అనఁగను వా
మనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩. సాం.
ని. మాన. ౪.
ద్వి. కుఱుచమంటల జీబుకొని యున్నకసవు,
చుఱచుఱఁ గమరంగ ... ద్వి. హరిశ్చ. పూ.
౨౨౩౧ పం.
ద్వి. నిను విచారింపక నీపుత్త్రి నైన, ననుఁ గుఱు
చగఁ జేసె నరనాథుఁ డనిన. రం. రా. ఉ.
౧౩౨ పా. ౪ పం.
కుఱుచలు ద్రొక్కు=చిందులు ద్రొక్కు, నర్తించు.
చ...హారముల్, కుఱుచలు ద్రొక్క ముంగురులు
గ్రొం జెమటన్ బదనెక్క వేలుపుం, దెఱవ
యొకర్తు చేదిజగతీపతికిన్ శిర సంటె వేడు
కన్. వసు. ౪. ౭౪.
కుఱుచ సేయు, కుఱుచకావించు = తక్కువప
ఱుచు.
వ...నీవును నాపలుకులు గుఱుచ సేయక నీపెం
పునుం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారు
నకు రథంబు గడప నియ్యకొని ... భార. వి
రా. ౮. ౨౯.
ఉ. సత్తుగ నోఁచ నెట్లుఁ బలిసంగతికిం బ్రతి
రూపమేని నా, చిత్తముపూనికం గుఱుచసే
సినసోలముతో డివన్ బ్రియో, ద్వృత్తవిశాల
వక్షమునఁ దే జెడునట్లుగ వ్రాసి చూపి నా,
యుత్తలపాటు మాన్పు మది నూఱడి వెన్నె
లచిచ్చు చొచ్చెదన్. కవిక. ౩. ౧౦౭. విక్ర.
౨. ౩౪.
శా...ఈబుడు తెంత న గ్గుఱుచకావింపన్ దను
న్నైత్తురే. అను. ౬. ౧౦౯.
జ: కుట్టారిక, కుట్టుసురు, కుట్టూపపు, కుఱుగడ,
కుఱుచపడు, కుఱుచపఱుచు, కుఱునువ్వు, కుఱు
పంది, కుఱుమట్టము, కుఱుమాఁడు, కుఱుముష్టి,
కుఱుమొల్ల.

**కుఱుచేపడు.** అ. క్రి. (√కుఱుచే) తగ్గు. (శ. ర.)

**కుఱుచపఱుచే.** స. క్రి. (√ కుఱుచేపడు) కుఱు
చపడఁజేయు.

(తగ్గించు)

గీ. వివృతవక్త్రంబు నూప నవ్వీరవరుఁడు, మఱి
పయోదముగతి మేను కుఱుచపఱిచి. భా.
రా. సుం. ౮౫.

**కుఱునువ్వు.** వి. (√కుఱు) తిలసస్య భేదము, చిన్న
జాతినువ్వుᳫ. హంస. ౮. ౧౭౭.

**కుఱుపంది.** వి. (కుఱు + పంది) వనవరాహ భేదము,
ఒకజాతి అడవిపంది. (ఇది జేనెఁడుపొడ నై పిడి
వెల్తి మూరెఁడునిడుదయై యుండును. పచ్చికమా
త్రము మేయును. చి.ని - 'ఒకవిధ మైనలేడి' అని
బ్రా.)

**కుఱుపు.** వి. (క. కురు. త. కురుప్పు.) అల్పవ్రణము.
గీ. వఱలుఁ గుఱు పనఁగాను నల్పవ్రణంబు. ఆం.
భా. ౨. ౧౨౯.

**కుఱుమట్టము.** విశ. (√ కుఱు) పొట్టిగాను పుష్టి

గాను ఉన్నది ('కుదిమట్టము' అని వా.)

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు ... కుఱుమట్ట పుఁబొట్టివడుగు కొంత నటించెన్. భాగ. ౭. ౪౩౭.

మహాస్రగ్ధర. మెఱుఁగారుంగోరఁ జిమ్మున్ మిడుఁగుఱు లెగయన్ మేదినీభృద్ద్రుషత్తుల్, కుఱుమట్టంబైనతోఁకం గొని విసరు వెసం గూలఁగా సాలపంక్తుల్ ... వరాహ. ౧౨. ౩౨.

ద్వి. ఉన్మత్తవేషంబు నొప్పుగాఁ దాల్చి, కుఱుమట్టపంగంబు కుంటిపాదంబు, పరికివిూసంబులు పల్లవెండ్రుకలు... ప్రభు. ౮.౧౮౮ పా. ౧౨ పం.

**కుఱుమాఁడు.** వి. (కుఱు+మాఁడు) ఇంటిమూలకప్పు. (శ.ర, బ్రౌ.)

**కుఱుముష్టి.** మి. వి.(√కుఱు) చిన్నజాతిముసిఁడిచెట్టు. ద్వి. సారంగ. ౨. ౭౦ పా. ౨ పం.

**కుఱుమొల్ల.** వి.(కుఱు+మొల్ల)ఒకజాతిమొల్లకీ.

సీ. ఘనసారగుణ యిదే కర్పూరపేటిక కుఱుమొల్లవిరు లివే కుందరదన. ఇందు.౬.౧౨౦.

**కుఱువు.** వి. ఊరువు, తొడ.

గీ. కుఱువు తొడ యన నూరువు పరఁగుచుండు. ఆం. భా. ౨. ౧౩౪.

వ...మఱియదియునుం గాక స్త్రీభాగంబైన డాపలికుఱు వెక్కక పురుషభాగంబై పుత్త్రారోహణయోగ్యంబైననావలపలికుఱు వెక్కితి గావున నాపుత్త్రునకు భార్య వగు మనిన... భార. ఆది. ౮. ౧౩౭.

గీ. పాణిపుటశీఘ్రపాత్త్రంబుఁ బాఱవైచి, కుఱువుపై నున్నకిన్నర నుఱుకఁ ద్రోచి. పాండు. ౪. ౧౩౬.

**కుఱ్ఱ.** విశే. ౧. చిన్నది, లేఁతవయస్సు గలది.

ఉదా: కుఱ్ఱవాఁడు, కుఱ్ఱది, మొ. (కొన్నిచోట్ల సమాసోత్తరపదముగా నుపయోగింపఁ బడినది. చూ. అల్లుఁగుఱ్ఱ, కొడుకుఁగుఱ్ఱ, మొ.)

వి. ౧. బాలుఁడు, పిల్లవాఁడు. ఆం.భా.౨.౧౧౭.

ఆ. కోరు మెద్దియైనఁ గుఱ్ఱ నీవు. భాగ.౫.౩౫౦.

౨. కొడుకు.

గీ. ఎన్నఁ గొమరులు కల్గక యున్నవారి, కింపు నందును నెమ్మది పొందదనుచుఁ, బుడమివేలుపుఁ బెద్దలు నుడువుచుందు; రట్లగుటఁ గుఱ్ఱ లేక నాకు నబ్బ వలయు. అచ్చ.రా. బాల.౪౧.

ద్వి. మాకుఱ్ఱఁ జూడక మముఁ గొని కాలు, శోకాగ్ని లాఱవు చూపవే వాని. రం.రా.అయో. ౧౨౪ పా. ౨౯ పం.

జ: కుఱకుఱ.

**కుఱ్ఱఁడు.** వి. బాలుఁడు, పిల్లవాఁడు.

క. గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ మీతాతయొద్దకున్ నీతండ్రుల్, వెఱ్ఱులు నీపై రరెయీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ కుధ మగున్. భాగ. ౯. ౨౧౪.

క. తొఱ్ఱులఁగాచిననందుని, కుఱ్ఱనిచరితామృతంబు గొనకొని చెవులం, జుఱ్ఱంగఁ దనివి గలుగునె. భాగ. ౧౦పూ. ౬౩౩.

విశే. చిన్నవాఁడు, లేఁతవయసువాఁడు. (చూ. కుఱ్ఱ. విశే.)

సీ. కొడుకుఁగుఱ్ఱఁడు చన్ను గుడువ కట్లుంట విచారించి మేదరసాని యపుడు. పరమ. ౧. ౧౩౯.

**కుఱ్ఱి.** వి. గోవు, ఆవు.

చ. ... రాజ్యముం, గొన నగునయ్య యిచ్చెడిపెకుఱ్ఱికి...భార.ఆది.౫.౧౦౧.

సీ. జగములు మూఁడును సంతోషమును బొందెఁ గుఱ్ఱులు చన్నులఁ గురిసెఁ బాలు. భాగ.౧౦పూ. ౯౪౦.

మత్త. ... నాలుగే న్నాఁడికుఱ్ఱుల నీఁడె పీనికిఁ

బాలు ద్రావుచు నుండఁగా౯. భార. ఆది. ౫. ౨౧౮.

గీ...గోవు కుట్టి,యావు నాఁగను ... ఆం. భా. ౨. ౨౬౨.

వలపులకుట్టి=కామధేనువు.

క. వనచరులనుజూచుచు నటఁ,జని జనపతి కాం చెనొక్కచక్కనియిట్టి౯, మునిపతిపెంపు డుబుట్టిని,వనమునఁ జరియించు వేళ వలపుల కుట్టి౯. పి. శకుం. ౨. ౧౮.

కుట్టు, అ. క్రి. (లే. కుట్టు) కూయు, అఱచు. (శ. ర, బ్రౌ.) వి. కూఁత.

సీ. పెల్లుగాఁ బొలుచుపూరేళ్ల కుట్టులసద్దు దొడ్డ యాబెళగువ్వ లొడ్డురవళి. చంద్రా. ౨.౮౧.

**కులంజనము.** సం=కులంజము.

**కులంజము.** సం. వి. అ. పుం. దుంపరాష్ట్రముశీ.

**కులంభర(లు)ఁడు.** సం. వి. అ. పుం.చోరుఁడు, కన్నపుదొంగ. (వాచ.)

**కులకంటకుఁడు.** సం. వి. అ. పుం. వంశమునకు కంటకమువలె బాధహేతు వైనవాఁడు.

**కులకము.** సం. వి. అ. న. ౧. నాలుగింటికి పైఁగా నుండి ఒకక్రియతో ముగిసెడు పద్యసమూహము. ౨. పటోలలత, చేఁదుపొట్లశీ. 3. సమూహము. ౪. అల్పసమాసములు గలగద్యబంధము. పుం. ౧. కాకేందువు, కాకితుమికిశీ. ౨. వల్మీకము, పుట్ట. 3. మరువకము, మరువముశీ.

**కులకరుఁడు.** సం.వి. అ.పుం. కులమునకు మూలపురుషుఁడు.

**కులకర్కటి.** సం.వి.ఈ.స్త్రీ. చిత్రకూటప్రాంతమందలి యొకజాతిదోసశీ.

**కులకుండలి.** సం=కులకుండలిని.

**కులకుండలిని.** సం.వి.ఈ.స్త్రీ. (తంత్ర)మూలాధారమందు ఆఁడుపామువలె నున్న శివశక్తి భేదము.

**కులకుఁడు.** సం.విశ.(అ.ఆ.అ) ౧.కులశ్రేష్ఠుఁడు.౨. శిల్పికులప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద.

**కులకుల.** వి. క్షుద్రక్రిములబాహుళ్యమును సూచించుటయందు దుపయోగింపఁబడుఅనుకరణము. (వ్యవ) వానితలనిండ పేలు కులకులలాడుచున్న వి. ఈపుచ్చుపండ్లలో పురుగులు కులకులలాడుచున్నవి.

**కులక్కము.** సం.వి.అ.పుం.కరతాళి,తాళమువేసెడి కంచువాద్యము.

**కులక్షయ.** సం.వి.ఆ.స్త్రీ.శూకశింబి,దూలగొండిశీ.

**కులగిరి.** సం.వి.ఇ.పుం.కులాచలము,కులపర్వతము.

**కులగురువు.** సం. వి. ఉ. పుం. కులాచార్యుఁడు.

**కులఘ్నుఁడు.** సం.విశ.(అ.ఆ.అ.) వంశఘాతకుఁడు, వంశమును నాశముచేయువాఁడు. (మనుష్యుఁడు)

**కులజము.** సం.విశ.(అ.ఆ.అ.) ౧.గొప్పకులమునఁ బుట్టినది,గొప్పకులముది.౨.కులక్రమమునఁ గలిగినది,వంశపరంపరలచే లభించినది.

**కులట.** సం.వి. ఆ.స్త్రీ.౧-కులము విడిచి పోవునది-అసతి, అంకుటాలు. ౨. పతివ్రత యగుభిక్షుకి.

**కులటి.** సం.వి.ఈ.స్త్రీ. మనశ్శిల. (కల్ప)

**కులటుఁడు.** సం.వి. అ.పుం-ఒకకుటుంబమునుండి మఱియొకకుటుంబమునకు వెళ్లువాఁడు- దత్తపుత్రుఁడు.

**కులతంతువు.** సం. వి. ఉ. పుం. వంశవర్ధకుఁడు, వంశమందుఁ బుట్టి సంతానముచే ఆకులమును వర్ధిల్లఁజేయువాఁడు.

**కులతిథి.** సం. వి. ఇ. పుం. స్త్రీ.చతుర్థి,అష్టమి,ద్వాదశి, చతుర్దశి-వీనిలో నే దేనియొకతిథి.(తిథులు కులము లనియు అకులము లనియు కులాకులము లనియు మూఁడువిధములు.ద్వితీయాదశమిషష్ఠ

లు తప్ప తక్కిన సరితిథులు కులతిథులు. పాడ్యమి మున్నగు బేసితిథులు అకులతిథులు. ద్వితీయాదశమిషష్ఠులు కులాకులతిథులు.)

**కుల(శ)త్థ.** సం. వి. ఆ. స్త్రీ. వనకులత్థము, అడవియులవలు. (పాఠాంతరము. కుసత్థ.)

**కుల(శ)త్థము.** సం. వి. అ. పుం. ఉలవలు. (పాఠాంతరము. కుళుత్థము.)

**కుల(శ)త్థిక.** సం. వి. ఆ. స్త్రీ. (పాఠాంతరము. కుళుత్థికా.) ౧. చక్షుష్య, కులత్థాంజనము. ౨. వనకులత్థము, అడవియులవలు. 3. ఉలవగింజవలె నుండుకాటుకరాయి.

**కులదీపకుఁడు.** సం. విశే. (అ. పికా. అ.) కులమును ప్రకాశింపఁజేయువాఁడు, కులమునకు వన్నె తెచ్చువాఁడు.

**కులదేవత.** సం. వి. ఆ. స్త్రీ. ఇలువేల్పు, కులక్రమముగా నుపాసింపఁబడు దేవత.

**కులద్రుమము.** సం. వి. అ. పుం. శ్లేష్మాతకము మొదలగువానిలో నొకటికి.

శ్లో. శ్లేష్మాతకః కరఞ్జశ్చ బిల్వాశ్వత్థకదమ్బకాః, నిమ్బో వటోదుమ్బరౌ చ ధాత్రీ చిఞ్చా దశ స్మృతాః. (వాచ.)

**కులనక్షత్రము.** సం. వి. అ. న. శతతార, ఆర్ద్ర, మూల, అభిజిత్తు - ఇవి తక్క మిగిలినవానిలోని సరినక్షత్రములలో నొకటి. (నక్షత్రములు కులము లనియు అకులము లనియు కులాకులము లని యు మూఁడువిధములు. భరణి, రోహిణి, పుష్యము, మఘ, ఉత్తర, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణము, ఉత్తరభద్రపద ఈ పదునొకొండును కులనక్షత్రములు. అశ్విని, కృత్తిక, మృగశీర్షము, పునర్వసువు, ఆశ్లేష, పుబ్బ, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, పూర్వభద్రపద, రేవతి ఈ పదుమూఁడును అకులనక్షత్రములు. ఆర్ద్ర, మూల, అభిజిత్తు, శతతార ఈనాలుగును కులాకులనక్షత్రములు.)

**కులనాశము.** సం. వి. అ. పుం. ౧. వంశముయొక్క నాశము. ౨. లొట్టియ, ఉష్ట్రము. (వాచ)

**కులపతి.** సం. వి. ఇ. పుం. ౧. వంశశ్రేష్ఠుఁడు. ౨. పదివేలశిష్యులను అన్నదానాదులచేఁ బోషించి యధ్యయనము చేయించు బ్రహ్మర్షి.

శ్లో. మునీనాం దశసాహస్రం యోఽన్నదానాదిపోషణాత్, అధ్యాపయతి విప్రర్షిరసౌ కులపతిః స్మృతః. (వాచ.)

**కులపత్త్రము.** సం. వి. అ. పుం. దమనకము, దవనముకి.

**కులపరంపర.** సం. వి. ఆ. స్త్రీ. వంశక్రమము.

**కులపర్వతము.** సం. వి. అ. పుం. కులగిరి. (ఇవి యేడు)

శ్లో. మహేన్ద్రో మలయస్సహ్యశ్శుక్తిమాన్ గన్ధమాదనః, విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః. (త్రి. ని.)

**కులపాలకము.** సం. వి. అ. పుం. ఒకజాతినారింజ, కమలాఫలముకి.

**కులపాలకుఁడు.** సం. విశే. (అ. లికా. అ.) వంశపాలకుఁడు.

**కులపాలి.** సం. వి. ఈ. స్త్రీ. కులవతి, కులస్త్రీ, మంచికులమును శీలమును గలయాఁడుది.

**కులపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. = కులపాలి.

**కులపుత్త్రుఁడు.** సం. వి. అ. పుం. వంశోద్ధారకుఁడగుపుత్త్రుఁడు.

**కులపురుషుఁడు.** సం. వి. అ. పుం. ౧. కులీనుఁడు, మంచికులమువాఁడు. ౨. కులమునకు మూలపురుషుఁడు.

**కులభార్య.** సం. వి. ఆ. స్త్రీ. సాధ్వి యగుపెండ్లాము.

**కులభృత్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గర్భిణికి చేయు పరిచర్య. ౨. వంశమును బోషించుట.

**కులము.** సం. విణ. (అ. ఆ. అ.) తిలకకుసుమపరిమళము గలది. (వై. ని.) వి. అ. న. ౧.వంశము, అన్వయము. ౨.సజాతీయప్రాణిసమూహము, తెగ. (ఉదా: విప్రకులము, పక్షికులము.) 3. గృహము, ఇల్లు. ౪.జనపదము. ౫. దేహము. ౬.ఋషులకు చేయుజలతర్పణము. పుం. ౧. తిలకపుష్పపరిమళము. (వై. ని.) ౨. మార్జాలము, పిల్లి. (కే. ని.)

**కులవంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్.) కులీనుఁడు, గొప్పకులమువాఁడు.

**కులవారము.** సం. వి. అ. పుం. మంగళవార శుక్రవారములలో నేదేనియొకటి. (వారములు అకులవారము లనియు కులవారము లనియు కులాకులవారము లనియు మూఁడువిధములు. ఆది సోమ, గురు, శని వారములు అకులవారములు. మంగళ,శుక్రవారములు కులవారములు. బుధవారము కులాకులవారము.)

**కులవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. వంశక్రమాగతమగు విద్య.

**కులవిప్రుఁడు.** సం. వి. అ. పుం.వంశక్రమముగా వచ్చినపురోహితుఁడు. (ఇట్లే: కులబ్రాహ్మణుఁడు, మొ.)

**కులవృద్ధుఁడు.** సం. వి. అ. పుం. కుటుంబమునందు పెద్దవాఁడు.

**కులవ్రతము.** సం. వి. అ. పుం. న. వంశపరంపరగా ఆచరింపఁబడువ్రతము.

**కులశ్రేష్ఠి.** సం. వి. న్. పుం. శిల్పికులప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. (అమరము)

**కులసంభవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మంచివంశమందుఁ బుట్టినవాఁడు, బీజ్యుఁడు.

**కులసత్త్రము.** సం. వి. అ. న. పిత్రాదిక్రమముగా సహస్రవర్షము లనుష్ఠింపఁ దగుయాగవిశేషము.

**కులసౌరభము.** సం. వి. అ. న. మరువకము, మరువము.

**కులస్త్రీ.** సం.=కులపాలి.

**కులహం(హుం)డకము.** సం. వి. అ. పుం. జలావర్తము, నీటిసుడి.

**కులాంకురము.** సం. వి. అ. పుం. కులముయొక్క ఉత్తరాభివృద్ధికి హేతువైనసంతానము.

**కులాంగన.** సం. వి. ఆ. స్త్రీ=కులస్త్రీ.

**కులాంగారుఁడు.** సం. వి. అ. పుం - కులమునకు బొగ్గువంటివాఁడు- వంశదూషకుఁడు, వంశమునకు అపకీర్తి తెచ్చువాఁడు.

**కులాయము.** సం. వి. అ. పుం. ౧. నీడము, పక్షిగూఁడు. ౨.గృహము, ఇల్లు.3.స్థానము,చోటు.

**కులాయిక.** సం.వి.ఆ.స్త్రీ-గూండ్లు కలది-పక్షిశాల, పశువు లుండుటకు కట్టినశాల.

**కులాలము.** సం.వి.అ.పుం. ౧.కుక్కుభము,గంపపులుఁగు, అడవికోడి. ౨. కౌశికము, గుడ్లగూబ. (హేమ. ని.)

**కులాలి.** సం.వి.ఈ.స్త్రీ.౧.కుల్థవిశేషము. (అమరసుధ.) ౨. వనకుల్థము,అడవియులవలు. (రా.ని.) 3. కుమ్మరవానిభార్య. ౪. కుమ్మరది.

**కులాలిక.** సం.వి.ఆ.స్త్రీ.౧.కుమ్మరిపెండ్లాము. ౨.కుమ్మరది.

**కులాలుఁడు.** సం.వి.అ.పుం. కుంభకారుఁడు,కుమ్మరవాఁడు.

**కులాహము.** సం. వి. అ. పుం. ౧.ఇంచుక పసుపువన్నెయు నల్లనిమోఁకాళ్లును గలఅశ్వము.౨.కృకలాసము, తొండ. 3. శాకభేదముసీ.

**కులి.** సం. విణ. (న్.నీ.న్.) మంచికులమువాఁడు.

వి.న్.పుం.కొండ.(వాచ)ఇ. పుం. చేయి. (శ్లో. కులిర్వాస్తో భుజాదళః.త్రి.ని.)ఇ,ఈ. స్త్రీ. కంట కారిక,వాఁకుడుకే. ఈ. స్త్రీ. పత్నియొక్క-జ్యేష్ఠ భగిని, వదినె. (వై. ని.)

కులింగదృక్కు. సం.వి.శ్.స్త్రీ. యక్షాక్షి,గచ్చచెట్టు.

కులికము. సం.వి.అ.పుం. ౧.ఒకానొక చెట్టు. ౨.అష్టమహానాగములలో నొకటి.౩.రవ్యాదివారము లందు వచ్చుదుష్టకాలము.

ఉదా: కులికవేళ, కులికకాలము.

కులికి(ల్క)ంచే. స.క్రి. (√కులుకు.) కులుకఁజేయు.

(ఒయ్యారముగాఁ గదల్చు.)

మ....గుబ్బచ,న్నులు గుల్కించు మెలంతలు౯ ...మల్లభూ. వైరా. ౫౬.

కులికుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) కులశ్రేష్ఠుఁడు.

వి. అ. పుం. ౧. శిల్పికుల ప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. ౨. సమానవంశమునఁ బుట్టినవాఁడు, జ్ఞాతి.

కులిరు. వి. (క. కుళిర్) చల్లఁదనము.

కులిరుగొను=శీతల మగు, చల్లఁబడు.

క. కొలవేసలు నెలదూఁడులుఁ,దలిరులు నీహార వారిఁ దడిపి నయమున౯, గులిరుగొన మేన నొత్తిరి,లలనలు పార్వతికి శీతలక్రియ లెలయ౯. కు. సం. ౫. ౬౨. (ప్రయోగాంతరము లేదు)

కులిశద్రుమము. సం. వి. అ. పుం. స్నుహి, జెముడుకే.

కులిశధరుఁడు. సం. వి. అ.పుం-వజ్రమును ధరించినవాఁడు-ఇంద్రుఁడు.

కులిశనాయకము. సం. వి. అ. పుం. సురతబంధ భేదము. (కులిశనామకము అని కొందఱు.)

కులిశము. సం. వి. అ. పుం. న-ఇంద్రునిచేతియం దుండునది; పర్వతములను పగులఁగొట్టునది-వజ్రాయుధము. పుం. ౧. మత్స్యవిశేషము. ౨. అస్థిసంహారవృక్షము, నల్లేరుకే.

కులీనకము. సం. వి. అ. పుం. వనముద్గము, అడవిపెసరకే.

కులీనసము. సం. వి. అ. న. నీరు. (వై.ని.)

కులీనుఁడు. సం.విణ. (అ.ఆ.అ.) ఉత్తమకులమునఁ బుట్టినవాఁడు.

కులుఁడు. సం.వి.అ.పుం.కులికుఁడు,శిల్పికుప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. (కల్ప)

కులుకము. సం. వి. అ. న. జిహ్వామలము, నాలుకపాఁచి. (త్రి. ని.)

కులుకు(ల్కు). అ. క్రి.(క.కులుకు.త. కులుక్కు)

౧. శృంగారముగా కదులు, నీటుగా కదలు, గునియు.

వ. ... చెదరినముంగురులు చక్క దువ్వుచు నల్లనల్లనం గులుకుచు...శకాం.౩.౨౧.

చ. బలువగపారువాపలుకు పల్కఁగ వచ్చునో కుల్క వచ్చునో, చెలువుని చెంగటం బకుని చెంగటఁ బోలెఁ గురంగలోచనా. శుక. ౧. ౪౪౦. ఇందు. ౫. ౧౦౩.

౨. మురియు.

క. కొండయనుఁగుఁగూఁతుఁ గలిసి కులికెడునో రకు౯. ఆచ్చ. రా. బాల. ౨౩. వేం. మా. ౧. ౬౭.

౩. ప్రకటమగు.

గీ. వాసుకి ననంతశక్తినివాసుఁ బిల్వ,నంపి యిట్లని పలికెఁ బ్రియంబు గులుక.దశా.౨.౧౭౭.

గీ. అనుచు నఖిలాంగశృంగార మభినుతించు, గతిఁ దులాకోటిమణికోటికాంచిదామ, కింకిణీగణకంకణాకీర్ణకలక,లారవమ్ములు గుల్క నొయ్యార మొలుక. సారంగ. ౨. ౪౩.

౪. ఒప్పు, ప్రకాశించు.

వ. ... సంక్రందనచందనగంధ్యలికఫలకంబునం గులుకుకర్పూరతిలకంబులోఁ దులఁదూఁగి ...ఉ. రా. ౪. ౧౬౩.

దరువు. ఉరమున వల్లకి గుల్క, నదియు హరినా మమే వరుసఁ బల్క. మృ. వి. ౧. ౧౩.

స. క్రి. ౧. వెదచల్లు, చిమ్ము; బయలుపఱుచు, ప్రకటించు.

(నరసింహస్వామి) చ...ద్విజవేషములోడ వచ్చె నా,గరదధిగంధముల్ గులుకుకట్టు ప్రసాదపుమాటలోడుతన్. పరమ. ౪.౨౨౭. (శ. ర. పా.)

సీ. కొదలుమాటలు లేనె గులుకుచుఁ బలుకుచో మోహనం బగువింతముద్దుఁ జెలువు. గీ. కలిగి ... కళా.౬.౧౯౬.

చ...చీకటుల్,గులికెడుసీలిడట్టి... కువల. ౪. ౨౦౨.

సీ. వలపులు గులుకుచెంగలువ క్రొవ్విరుల తేఁకులు గానరా నేసకొప్పు ముడిఁచి. వరాహ. ౩. ౧౧౧.

ఉ. భూవరముఖ్యుసన్నిధికిఁ బోయెడుమామిడి పండ్లపుట్టికల్, మోవఁగఁ గూలిఁ బుచ్చుకొని మాధతఁ గుల్కెడుగ్రామ్యచేష్టితం, శావహిలంగ నేఁగి...కళా. ౬. ౧౪౭.

౨. పోయు; వేయు.

సీ. గొజ్జంగపూఁదేనె కులికి మేదించినకమ్మఁగస్తురి మేనఁ గలయ నలఁదు. కాశీ. ౩. ౧౧౭. క్రీడా. ౪౩.

క. గంబూర కులికి...పన్నీటన్, బింబోష్ఠి యతనిపాదా,బ్జంబులు గడిగించెఁ గూర్మిసకియలచేతన్. సారంగ. ౨. ౪౪. విక్ర.౮.౯౬.

౩. కదలించు.

సీ. ఉబ్బుబుగ్గల నొక్కి యొయ్యనొయ్యనఁ గేలఁ గెమ్మోవిఁ గులికి సీత్కృతులు సలిపి. చంద్రా. ౨. ౪.

గీ.ఎట్టిగా నగ్నిఁ గాఁగినయినుపయిసుకఁ,గులికిపోయఁడు వీనిముక్కనను జెవుల. కాశీ.౩. ౧౪౨.

౪. రంగరించు.

గీ. పల్లఱును దేఁటిచిన్నిపాపలకుఁ గులికి, ప్రవ్వఁదేనియ నుగ్గులు పోసి పోసి. యయా.౪. ౨౪.

౫. పూయు.

చ. అలఘుతదీయఖేయముల నాడెడునన్నులగుబ్బచన్నులన్, గులికినయేణనాభినవకుంకుమసంకుమదాంకపంకసం,కలితవిలేపము ల్గరఁగి గమ్మని కమ్మనితావు లీన...హ. న. ౧. ౧౦.

౬. తాఁకించు ?

క. తల దలతోఁ దాఁకించినఁ,దల మీఱుం గాలు గాలఁ దాఁకించిన మి,క్కిలికాలు గలుగుఁ జేతులఁ, గులికినఁ దనచేయి మీఁ దగున్ ప్రేటునకున్. ఉ. హరి. ౬. ౧౦౬.

వి. ౧.శృంగారపుఁగుదిలిక.

గీ. దానితిన్నినునుఁబల్కు దానికుల్కు, దాని యొయ్యారమును మెచ్చి తాల్మి నిలుప, లేక వరుణుండుగూడ స్ఖలించెఁ దేజ, మదియు మునుపటిఘటమంచె యతివ యుంచె. ఉ. రా.౬. ౩౮౪.

వ. ... మేలి మైనకులుకుల రసికజనంబులమనంబుల మరులుకొలుపన్ జాలి... మను చ. ౫. ౧౦౧.

౨. విలాసము; అందము, ఒప్పు.

సీ. బిత్తరము కులుకు బెడఁగు...హొయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

సీ. ఫలభంగములు నేయుపనిఁ బూనెదరు గదా కులుకులా యివి మీకుఁ జిలుకలార. కృ. శకుం. ౨. ౨౧౯.

మ...ఏరా యధరామృతం బొసఁగి న న్నన్నింప రా యంచు దైన్యరసం బుప్పతిల న్నెలంత వలవంతం గుల్కులం జిల్కుపాం,డరగండ చ్యుతబాష్పధార కొనగోటన్ మీటుచుం బల్కుఁగన్. సారంగ. ౨. ౧౭౯.

చ...కులుకు చల్లెడుచూపులు...కవిరా. ౪.3౧.

(బ) కుమ్మరి కుండలపై చేయుశిల్పము. (ఒకవిధ మగునకిషీపని) హంస. ౪. ౧3.

విణ. ౧. శృంగారపుఁగుదిలిక గలది.

సీ. గుత్తంపుఅవిక దా హత్తకుండఁగఁ జేసి కల పంబు కులుకుగుబ్బలను బూయు. హంస. ౧. ౧౨౬.

వ. కొందఱు కులుకులాఁడులు తమకులుకుగుబ్బ లం బోలకున్న నీళ్లు మోయించి రనఁ జాలు జాలువాగిండ్లు పూని కెలంకులం గొలువు సే య...ఉ. రా. ౪. ౨౭౮.

సీ. వసివాళ్లు వాడెకువదనాబ్జములతోడ వలపుఁ దెల్పెడుకుల్కు తెలుఁగుతోడ. పరమ. ౪. ౧౦౧.

౨. మనోజ్ఞము, ఒప్పిదము, అందమైనది.

సీ. కులుకుఁబాయపురాచతలిరాకుఁబోఁడులు... నీలా. ౧. ౨౭.

సీ. నగుముద్దుమోమున మృగనాభితిలకంబు కులు కుడాల్ సిరులు ముంగురుల నొరయ.దశా.౧. ౭౧.

కుల్కుఁదనము=అందము.

గీ. కుందనముఁ గేరుచెక్కుకుల్కుందనంబు, ప ల్లవము నవ్వుచరణసంపల్లవంబు. చంద్రా.౪. ౧౨౪.

జ: కులికించు, కులుకులాఁడి.

కులుకు(ల్కు)లాఁడి. వి.(√కులుకు) విలాసములు గలస్త్రీ;స్త్రీ.

గీ. ... సింగార మొలుక ముద్దుఁ,జిలుకకడ ని ల్చెఁ గోమటికులుకులాఁడి. శుక.౧.౧౫౭.

వ. ... చిలుకలవలెఁ బలుక నేర్చినకొందఱు కు లుకులాఁడులు...ఉ.రా.౪.౨౭౮.

చ. ... అ,ప్పలుకులకుల్కులాఁడి నను భవ్యకవి త్వధురీణుఁ జేయుతన్. భోజసుతా. ౧. ౬. (పలుకులకుల్కులాఁడి=పలుకులవెలంది, స రస్వతి.)

కులుక్కగుంజ. సం.వి.ఆ.స్త్రీ. ఉల్కాగ్ని,కొఱవి నిప్పు. (కల్ప)

కులుప. వి. (త. కుసుప్పై=వాఁపు.) శోఫవ్యాధి, వాఁపు.

(వేశ్యామాతృవర్ణనము.)

ద్వి. వెలికుఱికినకండ్లు వ్రేలుచన్నులును, గులుప వట్టినమేను కోఁతి మొగంబు. ద్వి. పరమ.౪. ౭౯ పా.

కుల్మాషము. సం.విణ. (అ. ఆ. అ)శబలము,చిత్రవ ర్ణము గలది. (కే.ని.) వి.అ.న. కాంజికము, పులి యఁబెట్టిన కడుగునీరు. పుం. ౧. అలసందెలు,బొ బ్బరలు. ౨. మినుములు లోనగువానిగుగ్గిళ్లు. 3. కురువిందమణి.౪.యవపిష్టము.౫.సూపభక్తము, పులగము. ౬. శబలము,చిత్రవర్ణము. (కే.ని.)

కుల్యా. సం.వి.ఆ.స్త్రీ. ౧.కృత్రిమసరిత్తు,కాలువ. ౨. జలప్రణాళి, తూముకాలువ. 3. జీవంతిక,తిప్ప తీఁగె. ౪. నది,ఏఱు. (వై.ని.) ౫. సాధ్వి, క్రొ త్తడి. (హలా. ని.)

కుల్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సత్కులము నఁ బుట్టినది. ౨. మాన్యము, గొప్పది. 3. కుల మునకు హితమైనది. వి. అ. న. ౧. అస్థి,ఎముక. ౨. మాంసము. 3. శూర్పము, చేట. ౪. అష్టద్రో ణపరిమాణము.

కుల్లిమి=కుల్లెము. వి.ఒకజాతిమలుఁగుపాము, పాఁ పమీను. (బ్రా.)

కుల్లెము=కుల్లిమి. (బ్రా.)

కుళము. వి.(త.కుళమ్=చెఱువు)కొలను,చెఱువు.

గీ. ఇవి మహాశక్తు లివి జ్యోతు లివి మతంబు, లివి

య మణిమయపుండంతు లివి కుళంబు,లివి సు
వర్ణాశ్మసముదయం బివి తటంబు, లనుచుఁ
బేర్వేరఁజూపుచు నరిగి యంత. చెన్న. 3.
౮౫.

కుళాయ=కుల్లాయి.
మ. తలపాగంబట్టుకుళాయలుం దగుకునిద్దాయొం
ట్లు...దశా. ౭. ౧. ౩౩. ఉ. రా. ౫. ౨౭౦.

కుళాయి=కుల్లాయి.
గీ. పొత్తములు మేల్కుళాయి పల్ముత్తియం
పుఁ,బోఁగులును ... కల్గి ముంగిటికి వచ్చి,
నిలిచె వడి నొక్కనాఁడెంపు నేలవేల్పు. నీ
లా. ౧. ౬౦. ఆం. భా. ౨. ౧౫౫. భాను.
౮. ౬౦.

కుళి(లి)ంగము. సం. వి. అ. పుం. చటకము, పి
చ్చుక.

కుళి(లి)ంగి. సం. వి. ఈ. స్త్రీ. కర్కటశృంగి.

కుళీరము. సం. వి. అ. పుం. ౧.కర్కటము,ఎండ్రి.
౨. (జ్యోతి) కర్కటరాశి.

కుళీరము. సం=కుళిరము.

కుళుపు. వి. రాజావర్తమనుమణివిశేషము. (బ్రా.)
ఉంగరమునకు పొదిగెడువిశాల మగుమణివిశేష
ము. (శ. ర.)
చ. సరసిజసంభవుండు పురసారసగేహినికిన్ ర
చించున,చ్చెరు వగునీలపుంగుళుపు చెక్కిన
మేలిపసిండిముద్దుటుం,గర మన మింటితో
నొరయికన్ గనుపట్టెడు గోపురస్ఫుర,ద్గురు
తరశాతకుంభరుచిగుంభితసాలము వీట మీ
టుగన్. చంద్రా. ౧. ౮.

కుల్లా(ల్లా)=కుల్లాయి.
లయగ్రాహి...దోర,త్నాంగదము కుంకుమతరం
గముల గుప్ప జిగి వొంగుబురుసాపనిబెడం
గు గలకుల్లా, నింగికిఁ దళత్తళ లొసంగ ...
రా. వి. ౨. ౩౯.
శా. కుల్లా వెట్టితిఁ గోక సుట్టితి మహాకూర్పాస
ముం దొడ్గితిన్ ... తల్లీ కన్నడరాజ్యలక్ష్మీ ద
య లేదా నేను శ్రీనాథుఁడన్.(శ్రీనాథుని
చాటువు.)
గీ. ప్రబలు వస్త్రముకుటము కుల్లా కుళాయి,యనఁ
గ...ఆం.భా. ౨. ౧౫౫.

కుల్లాయి=కుళాయ, కుళాయి, కుల్లా, కుల్లాయ. వి.
(సం. ఖోలకః.క.కుల్లాయి.త.కుల్లా) చిన్నటోపి.
సీ. పరిజనంబులు వీఁచుసురఁటితెమ్మెరల బంగరు
ప్రాఁతకుల్లాయికళలు గదల.చంద్ర. ౨.౯౩.
ద్వి. తల యున్నఁ గుల్లాయి తగిలింపవచ్చు. ద్వి.
సారంగ. ౧. ౧౯ పా. ౧౨ పం.

కుల్లాయ=కుల్లాయి.
క. తల గలిగినఁ గుల్లాయలు, గల వేవగనైన నీవు
గలిగినఁ దాదృ,క్కులరవము లెన్ని యైనం,
గలిగెడుఁ బోకు మని యడ్డకా ల్వేయంగన్.
సారంగ. ౨. ౧౬. (శ.ర. పా-కుల్లాయులు.
ముద్రి.)

కుళ్లు=క్రుళ్లు. అ. క్రి. ౧. (కాలాతిక్రమణముచే
ఫలాదులు) చెడు, పాడగు.
ఉదా: మామిడిపండు కుళ్లినది.
గీ. రాజముఖులార వరముఖాంభోజలార,చారు
బిసబాహులార రంభోరులార, కందఁగా
నేల ముడుఁగుచుఁ గుంద నేల,కుళ్లఁగా నేల
తలవంపుగొళ్లవేల. చంద్రా. ౮. ౨౫౭. (రెం
డవయర్థమునకుఁ గూడ ఇది యుదాహరణ
ము.)
౨. (మనస్సులో) దుఃఖించు, తపించు.
ఆ. కొండఱాళ్లు దెచ్చి కోరికఁ గట్టిన,గుళ్లలోనఁ
దిరిగి కుళ్ల నేల,పాయ రానిశివుఁడు ప్రాణి
గానై యుండంగ. వేమన. ౨. ౧౮౯.
వి. ౧. చింత, అంతస్తాపము.

(వ్యవ) ఆకుల్లుతో వాఁడు సగమయి పోయినాఁడు.

౨. కాపట్యము, కాలుష్యము.

ఉదా: వాఁడు మనస్సులో కుల్లుపెట్టుకొని మాటలాడుచున్నాఁడు.

3. కుల్లినపదార్థము; మాలిన్యము.

(వ్యవ) ఆతూములో కుల్లు అంతయు తీసివేయుము. ఒడలికుల్లు. జట్టలకుల్లు.

విశ. కుల్లినది, చెడిపోయినది.

గీ. కుల్లుఁదిల్తికిఁ గవిసినకుక్క వోలె. రామలిం. ౧3.

**కుల్లుకుల్లు.** వి. దగ్గునప్పుడు కలుగుధ్వనియొక్క అనుకరణము.

గీ... కుల్లుకుల్లున దగ్గుకొనుచు,నుండు మనుజుండు జర తన్ను నిండ ముంప. శివధ. ౪. ౬౧.

**కుల్లుకొను=క్రుల్లుకొను.** అ. క్రి. (√కుల్లు-స్వార్థమున 'కొను') కుల్లు,(మనస్సులో)దుఃఖించు,పరితపించు.

సీ. గొటియమందల నించుకొననైతిఁగా యంచు గొల్లవాఁ డూరకే కుల్లుకొనఁగ. శుక. ౨. ౪౬3.

**కుల్లుపోతు=క్రుల్లుపోతు.** విశ. దుఃఖశీలుఁడు,మనస్సులో నెప్పుడును తపించువాఁడు. (శ. ర.)

**కువ=కువ్వ.** వి. (త. కువై.) ౧. కుప్ప, రాశి.

క. వివిధాస్త్రకోవిదుఁడు వా,సవి వానిరథంబుఁ బార్శ్ని సారథుల మహిం,గువలుపడ నేసె... భార. ఆది. ౬. ౧౨.

౨. పాఁతఱ. (బ్రౌ.)

**కువంగము.** సం.వి.అ.న. సీసము.

**కువకాలుక.** సం. వి. ఆ. స్త్రీ. ఘోలీశాకము, చేతరాసిక.

**కువకువ.** వి. కోకిలధ్వన్యనుకరణము.

చ. నునుఁజిగురాకు మేయుటతి నోరికెలంకులఁ దేటి గుట్టినన్, వనతరుశాఖలన్ గువకువ ధ్వనిఁ బాఱు పికాంగనన్ బికం, బనునయ మొప్ప మాన్పగతి నాత్మముఖంబు ముఖంబుఁ జేర్చి చుం,బన మొనరించె... మనుచ. 3. ౧౨.

**కువజ్రము.** సం.వి.అ.న. వైక్రాంతమణి.

**కువము.** సం.వి.అ.న. ౧.ఉత్పలము,కలువ.

**కువరము.** సం.విశ. (అ.ఆ.అ.) ఒగరు గలది.వి.అ. పుం. తువరము, ఒగరు.

**కువలము.** సం.వి.అ.న. ౧.ఉత్పలము, కలువ.

౨. బదరీఫలము,రేఁగుపండు. 3.ముత్యము.(మే. ని.) ౪. జలము. ౫.సర్పోదరము, పాముకడుపు. (వాచ.)

**కువలయము.** సం. వి. అ. న. ౧. ఉత్పలము,కలువ.

౨. నల్లగలువ. పుం. న. భూమండలము.

**కువలయాపీడము.** సం.వి.అ.పుం. ఒకయేనుఁగు. (ఇది కృష్ణునిచే చంపఁబడిన కంసునియేనుఁగు.)

**కువలయాశ్వుఁడు.** సం.వి. అ.పుం. ధుంధుమారుఁడను రాజు.

**కువలయిని.** సం.వి. ఈ. స్త్రీ.నల్లగలువతీఁగె.౨.కువలయసమూహము.

**కువలయేశుఁడు.** సం.వి.అ.పుం.౧.కలువలఱేఁడు, చంద్రుఁడు. ౨.భూమండలాధిపతి,రాజు.

**కువలి.** సం. వి. ఈ. స్త్రీ. రేఁగుచెట్టు.

**కువలేశయుఁడు.** సం. వి. అ. పుం-నీటియందుఁ బరుండువాఁడు-విష్ణువు.

**కువాటము.** సం. వి. అ. పుం. తలుపు, కవాటము. (వై. ని.)

**కువాడము=కువ్వాడము, కువాళము**[1]. వి. ౧. కపటచేష్ట.

ద్వి. లోకంబులో లేనిలోటతాఁటకత్తె, నీకువా
డమ్ము లన్నియు మాకుఁ దెలియుఁ, గైకొని
మేఁకలఁ గాచిరా పొమ్ము, నీకంటె మిక్కిలి
నెఱజాణ నేను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౦౪
పం.

౨. కాపట్యము.

ఆ. నీకువాడ మెల్ల నిన్న రాతిరి గంటి, నమ్మ చెల్ల
నిన్ను నమ్మరాదు, నవ్వు గాదు రేయి నాప్ర
క్కలోనుండి, కలవరింప లేదె చెలుల నెల్ల.
శృంగారరాధామాధవసంవాదము. ౧. ౪౧.

కువాడి=కువాళి. (కువాడము+ఇ.)

ద్వి. క్రచ్ఛఱ ద్వీపాంతరంబుననుండి, వచ్చిన
యట్టికువాడివడ్రంగి, యవగడం బైనయా
యాలయం బిట్లు, నవరించె నని సవసవ గాఁ
గ వింటి. ద్వి. పరమ. ౭. ౫౨౩ పం.

కువాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పరులదో
షమును ప్రకటించువాఁడు. ౨. దుర్భాషలాడు
వాఁడు. ౩. కుత్సితవాదము చేయువాఁడు.

కువాళము[1]=కువాడము. వి. కపటచేష్ట.

చ. తెలిసితి హా యిదంతయును దేవరపట్టపుదేవి
కైతవం,బలసుతుఁ ౘాడి దప్పినను నాజ్ఞయొ
నర్పఁగ లంచ మిచ్చి వే, పిలిచి తలార్ల చేత
ననిపించిన దిట్టుల నీకువాళముల్, దెలియక
వెట్టిరాజ యిది లెస్స నిజం బని నమ్మినాఁడ
వే. సారంగ. ౩. ౨౦౭.

విణ. కపటి, కుత్సితుఁడు.

గీ. తాడిమ్రానుక్కు మీఱంగ నూడఁ బెఱికి,య
క్కువాళంపురక్కసుఁ డెక్కుకొన్న,యర
ద మఱపఱ లోనరింప నలిగి వాఁడు, వాని నె
న్నొసలుఱక నొవ్వంగ నేసె. అచ్చ. రా.
సుం. ౧౯౯.

జః కువాళి.

కువాళము[2]. వి. వాహనము లోనగువానిగొ సెన.

సీ... వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ,తనరుఁ గు
వాళ మంచనఁగ... ఆం. భా. ౨. ౧౪౯.

జః కువాళించు.

కువాళి=కువాడి. విణ. (కువాళము[1]+ఇ) మోస
గాఁడు.

చ... వేడ్కఁ గాఁ డగుచు నక్కట యాకొఱగా
మిచే మమ్మం, జెఱుప నుపాయ మెంచి యి
లు చేర్చెను దేవరసొమ్ముఁ దెచ్చి యీ,యఱ
వకువాళి యింత యురి యా నని కానక మో
సపోయితిన్. వైజ. ౪. ౯౫.

కువాళించు. స. క్రి. (√ కువాళము[2])- గొసెన
గాఁజేయు-కప్పు.

మ. ప్రకటస్నేహ మెలర్ప నాతనిపయిం బద్మా
వతీకాంత వా, లికక్రొవ్వాఁడి మెఱుంగుఁ
జూపుల నివాళించెన్ గువాళించుచున్. వి
క్ర. ౭. ౨౪.

కువాహలము. సం. వి. అ. పుం. లొట్టియ.

కువిందుఁడు. సం. వి. అ. పుం.తంతువాయుఁడు,
సాలెవాఁడు.

కువిచిలు. వి. మృత్పాత్రవిశేషము.(బ్రా). హంస.
౫. ౧౨.

కువృత్తి. సం. వి. ఇ. స్త్రీ. చెడ్డనడవడి.

కువృత్తికృత్తు. సం. విణ. (త్) కువృత్తిని చేయు
వాఁడు. వి. త్. పుం. పూతికరంజము, నెమిల
డుగు కీ.

కువేణి. సం.వి.ఇ,ఈ.స్త్రీ.మత్స్యధాని, చేఁపలబుట్ట.

కువేలము. సం. వి. అ. న. కువలయము, కలువ.
(కే. ని.)

కువ్వ=కువ. వి. ౧. రాశి, ప్రోగు.

వ... పెన్నెలఁ జెన్నలయ వెన్నెలకువ్వలమవ్వం
బున నివ్వటిల్లు తెల్లజల్లుల నుల్లసిల్లుబల్లిదంపు
జల్లి మెకంబులును... ప్రబంధ. ౧౪౬.

గీ. ప్రోక యనఁ బ్రోవనంగను బ్రోగు నాఁగఁ,గు
ప్ప యన రాసి యనఁగను గువ్వ యనఁగ,
రాశి యగు... ఆం. భా. ౨. ౧౦౧. అ. మ.
క. ౫. ౨౨౨ పా. ౨౮ పం.
౨. పాఁతఱ. (బ్రౌ)

కువ్వాడము=కువాడము. (శ. ర, బ్రౌ.)

కుశ. సం. వి. అ. పుం. న. దర్భ.ఆ. స్త్రీ.౧.గుజ్జుపుకల్లె ము, వాగె.౨.అరణి. (వై.ని.) 3.రజ్జువు,త్రాడు.

కుశపము. సం.వి.అ.పుం-దీనితో నీరు త్రాగుదురు-పానపాత్రము.

కుశము. సం.వి.అ.పుం. ౧.ఒకద్వీపము. ౨.యోత్ర ము, పలుపు. న. ౧. జలము. ౨. హ్రీబేరము,కురు వేరు. (కే. ని.)

కుశలప్రశ్నము. సం.వి. అ. పుం. క్షేమము నడు గుట.

కుశలము. సం.విశ.(అ.ఆ.అ) ౧.చతురము, నేర్పు గలది. ౨. క్షేమము గలది. 3. శుభమైనది. ౪. పుణ్యమైనది. వి. అ. న. ౧. క్షేమము. ౨. శుభ ము. 3. పుణ్యము. ౪.పర్యాప్తి,సమృద్ధి,పూర్ణత.

కుశలి. సం.విశ.(న్.నీ.న్.) కుశలము గలవాఁడు.

కుశస్థలము. సం.వి. అ.న. కన్యాకుబ్జదేశము.

కుశస్థలి. సం.వి.ఈ.స్త్రీ. ద్వారక.

కుశాంగుళీయము. సం.వి.అ.పుం.పవిత్రము,దర్భ లతో చేసినయుంగరము.

కుశాక్షము. సం.వి.అ.పుం. కోఁతి. (వాచ.)

కుశాగ్రబుద్ధి. సం.విశ.(ఇ)-కుశాగ్రమువంటిబు ద్ధిగలవాఁడు-చుఱుకైనబుద్ధి గలవాఁడు.

కుశాగ్రము. సం. వి. అ. న. దర్భమొన.

కుశాగ్రీయము. సం.విశ. (అ.ఆ.అ) కుశాగ్రము వంటిది, వాఁడి యైనది. (బుద్ధి, మొ.)

కుశాసనము. సం. వి. అ. న. దర్భాసనము.

కుశి. సం.వి.ఈ. స్త్రీ. ౧. ఫాలము,నాఁగటికఱ్ఱు. ౨.ఇ నుముతో చేసినవస్తువు. (కే.ని.) 3. భగ్నాస్థిబం ధము, విఱిగినయెముకలు అతుకుకొనుటకు కట్టిన కట్టు. (వై. ని.)

కుశిక. సం.వి.ఆ.స్త్రీ.౧.ఫాలము,నాఁగటికఱ్ఱు. ౨.గ వేధుక, అడవిగోదుమచెట్టు.

కుశికము. సం.వి.అ.పుం. ౧. నూనె మొదలగువాని మడ్డి. ౨. అక్షము, తాండ్రచెట్టు. 3. సర్జవృక్షము, మద్దిచెట్టు.

కుశికుఁడు. సం. విశ.(అ.ఆ.అ.) మెల్లకంటివాఁడు. వి. అ. పుం. ఒకానొకఋషి. (ఇతఁడు విశ్వామి త్రునితాత. వాచ)

కుశీదము. సం. వి. అ. న. ౧. కుసీదము, ధనము వడ్డి కిచ్చి బ్రతుకువృత్తి. ౨. రక్తచందనముచెట్టు.

కుశీలవుఁడు. సం. వి. అ. పుం. ౧. నటుఁడు. ౨. వంది, బట్టువాఁడు. 3. గాయకుఁడు. ౪. యాచ కుఁడు. ౫. వాల్మీకి.

కుశుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ౧. పాపిష్ఠుఁడు, కుత్సితకర్మము చేయువాఁడు. ౨. మత్తుఁడు, మ దించినవాఁడు. వి.అ.పుం.రామునిపెద్దకొడుకు.

కుశేశయము. సం. వి. అ. న- నీటియం దుండు నది-పద్మము, తామర. పుం. ౧. సారసపక్షి. ౨. కర్ణికారముచెట్టు.

కుషాకువు. సం. వి. ఉ. పుం. ౧.కోఁతి. ౨.అగ్ని. 3. సూర్యుఁడు.

కుషితము. సం. విశ. (అ. ఆ. అ.)జలమిశ్రితము, నీటితో కలపఁబడినది.

కుష్ఠకేతువు. సం. వి. ఉ. పుం. మార్కండిక,నేల తంగేడు చెట్టు.

కుష్ఠగంధి. సం. వి. ఇ. న. ఏలావాలుకము, నూఁ గుదోసచెట్టు.

కుష్ఠగంధిని. సం. వి. ఈ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరుకీ.

కుష్ఠఘ్నము. సం. విణ. (అ. ఈ. అ.) కుష్ఠవ్యాధి నిపోఁగొట్టునది. (ఔషధము.) వి. అ. పుం. ౧. హితావలికీ. ౨. ఖదిరము, చంద్రకీ. చేఁతిపాట్లకీ.

కుష్ఠఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. వాయువిళంగముకీ. ౨. కాకోదుంబరికకీ. ౩. వాకుచి, కారుగచ్చకీ.

కుష్ఠనాశిని. సం. వి. ఈ. స్త్రీ. సోమరాజి, కారుగచ్చకీ.

కుష్ఠనుత్తు(దము). సం. వి. ద్. స్త్రీ. భారద్వాజి, అడవి ప్రత్తిచెట్టు.

కుష్ఠము. సం. విణ. (అ.ఆ. అ.) భూమియందుండునది. వి. అ. పుం. న. ౧. వ్యాధివిశేషము. (ఇది పదునెనిమిదివిధములు గలది.) ౨. చెంగల్వకోష్టుకీ. (శే. ని.)

కుష్ఠసూదనము. సం. వి. అ. పుం. ఆరగ్వధము, రేలకీ.

కుష్ఠహంత. సం. వి. ఋ. పుం. హస్తికందము, ఒకవిధ మగుకందకీ.

కుష్ఠహంత్రి. సం. వి. ఈ. స్త్రీ. వాకుచి, కారుగచ్చకీ.

కుష్ఠహృత్తు. సం. వి. ద్. పుం. విట్ఖదిరము, దుర్గంధము గలచంద్రకీ. (వెలితుమ్మ. అనికొందఱు.)

కుష్ఠారి, సం. వి. ఇ. పుం-కుష్ఠమును పోఁగొట్టునది-౧. గంధకము. ౨. విట్ఖదిరము, దుర్గంధము గలచంద్రకీ. (వెలితుమ్మ అనికొందఱు.) ౩. చేఁతిపాట్లకీ. ౪. ఖదిరము, చంద్రకీ.

కుష్ఠి. సం.విణ.(న్.నీ.న్) కుష్ఠరోగము గలవాఁడు.

కుష్ఠితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కుష్ఠరోగము గలవాఁడు.

కుష్మలము. సం. వి. అ. న. ౧. ఛేదనము, కోఁత. ౨. ఛాదనము, కప్పుట. ౩.వికాసము,విరియుట.

కుష్మాండము. సం. వి. అ. పుం. ౧. కర్కారువు, గుమ్మడికీ. ౨. దేవతాగణవిశేషణము. ౩. భ్రూణము, గర్భపిండము.

కుష్మాండి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కర్కారువు, గుమ్మడికీ. ౨. ఉమ, నల్లఅగిసెకీ.

కుసి. వి. (క. కుసి.) మంచపుకోడు మున్నగువానిరంధ్రములలో చొనుపుటకు సన్నముగా చెక్కఁనపట్టె మున్నగువానిచివర, పట్టికాగ్రము; అవయవములసంధి.

సీ...కుసి కూచ మనఁ బట్టికాగ్రమై యలరుచుండు. ఆం. భా. ౨. ౧౬౪.

సీ. పసిబాలుఁ డగునాఁడ బండిరూపముదైత్యవీరునిఁ గుసులకు విఱుగఁ దన్నె. చిత్రభా. ౫. ౧౭౨.

క. కసరి పొదరిల్లు వెడలఁగ,నొస లొకతలిరాకు దాఁకె నునుగాడ్పునకు౯, భసలగుణ మెక్కుఁవెట్టఁగఁ, గుసుమశరాసనునివిల్లు కుసులకువిటిగె౯. కకు. ౧. ౧౭౯.

గీ. కొమ్ముతాఁకులఁ గుసులకుఁగూల మబ్బులు... చిక్కుఁవడక చరించు నం దొక్కఁకరటి.రా. వి. ౩. ౪౯.

కుసిగుంపు. వి. (√కుసి?) శ్రమము, బాధ.

ద్వి. అని తనకొంగు చయ్యనఁ జుట్టి పట్టి,కొని పోకు మని కుసిగుంపు గావింప. ద్వి. పరమ. ౭. ౫౪౫ పా. ౪ పం.

చ...నాకు నీ,కొలు వికఁ జాలు నన్నఁ గుసిగుంపులఁబెట్టు వధింపఁ జూచుఁ గే,వలనరకంబు గా కొలుచువారికి దుష్ప్రభుసంశ్రయం బిసీ. వేం. పంచ. ౧. ౪౨౯.

క. రుసివంటిదాన న న్నీ,కుసిగుం పొనరించి యేమి గుడిచెదు పాపం,బసివోలెఁ దాఁకు నిను

నే, నుసురన్నం జాలుఁ జాలు నోహో యను డుఁ. వేం. పంచ. ౧. ౨౫౨. (కుసిగుంపాన రించు=బాధపెట్టు.)

కుసిగుంపునడక=అలసగమనము, మందగమనము.

ద్వి. కుసిగుంపునడకలతో డెశాఁ పతలు,అసమాన గతి వచ్చి...అ. మ. క. ౫. ౨౩౬ పా. ౨౪ పం.

**కుసితము.** సం. వి. అ. పుం. జనపదము, దేశము.

**కుసితాయి.** సం. వి. ఈ. స్త్రీ=కుసిదాయి.

**కుసితుఁడు.** సం. వి. అ. పుం. వడ్డివ్యాపారమువలన బ్రదుకువాఁడు.

**కుసిదము.** సం=కుసీదము.

**కుసిదాయి.** సం. వి. ఈ. స్త్రీ. కుసిదునిపెండ్లాము.

**కుసిదుఁడు.** సం=కుసీదుఁడు.

**కుసిలించే=కుసులు.** అ. క్రి. (√కుసులు) అతృప్తిచే ఖేదపడు, మనోవ్యాకులత నొందు. (శ. ర, బ్రౌ.)

**కుసిలింత.** వి. (√ కుసిలించే) అతృప్తిచేఁ గలిగిన ఖేదము, మనోవ్యథ. (శ. ర, బ్రౌ.)

**కుసీద.** సం. వి. ఆ. స్త్రీ. ధనము వడ్డి కిచ్చి బ్రదుకు స్త్రీ.

**కుసీదము.** సం. వి. అ. న. వడ్డివ్యాపారమువలన జీవించుట.

**కుసీది.** సం. విశే. (న్. నీ. న్)=కుసీదుఁడు.

**కుసీదికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)=కుసీది.

**కుసీదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) వృద్ధిజీవి, వడ్డిచేత బ్రతుకువాఁడు.

**కుసుంబా.** వి. (సం. కుసుంభః. త. కుసుంబా.) కుసుంభవర్ణము, ఎఱుపు మించినపసుపువన్నె.

సీ. కనకపుష్పముల నొప్పినకుసుంబాపాగ రాణింపఁ గల్కితురాయి మెఱయ. వేం. మా. ౧. ౧౩౪.

ద్వి. పసిమి గుల్కెడుకుసుంబాపాగఁ జుట్టి,వెస బంగరపురంగువిరులంగి దొడిగి. మృ. వి. ౧. ౩౨.

**కుసుంభము.** సం. వి. అ. పుం. ౧. మహారజనవృక్షము, కుంకుమచెట్టు. ౨. కమండలువు. స. ౧. కుంకుమపువ్వు. ౨. బంగారు.

**కుసుంభరాగము.** సం. వి. అ. పుం. ౧. కుంకుమపూవుయొక్క ఎఱుపు. ౨. కుంకుమపూవువలనఁ గలిగినయెఱుపు. ౩. కుంకుమపూవువంటి యెఱుపు. ౪. నాయికానాయకులపూర్వానురాగభేదము, కుసుమపూవువన్నెవలె పైకి శోభించినను హృదయమున గాఢముగా లేకతుదకు వీడిపోవు అనురాగము. (నాయికానాయకులపూర్వానురాగము త్రివిధము:-౧. నీలీరాగము=పైకి మిగుల శోభింపకున్నను హృదయమున గాఢముగా నుండి ఎన్నటికిని చెడనియనురాగము. ౨. మంజిష్ఠారాగము=పైకి మిగుల శోభించునదియు ఎన్నటికిని చెడనిదియు నగుననురాగము. ౩. కుసుంభరాగము. చూ. ౪.అర్థము.)

**కుసుని.** విశే. వామనుఁడు.

సీ. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక కుసుని... వామనాఖ్య దనరు. ఆం.భా. ౨.౧౨౩.(బ్రౌ. పా-కుసులి. ము ద్రి. పా.)

**కుసుమ=కుసుమము.** వి. (క. కుసుమ్బె.త. కుసుంబం.) ౧.ఒకజాతిపూలమొక్క. (బ్రౌ-ఒకజాతి చెట్టు. శ. ర.) ౨. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము.

సీ. గోదుమ పెదనువ్వు కఱునువ్వు తెలినువ్వు కుసుమ వెల్లగిసెయు గోఁగు జనుము. హంస. ౪. ౧౨౭.

౩. సస్యకుసుమము, సుంకు.

సీ. సస్యకుసుమసంజ్ఞ చను సుంకనంగను గుసుమ నాఁగను...ఆం. భా. ౨. ౨౩౭.

౮. (సం. కుసుంభః) కుసుంభవర్ణము, ఎఱుపు మించినపసుపువన్నె.

మ. కుసుమం జెట్టినచీరకొంగు వొలయం గ్రొవ్వారుఫాలిండ్లపైఁ, ద్రిసరంబుల్ పొలుపార ...క్రీడా. ౮౬.

గీ. కుముదకేదారముననుండి క్రొత్తవిరియు, కమలషండంబులకు వేడ్కఁ గాఁపువచ్చు, కొదమతుమ్మెదకడకెక్కఁ గుసుమవెట్టె, నభినవం బైనప్రథమసంధ్యాగమంబు. నైష. ౮. ౫.

౫. పుండునందలి మెలక. (బ్రౌ.)

కుసుమపూవు=కుసుంభపుష్పము.

సీ. కంకేళిచిగురాకు గర్ణపూరముఁ జేసి కుసుమపూవులధూళి కురులఁ దాల్చి. ౫. ౩౭.

సీ. కుసుమపూ వనఁగఁ దగును గుసుంభాభిధ... ఆం. భా. ౨. ౧౬౧.

జ: కుసుమపూరాజనాలు.

**కుసుమధన్వుఁడు.** సం. వి. న్. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

**కుసుమపురము.** సం. వి. అ. న. పాటలీపుత్ర మనుపట్టనము.

**కుసుమపూరాజనాలు.** వి. బ (కుసుమపూ+రాజనాలు.) ధాన్యవిశేషము. హంస. ౮. ౧౨౭. ప్రబంధ. ౧౧౨.

**కుసుమము**=కుసుమ.

(ఎఱ్ఱరంగు.)

క. కుసుమం బద్దినవిధమునఁ, బసుపున హత్తించినట్లు బంగారమునం,బసనిచ్చినగతి సంధ్యా,వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్. నైష. ౮. ౧౫౭.

చ. అలకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁప...మనుచ. ౬. ౩౧.

(బ) ధాన్యవిశేషము.

సీ. బలుతీఁగెమల్లెలుపార్జించితిమి చాలఁ గుసుమముల్ చులుకఁగాఁ గూర్పలేమె. కవిజ. ౧. ౧౩. ఆము. ౧. ౬౬.

**కుసుమము.** సం. వి. అ. పుం. న. ౧. పువ్వు. ౨. స్త్రీరజస్సు. ౩. ఫలము, పండు. ౪. నేత్రరోగవిశేషము, కంటిలో వేయుపూవు. (శే. వి.)

**కుసుమాంజనము.** సం. వి. అ. న. ఇత్తడిమలము నుండి తీయఁబడిపుష్పాకారముగనుండుకాటుక.

**కుసుమాకరము.** సం. వి. అ. పుం. ౧. తోఁట. ౨. పూగుత్తి. ౩. వసంతర్తువు.

**కుసుమాగమము.** సం. వి. అ. పుం. వసంతర్తువు, ఆమని.

**కుసుమాధిపము.** సం. వి. అ. పుం. చంపకము, సంపెఁగ.

**కుసుమాలుఁడు.** సం. వి. అ. పుం. దొంగ. (కల్ప)

**కుసుమాస్త్రుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

(ఇట్లే: కుసుమాయుధుఁడు, కుసుమబాణుఁడు, కుసుమశరుఁడు, మొ.)

**కుసుమించే.** సం. అ. క్రి. పుష్పించు. (బ్రౌ.)

**కుసుమితము.** సం. విశ. (అ. ఆ. అ.) జాతకుసుమము, పువ్వులు పూచినది.

**కుసుమేషువు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, పుష్పబాణుఁడు.

**కుసురుకొను.** అ. క్రి. (త. కుసూర్=ఉపేక్ష, అలక్ష్యము.) ఉపేక్ష వహించు?

వ. అని తత్తిమి యడుగుచున్నరతిముఖవికారంబు గని మనసిజుండు మనంబునం గుసురుకొనుచుఁ జిఱునవ్వు నవ్వుచు నిట్లనియె. కు. సం. ౪. ౪౧౪.

**కుసులు**=కుసిలించే. అ. క్రి. అతృప్తిచే ఖేదపడు, మనోవ్యాకులత నొందు. (శ. ర, బ్రౌ.)

జ: కుసిలించు, కుసిలింత.

కుసుల్లు. వి.బ. దండకడియములు, స్త్రీభుజాలంకారములు. (ప్రా.)

సీ. అలికభాగమునఁ జింతాకువెడల్పుగఁ బొసఁగించుకొన్నవిభూతిరేఖ, సందిట నిరువంక నొందుపైఁడికుసుళ్ల నందంబు నొందురుద్రాక్షపూస. గీ. అమరజంగమురా లయ్యో నఖిలపల్ల,వావశీకృతసమ్మోహ యలయకోవ.శుక. ౨. ౩౨.

కుసువు. సం.వి.ఊ.పుం. గండుమూషకము, ఎలుక,వానపాము.

కుసూలము. సం.వి.అ.పుం. ధాన్యముపోసెడుగాదె; పాణక, మొ.

కుసృతి. సం.విశ.(ఇ) దుర్వ్యాప్తి కలవాఁడు, చెడ్డనడవడి గలవాఁడు. వి.ఇ.స్త్రీ. ౧. చెడ్డనడవడి,శాఠ్యము. ౨. ఇంద్రజాలము. (కల్ప)

కుస్తు. కుష్ఠరోగము.

సీ. ... కుష్ఠములు మనఁ గుస్టవఁ బులు మన విలసిల్లు...ఆం.భా. ౨.౧౨౫.(ప్రాఁత ప్రతిపా)

కుస్తరించే. స.క్రి. ౧. లాలించు, బుజ్జగించు.

గీ. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు,కుంజముల నీలకుంతలఁ గుస్తరించి, కంతుసామ్రాజ్య మేలించి...ఆము. ౬. ౧౩౪.

వ. ... కందంబుఁ జఱచి మొగంబు దుడిచి ప్రస్తుతులఁ గుస్తరించి...మనుచ. ౪. ౧౧౪.

౨. ఊఱడించు, అనునయించు, ఓదార్చు.

గీ. కూఁతు నొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి... వేం. పంచ. ౪. ౩౩౩.

గీ. పారలి యేడ్చుచు నుండ నబ్బోటు లేల,కన్నెపడెదమ్మ యని యెత్తి కుస్తరింప. సారంగ. ౩. ౪౨. రం.రా. ఉ. ౧౩౨పా. ౭ పం.

౩. శాంతిపఱుచు.

ఉ. ఇంచుక ప్రొద్దుపోకడప నెవ్వరితో నుబుసేమి చెప్పుదు౦, బంచశరవ్యథం దలఁకుభావము నేగతిఁ గుస్తరింతు...విక్ర. ౬. ౩౮.

౪. సమాధానపఱుచు,ఒప్పించు.

గీ. సమ్మదంబున వసుమంతుఁ డుమ్మలించి, కూర్మిబంధుల నందఱఁ గుస్తరించి, గోలయుఁ బతివ్రతాధర్మశీల యగుచుఁ, బ్రాణపద మైన యిల్లాలిపజ్జఁ జేరి. శుక. ౧. ౯౮.

ఆ. దానిఁ బట్టఁ బూనువేజిబీజు గనుఁగొని,సానినిట్లు సేయఁ జనదు నాఁకఁ, గూర్మి మీఱ మీరు కుస్తరించిటు తోడి, తెచ్చి కూర్పవలయు నిచ్చలముగ. చంద్ర. వి. ౩. ౩౨.

౫. (లాలనార్థము) చఱచు, చేతితో తట్టు.

చ. కనఁదగు తెల్లమానికపుఁగవ్వల నొప్పెడుచప్పరాలలోఁ,దనపాడ పైనసిడఁ గని తాళకయేనుఁ గటంచుఁ గొమ్ములన్,జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసినము త్తెపుసింగపుంగమిన్, గనుఁగొని తాలు వేల్పువొరగా రలఁ డౌదలఁ గుస్తరింపఁగన్. యయా. ౧. ౭౭. (శ. ర. పా.)

గీ. మస్తకము దువ్వి పలుమాఱుఁ గుస్తరించి,సమరసముఁ జూపి మెల్లనె సముకుపఱచి, వాగె బిగియించి తమ్మినూల్ వాగె సడలి,పన్నెసోఁకిన ముందఱఁ బఱవ దయ్యె.చంద్రా.౩.౬౬.

౬. సేవించు.

గీ. కోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి, కుండలాముఖతీర్థంబుఁ గుస్తరించి, భీమమండలి దాపలఁ బెట్టుకొనుచు, గౌతమీగంగలవణాబ్ధిఁ గాఁగిలించె. భీమ. ౧. ౨౧.

౭. తాల్చు.

రగడ. కుటిలాలకములమీఁదఁ జిన్నిపువుఁ గుస్తరించు నచ్చుగ మణికర్ణిక. కాశీ. ౬. ౧౨౬.

సీ. సీమంతపథమునఁ జేర్చుచక్కఁ నవరించి మకుల పైఁ జిన్నిపూ గుస్తరించి. కాశీ. ౭. ౧౮౭.

౮. ఆచ్ఛాదనముచేయు, కప్పు.

సీ.హురుముంజినుత్యాలయొరగుపాగమెఱుంగు
నొసలిబిత్తరిబొట్టు మురుఁగువేయ, జాతినీల
పుఁదాళిచాకచక్యప్రభల్ కస్తూరినెఱివుఁ
లేఁగుస్తరింప. సారంగ. ౧. ౭౯.

౯. ఉల్లాసపెట్టు, సంతోషపెట్టు. (చూ. కుస్తరింపు.)

౧౦. ఆజ్ఞాపించు.

సీ. బిరుదువస్త్రాదులఁ జేర్వేర నాడాడ ముస్తాదు
గా నిల్వఁ గుస్తరించి. రంగా. ౨.౯౭.

జ: కుస్తరింపు.

**కుస్తరింపు.** వి.(√కుస్తరించే.)ఉల్లాసము.

ఉ.మారునిమాయపంపు దినమానము మేల్ సడలింపు జారిణీ,జారులకుస్తరింపు జలజంబులకుం
డలవంపు...కనఁగాఁదగెఁ జీకటిగుంపు పెంపుగాణ. ల. వి. ౪. ౪౧.

**కుస్తుంబరి.** సం.వి.ఈ.స్త్రీ.ధాన్యాకము,కొత్తిమిరి.

**కుస్తుంబురువు.** సం. వి. ఉ. న=కుస్తుంబరి.

**కుస్తుభుఁడు.** సం. వి. అ. పుం. ౧.విష్ణువు. ౨.సముద్రుఁడు.

**కుహ.** సం.వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి.

**కుహకజీవి.** సం. విశ. (న్.నీ.న్) మాయాజీవి.

**కుహకము.** సం. వి. అ. న-ఆశ్చర్యమును కలిగించునది-౧. ఇంద్రజాలము, మాయ. ౨. వంచన, మోసము.

**కుహకస్వనము.** సం.వి.అ.పుం-ఆశ్చర్యకర మగు ధ్వని కలది-కుక్కుటము, కోడి.
(ఇట్లే: కుహకస్వరము.)

**కుహకుఁడు.** సం. విశ. (అ.ఆ.అ.) ౧. ఇంద్రజాలికుఁడు. ౨. వంచకుఁడు, మాయకాఁడు.(వాచ.)

**కుహన.** సం.వి.ఆ.స్త్రీ. కపటచర్య,దంభచర్య.
(దంభముచే కావించుధ్యానమానాది.)

**కుహనము.** సం.విశ.(అ.ఆ.అ.) ౧. ఈర్ష్య గలది. ౨. మాయ గలది, వంచకము. వి. అ. పుం. ౧. ఎలుక. ౨. వల్మీకము, పుట్ట. న. ౧. ఒకరకముమట్టికుండ. ౨.కాచభాజనము, గాజుపాత్ర.(మే. ని.) ౩. మాయ.

**కుహరము.** సం. వి. అ. న. ౧. రంధ్రము, బెజ్జము. ౨. గుహ. ౩. కోటరము, తొఱ్ఱ. ౪. కంఠము, గళము. ౫. కంఠధ్వని, ఎలుఁగు. ౬. చెవి. ౭. సామీప్యము. (కల్ప.)

**కుహరితము.** సం. వి. అ. న. ౧. శబ్దము. ౨. పికాలాపము, కోయిలకూఁత. ౩. రతికూజితము.

**కుహళి.** సం. వి. ఇ. పుం. ౧. పూగపుష్పిక, వివాహాదులందు ఈయఁబడుతాంబూలము, మొ.(విల్యమ్సు)

**కుహాళ.** సం. వి. ఆ. స్త్రీ. కాహళి, బాకా.
శ్లో. కాహళీ తు కుహాళా స్యాత్. అ. పా. ప్ర. నాట్య. (శ. ర.)

**కుహికుహి.** సం. వి. ఇ. పుం. కాసరోగులు దగ్గునపుడు పుట్టెడుధ్వనియొక్క అనుకరణము.

గీ. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ, దనరు
ఘనకాసకుహికుహిధ్వనులవలన, భావజుఁడు
వెళ్లిపోయినపాడుమేడ, పగిదిఁ గాన్పించు
ముదుసలిపడఁతి యొకతె. కళా. ౩.౭౩.

**కుహుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**కుహువు.** సం. వి. ఊ. స్త్రీ. ౧. చంద్రకళ కానరానియమావాస్య. ౨. కోకిలధ్వని. ౩. హిమవత్పర్వతజాతనదీవిశేషము.

**కుహూకంఠము.** సం. వి. అ.పుం-కుహూ అనెడి ధ్వని కంఠమునఁ గలది-కోకిల.
(ఇట్లే: కుహూముఖము, మొ)

**కుహూలము.** సం. వి. అ. న. సశల్యభూమిచ్ఛిద్రము, గసికలు నాటినగుంట. (వాచ)

కుహేళి. సం. వి. ఈ. స్త్రీ. దట్టమైనమంచు,మూడ మంచు.

## కూ

కూ=కూయి.

(మొజ్జి)

ఆ. అకట యాఁడుకూయు నాలకూయును లాఁతి, వారికైన నరయ వలయు ననిన, నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు,మూడ నేర్చె ధర్మసూనుఁ డపుడు. భార. విరా. ౨. ౧౭౭.

జ: కూపెట్టు, కూయిడు.

కూఁక. వి. ౧. కూఁత.

ఉ. క్రొవ్వునఁ గూయుకోయిలలకూఁకలు శారికలాడుమాటలున్.సుక. చ. ౨. ౧౯. యయా. ౪. ౧౨.

౨. అఱపు, బొబ్బరింత.

గీ. తోఁక యల్లార్చి కేవునఁ గూఁకఁ బెట్టి, దోరణము డిగ్గి పోరికిఁ దొడరు నెడల. అచ్చ. రా. సుం. ౧౦౭.

3. ఆర్తధ్వని.

సీ.ఒకమూల డాఁగి మేదకులకూఁకలు విని కలఁగి పయ్యెద మేనిఁ గప్పువెలఁది. దశా. ౪. ౪౫.

(బ) చీవాట్లు.(చూ. కూఁకలువేయు.)

అరగూఁక పెట్టు=అర్ధక్రోశ ప్రమాణము.

గీ. ఇంక వణీశైలమునకు వైకంకమునకు,నడుమ బిల్వవనం బంత నిడుపు నెడలు,పునను గను పట్టుఁ బంకజవనము దాని, చెట్టులకు నెల్ల నరగూఁక పెట్టు పొడుపు.వరాహ. ౧౦.౧౨౬.

కూఁక(లు)పెట్టు=౧. అఱచు, బొబ్బపెట్టు.

క. ఆఁకట మలమలమాడుచుఁ, గూఁకలు వెట్టుచును బయటఁ గుపలయసురుల,ట్టాఁకల నుండఁగ నీకీ,వీఁకన్ భుజియింపఁ దగునె విప్రవరేణ్యా. శేష. ౧ ఆ. (శ. ర).

ఉ. ... దిశల్ వడఁ గూఁక వెట్టుచున్. రామా. ౮. ౧౯.

౨. కూయు.

క. సురగాలి యెదురు వీచెను,వఱ డొక్కటఁ గూఁకవెట్టె వసుమతి వణఁకెన్, ఉరగంబులు పొడచూపెను, హరిణసమూహంబు త్రోవ కడ్డము దాఁటెన్. మై. ౨. 3.

కూఁకలిడు=౧. కూయు.

గీ. తలిరుఁబోఁడులడెందము త్రుల్లడిల్లఁ, గూఁకలిడుకొంచు నెంతయుఁ గొంతలేక, యాగడంబునఁ బురి విచ్చి యాడెదేమి, యక్కటా నెమ్మి నీయాట యడవిఁ గలయ. నీలా.3. ౨౭.

౨. కేకలువేయు.

క. నాకొడుకును నాకోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం, గోక లెఱుంగక పాతినఁ,గూఁక లిడెన్ నీసుతుండు గుణమె గుణాఢ్యా. భాగ. ౧౦ పూ. 3౨౫.

కూఁకలువేయు=౧. (పిలుచుటకు) కేకలు వేయు.

సీ. తెరువడ్డుకట్టంగ మరునికింకరులకుఁ గూఁకలు వేయునో కోకిలంబు. పి. శకుం. 3. 3౫.

౨. చీవాట్లుపెట్టు.

ఉదా: వానిని నేను కూఁకలువేయుదును లే.

జ: కూఁకరించు, కూఁకవేటు.

కూఁకటి=కుంకటి. వి.(సం.కూటకః)౧.శిఖ,జుట్టు.

ఆ. వాఁడి యైనకత్తివాతి యమ్మునఁ గొని, పగతు శిరము చెక్కు లెగయ గొట్టెగి, నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లు గాఁ,గలయ నైదుగూఁకటుల నొనర్చె. భార. ఆర. ౬. ౨౫౦.(చూ. సం. భార. ఆర. ౨౭3. ౧౦, ౧౯.)

ఉ. ముద్దులమాటలున్ జిఱుతమోమున నున్నని లేఁతచెక్కులున్,గొద్దిగ నున్న నెన్నడుముఁ గూఁకటికందక ఫాలపట్టికన్,విద్దెము సేయు ముంగురులు వి ప్పగు ఱెప్పలగొప్పకన్నులున్, బ్రొద్దొకవింతయై యమరెఁ బుష్పసుగంధికి బాల్యవేళలన్. అని.౨.౨౧.

౨. నెమిలిజుట్టు, చూడ.

సీ. పురి యనఁ బింఛంబు మెఱయు జుట్టు సిక
మంచు సిగ కూఁకటన నుల్లసిలును శిఖ.ఆం.
భా. ౨. ౯౬.

3. జుట్టువెండ్రుకలు, శిరోజములు.

సీ. జడలయల్లిక యూడ్చి సంపెంగనూనియఁ
బిన్నకూఁకట్ల జొబ్బిలఁగ నంటి. హర. ౨.
౧౦౭.

4. కాకపక్షము, జుల్పా.

సీ. ఉదకబిందుకలాప ముట్టియుట్టిపడఁగఁ గ
ర మొప్పుముద్దుకూఁకట్లతోడ. కాశి. ౪.
౬౯.

శ్లో. లోయార్ద్రికాకపక్షాగ్రమ్. సం. కాశి.

సీ. కూఁకటి యనఁ జిప్పకూఁకటి యనఁ గాక
పక్షంబు...ఆం. భా. ౨. ౧౪౫.

5. కూఁకటివేరు, తల్లి వేరు.

ఉ.ఇత్తరశాక్షి మేనిజిగి యేలిక మేలిక డానిపైఁ
డి కీ,గుత్తపుగుబ్బలాఁడిజడ కూఁకటి చీఁక
టిమూలదుంప కీ, పుత్తడిబొమ్మకన్నుఁగవ
పోలిక వాలికగండుమీల కీ,బిత్తరిముద్దుసె
మ్మొగము పిన్నమ పున్నమచందమామకున్.
విజ. వి. ౨. ౧౧౮.

విణ. ప్రధానము. (చూ. కూఁకటివేరు.)

కూఁకటిప్రాయము = పిల్లజుట్టువయసు, లేఁబ్రా
యము.

క. ఈరీతి మనిరి క్రమమున, నారఘుకులతిలకు
లనుదినాభ్యుదయలీలనూ,చారిమఁ గూఁకటి
ప్రాయము, వారైరి గురుమాతృభక్తివశమాన
సులై. రామా. 3. ౧౪౭.

కూఁకటిరత్నము=చూడామణి, తలమానికము.

ఉ.చీఁకటికానచిచ్చు భవుచేలకుసుంభము తూ
ర్పుఁగొండకున్,గూఁకటిరత్న మబ్జరమకూరి
మిపంట చకోరరాజిపే, రాఁకటిమంట శో
ణకిరణావళిగంట రథాంగకేళికిన్, దేఁకువ
పెంట మింటఁ జనుదెంచె దినేంద్రుఁడు
కాలఘంటయై. కాశి. ౪. ౯౭.

కూఁకటివేళ్లతోఁ బెఱుకు=నిర్మూలము చేయు.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన
రాజవంశముం, గూఁకటివేళ్లతోఁ బెఱికి...
జై. భా. ౧. ౬౪.

కూఁకటుల్ గొలిచి చేయుట=జుట్లు(=తలలు)కొ
లిచి పెండ్లి చేయుట,వధూవరులు ఈడుజోడుగా
నుండునట్లు చూచి పెండ్లి సేయుట.

ఉ. ...కమనీయకౌతుక,శ్రీవిధిఁ గూఁకటుల్
గొలిచి చేసినకూరిమిసోమిదమ్మ సౌ,ఖ్యావ
హయై భజింప...మనుచ. ౧. ౫3.

జ: కూఁకటికువ్వె, కూఁకటిమువ్వ, కూఁకటి
మూఁగ, కూఁకటివేరు.

కూఁకటికువ్వె. (శ. ర-కూఁకటిగువ్వ. బ్రౌ.) వి.
(√ కూఁకటి) ఒకానొకపక్షి.

సీ. కూకటికువ్వె కుటాకకన్కు...గీ. అనఁగ ని
ట్లని పక్షిభేదాఖ్యలలరు. ఆం.భా.౨. ౯౭.
(కూఁకటిగువ్వ-ప్రాఁత ప్రతిపా.)

కూఁకటిమువ్వ. వి. (√కూఁకటి)ఒకానొకపక్షి,
ధూమ్యాటము.

సీ. ... ధూమ్యాట మెసఁగును గూఁకటిమువ్వ
నాఁ గూఁకటిమూఁగ యనఁగ. ఆం. భా.౨.
౯౧.

క. గువ్వలు కొంజులు కూఁకటి,మువ్వలు లావుక
లు కోళ్లు పూరేళ్లు మొదల్, క్రొవ్వినపులుఁ
గులగమి నో, ళ్లువ్విళ్లూరంగ నవ్వు దుర్విన్
ప్రాలెన్. ఇందు. ౨. ౭౦.

కూఁకటిమూఁగ. వి.౧=కూఁకటిమువ్వ. ఆం.భా.
౨.౯౧. ౨. భరద్వాజపక్షి. ఆం.సం.తిర్య.౧౫.

కూఁకటివేరు. వి. (√ కూఁకటి) పుంకటివేరు, తల్లి
వేరు.

క. ... మోహముఁ బట్టి తునుమాడక యీ,పిల్లలఁ
దునుముట కూఁకటి, వేళ్లుండన్ మునిఁడికొ
నలు విఱుచుట గాదే. ప్రబోధ.౫.3. పండి
తా. పర్వ. 3౧౨ పా.

**కూఁకరించు.** స. క్రి. (√కూఁక) కూఁకలు వేయు, చీవాట్లు పెట్టు.

సీ... లేఁచి వారలఁ గూఁకరించి పోవు. సత్య భామాసాంత్వనము. ౮. ౫౯.

**కూఁకవేటు.** వి. (√కూఁక) ఒకజాతిపాము.

సీ. కూఁకవేటులు చిల్మగులియలు త్రాఁచులు పె రజాలు గుఱ్ఱపుఁబెరజా లచటఁ. గీ. గలవు తక్కినజెఱ్ఱిపోతులును ... ద్వా. ౯. ౬౯. (కూటబెట్టు-బ్రా. పా.)

**కూఁకు=క్రుంకు.** అ. క్రి. అస్తమించు.

సీ. ... కూఁకె నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట. ఆం. భా. ౩. ౬౪.

ఆ. మూఁక గూడి ప్రొద్దు గూఁకుదాఁక. ష. చ. ౩. ౧౨౫. ఉ. హరిశ్చ. ౮. ౧౩.

**కూఁకుడు=కుంకుడు.** వి. (క. కూగటి.) కుంకుడు చెట్టు. (చి. ని.)

సీ. ... చీకిలేను కూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము. హంస. ౮. ౧౧.

**కూఁత.** వి. (√కూయు) ౧. అఱపు, కేఁక.

సీ. మొన్నఁ బారాశర్యముని కోట రాఁ గూఁత లెగయించి నెరవేఁకి యెత్తఁజేసె. కువల. ౨. ౯౦.

సీ. పాటఁ బాటిగఁ బాడి పరభృతమ్ముల లేఁచి కూఁతలు వేయించెఁ గొమ్మ యొకతె. చంద్రా. ౩. ౬౪.

౨. మొఱ, ఆర్తధ్వని.

వ...అట్లు కూఁత మట్టి పట్టుకొని...కళా. ౩. ౧౫౩. (కూఁతముట్టి = కూఁతననుసరించి వచ్చి.)

గీ. మొఱ్ఱ యన మొఱ యనఁగ వాపోక యనఁ గఁ, గూయి నాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు. ఆం. భా. ౧. ౧౧౫.

౩. ప్రలాపము, ప్రేలుడు.

చ. తలఁకక యోసి యేమిటికతల్ దల పెట్టినదాన విచ్చటం, దెలియము గాని ప్ప పెనుఁ ద్రిమ్మరికూఁతలదానవే కదా. కళా. ౫. ౫౦.

గీ. ఇచ్చినను నేమి వినయోక్తు లెఱుఁగ వలయు, గడుసుఁగూఁతల సత్కీర్తి గలుగఁబోదు. వేణు. ౫౪.

పోటుకూఁత=వీరాలాపము.

క. అని పలుక మఱియు నాతఁడు, మన సీయక యున్నఁ జూచి మంచిది పతిచే, నిఁదుని మించెద ననుఁ గనుఁ,గొనరా యని బోటి పోటుకూఁతలు వెట్టెన్. శుక. ౨. ౫౩౨.

సా: ఇతఁడు కూఁతకరణము గాని వ్రాఁతకరణము గాఁడు:- మాటలప్రోగు గాని పనిచేయ లేఁడని భావము.

కూఁతలిడు=కూయు.

వ...దుంపదూండ్లు మెసవి విసువక కూఁతలిడు కొదమరాయంచలును... నీలా. ౩. ౧౦.

కూఁతలువెట్టు=కేఁకలు వేయు, అఱచు.

ఉ. బందులఁ బట్టి చోరకులు బాధ యొనర్పఁగ ధారణీసురుల్, గుంది సమస్తసంపదలు గోల్పడి కానలలోన నుండఁగాఁ,గొంద ఱెక్కిం గి కట్టి వెసఁ గొట్టుచు భంగము లెల్లఁ జేయఁ గాఁ,గొందల మంది యేడ్చుచును గూఁతలు వెట్టెద రాలకింపుఁడీ. వి. పు. ౨. ౧౩౦.

**కూఁతకెదురు.** వి. (√కూఁత) శంఖము. (శ. ర.)

**కూఁతనేల.** వి. (√కూఁత) కూఁతవేటుమేర, కోసు నేల, క్రోశము.

సీ. ... కూఁతపట్టునేల యనంగఁ గూఁతనేల యనంగఁ గ్రోశము...ఆం. భా. ౨. ౬.

**కూఁతపట్టు.** వి. (√కూఁత.) కూఁతవేటుమేర. (శ. ర.)

**కూఁతపట్టునేల.** వి. (√కూఁత) కూఁతనేల, క్రోశము. ఆం. భా. ౨. ౬.

**కూఁతవేటుమేర.** వి. (√కూఁత)-కూఁతవేసిన చో వినఁబడునంతదూరము-కోసుదూరము.

సీ. బ్రహ్మర్షు లధివసింపఁగఁ గోరుకొనుచోట
వీటికోటకుఁ గూఁతవేటు మేర. గీ. విరివినగ
రు వినిర్మించె విశ్వకర్మ. కకు. ౨. ౮.

ఇట్లే: కూఁతవేటుదూరము.

సీ. విను మిచ్చటికిఁ గూఁతవేటుదూరంబునఁ
గల దొక్క హ్రదము నిర్మలజలంబు. హరిశ్చ.
౩. ౬౫.

కూఁతు=కూఁతురు. వి. (ఈశబ్దమునకు మొదట 'ఆఁడుశిసువు' అనునర్థమే యుండి కాలక్రమమున 'పుత్రిక' అనులాక్షణికార్థము కలిగినట్లు కనఁబడుచున్నది. ఇట్లే 'కొడుకు' శబ్దమునకు మొదట 'బాలుఁడు' అనునర్థమే యుండి పిదప 'పుత్త్రుఁడు' అనులాక్షణికార్థము కలిగినట్లు కనఁబడుచున్నది. ఈరెండుశబ్దములకుఁ గలరెండర్థములును భట్టారకుని కవిత్వమందే కానవచ్చుచున్నవి. ఇటీవల వీనిలాక్షణికార్థములే ప్రచారములోనికి వచ్చినవి.) ౧. ఆఁడుశిసువు, బాలిక.

వ. అంత నేము శిష్యగణంబులతోడ ... చని
యమ్మాలినీపులినతలంబున శకుంతరక్షితయైన
కూఁతును... ఎత్తికొని వచ్చి శకుంతరక్షిత
యగుటంజేసి శకుంతల యను నామం బిడి క
రంబు గారవంబునఁ బెనిచితిమి. భార. ఆది.
౪. ౪౭.

౨. పుత్రిక, కొమార్తె.

సీ. పడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల...
భార. ఆది. ౩. ౫౧.

మ. వినుమీ మానవనాథుకూఁతునకు నువ్విళ్లూ
రు నీరాజనం,దనుఁడు...దశకు. ౪. ౪౩.

సీ...గంధర్వనాథులకూఁతులు...హరి. ఉ. ౪.
౧౭౮. ఆం. భా. ౨. ౧౧౧.

కూఁతురు=కూఁతు. చూ. (ప్రాచీనశాసనములు పెక్కింటిలో నీశబ్దము గురురేఫయుతముగా నున్నది.) వి. ఔ. ౧. ఆఁడుశిసువు, బాలిక.
(చెలికత్తెలు సుగాత్రితో అనినమాటలు.)

ఆ. నలినవదన యెన్ని నాళ్లైనఁ జిన్నికూఁ,తుర
వుగావు నీవు తొడఁగి పతికిఁ, దగిననేవ
నేయ కగునె...కళా. ౪. ౬౭.

౨. పుత్రిక, కొమార్తె.

సీ...పుత్రికాహ్వాయ మొప్పఁ గూఁతు కొమా
రిత కూఁతు రనఁగ. ఆం. భా. ౨. ౧౧౧.

గీ. ఆతనూజుల కంచలి కనుజ యైల,తాంగి దు
శ్శల యనుకూఁతు రమరఁ బుట్టె.భార.ఆది.
౫. ౧౦౮.

ఉ...నీ,కూఁతురి నీయఁ జూడఁ గలుగుం గద...
పార్వ. ౫. ౭౨.

చ...ఇత్తు నీ,తనియనుజత్రయంబునకుఁ దక్కిన
కూఁతురులన్ భవత్కృపన్. రామా. ౪.
౮౬. (చి. ని. పా.)

౨. స్త్రీ, ఆఁడుది.

ఆ.కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి,నట్టి
పనికి నుచిత మైనసమయ,మొదవెఁ దడయ
టింక నొప్పదు...భార. ఉద్యో. ౩. ౧౮౮.

సా: కూఁతుర్లఁ గన్నమ్మకు కుర్చీపీఁటలు కొడు
కులఁ గన్నమ్మకు గోడపంచలు.

పెండ్లికూఁతురు=వధువు, పెండ్లికొమార్తె.

మ... పెండ్లికూఁ,తురిఁ గావించిరి పేరటాండ్రు
మహిభృత్పుత్రిన్ బ్రమోదంబునన్. కులశే
ఖరమాహాత్మ్యము. ౪ ఆ. (చి. ని.)

జ: కూఁతురుబుడమ.

కూఁతురు(రి)బుడమ. వి. (కూఁతురు+బుడమ)
ఏలావాలుకము, నూఁగుదోసకీ.

సీ... తెలియంగఁ దగును నూదోస రేణుకలు కూఁ
తురుబుడమన. గీ. వాలుకమ్మని...ఆం. భా.
౨. ౬౧.

గీ. బొల్లిపూసరయును సోమవల్లి చేఁతి,పొట్ల బి
ల్వంబు కూఁతురిబుడమ పెసలు,గాఁచి గుడ
మున లేహ్యపాకముగఁ జేసి,ఘృతయుతం బై
నఁ గాసలు క్రిందుపడును. చికి. (చి.ని.)

**కూకి(కీ).** వి. ౧. పారావతము, పావురము.

గీ. కూకివగపల్కు పల్కు బెళ్కుచును గుల్కు, నట్టె మెఱు వ్రాలు సుఖపులాహరిని సోలు, ముద్దులను బెట్టు దబ్బఱమోడి పెట్టు, నంత మెల్లఁగ గడిదేరి యాయొయారి. మల్లుపు. ౪. ౯౨.

గీ. పరఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు, పావురాలును బకదార్లు పావురములు, నాఁగఁ గలరవ పక్షిబృందముల పేళ్లు. ఆం. సం. తిర్య. ౧౩. అహ. ౩. ౧౯. వేంక. తిర్య. ౯౭.

౨. పారావతవిశేషము.

క. మేలైనలకోరీ లొ,డ్డీలున్...బకదార్లను గూ, కీలు ననెడు పేరులం దగినపార్వములన్. సారంగ. ౧. ౧౧౬.

సీ. పారావతంబగుఁ బావురాయి యనంగ ... తద్భేదములుగాను దనరుచుండును...ఒడ్డీకూకి బకదారిదూరబారు లనంగ...ఆం. భా. ౨. ౭౯.

కూకీపల్కులు=మణితధ్వనులు, రతికూజితములు.

సీ. మణితవాచకము లై మనుఁ బావురాపల్కు లనఁగఁ గూకీపల్కు లనఁగ...ఆం. భా. ౨. ౧౭౦.

**కూకు.** వి. ఆమిక్ష, పాలవిఱుగు.

సీ. ... ఆమిక్షసంజ్ఞ యై యలరుఁ గూకు, పాలవిఱుగు నాఁగ ... ఆం. భా. ౨. ౧౬౨.

జ: కూకులువత్తులగు.

**కూకుదుఁడు.** సం. వి. అ. పుం. అలంకృతురాలగు కన్యను వరునకు సత్కారపూర్వకముగా దానము సేయువాఁడు.

**కూకురుగుండఁగి**= కూకురుగుండె. (శ. ర, బ్రౌ, చి. ని.)

**కూకురుగుండె.** వి. దాత్యూహము, పక్షివిశేషము.

సీ. దాత్యూహసంజ్ఞ యై తనరుఁ గూకురుగుండె నాఁగ...ఆం. భా. ౨. ౯౩.

**కూకులువత్తులగు.** అ. క్రి. (కూకులు+వత్తులు+అగు). తుత్తునియలగు; చెదరు.

ఉ. క్రమ్మి చతుష్కరిం జముదు కాలువ లై ప్రవహింప రోమపుం, గుమ్మెలఁ బార్శ్వభూజములు గూకులువత్తులుగా ముఖంబునన్, దుమ్ములు రేఁగ మై మఱచి దున్నుచు ముస్తలఁ దేల్చి కుంజముల్, గొమ్ములఁ జిమ్ముదాని నొక ఘోరవరాహముఁ గాంచి యాత్మలోన్. వేం. పంచ. ౨. ౧౦౫.

ఉ. కుంభిరదప్రహారములఁ గూకులు వత్తులునైన మిన్ను...వేం. పంచ. ౧. ౪౯. (చి. ని. పా.)

ద్వి. నెట్టన నిప్పలు నిలిపెడుబుషుల, గుట్టు లన్నియును గూకులువత్తు లయ్యె, నిట్టి దుర్దశ రాకకేమి కారణము. ప్రభులిం. ౧. ౩. ౨౦పా. ౨౦ పం.

క. చిలువదళవాయు లప్పుడు, తలబీకనకాయ లై యథాయథ లై కూ, కులువత్తులు నై మొనకల, నిలువక శేషాహికడకు నెఱి చెడి పాఱన్. జై. భా. ౬. ౧౦౨.

**కూగు.** వి. (క. కూగు=కూఁత) కూఁతవేటుదూరము, క్రోసు?

ద్వి. కూగెంట నొక్కొకకూటంబు గలదు, యోగీంద్రసిద్ధనియుక్తంబు లవియు. పండితా. పర్వ. ౩౭౪ పా.

**కూచేము.** వి. (క. కూచ.) ౧. గుంజ, స్తంభము.

సీ. గందంపుఁగూచముల్ పొందించి కుసువేళ్ల నిలుపగాఁ గట్టినయట్టిమహిమ. రా. వి. ౩. ౭౧.

౨. కుసి, మంచము మున్నగువానిపట్టెయొక్క సన్నని చివర, పట్టికాగ్రము.

సీ. పట్టె యంచనఁ దగుఁ బట్టిక కుసి కూచ మనఁ బట్టికాగ్ర మై యలరుచుండు. ఆం. భా. ౨. ౧౮౪.

**కూచము.** సం. వి. అ. పుం. ౧. కుచము, స్తనము.
. (కల్ప)౨.హస్తి,ఏనుఁగు. (కే.ని.)

**కూచి**[1]**.** విశ. (క. కూచి.) ౧. విరిసినది, వికసించినది.

గీ. నల్లప్రజపై సరగ దండు వెళ్లఁ దలఁచి, రాజు వేయించు వెలిగుడారం బనంగఁ, దోఁచెఁ బాండిమ ప్రాచిఁ దోడ్తోన యందుఁ, గువలయదళమ్ము లప్పుడు గూచి యయ్యెఁ. సారంగ. ౨. ౧౬౧.

౨=కూచీ.(హిం. కూచ్) దండ యాత్ర. (చూ. కూచి చేయు.)

జ: కూచి చేయు.

**కూచి**[2]**.** విశ.(త.కూచ్చు) వాఁడియైనది,నిశితము.

ఉ. చూచుతఱి న్మనోభవుఁడు చొచ్చి పరస్పర వీక్షణంబు లన్,గూచి మెఱుంగుబల్లిలుకుఁ గోలలపాలయి నొచ్చి యెందు నా,హా చన లేనియానరవరాత్మజాలం జిగురాకుఁగత్తి చేఁ, గాచుట లేక యప్డు నటుక న్దోడఁగె న్వడి నజ్జునజ్జుగన్. చంద్రా. ౨. ౧౩౯.

౨. వాఁడిమి,శౌర్యము.

శా. ఔనే తార సెబాసు మెచ్చ వలె నాహా నీ గుణం బిం కిటన్, వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్న న్వానికిన్ శోకసం,ధానం బొందఁగఁ జేసినప్పుడు గదా నాకూచి లేకున్నచో, నేనే రంభనె యచ్చరల్ వొగడఁగా నీపేరువం బిల్వవే. కువల. ౪. ౮౭.

**కూచి.** సం.వి.ఈ.స్త్రీ.౧.కూచిక,తూలిక.(కౌముది) ౨.స్త్రీ. ౩. ఆఁడేనుఁగు. (కే.ని.)

**కూచిక.** సం.వి.ఆ.స్త్రీ.౧.తూలిక,చిత్రరువు వ్రాయు వాగలు. ౨. తాళపుఁజెవి.

**కూచి(చీ)చేయు.** అ. క్రి. (√కూచి[1]) దండువెడలు.

వ. ... అపు డుభయపార్శ్వవర్తులై బలసి కలసి కొలిచి యున్న చంద్రాదుల విలోకించి పయనంబై రండు పొండని పంచి కూచిసేయ నియమించి యంతఃపురంబుఁ బ్రవేశించి ... చంద్రా. ౩. ౪౨.

సీ. కూచిసేయింపఁగాఁ జూచె నందమె యేల చైద్యుఁ డెఱుంగఁడే శార్ఙలతిక, వెలిగుడారంబుల నిలిపె నందమె యేల బాణుఁ డెఱుంగఁడే బంధురగద. చంద్ర. ౪. ౧౨౪.

శా. రాచక్రంబున మేలుబంతి యనఁగా రాజిల్లునారాజు కూ,చీచేయించి సమంచితాత్మబలవత్సేనాసమేతంబుగా. రంగా. ౨. ౪౯.

ఇట్లే:-కూచిగావించు.

గీ. . . కూచిగావింప. . . రా. వి. ౨. ౬౭

**కూచిమతము.** వి.సాతాని మతములలో నొకమతము. (బ్రౌ.)

సీ.తనది కూచిమతంబు తమ్ముఁడు బౌద్ధుండు సర్వేశ్వరమతంబు షడ్డకునిది. వేఱు. ౬౯.

**కూచిమారము.** వి. పోకిరితనము. (బ్రౌ)

ద్వి. కుటిలకుత్సితములు కూచిమారములు, మటుమాయతనములు మందువ్రాఁకులును, నటమటంబులును మునై్నన చెయ్దములు. ప్రభులిం. ౨. ౪౦ పా. ౭ పం.

**కూచిమారుఁడు.** సం. వి. అ. పుం. ౧. పురుషజాతులు నాల్గింటిలో నొకజాతివాఁడు.

సీ. మన సీక మందుల మాయల మరగించి కారించు నాకూచిమారు నొల్ల. కు. సం. ౭. ౧౮౪.

౨. కామశాస్త్రగ్రంథకర్తలలో నొకఁడు.

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భముల్, పరిశీలించినవాఁడ . . . నైష. ౨. ౪౬.

**కూచీ**=కూచి[1]. (చూ. కూచిచేయు)

**కూజనము.** సం=కూజితము. (వై .ని.)

**కూజము.** సం. వి. అ. పుం=కూజితము.

**కూజే.** వి.(హిం.కూజా) పాత్రవిశేషము. (శ.ర)

**కూజితము.** సం. వి. అ. న. అవ్యక్తధ్వని.

**కూటకము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కపటమై నది. ౨. కల్లయైనది, నిజముకానిది. వి. అ. పుం. ౧. మురయను గంధద్రవ్యము. ౨. కఱి, కొప్పు. న.౧. నాఁగటిదుంప,గొడగ,ఏఁడికోల లేనినాఁగలి. ౨. ఫాలము, కఱ్ఱు.

**కూటకృత్తు.** సం. విణ. (త్) ౧. కపటము పన్ను వాఁడు, వంచకుఁడు. ౨. తప్పుపత్రము తప్పునాణెము లోనగు నవి కల్పించువాఁడు. వి.త్. పుం. ౧. కాయస్థుఁడు. ౨. శివుఁడు.

**కూటఖడ్గము.** సం.వి. అ. పుం. లోపలఖడ్గము గల కఱ్ఱ, కఱ్ఱకత్తి.

**కూటజము.** సం. వి. అ. పుం. కుటజము, కొండమల్లె.

**కూటపాకలము.** సం. వి. అ. పుం. ఏనుఁగులకు వచ్చెడి ఒకవిధ మగుజ్వరము.

శ్లో. అభిహన్తిహన్త కథమేష మాధవం,సుకుమారకాయ మనవగ్రహ స్స్మరః. అచిరేణ వైకృతవివర్తదారుణః, కలభం కఠోర ఇవ కూటపాకలః. మాలతీ. ౧. ౪౨.

**కూటపాలకము.** సం. వి. అ. పుం. కుమ్మరి ఆవము. (వాచ)

**కూటపాలకుఁడు.** సం.వి.అ.పుం. కుమ్మరి. (వాచ)

**కూటపాశము.** సం=కూటబంధము.

**కూటబంధము.** సం. వి. అ. పుం. బోను;వల;గాలము.

**కూటమానము.** సం.వి.అ.పుం. ౧.తప్పుతూనిక; తప్పుకొలత. ౨. తప్పుమానము. (తప్పుతూనికత్రాయి,తప్పుమానిక, మొ.)

**కూటమి.** వి. (√ కూడు[2]-క. కూట.త. కూటం.) ౧. కూడిక, చేరిక; స్నేహము, చెలిమి.

సీ. ఎలమిఁ బొల్పగుయూథికలకు సంతలకూటములకును మఱి విచ్చు మొగ్గ లొదవె. ఆము. ౪. ౧౨౩.

మ. ...ప్రకృతి నచ్చుం డైనసన్నాగ్ని యెన్నఁటికిన్ గూటమి వంకవచ్చు వికృతిన్ మన్నుండుగా నేర్చునే.మనుచ.౩. ౨౪. దశా.౨.౧౬౪.

౨. స్త్రీపురుషులకలయిక, సంభోగము.

గీ.చంద్రముఖిలోడి కూటమి జన్మఫలము.విక్ర. ౩. ౪౮.

చ. సరిపల పైనకూటమికి సాటిఁక లేదు గదా తలంపఁగన్. సారంగ. ౩. ౧౪౦.

గీ.కొఱలుఁ గవయుట కూడిక కూటమి కలయిక యనన్ రతి...ఆం. భా. ౨. ౧౭౮.

**కూటము.** (రూ. కూటాము. అని శ. ర, బ్రౌ). వి. (√కూడు[2]) ౧. చావడి.

క. ...భూపాల తిలకము వచ్చెన్ హితనృపకులకముతో భోజనంపుఁగూటంబునకున్. రా. వి. ౨. ౯౬.

క. చని యది వడ్డింపఁగ భో,జనకృత్యము దీర్చి యంత జలజాప్తుఁడు గ్రుంకిన దానికన్నుసన్నం,గని కూటములో వసించెఁ గంకటిమీఁదన్. శుక. ౨. ౪౨౪.

౨. కొలువుకూటము, సభాభవనము.

క. అలుకఁడు మృగమదమున మ్రుగ్గులు పెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గోడలు పూయుఁడు మణిదామకములు గట్టుఁడు పెద్ద కూటమున సొంపారన్. భార. ఉద్యో. ౩. ౧౪౨.

౩. కూటమి, స్త్రీపురుషులకలయిక, సంగమము.

క. చని తత్కేళీగేహం,బున నొకమగనాలికూటమునకై కనుగూ, ర్కనియొక్కజాములోనిం,పునఁ బొదలుచు నుత్తరంపుమాలి రమించెన్. శుక. ౩. ౭౧౨.

కేశవము. సం.వి.అ.పుం. పొన్నచెట్టు. (కల్ప)

కేశవర్ధని. సం.వి.ఈ.స్త్రీ. సహదేవీలతచెట్టు.

కేశవాలయము. సం.వి.అ.పుం.అశ్వత్థము, రావిచెట్టు.

కేశవావాసము. సం=కేశవాలయము.

కేశవుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) ప్రశస్తమైనకేశములు గలవాఁడు. వి. అ. పుం- కేశియనురాక్షసుని చంపినవాఁడు-విష్ణువు. (వాచ)

కేశవేశము. సం.వి.అ.పుం. కేశబంధము. (కొప్పు, సిగ, ముడి, జడ, మొ.)

కేశహంతృఫల. సం. వి. ఆ. స్త్రీ-రోమములను పోఁగొట్టుపండ్లు గలది-శమి, జమ్మిచెట్టు.

కేశహస్తము. సం=కేశపక్షము.

కేశాంతము. సం. వి. అ. పుం. కేశచ్ఛేదనకర్మము, గోదానము. (ఇది బ్రాహ్మణులకు పదియాఱవయేఁటను క్షత్రియులకు ఇరువదిరెండవయేఁటను వైశ్యులకు ఇరువదినాలుగవయేఁటను చేయుకేశచ్ఛేదనసంస్కారము.) మను. ౨. ౬౫.

కేశాంతికము. సం. విశ. (అ.ఆ.అ.) వెండ్రుకలవఱకు నుండునది, తలయెత్తుపాడుగు గలది.

కేశాకేశి. సం. అవ్య. ఒండొరులవెండ్రుకలు పట్టుకొని చేయునది. (యుద్ధము-చూ. కచాకచి.)

కేశారుహా. సం. వి. ఆ. స్త్రీ. సహదేవీలత. (వాచ)

కేశార్హా. సం.వి.ఆ.స్త్రీ. మహానీలి, పెద్దనీలిచెట్టు.

కేశి. సం.విశ. (న్. నీ. న్.) మంచివెండ్రుకలు గలవాఁడు. వి. న్. పుం. ౧. కృష్ణునిచే చంపఁబడిన ఒకరాక్షసుఁడు. ౨. సింహము. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. భూతకేశిచెట్టు. 3. అజలోమచెట్టు.(కల్ప.) ౪. చూడ, సిగ. (వై. ని.)

కేశిక. సం.వి.ఆ. స్త్రీ.శతావరి,పిల్లపీఁచర,చల్లగడ్డచెట్టు.

కేశికుఁడు. సం.విశ. (అ.ఆ.అ.) మంచివెండ్రుకలు గలవాఁడు.

కేశిని. సం.వి.ఈ. స్త్రీ. ౧. మంచివెండ్రుకలు గలస్త్రీ. ౨. ఒకరాక్షసి, కైకసి. (రావణకుంభకర్ణాదుల తల్లి.) 3. దుర్గ. ౪. చోరపుష్పి, కడిలముచెట్టు. ౫.జటామాంసిచెట్టు. (కల్ప.)

కేశుఁడు. సం.వి.అ.పుం. ౧. వరుణుఁడు. (హే మ. ని.) ౨. విష్ణువు.

కేశ్యము. సం.విశ.(అ.ఆ.అ.) కేశములకు హితమైనది, వెండ్రుకలకు నలుపు లోనగువానిని గలిగించునది. వి. అ. పుం. భృంగరాజము, గుంటగలగరచెట్టు. న. కృష్ణాగురువు, నల్లఅగలు.

కేసర. సం. వి. ఆ. స్త్రీ. కార్పాసము, ప్రత్తిచెట్టు. (కే. ని.)

కేసరము. సం. వి. అ. పుం. న. ౧. సింహములోనగువానిమెడమీఁదిజూలు. ౨. కింజల్కము. పుం. ౧. నాగకేసరముచెట్టు. ౨. పున్నాగము, పొన్నచెట్టు. 3. వకుళము, పొగడచెట్టు. (కే.ని.) న. ౧.ఇంగువ. ౨. బంగారు. 3. కాసీసము, అన్నభేది. (కల్ప.)

కేసరపూరకము. సం.వి.అ.పుం. మాతులుంగము, మాదిఫలముచెట్టు.

కేసరాచలము. సం. వి. అ. పుం. మేరుపర్వతము. (వాచ)

కేసరామ్లము. సం.వి.అ.పుం. మాతులుంగము,మాదిఫలముచెట్టు.

కేసరి[1]. వి. మృగవిశేషము, ఖేచరము.

సీ. ... కేసరి యన ఖేచర మగు...ఆం. భా. ౨. ౬౫. (బ్రా, శ. ర. పా- కిసరి. ప్రాఁతప్రతి వ్రాఁతప్రతులపాఠము.)

కేసరి[2]. వి. ఒకవిధ మగువరిపైరు.

(బ. కేసరులు-ర్లు-) ఒకజాతి ఎఱ్ఱవడ్లు. (బ్రౌ.)
వ. ...కస్తూరినిగరాలు ముత్తెసరు లేనుఁగుకొమ్ములు గంగాజలములు కేసరులు చంద్రవంకలు ...ప్రబంధ. ౧౧౨.
సీ. సన్నమామలు పచ్చగన్నేర్లు గోదండరామము ల్కేసర్లు రాయసర్లు. హంస. ౪. ౧౨౭.

కేసరి. సం. వి. న్. పుం. ౧. హనుమంతునితండ్రి. ౨. సింహము. ౩. గుఱ్ఱము. ౪. పొన్నకే. ౫. నాగకేసరముకే. ౬. రక్తశిగ్రువు, ఎఱ్ఱమునగకే. ౭. బీజపూరము, మాదిఫలముకే. విణ. న్. పుం. శ్రేష్ఠుఁడు. (ఈయర్థమున సమాసపూర్వపదముగా నుండదు. చూ. ఋషభుఁడు.)

## కై

కై[1]=కయి[1]. వి. (క. కై, కయి. త. కై.) హస్తము, చేయి.
మ. ...చిలుకన్ గైనుంచకే చిల్కపల్కులో నీపల్కులో కాంచలేము ... ఉ. రా. ౬. ౫౬.
క. కైకా నీపూనినపని, కై కా కై కందినట్టియనుఁగుంగొడుకి, ట్టైకానల కేఁగెడు ... అచ్చ. రా. అయో. ౯౪. ఆం. భా. ౨. ౧౩౭.
౨. తొండము. (చూ. కేలు, చేయి.)
జ: కైకట్టు, కైకలవాఁడు, కైకానుక, కైకాసము, కైకూడు, కైకొను, కైకొలుపు, కైకోల, కైకోలు, కైచాఁపులు, కైచెఱ, కైజీతగాఁడు, కైజీతము, కైతప్పు, కైదండ, కైపదు, కైపదను, కైముడి, కైమోడుపు, కైలాగు, కైలాటము, కైవడి, కైవసము, కైవీఁగు, కైసదు, కైసాటిమక్క, కైసేఁత, కైసేయు.

కై[2]=కయి[2]. ప్ర. (కు+ఐ-ఇది ఉభయయతుల లోనిది)-చతుర్థీవిభక్తిప్రత్యయము-కొఱకు.
(క) ప్రయోజనమును తెలుపును.
క. కమలాపతిఁ గొల్తు ముక్తికై విభు ననఁగన్. నరస. ౪. ౨౪.
గీ. అనఘ మామామ శకుని నాకై కడంగి, జూదమాడెడు నీతోడ...భార. సభా. ౨. ౧౭౪.
గీ. అమరతటినీతనూజుపైయలుకఁ జేసి, యనికిఁ జొరవ టె యట్లైన నతఁడు సచ్చు, నంతదాఁకఁ బాండవులకై కొంత సమర, కేలి వేడుకఁ జలుపుట వోలదొక్క. భార. భీష్మ. ౧. ౧౬౩. (ఇట 'పక్షమున' అని భావము)
(చ) హేత్వర్థకము.
గీ. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచితదక్షిణ లర్పించి యున్నధనముఁ, గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి, విడిచి రర్థంబు దీనికై వెఱవ నేల. జై. భా. ౧. ౭౩.
(ట) దెసకు, వైపునకు.
ఉ ... అత్యంతముఁ దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్. కళా. ౫. ౧౪.

కై[3]=కయి[3].

కైంకర్యము. సం. వి. అ. న. సేవ, ఊడిగము.

కైక=కయిక. వి. (సం. కైకేయీ.) దశరథుని భార్యలలో నొకతె.
క. కైకా నీపూనినపని, కై కా కై కందినట్టియనుఁగుంగొడుకి, ట్టైకానల కేఁగెడు నిఁక, నే కడ నీవంటితులువ లేరీ పుడమిన్. అచ్చ. రా. అయో. ౯౪.
సీ. ... కైకేయి వెలయును గైక యనఁగ. ఆం. భా. ౨. ౧౦౫.

కైకట్టు=కయికట్టు. వి. (కై[1]+కట్టు) సందర్భము.
సీ. సందర్భసంజ్ఞయై చనును గైకట్టన ... ఆం. భా. ౧. ౧౧౨.

కైకయి. సం. వి. ఈ. స్త్రీ. కేకయరాజుకూఁతురు; కైక, కైకేయి.

కైకయుఁడు. సం.వి.అ.పుం. కేకయదేశపురాజు. (రూ. కేకయుఁడు.)

కైకలవాఁడు=కయికలవాఁడు.వి.(√కై¹.) తంతువాయభేదము.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన...తద్భేదము ల్తొగటవాఁ డనఁగను సాలీఁ డనంగను సాలె యనఁగ ... కైకలవాఁ డనఁగను ... ఆం. భా. ౨. ౨౮౩.

కైకసి. సం.వి.ఈ.స్త్రీ. రావణాదులమాత, కేశిని.

కైకానుక(న్క)=కయికానుక.(కై¹+కానుక-త. కైక్కాణి.)

(రాజాదులఁ జూడఁ బోవునపుడు కొనిపోయెడుద్రవ్యము, ఉపాయనము.)

మ. పులిగోరుల్ పెరతేనె కస్తురి మెకంబుల్ పుస్గుజవ్వాజిపిల్లులు... సెలవిండ్లుఁ బాఱివాతంపక,ట్టులుఁ గైకానుక లిచ్చి బోయదొరబిడ్డల్ గాంచి రాభూవిభుణ్. రామా.౨.౫.

గీ. నీకుఁ గైకాన్కఁ జేసెద నేఁడు దానిఁ,దత్తనూజులకంఠరక్తంబు గ్రోలు.శుక.౨.౨౯౯.

(బహుమానము; లంచము.)

గీ. గుండ్లపేరును గైకాన్క కోరి సేతు,నమ్మ నా విన్నపంబు నీ వాలకించి,వాని ననుఁ గూర్పు నీనేర్పు పూని మెఱసి. హంస. ౨. ౩౭.

కైకాసము=కయికాసము. వి.(√కై¹) రాయిడి, బాధ.

క. చేసెదువలరాయనికై,కాసములకుఁ గాక జడిసెఁ గాఁపుంగొడుకుణ్, లో సుదతిఁ దెచ్చుటకు ని,ద్రాసక్తుని మిాఁటెఁ జన్నుద్రావెడుకొడుకుణ్. వేం. పంచ. ౪. ౪౮౮.(ప్రయోగాంతరము లేదు.)

కైకూడు=కయికూడు. (√కై¹)

కైకేయి. సం.వి.ఈ.స్త్రీ.కేకయరాజుకూఁతురు; కైక, దశరథునిమూఁడవభార్య, భరతునితల్లి.

కైకేయుఁడు. సం.వి.అ.పుం. కేకయదేశపురాజు.

కైకొను=కయికొను. స. క్రి. (√కై¹. త. కైక్కొళ్.) ౧. ధరించు;స్వీకరించు,పుచ్చుకొను; పట్టుకొను, గ్రహించు.

శా. శ్రీకంఠా నిను నీవు నేమఱకుమిా చిత్తంబు రంజింపచెదణ్, నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం,తాకారంబు జగన్నిమజ్జనము నీకై చూచెదేఁ జూపెదణ్ ...భాగ. ౮. ౩౯౧.

చ. పొదువుగ నెల్లయంగదులఁ బ్రోవులువోసిన నూత్నరత్నముల్, కడఁక ననేకవేషములు గైకొని వచ్చినయర్థికోటికిణ్,బిడికిళు లాదిగాఁగ బలినెట్టుదు రెప్పుడు వైశ్యభామినుల్...విక్ర. ౧. ౭౪.

గీ. కైకొనుము దీని నని యిచ్చె నాకవనిత, పూర్ణచంద్రనిభాస్య కప్పావుదండ. నైష. ౩. ౧౨౦.

చ. ... ప్రదక్షిణార్చియై,యకలుషలీలఁ గైకొనియె హవ్యవహుండు హవిర్విభాగముణ్. భీమ. ౫. ౩౯.

ఉ. ...తా గురుజనంబులు కుంకుమ సంకుపంకముం, బోలెడుచల్వయుం బసుపుముద్దయుఁ గైకొని తోడ రా మహా,కేళిరథాంగయైన నదికిం జని మజ్జనమాడి వేడుకణ్. శుక. ౧. ౪౨౨.

చ. అనవుడు బోయ యిట్లను శుకాంగనతో నడలంగ నేల నీ,తనయులఁ జంప నేను బిసితంబులు బ్రాఁతియె నాకు వీనిఁ గై,కొని వెలవెట్టువారికడకుం జని యమ్ముదు... కేయూర. ౪. ౬౭.

౨-పాణిగ్రహణముచేయు-వివాహమగు, పెండ్లియాడు.

చ. భవదనుజాత్మజ న్వసునృపాలుఁడు గైకొను
నెల్లి నేఁట...వసు. ౪. ౪.

ఆ. తనకు సదృశుఁ డైనతరుణునిఁ గైకొంట,రా
జసుతకుఁ దగవు రాజవదన. భాగ. ౯. ౬౨౦.
విక్ర. ౪. ౫౪.

౩. భావించు, ఎంచు.

గీ. ... గెల్పు గెల్పుగ మదీయ,బుద్ధి గైకొనద
య్యెడు సిద్ధముఖ్య. భార. శాం. ౧. ౬.

సీ. అఖిలసైన్యములు సహాయులు గూడంగఁ గృ
ష్ణుచే నపజయక్లేశ మొంది, యే మని తనవీటి
కేఁగె నమ్మగధేశుఁ డకట యిమ్మెయిఁ దన
యంత మేటి, యవనీపతుల కెల్ల నగ్రణి య
నిఁ బాటిపోక కర్జంబుగఁ గైకొనంగఁ, జను
నె...హరి. ఉ. ౨. ౩.

౪. ధ్యానించు.

శా. ... శృం,గారాగారము మంగళాచలపతిం
గైకొందుఁ జిత్తంబునన్. గంధ. ౧.

౫. లక్ష్యపెట్టు,సరకుగొను,పాటించు;ఆదరించు.

క. తనకొలఁది నుపాయంబులు, పొనరిచి ధనవం
తుఁ డగుట భూపగుణము ని,ర్ధనుని నిజప్రజ
యును గై,కొనదు విరోధులును సరకుగొనరు
కుమారా. భార. శాం. ౩. ౧౭౩.

మ. దయ నాయాడినమాట గైకొనవు సంతాపం
బుఁ దెచ్చెం జుమీ. భార. ఉద్యో. ౪. ౪౭.

క. ఏకాధివాసమైత్త్రిం, జేకొను మేఖలకు హితము
చెప్పుతలఁపునం,బోకుము నీ వెన్నఁడు నది,
కైకొనదు హితోక్తి తెలియఁగా లేదు మ
దిన్. కేయూర. ౩. ౨౬౪.

గీ. తప్పు సేసితి రిట్టులు దగునె వీర,లేమిగతిఁ బ
ల్కినను నది యెల్ల మనము,గైకొన వలయుఁ
గా కిట్లు గాదుగూడ,దని నిషేధించు టొ
ప్పునె మనుజనాథ. భార. విరా. ౫. ౨౭౫.

౬. అంగీకరించు, ఒప్పుకొను.

క. ఆకుహనాభూసురుఁ డపు, డాకాంతలసరస
సమ్మదాలాపములన్, గైకొనుచు ముదితహృ
దయుం,డై కేళీవనము వెడలి యరిగి కుఱఁగ
టన్. మనుచ. ౩. ౧౧౦.

క. తగుమాట లాంబికేయుం,డగు నని కైకొనునె
యెన్నఁ డైనను...భార. ఉద్యో. ౧. ౩౧౫.

౭. ఆక్రమించు, వశపఱచుకొను.

చ. మదగజరాజకుంభముల మచ్చరికించు చకో
జకుంభముల్,కదిసి కలంత మేరయునుఁ గై
కొని యున్నవి యెల్లవారికిన్,విదితము గాఁ
గ నిట్టితటి నీ చెలి డెందమునందు నేమియుం,
గదలక మాకు నుండ నవకాశము లేదు గదే
కళావతీ. నైష. ౮. ౬౫.

వ...వారి ప్రధానులు స్వామిద్రోహంబులు చేసి
రాజ్యంబులు గైకొని యేలం గలవారు...వి.
పు. ౬. ౩౯౫.

మ. కొనియెం గంచుకముల్ సముద్భటనటద్ఘోటీ
భటప్రౌఢిఁ గై,కొనియె న్వేడుక జీడికోట
యహితక్షోణీశు లల్లాడ...కాశీ. ౧. ౩౩.

౮. అవలంబించు, పూను.

సీ. ఏఁడు గాలం బయ్యె నేను నిరాహారఘోర
వ్రతంబుఁ గైకొన్నవాఁడ. హర. ౨. ౫౩.

౯. పొందు, చెందు.

చ. అశుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ
దలంప కీవు కా,ల్గడ దలయింపి గా నిదుర
గైకొన నే నది యంతరంబు గాఁ, గడఁగి మ
దంతహేతు వగుగర్భము నొంచితి...హరి.
పూ. ౧. ౮౭.

మ...కాశీశ్వర నీలకంఠ యనుచున్ మ్రాఁగన్ను
వాటిల్లఁ ద,త్కాలశీనూనుఁడు మూర్ఛఁ గై
కొనుఁ గ్రమక్షామాక్షరోల్లాసియై. కాశీ.
౨. ౧౫౪.

౧౦. అనుభవించు.

చ. అదియును గాక పూర్వకృత మైనయఘంబు

లు వ్యాధిరూపమై,పొదివినఁ దాను గైకొనక పోవునె... భోజరా. ౧. ౧౦౬.

సీ. ప్రాణేశ పతికి మున్పరలోక మరిగెడు చెలువ లేతపములు చేసిరొక్కొ,వల్లభ చూచితే వై ధవ్య మెక్కింతవడియైనఁ గైకొన వలసె నాకు. భా. రా. యు. ౩౯౨.

సీ. అసమసింహాసనస్థుఁడై యఖిలరాజ్య,వైభవంబులు గైకొంచు వఱలువాఁడు, నియతిమై గాలిఁ గ్రోలెడు నేఁడు నహహ, యధిప య తఁడు మహాభోగి యనుట నిజము.కవిక. ౬. ౩౯.

౧౧. భక్షించు, తిను.

ఉ. కల్లరిత్రాఁచు నిప్పుకలు గైకొనుకేకిచకోర పాళికిం,జెల్లినఁ జెల్లుఁ గాక సరసీజబిసంబు లిగుళ్లు మేసి భా,సిల్లెడుమీ కయో విషము చిల్కఁగ వేఁడిమి గుల్కఁ బల్కఁగాఁ, జెల్లునె యోమరాళపికశేఖరులార వచింపుఁ డింపుగన్. విజ. వి. ౩. ౫౭.

ఉ ... వాడుమోములం, బొందువడంగ సాం ద్రతరభూరుహపంక్తులచల్లనీడలం, గందఫ లాదిఖాద్యములు గైకొని కొండొక నిల్చి వెండియున్. భా. రా. యు. ౨౭౧. శుక. ౧. ౪౨౩.

౧౨. పట్టు, అనుసరించు.

వ. మాధవుండు ... కరినగరంబు పెంచెరువు గై కొని... చనిచని...భార. ఉద్యో.౩.౧౮౫.

మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రి యుం డేఁగఁగా...విక్ర. ౨. ౧౧౫.

అ. క్రి. ౧. పూను, ఉద్యమించు.

శ. మాకుం బుణ్యము సాలమి,గా కేమి జగత్త్ర యంబుఁ గావం బ్రోవం,గైకొన్న నీవు సకల వి,వేకివి మాదుఃఖ మెఱుఁగవే మధుమథనా. ఉ. హరి. ౪. ౯౬.

౨. కలుగు ?

క. ఏకరి దనకు నపాయము, గైకొనఁగాఁ దనదు మూర్ధకంపము సేయన్, లోకమున కపుడు సకలమ,హీకంపము పుట్టు నట్టియిభరాజం బున్. భా. రా. బాల. ౪౨౦.

కైకొలుపు=కయికొలుపు. స. క్రి. (√కైకొను) కైకొనఁజేయు.

(సమ్మతింపఁజేయు )

క. నావుడు మానరనాథుఁడు,గేవలపురుషుండె వాఁడు కీడొందుపనుల్, గావించునె మది బెదరం,గా వల దని చెప్పి దొరలు గైకొలు పుటయున్. భోజరా. ౪. ౭౪. (చూ.౭౩.)

కైకోల=కయికోల. వి. (కై¹ + కోల-ల. కై కోళన్.) గుడ్డలు నేసికొని బ్రతికెడు ఒకా నొకజాతి. (ఉదా: కైకోలవాఁడు, కైకోలది. శ. ర.)

కైకోలు=కయికోలు. వి. (√ కైకొను). కైకొ నుట.

(అంగీకారము)

సీ. నీవ కా కెవ్వరు నేర్తు రీపని కియ్యకొ మ్మని యతని కైకోలు వడసి. భాగ. ౮. ౧౯౨.

(గ్రహణము, గ్రహించుట)

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గై కోలు గావించి త,ర్ధాంగీకారము...నరస.౧. ౫. (శ. ర. పా- కైకోలుగావించు = గ్ర హించు.)

(ప్రతిజ్ఞ)

క. నేలయు నుదకముఁ దేజము, గాలియు నాక సము నెఱుఁగఁ గాచితి నాకై,కో లిదె రెం డాడఁగ నా,నాలుక మీపలుమువారినాలుక యటులే. ద్వా. ౫. ౧౯౮.

కైచోఁపులు. వి. బ. (కై¹ + చాఁపులు) నమ స్కృతి. (శ. ర.)

రగడ...నిబిడస్థలిలో నిబిడాకార, స్వామికి మతిఁ గైచాఁపు లొసంగుచు. హంస. ౪. ౨౧౩.

**కైచెలి**=కయిచెలి. విణ. (కై[1]+చెలి) చేతిలో బంది యైనది.

క. ఏచినతననిడువాలువి,లోచనముల చెలువమునకు లొంగి జలజముల్, కైచెలియిచ్చెనసం గే,లీచాలితనలిన మాకలికి ధరియించుచ౯. వరాహ. ౧౧. ౫౦.

**కైజా**=కయిజా. వి. (పార్సీ. ఫైజ్.) వాఁగెను వెనుక కీడ్చి కట్టుట. (శ. ర)

క. ఆకోలాహల మరు దని, యాకర్ణింపుచు విభుండు హయము డిగి హుసా,రై కైజా చేసి మహా,నోకహతలమున నిలిచి కనుంగొనుచుండ౯. చంద్రా. ౨. ౧౧౧.

శా. కైజా చేసినబొండుమల్లెవిరిబల్లుండాజగా జోదుతే,జీజాడం దల వాంచి బోటిచెలఁగుం జే గట్టిగాఁ జుట్టి ను,న్గాజుంగంబముచాటున న్నిలిచి క్రేఁగంట న్ననుం జూచునం, భోజాతాక్షిని సెజ్జకుం దిగుచు నేర్పుల్ గల్గునే మీఁదట౯. కుపల. ౪. ౯౯.

సీ. లాయంబులోనిలులాయంబుపైఁ గాలుఁ డెక్కుడునరునిపై రక్కసుండు, కైజా యమర్చి నక్రంబుపై వరుణుండు...శ్రీరం. మా. ౪. ౯౧.

జ: కైజామోర.

**కైజామోర**=కయిజామోర. వి. (కైజా + మోర.) ౧. హయశీర్షకంపనము.

సీ...కైజామోర యన హయశీర్షకంపనము వెలయు...ఆం. భా. ౨. ౨౦౦.

౨. కళ్లెముతో వెనుకకు బిగించినమూతి.

సీ. హయనాథుఁ డంపినహరులు కైజామోర లార్చుచుఁ బతికి జోహారుసేయ. వసు. ౧.౧౫.

సీ. అనికి వేలుపుఁదేజి నలరు కైజామోరయల్లార్చుచేఁ జీరుహయకులములు. చంద్రి. ౬. ౮౫.

శా... పురిం బొల్చు నా,జానేయంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చుచు౯. ఆము. ౨. ౨౬.

**కైజీతగాఁడు**=కయిజీతగాఁడు. విణ. (కైజీతము + కాఁడు) భృతకుఁడు; భృతకయోధుఁడు.

ఆ. కాననంబుబలముఁ గైజీతగాండ్రును, సైనయట్టిబలము లాలు నరసి. భార. ఆశ్ర. ౧. ౭౩.

**కైజీతము**=కయిజీతము. వి. (కై[1]+ జీతము) ఎప్పటి కప్పు డిచ్చుజీతము.

గీ. ఒకని నొకఁ డెచ్చరించుచుఁ జికిలియొఱలు, పొఱవైచుచు వడిఁ జోరఁ బాఱువారు,నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. కుపల. ౨. ౧౪౩.

సీ.అఖిలసీమామూల మైనదుర్గమ్ము లుంబళికలు గలకమ్మవెలమదొరలు,చేతి కై దేసివేల్ శివరాయలవరాలనెలకట్టడలపటాణీల్ గరీబు,లూళ్లాయములమీఁద హూరపుత్తరువు గన్నరాయకైజీతంబురాయవారు... రా. వి.౫.౧౩.

విణ. శపథాయుధనిషేవి, వెనుకకు తిరుగ నని యొట్టుపెట్టుకొని యుద్ధము చేయువాఁడు, సంశప్తకుఁడు.

సీ. శపథాయుధనిషేవి చనును గైజీత మంచనఁ గను...ఆం. భా. ౨. ౧౮౫.

మ...బోయల్ దాయలై పాయక,స్వరవీథి౯బరవీరుల న్గదుమ గుంపుల్ గూడి కైజీతముల్, దఱుమ౯ బర్విడి స్వామిపుష్కరిణితీర్థంబందు వే గ్రుంకిన౯. ప్రబంధ. ౭౯౭.

**కైజో**=కయిజో, కైదు, కయిదు. వి. కపింజలము, కాఁజు.

సీ. కాఁ జనఁ గై జనఁగాఁ గపింజల మొప్పు...
ఆం. భా. ౨. ౯౪. సుద. ౩. ౧౯౪.

గీ. కటకటంగ్రుల నితికించి గజ్జె గదలఁ,గతికి నె
తినెతికో లెమ్మకయును విఱుగ,వితిచె వడిఁ
గైజు నొక పెద్ద వేసడంబు. మనుచ. ౪.౫౭.

కైటభ. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ. (త్రి. ని.)

కైటభారి. సం. వి. ఇ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

కైటభి. సం. వి. ఈ. స్త్రీ=కైటభ. (త్రి. ని.)

కైటభుఁడు. సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు. (విష్ణుదేవుఁడు నిదురించుచుండఁగా నతనికర్ణము లనుండి కైటభుఁడును మధుఁడును పుట్టి బ్రహ్మ దేవుని చంపఁ బోవఁగా విష్ణువు వారిని సంహ రించెను.)

కైటర్యము. సం. వి. అ. పుం. ౧. భూనింబము, నేలవేము కీ. ౨. కట్ఫలము, పినగుమ్ముడు కీ. ౩. పూతికరంజము, నెమిలియడుగు కీ. ౪. మదన వృక్షము, ఉమ్మెత్త కీ.

కైడర్యము. సం. వి.అ. పుం. ౧=కైటర్యము. ౨. కృష్ణనింబము, కతివేము కీ.

శ్లో. కృష్ణనింబః కాలశాకః కైడర్యః సురభిచ్ఛ దః. షట్సు-ంధనిఘంటువు.

కైత=కయిత.

ఉ. పూఁత మెఱుంగులుం బసరుఁబూపబెడంగులు
చూపునట్టి వా, కైతలు... (పెద్దన చాటువు)

జ: కైతగాఁడు.

కైతకము. సం. విశ. (అ. ఈ. అ) మొగలిసంబం ధమైనది. (పువ్వు, మొ.)

కైతగాఁడు=కయితగాఁడు. వి. (కైత+కాఁడు.) కవిత్వము చెప్పువాఁడు, కవి. వేణు. ౨౨.

కైతప్పు=కయితప్పు. వి. (కై[1]+తప్పు). చేతిపొ రపాటు; పొరపాటు, ప్రమాదము.

సీ. కంగుకంగున నేలఁ గైతప్పఁగాఁ బడువేఁట
మ్ము లేఱక దాఁటి దాఁటి. మనుచ.౪.౧౦౩.

ఉ. అప్పుడ మూర్తికాంజలిఁ బ్రియంబునఁ జే
యుచు దేవ నిన్న కై,తప్పునఁ జేరె నీహయ
ము తండ్రికి నోర్వక పోదు బిడ్డఁడే,యొప్పు
మిఁ జేసెనేనియు ననూనకృపామతి నన్నుఁ
జూచి యీ,తప్పు సహింపు మంచు వసుధా
స్థలిఁ జాఁగిలి మ్రొక్కె-ఁ గ్రమ్మఱన్. జై.భా.
౫. ౧౬౭.

కైతవము. సం. వి. అ. పుం. ధుత్తూరము, ఉమ్మె త్త కీ. న. ౧. వైడూర్యమణి. - కితవుని ధర్మము- ౨.జూదము. ౩.పందెము,పణము. ౪.కపటము.

కైతవుఁడు. సం. వి. అ. పుం. ౧. జూదరి.౨.మో సగాఁడు. (వాచ.)

కైదండ=కయిదండ. (కై[1]+దండ.)
(హస్తావలంబము, చేయూఁత; ఊఁత.)

సీ. అర్ధరాత్రంబున నల్లాడనాథుండు దానె యొ
వ్వనికిఁ గైదండ యొసఁగె. హర. ౧. ౧౫.

సీ. కైదండ లిచ్చి రాకలువరాయనిఁ దెచ్చియం
దు మీఁదట నుంచె నతివ యోర్తు. యయా.
౪. ౯౩.

సీ. గంధేభఘంటికాఘణఘణల్ ఘనబృంహిత
ధ్వానములకుఁ గైదండ యొసఁగ. దశా. ౨.
౩౭౭. (ఇట 'బృంహితములను హెచ్చుచే
యు' అని భావము.)

కైదారకము సం. వి. అ. న. కేదారసమూహము.

కైదారికము. సం=కైదారకము.

కైదార్యము. సం=కైదారకము.

కైదు=కయిదు. వి. కైజు.

క. కళుకును గంకముచు గాకి కక్కె-ర కైదుల్.
ప్రబంధ. ౨౩౦.

కైదువ(వు)=కయిదువ. వి. ౧. ఆయుధము.

సీ... కైదువ యనఁగను గత్తి యనఁగ, నాయుధ మొప్పు... ఆం. భా. ౨. ౨౧౧.

చ. కరమున శైలభేది యగుకైదువ యున్నశచీకళత్రుఁడో... హరిశ్చ. ౪. ౮౧.

క. ...పారి మిడుఁగులు లెగసి కైదువులపాడి రాలెన్. భార. ద్రో. ౫. ౫౧.

క. పొడిచినకైదువునకుఁ జమురిడఁగా వలదు ...మనుచ. ౪. ౧౯.

ఉ... తెల్లనిమోముగుజ్జమును తెల్లనిమామయుఁ దెల్లకైదువున్, దెల్లనికోడలుం గలుగుతెల్లనికూఁతురితండ్రిఁ గొల్చెదన్. రుక్మా. ౧. ౬౦.

౨. వాఁడి యైనఅంచు.

చ. జిలిబిలిపాలు జాలుకొను చెక్కుల టెక్కును మద్దికాయలున్, గళుకులరావిరేక చిఱుగజ్జియ లందియ లైదుకైదువల్, గలయపరంజిబిళ్ల తుది గన్ బులిగోరును బుట్టువెండ్రుకల్, చెలఁగెడుపట్టి పండువులు చేసెఁ ద గన్ దలిదండ్రికంటికిన్. రా. వి. ౨. ౨౧.

౩. శ్యేనవిశేషము, ఒకజాతిడేగ ?

సీ. ఈమించుకైదు వాళ్లెన్ని గల్గినసైనఁ దిత్తిదీసినమాడ్కిఁ ద్రెంచి పట్టు. చంద్రా. ౨. ౮౮.

పిడుగుకైదువు=వజ్రాయుధము. వసు. ౫. ౩౬.

కైప(వ)డు=కయిపడు. అ. క్రి. (కై[1] + పడు) కైవ్రాలు, క్రిందికొఱగు.

వ ... ఒకయింటిమచ్చెకంటి పంచాశద్వర్షదేశీయ పలితసారం బైనవేణికాభరంబు కైపడ... కలమధురవీణాక్వాణపాణింధమం బైనయెలుంగత్తి ... చేరం బిలిచిన ... భీమ. ౨. ౧౧౦.

కైపదము=కయిపదము. వి. (కై[1] + పదము - ప్రా. కయిపద.) కవితాశక్తిని పరీక్షించుటకై పూరింప నిచ్చెడిపద్యాంశము, సమస్య.

ఉ. కైపద మిచ్చువారలును గ్రక్కునఁ బద్యము చెప్పువారలున్, రూపితసంస్కృతాది పదరూఢి యెలర్ప మహాప్రబంధముల్, వేపొసఁగంగఁ బల్కి పృథివిం బ్రథితంబుగఁ జేయువారు ధా, రాపురమందె కాక కలరా మఱి తక్కినపట్టనంబులన్. భోజరా. ౨. ౫౦.

కైపు=కయిపు. వి. (త. కయిప్పు) ౧. మత్తు, మైకము, లాహిరి.

గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్న,గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి, పెనఁగునెడ నెట్టవిరిసె నా వనితమేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె. కు.సం. ౭. ౧౮౭. రా. వి. ౨. ౨౮.

౨. సురాభేదము, సారాయి.

సీ. కల్లనంగ సురాఖ్య చెల్లును గైపు సారాయి సారా నాఁగ రహిఁ దనర్చుఁ, దద్విశేషంబు... ఆం. భా. ౨. ౩౦౩.

౩. కపటము.

సీ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు, గబును కైపు కిటుకు కొడు డబ్బు కవుడు డంబనంగ... ఆం. భా. ౧. ౧౩౭.

౪. ఉద్రేకము, విజృంభణము.

క. దీప మణఁగఁ జీకటియును, గోప ముడుగ శాంతిగుణముఁ గోల్కొనుక్రియ నాటోపోద్భటముగ వేసవి, కైపు సడలఁ దోఁచెఁ గారుకాలము దళమై. పాండు. ౪. ౧౯.

చ... తేఁకువ వచ్చువిరోధిసేనలన్, మరలఁగఁ దోలుచో నిలిచి మార్కొనువీరులఁ దాఁకి వీఁక జర్జరితముగాఁ బడం బొడిచి చంపక చిత్తముకైపు వోవునే. కు.సం. ౧౧.౬౯. (ఇట 'కోపోద్రేకము' అని భావము)

౫. అందము, సౌందర్యము, ఒప్పిదము.

ఉ. కారుమెఱుంగులం దెగడుకైపున నొప్పునెలంత లంత బం,గారపుఁబళ్లెరంబుల పగన్

ననుముత్తెపుముగ్గులోన నిం, పారెడుకెంపు
దివ్వియల నందపుఁగెందొడవుల్ చెలంగఁ
గా,నారతు లిచ్చి రప్పుడు యయాతికి లేనగ
వొప్ప నర్తకీల్. యయా. ౪. ౧౦౩.

సీ. పేరోలగంబున్నఁ జేర్చు కైపులతోడ నచ్చర
పూఁబోఁడు లరుగుదేర. యయా. ౫.౧౫౫.

ఉ.ఎల్లరు నంత మేలుకొని యిందుముఖుల్ ముఖ
మజ్జనాదికం,బల్లనఁ దీర్చి కైపుగఁ దులాంబ
రముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబు
లున్ బరిమళంబులుఁ దాలిచి...రామా. ౨.
౧౦౭.

౬. విధము.

సీ. పొల్లు గావించు కైపున రథుల్ రథముల నడిపి
నుగ్గాడిరి కడఁకఁ గరుల.చంద్రా. ౬. ౧౦౦.

గీ.రావణునిఁ జెట్టవట్టినరాజ్యలక్ష్మి,కైపు తోఁ
పించులంకపొంకంబు గాంచి. రామా. ౬.
౧౦౩.

కైపెక్కు= ౧. మత్తిల్లు; అలసుఁ డగు, సోమరి
యగు.

ఉదా: వాఁడు కైపెక్కి యున్నాఁడు.

గీ. జనులు మున్న కైపెక్కి యశక్య మని మ,నం
బులోపల స్రుక్కి కార్యంబునందుఁ, బూని
యుద్యోగ మొనరింపలేని యెట్లు,దానిసఫల
తాఫలతలు దారు గంద్రు. మార్క. ౩. ౪౭.

౨. వీడు, వదలు; చెదరు.

సీ. కబరికాభారంబు గైపెక్కి విరులతో నవటు
భాగంబుపై నత్తమిల్ల. కాశీ. ౧. ౩.

గీ. శ్రవణకహ్లారముకుళంబు జాఱకుండ, విరుల
కీల్గొప్పు వదలి కైపెక్కకుండ, నెత్తె శృం
గారకందుకం బెత్తినట్లు, కైటభారాతి మం
దరత్నాధరంబు. హర. ౬. ౪౫.

కైముడి=కయిముడి. వి. (కై¹ + ముడి) వాద్యవి
శేషము, తాళము.

గీ. తనరుఁ జుయ్యంకి కైముడి యనఁగఁ దాళ,
ము...ఆం. భా. ౧. ౧౫౯.

సీ. గాలికొమ్ములు డోళ్లు కైముళ్లు రుంజలు ...
మై. రా. యు. ౩. ౨౬.

కైముతికన్యాయము. సం=కైముత్యన్యాయము.

కైముత్యన్యాయము. సం. వి. అ. పుం. ఒకా
నొకన్యాయము.(చూ. న్యాయము.)

కైమోడుపు(డ్పు)=కయిమోడుపు. వి. (కై²
+ మోడుపు.) నమస్కారము.

రగడ. మాహురమం దనమానలె విడిసినకాలమే
ఘునకుఁ గైమోడుపు లని. హంస. ౪. ౨౧౩.

కైరఁడు=కయిరఁడు. వి. (క. కయిర) అశ్వవిశే
షము. (శ. ర.)

మ...మాహేంద్రచాపంబు మో,హనరత్నంబుల
వాగెత్రాడు వడగం డ్లాస్యస్రవత్ఫేన మై,త
నరం దజ్జలదంబుకైరఁ డెగయున్ ధారావి
హారంబులన్. వరాహ. ౧౦.౯౩.

గీ.బిగువుపదిలంబు చూచి గంభీరవృత్తి,మొక్క
పొన్నంకవన్నియ ద్రొక్కి నిక్కి,సరవిఁ గై
రని నెక్కి యుత్సాహలీల, పిక్కటిల్లఁగఁ
ద్రొక్కించి యెక్కవగను. ప్రబంధ.౧౮౪.

కైరవడీ=కయిరవడి. వి. (సం.ఖాదిరవటీ.) తాం
బూలముతోఁ గూడ నుపయోగించుకొనుటకు
కాఁచు లోనగువస్తువులు చేర్చి చేసినయుండ,
కాఁచువడియము, ఖాదిరఘుటిక.

సీ...ఖాదిరవట మొప్పును గైరవడి యన ...
ఆం. భా. ౨. ౧౬౭.

సీ. కప్పురగందంబు కైరవళ్ పట్టీలు తట్టు పునుం
గును...ప్రబంధ. ౫౭.

గీ. కాఁచువడియంబు లనఁగను గైరవ ళ్లనంగ
ఖాదిరఘుటిక లనంగదమన. ఆం. శే. ౫౫.

కైరవము. సం. వి. అ. న. తెల్లగలువ.

కైరవి. సం. వి. ఈ. పుం. చంద్రుఁడు. ఈ. స్త్రీ.
వెన్నెల.

కైరవిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగ. ౨. తెల్లగలువలసమూహము. ౩. తెల్లగలువ లున్న కొలను.

కైరవుఁడు. సం. వి. అ. పుం. ౧. కితవుఁడు, జూదరి. ౨. శత్రువు. (మే. ని.)

కైరాతము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. కిరాత సంబంధ మైనది. ౨. కిరాత దేశభవము. వి.అ.న. ౧. ఒకజాతిచందనపుమ్రాను. ౨. భూనింబము, నేలవేముకీ.

కైరాతుఁడు. సం. వి. అ. పుం. బలవంతుఁ డగు పురుషుఁడు. (కల్ప.)

కైలాగు=కయిలాగు. వి. (√కై¹ -త. కైలాగు.) హస్తావలంబము, చేయూఁత; ఊఁత.

క. మునుకలు గంగానదిలో, నొనరించుటకన్న భాగ్య మున్నదె యనుచుకా, మును కలుగంగా దిగి పరి,జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁడై. విజ. వి. ౧. ౫౫.

మ. అని సంతోషితచిత్తుఁడై బహువిధవ్యాపార మాధుర్యలీ,ల నుతింపం దనపాణిపల్లవము కైలా గిచ్చి యమ్మానిఁ ద,ద్ఘనగేహ ప్రతిహార గేహళిఁ జేరంగాఁ బంపి తా నాత్మ్క ర,మ్యానిశాంతంబున నుండె రంగపతి పద్మాదిప్రియాసక్తుఁడై. విప్ర. ౪. ౭౬.

కైలాట(ము)=కయిలాట. వి. ౧. మాయోపాయము; మాయ, మోసము.

ఉ ... తానును గజాస్యుఁడు లక్ష్మియుఁ జేసినట్టి కై,లాటమునకా ఘటిల్లె సకలార్థము దేవర యాజ్ఞ పెంపునకా. కాశీ. ౬. ౧౪౧.

ఉ ... కై,లాటము చేసె దేటికి బళా పికమాయిఁక మాను ... వేం. పంచ. ౪. ౧౯౨.

మ. కని చిల్కుం దన పెంటిగాఁ దలఁచి యాకైలాటపుంబుల్లు గ్ర,క్కున మి న్నందిన మేడమీఁదికిఁ దపుక్కుంగాంతితో జాతి ... సారంగ. ౧. ౧౭౯.

వ.అవ్వో యవ్వ కడుపుకూటికి దబ్బ ఱాడితి నని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు... వేం. మా. ౫. ౩౭.

౨. కీడు.

గీ. చూడక మొగంబు త్రిప్పి మాటాడ కిపుడు, చే దిగిచి పట్టుక పరాకు చేసినపుడె,యేమి పుట్టునో కైలాట మింక మీఁద, మగువ దయలేక విడనాడఁ దగునె నీకు. విజ. వి. ౨. ౧౯౭.

జ: కైలాటకత్తె, కైలాటకము, కైలాటకాఁడు.

కైలాటకత్తె(త్తియ)=కయిలాటకత్తె. విశ. (√కైలాట) మాయలాడి, మాయావిని.

కైలాటకము=కయిలాటకము. వి. (√కైలాట) మాయోపాయము; మాయ, మోసము.

సీ. పనిలేనిపనికై నఁ బాటి కైలాటకంబులు నేయుమునిఁ గన్న ప్రోడవేల్పు. చిత్రభా. ౪. ౧౨౦. ప్రబంధ. ౫౨.

కైలాటకాఁడు=కయిలాటకాఁడు. విశ. (కైలాట + కాఁడు) మాయాశీలుఁడు, మాయావి; దుష్టుఁడు.

సీ.... తపళికాఁ డనఁగఁ గైలాటకాఁ డనఁగను డక్కరి యనఁ. గీ. డం కనంగను మాయావి పొంక మగును. ఆం.భా. ౨. ౭౬.

గీ. కల్లరియు గొంటు కైలాటకాఁడు చెడును, ...కూళ గడు సన వర్తిల్లుఁ గుజువుపేర్లు. ఆం. సం. మాన. ౧౧.

కైలాటము=కయిలాటము.వి.(√కై¹)నమస్కారము.

రగడ. ఉత్తలతలమున నుత్తమహరికిని ఘనతరభక్తిని గైలాటము లని. హంస. ౪. ౨౧౩.

కైలాసకి=కయిలాసకి. వి. నాట్యవిశేషము.

ఉ.... కై,లాసకి పేరణీవిధము లాఁగులు జక్కిణి చిందుకొల్వణుల్, బాసలు కోపుఁజూపులును బాట పదాభినయంబు లేకయుక్, వాసికి మీఱ నాట్యకలనఁ బ్రకటించెను హావభావముల్. శ్రీరం. మా. ౪. ౧౬౨.

కైలాసము. సం. వి. అ. పుం-కేలాసము(=స్ఫటికము)వలెఁ బ్రకాశించునది-వెండికొండ.(ఇది శివునకును కుబేరునకును ఉనికిపట్టు.)

కైలు=కయిలు. వి. (హిం. కైల్) పండినధాన్యము కొలత. (శ. ర.)

జ: కైలుదారుఁడు.

కైలుదారుఁడు=కయిలుదారుఁడు. వి.(√కైలు) కైలు చేయించెడియధికారి.

కైళము. సం. వి. అ. న. ౧. వేడుక, వినోదము.౨. కేళీసమూహము.

కైవడి=కయివడి. వి. (కై[1]+వడి) ౧.కరజవము, చేతివడి, చేతిచురుకు.

గీ. కైవడి యనంగఁ దగు రీతి కరజవంబు.ఆం.భా. ౩. ౫౨.

క. కైవడి మెకములఁ గ్రుమ్మెడి,కైవడి మాయావ చేవ కనఁబోయెదుగా, దేవర మాదేవరవలె, వేవేగమె సామి వేఁట విచ్చేయవయా. సారంగ. ౧. ౭౬.

౨.ప్రకారము,రీతి; పోలిక,సామ్యము.

క. ... మెకములఁగ్రుమ్మెడి,కైవడి...సారంగ. ౧. ౭౬. ఆం. భా. ౩. ౫౨.

చ...పొలలోఁ బడినబల్లులకైవడి నెల్లవెంటలన్, జెడితిమి వేయు నేల సరసీరుహసంభవ దుష్ట దైత్యుచేన్. హర. ౩. ౧౫.

క. విను మలుక వొడమి మిక్కిలి, కను దెఱచిన త్రిపురవైరికైవడి యీయ,ర్జుననందుఁ దోఁచుచున్నది....భార. భీష్మ. ౨. ౯౩.

ఆం. భా. ౨. ౩౦౨.

కైవడిముస్తె=కయివడిముస్తె. వి.(సం. కైవర్తముస్తా.) తుంగముస్తె కీ.(శ. ర.)

కైవర్తకుఁడు. సం. వి. అ. పుం=కైవర్తుఁడు.

కైవర్తము. సం. వి. అ. న. కైవడిముస్తె, తుంగముస్తె.

కైవర్తి. సం. వి. ఈ. స్త్రీ. కైవడిముస్తె. (కల్ప)

కైవర్తుఁడు. సం. వి. అ. పుం-నీటియందు వర్తించువాఁడు-చేఁపలఁ బట్టువాఁడు, జాలరి.

కైవల్యము. సం. వి. అ. న-కేవలత్వము, ఐక్యము-౧.ఒంటరి యగుట,ఏకాకిత్వము.౨.(రెండు పదార్థములు) ఒకటిగా అగుట. ౩. నిర్వాణము, మోక్షము.

కైవళి=కైవడి.

(ఉపమ, పోలిక.)

సీ. కైవడి కైవళి కయివడి కాఁదువు ... పోలిక యనఁగఁ బొల్పొందు నుపమపేరు.ఆం.భా. ౨. ౩౦౨.

కైవసము=కయివసము. విశ. (కై[1]+వసము) -హస్తగతము-వశము, స్వాధీనము.

క. కావేరిని స్మరియించినఁ, గావేరిని దీర్ఘమాడి కావేరినదిన్, సేవించిన వారలకున్, గైవసమగుఁ గ్రతుఫలంబుఁ గైవల్యంబున్. శేష. ర. ౧౮౨.

సీ. వరుఁడు గైవస మైనవనిత స్వాధీనభర్తృక ... నరస. ౨. ర౦.

కైవారపుఁజెయ్యి=కయివారపుఁజెయ్యి. వి. (కైవారము[1]+చెయ్యి) నమస్కారవిశేషము.

రగడ. తనరుశరణ్యస్థలముశరణ్యస్వామికి నిడె కైవారపుఁజెయ్యని. హంస. ర. ౨౧౩.

కైవారము[1]=కయివారము[1]. వి.(త. కైవారమ్.) స్తోత్రము,పొగడ్త.

వ...హరసఖవీరభటహరిణశార్దూలుండును సుర రాజశూరపరివారవారివాహపవనుండును న నుకైవారంబులు సెలంగ నరకాసురుఁడు... ఉ. హరి. ౧. ౪౯.

సీ. కైవార మనఁగఁ బొగడ్త యనఁగఁ. గీ. బొగడిత యనంగఁ బొగడు నాఁ బొగడిక య న, మెప్పు నా మెచ్చు నాఁగను మీఱు వి నుతి. ఆం.భా. ౧. ౧౧౪.

సీ. మొనలకైదువవాఁడు మినుకుఁగైవారముల్ మెచ్చువాఁడని బీర మెచ్చువాఁడు.అచ్చ. రా. బాల. ౧౩.

గీ. అనుచుఁ గైవార మొనరించునవ్వలంతి, మ న్ను వేలుపు మేల్పంతిమదికి మీఱ, వేడ్క లొనగూర్చి పనిచి ... నీలా. ౨. ౪౨.

మ. బలభిద్వహ్నియమప్రచేతసులకున్ బ్రహ్మే యు వే మెల్లనుం, గలిభూపాలునియొద్దిపాత కుల మీకైవారదుర్భాషణం, బులకుం గాని యతండు మెచ్చఁడు దయాబుద్ధిం బరాధీన వృత్తుల నిశ్చేదల మమ్ముఁ గావఁ దగు నీద్రో హంబు లేకుండఁగన్. నైష. ౭. ౮౯.

(ఈప్రయోగములో.శ.ర.దీనిని తత్సమమునుగా గ్రహించెను. కాని శ్రీనాథునకు సంస్కృత సమాసమున సంస్కృతేతరపదములఁ జేర్చునల వాటు గలదు. ఇట్లే 'హేరాళ'పదమునుగూడఁ బ్రయోగించినాఁడు.

క... వసియించున్, హేరాళక్రీడాసం,చారిణి నూకాంబ భక్తజనరక్షణకై. భీమ. ౧.౧౦౦.

'కయివారము' అను రూపాంతర ముండుటచేత ను అచ్చతెనుఁగుగ్రంథములలో నుండుటచేతను సంస్కృతనిఘంటువులలో లేకపోవుటచేతను దీనిని అచ్ఛికముగా గ్రహించుటయే యుక్తము)

కైవారముచే(సే)యు=స్తుతించు, పొగడు.

శ. నావుడు నిది యా సంజయ, కైవారముసేసె దీవు కొంతేయుల... భార.ఉద్యో.౨.౨౨౭.

క. మీవా రెల్లను బెలుచం,గైవారముసేసి రత నిఁ గౌరవనాథా. భార. ద్రో. ౩. ౧౩౬. ,

జ: కైవారవుఁజెయ్యి, కైవారి.

కైవారము[2]=కయివారము[2]. వి.చుట్టుసంఖ్యో లఁది. (చి.ని.) పరిధి,గుండ్రనివానిచుట్టుకొలఁ ది.(బ్రౌ)ఉదా:నూతికైవారము, ప్రహరికైవార ము, నెు.

కైవారి=కయివారి. వి.(కైవారము[1] + ఇ-ఇది ఒ యారివంటిది.) స్తోత్రపాఠకుఁడు, కైవారముచే యువాఁడు, వంది.

మ. కమలాక్షుస్మరఘస్మరాబ్జభవులుం గైవార లంభోధిపూరములుం బుక్కిటిసాము గో త్రగిరివర్గమ్ముం గనత్కంముకా,భము...హరి. పూ. ౧. ౪.

సీ. సారిది సంజాతుఁడై సూతుండు నాఁ జనుసు నియుఁ దన్మఖకాలమునన జనన, మొంది మా గధుఁడు నా నొప్పనంయమియు నయ్యజా నాజ్ఞఁ గైవారులై దివిజుల,నలరించపని ను న్కి...హరి. పూ. ౧. ౧౧౯.

కైవా(వ్రా)లు=కయివాలు. అ. క్రి. ౧. వంగు, ఒఱగు.

ఉ...బలుసుఁబండులచాయఁ దనర్చి పండికై, వ్రాలినరాజనంబులకు వచ్చుశుకంబులఁ జేర నీక...విక్ర. ౪. ౩౯.

గీ. ప్రొద్దు కైవాలువాఁక నప్పాలఁతు లుండి, యే మొ సర్వేశ్వరుం డిట్లు తామసించె, ననుచుఁ జింతించుమన్న ... శుక. ౩. ౯౩.

౨. పశ్చాదులు క్రిందికి దిగు, వ్రాలు.

సీ. నఖపాళి బెడఁగు మాన్పకు మంచు నుడుగు గై వ్రాలె నా స్ఫటికాక్షమాలిక దగ. ఉ. రా. ౩. ౧౦౩.

౩. పడు.

శా. కంఠేకాలపదారవిందములపైఁ గైవ్రాలి లో లాక్షునిన్, ధుంఠీశ న్నియమించి భైరవుని

మోమ్పుం గేలుతో డాసి వై, కుంఠస్వామికిం జాఁగి మ్రొక్కి ... చంద్ర. ౩. ౭౨.

వ... పన్నీరు నించినయన్నీరుతిత్తు లొత్త వియత్తలంబునం బాఱి కై వ్రాలుధారల వాద్యంబులు దడిసిన ... ఆము. ౪. ౩౫.

౪. గలించు, కడచు.

గీ. ప్రాయ మింతకు మిగులఁ గై వ్రాలకుండఁ, గాశికాఖండ మనుమహాగ్రంథ మేను, దెనుఁగు చేసెద ... కాశీ. ౧. ౭.

౫. మ్లానమగు, వాడు.

క. వ్రాలిన యొప్పులు వెలఁ గై, వ్రాలినహృదయాంబుజంబు వసుమతి మీఁదన్, వ్రాలినచూపులు మొగమున, వ్రేలంగను ముక్కు మీఁది వ్రేలుం దనరన్. సారంగ. ౨. ౨౫౫.

౬: కై వాలుచు.

కైవా(వ్రా)లుచే(ల్చె)= కయివాలుచే.
స. క్రి. (√కైవాలు) కై వ్రాలఁ జేయు. (శ. ర, శ్రీ.)

కైవీఁగు=కయివీఁగు. అ. క్రి. (కై[1] + వీఁగు.)
చేయుచున్న పని నుండిమరలు, పనిమాను.

వ. అంత నుభయబలంబులుం గైవీఁగి నిజశిబిరంబుల కరుగునవసరంబున...కు.సం.౧౧.౭౭౩.
(ఇట 'యుద్ధకృత్యము మాని' అని భావము.)

కైవు=కయివు. వి. కైపు, మత్తు.
కైవెక్కు=మత్తిల్లు.

క. నావుడు మురారి నవ్వుచు, నా వేఁదుఱు నూఱడించి యనుచితము మహీ, దేవునిఁ జంపుట యనుచుం, గైవెక్కినవాని మేను కరమున నిమిరెన్. ఉ. హరి. ౨. ౧౫౦.

కైశికము. సం. వి. అ. న. వెండ్రుకలసమూహము. (కొప్పు, సిగ, మొ.)

కైశికి. సం. వి. ఈ. స్త్రీ. ౧. శృంగారకరుణరసానుకూల మగునొక కావ్యవృత్తి. ౨. దుర్గ.

కైశోరము. సం. విశే. (అ. ఈ. అ) కిశోరసంబంధమైనది. వి. అ. న. వయోవిశేషము. (పదునొకండు మొదలు పదునేనేండ్లవఱకు ఉండువయస్సు అని కొందఱు. పదునొకండు మొదలు ఇరువదియేండ్లవఱకును ఉండువయస్సు అని కొందఱు. పండ్లు వచ్చినది మొదలు మూఁడుసంవత్సరములవఱకును ఉండువయస్సు అని మఱికొందఱు.)

కైశ్యము. సం=కైశికము.

కైసడలు=కయిసడలు. అ. క్రి. (కై[1] + సడలు)
కైవ్రాలు, ఒఱగు, వంగు.

ఉ. వేనలి పాటపాటనరనెంద్రుకతోఁ దిలతండులాన్వయ, శ్రీ నటియింపఁ గైసడలి వ్రేఁకని చన్నులు పాలవంకలై, కానసియార్ప... కాశీ. ౭. ౧౫౯.

కైసరుఁడు. వి. (సం. కవీశ్వరః.) కవి.

సీ. కబ్బపుఁజేఁతరి కయి కైసరుఁడు మాటలల్లువాఁ డను పేళ్లు చెల్లుఁ గవికి. సాం. ని. మాన. ౬.

కైసాటిచుక్క=కయిసాటిచుక్క. వి. (కై[1] + సాటి + చుక్క)-చేతియాకృతి గలనక్షత్రము-హస్తనక్షత్రము. (శ. ర.)

కైసేఁత=కయిసేఁత. వి. (√కైసేయు) అలంకరించుట.

క. గరిత లలంకృతి సేయఁగ, గరువపుముసు వపుసు హెచ్చి కన్నియ దనరెం, బరియణపుం గైసేఁతల, నరపతి యొఱపతిశయిల్లునటనఁ జెలంగెన్. విజ. వి. ౨. ౧౩. ఆం. భా. ౨. ౧౪౬.

కైసేయు=కయిసేయు. స. క్రి. (కై[1] + చేయు.)
౧. అలంకరించు.

క. ఆసమయమునఁ గుమారిం, గైసేసి తదీయజననిఁ గాన్పించి చకో, రీసుదతి సుప్రయాణ, శ్రీసూచన చేసి ప్రణతి సేయించుటయున్. విక్ర. ౪. ౧౯౨.

ఉ...కై,సేసికొనం గడంగె... విక్ర. ౭. ౭౨.
ద్వి. పురము కైసేయించి...అ.మ. క. ౫. ౨౫౩ పా. ౨. పం.
౨. పూజించు, అర్చించు.
మ. తనకుం దాన ప్రతిష్ఠితుం డయినయాదక్షా ధ్వరధ్వంసి నే,మును పూజించితిఁ బిమ్మటన్ హరియు నంభోజాతగర్భుండునుం, గని కైసేసిరి యంతమీఁద సురలున్ గంధర్వులుం జేరి య,ర్చనముల్ సేసిరి మీరు చేయుఁడు తగన్ సమ్యక్సమారాధనల్. భీమ. ౪. ౨౦౩.

## కొ

కొంకనక్క. వి. (కొంకు + నక్క=పిఱికినక్క-బ్రౌ.) క్షుద్రజంబుకము, చిన్న జాతినక్క.
ఉ. చీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలున్. భార. అశ్వ. ౨. ౧౧౭.
గీ...కొంకనక్క యనఁగ, క్షుద్రజంబుక మంచు నెంచుకొనఁ దగును. ఆం. భా. ౨. ౮౩.
ఆ. కొంకనక్క చావ గొట్టి లేమిటి శేడ్చు. వేమన. ౨. ౫౮.

కొంకర. వి. (క. కొక్కి) వంకర, వంపు, వక్రత్వము. (చూ. కొంకరలుపోవు.)
విణ. వక్రము, వంకర యైనది.
క. ఎక్కడి మెఱగ మెక్కడిపాడు, వెక్కడిరూ పేడగమన మెక్కడికంఠం, బెక్కడ వినము కనుంగొన,మిక్కొంకర మెకము ననుచు నేడ్తెఱ దానిన్. వేం. పంచ. ౧. ౪౭౬.
వంకరకొంకరమాటలు=అడ్డదిడ్డపుమాటలు.
వ...ఈబ్రహ్మచారి శంకరునిగుఱించి యింకను వంకరకొంకరమాట లాడ నుంకించుచున్న వాఁడ ... హర. ౪. ౩౩.

జ: కొంకరలుపోవు,కొంగోడు,కొంగోడుపడు, కొంగోడువోవు.

కొంకరలుపోవు. అ. క్రి. (√ కొంకర.) శైత్యాదులచే వంకర యగు, మెలికలుతిరుగు.
చ. నినుఁ డనచంక నైచుకొని నీరనిధానచతుష్టయంబునన్, జని చని సాంధ్యకృత్యములు సల్పెడునంతఁ ద్రిప్పి తెచ్చి పెం,పున నటు వైచి కొంకరలుపోయిననీ మెయి చక్కనొక్కి పో, ననిచిన వాలినందనుఁడ నంగదుఁడన్ దళకంఠ వింటివే. రామా. ౭. ౨౫౮.
కొంకరవంకరలువోవు=కొంకరలుపోవు.
ద్వి ... ఈశ్వరుని, నడు మటు వీఁగి యున్నది యొక్క దెసకు, వారక కొంకరవంకరల్పోయి, గారీసు చేతులు పూరించినవియు. బస. పు. ౩. ౫౬౩. పం.

కొంకి=క్రొంకి. వి. (క. కొంకి) ౧. వస్తువును లాగికొన నుపయోగించునట్లు వెదురు మున్నగువానికి చివరఁ గట్టుపుల్ల, మొ.
వ. ఇవ్విధంబున వెడలం దిగిచి బ్రదికించి కొంకి గలనిడుపువెదురునం జేఁద పుచ్చి నీరు దిగిచి యబ్బాలునిదప్పి దీర్చి... దశకు. ౧౧. ౭౮.
౨. అందనిపండ్లులోనగువానిఁ గోయుటకు ఉపయుక్తముగా వంకరచిల్లదోఁపినకోల, దోఁటి. (శ. ర.)
౩. చోరసాధనవిశేషము;యుద్ధసాధనవిశేషము.
ఉ. కత్తియు నీలిచీరయును గంకటి రజ్జువు వారసంబు ముల్,గుత్తియు వాటురా లినుము గొంకియు నక్షుత లొల్కిబూదియున్. చెన్న. ౩. ౘ౭౪. బస. పు. ౫. ౩౩౮ పం.
వ...పౌండ్రభూపాలుండు యదువీరునగరంబు కలుఁగోట వికటంబుగా వలుఁదటంకంబుల నటకించియు దంచనపుగుండ్లం బడవైచియుఁ గొంకి క్రమ్మడు దగరు మొదలుగాఁ గలసాధనంబులచేఁ జీకాకు పఱచియు...ఉ.హరి. ౩. ౩౬.

౪. వంపుచీల. (శ. ర.)

౫. కాలిమడమపైభాగము.

సీ. మడమ యం చనఁగను మనుఁ బార్ష్ణి కొంకి నాఁ డదుపరి దేశమై తనరుచుండు. ఆం. భా. ౨. ౧౩౫.

చ. కవవటు డించి యే గునుకఁగా సురెఁ గొంకు లఁ దార్చి కూలుడు, న్నివిడినబొజ్జపై మిగు లునిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి పెనం గ వల్లుపముఁ ద్రెంచి యనంతునిగంట్ల కూన పుం, జెవులు గ గావ కట్టు గనె చేరుల పెక్కి యు దోఁపు నొల్చి పోక. ఆము. ౬. ౭౧.

(బ) ౧. ముచ్చిలిగుంటకు ప్రక్క నుండెడియె ముకలు. (ఉదా: మెడకొంకులు. శ. ర, బ్రా.)

౨. మోఁకాలిచిప్పకు లోతట్టు రెండు ప్రక్కల నుండెడియెముకలు. (శ. ర.)

కొంకిగోరు=కొంకివంటిగోరు, వంకరగోరు.

సీ. బూరుగుకాయఁ బోల్ బోరలు లవిటులకొన కత్తెరలకట్లు కొంకిగోళ్లు. ప్రబంధ. ౧౩౦.

ఇప్లే: కొంకిప్రేళ్లు.

సీ. బొక్కబొమ్మలు లోఁతుఁబొట్టలు మిడిగ్రు డ్లు గూనివీఁపులు నిడుఁగొంకిప్రేళ్లు. ఉ. హరి. ౨. ౧౨౨.

కొంకిసిగ=కొంకివలె వంకరగా నుండుసిగ.

వ... చెవులసంకులు లోవంకభుజంబులు కొంకి సిగలు గావిదుప్పటులు నొప్ప... ఆము. ౪. ౩౫.

కాలికొంకులు=డేగ మొదలగుపక్షులకాళ్లయం దలి కొంకివంటివంకరగోళ్లు. (బ్రా.)

కొంకి(కు)కొను. అ. క్రి. =కొంకు. (√కొంకు-స్వార్థమున 'కొను')

(వెనుదీయు)

ఉ... అనుమానములో నొకకొంత గొంకికొం, చ క్కట నీ కొకందులకు నచ్చిక లేక మెలంగ విష్ణుదా, సెక్కడిభర్త గాఁగ సృజియించె వ జుం డని హేల నవ్వుచుక్. హంస. ౧. ౯౯.

కొంకు. అ. క్రి. ౧. భయపడు, జడియు, ఉలుకు.

గీ. వచ్చి యచ్చండశర్మ తా వాకిటికడ, నిలిచి తనయగ్రమహిషినిఁ బిలువఁగా నె, గుండె జ ల్లని చతురుండు కొంకుచుండ, నతని నె ట్లిం తి యిలు వెళ్ల ననుప వలయు. హంస. ౩. ౧౭౪.

గీ. కుచభరంబున నడుము కొంకుచు వడంక, నూ లు దోఁదుసు వేడ్క నవ్వాలుఁగంటి. హంస. ౨. ౨౨.

క.... కాననాంతమున ముచ్చులకుం, గొంకి యస హాయతను నే, వంకకు నరిగితివో ... విక్ర. ౭. ౧౨౭.

౨. సంకోచించు; వెనుదీయు.

ఉ. ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక ల క్కయింటఁ జి, చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ దూలఁబుచ్చితి ... భార. శల్య. ౨. ౧౩౪.

శా... ఆచిర్తొండనంబీశ్వరుం, డేమిక్ గొంకక పెట్టు జంగములకుక్ హేరాళ మిష్టాన్న ముల్. హర. ౨. ౨౯.

క. క్రుంకె నెల మరుఁడు వేటకుఁ, గొంకె ను దూచ్చయము డొంకెఁ గుముదంబులడా, లింకెఁ దిమిరోత్కరంబు త, లంకె రవిచ్ఛవి యు దివిఁ దొలంకెఁ గడంకక్. బహు. ౨. ౧౦.

వి. ౧. భయము, జడుపు, బెదరు.

ఆ. తలఁకు పుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వె, న్నాటు దోఁచె ముట్టుపాటు దొడరె. భార. విరా. ౨. ౧౦౬.

ఆ. ఓరి దోసకారి యుడుగనికొ్రవ్వునఁ, బెల్లు మీ టి జగముతల్లి యైన, ప్రొద్దుఁగొలపుసామిముద్ది య నిటు తేల, కొంచుఁ బోయె దిపుడు కొం కు లేక. అచ్చ. రా. ఆర. ౬౯.

౨. సంకోచము.

క. తెలివ యొడఁబాటుమాటం, బలిమోయిన కొంకుతోడ బ్రాహ్మణుఁ గొని కన్యఁ గగు నెడకు నరిగె...భార. అను. ౧. ౭౮.

చ ... మానక వేచని మంతనంబున, న్వనితలు కొంకులో భయమునన్ వినిపించిరి యేమి మాయయో, మనుజవరాగ్రగణ్య మణిమాలిక గర్భముఁదాల్చె వింతగన్.ఉ.హరిశ్చ.౨.౯౮.

౩. వంకర, కొంకర. (చూ. కొంకువోవు)

చ. పదములకొంకువోఁ బిసికి ప్రక్కలస్రుక్కడలించి దంశవం,శదమనవృత్తి నింపొసఁగి సాస్న నఖంబుల దువ్వి నెత్తురుల్, చిదికెడు గండ్ల భూరజముచిల్కి...పాండు.౫.౨౩౬.

కొంకుకొసరు=సంకోచము;జంకు. (ఈరెండుపదములును సమానార్థకములు. చూ. కొసరు. ౪. అర్థము.)

గీ. సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోఁడి, పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర, నొడిసి తల పట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకుకొసరించుకయు లేక కూలఁ దాఁచె. భార. విరా. ౨. ౧౨౨.

గీ. గోత్రపరిపంథిలోఁ గొంకుకొసరు లేక.కువల. ౪. ౬౬.

క. అని రంభ సిగ్గుపడఁ బల్కిన దానికిఁ గొంకుకొసరు లేక దశముఖుం, డనుమానింపక యిట్లను...నిర్వ. ౬. ౬౨. విక్ర. ౩. ౯౭.

జ: కొంకనక్క, కొంకికొను, కొంకుపడు, కొంకుపాటు, కొంకువోవు.

కొంకుప(వ)డు. (గ్రా.)అ. క్రి. (√కొంకు)భయపడు; సంకోచించు; వెనుదీయు.

కొంకుపాటు. వి. (√కొంకుపడు)౧.భయపడుట; భయము.

సీ. పరులు తిట్టినచోటఁ బ్రత్యుత్తరము లేక ప్రాణహానికిఁ గొంకుపాటు లేక.గీ...అపుడ విద్వత్ప్రబంధంబు ననుకరించె,జారిణీజార నవరహస్యంగమములు. కవిక.౪. ౧౦౭. (శ. ర. పా.)

౨. సంకోచపడుట; సంకోచము.

చ...వానిచెంతకున్, గుతుక మెలర్పఁగాఁ జని శశంగని కోమలి కొంకుపాటులోఁ, గొతుకుచుఁ బల్కె...హంస. ౩. ౨౨౦.

కొంకు(లు)వోవు. అ. క్రి. (√కొంకు). ౧. (శీతబాధాదులచే) కొంకరలుపోవు, వంకరయగు.

గీ. కొన్ని దేశంబు శీతముచేఁ గొంకువోయె. కాశీ.౧.౧౩౭. (దేశములు=దేశములోనిప్రాణులు.)

చ...ఆపదం, బొరయకయుండఁ జేయును ప్రభూతపుసీతునఁ గొంకువోయెదున్. భార. శాం. ౩. ౩౧౩. (ఈతఁడు అనుకర్తృపదము అధ్యాహార్యము.)

ద్వి. కొంకులువోక లోవంకలు గాక,పొంకంబు దప్పక పొందులు చెడక ...అక్కజం బగుచుఁ, బాదములొప్పింటిభాతిని నమర. పండితా. పురా. ౯౩. పా.

కొంగ. వి. (సం. క్రుఞ్.) ౧. క్రౌంచపక్షి.

గీ. కొంచ కొంగ యనంగను గ్రౌంచ మెసఁగు. ఆం. భా. ౨. ౯౩.

౨. బకము.

సీ. కొక్కెరా లనఁగను గొక్కు లనంగను గొక్కెర లనఁగను గొంగ లనఁగఁ, బరఁగు నఖిఖ్యలు బకవిహంగములకు...ఆం. సం. తిర్య. ౧౨.

గీ...కొంగ యన బకంబు. సాం. ని. తిర్య.౭౯.

(గెలుకొంగ, గుడికొంగ, పినిగలకొంగ, పూఁగొంగ, సంకుబుడ్డికొంగ, దోసికొంగ-ఇవి కొంగలలోని భేదములు అని క్రొత్తబ్రా.)

కొంగమెడ=పొడుగుమెడ.

కొంగకాళ్లవాఁడు = ఎత్తైనమోఁకాళ్లుగలవాఁడు, ఊర్ధ్వజానువు.

జ: కొంగగొడ్డలి, కొంగవాలు.

**కొంగగొడ్డలి.** వి. (కొంగ+గొడ్డలి) త్రవ్వెడుసాధనవిశేషము. (దీనిచివర కొంగముక్కువలె నుండును. బ్రా.)

**కొంగవాలు.** వి. (√కొంగ) మాలమాదిగలు ధరించెడికత్తి; ఒకవిధమైనకత్తి.

క. సురియాళుచేతికత్తికి,నరు లందఱు పేరువెట్టినారు ధరిత్రిన్,మఱి కొంగవా లనంగను,దిరుమలపై నుండు దేవదేవ ముకుందా. (దేశ్యనామార్థకోశము.)

సీ. మాతంగుఁ డగువానిచేత నుండెడికత్తి కొంగవా లనఁగఁ జెలంగుచుండు. ఆం. భా. ౨. ౨౯.

(పందివేఁట) ఉ. పక్కుల నొంపఁ జూచి మఱి కొందఱు కొన్నిటిఁ గొంగవాలులన్,బక్కలు సించినన్...యయా. ౨. ౧౦.

సీ. పంకిలిబ్బిదొరలా వంకిలి నొందించి కొంగవాలున గట్లగొంగ గెలిచి.అచ్చ.రా.యు. ౪౭౪.

(వేశ్యావర్ణనము) వ...మదనుముద్గరంబు లన శంబరారికతారంబు లన నంగభవుకొంగవాలు లన...భీమ. ౧. ౧౧౭.

**కొంగు.** వి. చెఱఁగు, చేలాంచలము.

గీ. అట్టికర్ణునిఁ గొంగున నగ్ని డాఁచి,నట్టు లెమ్మెయి డాఁచితో యమ్మ చెపుమ. భార.స్త్రీ. ౨. ౧౭౪.

ద్వి. పొంగి చిచ్చులుకంగఁ బోవుచుఁ జీర,కొంగోసరించుపెన్వెంగలియట్లు. బస. పు. ౩. ౧౧౪౦ పం. ఆం. భా. ౨. ౧౫౨.

సా: కొంగు తగిలినను కొంత వాసియే.

కొంగుపసిఁడి,కొంగుబంగ(గా)రము= -కొంగునఁగట్టినబంగారము- ఇది ఒకరు ఈయ నక్కఱ లేకుండ తనకు తానే లభించు ఉత్తమపదార్థమునకు ఉపమానముగా ఉపయోగింపఁబడును.

క. తనుఁ గన్నతండ్రి సెప్పిన, పని సేసిన సుగతి కొంగుపసిఁడియ కాదే.భాగ. ౯.౫౫౭.

చ. విటులకుఁ గొంగుబంగరము వేడుకకాండ్రకుఁ బట్టుఁగొమ్మ యు,త్కటతరమన్మథార్తులకుఁ గల్పకుజంబు...హంస. ౧. ౨౧౫.

క. రామానుజయ్యదాన, ప్రామాణికముద్ర కొంగుబంగార మగున్. పాండు. ౧. ౬౫.

కొంగుబత్తెము = కొంగున ముడుచుకొనుబత్తెము,ధాన్యరూపమైనకాపుకూలి.(దీనిని వినాయకుని చేట యందురు)

చ...నిలిచినకుప్పకావలికి నిల్పుదు రప్పురిఁగొంగుబత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబు పొసంగు వేలుపున్. చంద్రా. ౧. ౨౫.

కొంగుముడి= ౧. భార్యాభర్తలు నద్యాదులందు స్నానము చేయునపుడు ఇరువురబట్టలకొంగులు కలిపి వేయుముడి.

చ. తిరుమలకంచిపుష్పగిరితీర్థములుం జని కొంగుముళ్లతో, వరములు దంపతుల్వడయ వారక కాన్కలు వైచి...హంస. ౨. ౯౫.

౨-కొంగున వేసికొనినముడి- ఇది సిద్ధముగా నున్నపదార్థమునకు ఉపమానముగా ఉపయోగింపఁబడును.

ఉ. అంగన నాకుఁ గొంగుముడియై తగు నీ విపుడిచ్చునీవి త,న్వంగి భవన్మనోజ్ఞమధురాధరకాంచనకాంచికాస్థలుల్,తంగెటిజున్ను ముంగిటినిధానము నా నటుగానఁ బాయకే, నంగజునాన నాదుహృదయం బెఱుఁగున్ వలపంబుజావనా. రామా. ౪. ౧౬౨.

చ...శుభప్రసంగ మం,గనకు నొసంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు నావుడున్.వసు. ౩. ౪౩.

కొంగుముడి వేసికొను=నిశ్చయ మని యెంచుకొను.

క. మది తహతహ విడిచి యిఁకఁ, ముదమున సతులార కొంగుముడి వేసికొనుం,డిదె నేఁటి మాపటికిఁ గూ,ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్ముఁ. ప్రభా. ౪. ౮౪.

జ: కొంగుపఱచు, కొంగుమాయు.

**కొంగుపఱ(ఱు)చు.** అ. క్రి. (√కొంగు) రతికి సిద్ధ మగు; సిద్ధ మగు.

గీ. వార లెల్లను బంగారువంటినిన్నుఁ, బాసి పలుగాకులకుఁ గొంగుపఱచు చెలుల, నంటి వర్తింప వాని కేమాయె...సుక. ౨. ౧౨౦.

గీ. గుట్టు నానయు విడనాడి కొంగుపఱిచి, యగడుపడి పడిచి పడసినట్టిపసిఁడి, కటకటా యేమిటికి నెక్క గడనవంక, నేమి గంటిని దొడుసు నా కేమి యనుచు. విప్ర. ౩. ౬౧.

గీ. కవుల కీఁగలజాతి యొక్కటియు లేదు, వితరణము వైశ్యులకుఁ బెండ్లివేళఁ గలదు, కొంగుపఱచిరి నృపతు లాకూటికొఱకు. రామలిం. ౨౩.

ఇట్లే:-కొంగొడ్డు.

గీ ... కాసువీసములకై యబ్బినట్టి, పురుషులకు నెల్లఁ గొంగొడ్డి పాట్టపోసి, కొనెడి వెలయాలి బ్రదుకిట్టి దనఁగ నేల. పరమ. ౩. ౨౦౬.

**కొంగుమాయు.** అ. క్రి. (√ కొంగు) చెఱఁగు మాయు, బహిష్ఠ యగు. (శ. ర.)

**కొంగొంగు.** వి. కొంగలు చేయుధ్వనికి అనుకరణము.

సీ...కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ. హర. ౪. ౧౯.

**కొంగోడువడు**=కొంగోడువోవు.

(ఒడ్డగిల్లు, ఒఱగు.)

సీ. కలఁగి వారిధులపంకము నివ్వటిల్లెను గులపర్వతములు కొంగోడువడియె. మై. ౨. ౩౬.

**కొంగోడువోవు**=కొంగోడువడు. అ. క్రి. (కొంగోడు + పోవు) కోడు విషమముగా నుండుటచే మంచము మున్నగునవి యొఱగు.

ఆ. కుక్కవడిన మిగులఁ గొంగోడువోయినఁ, గుఱుచ యైన మిగులఁ గొంచె మైన, మలిన మైన నేఁత పలుచ నైనను నల్లు,లున్న నుల్కమంచ మొప్ప దండ్రు. వి. పు. ౩. ౨౧౪.

**కొంచె**=క్రొఁచె. వి. (సం. క్రౌంచః. ప్రా. కొంచో. క. కొంచ.) క్రౌంచపక్షి.

సీ. పసిఁడికీల్బొమ్మ మీపజ్జ నేఁగదు!గదా కొంచలార కొలంకుటంచలార. అచ్చ.రా.ఆర. ౮౯. ఆం. భా. ౨. ౫౩.

కొంచగట్టు=క్రౌంచపర్వతము. అచ్చ.రా.యు. ౨౦౫.

ఇట్లే: కొంచగుబ్బలి. ఆం. సం. దేవ. ౧౩.

కొంచదీవి=క్రౌంచద్వీపము. (శ. ర)

కొంచ మొగ్గరము=క్రౌంచవ్యూహము. (శ. ర)

కొంచసారము=(క్రౌంచపక్షిధ్వనివంటిధ్వని గలది.) సప్తస్వరములలో నాల్గవది, మధ్యమస్వరము. (శ. ర.)

**కొంచించు**= కొఁచు. అ. క్రి. (√కొంచు-స్వార్థమున 'ఇంచు') సంకోచించు,

క. కొంచింపక వడిఁ బెన్నిధిఁ, గాంచిన పేదయును బోలె ఘనతరహర్షో, దంచితమానసుఁడై యా,పంచాననమధ్యఁ జేరి పలికెఁ బ్రేమఁ. రసిక. ౪. ౧౩౫.

మ ... పుత్రుం డటం,చును గొంచింపక వీని నొంచుఁ డిపుడు...దశా. ౮. ౧౬౧.

**కొంచు**=కొంచించు, కొఁజు. అ. క్రి. (సం. కుఞ్చ్) ౧. భయపడు; సంకోచించు.

లయగ్రాహి....పతిక్ బ్రా,ర్థించుచు జలేభుల
కుఁ గొంచుచు ఖగాళి బెదరించుచుఁ జెలంగి
రి వాసించుచు లతాంగుల్. ఉ. రా. ౩.
౨౧౪.

క. క్రోధుఁడు హింసను గని దు,స్సాధాటోప
మున మల్లచఱచుచు వినుమా, యోధర్మపత్ని
నీ వను, సాధనమున నెట్టివారిఁ జంపుదుఁ
గొంచక్. ప్రబోధ. ౨. ౬౬.

రగడ. కొమ్మ యిది నిజంబు పలుకఁ గొంచెఁ
గొంచెపఱచి ప్రేమ. వరాహ. ౩. ౯౨.

ఉ. కొంచక యంబుధిం బడినకొండలపత్త్రము
లూడ్చదయ్యె నూ,అంచులకత్తి...వసు. ౩.
౧౦౭.

౨. మందగించు.

మ.కనుఁగొన్నంతనె కన్యకామణికి లేఁగా నింత
గాన్పించెఁ జ,న్నోనలక్ నీలిమ యావరించె
ముఖపాండుశ్రీ మిటారించెఁ గు,ల్కునడల్
గొంచె...ఉ. రా. ౧. ౧౮౧.

వి. ౧. కొంకు, సందేహము.

ఆ. ఓరి దోసకారి కూరిమిమై దోడ,వనుచు నిన్ను
నమ్మి యకట పగతు,తోడఁ బో రొనర్పఁ
దొడఁగినచోఁ గికు,రించి రాఁగఁ జనునె
కొంచు లేక. అచ్చ. రా. కిష్కిం. ౨౯.

౨. తక్కువ, లోపము.

గీ. వేలుపులఱేఁడు దన కొకనెల్లమొదనె,గల
దనుచు నిక్కు నింతియు కాని యిట్లు,గలవె
పలువన్ని యలగిడ్డికదుపు లంచు, నెంచుచుం
డు నతం డెందుఁ గొంచు లేక. నీలా. ౧.
౪౮.

౩. మదము, గర్వము.

మ.ముదితల్ కొండలు కెంపురాబురటకొమ్మల్
పూని యేతేర నీ,ట దళత్పంకజనేత్ర యో
ర్తు తననీడక్ జూచి యాకార కొం,చు దలి
ర్పక్ జెలి యెవ్వతో పగలు పంజుల్ మించ
నే తెంచె నే,నిదిగో దాని జయింతు నంచు
దుమికెక్ హేలావతుల్ నవ్వఁగక్. చం
ద్రా. ౪. ౨౪౫.

౪. ముఱికి చెమట.

సీ...పరఁగుఁ గొం చనఁగను ముఱికి చెమట.ఆం.
భా. ౧. ౧౪౦.

విణ. తక్కువ, అల్పము.

ఆ. ఆట్ల పఱచువారిఁ బొల్లెముగా మర,లించి
సోఁకుఱేఁడు గొంచు గాని,కినుకతోడ న
తనిఁ గనుఁగొని బొమముడు,లదర నిట్టు ల
నుచు నుదరి పలికె. అచ్చ. రా. యు. ౧౦౦.

జ: కొంచించు, కొంచుఁడు.

కొంచేఁడు. విణ. (√ కొంచే) అల్పుఁడు, కించు.

శా ... ప్రత్యర్థిసంహారుఁ డా,భల్లూకేంద్రుఁడు
జాంబవంతుఁడు తలంపక్ గొంచుఁడే ...
సీతావి. ౧. ౧౦౫.

కొంచెకత్తె. విణ. (కొంచెము + కత్తె.) అమాయి
కురాలు.

గీ. రాజముఖి కొంతపడికిఁ దారావధూటి, సా
గసునెమ్మోముఁ దప్పక చూచి పేర్మి, నువిద
నీ వెంతకొంచెకత్తెవె జయంతుఁ,గాపునేసి
నగరితవు కావె నీవు. కువల. ౪. ౧౭౩. (ఇట
వ్యతిరేకలక్షణచే 'జాణ, నేర్పరి' అని భా
వము.)

కొంచెకా(గా)ఁడు. విణ.(కొంచెము+కాఁడు)
అల్పుఁడు, సామాన్యుఁడు.

వ... కించిజ్జ్ఞునై జడమతి నన్నుం గొంచెగానిం
గాఁ దలంచి నీతం జూడఁబోవఁ దెరువైన
నొసంగవైతివి...ఉ. రా. ౮. ౧౧౨.

సీ. నీకుఁగాఁగాఁ జేడె చేకూరినదిగాక కొంచె
గానికి సమకూడు నెట్లు. బహు. ౫. ౧౦౮.
శుక. ౨. ౨౮౫.

కొంచెతనము. వి. (కొంచెము+తనము) తక్కువ తనము, సూక్ష్మత్వము.

ఆ. కలికికురులనిడుపు కన్నులవెడలుపు, గుబ్బ దోయిహెచ్చు గొనబుఁగౌను,కొంచెతనము పిఱుఁదుఁగొప్పుతను బొక్కిలి,లోఁతు నెన్న నెన గలుగుట యరిది. అచ్చ. రా. అర. ౨౩.

కొంచెతనముసేయు=అవమానపఱచు.

గీ. అలిక మరచందురునిలోఁడఁ జెలిమిచేయఁ, దియ్యపలుకులఁ దేనెలు వియ్యమంద, నడపు లంచలఁ గొంచెతనంబుచేయఁ, గమలగంధిమనోహరాకార మలరె. కేయూర. ౪. ౧౩౫.

కొంచెపడు. అ. క్రి. (కొంచెము+పడు) ౧. తక్కువయగు, కొఱఁతనొందు.

వ. తండ్రీ నీప్రసాదంబున నన్నియు సమకూరెడుంగాక కొంచెపడియెడునే... భోజరా. ౬. ౧౯౧.

౨. సన్నగిల్లు, కృశించు.

సీ. కడుకొద్దికటిపటి కడుఁ గొంచెపడియుండె నతనాభి యొకటి యున్నతి వహించె. చంద్రా. ౧. ౯౭.

౩. లాఘవము నొందు, తేలికయగు.

క. ఒరునొద్ద కేఁగి హైన్యము, పరికింపక వేఁడి కొంచెపడియెడుకన్నన్,మరణం బుత్కృష్టంబు...శివధ. ౫. ౯౪.

గీ. నీదుపరమపతివ్రతానియతి కెదిరి, కొంచెపడెఁ దారకలలోనఁ గాంచు మనెడి,కరణి నిజపత్నిలోన భూవరసుతుండు, తగ నొనర్చె నరుంధతీదర్శనంబు. ఇందు. ౬. ౬౨.

౪. తగ్గిపోవు, క్షీణించు.

గీ. క్రూరసంతతి చెలయునే కొంచెపడక, విరివిగా ధర్మసంతతి వెలసినట్లు. నీతి. ౫౯.

౫. వ్యర్థమగు, నిష్ఫలమగు.

గీ. తరుణి నీచేత మదనతంత్రంబు లెఱుఁగఁ గోరి యున్నాఁడ నాయాస కొంచెపడక, యుండ సురత సుఖాంభోధి నోలలార్చి,యిం, పు సొంపార నన్ను మన్నింప వలయు.వి.పు. ౨. ౨౧౭.

కొంచెపఱుచు. స. క్రి. (√కొంచెపడు) కొంచెపడఁజేయు.

(తగ్గించు, తక్కువచేయు)

క. అప్పుడు చతురంగంబుల,నుప్పులు పలగోత్ర గరిమఁ గొంచెపఱుపఁగా, నుప్పొంగి మానసంబులఁ, గప్పరపడి భూతములు జిష్ణుకృపేక్షన్. జై. భా. ౫. ౧౯౩.

(తక్కువపఱచు, లాఘవపఱచు; చెఱచు,పాడుచేయు.)

సీ. భూభరణక్రియాస్ఫురణఁ గుంభీనసక్రోడేన ములనైనఁ గొంచెపఱచు. వి. పు. ౫. ౬౫.

గీ. మానసంబున ధర్మ మేమఱకుమమ్మ, నతికి నెక్కువనీసరిసతులలోన, వారి గనుమమ్మ కులశీలవర్తనములు, కొంచెపఱుపక మము విచారించుమమ్మ. వరాహ. ౨. ౧౨౪.

కొంచె(చియ)ము. విణ. (కొంచెము, కొండిక, కొండుక, కొండొక, కొంత, కొందఱు, కొన్ని అను శబ్దములలోనిపూర్వభాగ మైన'కొన్'అనునది కించిదర్థక మగుఒకానొకశబ్దముయొక్కలుప్తశేషరూప మనియు, అందలికారముమీఁది ఒకారము ఉకారముగా మాఱి 'కుంచు' శబ్దమందును, ఊకారముగా మాఱి 'కూఁతు,కూఁతురు, కూన' శబ్దములందును, చేరినట్లును ఊహింపఁదగి యున్నది - సం. కించిత్. క. కొంచ, కొంజం. త. కొచ్చె.) ౧.(ప్రమాణామునందు) అల్పము, తక్కువది.

సీ.కొంచెపుటశనంబు గొనుచు సంగంబులఁ బాసి యింద్రియములపజ్జఁ జనమి. భార. శాం. ౬. ౩౮.

క. లేమ మొనలు కరము గొంచెము, లమేయము
లు పగఱమూఁకలు...హరి. ఉ. ౨. ౧౯.

గీ. చింత యేటికి మన కింక నెంతకార్య,మైనఁ
బవమానసూనుఁడు పూనుకొన్న, సులభత వ
హించు నితఁడె కావలయు నన్న,గోష్పదము
కంటె మున్నీరు కొంచియంబు. చం. రా.
౬. ౯౨.

౨. సుకరము, తేలిక యైనది, చులుకనిది.

క... అప్పానినితోఁ బొందు కొంచెమా యొన
గూడన్. శుక. ౪. ౧౬.

క. తెలిసిన నేఁగుము తెలియని,యలవైనం బో
కు కొంచెమా పరపురుషుం,గలయూటలు...
శుక. ౧. ౪౪౮.

వి. ౧. న్యూనత, కొఱఁత, లోటు.

ఉ...నీకు నీ,కొంచెము వచ్చు బెల్ల హరిఁ గోరి
నుతింపుమి నార్యపూజితా. భాగ. ౧. ౯౫.

ఉ...నూనులన్, గాంచనివారు సద్గతులు గాం
చరటంచు శ్రుతుల్ వచించు నా,కొంచె
ము దీసివేసి సుతుఁ గోవిదు నిచ్చి కృతార్థుఁ
జేయవే. శేష. ౪. ౨౧. వి. పు. ౧. ౬౫.

౨. అల్పకాలము, అచిరకాలము.

ఉ. మేరుగిరీంద్రచాపునియ మేయకృపారసపూ
ర్ణదృష్టి నీ,కూరిమిపట్టిపైఁ గలదు కొంచెము
లోనసె కాయసిద్ధికిం, గారణ మున్న దాత
నికిఁగా మదిఁ గుందకుఁడీ...సారంగ. ౩.
౨౫౧.

౩. సంక్షేపము, సంగ్రహరూపము.

క. అని మన్వాదులు విస్తర,మునఁ జెప్పినమర్మ
ధర్మములు గొంచెమునన్,వినిపించిన ... వ
రాహ.౯. ౧౩౧.

కొంచెపువాఁడు=అల్పుఁడు.

క. వీరితలం పెఱిఁగిన గాం,ధారితనయుఁడు సు
హృద్వితానముఁ గూర్చుం,బోరఁబరిమార్తుఁ
గొంచెపు,వారై యున్నెడన యని యవశ్య
ముఁ గడఁగన్. భార. ఉద్యో. ౧. ౧౪.

ఉ. వంచన నన్యకాంతఁ గొనివచ్చినతుచ్ఛుని మీ
దశాననుం, గొంచెపువానిఁగాఁ దలఁచుకొ
మ్మిట నల్పులు లేరు...భా.రా.యు.౧౦౩౭.

జ: కొంచెకత్తె, కొంచెకాఁడు, కొంచెతనము,
కొంచెపడు, కొంచెపఱుచు, కొంచెముచే
యు, కొంత, కొందఱు, కొందాఁక, కొని,
కొన్నాళ్లు, కొన్ని, మొ.

కొంచె(చియ)ముచేయు. స. క్రి.(కొంచెము+
చేయు.) ౧. తక్కువపఱుచు, అవమానించు.

సీ. శ్యామోదయము కొంచియముచేయ నేతెంచి
శ్యామోదయమును హెచ్చఁగఁ దనర్చె. చం
ద్రి. ౪. ౪౫.

౨. వంచించు, మోసపుచ్చు.

ఉ... ఈమమున్,గొంచెముచేసి ప్రాగ్జ్యోతికికోఁ
దలపోసెదు మెచ్చితి న్ననున్. ఆము.౬.౪౦.

కొంజె=కొంచే. అ. క్రి.భయపడు; సంకోచించు.

క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక తేఁగల
నపారగురుతృణవనికా,పుంజంబుల...భాగ.
౧౦ పూ. ౫౦౫.

క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయ
మాలి రాజకుంజర యంతన్, గుంజరమును
డీకొలిపెను,గుంజరపాలకుఁడు గోపకుంజరు
మీఁదన్. భాగ. ౧౦ పూ. ౧౩౧౭.

కొంట. వి. (√ కొను) కొనుట. (అనుప్రయుక్త
మైన 'కొను' ధాతువునకును రూప మిట్లైఱుం
గునది. ఉదా: కనుఁగొంట,కైకొంట, పైకొంట,
మొ. శ. ర)

కొంటె. విశ. (త. కొండి.)అకార్యకరణశీలుఁడు,
దుష్టుఁడు, ధూర్తుఁడు.

క. కొంటెవి మాహృదయంబులు, గొంటెవి మానం
బు లజ్జఁ గొంటెవి వలువల్,గొంటి వీఁక నెటు

నేసెదో, కొంటెవు గద నిన్ను నెఱింగికొం టిమి కృష్ణా. భాగ. ౧౦ పూ. ౭౨౨. హంస. ౫. ౧౧౩.

జ: కొంటెతనము.

**కొంటెతనము.** వి. (√కొంటె) దౌష్ట్యము, ధార్ష్ట్యము, అకార్యము.

ఉ. తుంటఁట కార్ముకంబు కఱదొట్టిన తేంట్లఁట వింటినారి చే, యంటిన వాడుతూపు లఁట... కాయము లేదఁట నీకు లోకముల్, కొంటెతనంబునన్ గెలిచికో లిది యచ్చెరియంబు మన్మథా. కృ. శతం. ౨. ౧౭౯.

క. వింటి కదా నీతనయుని, కొంటెతనము వీరి మాని కుటిలాలక న, క్కుంటునకు నిత్తు రఁట యిటు, వంటివి పో పెక్కునోళ్ల వారలమాటల్. భోజరా. ౫. ౩౩౧.

**కొండ.** వి. (క. కొండ) ౧. పర్వతము.

సీ. ఏకొండశిఖరాగ్ర మీక్షించినంతన భవబంధములఁ బెడఁబాపఁ గల్గు. విక్ర. ౧. ౧౯౭.

౨. ఆకాశము.

(వ్యవ) కొండమీఁదిచుక్కలు. కొండంతయు ఎలుపెక్కినది.

౩. ఘనకార్యము, గొప్పపని.

క. కొండ ధరించుట నాకొక, కొండా ...హరి. పూ. ౭. ౧౭౯.

క. దండిని బ్రహ్మాండంబులు, చెండులక్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడుహరికిన్, గొండఁ బెకలించి యెత్తుట, కొండొకపని గాక యొక్కకొండా తలఁపన్. భాగ. ౧౦ పూ. ౯౧౮.

విణ. గొప్పది, ఘనము.

గీ. తా నెఱింగియు నీజాతి గానిదాని, మాట లెల్లను గొండగా మదిఁ దలంచి, యల్ల నడురేయి గిన్నె యి ట్లంప నేల, కుడిచి కూర్చుండి నను బాళి గొలుప నేల. విప్ర. ౪. ౭౭.

కొండఁ ద్రవ్వి యెలుకను బట్టు (కొను)=స్వల్ప ఫలముకై యెక్కుడుశ్రమ నొందు.

ఉత్సా. ... ఇప్పు డీవు చెప్పినట్టికష్టపా, టెంత దానవైన ఘుటిక నినుము పసిఁడి యౌటకా, నెంత వినుము కొండఁ ద్రవ్వి యెలుకఁ బట్టుటిది సుమీ. పరమ. ౧. ౧౭౭.

గీ. ఎంతదవ్వులనుండియో యేఁగుదెంచి, కడఁకు నెటుకులకై యింత కష్టపడెదు, గటకటా యమ్మహీసురాగ్రణివిధంబు, కొండఁ ద్రవ్వియు నెలుకను గొనుట యయ్యె. కుచేల. ౨. ౧౧౨.

గోరంతలు కొండం (దలం)తలు చేయు=అల్పవిషయమును అధికముగాఁ జేయు.

(వ్యవ) వాఁడు గోరంతలు కొండంతలుచేయును.

ఉ. ... గో, రంతలు కొండలంత లగునట్లుగఁ జేసితి మంచు...అము. ౫. ౭౭.

కొండఁజేయు=పెద్దచేయు.

సీ. ఈకొండ మణికాంచనాకారరుచి గాంచెఁ గొండ లెల్లను దనుఁ గొండఁజేయ. విక్ర. ౨. ౧౫.

కొండపట్టు=పర్వతములకుఁ జాటిపోవు.

ఉ. గద్దియ డిగ్గి కశ్యపునిగాదిలినూనుఁడు గొండపట్టినన్ ...కాశీ. ౬. ౨౧.

సా: కొండ తలక్రిందఁ బెట్టుకొని వాలకొఱకు నెదకినట్లు.

జ: కొండంగి, కొండఁజేయు, కొండకంది, కొండకాకి, కొండకాలువ, కొండకోఁతి, కొండగుమ్మడు, కొండగుఱుసు, కొండగోనుగు, కొండగోఁగు, మొ.

**కొండంగి.** వి. (√కొండ) కొండముచ్చు, గోలాంగూలము.

సీ. కొండముచ్చనఁగను గొండంగి యనఁగ గోలాంగూల మెసఁగును...ఆం. భా. ౨. ౭౩.

ద్వి. కటకటా కాటికిఁ గాష్ఠ సాఁచియును, విట
లీనంబులజాడ విడువఁ డీబడుగుఁ,గొండంగి
వీని వెక్కుఁ డుఁ దలదఱుగ. ద్వి. హరిశ్చ. ఉ.
౧౦౫౯. ('కొండెంగ' శ.ర. పా.)

**కొండకంది.** వి. (√కొండ) సస్యవిశేషము,ఒకజా
తికంది. (బ్రౌ, శ. ర.)

**కొండకాకి.** వి.(√కొండ)ఒకజాతికాకి,అద్రికా
కము.('మాలకాకి' అని చి. ని.)

**కొండకాలువ.** వి. (√కొండ) సెలయేఱు, ఝుర
ము.

**కొండకోఁతి.** వి.(√కొండ)బాలక్రీడావిశేషము.
సీ. దాఁగిలిమూఁతలు లనువిల్ల యాలంకి గుబ్బట
గురిగింజ కొండకోఁతి. హంస. ౩. ౧౪౬.

**కొండగుమ్ము(ము)డు.** వి. (√కొండ) ఒకజా
తిగుమ్ముడు. హంస. ౪. ౧౧.
గీ. మూఁడువేళ లపామార్గమూలములును, గుండ
లీమూలరజమును గొండగుముడు, వేఁడినీళ్లను
సేవింప వికృత మైన, కఠినశూలలు పాలివో
వు గ్రంథు లణఁగు. (చికి-చి. ని.)

**కొండగుఱుతు.** వి. (√కొండ) సాధారణ మైనగు
ఱుతు. (శ.ర,వా.)

**కొండగోనుగు.** వి. (√కొండ) వృక్షవిశేషము,
అక్షోటము. (శ. ర.)

**కొండగొఱ్ఱె (ఱ్ఱియ,ఱె,ఱియ.)** వి.(కొండ+
గొఱ్ఱె.) రోహిషము, కొండలయం దుండెడు
ఒకజాతిగొఱ్ఱె.
సీ...కొండగొఱ్ఱెల మన్ని గొనియెఁ గొన్ని. పి.
శకుం. ౨. ౧౫.
సీ. కొండగొఱియ నాఁ దగును రోహిషాభిధ...
ఆం. భా. ౨. ౮౫.
గీ. కోఁతితో మైత్రి వాటించుఁ గొండగొఱియ,
యార్వశేయునిపుణ్యాశ్రమాంతరమున. కా
శీ. ౨. ౪౩.
స్రగ్ధర. చెండాడెన్ గొండగొర్లన్ శెలగె సె
లుఁగులన్ ... యయా. ౨. ౩౨. (ఇందలి
'గొర్లు' అను రూపము చింత్యము.)

**కొండగోఁ(ఁగు)ను.** వి. (√కొండ-బ.కొండగోఁ
గులు.) ౧. కర్ణికారము, ఒకానొకచెట్టు. (చూ.
వసు. ౩. ౧౪౬, ౧౪౭.)
సీ. కొనరి వావిలిఁ గొండగోఁగును ననిపించె
మూర్కొని మాటాడి ముదిత యోర్తు. య
యా. ౪. ౧౯.
౨. కందరాళము.
గీ. కందరాళము కొండగోఁ గనఁగఁ గొండ,గో
ననఁగఁ బరఁగు...ఆం.భా. ౨. ౪౩.

**కొండచిలువ.** వి. (కొండ + చిలువ.) కొండపా
ము, గోనసము.
వ ... యాతుధానుం డనుకొండచిలువ నొడియ
...మనుచ. ౪. ౧౧౫.
సీ. కొండచిలువ యన గోనసం బగు...ఆం.భా.
౧. ౧౪౭.

**కొండచీమ.** వి.(√కొండ)ఒకజాతిచీమ.(శ.ర.)

**కొండచూలి.** వి. (కొండ+చూలి.) హిమవత్పు
త్రి, పార్వతి. వేమన. ౨. ౨౨౨.
ఇట్లే: కొండరాచూలి: వీర. ౧. ౧.
కొండపట్టి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౬౭౩ పం.

**కొండజువ్వి.** వి. (√కొండ) ఒకజాతిజువ్వి, కలు
జువ్వి.
ద్వి. గుది గొన్న జువ్వులు కొండజువ్వులును,ము
దిరినమోదుగుల్ ములుమోదుగులును. ద్వి.
పరమ. ౨. ౫౪ పా. ౮ పం.

**కొండజెఱ్ఱి.** వి. (√కొండ) ఒకజాతి పెద్దజెఱ్ఱి.
( ఇది మూఁడుమూళ్లనిడుద యై యెఱ్ఱనల్లకట్లు
గలిగి అరజేనకొలఁదికాళ్లు గలిగి యుండును.ఇది
జంతువులను దఱిమి కఱచును. దీనివిషముచే జం
తువు మేను బ్రద్దలై చచ్చును-చి. ని.)

**కొండజొన్న.** వి. (√ కొండ) ఒకవిధ ముసుజొన్నకి. (శ. ర.).

**కొండతంగే(గె)డు.** వి. (√కొండ) ఒకజాతితంగేడుకి. (శ. ర.)

**కొండత్రిమ్మరి.** వి. (కొండ+త్రిమ్మరి) కోఁతి. ఇట్లే: తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి, మొ. (బ్రౌ, శ. ర.)

**కొండదాసరి.** వి. (కొండ + దాసరి) ముష్టి యెత్తుకొని జీవించు ఒకజాతిదాసరి.

గీ. తనదుచెల్లెలి దొడ్డభూధవున కిచ్చి, యతనివలనను సిరి గాంచునంతకంటె, సారమై తోఁచుఁ గొండదాసరితనంబు. రామలిం. ౭౮.

**కొండనాలుక(ల్క).** వి. ( కొండ + నాలుక ) -పైనుండునాలుక - ఉపజిహ్వక, ఘంటిక.

సీ. ఎచ్చోటఁ జొచ్చుచ్చునేఁ డేసినాల్కలు కొండనాల్కలదాఁకఁ గోఁతపడియె. భీమ. 3. 3౭.

**కొండపగతుఁడు.** వి. (√కొండ) ఇంద్రుఁడు.

సీ. కొండపగతుపట్టికోడలినిండువేఁకటిఁ గాచినట్టిచేకత్తివాఁడు. రా. వి. ౧. ౭౧. (శ. ర. పా.)

**కొండపలుకు.** వి. (కొండ+పలుకు) పర్వతగుహయందలి ప్రతిధ్వని.

గీ. కొమరుఁ బిల్వనియలపల్కు కొండపల్కు, పట్టిఁ జూడనినును గ్రుడ్లు పెట్టుగ్రుడ్లు. చంద్రా. ౧. ౫3.

**కొండపిరడి.** వి. (√కొండ) పిండికొండచెట్టు. (దీనియాకులు రాలను పిండిచేయును.)

సీ. కొండపిండి యనంగఁ బిండికొండ యనంగ నగభేదిసంజ్ఞగా నలరుచుండు. ఆం. భా. ౨. ౬౫.

**కొండపిచ్చుక.** వి. (కొండ+పిచ్చుక) ఒకజాతిపిచ్చుక.

సీ... కొండపిచ్చుక పానకోయిలయును. హంస. 3. ౧౨.

**కొండప్రత్తి.** వి. (√ కొండ) ఒకజాతిప్రత్తికి. (శ. ర.)

**కొండబరిగె(వరిగ?)** వి. (√ కొండ) సస్యవిశేషముకి.

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చామలు వెలిచామ కట్టారికారికె కొండబరిగె, బరిగె ... హంస. ౪. ౧౨౭.

**కొండబూరుగ.** వి (కొండ + బూరుగ.) కూటశాల్మలికి.

వ... కొండబూరుగమ్రానిచేవకొఱడులద్రిప్పుడులును పూలతురాయీల రాణించుచేకత్తుంగిలగిలలును ... ప్రబంధ. ౭౮.

గీ... కొండబూరుగ యనఁ, గాను జనుఁగూటశాల్మలి ... ఆం. భా. ౨. ౪౭.

**కొండబెండ.** వి. (√ కొండ.) ఒకజాతిబెండకి. (బ్రౌ.)

**కొండమల్లయ్య.** వి. (కొండ + మల్లయ్య.) శ్రీశైలమల్లికార్జునుఁడు, శివుఁడు.

సీ. కొండమల్లయ్యచే నుండు నందురు గాని జింకను గాన మేవంక నైన. యయా. ౧. ౧౧౬.

**కొండమల్లె(ల్లియ).** వి. (√ కొండ) ఒకజాతిమల్లె, గిరిమల్లికకి. (శ. ర.)

**కొండమామిడి.** వి.(√కొండ) ఒకజాతిమామిడి, కోశామ్రముకి. (శ. ర.)

**కొండమారేడు.** వి. (√ కొండ) ఒకజాతిమారేడుకి. (శ. ర.)

**కొండము.** వి. (ఇట్లే పరుషాదిగా. బ్రా- సం. కుండమ్. ప్రా. కొండమ్. త. కుండం.) గుండము.

గీ. ...కుండాఖ్య నెలయు, చుండు గుండ మనంగ ను గొండ మనఁగ. ఆం. భా. ౨. ౨౪౧.

**కొండముక్కిడి.** వి. (√ కొండ) ఒకజాతిముక్కిడి, వృక్షవిశేషము. హంస. ౪. ౧౧, ౧౩౪.

**కొండముసువ.** వి. (√ కొండ.) కొండమ్రుచ్చు. (చి. ని, శ. ర)

**కొండమ్రు(ము)చ్చు.** వి. (కొండ + మ్రుచ్చు.) నల్లనిముఖము గలపెద్దకోఁతి, గోలాంగూలము.

చ. ...నేల యీనినటుల మున్నీరు వెల్లివిరసినవై ఖరిఁ బుట్టయిసుళ్లకరణిఁ గాకులజోకఁ గొండమ్రుచ్చులబాగున... ప్రబంధ. ౭౮౯.

ఆ. కోఁతిఁ బట్టి తెచ్చి కొత్తపుట్టము గట్టి, కొండముచ్చు లెల్లఁ గొలిచినట్లు, నీతిహీనులొద్ద నిర్భాగ్యు లుందురు... వేమన. ౨. ౬౪.

**కొండయల్లుఁడు.** వి.(√కొండ)-హిమవంతునియల్లుఁడు-శివుఁడు. చిత్రభా. ౫. ౧౦.

**కొండయిప్ప.** వి. ( √కొండ ) గిరిమధూకము. (చి. ని.)

**కొండయెక్కు, కొండెక్కు.** అ. క్రి. (కొండ+ఎక్కు) ౧. ఉన్నతస్థితికి వచ్చు, అతిశయము నొందు.

ద్వి. బ్రహ్మచారిని లోకపావనాత్ముండ, బ్రాహ్మణుఁడను బీదబాపఁడఁ గాను, హరికృపఁ గల్గు సర్వైశ్వర్యములును, గొఱఁత లేదిప్పుడే కొండయెక్కెదవు, ఇపుడేమి చెప్పెదు నీమేను నీది, తపము చాలెమ్ము నాతరుణివి గమ్ము. మృ. ౨. ౨. ౬౭.

౨. మిట్టెక్కు, గర్వముచే బిఱ్ఱబిగియు.

గీ. కరుణ జగములఁ బ్రోచుటో తురగ మెక్కి, ఘనరిపులఁ గొట్టుటో తురుష్కవధ యెంత, కొండ యెక్కెదు బతిమాలుకొనినకొలఁది. సిం. నార. ౧౭.

౩. (వ్యతిరేకలక్షణచే) అఱు, అఱిపోవు.

(వ్యవ) దీపము కొండెక్కినది.

**కొండరాగి.** వి. (√ కొండ) ఒకజాతిరావిచెట్టు. (ఇది ఫుల్లమామిడివంటిది. దీనికాయలు ఉప్పున ఊరఁబెట్టి అన్నములో నంజుకొందురు -చి. ని.)

**కొండరాయఁడు.** వి. (√కొండ)పర్వతరాజు, హిమవంతుఁడు. వీర. ౩. ౧౦౮.

**కొండరావి**=కొండరాగి. (√ కొండ) హంస. ౪. ౧౧.

**కొండరి.** వి. (కొండ+అరి) పర్వతీయుఁడు, కొండవాఁడు, కిరాతుఁడు, బోయ.

చ. వెఱవక యున్నవారలిట నెట్టితనం బిది గాదె కొండరుల్ చు, ఱుకొక యింత లేక మనుజుం దమదేవత కిందు నిత్యముం, జెఱు పొనరింతు రిప్పుడది సేగి విదేసులఁ బట్టుచున్నవా, రెఱుఁగఁగఁ జెప్పితి న్వెడలి యేఁగుఁడు ప్రాణముసద్దగల్గినన్. ద్వా. ౧౧. ౧౯, ౨౬.

**కొండఱేఁడు.** వి. (కొండ+ఱేఁడు) హిమవంతుఁడు.

ఆ. కొండఱేనికూఁతు కుసుమాపచయకేళిఁ, బోవుఁ బ్రతిదినంబు... భోజరా. ౫. ౧౯౧. వేమన. ౨. ౨౨౨.

**కొండలరాయఁడు.** వి. (√కొండ)-ఏడుకొండలకధిపతి-వేంకటేశ్వరుఁడు.

సీ. కొండలరాయనిఁ గొలుమకవులకు బంగారంబుముడుపు మోఁకాళ్ల ముడుపు. ప్రబంధ. ౨౪.

**కొండల్లము.** వి. (√కొండ) ఒకజాతిఅల్లము, తృణపుష్పిక. (శ. ర.)

**కొండవంగ.** వి. (√కొండ) ఒకజాతివంగ. (బ్రా)

**కొండవాఁడు.** వి. (√కొండ)పర్వతీయుఁడు, కిరాతుఁడు, బోయ. ('కొండవారు' అని శ.ర.)

**కొండవీడు.** వి. షా. (కొండ+వీడు) ౧. కైలాసపట్టనము.

గీ. కొండవీ డేలువేలుపుఁ గూడి పాల,కడలినడు చక్కి బలుమానికములవీవిఁ,బుడుకుమ్రాఁకులు మాకేళ్లు వొదలి పొదలు,కడిమిపూఁదోఁటలోనాడుగరితఁ దలఁతు. అచ్చ.రా. ౧.౨.

౨. ఆంధ్రదేశములోని ఒకపట్టనము.

సీ. మఱి కొండవీ డెక్కి మాకొక్కని నలి హైనయలకసవాపాత్రు నంటి రాఁజె. ఆము. ౧. ౩౬.

కొండవీటిచేఁత్రాడు = కొండవీటిలోని లోఁతునూతులనీరు తోఁడుట కుపయోగించుచేఁత్రాడు. (ఇది అతిదీర్ఘవిషయమునకు ఉపమానముగా వాడఁబడును)

ఉదా: ఈకథ ఎప్పటికిని తెగక కొండవీటిచేఁత్రాడువలె నున్నది.

**కొండసంపెఁగ.** వి. (√కొఁడ)ఒకజాతిసంపెఁగ¶. హంస. ౪. ౧౧.

**కొండసూడు.** వి. (కొండ + సూడు) గోత్రవైరి, దేవేంద్రుఁడు. అచ్చ. రా. కిష్కిం. ౨౫.

**కొండాట[1](ము).** వి. (√ కొండాడు[1]) ౧.స్తుతి, పొగడిక.

శా... ఉన్నపురముల్ గొండాటకర్హంబులే.కాశ. ౧. ౧౯.

వ. వృథా కొండాటములు మాని శౌర్యంబులు పూని యనిఁ జేసినఁ గాని పోనీయ మనువారును ... ల. వి. ౧. ౭౬.

౨. అన్యచింత లేక ఒకదానియందు మనస్సు లగ్నముచేయుట, వ్యాసంగము.

ద్వి. ...తదంగ,సౌకుమార్యంబు లోచనపర్వ మొదవఁ,గైకొని చూడవు గాని చూచినను, నదియె కొండాటమూ నన్నియు మఱచి. నప. ౪. ౧౩౬ పా. ౧౪ పం.

గీ. హరునితోడిద కొండాటమై లతాంగి, యుగ్రతాపంబు సైరింపకున్నఁ జూచి. వీర. ౧. ౧౯౫.

**కొండాట[2](ము).** వి. (√కొండాడు[2])కలహము, పోరు.

క. అని కెలసి పులుకుపులుకునఁ, దనుఁ జూచుజూడఁ బట్టి తన్నెం గొట్టెన్ ,దనివి సనఁ దిట్టెననలుం, గొనలుగ రొద మగనిఁ దెగనికొండాటమునన్. వేం. పంచ. ౪. ౪౬౯.

౨.ణ. బాధకము.

శా... చూడు నేఁ, డీకొండాటపు బెల్లుయుల్కొలుఁగ కిక్లేపార భక్షించెడిన్. వేం.పంచ. ౨. ౯౦.

**కొండాడు[1]**=కొనియాడు. స. క్రి. ( √ కొను-సే. కొండాడు.) పొగడు, స్తుతించు.

ఉ. చేడియ యీనృపాలకులశేఖరు సంతతదానకేలుఁ గొం, డాడఁగ వేయి నోళ్లు వలె నంచువచించితి నప్పుడు ... రాజ. చ. ౩. ౧౩౩.

సీ. కొనియాడెఁ బొగడెను గొండాడె నగ్గించె నఁగను వినుతించె ననుట దోఁచు. ఆం. భా. ౩. ౧౨౪.

**కొండాడు[2]**=కోరాడు. అ. క్రి. ౧. కొట్లాడు, జగడమాడు. (చూ. కొండాట[2])

(వ్యవ) నీపెండ్లికోసము నేను నెలదినములనుండి వానితోఁ గొండాడుచు నేయున్నాను.

౨. దుమ్మురేగఁజేయు.

సీ. కోరాడెఁ జిరిమెను గొండాడె నాఁగనుమమ్మురేఁచె నటంచుఁ దోఁచు మంత. ఆం. భా. ౩. ౧౩౨.

జ: కొండాట[2].

**కొండి.** వి. ౧. తేలుతోఁక.

సీ ... తేలనఁగను వృశ్చికంబు ... తద్భవనామమై తనరుఁ గొండి యనంగ ... ఆం. భా.౩. ౯౯.

౨. తేలుతోఁకచివర నుండుముల్లు. (బ్రౌ.)

౩. పీలదెక్క.

క. అక్కర్కట ముండఁగ నల,కొక్కెర దత్తరన
మెలిచికొని తినుసదియై, ముక్కెత్తి చూచు
నాలో, నొక్కుఁకునఁ గొండ్ల నితికి యొ
త్తెఁ గళముఁ. వేం. పంచ. ౧. ౩౨౬.

ర. ఱెక్కతలుపునంచులయం దమర్చు తేలుతోఁ
కవంటియినుపగొండ్లెము. (శ. ర.)

**కొండిక**=కొండొక. (చూ. కొంచెము.) విశ. (ప్ర
మాణవయోభాగ్యాదులందు) కొంచెము, అల్పము.

క. దండితబలినై జగములు, నిండఁ బెరుఁగుచున్న
వేళ నీయడుగున భూ,మండల మతినూత్మాకృ
తిఁ,గొండికమచ్చయును బోలెఁ గొమరొందు
హరి. పాండు. ౨. ౬౦.

సీ. మెండుగా బలిసి భూమండలాఖండల కొండిక
కుండిక నుండఁగూడ. గీ. దింత నిర్బంధ మై
నచో నెటుల నోర్తు. దశా. ౧. ౧౪౧.

సీ. మాతండ్రియింట నేఁ బ్రీతిఁ గొండికనాఁడు
చెలులతో నాడుచు ... మార్క. ౫. ౨౪౦.

క. కొండికప్రాయంబు ... వరాహ. ౪. ౧౩౫.

క. కొండికలను మన కెంతటి, దండి గలుగు నధిక
వస్తులతి హరి కొసఁగఁ, గొండంత దేవునకు
మజ్జే, కొండంతయుఁ బత్రి యిడెడుకుశలులు
గలరే. కుచేల. ౧. ౧౧౦.

వి. బాలుఁడు; బాలిక.

సీ. దొర దాల్చురవణముల్ తొడుగఁ డే భృత్యుం
డు కొండిక ప్రాయఁ డే గురుఁడు ప్రాయ. రా
మలిం. ౩౫.

క. ఒందుకొద లేదు తూరుపుఁ, గొండపయిం బ్రొ
ద్దు వొడిచెఁ గొమ్మా యిఁక నేఁ, డెండఁ బడ
కుండఁ గూఁతుం, గొండిక యన కంపవల
యుఁ గూరిమి ననుడుఁ. యయా. ౪. ౧౨౬.

**కొండికనగవు**=మందహాసము. వరాహ. ౧౦. ౮౪.

**కొండికవాఁడు**=చిన్నవాఁడు, బాలుఁడు.

ఉ. ... ఇప్పు డీ,కొండికనాని నమ్మి పగగొలిది
కార్యమె మీకు శౌర్యమే. కు. సం. ౧౦.
౫౭.

**కొండియుఁడు.** వి. (√ కొండియము.) కొండెము
చెప్పువాఁడు.

ఉ. క్రూరుఁడు లోభియుఁ శఠుఁడుఁ గొండియుఁ
డుఁ జడుఁడుఁ గృతఘ్నుఁడుఁ, నేరని
వాఁడు బొంకరియు నిండకు నోర్చునలెండుఁ
బందయుఁ, ధీరత లేమి దుర్నయ మతివ్యసన
త్వముఁ గల్గువారలుం, జేరువ నున్కి భూపతి
కిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా. భార. శాం.
౩. ౪౬౭.

సీ. కొండెకాఁ డనఁగను గొండెగీఁ డనఁగను గొం
డియుఁ డనఁ బిశునుండు పెలయు. ఆం. భా.
౩. ౧౩. ప్రబంధ. ౬౨౩.

**కొండీ.** వి. కొక్కెము. (బ్రౌ.)

**కొండీఁడు.** విశ. (కొండెము+ ఈఁడు-క. కొండెగ.
త. కొండుణి.) కొండెము చెప్పువాఁడు.

సీ. కొండీనినాలుక రెండుగాఁ జీరెడునలఖగంబు
లఁ జూడు మనని నాథ. మార్క. ౨. ౯౫.

గీ. అనృతవాదుల కొండీల యన్యమంది, రాన్నభో
క్తల మర్యాద నడఁచువారి, విశ్వసించినచోఁ
ద్రుంచివేయునట్టి, ఖలుల జిహ్వలు గోతురు
కాలభటులు. శేష. ౩. ౩౩.

ద్వి. వికలుండు గొండీఁడు వెదకిన నైన, నొకఁడు
మందున కైన నూరిలో లేఁడు. బస. పు. ౧. ౫౪౯
పం.

**కొండుక**=కొండొక. (చూ. కొంచెము.)

విశ. (చిన్న; చిన్నవాఁడు.)

వ. ... అర్జునుకొండుకనాఁటిపరాక్రమగుణసం
పదలు వైశంపాయనుండు జనమేజయునకుం
జెప్పె... భార. ఆది. ౫. ౨౪౯.

వ. ... చిత్రాంగదుండు బాల్యంబున గంధర్వునిహ

తుండయిన వానికిం గొండుకవాని విచిత్రవీ
ర్యు రాజ్యాభిషిక్తుం జేసి ... భార. ఆది. ౮.
౧౧౩.

ఆ. ... వారిలోఁ, బరశురాముఁ డాదిపురుషమూ
ర్తి, దండితాహితుండు గొండుక యయ్యును,
దద్ద గుణములందుఁ బెద్ద యయ్యె. భార.ఆది.
౩. ౭౦.

**కొండె(డియ).** వి. స్త్రీ పురుషులు తలయొక్క పురో
భాగమున వేసికొనెడుసిగ, ముందుసిగ.

చ... కొం, డెలపయి కమ్మ గ్రామ్యతరుణీశతి
డించిన పేఁపగంపలం, దళ మగుమన్న చెంగ
లువదండల ... ఆము. ౧. ౭౫.

గీ. కురులు సవరించి విరులతోఁ గొండెఁ గట్టి, మే
లుచందురకావిరుమాలు చుట్టి, సరిగెజిగివల్వ
మేన మెచ్చంగఁ దాల్చి, మెఱయుభూషల
నొడలిపై మెఱయఁజేసి. వేం. మా. ౮. ౨౮౫.

సీ. చందురులో నున్నకందుఁ దా మఱఁగించుతేపఁ
జెందలలకొండియలు చెలఁగ. విప్ర. ౧. ౬౭.

గీ. శేశబంధవిశేషాఖ్య గేరుఁ గ్రొమ్ముడి యన వెద
యన నూనెముడి యనఁ గొండె, యనఁగఁ
గీల్గంటనఁగఁ జొల్లె మనఁగ నభవ. ఆం. భా.
౨. ౧౮౫. రా. వి. ౧. ౬౨.

**కొండెఁడు.** విణ. (కొండెము+వాఁడు) కొండెము
చెప్పువాఁడు, చాడీ చెప్పువాఁడు.

క. ధరఁ గాఁపు కొండెఁడైనను, గరణాలకు బ్ర
తుకు లేదు గదరా సుమతీ. సు శ. ౭౫. వేమ
న. ౩. ౧౮౯.

**కొండెకత్తె(త్తియ).** విణ. (కొండెము + కత్తె)
చాడీలు చెప్పునది. (ఆఁడుది-శ. ర.)

**కొండెకా(గా)ఁడు.** విణ (కొండెము+కాఁడు)
చాడీలమారి, కొండెములు చెప్పువాఁడు.

సీ. కుమతియుఁ జుట్టంబుఁ గొండెకాఁడు ప్రియుం
డు కరుణావిహీనుండు కార్యదక్షుఁ,డు ...
రామలిం. ౧౧.

ఆ. కొండెగాఁడు చావఁ గొంపదనుకఁ బోవ, వం
తు కింతె గాని వగపు లేదు, కొంకనక్క చావ
గొఱ్ఱె లేమిటి కేడ్చు... వేమన. ౨.౫౭. ఆం.
భా. ౩. ౧౩.

**కొండెగీఁడు.** విణ. (√కొండెము-క.కొండెగ.)
కొండెము చెప్పువాఁడు.

సీ. కొండెకాఁ డనఁగను గొండెగీఁ డనఁగను గొం
డియుఁ డనఁ బిసునుండు వెలయు. ఆం. భా.
౩. ౧౩.

**కొండె(డియ)ము.** వి. (క.కొండె.త.కొండియమ్)
చాడీ, ఇతరులపై లేనిపోని నేరములు చెప్పుట, పై
శున్యము.

సీ. ... గురుజనంబుల, నిందించు టాగమనిందతవీ
యవిక్రయవిధి తద్వ్రాలేఖనము గొండి,యము
...గీ...ఆర్యకోటి, నిరయహేతువులుగఁ జె
ప్పు నృపవరేణ్య. భార. అను. ౨. ౬౧.

గీ. విను మరక్షితమంత్రంబు విరిసిపోవుఁ, గొండి
యంబున సఖ్యంబు గ్రుంగిపోవు. నా. పంచ.
౧. ౧౮౮.

సీ వినఁగోరఁ డొకనాఁడు వీనుల కింపుగాఁ గొ
లుమవారలవిఁదికొండెములను. మొ.రా.బా
ల. ౨౧.

సీ. అత్తమామల కెదురాడుదుశ్చారిణి వావివర్తన
లేనివాడవనె, కొండేలఁ గొంపలు గూల్చు
పాతకురాలు బలి భిక్ష మిడనినిర్భాగ్యురాలు.
శ్రీరం. మా. ౫.౩౮.

ఉ. ఓనృప నాకుఁ జూడ నలయుగ్మలి నీసుకు
నిక్ మనోహరా, నూనవిలాసుఁ జూచి నిలు
పోపక పట్టిన లోను గామి నెం, తే నెకలూ
ని వానిఁ బొలియింపఁగ మాయలు వన్నె నిట్లు
కొం, డేనను ధర్మరాజులను నిక్కముగా మి
ముఁ జెప్ప నేటికిక్. సారంగ. ౨. ౨౨౭.

కొండెపుఁగొఱవి=కొండెములమారి.

ద్వి. మిండతల క్కాత్తికి మిగిలినగొంట్లు,కొండెపుఁ గొఱవులు... పండితా. పురా. ౧౧౬ పా.

కొండెపుఁదపసి=(కొండెములు చెప్పుమని)నారదుఁడు.

సీ. చలిగొండ వెలిగట్టుచాయల గిలుబాడి కొండెం పుఁదపసిఁ గైకొనక చెలఁగి. గీ ... పాఁపరాయఁడు నెగడె నీప్రాంతమందు. చిత్రభా. ౫. ౧౦.

జ: కొండియుఁడు, కొండీఁడు, కొండెఁడు, కొండెకత్తె,కొండెకాఁడు, కొండెగీఁడు, కొండేలమారి.

**కొండెవల.** వి. చేఁపలు పట్టుటకు ఒక్కఁడే వేసెడు వల. (శ. ర.)

**కొండేలమారి.** విణ. (√కొండెము.)చాడీగొట్టు.

సీ. కడకుఁ బోయిన నొక్కకడఁ బరుండఁగ రాదు మఱఁదలు కొండేలమారిబసివి. అహ. 3. ౪3.

**కొండొక**=కొండిక, కొండుక. విణ. (చూ. కొంచెము-సం. కణకః.)౧. చిన్నవాఁడు; చిన్నది.

క. అకటకట యుత్తరుఁడు కొం,డొక కాంభోజుండునుం గడుఁ బాలుఁడు... భార. స్త్రీ. ౨. ౮౪.

సీ. ఇవ్విధంబునఁ గాంచి హృదయేశుమన్ననఁ బెనుచుచు నుండ నబ్బిసరుహాక్షి, కొండొకసవతియు గురుతరధర్మరక్షణశీలత న్ననుగుణవిధేయ. రాఘవ. ౪. ౭౪.

౨. కొంచెము, అల్పము.

క. ద్యూతజ్ఞులదెసఁ గొండొక, ప్రీతియుఁ గలదు ,..భార. విరా. ౧. ౨౦౭.

వ. ... కొండొకయు నుపేక్ష లేక ... భార. విరా. 3. ౮౭.

శ. దండిని బ్రహ్మాండంబులు,చెండులక్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడుహరికిన్, గొండఁ బెకలించి యెత్తుట,కొండొకపని గాక యొక్క కొండా తలఁపన్. భాగ. ౧౦ పూ. ౯౧౪.

3. పొట్టి, హ్రస్వము.

గీ. బాలుఁ డొక్కఁడు కొండొకకోల నేలఁ,బట్టుకొని ... భార. ఆది. ౬. ౨౬౦.

ఉ. కొండొకవాలమున్ గుబురుకొమ్ములు నన్నువలైనవీనులున్ ...క్రాలఁగాఁ, దొండము లేని భద్రకరితో నెనయైనవనీవరాహమున్.విక్ర. 3. ౭౫.

క్రి. విణ=ఒండొకచో. ౧. ఇంచుక, కొంచెము.

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొవ్వనిజనంబులు నా,చేతిధన మెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టె నెడలితిన్. భార. విరా. ౧. ౧౯౬.

వ. కౌంతేయాగ్రజుఁడు గురుబలంబు గనుంగొని కొండొక విన్ననై విచ్చు నాలోకించి... భార. భీష్మ. ౧. ౧౨౪.

౨. కొంచెము సేపు; కొంచెముదూరము.

వ. ...లోలంగఁ ద్రోవ రాని లేమికి నొండొకయుపాయంబు మదిం దోఁపమికిం గొండొక చింతించి...విక్ర. ౨. ౧౮౭.

వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి... భార. విరా. ౧. ౧3.

కొండొకనవ్వు=చిఱునవ్వు, మందహాసము.

గీ. అనినఁ గొండొకన వ్వొలయంగఁ జూచి,యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె, నేను గలుగంగ నీ కేమి...భార.విరా. ౫. ౧౧౫.

**కొండ్ర.** వి. ఒకసారి చాలు చుట్టినకొలఁది గలపొలము, చుట్టు దున్నినచాలునడిమి నేల; పొలము.

క. కురియును నెల మూఁడువానలు,సురభులు చన్నవిసి పితుకు సుకృతముజరుగున్,ధరఁ గొండ్ర వేలు పండును, బరఁగుం బురుపాయుషంబు

ప్రజలకు నెల్లన్. కాశీ. ర. ౭౯౯.

గీ. వఱపుదోసంబు వాయంగ వాన గురియఁ, గొం
డ్రలం బండు నారంభకోటు లెల్ల. భీమ. 3.
౧౭౨. రా. వి. ౫. ౦౨. అం. భా. ౨. ౨33.

ఒకకొండ్రయెత్తు=ఒకచాలుదున్ను.

సీ. ఓర్చునాఁగలి గూర్చి యొకకొండ్రయెత్తిన ఫ
ణిరాజుతలగుట్టు బయలుపడ దె.కకు.౧.౧౭౯.

జ: కొండ్రకైదువు.

**కొండ్రకైదువు.** వి. (కొండ్ర + కైదువు) హలము, నాఁగలి.

గీ. కొండ్రకైదువుబల్లిదుకూర్మితోడు. రా.వి. ౧.
౭౧. (శ. ర. పా.)

**కొంత.** స. (చూ. కొంచెము- కొంచెము + అంత) ఇంచుకంత.

క. కొంతేయులచారిం బడ, నింతియ సిరి చాలు
రాజ్య మెల్లను దారై, సొంత ననుఁ బెట్టుకొని
యొక, కొంత యొసఁగి కేని సట్టికూ డేమిటి
కిన్. భార. శల్య. ౨. ౧3.

గీ. క్రూరబుద్ధియై తొడఁగినఁ గొంత కొంత, విని
యు వినమి ... దశకు. ౧౧. ౧3౬.

వ. అమ్మంత్రిమాటను గొంత గాఁ బ్రసంగించి యి
ట్లనియె. దశకు. ౧౧. ౦౦.

**కొంతము.** వి. (సం. కుంతః. ప్రా. కొంతో. క. కొంత. త. కుందం.) ఈఁటె, బల్లెము.

క. ఎంత జితేంద్రియు లైనను, నెంత సదాచారు
లైన నేకాంతమునం, గాంతలసంగతి నుండినఁ,
గంతునికొంతాలపాలు గా కుండుదురే.విక్ర.
3. ౬౦.

క. గొంతాన నొకఁడు బెబ్బులిఁ, గొంతానం జి
దిమి మెచ్చికొనఁ జేసినచో ... శుక. ౧.
౧౭౨.కు.సం.౧౧.౬౯౬.

కొంతపు మొగ్గరము = కుంతాకారముగా నుండు వ్యూహము.

సీ. పొలుపొందఁగా నెల్లఁ పూఁచినవిధమున మును
కొని కొంతంపుమొగ్గరంబు. కు. సం. ౧౧.
౬౬౦.

విరికొంతపువేల్పు=పుష్పాయుధుఁడు,మన్మథుఁడు.

క. అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొ
ల్వఁ బైఁడిజగ్గిలెపైఁ జే,మంతులమాడువులో
విరి, కొంతపువే ల్పనఁగ రాజు కొలువున్నయె
డన్. యయా. ౫ ౨౫.

**కొందఱు.** స. బ. (చూ.కొంచెము- 'కొంచె' శబ్దమునకు మహన్మహత్వార్థకరూపము) కొంతసంఖ్య గలవారు.

మ. మును నీ వెన్నితి విక్రమాఢ్యు లని మమ్ముం గొం
దఱన్ ... భార. ద్రో. ౨. ౨౯౮.

చ. ... చిట్టకంపుఁ ద్రాగుడు గని సన్నల న్నగిరి
కొందఱు పాంథుఁ బ్రపాప్రపాలికల్.ఆము.
౨. ౯౯.

గీ. అంద టెందఱు కొందఱు ముందఱ యన...శక
టరేఫంబు లుడురాజ శకలనాళి. సర్వలక్షణ
సారసంగ్రహము.

**కొందలపడు.** అ. క్రి. (కొందలము + పడు) ౧. కలఁతపడు, సంక్షోభించు.

(సైంధవునిమాటలు) క. పెదవులు దడుపుచుఁ గా
ళ్లన్, గుదివడ వడఁకుచు మనంబు గొందలప
డఁగా, నిది యేటిమాట లాడెదఁ, దుదిఁ శా
ర్ఙుఁడు గానకుండఁ దొలఁగన వలయున్. భా
ర. ద్రో. ౨. ౨౯౨.

చ. నలువురు గుప్పుగుప్పనను నాలుగుమూలలమం
డి దూఁకి విచ్చలవిడిఁ బాఱసాగినను సాహస
మొప్పఁగఁ దద్విభుండు గొందలపడి చూచి
వీ రెవరు దాఁచక చెప్పుము చెప్పకున్న నగ్గ
లమున నిన్వధింతు నని కత్తిని దానొఱ దూ
సి పల్కినన్. హంస. 3. ౧౧౦.

౨. దుఃఖించు, శోకించు.

చ. అలఘుఁడు వాలి రామవసుధాధిపుఘోరశరి

ముఖంబుచే, నిలిగినవేఁడిమాట విని యెంతయు నుల్లము జల్లనంగఁ గొం,దలపడి తార యంగ దుఁడుఁ దాను మహీస్థలి వ్రాలి...భా. రా. కి ష్కిం. ౨౬౬.

క. అందులమఁ జాల భయపడి, యందఱు మడుగుల కు వ్రాలి యతిదీనతతోఁ, గొందలపడ నపు డాతని, డెందము గైకొనియె నక్కటికపుం జెంపుల్. విజ. వి. ౨. ౫౭.

**కొందలపఱుచు.** స. క్రి. (√ కొందలపడు) కలఁత పెట్టు.

క ...విభుం డమానుష తేజో,ధనుఁ డగుసహదేవుఁ గనుం,గొని యిట్లను పగలు మిగిలి కొందలప ఱుపన్. భార. విరా. ౧. ౯౭.

**కొందలపాటు.** వి. (√కొందలపడు.) కలఁత, సం క్షోభము.

సీ. అందంద కదిరెడుకొందలపాటుచేఁ దలఁకుచు ననికికి నిలుకడయును. భార. విరా.౨.3౧౫.

చ. మదిపాలదిండిచేటు తమమూఁకల కొందలపా టు వేల్పుమ,న్నెదొరలగెల్పునీటు గని...ఉ. రా. ౮. 3౦౬.

**కొందలపెట్టు.** స. క్రి. (కొందలము+పెట్టు.) ౧. కలఁత నొందించు, కలవరపెట్టు.

సీ. రాజ్యాంగములయందు రమణ మమత్వంబు ప్ర బలమై పాటునఁ బడఁగ నీక, డెందంబు నెవ్వ గఁ గొందలపెట్టెడు నకట ... మార్క. ౬. ౨౨.

క. మీవెంట వత్తు నే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా, దేవగణంబులతోడను, గో విందునిమంద లెల్లఁ గొందలపెట్టన్. భాగ. ౧౦ పూ. ౯౦3.

౨. బాధపెట్టు.

చ...నీవలన వరంబు లిట్లు గని వాలినదైత్యుఁ డు మమ్ము నింక నే,కొలఁదుల నైఁచునే కర ము కొందలపెట్టక యెట్లుఁ గావునం, దలఁపు మొకింత శాత్రవవధంబువిధంబు త్రిలోకనా యకా. హరి. పూ. ౮. ౨౨.

**కొందలము.** వి. (త. కొందళం.) ౧. క్షోభము, కలఁత.

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూ టాడె నం, చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం,దల మందెం ద్రిద శేంద్రుపట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె ... భార. విరా. ౪. ౧౭౨.

ఉ. ఎందును నెవ్వరుం బడనియెంతయుఁ గష్టము పాటు వచ్చినం, గొందల మంది పాండువిభు కోడలు దవ్వుల నున్న నన్ను గో,విందుఁడ కా వు మంచుఁ బలవించుట యోఁగఁగ రానియ వ్వవో, లెందలపోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్.భార.ఉద్యో. ౨. ౧౫౯.

౨. సంతాపము, విచారము.

చ. కలఁగుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొం,దలమున విక్రయించు వసు ధాధవుఁ డెవ్వరికైనఁ జెచ్చెరన్. హరిశ్చ. 3. ౨౫౮.

3. బాధ.

చ. ... తనకుఁ దోడ్పడువారలు లేక నన్ మదిం, దలఁపఁడె యత్తఱిన్ రిపువధంబున కెద్దియును తండ్రి యేను గొం,దలమునఁ బొందకుండ నని తాఁ బలుమాఱును జీర కుందునే. భార. ద్రో. ౨. ౨౪౭.

సీ. ... కొందలంబు, సలుపు నోవి యనంగఁ జను వ్యథ...ఆం. భా. ౧. ౧౫౦.

౪. సందియము, సంశయము.

క. కొందఱు గలఁ డందురు నినుఁ, గొందఱు లేఁ డందు రతఁడు గుణి గాఁ డనుచుం, గొందఱు గలఁ డని లేఁ డని, కొందల మందుదురు నిన్ను గూర్చి మహేశా. భాగ. ౧. ౨౨౫.

జ: కొందలపడు, కొఁదలపఱుచు, కొఁదలపాటు, కొందలపెట్టు, కొందలించు.

**కొందలించే**=కొఁదలపడు. (√ కొఁదలము.) (కలఁతపడు.)

వ. అప్పుడు పందికదుపులనెనువెంటం దనిలి కొం దలింపం జిందఱవందఱగాఁ జేసి యేసి యట చనఁ జన...ఉ. హరి. ౪. ౨౫.

**కొందాఁక.** అవ్య. ద్రు. (కొంత+దాఁక) కొంతప ర్యంతము, కొఁతవఱకు.

మ. కులకాంతాకరసంగమంబు మఱియుం గొం దాఁక నాకాంక్ష సేఁ,యులలాటాక్షుని ... వ రాహ. ౬. ౨౭.

**కొందు.** స. క్రి. (త. కొందు=పాడుచు) పాడుచు. ('నజ్జుగా నఱకు,నలినలిగాఁ గొట్టు' శ.ర, బ్రా.)

గీ. మొదమున నైదుతూపులపాదుసాహి, తమ్మిదో దుమ్మిఁ గొంది డెందమ్ము గ్రుమ్మి, క్రమ్ముకొని దొమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డి ట్లను నెమ్మనమున. ఉ. రా. ౭. ౪౫౬.

**కొంప.** వి. లొంప, అల్పగృహము, బీదయిల్లు; ఇల్లు.

సీ. ... అల్పగృహము, కొంప లొం పనఁ దగు... ఆం. భా. ౨. ౧౪.

సీ. అరిభయంకరలంక యం బేదకొంపయే కోపిం చుకొనిపోయి కొఱవిఁ జూఁడ. రామా. ౭. ౭.

శా. కొంపం బో రుదయించి రావు గద నాకుం జెప్పవమ్మా నీకథల్. వేం. పంచ. ౪. ౪౨౫.

(వ్యవ.) ఇంతపని చేయుటకు నీకొం పేమి మునిఁ గినది. వాఁడు దానికొంప తీసినాఁడు.

జ: కొంపచెఱుపు.

**కొంపచెఱుపు.** విశే. (√కొంప)-కొంప చెఱుచు వాఁడు-పలుగాకి, దుష్టుఁడు.

గీ. కొంటె కసుమాలమును దూబ కొంపచెఱుపు. హంస. ౫. ౧౧౩.

**కొకిబికి.** విశే. వికృత మైనది.

సీ. కొకిబికివేసంపుగూనిమూఁపులవాఁడ మూఁడు పంగలయూఁటె మోపినాఁడు. మనుచ. ౪. ౭౩.

వ. ... కొకిబికిమొకంబునఁ జికిబికినెండ్రుకలు జుంజుఱుఁగొప్పునం జెదరి యుప్పరం బెగ య...విప్ర. ౪. ౨౪. జాహ్నవీ. పీఠి. ౨౦.

కొకిబికికాలు=తప్పటడుగు, తప్పనాట్యము.

క. తకిట తకతక యటం చని, యొకజతి యేడక్ష రాల నున్నది యది యా,దికి సరిపడ నటి యింపుము, గొకిబికిగా నైన బిరుదు గొనుమా వెన్కాక్. పార్వ. ౫. ౧౯౯.

**కొక్కరాయి.** వి. (త. కొక్కు) బలాక, కొక్కెర.

సీ. పాటిపిట్ట యుల్లంకి పొన్నంగి తీతువు గున్నం గి యేట్రింత కొక్కరాయి. ప్రబంధ. ౨౩౪.

సీ. ... బలాక కొక్కెర యనంగఁ, గొక్కరాయి యనఁ బెంపెక్కను...ఆం. భా. ౨. ౯౪.

**కొక్కరించే.** స. క్రి. (క. కొక్కరిసు=౧. పరిహా సము చేయు. ౨. బెదరించు.) ౧. (కోఁతులు)వెక్కి రించు; వెక్కిరించు.

(వానరవర్ణనము.) ద్వి. కొనచెవుల్ ఱిక్కించి కొక్కరించుచును...రం.రా.సుం.౨౭౪పా. ౫పం.

(నటవర్ణనము) ద్వి. మోఁకాళ్లు దొడలును ముడివ ర్చుకొనుచుఁ, గూఁకటి గిలుపుచుఁ గొక్కరిం చుచును. పండితా. పర్వ. ౩౭౧ పా.

౨. బెదరించు, జడిపించు.

చ. మనుకులచంద్రుఁ డట్టియెడ మాతలి దెచ్చినవా సవీయకాం,చనరథ మెక్కి యెక్కిడినచా పముతోఁ బ్రతిఘాచలద్విలో,చనములలో యుగాంతయమశాసను కైవడి మించువేల్పు లక్, గనుఁగొని కొక్కరించుదశకంఠు నెదు ర్పడి పోరునయ్యెడన్. దశా. ౭. ౨. ౧౫౧.

౩. (పక్షులు) కాళ్లతో కెల్లగించు.

గీ. కుప్పలై యున్న యెరువెల్లఁ గొక్కరించి. నా. పంచ. 3. ౨౬౧. (శ. ర. పా.)

జ: కొక్కరింత.

**కొక్కరింత.** వి. (√కొక్కరించే.) కొక్కరించుట. (శ. ర.)

**కొక్కి=గొగ్గి.** విశే. ఎచ్చుతగ్గులు గలది.

సీ. కాంతరో నీతావికావిహో విటు ష్ఠవానికొక్కి దంతంబుల నొక్కఁ దగునె. హంస. ౧. ౯౧.

వి. విషమస్థితి.

చ.... ఫణిపుంగవుఁ జేఁదు దలంగ మట్టి దిక్కులు పగిలించి బ్రహ్మ నొకకొక్కికిఁ దెచ్చెద వీక్షణంబునన్. మై. 3. 3౬.

**కొక్కిరిబిక్కిరి.** వి. చీకిలిమాకిలి, వంకరటింకర.

ఉదా: వాని వ్రాంత కొక్కిరిబిక్కిరిగా నుండును.

**కొక్కిస=కొక్కెస¹.** వి. మల్లబంధవిశేషము.

వ. ... కక్కి కొక్కిస డొక్కెర ... ఆది యగు ముప్పదిరెండువిన్నాణంబులనాణెంబు పరీక్షించి ... హంస. ౧. ౨౦౬. ఆం. భా. ౨. ౨౯౯. ప్రబంధ. ౪౯౦.

**కొక్కు¹.** వి. పందికొక్కు.

సీ. ...కొక్కన గరిమిడికొక్కనంగను బందికొక్కనంగ. గీ. మూషికాభిధలగు...ఆం. భా. ౨. ౭౬. రం. రా. సుం. ౨౬౪ పా. ౨౪ పం.

ఆ. కొక్కు తిండియాసఁ జిక్కి చచ్చినయట్లు. వేమన. ౧. ౨౦౧.

జ: కొక్కురాతు.

**కొక్కు².** వి. ఒకానొకయాట. (వా.)

**కొక్కురో(రొ)కో=కొక్కొరోకో, కొక్కొక్కొ, కొక్కొక్కొకో.** వి. కోడికూఁతయొక్క అనుకరణము.

గీ. అప్సరస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కురోకో యటంచును గోళ్లు గూసె. హర. ౪.౧3౪.

క. ఱెక్కలు విదిల్చి లావులు, ముక్కున్నొనందువ్వి మోదమునఁ గంధరముల్, మిక్కిలి దిక్కు గనుంగొనఁ, గొక్కురొకో యనుచుఁ గోళ్లు కూయం దొడఁగెన్. శుక. ౧. ౧౪౫. నైష. ౭. ౪౯.

**కొక్కురాతు, కొక్కుహుజోమాదు.** వి. (√కొక్కు.) మూషకవాహనుఁడు, విఘ్నేశ్వరుఁడు.

గీ. గుజ్జువేలుపు పిళ్లారి కొక్కురాతు ... అన వినాయ,కునకుఁ బేళ్లొప్పును సుగంధికుంతలే శ. ఆం. భా. ౧. ౪3. అచ్చ. రా. బాల. ౨౧.

**కొక్కెర.** వి. పెద్దకొంగ, మహాబకము; బలాక.

వ. ఒక్కమహాబకంబు వచ్చె. అది పద్మభవునకుం బ్రసాదపాత్రంబగుచు నాళీజంఘుండును రాజధర్ముండు నను పేళ్లం బరఁగు. ఆకొక్కెరకు నమ్మత్తి నివాసంబై యుండు...భార. శాం. 3. ౪౪౭.

ద్వి. కొక్కెర బెగ్గురు కొంగ రాపులుఁగు, కక్కెర యాడెలు కన్నియలేడి, వెలిచె లావుక యాదివేర్వెఱుజాతి, పులుఁగు లన్నిటిఁ బొరివుచ్చి ...ద్వి. హరిశ్చ. పూ. ౬౯౯.

సీ...బలాక కొక్కెర యనంగఁ, గొక్కెరాయి యనఁ బెంపెక్కును...ఆం. భా. ౨. ౯౪.

**కొక్కెస¹=కొక్కిస.** వి. మల్లబంధవిశేషము.

సీ. కలియక తాలుమాలుల డింకి దొరలించి మిసిమినున్దొడలఁ గొక్కెస ఘటించి. కవివేల్పుశతకము. ౫౪. (చి. ని.) మల్లుపు. 3. ౬౯. ప్రబంధ. ౭౪ పం.

**కొక్కెస².** వి. ఒకానొక చెట్టు. (శ. ర.)

**కొక్కొక్కొ=కొక్కురోకో.**

క...కొక్కొక్కొ యనుచుఁ గోడి కూయఁ దొడంగెన్. వరాహ. ౪. ౧౬౪.

**కొక్కొరో(రొ)కో=కొక్కురోకో.**

ఉ...మ్రోసెఁ గొక్కొరో,కో యని కుక్కుటస్వర

దకుంతిలకంఠక ఘోరనాదముల్. విక్ర. ౬.౭౩.

సీ. కొక్కొరొకో యని కుక్కుటంబులు కూసె. కాశీ. ౩. ౨౩౫. (శ. ర. పా.)

కొక్కోకో=కొక్కురొకో.

శా. కొక్కోకో యని కుక్కుటచ్ఛటలెలుంగుల్ రెచ్చె నల్దిక్కులన్. బహు. ౩. ౯౪.

కొజ్జా. వి. (హిం. ఖోజా.) షండుఁడు, రాణివాసపుఁ గావలివాఁడు.

సీ. వీథులఁ దిరుగంగ వెనఁ దలారులు పట్టి కొజ్జాను జేసిరో...భోజరా. ౪. ౩౧౯. వేంక. మాన. ౩౧. (ఖొజ్జా. ముద్రి.)

కొటారము=కొటారు.

(కళ్లము)

క. వింటె యిటువంటిత్రిమ్మరి, పంటకొలంబున నెకాదు పాటింపఁగ వాల్గంటులఁ గలదా సాబగుల,పంటకొటారంబు కళలపంజర మనఘా. ఉ. హరిశ్చ. ౪. ౭.

గీ. తోఁట చేను కొటారంబు దొడ్డి యనెడు,నాసలన్నియు నిసుమంత లయ్యె...వసు.౨. ౧౪౯.

జ: కొటారి.

కొటారి. వి. (కొటారము+ఇ) ఉగ్రాణపువాఁడు, కోష్ఠాధికారి. (శ. ర.)

కొటారు=కొటారము, కొట్టరువు. వి. (సం. కోష్ఠాగారమ్. క. కొట్టార. త. కొట్టారమ్.) ౧. కొట్టు.

సీ. ... కొటారు. గీ. కొట్ట మని పల్కఁగాఁ దగుఁ గోష్ఠగృహము. ఆం. భా. ౨. ౧౫.

సీ. కాయధాన్యంబులకణఁజముల్ బియ్యంపుగరిసెలు దినుసులు గలకొటార్లు. హంస. ౨. ౨౭౬.

౨. ఉప్పు మొదలగునవి రాసులుగానుండెడుచోటు, కళ్లము.

ఉదా: ఉప్పుకొటారు, మొ.

ఉ. చూతమె డాసి పక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక,వ్రాతము లై వెలుంగుగరువంపుఁ గొటారుల నొప్పుతామ్రపర్ణీతటమట్లు జీర్ణదళబృందసమావృతపాండురప్రసూ, నాలిమనోజ్ఞమూలముల నర్థి నెసంగుమఘూకసాలముల్. మనుచ. ౩. ౭౦. వసు. ౧. ౯౪.

౩. ఆస్పదము, స్థానము.

సీ... జూదరి యెబ్బెరాసి గాఁతలకొటారు, మగని కంటి నెరసు... చెన్న. ౨. ౨౪.

చ... ప్రాయపుం,గలిమికొటారి దే కద జగాజిగిపైఁడిపెటారి మారుచే, నలుకుకటారి యంచు శకటారి నుతించు మిటారి మిం మగన్. ముకుంద. ౩. ౨౦౬.

కొటి(ట్టి)క[1]. వి. (సం. కుటీ. త. కుడి). గ్రామము; పట్టనము.

గీ. పల్లె కొట్టిక కొటిక పుప్పమ్ము నాఁగ,నూ రనఁగ గ్రామనామంబు లొప్పుచుండు. ఆం. సం. స్థా. ౪.

సీ. నిటలాక్షుగుడి లేనికొటిక నున్న యతండు నిల్ల డఘన మీకు యేఁచునతఁడు. జై. భా. ౧.౮౬.

ద్వి. ఈకొట్టికకు విప్రుఁ డెట్లు చేరెడిని, గైకొని బ్రతుక నేగతి గల దెంక: ద్వి. హరిశ్చ. ఉ ౫౨౭ పం.

సీ. జక్కులరాయిక్కఁ జొక్కునెక్కటియుద్దికడిఁది ముక్కొటికసోఁకుడులవెగులు. అచ్చ. రా. బాల. ౭.(ముక్కొటికసోఁకుడులు=త్రిపురాసురులు )

కొటిక[2]. విణ. వామనుఁడు, పొట్టివాఁడు.

సీ. కుఱుచ కొట్ర మరుఁజు కొటిక కుసుని...ఆ నఁగను వామనాఖ్య దనరు. ఆం. భా.౨.౧౨౩.

కొటికాఁడు=కొట్టికాఁడు. (√కొటి)

(వధ చేయుకింకరుఁడు.)

ఉ... కుమారుఁడు శౌరి నెమ్మదిన్, గట్టిగ నిశ్చ నప్డు గొటికాండ్రు కృపన్ వలకాలిపిల్లవ్రేల్, ముట్టఁగఁ గోసి మంత్రివరుముందటఁ బెట్టికృతప్రణాములై. జై. భా.౭.౪౧. (శ.ర.పా.)

**కొట్టకొన.** వి. (√కొన) అన్నిటికి కొన. (శ. ర.)

**కొట్టడి(డీ).** వి. (సం. కోష్ఠః. ప్రా. కొట్ఠ. త. కొట్టడి.) సరకు లుంచెడుగది, కొట్టు.

చ. పరఁగెడుఁరత్నకొట్టడులు భద్రముగా నొగి బీగముద్రలక్, గరిమ నొనర్చి ... హంస. ౧. ౧౧౯.

సీ. గౌళముల్ పచ్చాకు కచ్చూరములు చాల నించినకొట్టడీ ల్మించి యేఁగి. హంస. ౧. ౮౧.

**కొట్టము=కొట్టాము.** వి. (సం.గోష్ఠమ్.ప్రా. గొట్ఠం) ౧. గోవులు ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగువాని నుంచెడిసాల, పశుశాల; శాల, చావడి.

ఉ. ఏ నిఁక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు నెందు రా,జానుమతంబు ధర్మ మని యంత్రు గదా బుధు లైన నేమి యె,ద్దీనె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు మటన్న చంద మే,కానఁగ నయ్యె...సారంగ. ౨. ౨౭౮.

సీ. పాడు వైనముప్పంచఁ బొలుమనట్లుగ నేనుఁగులకు గుఱ్ఱములకుఁ గొట్టములును. భార. ఉద్యో. ౧. ౯౩.

గీ. ... తగు శాల కొట్ట మంచనఁగ సభవ. ఆం.భా. ౨. ౧౩.

గీ. ముమ్మర మ్మైనయారివేరమ్ము మదికిఁ,బుట్టి యతఁడేఁగెఁ దలపరికొట్టమునకు. నైజ. ౪. ౭౭.

౨. కొట్టు, సరకు లుంచెడిగది.

గీ. కొట్ట మని పల్కఁగాఁ దగుఁ గోష్ఠగృహము. ఆం. భా. ౨. ౧౪.

**కొట్టరువు=కొటారు.** వి.ధాన్యాదు లుంచెడికొట్టు.

ద్వి. బోరన మ్రోయుచప్పుడు వినఁబడఁగ, సారా ప్రనాథుఁ డాశ్చర్యం బెలర్పఁ, దివిరి కొట్టరువుగాదియ ప్రచ్చికొనుచు, భువిఁ బ్రతిష్ఠండయ్యె...బస. పు. ౭. ౭౭౧ పం.

ద్వి. ... సోమేశుఁ డాదినముతొల్నాఁడు, మడఁపులేఖయు నందిపడగయుఁ గొనుచుఁ,బడిహారి క్రియఁ బట్టపగలె యేతెంచి, కొట్టరువునఁ బల్లు గొలిపించుచుండ.బస.పు. ౭. ౭౪౭ పం.

**కొట్టాము=కొట్టము.**

(పసుశాల)

క.సానులకు గబ్బిదెబ్బలి,పూని కనుంగొనిన వాఁడు పోనీఁడు గదే,హాని యొనరించు హాలత, కూన సరగఁ బాటిపొమ్ము కొట్టామునకున్. చంద్ర. వి. ౨. ౭౪.

**కొట్టి(టి)=కోటి².** (చూ. కొట్టికాఁడు, కొటికాఁడు.)

జ: కొటికాఁడు, కొట్టికత్తె, కొట్టికాఁడు.

**కొట్టికత్తె.** వి. (√ కొట్టి) పరిచారిక, సేవకురాలు.

వ...గుత్తులమొడచిగుర్లు వలవంత వేఁడిమిం బొరలుకాంతలయిగురుఁబాస్పలకుఁ గొట్టికత్తెలు పుడికినన్...పూచినయశోకభూజాతపోతంబులును...కేయూర. ౪. ౫౦.

**కొట్టికాఁడు=కొటికాఁడు.** వి. (√ కొట్టి) వేగులవాఁడు, చారుఁడు.

క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెల వగునడవిన్,జొరఁ గొట్టికాండ్రు డెక్కెముఁ, బరికించి యెఱింగి కలయఁబడి కూఁత లిడన్. ఆను. ౩. ౨౭. ('కోటికాఁడు' పాఠాంతరమని శ. ర )

వ...మృగనులు నెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరఃకటిధనుష్కోటులై కొట్టికానిం జూపెట్టుకొని యెదురుమాటలు గాపండ నుండి... మనుచ. ౪. ౩౭.

**కొట్టించె.** స. క్రి. (√కొట్టు¹) కొట్టఁజేయు.

(పడఁగొట్టించు.)

సీ. నట్టింట దేవళ్ల పెట్టెఁ బెట్టినలిన్నెఁ గొట్టించి నెనఁ బందిగూఁడు చేసె. శుక. ౩. ౫౦.

(మ్రోఁగింపఁజేయు)

వ...పణవమృదంగదుందుభిప్రముఖతూర్యంబులు

గొట్టించియుఁ గావసులు పట్టించియు...మను
చ. ౪. ౩౭.

**కొట్టివేయు.** స. క్రి. (√కొట్టు[1]) ౧. పడఁగొట్టు, కూల్చు.

క. దళవాయితోడఁ గోటకు, వెలుపటియిల్లిల్లు గొ
ట్టివేయించి పిరంగులు లగ్గంబులవీఁద,న్నిలి
పింపఁగఁ బని చి నిగుడు నెవ్వగతోడన్. కువల.
౩. ౩.

౨. తగ్గించు, తీసివేయు.

(వ్యవ) వడ్డి కొట్టివేసి నాయొద్దనుండి మూలధన
ము మాత్రమే పుచ్చుకొన్నాఁడు.

౩. (గణిత) వ్యవకలనము చేయు.

ఉదా: ఎనిమిదిలోనుండి మూఁడు కొట్టివేయఁగా
అయిదు మిగులును.

౪. అననుకూలముగా పరిష్కరించు.

ఉదా: వ్యాజ్యెము కొట్టివేసినాఁడు.

**కొట్టు[1].** స. క్రి. (త. కొట్టు) ౧. తాడించు, ప్రహ
రించు.

క. జననాథ యేమి చెప్పదుఁ,గనలుచ నవ్వగ్గలప
సి కటము లదరఁగాఁ, దనచేతి నాగబెత్తముఁ,
గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై.
మనుచ. ౪. ౮౫.

వ...సముల్లోలకల్లోలహల్లీసకప్రభూతఘుంఘూ
నిలంబులు చఱచి కొట్టినం గూలువారును ...
వరాహ. ౭. ౫౯.

(క) చఱచు.

చ.పొలమరు లందుఁ గూఁత లిడ భూసురు లన్నది
వార్చి వార్చి మ్రాఁకులతుద లెక్కి చప్పటలు
గొట్టి యదల్పఁగ...ఆము. ౩. ౨౨.

(చ)-కొట్టి-వాయించు, మ్రోఁగించు.

ఉదా: డంకాకొట్టు, డప్పుకొట్టు, జేగంటకొట్టు.

౨. (కొట్టి) చంపు.

ఉ. ...దైత్యుల నూఁచముట్టుగాఁ, గొట్టినశౌర్య
ధుర్యునకుఁ గోసలరాజతనూజనెయ్యపుం, బట్టి
కి రామభద్రునకుఁ బ్రైపయిఁ జేకుఱుఁగాక భ
ద్రముల్. జై. భా. ౬. ౫౫.

గీ. ... హాయి యనుచు, నిందిరను గూడియుంటి
వీ వింటికన్న, గుడి పదిల మంచు యవవులఁ
గొట్టవయ్య. సిం. నార. ౨.

౩. కూల్చు, పాడుచేయు.

గీ...చుట్టు,ముట్టి శెట్టుగఁ దురకలపట్టనములు,
గొట్టి సాధించ వలయు గగ్గోలుపడఁగ. కృష్ణ.
౨. ౯౬.

౪. వెళ్లఁగొట్టు, పోఁద్రోలు.

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయ
భార్యఁ బాడవులకుం, గొట్టితిరి వారు మను
పఁగ,నెట్టన భరియింప వలెనె యీప్రాణము
లన్. భాగ. ౧. ౩౧౨.

గీ. ఇటుల నయ్యంబ మనసులో నీపుఁ బెట్టి, యాఁ
కలిని గట్టి దప్పుల నవలఁ దట్టి, నిద్దురను గొట్టి
వైరాగ్యనియతిఁ బట్టి, యుగ్రతపమును జే
యుచు నుండె నచట. పార్వ. ౪. ౪౨.

౫. పగులఁగొట్టు, బ్రద్దలుగొట్టు.

సీ. నీళ్లు వెల్లువగట్ట నికటాగ్రహారధరానురల్న
ళికేరములు గొట్ట. శుక. ౩. ౪౪౨.

౬. కొఱికివేయు.

చ ... అవ్వని నేమఱి నిద్రవోవఁగా, నెలుకలు
గొట్టె నేమొ సిగలు...కకు. ౫. ౧౭.

(వ్యవ) పుస్తకము లన్నియు చెదలు కొట్టినవి. చి
మ్మట చీర కొట్టివేసినది.

౭. చేయు, కావించు.

మ. భరమై తోఁచుకుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మా
లి చింతన్ నిరంతరతాళీదళసంపుటప్రకర
కాంతారంబునం దర్థపున్, దెరువాటుల్ దె
గి కొట్టి తజ్జపరిషద్విజ్ఞాతచార్యక్రియా, నిర
సుండై కొఱఁతంబడున్ గుకవి పృథ్వీశ్వరు
నీపక్షితిన్. మనుచ. ౧. ౯.

ఉ...వనిఁ జెరువాటులు గొట్టి కొట్టి మేఁ, న్వెం చి విరక్తి దాసరిని నిన్నఁ గదా యయినాఁడ వు...ఆము. ౬. ౪౦.

౮. ఛేదించు.

ఉదా: పూలతోను కాయలతోను ఉన్న చెట్టు కొట్టఁగూడదు.

౯. ఇది ప్రేరణార్థమందు 'చేయు' ధాతువవలె కొన్నితుమున్నర్థకముల కనుప్రయుక్తమగును.

ఉదా: చెడఁగొట్టు, పోఁగొట్టు, చెదరఁగొట్టు, విడఁగొట్టు, మొ.

౧౦. అనుకరణశబ్దముల కనుప్రయుక్తమై 'ఉచ్చరించు, అను, పలుకు' అనెడియర్థము నిచ్చును.

(చూ. రాకొట్టు, చీకొట్టు, కిలకొట్టు, కిచకొట్టు, బుసకొట్టు, ఊఁకొట్టు, మొ.)

౧౧. ఆడు, తిట్టు.

ద్వి. ఈసొన్నలాపురి యిటు గాలకుండఁ, జేసిన వాఁడె పో శివయోగివర్యుఁ, డనుచు వీతెఁడిగొట్టు లందఱుఁ గొట్ట, వినుచుండె రామయ్య విన్నఁ దనమున. ప్రభు. ౩.౮౩ పా. ౨ పం.
(చూ. పద్యప్రభు. ౩. ౪౧ పా.)

అ. క్రి. ౧. తగులు, తాఁకు.

తరల. అరిగి తక్కపటంపుధేనువు నల్లనల్లన మళ్లలోఁ, దిరుగుచుఞ్ వడి గాలి గొట్టినఁ ద్రెళ్లుచుఞ్ మఱి లేచుచుఞ్. వరాహ. ౧౦. ౩౮.

(వ్యవ) వానికి వడ గొట్టినది, ఎండ కొట్టినది, బిడ్డకు సందు కొట్టినది, మొ.

౨. ఎక్కువగా కలుగు.

సీ. ... పార్థివేంద్ర, యాఁకలి గొట్టి నే నడిగిన యన్నంబుఁ బెట్టింపుము ... దశా. ౬. ౭౧.

వి. ౧. దెబ్బ, ప్రహారము; తాఁకుట.

గీ. ఇట్లు కొట్టినకొట్టున నెఱ్ఱవాఱె, పుష్పకోమలధవళకపోలతలము, కరుణ పుట్టించె రాహువు గఱచి విడువఁ, దొరఁగునెత్తురుతోడిచందురునిపగిది. వరాహ. ౨. ౧౩౪.

గీ. కలికిచందోయి నెదిరెడికతన నేమొ, గంధగజకుంభపాళికిఁ గలిగెఁ జెట్లు, కలిగె బంగారుబొంగరమ్ములకుఁ గట్లు, కలశముల కెల్ల మునుమున్నె గలిగెఁ గొట్లు. ఇందు. ౨. ౧౮౯.

చ. మిడిమిడియెండ కొట్టునను మేనులు పెట్లుచునుండ నేలపై, నడుగుల దుమ్ము కుమ్మువలె నంటుకొనఞ్ ...వాల్మీకి. ౨. ౯౦.

౨. దండోపాయము.

సీ. ...కొఱలు నవలఁ, జతురుపాయంబులసంజ్ఞమైమం చీగి వేలు కొట్టన నాల్గు వేలువేఱ. ఆం. భా. ౨. ౧౯౦.

కంపుకొట్టు=వాసనవేయు.

దారులుకొట్టు=దారిదోఁపిడి చేయు.

అచ్చుకొట్టు=ముద్రించు.

సున్నముకొట్టు=వెల్లవేయు.

డాబులుకొట్టు=బడాయులుకొట్టు, బడాయిమాటలాడు.

ఈఁతకొట్టు=ఈఁదు.

ఊరుకొట్టు=ఊరు దోఁచుకొను.

వానినోటిలో మన్ను గొట్టినాఁడు=వానిజీవికకు భంగము కలిగించినాఁడు.

కొట్టినపిండి=బాగుగఁ దెలిసినది, అతిపరిచితమైనది.

ఉ. కోమలి నాకు నెట్టియెడఁ గొట్టినపిండి సమస్తలోకముల్, నీమది కింపులైనయవి నిర్భరశక్తిని దే సమర్థుఁడఞ్. కళా. ౬. ౩౬.

ఉదా: రామాయణము వానికి కొట్టినపిండి.

జ: కొట్టించు, కొట్టివేయు, కొట్టుకొను, కొట్టుపడు, కొట్టుమిట్టాడు, కొట్టుమిట్టిపడు, కొట్టులాట, కొట్టులాడు, కొట్లమారి.

కొట్టు[2]. వి. (సం. కోష్ఠః) సామగ్రు లుంచెడుగది.

సీ. కొట్లు బేహారులగొనబుటంగడులంద తఱచుగా గొందెము ల్తలుపులంద. అచ్చ. రా. బాల. ౪౭.

**కొట్టు³.** వి. ఒకానొక చెట్టు.

వ...కొడిసెల నొడిసెల నందుగుల నిందుగులఁ గ

లుగొట్లఁ గొట్ల...పి. శకుం. ౨. ౧౪.

**కొట్టుకొను.** అ. క్రి. (√కొట్టు¹) ౧.సంచలించు, కదలు.

(వ్యవ) గాలిలో బట్ట కొట్టుకొనుచున్నది.

౨. ఆందోళించు, డోలాయమానమగు.

(వ్యవ) కొడుకే మగునో యని వానిప్రాణాలు కొట్టుకొనుచున్నవి.

౩. శ్రమపడి పనిచేయు.

(వ్యవ) నీ వెంత కొట్టుకొనినను ఇంతకంటె నెక్కువ ధనము రాదు. కొట్టుకొని కొట్టుకొని వచ్చి వాఁడు గనుక పండుకొనినవెంటనే వానికి నిద్ర పట్టినది.

౪. బాధపడు.

(వ్యవ) వంట కొంచె మాలస్య మైనయెడల పిల్లలు ఆఁకలిచే కొట్టుకొందురు.

సా: బట్ట కొట్టుకొనిపోవుచుండఁగా పోఁగులకేడ్చినట్లు.

(వాడుకలోని విశేషప్రయోగములు.)

వాఁడు వాకిటఁ గొట్టుకొనుచున్నాఁడు కొంచెము బిచ్చమువేసి పంపుము. వారును వీరును కొట్టుకొనుచున్నారు. ఉప్పెనచే ఊళ్లు కొట్టుకొనిపోయినవి. పేలపిండి గాలికి కొట్టుకొనిపోవుచున్నది. ప్రవాహములోఁబడి వాఁడు కొట్టుకొనిపోవుచున్నాఁడు.

**కొట్టుప(వ)డు.** అ. క్రి. (కొట్టు¹ + పడు) ౧. దెబ్బలుపడు, తాడితమగు.

ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట...

విష్ణుభవదూరునిఁ జేర్కొనిరేని మీఁద స,

క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు

దుఃఖభారముల్. భాగ. ౬. ౧౨౩.

క. కొట్టువడి యటకు మునుపే, తిట్టుంబడి యేడ్చునాడు దెసఁ గని మదిలోఁ, గట్టలుక వొడమి నాసఖు, లిట్టనిరి మునీంద్రులోడ నెత్తిన చెలుచకా. మనుచ. ౪.౭౬. వేం. పంచ.౪. ౪౭౩.

౨. బాధపడు, పీడితమగు.

క. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హరిశర్మ ధృతి యుఁ దూలక తృష్ణం, గొట్టుపడకుండఁగాఁ దన, పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్. హంస. ౨. ౧౫౧.

౩. వ్యయమగు. (శ. ర.)

**కొట్టుమిట్టాడు.** అ. క్రి. (కొట్టు¹ + మిట్టి + ఆడు) అతిశయించు; నిరంకుశముగా మిట్టాడు, స్వేచ్ఛగా సంచరించు.

సీ... ఆఁకలి కొట్టుమిట్టాడంగ ... భాగ. ౯. ౧౦౧.

క. రక్కసులు వేడబంబుల, మిక్కిలి నామకొని కొట్టుమిట్టాడంగా, నక్కట యొక మెకమువలె, యిక్కానల నొంటిఁ దిరుగు టిదితగవగునే. యయా. ౨. ౫౭.

**కొట్టుమిట్టిపడు**=కొట్టుమిట్టాడు. అ. క్రి. ఎగిరిపడు, మిడిసిపడు.

ఉ. దిగ్గన లేచి నిబ్బరము దీటుకుచంబుల నాఁపలేక తాఁ, బగ్గెకుఁ గొట్టుమిట్టిపడు పైఁటచెలుగఁ జేల జాఱఁగన్. ఉ. హరిశ్చ. ౪. ౭౬.

**కొట్టులా(ట్లా)ట.** వి. (√కొట్టులాడు) కలహము, జగడము.

క. నీ కేమి యాతఁ డాతఁడుఁ, బైకొని మార్కొనిన నిన్నుఁ బ్రార్థించి రటో, యీ కొట్లాటలు దీర్పఁగఁ, నాకాధిపతనయ యనుచు వారుఁ డనియెన్. అహ. ౧. ౧౦౫.

గీ. పికిలిపిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు. కువల. ౫. ౯.

**కొట్టులా(ట్లా)డు, కొట్టాడు.** అ. క్రి. (√కొట్టు¹) ౧. ప్రహరించుకొను; జగడమాడు, పోట్లాడు.

రగడ. జలజనాళములఁ విశాలసరసలీలఁ గొొట్టులా
డి. రా. వి. 3. ౧౭౧.

సీ. అంత కంతకు నంపురాది సకర్తృక మనుచుఁ
గొొట్లాడువేదాంతికులును. రా. వి. ౨. ౭౫.

గీ. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు, డడ్డపడి
వారిలోఁడఁ గొొట్లాడియైన, దాని నుడుపంగఁ
జొరకున్నవానిఁ గ్రూర,కర్ముఁ డని చెప్పుదు
రు కర్మకాండవిదులు. భార. ఉద్యో. 3. ౨౮౨.

౨. బాధపడు.

క. కట్టా త్రికరణ మెఱుఁగఁగఁ,బుట్టినదుకితే ముల
నపుడ పాలియింపనియా,కట్టేఁడి దేహం బుడి
గినఁ,గొొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. 
భాగ. ౬. ౪3.

కొొట్టె. వి. (త. కొొట్టు.) ఒకవిధ మైనగాదె.

సీ...లగుఁ గుసూలాభిధ గాదె యనంగను గరిసె
యనఁగఁ. గీ. దశ్వికోషసమాఖ్యలు లనరుచుం
డుఁ, గొొట్టె కూటు పాడక కుమి బొట్ట యనఁ
గ...ఆం. భా. ౨. ౨౪౦.

కొొట్నము. వి.(ఇది 'కట్టు' ధాతువునకు 'కట్నము' వంటిది. √ కొొట్టు[1]-క. కొొట్టణ, కొొట్ణ.) ౧. వడ్లు మున్నగువానియొక్క దంపు.

ద్వి... నేఁ డాదిగా మీరు గూడి, చని వీరబా
హునిసదనంబునందు, వెట్టిఁ గొొట్నము నీళ్లు వె
లయంగఁగనవు,కట్టెలు నివి యాదిగాఁ గలప
నులు, పగ లెల్లఁజేసి ... ద్వి. హరిశ్చ. ఉ.
౧౬౬౧ పం.

మ. సొలపుం దెమ్మెరసోగలేదలిరు మోసుల్ పూర
జం బెంతయున్,గలయం బర్వఁగఁ దావిక్రొ
వ్విరిఁ గడంకన్ వ్రాలుమన్ దేలుమన్, వెల
సెన్ మాధవకాన నేందిరలపెండ్లిం దీవపూఁ
బోఁడులు,త్కలికన్ గొొట్నము తేఁటిపాట
లెసఁగంగా దంచుకీలిం జెలీ. చంద్రా. ౪.
౨౧౫.

౨. ఊడిగము. (శ. ర.)

శా. ఇట్టట్టెందును బోవ రాక వగతో నెల్లప్పు
డున్ వేలుపుల్,వెట్టిం గొొట్నముఁ జేయ...
యయా. ౨. ౬3.

క. అనవుడు భూతంబులు మా,కును మీకృపఁ జే
య నెట్లు కొొట్నంబుల మ,మ్మును బట్ట నోపునే
యవి, యని పదముల కెఱఁగి పలికి రంతయుఁ
దెలియన్. మై. 3. ౭౯.

కొొట్నములపాటలు = పెండ్లిలో కొొట్నములుదంచునపుడుపాడుపాటలు.

వ. అప్పుడు గప్పురగంధులు పెండ్లికొొట్నంబులపా
టలు పాడి రఁట యెటువలెను. మృ. వి. 3.
౫౯.

కొొట్నము(లు)దంచు = పెండ్లిలో స్త్రీలు పలురకములవడ్లు కలిపి పాటలు పాడుచు దంచు.

పాట. చెలియ రావె చేడె రావె చిన్ని రావె పొ
న్న రావె, నెలఁది రావె కొొట్నములు వేగ దం
చుము॥ గరుడవాహనములు మంచి గొరికుంకు
మములు రత్న,నసులు పచ్చగన్నేరులు సన్నది
నుసులు, కలయఁ గూర్చి ... దంచిరి. మృ. వి.
3. ౬౦.

కొొట్ర[1]. వి. పిండి లోనగువాని నుడుకఁ బెట్టుటకు పెట్టినయెసరు.

వ...కీచకతండులంబులం బిండికొొట్టి కొొట్రఁ బో
సి యుప్పి గొప్పులుగాఁ జేసి యావించినకుడు
ములబానలు...కాళ. 3. 3౬.

కొొట్ర[2]. విణ. వామనుఁడు.

సీ. కుఱుచ కొొట్ర కుఱుఁజు...గీ...అనఁగను వా
మనాఖ్య దనరు...ఆం. భా. ౨. ౧౨3.

కొొట్ల(ట్టుల)మారి. విణ. (√కొొట్టు[1]) కొొట్లుపడు స్వభావము గలవాఁడు, దెబ్బలు తినుస్వభావము గలవాఁడు.

సీ. తాళముల్ చూడఁ గీర్తనపాత్రము లటంచుఁ
గొొట్లమారుల జోడుగూర్పఁ దగునె. గీ...గ
బ్బిచన్గుబ్బగవకు, చంద్రా. ౪. ౧౨౭.

**కొడతము**=కొణతము[1]. వి. కుక్క మున్నగువాని మెడకుఁ గట్టి పట్టుకొనుకట్టి.

క. కొడతములు విచ్చి కుక్కల, విడుచుచుఁ బెను వలల నిగుడ విప్పుచుఁ గడఁకన్, వెడవెడ నార్చుచు నతిముదిఁ, గడువడి వలవేఁటకాండ్రు గవిసిరి పెలుచన్. పద్మ. ౧. ౧౧౩.

**కొడమ.** వి. ముఖభాగమునందు కట్టు లేక నడుమ వలవలె నల్లిక గలమూఁతవంటి మత్స్యగ్రహణ సాధనవిశేషము.

గీ. కొడమ తి ఱ్ఱడ్డకొడను ద్రొబ్బుడుపటంబు, చాఁప యెత్తెల గూడయు... హంస. ౪. ౧౭౪.

క. వలలం గాలంబులఁ గొడ, ముల నూఁదులఁ జువ్వలను గ్రమంబున... ప్రబంధ. ౧౯౪.

**కొడవలి.** వి. జా. అనా. (బ. కొడవలులు, కొడవళులు, కొడవళ్లు, కొడవండులు, కొడవండ్లు) లవిత్రము, కక్కులు గలిగి వక్రాకారమై గడ్డి మున్నగునవి కోయుట కుపయోగించునొకానొక పనిముట్టు.

క. కడునియతిఁ దపము చేయుచు, నడవికి నొకదినమునందు నరిగి సమిత్తుల్, కొడవంటఁ గోయునురవడిఁ, దడఁబడి తనవామహస్తతర్జని తెగినన్. వరాహ. ౧౨. ౨౪.

గీ... సత్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు... ఒండుమెయిఁ దెగ విట్టలముగ, నొలయు వైరాగ్య మనుకొడవలిన కాని. భార. శాం. ౪. ౧౯-౨. ఆం. భా. ౨. ౨౩౧.

**కొడస**=కొడిసె. వి. (సం. కుటజః) కుటజము, కొండమల్లెకి.

గీ... కొడస, కొడిసె యనఁ గుటజం బగు... ఆం. భా. ౨. ౫౦.

**కొడి.** వి. (సం. కోటిః. ప్రా. కోడి. క. కుడి) ౧. దీపశిఖ; దానినుండి వెడలుపొగ.

సీ. కొడిఁ బుట్టుకాళిమాంకురపు మేఘములను మెఱుఁగులై చూపుఁ గ్రొమ్మించు లుబర... గీ. అరతులొసంగు దివ్యకన్యకలు ధన్య, మతులు గ్రీడింతు రయ్యుత్తమస్థలమున. పాండు. ౨. ౧౩౭.

క. శ్రీకమలగృహము మోము వి, లోకింపఁగ దీపకళికలు కనుంగవ యౌ, నాకొడి వాటినసన్నపు, రేకలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్. పి. శకుం. ౨. ౧౪౯.

౨. దీపపువత్తి మున్నగువానియొక్క దగ్ధాగ్రము, కాలినచివర.

ఉదా: దీపపుకొడి, పొగచుట్టకొడి.

(వ్యవ) కొడి కత్తిరించుటచేత దీపము బాగుగా వెలుఁగుచున్నది.

౩. లక్షణము, చిహ్నము.

ఉదా: చవుటికొడినేల. (బ్రా.)

౪. జెండా?

ఉదా: కొడిస్తంభము=ధ్వజస్తంభము. (బ్రా)
కొడివేయు=జెండాయెత్తు. (బ్రా)

జ: కొడివడు.

**కొడిగ(గె)**=కొణిగ. వి. ముంజూరు, చూరుముందుభాగము.

ద్వి. అది మీఱఁగానీక యపరంజికొడిగ, ముదురుఁగెంపులపాళముగ నెండ గాయ. రం. రా. సుం. (చి. ని.)

సీ. పాడిమగఱాచందుకొడిగె నంటినజాతిరేకోటి ఱాగోడజాజుటాకు. ఘటికా. ౨. ౬౬.

**కొడిద**=కొడిసిలి. వి. బొట్టనవ్రేలు కాక తక్కిననాలుగువ్రేళ్లను వంపఁగా నేర్పడినచేర.

గీ. భాసిలు నికుబ్జచతురంగుశీసమాఖ్య, కొడిదకొడిదిలి యనఁగ రక్షోవిదారి. ఆం. భా. ౨. ౧౪౦.

**కొడిది(ద్ది).** వి. ఒకానొక చెట్టు. (శ. ర, బ్రా.)

సీ. కొడిదిపూసల నంటుకొలిపిన మొలత్రాడు తలదుడ్డు చీరణంబులపాదియును. ఆ... అమరనాకస్మికంబుగా, మందనుండి యింటిమగఁడు వచ్చె. వేం. పంచ. ౧. ౮౧౭.

సీ. నగుబు గప్పనిచంద్రనిప్పుకైపడి నున్న దీకొ
డ్డిపూసనీ కెవ్వఁ డిచ్చె. జై. భా. ౩. ౭౮.

కొడిదిలి=కొడిద, కొఁణిద[1], కొఁణిదిలి. వి. ౧.బొ
టనవ్రేలు కాక తక్కిననాల్గువ్రేళ్లను వంపఁగా
నేర్పడినచేర.

గీ. భాసిలు నికజ్జచతురంగుళీసమాఖ్య, కొడిద
కొడిదిలి యనఁగ రక్షోవిదారి. ఆం. భా. ౨.
౧౭౦.

చ. పుడమిని రాచయిండ్ల మఱి పుట్టునె యీవగ
కొమ్మ యమ్మరో, కొడిదెఁడు నెమ్మొగంబు
తళుకుందెలికన్నులు చేరెఁడేసి గా... బహు.
౮. ౧౦౬. చంద్రా. ౧. ౭౯.

కొడిమె[1]. వి. ౧. అపనింద.

సీ... అయ్యాబ్జముఖియు. గీ. మిగుల వెఱఁ గంది
యంతట నగుచు మీరు, సృష్టికర్త లెట్టైనను
జేయఁ గలరు, మదికి వలసినయట్ల చేయుదు
రుగాని, పట్టికొడిమెలు నాకును గట్టఁ జన
దు. కళా. ౫. ౫౬.

౨. అన్నృతము, అసత్యము.

సీ. బూతు నా బూమె నా బూక నా బూటక
మ్మనఁగను వేడబ మనఁగఁ గొడిమె. గీ.యనఁ
గను నబద్ధసంజ్ఞయై యలరుచుండు. ఆం. భా.
౧. ౧౧౭.

౩. పాపము, దోషము.

క. కడు నరుదుగ నీయెడ నీ, యడుగుంగొన యం
త సోఁకినంతనె చెడుగుం,గొడిమెలు విడి
చని క్రమ్మఱ, మడఁతితనం బొదవె నాకు
మానిసిమిన్నా. అచ్చ. రా. బాల. ౧౭౯.

జ: కొడిమెలాఁడు.

కొడిమె[2]. వి. చేఁపలబుట్ట, కువేణి.

సీ...కువేణి చెలంగుఁ గొడిమె యంచనఁగను...
ఆం. భా. ౧. ౧౪౯.

కొడిమెలాఁడు. విఠ. (కొడిమె[1]లు + ఆఁడు.)
పాపాత్ముఁడు. (శ. ర, బ్రౌ.)

కొడివడు. అ. క్రి.(√ కొడి) క్రుంగు ?

సీ ... దృష్టి కధికగోచరంబు. ఆ. గాఁగఁ బన్ని
నిలిచెఁ గాయ్యుతో దానవ, కులబలంబు సే
లకొడివడంగ. కు. సం. ౧౧. ౬౭౯. ( ప్ర
యోగాంతరము లేదు. ఇంకను విచార్యము.)

కొడిసె[1]=కొడస.

గీ. కొడిసెవిరులకమ్మఁదనంబు గొఱలి కొండ,సె
లల జాఱుతుంపురు మోఁచి మెలఁగుచున్న
గాడ్పు మురిపంబు నెందును గలిగి యెల్ల,వా
రిమనసులు వేడ్కల మూరిఁబోయె. హరి.
పూ. ౯. ౬౭.

గీ... కొడస, కొడిసె యనఁ గుటజం బగు ...
ఆం. భా. ౨. ౫౦.

జ: కొడిసెపాల.

కొడిసె[2]. వి. మత్స్యవిశేషము, ఒకవిధ మగు చేఁప.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువు లెంకల కిచ్చె వా
లుగలను సంగడీల కిచ్చె ...కొడిసెలఁ బరిహా
సకులకు నిచ్చె. ద్వా. ౧. ౨౮౦.

కొడిసెపాల. వి. (√కొడిసె[1])కొడిసెకాయ, ఇం
ద్రయవము.

గీ...కొడిసెపాల,నాఁగ నింద్రయవము దోఁచు
నాగభూష. ఆం. భా. ౨. ౫౦.

కొడుఁగురు=కొణుఁగురు. వి. ౧. దీపముయొక్క
చిట్టెము, దీపకిట్టము. (చి. ని, శ.ర.)

౨. (శైత్యాదులచే శరీరమునకుఁ గలుగు)వంకర.
(చూ. కొడుఁగురువోవు)

జ: కొడుఁగురువోవు.

కొడుఁగురువోవు=కొణుఁగురువోవు. అ.. క్రి.

(కొడుఁగుసు+పోవు) - శైత్యాదులచే-వంకర పోవు, మెలికెలుతిరుగు.

(గిజిగాఁడు) చ... నీతునం, గొడుఁగుసుపోయి యున్నసఖుఁ గ్రోఁతిఁ గనుంగొని చాలఁ గుందుచున్. కేయూర. 3. ౨౬౦.

**కొడుకఁడు**=కొడుకు. వి. బిడ్డఁడు, కొడుకు.

క. కొడుకఁడు నాపాదెగిటిలోఁ, జెడి పోయిన నాఁటనుండి చెలియా తెలియం,బడ దేవార్తయు నతఁ డే,పడుపున నెచ్చోట నిలిచి వర్తించెడినో. భాగ. ౧౦ ఉ. 3౨.

**కొడుకు**=కొడుకఁడు. వి. (చూ. కూఁతు.) ౧. మగశిశువు, బాలుఁడు.

ఆ. ఘనభుజుండు రాధ యనుదానిపతి యొక్క, సూతుఁ డసుగుదెంచి చూచి రత్న, పుంజభరిత మయినమంజసలో నున్న, కొడుకు దాని తోన కొనుచు వచ్చి. భార. ఆది. ౫. 3౧.

వ ... సాత్వతియు నబ్బాలు బలదేవుచేతికి నెత్తుకొన నిచ్చి తదనంతరంబ నారాయణు చేతికి నిచ్చిన.

క. అక్కొడుకు నబ్జనాభుం, డక్కజముగ నెత్తికొనుచు నందఱుఁ జూడన్, గ్రక్కున నొక్కట నడఁగెను, మిక్కిలిచేతులును వానిమిక్కిలికన్నున్. భార. సభా. ౨. ౫౬, ౫౭. అం. భా. ౨. ౧౧౭.

౨. పుత్త్రుఁడు.

క. పొడుపునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ,కొడుకని యీతని నెంతయు, నెడమడుగుగఁ జూపఁ దెత్తె యుండఁబు నగఁగాన్. భార.ఆది. ౮. ౧౦౦.

గీ. కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁదనము,గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు, నట్టియు జ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్ప దిది యని రుద్రుండు చెప్పి చనియె. భార. ఉద్యో.౮. 3౭౦.

3. పురుషుఁడు, మగవాఁడు.

క. చేసెడునలరాయనికై, కానముకుఁ గాక జడిసెఁ గాఁపుఁగొడు కా,లో నుదతిఁ దెచ్చుటకని,ద్రాసత్తని మాటెఁ జన్నుద్రావెడుకొడుకున్. వేం. పంచ. ౮. ౮౮౨.

కొడుకుఁగుఱ్ఱ=కుఱ్ఱవాఁ డైనకొడుకు.

గీ. ధర్మతనయాదు లైననీతమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ, వేలు మాలోక మెల్ల నీ కేల రాధ, కొడుకు కితండనుకొక్కవ కొడుకుఁగుఱ్ఱ. భార. ఉద్యో. ౮. ౫౯.

క. కొడుకుంగుఱ్ఱుకుఁ జనుఁబా,లిడి ... వేం. పంచ. ౮. ౮౯౧.

సా. కొడుకు బ్రదికియుండవలె కోడల్లు ముండమోయవలె నన్నట్లు.

జ: కోటరము, కోటవికము, కోడంత్రము, కోడంత్రికము, కోడవికము,కోడలిలినము, కోడలు.

**కొడుపు**. వి. డంకా జేగంట మున్నగువానిని వాయించుకోల, కోణము.

గీ. క్రొమ్మెఱుఁగుఁదీఁగె తళుకులకమ్మపసిఁడి,కొడుపుతాఁకుల ఘూర్ణిల్లె ఘూర్ణిల్లె ఘోరభంగి,దర్పకోద్దండదండయాత్రకును బోలె, భూరితరమేఘమాళిక పేరిభేరి. రామా. ౬. ౭.

సీ. మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను కొడుపుచేఁ దాటించు నెడపఁదడప. క్రీడా. ౧3౬.

ఉ. అంగదఁ దళ్స్వయంవరమహామహవైభవకేళిహజాతికిన్, గ్రంగన ఘంటపైఁ గొడుపు ప్రాలుట యెన్నఁడొ నాఁటనుండియున్, సంగరమున్ గిరఁబుగ మనంబున భావనసేయ నైరి యా,మంగళకార్యనిష్ఠు లయి మన్యమలోకమున న్మహీపతుల్. నైష. 3. ౨౫.

౨. బలపము లోనగువానికడ్డి.

వ. ఈబలపపుఁగొడుపున వలసినయన్ని లెక్క-

లొడ్డి వ్రాసి యీలాతపుఁగోల సవ్యహస్తం
బునఁ బట్టి మట్టించిన నన్నియు నీవు దలం
చినప్రాణులై నిల్చి నీవు చెప్పినపని చేయు
...ద్వా. ౭. ౧౧౩. ఆము. ౨. ౫౪.

౩. తంబుఱ వీణె మున్నగుతంత్రీవాద్యములు వాయించుటకు వ్రేలికిఁ దగుల్చుకొనులోహపు గోరు. (శ. ర, బ్రా.)

౪. జంతికలు చేయుగొట్టము (బ్రా.)

౫. అప్పడాలు మున్నగునవి ఒత్తుగుండ్రనికఱ్ఱ. (బ్రా.)

ప్రత్తికొడుపు=ప్రత్తికాయలోనిజడ, విడి.

సీ. శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటిమీఁదటి ప్రత్తికొడుపువోలె. కాశీ. ౧. ౧౩౭.

జమ్ముకొడుపు=జమ్ముకండె, జమ్ముకంకి, జమ్మువెన్న. (బ్రా.)

**కొడుము.** వి. తీర్థపుబిందె.

క. కొడు మెత్తుకొఱకు గుడికిన్, నడుచున్ వె
లపడుచు నాభినామమునం గ్రొ,మ్ముడిసౌరు
న్మడి చేరు, న్వడి జాఱుంబైఁట వింతవగఁ
గనిపింపన్. శుక. ౩. ౧౮. ('కొడు మెత్తుకొఱకున్=తిరుమజ్జనపుసేవయందు తీర్థపు బిందె నెత్తునప్పుడు కావించునుత్సవమునకు' అని కథాసందర్భమును బట్టి తోఁచుచున్నది.)

**కొణజేము**=కొణజా. (బ్రా.)

**కొణజా.** వి. వాకిటికావలియిల్లు, ద్వారమును మాత్రము సంరక్షణముచేయుపంచ. (బ్రా, శ. ర. "కొంజా" అనివాడుక.)

**కొణతము[1]**=కొడతము.

సీ. బిరుదు గల్గినయింటఁ బెరిఁగినం గొణతంబు
విప్పినంతనె కుక్క వెదకుఁ జెప్పు. వేను. ౩౬.

**కొణతము[2], కొణాత.** వి. మల్లసాధనవిశేషము.

మ. అమరం గ్రొవ్వరితేనెజాలుకొణతా లందంద
లాగించి పాం,కముగం బుప్పొడిమట్టిలోఁ
బొరలి పిఁకన్ బోఁకపూమొగ్గగో,తములం
ద్రొబ్బి సమీరమల్లుఁ డనువొందన్ మావి
పూలోడిఁ ద్రి,ప్పుమెయిన్ గోకిలబాలుఁ
డెంచికొను సొంపుల్ గుల్కునాదంబులన్.
శశాం. ౨. ౧౧౮.

సీ. మనును జెట్టి యనంగ మల్లాభిధానంబు...త
త్సాధనంబులై తగుఁ గంబము కొణత...ఆం.
భా. ౨. ౨౦౮. ప్రబంధ. ౭౨.

**కొణిఁగె.** వి. దిబ్బ, కుప్ప.

వ...మగరాలగోడలనీడలం దుఱంగలించుక్రీడా
పులినంపుఁ గొణింగెలఁ జెలంగురంగుల మె
లంగువెలుంగులు...కృష్ణ. ౧. ౨౦.

**కొణిగ(గె)**=కొడిగ. వి. ముంజూరు, చూరుముందటిభాగము.

సీ. పగడాలకొణిగలనిగనిగ ల్వజ్రంపుజగతిత్రే
వల నెఱజాజు నింప. వసు. ౨. ౨౩.

సీ. నెలవులై చెలువారునిలువుల విలసిల్లి కొణిగఁ
బారావతకులము వదర. మనుచ. ౬. ౩.

ద్వి. గోమేదకంబులకొణిగెలుబవిరి,గా మల్చి పై
వజ్రగార యొసంగి. రం. రా. బాల. ౮౩పా.
౭పం.

చ. చెదరి కపోతముల్ గొణిగ చేరక తారకవీ
థిఁ బాఱఁగా...వసు. ౪. ౬౩.

కొణిగచూరు=కొణిగ.

సీ. దోఁపుచూరనఁగను దోఁచు నంతళ్ళది కొ
ణిగచూరనఁగ నగు న్వలీక,ము...ఆం.భా.
౨. ౨౧.

**కొణిగె.** వి. నమస్కారము.

శగడ. గోవర్ధనమునఁ గొలునై గన్పడు, గోపవే
షునకుఁ గొణిగె లొనర్చుచు ... హంస. ౪.
౨౧౩.

వ...తులసీవనముంపలిగ వాసరునకుః గొణిగె...
ప్రబంధ. ౭౭౦.

కొణిద[1]=కొడిద. (బ్రా)

కొణిద[2]. వి. మనుష్యజాతివిశేషము. (శ. ర, బ్రా.)

కొణిదిలి=కొడిదిలి.

ద్వి. ఎనయు నిద్దర నెల్ల నేలినన్నృపుఁ, గొనిపో
యిరే నేలఁ గొణిదెఁడం తైన. ద్వి.హరిశ్చ.
పూ. ౧౪౨౮ పం. భా. ౫. ౭.

కొణుఁగురు=కొడుఁగురు. వి. ౧. దీపముయొక్క
చిట్టెము. (శ. ర.) ౨. (శైత్యాదులచే శరీరము
నకుఁ గలుగు) వంకర. (చూ. కొడుఁగురువో
వు.)

కొణుజో=కొనుజో. వి. పిడుఁజు, పశువులదేహమం
దు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము. (శ. ర,
బ్రా.)

కొతి(త్తి)మిరి. వి. (సం. కుస్తుంబరీ. ప్రా. కొతుం
బరి. త. కొత్తమల్లి. క. కొత్తుమిరి.) దనియపు
మొక్క, ధాన్యాకముః.

సీ...కుస్తుంబరి దనర్చుఁ గొతిమిరి యన. ఆం.
భా. ౨. ౨౪౯. అ. మ. క. ౫. ౨౪౭ పా.
౧౬ పం.

జః కొతిమిరిపురుగు.

కొత్తిమిరిపురుగు. వి. (√ కొతిమిరి) దీపముఁలో
పడి చచ్చునొకవిధ మైనపురుగు. (ఇది దీపము
లోఁ బడికాలునప్పుడు కొత్తిమిరివాసన కొట్టు
ను గనుక ఇట్టిపేరు వచ్చినది. బ్రా.)

కొతుకు=కొదుకు. అ. క్రి. ౧. జంకు, వెనుదీయు.

ఆ. తల్లి పాఱవైచి తరల నన్న్యులపంచ, బ్రతికి
కూఁతవట్టి కొతుక కీవు, కన్ను లెఱ్ఱచేసి య
న్నులఁ గని కాఱు,కూఁత లఱచె దేమి కో
కిలంబ. రసిక. ౪. ౧౮౦.

చ. అతితరమారఘోరవిశిఖాగ్నిశిఖాపరితాపభీ
తి న,య్యతివలమిన్న నిన్నిచటికంపెడిచో
మఱి యేమి పల్కె నీ,మతిఁ గొతుకంగ నే
ల చెపుమా...శుకమా రయంబునన్. రసిక.
౫. ౪౬.

౨. వర్ణలోపముగా మాటాడు, మాటలునమలు.
(శ. ర.)

వి. సంకోచము, జంకు. (శ. ర.)

విణ. వర్ణలోపము గాని పదలోపము గాని కల
ది, గ్రస్తము (౧. పదము. ౨. వాక్యము.)

సీ. గచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు.
...ఆం. భా. ౧. ౧౧౭.

జః కొతుకుపడు.

కొతుకుపడు. అ. క్రి. (కొతుకు+పడు) ౧. (మా
ట) లుప్తవర్ణము గాని లుప్తపదము గాని అగు.
(శ. ర.)

౨. తగ్గు, తక్కువ యగు.

క. అతనికి మంజుల యనఁగా, సతి యొక్క తెగ
లదు దానిసరి యెన్నుటకుం, గొతుకుపడు రతి
కిఁ జతురత, యితరల నిఁక నెన్న నేల యిం
దునిభాస్యా. హంస. ౨. ౭౦.

కొత్తడ(ళ)ము=క్రొత్తడము. వి. (త. కొత్తళమ్.
క. కొత్తళ.) కోటబురుజు.

ద్వి. లఱు చైనయట్టికొత్తడములతోడ, నిరవైన
ముందఱియిట్టికకోట,పడమటివాకి టేర్పడఁ
గాచి యుందు, రెడపక రాక్షసు లెనుబదికో
ట్లు. రం. రా. యు. ౩౦౩ పా. ౧౭ పం.

చ. తలఁకునఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూ
సి డాసి కొ,త్తళములపై నలంగములఁ దా
ర్కొని మార్కొని...ఉ. రా. ౪. ౨౮౨.

సీ...సాలావయవాఖ్య కొత్త,ళ మ్మన...ఆం.భా
౨. ౧౨.

**కొత్తెము.** వి. తాటిపండునందు విత్తు లేనికండ. (శ. ర.)

**కొత్తెమ్మ(మ).** వి. యోగిని, యోగాభ్యాసము చేయునాఁడుది. (ప్రా.)

కొత్తెమసాని=యోగిని యగుస్త్రీ.

వ... ప్రత్యక్షీకృతమోక్షలక్ష్మీవిశేషంబులం బోని యనశనవ్రతశుష్కీభూతంబు లగు మేనులుం గలకొత్తెమసానులును ... విప్ర. ౨. ౧౪.

**కొత్వాలు.** వి. (హిం. కోత్వాల్) పోలీసుఅధికారి. (శ. ర.)

గీ. ఎఱుకగలవారిఁ దరలఁడి నేఁడునపుడు, కరములసిఖాలుచేసి ముష్కరతురుష్కు, లవలఁ బొమ్మని కొత్వాలు కప్పగింతు, రచ్చటికిఁ జేరఁ బరులవ నలవి కాదు. కృష్ణ. ౨. ౧౨౩.

**కొద=కొదవ.** వి. (√కొదవ) ౧. కొఱఁత, లోపము, న్యూనత.

సీ. కూడుసీరకు నింటఁ గొద లేక యుండునే ... హర. ౨. ౪౧.

క. చదలేటినీటఁ దడుపక, కొద లేటికిఁ దీఱు సగరుకొమరుల కని ప్రే,మ దిగంతచరుఁడు గరుడుఁడు, మది వంత యడంప నంతమంతుం డంతన్. చం. రా. ౩. ౧౬.

౨. అక్కఱ, తమి, ఆశ.

క. ఇది గాంధర్వవివాహము, సుదతీ మన కిపుడు సాక్షి సూర్యుఁడె యన నో,ముదుకఁడ నీకొద తీఱిన, వద లెద వే నొల్ల ననుఁ బ్రవాళాధరయున్. భోజరా. ౭. ౧౧౪.

వ... జాతినపయ్యెదలు దారినపేరెదలు కొలఁది గడచినసద్దులు కొద దీఱనిసుద్దులు గలిగి యయ్యెడ ... సవిూర. ౩. ౧౭౮.

౩. సంకోచము, జంకు.

చ. ఎదఁ గొద లేక మ్రుచ్చు లని యెట్లు వచించితి రెల్లధర్మసం,పదలకు మూల మైనహరిభక్తులకు కిప్పుడ కాదు వారికిం,దుద నొకచోటఁ బాటిలదు దొంగతనం బని యేను బాస చేసెద ... పరమ. ౩. ౭౧.

౪. శేషము, మిగులు.

గీ. అనిన లాఁతుగఁ గోల్పోక నతఁడు రాజా, రడ్డిఁ గను నని కొదయుఁ దీర్పంగ మగిడి, యంతఁ బరియును బైప్రజ కలికి పాఱి, పోవ వాఁడును వెడపోట్లు పొడిచి చనియె. ఆము. ౬. ౯౩. (శ. ర. పా.)

**కొదమ.** వి. తిర్యగర్భకము, పశుపక్ష్యాదులపిల్ల; శిశువు.

గీ. నిసు వనంగను బిల్ల నా నిసుఁ గనంగఁ, గూన యనఁ గందు నాఁగను గొదమ యనఁగఁ, దిర్యగర్భకములు గాను దెలియ వలయు, నాపచారిక మన్యాశ్య లాట శర్వ. ఆం. భా. ౨. ౯౯.

సీ. త్రాళ్లఁ బట్టింపంగఁ దటి యైనకొదమల సంచులెఱింగి శిక్షించు నేర్పు. భార. విరా. ౧. ౯౪.

పులికొదమ. భార. ద్రో. ౨. ౮౯.

అంచకొదమ. నైష. ౬. ౨౨.

తేఁటికొదమ. పారి. ౨. ౬౩.

లేడికొదమ. హర. ౪. ౪౪.

వేఁడివేలుపుఁగొదమ = సూర్యశిశువు.

చ ... వేఁడివేలుపుం, గొదమలు దావపావకునికుఱ్ఱలు ... వానరవీరులు ... రామా. ౭. ౧౭౦.

విశే. ౧. తరుణము, పసుమది. (పశుపక్ష్యాదికము)

సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి మావుల హత్తించుమార్దవంబు. భార. విరా. ౧. ౯౪.

కొదమతుమ్మెద. నైష. ౮. ౪.

కొదమపులి. కళా. ౧. ౧౨౭.

కొదమపాయము. ఘటికా. ౨. ౨౬.

౨. బలిష్ఠము, దృఢము.
సీ. కొదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించు నెమ్మేనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౦.
౩. లేఁత; పిన్న, చిన్న.
సీ. సౌరభోల్లాసముల్ జాతి గ్రుంగఁగఁ జేరె నలరారుకొదమక్రొవ్వులను నెలను. ఆము. ౫. ౧౩౯.
సీ. ఢుంఢివిఘ్నేశునిష్ఠురకంఠవేదిపైఁ గొదమచుక్కలరాజుఁ గుస్తరించు. భీమ. ౨. ౪౪.
ఉ. సోరణగండ్ల రాఁ గొదమచుక్కలు పట్టస తుల్కవాటముల్, చేరుప ... ఆము. ౨. ౧౩.
కొదమతనము = చిన్నతనము, లేఁబ్రాయము.
గీ. కొదమతనమున నొప్పారి పిదప గండు, మెఱసి పొదలెడుమృగనాథులైఱఁగు దోఁప. హరి. పూ. ౬. ౧౭౫.
కొదమయెండ = ఈరెండ, లేఁతయెండ.
గీ. కొమరుఁబ్రాయంపునూనూఁగుఁగొదమయెండ, ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె. కాశీ. ౧. ౧౨౩.
కొదమపిడుగు = తీక్ష్ణమైనపిడుగు. (బ్రౌ.)
పిడుగుఁగొదమ = కొదమపిడుగు.
ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ, పతి రయమునఁ దేరు వఱపి భీముఁ, బొదివి పిడుగుఁగొదమపోనినారసము బిట్టేసె నదియతండు వేసెఁ దునియ. భార.భీష్మ.౨.౬౫.
జ: కొదమరి.

**కొదమరి.** విశే. (కొదమ + అరి) పిల్లలు గలది.
ద్వి. మద మతి ధృతి మాలి మదగజేంద్రంబు,కొదమరిపందిచన్గుడుచునే దేవ. పండితా. మహిమ. ౨౬౦ పౌ.

**కొదరు.** అ. క్రి. ౧. అతిశయించు.
(ఉపాకన్యవర్ణనము) సీ. కోర్కులతమకంబు కొదరియుఁ దాలిమిపొందున నందంద క్రిందువడంగ. హరి. ఉ. ౭. ౧౭౩.
౨. చెదరు. (శ.ర.) ౩. లేఁగు (శ.ర.) ౪. ప్రాపిడికలమునుండి సిరావలె చిందు. (బ్రౌ.)

**కొదలించే.** స. క్రి. (√కొదలు) కుదించు, తగ్గించు, సంకుచితముచేయు.
సీ. నెడతొక్కుఁబలుకుల వినిపించుఁ గొదలించుఁ గలయ వల్లభుపల్కు పలుకుపొంత. కు.సం.౯. ౩౪౬.

**కొదలు.** విశే. (క. కొదలు.) ౧. మందము, అలసము.
గీ...సారెఁ జెల్లుబ్బుచుయువజనశ్రమజలాబ్ధినిమడుకొన దక్షిణము వాసి యేఁగుదెంచె, గొదలునడతోడఁ బవమానకుంభజుండు. చంద్ర. ౩. ౧౦౭.
౨. అవ్యక్తము, అస్ఫుటము.
సీ. కొదలుమాటలు తేనె గులుకుచుఁ బలుకుపో మోహనం బగువింత ముద్దుఁజెలువు కళా.౬. ౧౯౬.
గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప, నేర్తునే నైన నేను వర్ణింతు నతని, చిన్నిమనుమఁడఁ గావునఁ జిఱుతవాండ్ర, కొదలుపలుకులు ముద్దునేయఁదురు గాదె. విప్ర. ౧. ౧౨.
జ: కొదలించు, కొదలుపడు.

**కొదలుప(ల్ప)డు.** అ. క్రి. (కొదలు+పడు)= కొదపడు.
(న్యూనత నొందు, కొఱఁతపడు)
ఉ. ఇమ్ములఁ దోడ నాడుచెలు లేమను చుండుదురొక్క యిప్డు నా, తమ్మునిముద్దుమాటలు గొదల్పడఁ బల్కెడుచిల్కబోద నిర్యమ్ముబొత్తునం గుడుచునర్మిలి చేద్పడు ... విర్వ. ౫. ౧౦౫.

**కొదవ=కొద.** వి. ౧. కొఱఁత, లోపము.
గీ. నేను మీదాన నగుట మీగానకథలు, పడిన

నన్వేళఁ గొదవలు దడవ రేమొ. కళా. ౨. ౮౩.

గీ. ఇది యెఱుంగక యున్న నా కేమి కొదవ, నీ కుఁ దెలియక యుండుట నీతి గాదు. శుక. ౩. ౨౬౩.

౨. లేమి, దారిద్ర్యము.

సీ. ఉదరపోషణమున కుర్వీశులను వేఁడి కొదవచేఁ గుందుమఁ గొన్ని నాళ్లు. వేఙ. ౩౩.

౩. తక్కువపాటు, న్యూనత, అవమానము.

ద్వి. ఇదె నాదుముఖభంగ మీక్షింపు నాదు, కొద వ నీకొదవగాఁ గోర్కి భావింపు. రం. రా. ఆర. ౧౬౯ పా. ౪ పం.

గీ... ఆర్తశరణ్యా నీప్రాపు గలిగి, యుండఁగా నిట్టి కొ వ మా కొదవ నేల. రామా. ౩. ౬౫.

౪. సంశయము, సందేహము.

గీ... అతని, తీర్థయాత్రయుఁ దపమును దేటపఱి ప, నొదవినపుడు గదా మదికొదవ దీఱు. కళా. ౨. ౧౫౭. (చూ. ౧౫౬)

౫. అపరాధము, నేరము, తప్పు.

గీ. బుజముపై నొక్కరొకలి పూని పట్టి, వదరు కొనుచును గసరుచుఁ బెదవు లదరఁ, గొదవ లెన్నుచుఁ దాఁ గన్నకూఁతు రున్న, తావు నకు వచ్చె నలదేవ దేవితల్లి. విప్ర. ౪. ౧౯.

చ. అన విని యంత యేమిటికి నానతి యిచ్చెద రి న్నినాళ్లుఁ ద, ద్దను జుని నొంచి మీపద ముదా రముదాకృతి నొందఁజేయఁగం, డినయది నా కు నేర మవునే కద యీకొదవన్ సహించి న, న్ననుపుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కువల. ౨. ౮౧.

౬. న్యూనము.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము... ఆం. భా. ౩. ౨౪.

జ: కొద, కొదవచేయు, కొదవడు, కొదవపడు.

కొదవచేయు. స. క్రి. (కొదవ + చేయు) చిన్నఁ బుచ్చు, అవమానించు.

క. గుఱిచేసి గిన్నెఁ బంపిన, తరువాతను మళ్లి పం పఁదగ దంపినచో, మఱి నిన్నుఁ గొదవచేసిన, తెఱఁ గగుఁ గెలవులును మీమదిం గడు నెడయున్. విప్ర. ౪. ౬౩.

కొదవ(ప)డు. అ. క్రి. (కొద + పడు) ౧. న్యూ నత నొందు, కొఱఁతపడు.

క. యాగము కొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయసవనానలకుం, డాగతవినీలధూమస, మాగమమున దనుజమశకమండలి ప్రగ్గున్. పి. శకు. ౩. ౧౦౭.

౨. తగ్గు, క్షీణించు; ఎత్తువడు.

సీ. ముదిమిచే లా వెల్లఁ గొదవడ్డఖరుని ద్రుంపుట యు నీళ్లకు నడ్డువోయుటయును. అచ్చ. రా. యు. ౨౫౫.

క. కదలు రదనములు పదములు, గుదివడు జవసత్త్వ మింకుఁ గొదవడుఁ జూపుల్, వదనంబు స్రుక్కుఁ జిక్కున్, ముదిమి సుమీ రోఁత ... సుద. ౨. ౧౩౭.

సీ... కొఁడవడ్డయేనుఁగుఁ గొదమవో లె. దశకు. ౩. ౪.

౩. విచ్ఛిన్న మగు, ఎడలెగు.

సీ. కొదవడ్డకౌరవక్షోణిపాలవతంసవంశంబు నిలి చె నెవ్వానివలన. వరాహ. ౧. ౯.

౪. మిగులు, శేషించు.

క. కలయం ద్రిమ్మరి మేదినిఁ, గలవీరుల నోర్చి జ యముఁ గైకొంటి మనుష్యులు నీకెదురే యిం కం, గలదే కొదవడ్డచో టఖండితశౌర్యా. నిర్వ. ౫. ౩౯.

కొదవపడు=కొదపడు. అ. క్రి. (√కొదవ) (కొఱఁతపడు, తక్కువపడు)

సీ... తత్రపతిమ యంతయు మన కబ్బినఁ బను లన్నియుఁ గొదవపడక సాగు. పరమ. ౫. ౧౪.

క. రంగద్విలాసకుబ్జా,లింగనతోషిత మదీయలీలా సేవా, సాంగత్యవచనరచనల, భంగుల నే మైనఁ గొదవపడెనొ యుపేంద్రా. విప్ర. ౪. ౩౭.

(భంగమగు, చెడు.)

క. కొదవపడియెఁ బని యనుచు, న్మది జాలిం దూలి వర్ధమానుఁడు దానిన్, వదినుండి మనుచు నందుల,కు దయాపరతంత్రుఁ డగుచుఁ గొండఱ నిలిపెన్. వేం. పంచ. ౧. ౯౬.

**కొదుక.** విశ. న్యూనము, తక్కువ.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము...ఆం. భా. ౩. ౨౪.

**కొదుకు=కొతుకు.** అ. క్రి. ౧. జంకు, భయపడు; వెనుదీయు.

క. ఆలంకి యాడుకైవడిఁ, గోలాటం బేయువాడ్కిఁ గొదుకక కవలై, యాలమునఁ జిడుగుడాడెడు,పోలిక నిరువాఁగు జగడమునఁ గలఁబడియెన్. చంద్రా. ౬. ౭౪.

క. తనకు ననిష్టం బగునో, యని కొదుకుట శంక ...నరస. ౩. ౫౭.

సీ. అడిగినఁ గొదుకక పుడమివేల్పులకు నిచ్చలుఁ బాఁడిమొదవులఁ జాల నొసఁగు. నీలా. ౧. ౪౯.

ద్వి. ఇది యుడుగఁగ వచ్చు నిది రా దటంచుఁ, గొదుకక వర మేటికొను మిత్తు ననిన. ద్వి. పరమ. ౨. ౧౦౦ పా. ౨౦ పం.

౨. వర్ణలోపముగా మాటాడు, మాటనములు.

క. బ్రదికినబలిదైత్యేంద్రుం, డెదఁ దనయపజయముఁ దలఁచి యెంతయు వెతచేఁ, గొదుకుచు నిట్లని పలికెన్, ద్రిదశాహితగురుని న్యాయనిష్ఠురఫణితిన్. దశా. ౫. ౫.

జ: కొదుకుకొను.

**కొదుకుకొను.** అ. క్రి. (కొదుకు+కొను- స్వార్థమున.)

(జంకు, భయపడు.)

గీ. అల్లనల్లన హరి హరి హరి యటంచు, గోఁయునఁబోలె నొదుఁగుచుఁ గొదికికొనుచు, ఓష్ఠపదభక్తి మూర్తీభవించె ననఁగఁ, జకితహరిణాక్షి దాసరిసాని యయ్యె. విప్ర. ౩. ౩.

**కొదుపు.** స. క్రి. (త. కుదప్పు) ఏదేని నోట వేసికొని మ్రింగకుండ ఊరక నమలు. (శ. ర-ఊకిం చు.-బ్రా.)

**కొద్ది=కొలఁది.**

వి. (పరిమితి, పరిమాణము.)

ద్వి. ఇలువేల్పులకుఁ బూజ లిచ్చెదువారు, కలకొద్ది దానముల్ గావించువారు. రం. రా. అయో. ౭౭ పా. ౧౯ పం.

ఉ. ముద్దియమోహ మెంతటిదొ మోహనరూపవిలాస వింటె యే, సుద్దుల నొల్ల దెవ్వరినిఁ జూడఁగ నొల్లదు సొమ్ము లొల్ల దే,ప్రొద్దు విడెంబు చల్వలును భోజన మొల్లదు నిద్ర యొల్ల దీ, కొద్దికిఁ బచ్చవిల్తునిలకోరుల నేమగుచున్నదొ కదా. శకాం. ౪. ౧౦౬.

సీ. తమికొద్ది నధరబింబము గంటిపడనీక మొనపంటి నొక్కింత మోపు మనుచు.అని.౩.౧౬. జాహ్నవీ. ౩. ౯౬. దశా. ౫. ౨౭.

(శక్తి)

గీ. వైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడె పెట్టి యిఁక మునిముచ్చుకాన, యిటు మొగం బైన నాకొద్ది యెఱిఁగె దనుచు,నింటికిని వచ్చె నవ్విటకంటకియును.విప్ర.౪.౩౧.

వ...రాళ్ల నొడిసెలలఁ బెట్టి చేకొద్దిఁ ద్రిప్పి త్రిప్పి వ్రేయుచు...సానంకో. ౨. ౨౪ పా.

సీ. మొలవంకికొద్ది బెబ్బులిని గెల్చిననాఁడు గరిగె నీముంజేతిగవ్వదండ. చంద్రా. ౨. ౫౭.

విశ. (అల్పము, కొంచెము.)

ద్వి. కొద్దిగా ముత్తెంపుగొనబువజ్రాల, మద్దికాయ

లడాలుమలయఁ జెక్కల్లి. రం. రా. బాల. ౨౦ పా. ౩౦ పం.

(పాటిది, ప్రమాణము కలది.)

సీ. తాళములంతలై తగ నిమ్మపండులకొద్దులై బొం గరాలుద్ది గాంచి. ప్రబంధ. ౭౧౦.

(వ్యవ) కొద్దివారు గొప్పవారు. కొద్దిమంది.

జ: కొద్దికాఁడు.

కొద్దికాఁడు. విశ. (కొద్ది+కాఁడు.)క్షుద్రుఁడు, అల్పుఁడు.

సీ. కొద్దికాఁడనఁగను క్షుద్రుండు తగు ... ఆం. భా. ౩. ౧౩.

కొన. వి. (క. కొనె. త. కొనై.) ౧. చివర, కొస.

ఆ. వెలరువాలుదీవియల సల్లసల్లార్చు, సోర్ణగండ్ల యందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁబోకతె మ్మెర లెలవేఁగ, కొనలవంక లొత్తు సనలఁ బ్రో చు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

ద్వి. కని బొద్దుఁడంత నుత్కటకోపవహ్ని, కొన లను దనుదాన గొని కాలుచుండ. పండితా. వా ద. ౧౭౬ పా. (వహ్నికొన=అగ్నిశిఖ.)

క. కొనఁ గననిపాపకర్ముఁడు,తను నాహారాదివిధు లఁ దనుపఁడు మేయక, జననీఁడు కాలు గ ట్టుక,మనుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్వి ధమనఘా. వేం. పంచ. ౪. ౫౬౫.

౨. వృక్షాదులచివరకొమ్మ, అగ్రశాఖ.

చ. భయ మనులొల్లికక విమలభావవసుంధరఁ బె ల్లగించి భ,క్తి యనెడువిత్తుఁ బెట్టి ప్రతధీనది సమ్మదవారిఁ జల్లఁగా,నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి త, న్మయము గఁ బ్రాఁకె నం చనఁగ నారులమైపులకంబు లే ర్పడెక. కాళ. ౪. ౧౨౨.

చ. ... ఉగ్రత మహాబలురాకకు నోర్వఁ జాల నా,తని నొకభంగి గెల్తు నని తాఁ దలపోసి మ రించె నాకులుం, గొనలును బొంపముల్ నిడు దకొమ్మలు లే యగుడుఁక రయంబునక. భార. శాం. ౩. ౩౯౪.

౩. గుఱ్ఱపుజూలు, కేసరము.

సీ. తేజినా నున్నతవాజియై విలసిల్లు... గీ. కొన యనఁగఁ గేసరం బొప్పు... ఆం. భా. ౨. ౧౯౭.

కొనచీకటి=వేకువ నుండులేఁజీకటి.

గీ. అంతఁ దొలుకోడి గూయ నయ్యత్రిపాదుఁ, డా త్మశిష్యులఁ జెలుపుచు నరిగె నదికి, నింద్రుఁడు ను గొనచీకటి నింతియిల్లు,సొచ్చి నెమ్మేను బా ణాకంగ సుందరియును. జాహ్నవీ. ౪. ౯౬.

నడుకొన=నడిమిప్రదేశము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యశ్వ రుని నొగలనడుకొన నిడి తా, నును రథ మె క్కి రథికుఁడయి, చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలక. భార. విరా. ౪. ౯౪.

వ. ...సకలచతురంగంబులం బూఁచున ట్లొనర్చి యొక్కమోహరంబుగా నమర్చి యం దగ్ర భాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వ త్థామసౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్న లేంద్రుండు వెన్నుదన్ని నిల్చునట్లు సే సె ... భార. ద్రో. ౫. ౧౪౨.

సీ. కుతలంబునడుకొనఁ గొలకొండగా నిల్పి శర నిధి గ్రొచ్చిరి సగరసుతులు. కు. సం. ౧. ౫౨.

కొనరిక్క = రేవతీనక్షత్రము.

క. కొనరిక్క పేరిపొలఁతుక, పెనిమిటి వై నాఁగలి యును జెనుఁదాటిసిడం,బును బూని శవలి కాంద్రక, దునిమి పుడమిపఁతి ద్రేఁగు ద్రో యుదువు గదా. అచ్చ.రా. బాల. ౧౫౯.

కొనగోరు = గోటికొన, నఖాగ్రము. భీమ. ౧. ౧౧౦. రాజ. చ. ౨. ౧౦౭.

కొనముక్కు = నాసికాగ్రము. వైజ. ౪. ౬౭.

కొనరెట్ట=హస్తాగ్రము. రం. రా. అయో. ౯౯ పా. ౫. పం.

కొనబావిలీ = చెవికొనయందు ధరించెడిభూషావి శేషము. (వా)

జ:కొట్టకొన, కొనలిడు,కొనలునిగుడు, కొనలువా ఱు, కొనలుసాగు, కొనలొత్తు,కొనసాగించు, కొనసాగు.

**కొనటి, కొనటివాఁడు.** విణ. కురూపి.

గీ... రూపవిహీనులు దారు రూపు, గలిగి తోలు మేనఁ గొనటులఁ బలికినారు. భార. ఆను. ౫. ౯౩.

గీ. ...కన్యఁ, గులజ నైనను రోగిణిఁ గొనటిఁ జె నఁటిఁ, బరిణయంబగు టొప్పదు...మార్క. ౩. ౨౩౯.

గీ.బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు,వలన హీనులు రూపసివలనఁ గొనటి, వా రసూయలు సేయుదు రీరసమున... భార. శాం. ౩. ౭౦.

**కొనకొనఁగోడి.** వి. బొల్లికోడి, జలకుక్కుటము.

గీ. కొనకొనంగోడి యేత్రింత కొంకనక్క, నమి లి యీనాలుగిటిదర్శనంబు లెస్స. క్రీడా. ౫౨.

సీ. చక్రస్తన ప్రకాశమునకు ఫేనంపుఁగొం గిడి కొనకొనఁగోళ్ల గొణఁగి. ఆము.౪.౧౯౩.సుద. ౩. ౧౯౪.

**కొనలిడు.** అ.క్రి (కొనలు+ఇడు ) వర్ధిల్లు, అతిశ యించు.

క. ... త్రయ్యా దొకయించు కైనన్, డయ్యెదు కొనల్డిమోఁ దృష్ణ...భాగ. ౯. ౫౭౭.

**కొనలునిగుడు.** అ. క్రి. (కొనలు+నిగుడు.) కొన లొత్తు, వర్ధిల్లు, అతిశయించు.

ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజబుద్ధి, నెఱిఁగి యతనియున్న యెడకు వచ్చి, పరమభక్తి మ్రొ క్కి ధరణీసురేశ్వరుఁ,గుశల మడిగి ప్రియము గొనలునిగుడ. భార. ఆర. ౫. ౨౮.

క. అర్తులకు మ్రొక్కి తక్కటి, క్రొత్తదులందఱుఁ బ్రియము గొనలునిగుడఁ గాఁ,న త్తఱిఁ దిలకించె

వరవ,నూత్తమ యై సత్యభామ యుజ్జ్వలగతి మన్. హరి. ఉ. ౪. ౨౭౧.

**కొనలువాఱు.** అ. క్రి. (కొనలు+పాఱు)వ్యాపిం చు, ప్రసరించు.

వ...నిజగరుత్కనకరేఖామయూఖంబు లాఖండ లారిదిక్కునకు నక్కజంపు టెలమిం గొనలు వాఱి యుద్దీపించు ప్రద్యుమ్న ప్రతాపవైభ వంబునుంబోలెఁ జాల నాలోకనీయంబు లగు చుండ. ప్రభా. ౭. ౧౦౫.

**కొనలుసాగు.** అ. క్రి. (కొనలు+సాఁగు?)౧. కొన సాగు,వర్ధిల్లు.

గీ. గోపకాంతలయాసలు కొనలుసాగు,చందమునఁ గోర్కె లెంతయు సందడించెఁ, గడుపులోప ల సర్వలోకములు నిడిన,బాలకునితల్లి యైన యప్పద్మముఖికి. వి. పు. ౭. ౪౭.

గీ. ఇవ్విధంబున బ్రాహ్మణుం డెఱిఁగియెఱిఁగి, తిరు గుచుండఁగఁ బెక్కువత్సరము లరుగఁ, గలుగు దురు పుత్రు లిద్ద ఱక్కాలమునకుఁ, గుండగో ళకవంశంబు కొనలుసాగ. కాశీ. ౭. ౨౩౪.

౨. వ్యాపించు, ప్రసరించు.

వ. ... అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాఁగకన లున కనుకూలం బైనహృదయంబు సదయంబు గా నొనరించి...కాశీ. ౧. ౫౭.

**కొనలొత్తు.** అ. క్రి. (కొనలు+ఒత్తు) వర్ధిల్లు.

ద్వి. కొనిపోయి వేడ్కలు కొనలొత్త నపుడు, వి నుతార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి. రం. రా. బాల. ౨౫ పా. ౨౦ పం.

**కొనసాగించే.** స. క్రి. (√కొనసాగు) కొనసాఁగఁ జేయు.

(వృద్ధిచేయు, పెంచు.)

మ. ధన మార్జింపుము నార్జితం బయినతద్ద్రవ్యంబు బేరంబుచేఁ, గొనసాగింపుదు వడ్డివాసివలనన్ గూర్తున్ మఱింత గొంత... ప్రబోధ. ౪. ౩౩.

**కొనసాగు.** అ. క్రి. (కొన + సాఁగు?) ౧. ప్రసరించు, వ్యాపించు; ప్రవహించు.

గీ. కాల మనుకువిందుఁడు చంద్రికాపటంబు, నేయఁ బన్నినమగ్గ మెకో యనంగ, నవమయూఖాళి గొనసాగి మిన్నుల నొప్పె, విధుఁ డమరవానిగృహభిత్తి వివర మనఁగ. కళా. ౮. ౧౫.

చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని ముక్కరడాలు మోవిపై, వెసఁ గొనసాగ ... జాహ్నవీ. ౧. ౧౭౬.

సీ. ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయుతీర్థమ్ముఁ గొనసాగఁ జేసినయనఘమూర్తి. విజ. వి. ౧.౧౨౭.

౨. వర్ధిల్లు, పెరుఁగు, అతిశయించు.

ఆ. కొడుకుఁ గన్న వేడ్క గొనసాగ రోహిణిఁ, జీరఁ బంచి చిత్రచేలములను, మండనముల నిచ్చి మన్నించె నందుండు. భాగ. ౧౦ పూ. ౧౯౭.

వ. నాబంధువర్గంబు బంధువర్గపుఁదీఁగయుంబోలెఁ గొనసాగి బ్రదుకుం గాక యని యాశీర్వదించి ... కాశీ. ౫. ౧౬౯.

సీ. మత్పాదభక్తి యాత్మకు జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు గుదురుపడును. దశా. ౧.౨౨౨

3. పూర్తియగు; నెఱవేఱు, సఫలమగు.

గీ. అమ్మహాపూజ గొనసాగినట్టు లైన, సంగరంబున గెల్చునేశత్రు వైన, విఘ్న మెందిన నోడు నవ్విధము మత్త, చిత్తుఁ డౌట గణింపక చేయఁ దొడఁగె. ఉ. రా. 3. ౨౦౫.

గీ. ...అశక్తు లైన,వారిచేతలు కొనసాగి వచ్చు నెట్లు. వరాహ. ౧౧. ౨౬.

గీ. వేలుపులవేల్ప మామొఱ యాలకించి, కనికరపుఁజూడ్కిఁ గనుఁగొని;గాట మగుచు, నెదలఁ బొదలెడునఘ కల్లఁ ద్రిదిలపఱిచి, సాఁకవే కోర్కి లికఁ గొనసాగఁ జేసి. అచ్చ. రా. బాల. ౬౯.

**కొని=కొన్ని.**

క. మనుజపతి యివ్విధంబునఁ, దనచెలియింటికిని మ్రుచ్చుఁ దప్పన నొప్పిం,చినయట్టుల మదిని సరకు, గొనక మఱచి యున్న యెడను గొనిదిన ములకున్. నిర్వ. ౭.౬3.

(హల్లు పర మగుచో 'ఇ'కారము లోపించుటయుఁ గలదు)

ఉ. కొన్ని గొణంగి కొన్గినిసి కొన్ని తుటారము లాడి...పాండు. ౪. ౧౪౭.

**కొనితెచ్చు.** స. క్రి. (కొని+ తెచ్చు) తీసికొనివచ్చు.

వ. భగీరథుం డనురాజన్యుండు కపిలముని ప్రదీప్త కోపానలదగ్ధు లగుసాగరుల నిరయంబువలన నుద్ధరించుటకై తపోవిశేషంబున మందాకినిం గొని తేర...కాశీ. ౫. ౨౮.

క. తోరపులత్తుకచాయల,వారువములు గట్టి మహిషవరకేతువు నె,ల్వార సమకట్టి తే రా,సారథి గొని తేర నెక్కి సంరంభమునన్. ఉ. రా. 3. 3౪3.

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టిన దానవో సుశీ,ఘ్రతఁ గొనితెమ్ము తల్లిఖుతుఁ గన్నులఁ జూచినదాఁక నామనం,బతిముదితంబు గాదు... ప్రభా. ౧. ౧3౬.

**కొనిపించు.** స. క్రి. ( √ కొను) కొనఁజేయు.

(విలువకు పుచ్చుకొనఁజేయు.)

ఉదా: మగనిచే ఆమె జరీచీర కొనిపించినది.

**కొనిపెట్టు.** స. క్రి. (కొని+ పెట్టు) కొనియిచ్చు, విలిచియిచ్చు.

సీ. మురువుతో నామేలిమునుఁగు దీసినవేళఁ గొని పెట్టు మందునో కుప్పసంబు. గంధ. ౧3౧.

**కొనిపోవు,కొంపోవు** స. క్రి. (కొని+పోవు) అపహరించు; తీసికొనిపోవు.

క. నాచిన్నిముద్దుఁగూఁతురు, నాచక్కనితల్లి వీథి నడయాడఁగ న,న్నిచు కొనిపోయె సాళ్వము, రాచిలుకం గొంచుఁ బోవుక్రమమునఁ దంధ్రీ. రాజ. చ. ౨. 3౧.

క. చంపినఁ జంపుము నన్నటు, గొంపోవుండినను జాలు కొసర కదయరేన్, జంపిన నన్నొకటిన మతి, కొంపోయిన నెంద ఱెట్లగుదురో యెఱుఁగన్. ప్రభా. ౩. ౧౪౩.

ఇట్లే: కొనిచను, కొంపఁజను, కొంచేఁగు, కొంచుఁబోవు.

క. శౌరి యిదె పారిజాతము, గోరికఁ గొనిచనుమ మనలఁ గొనిపోఁ డని లోఁ, గూరిన నెవ్వగఁ దక్కిన, భూరుహములు మసురసాత్రపూరము నించెన్. పారి. ౪. ౫౨.

చ. భామినితోడ నిట్లనియెఁ బన్మదళాక్షుఁడు గానఁ బోయెదన్, గోమలి బల్దరిద్రులము కొంచుఁ జనన్ మన కద్ది వస్తువా, స్వామికి నిష్టమైన యది సంగతి యే చన రిత్తచేతులన్, భూమిపులొద్దకున్ సతులపొందులకున్ గుదు లున్నచోటికిన్. కుచేల. ౧. ౧౦౩.

శా. ... నా, కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొంచేఁగు టర్హం బగున్. భార. శల్య. ౨. ౨౧.

క... రాచిలుకం గొంచుఁబోవు... రాజ. చ. ౨. ౩౧.

**కొనియాట.** వి. (√కొనియాడు) కొనియాడుట.

(శ్లాఘనము)

ఉ. ... ఆ, త్మాదరవృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి యా, గాదన కియ్యకొంటి ... భార. ద్రో. ౧. ౮౩.

క. నకులసహదేవనయశా, స్త్రకళావేదిత్వమునకు జను లనురాగా, ధికులై మిమ్ముం గొనియా, టకు నాతఁడు మనసు గీడ్పడం జింతిల్లున్. భార. శాం. ౧. ౧౭.

(ఆచరించుట)

సీ. తలఁపంగ నాద్యమై తనరుధర్మమ యెప్డుఁ గొనియాట నాస్తికగోష్ఠిఁ జనమి... గీ... ఇన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత. భార. ఆర. ౫. ౪౪.

(కొలుచుట)

క. కడుఁ గ్రొత్తలు నీ విటు నను, బడుగుం బాటించి మిన్ను ప్రాఁకించెదు నీ, యడుగులఁ గొనియాటకుఁ బను, పడినారము నీకు మమ్ముఁ బాడియె పొగడన్. హరి. ఉ. ౯. ౫౨.

**కొనియాడు**=కొండాడు. స. క్రి. (కొని + ఆడు.)

౧. మెచ్చు, పొగడు, స్తుతించు.

క. తనపలుప లోక మెల్లను, గొనియాడఁగఁ దగిన లోకగురుఁడు... భార. ఆది. ౭. ౨౪౬.

చ. హరుఁ జెడనాడి వీరిఁ గొని యాడెదు పెద్దయు నీవు... కు. సం. ౨. ౧౬౬.

౨. గౌరవించు, ఆదరించు; పాటించు, లక్ష్యపెట్టు.

చ. ... నీగురువుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు నె, ప్పె నటుల భక్తిమై నడవు... భార. విరా. ౧. ౨౫౨.

సీ. కుంతీమహాదేవికోడండ్రలోపల నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి. భార. విరా. ౨. ౨౧౬

క. అనినఁ బితృదేవతలు మా, కును నీకును నరకగతి యగుం జూమ్మీ నీ, మనమున మావచనంబులు, కొనియాడక విడిచితేని కులజలధిశశీ. మార్క. ౭. ౧౯.

౩. భజించు, సేవించు, కొలుచు.

క. ... నీవు నివ్విధపుజనములం, గొనియాడుము వారలు శో, భనము లొసంగుదు రఘంబుఁ బాపుదురు కృపన్. భార. అను. ౨. ౧౩౬.

సీ. స్వర్గకాములు పితృవర్గంబుఁ గొనియాడి యిహలోకసుఖలీల లెల్లఁ గాంచి. హరి. పూ. ౨. ౧౩౦.

౪. కాపాడు, రక్షించు, పోషించు.

గీ. ...అతనిపుత్రకులు దాని, నెంగిలులు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి. భార. కర్ణ. ౨. ౫౪.

క. విను మగ్గోవిందుఁడు సఖుఁ, డును బంధుఁడుఁ గార్యకర్తుఁడునై నిన్నుం, గొనియాడుచుండ దురితం, బను పేరును గలదె నీకు ననఘచరిత్రా. భార. శాం. ౩. ౪౮.

క. విను భక్తియు వెలిపుఁ గలిగి, యఘజన్ములు వె

ద్దవాని నారాధింపక్, జనవర యతేందు తమ్ము
లఁ,గొనియాడక సిరికిఁ బట్టగుసు రుజ్జ్వలులై.
భార. అను. ౪. ౧౩౨.

మూ: సహ్యేషాం వృత్తిదాతా స్యాత్సచైతాన్
ప్రతిపాలయేత్, కనిష్ఠాస్తం నమస్యేరన్ సర్వే
ఛందానువర్తినః. సం. భార. అను. ౧౬౨. ౧.
రం.రా. కిష్కి౧. ౨౧౬ పా. ౨౩ పం.

౫. అవలంబించు; ఆచరించు.

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ
బొందె నిట్లు సే,యుదుము తుల్యప్రయుక్త మ
గుచున్న సనాతనధర్మ మిత్తెఱం,గ దహనకర్మ
మెల్ల మది గానిదిగా మును నిశ్చయించి మా,
మొదలిటివా రొనర్చువిధమును గొనియాడితి
మేము నియ్యెడన్. భార. విరా. ౧. ౧౭౯.

క. విను రాజు లెట్టిధర్మము, గొనియాడుదు రట్ల
నడచు గుబుకొని ధాత్రీ, జనము ...హరి.పూ.
౨. ౭౭.

క. అనిన నతఁ డిట్టిధర్మము, కొనియాడక వ్రతము
లొండు గోరి నడపఁ గాఁ,బని యేమి...భార.
శాం. ౬. ౫౦౪.

౬. తలపోయు.

క.విధివశమునవచ్చినకీ,డనములు గొనియాడి వ్రేఁ
గులై విపులభవాం, బుధి మునుఁగుదురు ...
భార. అను. ౧. ౯.

శ్లో. కోహ్యాత్మానం గురుం కుర్యాత్ ప్రాప్తవ్యే
సతి చింతయన్, ప్లవంతే ధర్మలఘవో లోకేం
భసి యథా ప్లవాః, మజ్జంతి పాపగురవః శస్త్రం
స్కన్నమివోదకే. సం. భార. అను. ౧. ౨౨,
౨౩.

**కొనివచ్చు.** స. క్రి. (కొని + వచ్చు) తెచ్చు.
(తీసికొనివచ్చు)

గీ....సాహిణి యొకండు, కర్తయెదుటికిఁ గొనివ
చ్చె గంధవాహ, బాంధవం బగుకొకమహాసైం
ధవంబు. మనుచ. ౪. ౭౭.

(పైఁడిచేఁప) సీ. తనసంతతికి పేఁతఁ గొనివచ్చు
రీతి దిక్కరిశరీరంబులగరుల నాను. దశా. ౧.
౭౫౯.

**కొను.** స. క్రి. (త. కొళ్.) ౧. గ్రహించు.

(క) పట్టుకొను.

తరళము...ఏను తీర్థము లీసము ద్రతటంబునన...
వీని నెన్నఁడు నాడనో,డుదురు సన్మను లిందుఁ
గోల్మొసదుల్ గొనున్ వడిఁ జొచ్చుదున్.భా
ర. ఆది. ౭. ౧౪౭.

సీ. గంధర్వకామినీకాముకవ్రాతంబు లాతాలఁ గొ
ని మోఁది లజ్జఁ గొం.ద్రు. హర. ౫. ౧౦.

ఉ. ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న
దేవకీ,నందనుఁ జూచి...పారి. ౫. ౩౭.

(చ) తీసికొను; తీసికొనిపోవు.

ఆ. ... అతినవపిండుఁ, గరులఁ దురగములను నరదం
బులను గొని, యరుగు జెంచె ... భార. మూ.
౧౧౫.

క. చని సంప్రార్థించి యతనిఁ,గొని రుద్రునిఁ గాం
చి నీసఖుం డీతఁడు వ,చ్చినకార్యము కృపతో
డను,విను మని దండంబు లెఱఁగు వినిపించెఁ ద
గన్. భార. శాం. ౩. ౧౧౭.

(ట)-ధనాదులు- ప్రతిగ్రహించు; పరిగ్రహించు,
స్వీకరించు.

గీ. కపిల యిచ్చినవానిన కాదు నిజము, కొన్నవా
నిని బుణ్యాత్ముఁడుగఁ జేయు. భార. అను.
౩. ౧౦౩.

క. విను మిచ్చెద నని యీమియుఁ, గొనియెద నని
పలికి పిదపఁ గొనవునికియు న,త్యనృతంబులు
సత్యవ్రత,మునకుం దొలఁగంగ మనకు భూవర
తగు నే. భార. శాం. ౪.౧౫౦.

క. కా కేమి తన్నుఁ దిట్టెనె, కోకిల తన కేమి ధన
ము కో కొమ్మనెనే,లోకము పగ యగుఁ బరు
సని, వాకునఁ జుట్ట మగు మధురవాక్యమువల
నన్. కవిక. ౨. ౭.

క. వే కందమూలఫలములు, కో కొం డని యొసఁగ నందికొని నమలి కపుల్. భా. రా. కిష్కి. ౮౹౫.

(త) లోఁగొను, ఇముడ్చుకొను.

గీ....సముద్రంబులోన బుజ్జి, నైవఁ గొన్నంత గొనుఁ గాక...భార. భీష్మ. ౨. ౭౨.

౨. అపహరించు; హరించు.

క. ఆమిష మని దానిం గొనఁ,గా మది సమకట్టి యొక్క ఖగ మాఖగపుల్, వ్యోమమునఁ దాఁక...భార. ఆది. 3. ౭౯.

గీ. ... బ్రాహ్మణధనంబు గొనుట ధర్మంబు గాదు, మనుజపతులకుఁ దగియెడిమానికంబు, గాన విడుచుట నీతిమార్గంబు గాదు. వరాహ. ౫. ౫.

క. ఉన్నఁ గని యప్పడఁతి యో,యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁ డీ,పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీనియసువుఁ గొని యెద ననియెన్. భార. ఆను. ౧. ౪.

3. ఆధారముగాఁ జేసికొను; అనుసరించు.

గీ. ... ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁ గలుగువాఁడు. భార. ఉద్యో. ౨ ౧౬౯.

క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచుమెయికోలున భూ,రమణులు గొందఱు వచ్చిరి...భార. భీష్మ. ౧. 3౧.

గీ. పురము వెడలి గోమతి యనుపుణ్యతటిని,నడుము కొని చని యారాజనందనుండు, దీనియావల దెసనొక్క ద్విజకుమార,వరులయూరని యడుగంగ వారు సేరి. మార్క. 3. ౬౬.

౪. కావించు, చేయు.

క. వడి దొనఁ దిగుచుట దొడుగుట,వెడలం దెగ గొనుట శరము విడుచుట గానం,బడక విలు గుడుసువడుటయు,నుడుగక రక్కసులు పడుటయును గానఁబడున్. భా. రా. అర. ౧. ౨౪౪. (తెగగొను=జ్యాకర్షణ్ చేయు.)

చ. ధనువుల నిట్లు బాణములు దారుణలీల సమర్పి బద్దెగల్,గొని నిగిడింప...భా. రా. అర. ౨. ౨౪౪.

౫. పొందు, ప్రాపించు. (ఇది పెక్కుపట్ల విశేష్యముల కను ప్రయుక్తమై ఈయర్థముతో శబ్దపల్లవ క్రియగా ఏర్పడుచున్నది. ఉదా: తెవులుగొను, భయముగొను, ముదలుకొను.)

గీ.కుసుమధనువున నెవ్వండు గొను విజయము.భాగ. ౧౦ ఉ. ౧౦.

ఉ. ... సురేశ్వరాదులం, బన్నములాడి నీమగని పక్షము పల్కెదు గాక చేల నీ,కొన్నమద లజ్జజనులు గొందుఱె వ్రాత్యులఁ బూజ్యులందురే. కు. సం. ౨. ౧౬౯.

క.... ఈతటినిం,గనుఁగొనుపుణ్యుఁడు మిక్కిలి, కను గొను నెన్నుదుట నెన్నఁగాఁదరమగునే. దశా. ౧. ౧౨3. పాండు. ౧. ౭౧.

౬. లక్ష్యముగాఁ జేయు, గుఱిగాఁ జేయు.

ద్వి. ... ఇంద్రజిత్తు, పసిఁడిపింజల నొప్పుబాణము ల్దొడిగి, గోముఖుం డనువానిఁ గొని కాఁడనేసె. రం. రా. ఉ. ౭౫ పా. ౧౭ పం.

౭. లక్ష్యపెట్టు, సరకుసేయు.

క. కొనరు బుసులమాట నాస్తికులు వినయనిధీ. భార. శాం. ౬. ౨౨౫.

చ. ... భుజశక్తి నెవ్వరిం,గొనక కఠంగి రజ్జపులు కుల్ గడుఁ బెక్కులు వల్కు చెప్ప నీవు ... భార. మహా. ౪౪. భార. ద్రో. ౫.3౭.నృసిం. ౪. ౨౧.

౮. వశపఱచుకొను, ఆక్రమించు, స్వాధీనపఱుచుకొను.

సీ.అభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి యేచి యీపెన్నేలయెల్లఁ దాన,కొని యధ్వరములు పెక్కొనరించి ... భార. శాం. ౧. ౨3౮.

చ.బలిమిఁ దదీయు లప్పుడు సభాముఖ్యుల కట్టఁ బట్టి యా,తలఁ బడవైచుచుం దమకుఁ దా

మె యవారణఁ దత్త దాసనం,బులు గొని కూరుచుండిరి ...ప్రభా. ౧. ౮౨.

గీ. ఇందు ర మ్మన్నచోట ని ల్లెల్లఁ గొనుట. కుచేల. ౨. ౨౩.

౯. తాల్చు, ధరించు.

క. నలువదితొ మ్మిది రూపం,బులు గొనియుం బుష్ప గంధములు మోవఁగ లే, కలసియుఁ దమ్మెర లానుం,బలుమఱు యువజనము మేనిపలుచని చెమటల్. పాండు. ౧. ౧౮౫.

సీ. కొమ్ముకత్తుల మెఱుంగులనెల్ల పావడల్ గొనునది మస్తేనుఁగులచయంబు. కుచేల. ౨. ౧౨౭.

౧౦. పూను.

క. విను మప్పలుకులు పాటిగఁ, గొని దుర్యోధనుని తోడఁ గొంటిని బగ...భార. కర్ణ. ౩. ౬౦.

ఆ. హితజనంబు లెదుర నీతని కెడ లైనఁ, బ్రాణమిత్తు ననుచుఁ బ్రతినఁ గొంటి. జై. భా. ౮. ౯౦.

౧౧. కలియు, కూడు, చేరు.

సీ. కమలకాననమధ్యకలహంసవిభుభాతిఁ గూర్మి నెచ్చెలిపిండు గొని చెలఁగుచు. పాండు. ౨. ౩౧. కేయూర. ౪. ౧౬౫.

౧౨. తలఁచు, ఎంచు.

క. అది రవి గ్రుంకుటగాఁ గొని,మద మెసకంబెసఁగ నార్చి మనసైన్యంబుల్, వొదలె...భార. ద్రో. ౪. ౩౧౬.

ఆ. దనుజుఁ డనుచు మనుట తప్పుగాఁ గొనకుమీ. రుక్మా. ౫. ౧౬.

క. కటకట మనవారిది దు,ర్ఘటముగఁ గొని యెంత చింతఁ గావించెద రె,ప్పటికి కింక నేము మేమెం,తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞపనన్. ప్రభా. ౨. ౫౫.

౧౩. నెఱవేర్చు, సాధించు.

క. రాణింపఁ బల్కి తనపని, జూనై కొను ... ఆము. ౪. ౨౬౯.

ద్వి. పెనుపొందఁగా సామభేదదానములఁ,గొన రానికార్యంబు గొనకొనె నేని,మఱిగదా దండం బు. రం. రా. యు. అర్ణ్యా. ౧ పం.

౧౪. తెచ్చుకొను, తెచ్చిపెట్టుకొను.

చ. కిలకిల నవ్వు మోవిపలుగెంటుల దీటుఁ గుచంబు లొరగా, వెలువడఁ బైఁటవేయు నెఱివింతగఁ గేరు మరుల్కొనంగ బె,ళ్కులు గొనఁ జూచు లేనివగలుం గొని మాటికిఁ గుల్కు...హంస. ౧. ౨౧౭.

౧౫. చేరనిచ్చు.

వ. ... క్రేపులం గొననియావులం దొలఁగంగట్టి పిల్లపెట్టియు మందులు సల్లియుం జాల దుఃఖపఱిచి చేఁ పెఱింగించువారును. హరి.పు. ౫. ౧౪౨.

౧౬. (నృత్తాదులను) ప్రయోగించు.

క. మద్దెలసద్దున నీతని, నిద్దురమ బ్బెల్లఁ బోవ నేర్పు మెఱయ నే,నిద్దముగ దేశిఁ గొనియెద,నొద్దిక గా నుండుఁ డనుచు నొనరిచి సఖులన్. వాల్మీకి. ౩. ౧౨౨.

౧౭. భుజించు, తిను.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కండ్రు నిద్రగూరినయెడ మేల్కొని యునికియుఁ గార్యాలోచనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్. భార. ఉద్యో. ౨. ౩౮.

క. తనుయాత్రకుఁ గా నశనము, గొనుఁ బూర్ణముగాఁ గొనండు...భార. శాం. ౫. ౩౨౧.

౧౮. త్రాగు.

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకము గొనియె...హర. ౨. ౧౨౪.

క. ఎనుబదియేఁడులవార్ధక,మునఁ బ్రాక్తనశక్తి యుడిగిపో దాతనికిన్, దినియెడిది పెద్దమాంసము, కొనియెడియది కల్లు మనసుకొ వ్వెట్టుడుగున్. శివరా. ౪. ౧౫.

చ... అన్న మేమియుం, గుడువదు నీరముం గొ
నదు...భాగ. ౧౦ పూ. ౧౭౭.

౧౯. నెలకుదీసికొను, విలుచు.

క. ఏ మస్మైద మనినఁ బృథివి,యొమనుజాధీశ కొ
నుట యొప్పెదు తెరు విం, దేమియును నెగ్గు లే
దీ, భూ మిసురులకొర్కు దీర్చిపుచ్చుమ ప్రీ
తిన్. భార. అశ్వ. ౮. ౧౯౪.

సీ...అస్మైద నూఱుగోవుల కెవ్వరేఁ గొనుఁడు...
హరి. పూ. ౨. ౪౦.

౨౦. ఖండించు, నఱకు.

చ... ఎక్కుడు నెస రాహుమస్తకముఁ గొన్న సు
దర్శనదేవుఁ గొల్చెదన్. ఆము. ౧. ౯.

౨౧. కొట్టు, వ్రేయు.

సీ. కొనె మారెఁ జదిపె నాఁగను గొట్టె నని తోఁ
చు...ఆం. భా. ౩. ౧౩౨.

మ...భీమపార్థులును గోకొ మ్మంచు నొక్కుమ్మ
డిన్, గవియన్ ... భార. భీష్మ. ౩. ౩౯.
మార్కు. ౧. ౧౩౪.

౨౨. నాటు, కాఁడు.

చ. ఒకబలుతూపు రంబు గొని యుచ్చిచనం గర
మల్గి యేయుడున్. భార. ద్రో. ౪. ౧౭౩.

చ. హలధరుఁ డేకలవ్యహృదయంబు గొనన్ ఘు
నశక్తి వైచినన్. ఉ. హరి. ౩. ౧౧౬.

ద్వి.పరతేర నొకకొయ్య యరకాలు గొన్నఁ, జుర
చుర నరములు నుక్కుఁ దివుచుడు. పండితా.
పురా. ౧౩౨. పా.

అ. క్రి. ౧. నెలకొను, ఉండు.

చ.మనమునఁ గొన్న నెవ్వగలు మాన్పి ఘటించుతురు
కావ్యసమ్మదం, బనఘకథాముఖంబున హితా
హితబోధ మొనర్తు రింపుగాఁ,గనుఁగొనుకం
టె నద్భుతముగా నెటిఁగింతు రతీంద్రియా
ర్థముల్, ఘనమతు లెల్లవారికి నకారణమిత్రు
లు గారె సత్కవుల్. కవిక. పీఠి. ౭.

౨. పనికివచ్చు, చెల్లు, సాగు.

ఆ. కుటిలబుద్ధు లిచటఁ గొనవు నెట్టన ఘన, దో
ర్బలంబు మెఱసి తొడర వలయు, నటఁడు గాం
డివమున నడ్డసాళులు వైవఁ, దురల సంపవా
న గురియుఁ గాని. భార. విరా. ౪. ౧౯౭.

మ. అనిసం గ్రోధకపాయితాక్షుఁడయి మిథ్యాశి
ల్ప నీవాఁడుముల్, గొన విచ్చో నని మండలీ
కృతశరతోఁ దండనిర్ముక్తశ,స్త్రనికాయంబుల
సేసలన్ గడపి...జై. భా. ౫. ౧౦.

౩. అతిశయించు, విజృంభించు; వ్యాపించు.

సీ. పరితాపకిశిఖశిఖ ల్దరికొని వనములోఁ గార్చి
చ్చులై కొని కాలుచుండు. కు.సం. ౫. ౬౫౧.

చ. గనగన నెల్లప్రొద్దుఁ గొని క్రాలెడువేఁడిమిఁ
బేర్చుభర్త మే, నెనయును దగ్గఱన్ నయఁప
కెంతయు భీతి నొదుంగుచున్ ... హరి. పూ.
౧. ౧౬౭.

౪. అగు, ఏర్పడు.

ద్వి.గుంపులుగుంపులుగొని తన్ను దూఱ,సాం కేరి
రామునిసుద్ది చెప్పచును. రం. రా. అయో.
౧౨౧పా. ౭౫౦. (గుంపులుగుంపులుగొను=
గుంపులుగుంపులుగా ఏర్పడు.)

౫. ఇది సకర్మక క్రియలకు ఆత్మనేపదార్థమునందు
ను అకర్మక క్రియలకు స్వార్థమందును అనుప్ర
యుక్తమగును.

ఉదా: చంపికొను, కొట్టుకొను, దాఁగుకొను,పం
డుకొను, మొ.

చంపికొను:-

చ. ... భీష్ముని నెనకొల్పి సేనలను ముఖ్యుఁడ వీ
వని యుబ్బఁజేసి యీ,నునఁ దలపెట్టి చంపికొ
నఁ జూచె సుయోధనుఁ డింత నేమనున్.భా
ర. ఉద్యో. ౪. ౨౧౭.

రవులుకొను:-

సీ. ...అవుల నాపాట్మూన్నరు రవులుకొనియె. ఆ
ము. ౧. ౩౬.

(కోన్, కోఁగన్, కోఁగాన్, కొంచు, కొన్న,
కోక, కోని, కొందును, కొండ్రు, కొందురు, కొం
డ్రు, కొమ్ము, కో, కోకొమ్ము, కోవయ్య మొదలగు

విశేషరూపములు వ్యాకరణములనుబట్టియు ప్రయోగములనుబట్టియు గ్రహింపవలయును. కొన్ని ప్రయోగము లీక్రింద ఈయఁబడినవి.

చూచికొండము=చూచికొందము.

ఆ. ... చూచి,కొండ మెల్లపనియు రండు వేగ. భార. మా. ౧౭౩.

కొండ్రు=కొందురు.

సీ. ... మీాలయట్టుల బలపంతు లల్పులఁ దమకు నాహారములుగఁ, గీ. గొండ్రు భూపతి లేకున్న మండ్రె జనులు... భార. శాం. ౨. ౨౧౫.

కొండు=కొనుఁడు.

ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీ, కుండుట... నైష. ౧. ౫౧.

కొంద్రు=కొనుదురు.

శా. స్వామిద్రోహము వాపికొంద్రచట... కాశీ. ౬. ౩౭.

చవిగొను=౧. రుచిచూచు, ఆస్వాదించు.

సీ. ఏమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి దోఁపక యది మున్ను దోఁపకుండె. కళా. ౬. ౨౧౪.

౨. తిను; అనుభవించు.

మ. వివిధాజ్యాహుతిధూపదీపములు నైవేద్యంబు నీయగ్ని ముల్, జవిగొన్ బిమ్మట భుక్తిముక్తులు నవశ్యప్రీతిగా నెప్పడుల్, జవిగొండ్రం బురుహాసనాచ్యుతమహేశానాదిబృందారక, ప్రవరుల్ ...కాశీ. ౩. ౨౦౬.

తెవులుగొను, తెవుళులుగొను=రుగ్ణమగు, వ్యాధిగ్రస్తమగు. భార. ఆది. ౫. ౫౩, ఆను. ౫. ౨౧౪.

భయముగొను=భయపడు. భార. ఆర. ౨. ౮౪.

భుక్తిగొను=భుజించు. కాశీ. ౨. ౭౫.

౨: కొంట, కొండాట[1], కొండాడు[1], కొనితెచ్చు, కొనిపించు, కొనిపెట్టు, కొనిపోవు, కొనియాట, కొనియాడు, కొనివచ్చు, కొనుగోలు[1], కొనుబడి, కొనుమొదలు, కొలువు[4], కో[2], మొ.

కొనుగోలు[1]. వి. (√కొను) కొనుట, క్రయము. (శ. ర.)

కొనుగోలు[2]. వి. నాట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దోచ్చారణము.

మ. ఎకతాళంబున వీరమర్దళరవం బేకంబుగా నట్టువుల్, ధికతోంతత్తకఝుంకుఝుంకుకిణతోం ధత్తాంకియల్లోధకు, ధ్ధికుతెత్తెయ్య ధిమికుక్కుతక్కుధిగుతాంధిత్తాత్తతాళంబులన్, గకుబంతంబులు మాఱుపల్కు కొనుగో ల్గన్పట్టనప్పట్టునన్. ప్రబంధ. ౯౪.

కొనుజో=కొణఁజో. వి. పిడుఁజు, పసులదేహమందు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము.

సీ. ఎరువు తిప్పలు గొని యెల్లమఁదలు గొనుజెక్కు మేఁపులచోటు ద్రొక్కఁబడియె. హరి. పూ. ౬. ౫. (శ. ర. ప్రాఁత ప్రతిపా-కొనుజెక్కు=కొనుజలుపట్టి.)

కొనుబడి. వి. (√కొను) కొనుగోలు, క్రయము. (శ. ర.)

కొనుమొదలు. వి. (√కొను) క్రయధనము, కొనుటకిచ్చినసొమ్ము. (శ.ర, బ్రా.)

కొన్నాళ్లు. వి. బ. (కొన్ని+నాళ్లు) కొన్నినాళ్లు, కొన్నిదినములు, కొంతకాలము.

గీ. మున్ను కొన్నాళ్లు పలుగాకిమూఁకలోనఁ, గలసిమెలఁగినతెఱఁ గెల్లఁ గానిపింపఁ, జేడియలమీాద గ్రుడ్లిడ్డుసేయ రాకు, కోయిలా యింక నీయిల్లు గూలిపోను. నీలా. ౩. ౨౫. వసు. ౧. ౧౨౩.

కొన్ని=కొని. స. ఔ. (చూ. కొంచెము-'కొంత' శబ్దమునకు అమదర్థకబహువచనరూపము) కతిపయార్థకము.

సీ. బాగాలు వెస నొక్కపద్మాక్షి యొసఁగిన వెగ్గ లం బని కొన్ని వెడల నుమిసి. మనుచ. 3. ౬౬.

ఉ. కొన్నిటిఁ బాగ్యములఁ నలియఁ గొన్నిటి వీపులు పిండిపిండిగా,నన్నిటి భీముఁ డుద్ధ టగదాహతి నేనిక వేఁటలాడఁగన్. భార.భీష్మ. ౨. ౨౧౧. (ప్రాఁతప్రతులపాఠము.)

ద్వి. ... మఱికొన్ని వేల్పులు...బస.పు.౪.౩౧౩. (ఇట మహన్మహాత్త్యర్థకముగా నుపయోగింపఁబడినది.)

**కొపురు.** వి. (సం. గోపురమ్.) ౧. శిఖరము.

క. దాఁటుటయుఁ గొండకొపురులు, బీటలువాఱెం గడిందిబీతున జేజే,దాఁటు పడంకం బాఱెను,గాటపుఁబయ్యెరల మొగులు గడలకుఁ బాఱెన్. అచ్చ. రా. కిష్కిం. ౧౦౨.

౨. ఉన్నతి.

ఆ. ... గొనబుఁగొను,గొంచెతనముఁ బిఱుఁదుఁ గొపురును బొక్కిలి,లోఁతు నెన్న నెన గలుగుట యరిది. అచ్చ.రా.అర.౨౩. (శ.ర.పా)

**కొపెర=కొప్పెర.** వి. పెద్దమూతి గలపాత్రము.

సీ. సారాయికొపెరగంజాపాడుల్ దెమ్మంచు హరిణితోఁ గడు నెగ్గులాడి రనుచు.కువల.౧. ౪౧.

**కొప్పరము=కొప్రము.** వి. ౧. శిఖరము, అగ్రము. (శ. ర.) ౨. మూఁపు.

గీ. కొప్పరము మూఁ పటంచన నొప్పు నంస,ము ... ఆంభా. ౨. ౧౩౭.

క. అప్పుడు భయవిస్మయములు, ముప్పిరిగొన నశ్వశిరుఁడు ముందటఁ బైపై,నుప్పరము లెగయుగరుడుని,కొప్పరమున నున్న కపటగోవిందునకున్. వరాహ. ౧. ౧౪౨. ఉ. హరి. ౬. ౧౦౮.

విణ. విజృంభితము, ముమ్మరము.

ఉ. ... రోగములఁ,కొప్పర మైనచో...దా.శ. ౧౬.

జ: కొప్పరించు, కొప్పరింత.

**కొప్పరించే.** అ. క్రి.(√కొప్పరము) ౧. విజృంభించు; అతిశయించు.

వ. ...అడిదంబులు జళిపించిన ఝుణఝుణఝుంకారంబులుం దదీయపరస్పరఘర్షణక్రేంకారంబులుం బిమహుంకారంబులును ముప్పిరిగొనం గొప్పరించియు... అదలించియుం గదలించియుఁ బోరునవసరంబున... అవ్వీరద్వయంబు గనుంగొని...ఉ. హరి. ౪. ౨౪౬.

వ. రేవెలుంగు రాచిప్పలం గప్పురంపుఁగుప్పెలం గొప్పరించిననరసమధురసంబులు నించి ... పారి. ౨. ౯౨.

౨. (కోపాదులచే) రోమాంచము కలది యగు.

సీ. కొప్పరించఁగ మింటఁ గ్రొవ్వాఁడి రోమముల్ చొచ్చి వచ్చినతోలు లుక్కగుంపు. చంద్రా. ౧. ౭౯.

సీ. గాలి సోఁకిననైనఁ గనలి మైఁగొప్పరించి తటాన నట బయల్ సెలసికొనుచు. చంద్రా. ౨. ౯౨. ఉ. రా. ౭. ౪౧౩.

౩. పండ్లిగిలించు. (బ్రౌ)

ద్వి. కొప్పరింపుచుఁ బందుకోఁఱి యై యుండె. అభిమన్యుచరిత్ర. ౧౭౪.

స. క్రి. నిండుగాఁ బోయు.

సీ. దైవతైర్థికులు మందాకినీతోయముల్ గొప్పరించిన గాజువ పెప్లనఁగ...గీ...కనుపట్టెఁ దారకాసముదయంబు. విప్ర. ౩. ౭౦.

**కొప్పరింత.** వి. (√ కొప్పరించే) అతిశయము; విజృంభణము. (శ. ర.)

**కొప్పు**[1]. వి. (త. కొప్పు.) ౧. స్త్రీధమ్మిల్లము,కబరి, వేనలి.

చ....మోమున, న్వల పలరారుఁ గ్రొమ్మొగులన

న్నియఁ గేరును గొప్పుతీ రహో,చిలుకలకొ
ల్కి-సౌరు నెతేఁ జెప్పఁగ నల్పుకునైనఁ దీరు
నే. నీలా. ౨. ౧౯. దశా. ౬. ౩౪.

౨. మగవానిసిగ, జుట్టుముడి.

ఆ. అగ్నిదాహభీతి నంగారపర్ణుండు,బమ్మరిల్లి నే
లఁ బడిన వానిఁ, గొప్పు పట్టి యీడ్చుకొని ప
చ్చె ధర్మజు, కడకు నింద్రసుతుఁడు కడిమి
మెఱసి. భార. ఆది. ౭. ౪౪.

౩. ఇంటికప్పుయొక్క-యూర్ధ్వభాగము; ఉన్నత
స్థానము.

గీ.చని యధిశ్రయణిని పహ్నిసంగ్రహించి,యిం
టినడికొప్పు తగిలించి యెఱుఁగనట్లు, ముంగి
టికిఁ బోయి...శుక. ౩. ౩౧౪.

క.లలిఁ గొప్పెక్కించితి మధు,పుల శుకుల నడు
గుపఱచితి పుష్పాస్త్రా మా,లలకును మంచం
బులు శాఁ,పలకును బీఁట లనుమాట బళి నిజ
మయ్యెన్. చంద్రా. ౫. ౯౧.

౪. (వింటి) కొన, గనయము, కోపు.

చ. తెగువ మనోభవుండు తియతియ్యనిసింగిణి
వింటికొప్పునన్, దగిలిచె దక్షవాటిపనితాచి
కురంబులఁ బోలుశింజినిన్. భీమ. ౫. ౯౫.

సీ. కబరియు శిఖయును గార్ముకాగ్రంబును గొ
ప్పని పల్కఁగా నొప్పుచుండు. ఆం. భా. ౩.
౬౧.

జ: కొప్పుగొలుసులు, కొప్పువల.

**కొప్పు²**. వి. నాట్యవిశేషము, కోపు.

గీ. పెక్కుపగజక్కిణీ కొప్పు ద్రొక్కి నొక్కి,
చక్కనిమిటారి నరపతు ల్సొక్కి చూడ.
దశా. ౭.౧.౨౨౭. ('కోపు' అనియును చదు
వవచ్చును.)

**కొప్పుగొలుసులు.** వి. బ. (√ కొప్పు¹) కొప్పు
నకు నుభయపార్శ్వములయందు పెట్టుకొనుగొ
లుసులు, ఆభరణవిశేషము. (వా)

**కొప్పువల.** వి. (కొప్పు¹+వల) వాలపాశ్యావిశేష
ము. ('తలవెండ్రుకలను బంధించునట్టిముత్యాలస
రము' బ్రౌ.)

సీ....తనరును వాలపాశ్యావిశేషములు నూసక
తురాయి, ముత్యాలకుచ్చు కొప్పువల పాపట
బొట్టు జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క, య
నఁగ...ఆం. భా. ౨. ౧౪౭.

గీ. చెవులపూవులు బవిరలు చేరుచుక్క, కొప్పు
వలయును సవరించి కొప్పు మీఱ,భూషణము
లకుఁ దా నొకభూషణ మయి, పడఁతి యపు
డొప్పెఁ గన్నులపండు వగుచు. కళా. ౭.౬౬.

గీ. బవిరలును గొప్పువలయును బడఁతి యొత్తు,
దిద్దె...యయా. ౪. ౯౯.

**కొప్పెర=కొపెర.** వి. (సం. కర్పరః.) ౧. కటాహ
ము, కాఁగు, వెడల్పుమూతి గలచిన్నపాత్రము.

గీ. ఇట్టిసేవలతో నమ్మహీశ్వరుండు, వెడలుచును
శంఖలిఖితు లనెడిపురోహి,తుల నియోగించి
రానివారలను వైవ,డరసి కాఁగినచమురుఁ
గొప్పెరలలోన. జై. భా. ౪. ౧౧౦.

సీ. ధనముకొప్పెరదండఁ బెనుభూతె మున్నట్లు
గంగదరిని మొసలి గాచినట్లు. వైజ.౩.౧౨౫.

గీ. పసిఁడికొప్పెర లాతంబు పచ్చకోల, జోగప
ట్టియు కకపాల జోలెనంచి, కలికికాటుక గీ
ర్పొట్టు పలుఁగుపేరు, జాతి గాఁ దాల్చి నెఱ
మిండజంగ మగుచు. హర. ౫. ౪౦.

౨. తలపుర్రె.

క. అప్పుడు విడువక వ్రేసెం, గుప్పున నడునెత్తి
పగులఁ గొట్టఁగ వెడలెం, గొప్పెర నెత్తురు
భీమున, కప్పాండవలోచనముల నశ్రులు గా
ఱన్. దశా. ౯. ౧౨౭.

**కొప్రము=కొప్పరము.** వి. శిఖరము.

ఉ. పున్నమచందురుం డెగడుపొంకపుమోముల
రాచకన్నియల్, గ్రొన్నెలతాలమేలిపనికొ
ప్రపుమేడల నాటలాడ...నీలా.౧.౨౭.

**కొబ్బెర=కొబ్బెర.** వి. ౧. నారికేళముగ.

ఉదా: కొబ్బెరకాయ, కొబ్బెరపండు.

సీ. కోఁతి కొబ్బెరకాయ కొన కెక్కి పడఁ ద్రో
యు దానిజలంబులు ద్రావఁగలదె. రామలిం.
౧౭.

ఉ. మ్రొక్కి లొసఁర్తు...చక్కెర కొబ్బెరపండు
లుండ్రముల్, మెక్కెడుపాఁపజంబెములమే
టికి...నీలా. ౧. ౭.

౨. కొబ్బెరకాయలోనిభోజ్యపదార్థము, పేశము.

గీ. చాఅపప్పును గసగసాల్ జాజికాయ, సెనగ
లనుములు పత్రియు మునగపువ్వు, కొబ్బెర
యు మందపాలతోఁ గూర్చి త్రావి, యుబ్బుద
బ్బరకాఁడునీ కబ్బు టగునె. ప్రబంధ. ౯౮౧.

సీ. ... కొబ్బెరనఁ గొవ్వెర యటంచనఁగఁ ద
త్పేళ మెసఁగు...ఆం. భా. ౨. ౭౮.

క. తరణిదళరసమునను గొ,బ్బెర నిండన్ రాచి
రాచి పెట్టిన దళవా,సరములకు మస్తకీటక,
మురలి సుకేశములు మొలచు మొదలిటినియ
తిన్. చికి. (చి. ని.)

జ: కొబ్బెరపూవు, కొబ్బెరయుండ.

కొబ్బెరపూవు. వి.(√కొబ్బెర) మొక్క మొలచిన
కొబ్బెరకాయలో ఉండపలె నుండుమెత్తనిపదా
ర్థము. (బ్రౌ)

కొబ్బెరయుండ. వి. ( √కొబ్బెర.) భక్ష్యవిశేష
ము, పూండము. (శ. ర.)

కొమ[1]=కొమ్మ[1]. వి. శాఖ. (శ. ర.)

కొమ[2]=కొమ్మ[2].

(ఆఁడుది, స్త్రీ.)

క. కమలముల నుజ్జగించుం, గుముదంబుల బుజ్జగిం
చుఁ గొమచూపులు పున్నమచందమామవె
లుఁగుల, కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ
బోలుఁ జూమీ. విజ. వి. ౧. ౧౩౩.

క. కొమ నాము మీఁజఁ బైకొని, సుమనారాచం
బు లేసి స్రుక్కింపకు... మదకీరగమన శంబ
రదమనా. రసిక. ౪. ౧౬౬.

కొమరసామి. వి. (చి.ని,శ.ర-సం.కుమారస్వామి)
కుమారస్వామి.

లయగ్రాహి. హైమవతిపట్టి నఖిలామరశరణ్యు
నతకామితకరున్ గొమరసామి భజియిం
చెన్. కాశీ. ౪. ౩౦౨.

సీ. కొక్కరోకో యని కొమరసామిరథంబు కం
ఠంబు సాఁచి క్రేంకార మిచ్చె. భీమ. ౨. ౫౫.

సీ. ... అల్లదె కొమరసామయ్యనగరు. క్రీడా.
౧౪౯. ('కొమరుసామయ్య' ముద్రి.)

కొమరాలు. వి.బౌ. (కొమరు+ఆలు) ౧.యువతి,
జవరాలు; స్త్రీ.

సీ.కొమరాలిసిబ్బెంపుగుబ్బపొందమ్మి మొగ్గలు పే
రెదకుఁ జేర్పఁ గలిగెనేని. పె. శకుం. ౨. ౭౭.

గీ. ... మిత్రమోహార్తిఖిన్న, తమ్మికొమరాలుప
త్రనేత్రములు మోడ్చె. వేం. పంచ. ౪.
౨౩౪.

౨. సుందరి, అందము గలస్త్రీ.

ఆ. చాల ముద్దరాలు జవరాలు కొమరాలు. భాగ.
౯. ౭౨.

క. ఆలవు బాలవు గదుఁ గొమ, రాలవు గోమలివి
ముద్దరాలవు...కు. సం. ౬. ౬౭౨.

కొమరిత=కొమారి,కొమారిత, కొమార్త. వి.(సం.కు
మారీ. త. కుమరి)కూఁతురు, దుహిత.

గీ...అతనునారాచ మైన, రాచకొమరితఁ బాం
చాలిఁ జూచునపుడు. పాంచా. ౨. ౩౧.

కొమరు[1]. వి. (సం. కూబరః. త.కొమ్మై.) ౧.మనో
జ్ఞత, సొంపు, ఒప్పిదము.

ఆ. సోయగంబు సొబగు జోక మురువు కొమరు, చె
లువు తీరు సొరు పొలుపు చెన్ను, చక్కఁదన
మనంగ సౌందర్య మొప్పును...ఆం. భా. ౩.
౪౧.

సీ. వదనంబు కొమరు భావనఁ జేసి వేలుగా నుదుటి
పెం పలకలఁ బొదువఁబడఁగ. భార. విరా.
౧. ౨౭. ఉ. రా. ౧. ౨౧౦.

౨. విధము.

క. కరితురగసమితి గాఱ్ఱని, కురువీరుల మొన
లు మొగులు కొమరునఁ గవియన్. భార. వి
రా. ౪. ౨౬౦.

ద్వి. రెండుహస్తము లెత్తి రెక్కలతోడి, కొండ
త్రివ్వన వచ్చు కొమరు దీపింప. రం. రా. బాల.
౨౭ పా. ౯ పం.

విశ. ౧. మనోహరము, మనోజ్ఞము, చక్కనిది.

క....హయరత్నము త,ద్విమలోదధితీరంబునఁ,
గొమరుగ నేకతమ యిచ్చెఁ గ్రమ్మరుచున్నన్.
భార. ఆది. ౨. ౨౬.

గీ. చిఱుచెమటఁ జేర్చువింత క్రొమ్మెఱుఁగుతోడఁ,
గొమరు మేనొప్ప... కళా. ౪. ౯౬.

౨. (సం. కుమార:) పడుచువాఁడు; పడుచుది.

గీ. పాటితూముల రసము దైవాఱఁ గొలిచి, కొమ
రుజంగమునకు నిచ్చెఁ గోర్కి తీఱ. హర. ౧.
౨౩.

లయగ్రాహి. లేనికొమరుందనము లేని చెలువంబు
ను...కళా. ౪. ౪౯. (కొమరుందనము=యౌ
వనము.)

కొమరుమిగులు=అందగించు, ఒప్పు, చెన్నొందు.

సీ. చందురునుఁ గాంతికిం దెచ్చి కూర్చి బాగు
నకుఁ దెచ్చిన యట్లు గొమరు మిగిలి. భార. వి
రా. ౨. ౫౨.

సీ. రమణీయమహార్ఘకరత్నహారంబులు కుచకుంభ
ములమీఁదఁ గొమరుమిగుల. విక్ర. ౧. ౮౭.

కొమరారు=కొమరుమిగులు.

(సూర్యోదయవర్ణనము) సీ. చక్రవాకద్వయసం
తతి యెఱకలకొమరారు కెంజాయఁ గ్రొత్తఁ
జేసి. భార. ఉద్యో. ౨. ౧౧౪.

సీ. కొండంతకల్మిచేఁ గొమరారియుండియు నుప
వాసమున నుండె నువిదకు పదము,లు...చంద్రా.
౨. ౧౨౩.

కొమరొందు=కొమరుమిగులు.

క. కొమరుం బ్రాయము మిక్కిలి, కొమరొందెడు
దినముఁ గ్రొత్తక్రొత్తగ నెలమిన్. కళా. ౪.
౪౬.

సీ. సర్వపర్వతకులసార్వభౌముం డనఁ గొమరొం
దుపడమటికొండదండ. విక్ర. ౨. ౧౦౨.

జ: కొమరుఁదనము, కొమరుఁబాయము.

కొమరు². వి. (చూ. కొమరేలు-సం. కుమార:.)
కుమారస్వామి.

క. కొమరు సామ నేనాని కొమరుమిగులు...
ఆం. సం. దేవ. ౧౩. సాం. ని. దేవ. ౭.

కొమరుఁడు¹=కొమారుఁడు. (సం.కుమార:. ప్రా.
కుమారో.) ౧. పుత్త్రుఁడు, కొడుకు.

సీ. ... కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁ డ
నఁగఁ బుత్త్రాభిధానంబు... ఆం. భా. ౨. ౧౧౧.

ద్వి. అమలకీర్తులఁ బుణ్యుఁ డగువిభాండకుని, కొ
మరుండ బుశ్యశృంగుండు నా పేరు. రం. రా.
బాల. ౧౨ పా. ౭౪ పం.

౨. పురుషుఁడు, మగవాఁడు.

ఉ. కొండొకసేపు నిల్చి చనుకోరిక రాకొమరుం
డు... విక్ర. ౩. ౭౮.

౩. కౌమారవయస్సువాఁడు, యౌవనమునకు పూ
ర్వవయస్సువాఁడు. ఆం. భా. ౨. ౧౧౮.

కొమరుఁడు². వి. (సం. కుమార:) కుమారస్వామి.

చ. కొమరుఁడు సామి కొంచమల గొట్టినజాణఁ

డు...బారకే,ళ్లమరినవాఁడు వా నగు గుహో
ఖ్యలు...ఆం. భా. ౧. ౪౪.

**కొమరుఁదనము.** వి. (√కొమరు[1]) యౌవనము.
లయగ్రాహి ... తోఁచుఁ, లేనికొమరుందనము
లేని చెలువంబు...కళా. ౪. ౪౯.

**కొమరుఁబాయము.** వి. (కొమరు+పాయము.)
యౌవనము, పడుచుఁదనము.
వ. ... గాటంపుమరు నాటలకుం దివురుకొమరుఁ
బాయంపుందుటారికత్తియలును...నీలా. ౩.
౧౦.
ఇట్లే: కొమరునాఁడు, కొమరుఁబ్రాయము.
మ. ...కొమరునాఁడే చెల్లె మా వైఖరుల్. కకు.
౪. ౨౬.
క. ... కొమరుంబ్రాయము మిక్కిలి, గొమరొం
దడు...కళా. ౪. ౪౬.

**కొమరులు.** వి. బ. మేలుదూలముమీఁదిగుజ్జులు.
(శ. ర, బ్రౌ-కొమరలు అని వాడుక.)

**కొమరేఱు.** వి. దే. (√కొమరు[2].) పీఠికాపురస
మీపముననుండు కుమారారామగ్రామమున నుం
డుదివ్యవాహిని, స్వామిపుష్కరిణి.
సీ. కొమరేటికల్యాణకమలషండంబుల సౌరభ్య
భారంబు సంతరించి. భీమ. ౨. ౬౨, ౬౩.

**కొమారి**=కొమరిత.
(స్త్రీ)
గీ. ఆకొమిరెప్రాయపుమిటారిరాకొమారి,యడుగు
లను వ్రాలి ... చంద్రా. ౪. ౯౧.

**కొమారిత**=కొమరిత.
(పుత్రిక, కూఁతురు.)
క. చెలువంబు గలకొమారిత,గలిగినయందులకు ఫ
లము గాదే విభవో,జ్జ్వలమతిబలధృతిలీలా,
కలితుఁడ వగునీకు నొసఁగఁ గాంచుట లనఁ
గన్ .సమీర. ౨. ౫౩.
ఉ. ... బోటి వచ్చి యో,పల్లవపాణి ని న్బిలుపఁ
బంపిరి వ న్నిట రాజుగా రనం,బల్లకి యెక్కి
యాదొరకొమారిత...పాంచా. ౨. ౧౦.

**కొమారుఁడు.** వి. (బ. కొమారులు,కొమార్లు)౧. కు
మారుఁడు, పుత్త్రుఁడు.
సీ....కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁడనఁ
గఁ, బుత్త్రాభిధానంబు... ఆం. భా. ౨.
౧౧౧.
మ ...తల్లిదండ్రుల్ మనం,బు విరాజిల్లఁగఁ గూ
డఁబెట్టినధనంబుల్ లోకమందుఁ గొమా,ళ్ల
విగా కెవ్వరి వమ్మ...సారంగ. ౨. ౭౫.
౨. పురుషుఁడు, మగవాఁడు.
గీ. కన్య దనకంటె కింపైనధన్య నొకనిఁ, గోరికొ
నుఁగాక రాచకొమారులందు.భోజసుతా.౨.
౫౨. కళా. ౩. ౧౩౦.

**కొమార్త**=కొమరిత.
(కన్య)
చ. చెలువలచెంతకుం జనియె సిగ్గులపెండ్లికొమా
ర్తయుంబలెన్. కువల. ౨. ౨౭.

**కొమిరె.** వి. (సం. కుమారీ) ౧. కౌమారవయస్సున
నున్నస్త్రీ, యౌవనమునకుఁ బూర్వవయస్సున ను
న్నస్త్రీ. ఆం. భా. ౨. ౧౦౬.
౨. యువతి, యౌవనము గలస్త్రీ.
క. అమరావతిఁ గలవేలుపుఁ,గొమిరెలలోనెల్ల
రూపగుణశీలములం, గొమరారుదు...విక్ర.
౨. ౨౪౫.
ఉ. కొమిరెలు నీకు లేరె పది కోటులు వత్తువ
కోరితేని...ఉ. రా. ౪. ౨౧౦.
౩. కూఁతురు, పుత్త్రిక.
చ. కొమిరె మనోవ్యథం బొగుల గ్రుచ్చి కవుం
గిటఁ జేర్చి తల్లి...వసు. ౩. ౧౦౫.
౪. స్త్రీ.
గీ. మాను మీమోహ మని తెల్పి మానవేంద్రు,
చిత్త మెగ్గించి యొకమాటఁజేసి రాచ,కొ

మిరె నిదురించుతతి మందసమున నుంచి,వీడు నెడలించుకొని తెచ్చువేళ నెదుట. శుక. ౧. ౩౭౪.

విణ. యౌవనముగలది.(స్త్రీ)

వ... కొమిరెహరిణలోచనలచలితకంకణసంకుల క్రేంకారంబు లాననామోదమేదురాళిఝుం కారంబులబింకంబు లడంప...ఆము. ౪.౩౫.

కొమ్మ[1]=కొమ[1]. వి.(త.కొంబు,కొంబర్.) ౧.శాఖ.

సీ. అభ్రంకషాభోగ మగుమఱ్ఱికొమ్మను గట్టినవ్రే లెడునుట్టి యెక్కి. విక్ర. ౨. ౪౪.

మ. హరిశౌర్యం డగురామభూవిభునితీవ్రాటో పవద్వాహినీ, శరవేగంబున నాత్మమూలబల ముల్జాఱఁ దళాడంబరం, బరుగం గొమ్మలు వోవ లావతి నిజామాదుల్ వజీరు ల్భజిం, తురు నమ్రత్వముఁ గానలో ముసలిమాను ల్గా వితర్కింపఁగఁ.వసు. ౧. ౪౫. ('పుత్రపా త్రాదులు' అని ధ్వని.)

౨. (కోట గోపురము మున్నగువాని) శిఖరము, శృంగము.

సీ. చీలలు చెదరి బచ్చెన చిట్లి వానలఁ గూలు కొమ్మలతోడిగోపురములు. చంద్ర.౩.౪౭.

సీ. శ్రీకలితానూనచిత్రరేఖాయుక్తి కొమ్మలం దును గోటకొమ్మలందు. విక్ర. ౭. ౧౩౩.

లయగ్రాహి. అన్నగముపై జరతపన్నగపతిస్ఫుట లన న్నెగసి కోటతుదల న్నెగడుకొమ్మల్. మనుచ. ౫. ౩౦.

జ: కొమ్మత్రిమ్మరి, కొమ్మదాసరి, కొమ్మమెకము, కొమ్మలువోవు.

కొమ్మ[2]=కొమ[2]. వి. ఆఁడుది, స్త్రీ; భార్య.

క. అమ్మేటివిద్య నాచే,నిమ్ముగ నంతయుఁ నెఱిఁగి నృప నన్ను వివాహమ్మగు మనవుడు రెండ వ, కొమ్మ మదిఁ బ్రేమ గడలుకొన నిట్లని యెఁ. మనుచ. ౬. ౧౭.

గీ. సేవకులపాలిసురశాఖిపూవుఁగొమ్మ, కోమలా ర్ధేందుధరుకొమ్మ నోఁగులమ్మ. భీమ. ౧. ౯౭.

కొమ్మచెట్టు. వి. (√కొమ్మ[1]?) వృక్షవిశేషము.(దీని కఱ్ఱ కాఁగడావలె వెలుఁగును-బ్రౌ.)

కొమ్మత్రిమ్మరి. వి. (కొమ్మ[1]+త్రిమ్మరి) వానరము, కోఁతి.

గీ. మమ్ముఁ గొలువుము సుగ్రీవు మడిపి నీకుఁ, గొ మ్మత్రిమ్మరినా డొనగూడఁజేతు. అచ్చ. రా. యు. ౧౨౩. (శ. ర. పా.)

కొమ్మదాసరి. వి. (కొమ్మ[1]+దాసరి) ఊరినడిమిచె ట్టెక్కి బిచ్చముకొఱకుఁ గేకలువేయు ఒకజాతి దాసరివాఁడు. (వా)

కొమ్మనగొట్రపిండిచెట్టు. వి. పూతికకీ. (శ. ర.)

కొమ్మనగొలిమిడి. వి. మూలఫలకీ. (శ. ర.)

కొమ్మనగోర. వి. వృక్షవిశేషము. (శ. ర-ఉపలభే దకము, కొండపిండిచెట్టు. బ్రౌ)

కొమ్మనఁటి=కొమ్మనరఁటి. వి.(√కొమ్ము)-కొమ్ములవ లె నుండుకాయలు గలఅనఁటి-కదళీవిశేషముకీ.

గీ. పనసపం డ్లీడపండ్లు కొమ్మనఁటిపండ్లు,కప్పుర పుదబ్బపండులు నిప్పపువ్వు, మొదలుగాఁ గానుకలు పెట్టి ప్రోల నిలిచి,పలికిరి...రసిక. ౧. ౬౪.

కొమ్మనరఁటి=కొమ్మనఁటి. వి. (ఇది 'కొమ్మనగోర, కొమ్మనగులిమిడి'వంటిది.) కదళీవిశేషము కీ.

ఆ. తొలఁగఁబెట్టె రోషకలికించితంబుతోఁ, గొ మ్మనరఁటిపండ్లు గూర్మిమఱఁది. నైష. ౬. ౧౩౯.

కొమ్మమెకము. వి. (కొమ్మ+మెకము.) శాఖామృ గము, వానరము, కోఁతి.

క. అనిన విని రాముతమ్ముఁడు, నెన రొదవఁగ నత నిఁ జూచి నేర్పునఁ బలికెఁ, విను కొమ్మమె

కపుబలియుండ, గొనకొని మాచంద మెల్ల గు
లు తెఱఁగింతుఁ గా. అచ్చ. రా. కిష్కిం ౧. ౮.

కొమ్మలువోవు. అ. క్రి. (కొమ్మలు[1] + పోవు.) అతిశయిల్లు.

చ. ... రతికోర్కులు గొమ్మలువోవ... విభుండు
ను వారిజపత్ర నేత్రయుఁ గా, గడపల లేని కేలి
తమకంబున నుల్లము లుల్లసిల్లఁ గాఁ. నిర్వ. ౮. ౨౩.

కొమ్మి. వి. అడవిలో పెరుఁగునొక విధ మైనఫలవృక్షము. (దీనిపూవులు సువాసన గలవిగను ఆకులు కలకు గలవిగను ఉండును. బ్రౌ)

గీ. కొమ్మిపం డ్లీఁతపండ్లును గొంజిపండ్లు, మేడి
పండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచెత
లు దెత్తు రిత్తు విచ్చేయవయ్య. కళా. ౩. ౬౯.

సీ. మామిడికాయయు మారేడుకాయయుఁ గొం
డముక్కిడికాయ కొమ్మికాయ. గీ. ... ఆది,
యైనయూరుఁగాయలు గల వతనియింట. హం
స. ౪. ౧౩౫.

కొమ్ము. వి.(క. త. కొంబు) ౧. పశుశృంగము, విషాణము.

ఉ. కొమ్ములఁ గ్రుమ్ములాడు మదఘోరవృషంబుల
మాడ్కిఁ బోరుచో ...ఉ. రా. ౩. ౨౫౦.

క. పొడ చెదరి బూది చఱచిన, యొడళ్లలో నా
ల్గు రెండు నొకటియుఁ బ్రంగల్, వెడలినకొ
మ్ములబరువున, నడుగిడఁగా లేవు బలిసి యం
దలిదుప్పుల్. మనుచ. ౪. ౨౧.

సీ. ...శృంగంబు కొ మ్మనఁ జెలఁగుచుండు. ఆం.
భా. ౨. ౨౬౨.

౨. ఏనుఁగుదంతము.

ఉ. కొమ్ములు ద్రుంపఁబడ్డనవకుంభివిధంబునఁ గూ
లెఁ గుంభినిఁ గా. భా. రా. ఆర. ౧. ౨౨౪.

సీ. మదహస్తి నయినను నెదిరి కొమ్ములు పట్టి చది
కిలఁబడఁ ద్రోచుసత్త్వములును. విక్ర. ౧.౭౭.

౩. పందికోఱ, వరాహదంష్ట్ర.

సీ. నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ముకొన సు
బ్బ నెత్తినఘోణి పీవ. పారి. ౧. ౪౯.

౪. చౌఱ మున్నగు చేఁపలముఖభాగమున అంపముపలె నుండుఅవయవము.

సీ. తిమితిమింగిలముఖ్యదీర్ఘ మత్స్యంబులఁ గొమ్ము
న గుములుగా గ్రుచ్చి యెత్తు. దశా.౧.౫౯.

సీ. బిరుదువజ్రపుగండ పెండార మై మీఱఁ గొమ్ము
న శేషాహి గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౨౫.

౫. బాలచంద్రరేఖయందలి రెండుకొనలలో నొకటి.

సీ. వర్షగర్భము నడపక పోయె విదియలఁ గుముదా
ప్తుదారణకొమ్ము దఱిఁగె. కాళ.౩.౧౪౯.(దా
రణకొమ్ము = నెలహెచ్చుతగ్గులను సూచించు
కొన.)

౬. (విల్లు కావడిబద్ద తక్కెడదండె మున్నగువాని) కొన.

క. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసుపడం
దివియఁ గూడి కళలప్రశ్నం, బడిగిరి యొం
డొరులను గని, కడకొమ్ముల నున్నయదితిక
ద్రూతనయుల్. భీమ. ౪. ౧౩౪.

సీ. ధనువుక్రిందటికొమ్ము ధరణిపై మోపి మీఁదటి
కొమ్ము వామహస్తమునఁ బట్టి. భోజరా. ౫.
౭౭.

సీ. పెల్లులోహండికావళ్లకొమ్ముల వ్రేలుగిడ్డిమొత్త
ము నేతిలడ్డిగలును. ఆము. ౨. ౯౭.

౭. పసుపు లోనగువానినిడు పైనదుంప.
ఉదా: చాయపసుపుఁగొమ్ము, అల్లపుఁగొమ్ము, సొంటికొమ్ము, మొ.

౮. చిమ్మనగ్రోవి.

గీ. అనుచు నొకదిక్కు చేరి లావునను మీఱి కొమ్ము
దగఁ బూని యుడుపాళిఁ గోర్కి నాని, చల
ము దొరలంగ నాడునెచ్చెలులఁ గదిసి, సఖులు
సరసత జలకేళి సల్పి రపుడు. చంద్రా. ౪. ౨౪౭.

చ...జీవితేశసమితి గొమ్ములం గరఁచి చల్ల... ఆము. ౫.౧౧౩.

౯. (పర్వత) శిఖరము.

క. గుబ్బలికొమ్మెక్కటి గడు,నిబ్బరమునఁ జెఱికి యాతనికి నైచిన వాఁ,డుబ్బు సెడక మలద్రిమ్మరి,జెబ్బలిపై మొనలవాలు వేర్మికి నైచెఁ. అచ్చ. రా. యు. ౨౪౧.

౧౦. కోటశృంగము, కోటకొమ్ము.

క. ఇమ్ముల సప్పరివప్రము,కొమ్ములపై నుండి పురముకొమ్మలు వేడ్కన్, దమ్ములచుట్టముపదజల,జమ్ములఁ బూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. మొ. రా. బాల. ౪.

సీ...వరణశృంగ మ్మగుఁ గొమ్ము నా... ఆం. భా. ౨. ౧౨.

౧౧. కొమ్మ, వృక్షశాఖ.

ఉ. అం దొకకొండచేరువ సితాబ్జవనంబులతీరభూమి మా,కందముకొమ్మునన్ బిగియఁ గాళులు రెండుఁ దగిల్చి వ్రేలుచున్, గ్రింద హుతాశనార్చుల నఖేదమునం గబళించి మ్రింగుచు,న్నెందము కాంతి నొంద మహనీయతపంబొకఁ డాచరింపఁగన్. నిర్వ. ౧౦. ౭౧.

సీ. కలఁచుఁ బున్నాగంబు లలరుఁగొమ్ముల మహోన్నతి గలయనభీకమతుల నైన. హ.న.౨.౧౬. (నలార్థమున)

౧౨. చెలువుకొన, కలుఁజు, మఱిగొమ్ము.

వ. సుకుమారుండు చెలువుకొమ్ముదాపలం బట్టుకొని విపినషండంబునడుము గాఁ బక్కణంబునకు దక్షిణంబుగా నొరసికొని పోయి ...శివరా. ౩. ౧౦౨.

గీ. పరమగర్వోన్నతము లురభ్రములు రెండు,చెలువుకొమ్మునఁ గయ్యంబు సేయుచుండె. వేం. పంచ. ౧. ౨౩౨.

౧౩. ఆందోళికాదండము, పల్లకీ మున్నగువానికి ముందువెనుకల నుండుదండె.

సీ. అపరంజిమొసలివాయనుసులశిరసుతోఁ గనుపులు తొమ్మిది గలుగుకొమ్ము,నలసూర్యపటముపొన్నాజెంపుసరిగమేలుకట్టుపనులహెచ్చుపట్టుఁగుచ్చు. రా. వి. ౨. ౪౩.

గీ...ఆందోళికకు సంజ్ఞ యందల మనఁ, గొలుఁదదుభయదండంబు కొమ్మనంగ. ఆం. భా. ౨. ౨౦౧.

(వ్యవ) ఆనవారి ముందుకొమ్ము ముగ్గురును వెనుక కొమ్ము ఇద్దఱును పట్టి మోయుచున్నారు.

గీ. ఈచెలువ నన్నుఁ జేరిన నింక నెపుడుఁ, గొమ్ము దించకయుందు ముదమ్ము విఱ. దశా. ౨. ౨౭౪. (కొమ్ముదించకయుందున్=ఎప్పుడును అందలములోఁ బెట్టి మోయుచునే యుందును.)

౧౪. ఊఁదెడివాద్యవిశేషము.

మ...వేణుస్వనం,బులు గావించుచుఁ గొమ్ము లూఁదుచు...భాగ. ౧౦పూ. ౭౨౫.

క. కొమ్ములనినదమ్ములు శం,ఖమ్ములశబ్దములు...రా. వి. ౫. ౬౦.

సీ. కొమ్ము నా వాద్యభేదమ్ము శృంగ నా...ఆం. భా. ౩. ౫౨.

౧౫. గొండ్లవాఁడు బండము తగిలించుకొనుటకై నడికట్టునకు అమర్చినవంకరకొయ్య. (వా.)

౧౬. బలము, సేన.

క. కొమ్మా దానవనాథుని, కొమ్మావమునకుఁ దొలఁగె గురువిజయము నై,కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ,గొమ్మాభరణములు నీవు కోరిన నెల్లన్. భాగ. ౧౦ ఉ. ౧౮౭.

౧౭. ఉత్సాహము.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు పట్టి,ధరణిద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల, కొమ్ము వీడ సురలకొమ్ము వర్ధిల వాని,కొమ్ము నెఱికి మొత్తి కూల్చె నధిప. భాగ. ౧౦ పూ. ౧౧౪౪.

౧౮. హల్లునకుఁ జేర్చు 'ఉ'కారచిహ్నము.

గీ. కొమ్ముక్రారలు మఱి ద్వివర్ణమ్ము లగుట, వానియె డమని గురువులు వట్రుసుడులు, ప్రాణములు గాన వానిడాపలను గల్గు, నక్కారము లెల్ల లఘువులు నిక్కముగను. అప్ప. ౪. ౪౯.

వాఁడు కొమ్ములు తిరిగినపండితుఁడు = వాఁడు గొప్పపండితుఁడు, పాండిత్యప్రౌఢి గలవాఁడు.

వానికి కొమ్ములు వచ్చినవి = వానికి పొగరెక్కినది.

ఉదా: ఇప్పుడు వానికి కొమ్ములు వచ్చినవి మనతో వాఁడు మాటలాడునా.

చెఱకుఁగొమ్ము = మరల మొక్క యగుటకు నాటెడుచెఱకుముక్క. (వా.)

జ: కొమ్మనఁటి, కొమ్ముకాఁకర, కొమ్ముకాఁడు, కొమ్ముచేఁప, కొమ్ముచోఱ, కొమ్ముటుడుము, కొమ్ముటేనుఁగు, కొమ్ముతేజి, కొమ్ముపెసర, కొమ్ముమాచకమ్మ, కొమ్ములుగలవేలుపు, కొమ్ములుసూపు, కొమ్మువాఁడు.

**కొమ్ముకాఁకర.** వి. (√ కొమ్ము) ఒకజాతికాఁకర, కారవేల్లవిశేషము. (శ. ర, బ్రౌ.)

**కొమ్ముకాఁడు.** వి. (కొమ్ము+కాఁడు) ౧. అగసాలెవాఁడు, కంసాలవాఁడు. ౨. వరాహము, పంది.

సీ. నరకహేతుహిరణ్యాహరణవృత్తిఁ జరించుకొమ్ముకాని భజించుకొదవ లెల్ల. వసు. ౧. ౬౨.
(పైరెండర్థములకుఁగూడ నిది యుదాహరణము.)

క. ఆకొమ్ముకాఁడు తొల్లిటి, యేకలమో కాక యముఁడొ... ద్వా. ౮. ౧౯. (చూ. ౧౭.)

౩. కొమ్మూఁదెడువాఁడు, మాతంగసదృశుఁ డగు నొకజాతివాఁడు.

సీ. మాతంగసదృశుఁ డౌమనుజుండు తగు బోయఁ డనఁగను గొమ్ముకాఁ డనఁగ... ఆం. భా. ౨. ౫౯. (శ. ర, బ్రౌ. పా.)

**కొమ్ముచేఁప.** వి. (√కొమ్ము) ఒకానొకయాఁడు మత్స్యము, శృంగి. (శ. ర.)

**కొమ్ముచోఱ.** వి. (√కొమ్ము) ముఖభాగమందు అంపమువంటికొమ్ము గలచోఱమీను.

క. కరములు ద్రెవ్వినఁ బండులఁ, గరాసి గఱచుకొని కాద్రగతి నని మేషోత్కరముఁ దెగఁ బఱచె నొక్కఁడు, సురవాహినిఁ దఱియుకొమ్ముచోఱయుఁ బోలెన్. సు. సం. ౧౧. ౭౩౬.

**కొమ్ముటుడుము, కొమ్ములయుడుము.** వి. (కొమ్ము+ఉడుము) కొమ్ము గలఉడుము, గోధికావిశేషము.

ఆ. కాలు ద్రవ్వి యునికిఁ గని కొమ్ముటుడుములఁ, గఱచి తిగిచెఁ గొన్ని మొఱసడములు. చంద్ర. ౨. ౪౫.

క. ఒడలుబ్బ నిక్కి ముందఱి, యడుగులు ధర నూఁది చిందునలబలమునకున్, జడియ కొకగబ్బిగండె, క్కుడుకడిమిన్ దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుమున్. మనుచ. ౪. ౫౩.

**కొమ్ముటేనుఁగు.** వి. (కొమ్ము+ఏనుఁగు) పురుషగజము, మగయేనుఁగు.

గీ. కొమ్ముటేనుంగు మొగమైనకొడుకుఁ గుఱ్ఱహర. ౩. ౨౫.

చ. మునుకొని దంష్ట్రికారుచులు ముందటిచీకటినెల్లఁ బాపఁగా, వెనుకఁ దమాలనీలనిజవిగ్రహదీప్తులు చిమ్మఁజీకటిం, బెనుపఁగఁ గొమ్ముటేనుఁగు విభీషణశం జను దెంచు కైవడిన్, దనుజవరుండు వచ్చె... విక్ర. ౫. ౧౮౭.

ఉదా: పండితులలోఁ గొమ్ముటేనుఁగులు సభకు వచ్చిరి. (కొమ్ముటేనుఁగులు = కొమ్ముటేనుఁగులవంటివారు, గొప్పవారు.)

**కొమ్ముతేజి.** వి. (కొమ్ము+ తేజి = కొమ్ములు గలవాహనము) ఎద్దు, వృషభము.

సీ. పులితోలుహొంబట్టుఁబుట్టముల్ గలవారు కొమ్ముతేజుల నెక్కి గునియువారు. గీ... ప్రమథవీరులు గొల్చి రాబాహులేయు. పాండు. ౧. ౧౬౫.

**కొమ్మపెసర.** వి. (√కొమ్మ) ఒకజాతిపెసరకి. (శ. ర.)

**కొమ్మమాచేకమ్మ.** వి. (√కొమ్మ) కొమ్మలు గల మాచకమ్మ. (శ.ర.- స్తనములు వచ్చియు ముట్టురానిది. బ్రౌ.)

**కొమ్ములుగలవేలుపు(ల్పు).** వి. (√కొమ్మ) విఘ్నేశ్వరుఁడు.

చ.... కొమ్ములు గలవేల్పు విఘ్నతరుమూలములం జెకలించుబల్లిదుం, డలగణభర్త యప్పనచివాగ్రణి కీవుత మీప్సితార్థముల్. రాజ.చ.౧.౨.

**కొమ్ములుసూపు.** అ. క్రి. (కొమ్ములు + చూపు) ౧. కొమ్మలువేయు. ౨. ఎదిరించి మార్కొను.

సీ. కుంభోదకముఁ బోసి యంభోజముఖి పెంపఁ జాతంబు కొమ్ములుసూపఁ దొణఁగె. విక్ర. ౪. ౧౨౬. (ఇది రెండర్థములకుఁ గూడ నుదాహరణము.)

**కొమ్మువాఁడు.** వి. (√కొమ్మ) =కొమ్మకాఁడు. (శ. ర.)

**కొయగూర=కొయ్యగూర.** వి. (కొయుగూర- శ.ర.) కొయ్యతోఁటకూర.

క. పెసరుంబప్పేమిటికని, కసరు న్నెయి గొనఁడు పండుగను గొయగూరే, కొసరుం బలుచని చల్లయె, మెసరుం గనఁ డతనిలోభమున కేమందుక్. బహులా. ౫. ౭.

గీ... కొయ,గూర చక్రవర్తము చిల్కకూర గోళి, కూర... హంస. ౪. ౧౩౩.

**కొయ్య.** వి. (√కోయు?) ౧. కఱ్ఱ, దారువు.

వ... నెల్లికొయ్యలు ద్రచ్చి నుచ్చులంటించినక్ బెచ్చువెరుఁగుచిచ్చు లాత్రంపులక్ దవిలించి చిముడ నుడికిన వెలువరించి... మనుచ.౪. ౬౦.

సీ. తసరుఁ గొయ్య యనంగ దారుసమాఖ్యయై... ఆం. భా. ౨. ౩౭.

ఆ. కొయ్యబొమ్మ తెచ్చి కొట్టిన గుణి యౌనె... వేమన. ౨. ౧౩.

౨. స్తంభము, గుంజ.

ఉదా: ఓడకొయ్య, కట్టుఁగొయ్య, మొ.

౩. (=కొయ్యకాలు) కోఁతకోసినవరి మున్నగు సస్యములమ్రోడు.

గీ. వాడఁబాఱినయవి వక్రవనరుహములు, భాజనంబులలోన నిప్పచ్చరంబు, మీకు భిక్షాన్నములు లేమి నాకుఁ దెలిసెఁ, జేలపంటలఁ గొయ్యలే చెప్పఁ గాదె. కాశీ. ౭. ౧౮౩.

౪. దంతము, పల్లు. (ఈయర్థము పాములవాడుకలోనిది-అని బ్రౌ.)

గీ. కొయ్య లూడినపెండ్లికొడుకుకుఁ దెలినవ్వు విపినమండలిఁ గాయునెన్నె లయ్యె. వేం. పంచ. ౩. ౧౭౫.

విశే. మొద్దు, మూర్ఖుఁడు.

ఆ. ఆలుబిడ్డ లేనియట్టిత్రిమ్మరి యగు, కొయ్యగాక కుదుటఁ గూడునెట్టి, కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి చూతు రయ్య. భార. ఉద్యో. ౨. ౯.

ద్వి. మాయలు పన్నక మాదిగకొయ్యఁ, జూపుము చూపు మెచ్చోట డాఁచితివో. పండితా. దీక్షా. ౪౫ పా.

వినుపరానికొయ్య=వినిపింపరాని మొద్దు, చెప్పిన మాట విననికఠినహృదయుఁడు. (వా)

కొఱుకరానికొయ్య=కఠినహృదయుఁడు. (వా)

విఱుగఁబాటుకొయ్య=గర్వశీలుఁడు. (వా.)

గుండగొయ్య=దుష్టుఁడు. (శ.ర-మొండివాఁడు, మూర్ఖుఁడు. బ్రౌ.)

జ: కొయ్యకాలు, కొయ్యగండ, కొయ్యగూర, కొయ్యబోడు, కొయ్యతనము, కొయ్యనగాఁడు.

**కొయ్యకా(గా)లు.** వి. (కొయ్య+కాలు) కో-

న్న వరి మున్నగుసస్యములు కోయఁగా మిగిలిన మ్రోడు.

సీ... చేలపంటలు కొయ్యకాలె తెలుపు. రామ లిం. ౫౩.

**కొయ్య(య)గండ.** వి. (కొయ్య + కండ) కన్ను లు మున్నగువానియందు పెరుఁగుదుర్మాంసము. (వా.)

**కొయ్యగూర, కొయ్యతోఁటకూర = కొయ గూర.** వి. (కొయ్య + కూర=ఒకవిధ మగుతోఁట కూర. బ్రౌ. కోయు + కూర=కొయ్యగూర. శ. ర.)

ఆ. కొయ్యగూరవేళ్లు కొమరు మించినపాట్లు, వేళ్లు వేలువేల వేఁడినీళ్లు, నూతి... చికి. ౨. (చి. ని.)

సా: కొయ్యతోఁటకూరకును సిగ్గులేదు కొడవటి కిని సిగ్గులేదు. (కలహించుకొనినమనుష్యులు మర లఁ గలసికొన్నప్పుడు ఆక్షేపార్థ ముపయోగింపఁ బడుసామెత.)

**కొయ్యజోడు.** వి. (కొయ్య + జోడు) బొండ, ద్రు పదము. (బ్రౌ.)

**కొయ్యతనము.** వి. (√ కొయ్య) ౧. ధార్త్యము, దౌష్ట్యము.

గీ. గోపికలఁ గృష్ణుఁ డలయించుకొయ్యతనము. ధనా. ౨. ౭౬.

గీ. కొయ్యతనమునఁ గోపించుఁ గొంతతడవు. వ రాహ. ౧౧. ౮౬.

౨. దుష్టచేష్ట, కొంటెపని.

గీ. పట్టనములోన నీవు దర్పమునఁ జేయు, కొయ్య తనములు వీక్షించి కూర్మితనయ, నవ్వుదురు నిన్ను మొదల నానావిధముల, నవ్వుదురు దీక్షి తుని ననంతరమ జనులు. కాశీ. ౪. ౯౪.

**కొయ్యనగాఁడు=కొయ్య.** విశే. (√కొయ్య.) (మూఢుఁడు)

ద్వి. కొఱగానిజఱిభులకొయ్యనగాండ్ర, గొజ్జియల వార్తలు గూడునే త్రవ్వ. బస. పు. ౫. ౯౧ ౦.

**కొరటబండి.** వి. సివ్వంగులను దెచ్చెడుబండి.

ఉ. పన్నినసన్న పుం గొరటుబండ్లపయిన్ గొనివ చ్చుసివ్వఁగుల్. ఉదయనోదయము. ౩. ౮౩.

**కొరడా.** హిం. వి. చబుకు, జాటి.

క. రూకలకోమటికొడుకా, పోకలఁ బోమెదవ దేల పోరా పోరా, నీకుం గత్తె కొరడా, చే కొని కొట్టింతుఁ గొంటె చెనఁటి గరాసా. అ హ. ౧. ౧౦౦.

**కొరడు**[1]. వి. (క. కొఱడు, కొరడు) వంకరగాఁ గాక ఋజువుగా నుండుశాంద్రకమున్న, రోహి తము.

గీ. గుండె లవియ మింటఁ గొరడు వోఁచె. మై. ౨. ౪. ఆం. భా. ౧. ౮౨.

**కొరడు**[2]. వి. పక్షివిశేషము. ('గ్రుడ్లగూబ' అని శ. ర.)

సీ... ఆడెలు తొగ గిజిగాఁడు కొరడు. సువ. ౩. ౧౯౪.

**కొరద.** వి. మత్స్యవిశేషము.

సీ. కొరదయుఁ గడిసె పాపర మట్టు మచ్చంగి... వేం. పంచ. ౧. ౨౯౪.

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీ నులస మచ్చంగి బేడిస జెల్ల చాఱమీను. హంస. ౪. ౧౭౮. (శ. ర. పా.)

**కొరనాసిగండు=కొర్నవగండు.** వి. క్రూరమృగవిశే షము, దుమ్ములగొండి. (శ. ర, బ్రౌ.)

**కొరవంజి.** వి. (ఇట్లు దీనిని లఘురేఫముతో చి. వి, శ. ర- √ కొఱవ ?. క. కొఱవంజి=కొఱవజాతి స్త్రీ. త. కుఱవంజి=కొఱవజాతిస్త్రీ.) ౧. ఎఱుకుసాని; ఎఱుకువాఁడు, కిరాతుఁడు.

శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ మావ లావణ్యాశే, ఖాయుక్తిం దగుకొమ్మ లెందుఁ గ ల రీక్ష్మామండలిన్... శుక. ౧. ౧౮.

గీ. వేయు నేటికిఁ దరిమలవెండికొండ, లావినున్న

లికడఁగట్టు తావులందు, నప్పసం బుప్పతిల్లుచు
మెప్పుఁ గన్న, యట్టికొరవంజు లెల్ల మానుట్టె
లయ్యె. ప్రబంధ. ౧౬౦.

క. పాదనుండి రొప్పు బెబ్బులి, కొదమం జే యిచ్చి
పిలిచి కొరవంజి యొకం, డదరక కను చెదరక
మది, బెదరక పదరకయ కుఱుచపి డెమునఁ గెడ
పెక్. చంద్రా. ౨. ౯౦.

౨. ఎఱుకలు చేయు నాట్యము; నాట్యవిశేషము.

క. ఎఱుకో యెఱుక యటం చుం, గొరవంజి నటిం
చె నొక్కరుడుపుచ చంకక్, బురుడుఁడు బం
గరుబుట్టియు, సారిదిం గొల్లాపురమ్మనుద్దులు
వెలయక్. దశా. ౭. ౧. ౭౮.

సీ. చలుపుచున్నది ప్రోడజాడలఁ గొరవంజి యలతి
లోత్తమ నృత్యనిలయసీమ. కవిరా. ౩. ౭౮.

**కొరవి.** వి. (సం. కురవకః) ఎఱ్ఱగోరంట, కురవకముక్.

సీ...కొరవి నాఁ గ్రోవి నాఁ గ్రొమ్మి నాఁగఁ, గుర
వకనామ మా...ఆం. భా. ౨. ౫౩. పి.శకుం.
౨. ౧౩౭. కాశీ. ౧. ౧౩౭.

**కొర్నవగండు**=కోర్ణగండు, కొరనాసిగండు. వి.
క్రూరమృగవిశేషము, దుమ్ములగొండి.

చ...చెవులపోతులు కొర్నవగండ్లు... కస్తురిపిల్లు
లాదిగాఁ, గలమృగరాజి ... కానుక లం పెఁ
దంద్రికిక్. కాశ. ౩. ౪౭.

**కొఱ[1]**=కొఱఁత. వి. (త. కుఱై) ౧ కొఱఁత, తక్కు
వ, లోపము, న్యూనత.

సీ. ... కొఱ యన నొప్పు తక్కువ చెలంగు. ఆం.
భా. ౩. ౪౬.

౨. శేషము, మిగులు.

క. ముఱిముఱి చీకటిలో నం,దఱు రాజులు సమర
ముడిగి తగ నెల్లిటికిం, గొఱ గలకల నగు నడు
వుఁడు, నెఱ వగుగోవర్ధనాద్రి నేలకు నను
చుక్. ఉ. హరి. ౪. ౨౭౨.

విశ. (చూ. కొఱయగు) ౧. చిన్నది; తక్కువయై
నది, అల్పము.

సీ. మునులభార్యల దోఁచుకొని పురోడాశంబు మె
క్కి వేదులు గొఱచక్కలాడి. వరాహ. ౫.
౧౧౫. (కొఱచక్కలాడి=చిన్నచిన్నముక్క
లు చేసి.)

రగడ. కొఱవివేక మగుఁ గొరవిక్ నన గొన.ఇందు.
౩. ౩౫. ప్రబోధ. ౫. ౧౭.

కొఱనెల=అర్ధచంద్రుఁడు, బాలచంద్రుఁడు. నవ
నాథ. ౨. ౭౯పా. ౧౧ పం.

కొఱనెలతూపు=అర్ధచంద్రబాణము.

చ. ... మహుదైత్యహరుండు మహేంద్రుశింజినిం,
గొఱనెలతూపునం దునిమి...పారి. ౫. ౩౧.

కొఱనోము=అల్పవ్రతము.

కొఱనోమునోఁచు=అల్పసుకృతము చేయు,తక్కు
వపుణ్యము చేయు.

గీ. జగతిఁ గొఱనోమునోఁచినజలజముఖుల,కూరిమి
గణించి యతఁ డేల గారవించు.వసు.౪.౧౧౧.

జ: కొఱనవ్వు, కొఱప్రాణము, కొఱవోవు, కొఱ
సంది.

**కొఱ[2].** వి. ౧. శ్రేయస్సు, మంచి, మేలు.

క...ఏ, మోయి యిది నీకు మంచిదో,కో యాఁడుది
యునురుమన్నఁ గొఱ గాదు సుమీ. సారంగ.
౨. ౧౨౩.

క... పెం,గట్టడవి కయిన వెడలం,గొట్టింపును చే
యవేని గొఱ గాదు సుమీ. నీలా. ౨. ౬౦.

౨. వ్యాపారము, చేష్ట.

ద్వి. కంతునికొఱ రోసి కన్నులు మూసి,చింత లో
క్కటిచేసి శివుఁ దలపోసి. ద్వి. హరిశ్చ. ఉ.
౬౩ పం.

౩. ప్రయోజనము, పని.

సీ. ... కొఱ యనఁగాఁ బని... అప్ప. ౨.౯౩౭.

(చూ. కొఱమాలు, కొఱముట్టు, మొ.)

౪. శిల్పము. (శ. ర.)

సీ. కొఱ మించుపగడంపుగుంద్రగంబంబులు ...
అచ్చ. రా. అయో. ౪. ౪.

౫. అందము, ఒప్పిదము.
మణిగణనికరము. కలువలదొర కొఱగలతలవిరిగా ...మలయుచు జగముల మనుచునొడయఁడా. అచ్చ. రా. అయో. ౧౯౯. ఆం.భా. ౩.౭౬.

విణ. ౧. ప్రయోజనకారి, ఉపయోగకరము, పనికి వచ్చునది.

క. జవ్వనముం గలపుడు వెల, పువ్వుంబోడులకు ద్రవ్యములుగా కకటా, యెవ్వారికిఁ గొఱ యగుదురె, దవ్వై ప్రాయంబు చనినతతి నెలపడఁతుల్. పరమ. ౩. ౨౭౭.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల. మనుచ. ౨.౫౬.

౨. ప్రియము, మనోహరము.

క. ... నీకున్, మడవక మాయట్టివారిమాటలు కొఱయే. భార. సభా. ౨. ౧౯౦.

క. తమ్ములదొర కైరవజా,తమ్ములచెఱ చక్రసంయుతమ్ములకొఱ...తపనుఁడు పొడమెన్. రా.వి. ౧.౭౦.

మ. ... గుబ్బచన్నులు గుల్కించు మెలంతలున్ సొగసుకాండ్రున్ గూడ నానాటపాటలవాండ్రుం గొఱ గాక రాజులకు నిస్సారవంతు లౌత జ్ఞ లేల...మల్లభూ. ౩.౫౬.

౩. శ్రేయస్కరము.

వ. ...గురుభృత్యసామంతకాంత లగమ్యలు విష్ణుండు సర్వలోకగురుండు తత్పత్నీహరణప్రయత్నంబు కొఱ గాదు...వరాహ. ౧౧. ౫౭.

క. తలచుగ మెకములఁ బొరిగొను,మఱపున వచ్చితిమి దవ్వు మనపాల మిట కి, త్తతి నగునిమిత్తములు నృప,కొఱ గా విచె మనకుఁ బెద్దగొడ వగు ననినన్. మనుచ. ౪. ౬౩.

౪. అర్హము, యుక్తము.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం,తలవారితో న తగు నధి, కులహీనులతోడనైనఁ గొఱ గాదధిపా. భార. ఉద్యో. ౨. ౭౬.

క. ఈరీతిని మద్వల్లభుఁ, గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండఁగ, సైరించుట కొఱ గా దిది, రా రమ్మిఁక నోర్వఁ జుమ్ము రావే యనుచున్. కళా. ౩. ౧౯౧. శుక. ౨. ౫౯౯.

౫. సమర్థము, చాలినది.

చ. ఒకఋషిచేత నాయుధసమస్కారమెల్లను సప్రయోగమం, త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱ యైనవాఁడ... భార. విరా. ౩. ౧౫౦.

మ. సకియా నీమదిలోనికోరిక ఘటించన్ లేక మోహాబ్ధిపై,లకుఁ జేరం గొఱ గాక పంచపటిఁజుట్లం జెట్టునా మీఁదికి, న్కకు నీకున్ సమయంబె...చం. రా. ౫.౭౦.

కొఱగానివాఁడు=అప్రయోజకుఁడు.

సీ. అప్రయోజక సంజ్ఞ యలరుచుండును గొఱగానివాఁ డనఁగఁ గిగ్గాడి యనఁగ. ఆం.భా.౨.౨౭.

జ: కొఱకు, కొఱగామి, కొఱమాలు, కొఱముట్టు.

కొఱ[3]=కొఱ్ఱ[2]. వి. పాఠీనము, ఒకజాతిచేప.

సీ. కొఱ కొఱ్ఱ యనఁగను బరఁగుఁ బాఠీనంబు... ఆం. భా. ౧. ౧౬౦.

కొఱఁకు=కొఱను. వి. బీడు, విహీతము.

గీ...కొఱఁ కనంగను బీడు నాఁ గొఱ ననంగఁ, గంచె యన నప్రహతభూమి కాఖ్య లెసఁగు. ఆం. భా. ౨. ౬.

కొఱఁత[1]=కొఱ[1]. వి (త. కుఱై)తక్కువ,లోపము.

ఆ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు,గురువ యింక నొక్క కొఱఁతయు లే దిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగా రవమున. భార. విరా. ౧. ౨౫౩.

సీ. ఎక్కువదక్కువ లెన్నండు నొందక నిర్గుణత్వంబున నెఱయుఘనుఁడు, గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు మనుకేళి చొ

**కోఁడు.** స. క్రి. బియ్యము మొదలగువానిని చేట లోఁ బోసి ప్రక్కవాటుగా ఇటు నటు త్రిప్పు.
చ...కపర్దికొనలు చూఁడుచుం దనుజాప్రేవులు దోఁడుచు గాడ్పుకడ్పులో, గునుకులు గోఁడుచు న్వరుణుగుండియఁ దేఁడుచు...కకు. ౫. ౧౩౩. (గునుకులు=ధాన్యవిశేషము. గునుకులుగోఁడుచున్:-బాధ కలిగించుచు.)

**కోఁత.** వి. (√కోయు.) ఛేదనము, ఖండనము; హింస, బాధ.
క. వెడగోఁతల నెత్తు రొలుకఁ, బడఁ ద్రోచిన వచ్చి కుక్కపదుపు వెనుకకున్, జడిసెఁ గబళింప నొల్లక...భార. శాం. 3. ౫౦౭.
ద్వి. కమలాక్షి తుచ్ఛభోగముల కాసించి, యను నిచేఁ గోఁతల కమ్మ నే నోర్వ. ద్వి. సారం గ. ౧. ౭౭ పా. ౨౨ పం.
(వ్యవ) అత్తగారికోఁతలు ఆమె పడలే కున్నది.
కోఁతపట్టు=కోఁతకోయ నారంభించు.
(వ్యవ) వారిచేను మొన్ననే కోఁతపట్టినారు.
కోఁతకువచ్చు=కోసెడిపదనికి వచ్చు.
(వ్యవ) ఇంక నెలకుఁ గాని యీచేను కోఁతకు రాదు.

**కోఁతప(వ)డు.** అ. క్రి. (కోఁత+పడు) ౧. ఖండితమగు, నఱకఁబడు.
సీ. ఎచ్చోట ముచ్చిచ్చు నేడేసినాల్కలు కొండ నాల్కలదాఁకఁ గోఁతవడియె. భీమ. 3.3౭.
క. ఏయంగము గొని శూద్రుఁడు, పాయక విప్రునకుఁ దాను బాధకుఁ డగు వాఁ, డాయంగము కోఁతపడక, పోయెద నన రాదు తనకు భూపతిచేతన్. విజ్ఞా. ప్రా. ౮౭.
౨. హింస నొందు, బాధిత మగు.
గీ. కుపితమానసుఁడై పృథా కోయఁ బనిచె, నకట యిటువంటికువిభుఁ డెందైనఁ గలఁడె, కాలుచేఁ గోఁతపడలేక కడకుఁ దొలఁగఁ, గాలు చేఁ గోఁతపడఁజేసె నాలతాంగి. సారంగ. 3. ౧౨౦.

**కోఁతి=క్రోఁతి.** వి. (క. కోతి. త. కోంది) ౧. మర్కటము, వానరము.
సీ. కోఁతికి జలతారుకుళ్లాయి యేటికి విరజాజి పూదండ విధవ కేల. రామలిం. 33.
సీ. కోఁతి కొబ్బెరకాయ కొన కెక్కి పడఁద్రోయు దానిజలంబు లు ద్రావఁ గలదె. రామలిం. ౧౭.
ఉ...అకట కోఁతికి మానిక మేల...దశా. ౧. ౭౯౫.
సా: కులమింటికోఁతినైనను పెండ్లాడుట మంచిది(:-అందము లేకపోయినను కులీనురాలిని పెండ్లాడుట శ్రేష్ఠము.) తాఁ జెడ్డకోఁతి వన మెల్లఁ జెఱచినట్లు(:-తాను చెడుటయే కాక తక్కినవారిని కూడ చెఱచుటను దెలుపును.) కోఁతిపుండు బ్రహ్మరాక్షసి యైనట్లు(:-చిన్నకష్టము పెద్దకష్టముగా పరిణమించుటను దెలుపును.) కోఁతికి కొబ్బెరకాయ దొరకినట్లు(:-అనుభవింప లేనివానికి అనుభవయోగ్య మగుపదార్థము దొరకుటను దెలుపును.) నిప్పు ద్రొక్కనకోఁతికి నిప మెత్తినట్లు(:-స్వభావముచే చపలుఁ డైనవానికి మత్తి యొకచాపల్యకారణము గలుగుటను దెలుపును.)
చ...నిప్పు ద్రొక్కుకోఁతికి నిప మెత్తుచందమది త్రిప్పుట కేరితరంబు భూవరా. రంగా. ౨. ౨౨౬.
జ: కోఁతికొమ్మంచి, కోఁతిగుమ్మకట్టు, కోఁతిపుల్లలు, కోఁతిమామిడి.

**కోఁతికొమ్మంచి.** వి. (√కోఁతి) బాలు రాడెడి యొకయాట. (బ్రౌ, వా.)

**కోఁతిగుమ్మకట్టు=కోఁతికొమ్మంచి.** (బ్రౌ.)

**కోఁతిపుల్లలు.** వి.బ. (√కోఁతి) మగ్గపుపలకదారములను మీఁదికిఁ దగిల్చెడిపుల్లలు.(శ. ర, బ్రౌ.)

**కోఁతిమామిడి.** వి. (√ కోఁతి) కపీతనము, అంబాళముకీ. (దీనిపండ్లు కోఁతికి ప్రియములు.)

**కోఁదాము.** వి. జా. తాళవృక్షవిశేషము.

సీ. ముక్కు-దాడిమ బీజ మొగలింగ కోఁదాము ...హంస. ౪. ౧౧.

సా: ఈఁదా డన్నచోఁ కోఁదా డనుట=ఎమరెత్తుగా ప్రవర్తించుట. (చూ. ఈఁదాము.)

**కోక.** వి. వస్త్రము, బట్ట (వాడుకయందు స్త్రీవస్త్రపర్యాయమై యున్నది.)

ద్వి. కోక లుడుకుచుఁ జాకి క్రొవ్వి...బస. పు. ౪. ౧౦౧ పా. ౪౦ పం.

గీ. ఇట్లు వర్తించియును నాతఁ డేమియందుఁ, గళవళముఁ జెందెఁ గూడుఁ గోకయును లేక. శుక. ౩. ౩౮౫.

గీ. అపుడు గుణభామ చిత్రాంగి యలమి బలిమి, నొడిసి పట్టినఁ బైకోక విడిచి చనియె. సారంగ. ౨. ౧౩౨.

సీ. కులటలఁ గూడదు తొలఁగనీయదు పైఁట మీఁగాళ్లపైఁ గోక మెలఁగనీదు. దశా. ౧౦. ౧౦౯.

**కోకదేవము.** సం. వి. అ. పుం. పావురము. (రా. ని.)

**కోకనదము.** సం. వి. అ. న. ౧-చక్రవాకములను కూయునట్లు చేయునది-చెంగలువ, ఎఱ్ఱకలువపూవు. ౨. చెందమ్మి, ఎఱ్ఱతామరపూవు. (మే. ని.)

**కోకము.** సం. వి. అ. పుం. ౧. జక్కవ, చక్రవాకము. ౨. తోఁడేలు. ౩. కప్ప. ౪. ఈఁతచెట్టు.

**కోకిలము.** సం. వి. అ. పుం. ౧. పికము, కోయిల. (నైష. ౪. ౨౦.) ౨. కొఱవి. ౩. ఛందోవిశేషము.

**కోకిలాక్షము.** సం. వి. అ. పుం. ములుగొలిమిడికీ.

**కోకిలావాసము.** సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**కోకిలేక్షువు.** సం. వి. ఉ. పుం. నల్లచెఱుకు కీ.

**కోకిలోత్సవము.** సం=కోకిలావాసము.

**కోగెల**=కోయిల², కోవెల². వి. (సం. కోకిలః. తు. కోగిల్) పికము, వనప్రియము. (చి. ని, శ. ర.)

**కోచము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంకుచిత మగునది, ముడుఁగునది. ౨. సంకోచింపఁ జేయునది, ముడుఁగఁ జేయునది. వి. అ. పుం. సంకోచము, ముడుఁగుట.

**కోచే.** వి. జలజంతువిశేషము. హంస. ౪. ౧౯౬.

**కోచుఁడు.** సం. వి. అ. పుం. జాలరివానికి కటికదానియందు పుట్టినసంకీర్ణజాతివాఁడు.

**కోజాగరము.** సం. వి. అ. పుం. ఆశ్వయుజపూర్ణిమ. (కోజాగర్తి=ఎవఁడు మేలుకొని యున్నాఁడు? అని లక్ష్మి ఆనాఁటిరాత్రి ప్రశ్నించును-కల్ప)

**కోట.** వి. (సం. కోటః. ప్రా. కొట్ట, కోట. క. కోటె) ౧. దుర్గప్రాకారము, రాజధానిచుట్టునుండు ప్రహరి.

గీ. అమరు హాటకమయకవాటములతోడ, గుణతరం బైనయవ్వీటికోటగవను. నైష. ౨. ౪౨.

సీ...ప్రాకార మగుఁ గోట యన ... ఆం. భా. ౨. ౧౨.

౨. చుట్టును ప్రాకారము కలిగి రాజవాసస్థాన మగుపురము.

సీ. కోట యేమఱి కెప్డుఁ బాటించి గడ్డియు ఖాణంబు గొల్చును గట్టియలును, నేయి నూనెయును నానాయుధమ్ములు నౌషధములు నాభీలయంత్రములుఁ గూప, ములు లోనుగానందు వలయువాని సమగ్రములుగ సంపాదించి...భార. శాం. ౨. ౨౯౪.

పెట్టనికోట=కట్టక యేర్పడినకోటవంటిది, అయత్నముగా లభించినరక్షణసాధనము.

ఉ. పెట్టనికోట నీకు హరి....భార. ఉద్యో. ౧. ౨౯౭.

తరల. వినుము కౌరవకోటికిం దనవిల్లు పెట్టని
కోటగా, నని యొనర్చి....భార. స్త్రీ. ౨.
౧౭౪.

కోటకొమ్మ=దుర్గ ప్రాకార శిఖరము.

గీ...పొల్పుఁ జూడఁ, బట్టనముకోటకొమ్మలపం
క్తి గగన, మండలశ్రీకి సంపంగిదండవోలె.
ఆము. ౨. ౫.

గీ...చెలఁగి కోట, కొమ్మలం దాడుతెఱఁగంటికొ
మ్మ లిడెడు, వేల్పుదొరవమానికములు నవ్వీటఁ
దనరు. నీలా. ౧. ౩౧.

**కోటఁడు.** వి. (త. కోట్టాన్.) గ్రుడ్లగూబ.

క...కోటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మం బ
య్యెన్. వేం. పంచ. ౩. ౩౪౧.

ఉ. ఘుక్కని మాటిమాటికిని గోటఁడు బల్కెడు
వామదిక్కునం, జొక్కటమై ఫలించు మన
శోభనకార్యము లెల్లఁ డిట్టిభా. క్రీడా. ౫౧.
ఆం. భా. ౨. ౯౧.

**కోటకుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకసంకీర్ణజా
తివాఁడు. (వీనికి గృహకారకత్వము వృత్తి.)

**కోటము.** సం. వి. అ. పుం. ౧. దుర్గము, కోట.
(కల్ప.) ౨. కౌటిల్యము, కుటిలత.

**కోటర(ట్ర)ము=కోడంట్రికము.** వి. (√ కో
డలు.) కోడలితనము.

(స్నుషాత్వము, కోడంట్రికము.)

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ
జేసె నమ్మహా, పురుషునిపాలికిన్ బతులు వో
వఁగ వీరలతోన యేను జె, చ్చెరఁ జని కో
టరంబు దగఁ జేయుదునో యటుగాక పాడి
మై, పరవుడ మోపి చేయుదునొ వారికి మా
ధవ నిశ్చయింపుమా. భార. ఉద్యో. ౩.
౧౧౨.

సీ. వైవాహిక క్రియావ్యసనంబు గొన్నేండ్లు గొ
న్నేండ్లు కోడంట్రకోట్రములును. వి. పు.
౫. ౧౮౭.

ఉ. రాయిడికత్తె పైనపెనుఁద్రాణిడియత్తలయిం
డ్లఁ గోట్రముల్, సేయఁవిలాసిను ల్మనకు
సెందఁగ...విక్ర. ౬. ౭౩.

**కోటరము.** సం. వి. అ. పుం. న. నిష్కుహము,
చెట్టుతొఱ్ఱ.

**కోటరావణము.** సం. వి. అ. న. తొఱ్ఱలున్నచె
ట్లు గలయడవి.

**కోటరించు=**కోరాడు.

(పంది ముట్టెతో నేల కెల్లగించు.)

సీ. చిఱుతలై గురుతరస్థితి రొప్పి కప్పింపఁ
గోలమై లీలమైఁ గోటరించు. ల.వి.౨.౧౦౨.

**కోటటికము=**కోడంట్రికము. వి. (√ కోడలు.)
(కోడంట్రికము, స్నుషాత్వము.)

చ. పలుకుఁబడంతి యేయువిధపజ్జలఁ గోటటీకం
బు సేయు. రామా. ౧. ౨. (శ.ర.పా)

**కోటవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దిసమొలగలయాఁ
డుది, నగ్నిక. ౨. దుర్గాదేవి. (కల్ప)

**కోటానఁగోటులు.** వి. బ. (కోటులు + కోటు
లు-శ. ర.) పెక్కుకోటులు.

క. కాటుకకొండలకైవడిఁ, గోటానంగోట్లు మిం
ట ఘూర్ణిల్లుచు సం,స్ఫోటించు మేఘగణములు,
గాటంబుగ వృష్టి గురియఁ గరఁగి జగంబుల్.
మత్స్యపురాణము. ౨. ౩౧.

క. హాటకములు దక్షిణగాఁ, గోటానంగోటు లొ
సఁగి కుంభిని యెల్లం, బాటించి ధారవోసె
ను, హాటకగర్భప్రభావుఁ డగువరరుచికిన్.
విక్ర. ౫. ౧౩౦.

సీ. కొండలు వ్రాఁకులుఁ గోటానఁగోటులు వృథి
వి బీఁటలువాఱఁ బెలుకువారు.భా. రా.యు.
౨౬౩.

**కోటి**[1]. వి. (సం. కోటిః.) నూఱులక్షలసంఖ్య.

(ఈక్రింది ప్రయోగమునుబట్టి తెనుఁగుపదముగా గ్రహింపఁబడినది.)

క. లేడవఁగ వసమా యందుల, నెడపనిసిరు లేరికైన నెఱుఁగఁగ వచ్చున్, నోడువక కోటికి నెత్తిన, పడగలచేఁ గోమటిండ్లబంగరుమళిగల్. యయా. ౧.౭౭.

కోటికిఁబడగయెత్తు = కోటీశ్వరుఁడైనట్లు జెండా యెత్తుకొను, ధనాఢ్యుఁడగు; ఘనుఁడగు.

క. అన నిట్టిపలువయఅపుల,కును గోటికిఁబడగ యెత్తి గుఱి యగుపెద్దన్, నిను నమ్మరాదుగా కట్లొనరిచితే నిట్టిలంచ మొసఁగనె నీకున్. కళా. ౭. ౨౭.

**కోటి².** వి. వేగు, చారుఁడు.

కోటియిడు=చారుల నియమించు.

క. చెడ విఱిగి యడవిఁ బడి యెడ, నెడ గట్టులతుదలఁ గోటియిడి లోఁగడకున్, దడుకు వొడిపించి యాకుల,గుడిసెల వసియించె మంత్రి గురుభటయుతుఁడై. ఆము. ౩.౧౭.(శ.ర.పా.)

జ: కోటికాఁడు.

**కోటి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. కోణము, అంచు. ౨. అగ్రభాగము, చివర. ౩. చాపాగ్రము, వింటికొప్పు. ౪. అతిశయము, పెంపు. ౫. సంఖ్యావిశేషము, నూఱులక్షలు. ౬. వర్గము, సముదాయము. (ఉదా: మనుష్యకోటి, ప్రాణికోటి, మొ.) ౭.వాదమునందు ఒకపక్షము. (ఉదా: పూర్వపక్షకోటి. కల్ప.) ౮. (గణిత.) భుజకర్ణభిన్న మగుక్షేత్రావయవరేఖా భేదము.

**కోటికాఁడు.** వి. (కోటి² + కాఁడు-స్వార్థమున.) వేగువాఁడు,చారుఁడు. (శ. ర.)

**కోటిజిత్తు.** సం. వి. త్. పుం-పండితకోటిని జయించినవాఁడు-కాళిదాసకవి.

**కోటిపాత్రము.** సం. వి. అ.న. కేనిపాతము, త్రెడ్డు.

**కోటిరము.** సం. వి. అ. పుం. ౧.జటాజూటము,బుషులు తలపై కొమ్మువలె వేసికొనుజడలముడి. (ఆ.ని.) ౨. నకులము, ముంగిస ౩. ఇంద్రగోపకీటము, ఆరుద్రపురుగు.

**కోటిరుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**కోటివర్ష.** సం. వి. ఆ. స్త్రీ. స్పృక్క యనుగంధద్రవ్యము.

**కోటిశము.** సం. వి. అ. పుం. మట్టిగడ్డలు పగులఁగొట్టెడికొయ్య, లోష్టభేదనము.

**కోటీరము.** సం. వి. అ. పుం. ౧. కిరీటము,బొమిడికము. ౨. ఋషులు శిరసున కొమ్మువలె వేసికొను జడలముడి, జటాజూటము.

శ్లో. పాణౌ ఫణీ భజతి కంకణభూయమైశే,సోయం మనోహరమణీరమణీయముచ్చైః,కోటీరబంధనధనుర్గుణయోగపట్ట, వ్యాపారపారగమముం భజ భూతభర్తుః. సం. నైష. ౧౧. ౧౭.

**కోటీశము.** సం=కోటిశము.

**కోటేరు.** వి. విపరీతబద్ధలాఁగలము,దుక్కికి పోవునపుడు గాని దుక్కియై మరలివచ్చునపుడు గాని పణత మీఁదుగా కాఁడికి తగిలించిననాఁగలి. (దీనిని కవులు చక్కనిసొగముక్కున కుపమానముగా గ్రహింతురు.)

సీ. కోటే రనంగను గొఱులు విపర్యయబద్ధలాంగల సంజ్ఞ...ఆం. భా. ౨. ౨౩౨.

ద్వి. మీఁదైనయెద్దులమెడకాఁడిమీఁదఁ, గోటేరు నైచి...పరమ. ౭. ౫౩౧ పా.

క. కోటేరు నెట్టిన ట్లా,పాటీరసుగంధినాస భాసిలు ననఘా. ఇందు. ౨. ౧౬౪.

సీ. మీ టేరుపడి మంచికోటేరు నెట్టినముదుపు చూపట్టెడుముక్కు మెక్కు. వాల్మీకి. ౩. ౧౧౭.

**కోట్టము.** సం.వి.అ.పుం.దుర్గపురము.(అమరసుధ.)

**కోట్టారము.** సం. వి. అ. న. ౧. దుర్గపురము. ౨. పావంచ, కొలనిమెట్టు. ౩. నూయి. (విల్యమ్సు.)

**కోరము.** సం. వి. అ.పుం.మండలాకార మైనమచ్చలు కలిగెడు ఒకజాతికుష్ఠరోగము.

**కోరరము.** సం. వి. అ. పుం. అంకోలము, ఊడుగుచె.

**కోరరపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. వృద్ధదారకము, బొద్దిచె.

**కోడ.** వి. ఒకవిధమగు నాఱు.

సీ. నాఱటంచనఁగను మీఱు వాప్యాంకురావళి కోడయనఁగను బొలుచుఁ దద్వి,శేషనామంబు....ఆం. భా. ౨. ౩౫.(బ్రౌ.పా.)

**కోడంగి**=కోణంగి. (క. కోడంగి.)

ద్వి. కోడంగిగతి బాలుఁ డాడు మనంగ, వేడుక మతిఁ దొలఁకాడంగ నాడు. పండితా.పురా. ౧౬౬ పా.

**కోడంట్రము**=కోడంట్రికము. వి. (√ కోడలు.) (కోడట్రికము, కోడలితనము, స్నుషాత్వము.)

క...ఓ,రమణీమణి నీకోడం,ట్రము నెఱుఁగరు వారు యోగరసనిశ్చలతన్. కళా. ౭. ౪౯. ఆం. భా. ౨. ౧౧౧.

**కోడంట్రికము**=కోడంట్రము, కోడట్రికము, కోటట్రికము, కోటరము. వి.(√ కోడలు) ౧. కోడలితనము, స్నుషాత్వము.

క...సకి నాతనుజునకు నీవు సతివై కోడం,ట్రికమెపుడు చేసితివి నీ,మొకమే నే నెఱుఁగఁ దెల్పుము నిజంబు...ఉ. రా. ౪. ౨౦౬.

౨. కోడలిని అత్తవారు పెట్టుబాధ. (వా.)

**కోడబడి.** వి. భక్ష్యవిశేషము. హంస. ౧. ౧౦౫. (ముద్రి, బ్రౌ. పా-కోడిబడి. శ. ర. పా.)

**కోడట్రికము**=కోడంట్రికము. (కోడలు+ట్రికము) వి. (కోడంట్రికము, స్నుషాత్వము.)

సీ...కోడంట్ర మనఁగఁ గోడట్రిక మంచన స్నుషాత్వ మలరును...ఆం. భా. ౨. ౧౧౧.

**కోడలితనము.** వి. (√ కోడలు.) స్నుషాత్వము, కోడంట్రము.

సీ. అత్తగారని బత్తి నడుగు లొత్తుచు శచీపన జాక్షి కోడలితనము నెఱప. దశా. ౩. ౪౯.

**కోడలు.** వి. దే. (కొడుకు+ఆలు-శ. ర.) కొడుకుయొక్క భార్య, స్నుష.

క. సుందరి నాకోడంట్రుర,యం దభ్యర్హితవు నీవు...భార. సభా. ౨. ౨౫౭.

క. లలితాంగిఁ బడసెఁ దనకో,డలిరూపముకంటెఁ గడు బెడం గగురూపో,జ్జ్వలకాంతి గలుగుదానిన్...భార. ఆర. ౩. ౨౬౬.

సీ. అక్కటా హింసాదు లైనకోడంద్రార యెక్కడ నున్నారు...ప్రబోధ. ౫. ౯.

క. కల దాహా ద్రవసతి శశి,కల దా ననఁ జాలు నొకవికారపుఁగోడల్,వలదాలోలకటాక్షాం, చలదామనిబద్ధతరుణజనఖంజనయై.పాండు.౩. ౬౦. ఆం. భా. ౨. ౧౧౧.

సా. కోడలు నలుపైనచో కుల మెల్ల నలుపు. కొడుకు బ్రదితికియుండ వలెను కోడలు ముండమోయ వలెను.

**కోడాడు**=క్రోడాడు, కోరాడు.స. క్రి. ౧. కొమ్ములతో పొడుచు.

వ. ఇవ్విధంబున నవ్వేదండంబు లొండొండ చండక్రీడన్ గోడాడుచుండ. నృసిం. ౪.౪౭.

౨. అపహరించు.

మ...అమ్మాని శూలంబు చే,కొని నారాయణుప్రాణముల్ రణములోఁ గోడాడఁ జూడన్... ఉ. హరి. ౬. ౪౫.

**కోడి.** వి. (సం.కుక్కుటః. ప్రా.కుక్కుడో.క. కోటి) కుక్కుటము, అజ్జవాలు.

గీ. కొక్కరోకో యటంచును గోళ్లు కూసె.హర. ౭. ౧౩౭.

సీ. ద్రవిణము పైపన్నిదము లొడ్డి మాత్సర్యగతిఁ గోడిపందెము లాట్టువారు. వైజ. ౩. ౬౯. ఆం. భా. ౨. ౯౨.

జ: కోడిపేఁట, కోడిజెప్పు, కోడిపోరు.

**కోడిగ**=కోడీ. వి. (త.కోడి=హాసము) ౧. హాసము,

సరము ?. (రత్నములు వస్త్రములు మున్నగువాని యొక్క ఇరువదింటిసమూహము. బ్రౌ. రత్నముల యిరువదింటిసంజ్ఞ. శ. ర.)

సీ. కోయచేడెకుఁ గెంపుకోడిగల నొసంగి గురిగింజలను దీసి సరము గూర్చు. పార్వ. ౨.౨౩.

**కోడిగము.** వి. ౧. వంచన.

గీ... ఉర్వి చేరె, నడుగు చూపరిజడదారియెడయ నింటి, కోడి కోడిగములవేల్పుప్రోడ యపుడు. దశా. ౫. ౨౬.

క. వీడక యిట్టుల నాగ్లై, దేఁడులు విహరించ గర్భమిరవుగ నిలిచెఁగా, ప్రీడావతికిని నాహరి, కోడిగ మే మనుచుఁ దెల్ప గుణరత్ననిధీ. ఉ. హరిశ్చ. ౨. ౯౧.

౨. విలాసచేష్ట, శృంగారచేష్ట.

సీ. కడఁకఁ జేసినకోడిగముల కెల్లను బ్రతి చెనకుట లొకకొన్నిదినములందు. అని. ౧. ౧౧౯.

ఉ... ఈ,కోఁలివిటుండు చేయునెడకోడిగముల్గని మాటి వత్తురే. భల్లా. ౫. (శ. ర.)

ఉ. కుక్కయుఁ బోలె వెంటఁబడి కోడిగ మాడక భావజార్తిచే, నిక్కడ నిల్వఁగాఁ దరమె ...చంద్ర. వి. ౧. ౮౦.

౩. గేలి, పరిహాసము.

సీ. అతులితవేదవేదాంతచర్చల బ్రహ్మ నైనఁ గోడిగమాడుహంసతతులు. చెన్న. ౧. ౨.

౪. కొంటెతనము.

గీ. అధ్వగులు కోడిగములకై యాకు లెల్లఁ, ద్రెంచి శాఖావితానము ల్దుంచినైన, మోడుపడియుండె...శుక. ౩. ౪౩౯.

ద్వి. కినిసి బ్రాహ్మణుని శిక్షింప లే రనుచుఁ, జెనఁటి కోడిగములు సేసి పోయెదవా. ద్వి. హరిశ్చ. ఉ. ౭౫౫ పం.

విణ. దుష్టము.

గీ. కోడిగపుఁగంతుయాతన కోడి వజ్రి,కోడియై కూసెఁ గొక్కొరోకో యటంచు.అహ. ౩.౭౧.

చ. ఇనవిభుఁ డైనగౌతమమునీంద్రు వివేకము వీటిఁబుచ్చి యా,యనఘునిధర్మపత్నికి నహల్యకు నాఁడె దేఁ దలంచి వం,చనగతిఁ గూయు కోడిగపుజాతి...విప్ర. ౩.౪౮.

౨. వ్యర్థము, నిరుపయోగము.

చ. పని మఱి లేనికోడిగపుబాఁపని నీ వొకప్రోది సేసి పేర్కొని మును నావిలాసగుణరూఢి నెఱుంగనియట్లు పన్నిదం,బని కడు మించ నాడితివి యాడినమాటకుఁ దారసిల్లినన్, వెనుకకుఁ బోకు మందుఁ జెలి వెండియు జంకెన లుల్లసిల్లఁగన్. విప్ర. ౨. ౮౩.

వ. అతం డొక్కనాఁడు ... దాసీజనంబులు తన కాచరించునాడిగంబులఁ గోడిగంబులం జేసి కూడునీళ్లకుం బాసి గాసిపడుసమయంబున... వేం. పంచ. ౩. ౧౮౭.

జ: కోడిగించు, కోడిగీఁడు.

**కోడిగించు.** అ. క్రి. (√ కోడిగము.) శృంగారచేష్టలు చేయు.

సీ. గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి పరకామినీసహోదరతఁ జూప...గీ.కోరి తొలుమేనఁ దన కైనకొదువ లెల్ల, మాన్చుకొనవచ్చి భువనైకమాన్యలీల, నవతరించినకృష్ణుఁడౌ ననఁగ మించె, నరసవిభుకృష్ణరాయభూనాయకుండు. పారి. పీఠి. ౧౭.

స. క్రి. కోడిగముచేయు, పరిహసించు.

సీ. మండువేసవినాఁటిమార్తాండబింబంబు గోడిగించుపసిండిగుబ్బతోడ. కాశి. ౪. ౨౯౪.

**కోడిగీఁడు.** విణ. (కోడిగము + ఈఁడు) కోడిగము చేయువాఁడు.

(కొంటెవాఁడు.)

సీ. తనరథంబునకు మాధవసత్యభామల గుజ్జాలఁ జేసినకోడిగీఁడు. వరాహ. ౨. ౧౮౦.

గీ. నాల్కపై నువ్వుగింజైన నానసట్టి,యారివేరంపుఁదపసి కయ్యంబు కడుపు,కూడుగాఁ

చేసి మెలఁగెడుకోడిగీఁడు...చిత్రభా.౪.౮౩.
(శృంగారచేష్టాపరుఁడు, విలాసవంతుఁడు.)
సీ. కుంటెనీలకు నిచ్చి కోడిగీలకు నిచ్చి మిన్నక వారకామినుల కిచ్చి. విక్ర. ౭. ౧౨౮.

**కోడిపీఁట.** వి. (కోడి+పీఁట) బండిపోలుగట్టుచివర క్రింద ఎత్తుగా నుంచెడుమోపుడుకొయ్య, అను కర్షము.
సీ. పంకరుహంబులు బండికన్నులు ... అశోకము ల్గోడిపీఁట...కు. సం. ౬. ౮౩౯.

**కోడిపోరు.** వి. (√కోడి) కుక్కుటకలహము, ద్యూతభేదము. ఆం. భా. ౨. ౩౦౬.

**కోడియ=కోడె.**
వి. (కోడెదూడ, గిత్త, వత్సతరము.)
గీ. తలఁకి యోతండ్రి యాకోడియలను బట్టి.నీలా. ౨. ౬౨.
చ. గొఱియలమంద యాఁబసులగుంపు ... తఱుపు లగాడి కోడియలదా మెన గాదెలఁ గొల్చు గల్గి యే,కొఱఁతయు లేక యుండు నొకగొల్ల త...వేం. పంచ. ౧. ౫౭౬.

**కోడిఱె(డ్రె)ప్ప.** వి.(కోడి+ఱెప్ప.)కనుఱెప్పల యందు కలుగుకోగవిశేషము.
ద్వి. చెప్పఁ జిత్రము గోడిఱెప్ప వెర్గినదొ,తప్ప వోనోపునో తడికంటివిధము. బస పు. ౩. ౭౭౭ పం.
ద్వి. గ్రుడ్డిక న్నొరకన్ను కోడెఱెప్పకన్ను. పండి తా. మహిమ. ౨౭౩. పా.

**కోడీ=కోడిగ.** (శ. ర.)

**కోడు¹.** వి. జా. (మంచములు మున్నగువాని) కాలు.
వ... పగడపుఁగోళ్లపట్టెమంచములు...దశా. ౧. ౧౪.
సీ....కోడనఁగ ఖట్వాంగ మెసఁగు.ఆం.భా.౨. ౧౬౪.

**కోడు².** వి. జా. ఊరిచరినీటిపల్లము. (శ. ర, వా- కుల్యావిశేషము. చి. ని.)
ఉ... కాల మెడచేసిన నేతము లెత్తి కాల్వలుం,బావులు కోళ్లు నూతులును బావులు రాట్నములుం జలార్ద్రమై,చేయఁగ నాయెఁ గాక మతి చేయ నినాఁడవి తామె పుట్టునే. ద్వా. ౬. ౨౦. శ్రీ మ. ౩. ౨౨.
ఉదా: ఏళ్లను కోళ్లను ఏక మగునట్లుగా వర్షము కురిసినది.

**కోడు³.** వి. రేఖ, గీఁత.
సీ. ఖట్వాంగరేఖలు గనుపట్టుఁ గోడు నా...ఆం. భా. ౩. ౫౩.

**కోడుతాఱు.** అ. క్రి. పండినపైరు మిక్కిలి యొడు. (శ. ర, బ్రౌ.)

**కోడె=కోడియ.** వి. ౧.కాఁడికి మరపఁ దగినమగదూడ, గిత్త. (శ. ర.) ౨.గోవుమున్నగువానిమగదూడ; ఎద్దు, వృషభము.
సీ... కోడె యనఁగఁ జెయ్య యనఁగ. గీ. గో ప్రభృతి పుంస్త్ర్యపత్యముల్ ... ఆం. భా. ౨. ౨౬౨.
సీ. ఆదిశాక్వరము విహారంబు సలుపు నీకొండచెంపల గోవుకోడెవోలె. వరాహ. ౬. ౭౭.
ఉ...శూలపాణికిం, గా లొకటేమొ కుంటి వలెఁ గన్పడుచున్నది లేక కోడె నే,వేళల నెక్కుచుం దిరుగ నెట్టియె... పార్వ. ౪.౯౨.
౩. విటుఁడు.
గీ. అడిగినంతయు రో యిచ్చినట్టిక్రొత్త, కోడెఁ జేకొని తను వెళ్లఁ గొట్టుటయును,బ్రాలిఁదన వల్పులంజియఁ బాయలేక, వ్రీడ యించుక లేనిచేబోడిబొజుఁగు. కవిక. ౪. ౯౯.
విశ. తరుణము, పడుచుది.
క. మదమెదవుకోడెవిటులకు, హృదయపుటాంతరములోన హేమాహేమిక, బదివేలమన్న

ధులు పుట్టుదు రాసీమాటికుచపటుత్వము గ న్నన్. హంస. ౧. ౨౧౨.

శా. కామాంధల్ వెలనాటికోడెవిధవల్... క్రీ డా. ౨౧౯.

సీ. కోడెజక్కవగబ్బిగుబ్బచన్నులమీఁదఁ దరఁగ పయ్యెదకొంగు పారలి పడఁగ. దశా. ౯. ౧౩౦.

౨. మగది.

గీ...ఎవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె, లఱపులను బొడ్చుచు...నీలా. ౨. ౮౩.

(వ్యవ) ఆయావునకు పుట్టినది కోడెదూడా? పెయ్యదూడా?

కోడెపాయము=తారుణ్యము, యౌవనము.

మత్తకోకిల. కోడెపాయపుగబ్బిగుబ్బెతఁ గూర్చి వేలుపుఁబ్రోడ దాఁ,గోడియై యొకరేయి కూయిడ...సమీర. ౧. ౨౧౮.

జ: కోడెకాఁడు, కోడెకొండ, కోడెగాడ్పు, కోడెతనము, కోఁడెత్రాఁచు, కోడెరాతు.

కోడెకాఁడు. వి. (√కోడె) ౧. యువకుఁడు, తరుణుఁడు, పడుచువాఁడు.

ఆ. కోడెకాఁ డనంగ గోవాళ్లు నాఁగను, యువజనాఖ్య లొప్పచుండు రెండు. ఆం. సం.మాన. ౭.

గీ...మించుఁబోండ్లఁ,గూడి జలకేళిఁ గావించు కోడెకానిఁ, దలిరువిల్కాని నగుచక్కఁదనమువాని. దశా. ౬. ౭౮.

౨. యౌవనమునకు పూర్వదశయం దున్నవాఁడు.

గీ. కోడెకాఁడు కొమరుఁ డనఁ గొండి కనఁగఁ, దగుఁ గుమారుఁడు తరుణుఁడు దనరు వయను, వాఁ డనుచుఁ బలుకంగ...ఆం.భా.౨.౧౧౮.

౩. విటుఁడు, పల్లవుఁడు.

ఉ. ఎన్నఁడుఁ గాను వీస మొక టిచ్చినవాఁడవు గావు వీట నీ,వన్నియకోడెకాండ్రు తగ వార వధూటులకై యొసంగునా,చిన్నెలు నీవు చూచియు నినీ తల వంపఁగ నేర వన్నిటన్, బిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడ నేటికిన్. విప్ర. ౨. ౨౭.

సీ...గోవాళ్లు బొజుఁగు నాఁ గోడెకాఁడు. గీ.వెచ్చకాఁడు ననుపుకాఁడు వేడ్కకాఁడు,లంజెకాఁడు మిండఁ డనఁబల్లవుఁడు దనరు.సాం. ని. మాన. ౭.

కోడెకొండ. వి. (కోడె+కొండ) హిమాలయపర్వతము. (పృథుచక్రవర్తి భూమిని ధేనువును గాను హిమవంతమును దూడనుగను జేసి రత్నములు నోషధులును పిదికె నని పురాణప్రసిద్ధి.)

ఉ. ఎన్నఁటిమాట నీ వెఱుఁగుదే తుహినాచల మాట మేనకం, గన్నులఁ జూపి యంపసెగఁ గ్రాఁచినకాఁకకుఁ జల్లఁజల్లఁ దా,రొక్కన్న విరాళినాఁటివలిగొజ్జఁగనీటఁ జూమయ్య ధాత్రికిం, బన్నినకోడెకొండ యొడఁబాటునఁ దాల్చెఁ దదంక మిప్పడున్. కకు. ౧.౧౯౮.

కోడెగాడ్పు. వి. (√కోడె) లేగాలి, మందమారుతము.

సీ. నులుప కే లున్నవి నెఱయ ధైర్యంబును గందంపుమలకోడెగాడ్పుగములు. ప్రభా. ౫. ౧౭౮.

కోడెతనము. వి.(√కోడె) ౧. పడుచుఁదనము.౨. విటత్వము.

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుఁగోడెతనంబుతోడఁ గ,న్నిచ్చకు వచ్చు చేడియల నెచ్చరికించుచు...విక్ర. ౭. ౭.

౩. జాణతనము, ప్రౌఢి.

(సీతారాములకేళీవర్ణనము.) సీ. సకులు చిక్కులు దీర్చి జవ్వాజి కస్తూరి కులుకుగుబ్బలఁ బూయు కోడెతనము. ఉ. రా. ౬. ౧౬౭.

కోడెత్రాఁచు. వి. (√కోడె.) పడుచుత్రాఁచుపాము.

సీ.మంగలకత్తిపై నంగ ముంచినయట్లు కోడెత్రాఁ
చును ముద్దులాడినట్లు. వేణు. ౨౦.
(ఇట్లే కోడెపాము, కోడెనాగు.)
ద్వి. ఘన మైనయాపండు గసికాట్లుచేసి, యాడు
చు మనుపటియవిధి పోనాడి, కోడెపామై
యాడుకొనుచుండె నంత. ద్వి. శ. సా. ౨.
౬౬ పా. ౧౦ పం.
సీ. తమి నీలకంఠకంఠముల హారంబులబాగుఁ జూ
పెడుఁ గోడెనాగు లీడ. వాల్మీకి. ౩. ౧౮౩.

**కోడెరాతు.** వి. (√ కోడె) వృషభవాహనుఁడు,
శివుఁడు.
సీ. ఇటు కోడెరాతు మై నిడ్డపాముల మేఁతసాం
పు లీనెడుకొండఁ జూచినాఁడ. నరస. ౫.
౨౨.
(ఇట్లే కోడెవయాళివజీరుఁడు.)
చ. అలవి యెఱుంగ కొక్కపులి కల్గినవాఁడయి
భీతిఁ జెంది యక్కొలపగఁ దీర్చుకోఁదలఁ
చి కోడెవయాళివజీరుఁ డెప్పుడుఁ, మెలఁగె
డు వ్యాఘ్రచర్మ మనుమీనెఱడాగు ధరించి
శూరతాకలన భవత్కులంబునకుఁ గల్గదు జో
డు మృగాన్వయంబునన్. శుక. ౨. ౨౭౮.

**కోణంగి=కోడంగి.** వి. (త. కోణంగి.) అంగములను
వికారముగా చూపి జనులను నవ్వించుచు బిచ్చ
మెత్తుదాసరి.
ఉదా: కోణంగిచేష్టలు, కోణంగియాటలు.
సీ. ఆశించు నెపుడు నత్యాసక్తి నమ్మహానటుఁడు
నేనగరిఁ గోణంగి యగుట. నైజ. ౧. ౮౨.
వ...గోవింద లిడుచు నెద్దులపైఁ దమ్మటమ్ములు తిడి
మి తిడి మని మ్రోయ మ్రేయుచు వచ్చుకోణంగి
దాసరులగంతులు గని. ప్రబంధ. ౭౮. హంస.
౩. ౨౯.
జ: కోణంగితనము.

**కోణంగితనము.** వి. (√ కోణంగి) కోణంగిచేష్ట,
వెక్కిరింత. (బ్రా.)

**కోణకుణము.** సం. వి. అ. పుం-మంచపుమూలలఁ
దిరుగునది-మత్కుణము, నల్లి.

**కోణపుఁడు.** సం. వి. అ. పుం-విదిక్కు పాలించు
వాఁడు-నైరృతుఁడు, మూలఱేఁడు.

**కోణము.** సం. వి. అ. పుం. ౧. ఇల్లు లోనగువాని
మూల. ౨. (క్షేత్రగ) రెండురేఖలు కలియుచో
టు. ౩. విదిక్కు, మూల. ౪. వీణ మొదలగువా
ద్యముల వాయించువింటివంటిసాధనము (కమాను
మొ); గంట లోనగువాని వాయించెడుకోడుపు.
౫. అంచు, మొన. ౬. కుజగ్రహము. ౭. లగుడ
ము, దుడ్డుఁగఱ్ఱ. ౮. వాద్యభేదము. (కల్ప) ౯. శ
నిగ్రహము.

**కోణాఘాతము.** సం. వి. అ. పుం. ౧. కమాను మొ
దలగువాదనసాధనములతో సారంగి మొదలగు
వానిని వాయించుట. ౨. బహుఢక్కలను బహు
భేరులను ఒక్కసారిగా వాయించుట.
శ్లో. ఢక్కాశతసహస్రాణి భేరీశతశతానిచ, ఏక
దా యత్ర హన్యన్తే కోణాఘాత స్స ఉచ్య
తే. (భరతుఁడు.)

**కోణాలగొంది.** మి. వి.మిక్కిలి యిఱుకై నచీకటి
మూల
మత్తకోకిల. జాలి దక్కి మతాంతరాళవిశాలవే
దులయందుఁ గోణాలగొందిఁ దపంబు సల్పు
జనంబుతాల్ములు దూలుఁ దద్బాలికాకులనిస్తు
లస్తనపాలికామృగనాభివాతూలికాహతిఁ బ
క్వశాల్మలితూలికాశకలాకృతిన్. పాండు.
౫. ౨౯౬. (కోనాలగొంది.ముద్రి-ప్రయో
గాంతరము లేదు.)

**కోణిగి.** వి. నతి, నమస్కారము.
వ... తులసీవనమందలిగదాధరునకుఁ గోణిగి కృ
తశౌచమందలి పాపహరునకుఁ దెలుపుట...
ప్రబంధ. ౭౨౦.

**కోణే.** వి. (క. కోణే.) అంతఃపురము.

శా. కోణేవాకిట వారి నిల్పి కులుకుంగుత్తంపుఁజ
న్గుబ్బలే, జాణల్ కొందఱు కుంచెగెండియడ
పాల్గాగింప...నృపాలుఁ డంతిపురముం జే
రెం బ్రమోదంబునన్. కుచల. ౨. ౪౮.

**కోథము**, సం. విణ. (అ. ఆ. అ.) ౧. మథితము, త
రువఁబడినది. ౨. గళితము, జాఱినది.వి. అ. పుం.
౧. నేత్రరోగభేదము. ౨. భగందరరోగవిశేష
ము. ౩. జాఱుట. ౪. మథించుట, చిలుకుట.

**కోదండము.** వి. (త. కోదండం. క. కోదండ.)బా
లదండనసాధనము, నేరము చేసినబాలురు పట్టు
కొని వ్రేలాడుటకై మీఁదఁ గట్టినత్రాడు.
గీ. తొడలు పడిపెట్టి కోదండ మడరఁ గట్టి,రెట్ట
లెగఁబెట్టఁ బట్టించు రేపు మాపు. హంస. ౩.
౧౪౧.

**కోదండము.** సం. వి. అ. న. ౧. విల్లు, ధనుస్సు.
౨. ధనూరాశి. పుం. ౧.కనుబొమ్మ. ౨. ఒకానొక
దేశము.

**కోదండి.** సం. విణ. (న్. నీ. న్.) విల్లు కలవాఁడు,
విలుకాఁడు.

**కోదండరామములు.** సం. వి. అ. పుం. బ. ఒక
జాతివడ్లు.
సీ. సన్నసూదులు పచ్చగన్నేర్లు గోదండరామము
ల్కెసర్లు రాయసర్లు. హంస. ౪. ౧౭౬.

**కోదారము.** సం. వి. అ. పుం. ఒకజాతిధాన్యము.

**కోద్రంగము.** సం. వి. అ. పుం. మంచె.
శ్లో. కోద్రంగస్తు తమంగస్స్యాత్. అమరపద
పారిజాతము. (శ.ర.)

**కోద్రవము.** సం. వి. అ. పుం.కోరదూషము,అళ్లు.

**కోన**[1]=కాన[1]. వి. ౧. అడవి; తోఁట.
ఆ. గోల యిట్టికాఱుఁగోనలో ని న్నొంటి,డించి
చనఁగఁ జనునె,..అచ్చ. రా. అర. ౪౯.
చ...తిన్ననికన్నెమావిగుం,పునఁ బెనఁగొన్నమ
ల్లియలు పూచినకోనలు గాంచి యెుక్క-
చోట్. వసు. ౨. ౨౦.
౨. కోన యనుదేశవిశేషము.
సీ. కోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలె ... మనుచ.
౧. ౩౭.
జ: కోనతెంకి, కోన త్రిమ్మరి,కోనమనికిపట్టు,కో
నమెకము.

**కోన**[2]. వి. (సం. కోణః. క. కోణె. త. కోణమ్.)
౧. మూల.
ఉ...ఇండులకందువ కేఁగి గొందులుం, గోనలుఁ
జూచునంత...దశకు. ౫. ౭౧.
సీ. క్రొంజీకటులు గ్రమ్ముకోనలకోనల ఘన మైన
యోగిపుంగవులగవుల. సారంగ. ౩. ౨౩౨.
ఆంభా. ౨. ౩౦.
౨. లోయ, కొండసందు.
సీ. మందరశైలంబునందు నొకానొకకోనలోఁ గా
నలో గుముఱు గాఁగ,బలసినవెదురుజొంపము
క్రింద...దశా. ౪. ౭౯.
వ...కారుపోతులకోలాహలంబులం బ్రతిశబ్దంబు,
లీనుకోనలును...మనుచ. ౪. ౩౭.
౩. కొన, అగ్రము.
గీ... తెలికన్నుఁగోనలయెక్కిరింత,నెక్కి బలు
కొండఁ దాఁటువో నేయు మేటి.పాండు.౧.
౧౬౧. (తెలికన్నుఁగోనలయెక్కిరింత=శుక్లా
పాంగ-మయూర-వాహనము)
ద్వి. తోన శ్రీరంగనాథుఁడు తెలిగన్నుఁ,గోనల
నమృతంబు గురియ నిట్లనియె. ద్వి. పరమ.౫.
౪౨౫ పా.
జ: కోనతేఁడు.

**కోన**[3]. వి. గోసమూహము.
క... గో,బృందాహ్వాయంబు లలరన్, మందనఁ
గోన యన. ఆం. శే. ౩౨.

**కోనతె(టె)ంకి**=కోనమనికిపట్టు.

క...రక్కసుఁ, డరు దందుచు...ఒకయినుపద్రు డ్డునఁ, బరిగొని యక్కోన తెంకిబంట్లఁ జదు ముచుక్. అచ్చ. రా. యు. ౨౪౪.

**కోనత్రిమ్మరి.** వి. (√ కోన[1]) వనచరము, కోఁతి.

గీ. మంచి మెడకోనత్రిమ్మరిమన్నె గాని, కత యెఱింగింప...అచ్చ. రా. కిష్కిం. ౯. (మంచి మెడకోనత్రిమ్మరి=సుగ్రీవుఁడు.)

**కోనమనికిపట్టు.** వి. (√ కోన[1])వనౌకము, కోఁతి.

గీ ... కేసరి యనుకోనమనికిపట్టు,కలికి యంజన యనునది గన్నవాఁడ. అచ్చ. రా. కిష్కిం. ౧౧.

**కోనమలహారి.** మి. వి. (సంగీ) రాగవిశేషము. ప్రబంధ. ౯౭.

**కోనమెకము.** వి. (√కోన[1]) వానరము, కోఁతి.

సీ...మొసలి, కన్నులరాకాసిమిన్న కోనమెకంపుగుంపులఁ దార్కొని యంపవాన, గురిసె ...అచ్చ. రా. యు. ౩౧౧.

**కోనఱేఁడు.** వి.(కోన[2] + ఱేఁడు.) కోణపుఁడు,నైరృతుఁడు. (శ. ర.)

**కోనాలకము.** సం. వి. అ. పుం. న. సంఘసంచారియై నల్లతోఁకయు తెల్లకడుపును గలఒక జాతిజల పక్షి.

**కోనాలక.** సం. వి. ఆ. స్త్రీ=కోనాలకము.

**కోనాలి.** సం.వి.ఇ.పుం.ఇ,ఈ.స్త్రీ=కోనాలకము.

**కోనెఱు=కోనేఱు.**

క...చెఱువు మడువు లొండు కుంట చెలమ పడియ కో,నెఱు బుగ్గ వాఁగు...హంస.౪.౨౧౦.

**కోనేఱు=కోనెఱు.** వి. దే. (కోన[1] + ఏఱు-త.క. కోనేరి) చుట్టు మెట్లు కట్టినసలుచదరపుఁజెఱువు, పుష్కరిణి.

సీ. నెగడుఁ బుష్కరిణి కోనే ఱనఁగ...ఆం.భా. ౧. ౧౬౨.

**కోపకత్తె.** మి. విశే. (కోపము+కత్తె.) కోపముగలది (స్త్రీ.)

సీ. సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయుకొడుకుఁ గాంచినయట్టికోపకత్తె. క్రీడా.౧౨౯.

**కోపకుఁడు.** సం. విశే. (అ. పికా. అ.) కోపించువాఁడు.

**కోపగాఁడు.** మి. విశే. (కోపము+కాఁడు) కోపము గలవాఁడు.

గీ. నినుఁ గలయుభర్త కోపగాఁ డనఁగ నేల. సారంగ. ౨. ౧౧౫.

క.ద్వైపాయనముని వెడలం, ద్రోపించినకోపగాఁడు ధూర్జటి...భీమ. ౪. ౧౩.

గీ. అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ. కాశీ. ౪.౯౦.

**కోపగించు.** అ. క్రి. (సం.కోపః-ఇది 'చిత్తగించు' వంటిది.) కోపించు, కోపపడు.

సీ. మధుపసంగతిఁ గూడిమాడి నిద్రింపఁగాఁగినుకఁ బద్మిని కోపగించె ననఁగ.తపతీ.౪.౨౧.

గీ...ఆపడంతుక చెల్పినఁ గోపగించి. సారంగ. ౨. ౨౬౦.

**కోపగిలు(ల్లు).** అ.క్రి.(సం. కోపః) కోపగించు.

సీ. వేగ మూహింపు మీ విధుబింబముఖి కోపగిలిన భావము సమ్మతిలినభావ. గీ. మనుచుఁ దను నెచ్చరింప...చంద్రా. ౩. ౭౬.

**కోపన.** సం. వి. ఆ. స్త్రీ. కోపము గలయాఁడుది,భామిని.

**కోపనకము.** సం. వి. అ. న. చోరక మనుగంధద్రవ్యము కీ.

**కోపనకుఁడు.** సం. విశే. (అ. నికా. అ.) కోపశీలుఁడు, కోపము గలవాఁడు.

**కోపనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కోపశీలము, మండిపడునది. ౨. కోపము గలిగించునది. ౩. వాతాదిదోషములను మిక్కుటముగా రేఁచునది. వి. అ. న. కోపగించుట.

కోపనీయము. సం=కోపయితవ్యము.

కోపము. సం. వి. అ. పుం. ౧. క్రోధము, కినుక. ౨. దేహమందలివాతాదిదోషములలో నేదేని మిక్కుటమగుట, ప్రకోపము. (ఉదా: పిత్తకోపము, వాతకోపము.)

కోపయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కోపింపఁజేయువాఁడు.

కోపయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కోపింపఁజేయఁ దగినది.

కోపలత. సం. వి. ఆ. స్త్రీ. కర్ణస్ఫోటాలత.

కోపి. సం. విణ. (న్. నీ. న్.) ౧. మిక్కుటమగు కోపము గలవాఁడు. ౨. కోపము గలిగించువాఁడు. ౩. వాతాదులను రేఁచునది. వి. న్. పుం. జలపారావతము, నీటిపావురాయి. (కల్ప)

కోపించు. సం. అ. క్రి. కోపగించు.

క. రక్కసులరాజు నీతో, మిక్కిలి కోపించినాఁడు...భా. రా. యు. ౧౪౨.

ఆ. కొడుకుపాటు చూచి కోపించి కాళింగపతి రయమునఁ దేరు వఱపి ... భార. భీష్మ. ౨. ౬౪.

స. క్రి. కినియు.

మ. గురుశాస్త్రార్థగరిష్ఠులైనబుధులన్ గోపింపఁగా రాదు ..మల్లభూ. నీతి. ౧౩.

క. ఆపడవాలును దమభటులఁ, గోపించుచుఁ గవులఁ బాతకుల ఘోరుల నా, లోపలఁ గూర్చుండఁగ నిడి, యాపాడి తగంగఁ దీర్పుఁ డని నియమించెన్. ద్వా. ౭. ౩౩.

కోపిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.)=కోపకుఁడు.

కోపితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కోపింపఁజేయఁబడినది. ౨. మిక్కుటముగా రేఁపఁబడినది. (వాతాది.)

కోపు. వి. (క. కొపు. త. కొప్పు.) ౧. నాట్యముతీరు, నాట్యగతిభేదము.

మ...నాలిగా, డ్డ్వల పేరంగలనట్టువల్గుఱపఁ గోపుల్ చూపులేఁదీవపా, త్రలకయ్యామని పూవుముత్తెపుసరుల్దాల్పంగ నిచ్చెం గడున్. యయా. ౪. ౧౨.

గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపుకోపున దొరఁ జెల్ల గోఁపు లొసఁగ. వైజ. ౧. ౧౯౯. ఉ. రా. ౪. ౧౭౫. ఆం. భా. ౧. ౧౩౦.

౨. సౌందర్యము, అందము, చక్కఁదనము.

ఉ. కమ్మనిపల్కుకోపుఁ జెనకం గలచక్కనిమోహనాంగునిన్, గొమ్మరో చూడవమ్మ నలకూబరుఁడా యితఁ డంబుజాననా. ఉ. హరిశ్చ. ౪. ౧౧౫.

గీ. కత్తలానులయేపు మేల్కట్లకోపు, మదురుగోడలమెఱపు వాల్మగలయొఱపు. రసిక. ౧. ౩౬. చంద్రా. ౩. ౨౮.

౩. బలము, శక్తి, సామర్థ్యము.

దండకము...మందరాగంబుఁ జెన్గోపున న్మోఁపునం దాల్పవా...కృ. శతం. ౩. ౧౫౭.

గీ. ఏలికలవెంట వెస నంట నేపు రేఁగి, కోపు మీఱి జనోద్వృత్తిఁ గూడఁ బొంచి, యెందుఁ జొచ్చినఁ జొరనీయ కీడ్చి తెచ్చి, సలుగులను గూల్చె నొకకొన్ని జాగిలములు. శుక. ౧. ౧౭౦.

౪. నిమిత్తము, ప్రయోజనము.

చ...నే నహుషుబిడ్డఁడఁ బేరు యయాతి వేఁటకో, పున నపరించినన్ దెరలు బోనులు గైకొన కొక్కయిట్టి వచ్చినఁ జనుదెంచినాఁడ...యయా. ౨. ౫౫.

౫. కడ, దిక్కు; పార్శ్వము, ప్రక్క.

ద్వి. భూపాల యీకొండపొంతపశ్చిమపుఁ, గోపున నొకమట్టి కొమ రొందుచుండు. రం. రా. అయో. ౧౨౪ పొ. ౧౮ పం.

సీ. కరకంకణంబులు గల్లనఁ జెలు లిరుకోపులఁ జేరి వీచోపు లిడఁగ. శకాం. ౪. ౧౪౨.

౬. విధము, రీతి.

ఉ. క్రోధము మూర్తిఁ గైకొనినకోపునఁ గాంచ నవేష్టనోజ్జ్వలో,త్సేధగదాధరుం డగుచుఁ జెచ్చెర రావణుమీఁది కేఁగఁగన్. ఉ. రా. 3. ౭౪౧, ౮. ౧౧౨.

౭. పలకమీఁద వ్రాసెడికడ్డి, బలపము; కడ్డి. (శ. ర.) ౮. (వింటియొక్క) కొప్పు, కొన, కోటి.

సీ. ధనురగ్రమద్యనృత్తావయవమ్ములు గొఱలుచు నుండును గోపు నాఁగ. ఆం. భా. 3. ౬౨.

సీ...కోపు కొప్పు, నాఁ జను ధనురగ్రనామంబులు...సాం. ని. మాన. ౪౫.

చ...మృలసర్పము నొక్కటి వింటికోపునం,బనిపడ తెచ్చి వైచెనటు బ్రహ్మమునీంద్రునియంసవేదికన్. భాగ. ౧. ౪౬3. (శ. ర. పా.)

౯. మద్యము.

సీ...మద్యమ్ముపేళ్లు. గీ. తనరు సారాయి కోపు న...వేంక. ౭౦. (శ. ర. పా.)

సీ...కోపు, సారాయి యనఁ జెల్లు వారుణీనామముల్...సాం. ని. మాన. ౪౭.

౧౦. సమయము. (శ. ర, బ్రౌ.)

౧౧. చేపలను గ్రుచ్చెడినూవి. (శ. ర, బ్రౌ.)

౧౨. దుకాణము. (బ్రౌ. చూ-కోపుదారుఁడు.)

౧3. నిడివి, పొడుగు.

సీ. అష్టదిఙ్ముఖములం దష్టాంగములు మించఁ గోపు గాంచినవజ్రకూబరములు. దశా. ౫. ౧౪.

౧౪. (త. కూప్పదల్.) నమస్కారములు.

వ...పినాకీ నీకు నమస్కారంబు కైలాసనిలయా నీకుఁ గోపులు పశ్యల్లలాటా నీకు నేటికోళ్లు ...భీమ. 3. ౭౧౧.

౧౫. మనోహరము.

ద్వి. దాఁపుర మేల బృందావనమందుఁ,గో పైన చెంగల్వకొలనిలోపలను. ద్వి. శ. సా. ౧. ౨౬ పా. ౧ పం.

చెఱువుకోపు = అలుఁగు, తటాకజలనిర్గమనమార్గము.

సీ. ముల్కికిఁ జెఱువుకోపువకు నల్గనఁ బొల్చు... సాం. ని. నానా. ౮౭.

జ: కోపుదారుఁడు, కోపుపరువడి, కోపువాఱు.

కోపుదారుఁడు. వి. (√కోపు) దుకాణము పెట్టువాఁడు. (పైనుండి సరకులను తెచ్చి యమ్మెడివాఁడు. శ. ర-వర్తకుఁడు. చి. ని.)

కోపుపరువడి. వి. (కోపు+ పరువడి.) పంద్రెండు పరువడులలో నొకటి.(పదునాల్గువిసరులలో నొకటి-అని హంస. ౧. ౭౦౬.)

వ...ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాఁటడుగుపరువడి కోపుపరువడి ... మొదలు గాఁగలపది రెండుపరువడులను. ప్రబంధ. ౭౮.

కోపువాఱు. అ. క్రి. (√ కోపు) అందగించు,రమ్య మగు. (శ.ర, బ్రౌ.)

కోప్యము. సం=కోపయితవ్యము.

కోమ[1]. వి. వల్మీకాగ్రము, పుట్టచివర.

సీ.... పుట్టన వల్మీక మొప్పుచుండుఁ. గీ. గోమ యనఁ దదగ్రభూమి యౌ...ఆం. భా.౨.౮. ద్వి. హరిశ్చ. పూ. ౧౯౬౨ పం.

కోమ[2]=కొమ్మ. వి. స్త్రీ, ఆఁడుది.

ఉ. మాయనుఁగుంజెలిన్ వెదకుమా యను నొప్పుఁ దుటారి చిక్కులే,మా యను...గద్దకికారుజింకకో,మా యను...అచ్చ.రా.౩౪౯౬. (శ. ర. పా-ప్రయోగాంతరము లేదు.)

కోమటి. వి. (సం. కార్పటికః. క. కోమటి. త. కోమట్టి.) వైశ్యుఁడు.

సీ. కోమట్లు మూఁడవకొలము వా రన బేరులన వైశ్యనామము ల్దనరు నధవ. ఆం. సం. మాన. ౨.

చ. కొనుఁడు పరార్థ్యరత్నములు గోరినవానిన
యిత్తు మట్టెఱుం,గునఁ బచరింతు రంగడులఁ
గోమటు లప్పురి సిద్ధరత్నముల్. భార. ఆది.
౮. ౭౩.

జ: కోమటీఁడు.

**కోమటీఁడు**=కోమటి. వి. (కోమటి+ ఈఁడు-స్వార్థమున.) వైశ్యుఁడు.

సీ...సంచిమూల్యము నిచ్చి సడి కోర్చి త్రైవర్ణికు
లజంటఁ దిరుగనికోమటీఁడు...గీ. లేఁడు ధర
లోన రతిసేనఁ గూడి మాడి,యున్నవిటులం
దు...హంస. ౫. ౧౨౦.

**కోమలకము.** సం. వి. అ. న. తామరతూఁడు.

**కోమలము.** సం. విశే. (అ.ఆ.అ.) ౧.మృదువు,మెత్తనిది. ౨. అంద మైనది, సొగసైనది. ౩. ఇం పైనది, మనోజ్ఞము. వి. అ. న. ౧. నీరు. ౨. పగడమునందలి యొకానొకదోషము; కోమలదోషము గలపగడము.

వ. మఱియు జర్జరంబును గోమలంబును మలినం
బును బ్రుప్పియు ననంబడు నాలుగుదోషంబు
లు గలవవి యెఱింగించెద. రత్న. ౭౫.

చ. బుడుపులు గల్గుజర్జరముఁ బూనినఁ బ్రాణము
లుత్తరించు లే,మిడి నొదవించు వేదనలు మీ
ఱఁగఁ గోమలనామవిద్రుమం, బెడపక ...
రత్న. ౭౬.

**కోమలి.** వి. (సం. కోమలా. క. కోమలె.) చక్కఁదనము గలఆఁడుది; ఆఁడుది.

ఉ. తామరకెంపు లంతటను దాచినముక్కలిపీఁ
టమీఁదటన్,గోమలు లంతఁ బెండ్లికొడుకుం
దగ నుంచిన...యయా. ౪. ౧౦౪.

క...ఇట్టెఱుఁగునఁ బలికిన నాలకించి కోమలి
మిగులన్. నీలా. ౨. ౯౫.

సీ. ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁ
దుక మెలఁతుక వెలఁది మెలఁత...గీ...అన
స్త్రీసమాఖ్యలు...ఆం.భా.౨. ౧౦౪.

జ: కోమలికము.

**కోమలికము.** వి. (√. కోమలి.) సౌందర్యము, చక్కఁదనము.

క. ఈముక్కీచెవు లీమెఱుఁగ,మీమేలిమిపోలుపు
గలదె యేచెలువకు నీ,కోమలిక మెఱుఁగుట
కునై, రాముఁడు మెలఁగించి చూచె రమణీ
నిన్నున్. భా. రా. ఆర. ౧. ౧౪౮.

సీ. మెఱుఁగాఱుముంజియు మేనికోమలికంబుఁ
గడు దిట్టగుణము గుల్కెడు మెఱుగంబు. కళా.
౪. ౪౪.

**కోయ.** వి. ఒకజాతికిరాతుఁడు, ఆటవిక భేదము,ఒకజాతిబోయ.

గీ. బోయ నాఁగఁ గిరాతుఁ డాఁ గోయ చెంచు,
పరికి యేనాది...అనఁ దద్భేదములుగఁ, బొ
ల్చును వినంగ... ఆం. భా. ౨. ౨౮౬.

క. ఒడయా నీ షేరిటియా, బుడుతని కెన గానఁ
గానఁ బురుడింపఁగ ని,క్కడిబోయలలో మ
ఱి యె,క్కుడుచాయలమలల మెలఁగుకోయ
లలోనన్. చంద్రా. ౨. ౪౭.

జ: కోయత.

**కోయత.** వి. (కోయ+త.)కోయజాతిస్త్రీ.

గీ...కోయతల్ చెప్పుకొనఁగ, సకలమును విన్న
వారము...ప్రబంధ. ౧౭౪.

**కోయష్టి.** సం. వి. ఇ. పుం. నీటిగంపపులుఁగు, నీటిబెళగువ్వ.

**కోయష్టికము.** సం. వి. అ. పుం. చీకుఁగొక్కెర, గ్రుడ్డికొంగ.

**కోయిల**[1]=కోవెల[1]. వి. (త. కోయిల్)౧. దేవాలయము, గుడి.

ఉ... జైనుఁడున్, గొంచక యోరి సౌగతుఁడ
కోయిలతొత్తులమారికాన మా,మంచిమతంబు
గైకొనుము మానుము నీమత మన్న బౌద్ధుఁ
డున్. ప్రబోధ. ౩. ౨౯.(కోయిలతొత్తు

మారి=వేశ్యాలంపటుఁడు.)

౨. ఒకానొకదివ్యస్థలము.

క. కోయిలఁ దిరుమలఁ బెరుమా, కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదికపు, ణ్యాయతనంబుల మాయం, బై యెక్కడఁ బోయెనొకొ మురాంతకుప్రతిమల్. కాశీ. ౫.౨౮౭.

కోయిల[2]=కోవెల[2], కొగెల.వి. (సం.కోకిలః.ప్రా. కోఇల. త. కుయిల్. క.కుకిల్.) పికము.

చ. అలరులు గోసి కోసినవయస్యలఁ బల్మఱుఁ గౌఁగిలించి కో, యిలలయెలుంగులోలిఁ గొని ... డాఁగురింతలు వారితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్.హరి. పూ. ౭. ౩౫.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో, యిల చంచునఁ జించి క్రోల్చె నీరీతి వియో, గులగుండియ లవియింపుదు, బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్. పారి. ౩. ౪౯.

కోయు. స. క్రి. (క. త. కొయ్.) ౧. ఖండించు, భేదించు, నఱకు.

గీ. అపుడు మెడ గోయ ముని రోఁజు టాలకించి. మనుచ. ౬. ౫౧.

ఉ. కానకుఁ గొంచుఁ బో యిపుడు కాళ్లను జేతులఁ గోయుఁ డంచు లో, నూనినకిన్క రాజు మదుటుంగర మిచ్చెను...సారంగ. ౩. ౩౬.

గీ. ఆస లన్నియు మొదలంటఁ గోసియున్న, గోఁచికట్టున కటువంటిగొడవ గడవ, రాక మెడఁ జుట్టుకొనియె...పాండు. ౫. ౨౩౭.

౨. (పువ్వులు కాయలు ఆకులు మున్నగునవి) త్రుంచు.

రగడ. చనకుఁ డిఁక దవ్వులకు సఖులార పువ్వులకు, ననుచు నలరులు గోసి రతివ లల్లన డాసి. మనుచ. ౩. ౭౪.

వ...అందనిమ్రాఁకులపండ్లు గోయం దలంచెద ... నైష. ౨. ౬౩.

ఉ. అంటలు గట్టి చెక్కలకు నాండ్రను బిడ్డలుఁ గూరఁ గోయఁ బో...ఆము. ౩. ౩౩.

కోసికొని (సుక)తిను=మరణబాధపెట్టు,మిక్కిలి బాధించు.

ఉ...నీగళము రాట్నమునం బిగియించి యుంతునో, కోసుకతిందునో యనినఁ గోమలినిశ్చలధైర్యసుస్థయై. శుక. ౨. ౩౭౩.

కోఁతలుకోయు, సాఅకాయకోఁతలుకోయు=ప్రజ్ఞలు పల్కు, బడాయిమాట లాడు. (వా)

జ: కోఁత, కోఁతపడు.

కోర. వి. (త. కోరం.) ౧. మద్యము మున్నగునవి త్రాగుపాత్రము; పాత్రము.

ఉ...కాంతయుఁ దాను నొక్కకో, రందపుహార దివ్యమదిరామధురామృతపానకేళి యుప్పొంద యొనర్పఁగా ... నృసిం. ౩. ౯౪. భార. మా. ౩౯.

సీ. సురవరు లమృతంబు వరుసఁ గ్రోలెడుకోర కాముకశ్రేణికి ఖడ్గధార. చిత్రభా.౪.౧౧౦.

సీ. చంద్రకాంతపుఁగోరఁ జల్లనిపన్నీరఁ దొరఁ గెడుకన్నీరు తుడిచి తుడిచి.విక్ర.౪.౧౬౨. వి. పు. ౭. ౩౭౭.

౨. పళ్లెము.

గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపుకోపున దొర లెల్ల దోఁపు లొసఁగ, నాయకుఁడు బాపురే బాపురే యటంచుఁ, గన్నులు పైఁడికోర బాగాలు నంప. వైజ. ౧. ౧౪౯.

ఉ. కూరిమిమంత్రితోడ నలకూబరుఁ డేకతమాడి పెద్దబం, గారపుఁగోరఁ గల్పవనికాజనికాంతము లైనచీరలున్, హారవిభూషణావళియు నమ్మిథునంబునకుం బ్రియంబులో, నారదమౌని చేత నదనం జదివించెఁ గుబేరుపేరుగాన్.మనుచ. ౫. ౯౬.

విణ. పెద్ద. (మ్రుచ్చుగోర.)

(మఱికొన్ని యర్థములకు-చూ. కోరదాడ, కోరసిగ, మొ)

జ: కోరకావడి, కోరకొండె, కోరకొమ్ము, కోరగొను, కోరచూపు, కోరదాడ, కోరపాగ, కోరమీసము, కోరవాయి, కోరవాలు, కోరవోవు, కోరసిగ.

**కోరంగి.** సం.వి. ఈ.స్త్రీ ౧.చిట్టేలకికి. ౨.పిప్పలికి.

**కోరకము.** సం. వి. అ. పుం. న. ౧. మొగ్గ. ౨. తామరతూఁడు. ౩. తక్కోలము కి. ౪. చోర మను గంధద్రవ్యము కి.

**కోరకావడి.** వి.(కోర+కావడి.)కొనలు పైకి వంగి ధనురాకారముగ నుండుకావడి బద్ద. (వా)

**కోరకితము.** సం. విణ. (అ. ఆ. అ.) సంజాతకుట్మలము, మొగ్గలొడిగినది. (లత, మొ.)

**కోరకొండె**=కోరసిగ. వి. బిడ్డలు లోనగువారికి ముఖపార్శ్వమున వేసెడుకొండె. (శ. ర.)

**కోరకొమ్ము.** వి. (√కోర) వాఁడియైనకొమ్ము.(బ్రౌ)
సీ. హోమకుండములపై కుతికి కొంకరకోరకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౭౬.

**కోరగించె.** అ. క్రి. (ఇది'కోపగించు'వంటిది-సం. కోరక.) ౧. మొగ్గలొడుగు, కోరకిత మగు.
సీ. జలదానిలంబునఁ బులకించెనో యనఁ గుటజ భూజంబులు కోరగించె. విక్ర. ౪. ౩౧. హర. ౨. ౨౦.
౨. ఉదయించు, పొడుచు.
శా. నాళీకాప్తుఁడు గోరగించునటముఙ్ బ్రత్యూషకాలంబునఙ్ ...శృంగారపుం,గేళాకూళిని దీర్ఘమాడి...తపతీ. ౩. ౬.
౩. (కోపముచే) ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱనగు.
ఉ. నా విని కోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై,యా వెడమాయలాఁడి...వేం.పంచ. ౪. ౪౬౬. (చూ. ౪౬౭, ౪౬౮.)
౪. (క. కోరయిను=మిఱుమిట్లుగొను.) మిఱుమిట్లుగొను, మిక్కిలి చెదరు.
సీ. మించుకన్నులు కోరగించు రాజాన్నంబు నుపమింప రానిసద్యోఘృతంబు. విక్ర.౪.౧౮౮.
చ. కనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వల సాంధ్యరాగముల్. పారి. ౨.౩౧.
౫. ముడుఁగు, ముకుళిత మగు.
గీ. కోరగించినకడకంటికొలికిఁ జూచి,వాఁడివాలికపూఁదూపువంక దీర్చు, చొరగి రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన, యించువిలుకాని వ్రాసినా రిడుపునందు. నైష. ౭. ౧౫౦. (చూ:-వ...కోరకితనేత్రత్రిభాగుండై...హర. ౫. ౩౯.)
౬. ఏడ్చు ? (స. క్రి. బాధించు ?)
గీ. కళ మిలేము లెఱుంగక గడుసువగల, బిడ్డలింపైనవస్తువు లడ్డులేక, కొంటెతనమునఁ దమ్మంచుఁ గోరగింపఁ, దల్లి యేమియు నన లేక తల్లడించె. కుచేల. ౧. ౩౯.

**కోరగొను**=కోరవోవు. (కోర+కొను.)
(హేమంతర్తువునందు) ఉ...కాళ్లు నేలపైఁ,ద్రొక్కఁగ రాక కోరగొని తొట్రుపడంగ ... పద్మ. ౩. ౭౯.

**కోరచూపు.** వి. (√కోర.) క్రూరదృష్టి.
(కిరాతవర్ణనము.) సీ. కోర చూపులయెఱ్ఱచేరుగ్రుడ్డులవాఁడు...వరాహ. ౨. ౪౫.

**కోరడి.** వి. ఆవరణముగా వేసినపొడిమట్టిగోడ, కరగోడ.(శ. ర.)

**కోరదూషము.** సం. వి. అ. పుం. కోద్రవము, ఆరిక కి.

**కోరదాడ.** వి. (√కోర.) చప్పిదౌడ,లోని కణఁగినదౌడ. (బ్రౌ.)
సీ. ఆరేయి గల నెల్లవారును గోరదాడలును నల్లని మేను గలనెలంత, యొక్కతె యిలు సొచ్చి యువిదల నీడిచికొని పోవ ... కనిరి. భార. మా. ౨౫.

వ... కోరదాడలును బల్లమీసంబులును గుబురుచే తులును... గలయొక్క బ్రహ్మరాక్షసుండు... జాహ్నవీ. ౪. ౨౦.

కోరపాగ(గా). వి. (√కోర) ఒకచెంత కొరగున ట్లు చుట్టినతలపాగా. (వా)

కోరమీస(ము). వి. (√కోర.) పెద్దమీసము. (శ. ర - సూక్ష్మాగ్రము గల మీసము. బ్రౌ)

ఆ. మనుజరక్తసిక్తతనువును గోరమీసములు వృత్తలోచనములు... భార. అశ్వ. ౩. ౮౭.

గీ. కోరమీస మిడిగ్రుడ్లు... కలిగి. నైష. ౭. ౯౩.

కోరము. వి. (√కోరు².) కొబ్బెర మున్నగునవి కోరుటకు ఉపయోగించుసాధనము. (వా)

కోరము. సం. వి. అ. పుం. ౧. అవయవాస్థిసంధివిశేషము.(వాచ) ౨. కోరకము, మొగ్గ. ౩. పృష్ఠాంకురము, చెట్టు మొలక. (శే.ని.)

కోరవాయి. వి. (కోర + వాయి) కోష్ఠమునందును శిరస్సునందును పుట్టువాతరోగము.

గీ... కోర,వాయి యనఁ గోష్ఠశీర్షవాయు వొప్పు ... ఆం. భా. ౨. ౧౨౫.

కోరవాఱు. అ. క్రి. (కోర + పాఱు)-కోపముచే-ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱనగు.

స్రగ్ధర. ఆసద్యూమ్నాగ్రజన్ముండు... నేత్రాంతముల్ కోరవాఱన్, మీసంబుల్ దీటి పల్కెన్ మృగపరివృఢగంభీరనాదంబులోడన్. పరాహ. ౩. ౨౦.

కోరవోవు. అ. క్రి. (కోర + పోవు) కొంకరలుపోవు.

ఉ... కే,దారజలంబు లర్థిమెయిఁ ద్రావి శరీరము కోరవోవఁగా, నాఱడి వొంద నేల... విక్ర. ౧. ౨౦౦.

గీ... ప్రత్యుద్గమాభివందనము లెలమి, నడపకుండిన మాననీ నన్నుఁ గన్న, నోరిమాటకుఁ దన కేమి గోరవోయె. భాగ. ౪. ౪౨.

కోరసిగ=కోరకొం డె. వి. (√కోర) ఓరసిగ, ముఖపార్శ్వమున వేసెడుజుట్టుముడి.

(వేశ్యలు బుళ్యాళ్ళంగుని గూర్చి యనుకొనుమాటలు) గీ. కోరసిగ వేయఁచోటనే కొమ్ము పుట్టి,చెడిచినది... రామా. ౨. ౧౧౦.

(దండనాయకవర్ణనము) సీ. చెవిచెంత కొరగ వేసినకోరసిగసందు తెల్లచెంగులబట్ట వెళ్లఁ గట్టి. నైజ. ౪. ౬౭.

కోరా. విణ. సంస్కరింపనిది, బాగుచేయనిది. (వస్త్రము, లోహము, మొ.)

మ. తలఁ గోరా ముడిగుడ్డయున్ దనరఁ బ్రాఁకాలమం దెప్పుడున్. చెన్న. ౫. ౨౫౨.

జ: కోరాబంగారు.

కోరాడు=క్రోడాడు. స. క్రి. (కోరు² + ఆడు.) ౧. (ఏనుఁగులు క్రీడార్థము దంతములతో గట్టు మున్నగువానిని) త్రవ్వు.

క. జేగురుఁ గోరాడినమద, నాగంబులకేళి... కై. భా. ౭. ౧౬౭.

(కరులు) సీ. దిక్కూలములు మోచి రెక్కొండమని సుమీ యలదరుల్ దాము గోరాడుచుండు. సారంగ. ౧. ౭౨.

౨. (ఎద్దులు దున్నలు మొదలగునవి మదోత్సాహములచేతఁ గొమ్ములతో) కొట్టు.

సీ. ఈకొండ సెలయేఱు లీశ్వరుపృషభంబు గోరాడుకూలముల్ గూడి యొప్పు. హరి. ఉ. ౬. ౮.

సీ. కొమ్ముల నుదకమ్ము గోరాడి వే చల్లి కలఁచి క్రీడింపనీ కాసరములు. పి. శకుం. ౩. ౪.

సీ. హోమకుండములపై కుప్తికి కొంకరకోరకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు. పరాహ. ౧౧. ౭౬.

౩. (పంది ముట్టెతో నేల మున్నగునవి) కెల్లగించు.

సీ. అవనీతలము మోర నలవోకఁ గోరాడుఁ ద్రోవ గట్టినఁ దప్పఁ ద్రోవ నలుకు... గీ...అమ్మహా కోల మవనిగహ్వరము చొచ్చె. విక్ర. ౨. ౧౩౫. రామ. ౩౭౭.

౪. (ఎలుఁగులు, మొ నఖాదులతో) చీరు, చీల్చు.

వ...ఎలుంగులు గుంపులుగుంపులం బుట్టలు నిశితనిజనఖర కులిశకోటులం గోరాడ...మనుచ. ౪. ౩౭.

౫. (దుమ్ము లోనగువానిని) రేఁగఁజేయు.

గీ. ప్రాభవంబున దోర్దండబలము మెఱసి, గ్రొచ్చి కోరాడి త్రవ్వి రి కుతల మెల్ల. భాగ. ౯. ౨౦౫.

ఉ... క్రేళ్లుదాఁటెడుమబాళ్లులతోఁ దెలిదమ్మి ధూళి గో,రాడిరి...లతాంగులు రాగరసైక మగ్నలై. రామా. ౧. ౨౦౬. ఆం. భా. ౩. ౧౩౨.

౬. పాడుచేయు.

(ద్వివిదుఁ డనువానరుఁడు) సీ. సరిదుపవనసరోవ రములఁ గోరాడి మందలఁ గొందల మందఁ జే సి. భాగ. ౧౦. ఉ ౫౪౧.

**కోరాబంగారు.** వి. (√కోరా) అపరిశుద్ధమైన బం గారము, ఇతరలోహములతో కలసి వన్నె తగ్గిన బంగారము. (బ్రౌ, శ. ర.)

**కోరింద.** వి. లక్కగలిగెడియొకానొకతీఁగ. (శ. ర.)

సీ. ఇడిసినయిమ్మపులయెడలఁ బొప్రేనుత్తరేనుగ సిందకోరిందపొదల. ఆము. ౬. ౧౩.

సీ. ఎడ నెడఁ బికిలిపూ లిడినసంకులపేర్లు కోరిం దపూసలఁ గూడఁ దాల్చి. యమా. ౧. ౩౦.

**కోరిక**=కోరికి, కోరికె. వి. (√కోరు[1]. త. కోరి క్కై. క. కోఱికె.) ౧. కోరుట; ఇచ్ఛ, వాంఛ, కామము.

క. కోరికయు నొల్లమియు లే, కేరూపున భూత ములకు నెగ్గగు తెఱఁగుం, జేరక యకామవృ త్తిఁ ద,పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపిం చుక్. భార. శాం. ౬. ౨౨౪.

క. ఈకథ యెవ్వరు చదివినఁ, గైకొన్నను విన్నఁ గోరికను వ్రాసిన వా,రేకాలము శంభునికృప, నాకల్పము గందు రైహికాముష్మికముల్. భ ల్లా. ౫. (శ. ర)

క...మీర లిచ్చట నునికిఁ, సారెకుఁ గొల్వఁగ వ త్తును,గోరికతోఁ గంసహర ముకుంద మురారీ. పారి. ౧. ౫౧.

౨. అభీష్టార్థము, వాంఛితార్థము; వరము.

ఉ. ఎక్కుడుభక్తితోఁ గొలువ నిచ్చెదఁ గోరినవా రికోరికల్. దశా. ౧. ౨౫౪.

క...నీకు నెయ్యది, కోరిక యేతెంచినాఁడ గురు దక్షిణ యీ, భూరమణ వేఁడుము...ఆము.౩. ౫౪.

గీ. నలువ కోరిక లొసఁగెడినాఁడు...అచ్చ.రా. యు. ౮.

**కోరికి(ర్కి)**=కోరిక. వి. (√కోరు[1]) ౧. వాంఛ, ఇ చ్ఛ, అభిలాషము.

క. నీకోరికి యప్రతిహత,మేకార్యము గోరి వచ్చి తెఱిఁగింపుము...భార. ద్రో. ౨. ౧౬౧.

చ...ఇత్తెఱంగుగో,ర్కికిఁ గత మేమి పాండవుల గెల్చి ధరక్ సగ మీఁ దలంచితే. భార. ద్రో. ౧. ౧౧౯.

౨. వాంఛితార్థము, అభీష్టార్థము.

క. నాకోర్కి పిదపఁ జెప్పెద,లోకనుతా యొకటి యడుగ లోలత్వము చి,త్తాకలిత మయ్యె... భార. శాం. ౬. ౫౯౬.

క. కొలిచినబంటులకోర్కులు, పాలు పొనరఁగఁ బిడుకవేలుపున్నాదవునకుక్. నీలా. ౧. ౨౧. హ రి. ఉ. ౨. ౧౫౬.

౩. చిత్తము, మనస్సు, ఇచ్ఛ.

ద్వి. ఇదె నాదుముఖభంగ మీక్షింపు నాదు, కోద వ నీకొదవఁ గాఁ గోర్కి భావింపు,మనిన నచ్చె రు వంది యాత్మ భావించి, దనుజాధినాధుఁ

డాదానవి కనియె. రం. రా. ఆర. ౧౮౯ పా. ౪ పం.

కోర్కులపంట=వాంఛితముల నిచ్చునది.

ఉ... ముం,గొంగుపసిండి భక్తులకుఁ గోర్కులపంట జగంబులందు మా,మంగళశైలవల్లభుసమం బగుదైవము లేదు చూడఁగన్. అని. ౧.౪౨.

కోరికిపడు=అపేక్షపడు, తమకించు.

మ. విని వీక్షించినదాఁక ముచ్చటపడున్ వీక్షించి గాఢోపగూ, హనలాభం బగుదాఁకఁ గోరికిపడున్... మల్లభూ. శృం. ౨౨.

కోరికె=కోరిక.

(ఇచ్ఛ, వాంఛ)

క. కేదారశ్రీగురువర, పాదాంభోజాతమునకుఁ బ్రణుతి యొనర్తున్, మేదిని మామకమానస, కేదారములందుఁ గోరికెలు ఫలియింపన్. తప తీ. ౧. ౭.

కోరితము. సం. విణ. (అ.ఆ.అ.) కోరకితము, మొగ్గ తొడిగినది.

కోరు[1]. స. క్రి. (క. త. మ. తు. కోరు.) ౧. వాంఛించు, కామించు; వరించు.

క. కోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్. భార. విరా. ౧. ౨౧౯.

ఉ... పరదారధనాదులఁ గోర నేని... మను చ. ౨. ౭౬.

ఉ. ఔర యి దేటియోజన మృగాయతలోచన నన్నుఁ గోరునో, కోరదొ... దశా. ౨. ౩౧౩.

౨. ప్రతీక్షించు, నిరీక్షించు, ఎదురుచూచు.

గీ... కొంత ధైర్య, శాలినై యుంటిఁ దన్నిదర్శనముఁ గోరి. దశా. ౧. ౧౭౫.

జ: కోరిక, కోరికి, కోరికె.

కోరు[2]. స. క్రి. చీరు; గీఱు.

సీ. తోరంపుఁగొమ్ములఁ గోరి చెండాడుచోఁ గడిఁదిచిచ్చునఁ ద్రోచి కాల్చుచోట. నృసిం. ౪. ౧౨౧.

(వ్యవ) కొబ్బెరకాయలు కోరి కూరవండుదురు.

౩. కామదండము, మగగుఱి.

గీ. గురునిసతి దాదియు ననంగఁ బరఁగువారిఁ, గవయుకష్టుండు గురుతల్పగామి వాఁడు, ఉత్తమబ్రాహ్మణుఁడు గాక యుండె నేని, చంప కాతనికోరును ద్రెంప వలయు. విజ్ఞా. ప్రా. ౧౦౬. (ఇట 'కోలను' అనియు చదువవచ్చును.)

శ్లో. ఆచార్యపత్నీం స్వసుతాం గచ్ఛంస్తు గురుతల్పగః, లింగం ఛిత్త్వా వధస్తస్య... యాజ్ఞ. ప్రా. ౨౩౩.

౨. గీఱినకొబ్బెర మున్నగుపదార్థము.

(వ్యవ.) కొబ్బెరకోరుపూరణముపెట్టి బూరెలు వండినారు.

3. (క. కోలు) - పంట మున్నగువానియందలి-భాగము, పాలు, వంతు.

క. కోరనఁ బాలన నంశం, బు... ఆం. శే. ౪౫.

ఉ. వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ, గోరరి గొంచు సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి, స్తారముగా బలారికి వచస్పతి చెప్పుట యప్రసిద్ధమే. శార. భీష్మ. 3. ౩౦౯.

క. దున నియ్యకొన్నకృషికుఁడు, దునకయ యున్నేని యొకని దున్నింపఁ దగున్, దునక దున నీయ కాఁగినఁ, గొనఁగా నగుఁ జేనియరియుఁ గోరు నతనిచేన్. విజ్ఞా. వ్యవ. ౧౫౧.

సంగోరు=సగముపాలు.

మేటికోరు=పెద్దభాగము. (రైతునకు నెల్లభాగము. బ్రా.)

౪. (సం. కారః.) రాజాదులకిచ్చుధనేతరవస్తురూప మైనకప్పము.

చ. అరులకుఁ గోరువెట్టితిఁ గదా నిమఁ దమ్ముఁడ వైరిఁ జంపి యె,వ్వరివలమూఁపుమీఁద విలు

నైతు నయోధ్యకు నెట్లు పోవుదుర్, మరలి
సుమిత్ర న న్నడిగినం దలవంచుట యుత్తరం
బె... రామా. ౭. ౩౭.

జ: కోరము, కోరాడు.

కోరురాజనాలు. వి. బ. ధ్యానవిశేషము. (బ్రా)

సీ.... జిలకఅరాజనా ల్చింతపువ్వులు గోరురాజ
నా ల్బుదపోల్ రాజనాలు. హంస. ౪.౧౭౭.

కోర్ణగండు=కొర్నవగండు. వి. క్రూరమృగవిశేష
ము, దుమ్మలగొండి.

మ.... కోర్ణగండ్లు గుఱపోతు ల్కొండగొఱ్ఱె
ల్కారం,గులు నెందెందుఁ గనుంగొనంగ వని
లోఁ గోటానఁగోటుల్ నృపా. ఇందు. ౨.
౫౧.

కోఱ. వి. (సం. ఖురః. త. కోరప్పల్.) ౧. పల్లు,
దంష్ట్ర.

చ. తమలము కెంపున న్మెఱుఁగు దాఁకినచెందిర
కావికోఱలున్ ...ఒప్పమిండజం,గము చను
దెంచె... హర. ౧. ౧౫.

సీ. మెఱుఁగుఁగోఱలు డుల్ల మృత్యుదేవతనోరు
దట్టించి యముకాలఁ దన్ని నాఁడు. భీమ. ౧.
౧౧౦.

(కాలనేమి) ఉ. కోఱలు దీటుచున్ నయనకోణ
ములన్ దహనస్ఫులింగముల్, కాఱఁగ... హ
రి. పూ. ౪. ౧౪౪.

గీ... వాసుకికోఱలు వెఱుక... భార. విరా. ౪.
౨౧౩.

చ. బరవస మొప్ప గాలితడఁబాటు మెయిన్
గవి దూటి యొక్కకు, ఱుక్కరము తమంబు
లో వెరఁజి కోఱలచేఁ గబళించి పొట్టపెం, జె
ర నుడుమంచుఁ దెచ్చి కని చేవ దొఱంగక
ద్రుంచి వైచె...మనుచ. ౪. ౫౭.

కోఱలుతీసినపాము = కోఱలు తీసినపామువంటి
ది. (వా.)

కోఱకైదువ=దంష్ట్రాయుధము, పాము.

గీ. చలువ గలమత్తిరొల్లిక్రీఁడట్టుమీఁద, నిలువ
నందఱితోఁ గూడఁ బాలసు మెసవి, కోఱకై
దువదు నెదారిగుఱుతుగట్టు,సామి సంతోసమున
నున్న సమయమునను. ప్రబంధ. ౨౧౦. (కోఱ
కైదువదు నెదారి=సర్పరాజు, శేషుఁడు.)

జ: కోఱకొమ్ము, కోఱపల్లు.

కోఱకొమ్ము. వి. (కోఱ+కొమ్ము) సూదికొమ్ము,వాఁ
డిమొన గలకొమ్ము. (బ్రా)

సీ. మీఱిజినక్రొవ్వాఁడికోఱకొమ్ములఁ బుట్ట లాడ
కాడకును గోరాడి యాడి. వి. పు. ౭.౩౦౪.

క్రోఱడము. వి. ౧. క్రోధము, కోపము.

చ. పడిగొని కాలకేయభటవర్గము ద్రోచినఁ దాను
సేనలుం,గడఁగి నిశాచరేశ్వరుఁడు గ్రందుగఁ
దాఁకి రణంబునందడిం, దొడిఁబడ ప్రేసెఁ దీ
వ్రతరదోశశనిం దను నీడఁబోక కో,ఱడము
న బిట్టు గిట్టినముఱంది నెఱుంగక దుర్మదాం
ధుఁడై. నిర్వ. ౫. ౭౭. (చూ. ౭౬.)

౨. క్రౌర్యము.

గీ. బాలకునిఁ జంపఁ దలఁచుట పాప మనక, కో
ఱడంబున నొండొరు మీఱఁ బాఱి, వేఱు వే
ఱు యుపాయముల్ వెదకి వెదకి, కలయఁ బ
ల్కకిరాతులఁ గాంచి యచట. దశకు. ౨.
౭౧.

౩. ప్రతికూలవచనము.

చ. ధనదునియొద్ద కేఁగి యుచితంబుగఁ బల్కి
పురంబుఁ బాసి పొమ్మని మును చెప్ప కోఱ
డము లాడిన మద్భుజశక్తి యంబుజా, సనవర
శక్తి మూలబలశక్తి యెఱుంగఁగఁ జాటి చెప్పి
రమ్మని చతురాతిభాషణుఁ బ్రహస్తునిఁ బు
చ్చె సురారి లంకకున్. నిర్వ. ౩. ౯౯.

ఉ. జీఱికకల్లు ద్రావి మదసింధురగామిను లన్ని కే
రియ,ల్వాఱుచు గొఁడుగీతములు వాడుచుఁ
బొల్పుగఁ గ్రాలి యాడుచున్, గోఱడమాడు

చం బతులకు న్వళవస్తులు గాక మేరకున్, మీఱుచు వన్యకాంతలు రమింతురు తద్విపి నాంతరంబునన్. కు. సం. ౬. ౭౦౨. (ప్రాక్తప్రతిపాఠము.)

**కోఱపల్లు.** వి. ఔ. (√కోఱ) మృగదంష్ట్రవలె వాఁడి మొనగలిగి పలువరుసలో ప్రక్క నుండుపల్లు.
(వ్యవ) పిల్లవానికి ముందఱిపండ్లు వచ్చినవి కాని కోఱపండ్లు రాలేదు.
సీ. దేవేంద్రమదభేది తెలిచాయ గలకోఱపంటి మొనల్ సానఁబట్టుకొమ్ము. కువల. ౨. ౧౦౨.

**కోల.** వి. (క. త. మ. కోల్.) ౧. చేతికఱ్ఱ; కఱ్ఱ; బెత్తము.
గీ. బాలుఁ డొక్కఁడు కొండొకకోల నేతఁ, బట్టుకొని...భార. ఆది. ౬ ౨౬౦.
చ. కలికిపిసాళినవ్వు లెసఁగన్ వటుధూర్తులు కొంద ఱొండొరుం, దలకొన నెచ్చరించి తమదండపుఁగోలల నున్నమాఱుగోఁ, చులు వెసఁ బుచ్చి వైచి...ప్రభా. ౧. ౧౦౨. (దండపుఁగోల=దండముగా నుపయోగించుకఱ్ఱ.)
గీ...హెగ్గడికత్తె లరిది, పైఁడికోలలు పూని వే పదఁ డటంచుఁ, బల్లకీముందఱను బరాబరులు సేయ. యయా. ౪. ౧౫౮.
౨. (చెఱకు) గడ. (చూ. చెఱకుఁగోల.)
౩. (గొడుగు మున్నగువాని) కామ, దండము.
చ. గొడుగుల గాలిఁ గూల్చి మఱి కోలలతో డనపాఱనాన్చెఁ జే, ద్వడ జడి మేఘుఁ డట్లకట పాంథులపైఁ దన కెంత వైరమో. ఆము. ౪. ౧౨౯.
౪. పుల్ల, పుడుక.
క. వాలికపూములుకులఁ ద, త్కాలంబునఁ దొంటి యంపగంట్లును రేఁగెన్, జాలఁగ నురిసినపుండులు, కోలలఁ గెలఁకు టని యాళకుంతల కయ్యెన్. పి. శకుం. ౩. ౧౭౦.
౫. బాణము.
శ. విందునిసారథి నొకకో, లం దునిమిన వాహములు గలంగంబడి...భార. భీష్మ. ౩. ౩౩.
ఆ. కుండనీరు ముంప ఘుమఘుమధ్వని వినిఁ, గుంభినిన దబుద్ధిఁ గోలఁ దొడిఁగి, కడిమి నేయ...భా. రా. అయో. ౧౭౬.
౬. కఱ్ఱకుట్లు కాల్చుట కుపయోగపడుసాలము, ఇనుపసలాక.
సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగిలించి సురియతో బిగియ ద్రిండు, గట్టినసుఁజేలక ప్పెంతయును జెన్ను సేయంగ డాపలిచేతియందు, జెడిదంపుఁగోలలు బెడఁగొంద...భార. విరా. ౧. ౨౧౧.
౭. శిశ్నము, మగగుఱి.
గీ. గుదమునం దేనుమాఱులుఁ గోల నొక్క, మాఱు డాపలిచేఁ బదిమార్లు రెండు, చేతులను నేను మాఱులుఁ బ్రీతి మన్ను, చమికి శౌచంబు చేయుట చదురుఁదనము. విజ్ఞా. ఆచా. ౩౯.
విశే. దీర్ఘవృత్తము. (వ్యతి. గుండ్రము.)
ఉదా: కోలమొగము, కోలనిమ్మ, మొ.
కోలమూఁపు=ఎత్తైనమూఁపు.
సీ. బూరకాళులు నీచవోయిన చేతులుఁ గోలమూఁపులు గుదిగొన్నతొడలు. ఉ. హరి. ౨. ౧౩౨.
నేలకుఁగోలకుఁ దెచ్చు=(కొందఱను నేలఁ బడవైచు కొందఱను బాణములతో కొట్టు) పలువిధముల క్షోభపెట్టు. (క్రిందుమీఁదుచేయు. శ.ర, బ్రౌ.)
క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నేలకుఁగోలకుఁ దెత్తురనో, రికివచ్చినయట్టు లాడిరే యిబ్భంగిన్. భార. కర్ణ. ౩. ౮౮.
గీ. కోలుమసఁగి గురుండు పాంచాలసేన, నేలకును గోలకును దెచ్చె...భార. ద్రో. ౫. ౩౦౧.
కోలకుఁ దెచ్చు=బాణమునకు గుఱిసేయు.
(శ్రీరామావతారమున) గీ. కడలిఁ గోలకుఁ దెచ్చి నగబ్బి వీవ. పారి. ౧. ౪౯.

పా: కోల లేనికొట్టు, త్రాడు లేనికట్టు. (బ్రౌ)

జ: కోలకాఁడు, కోలక్రోఁతులు, కోలగగ్గెర, కోల జున్ను, కోలజెముడు, కోలదబ్బ, కోలదివియ, కోలదివ్వె, కోలనిమ్మ, కోలపాల, కోలపాన్న, కోల మెఱుఁగు, కోలలవారు, కోలవస, కోలాకుపాన్న, కోలాట, కోలాటపుఁగమ్మ, కోలెమ్ము.

**కోల.** సం. వి. ఆ. స్త్రీ.౧. చవ్య మనుగంధద్రవ్యము శీ. ౨. పిప్పలి శీ.

**కోలంబకము.** సం. వి. అ. పుం. వీణాశరీరము, వీణయొక్క సర్వాంగము.

**కోలకందము.** సం. వి. అ. పుం. కృమిఘ్నము, ఒక జాలిదుంప శీ. (రా. ని.)

**కోలకము.** సం. వి. అ. న. ౧. తక్కోలపుఁజెట్టు. ౨. మిరియము శీ. పుం.౧. అంకోలము, ఊడుగు శీ. ౨. బహువారకము, విరిగి శీ.

**కోలకాఁడు.** విణ. (కోల+కాఁడు.) వేత్రధరుఁడు, చోపుదారుఁడు.

ద్వి. వెడనవ్వు గదుర భూవిభుని డాయుటయుఁ, గడు రయంబునఁ గోలకాండ్రదలింప, వడి వ్రేయవచ్చినవారి వారించి, పుడమిఱేఁ డాతనిపోలిక దెలిసి. నవనాథ. ౪. ౧౩౧ పా.౧౩ పం.

సీ. అఖిలజీవుల నేర్చుయముఁడు నాముందఱఁ గోలకాఁడై యుండు వేళ యెఱిఁగి. సీతావి.౪. ౧౧౧.

**కోలక్రోఁతులు.** వి. బ. (కోల+క్రోఁతులు) బాల క్రీడావిశేషము, కోఁతికొమ్మంచి.

సీ. కోలక్రోఁతులు బిల్లగోళ్లు దూరనగోల లందలం బులు మఱి కుందికాళ్లు...గీ...ఆదిగా శైశవ క్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదార కులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

**కోలగగ్గెర.** వి. (√ కోల) కాళ్లకు త్రాడు తగిలించి ఏద్దులను మూటకట్టుగా కట్టి పడవేయుట.

గీ. ఎద్దులను గాళ్లు గట్టి క్రిం దేయు టొప్పఁ, గోలగగ్గెర యనఁగ...ఆం. భా. ౩. ౩౨.

గీ. అసియుఁ శాత్త్రయుఁ దేఁ బంపి యాంత్రపల్లిఁ, గోలగగ్గెర ద్రోయఁ దక్కుజముతోడ, నొరగి రక్కసులో దైన్యవిరహితముగ, ధర్మ మెఱింగించుసూక్తి నాతండు వలికె. ఆము. ౬. ౨౭. (శ. ర, బ్రౌ. పా-కోలగగ్గెరద్రోయక=పసరమును కట్టి పడవేయునట్లు పడవేయఁగా)

**కోలచ్చౌరి.** వి. నాట్యవిశేషము.

ఉ. దేశివిధంబు రట్టణము దివ్యకలాసియుఁ గోలచారి... శ్రీరం. మా. ౪. ౧౬౨.

**కోలజొన్న.** వి. (√ కోల.) ఒకరకము తేనె, ఔద్దాలకము. (శ. ర)

**కోలజెముడు.** వి. (కోల+జెముడు) ఒకవిధ మగు జెముడు, సింహుండభేదము శీ.

గీ. నేలతీఁటకసిందయుఁ గోలజెముడు ... మొదలు, గాఁ గలుగునట్టిచిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

**కోలదబ్బ.** వి. (√ కోల.) ఒకజాతిదబ్బ శీ. (శ. ర.)

**కోలదలము.** సం. వి. అ. న. నఖ మనుగంధద్రవ్యము శీ.

**కోలదివియ.** వి. (√ కోల) కాఁగడా.

గీ. కోలదివియలవెలుఁగు దిక్కులకు నిగిడి, తొడరి పురవీథిఁ జీకటిఁ దొలఁగఁ దోల. దశకు. ౫. ౯౦.

**కోలదివ్వె(వ్వియ)**=కోలదివియ.

ద్వి...తలవరులు, కోలదివ్వెలవారిఁ గొంచు నవ్వీథిఁ, బదపదఁ డిదె దొంగపదపంక్తి చొప్పు, వదలకుం డని రాఁగ...ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౯౯ పం.

**కోలనిమ్మ.** వి. (√ కోల) నిడుపుగా నుండుకాయలు గలఒకజాతినిమ్మ శీ. (శ. ర.)

**కోలపాల.** వి. (√ కోల.) అక్కుపుష్పిక ఌ. (శ. ర.)

**కోలపుచ్ఛము.** సం. వి. అ.పుం-పందితోఁకవంటి తోఁక గలది-రాపులుఁగు.

**కోలపొన్న**=కోలాకుపొన్న. (కోల+పొన్న.)

సీ. కోలపొన్న యనంగఁ గొమరారుఁ బృశ్నిపర్ణి యు...ఆం. భా. ౨. ౫౫.

**కోలము.** వి. (త. కోలమ్=ఆట.) నాట్యభేదము. (బ్రౌ.)

గీ. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి, మమునఁ గాళిక నిల్చి కోలము నటింపఁ, బొరి మొగంబున రాలునిప్పుకలనంగ, గుంపులై రాలె మహి నింద్రగోపతతులు. ఆము. ౪. ౯౭.

**కోలము.** సం. విశే. (అ. ఆ. అ.) ఖంజము, కుంటిది. వి. అ. పుం. ౧. పంది. ౨. తెప్ప. ౩. శనిగ్రహము. ౪. ఒడి. ౫. కౌఁగిలి. ౬. మూషికము, ఎలుక. న. ౧. అర్ధకర్షమెత్తు. ౨. తక్కోలము ఌ. ౩. రేఁగుఁబండు. ౪. త్రికటుకము. ౫. శుంఠి, సొంటి.

**కోలమెఱుఁగు.** వి. (కోల+మెఱుఁగు) నిలువుమెఱుపు, ఐరావతి.

సీ. శివుదిక్కునందు వేకువఁ గోలమెఱుఁగులు మెఱసె...హరి. పూ. ౭. ౧౬౦.

వ. కోలమెఱుంగులతెఱంగున రంగు మీఱుబంగారుజలపోఁతబెత్తంబులనటున ఘటిల్ల ...కళా. ౭. ౬౯.

**కోలలవారు.** వి. బ. (√ కోల) వేత్రధరులు, చోపుదారులు.

వ. సైనికులం జేరుకొని వాసి యెక్కించి పురికొలుపుకోలలవారియెలుంగులును...ఉ. హరి. ౩. ౨౭.

**కోలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి ఌ.

**కోలవస.** వి. (√ కోల) జటిల ఌ. (శ. ర.)

**కోలశింబి.** సం. వి. ఈ. స్త్రీ. ఖుట్వా, కంబళిచిక్కుడు ఌ.

**కోలాకుపొన్న.** వి. (కోల+ఆకు+పొన్న) పృశ్నిపర్ణి, అంఘ్రిపర్ణిక ఌ.

సీ...చిత్రమూలము నల్లతీఁగె కోలాకుపొన్న... హంస. ౪. ౧౦.

**కోలాట(ము).** వి. (కోల+ఆట-త. కోలాట్టం.) హల్లీసకము, స్త్రీలు చేతికోలలతో తాళము వేయుచు పాడుచు చుట్టును తిరిగి ఆడెడు ఒకవిధమగు ఆట.

సీ...కోలాట మనఁగ హల్లీసకం బలరుమారు. ఆం. భా. ౧. ౧౩౦.

గీ...నిద్దంపువేడ్కఁ, దవిలి కోలాట మాడుగంధర్వసతుల. చంద్రి. ౨. ౨౦.

వ... మోహనాంగులపాంశుళ్యంగారంబులు వెలపుచుఁ గోలాటలాడ. ల. వి. ౫. ౭౪.

(ఈ క్రింది ప్రయోగమున పురుషుల ఆటగా కూడ కనఁబడుచున్నది.)

సీ. కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడిక్రోవిహూఁతలు నూఁదుఁగ్రోవులు...గీ...ఆడుకొనుచుఁ, జమువుపై సంధ్యపై నాస్థ చాల లేక, పాలఁతియాకీలి నేఁ బ్రొద్దుపుచ్చుచుండ. హంస. ౩. ౧౪౬.

కోలాటమునైచు=కోలాటమువేయు.

శా. గీర్వాణబాలామణుల్ ...పాడుచుం, గోలాటంబులునైచి రామతిశ్రమం గూర్తింగలాక్షింపఁగన్. చంద్ర. ౨. ౧౩౯.

**కోలాటపుఁగమ్మ.** వి.(కోలాటము+కమ్మ) ఒకవిధమైననగ, కర్ణాభరణవిశేషము.

సీ. కడియాలుఁ బెక్కుజోకలయుంగరములు ముంగరయుఁ గోలాటంపుఁగమ్మతోడు. కళా. ౭. ౬౬. (ముంగరయును గోలాట కమ్మతోడు. పాఠాంతరము-శ.ర.)

షి,వానిగొడ్డలి నడశావిలోన వైచె. గంధ. ౬౬.

**క్రయణము.** సం. వి.అ. న. కొనుట, విలుచుట.

**క్రయణీయము.** సం=క్రేయము.

**క్రయపత్త్రము.** సం=క్రయలేఖ్యము.

**క్రయపెట్టు.** మి. స. క్రి. (క్రయము+పెట్టు) వెలకు పెట్టు, అమ్మఁజూపు.

సీ. పారుకూళ్లఁ గలమాన్యభూముల ధాన్యంబుఁ గ్రయపెట్టి విడుచు...నిరం. ౨. ౨౬.

**క్రయము.** సం. వి. అ. పుం. ౧. వెల. ౨. (వెల యిచ్చి) కొనుట, కొనుగోలు.

**క్రయలేఖ్యము.** సం. వి. అ. న. క్రయమును సూచించుపత్త్రము.

**క్రయవిక్రయికుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) క్రయవిక్రయములచే జీవించువాఁడు.

**క్రయారోహము.** సం. వి. అ. పుం-కొనుటకు వచ్చుచోటు-హట్టము, అంగడివీథి.

**క్రయించు.** సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను, విలుచు. (శ.ర)

**క్రయికుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) (సరకును వెలయిచ్చి) కొనువాఁడు, విలువకాఁడు. (వై. ని.)

**క్రయ్య**=కయ్య.

(కుల్య, కాలువ)

ఉ. ...కృత్తవానరశరశ్చరణాదులు నేమిఘుట్టనం, గ్రయ్యలు గట్టి యున్నరుధిరస్థలులుం బలితాస్త్రపంక్తులుం, గయ్యపునేల నుగ్రగతిఁ గానఁబడం దఱుచయ్యె నెంతయుక్. భా. రా. యు. ౬౯౭.

ఆ. అధికబలము గెల్చి యవనీపతులు గొంద, ఱతివిహీనరిపులయాక్రమమున, మడిసి రకటజలధి వెడలి సన్నపుఁగ్రయ్య, మునిఁగి రూపడంగుజనులమాడ్కి. భార. సౌ. ౨. ౧౭.

**క్రయ్యాట**=కాలువయూట, కాలువనీరు.

ద్వి. ఇందులక్రయ్యాట లీప్సితార్థంబు, లందిచ్చురసరసాయనసుధావారి. పండితా.పర్వ. ౩౧౩ పు.

**క్రయ్యఁబడు.** అ. క్రి. (క్రయ్యక్+పడు-స్వార్థమున) ౧. కలియఁబడు; చొరఁబడు.

క. నెయ్యమున నడిగిపుచ్చుట, యియ్యకొనక యర్థమీక యీర్ష్యాపరుఁడై, కయ్యమున గెలిచి కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనినరాక్షసమయ్యెక్. విజ్ఞా. ఆచా. ౧౦౦. (బలాత్కారము గా అని భావము.)

క. ఒంటి చరింపవు పొలమున, నింటికిఁ గడుఁ బ్రొద్దుగలుగ నేతెంచుచు రా, వెంటఁబడి పాడుచుగోవుల,జంటఁ జనకు క్రయ్యఁబడవు సందడి యగుచోక్. భోజరా. ౬. ౩౨.

౨. కలియు, కూడు.

క. వెయ్యేండ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ...భాగ. ౯. ౫౭౭.

**క్రయ్యఁబాఱు.** అ. క్రి. (క్రయ్యక్+పాఱు) కలయఁబాఱు.

(గంగ) వ... మానిని యన లోఁతు సూపక గరితయన నడిచప్పుడు సేయక ముగుద యన బయలుపడక ప్రమద యనఁ గ్రయ్యంబాఱుచుఁ బతివ్రత యన నిట్టట్టు చనక...ప్రవహించి. భాగ. ౯. ౨౩౦.

**క్రయ్యము.** సం. విశ. (అ. ఆ. అ) కొనుటకు అంగడియందు సిద్ధపఱుపఁబడినది.

**క్రయ్యు.** అ. క్రి. కలియు.

(గంగావర్ణనము) వ ... ముద్దుఁజందురులోడ నెయ్యంబునఁ గ్రయ్యు నడరి చొప్పు దప్పక సాగి చనుదెంచుసుధార్ణవంబుకైవడిఁ బెంపుగలిగి...భాగ. ౯. ౨౩౦.

జ: క్రయ్యఁబడు, క్రయ్యఁబాఱు.

**క్రల్లపడు.** అ. క్రి. దగ్ధమగు, కాలు.

క. తరు లెల్లఁ గ్రల్లపడఁగా, విరళములై నీడ లున్నవిధ మెప్పె నహ,స్కరరుచులతోడఁ దలపడి,యకవరలై తుమురుతుమురులై పడినక్రియన్. హరి. పూ. ౬. ౩౬. (శ. ర. పా.)

**క్రవ్యఘాతనము.** సం. వి. అ. పుం-మాంసముకొఱకు చంపఁబడునది-లేడి, జింక.

**క్రవ్యము.** సం. వి. అ. న. మాంసము, పొల.

**క్రవ్యాత్తు.** సం. విణ. (ద్) మాంసమును తిను వాఁడు. వి. ద్. పుం. ౧. రాక్షసుఁడు. ౨. మాంసమును తినుజంతువు. (పులి, గ్రద్ద, మొ.)

**క్రవ్యాదము.** సం. వి. అ. పుం. ౧. మాంసమును తినుజంతువు (పులి, గ్రద్ద, మొ.) ౨. రురువు, నల్లచాఱలు గలదుప్పి. (కల్ప.)

**క్రవ్యాదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) మాంసమును తినువాఁడు. వి. అ. పుం. రాక్షసుఁడు.

**క్రవ్యాశి.** సం. విణ. (న్. నీ. న్.) వి. న్. పుం=క్రవ్యాత్తు.

**క్రశితము.** సం. విణ. (అ. ఆ. అ.) కృశీకృతము, కృశింపఁజేయఁబడినది.

**క్రశిమ(ము).** సం. వి. న్. పుం. కృశత్వము, బక్కచిల్లుట.

**క్రష్ట.** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. కృశించువాఁడు. ౨. లాగువాఁడు. ౩. దున్నువాఁడు.

**క్రష్టవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దున్నఁ దగినది. ౨. లాగఁ దగినది.

## క్రా

**క్రాంతదర్శి.** సం. విణ. (న్. నీ. న్.) ఇంద్రియాతీతవిషయజ్ఞానము కలవాఁడు, సర్వజ్ఞుఁడు.

**క్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పోయినది, వెళ్లినది. ౨. ఆక్రాంతము, వ్యాప్తము. శిశు. ౪. ౩. వి. అ. పుం. గుఱ్ఱము. న. ౧. పోవుట, వెళ్లుట. ౨. అడుగు, చరణము. ౩. (జ్యోతి) ఏకనక్షత్రమున చంద్రునితో మఱియొక గ్రహము కలియుట.

**క్రాంతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పోవుట. ౨. అడుగిడుట, పాదవిక్షేపము. ౩. మీఱుట, అతిశయించుట. ౪. అణుచుట, ఆక్రమించుట. ౫. ఖగోళమండలిసూర్యమార్గము.

**క్రాంతికక్షము.** సం. వి. అ. పుం. ఖగోళమండలిసూర్యమార్గము.

**క్రాంతిమండలము.** సం. వి. అ. న=క్రాంతికక్షము.

**క్రాంతివలయము.** సం. వి. అ. న. పుం=క్రాంతికక్షము.

**క్రాంతివృత్తము.** సం. వి. అ. న=క్రాంతికక్షము.

**క్రాఁక**=కాఁక. (√క్రాఁగు-శ. ర.)

**క్రాఁగు**=కాఁగు. అ. క్రి. ౧. దగ్ధమగు, కాలు; తపించు, మండు; పరితాప మొందు.

ఉ. కౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దు,ర్వారభవత్ప్రతాపశిఖిఁ గ్రాఁగె మదిన్ వగ పేల దీనికిన్. భార. శాం. ౧. ౯౩.

క. ఈగంగాదికతీర్థము,లీఁగంగా నీవు తమసమిద్ధాంబువులం, దోఁగెడువారల గనఁగనఁ,గ్రాఁగెడునంగారసింధుకల్లోలములన్. పాండు. ౧. ౧౫౦.

సీ. పరదేసులై భూమిఁ దిరిగెడివారును గతి లేక యాఁకటఁ గ్రాఁగువారు. వి. పు. ౪. ౧౫౪.

౨. పోవు, నశించు.

ఆ. కడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ,యంతిఁ బుణ్యమూర్తి యైననలుని, నుతచరిత్రుఁ డైనఋతుపర్ణుఁ గీర్తింపఁ, గలిభయంబు లెల్లఁ గ్రాఁగు నధిప. భార. అర. ౨. ౨౩౦.

గీ. క్షత్త్రవధ నైనపాపంబు గ్రాఁగ వలయుఁ,గడఁ

గి నాకును సద్గతి గలుగ వలయు. భార. ఆర. ౨. ౨౬౨.

సీ. ఘనతపోనియతిఁ గ్రాఁగనికలుషంబులు జప
ము సేసిన నశించనియఘంబు,లు... గీ. అచ్యు
తానంత గోవింద హరి మురారి,యని తలంచి
నయప్పుడే యడఁగిపోవు. వి. పు. ౩. ౧౩౫.

౨. కాఁగు, పెద్దబాన.

సీ...క్రాలుఁ గటాహంబు క్రాఁ గనంగ. ఆం. భా. ౨. ౨౮౫.

గీ. క్రాఁగుపై మ్రుగ్గు తెలినిగ్గుఁ గ్రాఁగి పొంగ, సాగు
పాలని పై నీరు చల్లి చల్లి, యల్లుకొనునట్టినె
న్నెల నల్లుకొన్న, యన్నుమిన్నలు విహరించి
రన్నివగల. రా. వి. ౩. ౧౩.

క్రాఁగిపోవు=క్రాఁగు.

(నశించు.)

గీ. తామ్ర మాదిగఁ గలయట్టిధాతుచయము, గొలి
మి నిడి యూఁదఁ గీ డెల్లఁ బొలియునట్లు,
ప్రాణపవననిగ్రహమునఁ గ్రాఁగిపోవు, నఘ
యింద్రియజనితదోషాదు లెల్ల. మార్క. ౩. ౩౧౫.

జ: క్రాఁక, క్రాఁగుడు, క్రాఁచు.

**క్రాఁగుడు**=కాఁగుడు. వి. (√క్రాఁగు) తపించుట, తపనము. (శ. ర.)

**క్రాఁచే**=కాఁచే. స. క్రి. (√క్రాఁగు) ౧. కాల్చు; కరఁగించు; తపింపఁజేయు.

సీ. పటుతరం బగుచటచ్చటరవం బెసఁగంగ మ్రాఁ
కులుఁ బొదలును గ్రాఁచికొనుచు... గీ... పరఁ
గె, నద్భుతోద్భవం బైనమహానలంబు. భార. ఆశ్ర. ౨. ౧౫౧.

చ...త్రిజగంబులక న్నలబ్రహ్మవిష్ణురు, ద్రమహి
మ లోర్కులైకలయఁ గ్రాఁచినయుండ త్రి
వేదమూలకం, ద మని నుతింప నొప్పెసఁగెఁ
దామరసప్రియబింబ మత్తఱిఁ. నిర్వ. ౬. ౭౭.

గీ. తపనతపనీయ మాతపతాపవహ్నిఁ, గ్రాఁచుకా
లకళాదుష్పూత్కారచయమొ, నాఁగఁ దగెఁ
బశ్చిమానిలో గ్రాగమంబు. కృ. శకుం. ౧.౩౦.

వ...వాద్యంబులు తడిసిన విద్యోపజీవులు ప్రస్ఫు
రంబులు గ్రాఁప నగ్గి రోయుచుండ...ఆము. ౪. ౩౫.

సీ. కనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె...
గీ ... కృష్ణ, రాయబాహుప్రతాపజాగ్రదశ
గ్ని. మనుచ. ౧. ౩౭.

౨. నశింపఁజేయు, పోఁగొట్టు; చంపు.

క. నను నీస్తవమున నెవ్వం, డనుదినమును భక్తి
తో సమాహితమతియై, వినుతించు నతనియా
పద, లనయంబును నే ననంశయంబుగఁ గ్రాఁ
తుఁ. మార్క. ౬. ౨౩౧.

గీ. విప్రుకడుపులో నున్నయవ్విరు ననుజుఁ, బి
చె ర మ్మని వాతాపి ప్రియముతోడ, జీవితుం
డయివాఁడు సెచ్చెరను విప్రు, కడుపు వ్రచ్చు
చు వెలువడి క్రాఁచె విప్రు. భార. ఆర. ౨. ౩౨౦.

౩. పీడించు.

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు
లజ్జాగుణ, ప్రాచుర్యంబును నామనష్టము లి
గుఁ బత్మాంకితంబుల్ దృఢ, భ్రూచాపచ్యుత
ముల్ శ్రవఃపథగతంబుల్ తన్విదృగ్బాణ
ముల్, క్రాఁచ జ్ఞాగినయంతలో సురభిమల్ల
...మల్లభూ. శృం. ౭౮.

**క్రాఁచిపుచ్చు**=క్రాఁచు, నశింపఁజేయు.

గీ. సప్తగోదావరమునీట జలకమార్చి, పుష్పగం
ధాక్షతంబులఁ బూజసేసి, కలిభవం బైనకలు
షంబుఁ గ్రాఁచిపుచ్చి, మర్త్యుఁ డొందును వే
గం బమర్త్యపదవి. భీమ. ౩. ౧౧౫.

**క్రాకచికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ఱంపపుఁ
గోఁతగాఁడు.

**క్రాథకుఁడు.** సం. విణ. (అ. థకా. అ.) హింసించు
వాఁడు.

క్రాథము. సం. వి. అ. పుం. హింస, వధము.

క్రాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ.) క్రేత, కొనువాఁడు.

క్రాయు. అ. క్రి. కాండ్రించు.

సీ. ధవళలాంగూలపల్లవచాలనంబులు గోముసీ చ్ఛాయలఁ గ్రాసి యుమియ. కాశీ. ౪. ౨౬౯.

సీ. ధర్మరాజు లటన్న దబ్బరలే తిట్టుఁ గంబమ య్యె యటన్నఁ గ్రాసి యుమియు. శుక. ౩. ౪౯.

స. క్రి. ౧. కక్కు.

ఉ. మ్రింగియుఁ గ్రాయు నచ్చిలువ మెల్ల విషం గసుగందకుండఁగన్. నైష. ౮. ౧౭౩.

క. కొలఁది యెఱుంగక తిని కో,కిలకామిని వెడ లఁ గ్రాసెఁ గిసలయఖండం,బులు... వరాహ. ౩. ౮౮.

౨. ఉమియు.

ఉ... నెత్తురు చవిచూచుఁ గండలు తుథూ య ని క్రాయు... పిశాచవిభుండు ... ఉ. హరి. ౨. ౧౫౪. అచలా. ౨. ౮౧.

క్రార=క్రారవడి. వి. (క్రయ్యు+ర-శ. ర.) జడ్డ యై ఒకయక్షరముతోఁ గలియురేఫము.

గీ. కొమ్ముక్రారలు మఱి ద్విపర్ణమ్ము లగుట, వాని యెడమవి గురువులు వట్రువులు, ప్రాణము లు గాన వానిడాపలను గల్గు,నక్కరము లెల్ల లఘువులు నిక్కముగను. అప్ప. ౪. ౪౯.

గీ...క్రార,గిలక యన రేఫ మెసఁగును... ఆం. భా. ౨. ౧౮౭.

క్రారవడి=క్రార. వి. (క్రార + వడి-స్వార్థమున) జడ్డయై ఒకయక్షరముతోఁ గలియురేఫము. (శ. ర, బ్రా.)

క్రాలు. అ. క్రి ౧. చలించు, కదలు.

ఉ. ఆళియుఁబోలె నిప్పుడు వనాళి యమార్గమునం జరించునని,న్నోఁలలితాంగి కా దనుచు నున్నది మందసమీరణంబులం,గ్రాలుప్రవాళమంజరు లు కమ్రకరంబులవిభ్రంబు గా, బాలరసాల పుష్పరసపాయివనప్రియకంఠహుంకృతిన్. నైష. ౨. ౪౮.

వ... ఈరాజునీరాజనకరణంబులకు రం డనుచు నమరకాంతలఁ బిలుచునోజం గ్రాలునూతన కేతనంబులును...భా. రా. అయో. ౧౦.

౨. సంచరించు, తిరుగు.

క. నేలకు నల్లెఁడుపాడువునఁ, గ్రాలుచు మును మెఱయుగుఱునిరథచక్రము ల,క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁ బడియె నృపా. భార. ద్రో. ౫. ౩౧౭.

గీ. ఆలజాలంబు నీరిపై నాడుజాడ, గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ, నిదురలోపలఁ గలఁ దోఁచునీడ పిదపఁ, గానవచ్చునె యప్పు డ కన్నఁగాక. ఉ. హరి. ౫. ౧౧౦.

౩. ప్రవర్తిల్లు; వర్తిల్లు.

చ. గుణ మిది దోష మిట్టి దని కొంత యెఱింగినఁ గాక యిట్లు ని,ర్గుణతయ పట్టి క్రాలుతమ కుం దగువారలు సెప్పుసౌమ్యభా,షణము నిర ర్థకంబు...నిర్వ. ౬. ౬.

క. కైలాసనగమునందును,గ్రాలెడుప్రావృట్పయో ధరముచందమునన్, లాలితకటిభాగంబున,నీ లాంబర మమరు రామునిం బొడగాంచెన్.వి. పు.౭. ౩౩౯.

సీ. మడుఁగులోపలఁ జొచ్చి కడుపార నుదకం బు గ్రోలంగ దిగ నందుఁ గ్రాలుమొసలి, పా దముల్ కబళించి పట్టిన ... మొ. రా. యు. ౨. ౭౪.

౪. చెదరు.

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలె ను విస్ఫులింగముల్, గ్రాలఁగ దేవసంఘము లు గంపము నొంద...భాగ. ౬. ౪౨౫.

౫. క్రమ్మ.

గీ. గళితశృంఖల లయ్యు నకాలనిద్ర,గనుఁగవలఁ
క్రాలఁ దమయంతిఁ గదల పయ్యె,దారుణా
ధోరణప్రయత్న మునఁ గాని,నముచిమథనుని
వీట శుండాలఘటలు. పారి. ౪. ౬౭.

౬. అతిశయించు; విజృంభించు.

గీ. దేవలోకజిగీష చేఁ ద్రిపురహంతు,కామకా
మాంతకోద్భటాకారు లగుచు, లంక విడిచి మ
నోవీథి శంక విడిచి,యసురు లుత్సాహములు
క్రాల నరుగు వేళ. ఉ. రా. ౨. ౩౦.

క...అతఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమ
ముఖ్యరథికుల నొంచెన్. భార. ద్రో. ౪.
౨౯.

౭. సంచలించు, క్షోభపడు.

ద్వి. ఏలె వధూమణి యెన్నిచందములఁ, గ్రాలు
చునున్నాఁడఁ గటకటా యనవు. రం. రా.
ఆర. ౧౮౭ పా. ౧౩ పం.

౮. ఒప్పు.

శా. ప్రాలేయాంశుమరీచినిర్మలతనూభాగంబుఁ
గృష్ణాజిన, వ్యాలోలామలయజ్ఞసూత్రములు
నంసాసక్తవీణాలతా, లాలిత్యంబు లలాటి
కారుచులుఁ గ్రాల న్నారదుం డిచ్చలం, గై
లాసంబుననుండి వచ్చె...ఉ. హరి. ౩. ౯.

సీ...క్రాలెను వఱలెఁ దుఱంగలించె ... అనంగ
నొప్పె నన్మాటగాఁ జెప్పఁబడును. ఆం. భా.
౩. ౮౩.

జ: క్రాలుఁగన్ను,క్రాలుకొను, క్రాల్గంటి.

క్రాలుఁగ(ల్గ)న్ను. వి. ఔ. ౧. చంచలేక్షణము,
లోలనేత్రము.

శా...లోలోపల వేడుకల్ నిగుడ సిగ్గుల్ దేఱు
నొయ్యారపుం, గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుం
గులు దొలంకన్ మందయానంబుతో, నాలీ
లానిలయంబు చేయుదురొకో నాళీకపత్త్రేక్ష
ణల్. వరాహ. ౪. ౮.

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నులశరదిందుముఖు
లు చామరము లిడఁగ. మనుచ. ౧.౧౨.

౨. రోగవిశేషయుక్తమైన నేత్రము.

ద్వి...ప్రంగుడుకన్ను.క్రాలుఁగన్నను నీరు గా
రెడికన్ను. పండితా. మహిమ. ౨౭౩ పా.

క్రాలుకొను. అ. క్రి.(క్రాలు+కొను-స్వార్థమున)
=క్రాలు.

(ప్రకాశించు)

వ...కరంగుకురంగధరకాంతకందళంబులజలజలని
తెలినీటిజాలునం గ్రాలుకొనుచు నచ్చవెన్నెల
విచ్చలవిడిఁ జెచ్చు పెరిఁగి...వసు. ౪.౨౩.

క్రాల్గంటి. వి. (రూ. క్రాలుఁగంటి-క్రాలు+కన్ను)
తరళాక్షి, చంచలాక్షి; స్త్రీ.

క...కోర్కుల్, బిట్టొదవెఁ బిఱుఁదులుం జన్నుఁ,
కట్టులుఁ గడు బలిసె నపుడు క్రాల్గంటుల
కున్. అచ్చ. రా. బాల. ౭౬.

ఆ...వలపుఁ,గాఁక బలిత మయ్యెఁ గ్రాల్గంటి
కి...నీలా. ౩. ౩౬.

## క్రి

క్రి=క్రీ. విశ. క్రిందిది. (చూ. క్రిందు. విశ)
ఉదా: క్రిందల, క్రియ్యాట.

క్రించే=కించే. విశ. ౧. అల్పుఁడు, నీచుఁడు; అ
ల్పము, నీచము.

ఉ. వంచన రాము దేవిఁ గొనివచ్చినయట్టులు గా
దు రోరి న, క్తంచర నన్ను నాహవముఖంబు
న డాయుట లన్న నయ్యరే,క్రించ సహోద
రుం గరము గీడ్పడి మానవు చేతఁ బొంచి యే,
యించుట గాదు లే...భా. రా.యు.౪౮౪.

క. క్రించా మూఢుని నినుఁడ,కిక్కించుట యన నెం
త సింధుకీలాలమునన్, వంచింపఁబడరె ము
న్నొక,వంచక మభిజాతకమఠవల్లభు చేతన్.
వేం. పంచ. ౪. ౫౧౮.

గీ.పాడిమానిసు లండ్రు నిన్నాలు నోకనీ,బోడివి రిస్సిరో పెక్కండ్రు ప్రోడ లిదియు, మగఁటిమియె క్రించుపని కిట్లు దెగినయప్పు,డుల్లములు వారలకు నెట్టు లుండెనొక్కొ. భార. స్త్రీ. ౧. ౭౬.

౨. దుష్టుఁడు.

ఉ. వారలు వాలిపంపునన వచ్చినవా రనుశంకనామదిఁ, వారక నాటి యున్నయది వాలియు నాయెడఁ గ్రించు రాజు లే,పార ననేకమార్గముల నప్రియులం దెగఁ జూతురు ... భా. రా. కిష్కిం. ౧౧.

ఉ. కాన లెఱుంగ వీవు బలుగాములుఁ బాములుఁ గ్రించుచెంచులున్, దానవమాయలుం గలపథంబులు...భా. రా. అయో.౪౩.

జ: క్రించుఁడు, క్రించుఁదనము.

క్రించేఁడు=క్రించే, కించే. విశ. (√క్రించే) నీచుఁడు, అల్పుఁడు.

మ ... నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గాననం,బునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రిం,చునిచందంబున రచ్చఁ బెట్టితి నటంచున్ డాఁగి పో నేల...నీనగు మొగంబుం జూపవే జానకీ. ఉ.రా.౭.౯౬.

క్రించేఁదనము. వి. (క్రించు+తనము.) అల్పత్వము, నైచ్యము.

క...కమనీయగుణ,స్తోమ నిజభామ నొల్లక, ధామమున నటించెఁ గ్రించుఁదనమున జడుఁడై. భాగ. ౬. ౧౦౬.

ఉ...నీ,ప్రేమకు వచ్చుదాసులకుఁ గ్రించుఁదనంబున నెగ్గు చేసితిన్. భాగ. ౯. ౧౧౬.

క్రిందంటు=అడుగంటు. (క్రిందు + అంటు) (నశించు.)

ఉ. మంటకుఁ జేరి కామిడుతమూడ్కి నశింపక మత్కుమారిమే, నంటియు నింటి కేఁగి చదలంటినదుర్మతి సేనతోడఁ గ్రిం,దంటఁగ మం

టివాన గురియం గల దేడుదినంబులు ... ఉ. రా. ౭. ౩౩౭.

క్రిందల. వి. (క్రిందు+తల) క్రిందగుతల.

సీ. మోముఁదమ్మికిఁ దేటిమొత్తమై పాగ పర్వ వ్రేలుఁ గ్రిందల గాఁగ వృక్షశాఖ. పాండు. ౨. ౫౯. (క్రిందలగాఁగ=తలక్రిందుగా, అధోముఖముగా.)

క్రిందు. వి. జౌ. ౧. అధోభాగము, దిగువ.

గీ. నాభికందంబుక్రిందట నలినగంధి,కుండలీశక్తి దేవత యుండు నెలవు. కాశీ. ౨. ౧౨౫,౧౨౭.

క.ఊఁడుకొనఁబడుమధూళిక,యొడికలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు తిరిగియుఁ దిరుగని,జాడఁ దరుల్వాలిచె నవ్వసంతపువేళన్. ఆము. ౫. ౧౩౭.

దండకము. చాగంపుబల్ రక్కసుం గ్రిందికి ద్రొక్కువా. నీలా. ౨. ౪౧. (క్రిందికిన్:-పాతాళలోకమునకు అని భావము.)

౨. పూర్వకాలము.

(నరకంబులను) వ. అతనితోడఁ గ్రిందటఁ బడితరంబులవారును ముందటఁ బడెడరంబులవారును బొందుదురు. భాగ. ౧౦ ఉ. ౪౮౧.

౩-అథస్థితి-వశము.

సీ. తాను రుక్మిణి యయ్యుఁ దగ దన దాత్మ నాయకుఁ డొకనరుక్రింద హరులఁ బట్ట. వసు. ౧. ౬౫.

ఉదా: అతనిక్రిందఁ బనిచేయుట కష్టము.

విశ. (వృత్తియందు వికల్పముగా'ందు'లోపించును.అట్టియెడల కొన్నిపట్లను గాగమమును,కొన్నిపట్ల మీఁదివర్ణమునకు ద్విత్వమును, కొన్నిపట్లలు ప్తశేషమునకు దీర్ఘమును వచ్చును.)

ఉదా: క్రిందల, క్రీఁగడుపు,క్రియ్యాట, క్రీనీడ.

౧. అధోభాగమం దున్నది.

గీ. ...క్రిందటిప్రయ్యా భువియు మీఁది,ప్రయ్యా

దివియును...హరి.పూ. ౧. ౫౩.

సీ. చరమాంగపీఠికాస్థాపితశేషుండు కితవకచ్ఛప
రాజు క్రిందిమట్టు. హర. ౬. ౪౦.

గీ. చచ్చిపోయినవారికై చాల వగల, దుఃఖపడు
దురు మఱునాఁడు తొడరి చనరొ, తాము
బ్రదుకుట కేది తథ్యంబు తడవ, వనిత క్రిం
దాకుమీఁదాకువాసి గాదె. కుచేల. ౧. ౮౦.

౨. తక్కువ.

సీ. శ్రీకాంత దా నయ్యుఁ బ్రియు నిరోధింపదు
క్రిందై విరోధికిఁ గేలు సాఁప. వసు. ౧. ౬౫.

సీ. అజసమాగమనవిఖ్యాతి వచింపవే యంచలనడక
క్రిం దౌను గాని, చక్రేశ్వరకథాప్రసక్తి గ
ణింపవే మలయమారుతధాటి నిలుచుఁ గాని.
ఇందు. ౩. ౨౪.

౩. కడచినది.

ఉదా: క్రిందటియేఁడు, క్రిందటినెల.

(వ్యవ) మంచి చెడ్డ క్రిందఁ బరిణమించినది. (చెడ్డ క్రింద=చెడ్డగా)

జ: క్రిందంటు, క్రిందల, క్రిందుపడు, క్రిందుపఱుచు, క్రిందుసేయు, క్రిగ్గాలి, క్రియ్యాట, క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీఁబడు, క్రీగాడ్పు, క్రీగోరు, క్రీనీడ, క్రీనీరుసేల, క్రీవాడ.

**క్రిందుప(వ)డు.** అ. క్రి. (√ క్రిందు) ౧. తక్కువయగు, తగ్గు.

సీ. బ్రతుకుభాగ్యము క్రిందుపడఁగఁ బాఁపన
యిండ్ల కరిగి యాఁకటికిఁ గూడడిగె ననుచు.
శుక. ౨. ౫౪౭.

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగువ
ట్టెఁ గ్రిందువడిరి బుధులు, హీనజాతిపురుషు
లెచ్చిరి... వేం. పంచ. ౨. ౧౩౨.

ఉ. అంతట లజ్జ క్రిందుపడ నత్యధికంబుగ మించి
మానసా, భ్యంతరపూర్ణ మైనపతిభక్తి కతంబు
నఁ దల్లిమాట యొ,క్కింతయుఁ దాను గైకొన
క...కళా. ౪. ౯౪.

౨. లోఁబడు, లొంగు.

చ. పగవాఁ డైనను వచ్చి క్రిందుపడి తాఁ బ్రా
ర్థించిన౯ వానికిం, దగుసంభావన లిచ్చి ప్రో
చుటయె పో ధర్మంబు...వి. పు. ౬. ౧౬౨.
మనుచ. ౩. ౫౦.

౩. ఓడు.

సీ. బిరుదంటివా నీకు బిరుదెక్కడిది పాండునృప
కుమారునకుఁ గ్రిందుపడినావు. నిరం. ౩. ౨౯.

సీ. పలుచందములఁ జిందములఁ గ్రిందుపడఁజేసి
నెలతాల్పుబలువేల్పు చెలువు నవ్వి. గీ ... తవ
యసం బెల్లకడల, వెలుఁగ...నీలా. ౧. ౪౫.
(ఇట ఔపమ్యద్యోతకము) హర. ౭. ౧౭౯.

**క్రిందుపఱు(అ)చు.** స. క్రి. (√ క్రిందుపడు) క్రిందుపడఁజేయు.

౧. అధస్థితముగాఁ జేయు.

మ...లం, ఘనచాతుర్యము నింగి క్రిందుపఱుప
గా వానరానీకముం, గినుకం బొంగుచు...
భా.రా.యు. ౧౪౨౭.

౨. భంగపఱుచు, అవమానపఱుచు.

సీ. అసురదైత్యుఁ బోరిగొనె నదరి వత్సకుఁ ద్రుంచె
గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱచె. భాగ.
౧౦ పూ. ౧౩౨౮.

౩. ఓడించు.

సీ. బ్రష్టు మధ్యస్థుఁడై పరికింపఁ గుండలీశ్వరుఁ
గ్రిందుపఱిచినశాబ్దికుండు. వరాహ. ౯. ౪౩.

సీ. విమలధైర్యంబున హిమమహీధర మేరుమందరా
ద్రుల నైనఁ గ్రిందుపఱుచు. వి. పు. ౫. ౬౫.
( ఇట ఔపమ్యద్యోతకము )

**క్రిందుసే(చే)యు.** స. క్రి. (క్రిందు+చేయు) క్రిందుగాఁ జేయు.

(అధోముఖముగఁ జేయు)

గీ. నియతిచేతఁ గదర్థితుం డయినధైర్య,పరునిధై ర్యగుణంబు మాన్పంగఁ దరమె,క్రిందుసేయం గఁబడినట్టికృష్ణపక్షుని, కీల లెందైన మీఁదు గాఁ గెరలుఁ గాదె. భర్తృ. ౧. ౪౪.

(తక్కువపఱచు)

చ. అనుడు నగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతు తోడఁ దోడిస,న్మును లలరంగ నోయనఘమూ ర్తి సమస్తముఁ గ్రిందుచేసి మిం,చినబలువే ల్పుఁ దీర్ఘమును క్షేత్రము నొక్కడఁ గూడి యుం డెనే,ని నిరుపమాద్భుతిం దెలిపి నీవు మ ముం గరుణింపఁగాఁ దగుఁ. పాండు. ౧. ౧౫౨.

క్రిక్క. వి. వంది, బట్టు.

గీ...బట్లు, క్రిక్క లనఁ బాఠకాఖ్యలు గేరుచుం డు. ఆం. భా. ౨. ౧౭౬.

మ...అభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ, క్షమతం బేర్చుచళుక్యవిశ్వవిభుశశ్వద్దానధా రాజలౌ, ఘముతో సాటికిఁ బాటిసేసెదవు క్రిక్కా చక్కఁ దర్కింపుమా. కావ్యా. ౪. ౬౩.

సీ. పసిఁడిజీరాపట్టెపనికీలుటందియ లడుగుఁదమ్ము లఁ గ్రిక్కలట్ల తనర. మల్లుపు. ౮. ౫౪. వేంక. ౩౦.

క్రిక్కటిల్లు(లు). అ. క్రి. కంపించు.

శా. క్షోణీచక్రము గ్రిక్కటిల్లఁగ దిశల్ ఘూ ర్ణిల్ల దట్టించుచుఁ, జాణూరుం డతిభీషణస్ఫు రణతో శార్ఙ్గి వెసం దాఁకి ... పద్మ. ౯. ౩౨౧.

క్రిక్కిఱి. విణ. (ఇది వృత్తియందే కనఁబడుచున్న ది-√ క్రిక్కిఱియు.) మిక్కిలి యిఱుకైనది, కొంచెమైన ఎడము లేక యుండునది.

ఉ. క్రిక్కిఱిచన్నుదోయియిరుగ్రేవలకాంతియుఁ బంచబాణుఁ గ్రొ,వ్వెక్కఁగఁజేయ హస్తయు గ మెత్తి...నైష. ౪. ౧౯౮.

క్రిక్కిఱించే. స. క్రి. (√ క్రిక్కిఱియు-చూ. ఇఱించు) క్రిక్కిఱియఁజేయు.

(ఎడము లేకుండఁ జేయు)

క. పలుకు నెడఁ బార్థసేనా,కలకలములు నిజపు రోపకంఠసరణిది,క్కులఁ గ్రిక్కిఱింప ... జై. భా. ౭.౧౨౪. (శ. ర.పా-'నిండిచు'అని భావము)

వ. ...నడిచెక్కుఁ గ్రిక్కిఱించుచు నొక్కయె డం గాలువొడిచి ముక్కు న నక్కుంతహారత రళంబు నొక్కుచు ... పాండు. ౮. ౨౩౪. ('ముడుఁచు' అని భావము)

క్రిక్కిఱియు. అ. క్రి. (క్రిక్కు+ఇఱియు. శ.ర- ఇది ఉభయయతులలోనిది. చూ. కావ్యా.౪.౬౯)

౧. ఎడము లేకయుండు, నిండు.

ఉ. దిక్కులు నాకసంబు జగతీతలభాగము నెల్ల చోటులుం, గ్రిక్కిఱియంగఁ గ్రందుకొని కీశబలంబులు వెన్క ముందటం, బెక్కువిధం బులఁ నడువ భీకరభంగులఁ గ్రొవ్వు లారఁ గా, నక్కజ మంద వచ్చి ప్లవగాధిపుపట్టన మెల్ల ముంచినఁ. భా. రా. కిష్కిం. ౫౧౩.

క. క్రిక్కిఱిసినశరములలో ... కు. సం. ౧౧. ౪౮౩.

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణం బు సేయ వాఁ, డుఱక నిశాతసాయకము లొ క్కమొగిం బడి మేనియందుఁ గ్రి,క్కిఱియఁ గఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములఁ... భార. విరా. ౩. ౨౧౫. కవిజ. ౩. ౧౪. కుసం. ౭. ౯౬.

౨. చేరు, కూడు.

సీ...కూడె బెరసెఁ గ్రిక్కిఱిసెను బెనఁగె దొ రసె, నందెఁ గదిసెఁ జేరె నన నంటె నని తోఁ

చు...అం. భా. ౩. ౧౧౯.

**క్రిక్కు**=కిఱుకు². వి. త్రిప్పు. (శ. ర)

జ: క్రిక్కిఱితి, క్రిక్కిఱించు, క్రిక్కిఱియు, క్రిక్కొను.

**క్రిక్కొను**=క్రిక్కిఱియు. అ. క్రి. (క్రిక్కు+కొను.)

(నిందు)

సీ. తలఁకొత్తుమిన్నేటితరఁగలఁ గ్రమ్ముక్రొన్నురుపులఁ గురులపై విరులఁ బెనుప, మెఱుఁగులఁ గ్రిక్కొనుకొఱనెలఁ గేతకిదళములతో వేణి నెలవు కొలుప. కు.సం. ౩. ౫౯.

క. మృదుబలము లుర్విఁ గ్రిక్కొన,విడిసిన...కు. సం. ౮. ౭౭.

**క్రిగ్గాలి.** వి. (క్రిందు+గాలి)తూర్పుగాలి.(బ్రా)

ద్వి. పరఁగినపెనుగాలిబలుపునఁ జేసి, చిరిఁగినకేతకులఛిద్రపుప్పములు, క్రిగ్గాలి దూలఁ దాఁకినఁ బొంగి తుదలు, బుగ్గరించినయట్టిమొగ్గపుప్పములు...కావని వర్జించి ... బస. పు. ౪. ౧౫౫ పం.

**క్రితము.** వి. పూర్వము, మునుపు.

ద్వి. క్రితము నీప్రాణపరిత్యాగమునకు, మఱి మెచ్చి యవసరోచిత మిచ్చి నన్ను. బస. పు. ౭. ౯౩౭ పం.

చ. ఇటక్రిత మెన్నిలోయముల నిందుముఖీముఖశేషమద్యముల్, గుటుకునఁ గ్రోల నీకుటిలకుంతలయెంగిటిమాధ్విఁ గల్గువి, స్ఫుటమధురత్వవాసనలు చూడరు గాక దివౌకసుల్ సుధా, ఘుటికలలోనిమేలు మఱి కోరుదురే యిది క్రోలఁ గల్గినన్. ప్రబోధ. ౩. ౫౬.

(వ్యవ) ఈపని నాలుగునెలలక్రితము జరిగినది. ఇంతకుఁ గ్రితము వానిని నేను చూడ లేదు.

**క్రిమి.** సం. వి. ఇ. పుం=కృమి.

**క్రిమిఘ్న.** సం. వి. ఆ. స్త్రీ. బాగాకు శ.

**క్రిమిఘ్నము.** సం. వి. అ. పుం. వాయువిళంగము శ.

**క్రిమిఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. సోమరాజి, కాపగచ్చ శ.

**క్రిమిజ.** సం. వి. ఆ. స్త్రీ. లాక్ష, లక్క.

**క్రిమిజము.** సం. వి. అ. న. అగురువు, అగలు శ.

**క్రిమిజాతము.** సం. వి. అ. న. ౧ లక్క. ౨. లక్క.

**క్రిమిజాపము.** సం. వి. అ. పుం. అగురువు, అగలు శ.

**క్రిమిశత్రువు.** సం. వి. ఉ. పుం. బాడిశచెట్టు.

**క్రిమిశాత్రవము.** సం. వి. అ. పుం. దుర్గంధముగలచంద్ర శ. (వెలితుమ్మ అని కొందఱు)

**క్రిమిశైలము.** సం. వి. అ. పుం.వల్మీకము, పుట్ట.

**క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాత్వర్థము. ౨. చేయుట. ౩. చేష్ట, వ్యాపారము, పని. ౪. శిక్ష,విద్యాభ్యాసము. ౫. నిష్కృతి, ప్రాయశ్చిత్తము. ౬. పూజ. ౭. చికిత్స. ౮. వ్యవహారసాధనము లగుసాక్షి లిఖితపత్రాది. ౯. ఉపాయము.౧౦.సాధనము, ఉపకరణము. ౧౧.ఆరంభము. ౧౨.విధము. (ఈయర్థము తెనుఁగున నే కలదు.)

సీ. అలికిడి మేల్కొనుతని ధృష్టద్యుమ్నుఁ బట్టిన క్రియఁ దలపట్టి యీడ్చి.భార.సౌ.౧.౧౬౮.

**క్రియగొను.** మి. అ. క్రి. ౧.కలుగు,ఒనగూడు.

క. ఉడుగక మే మహితముఁ బలి,కెడువారము నీవు హితవు క్రియగొనఁగాఁ బల్కెడువాఁడవు...భార. ఆది. ౮. ౪౦.

౨. పూను.

ద్వి. ఒనర ముందర శిరం బుండ మోఁకాలి, కిరినేస వెట్టంగఁ గ్రియగొనినట్లు. పండితా. దీక్షా. ౯౯ పా.

**క్రియము.** సం. వి. అ. పుం.(జ్యోతి) మేషరాశి.

**క్రియాకారుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) పని సేయువాఁడు. వి. అ. పుం. క్రొత్తశిష్యుఁడు. (త్రి.ని.)

**క్రియాకారము.** సం. వి. అ. పుం. ప్రతిజ్ఞ.

**క్రియాద్వేషి.** సం. విణ. (న్. ణీ. న్) వ్యవహారమందు సాక్షిలిఖితపత్త్రాదులకు వ్యతిరేకముగాఁ జెప్పు ప్రతివాది.

శ్లో. అన్యవాదీ క్రియాద్వేషీ నోపస్థాతా నిరుత్తరః, ఆహూతప్రపలాయీ చ హీనః పంచవిధః స్మృతః. (వాచ.)

**క్రియాపవర్గము.** సం. వి. అ. పుం. కార్యసమాప్తి, పూనినకార్యముయొక్క ముగియిక. సం. కిరా. ౧. ౧౪.

**క్రియాపాదము.** సం. వి. అ. పుం. వ్యవహారాంగములు నాల్గిటిలో మూఁడవది.

**క్రియాభ్యుపగమము.** సం. వి. అ. పుం. సేద్యము మున్నగువానియందు భూస్వామియు రయితు మున్నగువారును చేసికొనెడిఒడంబడిక.

**క్రియావంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్) పనియందు పూన్కి గలవాఁడు, క్రియాసక్తుఁడు.

**క్రియావసన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) సాక్ష్యములు మొదలగువానిమూలమున వ్యాజ్యమునందు ఓడినవాఁడు.

**క్రియావిశేషణము.** సం. వి. అ. న. క్రియతో అన్వయించువిశేషణము.

**క్రియాసమభిహారము.** సం. వి. అ. పుం. ౧. పని మరలమరల చేయుట. ౨. పని అధికముగా చేయుట. ౩. పనిని మరల మరల అధికముగా చేయుట. శిశు. ౨. ౪౩.

**క్రియ్యు=క్రుయ్యు.** అ. క్రి. కృశించు.

క. క్రొక్కారుమెఱుఁగు మేనులుఁ, గ్రిక్కిఱిసిన చన్నుఁగవలుఁ గ్రిస్సినవడుములో. భాగ. ౮. ౨౬౫.

సీ. ఒడిసి భక్షించిన నున్నమీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సియున్న. భాగ. ౧౦ పూ. ౭౦౭.

**క్రియ్యాట.** వి. (క్రిందు + ఊట) క్రిందియూట.

గీ. ఏకమై కాలువలు గట్టి యేకహేలఁ, బఱవ నందలి క్రియ్యాటపసిమి తేటఁ, బండు నవ్వీట ముక్కారుఁ బసిఁడిగాఱు, సరసధాన్యంబు మంచిరాజనపుఁజేల. పాండు. ౧. ౧౧౯.

## క్రీ

**క్రీ.** విణ. క్రిందిది. (చూ. క్రిందు. విణ.)

**క్రీఁగడుపు.** వి. (క్రిందు + కడుపు) వస్తి, పొత్తికడుపు.

సీ... పొత్తి, కడుపు క్రీఁగడుపు నాఁగను వస్తి చెన్నొందు... ఆం. భా. ౨. ౧౩౬.

**క్రీఁదొడ.** వి. (క్రిందు + తొడ) క్రిందితొడ, తొడఅడుగుభాగము.

గీ. కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి, గురుఁడు నిద్రింప వికృతాతిఘోరరూప, మళక మని యెడునొకకీట మద్రినేంద్ర, తనయు క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ. భార. శాం. ౧. ౨౧.

**క్రీఁబడు.** అ. క్రి. (క్రిందు + పడు) తక్కువయగు.

సీ. సురకరి యీయద్రిఁ జరియించు నేనుంగుఁ గొదమలఁ గ్రీఁబడ్డకొదమయొక్క. మార్క. ౧. ౯౭. (కృతఘడు-శ.ర.పా)

**క్రీగాడ్పు.** వి. (క్రిందు + గాడ్పు) - క్రిందిగాలి - అపానము.

గీ. మానసాంబుజకర్ణికామధ్యమునను, గొన్నిదివ

ములు శశిమాళిఁ గుదురుకొల్పి, మీఁది గాడ్పుఁ
గ్రీగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు
గట్టువఱపి తగను. పి. శకుం. ౨. ౧౧౩.

క్రీగోరు. వి. జా. (క్రిందు + గోరు)-క్రింద నున్నగోరు-కాలిగోరు.

శా. జేటం బేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి... క్రీగోట స్తే యొరయుక ... కు. సం. ౧. ౧౦౦.

క్రీడ. సం.వి.ఆ.స్త్రీ.౧. బంతులు మున్నగువానితో ఆడుఆట. ౨. ప్రియులు మున్నగువారు చేయుపరిహాసము. ౩. అవజ్ఞ, అనాదరము. (మే.ని) ౪. విహారము.

క్రీడత్. సం. శత్ర. క్రీడించుచున్న.

క్రీడనకము. సం. వి. అ. న. క్రీడాసాధనము. (ఆటబొమ్మ, మొ.)

క్రీడనము. సం. వి. అ. న. ౧. ఆట. ౨. ఆటబొమ్మ.

క్రీడనీయకము. సం=క్రీడనకము.

క్రీడము. సం. వి. అ. పుం. పరిహాసము. (కల్ప.)

క్రీడాగృహము. సం. వి. అ. న. కేళీగృహము. ఇట్లే క్రీడామందిరము, మొ.

క్రీడానారి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య, ఆటవెలఁది.

క్రీడారత్నము. సం. వి. అ. న. ౧-ఆటలలో శ్రేష్ఠ మైనది-రతి, సంభోగము. ౨. క్రీడార్థ మైనరత్నము.

క్రీడావనము. సం. వి. అ. న. ఉద్యానము, ఆటతోఁట.

ఇట్లే క్రీడాకాననము, మొ.

క్రీడి. వి. (సం. కిరీటీ. ప్రా. కిరీడి) అర్జునుఁడు.

సీ... వేగంటికొమరుఁడు వెన్నునంటు, వెన్నుమచ్చదునీఁడు వివ్వచ్చు కవ్వడి గెలుపుపేరుగ లాఁడు క్రీడి యనఁగ, నర్జునునామంబు లగు ...సాం. ని. దేవ. ౧౬. భార. విరా. ౪. ౧౫.

క్రీడించు. సం. అ. క్రి. ౧. విహరించు.

సీ. ఏకాంతమునఁ దనయిచ్చఁ గ్రీడింప దర్పకుఁ బాసి వచ్చినరతి యనంగ. మార్క. ౨. ౫౪.

౨. రమించు.

మ... ఎలమిం గ్రీడింపు నాతో మనోహరకేళీగతి నెందుఁ బోకుము సుహృద్వ్యామోహము ప్పొంగఁగన్. మార్క. ౪. ౨౪౦.

క్రీడిత. సం. విశ. (ఋ. త్రీ.. ఋ) క్రీడించువాఁడు, విహరించువాఁడు.

క్రీడితము. సం. వి. అ. న. క్రీడ.

క్రీణత్. సం. శత్ర. కొనుచున్న.

క్రీణానుఁడు. సం. విశ. (అ. ఆ. అ) కొనుచున్నవాఁడు.

క్రీతకుఁడు. సం. వి. అ. పుం. ధన మిచ్చి కొన్న కొడుకు, క్రీతుఁడు.

క్రీతము. సం. విశ. (అ. ఆ. అ.) వెల యిచ్చి కొనఁబడినది, విలువఁబడినది.

క్రీతి. సం. వి. ఇ. స్త్రీ. కొనుట.

క్రీతుఁడు. సం. వి. అ. పుం. తల్లిదండ్రులనుండి కొనఁబడినపుత్త్రుఁడు. (వీఁడు పన్నిద్దఱుపుత్త్రులలో నొకఁడు.)

క్రీనీడ. వి. (క్రిందు+నీడ) క్రిందినీడ.

గీ. లతల క్రీనీడఁ దిలతండులితము లగుచుఁ, గాంతయీనిందు కేతనికరము లమరు. నైష. ౮. ౧౭౪.

క్రీనీరునేల. వి. (క్రిందు+నీరు+నేల) అనూపము, జలప్రాయదేశము.

గీ. నీరుముం పనఁ గ్రీనీరునేల యనఁగ, ఖ్యాతిగాంచు ననూపంబు మాతృభూతి. ఆం. ఖా. ౨. ౭.

క్రియమాణము. సం. విశే. (అ. ఆ. అ) కొనఁబడుచున్నది.

క్రీవాడ. వి. (క్రింద + వాడ.) పాతిపాలుము. (శ.ర)

## క్రు

క్రుంకించు. స. క్రి. (√క్రుంకు) క్రుంకఁజేయు. (అస్తమింపఁజేయు)

గీ. అనుచుఁ గ్రుంకింప రాని ప్రొద్దరసి యరసి. భార. విరా. ౨. ౩౧౪.

క్రుంకు. అ. క్రి. ౧. మునుఁగు; స్నానముచేయు.

చ. ఇటు తగునే సుయోధన...ఏమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పనే. భార. శల్య. ౨. ౫౪.

గీ. కణఁకఁ గాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి. కాశీ. ౩. ౧౬.

౨. అస్తమించు.

సీ...కూఁకె నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట. ఆం. భా. ౩. ౯౭.

క. మాయరవి యేల క్రుంకఁడొ,కో యను ని ట్టేల తడసెనో యను...భార. విరా. ౨. ౩౧౨.

గీ...ప్రొద్దు గ్రుంకెడుదాఁకఁ బోరు జరుపు, చున్న విజయహాని జనింప కున్నె...రాఘవ.౪. ౧౭౪.

౩. చచ్చు, మృతి నొందు.

శా. శంకాకీర్ణమనస్కు-దానవరిపుల్ చక్రాయుధుం డింతతోఁ, గ్రుంకెం బో యని భీతు లైరి యచటన్...ఉ. హరి. ౬. ౧౯౦.

వ. దనుజులు మనుజులం జుట్టుముట్టి బలిమి నలమి యలిగి యలుఁగులతోడం గూడ మ్రింగినఁ గ్రుంకక. రాజ.చ. ౨. ౭౪.

సీ. క్రుంకె నేఁగెను బోయె డింకవేసెను మ్రగ్గె ననఁ జచ్చె ననుమాట కాఖ్య లయ్యె. ఆం. భా. ౩. ౯౭.

౪. గ్రుచ్చుకొను.

ఉ. కోటలసంధి నెంపములు గ్రుంకిన నంత దిన క్రమంబునన్,మీజినవొప్పి భుక్తిఁ గొన నేరక యాననగహ్వరంబునన్, గాఱెడులాల తోడఁ బులి గ్రచ్చటి లోఁబడి యుండ మ్రానిపైఁ, గూర్చినవంత నొక్క-ద్రుమకుట్టవిహంగము దాని కిట్లనున్. కేయూర. ౩. ౧౧౫.

౫. అడుగునకుఁబోవు.

మ...రవిదీప్తిం గ్రుంకి పాతాళగ,హ్వరముం దూఱినవాని...ఆము. ౨. ౬౬.

వి. అస్తమయము.

సీ. తమియు మత్సరము డెందమున నంతంతకుఁ బొడమి కానఁడు ప్రొద్దుపొడుపుఁ గ్రుంకు. పి. శకుం. ౪. ౧౬౪.

క్రుంకిడు, క్రుంకులిడు=స్నానముచేయు.

శా. ఏయేతీర్థములందుఁ గ్రుంకిడితిరి...మనుచ.౧. ౬౯.

సీ. తెల్లవాఱె నటంచుఁ దివిరి యజ్జన్నిగట్టేటి పొంతకుఁ గ్రుంకులిడఁగఁ జన్న. అచ్చ. రా. బాల. ౧౪౬.

క్రుంకువెట్టు, క్రుంకులువెట్టు=౧. క్రుంకిడు,స్నానముచేయు.

ఉ. చొచ్చి చనంగ భోగవతిచొప్పన నొప్పు స్రవంతి యుండఁగా,నచ్చటఁ గ్రుంకువెట్టి వెస నవ్వలి కేఁగి...భోజరా. ౫.౨౨౨.

సీ. యజ్ఞతటాకంబునందుఁ గ్రుంకులు వెట్టి బ్రహ్మర్షిపితృతృప్తిఁ బ్రస్తరించి: భీమ.౩.౧౧౭.

౨. క్రిందికి వంగు.

గీ. ఎట్లు గ్రుంకులువెట్టుచు నేచి పట్ట,నీక యెటపాఱెనేనిఁ బోనీక శరము,పాలువడఁ జేసి తెమ్ము భూపాల యొప్పఁ,జారుతర మైనయీ మృగచర్మ మైన. భా. రా. అర. ౨. ౩౭.

తప్పఁగ్రుంకు=తప్పించుకొను.

గీ. నాకు వెఱచి కైలాసయానంబు పేరఁ, గొంత

కాల మమ్మెయిఁ దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూనె మహావిభూతి, మెఱయ వచ్చియు నీయూరు సెలుపసైతి. హరి. ఉ. ౬. ౨౦౭.

గీ. తప్పఁ గ్రుంకెడు నెర వాత్మఁ దలఁచి తలఁచి. దళకు. ౫. ౯౧.

జ: క్రుంకించు, క్రుంకుఁగడలి, క్రుంకుగట్టు, క్రుంకుడు, క్రుంకుడుగట్టు.

**క్రుంకుఁగడలి.** వి. (క్రుంకు + కడలి) పశ్చిమ సముద్రము.

గీ. నీట ముంచిన మేలివన్ని యపసిండి, పూడె యనఁ గ్రుంకుఁగడలిలోఁ బ్రొద్దు వ్రాలె. నీలా. ౩. ౩.

**క్రుంకుగట్టు**=క్రుంకుడుగట్టు. వి. అస్తపర్వతము, పడమటికొండ.

క. ఈవిధమున నయ్యామవ, తీవైభవ మొప్పమిగుల దృష్టించుచు ని, ద్రావశత శయ్యాకుం జను, కైవడి శేరాజు గ్రుంకుగట్టున కరిగెన్. వైజ. ౧. ౧౧౦.

చ. పెనిమిటి యైనవెన్నుఁ డొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టుఁ గ్రుంకుగ, ట్లనుడనరెండుచేతుల నొయారము మీఱఁగ నేలకొమ్మ దా, ల్చినపవడంపుఁజుట్టులుఁ గుఁ జిందమునుంబలెఁ జూడ నొప్పెనం, తను దగఁ దూర్పునన్ వెనుకఁ దమ్ముల విందును జందమామయున్. యయా. ౫. ౩౦.

ఇట్లే క్రుంకుగుబ్బలి, మొ.

సీ. క్రుంకుగుబ్బలి... అచ్చ. రా. అయో. ౧౩.

సీ. క్రుంకుమల... ప్రబంధ. ౧౬౧.

సీ. క్రుంకుమెట్టు... యయా. ౨. ౬౦.

చ... క్రుంకుమెట్టు.. పారి. ౨. ౩౨.

సీ... అస్తాద్రి పడమటికొండ, క్రుంకుఁగొండ యనగు... ఆం. భా. ౨. ౨౮.

**క్రుంకుడు.** వి. (√ క్రుంకు.) (అస్తమయము.) చూ. క్రుంకుడుగట్టు.

**క్రుంకుడుగట్టు**=క్రుంకుగట్టు. వి. అస్తాద్రి.

సీ. నెలతాల్పు దేవర యలిగినఁ బని గాదు వెండి గుబ్బలి దేక యుండనిండు... వలి శేయుఁ బగలును నడక గానఁగ రాదు పుట్టుగ్రుంకుడుగట్లు నెట్టి రండు. యయా. ౩. ౩౮.

**క్రుంగఁబడు**=క్రుంగు. అ. క్రి. (క్రుంగన్+పడు-స్వార్థమున) దిగఁబడు, క్రిందికి పోవు.

ఆ. ధరణి గ్రుంగఁబడఁగ ద్వారతోడ దవ్వఁగాఁ, దుంగభంగి నిడుద చెంగలిడుము. భా. రా. కిష్కి. ౦. ౮౩౧.

**క్రుంగిలు(ల్లు)**=క్రుంగు. (√ క్రుంగు) ముడుఁగు, సంకుచితావయవ మగు.

ఉ. ఇగ్గెడు వెన్కకుం బయికి నీడ్చినఁ గైటదొలంగఁ జేయఁ గే, లొగ్గెడు రెమ్మ పోఁకముడి యాడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం, బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు శాల ననంబ నేమి యా, సిగ్గుకు సిగ్గ లేదిటులు నేసినపిమ్మట నుండ వచ్చునే. విజ. వి. ౨. ౩౦.

**క్రుంగు.** అ. క్రి. ౧. దిగఁబడు.

సీ. ఆకాశవాహినీసైకతంబుల ఖురాంచలటంకములు గ్రుంగ జడనుపడిన. కాశీ. ౩. ౧౨.

౨. అడఁగు.

సీ. క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్యవికృతిఁ గ్రుఁగనినాఁటివింధ్యశిఖరి. నైష. ౧. ౩౫. దశా. ౧. ౨౬౧.

౩. తగ్గు; నశించు; మరణించు.

ఉ. కోపము పొంగఁ గ్రుంగు నొకకొన్నిదినంబులు... దశకు. ౫. ౨౩. ఆం. భా. ౩. ౧౮.

సీ. పరమసాధుజనంబుభావంబు లుప్పొంగెఁ గలుషచారిత్రులబలిమి గ్రుంగె. కళా. ౮. ౧౨౩.

శా. కాశీదేవనదీజలంబులను గ్రుంకం గ్రుంగు సర్వాఘముల్. సురా. ౨౦.

సీ. సమయుట యీల్గుట చావు చక్కడఁగుట
క్రుంగుట త్రుంగుట కూలుట...మిత్తి పెన్ని
దుర నా మీఱును మరణము. ఆం. భా. ౨.
౨౨౫.

౪. వంగు, క్రింది కొదుఁగు; పొట్టిదగు.

(మల్లయుద్ధవర్ణనము) సీ...బలువిడి వాఁడు పై
నడరిన జరగక యవనిఁ గ్రుంగి, నిలుచు...
భార. విరా. ౨. ౧౫.

మ. చరమాశాంతరవీథిఁ గై కొని సరోజాతప్రి
యుం డేఁగఁగా,సరి నంతంతకుఁ గ్రుంగి క్రుం
గి కనక స్తంభఁబు చిత్రంబుగా, సరసీపూర
సమస్థితం బగుటయుఁ సర్వంసహాధీశుఁ
డుఁ, వెరవారం దిగి వచ్చి యప్పురిని దా
విశ్రాంతచేతస్కుఁడై. విక్ర. ౨. ౧౧౪.

క్రుంగిపోవు=క్రుంగు.

(నశించు)

గీ. కొండియంబున సఖ్యంబు గ్రుంగిపోవుఁ, గటి
నభాషలఁ బడిపోవుఁ గాతరుండు. నా. పంచ.
౧. ౧౪౪.

(హీనసత్త్వుఁ డగు.)

(వా) వాఁడు కష్టములచేత క్రుంగిపోయినాఁడు.
జ: క్రుంగఁబడు, క్రుంగిలు.

క్రుంచ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుకొంచ, ఒక
విధ మైనఆఁడుకొంగ. ౨. ఆఁడుహంస.

క్రుంచము. సం. వి. చ్.పుం.౧. క్రౌంచము, కొం
చ, ఒకవిధ మైనకొంగ. ౨. హంస, అంచ.
అ.పుం. ౧.కొంచపిట్ట, ఒకవిధమైన కొంగ.౨. ఒ
కవిధమైనవీణె. ౩. క్రౌంచపర్వతము, కొంచగు
బ్బలి.

క్రుక్కించే. స. క్రి. (√ క్రుక్కు) క్రుక్కఁ
జేయు.

(అదిమించు, కూరించు)

వ...కేదారపంకంబులోనఁ గానరాకుండ సువ
ర్ణమయం బైనచేరంబుఁ గ్రుక్కించి... పర
మ. ౫. ౨౭.

క్రుక్కిడము. విణ. (√ క్రుక్కు) ౧. నిండినది.

ఉ. అక్కజమై మహార్ఘనివహంబు సదుస్తులు మె
చ్చఁ జూచినఁ, గ్రుక్కిడ మైనసత్కృతి
...కు. సం. ౧. ౩౯.

౨. పూడినది.

ద్వి. గ్రక్కున భస్మంబు గాఁ బురంధ్రంబు, గ్రు
క్కిడంబై కట్టుకొని కీలుకొనుడు.పండితా.
పురా. ౧౩౪ పా.

క్రుక్కు. స. క్రి. (క. కుక్కు) ౧. (పేను మొ
దలగువానిని) బొటనవ్రేలిగోటితో నొక్కు.

గీ. ఎలయుసీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి,
యంటుసొంటులు పరికించి యంట్లఁ బొడిచె,
గోరుముక్కుల దిగమువ్వి తూరుపెత్తి, నెబు
లఁ గలిగినపేల నన్నింటిఁ దిగిచె. పాండు.
౩. ౩౦.

సీ. కన్నగాం డ్రగుచు నగళ్లు ప్రవేశించి యం
దు నెంతటివార లడ్డమైనఁ. ఆ. జక్కడఁ
చుచుఁ బేను గ్రుక్కినపాటిగా, నిష్ట మైన
యర్థ మెల్లఁ బడసి. ప్రభా. ౧. ౧౦౯.
(పేనుగ్రుక్కినపాటిగా:-కొంచెమైన నిత
రులకు తెలియకుండ, చప్పుడు లేకుండ)

౨. అడఁచు.

వ...కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని...ఆము.
౬. ౬౬.

సీ. పాడమురసావేశమున వచ్చునర్థోక్తి లోదవి
నాలుకకు రాకుండఁ గ్రుక్కి. మనుచ. ౩.
౯౭. నరస. ౧. ౬౪.

౩. అదుము, కూరు.

ఉదా: పిల్లలకు అన్నము క్రుక్రి క్రుక్కి పెట్టఁ
గూడదు.

౪. తూర్చు, చొప్పించు.

ఉ. అక్కమలాయతాక్షుఁడు భయంకరబాహు

వు దైత్యుకుక్షిలోఁ, గ్రుక్కినఁ దద్దయుఁ బ లిసి రోగముపేక్షలచేత మేనికిన్, వెక్కస మైనచందమున విహ్వలభావముఁ జేసి దేహ ముఁ, ప్రక్కలు వాపి చంపె...వి. పు. ౭. ౩౨౮.

౨. వంచన, మోసము.

సీ...వంచన మెసంగు. గీ. జూడఁగు క్రుక్కు కి కుదు పిక్కు జుణుఁగు మొఱఁగు, డనఁగ... ఆం. భా. ౨. ౨౯౨.

జ: క్రుక్కించు, క్రుక్కిదము, క్రుక్కుడు.

**క్రుక్కుడు.** వి. (√క్రుక్కు) ౧. క్రుక్కుట. (శ. ర.) ౨. పీడనము, అదుముట.

సీ...క్రుక్కు డదుము డొత్త, డ మ్మొత్తు నాఁ బీ డనమ్ము విరాజిల్లు...ఆం. భా. ౧. ౧౫౦.

**క్రుచ్చు**=కూర్చు. స. క్రి. (చూ. వా క్రుచ్చు)

**క్రుత్తు.** సం. వి. ధ్. స్త్రీ=క్రుధ.

**క్రుధ.** సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

**క్రుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ) కుపితము, కోప ము నొందినది. వి. అ. న. కోపము.

**క్రుధ్యత్.** సం. శత్రు. కోపపడుచున్న.

**క్రుమ్మరించు**=కుమ్మరించు. స. క్రి. క్రుమ్మరిలఁ జేయు.

(అధికముగా ప్రసరింపఁజేయు.)

గీ. కమ్మనిపిసాళివలపులు గ్రుమ్మరించు, కమ్మజవ్వాదిఁ దలయంటెఁ గలికి యొకతె. వసు. ౪. ౧౦౯.

(అధికముగా వెలువఱుచు)

సీ. క్రోధపావకుఁ డుండుకుండంబులన నేత్రగోళముల్ మంటలు గ్రుమ్మరింప. ఉ. రా. ౩. ౩౮౫.

(కుండలు లోనగువానినుండి యొక్కసారిగా జలాదులను పడఁజేయు.)

గీ. కడవలను గ్రుమ్మరించినవడువు దోఁపఁ, గురియుచుండంగ వఱదల గ్రుంతమిట్ట, లొక్క కొలఁదిగఁ బాఱె నీళ్లక్కజముగ. ద్వా. ౧౦. ౮౮.

జ: క్రుమ్మరిల్లు.

**క్రుమ్మరిల్లు(లు)**=కుమ్మరిలు. అ. క్రి. (√క్రుమ్మరించు) కుండ లోనగువానినుండి యొక్కసారిగా జలాదులు పడు; పడు.

క. భృంగీసంగీతస్వన, మాంగళ్యసుగంధకుసుమమంజరుల బయల్, పొంగుమరందము నెపమున, శృంగారరసంబు గ్రుమ్మరిలుపొదరింటన్. కవిరా. ౨. ౧౬౧.

వ...చూర్ణంబు లైనకర్ణంబులును వ్రక్క లైన ప్రక్కలును మురిసినశస్త్రంబులును విరిసిన జోళ్లును గ్రుమ్మరిల్లినబొమ్మిడికమ్ములును గుంపులుగొను పడగలును...పద్మ. ౧౦. ౨౯.

**క్రుమ్మరు.** అ. క్రి. ౧. తిరుగు, సంచరించు.

ఆ. క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్నయా, విజనవిషమశైలవిపినభూమి. భార. ఆది. ౭. ౭౫.

క. ఇమ్మడువు మీనములతో, నిమ్ములఁ గూడాడి పెరిఁగి యున్నాళ్లను బ్రేమమ్మున నుండితి నొంటిగఁ, గ్రుమ్మర లే నింక నన్నుఁ గొనిపోవఁగ దే. నా. పంచ. ౧. ౨౨౬.

౨. విహరించు.

ఉ. ఈయొలదోఁట నుండఁ దగ దింకొకచక్కి వసింప నేఁగుఁ డో, ధీయుతులార పాండ్యవరదేవతనూభవ కేళికాగృహ, ప్రాయత నిందు నెప్డు నిరపాయమున న్విహరించుచుండు నేఁ, డాయొలనాఁగ గ్రుమ్మరుట కై యదె వచ్చెఁ దలంగుఁ డిత్తఱిన్. శుక. ౧. ౩౨౮.

వ...సుకన్య యనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న...భార. ఆర. ౩. ౧౭౬.

౩. ప్రవర్తించు.

క. ఉరులింగము బోధించిన, కరణిన్ గ్రుమ్మరుము వంటకట్టియు లోకమో, పరువుగ వారలగే

హాసరణములో బయలనుండి వైచుచు నుం డెన్. చెన్న. ౫. ౨౨౮.

**క్రుమ్ము=కుమ్ము[1].** స. క్రి. పొడుచు.

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు... నొసల్లు గ్రుమ్మియు...ఉ. హరి. ౧. ౧౮౭.

సీ. కంసారి ఓగియూరఁ గౌఁగిటఁ జేర్చిన గుబ్బ లఁ గసిదీఱఁ గ్రుమ్మెఁ గొమ్మ. రాధికా. ౨. ౧౩౬.

దండకము. మన్నంతయుం గొంచు బల్వాఁపరా యిక్కఁ కుం బ్రాఁకు బంగారపుంగంటికేద్రి మ్మరిం జన్నపుంబందివై చెండి వాల్గొమ్మునం గ్రుమ్మవా ... అచ్చ. రా. యు. ౧౬౧. ఉ. రా. ౧. ౬౭.

వి. పోటు, పొడుపు.

సీ.కలుకుగుబ్బల బ్రొమ్ముఁ గ్రుమ్ము లేర్పడ గ్రుచ్చి తనివారఁ గౌఁగిట ననఁగి పెనఁగి. ఉ. హరి శ్చ. ౪. ౧౩౨.

**క్రుమ్మడఁగించు=అడఁచు.**

సీ. దయ పిఱిఁదికి వైచి నయము క్రుమ్మడఁగించి బాంధవం బురివి పాపమునఁ బొదలి. దశకు. ౩. ౯.

**క్రుమ్మెసలాడు=కుమ్ములాడు, పొడుచు.**

మ... రాచబిడ్డలునున్ వెల్మదొర ల్దురమ్మునకు నొడ్డారించి క్రొవ్వాఁడిబాఁకులతోఁ గ్రుమ్మె సలాడ సాగి రలుకన్ గోవిందశర్ధార్భటిన్. రంగా. ౩. ౨౧౭.

జ: క్రుమ్ముడు, క్రుమ్ముడుపడు, క్రుమ్ములాడు.

**క్రుమ్ముడు.** వి.(√ క్రుమ్ము)పోటు,పొడుపు.(శ.ర.)

**క్రుమ్ముడుపడు.** అ. క్రి. (√ క్రుమ్ముడు) పోటుపడు. (శ. ర.)

**క్రుమ్ములాడు=కుమ్ములాడు.** అ. క్రి. (క్రుమ్ములు+ఆడు) పోట్లాడు.

గీ. కొసర కాఁబోతు నాఁబోతుఁ గ్రుమ్ములాడ, నడిమియాఁబెయ్యగతి వచ్చె నాకు నిపుడు. కాశీ. ౨. ౧౦౮.

ఉ. కొమ్మజెడంగుసొంపుఁ గనుఁగొన్నకనుంగవ దత్తఱింపఁగా, నమ్ముని యాఁప నోపక కపుడ ల్లన జెప్పలు విచ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱఁ గృష్ణకృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱ మూయు మన్మథవికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్. కళా. ౩. ౧౯.

**క్రుయ్యఁబాఱు=క్రుయ్య.** (క్రుయ్యన్+పాఱు-స్వార్థమున.)

(కృశించు)

సీ. పలికి రెంతయుఁ గ్రుయ్యఁబాఱిన నునుఁజెక్కు లందంద తడివెడు నశ్రువారి. హరి. ఉ. ౩. ౪౭. (వావిళ్లప్రతిపా.)

**క్రుయ్యు.** అ. క్రి. (సం. కృశ్.) ౧. కృశించు; తగ్గు, క్షీణించు.

మ. మలినుండై కడు డస్సి క్రుస్సి...కు.సం.౧౦. ౪౫౬.

చ...తలల్ దిగవైచి నోరఁ ద్రేఁగుడు దొరఁగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు ప్రస్సి పుర్వులు గ్గడువుగఁ బాఱఁ దద్దయును గాతియఁ బొందె ప్రజంబునన్ బసుల్.హరి.పూ. ౬. ౪౩.

క. నెయ్యెం డ్లయ్యును నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడఁ గామసుఖములం, గ్రుయ్య దొకయించు కైనన్, డయ్యదు కొనలిడియెఁ దృష్ణ నవపద్మముఖీ. భాగ. ౯. ౫౬౬.

మ. నినుఁ జింతించిన విన్నఁ జేరుకొనినన్ నిర్మాలమై క్రుస్సి పాపనికాయంబు వినష్ట మానట... భాగ. ౧౦ పూ. ౧౧౧౭.

౨. వెనుదీయు; వెనుకపడు.

ఉ. ఎయ్యెడఁ గయ్యముల్ గలవొ యెవ్వరు చివ్వల కుత్సహింతురో, క్రుయ్యక యంచుఁ

గోరి వెసఁ గ్రమ్మరుచుండుదు నెందు నేను ...హరి. పూ. ౮. ౧౧౬.

వ.... తరుణతరుణీజనంబులు...వినోదంబుల నద టుమిాతి కడచి చనం బంగ్వాంధజరత్ప్రముఖులు క్రుస్సి యోలాకుపడ నెడనెడం గా వలియై తగువారు నడిపింప...హరి. పూ. ౬. ౨౨.

జ: క్రుయ్యఁబాఱు.

క్రుల్లగించే. అ. క్రి. (√ క్రుల్లు)-మనస్సులో-దుఃఖించు. (శ.ర)

క్రుల్లగింత. వి. ( √ క్రుల్లగించే ) -మనస్సులో-దుఃఖించుట. (శ.ర)

క్రుల్లు=కుల్లు. అ. క్రి.

(అవియు, పగులు)

గీ. గుండియలు గ్రుల్లఁ దన్నినఁ గ్రక్కుమిక్కు, రనక యాతనికినుక చల్లారనిచ్చి. సుక. 3. ౬33.

(-మనస్సులో-దుఃఖించు)

సీ. కోపశోకంబులఁ గ్రుల్లుచుఁ దనలోన మండు చు దితి సాల మఱుఁగఁ దొడఁగె. భాగ. ౬. ౫౦౯.

జ: క్రుల్లగించు, క్రుల్లగింత, క్రుల్లుపోతు.

క్రుల్లుపోతు=కుల్లుపోతు. విశే. (√ క్రుల్లు.) క్రుల్ల గించుస్వభావము కలవాఁడు. (శ. ర)

క్రుశ్యమానుఁడు. సం. విశే. (అ.ఆ.అ) ౧. తిట్టఁబడుచున్న వాఁడు. ౨.పిలువఁబడుచున్న వాఁడు.

క్రుశ్వము. సం. వి. న్. పుం. ౧. నక్క. ౨. కొంగ. (కే. ని.)

క్రుశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడునక్క. ౨.ఆఁడుకొంగ. (కే. ని.)

క్రుష్టము. సం. విశే. (అ. ఆ. అ) ౧. అఱచినది. ౨. యుద్ధాదులకు పిలువఁబడినది. 3. తిట్టఁబడినది. ४. ఏడ్చినది. వి. అ. న. ౧. కూఁత, అఱుపు. ౨. ఏడ్పు. 3. చప్పుడు, ధ్వని.

## క్రూ

క్రూర. సం. వి. ఆ. స్త్రీ. ౧. రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు కీ. ౨. బదరి, రేఁగు కీ. 3. కంటకారి, వాఁకుడు కీ.

క్రూరకోష్ఠుఁడు. సం. విశే. ( అ. ఆ. అ )-క్రూరమైనకోష్ఠము కలవాఁడు-బద్ధకోష్ఠుఁడు,మలబంధము గలవాఁడు.

క్రూరగంధము. సం. వి. అ. పుం-చెడ్డకంపు కొట్టునది-గంధకము.

క్రూరదృక్కు. సం. విశే. (శ్) క్రూరమైనచూపు కలవాఁడు. వి. పుం. ౧. పిసునుఁడు, దుష్టుఁడు ౨. శని. 3. అంగారకుఁడు. స్త్రీ. క్రూరదృష్టి, క్రూర మైనచూపు.

క్రూరధూర్తము. సం. వి. అ.పుం. నల్లఉమ్మెత్త కీ.

క్రూరము. సం. విశే. (అ. ఆ. అ) ౧. కనికరము లేనిది. ౨. పరుసనిది, కఠినము. 3. ఉగ్రము,భయంకరము. ४. హింసకము, నాశము సేయునది. ౫. ఉష్ణము, వేండ్రము కలది. ౬. కఱ కైనది.౭. దరిద్రము, ధనము లేనిది. వి. అ. పుం. ౧. డేగ.౨. కంకము, రాపులుఁగు. (రా. ని) 3. (జ్యోతి)మేషాదిరాసులలో బేసిరాశి. ౮. అస్థి, ఎమ్ము. (కే.ని)

క్రూరరావి. సం. వి. న్. పుం. ద్రోణకాకము,మాలకాకి. (రా. ని)

## క్రే

క్రే. (వృత్తియందు 'క్రేవ' శబ్దమునకు తుదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము.)

ఉదా: క్రేఁగన్ను, మొ.

**క్రేంకారము.** సం. వి. అ. పుం=క్రేంకృతి.
(రథనేమియొక్కధ్వని.) వ... తక్కినదండనాథులం దానును రథనేమీక్రేంకారభేరీభాంకారశింజినీటంకారవీరభటహుంకారంబులన్ వియత్తలంబు నొంది యెదుర్చుటయు ...శశాం. ౪. ౨౧.

క్రేంకారమిచ్చు=ధ్వనిచేయు, కూయు.

సీ. కొక్కొరోకో యని కొమరసామిరథంబు కంఠంబు సాఁచి క్రేంకారమిచ్చె.భీమ. ౨. ౨౮. (క్రొక్కారమిచ్చె. శ. ర.పా.)

**క్రేంకృతి.** సం. వి. ఇ. స్త్రీ=క్రేంకారము. ౧. శారికాదిధ్వని.

ఉ...కలారవ, క్రేంకృతి శారికాపికశుకీవిహగాదులచే వినంబడెన్. రామా. ౨. ౧౦౪.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం,బులపయి దట్టపుంజిలును వోవఁగఁదారలకంచు గీయఁగా,బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్, కలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రేంకృతులిచ్చు మరాళమాలికల్. ఆము. ౪. ౧౫౦.

౨. నూపురాదిధ్వని.

చ... అందియల క్రేంకృతి గంకణమేఖలాధ్వనిం, బ్రకటముసేయ...కాశీ. ౪. ౧౫౪.

**క్రేఁగన్ను.** వి. దే. (కేవ+కన్ను) నేత్రాంచలము; కటాక్షము.

సీ... కడక న్ననంగఁ గ్రేఁగ న్ననంగ. గీ. నసునపాంగంబు...ఆం. భా. ౨. ౧౪౪.

గీ. కడలికడనుండి మగిడి కేవఁగంటిదృష్టి, యిడుచుఁ బొఱుచు జడదారియెడయు లపుడు. దశా. ౧. ౧౭౮.

సీ. కేవఁగంటనైన వీక్షింపవు ... వరాహ. ౨. ౫౬. కాశీ. ౪. ౧౪౫.

**క్రేఁగయి.** వి. (కేవ+కయి) హస్తాగ్రము.

చ. మంచపుఁ గోడుతాలుపరిమన్కిబిడారపుమెట్టుఁ గ్రేఁగయిం,గొంచక యెత్తినట్టి నిను... అచ్చ. రా. యు. ౧౩.( క్రేగయి-శ.ర.పా.)

**క్రేఁటు.** అ. క్రి. ౧.గొంతు సవరించుకొనుటకై ఒకవిధ మగుధ్వని చేయు, సకిలించు. (శ. ర.)

వ. ఉష్మలిక యింత యేటి కనుటయు నబ్బోటి క్రేఁటుచు నిట్లనియె. మనుచ. ౬. ౯.

౨. తొట్రుపడు.

ఉ...అమాసచీకటిం, గ్రేఁటుచు నేఁగుదెంచెనడురేయిని జోరుఁడు కన్న పెట్టఁగన్.భల్లా. ౧. (శ. ర.)

వి. గద్గదకంఠమును బాగుచేసికొనుటకై చేసెడి ధ్వని, సకిలింత.

సీ. తత్సాధుకృద్ధ్వని దనరుసు గ్రేఁటన...ఆం. భా. ౧. ౧౨౨. (గ్రేఁటు-అని.ప్రా)

జ: కేవఁటుకొను.

**క్రేఁటుకొను**=కేవఁటు. అ. క్రి. (కేవఁటు+ కొను-స్వార్థమున)
(గొంతు సవరించుకొనుటకై యొకవిధ మగుశబ్దము చేయు)

క...గండఫలకభాగఁబులపైఁ,గాటుకకన్నీరొలుకఁగ,మాట నెడలఁ గ్రేఁటుకొనుచు మానిని పలికెన్. మనుచ. ౩. ౯౨.

(వరూథిని) క...అతనిఁ జూఅముఁ, గోపమునం జూచి గ్రేఁటుకొనుచుం బలికెన్. మనుచ. ౨.౬౯.

**క్రేఁదొట్టు.** అ.క్రి.(క్రేవ+తొట్టు) గట్టారయు.

వ. ఇరువురగదలును మసకంబునం బెనంగుపాములపగిదిం దాలించుపాసికలపోలికఁ గ్రేఁదొట్టు కరల్లకైవడిఁ గలయబెరయ...ఉ. హరి. ౩. ౬౪. (కైతొట్టు. ముద్రి-క్రేతొట్టు. శ. ర. పా.)

**క్రేగాలి.** వి. (కేవ+గాలి) ప్రక్కగాలి.

ద్వి. సంపంగెకేళిగాలిఁ జలియించు తేఁటి, గుంపు
లగలి...అ. మ. క. ౨. ౬౪. ౨౩ పం.

క్రేడి[1]. వి. సంబావుతోఁ గలసినకారు లోనగు ఎఱ్ఱవడ్లు. (శ. ర.)

క్రేడి[2]=క్రేణి.

(పరిహాసము - చూ. క్రేడిసేయు.)

జ: క్రేడించు, క్రేడిసేయు.

క్రేడించే=క్రేణించే, కేడించే. స. క్రి. (√క్రేడి[2].) ఉపేక్షించు, అలక్ష్యము చేయు.

గీ. తమ్ము వరియింపకునికి దీర్ఘమ్ము రోఁజు, నహులఁ
గ్రేడించి నడచిరి యానధరులు. నైష. ౪. ౩౦.

అ. క్రి. తొలఁగు.

క... విప్రుతోడ మెయికొని పోరి,ట్లమ్చుపడ
నేటి కని వి,వ్వచ్చుఁడు గ్రేడించి యొండు
వలనికి నడచెన్. భార. భీష్మ. ౨. ౩౦౭.

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడిం
చి రాక గెలుపే యతఁ డే,చ్చో డాఁగి
పోయెనొకొ మా,తోడిబవర మిట్లు తాను దొ
లఁగినఁ దెగునే. భార. ద్రో. ౧. ౩౭౪. ప్ర
భా. ౩. ౩౮.

క్రేడిసేయు=క్రేణిసేయు. స. క్రి. (క్రేడి[2] + చేయు) పరిహాసము చేయు.

వ...విలయమార్తాండమండలంబు వేఁడిమిం గ్రేడి
సేయు మాఁడవబాణంబు తూణంబునం దిగు
చునప్పుడు. జై. భా. ౪. ౭౨. (శ. ర. పా-
ఔపమ్యద్యోతకము.)

క్రేణి=క్రేడి[2]. వి. ౧. ఉన్నతపదము, పెద్దయధికారము.

క. మించి ధనమాసఁ బ్రజ నెరి,యించు మరాత్ముల
కుఁ గ్రేణి యిచ్చుట పతి కూ,హించిన నిండిన
చెలు వవి,యించి శకులకులము సంగ్రహించు
ట గాదే. కవిక. ౨. ౧౯.

౨. పరిహాసము.

ఉ. నారి యొకర్తు చొక్కపునవల్ గలచక్కని
చిన్నపొన్నకుం, జేరి ప్రసూనగుచ్ఛము లశే
షము గోసియుఁ గ్రేణి నోర్తు నీ,భూరుహ మె
క్కు మన్న నగి పూచఁగఁ జేయుదు నాకి
దెంతయున్, మేరువు గాదు నా నదిన పేరున
నందగి పూచెఁ గ్రమ్మఱన్. చమ. ౧. ౬౮.
(శ. ర. పా.)

క్రేణివట్టు=పొందు ?

గీ. పరమకళ్యాణి యాపగాంభస్త్రివేణి, రాజశే
ఖరపతంనుగారాపురాణి, సమధికప్రీతిఁ దేలి
యాసత్యవాణి, సేవలత్వశుభశ్రేణి గ్రేణివట్టె.
కాశీ. ౩. ౯౦.

జ: క్రేణించు, క్రేణిసేయు.

క్రేణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. (వెలయిచ్చి)కొనుట. (విల్యమ్ను) ౨. భూమి మున్నగునవి ఇంతకాలమునకు ఇంత ద్రవ్యము ఇచ్చెద మని ఫలభోగమునకై పరిగ్రహించుట. (శే.ని.)

క్రేణించే=క్రేడించే. స. క్రి. (√క్రేణి.) అలక్ష్యము చేయు, తిరస్కరించు.

సీ. పూఁబోఁడి యిపుడు నాపూబంతు లింక నీపా
లింటి వనుచు డాపంగఁ దగునె, కమల మె
క్కటి నేను గాన్కఁగా నిచ్చినఁ గనుసన్నఁ
గ్రేణింపఁ జనునె సకియ. గీ. యనుచు నిఘ
మ్రోల మేలంబు లాడుకొనుచు, నంగసౌం
దర్యసంసూచనాభిరామ, చాటువాచావి
చిత్ర్యాసరణి మీఱ, గిల్లి రప్పుడు సతుల
రాగిల్లి విరులు. రామా. ౧. ౧౭౮.

క్రేణిసేయు=క్రేడిసేయు. స. క్రి. (√క్రేణి.) పరిహసించు, తిరస్కరించు.

ఉ. ... కాంచనహర్మ్యతుంగశృంగమ్ములరశ్మి రే
ఖలు ప్రకాశములై కడఁ బర్వి తత్సమీ,ప
మ్మునఁ బాఱుచున్నఘనపంక్తులయం దచిర

ద్యుతిప్రతా,నమ్ములఁ గ్రేణి సేయుచు ననార తముఁ విలసిల్లుఁ దత్పరిన్. భార. ఆది. ౭. ౭౧. (ఇట ఔపమ్యద్యోతకము.)

ఉ. కాయజుఁ గ్రేణిసేయు ననఁ గౌశికు మీఱు ననంగ విభ్రమ,శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే. భార. విరా. ౧. ౨౩౪.

ఇప్లే: క్రేణియొనర్చు.

ఉ. ... మేనకఁ గ్రేణియొనర్చుప్రాయపుం, జేడియ లబ్బురం బయినచెంగలువల్ తగఁ జల్లి రండఱున్. యయా. ౪. ౧౫౬. (ఇట ఔపమ్యద్యోతకము.)

**క్రేత.** సం. విణ. (ఋ. త్రి. ఋ.) వెలయిచ్చి కొను వాఁడు, విలుపకాఁడు.

**క్రేతవ్యము.** సం=క్రేయము.

**క్రేపు.** వి. ౧. దూడ, వత్సము.

సీ. దూడ నాఁ గ్రేపు నాఁ దోఁచును వత్సంబు... ఆం. భా. ౨. ౨౬౨.

క. అరి మిగులఁ గొనుట క్రేపులు, పొరిమాలం బిదికినట్ల భూవర...భార. శాం. ౨. ౩౭౯.

క...క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్. భాగ. ౧౦ పూ. ౫౧౦.

౨. (పర్వత) శిఖరము.

ఉ. ...ఇందుబింబమున్, గిమ్మనసీదు మోపు గిరిక్రేపులు మూఁపులు కొను గానరా,ను ... మనుచ. ౩. ౬.

జ: క్రేపుఁగుట్టి.

**క్రేపుఁగుట్టి.** వి. (√ క్రేపు) చిన్నదూడ.

సీ. ధారిణీగవికి రత్నమహౌషధంబులు చేఁపు పుట్టించిన క్రేపుఁగుట్టి. వరాహ. ౧౦. ౪౭.

**క్రేయము.** సం. విణ. (అ. ఆ. అ.) కొనఁదగినది. (సరకు)

**క్రేయో.** వి. వెడలఁగొట్టుటయం దగుధ్వని కనుకరణము.

శా. ... ఈ,యోషిద్బాడబులన్ ధనంబుఁ గొని క్రేయో యంచు మర్త్యాళి దు,ర్భాష ల్పల్కఁ బురంబులో వెడలఁ బంపం బాడి ... భల్లా. ౩ ఆ. (శ. ర.)

**క్రేళ్లు.** వి. బ. ౧. బాహుళ్యము, అతిశయము.

సీ. రోహణాద్రియుఁ బెక్కురూపు లై యున్నట్లు క్రీడాచలంబుల క్రేళ్లు గలిగి. భా. రా. యు. ౨౨౭౧.

౨. గంతులు; పర్వులు. (చూ. క్రేళ్లుదాఁటు, క్రేళ్లుదోలు, మొ.)

క్రేళ్లుచూ(నూ)చు=క్రేళ్లువాఱఁజూచు, చంచలముగాఁ జూచు.

ఉ. ...సత్యసంతతుల్, వెచ్చపుఁగూరుముల్ పరిఢవింపఁగ నేరరు నేర రబ్జసం,పచ్చటులంబు లై మెఱయుబచ్చెనచూపులఁ గ్రేళ్లుచూడఁగన్. పి. శకుం. ౨. ౧౬౦.

సీ. అచిరాంశురుచు లేమి యని వానిదెసఁ దప్పఁ జూచుభావనఁ గ్రేళ్లునూచు నతివ. కు. సం. ౭. ౬.

క్రేళ్లుచూపులు=చంచలదృష్టులు.

సీ. క్రేళ్లుచూపులకలికితనంబుపస నేర్చె...కళా. ౬. ౨౦౦.

క్రేళ్లు త్రుళ్లు=క్రేళ్లుఱుకు.

సీ. తల వాంచి బెళుకుఁజూపులు క్రేళ్లుత్రుళ్లఁగఁ దెఱమఱుంగున నిల్చునొఱపుఁ జూచి. కువల. ౪. ౭౧.

జ: క్రేళ్లుదాఁటు, క్రేళ్లుదోలు, క్రేళ్లుద్రిప్పు, క్రేళ్లుబ్బు, క్రేళ్లుఱుకు, క్రేళ్లువాఱు, క్రేళ్లుసను, క్రేళ్లెగయు.

**క్రేళ్లుదాఁటు.** అ. క్రి. (క్రేళ్లు+దాఁటు) ౧. ఎగిరిపడు.

ద్వి...మీలు,క్రేళ్లుదాఁటుచు మాటికిని సముల్లోల,కల్లోలములఁ దేలుక్రమముఁ గన్గొంటె. విష్ణు. పూ. ౨ ఆ. (శ.ర.)

౨. గంతులిడు; దుముకు.

చ....కపీంద్రులు దిక్కు లార్పులం,బటియలు సే యుచున్ బ్రమరి పాఱుచుఁ గేరుచుఁ గ్రేళ్ల దాఁటుచున్. భా. రా. యు. ౨౭౩.

సీ. అడ్డంబునిడుపుటాఁబడ్డలగతి మనుఁబిళ్లు డొం కలనుండి క్రేళ్లుదాఁట. మనుచ. ౨.౬. రాజ. చ. ౩. ౧౬౧. ప్రబోధ. ౧. ౯౯.

ఇశ్లే: క్రేళ్లుగదాఁటు.

ఉ. ... ఉదగ్ర శిలాచలభూరిశృంగముల్, గేల ధరించి నల్గడలఁ గ్రేళ్లుగదాఁటుచు నార్పులం దెసల్,వ్రీలఁగఁ జేయుచున్...భా. రా. కి ష్కిం. ౫౪౨.

**క్రేళ్లుదోలు.** స. క్రి. (క్రేళ్లు+తోలు) పరుగులె త్తించు.

వ. అని పలికి సమరప్రకారంబునం దేరు క్రేళ్లు దోలి పాంచాలబలంబులపయి నడరె. భార. భీష్మ. ౩. ౩౬౭.

**క్రేళ్లుద్రిప్పు.** స. క్రి. (క్రేళ్లు+త్రిప్పు.) గంతు లువేయించు.

మ... కొర్కులు క్రేళ్లుద్రిప్ప...మనుచ. ౨. ౩౦.

**క్రేళ్లుబ్బు.** అ. క్రి. (క్రేళ్లు+ఉబ్బు) అతిశయిం చు.

సీ. అలజలంబులు ధాత్రి నవఘళింపక మున్నె క్రేళ్లుబ్బు వారియకీర్తిపంక,మాపంకసంకరం బంకురింపక మున్నె పాడము నసత్కీర్తి పుం డరీక,ము...నరస. ౫. ౧౦౨.

**క్రేళ్లుఱుకు.** అ. క్రి. (క్రేళ్లు+ఉఱుకు).౧.ఉఱు కు, దూఁకు.

క. చఱినుండి తొలఁగ నుఱికెడు, నెఱసింగపుఁ గొదమ వోలె నిబ్బరముగఁ గ్రే,ళ్లుఱికెం దొ లఁగం బగతుని, యఱకటనుండి భువిమీఁది కబ్బలియుండున్. హరి. పూ. ౬. ౧౦౫.

క. ఆలోనం గురుధరణీ, పాలుఁ డడరి ప్రేయ టయును బవనసుతునిపై, సోలెనది గావఁ డాపతి, కేలీవిభ్రమము దోఁపఁ గ్రేళ్లుఱికె నృపా. భార. శల్య. ౨. ౨౬౫.

౨. ఎగిరిపడు, మిడిసిపడు; గంతులిడు.

వ. చకితకురంగశాబంబుకరణిం గ్రేళ్లుఱుకు చేడి సమీరలకరణిం బ్రేక్షణప్రభాజాలంబులు వ లుగడలం గడలుకొన...కృ. శకుం.౨.౪౦.

సీ. కేలిపై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడువాలుగ సోగలమేలు డించి. భార. విరా. ౨. ౭౩. (శ. ర. పా)

సీ. హయము క్రేళ్లుఱుకునో యని రెండుగడలం దు వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు. కళా. ౬. ౬౨.

**క్రేళ్లువాఱు.** అ. క్రి. (క్రేళ్లు+పాఱు) గంతులు వేయు.

ద్వి. బల్లిదుల్ మాశివభక్తులే యనుచుఁ, గ్రేళ్లువా ఱుచు నాడు క్రియఁ బాడి యాడు. బస.పు. ౧. ౪౨౦.

ఉ...లోచనప్రభా,జాలము క్రేళ్లువాఱఁగఁ గు చద్వితయంబు చలింపఁ జొక్కుచున్, పా లుచు సారెకు న్మరలి చూచుచుఁ జేరె నికుంజ గేహమున్. కృ. శకుం. ౨. ౪౭.

గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ నుఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్లువాఱు, నావృకోదరుపైఁ గవియంగఁ జేయి,వీచె సేన కుఁ గాళింగవిభుఁడు గడఁగి. భార. భీష్మ. ౨. ౬౦.

**క్రేళ్లుసను.** అ. క్రి. (క్రేళ్లు+చను) క్రేళ్లుదాఁ టు, ఎగిరిపడు.

సీ. హస్తులగదురున కడరి నిల్వక క్రేళ్లుసను హ యంబులమణిస్యందనములు. భా. రా. యు. ౫౧౭.

క్రేళ్లెగయు. అ. క్రి. (క్రేళ్లు+ఎగయు) మీఁది కెగురు, పై కెగురు.

క ... కే లాగిఁ దెగి యలుఁగులతోన క్రేళ్లెగసి వ డిం, దూలె...కు. సం. ౧౧. ౭౨౫.

క్రేవ. వి. ౧. ప్రక్క, పార్శ్వము. (వృత్తియందు దంత్యవర్ణలోపము. చూ. క్రే.)

వ. కయ్యంబు కలదూ పంతమునఁ గనుఁగొనుటకు మింటిక్రేవ నున్న వెరవు గా దనుపరుసున సవిత్రుండు చక్కనిమింటికిం జనుదెంచె. భా ర. భీష్మ. 3. 3౭౬.

క. క్రేవల నేకాంగులు రా...అము. ౨. ౯౬.

క. ఇరుక్రేవల నడకకాఁర్గరథాంగగదాయుధము లు రాఁ దొడఁగె...పారి. ౨. ౭౭.

౨. సమీపప్రదేశము, దగ్గఱ.

గీ...క్రేవ పొంత, యంచ యొద్ద నా నికటాఖ్య యగు...ఆం. భా. 3. ౨౧.

3. ప్రదేశము, చోటు.

చ. అలకలఁ జిన్నిపూ వలికినంతన మోము సెమర్చుఁ జన్నుఁగ్రేవల మృదుపత్త్రభంగములు వ్రాయుడుఁ గా నసియాడు ... కోమలి మరు ప్రసవాస్త్రహతిం జలింపదే. కు. సం. ౫. ౬౧౨.

ఉ. తాళఁగ లేక తాల్మి చెడి తల్లడ మందుచు లేచి సేలపై, వ్రాలుచు...కే లెడఁ జేర్చుచుం జలువక్రేవల కేఁగుచు నీరు ద్రావుచు౯. చెన్న. ౫. ౧3.

కన్నుఁగ్రేవ, కంటిక్రేవ=కంటిపార్శ్వము, కంటికొన.

శా. కన్నుంగ్రేవలఁ గెంపు దోఁప ... చం. రా. ౫. ౬౧.

ఉ...కంటిక్రేవ...భార. భీష్మ. ౨. 3౦.

జః క్రే, క్రేఁగన్ను, క్రేఁగయి, క్రేఁదొట్టు, క్రేగాలి, మొ.

## క్రై

క్రైలు. వి. ధాన్యము నుఱిచి కొలుచుట, ఒబ్బిడి.

వ... క్రైలుగ నఱకి పగటం జిట్టుముట్టాడుసహజ సాహసులును...ఉ. హరి. ౪. ౨౯. (ఇక్కడ క్రైలుగ ననఁగా సర్వనాశముగ ననియర్థము. గ్రంథములయం దిట్లు రేఫసహితముగా నిది కానఁబడుచున్నది.-శ. ర.)

జః క్రైలుదారి.

క్రైలుదారి. వి. (√క్రైలు.) క్రైలు చేయించెడి యధికారి. (శ. ర.)

## క్రొ

క్రొ. విశే. (వృత్తియందు క్రొత్తశబ్దముయొక్క లుప్తశేషము. చూ. క్రొత్త.)

క్రొంకి=కొంకి.

(యుద్ధసాధనవిశేషము.)

గీ. పాళెము ల్వెట్టి క్రొంకులు బ్రద్దపురుఁ, గత్తి గొంతెంబు లొడిసెళ్లుఁ గత్తళములు, నారసములును విండులు నగరిలోనఁ, బెట్టి ... ఉ. హరి. ౨. ౯౨.

(చోరసాధనవిశేషము)

చ...కొ,య్యయు నురి క్రొంకి నారసము...దశ కు. ౫. ౭౨.

మత్తకోకిల...గ్రద్దగోరును గ్రొంకియుం౯. ద్వా. ౧౦. ౧౧౯.

క్రొంచే=కొంచే. (సం. క్రౌంచః. ప్రా. కోంచ) క్రౌంచపక్షి.

ఉ. ఱెక్కలు సించి కంఠమున ఱేకులు వాపి శిరంబు వ్రచ్చి పేఁరుపుక్కనఁ గ్రొంచచంద మగునొడ్డు గలంగఁగఁ జేసి... భార. భీష్మ. ౨. 3౦.

క్రొంఛాయ. వి. (క్రొత్త+ఛాయ) నూతన కాంతి.

సీ.రంజిల్లనపరంజిక్రొంజాయకమ్మడాల్తపసుపుఁ జె
క్కు_లమీఁదఁ దాండవింప. ఇందు. ౫. ౧౭౩.

**క్రొంజిగురు.** వి. (క్రొత్త + చిగురు) లేఁతచిగురు.

సీ. పావనవైజయంతీవనమాలిక క్రొంజిగుకొత్తిన
గుజ్జుమావి... గీ. అనఁగఁ జూపట్టె జలధిక
న్యాలలామ, పద్మనాభునిఘనభుజాభ్యంతర
మున. దశా. ౨. ౨౮౨.

**క్రొంజిగురులవిల్కాఁడు.** వి. (√క్రొత్త)-లేఁ
జిగురువిల్తుఁడు-మన్మథుఁడు.ఆం.భా. ౧. ౮౫.

**క్రొంజిలుఁగుఁజేల్వ.** వి. (క్రొత్త + జిలుగు + చ
ల్వ) క్రొత్తదియైన సన్నపువస్త్రము.

చ. జలకములాడి క్రొంజిలుఁగుఁజల్వలు దాలిచి పు
ణ్యవేదిపై,నెలకొని సంధ్య వార్చి జపనిష్ఠలు
దీర్చి కృతాగ్నిహోత్రుఁడై.ఉ.రా.౫.౨౮౬.

**క్రొఁజీకటి.** వి. (క్రొత్త + చీకటి) మునిచీకటి, మ
సకచీకటి.

మ.నటదీశానశిరస్తటత్రుటితరత్నచ్ఛాయఁ గల్లోలి
నీ, వీటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగా
భిపాతోన్నమ,త్పటుపాథోలవధారఁదార లె
గసెం దద్బిందుసంజానితో,త్కటసంధ్యానల
ధూమకందళములై కన్పట్టెఁ గ్రొంజీకటుల్.
వసు. ౪. ౧౦.

**క్రొందమ్మి=క్రొత్తమ్మి.** (శ.ర.)

**క్రొందావి=క్రొత్తావి.** వి. (క్రొత్త + తావి) నూత
నపరిమళము.

క. కుందనపుబిందియల హరి,చందనతరుఖండవ
హ్నిసంతప్తం బై, క్రొందావు లొల్కుపన్నీ,
టందగ జలకంబొనర్చి...హంస. ౫. ౩౬౬.

**క్రొంబట్టు.** వి. (క్రొత్త + పట్టు) క్రొత్తపట్టు.

సీ. జెడఁగుఁజెంగావిచల్లడముపై బిగియించి కట్టి
నక్రొంబట్టుడట్టి దనర. దశా. ౭. ౨౭.

**క్రొంబని.** వి. (క్రొత్త + పని) వింత యగుశిల్పము,
అపూర్వశిల్పము. ఇందు. ౬. ౧౩౧.

**క్రొంబూవిలుకాఁడు.** వి. (క్రొత్త+పూ+ విలు
కాఁడు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

ఉ...క్రొం,బూవిలుకానిసాహిణపుఁబ్రోవరి యా
మని వచ్చె నత్తఱిన్. కృ. శకు. ౧. ౭౧.

**క్రొంబెరుఁగు.** వి. (క్రొత్త + పెరుఁగు) నూతనదధి.

సీ. పెక్కు_లాగులఁ గదంబించుజున్నులతోడఁ జే
రి చాఁకొన్న క్రొంబెరుఁగులతోడ. పి.శకు. ౧.
౧౩౫.

**క్రొంబొగ.** వి. (క్రొత్త + పొగ) నూతనధూమము.
భా. రా. యు. ౨౧౯.

**క్రొక్కారము.** వి. కోడికూఁత.

సీ.కార్కో_డిగములక్రొక్కారంబుసందడి...చం
ద్రా. ౨. ౪౧. (శ. ర. పా-కొక్కారము. చి.
ని. పా-కోకారము. ముద్రి. పా)

**క్రొక్కారు.** వి. (క్రొత్త+కారు) వర్షాకాలము.
కవిక. ౬. ౧౯.

క్రొక్కారు మెఱుఁగు=వర్షాకాలపు మెఱపు. భా
ర. విరా. ౨. ౪౩. నైష. ౩. ౮౨.

**క్రొగ్గంటి.** వి. (క్రొత్త+గంటి) క్రొత్తగాఁ బడిన
గాయము.

సీ. బరులపైఁ గ్రమ్మెడునరుణధారలు దమమేనిక్రొ
గ్గంటులలోనఁ జొచ్చి. కు. సం. ౧౧. ౭౦౨.

వ...ఆపాదచూడంబుగా నొదవినక్రొగ్గంట్లనుసు
గక నెడలుక్రొన్నెత్తుట జొత్తిల్లి...కవిక. ౨.
౧౯౭.

**క్రొత్త.** (వృత్తియందు మీఁదివర్ణములు వికల్పముగా
లోపించి 'క్రొ' అనునది మిగులును. దీనికి కొన్ని
యెడల నుమాగమమును కొన్నియెడల పర మగుహ
ల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా: క్రొంబసిఁడి,
క్రొంబులకలు, క్రొక్కారు, క్రొగ్గంటి, క్రొగ్గండి,
క్రొన్నెల, క్రొమ్మేఘము, మొ.) విశ. అపూర్వము;
నూతనము.

క. కరువున గండరువునఁ జి,త్తరువున నిసచంద్రరుచులఁ దారలరుచులన్, హారహారధాత్రాదులకీ,హరిణముసరిరూపు పడయ నలవియె యెందున్. భా. రా. అర. ౨. ౩౩.

క. వెన్నెలపోఁతపనులో యన, వెన్నెలగండరువుపనులవిధమున మీఁదన్, వెన్నెలనీరు వెఱపి రనఁ, గన్నులకింపొసఁగె నిల సకలరూపములున్. నిర్వ. ౬. ౫౩.

చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చి గం,డరు వొనరించిరో హరుజటాస్థలికిం దొడ వైనయేటివె,న్నరువునఁ జేసిరో యన మనోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లుసుం,దర తురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్. భార. అను. ౧. ౧౭౩.

**గండవడము**=కండవడము. (శ. ర.)

క. ఉండిరి కాంతయుఁ బతియును,గండవడము మాటునందుఁ గడు నింపులతో, నిండినవేడ్కలు తనరఁగ, నొండొరులం జూడఁ గన్నులువ్విళులూరన్. పోడ. ౭. ౬౧. విప్ర. ౪. ౩.

**గండశిల.** సం. వి. ఆ. స్త్రీ. పెద్దబండ.

**గండశైలము.** సం. వి. అ. పుం. కొండనుండి జాఱిపడినపెద్దఱాయి.

**గండసాహ్వయ.** సం. వి. ఆ. స్త్రీ. గండకీనది.

**గండాంగము.** సం. వి. అ. పుం. ఖడ్గమృగము.

**గండాడు.** అ. క్రి. (గండు+ఆడు)-మగపని చేయు-రమించు.

క. చండాలితో ద్విజుం డొగి, గండాడిన పక్షమున భగము వ్రాసి తగన్, దండువు గొని దేశంబున,నుండకయుండంగ నడుచు టుచితము పతికిన్. విజ్ఞా. ప్రా. ౧౨౬.

**గండారము**=గండరువు.

ఉ ... అ,చ్చెరువకఁబమ్ముం గదిసి చిత్తరువో కరువో యనంగ గం,డారపుబొమ్మవోలె నచటం గదలించుక లేక యుండఁగన్. ఉ. హరి. ౧. ౬౦.

వ... గండారంబులబొమ్మలరహిని మానులకైవడి జక్కఁగా మేనుల నిసుమంత గదలనీక నిలుచువారును... ప్రబంధ. ౭౭౭.

**గండారు.** వి. చెఱసాల.

శా. వ్రేలుంగొమ్మలు సేల దారసిలినన్ వెళ్లంగరాకుండఁగా, లోలోఁ ద్రిమ్మరునాలిగాడ్పులు పగళ్లన్ రేలుఁ బూఁదావులన్, జాలన్ ముచ్చిలిపోవఁ బట్టుకొని పజ్జన్ బచ్చగండార్లలో, సోలన్ గావలిపెట్టె నామని యనన్ జూపట్టె లేఁదోఁటలన్. యయా. ౪. ౭. (ప్రయోగాంతరము లేదు)

**గండాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగఱికె. ౨. సర్పాక్షీలత.

**గండి.** వి. (తు.మ.క.గండి) ౧.రంధ్రము,బిలము.

గీ. సరియ యన గండి యనఁగను సరె యనంగ,బడిలి యన దుంక వన రంధ్ర మడరు ... ఆం. భా. ౧. ౧౪౫.

ఉ. సన్నపుగండి యొక్కటి రసాతలమార్గము పోలె నివ్వమై... భోజరా. ౫. ౭౫.

వ...నవ్యనారాచభిన్నదేహంబులయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలురక్తస్యందసందోహంబులతో ...భాగ. ౧౦ పూ. ౧౫౫౯. వేం. పంచ. ౩. ౨౦౦.

గండిచేయు=కన్నము కలదిగా చేయు.

గీ. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు, బండికల్లుగ నీమేను గండిచేసె, నదియు నెలవాటి తెగటాఱవైతి చంద్ర,యకట రోహిణియెడ నపథ్యమునఁ జేసి. మనుచ. ౩. ౪౦.

౨. గుంట.

సీ...ఆకురాలుపుగండ్లయందు...మనుచ. ౬. ౨౭. ఆము. ౫. ౧౧౭.

౩. సందు, అవకాశము.

ఉ...వారును వానియెమ్ములన్, గీఱఁగ నొండువిం డ్లు గొని కిన్క యెలర్పఁగ నేసి కెమ్మెయిం, దీఱద గండి గాంచి నసు తేరిపథంబునఁ బోవ వారికిన్. భార. ద్రో. ౩. ౮౩.

జ: గండిదొంగ.

**గండి.** సం. వి. ఇ. పుం. స్కంధము, వేర్లు మొదలు కొమ్మ వఱకు నుండుమ్రానిభాగము.

**గండిక**=గండి. (శ. ర.)

**గండిక.** సం. వి. ఆ. స్త్రీ. గులకఱాయి.

**గండిదొంగ.** వి. (గండి + దొంగ) కన్నపుదొంగ.

గీ. వీఁడెపో వ్రేలగీముల వెన్నజున్ను, గముఁ గొల్లగ మెక్కినగండిదొంగ. నీలా. ౩. ౫౨.

సీ...గండిదొంగనఁ గన్నకాఁడనంగఁ, దగు సురంగాకారితస్కరనామంబు...ఆం. భా. ౨. ౫౧.

**గండివనము.** వి. (సం. గ్రంథిపర్ణమ్) గ్రంథిపర్ణము కీ.

గీ... గ్రంథిపర్ణంబు పొల్పగు గండివనము, నాఁగ ...ఆం. భా. ౨. ౬౨.

**గండీరము.** సం. వి. అ. పుం. ౧. ఏఱుపంగ కీ. ౨. తురుజహూర కీ. వ. చిత్త్రిహూర కీ.

**గండీరి.** సం. వి. ఈ. స్త్రీ. జెముడు కీ.

**గండీరుఁడు.** సం. వి. అ. పుం. శూరుఁడు.

**గండు.** వి. (సం. గండః. క. గండు) ౧. మగతనము, మగటిమి, పౌరుషము; బలము, శక్తి, సామర్థ్యము.

గీ. మగతనంబన గండన మగటిమి యనఁ, బౌరుషంబున కాఖ్యలై పరఁగుచుండు. ఆం. సం. మాన. ౫౭.

క. గండున రాధాతనయుఁడు, రెండు దినంబులు పెనంగి...భార. అశ్వ. ౩. ౧౨౪.

క. పాండవులును బాంచాలురు, దండిమగలు వారు నూడఁ దలఁకక నిన్నున్, భండనమునఁ బడనైవఁగ, గండు గలుగు టద్భుతంబు... భార. స్త్రీ. ౨. ౭౭.

౨. మగజాతిజంతువు, పసుజాతిలో మగది; మగ కుక్క.

సీ. గండనఁ బోతనఁ గాను దిర్యక్పుం, పాఖ్యయా...ఆం. భా. ౨. ౧౦౦.

ఆ. గూనివీపు లదర గొణఁగి తిట్టుచు నేపు, గఱచినట్టికుక్కగండ్లనంగ, మూలినరపమాసముల బోయముమసళ్లు, పందివలలు మోచి పఱచిరపుడు. మనుచ. ౪. ౩౬.

క. ఒడ లుబ్బ నిక్కి ముందటి, యడుగులు ధర నూఁది చిందునలబలమునకున్, జడియ కొకగబ్బిగండె, క్కుడుఁగడిమిన్ దివిచెఁ ద్రుంగి కొమ్ములయుడుముల్. మనుచ. ౪. ౫౩.

చ...నులివచ్చ పెన్నురవు నెత్తురు ద్రావుమ వేఁటదీర్పఁగాఁ, బులితలగుండుగండఁడనఁ బొల్చనగం డిది భూవరోత్తమా. చంద్రా. ౨. ౭౫.

౩. గర్వము.

ఉ...దుర్గమదోర్బలు లమ్మహాత్మకుల్, గండున బెట్టు పైఁబడుట కార్యము గాదు ... భాగ. సౌ. ౧. ౨౨.

సీ. ఒండు చూడండు మూష్టుండు మండునటం చుఁ దొండయై గండాటియుండె ధనదుఁడు ... ఉ. రా. ౩. ౧౭౧.

౪. కోపము.

గీ. అని గయాళించికొనుచు హస్తాంబుజముల, నిరుపాపని దురదుర నరిగి తొట్ల, లోనఁ బడవైచి మొగమునఁ బూనుగండు, తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి. శుక. ౪. ౬౩.

విణ. మగజాతిది, మగది.

ఉదా: గండుఁదుమ్మెద, గండుమీను, గండుఁబిల్లి.

సీ. చంచలం జిగురాకుఁ జించి యాడుచు నలి
నెలుఁగించుగండుఁగోయిలలసాంపు. భార.
అను. ౧. ౧౭౧.

గండడఁగు=బలహీనుఁ డగు.

క...భీమసేనుఁ దాఁకి...నొంచిన, గండడఁగక
యతఁడు...భార. ద్రో. ౪. ౧౫౩.

గండడఁగించు=గండడఁచు, నశింపఁజేయు.

చ... కైటభదానవభేది యంతరం,గము నెడలిం
చెఁ గాని నిను గండడఁ,గింపకపోయె నింది
రారమణిఁ దలంచి రా,త్రిచర రాగనిమగ్నుల
కేడ ధర్మముల్. వసు. ౪. ౩౨.

చ...క్రోధకామముల గండడఁగించి...ఉ. హరి.
౪. ౭౭.

గండడఁచు=ఓడించు,లొంగఁదీయు.

సీ. ఎదిరించుకరినైన నెదిరించుహరినైన గండడం
పఁగఁ జాలుగుండెదిటము. ఇందు. ౧. ౧౫౨.

గండుమిగులు=విజృంభించు; ఒప్పు.

క. పాండవపాంచాలాదులు, గండుమిగిలి పెట్టు ద
ళుమఁ గౌరవబల మొం,డొండ కలంగెడు న
ద నీ,పండితనము నూపి కావఁ దగుతజె వ
చ్చెక్. భార. ద్రో. ౫. ౯౫.

వ...శిఖండి గాంగేయునకుఁ గట్టెదురుగా నిలి
చి గండుమిగిలి యొప్పె ... భార. భీష్మ. ౧.
౧౩౦.

సీ. వికటాస్థిహారముల్ విషధరమాలికల్ గజచర్మ
వసనంబు గండుమిగుల... గీ... మదమత్తవృ
షభ మెక్కి,రుద్రుఁ డీవేళ మెలఁగెడు రౌద్ర
ముగను. దశా. ౩. ౫౨.

గండుమీఱు=శక్తిహెచ్చు.

వ...అమ్మహాభాగుండు గండుమీఱి... తనుచ్ఛా
యాపూరంబున నక్కాన వెలింగించుచు ...
మనుచ. ౨. ౭౭.

గండుమెఱయు=గండుమిగులు.

వ.నిండునెలమగండు గండుమెఱసి యేతేరఁ దేటి
చూచినతో గమగువ...రాజ. చ.౩. ౧౪౨.

వ. అన్నలుండు ... సంపూర్ణపూర్ణిమాచంద్రబి
బంబు విడంబింపం జాలునెమ్మొగంబునసం
గళంకాలంకారకళంక సంకిరింపంజేయం జా
లుకోమలశ్మశ్రురాజి విరాజిల్లం గండుమెఱ
సి...నైష. ౧. ౯౭.

జ: గండాడు, గఁడుబాయి, గండువావిలి.

గండుఁడు. సం. వి. అ. పుం. శూరుఁడు. (కే. ని.)

గండుబాయి. వి. (గఁడు+బాయి) మగబాయి,
వజ్రము.

సీ. గండుబానిగ్గుచొకాటంపుమొగముట్టుతోగకేఁ
కలపతాణి దుమికి యాడ.ఉ.హరిశ్చ.౩.౧౩౧.

గండువావిలి. వి. ( గఁడు+వావిలి. ) వృక్షవిశేష
ము.

సీ. కలుజువ్వి వావిలి గండువావిలి యేఱుమద్ది
మద్దియును...హంస. ౪. ౧౧.

గండువు. సం. వి. ఉ. పుం. ఉ, ఊ. స్త్రీ.తలగడ.

గండూపదభవము. సం. వి. అ. న.సీసము.(కల్ప)

గండూపదము. సం. వి.అ పుం.కించులుకము,ఎఱ్ఱ,
వానపాము.

గండూపది. సం. వి. ఈ. స్త్రీ. శిలి, ఆఁడువానపా
ము.

గండూష. సం. వి. ఆ. స్త్రీ=గండూషము.(కే.ని)

గండూషము. సం. వి. అ. పుం. న. ౧. పుక్కిలిం
త. ౨. పుడిసిలి. ౩. ఏనుఁగుతొండముచివర.
(వై. ని.)

గండూషించు. సం. స. క్రి. పుక్కిలించు.

వ...కాదంబరి గండూషించి...మనుచ. ౩. ౭౯.

గండె=గెండె. వి. (సం. గడః. త. కెండై) మత్స్యవి
శేషము; మత్స్యము.

ఉ...పిత్తడికాసు మల్లుమీ, నల్లయు గండె రొ

య్య పర కాదగఁ జేపలఁ బట్టి... ప్రబంధ. ౧౯౫.

సీ. తాను సురమానినృపతనుల్ దాల్చి యకట, కామినీలతి నుడికించుకంటె నట్టె, గండెయు ను నల్లదాసరిగాఁడుఁగిరియు,హరియు నై పోవుటయ మంచి దను యుగంబు. ఆను. ౫.౪౧.

**గండోలము.** సం. వి. అ. పుం. ౧. గుడము, బెల్లము. ౨. గుడకము, బెల్లముతో వండినఔషధవిశేషము. ౩. కబళము, నోరుపట్టునుద్ద.

**గండోలి.** సం. వి. ఈ. స్త్రీ. కణుఁదుకీఁగ. (వై.ని.)

**గండ్ర**[1]. విణ. ౧. ధృష్టుఁడు. (శ.ర, వా.) ౨. పెద్దది. (చూ. గండ్రచీమ.) బ. ౧. పరుషము.

శా. తండ్రీ నాకు నను గ్రహింపఁగదె వైద్యం బంచుఁ బ్రార్థించినన్, గండ్రల్ గా నటు లాడి ధిక్కృతులఁ బోకాల్మంటివి...మనుచ. ౫. ౧౭.

౨ గట్టివి, పొల్లుకానివి.

గీ. నుతిపి తూర్పెత్తి కడలకు బిరుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. ౫. ౮.

జ: గండ్రచీమ, గండ్రనూఁక.

**గండ్ర**[2]. వి. (సం. ఖండః.) ఖండము, ముక్క.

సీ.గనె గండ్ర గండ్రిక గనియ యటంచన నిష్వాదిఖండము లెన్నఁ దగును. ఆం. భా. ౨. ౭౫.

ద్వి. గండ్రలుగాఁ గొట్టెఁ గాళ్లను ... పండితా. పురా. ౯౬ పా. అని. ౪. ౮౫.

జ: గండ్రించు.

**గండ్రచీమ.** వి. (గండ్ర[1]+చీమ) ఉలంకలము, పెద్దనల్లచీమ. (శ. ర.)

**గండ్రనూఁక.** వి. (గండ్ర[1]+నూఁక) పెద్దనూఁక, పెద్దతండులఖండము. (వా)

**గండ్రపురి.** వి. పోటికట్టు ? (గాయపడినవానికిఁ జేయు శుపచారము.) సీ. పతయాను పగుబొంది పడకుండుటకు గండ్రపుర లిచ్చ్యగతిఁ జాలఁ బొత్తు లునిచి.పాండు. ౩. ౫౬. (గండ్రపురి=కుట్లకోల-వ్యాఖ్య)

**గండ్రించు.** స. క్రి. (√ గండ్ర[2]) ఖండించు, నఱకు, గండ్రలు గాఁజేయు.

క...వానితల యిలఁ గూలం, గండ్రించువేల్పుపగతుం, డీంద్రగమారయ్యా నితని నెన్నఁగఁదరమే. చెన్న. ౫. ౨౫౦.

**గండ్రిక**=గండ్ర[2]. వి. (సం. ఖండకః) ఖండము, ముక్క.

స్రగ్ధర...గండ్రికల్ చేసి నేలన్, నిండించెన్ దుప్పలన్ బన్నిదమున కొకటిన్ లేక యుండంగ నచ్చోన్. యయా. ౨. ౩౨.

సీ.గనె గండ్ర గండ్రిక గనియ యటంచన నిష్వాదిఖండము లెన్నఁ దగును. ఆం. భా. ౨.౭౫.

**గంత.** వి. (సం. కంథా. త. కందై. క. కంతె.) ౧. కంథ, బొంత.

గీ...కంథ మీఁఖు బొంత,గం తన... ఆం. భా. ౨. ౧౫౮.

౨. చినిఁగినవలువ.

ద్వి.ఇంతవానికి నీకు నిటు నూది పూని,గంత బొంతయుఁ గుట్టఁగారణం బేమి. ద్వి. పరమ. ౨. ౮౪ పా. (చి. ని. పా.)

౩.ఎద్దులు లోనగువానిమీఁద వేయుగోనె, మెత్త. (నందివాహనవర్ణనము.) ద్వి. పస మించుమువ్వలఁ బసిఁడిగంటలును, బసిదిండిగంతయుఁ బాఁపపట్టెడయు...కలిగి...ద్వి. పరమ. ౨. ౭౬ పా.

౪. కనఁబడకుండ ఎద్దులకన్నులకు కట్టెడువస్త్రాదికము, కనుమూఁత.

(వ్యవ) ఎద్దుకు గంతలు గట్టి గానుఁగాడించును.

సా:గంతకుఁ దగినబొంత:- దేనికిఁ దగినది వానికి దొరకు నని భావము.

క. భోగేచ్ఛ నాపఁ గల్గిన, నీగతిఁ జరియింప నే
టికింటనె యున్నఁ గా, సాఁగదె మున్నిటివిట
సం,భోగము గంతలకుఁ దగినబొంతలు లేవే.
నైజ. ౨. ౧౦౧.

గంత, సం. విణ. (ఋ. స్త్రీ. ఋ) ౧. పోవువాఁడు.
౨. పొందువాఁడు.

గంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁ దగి
నది.

గంతు[1]. వి. (క. గంకు) ప్లుతగతి భేదము.

గీ...ప్లుతగతి భేదంబు జంగ గంతు,దాఁటు పల్ల
టీ దుముకు నాఁ దనరు...ఆం.భా.౨.౧౯౭.

వ...త్రుళ్లి గంతు లిడుగబ్బి బెబ్బులులనలఁగుడుల
... మనుచ. ౪. ౩౭.

చ... కనీనికాద్యుతులు గంతులునైవ ... గంధ.
౪౩.

ఉ...గంతుల,స్తోకత వేసి యొక్కయెడఁ జూ
చి సమగ్రపుదృష్టి లేకయే,కాకవి కావుకావు
మని కాకవిధంబు వహించు నిద్ధరన్. ఇందు.
౧. ౧౩.

బ. త్రుళ్లు, మిడిసిపాటు.

మానిని. అంత మదింపకువే యని పల్కిన నంత మ
దింపకువే యనుచున్, గంతు లడంచెద లె మ్మ
ని పల్కిన గంతు లడంచెద లె మ్మనుచున్.
కళా. ౩. ౧౯౫.

(చంద్రోపాలంభము) ఉ... పూర్వపక్షపుం, గం
తుల కేమి చూచెదవుగా తుది నీబహుశాస్త్రి
భేదముల్. వసు. ౪. ౭౭.

(మార్యాస్తమయవర్ణనము) ఉ...రథాంగపంక్తి
కిన్, గంతులు దీటె నుత్పలవనంబుల నాడఁ
గఁ జేర భృంగముల్. వాల్మీకి. ౩. ౯౭.

గంతుఁబరువు = గంతులు వేయుచుపరుగెత్తుపరు
గు.

క. ఆచీకటి వెనుతగిలినఁ,బ్రాచీదిశనుండి గంతుఁ
బరువున రవి ధ,ర్మాచలముమలఁకత్రోవను, వే
చనియెం గాక...భాగ. ౧౦ పూ. ౧౭౯౩.

జ: గంతుగొను.

గంతు[2]. వి. సమూహము, గుంపు.

ఆ. కత్తిగొంటు లైనయస్త్రగంతు. ప. సం. ౭.
౧౩౫.

రగడ. కలికి కలికిలతలను దుష్మైనగంతుగంకులు
చూడు...వాల్మీకి. ౩. ౧౧౪.

గంతుగొను. అ. క్రి. (గంతు[1] + కొను) ౧. దుము
కు, దాఁటు.

వనమయూరము ... రక్కసులు సిగ్గడిగి భూ
మిన్, గంతుగొని పాటి రపకారపరు లా
ర్వన్. భాగ. ౬. ౩౭౭.

క...ధరణికి, గంతుగొనె న్వడిని బంక్తికంధరుఁ
డలుకన్. మొ. రా. యు. ౨. ౩౭.

౨. చచ్చు.

మ...గిట్టెన్ పులు ల్సింగముల్, కడగొట్టెన్ మ
నుఁబిల్లు గంతుగొనె ... సారంగ. ౧. ౧౦౭.
ఆం. సం. మాన. ౫౩. ఆం. భా. ౩. ౭౭.

గంతువు. సం. వి. ఉ. పుం. పోవువాఁడు, వెళ్లు
వాఁడు.

గంత్రి. సం. వి. ఈ. స్త్రీ. కంబలావృతరథము.
(వై. ని.)

గందపట్టె[1](ట్టియ). వి. (సం. స్కంధపట్టికా.
ప్రా. ఖంధపట్టిఆ. క. గందపట్టిగె.) తలుపుమీఁద
నమర్చబడియడ్డుకొయ్య.

గీ...గంద, పట్టె నా స్కంధపట్టిక పఱలు ...
ఆం. భా. ౨. ౨౧.

మ... ఆధాత్రీశువక్షఃకవా,టముపై నె ప్డాకొ
గందపట్టెగతి నుండన్ నాదుకే శ్సేర్చుటల్.
కళా. ౭. ౧౧౦.

క. బలిసద్మద్వారేంద్రో,పలఫలకకవాట మనఁగఁ
బరఁగె సరసి యూర్ము లు గందపట్టియలు
గాఁ, జెలఁగు...చంద్ర. ౪. ౨౬.

**గందపట్టె²(ట్టియ).** వి. (గందము + పట్టె) గందముతోఁ బెట్టినరేఖ.

గీ. ఉదుటుగుబ్బలు గలతల్పుటురము నూచి, గందపట్టెలు నూచి బంగారు నూచి, వీటివాకిటి చోటు నే విడువ కెపుడు, సుట్లునెట్టుచు నుందురు సోమరవులు. ఆము. ౨. ౧౦.

గీ. గందపట్టె యనంగను జందనాను, లేపనకవాటపట్టికల్ మీఱు ... ఆం. భా. ౩. ౫౮.

(ఇవి 'గందపట్టె¹'కుఁ గూడఁ బ్రమాణములు.)

**గందపుఁగొండ.** వి. (గందము+కొండ) మలయాచలము.

చ...అ,య్యాళికచ సేదఁ దేర్చె నపు డందపుగందపుఁగొండపయ్యెరల్. రా. వి. ౩. ౪౦.

ఇట్లే గందపుమెట్టు, మొ. ప్రబంధ. ౮౭.

**గందపుమ్రాను.** వి. ఔ. (గందము+మ్రాను.) చందనవృక్షము.

చ. ననిచినగుజ్జుమావికెలనం దగుగందపుమ్రానికొమ్మలం, బెనఁగొనియున్నమల్లికల పెక్కువ గన్గొని...విప్ర. ౩. ౫.

**గందపా(వొ)డి.** వి. (గందము + పొడి-త. కందప్పొడి.) గంధచూర్ణము, బుక్కా.

సీ. బలుకప్పురంపుఁదిప్పలు వితర్దులుగాఁగఁ బుప్పొడుల్ వలిగందపొడులు గాఁగ. రసిక. ౨. ౧౮.

గీ...గంధచూర్ణంబు చెలఁగు బుక్కా మనంగ, గందవొడి యనఁగాను బుక్కా యన భువ. ఆం. భా. ౨. ౧౬౨.

సీ. అలరుగుత్తులనిండ నలరుపుప్పొడి గుబ్బకవలపై నలఁదుగందవొడిఁ బోల. చంద్రి. ౨.౭౩.

**గందము.** వి. (సం. గంధః) ౧. చందనవృక్షము.

ద్వి. గందంపుఁగొమ్మలఁ గాలాహి చుట్టు, చందంబునను...ద్వి. పరమ. ౮. ౩౪౯ పా.

౨. చందనపుచెక్క మొదలగునవి అఱుగఁదీయఁగా వచ్చులేపనద్రవ్యము.

ఉ. గందపుఁబూఁత...శుక. ౨. ౯౬.

గీ. గంద మందంద డెందంబునందు నలఁది. విక్ర. ౮. ౧౫౯.

ఉదా: మంచిగందము, సాంటిగందము, మొ.

౩. వాసన; సువాసన.

ఆ. కంపు గబ్బు గౌలు గందంబు వల పన,గంధ మెప్పు...ఆం. భా. ౧. ౧౦౬.

ఉ. కమ్మనియూర్పుగాడ్పులగందముఁ గ్రోలఁగ వచ్చి.. హర. ౩. ౭౧.

ఉ...క్రొత్తకప్రపుం,గందముచందముం జెగడఁ గన్నియ నెమ్మెయితావి...నీలా. ౧. ౫౭.

జ: గందపట్టె², గందపుఁగొండ, గందపుమ్రాను, గందపొడి.

**గందొడివాఁడు.** వి. (తోలుబొమ్మలాటలోని) హాస్యగాఁడు; హాస్యగాఁడు.

సీ. పూల్గట్టుసాతానిబోడి కుంగర మిచ్చు గందొడివానికి విందు సేయు. హంస. ౫. ౧౩౮.

**గంధకము.** సం. వి. అ. పుం. ఉపధాతువిశేషము, ఒకమందుదినుసు.

**గంధకారి.** సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామరకి.

**గంధకారిక.** సం. వి. ఆ. స్త్రీ. వాసనద్రవ్యముల నాయితపఱచుపనికత్తె, సైరంధ్రి.

**గంధకాలి.** సం. వి. ఈ. స్త్రీ. యోజనగంధి, సత్యవతి. (వ్యాసునితల్లి.)

**గంధకాష్ఠము.** సం. వి. అ. న. అగురువుకి. (త్రి. ని-శంబరచందనము. రా. ని.)

**గంధకుటి.** సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధద్రవ్యముకి.

**గంధగజము.** సం. వి. అ. పుం. గజవిశేషము.

శ్లో. యస్యగంధం సమాఘ్రాయ నతిష్ఠన్తి ప్రతిద్వి

పాః,సనై గంధగజో నామ నృపతే ర్విజయావహః. (ఆ. ని.)
ఇట్లే గంధద్విపము, మొ.

గంధచేలిక. సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి (రా. ని., త్రి. ని.)

గంధజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ఘ్రాణేంద్రియము, ముక్కు.

గంధతూర్యము. సం. వి. అ. న. యుద్ధమున వాయింపఁబడు భేరి మొదలగువాద్యము.

గంధతైలము. సం. వి. అ. న. ౧. చందనమునుండి తీసినఅత్తరువు. ౨. సువాసన గలనూనె.

గంధదారువు. సం. వి. ఉ. న. అగలు ౛.

గంధధూళి. సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి.

గంధనకులము. సం. వి. అ. పుం. చుంచు. (వాచ)

గంధనము. సం. వి. అ. న. ౧. ఉత్సాహపెట్టుట. ౨. ప్రకాశనము, బయలుపఱచుట. ౩. హింసించుట, బాధించుట. ౪. సూచించుట. ౫. ఉద్వర్తనము, నలుఁగుపెట్టుట.

గంధనాకులి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి ౛.

గంధనాళి. సం. వి. ఈ. స్త్రీ. ముక్కు. (త్రి. ని.)

గంధనిలయ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిమల్లె ౛.

గంధపత్త్ర. సం. వి. ఆ. స్త్రీ. శటి, ఒకవిధ మగుక చోరము ౛.

గంధపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అజమోద, ఒక జాతిఓమము ౛. ౨. అశ్వగంధ, పెన్నేరు ౛.

గంధపలాశి. సం. వి. ఈ. స్త్రీ=గంధపత్త్ర ౛.

గంధపలాశిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. పసుపు. ౨. గంధపత్త్ర, శటి ౛.

గంధపాషాణము. సం. వి. అ. పుం. గంధకము.

గంధపిశాచిక. సం. వి. ఆ. స్త్రీ. గుగ్గిలము మున్నగువానిధూపము.

గంధపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. నీలి ౛.

గంధపుష్పము. సం. వి. అ. పుం. ౧. వేతసము, ప్రబ్బ ౛. ౨. కేతకము, మొగలి ౛. ౩. అంకోలము, ఊడుగు ౛. ౪. బహువారకము, విరిగి ౛.

గంధఫలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రేంకణము ౛. ౨. సంపెఁగ మొగ్గ.

గంధబంధువు. సం. వి. ఉ. పుం. మామిడిచెట్టు.

గంధమాదనము. సం. విశ. (అ. ఈ. అ.) సుగంధముచే పరవశము చేయునది. వి. అ. పుం. నల్లని పెద్దతుమ్మెద. ౨. గంధకము. పుం. న. ఒకానొక కొండ. (ఇది మేరువునకుఁ దూర్పున నున్నది. సుగంధివనములకు ప్రసిద్ధము.) న. గంధమాదనపర్వతమందలి ఒకానొకయడవి.

గంధమాదని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మద్యము, సారాయి. ౨. బదనిక ౛.

గంధమాదిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. లక్క. ౨. మురయనుగంధద్రవ్యము ౛.

గంధమార్జారము. సం. వి. అ. పుం. ఖట్టాసము, పునుఁగుపిల్లి.

గంధము. సం. వి. అ. పుం. ౧. సువాసన; వాసన. ౨. లేశము, సూక్ష్మాంశము. ౩. గంధకము. ౪. అఱుగఁదీయఁగా వచ్చినలేపనద్రవ్యము, గందము. ౫. సంబంధము. ౬. గర్వము.

గంధమూలము. సం. వి. అ. పుం. కులంజనము ౛.

గంధమూలి. సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరము ౛.

గంధమూషి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు.

గంధమూషికము. సం. వి. అ. పుం. చుంచు. (త్రి. ని.)

గంధమృగము. సం. వి. అ. పుం. ౧. పునుఁగుపిల్లి. ౨. కస్తూరీమృగము.

గంధమోదనము. సం. వి. అ. పుం. గంధకము.

**గంధమోహిని.** సం. వి. ఈ. స్త్రీ-గంధముచే మోహింపఁజేయునది-సంపెఁగమొగ్గ.

**గంధరసము.** సం. వి. అ. పుం. శాలెంతబోళము, గోపము.

**గంధరసాంగకము.** సం. వి. అ. పుం. సరలనిర్యాసము, దేవదారువృక్షముయొక్క బంక.

**గంధరాజము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకపూలచెట్టు. ౨. ఒకజాతిమల్లెచెట్టు. ౩. ఒకవిధమైనగుగ్గిలము, కణగుగ్గులువు. ౪. జవాది యనుగంధద్రవ్యము. ౫. చందనపుష్పము.

**గంధర్వనగరము.** సం. వి. అ. న. ౧. గంధర్వులపురము. ౨. భూమియందు ఎండమావులవలె ఆకాశమందు తోఁచుమిథ్యానగరము. (ఇది కనఁబడినపుడు అశుభము కలుగును.)

ఇట్లే గంధర్వపురము, మొ.

**గంధర్వము.** సం. వి. అ. పుం. ౧. కడఁతి, ఒకజాతిమృగము. ౨. గుఱ్ఱము. ౩. అంతరాభవసత్త్వము,మరణమునకును తిరిగి జన్మించుటకును మధ్యకాలమున యాతనాశరీరము ధరించినప్రాణి. ౪. మగకోయిల.

**గంధర్వవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. సంగీతవిద్య.

**గంధర్వవేదము.** సం. వి. అ. పుం. సామవేదోపవేదము, సంగీతమూలగ్రంథము.

**గంధర్వహస్తము.** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**గంధర్వుఁడు.** సం. వి. అ. పుం. ౧. దేవయోనివిశేషము. ౨. పాటపాడువాఁడు, గాయకుఁడు.

**గంధలత.** సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణముచెట్టు.

**గంధవతి.** సం. వి. ఈ. స్త్రీ-గంధము గలది-౧. భూమి, నేల. ౨. మత్స్యగంధి, సత్యవతి. (వ్యాసుని తల్లి.) ౩. మద్యము. ౪. అడవిమల్లెచెట్టు. ౫. మురయనుగంధద్రవ్యముచెట్టు. ౬. వాయుదేవునిపురము.

**గంధవహ.** సం. వి. ఆ. స్త్రీ-గంధమును గ్రహించునది-నాసిక, ముక్కు.

**గంధవహాయనము.** సం.వి.అ.న.వాతాయనము,గవాక్షము, కిటికీ.

ఉ. వచ్చెనతండు బురాంగనలు వారక నొండొరులాజ్ఞ మీఱి మేల్,మచ్చులు చేరియున్ గృహసమంచితగంధవహాయనంబులన్, విచ్చుగహత్తియున్ వెడలి వీథులరచ్చలశాలుదీరియున్, మెచ్చట మీఱఁ దద్విభవమున్ మది మెచ్చుచుఁ జూచునయ్యెడన్. ఉ.హరిశ్చ. ౪. ౨౨.

**గంధవహుఁడు.** సం. వి.అ. పుం-గంధముపట్టుకొనిపోవువాఁడు-వాయువు, గాలి.

**గంధవాహ.** సం=గంధవహ.

**గంధవాహము.** సం. వి. అ. పుం. కస్తూరీమృగము.

**గంధవాహుఁడు.** సం=గంధవహుఁడు.

**గంధశుండిని.** సం. వి. ఈ. స్త్రీ-దుర్గంధము గలతొండము గలది-గంధమూషి, చుంచు.

**గంధశేఖరము.** సం. వి. అ. పుం. మృగమదము, కస్తూరి.

**గంధసరులు.** మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. కుసుమపూరాజనాల్లుత్తిబల్లుత్తులు కస్తూరిపట్టెలు గంధసరులు. గీ ... ఆదియగుపేరుగలుగు వడ్లు...హంస. ౪. ౧౫౯.

వ...పచ్చదినసరులు గంధసరులు మద్దిగంద్రలు ...ప్రబంధ. ౧౧౨.

**గంధసారము.** సం. వి. అ. పుం. ౧. చందనముచెట్టు. ౨. ఒకజాతిమల్లెచెట్టు.

**గంధసోమము.** సం. వి. అ. న. తెల్లగలువచెట్టు.

**గంధహారిక.** సం. వి.ఆ. స్త్రీ. గంధకారిక, సైరంధ్రి.

**గంధాఖువు.** సం. వి. ఉ. పుం. చుంచు.

**గంధాఢ్యము.** సం. విణ. (అ. ఆ. అ) గంధముతో నిండినది. వి. అ. పుం. ౧. చందనవృక్షము. ౨. నారింజ కే. న. ౧. చందనము. ౨. జవాది యనుగంధ ద్రవ్యము.

**గంధామ్లు.** సం. వి. ఆ. స్త్రీ. అడవిమాదిఫలము కే.

**గంధారము.** సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

**గంధాశ్మము.** సం. వి. న్. పుం. గంధకము.

**గంధి.** సం. విణ. (ఇ) గంధము గలది. (ఉత్, పూతి, సు, సురభి, శబ్దములుపూర్వపదములుగా నున్నట్టిదియును ఉపమానవాచకము పూర్వపదముగా నున్నట్టిదియు నగుపరిమళవాచకగంధశబ్దమునకును ఉత్తరపదమగు అల్పార్థకగంధశబ్దమునకును బహువ్రీహిసమాసమున ఇకార మంతాదేశమయి 'గంధి' యను రూపము గలుగును - ఉదా: సుగంధి పుష్పము, పద్మగంధి స్త్రీ, ఘృతగంధి భోజనము = నేయి కొంచెము గలభోజనము.) వి. న్. పుం. నల్లి.

**గంధికము.** సం. విణ. (అ. ఆ. అ.) గంధము గలది. వి. అ. పుం. గంధకము.

**గంధికుఁడు.** సం. వి. అ. పుం. పరిమళ ద్రవ్యముల నమ్ము వర్తకుఁడు.

**గంధిని.** సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధ ద్రవ్యము కే.

**గంధో(ధా)తువు.** సం. వి.ఉ.పుం. పునుఁగుపిల్లి.

**గంధోత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.

**గంధోలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కణుఁదుకీఁగ. ౨. కచోరము కే.

**గంప.** వి. (క. గంపె.) వెదురు లోనగువానితో నల్లినపాత్రము, కండోలము.

చ... పేఁపగంపలన్, దళ మగుచున్న చెంగలువదండల...ఆము. ౧. ౭౨.

సీ...కండోల మెసఁగును గంప యనఁగ.ఆం.భా. ౨. ౨౮౦.

జ: గంపపులుఁగు, గంపసిడి.

**గంపపులుఁగు**=గబ్బులుఁగు. వి (గంప+పులుఁగు) కుక్కుభము, అడవికోడి. (వీనిని గంపలతో తెచ్చి అమ్ముదురు-బ్రౌ.)

సీ...కుక్కుభంబు గబ్బులుఁగు గంపపులుఁ గనఁగ,వఱలు...ఆం. భా. ౨. ౯౭.

**గంపసిడి.** వి. (√గంప) గ్రామదేవతకు మ్రొక్కు చెల్లించుటకై మనుష్యుని గంపలోఁ గూర్చుండఁబెట్టి యాడించెడుసిడి. (చూ. సిడి.)

**గంబుర(ము)**=కప్పురము.

ఉ. కారు మెఱుంగు రాచిలుక కస్తురిపిల్లె పదాఱువన్నెబం,గారము రస్తుకుప్ప తెలిగంబుర వెన్నెలలోని తేట యొ,య్యారపుఁ డెంకి యందముల కన్నిటికిం దగుపట్టుఁగొమ్మ సిం,గారపుదొంతి యైనకులకాంత నయో యెడఁబాయ నేర్తునే. శుక. ౧. ౯౮.

సీ...గంబూర గంబుర గంబురా గంబురమ్ము గంబూరమ్మన మ్మను ఘనసారము...ఆం. భా. ౨. ౧౬౨.

**గంబురా**=కప్పురము.

శా. శ్రీవిన్నాణపుగుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ము,క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారా ప్రయుక్తం బనే, భావంబో యని పల్కుకల్కి చెలి సంభావించుకాంచీపురీ, దేవుం డీవుత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్. శశాం. ౧. ౧. ఆం. భా. ౨. ౧౬౨.

**గంబూర(ము)**=కప్పురము.

**గంధమోహిని.** సం. వి. ఈ. స్త్రీ-గంధముచే మోహింపఁజేయునది-సంపెఁగమొగ్గ.

**గంధరసము.** సం. వి. అ. పుం. శాలెంతబోళము, గోపము.

**గంధరసాంగకము.** సం. వి. అ. పుం. సరలనిర్యాసము, దేవదారువృక్షముయొక్క బంక.

**గంధరాజము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకపూలచెట్టు. ౨. ఒకజాతిమల్లెః. ౩. ఒకవిధమైనగుగ్గిలము, కణగుగ్గులువు. ౪. జవాది యనుగంధద్రవ్యము. ౫. చందనపుమ్రాను.

**గంధర్వనగరము.** సం. వి. అ. న. ౧. గంధర్వులపురము. ౨. భూమియందు ఎండమావులవలె ఆకాశమఁదు తోఁచుమిథ్యానగరము. (ఇది కనఁబడినపుడు అశుభము కలుగును.)

ఇట్లే గంధర్వపురము, మొ.

**గంధర్వము.** సం. వి. అ. పుం. ౧. కడఁతి, ఒకజాతిమృగము. ౨. గుఱ్ఱము. ౩. అంతరాభవసత్త్వము,మరణమునకును తిరిగి జన్మించుటకును మధ్యకాలమున యాతనాశరీరము ధరించినప్రాణి. ౪. మగకోయిల.

**గంధర్వవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. సంగీతవిద్య.

**గంధర్వవేదము.** సం. వి. అ. పుం. సామవేదోపవేదము, సంగీతమూలగ్రంథము.

**గంధర్వహస్తము.** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**గంధర్వుఁడు.** సం. వి. అ. పుం. ౧. దేవయోనివిశేషము. ౨. పాటపాడువాఁడు, గాయకుఁడు.

**గంధలత.** సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణముః.

**గంధవతి.** సం. వి. ఈ. స్త్రీ-గంధము గలది-౧. భూమి, నేల. ౨. మత్స్యగంధి, సత్యవతి. (వ్యాసుని తల్లి.) ౩. మద్యము. ౪. అడవిమల్లెః. ౫. మురయనుగంధద్రవ్యముః. ౬. వాయుదేవునిపురము.

**గంధవహ.** సం. వి. ఆ. స్త్రీ-గంధమును గ్రహించునది-నాసిక, ముక్కు.

**గంధవహాయనము.** సం.వి.అ.న.వాతాయనము,గవాక్షము, కిటికీ.

ఉ. పచ్చశిలంబురాంగనలు వారక నొండొరు లాజ్ఞ మీఱి వేల్,మచ్చులు చేరఁగా గృహసమంచితగంధవహాయనంబులన్, విస్ఫుగహత్తియుఁగా నెడలి వీథుల రచ్చల బాలుదీరియుఁగా, ముచ్చట మీఱఁ దద్విభవముఁగా మది మెచ్చుచుఁ జూచునయ్యెడన్. ఉ.హరిశ్చ. ౪. ౨౨.

**గంధవహుఁడు.** సం. వి.అ. పుం-గంధమును కొనిపోవువాఁడు-వాయువు, గాలి.

**గంధవాహ.** సం=గంధవహ.

**గంధవాహము.** సం. వి. అ. పుం. కస్తూరీమృగము.

**గంధవాహుఁడు.** సం=గంధవహుఁడు.

**గంధశుండిని.** సం. వి. ఈ. స్త్రీ-దుర్గంధము గలదైగలది-గంధమూషి, చుంచు.

**గంధశేఖరము.** సం. వి. అ. పుం. మృగమదము, కస్తూరి.

**గంధసరులు.** మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. కుసుమపూరాజనాల్గుత్తిబల్గుత్తులు కస్తూరిపట్టెలు గంధసరులు. గీ ... ఆదియగుపేరు గలుగు వడ్లు...హంస. ౪. ౧౭.

వ...పచ్చడినసరులు గంధసరులు మద్దిగంద్రలు ...ప్రబంధ. ౧౧౨.

**గంధసారము.** సం. వి. అ. పుం. ౧. చందనముః. ౨. ఒకజాతిమల్లెః.

**గంధసోమము.** సం. వి. అ. న. తెల్లగలువః.

**గంధహారిక.** సం. వి.ఆ. స్త్రీ. గంధకారిక, సైరంధ్రి.

**గంధాఖువు.** సం. వి. ఉ. పుం. చుంచు.

**గంధాఢ్యము.** సం. విశే. (అ. ఆ. అ) గంధముతో నిండినది. వి. అ. పుం. ౧. చందనవృక్షము. ౨. నారింజ చెట్టు. న. ౧. చందనము. ౨. జవాది యనుగంధ ద్రవ్యము.

**గంధామ్ల.** సం. వి. ఆ. స్త్రీ. అడవిమాదిఫలము చెట్టు.

**గంధారము.** సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

**గంధాశ్మము.** సం. వి. న్. పుం. గంధకము.

**గంధి.** సం. విశే. (ఇ) గంధము గలది. (ఉత్, పూతి, సు, సురభి, శబ్దములుపూర్వపదములుగా నున్నట్టిదియును ఉపమానవాచకము పూర్వపదముగా నున్నట్టిదియు నగుపరిమళవాచకగంధశబ్దమునకును ఉత్తరపదమగు అల్పార్థకగంధశబ్దమునకును బహువ్రీహిసమాసమున ఇకార మంతాదేశమయి 'గంధి' యను రూపము గలుగును - ఉదా: సుగంధి పుష్పము, పద్మగంధి స్త్రీ, ఘృతగంధి భోజనము = నేయి కొంచెము గలభోజనము.) వి. న్. పుం. నల్లి.

**గంధికము.** సం. విశే. (అ. ఆ. అ.) గంధము గలది. వి. అ. పుం. గంధకము.

**గంధికుఁడు.** సం. వి. అ. పుం. పరిమళద్రవ్యముల నమ్మువర్తకుఁడు.

**గంధిని.** సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధద్రవ్యము చెట్టు.

**గంధో(ధా)తువు.** సం. వి.ఉ.పుం. పునుఁగుపిల్లి.

**గంధోత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.

**గంధోలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కణుఁదుకీఁగ. ౨. కచోరము చెట్టు.

**గంప.** వి. (క. గంపె.) వెదురు లోనగువానితో నల్లినపాత్రము, కండోలము.

చ... పేఁపగంపలన్, దళ మగుచున్న చెంగలువ దండల...ఆము. ౧. ౭౫.

సీ...కండోల మెసఁగును గంప యనఁగ.ఆం.భా. ౨. ౨౮౦.

జ: గంపపులుఁగు, గంపసిడి.

**గంపపులుఁగు** = గబ్బులుఁగు. వి (గంప + పులుఁగు) కుక్కుభము, అడవికోడి. (వీనిని గంపలతో తెచ్చి అమ్ముదురు - బ్రౌ.)

సీ...కుక్కుభంబు గబ్బులుఁగు గంపపులుఁ గనఁగ, వఱలు...ఆం. భా. ౨. ౯౭.

**గంపసిడి.** వి. (√ గంప) గ్రామదేవతకు మ్రొక్కు చెల్లించుటకై మనుష్యుని గంపలోఁ గూర్చుండఁ బెట్టి యాడించెడుసిడి. (చూ. సిడి.)

**గంబుర(ము)** = కప్పురము.

ఉ. కారు మెఱుంగు రాచిలుక కస్తురిపిల్లి పదాఱు వన్నెబం, గారము రస్తుకుప్ప తెలిగంబుర వెన్నెలలోని లేట యొ, య్యారపుఁ డెంకి యందముల కన్నిటికిం దగుపట్టుఁగొమ్మ సిం, గారపుదొంతి యైనకులకాంత నయో యెడఁబాయ నేర్తునే. శుక. ౧. ౯౮.

సీ...గంబూర గంబుర గంబురా గంబురమ్ము గంబూర మ్మన మ్మను ఘన, సారము...ఆం. భా. ౨. ౧౬౨.

**గంబురా** = కప్పురము.

శా. శ్రీవిన్నాణపుగుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ము, క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారాప్రయుక్తం బనే, భావంబో యని పల్కుకల్కి చెలి సంభావించుకాంచీపురి, దేవుం డీవుత నీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్. కళాం. ౧. ౧. ఆం. భా. ౨. ౧౬౨.

**గంబూర(ము)** = కప్పురము.

సీ. ఏపీట సతులపాలిండ్లపై గంబూర నవహారము
లచిప్పకవుచు మాన్చు. ఆము. ౨. ౩.

సీ. మొత్తమై మారుతాయత్తమై గంబూర మెగ
య వితానముల్ బిగియ వలదు. వసు. ౧. ౧౪౧.
ఆం. భా. ౨. ౧౬౨.

జ: గంబూరరాజనాలు.

**గంబూరరాజనాలు.** వి.బ. (√గంబూర) ధాన్య
విశేషము.

సీ. సంపంగెపూవడ్లు జాజిరాజనములు గంబూర
రాజనా ల్కన్నెసరులు. హంస. ౪. ౧౨౭.

**గంభారి.** సం. వి. ఈ. స్త్రీ. గుమ్మడుచెట్టు.

**గంభీరము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. లోఁతు గల
ది. (నది, మొ.) ౨. దురవగాహము, గ్రహింప
రానిది. (హృదయము అర్థము, మొ.) ౩. మంద్ర
ము.(ధ్వని) వి. అ. పుం. ౧. తామర చెట్టు. ౨. జంబీ
రము, నిమ్మచెట్టు.

**గంభీరవేది.** సం. వి. న్. పుం. తోలుఊడునట్లును
నెత్తురు కాఱునట్లును మాంసము ముక్కలుగా
పడునట్లును బరిగోలలలోడను అంకుశములతో
డను పొడిచి యెంత బాధ పెట్టినను ఒడలెఱుం
గకుండునట్టియేనుఁగు; చిరకాలమునకు శిక్షను
గ్రహించుఏనుఁగు.

**గంభీరిమ(ము).** సం. వి. న్. పుం. గాంభీర్యము.

**గగన(నే)చరము.** సం. విణ. (అ. ఈ. అ) ఆకాశ
మునఁ దిరుగునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. గ్ర
హము. ౩. రాశిచక్రము.

**గగనము.** విణ. (చి.ని, శ.ర - సం. ఘనమ్? గహనమ్?)
దుర్లభము.

సీ. గగనఘంటాపథక్రమణశీలున కెంత గగన మ
య్యె లతాంగి కానుఁజదలు. వసు. ౩. ౯౯.

ద్వి. వేఁడెదఁ గాదేని వెడలునాయంప, వాఁడి
మినైనను వార్ధి నింకింతు, బంధింతుఁ గాదేని
పవనతనూజ, కంధిదాఁటుట యెంత గగనం
బు నాకు. రం. రా. యు. ౨౮౦ పా. ౧౦౫.

**గగనము.** సం. వి. అ. న. ౧. ఆకాశము. ౨. (గణి
త) శూన్యము, సున్న.

**గగురు**=గగ్గురు, గగురుపు. వి. భయహర్షాదులచేత
మేనివెండ్రుకలు నిక్కఁబొడుచుట, రోమాంచ
ము.

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గురనం
గను గగు రనంగ, గరుదాల్పనంగను బరఁగు
రోమాంచంబు...ఆం. భా. ౧. ౧౪౧.

జ: గగురుపాటు, గగురుపాఱు, గగురుపాడము,
గగురుపొడుచు, గగురుపొడుపు.

**గగురుపా(ర్పా)టు.** వి. (√ గగురు) రోమాంచ
ము.

గీ. గగురుపాటును వడఁకును గానిపింప, నెల్లను
మనోవితానంబు నెనసి కొల్వ, మంచుఁగిపట్టి
పొగడ విరించనుండు, గరుణఁ బౌలస్త్యజన
కు సాక్షాత్కరించె. ఉ. రా. ౧. ౨౨౧.

సీ. పైరుపచ్చలతాళి మీఱ మొల్కలగుర్పా
టుఁగంచుక మూనె రత్నగర్భ. ఉ. రా. ౧.
౧౩౬.

**గగురుపా(ర్పా)ఱు.** అ. క్రి. (గగురు+పాఱు)
గగురుపాటు కలది యగు.

మ. కమలాకామినిపాణిపంకజము సోఁకన్ మై
గగుర్పాఱ న,క్కమలాక్షుం డనిశంబు సా
త్త్వికమునన్ గన్పట్టియున్ సద్విలా,సము
నన్ సాత్త్వికమూనె...ఉ. రా. ౮. ౩౧౧.
సాం. ని. మాన. ౨౪.

**గగురుపు(ర్పు)**=గగురు. వి. రోమాంచము.

ఉ. గుప్పున నప్పు డప్పడఁతిగుబ్బలు మించె గగు
ర్పుకూర్పునన్. చంద్రా. ౬. ౧౪౨.

**గగురుపొ(ర్పొ)డము.** అ. క్రి. (గగురు+పొడ
ము) గగురు గలది యగు.

(యోగవాసిష్ఠనివర్ణన) చ. జోటజోట ధారగా వడి యుచుం గడలెత్తుసుధారసంబు గ్రుం,గుటగు ట నప్పటప్పటికిఁ గ్రోలుచు నాలుగురెండు మూలలన్,గుటిలత దాల్చుభోగిని గగుర్పొడమించుచు దక్షిణశ్రవ,స్తటవిసరత్ప్రయోదని నదంబునఁ జొక్కుచు మబ్బు గ్రక్కుచున్. పాండు. ౪. ౪౯.

గగురుపా(ర్పొ)డుచే. అ. క్రి. (గగురు + పొడుచు) రోమాంచిత మగు, పులకించు; (రోమములు) నిక్కు.

సీ. ...పులకలొత్తెను గగుర్పొడిచె... గీ....అనఁగఁ దగును రోమాంచనామముల్... సాం. ని. మాన. ౨౪.

చ...సమ్మదాశ్రులన్, దొలఁచినయట్లు వోయె డుఁ గనుంగవకాటుక బేఁటులెత్తుఁ జె,క్కులమకరీవిలాసము గగుర్పొడువన్ హరిఁ జూచువేళ...పారి. ౩. ౧౨.

గీ. కైదువలు విడిచి యొడళ్లు గగురుపొడువ,నంత నంతఁ గకావికలైనవారిఁ,గని మురుఁడు కుబేరునిఁ గదిసి యేసెఁ, బ్రతిభయాశీవిషోపమబాణశతుల. ఉ. హరి. ౧. ౪౧.

ఉ. గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ ...మనుచ. ౨. ౨౯.

క... మెయి గగుర్పొడువఁగ...పారి. ౧.౧౨౨.

మహాస్రగ్ధర ... కాంచెన్, శలసంతానంబు మేనన్ గగురుపొడిచి కన్పట్ట నున్నట్టి యేదున్. కళా. ౬. ౧౬.

గగురుపా(ర్పొ)డుపు=గగురుపాటు. (√గగురుపొడుచే.)

సీ. మొగలిపూఁబొదలు మోమునఁ జేర్చుచీరగాఁ బూరిమోసులు గగుర్పొడుపు గాఁగ...గీ. నేలప్రోయాలు దనముద్దుఁజూలిఁ దలఁచి, తెఱపి గనరానివంతలఁ గొఱలి యొఱలె. అచ్చ. రా. కిష్కిం. ౬౬.

గగ్గు. వి. గద్గదిక, డగ్గుత్తిక.

సీ. గగ్గ నా వెలయు గద్గదిక ... ఆం. భా. ౧. ౧౨౨.

అ. క్రి. సంకోచించు. (శ. ర.)

గగ్గురు=గగురు. వి. రోమాంచము.

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గురనంగను గగురనంగ,గరుడాల్పనంగను బరఁగు రోమాంచంబు...ఆం. భా. ౧. ౧౪౧.

గగ్గులకాడు. వి. జా. (గగ్గులు+కాడు) ధాన్యము రాల్చినకంకులరాశి. (శ. ర.)

విణ. ౧. చెల్లాచెదరైనది; నిస్సారము.

సీ. తలలు పీడంగ విద్యాధరు ల్పఱచిరి గగ్గులకాడైరి ఖచరపతులు. పారి. ౫. ౩౭.

సీ. గగ్గులకాడైరి కలఁగి రోటాఱిరి వెలవెల్లనైరి నివ్వెఱఁగుపడిరి. హర. ౩. ౧౦.

క. చదిపెం గాలుబలంబుఁ, గదిమెన్ గుబ్బంబు పోఁజు గగ్గులకాడై, చెదరంగ...కాళ. ౨. ౪౧. కాశీ. ౭. ౯౭.

౨. చెదరఁగొట్టునది.

ఉ. సిగ్గునకుం బికావికలు చిత్తసమున్నతి పేరివార్తకున్, గగ్గులకాళ్లు శంకలకుఁ గన్కని యెగ్గులఁ బుట్టునల్కకున్, సగ్గిసముగ్గిసల్ నిలుపు సైరణకున్ గననీనియొత్తికో,ళ్లగ్గజయానకుం బతికి నయ్యె యథేష్టరహఃప్రసంగముల్. కవిక. ౩. ౨౨౯.

గగ్గులకాటఁగల్పు=నాశము చేయు, పాడు చేయు.

ఉ. డగ్గఱి యెవ్వఁడో కటకటా శివలింగము మీఁదిరత్నముల్,గగ్గులకాటఁగల్పి ములుకంపలు తీవలు వెట్టె నేఁడు...కాళ. ౨. ౧౧౦.

గగ్గులకాడులుగావించు=వధియించు.

సీ. గగ్గులకాడులుగావించె మురియించె...గీ... అనంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై...ఆం. భా. ౩. ౧౨౩.

**గగ్గులు.** వి. బ. నుతిచినకంకులు. (శ. ర.)

జః గగ్గులకాడు.

**గగ్గెర.** వి. ఒకానొక చెట్టు. (ఇది తెల్లగగ్గెర, నల్లగగ్గెర అని ద్వివిధము.)

గీ. దవనమును గగ్గెరయు బిల్వదళము లాది,యైన పూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంతులకుఁ గొండపాడువుగా వైచుటయును. ఉ. రా. ౩. ౨౦౧.

**గగ్గోలు.** వి. ౧. క్షోభము, కలఁత; అల్లరి.

గీ. అప్రుడు గొందఱు మృగయు లయ్యడవిఁ దూఱి, ఘోరముగ నెల్లకడల గగ్గోలు గాఁగఁ, గూఁత లిడి చోఁపుటయు మృగకులము గలఁగి, బయలువెడలినఁ గాంచి యప్పార్థివుండు. రసిక. ౧. ౧౦౯.

గీ. గొల్లవాడల నెల్ల గగ్గోలు పుట్ట ... నీలా. ౩. ౫౫.

గీ. గొల్లగాఁ గూఁక లిడుచు గగ్గోలు సేసి, లేవకుండిన విసిగి యాలెంక లినుప,ద్రుడ్ల గుదియలఁ బిడికిళ్ల రోఁకళ్ళులను, మొత్తి ... అచ్చ. రా. యు. ౨౨౭.

౨. పరాక్రమము, శక్తి?

గీ. బేలుపోవనిపాలదిండ్ల నూలుకొనుచు, దీలుపడఁ గొట్టునట్టిగగ్గోలువాఁడ. ప్రబంధ. ౨౨౮. (ప్రయోగాంతరము లేదు)

గగ్గోలుగ=౧. అధికముగా.

ఉ...గ,గ్గోలుగ నుప్పతిల్లె బిగుబ్బలపైఁ బులకాంకురావళుల్. గంధ. ౭౩.

౨. ఆకస్మికముగా?

క. ఈరీతి మెలఁగువారల,దారుల్ విని రాజుకొడుకు ధవళాఖ్యాకుం,డౌరా గగ్గోలుగ న,న్నారిపయిం బడుము నని ఘనం బగుప్రేమన్. శుక. ౨. ౨౧౫.

జః గగ్గోలుపడు.

**గగ్గోలుప(వ)డు.** అ. క్రి. (√ గగ్గోలు) ౧. క్షోభపడు, కలఁత నొందు.

(పురూరవుఁడు)గీ... ఏఁగెఁ జటులపటహ, ఘూర్ణితధ్వని దిశలు గగ్గోలుపడఁగ. కవిరా. ౩. ౧౮.

ద్వి. నే నొక్కరుండ నన్నిటఁ దోడొకరిఁ, గానక బెగడి నల్గడలు చూచుచును, బడలుచ గగ్గోలునడి మోసటిలుచు. విష్ణు. పూ. ౩. ఆ. (శ. ర.)

౨. అతిశయించు.

వ...నీలంపులిగ్గుల గగ్గోలుపడు సోనపాటిం గొఁగిలించిన పొగడగుంపులనట్టనడుమ...కువల. ౮. ౯౨.

**గచ్చె=గ్రచ్చె.** వి. (త. గళత్చి క. గజ్జిగె.) యక్షాక్షి వి.

ఆ. ఇచ్చవానియొద్ద నీనివాఁ డుండినఁ, జచ్చుఁగాని యీవి సాగనీఁడు, కల్పతరువుక్రింద గచ్చచె ట్టున్నట్లు... వేమన. ౨. ౭.

సీ. గచ్చ గ్ర చ్చనఁ జెల్వు గాంచుఁ గాచస్థాలి...ఆం. భా. ౨. ౮౯. (ఈయర్థము కాచస్థాలీశబ్దమునకు సంస్కృతనిఘంటువులలో లేదు.)

జః గచ్చకాయలు.

**గచ్చెకాయలు.** వి. బ. (√ గచ్చె) గచ్చకాయలాట, బాలక్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానుఁగ త్రిప్పట్లు, గుజ్జెక్కుడు మంటిగూండ్లు ... హంస. ౩. ౧౮౬.

గీ. గచ్చకాయలు దాఁగిలిమ్రుచ్చులాట, బంతి మెకమాట చిందఱపఱపులాట, లనెడు శైశవదుర్వ్యవృత్తి నధిగమించి. ప్రబంధ. ౬౧౩.

**గచ్చె[1].** వి. (క. గచ్చు=గార.) ౧. బంగారము సున్నము మొదలగువానిపూఁత.

సీ. పసిఁడిగచ్చమర సోపానముల్ మూఁటఁదుం
గిల విశాలితయుఁ జిత్రితయునైన, సభ...
ఆము. ౪. ౫౭.

చ. ఇలఁ గలవస్తుసంతతులకెల్లను గచ్చిడుమాస్వ
భావపాటలరుచి కేమి వేఱ యొకడాలిఁ
కవచ్చునె లక్కనీటమమ్మలమిన దెంతయు
గ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం,
బుల నగునట్లు మించునఖముల్మెఱయన్ గొ
మరారు నింతికిన్. ఆము. ౫. ౩౪.

గీ. పచ్చవిలుకునినడయామునగచ్చుకోల, పూనిక
నవ్వేల్పుఁజిగురాకుఁబోఁడియు నల, మానిప
రమేశ్వరుని యాశ్రమంబుఁ జేరి. చంద్రా. 3.
౧౭౭. ప్రబంధ. ౭౮.

౨. గోడలోనగువానికి పూయుటకై యినుక
చేర్చి దంచినసున్నము, గార.

గీ. కాలగుణయుక్తి మింటిచక్కటికి నెగయ,
వాసవునిపట్టి పాడువుగా వైచి యాడు,గ
చ్చు చమరినదారుచక్రంపుబిళ్ల, వోలె నొ
య్యనఁ బ్రాచి లేఁబ్రొద్దు పొడిచె. మనుచ.
౫. ౪౦.

3. కాంతి.

(కృష్ణుఁ డను మేఘము) ఉ. క్రాలెడుపచ్చపట్టు
నునుగచ్చుల క్రొమ్మెఱుఁగై చలింప... హరి.
పూ. ౬. ౧౧౬. (శ. ర. పా.)

౪. కపటము.

వ... పెచ్చు మల్లాడియు గచ్చులుసేసియు హె
చ్చుకత్తులు దూసియు... ప్రబంధ. ౭౫౦.

గచ్చుగ=కపటముగ.

క. వచ్చి యిది యేమి చెలి యని, విచ్చలవిడి వీ
పుఁ జఱచి వెఱవకు మని లోఁ, జొచ్చిన భ
యమున నదరిన, గచ్చుగ నిట్లనియె గోపక
న్యక పతితోన్. హంస. ౨. ౧౨౪.

జ: గచ్చులాఁడి, గచ్చువిచ్చుగు.

గచ్చు[2]=గ్రచ్చు. విణ. గ్రస్తము, వర్ణలోపము
గాని పదలోపము గాని కలిగినది.)పదము వా
క్యము.)

ఆ. గచ్చు కౌతుక నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు.
ఆం. భా. ౧. ౧౧౭. (శ.ర.పా)

౨. బ. దంభములు, డాబులు.

సీ. గెలువని రాజుకు బలుగచ్చులును మెండు నెల
మి వంధ్యకు మైథునేచ్ఛ మెండు. వేణు. ౧౩.

జ: గచ్చువడు.

గచ్చులాఁడి. విణ. (గచ్చు[1]లు + ఆఁడి) మాయలాఁ
డియగు స్త్రీ; స్త్రీ.

వ... మందరంబుఁ దెచ్చి పాతిపాతి సముద్రం
బుఁ ద్రచ్చి చేఁజొచ్చినయమృతంబు గచ్చు
లాఁడికి మెచ్చి చూఱవుచ్చి వియచ్చరులకు
నోగిరం బిచ్చి తమ్ముఁ గట్టఁ ద్రాళ్లు తామే
తెచ్చికొని రనువారును...లక్ష్మీ. ౨. ౭౬.

ఉ...ఇటు వచ్చినయచ్చరగచ్చులాండ్రలో, నే
రుచిరాంగి చక్కనిది ... అహ. ౧. ౭౨.

గచ్చువడు. అ. క్రి. (√గచ్చు[2]) లోపించు?

క. చొచ్చి శివదివ్యలింగముఁ, గ్రుచ్చి బిగియ నం
టఁ బొదివికొని తనవెంటన్, వచ్చుజముఁ ద
లఁచి తాలిమి, గచ్చువడఁగ నతఁడు భీతగతి
నిట్లనియెన్. శివలీలావిలాసము. ౨.

గచ్చువిచ్చుగు. అ. క్రి. (గచ్చు[1] + విచ్చు + అ
గు) కార్యము వికలమగు; వికలమగు.

గీ. ఆఱుమూఁడయ్యె గచ్చువిచ్చయ్యె ననఁగ, బె
డిసె బుసిపోయె ననఁగను జెడియె ననఁగ, నా
ఖ్యలగుఁ గార్యవైకల్యమయ్యె ననుటకు...
ఆం. శే. ౯.

గీ. అటుల జయభేరికారవం బతిశయింపఁ, జెలఁ
గి చనుదెంచునతనికోల్తలకుఁ గాక, బెదరి బె
దరి కలంగి కన్ జెదరి తొలఁగి, గచ్చువిచ్చ
య్యెఁ బారశీకవ్రజంబు. కృష్ణ. 3. ౩౯.

గచ్ఛత్. సం. శత్ర. పోవుచున్న.

**గజే.** విణ. (సం. గజః) పెద్ద. (దీనికి వృత్తియందే ప్రయోగము కలదు. చూ. గజనిమ్మ)

జ: గజదండ, గజదొంగ, గజనిమ్మ, గజయీఁత.

**గజకందము.** సం. వి. అ. పుం. హస్తికందము, ఒక జాతిదుంపకూ.

**గజకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ఓషధివిశేషము. (వాచ)

**గజేగజే.** వి. వడఁకుటయం దగుఅనుకరణము.

ద్వి. కడు భయంబున వాఁడు గజగజ మేను,వడఁక సైన్యంబున వాసవు కెరఁగి. నవనాధ. 3. ౨౨౬ పా. ౧౭ పం.

**గజగామిని.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగువలె నడచు స్త్రీ; స్త్రీ.

**గజచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పుణ్యకాలవిశేషము, శ్రాద్ధోచిత మగుసూర్యగ్రహణకాలము.

శ్లో. సైంహికేయో యదా భానుం గ్రసతే పర్వసంధిషు,గజచ్ఛాయా తు సా ప్రోక్తా తత్ర శ్రాద్ధం ప్రకల్పయేత్. (కల్ప.)

౨.ఏనుఁగుయొక్క ఛాయ.

**గజచ్ఛాయము.** సం. వి. అ. న. ఏనుఁగుయొక్క ఛాయ. పుం. మహిషము, దున్నపోతు.

**గజత.** సం. వి. ఆ. స్త్రీ. గజసమూహము.

**గజేదండ.** వి. (గజ+దండ) మల్లవిద్యావిశేషము, పదిరెండుదండలలో నొకటి.

వ...అవ్వీరుఁడు సమదండ గజదండ కుక్కుటపు దండ మొదలుగాఁ గల పదిరెండుదండలయ ఖండపాండిత్యంబు దెలిసి...హంస. ౧. ౨౦౬. మల్లుపు. 3. ౬౯.

**గజదంతము.** సం. వి. అ. పుం. ౧.ఏనుఁగుదంతము. ౨. బట్టలు మొదలగునవి ఉంచుటకు గోడకు కొట్టినకొయ్య. (వాచ.)

**గజేదొంగ.** వి. (గజ+దొంగ) పెద్దదొంగ, గొప్ప దొంగ. (బ్రౌ, వా.)

**గజనిమీలనము.** సం. వి.అ.న.-ఏనుఁగువలె కన్నులు మూసికొనుట-౧. చూచియు చూడనట్లుండుట. ౨. కపటము, వంచన.

**గజనిమీలిక.** సం. వి. ఆ. స్త్రీ=గజనిమీలనము.

**గజేనిమ్మ.** వి. (గజ+నిమ్మ-క. గజనింబ) లకుచము, పెద్దనిమ్మకూ.

గీ. నిమ్మ యం చనఁగా జంభలమ్ము దోఁచు,నదియె గొప్పైన గజనిమ్మ యనఁగఁ దగును. ఆం. భా. ౨. ౪౨.

రగడ. నెలకొనుచుఁ బ్రబలుగజనిమ్మలను నిమ్మలను. భాను. ౨. ౬౮.

**గజపతిలాగీలు.** మి. వి. బ. ధాన్యవిశేషము.

వ...కాఱుసంపెఁగలు కందర్పభోగులు గజపతిలాగీలు బొందడీలు... అనునూటవాలుగుఁగులపైరులచేరుడుబియ్యంపువట్టిపసాదంబులు.. ప్రబంధ. ౧౧౨.

**గజపిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. పిప్పలీభేదముకూ.

**గజపుటము.** సం. వి. అ. పుం. పుటము వేయుటకై గజములోఁతు త్రవ్వినగోయి. (వాచ)

**గజబంధని.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుసాల.

**గజబంధిని.** సం=గజబంధని.

**గజభక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ-ఏనుఁగులు తినఁదగినది-సల్లకి, అందుగ కూ.

**గజమాచలము.** సం=కరిమాచలము. (కల్ప)

**గజేము.** వి. (సం. గజః. హిం.గజ్) ఇనుపసలాక, ఇనుపయీఁచ; తుపాకిలో మందు దట్టించెడి యినుపసలాక. (వా)

**గజము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు. (భద్రము, మంద్రము మృగము అని గజజాతులు మూఁడు. త్రివిధగజములకును మానభేదముచే అరాళము, అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామనము

అని నామములు గలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, మాయుకము, పంచమంగళము మున్నగు గజభేదము లనేకములు కలవు. గజముయొక్క శిరఃపిండములు కుంభములు. కుంభముల క్రిందిచోటు ఆరత్నము. కుంభముల నడిమిచోటు విదువు. చెక్కిలి కటము. నొసలు అవగ్రహము. కనుగ్రుడ్డు ఈషిక. కడగంటిచోటు నిర్యాణము. కర్ణమూలము చూళిక. దంతమూలము కరీరిక. దంతమధ్యము శంఖము. అడ్డముగా విసరఁబడినకొమ్ముదెబ్బ పరిణామము. నొసటిబుడిపి వాతకుంభము. వాతకుంభము క్రిందిచోటు వాహిత్థము. వాహిత్థము క్రిందికొమ్ములలోపలిచోటు ప్రతిమానము. తొండము శుండ. తొండముచివరకర్ణిక. తొండమున వచ్చుతుంపురు వమథువు. ముఖమునందలిబొట్ల(=పొడల)గుంపు పద్మకము. మూఁపు ఆసనము. మేఢ్రము కకుదము. మోఁకాలు ప్రోహము. మోఁకాలిక్రిందిచోటు సందానము. పిక్కకుముందుచోటు అయస్కారము. ప్రక్కచోటు పక్షభాగము. ముందఱిచోటు దంతభాగము. ముందటికాళ్లపిక్కలు మొదలుగాఁగలచోటు గాత్రము. వెనుకటికాళ్లపిక్కలు మొదలుగాఁ గలచోటు అపరము. మెడను గట్టెడు గొలుసు కలాపకము. కాళ్లఁ గట్టెడుగొలుసు త్రిపది. నడుమునఁ గట్టెడుమోకు వరత్ర. దీనిని అయితముసేయునపుడు మెడను గట్టెకుత్రాడు సజ్జన. వీపుమీఁదఁ బఱచుకంబళము విధానము. గంత శారి. ఇది నీళ్ల మునుఁగుట నిర్వాణము. దీనిఅలంకారము శృంగారము. దీనినిఁ బట్టుటకు త్రవ్వెడుపల్లము అవపాతము. దీనికిఁ గలిగెడు పిత్తజ్వరము పాకలము. మదము దానాదికము.) ౨. ఎనిమిది అనుసంఖ్య. 3. మూఁడడుగులపరిమాణము, ముప్పదియాఱంగుళములు. (శ్లో. సాధారణనరాఙ్గుళ్యా త్రింశదఙ్గుళకో గజః. అనువాక్యము ననుసరించి ముప్పదియంగుళములు.)

**గజమోటనము.** సం. వి.అ. పుం-ఏనుఁగును హింసించునది-సింహము. (విల్యమ్సు.)

**గజయాన.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడకవంటినడక గలస్త్రీ; స్త్రీ.

**గజేయీఁత.** వి. (గజ+ఈఁత) గొప్పయీఁత. (వా.)

**గజరిపువు.** సం. వి. ఉ. పుం. ౧. సింహము, ఏనుఁగుగొంగ. ౨. గజాసురశత్రువు, శివుఁడు.

**గజేరుగజేరులువోవు.** అ. క్రి. (గజరుగజరులు+పోవు) పులకరించు.

క. జవరా లగుకాపాలిని,కవుఁగిటఁ దన మేను గజరుగజరులువోఁగా, నవిరళసుఖమున హృదయం,బివతాళింపంగ బొద్ధుఁ డిట్లని పలికెన్. ప్రబోధ. 3. ౪౬.

(భిక్షుః-సానందం పరిష్వజ్య రోమాంచమభినీయ జనాంతికం. అహో సుఖస్పర్శా కాపాలినీ. సం. ప్రబోధ. 3.)

**గజసాహ్వయము.** సం=గజాహ్వయము.

**గజాజీవుఁడు.** సం. వి. అ. పుం-ఏనుఁగువలన బ్రతుకువాఁడు-మావంతుఁడు, మావటీఁడు.

**గజాననుఁడు.** సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఏనుఁగుమోముసామి.

**గజాశనము.** సం. వి. అ. పుం. అశ్వత్థము శ. న. తామరవేరు.

**గజాహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గజపిప్పలి శ. ౨. హస్తినాపురి.

**గజాహ్వము.** సం=గజాహ్వయము.

**గజాహ్వయము.** సం. వి. అ. న. హస్తినాపురము.

**గజిబిజి.** వి. ౧. క్షోభము, కలఁత, కలవరము.

చ. గజిబిజి లేక యుబ్బక యఖండితశౌర్యమునస్త్రవీర్యమున్,భుజబలమును బొగడ్త వడ... భార. భీష్మ. ౨. 33.

క... నిత్యమును హరిన్,గజిబిజి లేక తలంచిన,నుజనులకును నతనియందుఁ జొరఁగా వచ్చున్.

భాగ. ౧౨. ౯. (ఇట మనశ్చలనము అని భావము.)

క. గజదైత్యుఁ డివ్విధంబున, గజిబిజి సేయంగఁ గాశికానగరమునం, బ్రజనితభయకంపమునం, బ్రజ తామరపాకునీళ్లభంగిఁ దలంకెన్. కాశీ. ౭. ౧౯౬. (శ.ర.పా.) భార. ద్రో. ౪. ౨౮౯.

౨. తమకము; ఉద్రేకము.

వ... పరదేశం బాపోశనంబుగొనం దమకించుత నబలంబుగజిబిజి యుడిపికొని గోగణంబుల యగపా టూహించి... భార. విరా. ౩. ౧౩౧.

ద్వి. మంగళశివకథామహితసంగప్ర,సంగతి గాన్నివాసరములు సలిపి, కల్యాణమున కభిగమనంబుసేయఁ, గల్యాణమున భక్తిగజిబిజి పుట్టె. పండితా. మహిమ. ౧౦౧ పా.

౩. అల్లరి.

క. అజుఁ డరుగుదెంచి గురునిన్, రజనీకరుఁ గాంచి యిట్టిరచ్చలు గలవే, గజిబిజి వల దని తారా, గజయానం జేరఁబోయి గ్రక్కునఁ బలికెన్. శశాం. ౫. ౧౨౯.

గీ. పొదువు పోనీక పట్టుము భూమిదేవ, వర్య యనుకొంచు వచ్చి కవాటముగడె, యెడపినంతనె తద్భర్త యింతితోడ, నెవ్వఁ డీతండు గజిబిజి యేమి యనుచు. హంస. ౫. ౨౪౨.

౪. సందడి, ప్రాణిసమూహధ్వని.

సీ. కామాదిఖగములగజిబిజు లడఁగ దేహాభిమానాదిత్యుఁ డస్తమింప. సీతారా. ౧. ౧౪౯.

వ... తదుగ్రతకుం గాక చీకాకుపడు ప్రజలగజిబిజు లాలించుచు గౌడపతి ... కళా. ౮. ౯౩.

వ. అత్యవసరంబునఁ గళాపూర్ణుఁడు తదాగమనంబున కెదురుచూచుచుండి వారిగజిబిజి కొంతచేరువను వినంబడిన...కళా. ౯. ౧౨౦.

౫. మ్లానత, వాడుట.

క. భుజగర్వ మడఁగఁ జుట్టిన, భుజగాస్త్రము లిట్టు నట్టుఁ బొరలంబడినన్, గజిబిజి లేదు మొగంబున, మఱ బాపురె వీనిఁ బోల మగలుం గలరే. ఉ. హరి. ౫. ౨౯౦.

౬. పీడ, బాధ.

చ... ఖేరజపులతాంతబాణుఁడు కరస్థితపల్లవఖడ్గధారచే, గజిబిజి చేసెనేని మఱి కార్యము దప్పు నటంచు గొబ్బునన్. రాజ. చ. ౩. ౮౩.

విణ. ౧. కలవర మొందినవాఁడు; కలవర మొందినది.

క... చాలఁ గలకలపడుచున్, గజిబిజియైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టివడుగుఁ బాఁపనిరాకన్. భాగ. ౮. ౫౩౪.

వ. అని తెగువం బలికిన నమ్ముసుపగజగజ వడంకి గజిబిజియై యంతరంగంబున నిట్లని చింతింపం దొడంగె. సురా. ౮౮.

౨. పోయినది.

క. పొలఁతుక నిజదయితునకై, కలమానధనంబు చాల గజిబిజి గాఁ దా, నిలువడియును గులగతియును, దలఁపమియు త్రపావినాశదశ యనఁ బరఁగున్. కావ్యా. ౨. ౯౬.

౩. నలఁగినది.

సీ. ఈగుబ్బలిఁకమీఁద నాగోటికొనధాటి గదిసిన గజిబిజి గాక యున్నె. కువల. ౩. ౫౪.

జ: గజిబిజించు, గజిబిజిపడు.

గజిబిజించు. అ. క్రి. (√ గజిబిజి.) ౧. కలవరపడు, కలఁతపడు.

వ. అట్టియెడఁ దదీయసైన్యంబు గజిబిజించిన. ఉ. హరి. ౩. ౯౮.

౨. గడబడచేయు.

ద్వి. చనుదెంచి ముష్టికచాణూరముఖ్యు, లెనయు రంగస్థల మెల్లఁ దారగుచు, భుజ మప్పళించుచుఁ బోరి విజృంభించి, గజిబిజింపుచు నం

డఁగా నంతలోన. ద్వి.భాగ. 3. ౫౧ పా.

**గజిబిజిపడు.** అ. క్రి. (గజిబిజి + పడు) కలఁత నొందు.

క. గుజగుజలువోవువారును, గజిబిజిపడువారుఁ జాలఁ గలకలపడుచున్, గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టిపడుగుఁబాఁపనిరాకన్. భాగ. ౭. ౨౩౪.

**గజ్జె.** వి. తొడసందు, వంక్షణము.

సీ. గజ్జ నాఁ దనరు వంక్షణము...ఆం. భా. ౨. ౧౩౬.

(హనుమంతుఁడు) క. జలనిధులు జానుదఘ్నం, బులు గాఁ గులగిరులు గజ్జపాడువులు గాఁ దా, రలు దలపువ్వులు గా దిక్కులు కడవం బెరిఁగెఁ గనకకుధరముభంగిన్. భా. రా. సుం. ౩౦౭.

జ: గజ్జదుముకు.

**గజ్జదుముకు.** వి. (గజ్జ+దుముకు) మల్లవిద్యావిశేషము. (ఇది లోగజ్జదుముకు, వెలిగజ్జదుముకు-అని ద్వివిధము)

వ... లో వెలిచూరణగజ్జదుముకునఱుకు లనునఱుకులును...మల్లుపు 3. ౬౯.

వ. ... లో వెలిగజ్జదుముకుమారణనఱుకు మొదలైనయిరువగలనఱుకులు... ప్రబంధ. ౭౭.

**గజ్జి.** వి. (సం. కచ్ఛూః) కచ్చువు, లీఁటకుఱుపు.

సీ...గజ్జి, చిడుము నా ఖర్జువు చెలఁగును...ఆం. భా. ౨. ౧౭౯.

**గజ్జియ(జ్జె).** వి. క్షుద్రఘంటావిశేషము, ఒకవిధ మగుచిఱుగంట.

ద్వి. చెందమ్మిరేకులఁ జెనకుపాదములఁ, జెందినపసిఁడిగజ్జియలు నందియలు. ద్వి. పరమ. ౧. ౩౪ పా.

ద్వి. అంత నొయ్యన దోఁగియాడంగ నేర్చె,నంత బంగరుగజ్జియలును...ద్వి. పరమ. ౨. ౩౭౭.

ఉ.చక్కసితంద్రి పాదజలజంబుల గజ్జెలు మ్రోయ మందుమా,చక్కనటింతు విప్పు డొకసారి యఁు నాడవు...ఉ. రా. ౧. ౧౯౪.

సీ...బురజ చిఱుగంట మువ్వ గజ్జె యన క్షుద్ర, ఘంటావిశేషముల్ గన్పట్టుచుండును...ఆం. భా. ౨. ౧౫౧.

జ: గజ్జెగొలుసు.

**గజ్జో.** వి. మదము.

గజ్జుపట్టు=మదించు; అధిక మగు.

ద్వి. కర్మజాడ్యము మాని గావింతురేని, మర్మంబుఁ జెప్పెద మఖ మొనర్చుటకు, గజ్జుపట్టిన యహంకారంబు పసువు, రజ్జువు వాయుపూరకమె యూపంబు,మనసు జ్ఞానమె యగ్ని... ప్రభు. ౪. ౧౩౨ పా. ౧౯ పం.

గజ్జుఱేఁగు=మదించు.

(శరదృతువర్ణనము) గీ. ఎల్లు శోభిల్లె మంకెన లుల్లసిల్లె, కాలకంధరవాహంబు గజ్జుఱేఁగె. పాండు. ౪. ౩౭.

జ: గజ్జులాఁడు.

**గజ్జూరము.** వి. (సం. ఖర్జూరః) ఖర్జూరముకి.(శ.ర.)

**గజ్జెలాఁడు.** విశ. (గజ్జులు+ఆఁడు)గర్వి, మదించినవాఁడు.

వ అని యజ్జనుండు పల్కిన నాగజ్జులాఁడు మోఅకంబున మొగ మడ్డంబు గదల్చి...హర. ౭. ౬౧.

**గజ్జెగొలుసు.** వి. (గజ్జె+గొలుసు) స్త్రీపాదాభరణవిశేషము, పాఁజేబులు. (శ. ర.)

**గటక.** వి. ౧. పిండితోఁ జేసినజావ, అంబలి. (శ. ర, బ్రా.) ౨. లేపనార్థము నూనె యుడికించినపిండి. (చి. ని, బ్రా.)

**గట్ట.** వి. (సం. ఘట్టనా) సిద్దనోటికి వేసి గట్టించెడు బిరడ. (శ. ర.)

**గట్టన.** వి. (సం. ఘట్టనా) గట్టించుట. (శ.ర,వా.)

గట్టము. విణ. గట్టిది.

చ. పరువు లిడంగ నాత్మఖురపాతములం గనకా
ద్రి చెంగటం, గర మపరంజిరామెరనుగట్ట
పునేలలు చూర్ణితంబులై, ఖురళికలట్లయాట
బలఘోటకకోటికి నేదదేఱఁగాఁ, బొరలుట క
య్యెడం వెదకఁబో వలదయ్యె రజఃప్రదేశ
ముల్. కవిక. ౨. ౧౦౦.

గట్టి. విణ. (క. గట్టి) ౧. కర్కశము, కఠినము; దృ
ఢము.

సీ. కఠినిమ విల్కాలకొల్కి గబ్బిగుబ్బలగట్టితన మె
ఱింగినయురస్థలము మెఱయ. దశా. ౫. ౪౬.

గీ. బుద్ధ నీగట్టిహృదయసంపుటముఁ దాఁకి, కుంఠి
తము లయ్యె మరునంపకోల లెల్ల. నైష. ౭.
౧౩౯.

గీ. గట్టి కటికి యనంగఁ గన్పట్టు దృఢము. ఆం.
భా. ౩. ౨౩.

౨. బిగు వైనది, సడలనిది.

క. అని పొగడుచు నొయ్యారపు, టనువున జడ
లల్లి జిలుఁగు లగుపయ్యెదలం, జనుకట్లు గట్టి
గట్టిగ,ననిమిషకాంతలు లతాంతహరణోత్సు
కలై. మనుచ. ౩. ౭౩.

౩. గుల్లకానిది; తఱచైనది, దట్టమైనది.

గీ...గట్టివరహా...శుక. ౩. ౫౦.

సీ...గట్టికమ్మిదుప్పటి...శుక. ౨. ౨౪౧.

౪. అధికము.

గీ. అట్టి శ్రీపర్వతము చూచినట్టివారు,గట్టిపుణ్యం
బు చేసినయట్టివారు. విక్ర. ౧. ౧౯౭.

౫. నిశ్చితము, నిజము.

ఆ. ఇతనికడుపు వ్రచ్చి యిందెప్డు రత్నంబుఁ,
గాంచి లేని తనదుకడుపు వ్రత్తు,రుఱక చంపి
పోదు రూరక విడువరు, కడుపు వ్రచ్చు టె
ట్లు గట్టితనకు. కేయూర. ౩. ౩౩౧.

౬. దిట్ట.

సీ. వేదశాస్త్రంబులు వెదకి కానఁగ లేనిగట్టి ప్రే
తలత్రోలఁ గట్టువడియె. భాగ. ౧౦ఉ.౬౯౦.

వి. ౧. గట్టితనము, దృఢత్వము.

ఉదా: ఇనుపపెట్టెయొక్క గట్టి కఱ్ఱపెట్టెకు రా
దు.

౨. పొల్లు కానిగింజ.

(బలరామునిమాటలు) గీ. మాగధాధమ బహుధా
న్యమర్దనమున, కేను రోఁకలి గైకొంటి నిది
నిజంబె, యింక మీలోన గట్టి పొల్లేరుపఱ
చి, చెరుగఁ జక్రంబె చాలదె శ్రీహరికి. ద
శా. ౯. ౫౦.

౩. శౌర్యము.

ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ గలయం
బడి గోవ్రజంబులన్, దందడి వెట్టుకొనఁ బి
ఱుఁదన్ నడిపింపఁగఁ బంచి గట్టిమై, నంద
ఱు నింతకున్ వెనుకరై మొన లేర్చి చనంగ
...భార. విరా. ౪. ౧౭౪.

సీ... కడిమి యుక్కు కఱకు గట్టి కడిఁది. గీ.
నాఁగ శౌర్యాభిధానంబు గాఁగఁ జెలఁగు.
ఆం. భా. ౨. ౨౨౧.

౪. ధృతి, ధైర్యము.

గీ...ఉదుటు గట్టి, దిట్ట మురిది బిరుదు నాఁగ
ధృతికిఁ బేళ్లు. ఆ. సం. మాన. ౫౩.

౫. కణిక.

సీ.హరిహర బ్రహ్మమహానుభావంబు లొక్కటిగాఁ
గఁ గరఁగినగట్టి యనఁగ. భార. విరా. ౨.
౨౪౧. (ప్రాఁతప్రతి, చి. ని. పా)

౬. బాలురు వ్రాసికొనువ్రానిపలకలమీఁద బొగ్గు
పొడి పసరు కలిపి పూయుపూఁత.

ఉ. దేవి తమోమషీరసము తేటఁ బొసంగఁగ గట్టి
వెట్టియుం,కావళి వ్రాయఁగాఁ దొడఁగె నబ్జ
రసంపుటకాంతరంబునన్, బూవిలుకానిశౌ
ర్యగుణముల్ హరిణాంకుఁడు ముత్తియంపుఁబ
లం, దావడముల్ రచించినవిధంబున నక్ష
టికాముఖంబులన్. నైష. ౭. ౧౭౦. (నేను.

పా- ప్రాంత ప్రతులపాఠమునుబట్టియు కట్టించు అనుగుంటూరుమండలము వాడుకనుబట్టియు'కట్టి వెట్టు'గా గ్రహించి కట్టించు అనునర్థము చెప్పుటమంచిదని తోఁచెడిని. కట్టించు=బొగ్గుపొడి పసరు మొదలగువానిచేత-పలకకు-పూయుపూఁత. గుంటూరువాడుక.)

గట్టిగ(గా)=౧. కఠినముగా.

ఉ. గట్టిగ నుండుకొండలును...నీలా. ౨. ౨౩.

౨. శ్రద్ధతో, సావధానముగా.

క. అటు లేనియుఁ జెప్పెద నీ, పాటిపాటితలపోఁ
త లెల్లఁ బోవ నడువుమా, రట ముదుగు నెమ్మ
నము నొక్కటెగా నొనరించి గట్టిగా వినుమ
ధిపా. పాండు. ౫. ౫౦.

౩. పూర్ణముగా.

క. ఇట్టిదినంబులు నుప్పది, నెట్టన పద్మజున కొ
క్క నెల యట్టినెలల్, గట్టిగఁ బండ్రెండగు
నమ, యట్టిసమలు నూఱు బ్రహ్మాయాయుస్సు
సుమీ. వి. పు. ౧. ౭౧.

౪. స్పష్టముగా.

ఉ...వంశ మెల్లఁ బూ,తమ్మగు నీదుచర్య నని ధా
తపడంతియె యానతిచ్చె స్వ,ప్నమ్మున వచ్చి
తావకగుణంబులు చూచినయట్లు గట్టిగన్. క
ళా. ౪. ౧౭౬.

క. చిట్టుములు పుట్టెఁ దాఁ గను, పట్టికి నిటమీఁద
ధర్మపథమున నిటులం,బుట్టెడు నరుచి యటం
చున్, గట్టిగ జనములకుఁ దెల్పుకై వడి దిలి
కిన్. దశా. ౩. ౧౦౬.

౫. బాగుగా అనునట్లు.

సీ. హీరకుట్టిమభూము లినుకనేల లటంచు గట్టి
గా నడుగులు పెట్ట వెఱచు. దశా. ౧. ౨౭౨.

౬. నిశ్చితముగ.

క. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందు
మాట దలఁపుము లేదా, గట్టిగ నీమగఁ డెటేఁ
గిన, యట్టయినను సిగ్గుపాటు లొఁగద చెలి
యా. హంస. ౨. ౧౨౭.

౭. నిశ్చలముగ, కదలకుండఁగ.

క. తగ మేహనంబుపై సవ్యగుల్ఫ మిడి దానిపైఁ
దదన్యం బిడి గట్టిగఁ గూర్చుండుట యొగి,
వ్యగుణా మోక్షాసనాఖ్యమై పెంపొందున్.
కళా. ౫. ౧౫౭.

౮. రూఢము.

ఉదా: పద్యము గట్టిగా రాలేదు.

౯. బిగ్గరగా.

ఉదా: గట్టిగా మాటలాడినఁ గాని నాకు వినఁబడదు.

గట్టివైసుది=ప్రౌఢ.

గీ...గట్టివైసుదియఁ బ్రోడ యనఁగఁ దనుఁ బ్రౌఢ.
సాం. ని. మాన. ౧౩.

గట్టివాఁడు=దిట్ట, సమర్థుఁడు. (మహత్వమహావర్థకరూపము 'గట్టిది')

ఆ. గట్టివాఁడ వగుటఁ గార్ముకనిపుణత, గలుగుట
శరవిద్య ఘనుఁడ వగుట, ధైర్యశాలి వగుట
శౌర్యధురీణుఁడ, వగుట నిన్నెఱుంగనయ్యె
నేను. రామయామాత్యకృతగయోపాఖ్యాన
ము. ౨ ఆ.

ఉదా: వాఁడు గణితశాస్త్రములోఁ జాల గట్టివాఁడు.

జ: గట్టిపాఱు, గట్టిప, గట్టివా, గట్టివాతనము, గట్టివాయి.

గట్టించు. స. క్రి. (√ గట్టి? క. గట్టిసు.) గట్టన చేయు.

సీ. గందపుఁబొడి వైచి గట్టించి యందుపై నెల
రాలఁ గట్టిన నెలవునందు. యయా. ౫. ౯౭.

గట్టినబోది. వి. బాలక్రీడావిశేషము.

సీ. చిడుగు డువ్వలపోటి చెండు గట్టినబోది యల్లి
యుప్పనఁబట్టె లప్పళాలు. కాళ. 3. 33.
ప్రబంధ. ౬౧౩.

గట్టిపాఱు. అ. క్రి. (గట్టి+పాఱు) గట్టిపడు, జెదరుతీఱు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాకలను దేటి గడి మీటి గట్టిపాటి, రాలు గాయతనాన బేరజపుదారి, నారి తేటియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

గట్టిల్లు. అ. క్రి. (సం. ఘట్) సమకూడు, సంభవించు, ఘటిల్లు.

ద్వి. సెట్టికిఁ గర్తంబు తిట్టు దేవరకు, గట్టిల్లె నింతియ కావున మఱియు, భక్తుని మ్రింగినపచ్చిరక్కసుఁడు, భక్తుని జంపఁ బాల్పడుచునఁగాఁడు. బస. పు. ౭. ౭౮౩ పం. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

గట్టివ=గట్టివా.

విశ. (ధూర్తుఁడు.)

ఉ. గట్టిచేతలం బసలుఁ గల్లతనంబులు నీవు పుట్టఁగాఁ, బుట్టినవి... పారి. ౧. ౧౨౭.

గట్టివా. విశ. (గట్టి+వా) ౧. మాటకారి.

(కార్తవీర్యార్జునిక్రీడావర్ణనము)

గీ. గట్టివా యొక్కఁడై సహస్రకరునిమీఁదఁ, దఱిమి గాకొఁనుశైవాలకేశము నించి, తలఁప నిది యొక్కటియె యయుక్తం బటంచు, విభుఁడు చిఱునవ్వు నవ్వ నవ్వించె సఖుల. ఉ. రా. ౩. ౨౧౫.

౨. కఠిన మైనవాక్కు గలది, పరుష మైనవాక్కు గలది; ధూర్తురాలు; దుష్టురాలు.

గీ. తవిలి పలుమఱుఁ జెవులు చీఁదఱగొనంగ, బిట్టు మొరసెడు వస త్రాగినట్టు లిట్టి, గట్టివాజాడ లెట్టుగాఁ బట్టుపడియె, బెట్టుగా నిన్ను వెసఁ జెఱఁ బెట్టియుఁడను. నీలా. ౩. ౭౯.

మ... లోఁ దాల్మి యాడనిఁబాడం బులకాంతరంబు లొనకూడం గట్టివాయింతి వేఁచని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షం బట్టఁగాఁ బోయినన్. సారంగ. ౨. ౯౩.

చ. ఉడుగక బుత్తి ముత్తులిడ నోపి యొడళ్లఱిలేక యుండఁ గాఁ, గడు నెదలోఁ దలంచుకొని గాటపుమక్కువఁ బ్రోదిసేయున, య్యొడయునిఁ బాసి యాగడపుటోజలఁ ద్రిమ్మరునట్టి గట్టివా, పడఁతుక యెయ్యెడన్ దలఁచఁ బాసిన వెండ్రుక గాదె యెన్నఁగన్. అచ్చ. రా. ౪ యో. ౭౨.

౩. దుష్టుఁడు.

దండకము... కన్నతొల్బొల్బ్బట్టైనిం బట్టి యిట్టట్టుగా బిట్టు దట్టింపుచుం జెట్టలుం బెట్టుబల్గట్టివారక్కసు న్వెక్కసం బైనపేరుక్కులోనుక్కుఁ గంబంబునం బుట్టి గిట్టింపవా... అచ్చ. రా. యు. ౧౬౧.

౪. దిట్టఁడు.

సీ. పెనుఁబాఁపపేరు వేసినగట్టివా కుంభిదైత్యవరోధ వైధవ్యదాయి. వరాహ. ౬. ౪౯.

వి. ధూర్తస్త్రీ, గట్టివాయి.

సీ. గట్టివా జంత జాఁగ గయ్యాళి యనఁగను ధూర్తయోషాభిధ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౧౭.

గట్టివాతనము. వి. (గట్టివా+తనము) గయ్యాళితనము, ధార్త్యము.

వ. వెంట వెంట వచ్చునిజచ్ఛాయలంగని లేమ్మనంత నంతఁ జూపెట్టుక వచ్చుకొంటనిలేమ్మికంటు లని యప్పట్టున గట్టివాతనంబులు గనుపట్టఁ దమనేరమి వారిపై నారోపించి ... చంద్రా. ౫. ౬౩.

గట్టివాయి=గట్టివా.

వి. (ధూర్తస్త్రీ, గయ్యాళి.)

క. వంచాడించక తాలిమి, డించక బిగు వెదలి దల్లడించక మదిలో, నించుక యైనను దాఁక లి, యించక యాగట్టివాయి యిట్లని పలికెన్. సారంగ. ౩. ౨౦౬.

సీ. గట్టివాయి యనంగ గయ్యాళి యన జాఁగ యు

న ధూర్త సతికిఁ నాహ్వాయము లమరు. ఆం. సం. మాన. ర. సాం. ని. మాన. ౫.

**గట్టివాలు.** వి. ('గట్టువాలు' అని శ. ర. కాని భారతాదులపెక్కు ప్రతులపాఠమును బట్టియు, కన్నడమును బట్టియు 'గట్టివాలు' అని గ్రహింపఁబడినది-క. గట్టి=పరిమళ ద్రవ్యములయొండ. వల్తి-స్త్రీప్రత్యయము. గట్టివల్తి=సైరంధ్రి, గంధకారిక.) సైరంధ్రీజాతిస్త్రీ, పరులయింట నుండి గంధపుష్పములచే నలంకరించుస్వతంత్ర స్త్రీ; గంధపుష్పాదుల నమ్ముస్త్రీ.

ఆ. ఏను గట్టివాలు వాన నా కెవ్వరు, కడుపుకూడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదు రట్టివా, రలకుఁ బనులు నేసి మెలఁగుబుద్ధి.

క. వచ్చితి ... భార. విరా. ౧. ౭౮, ౭౯

సీ. గట్టివా లై లక్ష్మి గైసేయుచున్నది చేరి యంతఃపురస్త్రీజనముల. కాశీ. ౭. ౫౭.

(కుబ్జ అనినమాట) మ. కలపం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కం బొల్లఁ డెల్లప్పుడున్, జలకంబాడి మదాగమంబ మదిలోన న్వార్చుఁ గంసుండు రా, జెలమిన్ మెచ్చినగట్టివా లిది యనన్ హృద్యక్రియావిక్యఁ జేశలనై యుండుదు ...హరి. పూ. ౯. ౭౪. కాశీ. ౨. ౧౪౬.

గీ. ఏకజాతిసుమంబు లనేకజాతి, కలితసుమనః కదంబమ్ముగా నొనర్చి, వలచి తరితీపు పుట్టించి పిలుతు రర్థి, గట్టివాలుపడంతు లప్పట్టనమున. తపతీ. ౧. ౬౧.

చ. దల మగుచంద్రఖండములు దారలు సాంకవ మొప్పపాణిపాటల మగుదంతపుంగరవటంబు శశాంకుఁడు గుంపుమైనచీ, గలజిగి కెంపుగా బయటిరథ్యల నొప్పదు రిందుకాంత వేదులప యి సంధ్యయే బహుతఁ దోఁచె నన స్ఫురి గట్టివాల్సతుల్. ఆము. ౨. ౨౩. చంద్రా. ౧. ౩౬.

**గట్టు.** వి. ౧. పర్వతము.

ఆ. గాడ్పువేల్పుపట్టి గ ట్టెక్కి యుక్కనఁ, జూచె నూటి నేటి జోటిమగని, భావిసేతు వచ్చు పడ లంకకడమను, నూత్ర పట్టుమాడ్కిఁ జూడ్కి వెలుఁగ. రామా. ౬. ౯౨.

సీ... గట్టు నాఁ దీరనగంబు లలరు. ఆం. భా. ౩. ౫౩.

౨. తీరము, ఒడ్డు. ఆం. భా. ౩. ౫౩.

గట్టులమొకిమీఁడు=అద్రిరాజు, హిమవత్పర్వతము. రామ. ౨౧౩.

గట్టురాజల్లుఁడు=శివుఁడు. రామా. ౧. ౪౩.

గట్టుచాటునిక్షేపము=పర్వతముక్రింద నుండునిధి. (అసాధ్యము, వశము గానిది అని భావము)

గీ. జనమనోరమ ధాన్యమాలిని గళావ, తియుఁ దిలోత్తమ పూర్వచిత్తియుఁ బ్రమోహి, మొదలుగా నింతులకుఁ జింత యొదవె నశని, చిత్తమది గట్టుచాటునిక్షేప మనుచు. కవిరా. ౩. ౪౮.

జ: గట్టుఁద్రిమ్మరి, గట్టుతాలుపు, గట్టుదాయ, గట్టుపట్టి, గట్టురాచూలి, గట్టులరాయఁడు, గట్టులఱేఁడు, గట్టువిలుకాఁడు, గట్టువిల్తుఁడు, గట్రాచూలి, గట్లనూఁడు.

**గట్టుఁద్రిమ్మరి.** వి. (గట్టు+త్రిమ్మరి.) మలత్రిమ్మరి, వానరము, కోఁతి.

క. ఉమ్మలిక యుడిగి తద్దయు, నెమ్మదితో నుండు మిపుడు నీ చెంతకు బీ,ర మ్మొదవఁగ నగ్గట్టుం, ద్రిమ్మరిమొన గానిఁ బట్టి తెచ్చెద నెలమిన్. అచ్చ. రా. సుం. ౧౭, ౧౧౨.

**గట్టుతాలుపు.** వి. (శ. ర-గట్టు+తాలుపు) నగధరుఁడు, విష్ణువు.

సీ. మశకపంక్తులయట్లు మాత్త రుద్ధతిఁ జూప గట్టుతాలుపు చెట్టు బెట్టఁ జెందె, మకరవైఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధివహీ వహించె. ఉ. రా. ౨. ౫౦. ('గట్టుఁదాలుపు' ముద్రి)

**గట్టుదాయ.** వి. (గట్టు + దాయ) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

గీ. బమ్మయ మ్మెర్చి యజ్జగబంటుమీఁద, నైవనది సంపఁ జాలక వానిఁ గుదియఁ,గట్టివైచిన మే నల్లఁబట్టివైచి, తండ్రికడ నిల్పె నగ్గట్టుదాయ నూఁడు. అచ్చ. రా. సుం. ౧౩౨. (గట్టుదాయనూఁడు=ఇంద్రజిత్తు.)

**గట్టుపట్టి.** వి. (గట్టు + పట్టి) ౧. మైనాకుఁడు.

సీ. గట్టుపట్టినిఁ జెట్టపట్టి చట్టుప లేలినట్టి జెట్టిఁ గ్రోలుదిట్టతపము. అచలా. ౩. ౪౧.

౨. పార్వతి. వరాహ. ౯. ౫౮.

**గట్టురాచూలి.** వి. (గట్టు + రాచ + చూలి.) హిమవత్పుత్రి, పార్వతి.

దండకము... ఈశునిల్లాలవై యున్న యాగట్టురా చూలివి న్నీవ కావే... రాజ. చ. ౨. ౭౯.

**గట్టుల(ట్ల)రాయఁడు**=గట్టులఱేఁడు. సాం. ని. స్థా. ౫౫.

**గట్టుల(ట్ల)ఱేఁడు.** వి. (√గట్టు) హిమవంతుఁడు, నగాధిపుఁడు. (శ. ర.)

**గట్టువిలుకాఁడు.** వి. (√గట్టు) శివుఁడు. అచ్చ. రా. సుం. ౧౫౨.

**గట్టువిలుతు(ల్తు)ఁడు**=గట్టువిలుకాఁడు. ఆం. సం. దేవ. ౬.

**గట్రాచూలి**=గట్టురాచూలి.

శా. ఎట్రా శేషుఁడు పోతరించి సభలో నెగ్గాడె నా రత్నమీఁ, డట్రా వాసుకితక్షకాదిధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్, చుట్రా నిల్తురుగాక నన్ను సమరక్షోణిఁ విజృంభించి యా,గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారంబు వారించెదన్. జై. భా. ౭. ౯౨.

(ఇట్లే 'గట్లఉనిబిడ్డ' ఆం. భా. ౧. ౪౦.)

**గట్లనూఁడు.** వి. (√గట్టు) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

(ఇట్లే గట్లగొంగ.) అచ్చ. రా. యు. ౪౭౪, కిష్కిం. ౭౬.

**గడ[1].** వి. (సం. కాండః. క. గడె.) ఇక్షురంభాదికాండము.

సీ. ఇక్ష్వాదికాండాఖ్య యెసఁగును గడ యన... ఆం. భా. ౨. ౭౫.

సీ. కమలపుపాళంబు గాలాపుఁ బ్రాడుగాఁ గాలోగ్ర దండంబు గడయుఁ గాఁగ. కు. సం. ౧౦. ౫౩౫.

సీ. పరిభూతబిసపద్మభాతులు చేతులు కదలికా యుగళంబుగడలు దొడలు. భా. రా. సుం. ౧౫౩.

౨. యుద్ధసాధనవిశేషము. (ఈఁటె ?)

సీ. విరివిరియై మేఘముల్ పెరిఁగివచ్చినలోకఘన పతాకలశతాంగములు హత్తి, నెదురుపాదల్ పేర్చువిధమునఁ గనిపించుగడలపాఁజులు సమగ్రముగఁ గూడి. విజ. వి. ౩. ౧౫౨.

గీ. గడలపాఁజులరొద లిరుగడలఁ జెలఁగ, దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి. సారంగ. ౨. ౧౯౦.

౩. ఓడకంబము, తెరచాఁపకొయ్య.

క. గడ కట్టినయోడపగిది ... శివయోగసారము. ౨. ఆ. (శ. ర.)

జ: గడచీల, గడసాదన.

**గడ[2].** వి. (సం. ఘటా. ప్రా. ఘడ.) సమూహము.

సీ. మక్కువఁ దేఁకువ దక్కి లోఁ దవిలి యాడెడుచక్రవాకపుగడలతోడ. నిర్వ. ౭. ౫౩. (శ. ర. పా.)

**గడ[3].** ప్ర. చేర్వాదులకంటె వచ్చు నొకానొక ప్రత్యయము. (చూ. అత్తుగడ, చేరుగడ, మొ.)

**గడగడ.** వి. (త. కడకడప్పు) వడఁకుట మున్నగువానియందగు అనుకరణము.

క. గడగడ వడఁకెడు మేన,న్నిడువెంట్రుక నెట్ట... ఉ. హరి. ౬. ౯౬.

ద్వి. కూటమి నొకజోడుకో డైలై యున్న, నాఁటి
సఖ్యము మది నాటి ప్రేరేఁప, గడగడ వసు
దేవుకడ కేఁగె నతఁడు. అ. మ. క. ౧. ౨౬
పా. (వడివడిగా వెడలు అని భావము.)

గడగడపఱచు=వణఁకింపఁ జేయు, భయపెట్టు.

ద్వి. కనక రేఖాకాంతి గడగడపఱచు, తనువల్లిక
యు వీణఁ దలపించు నెలఁగు. రం. రా. ఉ.
౭౦ పా. ౭ పం. (ఇట ఔపమ్యమును తెలు
పును.)

జ: గడగడలాడు.

**గడగడలాడు.** అ. క్రి. (గడగడలు + ఆడు) వ
డఁకు.

ఉదా: వాఁడు నన్నుఁ జూచిన గడగడలాడును.
(శ. ర, వా.)

**గడచీల.** వి. (√ గడ[1]) ఏతపుబానయం దమర్చి
యుండెడుదండెపుఁ బీఁటలు తగుల్చుటకు గడశల
నుండెడుచీల, కుండ గట్టెడుచోట ఏతపుగడకొన
కు అమర్చుచీల. (శ. ర.)

**గడన[1].** వి. (√ గడించు[1]. సం. ఘటనా) సంపాద
నము, ఆర్జనము.

క. గడన గలమగనిఁ జూచిన, నడుగులకును మ
డుఁగు లిడుదు రతివలు తమలో, గడ నుడుగు
మగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు న
గుదురు సుమతీ. సు. శ. ౪౩.

క. నీ వీవైష్ణవు విటునిం, గావించిన లంజెతనపుగ
డన విడిచెదక, గావింప లేకయుండిన, నీవు
న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెక.
వైజ. ౨. ౩౦. బహు. ౫. ౪.

**గడన[2].** వి. (√గడించు[2]. సం. గణనా) ౧. ఎన్ని
క, లెక్క.

పీ. లక్షించి మలయశైలమ్ముఁ దేఁ డని కాని గం
ధసారమనను గడన లేదు. జై. భా. ౫. ౧౬౭.

౨. స్తోత్రము.

ఆ. ఆనిన రౌద్రరసము మనమున నడరంగఁ, బడ
గ యెత్తునురగపాలురేఖ, నెనయఁ జేతిసారెఁ
గొని ప్రేసెఁ బతి పేడి, గడన యుడుగు మన్న
నుడుగ వనుచు. భార. విరా. ౫. ౨౪౯.

౩. దొంగమేపు.

గీ... గడన యనఁగ, లంప మన దొంగమేపు చెలం
గు నభవ. ఆం. భా. ౩. ౩౫.

**గడనకత్తె**=గడనచేడియ. (శ. ర-గడన[1]+కత్తె)

**గడనచేడియ.** వి. (గడన[1]+చేడియ) భోగముది,
వేశ్య.

గీ. దొరలు మన్నీలు చెలులు బందుగులు జెట్లు,
బంట్లు కబ్బంపుఁగూర్పరు ల్బాళిగాంద్రు, గ
డనచేడియ లూడిగీల్ గాణ లోజ్జ, బాఁపన
య్యలు దీర్పరు ల్బలసి కొలువ. నీలా. ౨.
౪౯.

**గడనము.** వి. (క. గడణ) గడ, సమూహము.

క. పిడుగు లయి తాఁకు నలుగడ, జడనిధులై ముం
చు గోత్రశైలములై పైఁ, బడుఁ జదియఁ గా
రుమొగుసుల, గడనములై కప్పుఁ బన్నగము
లై చుట్టుక. కు. సం. ౧౨. ౯౬౩.

**గడప**=కడప. వి. దేహళి, ద్వారముయొక్క క్రింది
కమ్మి. (వా, చి. ని, శ. ర.)

సీ... గడప యన దేహళీసంజ్ఞ యడరు నభవ. ఆం.
భా. ౨. ౧౭.

**గడబడ, గడిబిడి.** వి. (హిం. గడ్ బిడ్.) ౧. అ
ల్లరి. (శ. ర.) ౨. తొందర, బాధ. (బ్రౌ)

**గడము.** వి. కుండ లోనగువానిమూఁత, గడి.

గీ ... గడి యన గడంబు, నాఁగను ఘటాదికపి
ధాన మా గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

**గడము.** సం. వి. అ. పుం. ౧. తెర. ౨. వెలుగు, కం
చె. ౩. అగడ్త. ౪. విఘ్నము. ౫. గండెచేఁప.
౬. ఒకానొకదేశము.

గడలవణము. సం=గడోత్థము.

గడవం(మం)చె. వి. (శ. ర-గడ1 + మంచె?- హిం. ఘరోంచి.) మాటలు మున్నగునవి పెట్టుటకై కోళ్లు అమర్చినచట్టము.

గడసాదన. వి.(గడ[1] + సాదన) సాము,వ్యాయామము. (శ. ర.)

గడసియ. వి. ౧. అటుక. ౨. మచ్చు, మిద్దె. ౩. మదురు. (చి. ని.)

గడసిల్లు. అ. క్రి. కడనుండు, చివర దగు? (గడిసిల్లు=క్రుంగు ? చూ. గడిసిలఁబడు)

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకులింకించె గంభీరహుంకారగర్జనమున ... గడసిల్లునర యొడ్డగెడ వైన నెవ్వాఁడు త్రాసుపైఁ గట్లెచందమున పంచె. భీమ. ౨. ౭౭.

గడసె. వి. ౧.గడసియ, అటుక. (అప్ర -శ.ర.)

గడి[1]. వి. (క. గడి) ౧. సీమ, పొలిమేర; సరిహద్దు; మితి, మేర.

క. పొలిమేరన గడి యనఁగాఁ, బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా,స్థలనామధేయములు...ఆం. భా. ౨. ౨౪.

క. పరఁగును నచ్చట వాహిని, విరజ యనఁగ మిగుల నొకటి విమలామృతని, ర్భరపూర్ణ యగుచు నది గడి,పరమపదమునకు భవ ప్రపంచంబునకున్. పరమ. ౧. ౨౪.

క. అడవులు గడిదేశము లవి, దడములుగాఁ బెంపుమా...ఆము. ౪. ౨౫౬.

ఆ. కలఁగి తేఁటవోదు గడి దప్ప వెలిమను, నీటికుప్పనీరు నేటుమనసు. అచ్చ. భా. ౪. ౫౯.

చ. ఎదిరినయోబళౌరినరసేంద్రునికీర్తి నిజాంశుపంక్తికిన్, మదనవిరోధి భీతుఁ డయి మార్గాన కేఁగినఁ దద్రథంబు ద,త్సదనము నాక్రమించి రభసంబున నావృషభాధిపధ్వజున్, వెదకఁ జూమీ యజాండముల వే వెదలెం గడి లేనియీసునన్. నరస. ౪. ౬౭.

౨. చదరంగపుబల్ల మున్నగువానిమీఁద గీచినయిల్లు.

ఉదా: చదరంగపుగడి.

౩. దరి, సమీపము.

క. తరుగుల్మాదులమలువునఁ, దరతరమ చలించి గడికిఁ దారుచుఁ బురసం,హరు నెయిదఁ జొచ్చెఁ గాముఁడు...కు. సం. ౫. ౪౯౩.

౪. కుండ లోనగువానిమూఁత, గడము.

గీ...గడి యన గడంబు,నాఁగను ఘటాదికపిధాన మా గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

౫. (రెండురెండుపశువులకు) ఒక్కొక్కకాలుచేర్చి వేసెడిబందము. (చూ. గడిత్రాడు)

౬. మర్యాద, కట్టుబాటు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి,కాకలను దేఱి గడి మీఱి గట్టిపాటి, రాలుగాయతనాన బేరజపుదారి, నారితేఱియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

జ: గడికాళ్లువేయు, గడిత్రాడు, గడిదేఱు, గడిదొంగ, గడిపోతు.

గడి[2]=గడీ. వి. దుర్గము, కోట. (చి. ని.)

క. ఆబొబ్బిలిగడిపై తెటఁ,గా బురుజులపై నెసంగు నాగ్నేయకళా,క్షీబదయోమయ మైనయ, రాబాసాం పన్న నెన్నరా దెవ్వరికిన్. రంగా. ౨. ౨౭.

గడి. సం. వి. ఇ పుం. గిత్త, కోడెదూడ.

గడి(యి)ంచు[1]. స. క్రి. (సం.ఘట్). ౧. సంపాదించు, ఆర్జించు.

ద్వి...నూటపదార్లు,గడియించి యౌవనకాలంబునందు. ద్వి. సారంగ. ౨. ౬౯ పా. ౨౩ పం.

చ. పుడమి సమస్తవర్ణములపొత్తులు నీలువు దప్పిలంజెలై, పడిచి గండింతు రర్థములు...వరాహ. ౯. ౧౩౬.

ద్వి. గోఁచి గట్టిన నాఁటఁ గోలెఁ బీనుఁగుల, మోచి గడించినమూలధనంబు...ద్వి. హరిశ్చ. ఉ. ౭౭౭ పం.

౨. కల్పించు.

మ... దోఁసము సుమ్మెందు నిరాపనిందలు గడించఁగ...సారంగ. ౩. ౧౨.

చ. అటు దలఁ డౌర యెంతటిమహాత్ములు మీర లు నాదుమీఁదనా, కటకట మీవచోరచన కౌశల మోభువనప్రపంచసం, ఘటనధురీణ యన్న నగి కామిని యిం దిపు డేమి గాంచి యీ, కిటుకు గడించి పల్కె దెఱఁగింపుము కల్గిన నాకు నావుడున్. కళా. ౫. ౩౭.

జ: గడన[1], గడనకత్తె, గడనచేసియు.

**గడి(యి)ంచు[2].** స. క్రి. (సం. గణ్) గణన సేయు, పాటించు.

క. వెడదెరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహ దొంగ లానపాడిచినఁ గోకల్, విడుతురె గడింతు నే యెక్కడిగతిమాలినపిశాచిక వో నీమాటల్. కళా. ౩. ౧౯౩.

ద్వి. వడు గని యిది యేమి గడియించె దీవు, జడుఁడ నె ట్లయితి విశ్వేరునిఁ గొల్చియును, బరమాత్ము గురునిగాఁ బడసి దుర్నరుల, గురు లని తలఁచుట నరకంబు గాదె. బస. పు. ౧. ౪౨౭ పం.

**గడికాళ్లువేయు.** స. క్రి. (√గడి[1])-రెండు రెండు పశువులను-ఒక్కొక్క-కాలు చేర్చి లంకె వేయు.

ఉదా: ఆవులను పొలములో గడికాళ్లువేసి రా. (శ. ర.)

**గడితపడు.** అ. క్రి. (గడితము+పడు) గట్టిపడు, ఘనీభవించు.

గీ... వలరాచమేపుడుకంటివేల్పు, జడలలోనుండి వడియుచు గడితపడిన, తేటవేలుపుటేటిపెన్నీటిబొట్టు, లనఁగఁ జుక్కలు కనుపట్టె... యయా. ౨. ౬౧.

**గడితము.** విశే. (సం. ఘటితం. ప్రా. ఘటిఅ) ౧. ముదురైనది, మోటుది; చిక్కనిది, తఱచైనది.

సీ. గడితంపు జెలుఁగుతో లక్కప్పిన నొప్పారుబలు తేరు వేయి మావులు వహింప. హరి. ఉ. ౬. ౨౧౩.

సీ. పచ్చియేనికతోలు పచ్చడంబుఁ ద్యజించి గడితంపుఁ బట్టుపచ్చడము గట్టు. వార. ౫. ౫.

సీ. కుండబొజ్జల క్రింద ద్రిండుగా బిగియించి గడితంపుమడుఁగులు గట్టినారు. నైష. ౬. ౮౩.

౨. అధికము, మిక్కుటము; పెద్దది.

క...పదివేలముద్దుఁదలిరుంబోఁడు, ల్గలిగెద రిటువలె గడితపు, వలపంతం జెంది కంద వలను నృపాలా. రసిక. ౩. ౧౪౧.

గీ...జగములు గడితంపుఁగనికరంపుఁ, బెంపు రాణింప నెపుడు పాలింపుచుండు. రసిక. ౧. ౨.

సీ. గడితంపుఁగీల్జడ కటిమండలంబునఁ బలుదెఱంగుల లాస్యకలన నెఱప. రసిక. ౫. ౧౩౩.

క. బెడిదపుటడిదముఁ గైకొని, గడితపుటొఱ దుస్సి వాఁడిఖడ్గము చేతన్ ... జడ గోసి యతండు వేగ చనియె లతాంగీ. శుక. ౨. ౨౨౩.

వి. ౧. తఱచు, బాహుళ్యము.

క. వి:డుతలగడితము తొలుకరి, పిడుగులబెడిదంబు చిలువపిండులవడియున్. అచ్చ. రా. యు. ౩౨౫.

౨. సాంద్రత్వము, చిక్కన.

క. పడఁతుక యొక్కతె పోఁగుల, గడితము గల చల్వవల్వ గైకొని...పార్వ. ౫. ౧౭.

౩. ముదుగుఁదనము, మోటుఁదనము. (శ. ర.)

జ: గడితపడు.

**గడిత్రాడు.** వి. జా. (√గడి[1])-రెండు రెండు పశువులను-ఒక్కొక్క-కాలు చేర్చి లంకెవేసెడుపలుపు. (చి. ని, శ. ర.)

**గడిదల.** వి. ఒకవిధమైనయాయుధము.

క...కూలిరి గడిదలలు దాఁకి కుంభినిమీఁదన్.
కు. సం. ౧౧. ౬౯౬.

వ...గడిదల లూని జళిపించియును ... ప్రబంధ.
౭౮౭.

**గడిదేలు.** అ. క్రి. (గడి[1] + తేలు) నిపుణుఁ డగు, ఆరితేఱు.

గీ. ఆరితేఱె ననం గడిదేఱె ననఁగఁ, గసిమసం
గె ననంగ నాఖ్యలు దనర్చు, నిపుణుఁ డయ్యె
నటంటకు...ఆం. శే. 3౫.

క. వెడవెడ దుర్వ్యవహారపు, నడవడి గడిదేటి గు
రుజనము శిక్షింపన్, గడుసువడి విప్రతన
యుఁడు...పాండు. 3. ౧౪.

గీ. జారవిద్యలఁ గడు గడిదేటి యామి,టారి వి
డిపడ్డమరులేజిదాడి మీాటి. శుక. ౨. ౧౦౧.

**గడిదొంగ.** వి. (√గడి[1]) గడిదేఱినదొంగ, నిపుణుఁ డగుచోరుఁడు. (బ్రౌ)

**గడిపోతు.** వి. (గడి[1] + పోతు) ఆఁబోతు.

ద్వి. ఉడుగక వాతఁ గ్రొవ్వులుకంగఁ గుడిచి,
గడిపోతువలె మేనికండలు వెంచి. ద్వి. హరి
శ్చ. ఉ. ౫౯౭ పం.

**గడియ[1](డె).** వి. ౧. అర్గళము, తలుపునకు నడ్డుగా వైచుకఱ్ఱ.

సీ...అర్గళాఖ్య,గడియ నాఁ దగును...ఆం.భా.
౨. ౨౨.

గీ...తలుపు,మూసి గడియ బిగించెద మోసపోక.
శుక. ౨. ౧౨౨.

గీ. అతివ బంగారునఱలోని కరిగి మిగులఁ, బెరుఁ
గుసిబ్బితిచే గడెఁ బెట్టుకొనియె. యయా.౫.
3౪.

గడియలుపడు=గడియలు వేసినట్లగు.

క. ఉడుగనిపస్తులఁ జెవులను, గడియలుపడ మే
ను వడఁక...పాండు. 3. ౧౦3.

**గడియ[2](డె).** వి. (సం. ఘటికా) ౧. ఘటిక, ఇరువదినాల్గునిమిషములకాలము.

గీ. గడె గడియ నాఁగ ఘటిక యా...ఆం. భా.
౧. ౯౫.

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని...కుమా.
౨. ౪౭.

౨. ముహూర్తము, అల్పకాలము.

గీ. కంతుశత్రు జయించెద గడియలోన. దశా.3.
3౭.

గీ. గడియతడవులోఁ బొడిపొడిగా నొనర్చె. హ
రి. ఉ. ౬. ౧౯౯.

జ: గడియకుడుక.

**గడియకుడుక.** వి. (గడియ[2] + కుడుక) గడియలను దెలుపుపాత్రవిశేషము. (ఇది అడుగున చిల్లుల గలిగియుండి తేలికగా నుండును. ఇది నీటిలో తేల విడువఁగా క్రిందిచిల్లులనుండి నీరు పోసికొని ఒకగడియసేపటికి మునుఁగును. దీనిబట్టి పూర్వము కాలమానమును దెలిసికొనెడివారు.)

ఆ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో,వ్రా
లె...ద్వా. ౪. ౨3౯.

గీ. గడియకుడుక మునుంగుట గని గురుండు, తె
ల్లవాఱెడు నని పఱతెంచి పలుక. కుమా.౨.
౧౨౫.

**గడియారము.** వి. (క. గడియార. త. గడికారం. తు. గడియాళ్) గడియలు తెలుపుయంత్రవిశేషము; కాలము తెలుపుయంత్రవిశేషము.

మ. ఉడువీథిన్ శిఖరావలంబి యగునంభ్రోర్వీ
శుమోసాలపై, గడియారంబున మ్రోసె రెం
డెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్...
క్రీడా. ౧౫౫.

ఉ. ఆనలినాయతాక్షుగడియారమునం దభిసారి
కాజఘాం,సానికతప్రసూనశరచాపగుణధ్వ
నులో యనంగ ఘం,టానినదంబులయ్యెడవి
నంబడియెం గుపితాబ్జలోచనా,మానసముల్ప
లింపఁ బ్రథమప్రహరాపగమప్రకాశనమై.
పారి. ౨. ౫౦.

ద్వి. ఒక్కొకగడియ కొక్కొకపండు వ్రాలు, నక్కజం బగు గడియారవృక్షములు, ఒక్కొక గడియ కొక్కొకమాటు చెలఁగు, నక్కజం బగుగడియారశైలములు. బస. పు. 3.౧౦౦౪, ౧౦౦౬ పం. (ఇటవృత్తియందు 'ము' వర్ణలోపము.)

(వ్యవ)గడియారము పండ్రెండుగంటలు కొట్టినది.

**గడిసిలఁబడు.** అ. క్రి. (ఒ్రమ్మ) భారాదులచే క్రుంగఁబడు. ('గరిసిలఁబడు' అని బ్రౌ)

సీ. ఇగురుమేతల నొగ రెక్కఁ గోకిలకును వడి ఒ్రమ్మ గడిసిలఁబడియె నేని... గీ...బట్టబయ లగు గర్వరేఖ,విషమసాయక...పి.శకుం. 3. ౧౯౦.

**గడీ**=గడి².

గీ. రావువారిగడీమీఁద రాచవారి, పనుపునఁ బరాసువారు కోపంబుఁ జేసి.రంగా.౨.౧౨౨.

**గడు**=గడ్డు. (చూ. గడుఁగాయ, గడుమన్నెము.)

జ: గడుఁగాయ, గడుమన్నెము.

**గడుకము.** సం. వి. అ. పుం. భృంగారము, బంగారుగిండి; గిండి.

**గడుఁగాయ.** విణ. (గడు+కాయ) రాలుగాయ, తుంటరి. (వా)

**గడుమన్నెము.** వి. (గడు + మన్నెము) గడ్డుమన్నెము, లోమన్నెము. (వా)

**గడురుఁడు.** సం=గడులుఁడు.

**గడులుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) కుబ్జుఁడు, మఱుగుజ్జు. (విల్యమ్సు.)

**గడువు.** వి. (క. గడువు)-కాలముయొక్క-అవధి, మేర.

గీ. గడు వనఁగ మేర యనఁగ నుగ్గడి యనంగ, నడరు మర్యాద...ఆం. భా. ౨. ౧౯౧.

ద్వి...కొన్ని,దినములు గడు విడి...ద్వి. పరమ. ౭. ౫౮౬ పా.

ద్వి. ఆగడువుకు రానియట్టివానరుల, వేగంబె తల దెగ వ్రేయుము నీవు. రం. రా. కిష్కిం. (చి. ని.)

**గడువు.** సం. విణ. (ఉ) కుబ్జుఁడు. వి. ఉ. పుం. ౧. బల్లెము. ౨. గిండి. 3. ఎఱ్ఱి, వానపాము. ౪. మెడమీఁదికంతి. ౫. కంతివలె నిరర్థక మగుపదార్థము.

**గడుసరి.** విణ. (గడుసు+అరి-క. గడుసరి) ౧. కఠినము; కఠినుఁడు.

ద్వి. నమ్మిక పుట్టించి నయములు నేసి, గడుసరిమనసులు గరఁగించి వుచ్చి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౯౯ పం.

సీ...కఠినాత్ముఁ డొప్పఁను గడుసరి యన. ఆం. భా. 3. ౧౨.

౨. మాయలమారి, వంచకము.

క. అడుగులు తొట్రుపడంగా, నడ లొందినయది యపోలె నయ్యెయెడలన్,బుడమిఁ బడి మ్రొగ్గి లేచుచు, గడుసరి యగుశకశక మెయ్యఁ గదియం బోవన్. నా. పంచ. ౧. ౨౫౪. వైజ. ౪. ౯౪.

3. దుష్టుఁడు, కూళ.

క. ఒడయఁడ నే నొకజన్నము, గడు వేడుకతో నొనర్పఁ గడఁగిన నెపునన్, గడుసరిరక్కసు లిరువురు, దొడరి వడిన్ జెఱుపుచుండుదురు చల మెదపన్. అచ్చ. రా.బాల.౯౫.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల, గడుస రు లగ్యయ్యంపుఁగ్రచ్చలు...పండితా. పురా. ౧౧౬ పా.

౪. అసాధ్యుఁడు. (శ. ర, బ్రౌ.)

**గడుసు.** విణ. (క. గడుసు. త. కడిదు) ౧. కఠినము, గట్టిది.

కవిరాజ ....గడుసుఁజనుంగవ ... కవిరా. ౫. ౨౪౫.

గీ. గడుసుఁబిక్కలు గలిగినమడమ లమర, వెంట

నిరవంకఁ జెంపుడు వేఁపు లరుగ. శుక. ౨. ౪౧౨.

సీ. గడు సైనపెనుమొప్పు గాలికి వెఱచునా విఱుగఁ గాచినమ్రాను వెఱచుఁ గాక. రామలిం. ౨౪.

౨. కుజనుఁడు, కూళ.

ఆ. ఆతతాయి గడుసు నన్యదేశ్య నధర్ము ... ఆము. ౪. ౨౧౯.

గీ. కూళ గడుసన వర్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం. సం. మాన. ౧౧.

వ... నీవు చని యీనడుమ నంకురితదర్పు లగుచు నెదుర్పడం గడంగుగడుసుదొర లెక్కడెక్కడం గలరో వారి నుక్కడంచి ... కళా. ౭. ౨౬౭.

౩. గాఢము, అధికము; హెచ్చైనది.

(రతివిలాపము) క. పుడమిఁ బడి పొరలి తను నొ,క్కఁడు చుట్టం బనుచు నెత్తఁగా లేకునికిన్, గడు సగుశోకము నెమ్మది, నడఁగక మెల్లఁగ వరాళి కారంభించెన్. పార్వ. ౩. ౭౪.

౪. అసాధ్యము. (శ. ర.)

వి. ౧. కాఠిన్యము. (శ. ర.) ౨. మొండితనము. (చూ. గడుసుపడు.)

గడుసురాలు=గడుసుఁదనము గలస్త్రీ.

ఆ. ఎవ్వరిగుణములును నేమన్న మానవు, చక్కఁజేయ రాదు కుక్కతోఁక, గడుసురాలు మగని గంపఁ బెట్టును రా. వేమన. ౧. ౧౬.

జ: గడుసరి, గడుసుఁదనము, గడుసుపడు.

**గడుసుఁదనము.** వి. (√ గడుసు) ౧. కాఠిన్యము.

గీ. కైక యేపేఁకఁ బవలించు లేక లేక, కలిగినకకుత్థ్సవంశశేఖరునిమృదుల,తను వయోయీను నెనయఁగనీ మనసుకంటె, గడుసుఁదనమొందును పలసంఘములయందు. చం. రా. ౪. ౨౯.

౨. మోటుఁదనము.

సీ. రాఁ గూడ దని పల్కు రమణునెంబడి నేఁగి కానలో విహరించు గడుసుఁదనము, మాయామృగమువెంట మగఁడు పోవఁగ దంటపు ఱంది నంపిన నాఁటిమంపుఁదనము...కృ.శ.పు. పీఠి. ౫౦.

౩. ధార్ష్ట్యము.

వ... మీర లీమ్రుచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని యుండుఁ డనుటయు నుదిరిపడుచు న ప్పుడు చులు గడుసుఁదనంబున నలేని నధిక్షేపించి. ప్రభా. ౧. ౧౦౭.

**గడుసుప(వ)డు.** అ. క్రి. (గడుసు+పడు) మొండితనము వహించు, బండ యగు.

క. వెడవెడ దుర్వ్యవహారపు, నడవడి గడిదేతె గుజనము శిక్షింపక్, గడుసువడి విప్రతవ యుఁడు, సడి కోరిచి వంగవరకచాటుక్ మానెన్. పాండు. ౩. ౧౪. (శ.ర.పా. 'వంక పరక' ముద్రి. పా)

క. అడుగఁ దగువాని నడిగిన, నిడినమొదల్ గొసరఁ గొసర నీ లే వనఁగా, గడుసుపడి యాన చేఁ దా, నడిగిన దుర్మార్గవృత్తుఁ డగు రా కేమా. వేమన. ౨. ౧౯౪.

**గడెకారి.** (ఇది అరవము అని శ.ర.కాని అరవనిఘంటువులలోఁ గానరాదు) వి. బల్లెము గలవాఁడు; పోకిరి. (శ.ర.పోకిరి అనునర్థమున 'గడేకారి'వా)

**గడేరము.** సం. వి. అ. పుం. మేఘము.

**గడోత్థము.** సం. వి. అ. న. గడదేశమునఁ బుట్టుక్షారియుప్పు.

**గడోలము.** సం. వి. అ. పుం. ౧. గ్రాసము, కబళము. ౨. గుడము, బెల్లము.

**గడ్డ.** వి. (సం. గండః. క. గడ్డె. త. కట్టి.) ౧. వ్రణము.

ఉదా: నెత్తురుగడ్డ.

౨. దుంప, మూలము.

సీ. మోర కగ్గల మైనకోఱచేఁ దుంగగడ్డలు ద్ర వ్వుకిటి రాజు చెలిమి వీడి. కార్తి క. ౧. ౫౪.

౩. మంటిపెల్ల, లోష్టము, బెడ్డ.

క.ఘనతర మగుహ్రీగౌరవ,మున ముఁగినఁ బావ మఖిలమును రూపు సెడుం, బెనుపువయగ్గలి కఁబొగడు, గనినపయోరాశిఁ బడ్డగడ్డయుఃబోలెన్. భార. ఆను. ౨. ౪౦. ఆం. భా. ౨. ౨౩౦.

౪. (ఏటిమొక్క) ఒడ్డు.

ద్వి...కావేరి, ఘన వేగమున రెండుగడ్డలు జవు రు, కొని పాఱ...ద్వి. పరమ. ౫౪౧ పా. ౩ పం.

శా. ఓసామి ... నట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడనే, యాసం గట్టితి వేటిగడ్డ నిలు...కాళ.౩.౬౫.

గడ్డపెరుఁగు=గడ్డవలె నుండు పెరుఁగు. (వా.)

నడుగడ్డ=ద్వీపము, ఏటినడుమ నుండుదిబ్బ.

సీ. కావేరినడుగడ్డఁ గాఁపురంబుండుదు దివసాం తమున నిటఁ దిరిగి వత్తు. కకు. ౧. ౨౧౫.

చ. చరణవిహీనుఁ డట్టె ఘనసాగరభీకరవీచికా సము,త్కరపరిఖాంత మైననడుగడ్డకు వచ్చి నిజోదరాగ్నిచే, నెరియుచు నున్నయట్టితు ది నెవ్వరికిం బడయంగ రానినుం,దరి యిది పత్ని యయ్యెడిని దైవముచేఁతల కడ్డ మున్న దే. భోజరా. ౫. ౩౪౬.

జ: గడ్డపలుగు, గడ్డపాఱ, గడ్డప్రొయ్యి.

**గడ్డపలుగు.** వి. (√ గడ్డ) గునపము. (వా)

**గడ్డపాఱ.** వి. (గడ్డ+పాఱ-త. కట్టపారై) -గడ్డ లు పెల్లగించునది-గునపము, ఖనిత్రము.

గీ. వాఁడు శల్యాసురుం డన వసుధఁ బరఁగు, శ ల్యరూపతనునికిఁ దచ్ఛలలచయము, గడ్డపాఱ లకై వడిఁ గానిపించి, పేర్చుట ఖనిత్రశలుఁ డని పేరు గలదు. కళా. ౬. ౨౭.ఆం. భా. ౨. ౨౩౦.

**గడ్డప్రొయ్యి.** వి. (గడ్డ+ప్రొయ్యి) గడ్డలలో నే ర్పఱచినప్రొయ్యి. (శ. ర, వా.)

**గడ్డము.** వి. (క. గడ్డ) ౧. చిబుకము.

గీ... చిబుకాఖ్య యలరు గడ్డ,మనఁగ గద్దువ నాఁగ...ఆం. భా. ౨. ౧౪౨.

మ...తా నొక్కచే, తన కంఠంబును గౌఁగిలిం చి యొకచేతన్ గడ్డము న్బట్టి చెక్కునఁ జె క్కానుచు నొక్కచన్మొనయురఃకోణంబు తో రాయఁగన్. కళా. ౫. ౬౧.

౨. చిబుకశ్మశ్రువు, గడ్డముమీఁదిపొడుగుపాటి వెండ్రుకలమొత్తము.

సీ...చిబుకశ్మశ్రు వడరు. గీ. గడ్డ మన... ఆం. భా. ౨. ౧౪౬.

సీ. నిగిడి పూఁకేకుబాగు గఁ గత్తిరించినగడ్డంబు కొన రొమ్ము గమ్మిరింప. నైష. ౭. ౯౩.

వ...అర్ధనారి గావునం బురుషుండు గాఁడు గడ్డం బు గలిగినకతంబున యోష గాదు ... కాశీ. ౭. ౪౭.

**గడ్డరము.** సం. వి. అ. పుం. గొఱ్ఱె.(వాచ.)

**గడ్డరిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉత్పత్తిస్థానము తెలి యక ఎడ తెగకుండ ప్రవహించునొకానొకనది.

౨. మగగొఱ్ఱె ననుసరించి పోవు ఆఁడుగొఱ్ఱె. (వాచ-మగగొఱ్ఱెలచేత ననుసరింపఁబడు ఆఁడు గొఱ్ఱె-కల్ప)

**గడ్డి.** వి. కసవు, తృణము.

సీ...గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును తృణసంజ్ఞ ... ఆం. భా. ౨. ౭౬.

జ: గడ్డిపాము, గడ్డిపిట్ట, గడ్డిబొద్దు.

**గడ్డిపాము.** వి. (√ గడ్డి.) ఒకజాతిపాము. (శ. ర)

**గడ్డిపిట్ట.** వి. (గడ్డి+పిట్ట) పక్షివిశేషము.

సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చిక ల్పనుపుముద్ద. గీ.లాదిగాఁ గలుగుపులుఁగులు ...రసిక. ౧. ౬౩. (శ.ర.పా)

**గడ్డిబొద్దు.** వి. (గడ్డి + బొద్దు) ౧. చుట్టకుదురు. (శ.ర.) ౨. కొన్ని మోపులపరిమాణము గలిగి బండిమీఁదఁ దీసికొనివచ్చెడిపెద్దగడ్డికట్ట.

గీ. గడ్డిబొద్దువలెను మేను గానిపింప, బారకట్టిలతెఱఁగున బాహు లలర, జనకయాగంబుఁ జూడవచ్చెను లలాట,సాంద్రతరరోమరేఖ యాచంద్రరేఖ. చంద్ర. వి. ౧. ౬౯.

**గడ్డు.** విశే. ౧. అధికుఁడు, ఎక్కువవాఁడు.

సీ. అలు చైనవానియి ల్లాక్రమింపఁగఁ జూచుఁ డనకు గడ్డైనఁ బాదములు పట్టు. రామలిం. ౨౬.

౨. అసాధ్యము.

ఉదా: గడ్డురోగము.

క్రి. విశే. అధికముగా, మిక్కిలి. (చూ. గడ్డులుకు)

వి. ఆధిక్యము, అతిశయము. (చూ. గడ్డుకొను)

జ: గడ్డుకొను, గడ్డులుకు.

**గడ్డుకొను.** అ. క్రి. (గడ్డు + కొను.) అతిశయించు.

వ. యాదఃపతి మేదురామృతంబుజిడ్డున గడ్డుకొని నపూషాదిత్యవదనంబున నుప్పతిల్లుత్రుళ్లిమెలుంగులు...భీమ. ౫. ౭. (శ. ర. పా.)

**గడ్డులుకు.** అ. క్రి (గడ్డు + ఉలుకు.) ౧. పైపడు, కవియు.

వ. ఆనరకంఠీరవుండు... శరాసనకళావిశేషంబున నీసు నెఱపుచుం దెఱపి గొని రథంబు వఱపించి యొఱపుపఱపున నడ్డగించుపగఱయొడ్డు గడ్డుటికి చించుకొని...రాఘవ. ర. ౧౫౨.

వ...గడ్డులుక నీక యడ్డంబుగా నొడ్డుకొనియెడు నెదిరిపిడికిలివాయం దట్టి...కళా. 3. ౨౬౬.

౨. పాఱిపోవు, తప్పుకొనిపోవు.

వ...అడ్డగించి నించినయొడ్డువలలకు నడ్డించి వెడ్డునం బడక గడ్డుటికియు మృగంబు లనేకంబులు వొలియుటయును...ఉ. హరి. ర. ౭౯.

**గణకి.** సం. వి. ఈ. స్త్రీ. గణకుని పెండ్లాము.

**గణకుఁడు.** సం. వి. అ. పుం. ౧.జోస్యుఁడు. ౨.కరణము, గ్రామపులెక్కలు వ్రాయువాఁడు.

**గణగణ.** వి. (క.త. కణకణ.) ఘంటాధ్వనికి అనుకరణము.

సీ...గణగణ మొలనూలిగంట లులియ. ప్రబంధ. ౧౨.

**గణచక్రకము.** సం. వి. అ. న. సత్పురుషులసహభోజనము.

శ్లో. ధార్మికాణాం తు సంభూయ భోజనం గణచక్రకమ్. (త్రి. ని.)

**గణదీక్షి.** సం. వి. న్. పుం. పెక్కండ్రకుఁ బురోహితుఁ డగువాఁడు. (యాజ్ఞ. ౧. ౧౬౧.)

**గణదేవతలు.** సం. వి. అ. స్త్రీ. బ. గణములుగానుండు దేవతావిశేషములు.

శ్లో. ఆదిత్యవిశ్వవసవస్తుషితా భాస్వరానిలాః, మరాజికసాధ్యాశ్చ రుద్రాశ్చ గణదేవతాః. (అమరము.)

**గణద్రవ్యము.** సం. వి అ. పుం. సాధారణద్రవ్యము, పెక్కురసొత్తు.

**గణన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎన్నిక. ౨. తలఁచుట.

**గణనము.** సం. వి. అ. న. ౧. ఎన్నిక, లెక్కపెట్టుట. ౨. భావించుట, తలఁచుట.

**గణనీయము.** సం. విశే. (అ. ఆ. అ) గణింపఁదగినది.

**గణపతి.** సం. వి. ఇ. పుం. వినాయకుఁడు.

**గణపూర్వుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గ్రామణి, గణమునందు ముఖ్యుఁడు.

**గణము.** సం. వి. అ. పుం. ౧. సమూహము. ౨. ప్ర

మధులసమూహము. 3. సేనావిశేషము. (ఇర్వదే డుురథములు అన్ని ఏనుఁగులు ఎనుబదియొక్కగు ఱ్ఱము నూటముప్పదియేవురు కాల్వురును గలసేన.) ౪. (ఛంద)మగణము, మొ. ౫. (వ్యాక) ఒక్క సూత్రముక్రింద వచ్చుపదాది. ౬. శబ్దము, ధ్వని. (శే. ని)

గణయత్. సం. శత్రు. గణించుచున్న.

గణయితవ్యము. సం=గణనీయము.

గణరాత్రము. సం. వి. అ. న. పెక్కురాత్రులసమూహము.

గణరూపము. సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు.

గణవృత్తము. సం. వి. అ. న. గణబద్ధ మగువృత్తము. (శార్దూలాది. వ్యతి.మాత్రావృత్తము.)

గణహాసము. సం. విశ. (అ. ఆ. అ) పెక్కురను పరిహసించునది. వి. అ. పుం. చోర మనుగంధద్రవ్యముచెట్టు.

గణాచారి. సం. వి. న్. పుం. సివమెక్కి గంతులు వేయువాఁడు. (ఇది తెలుఁగున నే కలదు.) (వేశ్యామాతృవర్ణనము) సీ. తా నున్న శ్రేణి కంతటికి గణాచారి పెక్కు సుద్దులు ప్రోయు పెద్దబేరి. శుక. 3. ౧౮౯.

గణాధిపుఁడు. సం. వి. అ. పుం. ౧.వినాయకుఁడు. ౨.శివుఁడు. 3. ఒకసమూహమునకు ముఖ్యుఁ డైనవాఁడు, గామిడి.

గణాన్నము. సం. వి. అ. న. ౧. పెక్కండ్రకొఱకు వండినయన్నము. ౨. పెక్కండ్రసాత్తయినయన్నము.

గణి. సం. వి.ఇ.స్త్రీ.గణనము, లెక్కించుట. పుం.సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు. (నై.ని.)

గణి(యి)ంచు. సం. స. క్రి. ౧. లెక్కపెట్టు. సీ... భూరజోంబుధిజలపరమాణుగణము. గీ. నైన గణియింపఁగా వచ్చుఁ గాని వినుము, తత్కృతయుగంబులోపలిదైత్యమథన,కృతచరిత్రంబు లన్నియు నెన్న రాదు, వనజభవునకు శతకోటివత్సరముల. వరాహ. ౫.౪౬.

౨. ఎంచు, ఆలోచించు.

శా. దారస్వీకృతియు న్దయాభిరతియుఁ... దీనదా, సీరాజీసుతబాంధవాతురజనశ్రేణీసమృద్ధాన్నస,త్కారోదారతయు న్గణింప గృహికి న్ధర్మంబు లుద్యన్మతిన్. మార్క. 3. ౧౪౫.

3. లక్ష్యపెట్టు, పాటించు.

చ. వరద నిరీహయోగిజనవర్గసుపూజిత నీపదాబ్జముల్, నిరతము నంతరంగమున నిల్పి భవత్పదనుగ్రహాదిక,స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢు లవిద్యులు మున్నమంగళా,పరణుఁ డటంచుఁ బల్కిన భవన్మతి నే గణియింప నచ్యుతా. భాగ. ౪. ౧౬౫.

౪. స్తుతించు, పొగడు.

మంజులగతిరగడ. నైమిశపుణ్యవనంబునఁ బొందినహరికిని మంగళహారతు లెత్తుచుఁ, దనరుహరిక్షేత్రంబున నెలకొనుసాలగ్రామస్వామి గణింపుదు. హంస. ౪. ౨౧3.

౫. చూచు.

ఉ. ఎక్కడఁ జూచినన్ జనమదేభతురంగమనోజ్ఞరావ మే,దిక్కునఁ జూచినన్ మదవతీమృదుగానజతానమాన మే, చక్కి గణించినన్ వివిధచామరకేతనభూషణద్యుతుల్, మిక్కిలి వింతచంద మయి మెచ్చొనరించె మహాద్భుతంబుగన్. ఇందు. ౫. ౬౮.

౬. ఉగ్గడించు, చెప్పు.

క. ఐన జను లాడుకొనియెడి,నానోక్తులు వినఁ దలంచి నన్నడిగిన మీ,యానకు వెఱచి గణించెన,భానుకులాధీశ వినుము పౌరులపలుకుల్. ఉ. రా. ౬. ౧౯౯.

చ. కినియమి సంగవర్జన మకించనభావము దార్ఢ్మి విప్రవా,సనము ప్రశాంతి యార్జవము శౌచ

ము సద్ర్వతనిష్ఠ భైక్షభో,జన మిల నిద్ర నేఁ
త కృప సంతతతత్త్వవిచింతనంబు మా,నిని
యతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను
జెప్పితిన్. భార. అను. ౫. ౧౮. భాగ. ౧౦
పూ. ౩౩౪.

**గణిక.** సం. వి. అ. స్త్రీ. ౧. వారాంగన, వేశ్య. ౨. ఆఁడేనుఁగు. ౩. అడవిమొల్లకీ. ౪. నెల్లికీ.

**గణికారిక.** సం. వి. అ. స్త్రీ. నెల్లికీ.

**గణితము.** సం. విశ. (అ. ఆ. అ.) గణింపఁబడినది. వి. అ. న. ౧. గణించుట. ౨. లెక్క. ౩. గణితశాస్త్రము.

**గణితి.** సం. విశ. (న్. నీ. న్) ౧. గణించినవాఁడు, గణన చేసినవాఁడు. ౨. గణితశాస్త్రజ్ఞుఁడు.

**గణుతి.** వి. (సం. గణితమ్) ౧. ఎన్నిక, లెక్క.

(సంతవర్ణనము) సీ. పెనుఁగోలుకాండ్రకు జనస
మూహంబులగణుతి చూపెడునాయకప్రభుం
డు. హంస. ౨. ౪౭.

౨. నుతి, స్తోత్రము.

క. గురుదేయాధికనిస్పృహ,ధరణీసురుఁ డర్థికా
మితధనాధికదా,యి రఘువు సాకేతజనో,
త్కరముల కయ్యిరువు రైరి గణుతి ఘటింపన్. రఘు. ౩. ౯౦.

శ్లో. జనస్య సాకేతనివాసినస్తౌ,ద్వావప్యభూతా
మభినంద్యసత్త్వౌ, గురుప్రదేయాధికనిస్పృ
హోర్థీ,నృపోర్థికామాదధికప్రదశ్చ.సం.రఘు.
౫. ౩౧.

౩. లక్ష్యము, లెక్క.

(అశ్వవర్ణనము) సీ. కసవుమోపరి గాలి గణుతియే
మా కంచు నగినట్ల వదనఫేనముల రాల్చు. శ
శాం. ౨. ౨౫.

జః గణుతించు.

**గణుతించు.** స. క్రి. (√ గణుతి) ౧. ఎంచు, భావించు.

క. యాగంబునందు శ్రద్ధా,యోగము గలయశుచి
శ్రద్ధ యొనరనిశుచి పు,ణ్యాగమసంపదఁ దు
ల్యులు,గా గణుతించిరి నిరూపకత నమరవ
రుల్. భార. శాం. ౫. ౨౪౭.

శ్లో.శుచేర శ్రద్దధానస్య శ్రద్దధానస్యచాశుచేః,దే
వా విత్తమమన్యంత సదృశం యజ్ఞకర్మణి.సం.
భార. శాం. ౨౭౦. ౧౦.

౨. లెక్కించు.

క. గుణనిధి యగుప్రహ్లాదుని,గుణము లనేకములు
గలవు గురుకాలమునన్, గణుతింప నశక్యం
బులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.
భాగ. ౭. ౧౨౦.

౩. లక్ష్యపెట్టు, సరకుసేయు.

ఉ. దిగ్గన లేచిపోయె గణుతింపక వాఁడు విరో
ధులబ్ధిక్కై,యగ్గలికంబునన్ మనల నందఱఁ జీరి
కిఁ జేకొనండు...నిర్వ. ౩. ౧౧౫.

౪. స్తుతించు, కొనియాడు.

సీ. గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధపరిశోక్షి
తస్థాణు భట్టబాణు. భీమ. ౧. ౭.

**గణె(ణియ)ము.** వి. వేషధారులు ధరించెడిలక్క సొమ్ము. (చి. ని, శ. ర.)

**గణేయము.** సం=గణనీయము. సం. నైష. ౩.౪౦.

**గణేరుక.** సం. వి. అ. స్త్రీ. ౧.కుంటెనకత్తె. ౨.పని కత్తె.

**గణేరువు.** సం. వి. ఉ. పుం. కర్ణికారముకీ. స్త్రీ.౧. వేశ్య. ౨. ఆఁడేనుఁగు.

**గణేశభూషణము.** సం. వి. అ. న. సిందూరము.

**గణోత్సాహము.** సం. వి. అ. పుం-సజాతీయములగుంపుతోఁ గూడి తిరుగుటయం దుత్సాహము గలది-ఖడ్గమృగము.

**గణ్యమానము.** సం. విశ. (అ. ఆ. అ.) గణింపఁబడుచున్నది.

**గణ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సంఖ్యేయము, లెక్కింపఁ దగినది. ౨. లెక్క సేయఁ దగినది, లక్ష్యము సేయఁ దగినది. ౩. గణములోఁ జేరినది.

**గతపడు.** మి. అ. క్రి. (గతము + పడు) ౧.కడచు. (శ. ర) ౨. చచ్చు.

ద్వి. హతశేషు లగు రాక్షసావళి సెబ్బు, గతపడ్డయ మ్మహాకాయునిఁ దలఁచి. రం. రా. యు. ౩౭౮ పా. ౨౧ పం.

**గతభర్తృక.** సం. వి. ఆ. స్త్రీ. విధవ.

**గతము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పోయినది. ౨. కడచినది, గతించినది. ౩. చచ్చినది, నశించినది. ౪. ప్రాప్తము, పొందినది, చెందినది. ౫. జ్ఞాతము, తెలియఁబడినది, గ్రహింపఁబడినది. వి. అ. న. ౧. పోవుట. ౨. గతి, నడక. ౩. ప్రకారము, విధము. (కే. ని)

**గతసన్నకము.** సం. వి. అ. పుం. మద ముడిగినయేనుఁగు.

**గతాగతము.** సం. వి. అ. న. రాకపోకలు.

**గతానుగతము.** సం. వి. అ. న. ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించుట.

**గతానుగతికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించువాఁడు.

శ్లో. తామేవానుగతా గతానుగతికాస్త్యక్తానురాగాః ప్రజాః. ముద్రా. ౬. ౫.

**గతాయువు.** సం. విణ. (స్) ౧. మృతుఁడు. ౨. వయసు గడచినవాఁడు, వృద్ధు.

**గతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గమనము, పోక. ౨. నడక. ౩. త్రోవ. ౪. ఉపాయము. ౫. ఎఱుక, జ్ఞానము. ౬. స్థానము. ౭. నాడీవ్రణ మార్గము, నారి పుంటికంటిత్రోవ. (మే. ని, వి. ని.) ౮. ప్రమాణము.

శ్లో...మృగః క్షతః క్షణా, దనేన పూర్వం న మయేతి కా గతిః. సం. కిరా. ౧౪. ౧౫. (కా గతిః=కిం ప్రమాణమ్. మల్లి. వ్యా.)

౯. స్వరూపము.

శ్లో...న వయం నిరూపయితుమస్య గతిమ్. సం. కిరా. ౬. ౩౬. (గతిం=స్వరూపమ్. మల్లి. వ్యా.)

౧౦. విషయము.

శ్లో...మనోరథానామగతిర్న విద్యతే. సం. కు. సం. ౫. ౨౪. (అగతిః=అవిషయః. మల్లి. వ్యా.)

౧౧. పరిణామము.

శ్లో. దురధిగమా హి గతిః ప్రయోజనానామ్. సం. కిరా. ౧౦. ౪౦. (గతిః=పరిణతిః. మల్లి. వ్యా)

౧౨. శరణము, దిక్కు.

గీ...అందఱకు నీవ గతి గాక యన్యుఁ డొకఁడు, నీకు గతి యౌనె సకలలోకైకనాథ. దశా. ౧. ౧౬౧, ౧౫౯.

౧౩. వలె; విధము, రీతి.

ద్వి. ఎన్నిక కెక్కి యారేడులోకముల, వెన్నెల గతిఁ గీర్తి వెలిఁగించె ... ద్వి. హరిశ్చం. పూ. ౧౫౨ పం.

సీ. చంద్రమతీనాథుచందాన నలుని వైఖరిఁ బురుకుత్సునిగతిఁ బురూరవుని మాడ్కి ... శుక. ౧. ౧౦.

గీ...వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము, గైకొన వలయుఁ గాక...భార. విరా. ౫. ౨౭౫.

**గతించు.** సం. అ. క్రి. ౧. కడచు.

చ. వినయవిశేషహృద్య లగువిద్యలు నేర్చుట లేదు నీతిచే, ధనమును గూర్ప లేదు తలిదండ్రులసేవయుఁ జేయలేదు ...... గ్రొబ్బున సమయంబు కాకులకుఁబోలె గతించెఁ బరాన్నభుక్తులకా. భర్తృ. వైరా. ౪౭.

౨. చచ్చు. (శ. ర, వా)

**గతిగొను.** మి. అ. క్రి. (గతి + కొను) ఏకగతి కలది యగు.

క. కలికివదుమదనకదనపుఁ,బలుపులకలకలము జె
డఁగువడు మేఖలము,వ్యాలరవళిఁ దగిలి గతిగొ
నఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గని
యెన్. భాగ. ౬. ౯౯.

**గతిపడు.** వి. అ. క్రి. (గతి + పడు) లభించు.

క....వానితలఁ ద్రెంచి సము,త్కటముగ వనల
ములో నొక్కట వైవుము సిద్ధు లెల్ల గతిప
డు నీకున్. ద్వా. ౧౨. ౬౫.

**గతిల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వరుస, పరంపర. ౨. ఏ
ఱు, నది. 3 వేత్రలత, పేము ?.

**గతుకు**[1]=కతుకు స. క్రి. (కుక్క మొదలగునవి )
కొంచెముకొంచెముగాఁ దిను; నాలుకతో కొం
చెముకొంచెముగాఁ ద్రాగు.

క. ప్రతిగృహము నెపుడుఁ దిరుగుచు, నతిశయ
మున భుక్తశేష మాతురమతినై, గతుకుచు
వీథుల నుండుచుఁ, గతిపయసంవత్సరములు గ
డపితి నచటన్. బ్రహ్మో. ౨. ౧౨౮.

(వ్యవ) కుక్క గంజి గతికినది.

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గతుకు**[2]. వి. గొయ్యి. (బ్రా, చి. ని.)

(వ్యవ) చీకటిలోఁ బోవుటచే గతుకులలోఁ బడి
నాఁడు.

**గత్త(ము).** వి. ఎరువు. (బ్రా, శ. ర.)

**గత్తర.** వి. ౧. క్రమము లేక కలిసిపోయి యుండు
ట. (బ్రా) ౨. ఉపద్రవము. (శ. ర)

**గత్తు.** వి. మూత్రగంధము. (శ. ర.)

**గత్వరము.** సం. విశే. (అ. ఈ. అ) ౧. పోవునది.
౨. నశించునది, నశ్వరము. 3. కదమునది.

**గద.** సం. వి. ఆ. స్త్రీ. గుదియ, దుడ్డువలె నుండు
ఆయుధవిశేషము.

**గదమాయించే.** స. క్రి. గద్దించు. (శ. ర.)

**గదము.** సం. వి. అ. పుం. ౧. తెవులు, రోగము.
౨. కుష్ఠము. న. విషభేదము. (వాచ)

**గదయిత్నువు.** సం. విశే. (ఉ) ౧. వాచాలుఁడు,
వదరుపోతు. ౨. కాముకుఁడు. వి. ఉ. పుం. కా
ముఁడు, మన్మథుఁడు.

**గదాంబరము.** సం. వి. అ. పుం. మేఘము. (త్రి. ని.)

**గదాగ్రజుఁడు.** సం. వి. అ. పుం-గదునియన్న-
విష్ణువు.

**గదాధరుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨.
ఒకతర్కగ్రంథకర్త.

**గది.** వి. ఇంటిలోపలియఱ. (శ. ర.)

(వ్యవ) నిన్న నేను మా మేడగదిలో పరుంటిని.

**గది.** సం. విశే. (న్. నీ. న్) ౧. గదను ధరించిన
వాఁడు. ౨. రోగి, తెవులు గలవాఁడు.

**గదితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. చెప్పఁబడి
నది. ౨. రోగము కలది.

**గదుకు**=కతుకు.

(కుక్క మొదలగునవి కొంచెముకొంచెముగాఁ
దిను; కొంచెముకొంచెముగా గ్రహించు.)

చ. కదిసిన నోరవోయి యొఱకబ్బపుదొంతులన
త్పదార్థముల్, గదుకుచు నెట్టివారిఁ బొడగ
న్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్, మఱికి నస
హ్యమై శునకమార్గమునం జరియించుచున్న
దుష్పదకవు లెల్ల మత్కవితఁ బట్టక దప్పు
లు విండ్రు గావుతన్. వాసిష్ఠ. ౧. ౭. (పైరెం
డర్థములకును ఇది యుదాహరణము)

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గదుము.** స. క్రి. అదలించు, గద్దించు.

సీ. అదలించె గద్దించె నడలించె ననఁగను గదిమె
నం చనుమాటగాఁ జెలంగు. ఆం. భా. 3.
౧౨౮.

సీ. కాలుపుల్ దిని యాము గవిసి మనోబ్బతులు కా
రుపోతులనైన గదుముఁ జూచు. సారంగ. ౧.
౬౯.

చ...నిన్న నే, కద నినుఁ బట్ట మఱ్వరకుఁ గట్టెద నన్న ది యందు కింతి దక్, గదిమికొనం దలం కినది కన్న ది విన్న ది గాని దేమి చెప్పదు ...చం. రా. ౪. ౪౧.

**గదురు.** వి. (క. గదరు) దుర్గంధము, దుర్వాసన.

సీ. పులితోళ్లపై నాఱఁబోసినరక్తార్ద్రకరిశిరోము క్తాళిగదురుకంపు. చంద్ర. ౫. ౧౨౧.

చ. మదమున సోమకాసురుఁడు మ్రుచ్చిలి యచ్చ లమారఁ గొన్నప్రాఁ, జదువులు తెచ్చి తజ్జఠర సాంద్రతరాంత్రము లంట నంటఁబల్, గదు రు దొలంగఁ గీర్తియనుగంగఁ దొలంచి ... పాండు. ౨.౫౬.

విణ. విస్రము, పచ్చివాసన గలది.

ఆ...గదురు నాఁగ నగును విస్రాఖ్యయై.ఆం.భా. ౧. ౧౦౭.

సీ. జాగువాపైతాణిసాలుఁ దూలఁగఁ జేసి గదు రుతోల్కటిసీమఁ గదురుకొనియె. ఘటికా. ౧. ౧౫౩.

**గద్గదము.** సం. విణ. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడిన ది. (స్వరము.)

**గద్గదస్వరము.** సం. వి. అ. పుం. ౧. డగ్గుత్తికపడి నయెలుఁగు. ౨. ఎనుపోతు.

**గద్గదిక.** సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.

**గద్గదితము.** సం. విణ.(అ.ఆ.అ.)గద్గదస్వరముగలది.

**గద్ద=గ్రద్ద.** వి. పక్షివిశేషము, గృధ్రము. (చి. ని, శ. ర, వా.)

జ: గద్దగోరు, గద్దముక్కువాఁడు.

**గద్దగోరు.** వి. ఔ. (√గద్ద.) ౧. గద్దయొక్క గోరు. ౨.ఒకానొకచెట్టు. (దీనియాకులు గద్దగో రువలె నుండును.)

వ...ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి ... మొదలుగఁ బెక్కుతెఱంగుల వ్రాఁకులు...పి. శకుం. ౨. ౧౪.

౩. చోరసాధనవిశేషము.(ఇది గద్దగోరువలె నుం డును)

గీ. కావు మలుబంతి సికమల్లు గద్దగోరు... తో లునిచ్చెన మొదలు ముందుగ ధరించి. ప్రబం ధ. ౭౫౯.

సీ. భవనదీపాహితభ్రమరశ్వేటిక వాలుకాభస్త్రి తలమల్లు గద్దగోళ్లు... గీ... ఎట్టినికన్న ల మర, దూరితత్రాసుఁ డపు డొక్కడొంగబం టు. వేం. పంచ. ౩.౧౯౯.పరమ.౪.౧౨౪.

౪. ఒకవిధ మగుగొండ్లెము. ( ఇది గద్దగోరువలె నుండును-వా.)

**గద్దన.** వి. గద్దింపు.

సీ...గద్దింపు వెలయుచు గద్దన యన. ఆం. భా. ౩. ౩౦.

**గద్దముక్కువాఁడు.** విణ. (గద్ద+ముక్కు+వాఁ డు)-గద్దముక్కువంటిముక్కు గలవాఁడు-ఖరణ సుఁడు, వాఁడిముక్కు గలవాఁడు. (శ. ర.)

**గద్దఱి.** విణ. ౧. నేర్పరి, నిపుణుఁడు.

చ. కరితురగాధిరోహముల గద్దఱులై విలువిద్దె లందు నేర్పరు లయి ... చం. రా. ౨. ౫౨.

౨. ఉద్ధతము, పొగరు గలది; పొగరు గలవాఁడు.

చ...గద్దఱిపంది నొకండు వెన్ను చే,యదరక ముప్పిడిం బొడిచి యంటఁగఁ బట్టుచుఁ గో ఱఁ గొట్టినక్, మెఱుఁగ నీక తెచ్చినను మె చ్చు లొసంగెను రాజు వానికిక్. యయా. ౨. ౧౧.

శా... ఇన్లైంతే గద్దఱినై గురుం దొలఁగి పోసీ వు...పరమ. ౫. ౩౬౩.

౩. దుష్టుఁడు; దుష్టము.

ఉ...తద్గృహసీమ వసింపనీయ దీ,గద్దఱి గ్రద్ద చేరి కలకాలము పోరెడిఁ బోరు మాన్పవే.ఉ. రా. ౭. ౨౩౦.

చ...చొక్కట మగు నేపువాని కొకగద్దఱిజా డలచేడెఁ గూరుచుం, గటకట తమ్మిచూలికో

అగాములు బొములు గాఁ దలంచెదన్. నీలా. ౧. ౧౧౦.

క. ముద్దులపట్టివి నీ కీ, గద్దతిచందములు మెలఁగఁ గా రాదు సుమీ. నీలా. ౨. ౧౦౫.

౪. సాంద్రము, దట్టమైనది.

చ... అ, యత మగుచక్రవాళగిరియంపలిగద్దతి యంధకారమున్, సితనిజకీర్తిచంద్రికలచేత నతం డడఁగించు చుండఁగన్. సీమం. ౧. ౧౬౦. అప్ప. ౨. ౧౯౭.

జ: గద్దతించు, గద్దతికాఁడు, గద్దతితనము.

**గద్దతించే.** అ. క్రి. (√ గద్దతి. క. గద్దతిసు, గద్రిసు) గర్జించు.

(ఆదివరాహవర్ణనము) సీ. కఠినవాలము బెట్టు గాలించి యొకచోట: గడిమిమై రొప్పుచు గద్దతించు. హ. వరాహ. 3. ౪.

**గద్దతికాఁడు.** విశ. (గద్దతి + కాఁడు - స్వార్థమున) గద్దతితనము గలవాఁడు, ధీరుఁడు.

ఉ... ఇట్టిబల్లిద్దతికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమి వింత... అచ్చ. రా. సుం. ౧౨.

**గద్దతితనము.** వి. (√ గద్దతి) ధైర్యము.

క. పెద్దపులి వెడలి చనె ననిగద్దతితనమునను నక్కకదుపులు పొదలో, నుద్దవిడిఁ జొచ్చి చిఱుతల, యొద్దం బడినట్టు లయ్యె నోయనుశేంద్రా. దశా. ౪. ౪౦.

**గద్దించే=గద్దతించే.** స. క్రి. అదలించు, బెదరించు.

ద్వి. ఎవ్వఁడు నావారి నెల్ల గద్దించి, చివ్వకు నా మీఁదఁ జేచాఁచు... ప్రభులిం. 3. ౧౫ పొ. ౨౪ పం.

సీ. గవి నున్న పులిఁ గన్నఁ గదిసి గద్దించి గొబ్బన నీడ్చి తే నోపుప్రోడ నేను. ఉ. రా. ౭. ౪౦౪.

సీ. అదలించె గద్దించె నడలించె ననఁగను గదిమెనం చనుమాటగాఁ దెలంగు. ఆం. భా. 3. ౧౨౪.

జ: గద్దింపు.

**గద్దింపు.** వి. (√ గద్దించే.) అదలింపు.

గీ. అతనిగద్దింపులకు భయము మాను నాస. కుసు. ౨. ౬౯.

సీ... గద్దింపు వెలయుచు గద్దన యవ. ఆం. భా. 3. 3౦.

**గద్దిగ.** వి. గద్దియపైఁ బఱచుకంబళి, గద్దెకంబళి.

సీ. బటువుగద్దియలపైఁ బట్టుగద్దిగలీతి జనునదేశముల హిజాయు లమర. కుసు. ౧. ౭౬.

గీ... సొగసులిద్దంపుఁబట్టుగద్దిగ వసించి. కుసు. ౨. ౭.

(ఈపద మీ గ్రంథముననే కానిపించుచున్నది.)

**గద్దియ**[1] **(ద్దె).** వి. (సం. ఖట్టికా.) ౧. సింహాసనము.

గీ. క్షత్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియ నిడి, పట్టబద్ధుఁ గావింపుచుపో... హరి. పూ. ౧. ౧౦3.

సీ. ఉచితంబు లగుషోడశోపచారంబుల నాగద్దె కతిభక్తి నాచరించి. విక్ర. ౨. ౯౫.

క... మను, న్యాయపుఁడు నిల్పె సుమన, స్సాయకు సరిగద్దెమీఁద సౌహార్దమునన్. పార. 3. ౪౦.

౨. పీఠము, పీఁట.

గీ... పీఠంబు దనరుచుండు, గద్దె గద్దియ పీట నాఁగను... ఆం. భా. ౨. ౧౬౫.

3. పువ్వులలో నుండెడిమిద్దె, దుద్దు.

గీ. తమ్మిగద్దియదాకట గ్రమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి. వసు. ౨. 3౨.

౪. సోద. (బ్రా, శ. ర-సోదచెప్పెడిచోటు. వా.)

గద్దెకంబడి=గద్దెమీఁద వైచుకంబళి, గద్దిగ.

ద్వి... గద్దె, కంబళ్లు కప్పడికంబళ్లు గోర్పడంబులు... పండితా. పర్వ. 3౪౬ పొ.

**గద్దియ**[2] **(ద్దె).** వి. (సం. గద్యాణమ్) బంగారునాణెము, వరహా.

సీ. పదివేల మొదవులు పదివేలగద్దెలపసిఁడియు ని
మ్మహీపతుల కిమ్ము. భార. ఆర. ౨. ౩౪౪.
(శ. ర, కరాల. ప్రతులపాఠము.)

గద్దువ. వి. (క. గద్ద) గడ్డము, చిబుకము.

సీ.మడమలు మోవంగ మైలచీరలు గట్టి కర్ణముల్
మోవంగఁ గాటుక లిడి...వెడలి గద్దువ మో
వ వీడియంబులు చేసి కాంతుఁ జెంపలు మోవ
గంద మలఁది. కవిక. ౪. ౯౪.

గీ. అమ్మ వగవకె యంచును నక్కుఁ జేర్చి, గద్దువ
ను బట్టుకొని వేఁడఁగాఁ దొడంగు. పార్వ.
౨. ౧౬౩.

గీ...చిబుకాఖ్య యలరు గడ్డమనఁగ గద్దువ నాఁ
గ...ఆం. భా. ౨. ౧౪౨.

గద్దెపొంకములు. వి. బ. పరువునకుఁ దగినగౌరవం
పుమాటలు.

సీ. కలవి లేనివి కొన్ని కొలువునఁ గూర్చుండి గ
ద్దెపొంకాల్ చెప్పఁ గలరు గాక. చంద్రా. ౩.
౪౬. (గద్దెపొంకము-శ. ర, చి. ని. పా.)

గద్యము. సం. విణ. (అ. ఆ. అ) చెప్పఁ దగినది.
వి. అ. న. వచనము. (వ్యతి. పద్యము.)

గద్యాణకము. సం=గద్యాణము.

గద్యాణము. సం. వి. అ. పుం. ౧. నలువదియెనిమి
దిగురివెందగింజలయెత్తు. ౨. వరహా, ఒకబంగారు
నాణెము.

గద్యానకము. సం=గద్యాణము. (కల్ప)

గనగన=కనకన. వి.

(తపించుట యందలియనుకరణము.)

సీ. వేసవి గనగన వేఁగుచట్రాతిపై నగ్గి నల్లడ మం
డ నర్కుఁ జూచి. నిర్వ. ౩. ౬౩.

చ. గనగన నెల్లప్రొద్దుఁ గొని కాలెడువేఁడిమిఁ
జేర్చుభర్తమే, నెనయును డగ్గఱన్ సయిఁప
కెంతయు భీతి నొదుంగుచున్...హరి.పూ.౧.
౧౬౭. (ప్రాఁత ప్రతిపా).

(కోపముచే మండిపడుటయందలియనుకరణము.)

క. అనుటయు హంసుఁడు గనగనఁ, గనలి మదిం
జెలువు విడిచి కాలువఁ బోగడం, జనునే వీ
నికి నని యిట్లను...ఉ. హరి. ౪. ౧౮౬.

(త్వరితముగా చొచ్చుటయం దగునమకరణము.)

ద్వి. గడియ గ్రక్కునఁ బుచ్చి గ జ్జనఁ దలుపు,
గడుఁ బాఱఁ దెఱచుచు గనగన ద్విజాలు, సొ
చ్చుదు నంతలో...పండితా. దీక్షా.౪౪పా.

విణ. ౧. గనగనయను కాంతిగలది. (కర్మధారయ
మున నిగాగమము.)

వ...మవ్వంపుదివ్వెలవలె నివ్వటిలుగనగననిమఁటు
లకై...ఉ. రా. ౩. ౧౯౧.

వ...మినుకుమినుకు మనుగనగననిమఁటులఘృణు
లపెంపు శంపలసొం పలరింప... సమీర. ౩.
౧౭౮.

వ...గనగనని నిప్పులన్...మనుచ.౪. ౬౦.

గనగనలాడుకుంపటి=గనగనమండునిప్పులు గల
కుంపటి. సానందో. ౨. ౬.

గనప. విణ. (√ గనము?) పెద్దని; ఎత్తైనది.
(వృత్తియందే దీనికి ప్రయోగములు కనఁబడుచు
న్నవి)

సీ. కాంచి యుదంకుండు గ్రమ్మన దిగదాఁటి వె
నుకొనునంతకు గనపపుట్టఁ, జొచ్చె నయ్యురగ
ము...భార. అశ్వ. ౩. ౧౦౫.

గీ. కావిసెలయేఱు లురిలెడుగనపకొండ,కరణి
నొందె బాణుఁడు బాహుకర్తనమున. హరి.
ఉ. ౮. ౨౧౨.

సీ. జాంబూనదచ్ఛాయచందంబువర్ణంబు గలిగిన
పలుచనిగనప మేను. భార. ఆశ్ర. ౨. ౪౦.
భార. శాం. ౪. ౪౦.

గనపర=గని మెర. వి. గన్నేరు కీ. (చూ. గనపరా
కులు)

జః గనపరాకులు.

**గనపరాకులు.** వి.బ.గన్నెరాకమ్ములయొక్క అలుఁగులు. (వావిళ్ల, వేదము. వ్యాఖ్యలు.)

గీ...గనపరాకులు నిగిడ్చి, చెప్పటట్టలు శోధించి సిగలు విప్పి. ఆము. ౬. ౭౫. (గనపరాకులు నిగిడ్చి=గోడుగుల గన్నెరాకులువెళిపించి అని వ్రాఁతప్రతివాఖ్య- 'కనపరాకులు=గన్నేరాకులవంటి అలుఁగులు.' అని బ్రౌ- ప్రయోగాంతరము కనఁబడలేదు.)

**గనము.** విశే. (సం. ఘనమ్. క. గన.) అధికము.

సీ...పెను గొప్ప బలు పేరు పెద్ద దొడ్డ, గన మన నధికాఖ్య లొనరు...సాం. ని. మాన. ౪౯.

**గనయము.** వి. ౧. పోఁకముడి, నీవి.

గీ. నాతిగనయంబు వదలింప నాథుమీఁద, నాభిపంకజగంధ మున్నతిఁ జరించె,నన జుగుప్సాభిధాశ్లీల మయ్యె నింతి,కపుడు పాక్కలిరోంపికం పర్థ మగుట. కావ్యా. ౬. ౯౧.

సీ. అనయంబుఁ దిన్ననియమనువున గనయంబు ప్రిదులంగ మెలఁగి చొక్కొదవఁజేయు. ఆ. నిక్కరంబు...భార. స్త్రీ. ౨. ౧౩౩.

౨. వింటికొప్పు.

క. గొనయంబుసెక్కఁ ద్రోచిన, గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం,బున విల్లు విడిచి వేటొక, యనిమిషభటుఁ డనికి వెడలె నడిదము గొనుచున్. పారి. ౪. ౭౧.

**గని[1].** వి. (సం. ఖనిః) ౧. ఆకరము, బంగారము మున్నగునవి పుట్టుచోటు; స్థానము.

గీ. గని యనఁగ నాకరం బగు ... ఆం. భా. ౨. ౩౨.

క. జనపదములు పురగిరులున్, గనులు వను ల్నదులు ... కనుఁగొనుచుఁ బోయి మ్రోలన్ లీలన్. హంస. ౫. ౩౪౭.

గీ. ...అధికశుభంబులకు భ,వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ. భార. శల్య. ౨. ౩౩౯.

మ...పచ్చనివిల్కానికి మామ చల్వగని పశ్యత్ఫాలజూటాగ్రమో,హనరత్నంబు సుధాకరుండు...పారి. ౪. ౪౭.

౨. బిలము, రంధ్రము.

చ. అనవుడు నిప్పుగోత్తమమునందు మహాబిలము ప్పుచుండు దా,నను గుహ యొక్క టెప్పుడును నవ్యముగాఁ గనుపట్టు నందులో, న నుపమ మైనగుండు గలదందును నేడు బిలంబు లుండు న,గ్గనులఁ జరించుఁ దుష్టదలకైవడి నెప్పుడు వానిప్రాణముల్. మై. ౩. ౧౨౧.

**గని[2].** వి. (సం. ఘనమ్.) గడ్డ, ముద్ద. (చూ. గనికట్టు)

జ: గనికట్టు.

**గనికట్టు.** అ. క్రి. (గని[2] + కట్టు) ఘనీభవించు, గడ్డకట్టు.

వ...సేవంతిపూఁబొదలచినుకున ననఘహిమసలిలములు ... కస్తూరిమెకంబులమదభరంబులం దొరఁగు నాభీరక్తంబు లిగిరి గనికట్టిన నిగరములు గరఁచికొని పఱచి...వసు. ౨. ౧౧.

**గనికెకుండలు.** వి. బ. బాల్యక్రీడావిశేషము.

సీ...చొప్ప బెండ్లమంచంబులు గంగెద్దులాటలు గనికెకుండ,లు...హంస. ౩. ౧౪౬.
(ప్రయోగాంతరము లేదు-గరగకుండలు?)

**గనిమ.** వి. (పాదు మడి మున్నగువాని) గట్టు, సేతువిశేషము.

క. మహనీయమఘుఘుకీసం, గ్రహమునఁ గాలువలు వఱపి గనిమలుగ రజం,బహరహము సెఱపి మాపు,న్సహకారము లయ్యె నవటిసహకారంబుల్. వసు. ౧. ౧౩౫. ఆం. భా. ౨. ౫.

మ. గనిమల్ దీఱిచి కాల్వలేర్పఱిచి ... బహు. ౨. ౨౦.

సీ. ఆడునుదుక్కలను మళ్లెడలఁగాఁ బొలిలదును పై నగనిమలు నటికి నటికి, పైరుమునుఁగ గాద.

బలిసినచేలలోఁ దెరలక కలుపులుతీసితీసి. ఉ.
హరిశ్చ. ౪. ౧౩.

గనిమెర=గనపర. వి. గన్నేరు ౹.

ద్వి. గనిమెరపూఁజాయ గలుపసీర్కా వి, గనుప
ట్టుశాటి మీఁగాళ్లతో నొరయ. ద్వి. పరమ.
౪. ౫౬౭ పా. ౧౧ పం. (చి. ని. పా.)

గనియ(నె). వి. (సం. కణికా) ఖండము, ముక్క.
సీ. గనెగంద్ర గంద్రిక గనియ యటంచన ని
ష్ట్వాదిఖండంబు లెన్నఁ దగును. ఆం. భా.
౨. ౭౫.

గీ... మేని, గనియ లన్నియు సంధానకరణి నది
కి. భా. రా. యు. ౧౧౨౦.

సీ... తనుపాపరసదాడిగనెలతోడ. ఆము. ౨.
౭౩.

ద్వి... సభవారు నట్టిదురాత్మ... గనెలుగాఁ జే
తులుఁ గాళ్లుఁ గోయింపఁ, జను నని...నవ.
౨. ౯౨ పా. ౧౩ పం.

గనివోటు. వి. (క. కణి=రాయి. త. కణె) ఆనవా
లుకై వ్రాళ్లమీఁద వరుసగా వేయు పోటు ?.

ద్వి... ఉలు లోలి నాటి, పసలు మించఁగ సూ
త్రపట్టినపగిది, విసుపక గనివోటు వేయువా
రలును ... అనిమిషశిల్పి, గని యోటువడు
చుండ గనివోటు నైవ. ద్వి. పరమ. ౭.౫౧౫
పా.

గనివోటుకొట్టు=గనివోటుపడునట్లు కొట్టు ?.

సీ. ఎప్పుడు చూచిన నెడపక ఖంగుఖం గనును
క్కుటులులమహాస్వనంబు, బెడిదంపుటడ్డీలు
బిగియించి గనివోటు కొండ గొట్టెడుకట్టు
గుండ్లరవము. పరమ. ౫. ౪౦.

గనీబు. వి. ఒఱ, ఖడ్గకోశము.

చ. కలకల నవ్వుచున్న ప్రపశిఖామణి పహొన్నగ
నీబులోనియిుట్టలపు మెఱుంగుఁ బాయలబెడం
గుఁగటారి జకీన దూసి మంత్రులు గన తూ
ద్రుమస్తము కలుక్కునఁ ద్రుంచె...ఉ.రా.
౭. ౨౧౧.

గనుపు=కనుపు. వి. వెదురు చెఱకు లోనగువానియం
దు ఎడనెడ నుండుముడి, పర్వము.

సీ... కన్ను కనుపు గంటు గను పంచనఁగఁ బ
ర్వమునుకు...ఆం. భా. ౨. ౭౪.

గన్నెర=గన్నేరు.

రగడ. తలిరుఁబోఁడి నీతలఁపునఁ గన్నెఱ,పలుకు
తేనెలకు వంపకు గన్నెర.రాజ.చ.౨.౧౪౯.

సీ. గొజ్జంగి యిజ్జాజిపజ్జం గిసల మొందునెలకక
స్తురియు గన్నెరయుఁ బూచె.బహు. ౨.౨౧.

గన్నెరాకమ్ము. వి (గన్నెరు+ఆకు+అమ్ము)-గన్నే
రాకువంటియలుఁగు గలబాణము-బాణవిశేషము.

వ... ఆట్లు తాఁకుటయు వారల నతండు గన్నె
రాకమ్ములఁ జీకాకుపఱిచె...భార. భీష్మ.౩.
౨౯౯.

గీ. పసిఁడిపీఠంబుపై నుంచి పద్మనయనఁ, జెలువ
మగు గన్నెరాకమ్ము నేతికిచ్చి. నైష.౬.౩౭.

గన్నెరు=గన్నేరు.

(గన్నేరుపువ్వు)

సుగంధి. చాలుఁ జాలు నెంత కైనఁ జాలు నున్న
గన్నెరుల్. యయా. ౪. ౨౦.

ఉ. కన్నియ యెన్నియేండ్లు విరిగన్నెరులక్ హ
రుఁ బూజనేసిరో...రా. వి. ౪. ౨౩.

(గన్నేరుచెట్టు.)

సీ...కరవీర మలరును గన్నే రనంగను గన్నెర
నఁగ. ఆం. భా. ౨. ౫౩.

(బ. ధాన్యవిశేషము.) వేంక. మాన.౭౬.

గన్నేరు=గన్నెర, గన్నెరు. వి. కరవీరము ౹.

సీ. గన్నేరుఁబూఁజాయఁ గనుపట్టుజిలుఁగైనసలి
లకాషాయవస్త్రంబు గట్టి. నైష. ౮. ౧౦౩.
ఆం. భా. ౨ ౫౩.

(బ) ధాన్యవిశేషము. సాం. ని. మాన. ౫౭.

గప్పళించే. అ. క్రి. ఇనుకు.

సీ. ఇవి పొత్తి సొలసినమృగనాభిమృగినెత్తురులు గప్పళించినకెలవు లయ్యె. రా. వి. ౩. ౫౩. (ప్రయోగాంతరము లేదు)

గప్పాలు. వి.బ.(హిం. గప్) జంభాలు, అతిశయపు మాటలు. (శ. ర.)

గప్పు=గుప్పు[2]. వి. వాసనగొట్టుటయందలియనుకరణము. (ఆమ్రేడితరూపము-గప్పుగప్పు.)

(వ్యవ) వాఁడు రాఁగానే అత్తరువాసన గప్పుమని కొట్టుచున్నది.

రగడ. కప్పురంపుటనంటు లివిగో గప్పుగప్పునఁ దావిఁజిల్కెడు. కిరా. ౩. ౨౦.

గప్పున=గుప్పున. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా; అకస్మాత్తుగా.

సీ. పటచిత్రితాకారపతిరేఖ కనుడాయ విప్పుకొప్పులచేత నప్పళించె, నప్పళింపఁగనీక గప్పునఁ గనుదోయి నలమి పైఁబడ లజ్జ యడ్డకట్టె. చంద్రా. ౫. ౨౭.

(గుబ్బలు) ఉ. గప్పున వ్రాలఁగాఁ దివురుకైవడి నుబ్బున నిబ్బరింపుచుఁ. చంద్రా. ౬. ౧౯౨.

సీ. చెలులు సిబ్బెంపుగుబ్బలఁ జిల్కుపన్నీట నెగసి గప్పునఁ గప్పి నిగుడుపొగలు. చంద్రా. ౪. ౨౨.

గబగబ=గవగవ. (బ్రౌ.)

(వ్యవ) వాఁడు గబగబ పరుగెత్తుకొని వచ్చినాఁడు.వాఁడు గబగబ ఉత్తరము చదివినాఁడు. వాఁడు గబగబ పని చేసినాఁడు.

గబీలు. వి. గ్రుద్దుట నీళ్లలో నుఱుకుట మండుట కలఁత నొందుట మున్నగువానియందలి యనుకరణము.

(వ్యవ) వాఁడు గబీలున నొకగ్రుద్దు గ్రుద్దెను. వాఁడు నూతిలో గబీలున ఉఱికినాఁడు.

ఆయడవి గబీలున మండుచున్నది. (శ. ర.)

కడుపులో గబీలు మనుచున్నది.

క...అతనిఁ గనినంతనె నా, డెందము గబీలు ప... నియెఁ...అహ. ౩. ౮.

గబుక్కున=గవుకున.

(వ్యవ) వాఁడు గబుక్కున నూతిలో దూఁ... నాఁడు.

గబుసు. వి. కపటము.

సీ ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గౌరు, గబుసు కైపు కిటుకు కాదు డబ్బు కవుదు డం ఒక... గ...ఆం. భా. ౧. ౧౩౭.

గబ్బాటు[1]. వి. కలఁత. (శ. ర.)

గబ్బాటు[2]. విణ. నెల తక్కువైనది.(పసుపు కంద చేమ గెనసు పెండలము మున్నగువస్తువు-శ.ర.)

గబ్బి. విణ. (గబ్బు+ఇ-క. గబ్బి) గర్వి; దుష్టుఁడు.

సీ...రాచ,బిడ్డయై యుండి గబ్బితనం బెఱుఁగఁ... డు...ఉ. హరి. ౫. ౨౭౭.

ఉ. ఆసతిఁ గూడి యాసరణి నన్య మెఱుంగక యుండ నీసునం, గాసిలి తప్పపత్ని జరగబ్బితనంబునఁ జెంపఁ గొట్టుచుఁ, దా నెకి... ట్టి యప్పుడు దనర్చురతిఁ ముఖచుంబనంబు నుం, జేసెనొకో యనంగ నరసెం బతి కయ్యుయిచోటు లంతటఁ. పరమ. ౨. ౪౬.

శ. గబ్బిమరుం డొంటి పెఱుఁగక, గొబ్బునఁ గై బడును...విజ. వి. ౨. ౧౯౧.

౨. నిక్కినది, నిగిడినది.

వ...పలుకంబండినమారేడుపండ్లగారామఁ కై చుగబ్బిగుబ్బలబెడంగును...హర. ౩. ౨౩.

(స్తనవర్ణనము.) సీ. కొన లుబ్బి గబ్బులై సుబ్బులై యపరంజికుండలై కొండలై దండ నిండి. ... రస. ౫. ౧౧౩.

౩. గొప్పవాఁడు, ఘనుఁడు.

గీ.కడలిఁ గోలమఁ దెచ్చినగబ్బి వీవ.పారి.౧.౪౯.

(మందరపర్వతము.) సీ.. కడలిరాయలలోఁతు
గన్నగబ్బి. మనుచ. ౫. ౪౭.

౪. ధీరుఁడు.

గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు,కా
లయవనునికడ కేఁగి గబ్బితనము, వెలయఁ ద
నపేరు చెప్పి గర్వించి తన్నుఁ,దఱిమి పట్టం
గ నోపినఁ దగిలి రమ్ము.

చ. అనుటయు...వి.పు. ౭. ౧౭, ౧౯.

౫. కపటము, కవుదు.

సీ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు, గబుసు
కైపు కిటుకు కాడు డబ్బు కవుదు డంబనం
గ...ఆం. భా. ౧. ౧౩౭.

**గబ్బిడా**=గబ్బిలము.

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు,రా
యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు ...
సాం. ని. తిర్య. ౭౧.

**గబ్బిడాయి**=గబ్బిలము.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ,దైలపా
యిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨.
౯౪.

**గబ్బిలము**=గబ్బిడా, గబ్బిడాయి, గబ్బిలాయి.వి.
తైలపాయిక, ఇంటికప్పు మొదలగువానినుండి త
లక్రిందుగా వ్రేలాడుఒకవిధ మగుపక్షి.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపా
యిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨.
౯౪.

**గబ్బిలాయి**=గబ్బిలము. (క. గబ్బిలాయి)

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు, రా
యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు...ఆం.
సం. తిర్య. ౭౧.

**గబ్బిలి**. వి. జా. పిడికిలి.

ఉదా: గబ్బేఁడుకూర తే. (శ. ర.)

**గబ్బివాఁడు**. విశ. (గబ్బి+వాఁడు) గబ్బితనము
గలవాఁడు.

(కొంటెవాఁడు)

(కృష్ణుఁడు) ద్వి. మునియేఁటనే ... పడుచు,
చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు ఆ.మ.
క. ౧. ౩౪ పా. ౧౦ పం.

**గబ్బిస**. వి. ఒకానొకమూలిక. (శ. ర.)

**గబ్బు**. వి. (సం. గర్వః. క. గబ్బు) ౧. గర్వము;పొ
గరు.

ద్వి. గబ్బున జైనమార్గ మె యాది యనుచు, మెట్టి
మాతోఁ బ్రతిఘటించి యాడ. బస. పు. ౬
౫౫౯ పం.

చ. కడఁగి కుమారుపేరురము గబ్బును నుబ్బును
దొంగలింపఁగాఁ, బోడిచెను... నృసిం. ౪.
౧౧౪.

సీ. కెరలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె
ముద్దుచూపెడివీరి మోవులందుఁ, బచ్చబంగా
రు కుప్పలుసేయఁగా రాదె గబ్బు మీఱినవీరి
గుబ్బలందు. పాండు. ౧. ౧౧౭.

౨.(గజాదుల)మదము.(చూ.గబ్బుచెంక మేకము)

౩. గంధము; దుర్గంధము.

ఆ. కంపు గబ్బు గవులు గంధంబు వల వస,గంధ
మొప్పు...ఆం. భా. ౧. ౧౦౬.

సీ...పాలగబ్బు...చంద్రా. ౨. ౭౭.

సీ. ఎడ లేక తఱచు వ్రేలెడుజిబ్బటీలచే గబ్బు
లు వెదచల్లుగర్భగృహము. చంద్ర. ౩. ౪౭.

జ: గబ్బి, గబ్బివాఁడు, గబ్బుకొను,గబ్బుచీకటి,
గబ్బుచెంక మేకము, గబ్బుదేలు, గబ్బెక్కు.

**గబ్బుకొను**. అ. క్రి. (గబ్బు+కొను) గబ్బు కల
ది యగు.

(వాసనగొట్టు, పరిమళించు.)

ఉ. గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బలజొబ్బిలుతావికుంకు
మఁ, గబ్బుకొనంగఁ జాలునెదఁ గప్పినజె
బ్బులివన్నె పచ్చడం, బబ్బురమై తనర్పఁ బ్ర
మథావలి యుబ్బుచు వెంట నంటఁగా, గిబ్బప

యాళి తేజి దుమికించుచు వచ్చె మహీసఁడ త్త్రికిన్. దశా. ౨. ౬౯.

**గబ్బుచీకటి.** వి. (గబ్బు + చీకటి.) గాఢాంధకారము. (శ. ర)

**గబ్బుచెంకమెకము.** వి. (గబ్బు + చెంక + మెకము)-మదము గాఱు చెంపలు గలమృగము-ఏనుఁగు.

సీ. గబ్బుచెంకమెకంబుగట్టికళవసంబు తుబుసంబుగాఁ జేసికొన్నదంట. ఆం. భా. ౧. ౩౭.

**గబ్బుదేఱు.** అ. క్రి. (గబ్బు + తేఱు.) గబ్బు కలదియగు.

(అతిశయించు)

సీ. మెఱపులై మిట్టలై మిక్కిలి బటువులై క్రాలుఁగన్నులచెన్ను గబ్బుదేఱ. గీ. పత్రి పతి కేతనునిపురః క్షేత్ర మూఁడి, యున్న శ్రీక్షేత్ర పాలకు యోగిలోక, రమణు ముప్పదిరెండక్షరములమంత్ర, రాజము జపించి కొల్వ దొరకు శుభములు. పాండు. ౨. ౯౧.

**గబ్బులుఁగు**=గంపపులుగు. (గంప + పులుఁగు.)

ఉ. మానక యుబ్బి గబ్బులుఁగు మాటికి మాటికిఁ గ్రోల్చెఁ గొమ్మపై ...హర. ౨. ౧౮.

వ...కౌశికంబు డబ్బు గబ్బులుఁగు గాలి కనుఁబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులై యున్నయవి. ఆము. ౬. ౬౬. ఆం. భా. ౨. ౯౭.

**గబ్బెక్కు.** అ. క్రి. (గబ్బు + ఎక్కు) గబ్బుమీఱు, సాంద్ర మగు, దట్టమగు.

ఉ...గ, బ్బెక్కినమబ్బు శైలగుహ లీఁగె దిశల్ వెలుఁగొందె నిక్కలన్, జక్కవజోళ్లు గేరె జలజాతహితుం డుదయించెఁ దూర్పునన్. వేం. పంచ. ౩. ౧౦౭.

**గభస్తి.** సం. వి. ఇ. పుం. ౧. కిరణము. ౨. సూర్యుఁడు. స్త్రీ. స్వాహా, అగ్ని దేవునిభార్య.

**గభస్తిమంతుఁడు.** సం. వి. త్. పుం. సూర్యుఁడు.

**గభస్తిమాలి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**గభస్తిహస్తుఁడు.** సం. వి. అ. పుం-కిరణములు చేతులుగాఁ గలవాఁడు-సూర్యుఁడు. (త్రి.ని.) (ఇట్లే గభస్తికరుఁడు, మొ.)

**గభీరము.** సం. విణ=గంభీరము.విణ.

**గభీరిక.** సం. వి. ఆ. స్త్రీ. గంభీరధ్వని నిచ్చుకాకభేరి, పెద్దఢక్క.

**గభీరిమ(ము).** సం. వి. న్. పుం. గాంభీర్యము.

**గభోలికము.** సం. వి. అ. పుం. గుండ్రనితలగడ.

**గమకము.** వి. ౧. యత్నము, పూనిక; ఉత్సాహము.

క. గమకమున నెదురుపగతురఁ, గొమరుం జాయములవేల్పుఁ గొమ్మలఁ గడుఁ జుట్టములఁ గఁగూర్చెదు నేఁడుపు, సమకూరినరాయపక్షిసాళ్వంబునకున్. యయా. ౧. ౭౨.

చ. సమదగజంబుపై తుఱుముసామజవైరికి సూటిపెట్టునా, గమకముఁ జూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వ లే, కమితభయాప్తి నోరసిలె... సారంగ. ౧. ౧౦౦.

మ. గమకంబుల్ సెడి కైదువుల్ విడిచి ... ఉ. రా. ౨. ౯౧.

౨. పుష్టి.

సీ...తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము. ప్రబంధ. ౮౨.

౩. నైపుణ్యము.

క. కలికివరుమనకదనపుఁ, బలుమలకలకలము చెడఁగువడు మేఖలము, వ్వాలరవళిఁ దగిలి గతిగొనఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గనియెన్. భాగ. ౬. ౯౯.

విణ. ౧. అధికము, ఉరువు, గొప్ప.

వ. ఇట్లు మ్రొక్కి తేని నమ్ముద్రియ గద్దెపై నుంచి తద్దయు సుద్దవిడి నతనిమీఁదిశమకంబు గమకంబై పర్వ నతనిమదియుఁ దనవయిం దగుట దెలిసి ...యయా. ౪. ౬౪.

మ. ప్రళయాభీలఘనాఘనారవసమారంభఁబు లారోటుఁగూఁ, తల దైత్యోదరముల్ ప గిల్చి మఱి యంతన్ బోక తద్రక్తధారలు గ్రోలన్ గమకంబుగాఁ దెఱచువక్త్రంబో య నన్ జెజ్జమిం,పలరం దాలుచు పాంచజన్య ము మదీయాభీష్టముల్ సేయుతన్. చంద్రా. ౧. ౭.

వ... పాదసంవాహనాదికంబులఁ బతుల నిదుర వుచ్చి గమకమ్ము లగుతమకమ్ములు తమకు నెత్తు లునెట్ట నలఘుతరసాహసైకసహాయ లగుతా పికత్తియలదాపుల సంకేతస్థలంబులకుం జేరి ... చంద్రా. ౫. ౬౩.

౨. మనోజ్ఞము, సొంపైనది.

ద్వి. అందులఁ బంగరుహరువుచిత్తరువు, లందం బుగాఁ దీర్చి హరినీలకరుల, గమి గమిచినప టికంపుసింగముల, గమక మాసోపానగతుల నేర్పఱచి. రం. రా. బాల.౭౩ పా. ౧౦ పం.

చ. కమికెఁడుగుబ్బచన్నుఁగవగాసికిఁ బాసిన జాఱుపయ్యెదల్,గమకపువాలుఁగన్ను లెసఁ గన్ బొసఁగించిరి కేళి బాలికల్. రా.వి.౩. ౮౮.

౩. స్థూలము.

గీ. ఒమ్ము గాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ, స్థూలమగు...ఆం. భా. ౩. ౨౦.

జః గమకముగొను, గమకించు, గమకింపు.

గమకము. సం. విణ. (అ. మికా. అ) ౧. వెళ్లునది.

౨. తోఁపఁజేయునది. ౩. ప్రమాణములచే నిరూ పించునది. వి. అ. పుం. (సంగీ) స్వరవిన్యాసభే దము.

గమకముగొను. అ. క్రి. (గమకము+కొను) య త్నము చేయు, యత్నించు.

క. పలికెద నని గమకముగొనుఁ, బలికినఁ గడు న లుగువిభుఁడు ప్రతివచనముల న్, బలుకఁ దని నిలుచు శశిముఖి... భాగ. ౭. ౩౮౩.

గమకించే. అ. క్రి. (√ గమకము) ౧. యత్నిం చు, పూను.

ద్వి. చంద్రహాసం బెత్తి జానకి ప్రేయ,నింద్రారి గమకింప ... రం. రా. సుం. ౨౫౨ పా. ౭ పం.

ఉ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మో హము నిల్వ లేక చే,లాంచల మంటి శయ్య కపు డల్లనఁ దార్చి కవుంగిలింప నుం,కించుఁ బయంట నంట గమకించుఁ జలించుట దెప్ప డెప్ప డం, చించుక సేపు లోన మెఱయిం చు నసేకమనోవికారముల్ విజ. వి. ౨ ౨౭.

౨. మనోజ్ఞ మగు, ఒప్పు.

సీ. గమకించచమరివాలము లోనఁ గీలించి యు ప్పరంబుగ నోరకొప్పు దిద్ది. వైజ. ౮. ౩౦.

ద్వి... చిత్రాంగిఁ గనుఁగొని మ్రొక్కి, వినుతింప వారాశివిధమునఁ బొంగి, గమకించునుత్యా లగద్దెపై నుండి, దుమికి...ద్వి. సారంగ. ౧. ౨౨ పా. ౬ పం.

గమకింపు. వి. (√ గమకించే) గమకించుట. (అదలింపు.)

చ. హరి నరయన్ గుఱుం డనుప నత్తఱి సాగరు లుర్వి రోసి వే,సరి ధరఁ ద్రవ్వి త్రవ్వి బలిస ద్మగులై హరిబుద్ధి దక్కి చి,క్కర మునిము చ్చటంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి త, ద్గురుతరకోపదీపమునకున్ శలభాకృతిఁ జెం ది రందఱున్. చం. రా. ౩. ౧౮.

గమగమ. వి. (క. గమగమ.) ౧. పరిమళించుట కో పగించుట మున్నగువానియం దగునసుకరణము.

సీ. గమగమ వలచుచొక్కపుఁగమ్మఁగస్తురి నలుఁగి డె నొకమదనాగయాన. రసిక. ౧. ౭౧.

సీ. గమగమ మైకదంబములు గుబాళింప ... ప్ర బంధ. ౧౮.

గీ. గమగమలకప్రపువిడెంబుగంధ మొలయ,మిన

మినల్కు౯ంకుమపురేఖ మించు లొల్క౯. హం
స. ౫. ౩౭౦.

క. అనుటయు హంసుఁడు గమగమఁ,గనలి మదిం
జెఱుపు విడిచి కాలువఁ బొగడం, జను నే వీని
కి నని...ఉ. హరి. ౪. ౧౫౬.

౨. సువాసన.

క. వలదుపవనవాసనలం, గలవిపఋులమృగమదాది
కముగమగమలక౯, వెలువల లోపల వలపులు,
గలసుమఁగప్పురపుబరణి గా కది పురమా. క
కు. ౧. ౧౭౪.

జః గమగమించు.

**గమగమించే.** అ. క్రి. (√గమగమ) గమగమ య
ని వాసనగొట్టు.

గీ. కప్పురపువీడియపుఁదావి గమగమింప. శేష. ౪
ఆ. (శ. ర.)

**గమథము.** సం. వి. అ. పుం. త్రోవ.

**గమథుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పోవువాఁడు,
యాత్రికుఁడు.

**గమనము.** సం. వి. అ. న. ౧. పోక, వెళ్లుట. ౨. ప్ర
యాణము. ౩. పొందుట. ౪. రమించుట. (ఉదా:
అగమ్యాగమనము, మొ.)

**గమనించే.** సం. అ. క్రి. ౧. పయనమగు.

సీ. నడిచె నింద్రుండు కిన్నరకాహళులు మ్రోయ గ
మనించె శిఖి డిండిమములు మ్రోయ. వరాహ.
౨. ౮.

గీ. సకలజనులకుఁ బయనంబు చాటఁ బంచి,బల
ముఁ జదలంబు గదలింపఁ బంచి పెట్టి, తాను గ
మనింప సమకట్టె తత్ప్రధంబుఁ, దల్లి కెఱిఁగిం
ప నిజనిశాంతమున కరిగి. జై. భా. ౨.౧౦౬.

౨. చరించు, తిరుగు.

ద్వి. వసుధేసునొద్దనె వదలక నీవు, వసియింపఁ ద
గు నన్న వచ్చితి నేను, దలఁచినప్పుడు వచ్చి
ధరియింతు రూపు, గలిగియుఁ బోడ లేక గ
మనింప నేర్తు రం. రా. ఉ. ౧౧౫ పా. ౧౯ పం.

౩. వెడలు, ఉద్గతమగు.

ద్వి. అమృతాన్నరుచి లోన నడఁగక వెలికి,గమ
నించె నన దేహకళ వెల్లఁబాఱె. రం. రా.
బాల. ౧౯ పా. ౨౪ పం.

౪. కుతూహలపడు.

ఉ. నింతువు నాదుకోర్కి౯ గమనింతువు కేళికహ
ర్షికంబు...శశాం. ౪. ౮౦. (ఇట 'శలఁచు'
అని శ. ర.)

స. క్రి. ౧. గ్రహించు; పాటించు.

(వ్యవ)అందఱు ఈవిషయము గమనింపవలయును.
వాఁడు నే నెంత చెప్పినను నామాట గమనింపఁ
న్నాఁడు.

౨. నడపు.

క...రథికుఁడు గమనించినపుడె రథ మమనుచు
...వేమన. (బ్రౌ)

**గమనిక.** సం. వి. ఆ. స్త్రీ. అల్పమార్గము, సూక్ష్మవృ
త్తి; విధము.

వ...న చ అర్థశక్తిమూలే వ్యంజనే అనుమానతం
కా,వ్యంగ్యవ్యంజకయోరవినాభావాభావాత్
...నచాభిధావృత్తిః,సంకేతితార్థ ఏవ తస్యాః
పరిచయ ఇతీయతీ గమనికా. ప్రతాపరుద్రీ
యము. కావ్యప్రకరణము. ౪౨ పా.

సీ...మంత్రవర్తనముఁ దంత్ర,గమనికయును వి
విధము లైనదానవిధులు బహుళత్యాగములు
ను లోక,సంస్తుతము లయ్యె...భార. ఆశ్వ.
౪. ౨౧౮.

వ...ముఖ్యవరాహంబుగమనిక నున్నతక్షుముదై
...భాగ. ౯. ౨౩౦. (శ. ర. పా. 'గరిమ'
ముద్రి.)

వ...మృత్యుదేవతయెత్తునం గాలుపోలిక శమన
నిగమనిక నెదిరి...భాగ. ౧౦ పూ. ౧౩౬౫.

**గమనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొంద
దగినది. ౨. తెలియఁ దగినది.

**గవ్యూతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. రెండుక్రోసులు. ౨. ఒకక్రోసు. (వాచ.)

**గవ్వ.** వి. వరాటిక, కపర్దకము. (దీనిని చిన్ననాణెముగా వాడుదురు.)

వ...గవ్వదండలగంటల నలంకరించి...ఆము. ౪. ౩౫.

గీ...గవ్వ యనఁగ వెలయు, చుండును వరాటమై ...ఆం. భా. ౧. ౧౬౧.

గవ్వచాకము = పుంజెఁడుగవ్వలు, నాలుగుగవ్వల మొత్తము.

మ.చరమాశానికషోపలాంచలమునన్ సంధ్యాప్రకాశోదయం, బొరఁ గావించి విరించిచేఁ గొనినసూర్యం డన్పుదార్వన్నెబం, గరపుంబూదియకై వియద్విపణి వేడ్కం గాల మన్వచ్చు చెచ్చెరఁ జెల్లించినగవ్వచాక మన మించెం దారకాచక్రముల్. నైష. ౮. ౧౫౯.

శ్లో. అస్తాచలేఽస్మిన్ నికషోపలాభే సంధ్యాకషోల్లేఖపరీక్షితో యః, విక్రీయ తం హేళి హిరణ్యపిండం, తారావరాటానియమాదిత ద్యౌః. సం. నైష. ౨౨. ౧౩.

జ: గవ్వసరులు.

**గవ్వసరులు.** వి. బ. (గవ్వ+సరులు.) ధాన్యవిశేషము. హంస. ౪. ౧౨౭.

**గస.** వి. (సం. కాసః. త. కశం) ఉబ్బసము. (శ. ర- 'కంఠములోనినస' అని చి. ని.)

**గసగస.** వి. (క. గసగసె. త. కసకసా. హిం. కష్ ఖాష్.) సస్యభేదము ?. (దీనివిత్తులు నల్లమందువిత్తు లందురు.)

వ...గసగస యెసక మెసఁగె...కాశీ. ౩. ౨౩.

బ. (గసగసలు, గసగసాలు .)గసగసవిత్తులు, అహిఫేనబీజములు.

గీ. జాజికాయలు జాపత్రి చాఱపప్పు, సెనగ లనుములు గసగసల్ మునగపువ్వు, మదనవిత్తులు కొబ్బెర మందహాలు,నూపి త్రాగిన మద ముబ్బుఁ జేరువేళ. హంస. ౫. ౧౩౧.

ఆ. వెదురుఁబ్రాలు శాలివదనికల్ గసగసాల్,జల్లి మెకపుఁబాలుఁ జాఱపప్పు. యయా. ౧. ౧౦౩. ఆం. భా. ౨. ౧౬౧.

**గసాబు.** వి. తుపాకివంటియుద్ధసాధనవిశేషము.

ద్వి. క్రోవులు జబురుజంగులు పిరంగులును, బుస క్రోవులును గసాబులు తుపాకులును, వసుధ లీలగ నొక్కపడిఁ గాల్చి ... ఆ. మ. ౪. ౩. ౧౭౧ పా. ౧౫ పం.

**గసి[1].** వి. శంకుభేదము, ఒకవిధ మగు మేకు; ఒకానొక వేఁటసాధనము.

సీ...వసి గసి మేకన వసుధ శంకు. గీ. భేదనామంబు లగుచు శోభిల్లుచు ... ఆం. భా. ౨. ౨౧౭.

ద్వి. మునుకొని యాతనిముక్కుఁగ్రోళ్లందు, ఘనమైనపాఱలు గసులుఁ బెట్టియును. రం. రా. యు. ౩౯౫ పా. ౧౨ పం.

ఆ...వసులు గసులు...ఆది గాఁగఁదెచ్చి రాటవికులు. పి. శకుం. ౧. ౧౧౬. హరిశ్చ.౨. ౬.

జ: గసిక.

**గసి[2].** వి. (క. గసి) కాఁచిననెయ్యి లోనగువానియడుగునకు దిగుమడ్డి.

సీ...గసి నాఘృతాదికల్కంబు దనరు. ఆం. భా. ౨. ౨౫౯.

**గసిక.** వి. (√గసి[1]) ౧. త్రవ్వుటకనువుగా కొన చెక్కినకొయ్య. (శ. ర, వా) ౨. శూలము, శలాక.

ద్వి...మానవమాంస,ఖండంబు లొండొండ గసికల గ్రుచ్చి,కమ్మఁగాఁ గాల్చి చంకను బెట్టి మెసఁగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౨౪.

౩. మొన యేర్పడునట్లు చెక్కినకొయ్యబాణము.

గీ. అలయ దూరస్థితు నృపాలు ననుముఖ్యుఁ, దవిలి

తగనికోర్కులు గోరి తివిరి మొగ్గ,గసికలకుఁ జాల నగ్గమై యెసఁగ...హ. న. ౨. ౬౬.

గీ. గసికకోలలు గొని భిల్లబిసరుహాక్షు, లడవిఁ దిరుగుదు రాత్మనాయకులఁ గూడి. కాళ. 3. ౧౫.

గసిబిసి=గజిబిజి.

విశ. (చెల్లాచెదరు, మిక్కిలిచెదరినది.)

చ... అసురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్, గసిబిసియై నిరర్థ మయి గ్రక్కునఁ బోయెను నిద్ర నొంది సం,తస మున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వేల్పు లండఱున్. భాగ. ౧. 383.

(తాఱుమాఱు, వ్యత్యస్తము.)

క. లసితాలంకృతిసంధులు,గసిబిసియై చెదరకుండఁ గల్పించినఁ, బొం,దెసఁగెడుసంయోగం బది, రసికులు నరసింహసంకరం బనఁ బరఁగున్. కావ్యా. 3. ౯.

ద్వి...బిజ్జులని,నొసలిరేఖలు గసిబిసిచేసి రాజ్య, మసమాక్షుకవిలియ నటు తుడిపించి. బస. పు. 2. ౯౧౫ పం.

(కలఁగినది)

(మన్మథుఁడు)గీ...అయ్యవనివిభుని, వ్రతము లన్నియుఁ గొనిపోయి వటిఁ గలిపి, చిత్తమంతయు గసిబిసి చేసి విడిచె. భోజరా.2.౧౦౦.

సీ. పలునొక్కులను జిక్కువఱపకు మని మ్రొక్కు కుసుమకోమల గసిబిసి యొనర్చి. మృ. వి. ౧. ౪౫.

గస్తాలు. వి. బ. మల్లవిద్యావిశేషము.

వ...బసికీలు గస్తాలు పుటంబు లనునట్టివకుసల వితంబులును...మల్లుపు. 3. ౬౯. ఆం. భా. ౨. ౨౦౭.

గస్తీలు. వి. బ. (గస్తు+ఈలు.) కావలివారు.

ఉదా: పైగస్తీలు వచ్చినారు. (శ. ర.)

గస్తు. వి. (హిం. క. గస్తు.) –రాత్రివేళ దొంగతనము లోనగునవి జరుగకుండుటకై కావలివారు-ఊరు తిరిగి కాచుకావలి.

ద్వి. ఆలీలఁ గొఱవిదయ్యంబుల దివ్వె, కోలలవారిఁగాఁ గొని గస్తు దిరిగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౬౭ పం.

గీ. కుశలగతి మజ్జనములాడి కుడిచి కట్టి,ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ, ఖడ్గఖేటకపాణియై గస్తు దిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. వేం. పంచ. 3. ౯౭.

సీ. కడు గడీపై నలంగముచుట్టు నెల్లెడ గస్తు గ్రుమ్మరునట్లు గట్టివఱచి. రంగా. ౨. ౯౧.

జ: గస్తీలు.

గహనము. సం. విశ. (అ. ఆ. అ) ౧. నిబిడము, దట్టమైనది. ౨. దుష్ప్రవేశము, చొర రానిది. 3. దుర్బోధము, ఎఱుఁగ రానిది. వి. అ. న. ౧. అడవి; దట్టమయిన అడవి. ౨. గుహ. 3. దుఃఖము, కాఁటియ. ౪. జలము.

గహ్వము. సం. వి. అ. న. ౧. గాంభీర్యము. ౨. దుర్గము, పోవ నలవి గానిచోటు.

గహ్వరము. సం. విశ. (అ. ఆ. అ) ౧–గాంభీర్యము గలది–లోఁతయినది. ౨.దుష్ప్రవేశము, చొర రానిది. వి. అ. పుం. పొదరిల్లు. న.౧.దంభము.౨. అడవి. 3. గుహ. ౪.ఏడ్పు. ౫. జలము. ౬.గాంభీర్యము, గుట్టు. (కే. ని.)

క. కులభామిని యేమైనను, గలుగుకొలఁది నింటిలోన గహ్వరమునఁ బ్రొద్దులు గడపునె ప్రియమున నా,నెలఁతుక నీపంపు నేయ నేర్చునె చెపుమా. కుచేల. ౨.౧3.

గహ్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గుహ. ౨. భూమి, నేల.(విల్యమ్సు.)

## గా

గా. ఇది మహద్వాచకములకు అప్రయుక్తమై నీచత్వమిత్రత్వములను దెలుపును.(ఇదిపరమగునపు

డుపూర్వావ్యచ్చునకు 'ఇ' ఆదేశ మగును. దీనిని 'ఇగా' అని కొందఱు గ్రహించిరి. సంబుద్ధియందు 'గ' అను రూపము గూడ నుండును.)

సీ... ప్రశ్న చెప్పఁగ మాలపాపిగాఁడు. వేణు. ౨౫.

ఉ... భా, గోతులబుచ్చిగానికి... (చాటువు)

క. జగములు వొగడఁగ నెగడిన, జగబంటరికొమరుఁ డయ్యు జతనమునఁ గటా, పగ దీఱుప నోపవు నీ, మగతన మేమిటికిఁ దులువమాఱ్ద్రిమ్మరిగా. అచ్చ. రా. యు. ౧౨౨.

క... గోపాలిగ రమ్మటంచుఁ గొడుకుꣳ బిలిచె. అహోబలపండితీయము. 3౪౬ పా.

గాంగము. సం. విణ. (అ. ఈ. అ) గంగది, గంగకు సంబంధించినది.

గాంగాయని. సం. వి. ఇ. పుం=గాంగేయుఁడు.

గాంగుఁడు. సం=గాంగేయుఁడు.

గాంగేయము. సం.వి.అ.న. ౧. బంగారు. ౨.కనకావ్హాయము, ఉమ్మెత్త ౩. పుం. ఒకవిధమగు చేఁప.

గాంగేయుఁడు. సం. వి. అ. పుం- గంగాపుత్త్రుఁడు-౧. భీష్ముఁడు. ౨. కుమారస్వామి.

గాంగేరుకి. సం. వి. ఈ. స్త్రీ. బీఱ ౩.

గాంజికాయనము. సం. వి. అ. పుం. వర్తిక, మీనవల్లంకిపిట్ట.

గాండివము. సం=గాండీవము.

గాండివి. సం=గాండీవి.

గాండీవము. సం. వి. అ. పుం. న. ౧.అర్జునునివిల్లు. ౨. విల్లు. (మే. ని.)

గాండీవి. సం. వి. న్. పుం. అర్జునుఁడు.

గాండ్రించె. అ. క్రి. (ముఖము) ఉబ్బు. (శ.ర.)

గాండ్రు. వి. పులి యఱచుటయందగుధ్వనికి అనుకరణము.

వ... పాఱమ్ములు బొమ్మకలంకులం గాఁడ గాండ్రు గాండ్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తుపాడు నెగసి... మనుచ. ౪. ౩౭.(బ్రా. పా- కాండ్రుకాండ్రు. శ. ర. పా)

గాండ్రుపెట్టు=గాండ్రుమను.

ద్వి. మండ్రాటముగ నిట్టిమాంసంబు మెసవి, గాండ్రుపెట్టెడు పెద్దగండు మెకాలు.ద్వి.సారంగ. ౨. ౮౦ పా. ౧౨ పం.

గాండ్ల. వి. నూనె అమ్మి జీవించెడుజాతి. (చూ. గాండ్లవాఁడు.)

జ: గాండ్లవాఁడు.

గాండ్లవాఁడు. విణ. (√గాండ్ల) గాండ్లజాతివాఁడు. (మహత్త్యర్థకరూపము 'గాండ్లది')

వ... కటిక బట్టు జెట్టి దేండ్ర తొగట గాండ్లవారును... హంస. ౩. ౪౯.

గాంతువు. సం=గంతువు.

గాందిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. గంగానది. ౨. కాశిరాజుకూఁతురు. (శ్వఫల్కునిభార్య. అక్రూరునితల్లి.)

గాంధర్వము. సం. విణ. (అ. ఈ. అ) గంధర్వసంబంధ మైనది. వి. అ. పుం. ౧. వధూవరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొనువివాహము. ౨. సంగీతవిషయక మగునొకయుపవేదము. ౩. దినముయొక్క-పదునేనుభాగములలో నేడవది. ౪. గుఱ్ఱము. న. సంగీతము, గానము, పాట.

గాంధర్వి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వాక్కు, భాష. ౨. దుర్గ. (విల్యమ్సు)

గాంధర్వుఁడు. సం=గంధర్వుఁడు.

గాంధారము. సం. వి. అ. పుం. ౧.(సంగీత) స్వరవిశేషము. ౨.సిందూరము. ౩. ఒకానొకదేశము. న. గంధరసము, బాలింతబోళము.

గాంధారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గంజాయి. ౨. ధృ

తరాష్ట్రునిభార్య. 3. యవాసము, తీఁటకసిందరి. ఇ. పుం. శకుని. (ఇతఁడు దుర్యోధనునికి మేనమామ.)

గాంధారేయుఁడు. సం. వి. అ. పుం. గాంధారీ పుత్త్రుఁడు. (దుర్యోధనాది)

గాంధికము. సం. వి. అ. న. గంధద్రవ్యము.

గాంధికుఁడు. సం. వి. అ. పుం. గంధద్రవ్యములమ్ము పురుషుఁడు. (వాచ)

గాంభీర్యము. సం. వి. అ. న. ౧. లోఁతు. ౨. (క్రోధశోకాదులచే) వికారము నొందకుండుట.

గాఁజెర[1]. వి. ఒకానొకదుంప.

ఆ... పెండల, మల్ల ముల్లి పసుపు ముల్లంగి వెల్లుల్లి, గాఁజరయును మొదలుగాఁగఁ గలవు... హంస. ౪. ౧౩౧.

గాఁజెర[2]. వి. (సం. కలంజః) పొగాకు.

సీ. గంజాయి యనఁగను గాంధారి చెన్నొందు గాఁజర యంచనఁగాఁ గళంజ, మగు...ఆం. భా. ౨. ౭౩.

గాఁడి. వి. (త. కాడి) ౧. తొలిచి కాని త్రవ్వి కాని నిడుపుగా ఏర్పఱిచినపల్లము. (చూ. గాఁడిప్రాయ్యి) ౨. నిపానము, పసులు నీరు త్రాగుటకు గాఁడి యేర్పడ ఱాతితో కట్టినతొట్టి.

(యమునావర్ణనము.) గీ. ప్రతిదినముఁ గ్రోల నిది గాఁడిబావి గాదె, కృతశకృత్కరినందగోబృందమునకు, క్షుద్ర మిది గాదె దివసకృజ్జలజమునకు. వేం. పంచ. 3. ౧౨౧. ఆం. భా. ౧. ౧౬౨.

3. పసులను కట్టుచోట కసవు వేయుటకు పలకలు లోనగువానితో గాఁడిగా నేర్పఱిచినస్థానము.

(అమరావతీపురవర్ణనము.) గీ. కామగవిఁ గట్ట నిది గదా గాఁడిపట్టు. ఉ. రా. ౪. ౨౫౯.

(ఈశ్వరవర్ణన) గీ. విషగళుఁడు గాఁడిఁ గట్టినవేల్పుటావు, హాటకాచలధన్వి సిద్ధాంజనంబు... భక్తులకును. పి. శకుం. ౪. ౪.

జ: గాఁడిప్రాయ్యి.

గాఁడిప్రాయ్యి. వి. (గాఁడి + ప్రాయ్యి.) గాఁడి త్రవ్వి ఏర్పఱిచినప్రాయ్యి. (వా)

గాఁడు. వి. ౧. కండూతి, దురద.

గీ... దూల జిల నవ నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి...ఆం. భా. ౨. ౧౭౯.

౨. కాముమదము. (శ. ర.)

గాగర. వి. స్త్రీలు కట్టుకొను పావడ. (శ. ర. 'గాగరా' చి. ని, వా.)

గాజరము. సం. వి. అ. న. పచ్చముల్లంగి రి.

గాజాపరుఁజు. వి. ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము, కత్తి మొదలగువానిపిడి.

సీ... ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము. గీ. జరపరుంజు ననంగను బరఁగు నదియె, చనును నెమ్మిలిపరుఁజు గాజాపరుఁ జన. ఆం. భా. ౨. ౨౧౫. (శ. ర. పా)

గాజు. వి. (సం. కాచః. క. గాజు.) ఇసుక కరఁగించి చేసినయొకపదార్థము, కాచము.

గీ. వలచుఁ గస్తూరినిగరాలతలుపు దెఱవ, గాజుటోవరిలో ధూపగంధలహరి. నైష. ౭. ౧౫౪.

ద్వి. గాజు పెంచుక లేఱ గమియించినట్టు. బస. పు. ౨౦౧ పా. ౧౫ పం.

క... వంటచెఱకుఁ దెచ్చుచుఁ బురనా, రీజనుల కమ్మి యాతఁడు, గాజు గడపినట్లు దినము గడపుచు నుండెన్. శుక. 3. ౨౪౬. ఆం. భా. ౨. ౨౮౦.

౨. గాజుతో చేసినవస్తువలయము; హస్తవలయము.

ఉదా: నీవు పురుషుఁడవా ? గాజులు తొడిగించుకొని యింటఁ గూరుచుండుఆఁడుదానవా?

గీ. గాజు లెగఁద్రోసి చప్పుడు గాకయుండ, వ
చ్చె నూర్వశి యర్జునావాసమునకు. హర. ౭. ౧౧౯.

సీ. సడలి ముంజే వ్రాలుజాఱువా పైఁడిగాజులు
పైకి నెగఁద్రోయుచోవిలాస,ము...దశా. ౨. ౩౬౦. ఉ. హరి. ౪. ౧౫౭.

జ: గాజుకడియము, గాజుకప్పెరలు, గాజుకుప్పె, గాజుకొప్పెర, గాజుపడు, గాజుప్పు, గాజులవాఁడు, గాజువాలు.

**గాజుకడియము.** వి. (√గాజే) గాజుతో చేయఁబడినకడియము.

ఆ. భూజనంబు నేలురాజు మగం డయ్యు, గాజుకడియ మనెడిగతి చెలంగె. కుచేల. ౨. ౧౧౦.

బ. ధాన్యవిశేషము.

వ... ఊఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు...అనునూటనాలుగువగలపైకులు... ప్రబంధ. ౧౧౨.

**గాజుకప్పెరలు.** వి. బ. (గాజు+కప్పెరలు) ధాన్యవిశేషము.

సీ...గాజుకప్పెరల్ కురువడాల్ కంటసరులు... గీ...ఆది యగుపేరు గల్గువడ్లతనియింట,నుండు...హంస. ౪. ౧౭౫.

**గాజుకుప్పె.** వి. (గాజు+కుప్పె.) కాచపాత్రవిశేషము.

సీ. చేదివ్వెప్రతిమ చాసీతిబంధములమేల్కట్టు గొజ్జఁగినీటిగాజుకుప్పె. గీ. కలరతాగారము నను...వైజ. ౩. ౭౪.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుచు దీపంబ,చెట్టులుండు జ్ఞాన మట్టు లుండుఁ, దెలిసినట్టివారి దేహంబులందును...వేమన. ౧. ౯.

**గాజుకొప్పెర.** వి. (గాజు+కొప్పెర) గాజుతో చేసినపాత్రవిశేషము.

గీ. గాజుకొప్పెర యనఁగను గర్పర మగు. ఆం. భా. ౨. ౨౪౫.

**గాజుపడు**=గాజువాలు. (గాజు+పడు.) (కాంతిహీన మగు)

ఉ. ఆజగదేకవీరుఁ డగునర్జునుఁడు...పదునార్వుర నొక్కపెట్టునం, గాజుపడంగఁ గూర్చె ...చిత్రభా. ౭. ౧౨౧.

**గాజుప్పు.** వి. (గాజు + ఉప్పు) ఒకానొకఉప్పు, కాచలవణము. (శ. ర.)

**గాజులవాఁడు.** వి. (గాజులు+వాఁడు) గాజులమ్మెడుబలిజె. (శ. ర, వా.)

**గాజువాలు.** అ. క్రి. (గాజు+పాలు) కాంతిహీన మగు, గాజుపడు.

గీ. నెఱయ నర్మిలి నెనయు నీనెమ్మొగంబు, ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాఱె, రాహుకబళితరోహిణీరమణుమాడ్కి, నుండఁ గనుఁగొనియే నెట్టు లుందుఁ గుఱ్ఱ. మార్క. ౧. ౨౫౪.

ఉ. కందవు గాజువాఱవు వికారము నొందవు... దీర్ఘనిద్రల ధరిత్రి శయించినజంతుదేహముల్. కాశీ. ౩. ౧౦౫.

గీ. గాజువాఱదు చరణపంకజయుగంబు, హస్తతలములకెంజాయ లడఁగిపోవు. హరిశ్చ. ౫. ౩౯.

**గాజె(జియ)**=గాదియ. వి. (సం. గంజః) కునూలము,ధాన్యము మొదలగునవి పోసికొనుటకు ఏర్పడినచిన్నబొట్ట. (శ. ర, చి. ని.)

**గాటము.** విశే. (సం. గాఢమ్. క. గాట.) అధికమైనది; సాంద్రము, దట్టము.

గీ. గాట మగుచలివేళను నీటిలోన, భార్గవుఁడు ఘోర మైనతపం బొనర్చె. పరమ. ౧.౧౧౨. (ఆదిమత్స్యవర్ణనము.) మ. తపుకుంజాయకడాని మైపొడలు నిద్దామీనసల్కఱ వేయిగో,ఱులు గాటంపుగఱుల్ ...దశా. ౧. ౨౧౧.

ద్వి. పాటలాతింత్రిణీప్రముఖవృక్షముల, గాట మానడవుల...ద్వి. హరిశ్చ. పూ. ౫౯౬.
సీ. గాటంబుగా నిర్లగవియదేహమువాఁడు కడు నక్కళించినకడుపువాఁడు. వరాహ. ౨. ౪౫.

**గాటు.** వి. (సం. కటుః) ౧. కటువు, కారము.
గీ...గాటు, కార మెుప్పొ్టిన యనంగఁ గటువు వెలయు. ఆం. భా. ౧. ౧౦౪.
౨. (తీవ్రమగు) వాసన.
సీ. బొట్టుకస్తురినీటు పట్టుబల్వలెవాటుదొట్టుగంధపుగాటుఁ దొంగలింప. చెన్న. ౪. ౨౬౪.
విశే. ౧. కారము కలది.
ఉదా: మిరెపకాయ చాల గాటుగా నున్నది.
౨. తీవ్రమగువాసన గలది.
ఉదా: పొగాకు గాటుగా నున్నది.

**గాడి.** విశే. (సం. గాఢమ్) గాటము.
రగడ. గాడిగ వెన్నెల గాయఁగఁ దరువుల, నీడలఁ బొడవెన్నెలలు...బిల్హ. ౨. ౭౯. (ప్రయోగాంతరము లేదు.)

**గాడిద(డ్డ).** వి. (సం. గార్దభః. త. కళుదై.) గాలిగాఁడు, ఖరము.
చ. గాడిదరూపు దాల్చి యనుకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం,బాడెదు శక్ర...భార. శాం. ౪. ౩౯౬.
సీ. జాతైనబారాహజారతేజికిఁ గాక కటకుల కళ్లెంబు గాడ్ద కేల. వేము. ౬౪. ఆం.భా. ౨. ౨౬౬.
జ: గాడిదకాళ్లవాఁడు, గాడిదపులి.

**గాడిదకాళ్లవాఁడు.** విశే.(√ గాడిద)ముట్టుపోఁకాళ్లవాఁడు, ముడికాళ్లవాఁడు, సంజ్ఞువు.(శ.ర.)

**గాడిదగడపర.** వి. ఒకానొకయోషధి, పిండీతకము ?.
గీ. పాదలుఁ బిండీతకమ్ము గాడిదగడపర, చాగరాడి వెలికి యటంచన...ఆం. భా. ౨. ౬౫.
సీ...గాడిదగడపర కన్నెకొమర. హంస.౪.౧౦.

**గాడిదపులి.** వి. (√ గాడిద) దుమ్ములగొండి, కొర్నవగండు. (శ. ర.)

**గాడీ.** వి. (హిం.గాడీ) బండి;రథము. (బ్రా. మిశ్ర, వా.) శ. ర. ఈపదము దే. వి. గా 'గాడి' అను రూపాంతరముతోను 'రథవిశేషము' అనునర్థముతోను గ్రహించి యాక్రిందిభారతమును ప్రమాణముగా నిచ్చినాఁడు.
సీ...చిత్రలలిత,గతి నొప్పనేనూఱుగాడీలు...భార. ఆది. ౮. ౨౨౧. ఒకప్రాఁతప్రతిలోఁ గూడ పాఠ మిట్లే యున్నది. కాని దీనికి మూల మగు సం. భార. ఆది.౨౩౭. ౪౧. శ్లోకము నుబట్టి 'ఏనూఱుగాడిదలను'అను భా.ల.వ్యా. పాఠమును, ముద్రితపాఠమును యుక్తముగాఁ గనఁబడుచున్నవి. 'గాడీలు' అను పాఠము గ్రహించినయెడల రథములు రెండుమార్లు చెప్పఁబడుటయు గాడిదలమాట లేకపోవుటయు సంభవించును.

**గాడుపు(డ్పు).** వి. వాయువు, గాలి.
సీ. ఏచి యాచెవిగాడు పాచెవిఁ బోవంగ ... పాండు. ౨. ౭౯.
సీ...చల్లనిగాడ్పు...భార. ఆది. ౮. ౨౩. ఆం, భా. ౧. ౫౯.
జ: గాడుపుచూలు, గాడుపుతండ్రి, గాడుపుసంగడీఁడు, గాడ్పుతూపు, గాడ్పుదిండి.

**గాడుపుచూలు(లి).** వి.(గాడుపు+చూలు) ౧. హనుమంతుఁడు.
క...తులువతోలువేలుపులం, గాడుపడఁ దవిమి యార్చుచు, గాడుపుచూలీవు సొచ్చె గాటపుఁగినుకన్. అచ్చ. రా. సుం. ౧౭౧.

గీ... గాడ్పుచూలి యి ట్లీవమునూడు, గ్రుంకునం
తకు నొదిఁగి యక్కొ౯ండ నున్న. అచ్చ. రా.
సుం. ౨.

౨. భీముఁడు.

ఇట్లే:- గాడుపుకొడుకు, మొ.

క. ... గర్వ మడంచి విడిచె గాడ్పుకొడు కొ
గి౯. రాఘవ. ౪. ౩౩.

**గాడుపుతండ్రి.** వి. (గాడుపు + తండ్రి) ఆకా
శము.

క. అపు డగ్గివన్నెలోలువేఁ,లుపు తన నెమ్మేనిమం
టలు గడిందిగ గా,డుపుతండ్రిఁ బొదువఁ
గోఁతిప,దుపుపై నరదంబు నెమ్మితోఁ బఱపు
టయు౯. అచ్చ. రా. యు. ౪౯౧.

**గాడుపుసంగడీఁడు.** వి. (గాడుపు + సంగడీఁడు)
వాయుసఖుఁడు, అగ్ని.

గీ... ఇంద్రజితుండు దీవి,కరిగి గాడుపుసంగడీఁ
డలర నొక్క,దండ వేలిమి యొనరింప... అ
చ్చ. రా. యు. ౧౩౮.

ఇట్లే:- గాడ్పుచుట్టము.

మ. జముఁడో వేల్పుల ఱేఁడొ నీళ్లదొరయో చా
గంపురాయండొ వి,న్కొ౯మరుండో విసదారి
తాల్పరియొ సోఁకుంబెద్దయో గాడ్పుచు,ట్ట
మొ... అచ్చ. రా. సుం. ౧౫౧.

**గాడ్పుతూపు.** వి. (గాడ్పు + తూపు) వాయవ్యా
స్త్రము.

చ... గాడ్పుతూపు నె,వ్వడిఁ బఱిఁగించి చేయి
దెగ వైచెఁ గడిందిగ రాముఁ డత్త ఱి౯. అ
చ్చ. రా. యు. ౨౪౭.

**గాడ్పుదిండి.** వి. (గాడ్పు + తిండి) పవనాశనము,
సర్పము, పాము.

(గురుస్తుతి) సీ. ఏదంట యొసఁగుచున్నాది దోస
పుఁదుల్వ గాడ్పుదిండులకు వాకట్టుమందు.
అచ్చ. రా. బాల. ౧౧.

గాడ్పుదిండిములికి = నాగాస్త్రము.

ఆ. సోలి యపుడె తెలిసి సోఁకుజో దెంతయు,
నులికి గాడ్పుదిండిములికి వైవ. అచ్చ. రా.
యు. ౩౫౩.

**గాఢము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అవగాఢము,
అవగాహనము చేయఁబడినది. (నద్యాది) ౨. అవ
గాహనము చేసినది, మునిఁగినది. ౩. గుత్త మైనది,
బిగు వైనది. (గాఢాలింగనము, గాఢాంగదము,
మొ.) ౪. దట్ట మైనది. ౫. క్రిక్కి౯రిసినది. ౬.
మిక్కు౯ట మైనది, అధికము.

**గాణ.** వి. (సం. గాయనః. ప్రా. గా అణో. క. గా
ణ.) పాటకాఁడు; పాటకత్తె.

సీ. గాణ యుంచనఁగను గాయకాభిన చెల్లు..
ఆం. భా. ౨. ౨౮౭.

ఉ. వీణియ ముట్టి పంచశరవిక్రమము ల్పచరిం
చుగీతముల్, గాణతనంబు మీఱఁ బలుకం గ
లభాగ్యము నాకుఁ గల్గునే. చంద్ర. ౪. ౧౧౨.

వ... కలమధురకిన్నరీనిక్వాణంబులరాణం బ్రా
ణఁ జెఱుమనిన్నాణంపుఁగొల్పు టెసంగుచు
ను వేల్పుగాణలు పాడులక్ష్మీనారాయణులక
ళ్యాణంపుఁబాటలం దీటుకొనుతిన్ననిరవం
బులు౯ గలసి... మనుచ. ౫. ౭౧.

**గాణపతము.** సం. విణ. (అ. ఈ. అ) గణపతికి సం
బంధించినది.

**గాణిక్యము.** సం. వి. అ. న. గణికలసమూహము,
వేశ్యాసమూహము.

**గాణీ.** వి. (సం. గాయనీ. క. గాణి) గాయకురాలు,
పాటకత్తె.

వ... మఱియు నిక్కు౯లాచలసంతానంబు సంతాన
కుసుమవాసనాసమాగతసారంగసంగీతభంగీత
రంగంబు లుపాంగంబులుగాఁ బాడువేల్పు
గాణీలపాణీరితమాణిక్యవీణామధురరాణా
మృతంబులఁ గరఁగి... వసు. ౨. ౧౧.

క. ఐదువ గాణీలను భా,పాదన గేయముల పేర భార

తి సతిపై, మోదమున ధవళవర్ణప్రాదుర్భావం
బు నెఱపెఁ బలుమఱు నచటన్. వసు. ౫.
౧౨౬.

గాణు. వి. హాని.

క. రాణించిననీ కౌఁగిటఁ, బ్రాణేశ్వర నాకు మగుడఁ బ్రాయము వచ్చెన్, జాణలగువారికూర్మికి, గాణు గలుగ నేర దెంతకాలంబునకున్. ప్రబోధ. ౨. ౭౩. (ప్రయోగాంతరము లేదు)

గ. మిథ్యాదృష్టిః:–మహారాజ! అహమపి సాంప్రతం నవయౌవనా సంవృత్తా. న ఖలు భావానుబంధః ప్రేమా కాలేనాపి విఘటతే... సం. ప్రబోధ. ౨. ౯౧ పా.

గాణుఁడు. వి. (సం. గాయనః) గాయకుఁడు, పాటగాఁడు.

(గంధర్వవర్ణనము) శా. పక్షంబుల్ లలిఁ దాల్చు కీరనిభదీవ్యద్వాణులున్ గాణులున్. హరి. ఉ. ౭. ౧౨౦.

గాత. వి. (సం. ఘాతః) ౧. దెబ్బ, వ్రేటు, పెట్టు.

స్రగ్ధర... ఖద్దిన్ జెండాడుమ్రాఁకుల్ కవుఁగిటికొలఁదుల్ కత్తి నొక్కొక్క గాతన్. మనుచ. ౪. ౮. (ఖద్ది క్రిందిశ. ర. పా)

పంచచా. కటారికానిగాత చేత... రా. వి. ౪. ౪౭.

౨. ద్రోహము.

సీ... ఎబ్బెరాసి గాతలకోటారు. ఆ. మగనికంటె నెరసు పగలాఁడి. చెన్న. ౨. ౨౪.

గాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ) గానము చేయువాఁడు, పాడెడువాఁడు.

గాతము. వి. (సం. ఖాతమ్. క. గాతాము) పల్లము, గోయి.

సీ. గాతము గవి యన ఖాతంబు ... ఆం. భా. ౧. ౧౪౬.

మ. సలుగుల్ ముట్టెలఁ దుంగవేళ్లు పెకలించన్ జెందుగాతాల దిక్కులు గంపింపఁగఁ బడ్డయేనుఁగుల పైఁ గుప్పించి సింగంపుఁబిల్లలు ...చంద్రా. ౨. ౬౪.

గాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ) పాడఁదగినది.

గాతి[1]. వి. (సం. ఘాతిః. క. గాతి) దెబ్బ, చఱపు.

గాతిగొను=కొట్టు.

సీ. ... దేవరాడ్వాహనదండి, యాతుపాళిమరుత్తుల గాతిగొనిన, ధనదుఁ జెందిరి...వరాహ. ౬. ౧౩౦.

గాతి[2]. వి. గ్రాసము.

గీ. చెఱకులను బెల్లమును జూపి చిన్నవాండ్రఁ, జంపి తొడవులు గొని వచ్చుసాహసమునఁ, బాపముల కెల్ల నొడికట్టి పాయ కెపుడు, శ్వేతుఁ డీరీతి లంజియ గాతికొఱకు. భల్లా. ౩. (శ. ర.)

మ. అగసంస్తంభనమాని గాతి కటు డాయం గాక యార్యాగ్నికిన్, దెగనాడన్ వసపోనిదుర్యశపుటద్దిన్ శక్యమా దాఁటఁగన్. చం. రా. ౬. ౯౦.

శ్లో. అకలశభవలేహ్యాం దుశ్శమం బాడబాద్యైః సం. చం. రా. కిష్కిం. ౯౦.

గాతు. వి=అగాదు.

గాతుగావించు=అగాదు చేయు, వ్రేల్చు.

(సైనికులు) గీ. లెక్క కెక్కుడు గాఁ దూఁగు రేకలాలు... పిరంగు, లొక్క మొగి గాతు గావింపనుక్కు మెఱసె, గుండ్లగుంపులు జడివాన గురిసినట్లు. రంగా. ౩. ౬౬.

గాతుగా=తప్పకుండ.

ద్వి. బేతాళు నొక్కనిఁ బిలిచి నీ వింక, గాతుగా నాకొల్వుకాఁడవై వీరిఁ, గొట్టి యిందఱఁ బనిగొనుచు నిచ్చోటఁ, బెట్టింపు తగుమంచె బెంపార ననిన. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౭౯ పం.

జ: గాతుకలఁగు.

గాతుకలఁగు. అ. క్రి. (గాతు + కలఁగు– ఇది బోరుకలఁగువంటిది.) భేదిల్లు, పగులు.

క...శౌరి తామ్రధ్వజునిచే..గద గొని మస్తకము
గాతుకలఁగఁగ నడిచెన్. జై. భా. ౭.౧౭౯.

గీ. కాద్రవేయులకన్నులు గాతుకలఁగ, భీకరజ
యానకము చలింపించుటయును. వరాహ. ౧౧.
౧౭౧.

సీ. కణఁత లెల్లను గాతుకలఁగి దిక్కులుఁ బొ
టపాటఁ గన్నీటిబొట్లు పడియె. రామా. ౮.
౭౪.

**గాతువు.** సం. విణ. (ఉ) ౧. రోషణుఁడు, కోపి.
౨. గాయకుఁడు. వి. ఉ. పుం. ౧.గంధర్వుఁడు.
౨. మగకోయిల. ౩. గండుఁదుమ్మెద. (మే. ని.)
౪. అన్నము. స్త్రీ. పృథివి, భూమి. (కే. ని.)

**గాత్రము.** విణ. స్థూలము.

గీ. ఒమ్మ గాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ,
స్థూల మగు...ఆం. భా. ౩. ౨౦.

వి. కంఠము; కంఠస్వరము.

సీ.రహి పుట్ట జంత్రగాత్రముల రాల్గరఁగించు వి
మలగాంధర్వంబు విద్య మాకు.మనుచ. ౨. ౪౩.

**గాత్రము.** సం. వి. అ. న. ౧. కళేబరము, శరీర
ము. ౨. అంగము, అవయవము. ౩. ఏనుఁగుయొ
క్క ముందటిపిక్కలు లోనగుచోటు, గజాగ్ర
జంఘాది దేశము. (మే. ని.)

**గాత్రసంకోచి.** సం. వి. న్. పుం.-అవయవములను
సంకోచింపఁజేయునది-నల్లతొండ. (రా. ని)

**గాత్రానులేపని.** సం. వి.ఈ. స్త్రీ. పరిమళము
గలలేపనద్రవ్యము.

**గాథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చరిత్రము. ౨.గానము,
పాట. ౩.ప్రాకృతభాష.౪.(ఛంద) ఒకానొకవృ
త్తము.(మే. ని.)

**గాథకుఁడు.** సం. విణ. (అ. థకా. అ.) గాయకుఁ
డు, పాడెడువాఁడు.

**గాద[1].** వి. ౧. కదుము, బొప్పి, గాదము.

ఉ...మేను పెనుగాదలు గట్టఁగ ప్రేసికొంచుఁ
ద,న్మెచ్చకయున్న వానిఁ గని మేగరు దా
ల్పఁగ నిట్లు పల్కినన్. వాసిష్ఠ. ౨. ౧౯౨.
('గ్రాద' శ. ర. పా.)

౨. చెమటకాయలతఱచు. (శ.ర.)

**గాద[2].** వి. (సం. గాథా) వృత్తాంతము, సమాచా
రము.

గీ...తత్ప్రాణసఖులు, దేవకీదేవి కీమాట దెల్పస
న్నఁ, గా దనుచుఁ జేరి చెలి యున్నగాద
దెలిపి,రి... విజ. వి. ౩. ౬౮. (ప్రయోగాం
తరము కనఁబడలేదు.)

**గాద[3]**=గాదము[2].

సీ. పైరు మునుఁగ గాద బలిసినచేలలోఁ దెరలక
కలుపులు దీసి తీసి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

**గాదము[1].** వి. గాద, కదుము, ఘాతభవగ్రంథి.

గీ. గాద మనఁగను బొప్పి నాఁ గదుము నాఁగఁ,
దగును ఘాతభవగ్రంథి...ఆం. భా.౨.౧౩౦.

**గాదము[2].** వి. కసవు, గడ్డి.

సీ. గడ్డి గాదము గవతము కసవు కవను, ఫుల్లు
పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ...ఆం.
భా. ౨. ౭౬.

చ. అలఘుబలాఢ్యుఁ డయ్యును దయాళువు గా
వున శాంతచిత్తుఁడై, నిలిచినతంద్రికాలమున
నెమ్మది గాదములోనిపోసకాయలువలె ను
న్న రాజులు బలారిభయంకర నిన్ను నట్లు
కాఁ,దలఁచిరి దాడివెట్టి భుజదర్పముఁ జూపు
ము వేయు నేటికిన్. వరాహ. ౩. ౫౪.

గీ...గాదమున మాటుపడి యున్నకాయపోలె.
విక్ర. ౪. ౬౦.

**గాదిలి.** వి. ౧. కూర్మి, ప్రేమ.

గీ. అలయుఁ జుట్టము కూర్మి గాదిలి యనంగ. ఆం.
భా. ౩. ౪౬. ఆం. శే. ౬.

౨. చుట్టము. ఆం. భా. ౩. ౪౬

౩. ప్రియుఁడు, భర్త; ప్రియురాలు, భార్య.

ఉ...ధర్మభా, గమ్ములకర్త భారతికి గాదిలి ము వ్వురతోల్త పేరు...హరి. పూ. ౧. ౩.

ఉ...అల్కలోఁ, గన్నుల నిప్పు లొల్కఁహరు గాదిలి దక్షునిఁ జూచి యిట్లనున్. కు.సం.౨. ౧౬౩.

విశ. ప్రేమపాత్రము.

సీ. కాశిరా జనువానిగాదెలికూఁతులఁ గవలవా రల నలికాంతిమతుల. భార. సభా. ౧.౧౩౫.

(తల్లి కొడుకును పిల్చుట) ద్వి...యక్షేశసఖుని సన్నిధిఁ బ్రసాదంబు గొనఁగ నాగాదిలి రావె. బస. పు. ౪. ౪౪౬ పం.

గాదియ(దె)=గాదె.

సీ. ఎదురుమాటినపందిఁ గదిసి గాదియక్రిందిపం దికొక్కని మోరఁ బట్టి కెడపు...గీ. అధిప దేవరబంటు గన్నట్టిపట్టి...రా. వి. ౩. ౪౫.

ద్వి. గంభీర మగుకొల్చుగాదెలలోన ... పండి తా. దీక్షా. ౪౪. పా.

సీ...కుసూలాభిధ గాదె యనంగను గరిసె య నఁగ. ఆం. భా. ౨. ౨౪౦.

గాధము. సం. విశ. (అ.ఆ.అ) మెరకగా నున్నది, లోఁతు లేనిది. (వ్యతి. అగాధము.) వి. అ. న.౧. లోఁతు లేనిచోటు, మెట్ట, మెరక. ౨. స్థానము, చోటు. ౩. లిప్స, సంపాదింప నిచ్ఛ.

గాధి. సం. వి. ఇ, న్. పుం. విశ్వామిత్రునితండ్రి.

గాధేయుఁడు. సం. వి. అ. పుం. గాధిపుత్త్రుఁడు, వి శ్వామిత్త్రుఁడు.

గానము. సం. వి. అ. న.౧. పాట. ౨. ధ్వని.(శే.ని.) ౩. పోవుట. ౪.స్తుతి. (వాచ.)

గాని. సం. విశ. (న్. నీ. న్.) ౧. పోవువాఁడు.౨. పొగడువాఁడు. ౩. పాడెడువాఁడు, గానము చే యువాఁడు. (వాచ)

గానిని. సం. వి. ఈ. స్త్రీ. కంఠస్వరము తేటపఱచున ట్టియొకమూలిక, వచ, వస ౯. (వాచ)

గానుఁగ(న్గ)=గానుఁగు. (క. గాణ. త. కాణమ్.) నూనె చెఱకురసము మున్నగునవి తీయుయంత్ర ము.

సీ. తిలయంత్రసంజ్ఞయై యలరు గానుఁగ యన... ఆం. భా. ౨. ౩౦౨.

గానుఁగరోఁకలి=గానుఁగాడుట కుపయోగించు రోఁకలి.

చ...తదంగము లొండొకటిం బొరింబొరిం, గది యఁగ నొక్కి నొక్కి పెనుగానుఁగరోఁకట నిత్తుఖండముల్, చిదుపు తెఱంగునం జిదియఁ జేయుడు...పరమ. ౧. ౭౯.

గానుఁగపట్టె=గానుఁగ ఆడునపుడు గానుఁగవా రు కూర్చుండుపలక.

ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుటెద్దుఁ బ్రతోదము మోపి రొప్పచున్, గానుఁగపట్టెపైఁ దిరుగుఁ గట్టెఁడి టిట్టిభ మందరాద్రిమం,థానకమధ్య మానతిమిధామజలభ్రమిమండలం బధి,స్థాన ముగా భ్రమించునలసంపదచేడియఁ బోలకుం డునే. క్రీడా. ౧౦౩.

గానుఁగతోలు=తోటివలె నుండుగానుఁగభాగ ము.

సీ. బూరుగుపెనుమ్రానుపాడవు గానుఁగతోటివల ముదేహము దాకవంటినోరు. చంద్ర. వి.౧. ౭౫.

గానుఁగు(న్గు), గానువు=గానుఁగ. వి.నూనె లో నగువానిని దీసెడియంత్రము.

క...అతనివంశం బెల్లన్, గానువునఁ బెట్టి యా ర్చిన, నేనియుఁ జాల దిది పెద్దయే దక్షునకున్. కు. సం. ౨. ౨౨౯. (చూ. కల్లుగాన్గు.)

గానుఁగు(గ)ది=తిలఘాతుకురాలు.

ఉ. మీనవిలోచనంబులుకు మీటిన ఖంగనుగుబ్బ చన్నులున్ ...మంద యానముం, గా నొనరిం

చి దీని గణికామణిఁ జేయక నిర్దయాత్ముఁడై, గానుఁగదానిఁ జేసినవికారవిధిం దలమొత్తఁ గాఁ దగుక్. క్రీడా. ౧౦౪.

గానుఁగు(గ)వాఁడు=తిలఘాతుకుఁడు.

సీ...తిలఘాతుకుం డొప్పఁ దెలికవాఁడు, గానుఁ గవాఁడన...ఆం. భా. ౨. ౨౫౪.

గానుఁగాడు=(నువ్వులు మొదలైనవి) గానుఁగ లోఁ బెట్టి ఆడు.

(వ్యవ) దినమునకు ఎన్నినువ్వులు గానుఁగాడు దురు.

సా: గానుఁగుఱోటిలో చేయి పెట్టి పెరుమాళ్లకృప యన్నట్లు.

జ: గానుఁగుఁబిండి.

గానుఁగు(గ్గు)ఁబిండి. వి.(గానుఁగు+పిండి) తెలికపిండి, పిణ్యాకము.

క.దుండిగపాకుం గానుఁగుఁ,బిండియు ఁఉపకడఁ బొరఁటి ప్రేమం దినఁగా, రెండయిదుదినముల కుఁ దా,ముండుట లేదనుచుఁ బోవు నుగ్రపు బల్లల్. (చికి. చి. ని.)

సీ...తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గాన్గుఁబిండి యనంగ...సాం. ని. మాన. ౪౭.

గాబ=గాబము. వి. తృణవిశేషము. (శ. ర)

ఉదా: ఇక్కడ గాబ యెక్కువగా పెరిఁగినది.

ద్వి. గాబకోరిందలఁ గడు దట్టమైన. ద్వి. పరమ. ౭. ౪౯౯ పొ. ౪ పం.

గాబము=గాబ. (శ. ర.)

గాబరా. వి. (హిం. గాబరా. ప్రా. మిశ్ర.) భయము, తొందర, కలవరము. (శ. ర.)

గాబాగూబీ. వి. అడావుడి, గడబడ.

క. నీబానిసతో త్తిది దయ, చే బాసల నిచ్చి చాలఁ జేపట్టు మిఁకక్, గాబాగూబీ సేయక, నీబంతిని గూడు గుడుపు నిత్యము సామీ. చంద్ర. వి. ౩.౧౪౮.

గాబు. వి. మూతివెడల్పు గలపెద్దపాత్రము, కొప్పెర.

గీ. గాబు కొప్పెర యనఁగను గర్వర మగు...ఆం. భా. ౨. ౨౪౺.

సా: గాబు వచ్చి కడముంతలోఁ దూటినట్లు.

గామ. వి. పిపీలికావిశేషము. (శ. ర.)

ద్వి. ఓసి యమంగల్య మొదవ నేడ్చెదవొ,యీసంధ్యప్రొద్దు మాయింటిముందటను, గలగొని చీమల గామలవలెను, జెలఁగుచు ముందఱ శిశువులాడఁగను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౯౪ పం.

గామి. సం. విణ. (న్. నీ. న్.) ౧. పోవునది. ౨. పొందునది.

గామిడి. విణ. (సం. గ్రామణీః) ౧. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు.

మ...ఊరిగా,మిడిబాఁపల్ చనుదెంచి రద్దురిపద భూమిాథ ర్తయిల్ చేరఁగక్. పాంచాలీ. ౪. ౩౯.

క. కడకడయొడయనిముంగై, కడియపునుస్నెత్తఁ బండుగామిడి మన్నం,బడఁతుకకై యిష్టానిసి, యొడ లూనినవాఁడు సూనె యుక్కు దలిర్పక్. అచ్చ. రా. బాల. ౯౭.

౨. పీనము, బలిసినది.

ఉ. మోమఖిలంబుఁ గన్నుఁగవ ముచ్చటమిాఁఁగ వక్షమంతేయుక్, గామిడిచన్నుదోయి కనుఁగొను సమస్తము మిన్న...బిల్హ. ౩.౭౯.

౩. గయ్యాళి.

ఉ. ఆమహితాత్ముఁ డొక్కనెలయాలికి మిక్కిలి తాను గూర్చువాఁడై మమత నైలంగుచు నొకప్పుడు నేమియు నీయకున్నచో, గామిడి దానితల్లి విటకంటకి యిల్వెడలింప పంచే, భామినియింటిపంచ బహుభంగులఁ జింతిలుచుండ నవ్విటక్. విప్ర. ౪. ౪౨.

౪. దుష్టము.

ద్వి. నామీఁదికొ న్మేలనలుకెదు రోరి, గామిడిగొల్ల యీకొననంబునను, మాకు నీడై యున్న యీకొమ్మె కాని, చేకొని నలుకంగఁ జెట్టులు లేవె. బస. పు. 3. ౧౧౨౫ పం.

ఉ. ఏ మనుదాన నేకరణి నే మనుదాన వియోగ సాగరం, బే మని యీఁదుదాన గతి యే మని పల్కెడువారిఁ గాన హా, గామిడిదైవ మీవిత ముగా మిడిమేలపుఁజేఁత నిర్దయన్, సీమలు గానిసీమలకుఁ జెల్వఁడ యేఁగఁగఁ దెచ్చె నక్కటా. శశాం. ౨. ౧౩౩.

జ: గామిడికత్తె, గామిడికాఁడు, గామిడిపంది.

గామిడికత్తె=గామిడి. (గామిడి + కత్తె - స్వార్థమున)

(దుష్టురాలు)

ఉ. సీమపాలంతు లెల్లఁ దమచేతికి వచ్చినదాఁక నోయి నా, సామి వితీర్ణికర్ణ యన సాగుదు రంతటిలోన నోయి నీ, గ్రామము నామ మెయ్యది యొకొ యనఁ జూతురు కూఁతు రావగన్, గామిడికత్తె గాదు మిముఁ గన్నులఁ గప్పుకొనంగ నేరుచున్. బహు. ౫. ౧౨౨.

గామిడికాఁడు. వి. (గామిడి + కాఁడు) వరాహ యూథపము, పందికదుపునకు మొనగాఁడైనపంది.

గీ. పంది నలు గేకల మ్మనఁ బరఁగు ఘృష్టి, తనరు గామిడికాఁ డనఁ దద్గణేశుఁ, డు... ఆం. భా. ౨. ౭౨.

గామిడిపంది=గామిడికాఁడు. (గామిడి + పంది)

సీ. ఘురఘురధ్వనులతోఁ గోలలకొనఁ జిమ్ముగామిడిపందులఁ గని తోలఁగక. మల్లు పు. ౧. ౫౯.

గాము. వి. (సం. గ్రహః) ౧. పిశాచము.

ఆ... బూచి, గాము సోఁకు సత్తి గాలి దయ్యము బూత, మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ. ఆం. భా. ౧. ౬౩.

గీ. నిప్పు ద్రొక్కినరీతిని నిలువ దెచట, గాము సోఁకినరీతిని గలవరించు, విఱిగి తల మిన్ను పడిన ట్లు విన్నఁబోవు, భావజునిధాటిఁ గలఁగి రాధావధూటి. రాధికా. ౨. ౧౯.

చ. కలువలగోము జక్కవలగాము వియోగులబాము... చంద్రుఁడు దోఁచెఁ దూర్పునన్. ఘటికా. ౨. ౧౪౩. (ఇట 'పీడించువాఁడు' అని భావము.) భార. సా. ౧. ౧౫౬.

౨. సూర్యాదిగ్రహము.

సీ... నాలు, గవలగనంబున నన్ని గాములును మేల్చోడ్కులఁ దనరార వేడ్కఁ బొదలి, మొదలివెలంది రామునిఁ గాంచె... అచ్చ. రా. బాల. ౭౪.

గీ. కాముఁ డనఁగ నెంత గండుఁగోయిల యెంత, సోముఁ డెంత గాలి నేమ మెంత, భీము రాము గాముఁ బాముఁ బ్రార్థించిన, భామ వారిగర్వభంగ మగును. కవిరా. 3. ౧౫౩.

గాములమేటి=సూర్యుఁడు, గ్రహపతి.

ఉ. గాములమేటి లోకములకన్ను తమమ్ములమిత్తి యామినీ, భామ తొలంగుబావ ... భానుఁడు తూర్పునఁదోఁచె నత్తఱిన్. కృ. శకుం. 3. ౫౭.

ఇట్లే: గాములఱేఁడు.

ద్వి. కలువలపగవాఁడు గాములఱేఁడు. ద్వి. హరిశ్చ. పూ. ౨౨౦౧ పం.

గాముకము. సం. విణ. (అ. ఆ. అ) పోవునది.

గాముకోసు. వి. ఊరిచుట్టుకోట. (చి. ని.)

గాయకము[1]. వి. (త. కాయకం = వ్యామోహము) మాయ, వంచన.

గీ. చాయవాటులు సన్నలు గాయకములు, మెచ్చులును దచ్చనలు పొరపొచ్చెములును, దగవులును వారకాంతావితానములకు, జలజలోచనలార నైసర్గికములు. కాళ. ౪. ౩౦.

విణ. వంచకము.

గీ. ఓసి పాపాత్మురాల నీ వేసదారి, గాయకపుసుద్దు

లెల్ల నాకాశవాణి, తెలుప విని వచ్చి ...సా రంగ. 3. ౨౦౮.

ద్వి. మృత్యువు గిత్యువు మెసవంగ వెఱచు,నత్యం తవజ్రమయం బగు నిదియు, గాయకంబులు వక్కఁగా లేము గాని, కాయసిద్ధులు చూపఁ గలము మే మనిన. ప్రభులిం. ౮. ౧౨౮ పా. ౨౩ పం. (గాయకములు:-కపటవచనములు.)

**గాయకము².** విణ. ప్రియము, ఎక్కువవెల గలది.

ఉదా:ఈయేఁడు మిరెపకాయలు గాయకముగా నున్నవి.

**గాయకుఁడు.** విణ. ప్రౌఢుఁడు.

ఉ. ప్రాయపుగాయకుల్ వెలనెపాన నెగాదిగఁ జూడ నేర్పు లౌ,రా యివి దండమీఁదఁ గొసరం దొరఁకొంటిరి మంచిసాములే, పో యిటు లైనచో సరసము ల్గద మా కిపు డంచు నప్పరిం, గాయజుతూపు లమ్ముదురు కందువమాటలఁ బుష్పలావికల్. విజ. వి. ౧. ౧౮.

ఉ. గాయకుఁ డొక్క-గాయకశిఖామణి యాయెడఁ దద్గురుక్ విప,ణ్యాయతవృత్తి వర్తిలు ప్రియవ్రతనూనునిఁ గాంచి వైశ్యరా,ధేయ సుధీజనావలివిధేయ భవత్సుతుఁ డిచ్చినట్టికా, శేయముఁ గంటె దానగుణశేఖరుఁ డంచుఁ బదంబు వాడినక్. బహు. ౫. ౧౪౮.

**గాయకుఁడు.** సం. విణ. (అ. యికా. అ) ౧.పాట పాడువాఁడు. ౨. నర్తకుఁడు, నటుఁడు.

**గాయత్.** సం. శత్ర. గానము చేయుచున్న.

**గాయత్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ద్విజులు సంధ్యోపాసనయందు జపించుమంత్రవిశేషము; దేవతావిశేషము. ౨. ఆఱుఅక్షరములఛందస్సు. 3. ఖదిరము, చంద్రికి.

**గాయనము.** సం. వి. అ. న. పాడుట; పాట.

**గాయనుఁడు.** సం. విణ. (అ. ఈ. అ)పాట పాడువాఁడు.

**గాయమానము.** వి. శస్త్రవిద్యాభేదము, ఒకవిధమగుసాదన.

వ...లోబిత్తరియు వెలిబిత్తరియు సర్వాంకుశంబును మొదలుగాఁ గలపదిరెండుగాయమానంబులును... ప్రబంధ. ౭౭.

సీ...సాదకాఁ డనఁగను శస్త్రదక్షుఁ. గీ.డలరఁ దద్విద్య సాదన యనఁగ నెగడు, నలుకు పరువడి గాయమానంబు విసరు,మొన లనంగను దద్భేదములు చెలంగు. ఆం. భా. ౨.౨౦౫.

**గాయము.** వి. (క. గాయ.త. కాయం) కత్తి లోనగువానితాఁకునఁ గల్గుదెబ్బ, క్షతి, నలుకు.

శా...అతఁడుక్ రాకాసి మేల్బంతిపైఁ,దేజారం బెడిదంపునారసము లెంతేని న్వడి వ్వైరిమే,న్గాజుంబూసకు సందు లేక కదియం గాయంబులం జేసినక్. అచ్చ. రా. యు.౫౦౩.

క. ఇవి పందికొమ్ముగాయము, లివి సింగపుఁగోఱజీర లివి యేనుఁగుపో,ట్లివి పులిగోరులచెనకులు, నువుగింజకుఁ జో టిడదు తనువు గనుము నృపా. రా. వి. 3. ౪౭.

గాయముచేయు=గాయము కలదిగాఁ జేయు.

వ...కయ్యంబునఁ బాఱఁ బాఱఁ గాయంబు గాయంబు నేసి ...ఆము.౬.౮౬. (ప్రాశప్రతి.)

**గాయము.** సం. వి. అ. పుం. ౧. పాడుట.౨. పాట,

**గార¹.** వి. (సం. క్షారః. క. గారె. త. కారై.) ౧. గోడ లోనగువానిపూఁతకై ఇసుకఁ జేర్చి దంచినసున్నము.

సీ. కంకర బెందడి గార సోద యనంగ లేపవిశేషమై తోఁపఁ దగును. ఆం. భా. ౨.౧౭.

సీ. చికిలిప్రాఁగెంపుటిటికలగోడలు వెట్టి వజ్రంపు గారలపను లొనర్చి. ఉ. రా. ౨. ౭౯౨. పాండు. ౫. ౭౯౮.

౨. డాఁగు, మఱక.

ఉదా: తాంబూలపుగార.

3. పట్టు.

ఉదా: కంటికి నల్లమందు గార వేసినారు.
౪. రత్నదోషవిశేషము.
క. ఈరత్నమునకుఁ బ్రుప్పియు, గారయుఁ గర్కశము ననఁగఁ గసరులు మూఁడే,పారు నవి యెల్లఁ దెలియక, వారక ధరియింప జగతి వల దెవ్వరికిన్. రత్న. ౨౫.
జ: గారకాఁడు.

గార². వి. ౧. ఇంగుది, ఒకానొక చెట్టు. (దీనికి సాలగ్రామనిఘంటువులో 'జలజంతువినాశక' మనుప ర్యాయపదము కలదు. సాల.ని.౬౫౦ పొ)
గీ. గాలములు వైచువా రవి కా వటంచుఁ, బెనువల ల వేయువా రవి పనికిరా వ,టంచు వడి గార చెక్కకై యఱచువారు, నై నయసురుల కని యె మత్స్యంపుమూర్తి. దశా.౧.౨౯౯.
సీ... గార యనంగ నలరు నింగు.గీ.దియు...ఆం. భా. ౨. ౪౭.
౨. గారచెక్కతో తీసినగంధము.(ఇది త్రాఁగిన చేఁపలు మత్తెక్కి పడిపోవును. బ్రౌ.)
గీ. గారఁ ద్రావినమీనుసంగతి మనోజ, వేదన నతండు పొరలఁ దన్వియు నెఱింగి, తనవలనుఁ జేరెఁబో బోడిదాస రనుచు, డెందమునఁ జాల సంతస మందె నంత. వైజ. ౨. ౧౪౦.
ఆ. వలలు దారు నింక వచ్చి జాలరివేఁట, కాలు నేఁలు గలఁచి గారవెట్టి, మిడిసిపోవనీక మెడఁ బట్టుకొనియెద,రప్పు డెందుఁ జొత్తు నన ఘచరిత. భాగ. ౮. ౬౯౭. ద్వి. తి. సా. ౪౨ పొ. ౧౧ పం. దశా. ౧. ౧౫౪.

గారపిండి=గారకాయలపిండి.
ద్వి. మొనసి తిలోదకములు వోసి పగలు, పెనఁగొన మఱి గారపిండి చేఁ బుణ్యా, ధను లర్థిఁ బిండప్రదానము ల్చేసి. రం. రా. అయో.౧౩౮ పొ. ౨౯ పం.

గారకాయ=ఇంగుదీఫలము; గారకాయలో మందుకూరి చేసిన ఒకానొక బాణసంచు.(వా)
గారనూనె=ఇంగుదీతైలము, గారకాయలనుండి తీయునూనె.

గార³. వి. ఒకజాతిచేఁప. (బ్రౌ)

గారకాఁడు. వి. (గార¹+కాఁడు) నూసరి,గచ్చు పని చేయువాఁడు.
సీ...మీఁలు నూసరి యన గారకాఁడు ... ఆం. భా. ౨. ౫౨.

గారడము. వి. (సం.గారుడమ్. క. గారడ. త. కారడం) ౧. విషమంత్రము. (శ. ర.) ౨. మాయ.
గీ. గారడపురక్కసుని నెందుఁ గానకుండి,రి... అచ్చ. రా. యు. ౩౭౭.
క. తలఁపున నిది గారడ మని,తలఁపకు మాసింగఁడల్లతరిగొండదరిన్, దల మోచి తెచ్చినవి యివి,తల నుంచుము పసిఁడితాయెతల నుంచి నృపా. శుక. ౧. ౧౨౫.
జ: గారడి, గారడీ, గారడీఁడు.

గారడి. వి. (గారడము+ఇ)పాములు పట్టువాఁడు, గారడీఁడు.
గీ. వ్యాళసంగ్రాహినామమై వఱలు గార,డీఁడనంగను బాములవాఁడనంగ, గారడి యనంగ...ఆం. భా. ౧. ౧౪౮.

గారడీ=గారడము. వి. (√ గారడము. క. గారడి) ఇంద్రజాలము; మాయ. (బ్రౌ, వా)

గారడీఁడు. వి. (గారడి+ఈఁడు-స్వార్థమున) ౧. గారుడమంత్రము తెలిసినవాఁడు, పాములవాఁడు.
ఆ. అను వెఱింగి భూపుఁ డనుపాముఁ బట్టియా,డించు మంత్రి గారడీనికరణి. ద్వా. ౧. ౧౯౪.
గీ. వ్యాళసంగ్రాహినామమై వఱలు గార,డీఁడనంగను బాములవాఁడనంగ, గారడి యనంగ ...ఆం. భా. ౧. ౧౪౮.
౨. (గారడీ+ఈఁడు) ఐంద్రజాలికుఁడు.

గీ. ఐంద్రజాలికసంజ్ఞమై యలరుచుండు, గారడీఁ
డన...ఆం. భా. ౨. ౨౫౭.

గారము. వి=గారవము.

(అపేక్ష; వలపు.)

సీ. కందుకక్రీడపై గారంబు పచరించుహస్తాబ్జము
లఁ బూనె నక్షమాల. హర. ౪. ౧౧.

(ఆకాశవాణిమాట) ద్వి. సకియ నీయింటికి సారం
గధరుఁడు, ఒకపావురమువెంట నుతికి రా లే
దె, రాఁగానె నీవు గారముచేయ లేదె, బా
గుగా నీకాళ్లఁ బడి మ్రొక్క లేదె. ద్వి. శ. సా.
3. ౧౦౪ పా. ౧౨ పం.

(మైత్రి.)

గీ. పొందొరిమె పొత్తు గారము పొందిక యనఁ,
బరఁగుచుండును మిత్రభావంబు... ఆం. భా.
౨. ౧౮౬.

విశే. అధికము.

క. నూరెల ముదికౌముదిసిం, గారము గార మయి
పాముకన్వలె మెఱుఁగుల్, వాఱు చెలువారు
నొక తెల్లి, పారువ మిట వ్రాలె వెలుఁగుపడి పడిఁ
జూడన్. సారంగ. ౨. ౨౧౭.

గారవము=గారము, గారాబము, గారాము. వి.
(సం. గౌరవమ్. ప్రా. గారవం.) ౧. గౌరవము,
ఆదరము.

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుఁడు,
గాఁ దలంచె నేని గారవమున, నట్ల చేసి భక్తి
ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్య
యుతము గాఁగ. భార. విరా. ౧. ౧౮౮.

౨. గొప్పతనము.

సీ. నిండుఁగొల్వునను గూర్చుండి ధర్మజుతోడఁ
గార్యంబు దెలిపెడి గారవంబు. దశా. ౧. ౯౪.

3. ప్రేమ, అనురాగము; వాత్సల్యము.

క. ఈరాజు రాజముఖియును, గారవమునఁ గల
సి మెలసి కందర్పసుఖ, శ్రీరతులై విహరించె
ద, రీరీతిని మనము నునికి యెంతయు నొప్పన్.
విక్ర. ౭. ౮౫.

క. ఆరాజర్షియు దానికిఁ, గారణ మమ్మునియు కాఁ
బ్రకాశజ్ఞానో, దారమతి నెఱిఁగి కన్నియు,
గారవమునఁ గొని పులస్త్యుకడకుం జనియెన్.
నిర్వ. ౨. ౨౭.

౪. ముద్దు, లాలనము.

గీ. చెంచుఁజిసురాసుఁ బోణులచేఁత లెల్ల, నభిన
యింతురు పర్ణశాలాంతరములఁ, దండ్రు లెం
దేని చనునప్డు తల్లు లెదుర, గారవము సేయ ము
నికన్యకాజనంబు. హర. ౫. ౩౭.

౫. రీతి, విధము.

సీ. శిబిపోలిక మరుత్తుచెల్వునను దిలీపుకరణి సు
హోత్రుని గారవమున. విక్ర. ౨. ౬౯.

జ: గారవించు, గారవిల్లు.

గారవించే. స. క్రి. (√ గారవము) గారవము
చేయు.

(ఆదరించు.)

గీ. నాకుఁ బ్రాణంబుప్రాణమై నన్నుఁ దన్న, కాఁగ
భావించి యాదేవి గారవించు. భార. విరా.
౧. ౩౧౬.

చ. అనవుడు నక్క రాఁ బనిచి యప్పలి గౌఁగి
టఁ జేర్చి బాష్పముల్, గనుఁగవఁ గ్రమ్మ నుక్
బలుకులం దగఁ బెద్దయు గారవించినన్. భా.
ర. శాం. ౩. ౭౪.

(గౌరవముచేయు.)

శా...న న్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి, సత్కా
రం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవా
క్ప్రౌఢిమన్. నైష. ౧. ౧౨.

(లాలనచేయు)

సీ. తనమంజులాలాపతతిఁ గూడి భాషించుకీరం
బు నొక కేల గారవించి. విక్ర. ౨. ౨౭.

సీ...కార్తికేయుని శూలి గారవించి, ముద్దాడు
నెడ...ఉ. హరి. ౫. ౬.

గారవిల్లు(లు). అ. క్రి. (√ గారవము) గారవము నొందు.

(లాలనమును పొందు)

(బభ్రువాహనుని శైశవవర్ణన.) సీ. తనవంశకర్తను త్పలబాంధవునిఁ బోలుఁ గరము లర్మిలిఁ జూఁచి గారవిలుట. విజ. వి. ౨. ౪౦.

(అనురాగమునొందు, వలపుఁజెందు.)

క. చెలువా పదివే లైనను, విలువా నినుఁ జూచి గారవిలువారలకున్. చంద్ర. ౪. ౧౧౪.

(గౌరవము నొందు)

ఉ. ...తమ్ములు గల్గి గారవిలుధన్యులసంపద కేటి లెక్క... ల. వి. ౩. ౫౫.

గారాబము. వి=గారవము.

(వాత్సల్యము.)

(రేవతి)ఆ.వీఁటఁ బెంచుదానిఁ బూఁటఁ బెంచె నటంచు, జనులు పల్కు పలుకు సత్యముగను, గన్నతల్లి మిగుల గారాబమునఁ బెంపఁ, బెరిఁగెఁ జైత్రలతిక పెంపు మీఱ. దశా. ౭. ౭౦.

(గొప్పతనము)

క. వారలలోఁ గౌసల్యా, నారీమణి యఖిలపావనశ్రీమద్గర్భాధూఢలక్షణంబుల,గారాబముఁ జెందె విభుఁడు గడు రంజిల్లన్. రామా. ౩. ౭౧.

విశ. ప్రేమాస్పద మైనది, ప్రియము.

సీ. రాజశేఖరునిగారాబంపుఁబూఁదోఁట విపులామహాదేవివెల్లచేల...గీ... అంబురాశి. చిత్రభా. ౫. ౫.

గారాబు. విశ. ప్రియము.

గీ. సోమమకుటునిగారాబుజోటి యైన, దక్షవాటికఁ బ్రతిమహోత్సవమునందు. భీమ. ౩. ౬౨.

సీ. కమలాప్తసారథి గారాబుఁదమ్ముండు ...పారి. ౨. ౭౧. అచ్చ. రా. యు. ౪౭౧.

గారాము. వి=గారవము.

(గొప్పతనము)

సీ. మారేడుపండులగారాము సెబచునీమొలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె. భార. అను. ౧. ౫౦.

శా. ఈరూపే కలలోపలం గలసె న న్నేరూపునం జేర నా, కీరూ పింతటిమేటిరూపసికిఁ దా నిల్లాలుగా నోమునన్గారా మేలలితాంగికిం గలుగు...ఉ. హరి. ౫. ౧౫౫.

(ఆదరము.)

క. ఆరాజు సేయునెయ్యము, గారామును జెప్ప దీపు గడుఁ దీపుగా. భార. ఉద్యో. ౧. ౩౪౦.

(మరియాద, గౌరవము.)

ఆ.విగతనాథ లైనమగువలగారాము,సెడక యుండునట్లు నడపికొనుచు. భార. మౌ. ౧౭౫.

(కామోద్రేకము)

శా. ఆరామామణిమీఁదిప్రేమమున నిట్లారామసీమాసరో,వారంబు ల్దిలకించి యందు నతిదుర్వారంబులై మిఱుఖృం,గా రావంబులచే ననంగరుజ వొంగారం గురంగాక్షిక్ర్యం,గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా రాక గారామునన్. వసు. ౩. ౭౩. (చూ. ౭౪.)

విశ. అనుఁగు, ప్రియ మైనది.

సీ...భూరిశ్రవసుఁడు నీదు, గారాపుఁబట్టి... భార. స్త్రీ. ౨. ౧౨౭.

శా... మారయకుఁ బుణ్యాచార ధీమాంబకున్గారా మైనతనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి...నైష. ౧. ౧౨. సీలా. ౧. ౧౨.

(గౌరవపాత్రము)

క. దేవకియును రోహిణియును, రేవతియును రుక్మిణియును బ్రియము లెసఁగ సంభావన లొనర్ప గారా,మై వెలసె బలేంద్రుపౌత్రి యదుతతి కెల్లన్. హరి. ఉ. ౭. ౨౯౯.

గారిత్రము. సం. వి. అ. న. అన్నము. (కల్ప)

గారు. వి. పౌ. ఇది తఱుమగా స్త్రీసమము లగు నేక వచనాంత దేశ్యశబ్దములకుఁ గొన్నింటికి చివరఁ జేర్పఁబడి పూజ్యతను దెలుపును.

ఉ...కూరిమియల్లు నంపుచో, నెట్టివిపాద మాత్మ నుదయించెనొ మామసనత్త గారికిఁ. నైష. ౭. ౪.

గీ. కదిసి నిలుచున్న సౌమిత్రివదినె గారి, జిలుఁగు నవ్వులు మగఱాలచిలుక తాళి, నవఁగి పెనఁగఁ ద్రిలోక మోహనవిలాస, ధాముఁడై మించె సీతాభిరాముఁ డపుడు. ఉ. రా. ౬. ౧౯౯.

ద్వి...మసణయ్య గారు...పండితా. దీక్షా. ౬౦పు.

ఉదా: నాయఁడుగారు, సోమయాజులు గారు.

ఉ. నన్నయభట్టుగారు యజనం బొనరించినచోట జమ్మిచెట్టున్నది...(చాటువు)

గారుడము. సం. విణ. (అ. ఈ. అ) ౧. గరుడాకారము గలది. (వ్యూహము, మొ.) ౨. గరుడసంబంధ మైనది, గరుడుఁడు దేవత గాఁ గలది. (అస్త్ర మంత్రాది) వి. అ. పుం. న. ౧. గరుడపచ్చ. ౨. విషమంత్రము. ౩. గరుడాస్త్రము. ౪. గరుడ వ్యూహము. ౫. బంగారు. ౬. గరుడపురాణము.

గారుడికుఁడు. సం. వి. అ. పుం. విషవైద్యుఁడు, పాములవాఁడు.

గారుత్మతము. సం. విణ. (అ. ఈ. అ) ౧. గరుడాకారము గలది. (వ్యూహము, మొ.) ౨. గరుడుఁ డధిదేవత గాఁ గలది. (అస్త్రము, మొ.) వి. అ. న. గరుడపచ్చ.

గారె. వి. భక్ష్యవిశేషము, మినుపపప్పు రుబ్బి చేసెడివడ.

సీ. గారెలు బూరెలు చారులు మోరులుఁ గమ్మని మాంసముల్ ఘుమ్మనుచు. ఉ. రా. ౬. ౧౨౨.

మ. కుసుముల్ గారెలు బెల్లమండెఁగలు... రామా. ౨. ౧౧౫.

సా: కడుపు నిండినవానికి గారెలు చేఁదు.

గార్గ్యుఁడు. సం. విణ. (అ. గ్రీ. అ) గర్గునివంశమున పుట్టినవాఁడు.

గార్దభము. సం. వి. అ. పుం. గర్దభము, గాడిద.

గార్ధ్యము. సం. వి. అ. న. పేరాస, తృష్ణ.

గార్ధ్రము. సం. విణ. (అ. ఈ. అ.) గృధ్రసంబంధ మైనది. వి. అ. న. బాణము.

గార్భము. సం. విణ. (అ. ఈ. అ.) గర్భసంబంధ మైనది.

గార్భిణము. సం. విణ. (అ. ఈ. అ.) గర్భిణికి సంబంధించినది. వి. అ. న. ౧. గర్భిణీసమూహము. ౨. సీమంతోన్నయనము, గర్భిణీసంస్కారవిశేషము. (కే. ని.)

గార్హపతము. సం. విణ. (అ. ఈ. అ.) గృహపతి సంబంధ మైనది. వి. అ. న. గార్హస్థ్యము, గృహస్థధర్మము.

గార్హపత్యము. సం. వి. అ. పుం.-గృహపతితో నిత్యము కూడి యుండునది- అగ్నిహోత్రభేదము, శ్రౌతాగ్నులలో నొకటి. (గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అని శ్రౌతాగ్నులు మూఁడు.) న. గృహపతిత్వము, గార్హస్థ్యము.

గార్హము. సం. విణ. (అ. ఈ. అ) గృహసంబంధ మైనది.

గార్హస్థ్యము. సం. వి. అ. న. ౧. గృహస్థాశ్రమము. ౨. గృహస్థుఁడు ప్రతిదినము నడుపింపవలసినపంచయజ్ఞములు, మొ.

గాలగాఁడు. వి. (గాలము + కాఁడు.) గాలము వేసి చేఁపలు పట్టువాఁడు.

సీ...పాపనిర్ముక్తుఁడై మతి యోగ మాచరింపఁగ యోగ్యుఁ డగు నరుండు. గీ. మనను పట్టుట ముఖ్యపుటనువు దాని, కామిషము గాలగాని కట్లట్ల... భార. అను. ౫. ౨౫౬.

గాలనము. సం. వి. అ. న. ౧. వడఁబోయుట. ౨. ద్రవింపఁజేయుట, కరఁగించుట. ౩. శాపము, తిట్టు.

గాలపుఁజేవ్వ. వి. (గాలము + మవ్వ) చేఁపలనుబట్టుట కుపయోగించుసన్న నిపాడుగై నరెమ్మ. (బ్రౌ)

గాలము=గాలాము. వి. (సం. గాలమ్. క. తు. గాళ.) ౧. చేఁపలను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁ జేసినసాధనము, బడిశము. (దీని భేదములు:- ఉంటగాలము, గోరుగాలము, మొ.)

సీ...బడిశ మెసఁగు, గాల మంచనఁగను. ఆం. భా. ౧. ౧౫౯.

ఆ. నీళ్లలోని చేఁప నెఱి మాంసమాశకు, గాలమందుఁ జిక్కి కూలు నట్టి, యాశ పుట్టి మనుజుఁ డాశీతిఁ జెడిపోవు...వేమన. ౧. ౫౫.

చ. కలువలవిందు జక్కవలగాలము తమ్ములకెల్ల వైరి చుక్కలచెలికాఁడు...భా. రా. యు. ౨౬౪౭. (ఇట 'బాధకుఁడు' అని భావము.)

గీ. అనిమిషులగుండెలో గాలము...ఉ. రా. ౧. ౧౪౯.

౨. నూతిలోని చేఁద మున్నగునవి తీయుట కుపయోగించుసాధనము. (వా)

జ: గాలగాఁడు, గాలపుఁజువ్వ.

గాలము. సం. వి. అ. పుం. ౧. గళనము. ౨. మదనము, 'ఉమ్మెత్త'. న. ౧. ఉమ్మెత్తకాయ. ౨. బడిశము, గాలము. (కే. ని.)

గాలవము. సం. వి. అ. పుం. లొద్దుగు, లోధ్రముక్.

గాలాము=గాలము.

సీ. వాలారుగోరు మేల్ గాలాము చేసె నేజే జే హిరణ్యాసుశిశుకమునకు ... గీ. అనృహార్యతుషర్యుండు...పాండు. ౨. ౧౩౭.

క. చాలఁ గుఱుంగటిమణుఁగుల, గాలాపుస్వేటలాడఁగా దొరకినబల్లిలు చవిఁ దేల్చెనపుడా, పాలెంబున డిగినబక్కబంట్రౌతులనుక్. కువల. ౨. ౧౦౮.

గాలి. వి. (క. గాళి. త. కాల్. తు. ఘాళి) ౧. వాయువు.

సీ. కమ్మనిచల్లనిగాలి మెల్లన వీచె హోమానలంబు సెన్నొంది వెలిఁగె. భాగ. ౧౦ పూ. ౧౦౫. ఆం. భా. ౩. ౫౩.

౨. మృగాదివేద్యగంధము, పసి.

సీ. ఇవి గాలి గనిన మూకవరాహదనుజేంద్రు నైన జుట్టెంటిలో నాఁగఁ జాలు. మనుచ. ౪. ౩౧.

(సూకరము) సీ. ఎగుచుకూఁతలు ముట్టె యెత్తి బిట్టాలించి గమికిఁ గన్నా కయి గాలి యరయు. మనుచ. ౪. ౪౨.

౩-వాయురూపమున నుండునది-పిశాచము.

క. అన విన వదరకువే యీ, తని కేమియు లేదటంచు దానిపిఱుందన్, జని వీరుఁ డతనియాకృతిఁ, గని త్రోవం గాలి సోఁకెఁ గావలె ననుచున్. శుక. ౨. ౫౩౯.

సీ. పవనపిశాచము ల్పరఁగు గాలి యనంగ...ఆం. భా. ౩. ౫౩.

౪. పసువులకు తగిలెడివ్యాధివిశేషము. (దీని భేదములు:- కాలుగాలి, నాలుకగాలి.)

కాలుగాలి = పసువులకు గొరిజలయందు పుండుపడెడివ్యాధి, గాలికుంటు. (వా)

నాలుకగాలి=పసువులకు నాలుకయందు పుండుపడెడివ్యాధి. (దీనినే 'నోటిగాలి' యందురు.)

క. తైలంబు కోద్రవాన్నము, మాలిమితో నేడుమార్లు మంత్రించియు గో, జాలంబులకును బెట్టిన, నాలుకగా ల్లంట వండ్రు. ... పసువైద్యశాస్త్రము. ౮౯.

గాలితేరెక్కుమన్నీఁడు=(మలయువాయువు రథముగాఁ గలప్రభువు) మన్మథుఁడు. ఆం. భా. ౧. ౪౫.

గాలిపాట=నేర్చుకొనకుండ వినికివలన వచ్చిన గానము. (వా)

గాలిబ్రతుకు, గాలిజీవనము = స్థిర మైనజీవనోపాయము లేనిబ్రతుకు. (ప్రా)

గాలికవణంబు మేపుడు=పవనాశనము, పాము. అచ్చ. రా. యు. ౪౯3.

జ: గాలిఁబుచ్చు, గాలిఁబోవు, గాలికుంటు, గాలికొమ్ము, గాలిగంగలు, గాలిగాఁడు, గాలిగుడి, గాలిగూఁడు, గాలిగొను, గాలిగోపురము, గాలిగ్రుడ్డు, గాలిచీర, గాలిచూలు, గాలిధిండి, గాలిద్రిమ్మరి, గాలినెచ్చెలి, గాలిపంట, గాలిపటము, గాలిపడగ, గాలిపిశాచము, గాలిబిళ్ల, గాలిమాట, గాలిమెకము, గాలిమేఁతరి, గాలివాన, గాలివేఁత.

**గాలి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నింద. (వై. ని.) ౨. శాపము, తిట్టు. (విల్యమ్సు, ఆ. ని.)

**గాలించే.** స. క్రి. ౧. నీళ్లలో పోసి బియ్యములో నగువానిని రాళ్లు రాకుండ పైకి తీయు. (ప్రా)

౨. శోధించు, వెదకు.

సీ...కోటగవఁకు, లారసి బలితంపుఁదేసులు గాలించి...అచ్చ. రా. సుం. ౮.

మ...వీఁక నొ,క్కట లంకాదినిశాటకోటి నుదధింగాలించి కారించెదన్. భా.రా.సుం.౧౨౭.

గీ. మేఁక మెడచన్నులకుఁ బాలు మేడిపూలు, లేవు త్రిభువనములను గాలించి చూడ. వేణు. ౮౫.

జ: గాలింపు.

**గాలింపు.** వి.(√గాలించే) శోధనము,పడఁబోఁత.

సీ...పడిఁగట్టు గాలింపు కడుగు డేరు. గీ. పలుపనఁగ శోధనాభిధ పరఁగుచుండు. ఆం. భా. ౨. ౨౫౨.

**గాలిఁబుచ్చే.** అ. క్రి. (√గాలిఁబోవు) గాలిఁబోవఁజేయు.

(వ్యర్థముచేయు.)

శా. వాలుం గేలున నంటఁ బట్టుకొని జీవం బింత నిస్సారమే,యేలా సాహస మింత క్రూరమతివై యేకాంత మిక్కానలో, గాలింబుచ్చెదు పౌరుషం బిది విసం గానం గదుర్ దోసమీ, బేలుంజెయ్యికతంబు చెప్పు నిను సంప్రీతాత్మునిం జేయుదున్. దళకు. ౬.౬.

**గాలిఁబోవు.** అ. క్రి. (√ గాలి) ౧. గాలికి కొట్టుకొనిపోవు; నశించు.

గీ. గాలిఁబోయెడుపరుగాకుగతిఁ గరంబు, తూలిపోయెడు నెమ్మేనితోడఁ జనుచు, విప్రవర్యుం డు కన్నులవిందు గాఁగ, వీక్షణము చేసె రుక్మిణీవిభుపురమ్ము. కుచేల. ౨. ౭.

(చంద్రోపాలంభనము.) సీ. ఎప్పుడు జంకించు వ్యాజాతశింజినిఁ గావరంబునఁ దన్ను గాలిఁబోవ. వరాహ. ౮. ౨౧.

౨. వ్యర్థమగు.

ఉ...వాఁ,డాయతశక్తి నన్ను నిట నంకిలినెట్టిన పుడ్రామభూ,నాయకునాజ్ఞ గైకొనిననాపని చెల్లక గాలిఁబోవదే. భా. రా. సుం. ౭౧.

**గాలికుంటు.** వి. (గాలి+కుంటు) పశువులకు గొరిజలయందు పుండుపడెడువ్యాధి. (శ. ర.)

(వ్యవ) వారిగేదెకు గాలికుంటు తగిలినది.

**గాలికొమ్ము.** వి. (గాలి + కొమ్ము) వాద్య భేదము.

సీ. గాలికొమ్ములు డోళ్లు కైముళ్లు రుంజలు... మొ. రా. యు. 3. ౨౬.

**గాలిగంగలు.** మి. వి. బ. (√ గాలి) పిశాచరూపము గలక్షుద్రస్త్రీదేవతలు.

క. ఆతతిఁ దన్నగరీపతి, జాతర సాటించెఁ బసు విసర మనితరసా, ధ్యాతతవాతామయుని, ర్ఘాతాహతిఁ దూల గాలిగంగల కెల్లన్. పాండు. 3. ౭3.

గాలిగాఁడు. వి. (గాలి+కాఁడు)- గాలివలె అంతటను దిరుగునది - గాడిద.

చ. ...అనఘులఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁదపెత్తుగాఁ, గనుఁగొని గాలిగానికడకాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్క-రా. భా. శ. ౩౭.

సీ... రేవుగుఱ్ఱము గాలిగాఁడు, గాడిద యనఁగను ఖరము రాగిలుచుండు...వేంక. ౯౪.

గాలిగుడి. వి. (గాలి + గుడి) సూర్యచంద్రులకుఁ జుట్టు నేర్పడెడుమండలము, పరివేషము. (శ. ర)

గాలిగూఁడు. వి. (గాలి+గూఁడు) గాలికి ఆటకై గూఁడువలె ఏర్పఱచిన పనలకుప్ప. (వా)

గాలిగొను. అ. క్రి. (గాలి+కొను) గాలిచేతడియాఱు.

వ... తిత్తొలిచి గాలిగొన వైచినపుక్కకలిమంబుఁ గనుంగొని...భార. శాం. ౩. ౨౭౫.

గాలిగోపురము. మి. వి. (గాలి+గోపురము) మిక్కిలి యెత్తుగా నుండుదేవాలయపుగోపురము.

గాలిగ్రుడ్డు. విశ. (గాలి+గ్రుడ్డు) ౧. అవివేకి, తెలివిమాలినవాఁడు. (బ్రా.)౨.షేద. అప్ర. (శ.ర.) వి. ౧. గ్రుడ్డువలె ఎండమావులలో గానఁబడుధూమవికారము. ౨. హనుమంతుఁడు. (చి. ని.)

గాలిచీర. వి. (గాలి+చీర) ౧. తెరచాఁప.

సీ. అఖిలభూతదయాపరాయణత్వము లిపికాఁడు వైరాగ్యంబు గాలిచీర. గీ... మురారిచరణ రాజీవభక్తి, గౌరవం బనుపేరోడ...వరాహ. ౫. ౭౬.

౨. గాలి చొరకుండునట్లు కన్నమునకు కప్పెడు చీర, చోరసాధనవిశేషము.

మత్త. గాలిచీరయు నొల్కిబూడిద గ్రద్దగోరను గొంకియున్, గోలయున్ వెలుఁగార్చు పుప్వులక్రోవి ముండులబంతియున్, మైలమందులకొయ్య గత్తెర మాఱుఁగన్నపుఁగత్తియున్, నీలిదిండును నల్లపూఁతయు నేర్పు తోడుగ ముచ్చులున్. ద్వా. ౧౦. ౧౧౭.

గాలిచూలు(లి). వి. (గాలి+చూలు) ౧. అగ్ని. ౨. భీముఁడు.

గీ. తుంగమదుపున నాడుమాతంగవిభుని, భంగి భవదీయసైన్యంబు బడలుపడఁగ, లీల నిస్సంభ్రమం డయి కేలి సలిపె, గాలిచూలప్డు గగనచరాలి వొగడ. భార. భీష్మ. ౨. ౨౨౨.

౩. హనుమంతుఁడు.

ఇట్లే:- గాలిపట్టి.

సీ...కడిఁదిపులుఁగు, నకుఁ దగినట్టిచందము దీర్చియరుగుచుఁ బంపచేరువ గాలిపట్టిఁ గాంచి. యయా. ౩. ౨౧.

గాలితము. సం.విశ. (అ.ఆ.అ) ౧. వడఁబోయఁబడినది; వస్త్రాదులలో పోసి మెత్తనిది క్రిందికి దిగునట్లు చేయఁబడినది. (పిండి, మొ-ఉదా: వస్త్రగాలితము, మొ.) ౨.కరఁగింపఁబడినది.

గాలిదిండి. వి. (గాలి+తిండి)-పవనాశనము-సర్పము.

గీ. మీలు కప్పలు తాఁబేళ్లు గాలిదిండ్లు, మొసలు లెండ్రులు నెగడులు మొదలు గలుగు, నీరుద్రిమ్మరిపదుపులు...అచ్చ. రా. యు. ౩.

గాలిద్రిమ్మరి. వి.(గాలి+త్రిమ్మరి)-గాలిరూపమునఁ దిరుగునది-పిశాచము.

సీ. ఏమీ పిశాచంబ యీళ్వరుండే నిన్ను భేదబుద్ధినిఁ బంపఁ బ్రేరకుండు, కాక భూసుర యేను గర్తనే యయ్యాతనసుమతి మ్రింగెద నంటి నిన్ను...గీ. గాలిద్రిమ్మరి యీతండకల్మషుండు, హింసఁ జేయించునే కాలమింతె గాక, యొరి వినరోరి జాలిమాత్రోపజీవి, కాలమని యీతఁడని వేఱు గాదు ... శ్రీరం. మా. ౬. ౧౧.

గాలిని. సం. వి.ఈ.స్త్రీ.(మంత్ర) ముద్రావిశేషము.

గాలినెచ్చెలి. వి. (గాలి+నెచ్చెలి) వాయుసఖుఁడు, అగ్ని. ఆం. సం. దేవ. ౧౮.

గాలిపంట. వి. (గాలి+ పంట) నిర్ణయము లేనిపంట. (శ. ర.)

గాలిపటము. మి. వి. (గాలి+పటము) ౧. పిల్లలు గాలిలో నెగురవేసికొనుటకై కాగితము మున్నగువానితోఁ గట్టినపటము, గాలిపడగ.

మ. అరుదారన్ రఘువీరుఁ డొక్కతఱి బాల్య క్రీడ మారీచము, ష్కరుమే నాశుగయుక్తి గాలిపటముంగా వింట నాడింపుచున్. చంద్రా. ౧. ౨౧. శుక. ౩. ౪౪౭.

౨. బాలక్రీడావిశేషము, గాలిపటముతో ఆడుడుకొనుఆట.

సీ...దోఁపిల్లి గాలిపటంబు సరిబేసి పుటచెండు చాకిమూట. హంస. ౩. ౧౪౬.

గాలిపడగ. వి. (గాలి+పడగ) గాలిపటము.

గీ. ఆలజాలంబు నీటిపై నాడుజాడ, గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ, నిదురలోపలఁ గలఁ దోఁచునీడ పిదపఁ, గానవచ్చునె యప్పుడ కన్నఁ గాక. ఉ. హరి. ౫.౧౧౦.

గాలిపిశాచము. మి. వి. (గాలి+పిశాచము) గాలి రూపమున నుండుపిశాచము. వేం.పంచ. ౧.౨౪౩.

గాలిబిళ్ల. వి. (గాలి+బిళ్ల) గాదలు వాఁచెడురోగవిశేషము, గాదబిళ్ల. (బ్రౌ, వా)

గాలిమాట. వి. (గాలి+మాట) లోకప్రవాదము, జనశ్రుతి.

సీ. మలయమారుత మైన మెలఁతఁ దెచ్చునటన్నఁ గానరా దదియును గాలిమాట. తపతీ.౨.౭౯.

గాలిమెకము. వి. (గాలి+మెకము)-వాయువునకు వాహన మైనమృగము-లేడి, వాతాయువు.

సీ. తడవింట నేయక తఱిమి గాలిమెకంబు నుసురుతోఁ గొనివచ్చునసమజవము. రా. వి. ౩. ౪౬.

గాలిమేఁతరి. వి. (గాలి+మేఁత+అరి)-వాయువు ఆహారముగాఁ గలది-పవనాశనము, పాము.

సీ. కప్పఁగుత్తుకవాఁడు గాలిమేఁతరియందె జోటివాఁ డర మెయిజోటివాఁడు. అచ్చ. రా.బాల. ౧౩.

ఇశ్లే:- గాలిమేపరి.

సీ. ఘనవృషభేంద్రుండు గాలిమేపరిపిండు వాజిగా భూషణరాజి గాఁగ. చెన్న. ౨.౧౫౭.

గాలివాన. వి. (గాలి + వాన) గాలితోడివాన, ఝంఝ.

వ...అప్పు డప్పువ్వుఁదోఁట గాటంపుగాలివానచేత నేకీడునుం బొరయకునికి జనులు వెఱఁగందుచుండిరి... కళా. ౪. ౯౩.

గాలివేఁత. వి. (గాలి+వేఁత) ౧. గాలికొట్టుట.

౨. జ్వరభేదము (శ. ర.)

గాలోడితము. సం. వి. అ. న. పరీక్షణము, వాగ్విమర్శనము.

గాలోడితుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. మత్తుగొన్నవాఁడు, కైపెక్కినవాఁడు. ౨. తెవులుగలవాఁడు. ౩. మూఢుఁడు, తెలివి లేనివాఁడు.

గాలోడ్యము. సం. వి. అ. న. పద్మబీజము.

గాళకుఁడు. విణ. (క. గాళక) ౧. దిట్టఁడు, ధీరుఁడు.

ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతునక్క లా, భీలతరాళనుల్ చిదిమిపెట్టినబంటులు... విజ. వి. ౧. ౧౦.

౨. ప్రౌఢుఁడు.

ఆ. అనుచు నెల్లవేల్పులను గొల్చి మును కబ్బ, ములను గన్న గాళకులను దలఁచి. నీలా. ౧.౧౧.

ఆ. గోల గాని మిగుల గాళకురాలు గా,దింటి... నీలా. ౩. ౧౦౦.

గాళుచేయు=కాడుచేయు. స. క్రి. (క. గాళు=నాశము, పాడు.) నాశముచేయు, ధ్వంసము చేయు, పాడుచేయు.

సీ. ఆటతిప్పలు ప్రచ్చి పాటబండులు గూల్చి క ట్టున లన్నియు గాళుచేసి. అచ్చ. రా.సుం. ౯౫.

గావల్గణి. సం. వి. ఇ.పుం-గవల్గణునికొడుకు-సంజయుఁడు. (వాచ)

గావు. వి. (త. కావు.) బలి.

గీ. గొప్పచింబోతుకదుపులఁ గూర్చి నీకు,గావు వెట్టింతుఁ జుమ్మ యోగంగనమ్మ. నీలా. ౧. ౧౧౩.

గావుకేక=(బలియిచ్చునపుడు వేయుకేక) పెద్దకేక. (వా)

జ: గావుకొను, గావుపట్టు.

గావుకొను. స. క్రి. (గావు + కొను) బలి పుచ్చుకొను.

చ. గొఱియల మేఁకపోతులను గొమ్ముపొట్టేళ్లను గావుకొందువు...కాళికేశ్వరీ. వీథి. ౪౧.

గావుకోడి. వి. మూలికావిశేషము. (శ. ర, బ్రౌ)

గావుప(వ)ట్టు. స. క్రి. (గావు+పట్టు) ౧.చంపు.

సీ. కడుఁదుఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యాకస్తూరిదుప్పుల గావుపట్టు...గీ.అని... వేటకాండ్రు, మెచ్చి పొగడుచు మెకముల మీఁద గొలుసు, లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. సారంగ. ౧. ౯౨.

సీ. హోమకుండములు నిర్ధూమధామంబులు గావించి పసువుల గావువట్టి. వరాహ. ౫. ౧౧౫.

౨. నాశముచేయు.

ద్వి. పొదలెడుపురుషార్థముల గావుపట్టి, మదము మాత్సర్యంబు మట్టి మల్లాడి విష్ణు. పూ. ౩ ఆ. (శ. ర.)

వి. గట్టిపట్టు, కార్యము ముగియువఱకు ఒక్కపట్టుగా పట్టినపట్టు. (చి. ని,శ. ర)

గాసటబీసట. వి. సలక్షణముగానిచదువు. (శ. ర.)

ఉ. భాసురభారతార్థములభంగులనిక్క మెఱుంగ నేరమిం,గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్, వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లగఁ జేసినట్టియ, బ్జాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనాద్యులన్. నృసిం. పీఠి. ౯.

గాసము. వి. (సం. గ్రాసః.) ఆహారము, తిండి; బత్తెము.

సీ. నల్లదేవరకోలఁ బల్లె లేసినమేటి విసము గాసము గాఁగ మెసఁగుజియ్య. శివధ. ౩. ౭౫.

క. మీసము పస మగమూతికి, వాసము పస యిండ్లకిల్ల వనితల కెల్లన్, వేసము పస బంట్రౌతుకు, గాసము పస...కవిచౌ. శ. ౯౦. రా. వి. ౫. ౫.

గాసి. వి. (క. తు. గాసి) వ్యథ, వెత.

ఉ... అ,య్యో సరసీరుహాక్షి మదయోగభరంబున నిట్లు ఖిన్నయై, గాసి వహించియున్నది... శుక. ౧. ౧౨౪.

సీ... వంత గాసి వెతారము కాఱియ వెత,శారి నొగులు నొప్పి బాద నెగులు నొవ్వి వందురు దురపిల్లు కొందలంబు,సలుపు నోవి యనంగఁ జను వ్యథ ... ఆం. భా. ౧. ౧౪౦. రా. వి. ౨. ౭౦.

విణ. ౧. నష్టము, నశించినది, చెడినది.

గీ... బేహార మాడు,టయును గోరక్ష గావించుట యును మొదలు,గాఁగ బ్రతికెడు తెరువులు గాసి గావె. భార. శాం. ౨. ౨౫౫.

గీ. కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ, దఱచి వారలఁ గొని మమ్ము గెలుచువాఁడ, వై మనంబున శంకింప కట్లు కీడు,చేసి తాపూఁపు దప్పిన గాసి యైతి. భార. శల్య. ౨. ౫౯.

౨. వ్యర్థము, పనికిమాలినది.

చ...నీదగుసహాయతఁ గౌరవసేన రూపుమా,పు
ట యవలీల నాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీ
కుఁ బాడియే,కటకట నాపరాక్రమము గా
సి గఁ జక్రము చేత నంటితే. భార. భీష్మ. ౨.
౧౬౧.

౩. నలఁగినది.

సీ. కమ్రక్రొవ్వారిసరుల్ గాసియై యసియాడ బలు
కీలఁ గొప్పులఁ బట్టి యీడ్చి.ఉ.రా.౪.౯౩.

జః గాసించు, గాసిఁబడు, గాసిఁబఱచు, గాసిఁబె
ట్టు, గాసిలు, గాసిసేయు.

గాసించు. స. క్రి. (√గాసి) గాసిలఁజేయు.

(బాధించు, క్లేశపఱచు)

క. చేసినమే లెఱుఁగుదు రొరు,గాసింపరు కుచ్చి
తంపుఁగఱద లెఱుఁగ ర,త్యాసక్తసౌహృదు
లు స,త్యాసీనులు సురలు వార లపకారకులే.
ఉ. హరి. ౫. ౩౦౧.

ద్వి. గాసించి వీరి నిక్కడ నాకు నేన,చేసేతఁ
బట్టి శిక్షించితి నేని,యీజాడ తన కేల యె
ఱిఁగింప వనుచు,రాజు విన్నను నపరాధంబు
వచ్చు...ద్వి. పరమ. ౪. ౩౩౪ పా. ౭ పం.

గాసిఁబడు. అ. క్రి. (√గాసి) ౧. బాధపడు, దుః
ఖపడు.

సీ. హోమాజ్యగంధోర్మి కుద్వేగ మొందుచుఁ గ్ర
తుధూమములచేత గాసిఁబడుచు. నైష. ౭.
౧౨౩.

క. హా సుకుమార కుమారక,హా సుగుణనిధాన నీ
వు సర్వాం బఁటరా,గాసిఁబడఁజేసి మమ్మున్,
బాసి చనఁగ నేమి తప్పు పాటిలెఁ జెపుమా.
ఉ. రా. ౭. ౧౭౨.

క. స్త్రీ సంతోషించు తెఱం,గాసపడని మనసు
గలుగునట్టియధముఁ డి,చ్చో సడిఁ గనుఁ జని
యచ్చో, గాసింబడు జమునిభటులు గాటి
యవెట్టున్. భార. అశ్వ. ౪. ౨౨౭.

౨. చెడు.

క. ఆసమయమున రహస్యము, గాసింబడకుండ
బుద్ధిగౌరవమున నా,రాసుకుని బాలచంద్రి
క,చేసన్నలఁదొలఁగఁ బంచెఁ జెలిలోఁ గూ
డన్. దశకు. ౩. ౧౧౭.

గాసిఁబఱు(అ)చు. స. క్రి. (√గాసిఁబడు) గా
సిఁబడఁజేయు.

(పీడించు)

సీ. కవజక్కవల పెక్కు గాంచునీచనుదోయి కలి
కి యేకతినుండు గాసిఁబఱిచె. ఉ. రా. ౪.
౨౨౭.

(బాధపెట్టు)

సీ. బహురూపులను మీటి పర్ణశాలలు దూటి క
డఁగి మునిస్త్రీల గాసిఁబఱచు. ఉ. హరిశ్చ.
౪. ౭౪.

(నాశముచేయు, చెఱుచు.)

వ...గడుసరిదానవులు పసిమి గలపసిఁడి కాస
చేసి పడఁ ద్రోసి గాసింబఱిచినప్రాసాదంబు
లును...ఉ. హరి. ౧. ౫౩. (వీరేశ. పా.)

గాసిఁబెట్టు. స. క్రి. (√గాసి) ౧. దుఃఖపెట్టు,
శ్రమపెట్టు, బాధపెట్టు.

క. ఆసధ నమ్మెయి నీదు,శ్వాసనుఁ డప్పాండుపు
త్రసతిఁ గ్రూరాత్ముం,డై సంక లేక పెద్దయు,
గాసింబెట్టంగ ...భార. స్త్రీ. ౨. ౫౬.

క. ఆసాసల వచ్చితి నను, గాసింబెట్టి యది యడ
విఁ గలసెను మృగయా,వ్యాసక్తుఁడు వగచు వ్ద
న,యేసినమృగ మనఘు తప్పి యేఁగుటకుఁ గ
డున్. భార. శాం. ౩. ౧౫౩.

సీ. వేల్పుఁగన్నియల నేవేళ దేశీయంపులిట్టుఁకేఁ
తల గాసిఁబెట్టువారు. నరస. ౫. ౯౦.

౨. ధ్వంసముచేయు, చెడఁగొట్టు, చెఱుచు.

గీ...ఏకాంత మంతయు గాసిఁబెట్టఁ, గడఁగి...
దశకు. ౬. ౭౨.

గాసిలు(ల్లు). అ. క్రి. (√గాసి) ౧. శ్రమపడు, ఆయాసపడు; కష్టపడు, బాధపడు.

ఉ. గాసిలనీక రాసుతులఁ గౌశికుఁ డాఁకలి నీరువట్టునా, యాసము లేనిమంత్రము... కృప చేసి కృతార్థులఁ జేసె నెంతయున్. రామా. ౪. ౨౭.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే, గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి... పారి. ౧. ౧౩౩. (ఇటఁ 'తప్తమగు' అని భావము.)

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం, దా సైరణ సేయఁడు... భార. విరా. ౪. ౨౩౦.

౨. క్షీణమగు, తగ్గు.

చ...నామనంబునఁ గడింది భయంబు జనించె దక్షిణాం, గనికరముల్ చలించె ధృతి గాసిలె మే నవశత్వ మొందె... ఉ. రా. ౬. ౨౩౬.

౩. కోపమొందు.

ఉ... అంతకు ము న్గడి ద్రెవ్వి మీరెదన్, గాసిలియుండుయాదవనికాయము సైఁపదు రాజసూయమున్. ఉ. హరి. ౪. ౧౨౭.

ఉ. ఆసమయంబునన్ మనసిజారి లలాటతటీనటీభవ, దృగ్భాసిసముద్రగ్రుఁడై తనసుతుం గడకన్నులు జేవురింపఁగా, గాసిలి చూచి వీఁడు సురకాంతల నాసభలోన నెట్టులం, జేసెఁ దనూవిలాసములచే నని భీషణభావనార్భటిన్. వరాహ. ౬. ౫౭. వి. పు. ౭. ౨౪౩.

గాసి(చే)సేయు. స. క్రి. (గాసి+చేయు) ౧. బాధపెట్టు.

ఉ. భంగముతోడ నున్న ననుఁ బంపు విరాటుని మీఁద భూమికిం, జెంగట నుండు నావయినజీతపుటూళ్లలు సంతతంబు వ్రానిం గడు గాసి సేయునతనిం జెఱుపన్ దటి యయ్యె... భార. విరా. ౩. ౧౧౯.

శ్లో. రాష్ట్రం మమాసకృద్రాజన్ రాజ్ఞా మాత్స్యేన బాధితమ్. సం. భార. విరా. ౩౨. ౩౭.

గీ. పదియు నొక్కంద్ర రుద్రులఁ బాయవిడిచె, గాసిచేయక కాకోలకంఠపట్టి, తంద్రి పేరి వారగుట చిత్తమునఁ దలఁచి. కాశీ. ౭. ౧౯౧.

౨. ధ్వంసముచేయు, పాడుచేయు.

చ... సమస్తభూజముల్, బలువిడి గాసిచేసి బహుభంగుల నిట్టులు ద్రుళ్లు చున్నెడన్. భా. రా. సుం. ౫౪౦.

చ. వననిధి దాఁటి లంకయును వానివనంబును గాసిచేసి నం, దనుఁ దెగఁ జూచి వచ్చినవిధం బదియబ్బులచేతఁ దీరునే, జనకజఁ గాంతు మేయసమసాహసుఁ డీతఁడు లేక తక్కినన్. నిర్వ. ౭. ౧౩౨.

గాహనము. సం. వి. అ. న. ౧. స్నానము, మునుఁగుట. ౨. చొచ్చుట.

గాహమానుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) ౧. ప్రవేశించుచున్నవాఁడు.

శ్లో. బ్రహ్మావర్తం జనపద మథచ్ఛాయయా గాహమానః. మేఘ. ౧. ౪౭.

౨. స్నానము చేయుచున్నవాఁడు.

గాహము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మునుఁగునది, క్రుంకునది. ౨. చొచ్చునది. వి. అ. పుం. ౧. అవగాహనము, మునుక. ౨. ప్రవేశము, చొచ్చుట.

గాహిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) ౧. మునుఁగువాఁడు, స్నానము చేయువాఁడు. ౨. చొచ్చువాఁడు.

గాహితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రవేశింపఁబడినది. (నద్యాది) ౨. నిమగ్నము, మునిఁగినది.

## గి

గి=గీ. అవ. నిందయందు ఆమ్రేడితశబ్దము యొక్క ఆద్యక్షరమునకు వచ్చెడియాదేశము.

చ. హరి గిరి వహ్ని గిహ్ని మతి యంతకు గింతకు దైత్యు గీత్యు వా,ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు ... భా. రా. యు. ౯౦౪.

క...నీవు గినిసిన, వరముల గిరములను బ్రదుకు వారే కుమతుల్. ఉ. హరి. ౪. ౧౦౭.

**గింగురు.** వి. ౧. వింటినారినుండి బాణము వెడలుట మున్నగువానియందగుధ్వనికి అనుకరణము.

ద్వి. కొదమనాగముఁ బోనికోల మిణ్గురులు, సెద రంగ దొనఁ దీసి శింజినిఁ దొడిగి, తెగ గింగు రనఁ బాపి దృష్టి సంధించి, తెగ నేయుటయు ...ద్వి. హరిశ్చ. పూ. ౭౧౫.

౨. పెద్దధ్వని వినునప్పుడు చెవులలోఁ గలుగుధ్వనికి అనుకరణము.

ఉదా: ఆరొద వినఁగానే నాచెవులు గింగురుమన్నవి.

**గింజ.** వి. బీజము, విత్తు.

ఉ...గుమ్మడిగింజ తెల్లంగు...ఆము. ౫. ౯౦.

సీ. వీడెంపుబలు కెంపు విరిసి వెన్నెలగాయ వరిగింజ నొకటఁ బల్వరుసఁ దోమ. ఆము. ౧.౬౦. ఆం. భా. ౨. ౩౯.

**గింజు.** స. క్రి. విదిలించు, చిమ్ము.

ద్వి. జయకాముఁ డలుఁగులు జళిపించి చిమ్ము, క్రియఁ గరచరణముల్ గింజి యాడుచును. అ. మ. క. ౧. అవ పా. ౨౦ పం.

జ: గింజుకొను.

**గింజుకొను.** స. క్రి. (√గింజు)-కాళ్లు-విదిలించు, చిమ్ము.

శా...మీఁ జేతులం గన్నులిం, పారం దోముచుఁ జేవఁ బూని పిఱుఁ దొయ్య న్నీఁది కల్లార్చుచున్, శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొను చుం జెల్వంబు రెట్టింపఁగన్. హరి. పూ. ౫. ౧౭౭.

వ...అక్కాంచనహంసంబు ...ఎగయ నుంకించుచుఁ జంచుపుటంబునఁ బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులు గింజుకొనుచు...నైష.౧. ౧౦౧.

అ. క్రి. కాళ్లు చేతులు విదిలించుకొను,గిజగిజలాడు; శ్రమపడు.

వ. చండికానసుద్దండపాశంబునం దగుబడి గింజుకొనుచు పాశములు పన్నినవలలం బడి శన్నుకొనుచున్నఁబోతులరీతి నుండిరి...వరాహ. ౧౧. ౧౦౫.

(వ్యవ) వాఁడు ఎంత గింజుకొన్నను చను వంటలేదు.

**గింటెన.** వి. దింటెన చూ.

సీ...గింటెన యనఁగను దింటెన యన,గిరికర్ణి చెలువొందు...ఆం. భా. ౨. ౫౬.

**గింటెము**=గెంటెము. (క. త. గింట.) జమిరిపోఁగు నేఁతబట్ట, రెంటెము.

గీ. మడతపసిమిడిగింటెముల్ మంజిడిజిగి, దోమతెరమంచములు హసంతులు జవాది,యగలుపేరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలినెలలు తద్వ్యఘూపచశరణుఁ డగుచు. కళా. ౭. ౧౮౧.

విశ. దట్టమైనది, సాంద్రము; అధికము.

సీ. పసిఁడిగింటెంపుదుప్పటికప్పు లోహపహాకమ్మఁగస్తురితిలకమ్ము బళిర. వాల్మీకి.౩.౧౫౧.

సీ. రింగులువాఱ గైరిక పుగింటెంపుఁబచ్చడము గట్టి ప్రదేశమునఁ గట్టి. వరాహ. ౬. ౪౦.

ఉ. గెంటని ప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూలొసంగి వ్రా,ల్గంటి గిఱుక్కునం దిరుగఁ గన్నికస్తురితావి గ్రమ్ముకో, గింటెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁజిమ్ముకొ యూరిజిల్గుఁబ,య్యంటచెఱంగొకింత దనయంగముపై నటు సోఁకినంతటన్. విజ. వి. ౨. ౧౩౪.

**గిండి.** వి. (సం. కుండీ. క. త. గిండి) భృంగారము, సన్నని మెడ గలపాత్ర. (చెంబు, జారీ, మొ.)

గీ...భృంగారు గిండి నాఁ జను ... ఆం. భా. ౨. ౧౯౩.

సీ. గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితి యుం డ జలములగిండి లక్షణ వహింపఁ. ప్రభా. ౨. ౧౫.

సీ. తపుకుబంగరుగిండ్లు దులకించునిరిచెండ్లు నడఁ గించుపాలిండ్ల నమరుదాని. ఉ. రా. ౨. ౭౬౬.

(వ్యాసునివర్ణన.) గీ. కేల మున్నీటిక్రొన్నీటిగిం డివాని. చంద్ర. ౩. ౨౧.

సీ. నీరధీశ్వరుఁడు పన్నీటిగిండి ధరింప మృగవా హనుఁడు తాళవృంత మూన. దశా.౨.౧౨౮.

**గిందుకము.** సం. వి. అ. పుం. క్రీడాకందుకము, ఆటబంతి. (వాచ, విల్యమ్సు.)

**గిచ్చు.** స. క్రి. ౧. గీచు. (శ. ర, బ్రౌ) ౨. (గోళ్ళ తో) గిల్లు. (వా)

**గిజేగిజే.** వి. (క. గిజి) ౧. క్షోభము, కలవరము. (చూ.గిజగిజపడు.) ౨. కాళ్లుచేతులు విదిలించుట యం దగుఅనుకరణము.

ఉదా: వాఁడు మూర్ఛ వచ్చి గిజగిజ తన్నుకొను చున్నాఁడు.

గిజగిజయగు=కలఁత నొందు.

క. గజవదనాదులు గాంచిరి,నిజరక్షితసీమఁ గాల నియమితభృత్య, వ్రజకృతబహువిధబాధల, గిజగిజయగుశూద్రభక్తుఁ గీలితదేహున్. శ్రీ రం. ౩. ౫౭౨.

ద్వి. ఒందంగఁ బాదాగ్ర మూఁది నటింపఁ, గ్రిం దటికూర్మంబు గిజగిజ గాఁగ. బస. పు. ౩. ౭౧౦ పం.

జ: గిజగిజకుడుచు, గిజగిజపడు, గిజగిజలాడు.

**గిజేగిజేకుడుచు**=గిజేగిజేలాడు. (గిజగిజ+కుడుచు)

సీ. కదలించి యెత్తఁగాఁ గడు నళక్తుండయి గిజ గిజకుడిచె నక్కేకయుండు. చమ. ౩. ౭౩.

**గిజేగిజేపడు**=గిజేగిజేలాడు. (గిజగిజ+పడు)

క...చిలుకలు,గితిగొనఁ బఱపుటయు వాఁడు గి జగిజపడుచున్. అచ్చ. రా. యు. ౨౧౭. (గి జగిజకొను-శ. ర. పా)

**గిజేగిజేలాడు.** అ. క్రి. (గిజగిజలు+ఆడు) క్షోభ పడు, కలవర మొందు.

వ ... ధవళకిరణుకిరణంబులు చుఱుకుమఱుకు న మర్మంబు లంటిన గజగమన గిజగిజలాడి తా ళఁజాలక మూర్ఛ గ్రమ్మి సొమ్మసిలిన...మృ. వి. ౨. ౮౪.

గిజగిజలాడుకొను=గిజగిజలాడు.

ద్వి. కినుకతోఁ బలికిన గిజగిజలాడు,కొనుచు నిం టికి వచ్చి కొంకుచు నుంటి. ద్వి. తి. సా. ౨. ౨౭ పా. ౨౬ పం.

**గిజేరు**=గిజారు. వి. ౧. బీజము, గింజ.

గీ...బీజాఖ్య పరఁగు విత్తు,విత్తనము గింజ గిజ రన...ఆం. భా. ౨. ౩౯.

ఉదా: గిజరువంకాయ.

౨. మామిడిపండు లోనగువానియం దుండుపెం కము. (శ. ర, బ్రౌ.) ౩. కోడిగ్రుడ్డులోనిపచ్చని పదార్థము. (బ్రౌ.)

**గిజిగాఁడు**=గిజ్జిగాఁడు. వి. (క. గిజు గార.) పక్షి విశేషము.

సీ. గిజిగాఁడు పూరేడు కేర్జంబు పొన్నంగి...

గీ...ఇట్లని పక్షిభేదాఖ్య లలరు...ఆం. భా.౨. ౯౮.

గీ...ఒకకులాయము ఘటించుఁ,గాని గిజిగాఁడు మాడువు గట్టఁ గలదె. వి. నం. ౧. ౧౩.

ఉ...శృం,గారవనద్రుమాళి గిజిగాఁడులు గూఁ డులఁ జేర్చు...మనుచ. ౧. ౩౬.

**గిజిబిజి.** వి. నములుటయం దగుఅనుకరణము.

చ. అజునివరంబుకల్మి నిటలాక్షుమహోక్షుమూఁ దాఁకి గెల్చు దిగ్గజములమోపు మూఁపుర ముగాఁ గొన నోపు సురాసురాస్త్రములన్,

గిజిబిజిఁ బిప్పిగా నములు గిత్త దడీయము దా
దృశంపుట, క్కజములు తేరిగిబ్బలప్రకార
ము లాతఁ డజేయఁ డెమ్మెయిన్. కకు. ౫.
౭౨.

**గిజ్జేరు**=గిజేరు. (శ. ర, బ్రౌ)

**గిజ్జిగాఁడు**=గిజిగాఁడు. వి. పచ్చపిట్ట, బంగారుపి
చ్చుక. (శ. ర, బ్రౌ)

**గిజ్జే.** వి. భక్ష్యవిశేషము.

వ ... పచ్చడులుం గిచ్చడులుం బజ్జులుం గిజ్జు
లున్ వడియఁబులుం గడియఁబులును...కా
శీ. ౭. ౧౮౫. (చి. ని. పా.)

**గిట.** వి. కృశించుటయం దగుఅనుకరణము. (ఆమ్రే
డితరూపము-గిటగిటగిట)

క. పెటపెటపెటఁ గాసె న్రవి,పటపటపట మను
చు గిరులు పగిలెన్ రగిలెన్, జిటచిటచిట మ
నుచున్ వని, గిటగిటగిట మనుచు జనము గృ
శియించె సెగన్. రా. వి. ౫. ౯౮.

**గిటక.** విణ. పొట్టివాఁడు.

సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు...ఠంగ
ణా యనఁగను వామనాఖ్య దనరు... ఆం.
భా. ౨. ౧౨౩.

**గిటగిట**[1]=కిటకిట. వి. ౧. పండ్లుగీఁటుటయం దగు
ననుకరణము.

ద్వి. గిటగిటఁ బండ్లను గీఁటి కాశికుఁడు,చిటచిట
మిడుఁగుర్లు చెదర వీక్షించి. ద్వి. హరిశ్చ.
పూ. ౧౧౮౩ పం.

౨. (నడుము) వడఁకుటయం దగుననుకరణము.
(చూ. గిటగిటమను)

జ: గిటగిటమను.

**గిటగిట**[2]. విణ. కృశము, సూక్ష్మము. (వృత్తియందు
నిగాగమము)

క...కీల్జడ నటి,యింపన్ గిటగిటనికా నొకింత చ
లింపన్. విజ. వి. ౩. ౭౯.

గీ. మఱియు నయ్యిందుబింబాస్యమందగతియఁ,
గటిభరముపొంకమును గిటగిటనినడుము, మె
ఱుఁగుఁజెక్కులు వళులు గంభీరనాభి, సొం
పుఁ జూపఱ్కొక వింతయింపు నొసఁగె. పర
మ. ౩. ౧౨౫.

జ: గిటగిటన.

**గిటగిటన.** విణ. (√గిటగిట[2])౧.అల్పము,హీనము.

వ...మహేంద్రనిషధద్రోణంబులు దరిప్రాణంబులు
హేమకూటంబు గిటగిటన తక్కుఁజిటుకొం
డలం జేర్కొనం గారణం బేమి...కాశీ. ౧.
౧౦౦.

౨. మృదులము, సుకుమారము.

ద్వి. కటకట భార మెక్కడనుండి వచ్చె,గిటగిట
నైనయీకీరవాణికిని ... ద్వి. హరిశ్చ. ఉ.
౯౧౮ పం.

౩. కృశము.

వ...ఈబోటి... పుటపాకనికాశం బగుకాఁకం
జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్లగిట
గిట నగుచున్నది...ఆము. ౫. ౫౫.

౪. కొంచెము, చాలనిది.

వ...చదువ దొరఁకొనిన నరునకుఁ గాలంబు నా
లంబు విఘ్నంబు లఖిలోద్యమఘ్నంబు లందు
లకు సామగ్రి గిటగిటన కొంతెఱుక నగుమ
దంబు పుటపుటన...ఆము. ౧. ౭౮. (వ్రాఁత
ప్రతి పా.)

**గిటగిటమను**=కిటకిటమను. అ. క్రి. (గిటగిట[1]+
అను) వణఁకు.

క. చనుఁగవ వ్రేఁగున గిటగిట, మనునెన్నడు మే
మి యగునొ యనియెడిశంకన్,గనకపుఁగట్టి
డి నాఁడో,వనజాసనుఁ డనఁగ వనితవళులిం
పెసఁగున్. ప్రభా. ౨. ౮౩.

**గిట్ట.** వి. ౧. ఖురము, డెక్క.

గీ...గొరిజ డెక్క,గిట్ట యన ఖురనామంబు గేరు
చుండు...ఆం. భా. ౨. ౧౯౭.

౨. బాణము.

వ...మైందునిఁ జొవంచగిట్టల గజు నెనిమిదికో లలఁ గుముదు నైదమ్ముల ... అచ్చ. రా. యు. ౩౬౮.

సీ. చేరి యెక్కినచోటఁ బూరి మెక్కినచోట భ యదో_క్తి దయశక్తిఁ బరఁగఁ జూపె, గిట్టఁ బూనినచక్కిఁ బుట్ట లానినచక్కి గురుశ_క్తి యురుభ_క్తి గుదురుపఱచె...రా. వి. ౫.౧౨.

గిట్టించే[1]. స. క్రి. (√గిట్టు[1]) ౧. చంపు.

దండకము...బల్లట్టివారక్కసుల్ నెక్కసం బైన పేరుక్కుతో నుక్కుఁగంబంబునం బుట్టి గిట్టింపవా...అచ్చ. రా. యు. ౧౬౧.

౨. భేదించు.

ద్వి. తనయుఁడు పిన్నని తలపోయ వలదు, కినిసినఁ గొండలు గిట్టింప నోపు. అ.మ.క. ౧. ౩౫ పా. ౨౨ పం.

గిట్టించే[2]. అ. క్రి. (√గిట్టు[2]) గిట్టుబడియగు. (శ. ర-చూ. గిట్టింపు[2].)

గిట్టింపు[1]. వి. (√గిట్టించే1) చావు. (శ. ర.)

గిట్టింపు[2]. వి. (√గిట్టించే[2].) గిట్టుబడి. (శ.ర,వా)

గిట్టు[1]. అ. క్రి. చచ్చు.

ఆ. వీరు కలియుగమున వేయేండ్లలోపలఁ, బుట్ట గిట్టఁ గలరు భూవరేంద్ర. భాగ. ౯. ౬౮౨.

మ. కెడసెం దుప్పులు డింకవేసె నెలుఁగుల్ గిట్టెన్బులుల్ సింగముల్, కడగొట్టెన్...సారంగ. ౧. ౧౦౭.

౨. చెడు, నశించు.

సీ. గుట్టు పోనిచ్చిన గిట్టుఁ బెద్దతికంబు, దుర్వ్యయపరుఁ డైనఁ దొలఁగు మిసిమి. రామలిం. ౭౮.

జః గిట్టించు[1], గిట్టింపు[1].

గిట్టు[2]. అ. క్రి. ౧. చాలు.

ఉదా: కూలి గిట్టినచో ఈపని చేయుము. గిట్టనిచో మానుకొనుము.

౨. అనుకూలమగు; ఇష్టమగు; సరిపడు.

ఉదా: అనీళ్లు నాకు గిట్ట లేదు. ఇంగువ నాకు గిట్టదు. మావా రిక్కడకు వచ్చుట మీకు గిట్టదు. మాకును వారికిని గిట్టదు. వారు నాకు గిట్టనివారు.

జః గిట్టించు[2], గిట్టింపు[2], గిట్టుబడి.

గిట్టుబడి. వి. (గిట్టు[2] + బడి) అమ్మకమునందలిలాభము. (శ. ర.)

గిడస. విశ. పొట్టి, గిటక, వామనము. (బ్రౌ, శ.ర.)

గిడిగిల్లు. వి. బ. నమస్కారము.

వ...చిత్రకూటమందలిరాఘవునకు గిడిగిల్లు నంది గ్రామమందలిరాత్రుఘ్నునకు జేజే... ప్రబంధ. ౧౮౦. హంస. ౪. ౨౧౩.

గిడిబిడి. వి. (క. గిడిబిడి.) వాద్యవిశేషము.

వ...తప్పెట గిడిబిడి తుడుము...మొదలైనహృద్యానవద్యవాద్యవిశేషంబులు. హంస.౩. ౨౯.

గీ. వేల్పుగిడిబిల్లు మొరయఁ గ్రొవ్విరులు గురియ. సుద. ౨. ౭౬.

గిడియ. వి. పటహవిశేషము.

సీ...తమ్మటం బనఁగను దమటం బనంగను దమటాభిధానంబు దనరుచుండుఁ. గీ. దుడు మనంగను దముకు నా గిడియ యనఁగ, నరగజమనంగఁ దద్భేదనామము లగు. ఆం. భా. ౧. ౧౨౭.

గిడుగు. వి. కామ లేనిగొడుగు, కామ అక్కఱలేనిగొడుగు. (శ. ర.)

గిడ్డ. విశ. (క. గిడ్డ.) పొట్టి, వామనుఁడు.

గీ...కుఱుచ తింగణ గిడ్డ గిఱక గుజ్జు, పొట్టి యన వామనాఖ్య లౌ...సాం. ని. మాన. ౫.

వి. వామనమూ_ర్తి, విష్ణ్వవతారభేదము.

రగడ. మీను తాఁ బేల్పంది మానిసి మేకము గిడ్డ
యు నేలవేల్పును...అచ్చ. రా. యు. ౬౪.

గిడ్డంగి. వి. (క. త. గిడ్డంగి.) ౧. సరకు లుంచి య
మ్మెడియిల్లు. ౨. చెఱసాల. (శ. ర.)

గిడ్డజొన్న. వి. చిఱుజొన్న, చిన్నగింజలజొన్న ².
(బ్రౌ).

గిడ్డతనము. వి. పొట్టితనము, వామనత్వము. (బ్రౌ)

గిడ్డి. వి. (సం.గృష్టి:.క.త.గిడ్డి.) పొట్టియావు; ఆవు.
సీ...శేరు వామనగవి గిడ్డి యనఁగ ... ఆం. భా.
౨. ౨౬౩.

ఉ. ఏనికమోముబూమియు వహించి చరించుచు
నుండుకామధు, గ్ధేనువు ధుంతి కాశి నిది తె
ల్లము వేల్పులగిడ్డి కానినాఁ, డీనునె మోక్షత
ర్ణకము...కాశీ. ౬. ౬౧.

విణ. గిడ్డ, పొట్టిది.
సీ...ఆవు పొట్టియు గిడ్డి యనఁ జెలంగు ... ఆం.
భా. ౩. ౪౬.

గిడ్డు. వి. (క. గిడుగ) శ్యేనవిశేషము.
క...సాళ్వంబులు గి,డ్డులు మొదలుగఁ గలవిడివేఁ,
టలపులుఁగులు పదనుతో మిటారింపంగ౯.
యయా. ౧. ౪౦.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు,జాలె
జలకట్టె కణుజు వేసడము బైరి...అను డేగ
కులము...పి. శకుం. ౧. ౧౧౦.

గిత్త. వి. ఎద్దుపట్టనికోడె, ఆర్షభ్యము; వృషభము.
సీ. గిత్త నా గిబ్బ నాఁ గెరలు నార్షభ్యము ...
ఆం. భా. ౨. ౨౬౨.

సీ. గిత్త తత్తడివాఁడు బుత్తిముత్తు లిడంగఁ జాలు
వాఁ డొదల జాలువాఁడు. అచ్చ. రా. బాల.
౧౩.

గిద్ద. వి. సోలలో నాలుగవభాగము. (శ. ర, వా.)

గిద్దు. వి. శ్యేనవిశేషము.
సీ. జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభేదములు...
ఆం. భా. ౨. ౯౦.

ద్వి. ఎద్దు లిబ్బులు పిడియేనుఁగు పెద్ద,గిద్దులు డేగ
లు గేరజంబులును...ప్రభులిం. ౪.౧౩౧పా.
౧౭ పం. ప్రబంధ. ౧౯౧. కాశీ. ౩. ౪౬.

గినియ. వి. కటభి ². (బ్రౌ, శ. ర)

గినుమాడు. స. క్రి. (గినుము+ఆడు) వంచించు.
మ. తను నాప్యాయితుఁ జేసి రేపు గృహకృత్యం
బు ల్వొవర్పం దొడం,గినతల్లిం గినుమాడి త
ప్పడుగులం గ్రీడారతిం బోయి ... హరి.
పూ. ౫. ౧౯౬. (శ. ర-ప్రయోగాంతరము
లేదు. గిలుబాడు ?)

గినుము. వి. వంచన. (శ. ర-చూ. గినుమాడు)
జ: గినుమాడు.

గిన్నె(న్నియ). వి. (త. గిణ్ణి. క. గిణ్ణిల్.) లోహాది
పాత్రము.
గీ. సాని యీశానియై మహోత్సవమునందుఁ, గేలి
నవచంద్రకాంతపుగిన్నె పూని ... భీమ. ౧.
౧౦౪.

ఆ...పైఁడిగిన్నె...దశా. ౪. ౧౩౭.

సీ. నెరపుగా నూటె గిన్నియల నించినయట్టియిరిది
కుంకుమ నించినట్ల యుండె. కువల. ౫. ౩౭.

క...అగ్గిన్నియ జి,య్యాలకడకుం గొని చనఁగా...
నైజ. ౪. ౭౩. ఉ. హరి. ౩. ౭౬.

౨. చషకము, పానపాత్రము.
గీ. గిన్నె యన డబ్బు రనఁ గోర యన్నఁ జషక,
ము...ఆం. భా. ౨. ౨౪౪.

గిబ్బ=గిత్త. వి. ౧. ఎద్దు, వృషభము.
ఉ...మదించి యంకెలిడుపోటరిగిబ్బలఁబని నెక్కి
యీ,శానుఁడు వచ్చె...పారి. ౪.౭౪.

వ...వడి గలగిబ్బలం బూన్చినశకటంబులు...భా
గ. ౧౦ పూ. ౨౧౧.

౨. ఎద్దుపట్టనికోడె, ఆర్షభ్యము.

సీ. గిత్త నా గిబ్బ నాఁ గెరలు నార్షభ్యము ... ఆం. భా. ౨. ౨౬౨.

విశ. ( ఋషభశబ్దమువలెనే ఉత్తరపద మగునపుడు) శ్రేష్ఠవాచకము.

క. చన్నులు జక్కవగిబ్బలు...నీలా. ౧. ౫౪.

సీ. కలిమిగుబ్బెతమిన్నగబ్బినిబ్బరపుబ్బుగుబ్బలా జక్కవగిబ్బజోడు. దశా. ౧. ౧౬౮.

గిబ్బడాల్దొర=వృషభధ్వజుఁడు, శివుఁడు.

సీ. గిబ్బడాల్దొరగుండు కబ్బంపుఁబ్రోయాలు లిబ్బిగుబ్బెతయబ్బ బొబ్బ మెకము. అచ్చ. రా. యు. ౪౯౨. (గిబ్బడాల్దొరగుండు=కైలాసపర్వతము.)

గిబ్బబాబాజోదు=వృషభవాహనుఁడు, శివుఁడు. అచ్చ. రా. ఆర. ౫౭.

గిబ్బరాతు = వృషభవాహనుఁడు, ఈశ్వరుఁడు. పార్వ. ౨. ౧౭౫.

గిర. సం. వి. ఆ. స్త్రీ. వాక్కు. (త్రి. ని.)

గిరక. వి. ౧. నూతిరాట్నము, ఘటయంత్రము. (శ. ర-గిఱక. చి. ని. గిలక. వా)

౨. నూలిరాట్నముయొక్క చక్రము.

సీ. తంతుసంతతిసముత్పాదనయంత్రంబు రాట్న మంచనఁగను రహికి నెక్కుఁ,దద్బద్ధసూత్రంబు తెగు పడి యంచన గిరక నా భ్రమకంబు పరఁగు చుండు. ఆం. భా. ౨. ౨౯౮. (గిఱక. ప్రాఁత ప్రతిపా.)

గిరగిర. వి. తిరుగుట మొదలగువానియం దగుధ్వనికి అనుకరణము.

చ... ప్రచండమండలా,గ్రము జళిపించుచుఁ గిరగిర నద్రిరుగ న్నెగవైచి పట్టుచుఁ. కళా. ౬. ౧౮.

సీ. బరుల నఖంబుల గిరగిర గోఁకుచుఁ బొరిఁబొరి ఫలములఁ గఱచివైచు.భాగ. ౧౦ ఉ. ౫౮౮. దశా. ౧. ౨౨౫.

గిరణము. సం. వి. అ. న. మ్రింగుట, గిలనము.

గిరదా. వి. (హిం. గిర్దా) గుండ్రనిజుట్టును చుట్టియుండువెండ్రుకలు. (శ. ర-గిరజా. వా)

గిరవు. వి. ౧. కుదువ, తాకట్టు.

సీ. కనుదోయి మెఱుఁగులు కంతుతూపులకడ గిరవుగాఁ బెట్టితే హరిణనయన. విక్ర. ౭. ౬౨.

చ... అరుణంపుబొండ్లములనారికెడంబులు వజ్రకుట్టిమం,బగుపథముం జెలంగు భవనాహృతశేషితరత్నరక్ష క,భ్రగతరుసంతతిం బ్రథమ భార్యఁ బురిం గిరవుంచె వార్ధి నాఁ. ఆము. ౧. ౫౮.

౨. కానుక, ఉపాయనము.

( కిరాతకన్యావర్ణనము ) గీ. హరిణకరిహరిచమరంబు లక్షికుంభ, మధ్యవాలాకృతులు దెచ్చి మనుపుకొఱకు,భిల్లపతియింట గిరవులు పెట్టెననఁగ, దృక్కుచవలగ్నచికురచారిమల నొప్పు. వరాహ. ౨. ౧౧౩.

రగడ... కోరి గిరవులువెట్టి కొలఁచుజగతీపతులు ...పి. శకుం. ౩. ౨౨౫.

గిరస. విశ. పంద, పిఱికి, సమరభీరువు. (శ. ర.)

గిరాకి. విశ. (హిం. గిరాన్.) వెల యధికమైనది, ప్రియమైనది. (శ. ర.)

గిరాటువేయు. స. క్రి. ఉవ్వు. (శ. ర, వా)

గిరి. సం. విశ. (ఇ) పూజ్య మైనది. వి. ఇ. పుం. ౧. పర్వతము. ౨.నేత్రరోగవిశేషము.౩.అచ్చనగాయ.(వై.ని.) ౪. (గణిత) ఏడుఅనుసంఖ్య. ౫.మేఘము.౬.పాదరసమందలియొకానొకదోషము. ౭. కొండఱు సన్న్యాసులనామములతుదిని జేర్పఁబడుబిరుదు. (ఉదా: ఆనందగిరి, మొ.) ౮. తంత్రమతానుసారి యగుసన్న్యాసి.౯. ప్లక్షము, జువ్వి. (కే. ని.) స్త్రీ. మ్రింగుట.

గిరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిట్టెలుక. ౨. వసురాజు భార్య.

గిరికంటకము. సం. వి. అ. పుం-గిరులకు శత్రువు-వజ్రాయుధము. (త్రి. ని.)

గిరికదంబము. సం. వి. అ. పుం. ఒకజాతికడిమిచెట్టు.

గిరికర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దింటెనచెట్టు.

గిరికర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి, నేల. (త్రి. ని.) ౨. దింటెనచెట్టు.

గిరిగి(గ్గి)ట. వి. (క. గిరిగట, గిగ్గట=చక్కని ధ్వని లేనిసంగీతపుఁ బనిముట్టు.) ఒకానొకసంగీతపుఁబనిముట్టు. (బ. ఆకునపుకు వాయించెడుకంచుతాళము అని శ. ర.)

ద్వి. మఱి మును ల్వంచినమహితోరగంబు, గిరిగిట గాఁ బట్టి క్రియ నాడునాఁడు. పండితా. వాద. ౨౭౯ పా.

ద్వి. గెడగూడి పసిఁడి గిగ్గిటకేళికలను, గడునొప్పుసాన్నలికపురంబువారు. బస. పు. ౨. ౭౩ పం.

ద్వి... పసిఁడిపానంబు, గిరిగిటల్గాఁ బట్టి కేళికల్ సేయు. (భల్లా. ౨ ఆ. శ. ర)

గిరిజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పార్వతి. ౨. పర్వతకదళి, కొండయరఁటిచెట్టు. ౩. మల్లెతీఁగ. ౪. నిమ్నగ, నది. (కే. ని.)

గిరిజము. సం. విణ. (అ. ఆ. అ.) కొండయందుఁ బుట్టినది. వి. అ. న. ౧. అభ్రకము. ౨. లోహము, ఇనుము. ౩. శిలాజిత్తు. ౪. గైరికము, కావిరాయి.

గిరిజామలము. సం. వి. అ. న. అభ్రకము.

గిరిజ్వరము. సం. వి. అ. పుం. ఇంద్రునివజ్రము.

గిరిధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాల్పు.

గిరిధాతువు. సం. వి. ఉ. పుం. గైరికము.

గిరిపుష్పకము. సం. వి. అ. న. శిలాజిత్తు.

గిరిప్రియ. సం. వి. ఆ. స్త్రీ. చమరి, ఆఁడుచమరమృగము. (రా. ని)

గిరిభిత్తు. సం. వి. ద్. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. వజ్రాయుధము.

గిరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కుటజము, కొండమల్లెచెట్టు.

గిరిమృత్తు. సం. వి. ద్. స్త్రీ. గైరికధాతువు. (త్రి. ని.)

గిరియకము. సం=గిరీయకము.

గిరియాకము. సం=గిరీయకము.

గిరిరాజు. సం. వి. అ. పుం. హిమవంతుఁడు.

గిరివేము. మి. వి. కొండవేముచెట్టు. హంస. ౪. ౧౧.

గిరివ్రజము. సం. వి. అ. న. ఒకపట్టనము. (ఇది మగధదేశమందలిది. జరాసంధుని రాజధాని.)

గిరిశయుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

గిరిశుఁడు. సం=గిరిశయుఁడు.

గిరిసారము. సం. వి. అ. పుం. ౧. లోహము, ఇనుము. ౨. తగరము. ౩. మలయపర్వతము. (మే. ని.)

గిరిసెను. వి. (సం. శిరీషః) దిరిసెనము, శిరీషముచెట్టు.

సీ... దిరిసెను గిరిసెను దిరిసెన మనఁ, జనును శిరీషాఖ్య... ఆం. భా. ౨. ౪౯.

గిరిస్తని. సం. వి. ఈ. స్త్రీ. భూమి. (వై. ని)

గిరిస్రవ. సం. వి. ఆ. స్త్రీ. నిర్ఝరము, సెలయేఱు.

గిరీయకము. సం. వి. అ. పుం. అచ్చనగాయ, గిరి. (వై. ని)

గిరీశుఁడు. సం. వి. అ. పుం-కైలాసపతి-శివుఁడు.

గిఱక. విణ. గిటక, పొట్టి. (బ్రౌ, శ. ర.)

జ: గిఱకతాడు.

గిఱకతాడు. వి. దే. (గిఱక+తాడు) హింతాలము, ఈఁదాడుచెట్టు. (బ్రౌ, శ. ర.)

**గిఱి.** వి. (క. గిఱి) వలయాకారపురేఖ.

మ...దైత్యేశుఁ డయ్యాటలోఁ, గొనిపోయెన్ గిఱి దాఁటి రాము...భాగ. ౧౦ పూ.౧౩౧.

మ...తనచుట్టు న్గిఱి గీసె నాఁగఁ బరిధిన్ ఖద్యోతుఁ డొప్పె న్దివిన్. పె. శకుం. ౩. ౫౦.

జ: గిఱికొను, గిఱికొలుపు, గిఱిపిల్లాఁడి.

**గిఱికొ(గొ)ను=గ్రిక్కొను.** స.క్రి. (√గిఱి)

౧. చుట్టుకొను, పరివేష్టించు.

గీ...గిఱికొనెను బ్రహ్మెఁ బరికొనె గ్రిక్కొనె నన, వెలయు వేష్టించె ననుటకు వేదవేద్య. ఆం. భా. ౩. ౧౧౭.

క. ఉఱక మదీయాంగంబులు, గిఱిగొన నబ్లేయుటయును ... భార. ఉద్యో. ౪. ౩౨౦.

౨. ఆవరించు.

క. అఱవఱ లైనరథంబులు... కూలినకరులున్, గిఱికొనియె న్సమరమేదినీతల మెల్లన్. భార. భీష్మ. ౨. ౨౩౬.

అ. క్రి. ౧. వ్యాపించు, పర్వు.

క. దిక్కులనుండి ధరిత్రిం, గ్రిక్కిఱిసి మహాతమంబు గిఱికొనె...విప్ర. ౩. ౩౦.

చ. మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలి సోనయుఁ గల్గుమేఘముల్, గిఱికొన నొప్పు నాకసములీల...భార. ద్రో. ౧. ౨౭౯.

౨. ప్రవహించు.

గీ. ఉడుగ కందంద త్రావుచో నురముమీఁద, పఱద లై క్రొత్తనెత్తురు గిఱిగొనంగఁ, గక్షముల నున్నకుణపంబు కఱచి కఱచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి. హరిశ్చ. ౩. ౯౧.

౩. అధికముగా కలుగు.

క...కేళీవనదర్శనేచ్ఛ గిఱికొన మెలఁగెన్. ఉ. రా. ౪. ౧౪౭.

క. ఈవియుఁ జల్లఁదనంబును, గేవలసౌందర్యగుణము గిఱికొనఁగఁ గళా,భావుకుఁ డైననృసింహా,త్మావల్లభుఁ డమరుఁ బూర్ణచంద్రోపముఁ డై. నరస. ౫. ౧౩.

క. తెఱవ పులకాంకురంబులు, గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదం బొసఁగెన్...నైష. ౬.౬.

జై. భా. ౪. ౧౧౯.

౪. స్థిరపడు.

క. ఈలీల నిజపదార్చన, కేళీతత్పరత నతఁడు గిఱికొని యుండన్, నాళీకగేహినీకుచ, పాళీలోలుండు రంగపతి మదిలోనన్. విప్ర. ౨. ౩౪.

**గిఱికొలుపు.** స. క్రి. (√ గిఱికొను) గిఱికొనఁజేయు.

(క్రమ్ముకొనఁజేయు.)

క. మఱియును శరశతకము మెయి, గిఱికొలిపిన వృష్ణివరుఁడు గినియఁగ లేక, పఱి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయు లుబ్బు మిగిలి నరేంద్రా. భార. ద్రో. ౩. ౨౭౧.

**గిఱిపిల్లాఁడి.** వి. (గిఱి + పిల్లాఁడి) స్త్రీలు కాలి మూఁడవ వ్రేలను ధరించెడు పిల్లాణి. (శ. ర.)

**గిఱుకు.** స. క్రి. (త. గిఱుక్కు)౧. అక్షరములు బటువుగా వ్రాయక వంకరకొంకరగా గీచు. (శ. ర-గిలుకు. వా.)౨. (తప్పువ్రాఁతను) తుడుచు. (శ. ర.) వి. తుడుపు. (శ.ర.)

**గిఱుక్కు.** వి. శీఘ్రముగా మరలుట మొదలగువానియం దగుఅనుకరణము.

చ...గిఱుక్కున న్మరలి ద్రేసె...చంద్రా. ౨. ౧౦౨.

చ...భయ మంది గిఱుక్కున మోముఁ ద్రిప్పుచో...దశా. ౨. ౩౧౫.

సీ. చేరి మాటాడక చెలి గిఱుక్కున నేఁగ మతి చుఱుక్కని చాల వెతలఁ జెంద. శశాం. ౨. ౯౬.

**గిఱుపు(ర్పు)=గిలుపు.** స. క్రి. ౧. (కను) గీఁటు.

చ...ఆతఁడుం, దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క,న్గిఱిపినమాత్ర

లోన నలినిం బటుబాణచతుష్కయుగ్మ మే,
డ్తెఱ దొడి మూర్వి గ్రమ్మఱ ఘటించు నె
డఁ బడి నేసి యార్చినన్. భార. విరా. ౫.
౧౮౧.

శా...శ్రీభీమేశ్వరస్వామి ని,ష్పర్యత్యూహం బ
గుసౌహృదంబున హరిబ్రహ్మోమలన్ భ్రూల
తా,ప్రత్యుద్బోధనసంజ్ఞ చేసి కను గిర్వం
జాగె...భీమ. ౫. ౧౧౨.

౨. కదలించు, చలింపఁజేయు.

చ...అసురేశ్వరుఁ డప్పుడు గాలుఁ జేయు లా,
వటి రథసంబునం గుమప నక్కడ నిక్కడ
నూడఁ జూచి మై, గిఱుపఁగ నవ్వి శక్తి యె
త్తఁగించుట నెమ్మదిఁ గోరి వానిమై, నుఱునుఱ
స్రుక్క నొక్క బలసూదనసూనుఁడు ప్ర
క్కదాపునన్. నిర్వ. ౭. ౮౮.

సీ. తురగరూపము దాల్చి తోఁక యల్లార్చుచుఁ
గర్ణముల్ గిఱుపుచుఁ గడుఁ జెలంగి, హేషిం
చుమను...మార్క. ౫. ౩౫౯.

౩. దువ్వు, సవరించు.

సీ. హరిమ్రోల వినతాంగుఁ డై యున్నయురగారి
యెఱకలు పలుమారు గిఱిపి గిఱిపి.నృసిం.౧.
౫౮.

గిఱ్ఱు. వి. ౧. గుండ్రముగాఁ దిరుగుటయం దగుననుక
రణము.

సీ. మరుఁడు వైచినపైఁడిహరువుబొంగరమట్లు బ
లువిడి గిఱ్ఱున బ్రమరి దిరుగు.మల్లుపు. ౪.౬౫.

సీ. కీల్బొమ్మ రము జాలె గిఱ్ఱునఁ ద్రిమ్మరు తెఱఁ
గున... ప్రబంధ. ౧౦౯.

౨=గిఱుక్కు.

గీ. బరులకంఠమతికై రాయఁబడినలేరువు, తునిసి
పెల్లున విఱిగి గిఱ్ఱునను మరలి,పక్కనను రెం
డు తునియలై పడఁగఁ గొట్టె, భీకరం బగు
నొకదొడ్డనూకరంబు. చంద్రా. ౨. ౯౨.

జ: గిఱ్ఱుపురుగు.

గిఱ్ఱుపురుగు. వి. (గిఱ్ఱు + పురుగు) చెట్లయం దుం
డి యెల్లప్పుడు గిఱ్ఱు మని కూయునట్టియొకపురు
గు. (శ. ర.)

గిల. వి. గిలక మున్నగువానిధ్వని కనుకరణము.
(మా. గిలక,గిలకొట్టు, మొ—ఆమ్రేడితరూపము
'గిలగిల')

చ. అలర గళస్థలింగ మపు డాత్మకరంబున నిల్పి
వింతగా, గిలగిల నాఁగ గిల్క యొకకేలఁ గ
దల్పఁగ...చెన్న. ౫. ౧౯౪.

గీ... చలువవలువ, పెళపెళ గ్లిల్కుమట్టెలగిలగి
లల్ రహించ రాయంచకడ నిల్చెఁ జంచ
లాక్షి. హంస. ౩. ౫౮.

ద్వి. మువ్వల గిలగిల మొఱయ జాడించి, క్రొవ్వున
నుప్పొంగుకొమరుసాళ్వముల. అ. మ. క. ౫.
౨౨౧ పా. ౨౭ పం.

గిలగిలలుగ నార్చు=గిలగిలధ్వని వచ్చునట్లు ఆఱఁ
బెట్టు, తడి యేమియు లేనియట్లు ఆఱఁబెట్టు.

క. గుళిగ లోనరించి నీడన్, గిలగిలలుగ నార్చి
నారికేళపుబుఱ్ఱన్, జెలువొంద దాఁచి మే
హం,బుల ననుపానముల నీయఁ బోవున్...
(చికి. ౨. చి. ని.)

జ: గిలక, గిలకచెట్టు, గిలకబండి, గిలకసరము, గి
లకొట్టు, గిలగిలచెట్టు, గిలగిలలాడు.

గిలక (ల్క). వి. (√గిల. క. గిలకె-కొన్ని ప్రతులలో
గిలుకయని ఉ మ్మధ్యరూపము కనఁబడుచున్నది.)

౧. గిలగిలమని మ్రోఁగెడుబాల్యక్రీడాసాధనము.

సీ. జలదేవతాపుత్రికలు దాల్ప నిచ్చినగిలకలక్రి
యఁ జెండొవలు దనర్ప. రాజ.చ. ౨.౧౫౨.

చ...గిలగిల నాఁగ గిల్క యొకకేలఁ గదల్పఁగ
...చెన్న. ౫. ౧౯౪.

౨. గిలగిలమని మ్రోఁగెడుఇనుపరేకుబిళ్ల.

గీ. పసిఁడిగిలకలచేర్కోల...కాశీ. ౩. ౧౨.

గీ. గిలక లున్న వెదురు కేలఁ బట్టి...నా. పంచ.
౨. ౭౪.

౩. రేఫముయొక్క రూపాంతరనామము, వలపల
గిలక.

గీ. మొదల రేఫాక్షరంబు నాపిదప దాని, జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు, ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు, గిలక విభజించియు లిఖింతు రలఘుమతులు. అప్ప. ౨. ౮౧.

౪. కాలిచీలమండకు వెనుక నుందుభాగము. (వా) గిలకలలో వాఁపు పుట్టినది.

౫. ఆంత్రరోగవిశేషము. (వా)

౬. బాలక్రీడావిశేషము.

సీ...గిలకలు చిటికలు కీఁచుబులులు...గీ...అకట యగచాట్లప్రాంత నై యాడుకొనుచు. హంస. ౩. ౧౮౬.

గిలకలపండుగ=బడిపిల్లలు నవరాత్రములలో గిలకలు పట్టుకొని తిరిగెడియుత్సవము.

గిలకచెట్టు. వి. (√గిలక) ఘంటారవకీ.

సీ. గిలగిలచెట్టు నా గిలిగింతచెట్టు నా గిలిగిచ్చచెట్టన గిలకచెట్ట,టన్న ఘంటారవ యాను...ఆం. భా. ౨. ౫౭.

గిలకట. వి. ఒకానొకయోషధి.

సీ. కుండలిద్వయమును గుముడును నేలతంగేడు త్తరేనియు గిలకటయును. (చికి. చి. ని)

గిలకబండి. వి. (√ గిలక) చిన్నచక్రములబండి (శ. ర.)

గిలకరించు. స. క్రి. ౧. చిలుకు, మథించు.

క. తెపవం బెట్టినబానల, పెరుగులు మును గిలకరించి పేర్చినవెన్నల్, నురుపు లెగఁగ్రోలి... హరి. పూ. ౫. ౨౦౩.

సీ. దుగ్ధాబ్ధి గిలకరింతురె నిలింపులు తొల్లి యీయాసవముచవి యెఱిఁగి రేని. రుక్మా. ౩. ౨౩౧.

౨. గిలకొట్టు. (శ. ర.)

గిలకసరము. మి. వి. (√గిలక.) స్త్రీలు ధరించెడు ఆభరణవిశేషము.

ద్వి. కెంపులముక్కలు గిలకసరంబు, సొంపుతో వజ్రాలజోడుహారములు. ద్వి. శ. సా. ౧. ౧౩౩ పా. ౧౮ పం.

గిలకొట్టు. స. క్రి. (గిల+కొట్టు) ౧. కలుపు, రంగరించు.

ఉ. పాలడలోనఁ బోసి చనుఁబాలు నెయింగిల కొట్టి కాళ్లపై,బాలకు నుంచి. సారంగ. ౧. ౪౪. (శ. ర. పా.)

౨. వ్రేళ్లతో చిలుకు.

సీ. కరలించి యమృతంబు గిలకొట్టఁగా రాచె ముద్దుఁ జూపెడివీరి మోవులందు. పాండు. ౧. ౧౧౭.

౩. వ్రేళ్లతో పుణుకు.

సీ. గిలకొట్టి యట్టె చక్కిలిగిలి యని పెట్టి కిలకొట్టి నవ్వి నవ్వోలయఁజేసి. చంద్రా. ౨. ౫.

గిలగిలచెట్టు. వి. (√ గిల) గిలకచెట్టు. ఆం. భా. ౨. ౫౭.

గిలగిలము. సం. వి. అ. పుం. మకరము, మొసలి. (వాచ)

గిలగిలలాడు. అ. క్రి. (√గిల)క్షోభ నొందు;బాధచే తన్నుకొను. (బ్రౌ, వా.) ఉదా: ఆపిల్లవాఁడు అన్నమునకు గిలగిలలాడుచున్నాఁడు. ఆదూడ ఆదెబ్బతో గిలగిలలాడి చచ్చినది.

గిలగ్రాహము. సం. వి. అ. పుం. మొసలి. (కల్ప)

గిలనము. సం. వి. అ. న. గిరణము, మ్రింగుట.

గిలము. సం. విణ. (అ. ఆ. అ) మ్రింగునది. వి. అ. పుం. జంబీరము, నిమ్మకీ.

గిలాబ. వి. (హిం. గిలాబ) గచ్చుచేయుట. (శ.ర)

గిలి. వి. (క. త. గిలి.) భయము.

ఉదా: పులి పోయినను గిలి పోలేదు.(బ్రౌ,శ.ర.)

గిలి. సం. వి. ఇ. స్త్రీ. గిరణము, మ్రింగుట.

గిలిగించు. స. క్రి. గిలిగింత కలదానినిగా చేయు, గిలిగింత పెట్టు.

చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పుగకన్నులచా

యు లొవ్వఁ జెక్కిలి గిలిగించి వ్రేతలు న
గింపఁగ నుండుట...హరి. పూ. ౮.౧౩౪.

ఉ. కేకిసకొట్టి యొర్తు గిలిగించిన నొక్కవిలోల
నేత్ర లీ,లాకలకంఠకూజితముల న్నగ...
చంద్ర. ౪. ౧౭.

జ: గిలిగింత, గిలిగింత చెట్టు.

**గిలిగి(ల్గి)ంత.** వి. (√గిలిగించే) చక్కిలిగింత.

గీ...ఓసరసిజాక్షి, యేను జెక్కిలి గిలిగింతలిడు
టఁ దలఁతె. నైష. ౮. ౮౬.

ఉ. కేరఁగ రాదు నవ్వ గిలిగింతలువెట్టఁగ రాదు
చెక్కులం,జీరఁగ రాదు...హంస. ౧. ౯౪.

మ. తనకుం గాఁగిలి యీ వొకప్పుడును నాథా
నీకరస్పర్శనం,బున గిల్గింత లె యంచుఁ బద్మిని
కరాంభోజంబున స్మందమం,దనటద్వాయుచ
లద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వెల్గురా,యని
రారా యని పిల్చె నాఁ దగె ద్విరేఫాద్యంత
దీర్ఘధ్వనుల్. విజ. వి. ౧. ౧౩౯.

గిలిగింతవాఱు=గిలిగింత పెట్టిన ట్లగు,గులగులమను.

గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి,
శూలినాంచారి పాలిండ్ల మూచుకములు, పాల
చేఁపున గిలిగింతవాఱుటయును, మెత్తమెత్త
న నఱచేత నొత్తికొనుచు. హర. ౨. ౯౫.

గిలిగింత(లు)వోవు=గిలిగింత కలది యగు, చలించు.

గీ. ఎదుట జలకేళి గావింపఁ దదఖిలాంగ,ములు
నిరీక్షించి గిలిగింతవోవుమనసు, నిలుప లేని
కతంబున నిర్గమించె,జరమధాతువు శైలని
ర్ఘరముపోలె. వరాహ. ౧౧. ౮౧.

వ... అదియు ... గొప్పచనుగుబ్బలు బొమ్మనఁ
గాఁడిపాఱ బిగియఁ గాఁగిలించిన వాఁడు...
అంతఃకరణంబు గిలిగింతలువోవ నర్హాంత య
ర్హాంతయనుచు నంతకంతకు నింద్రియవికా
రంబు బలవంతంబై సంధిల్ల. ప్రబోధ. ౩. ౫౧.

**గిలిగింతచెట్టు.** వి. (√ గిలిగింత.) గిలక చెట్టు.ఆం.
భా. ౨. ౫౭.

**గిలిగిచ్చెచెట్టు.** వి. గిలకచెట్టు. ఆం. భా. ౨. ౫౭.

**గిలిగిలి[1].** వి. గిలిగింత.

చ. అలికులవేణి యొ ర్తొకనిహస్తముల న్నఖమజ్జ
నాంబువుల్,గలఁతియ యెత్తిపోయ నవి గా
ర్చుచు నుండె నతండు దోయిటన్, నెలకొని
దానిక్రొమ్మెఱుఁగునిద్దపుఁజెక్కులు ముద్దువె
ట్టుకోఁ,గెళవులవారిచూపుగిలిగిల్ల మొఱంగఁ
గ వేళఁ గోరుచున్. నైష. ౬.౧౧౨.

**గిలిగిలి[2].** వి. మంచము సకినలధ్వనికి అనుకరణము.

క. ఒకచోటఁ బువ్వఁబంధిరి, యొకచోఁ జప్పర
ము దూఁగుటుయ్యల యొకచో, సకినలగిలి
గిలిమంచం,బొకచోఁ గప్పురపుఁబఱుఁగుటో
వరియొకచోన్. నైష. ౭.౧౪౮.

**గిలిగిలించే.** స. క్రి=గిలిగించే. (చూ. గిలిగిలింత.)

జ: గిలిగిలింత.

**గిలిగిలింత.** వి. (√ గిలిగిలించే.) గిలిగింత.

సీ. లలిఁ గపోలంబులు గిలిగిలింతలువుచ్చి నవ్వింప
వఁ గలకల నవ్వ నవ్వ. హరి. పూ. ౫.౧౯౦.
(గిలిగిలింతలువుచ్చు = గిలిగిలింతలు కలవానిఁ
గాఁ జేయు.)

**గిలితము.** సం. విణ. (అ. ఆ. అ) మ్రింగఁబడినది.

**గిలుకరించే.** అ. క్రి. (√ గిలుకు) మ్రోఁగు.

గీ. కలికిచూపులు వీనులఁ బలుకరింప, సొలపునడ
పుల నందియ ల్గిలుకరింప. చంద్రా. ౩. ౯౨.
('గిలకరించు' శ. ర.పా.)

**గిలుకు(లుక్కు).** వి. ౧. మట్టెలు మొదలగువానిధ్వనికి అనుకరణము.

మ. చరణాబ్జంబుల గిల్కుమట్టెలరొదల్ సంధిల్ల
...చం. రా. ౫. ౩౬.

వ...గిలుకుటందియరవళితో ... ఉ. రా. ౫.
౨౪౮.

సీ... గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి...హర. ౫. ౫౫.

సీ. గిల్కు-గిల్కు-న మ్రోయుకింకిణీగుచ్ఛంబు తాళమానంబులో మేళవింప. క్రీడా. ౧౩౬.

౨. ధ్వని.

సీ. అంతరాంతరములం దస్థిబృందంబులు పెళపెళమనియెడుగిలుకు లెసఁగ. భీమ. ౪. ౧౩౭.

జ: గిలుకరించు.

**గిలుపు.** స. క్రి=గిలుబు.

(-కన్ను-గీఁటు.)

వ...కన్నియ మొఱంగి యచ్చెలులు విభునకుం గన్ను గిలిపి యొండొరు లొక్కొ-క నెపంబునం జనిరి...రామా. ౪. ౧౫౬. (శ. ర. పా) అప్ప. ౪. ౪౨౧.

(ఆడించు)

ద్వి. మోఁకాళ్లు దొడలును ముడివర్చుకొనుచుఁ, గూఁకటి గిలుపుచుఁ గొక్కరించుచును. పండితా. పర్వ. ౩౭౧.

**గిలుబా(ల్బా)డు.** స. క్రి. (గిలుబు+ఆడు) ౧. అపహరించు.

సీ. ఇందు గీసినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి. పాండు. ౩. ౧౬.

సీ. గేదంగివాసనల్ గిలుబాడి నునుసురపొన్నపువ్వులవలపులు గ్రహించి. గీ. చలువతెమ్మెర యమ్మేటిశ్రమము మాన్చె. ఉ. రా. ౪. ౧౬౭.

ఉ. వేడుకతో విమర్దకుఁడు విశ్వసనీయుఁ డనంగఁ జాలి తా, నీడయుఁ బోలెఁ దోఁ దిరిగి నెయ్యముకల్మి విధంబు దెల్పఁగా, నీడగుమాటలం బనుల నిచ్చలు నిచ్చకు వచ్చుభంగి గి, ల్బాడి తదంతరంగము బయల్పడ మా కెఱిఁగించు నిచ్చలున్. దశకు. ౬. ౨౬. (గ్రహించు అని భావము.)

౨. వంచించు.

ద్వి. వనజాక్షి యొక్క-తి మనసుఁ బంపుడును, జని మనోహరునితోడను రమియింపఁ, దను గిలుబాడెఁ గదా మనం బనుచు, నెనయ నపుంసకం బిల మనశ్శబ్దు, మనినపాణినిసూత్ర మాలి సేయుచును, వనిత గోపించుడు వచ్చె నమ్మనను. పండితా. దీక్షా. ౭౭ పా.

౩. ఏలు, ఎన్ను.

సీ. కేసరి ధూమ్రాక్షు గిలుబాడుకొని వానరేశ్వరుండు ప్రహస్తు నేఁజికొనియె. రామా. ౭. ౨౫౭.

**గిలుబు.** స. క్రి. అపహరించు.

సీ. మేటిజూదరి యన వాటమూతిపుటమై నాడుచుండుదు నే నహర్నిశంబు...గీ. తలఁపుగతి వచ్చుఁ గోరినదాయ మనఁగ, శకునిజూదంబు దీనియచ్చోకొ యనంగ, గిలుపు నాయదె కానొడ్డు గిలుబ నేర్చి, యెల్లపిడికిళ్ల విడిపించి యేన కొందు. ద్వా. ౧౦. లా. చంద్రా. ౫. ౧౦౪.

౨. దొంగతనము, చౌర్యము.

సీ. పరఁగుఁ దెక్కలి యన బందిపోటనఁగను గిలుబనఁగాను లంకింపు నాఁగ, దాఁపర మనఁగను...చౌర్యంబు...ఆం. భా. ౨. ౭౯౨.

జ: గిలుబాడు, గిలుబుకొను, గిలుబుచేయు.

**గిలుబుకొను.** స. క్రి. (గిలుబు + కొను) కొంగిలించు.

రగడ. గురివెంద నదె గిలుబుకొనియెఁ బయ్యెర దొంగ. మనుచ. ౩. ౮౪.

సీ. తనుఁ జూడ వచ్చినఁ గనికరంబును లేక కల సొమ్ము లెల్లను గిలుబుకొనుట. రామ. ౩౬౬.

**గిలుబుచేయు.** స. క్రి. (గిలుబు + చేయు.) అపహరించు.

సీ. తలిదండ్రులకు సమ్మతంబుగా నతిథిసత్క్రియ యటంచు నొకింత గిలుబుచేయు. నిరం. ౨. ౨౬.

సీ...కృతవీర్యునర్థంబు గిలుబుచేసి, కొని దాఁచి యున్నవా రని భార్గవుల నెల్లఁ బలికిన...

భార. ఆది. ౭. ౧౩౨. (శ. ర. ప్రాఁత ప్రతి తుల. పా.)

**గిల్ల.** విశ. మెల్ల, కంటి కడకు ఒఱిగినది, కేకరము. (చూ. గిల్లకన్ను, మొ.)

జః గిల్లకన్ను, గిల్లచూపు.

**గిల్లకన్ను.** వి. ఔ. (గిల్ల + కన్ను.) మెల్లకన్ను.

సీ. వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁ జూచుకిసల యోష్ఠి వహించు గిల్లకన్ను. కాశీ. ౨. ౭౦.

శ్లో. కటాక్షయతి వా న్యం వై కేకరాక్షీ తు సా భవేత్. సం. కాశీ.

**గిల్లచూపు.** వి. (గిల్ల + చూపు.) మెల్లచూపు.

ద్వి. పిల్లికన్నులు బల్ల పెరిఁగినకడుపు, గిల్లచూపులుఁ జాల గిజికొన్న బొచ్చు. నవనాథ. ౩. ౧౦౭ పా. ౧౯ పం.

**గిల్లు.** స. క్రి. ౧. (గోళ్లతో) త్రుంచు.

సీ. పెనుమ్రేలికొనగోర బిసరుహాసను మోముఁ గెందమ్మివిరివోలె గిల్లినాఁడు. భీమ. ౧.౧౧౦.

రగడ. కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము. పారి. ౪. ౧౬.

చ...గోరు మోపి గిల్లనిచిగురాకు లాలితవిలాస నికేతన మాలతాంగి దా, ననుభవకర్త యేఘనుఁడో యావిధియత్న మెఱుంగనయ్యెదన్. పి. శకుం. ౨. ౧౫౭.

౨. (నఖములతో) క్షతముచేయు, గిచ్చు.

క. అనుచుఁ దనూజుల నిద్దఱఁ, గొనగోటం గిల్లి వారు కో యని యేడ్వన్. శుక. ౨. ౨౫౭.

వి. నఖక్షతము. (శ. ర.)

జః గిల్లుడు.

**గిల్లుడు=గిల్లు.** వి. (√ గిల్లు.) నఖక్షతము. (శ.ర.)

**గివుఱు.** స. క్రి. గీఱు.

గీ. వెడలుబీఁ జెండకును శరద్వృక్షము డిగి, వార్షికమె యెక్కి త్రోటి నిర్వంకవక్షు, తులను గివుఱుచు వెట్టిచూపుల నురంబు, కెలఁకులు గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె. ఆము. ౪. ౧౭౧. (శ. ర. పా. 'నివురు' ముద్రి. పా.)

**గిసుకు.** వి. తుమ్మటయుం దగుఅనుకరణము.

ద్వి. భసితంబుఁ బూయంగ గిసుకునఁ దుమ్మ, నా వేమవిభుఁడు శతాయుష్య మనుచు. పండితా. పురా. ౧౬౭ పా.

## గీ

**గీ[1]=గి.** అప. నిందయందు దీర్ఘాది యైనయామ్రేడితశబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చెడియాదేశము.

చ...అంతకు గింతకు దైత్యు గీత్యు...భా. రా. యు. ౯౦౪.

మ...ఇంకన్ సాత్యకిన్ గీత్యకిన్...ఉ. హరి. ౪. ౧౩౨.

**గీ[2].** వి. ఘంటాధ్వనికి అనుకరణము.

ఉ...వరించి రా, భామిను లందఱున్ గుసుమబాణుఁడు గీ యని ఘంట వ్రేయఁగాన్. భాగ. ౯. ౧౭౭.

**గీఃపతి.** సం. వి. ఇ. పుం. ౧. బృహస్పతి. ౨. చదువరి, పండితుఁడు.

**గీంద్రు.** వి. పెద్దచప్పుడు వినుటవలన చెవులలో కలిగెడుధ్వనికి అనుకరణము,

గీంద్రుమను=గింగురుమను.

క. వినువక చను నెమకెడున, ప్పసిపాపఁడు తల్లి దాపుఁ బాయుటఁ గడు వెక్కసపడుచు సారెసారెకు, ననుచును రై చెవులు గీంద్రు మన వాపోయెన్. వేం. పంచ. ౪. ౪౩౩.

**గీఁక.** వి. (సం. ఘీంకారః.) బృంహితము, ఏనుఁగు ఘీంకారము.

క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁక పెట్టఁ గులిశము నేలన్, భజన చెడి విడిచె నింద్రుఁడు...భాగ. ౬. ౪౦౭.

గీ...గీఁక, యనఁగ ఘీంకార నామధేయంబు చెలఁగు...ఆం. భా. ౨. ౧౯౪.

జ: గీపెట్టు.

గీఁకు. స. క్రి. గోరు మొదలగువానితో గీచు.

ద్వి. కొదమసింగములను గోరి తుండముల, ముద మున నొయ్యనఁ బుడుకు నేనుఁగులు, వానిచె క్కులతీఁట వక్రనఖాళిఁ,బూని గీఁకుచు ను న్న పులులును...ద్వి.హరిశ్చ. పూ. ౭౮౧ పం.

గీఁటు. స. క్రి. ౧. (పండ్లు) కొఱుకు, దీఁటు.

ద్వి. గిటగిటఁ బండ్లను గీఁటి కాశికుఁడు, చిటచిట మిడుఁగుర్లు చెదర వీక్షించి. ద్వి. హరిశ్చ. పూ. ౧౧౮౩ పం.

చ...గిటగిటఁ గోఱ లుద్దవిడి గీఁటుచు రొప్పుచుఁ గొప్పరించుచున్, గిటిగణ మేఁగుదేర ... ద్వా. ౮. ౭౬. వరాహ. ౨. ౧౩౨.

౨. (కన్ను) గిఱుపు, గిలుపు.

క. మును దక్షుఁ డభవుఁ బలుకఁగఁ, గనుగీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలిం,చెను నందీశ్వ రుఁడు...భాగ. ౪. ౧౧౯. ఉ.హరి.౫.౫౯.

౩. చిమ్ము.

క...కంటినీరు గీఁటి యతనిపై, ధూళి వెసఁ దు డిచి...వాసిష్ఠ. ౪. ౪౦.

౪. మీటు.

చ...లేజవరాలు చెక్కు గీఁ,టిన వస వల్చు బా లకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే. సై స. ౧. ౧౭.

చ. తనమృదుగీతికాపరిణతధ్వనివైఖరిఁ బల్కు మంచు మిం,చినరహిఁ జేతివీణియకుఁ జెక్కు లు గీఁటుచు నేర్పుచున్నదో, యన నఖరాం కురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గాన మిం,పొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. పారి. పీఠి. ౫.

ఉ...కుమారుని మక్కువ మీఱ నేడ్పు రాఁ,జె క్కులు గీఁటి యెత్తి యెదఁజేరిచి ముచ్చటఁ దీఱునట్లుగా, నక్కట ముద్దులాడ వలదా ...సారంగ. ౧. ౧౧.

౫. చీల్చు.

చ...ధరిత్రి కొమ్మునం, దలవడ మాటి రక్కసు నియంగము గీఁటి బలీంద్రునిన్ రసా,తలము న మాటి...దా. ౪. ౩౩.

వెడల(ఁగ)గీఁటు=వెడలఁగొట్టు, తఱిమివేయు.

క. ఏటికి నీరాచరికం, బాఁటది మొఱపెట్టఁ బసు వు లాతురపడ నో,యాఁటదని లేచి దొంగ ల, గీఁటవు వెడలంగ శవము క్రియ నుండెది దే. భాగ. ౯. ౪౦౮.

గీఁత. వి. (√ గీయు) ౧. రేఖ, గీటు. (శ.ర.) ౨. గీయుట. (చూ. గీఁతకత్తి, మొ.)

గీఁతకట్టె(ట్టియ). వి. (గీఁత + కట్టె) వడ్లవాఁడు నాములు తీర్చుటకై ఉపయోగించుపనిముట్టు,క త్తికాసు. (శ. ర, బ్రౌ.)

గీఁతకత్తి. వి. (√ గీఁత) గీఁతగీసెడికత్తి, ఈంద్ర వానికత్తి. చెన్న. ౫. ౨౫౨.

గీచే=గీయు. (శ. ర)

మ. కనకాంగీమణి కంచు గీచినగతిన్ గంతంబు మీఱన్ జటాం, తనిరూఢప్రతిపాఠ మొం దినపులస్త్యబ్రహ్మవేదధ్వనిన్,విని...ఉ.రా. ౧. ౧౮౦.

గీజే. వి. పీఁకులాట. (బ్రౌ)

జ: గీజుపోరు.

గీజేపోరు. అ. క్రి. (గీజు + పోరు) ౧. విరామము లేకుండ జగడమాడు.

సీ. కీలుగంటిది యేల పోలఁగా నునుఁగొప్ప గీ ల్కొల్పుకొమ్మంచు గీజుపోరు ... శుక. ౨. ౪౫౬.

౨. మిక్కిలి మారముచేయు.

గీ. శిశువులు...చిఱుదిండి గని యిది తెమ్మటంచు, గీజుపోరుట కెద పెల్లగిల్లఁ బొగిలి, పాలఁతి యూరార్ప నతఁడుకాఁపురము నేయు. శుక. ౩. ౨౪౪.

**గీటడ(ణ)ఁగించే=గీటడఁచే.** స. క్రి. (√ గీటడఁగు.) చంపు; నశింపఁజేయు.

(కంసునిమాటలు) సీ...ఉగ్రసేను మాయయ్య గీటడఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి ...భాగ. ౧౦ పూ. ౧౧౬౧.

దండకము ... భీమకోపంబున న్లోకవిద్రావణుణ్ రావణు న్ధాటిచే గీటణంగింతు వంచు...కృ. శతకం. ౩. ౧౫౭. భార. విరా. ౨. ౧౩౫.

సీ.ఉత్కంఠరమ సంకునొఅపు గీటడఁగించి వెలిద మ్మితుటుములఁ జాలుకఁ జూచి. గీ...ఉల్లసిల్లె, మహిత పెద్దాడసూరయామాత్యహాళి. పె. శతకం. ౧. ౪౩. (ఇట ఔపమ్యవాచకము.)

**గీటడఁగు.** అ. క్రి.(గీటు² + అడఁగు) చచ్చు;నశించు.

సీ...యాదవు లెల్లను నమ్ముసలము, నద్భుతశక్తి గీటడఁగుదురు...భార. మౌ. ౧౦౮.

సీ...సౌబలుఁడు గీటఁడగెను లూపండు మడిసె ...భార. శల్య. ౧. ౯.

చ...మహాత్మ మీరు చె,ప్పినపరమార్థతత్త్వమున పెంపున నాహృదయంబులోనఁ గ,ల్గినయవివేక మంతయును గీటడఁగెణ్ సుఖి నైతి... వి. పు. ౩. ౩౬౪.

**గీటడ(ణ)ఁచే=గీటడఁగించే.**

(చంపు.)

గీ. మేటిమగని ఘటోత్కచు గీటడఁపఁడె, యట్టి జెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి,నయ్యె...భార. కర్ణ. ౧. ౪౨.

క...మన,కీచకు లండఅను రాత్రి గీటడఁచెర హ,స్యోచితవిధమున గంధ,ర్వాచరణము పేర భీముఁడు...భార. విరా. ౫. ౩౩౧.

**గీటు¹.** వి. గీఁత, రేఖ. (శ. ర, వా.)

జ: గీట్లబద్ద.

**గీటు².** వి. ౧. (క. కీటు=అనాదరము.) అనాదరము, ఉపేక్ష. (చూ. గీటునఁబుచ్చు.)

౨. గర్వము. (బ్రా)

జ: గీటడఁగించు, గీటడఁగు, గీటడఁచు.

**గీటునఁబుచ్చు.** స. క్రి. ౧. అనాదరించు, ఉపేక్షించు.

క. విని వినని వానిచందం,బున గీటునఁబుచ్చి ... జై. భా. ౮. ౩౯.

వ. అని తలంచుచుఁ గీచకునిమాటలు గీటునంబుచ్చి యొండుపలుకులు జరపిన...భార. విరా. ౨. ౪౨.

సీ...కులము గీటునఁబుచ్చి వలను దప్పి, శౌచంబు వదలి...దశకు. ౩. ౯. భార. సౌ. ౨. ౭౭.

౨. పోఁగొట్టు.

వ. అతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునంబుచ్చె...భార. శల్య. ౨. ౩౧౦.

**గీట్లబద్ద.** వి.(√గీటు1) కాగితములు లోనగువానియందు గీట్లు వేయుటకు ఉపయోగించుకోల. (శ. ర.)

**గీత.** సం. వి. ఆ. స్త్రీ. ఆధ్యాత్మికతత్త్వవిషయమై ప్రశ్నోత్తరరూపమున నుండు గ్రంథము. (ఉదా:భగవద్గీత,రామగీత,శివగీత,పాండవగీత,మొ.)

**గీతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గానము చేయఁబడినది, పాడఁబడినది. ౨. పలుకఁబడినది, చెప్పఁబడినది. వి. అ. న. ౧. గానము, పాట. ౨. (ఛంద.) పద్యవిశేషము. (ఈయర్థము తెనుఁగుననే కలదు ) అప్ప.క. ౨౦౪.

**గీతమోది.** సం. విణ. (న్. నీ. న్) గానముచే సంతోషించువాఁడు. వి. న్. పుం. కిన్నరుఁడు.

**గీతి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. గానము చేయువాఁడు. ౨. సంగీతముతో చదువువాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. పాట. ౨. (ఛంద) వృత్తభేదము.

**గీదుపోరు=గీజోపోరు.**

సీ. దోసాన కలిగిన నోసి పో లెమ్మనుఁ బేదసాదలఁ బ్రోవ గీదుపోరు.గీ...అయ్య ననుఁ గన్నయొయ్య గయ్యాళి తల్లి. విప్ర. ౩. ౧౫.

గీపెట్టు. అ. క్రి. (గీఁక + పెట్టు) ౧. (ఏనుఁగు)ఘీంకారము చేయు.

సీ. కేల్గలమెకములగీపెట్టుటలును మావులసకిలింతలగ్గలపుఁదేర్ల,రొదలు కాలరులయార్పులు వాయిదమ్ములమ్రోఁతలు నొక్కటై...అచ్చ. రా. యు. ౩౨౨.

౨. మొఱపెట్టు.

క...క్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్, గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా. భాగ. ౧౦ పూ. ౪౬౭.

సీ. అలమి గీపెట్టింతు మలుకఁ గోఱలు నూఁటి పై వచ్చుభూదారపతులనైన. హ. న. ౨. ౧౯.

దండకము...అత్యుగ్ర మైమొక్కరావంబు పుట్టెన్ జెళా రంచు బ్రహ్మాండభాండంబు వ్రీలెన్...నానామహాభూతసంఘంబు గీపెట్టె ...దశా. ౪. ౨౩౨.

౩. మ్రోయు, ధ్వని చేయు.

క. మదిరాక్షిజంఘు లంగజు, గద లగు నూహింపఁ గావు కాహళు లైనన్నదుకు వడక గీపెట్టక ...ఉన్నే. పాండు. ౩. ౧౭౨.

గీము. వి. (సం. గృహమ్? గేహమ్? క.గేబు.) ఇల్లు; నివాసము, ఉనికి.

సీ. ఎడపక గీమున కేతెంచువిందుల కెలమి వల్వలును సొమ్ములు నొసంగు. నీలా. ౧. ౪౯.

శా. సామీ దేవర పేరు సెప్పికొని యీసంద్రంపుఁబెన్గోనలో, గీము ల్గైకొని చుట్టపక్కములతోఁ గీ డెన్నఁడున్ లేక మా,భూమి న్గలిన వేఁటతోడఁ గడుపుల్ పూరింతుము ... చంద్ర. ౨. ౬.

గీమువేల్పు=గృహదేవత, ఇలువేల్పు.

క...వేనోములు నోఁచి గీమువేల్పుల కన్నో, కానుకలు నించి కాంచిన,కూనలఁ గానలకుఁ బంపుకొన నేరుతునే. అచ్చ. రా. బాల. ౧౦౨.

బలిగీము=బలిసద్మము, పాతాళము.

చ. క్షితి నుదయంబుఁ జెంది బలిగీమునకు న్వడి వేరువాఱె...చం. రా. ౨. ౭౨.

గీయు=గీచే. స. క్రి. ౧. చివ్వు, చెక్కు.

సీ. గీసి గొజ్జఁగనీరు పోసి నూఱినక్రొత్తచిఱుబంతి వసుపులో చేవ నలఁది. హర. ౨. ౧౦౭.

గీ. నలువ సన్నంబుగా దీనినడుము గీసి, యావనమునకు నిచ్చె నాయంశ మెల్ల,నది యుపాదానముగఁ గదా యిది సృజించె,నున్నతము లైన యేతత్పయోధరముల. నైష. ౩. ౧౯౧.

వ...మఱియునుత్తాలంబు లగుతాలంబులం గిరాతజాలంబులు గీసి...చంద్రా. ౨. ౭౪.

౨. గోఁకు.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం,బులపయి దట్టపుంజిలుము వోవఁగఁ దా రలకంచు గీయఁగా,బలె నలుపంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్, కెలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రేంకృతు లిచ్చు మరాళమాలికల్. ఆము. ౪. ౧౭౦.

క. అసమయంబునఁ గాంస్యము, గిసినగతి ... ఒక్కనుడి వినఁబడియెన్. ఉ. రా. ౭. ౧౨౬.

౩. గంటమున్నగునవి కొడుపున్నగువానితో రాచు.

వ...అందెచప్పుడున్ గింకిణీరవంబును నురుమగీసినగతిన్ దేఁటి మ్రోసినక్రియ...మనుచ. ౪. ౧౧౫.

౪. అఱుగఁదీయు.

సీ. ఇందు గీసినరీతి నించుకించుక చేరి గిలుబాఱుఁ దల్లిపైఁ గలపసిండి. పాండు. ౩. ౧౬.

౫. బలపము మున్నగువానితో పలక మున్నగువానిపై గీచు. (శ. ర.)

జ: గీఁత, గీఁతకట్టె, గీఁతకత్తి.

గీరథుఁడు. సం. వి. అ. పుం-రథమువలె వడిగలవాక్కు గలవాఁడు-బృహస్పతి. (త్రి. వి.)

గీరన(నం)గింజే. వి. బాల్యక్రీడావిశేషము.

సీ. తూరనతుంకాలు గీరనగింజలు పిల్లదీ వాళంకె బిల్లగోడు. కాశీ. 3. 33.

మ...పింపిళ్లులు కుచ్చిళ్ గీరనంగింజ లో,మనగుం
టక్ కనుమూసిగంత నలుగంబాలాట ... క
ళా. ౬. ౨౦౨.

సీ...గీరనగింజ కొండకోఁతి...హంస. ౩. ౧౪౬.

ఉ. చారుచిరత్నరత్నమయ సౌధముల న్బురినైశ్య
కన్యక,ల్గీరనగింజ లాడుతఱి...శశాం.౨.౧౯.

**గీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మ్రింగఁబడిన
ది. ౨. వర్ణింపఁబడినది; పొగడఁబడినది.

**గీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వర్ణించుట; స్తోత్రము. ౨.
నిగరణము, మ్రింగుట.

**గీర్దేవి.** సం. వి. ఈ. స్త్రీ. వాగ్దేవి, సరస్వతి.

**గీర్పతి.** సం=గీఃపతి.

**గీర్బాణుఁడు.** సం=గీర్వాణుఁడు.

**గీర్వాణకుసుమము.** సం. వి. అ. న. దేవకుసుమ
ము, లవంగముక.

**గీర్వాణుఁడు.** సం. వి. అ. పుం-వాక్కు బాణము
గాఁ గలవాఁడు; వేదశాస్త్రరూపవాక్కును
వివరించి చెప్పువాఁడు; స్తుతిరూప మగుమం
త్రాదికము వినఁ గోరువాఁడు- దేవత, వేల్పు.

**గీఱ.** వి. (√గీఱు) గీఁత, రేఖ.

రగడ. కన్నెచంటిముంటిగీఱఁ గన్నఁ గన్నతల్లి
దిట్టు...వరాహ. ౩. ౯౨.

**గీఱు.** అ. క్రి. నాటు, గ్రుచ్చుకొను.

చ...ద్రౌపది నింతకాల మ,ప్పలుకు లలంచుచుం
డె మదిఁ బాయవు గీఱినయమ్ము లట్ల...భార.
౩. ౩౬.

ఉ...వృకోదరుండు పదితూపులు పాములు పుట్ట
లోనికిం, దూఱినయట్లు గాఁ బ్రబలకోర్చల
మేర్పడ నేయ నెమ్ములన్, గీఱిన మూర్ఛ వచ్చి
యొఱగెన్...భార. భీష్మ. ౨. ౩౯౭.

సీ. పాంచాలి నవమానపఱిచిన తెఱఁగును నయ్యెం
తి వెనుక రా నడవిఁ గలయ, ధర్మజుచన్న చం
దంబును మది గీఱి యుండక మఱి పెట్టు లొల
సె నీకు...భార. ఆశ్ర. ౧. ౧౧౭.

స. క్రి. ౧. (పండ్లతో) చీకు.

సీ. ఎఱచి గీఱిన జీర లేర్పడఁ దునుముట్టఁ జీకిన
నులిపచ్చికీకసము ను. ఆను. ౬. ౧౩.

౨. ఛేదించు.

వ...ఇట్లు మనుహూనుం డేయు సాయకంబులు
...మర్మంబులు గీఱియు...ఉ.హరి.౧.౧౪౭.

౩. భేదించు.

క...గీఱునె సాత్త్వికులబుద్ధి గిల్బిషచయముల్.
నృసిం. ౧. ౯౫.

౪. (గోళ్లతో కుసుము) దువ్వు.

ఉ. చేరఁగ రార నీకురులు చిక్కువలించెద నం
చు నేర్పుతో, సారసగంధి పిల్చి బిగిచన్నులు
వెన్నున నాన నిల్పి శ్రం, గారపువింతమాటల
వికావిక వాని నగించి నవ్వుచుం,గూరిమి మీ
ఱ గీఱి కొనగోటఁ జిటుక్కున నొక్కఁ జొ
క్కఁగన్. శశాం. ౨. ౭౪.

శా. పన్నీటన్ నయనంబు లొత్తెఁ దనువుం జాఱీ
రపంకంబుతోఁ, జెన్నారం బద నిచ్చె గీఱిసి
గ వేసెన్ దాయెతు ల్సాట్లె...హంస.౧.౪౫.

జ: గీఱ, గీఱుగాజు, గీఱుడు, గీఱునామము, గీ
ఱుబొట్టు.

**గీఱుగాజు.** వి. (√గీఱు) ఒకవిధ మైనగాజు. (శ.
ర.)

**గీఱుడు.** వి. (√గీఱు) ౧. గోఁకుడు. ౨. భేదనము.
(శ. ర.)

**గీఱునా(ర్నా)మము.** వి. (గీఱు + నామము)గో
టితో గీఱి తీర్చెడిబొట్టు.

సీ. తెఱవ కస్తురిచుక్క దీర్చి వచ్చిన బెక్కు గీఱు
నామము నాఁటితీరుఁ గేరు...విజ. వి.౩. ౧౩.

సీ. నెలరేక నుదుటిపై నీ రైనకమ్మఁగస్తూరిగీర్నా
మంబు సొరు మీఱ. ఇందు. ౧. ౨౦.

గీఱుబొ(ర్బొ)ట్టు=గీఱునామము.

గీ. వెలయ మృగనాభి గీర్బొట్టు వెట్టినారు...నై
ష. ౭. ౬౩.

గీ. కలికి కాటుకగీర్బొట్టు పలుఁగు పేరు, జాతి
గాఁ దాల్చి నెఱిమించ జంగ మగుచు... హ
ర. ౫. ౪౦.

గీవు=గిరవు. అప్ర. (శ. ర.)

గీష్పతి. సం=గీఃపతి. (ఈశబ్దము పాణినీయమునకు
విరుద్ధము.)

ఉ. ...గీష్పతి యేమి చెప్పె నిటక్రింద బలారికిఁ
గామవిక్రియా,దుష్పథవృత్తి కిఁక ... నైష.
౪. ౭౨.

## గు

గుంజె. వి. (క. గుంజె) ౧. స్తంభము.

సీ. వికలంపుఁదెడ్లపోలికడొంకుచేతులు పందిలి
గుంజలపగిదికాళ్లు. ప్రబంధ. ౬౨౨.

౨. రాట్నముయొక్క అవయవము. (ఇది స్తంభ
మువలె నుండును.)

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలకయు
దిండు కదురు గుంజలును ద్రొక్కుడుబొమ్మ
యునుం ద్రిప్పడు,పుడుకయునుం గలుగురా
ట్నములు నైకొనుచుఁ. శుక. ౨. ౪౧౯.

గుంజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. గురిజ, గురివెంద. ౨.
రెండుగోదుమగింజలయెత్తు. ౩. అవ్యక్తమధురధ్వ
ని. ౪. తప్పెట, వాద్యభేదము. ౫. గంజ, కల్లుదు
కాణము. (వాచ) ౬. ఉప్పళము, ఉప్పఁబత్తి.

గుంజత్. సం. శత్ర. అవ్యక్తమధురధ్వని చేయుచు
న్న.

గుంజనము. సం. వి. అ. న. అవ్యక్తమధురధ్వని.

గుంజెనుసుఁగు. స. క్రి. పరిహాసముచేయు. (శ. ర.)
వి. ఎలుఁగుగొడ్డాట. (శ. ర.)

గుంజము. సం. వి. అ. పుం. ౧. అవ్యక్తమధురధ్వ
ని. ౨. గుచ్ఛము, పూలగుత్తి.

గుంజాటన. మి. వి. వ్యసనము. (శ. ర.)

గుంజిక. సం. వి. ఆ. స్త్రీ. గురివెందపూస.

గుంజితము. సం. వి. అ. న. అవ్యక్తమధురధ్వని.

గుంజిలి[1]. వి. గోపనము, దాఁపురము. (చూ. గుం
జిలిపెట్టు[1].)

జ: గుంజిలిపెట్టు 1.

గుఁజిలి[2]. వి. (బ. గుంజిళ్లు) చేతులు కట్టుకొని రెం
డుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండి లేచుట. (బ్రౌ,
శ. ర.)

సీ. గుంజిళ్లు పెట్టించుకొను మేటి పిళ్లారి కుడుము
దాలుపు పెద్దకడుపువేల్పు. సాం. ని. దేవ. ౨.

జ: గుంజిలిపెట్టు[2].

గుంజిలిపెట్టు[1]. అ. క్రి. (గుంజిలి[1] + పెట్టు) గో
పనముచేయు, దాఁచు.

ఉ. కావరమెత్తి యిట్టు లనుఁ గాటియ పెట్టుచు
నున్న దాని ని,చ్చావతిఁ జూచి లేచి రభసం
బున రెడ్డన పల్కె నోసి నీ,చేవ యెఱింగి కా
ద మును చెప్పక గుంజిలిపెట్టి యున్కి నీ,వే
వల దన్న వేఁడుకొనవే మఱి యేనయి చెప్పి
నాఁడనే. వేం. పంచ. ౪. ౪౬౯.

గుంజిలిపెట్టు[2]. అ. క్రి. (గుంజిలి[2] + పెట్టు) గుం
జిళ్లుతీయువానివలె పైకిఁ బోవుచుఁ గ్రిందికి వ
చ్చుచుండు.

క. పెంజెమట జాఱ దోవతి, పింజెలు మాటికిని
గాళ్లఁ బెనఁగొనఁ గడుపుల్, గుంజిలిపెట్టఁగ
వేలుపు,లంజెలఁ గూడంగఁ జని హాహాహరి
మొఱయుచుఁ. వాల్మీకి. ౩. ౧౧.

గుంజో. స. క్రి. (క. గుంజా.) ౧. (వ్య, మొ.) జా
డించు.

శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియద్ద్వారా
ళి వేటాడి ప్రావృణ్ణారంభం బనుబుట్టఁ బెట్టి ను
లి వాయుం గుంజి యీఁ దాఁటఁ జె,న్నార
నై వ్యచినజాలమో యనఁగ శోభాకించనత్వం
బునన్,దారానాయకమండలం బమరె నన్
గ్రావకూటంబునన్. కాశి. ౪. ౯౬.

సీ. అని చిన్నకూఁకటిఁ బెనఁచినజడ పట్టి గుంజి
యీడిచి చెంపఁ గొట్టి తిట్టి.హరిశ్చ.౫.౧౭.

౨. లాగు, బలాత్కారముగానీడ్చు. (బ్రౌ, చి.ని. ధాతుమాల.)

సీ.కరముష్టిదండ మెక్కుఁడు తీసి పోనై చె నంజ
కొక్కుఁడు శిఖ గుంజి యడిచె. హరిశ్చ. ౪. ౧౬౨.

3. ఉదుకు; బట్ట ఉదికినట్లు కొట్టు.

సీ... అయ్యెడకుఁ జీరలు గుంజునొక్క చాకిత
యీఁ దా నొంటి వచ్చి. భోజరా. ౪.౧౪౫.

ఉ...భక్త వ,స్త్రావళి గుంజుచో... చెన్న. 3.౯౭.

సీ. పాదంబు లిరుచేతఁ బట్టి గుంజుండు జర్జరితం
బుగా వీనిఁ జట్టురాత. కాశీ. 3. ౧౫౭.

వి. ౧. ఈఁతచెట్టు తాటిచెట్టు మున్నగువాని మొవ్వు.

(దుర్భిక్షువర్ణనము.) గీ...ఈఁత, గుంజు మొదలు
గఁ దిన దొరఁకొనియె జనము. కాశి. 3.౧౫౧.

౨. తాళపేశము.(తాటితేగ మొనయందు బుజ్జిలో నుండెడుగిజురు. శ. ర.)

గీ. తాళపేశంబు గుంజనఁ బోలు నభవ. ఆం. భా. ౨. ౭౭.

3. ఫలాదులలో అనువుగా నుండుసారము,గుజ్జు. (బ్రౌ)

జ: గుంజుకొను, గుంజులాడు.

**గుంజుకొను.** స. క్రి. (√గుంజు)లాగుకొను.(బ్రౌ)

**గుంజులాడు.** అ. క్రి. (√గుంజు) పెనఁగులాడు. (బ్రౌ.)

**గుంట**=కుంట.

(చిన్నగొయ్యి, గుంత.)

వ...గరువు నేలల గుంట లొనరించి ... మనుచ. ౪. ౬౦.

(చిన్నచెఱువు, అల్పతటాకము.)

గీ. కుంట గుంట యనంగఁ బేర్కొనఁగ వచ్చు,
నల్ప మైనతటాక మార్యాసమేత. ఆం. భా. ౧. ౧౬౨. అమ. ౪.౨౩౬.

(కొండ్ర)

గీ. ప్రబలు సీతానివృత్తి కొండ్ర యన గుంటయు
నఁగ...ఆం. భా. ౨. ౨౩౩.

(భూపరిమాణవిశేషము. శ. ర, బ్రౌ.)

జ: గుంటక, గుంటకలగర, గుంటక్రోవి, గుంటగలిజేరు, గుంటచాళ్లు, గుంటమాలము, గుంటనక్క, గుంటప్రొయ్యి, గుంటమారి, గుంటబుపడు.

**గుంటక.** వి. (√గుంట-క. కుంటె) దున్ని విత్తులు చల్లినవెనుక నేల సవర చేయుసాధనము. (చి.ని, శ. ర, బ్రౌ.)

సీ. గుంటక నాఁగను గొర్రు నా...పరఁగునుగృ
షి,సాధనభేదముల్ ... ఆం. భా. ౨. ౨౩౩.

**గుంటకలగర.** వి. (√ గుంట) భృంగరాజము ౹. ఆం. భా. ౨. ౬౯. (గుంటగలగర-శ.ర,చి.ని.)

**గుంటక్రోవి.** వి. (గుంట + క్రోవి) ఒకరకముఫిరంగి. (చి. ని-గుంటక్రోవ. బ్రౌ, శ. ర.)

గీ...గుంటక్రోవి,జబురుజంగి తుపాకి జజా యనంగ, నెలయు నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ. ఆం. భా. ౨. ౨౧౭.

**గుంటగలిజే(జ్జే)రు.** వి. (గుంట+గలిజేరు) గుంటకలగర, భృంగరాజము ౹.

గీ. గుంటగలిజేరు కలగర గుంటకలగ,ర యనఁ జె
న్నొందు నా భృంగరాజసంజ్ఞ.ఆం.భా.౨.౬౯.

సీ... గలిజేరు గుంటగజ్జేరును. హంస. ౪. ౧౦.

**గుంటచాళ్లు.** వి. బ. (గుంట+చాలు)బాలక్రీడావిశేషము.

సీ...పుట్టచెండ్లుప్పనఁబట్టె లాలంకులు గుడుగుడుగుంచాలు గుంటచాళ్లు... గీ. ఆదిగాఁ జై

వక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదా
రకులఁ గూడి. వి. పు. ౬. ౨౦౨.

**గుంటదూలము**=కుంటదూలము. (శ. ర.)

**గుంటనక్క.** వి. (గుంట + నక్క) చిన్నజాతిన
క్క, కిఖి. (శ. ర.)

**గుంటప్రొయ్యి.** వి. (గుంట + ప్రొయ్యి.) గుంట త్ర
వ్వి యేర్పఱచిన ప్రొయ్యి. (శ. ర)

**గుంటమారి.** విణ. (గుంట + మారి) దుర్మార్గుఁడు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి,
కాఁ కలను దేటి గడిమీఁటి గట్టిపాటి, రాలు
గాయతనాన బేరజపుదారి, నారితేటియు
బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

**గుంటలుపడు.** అ. క్రి. (√ గుంట.) పల్లమగు,
లోఁతగు.

వ...వెన్నంటుకొనినయుదరంబులు గుంటలుపడిన
కన్నులు...దశా. ౨. ౫౩.

**గుంటి.** వి. ౧. చేనిభాగము. (శ. ర.) ౨. దున్నుట
మొదలగువాని కేర్పఱచుకొన్న భూభాగము. (బ్రౌ,
శ. ర.)

**గుంటిక్రోవి.** వి. (గుండు + క్రోవి.) ఒకవిధ మైనతు
పాకి.

వ...పిరంగులధింధిమ్ములు... గుంటిక్రోవులడబ్బ
డుబ్బులు...ప్రబంధ. ౬౭౭.

గీ. క్రోవులను గుంటిక్రోవులఁ గోటమూఁక, యల
ముఖంబునఁ దొట్టినబలము నెల్ల, మంగలము
లోని పేలాలమాడ్కిఁ బేల్చె. రా.వి. ౫. ౨౨.

**గుంటు.** వి. ఒకజాతియాయుధము.

గుంటుకాఁడు=గుంటు అనునాయుధముకలవాఁడు.

సీ. ఎంపనుర్పుడు నేయు నేనిక కాని ముక్కోయ్యి
లువడ వ్రేయుగుంటు కాని. కు. సం. ౧౧.
౬౧౦.

**గుంఠనము.** సం. వి. అ. న. ౧. కప్పుట. ౨. పూ
యుట.

**గుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కప్పఁబడి
నది. ౨. పూయఁబడినది.

**గుండ[1].** వి. ౧. గుడ్డ, బట్ట.

సీ. ఎండగట్టినకావిగుండలకెంజాయ చిగురుజొం
పంబుల చెన్నుఁ బెంప. యయా. ౨. ౫౦. (శ.
ర. పా-'ఆఱఁగట్టినకావిచీరల' ముద్రి. పా.)

**గుండ[2].** (సం. గుండకః) పొడి. (శ. ర, వా.)
జః గుండాకు.

**గుండ[3].** ప్ర. ద్రు. పంచమీవిభక్తి ప్రత్యయము.

గీ. వైకొనక సమిధలు తోంటికరణిఁ గోయు,
చుండె ఖండితతర్జనిగుండ నెత్తు, రెముక మొ
దలుగ లేదయ్యె నించు కైన, భూతియె వెడ
లె నార తపోవిభూతి. వరాహ. ౧౨. ౨౫.

స్రగ్విణి. దండకారణ్యమధ్యంబుకాల్దోవలో,
గుండ నేఁ గవ్వపుంగొండకుం బోవ...ప్ర
బోధ. ౫. ౯౭.

**గుండఁగి.** వి. సలిలకుక్కుటము, నీరుకోడి.

గీ. సలిలకుక్కుటనామంబు వెలయు నీరు, కోడి
యనఁ బుల్లగొర కన గుండఁగి యన. ఆం.
భా. ౨. ౯౨.

**గుండఁడు.** వి. (క. గుండ) బంటు, దానుఁడు.

సీ. బానసీఁ డన బంటు వరవుఁడు గుండఁడు
నాఁగ దాసాఖ్యలు గాఁగఁ దనరు. ఆం. భా.
౨. ౨౭౭.

ఉ. గుండనికిం బసిండిపనిగో రడిబండకు వెండి
తాయెతుల్, లండికిఁ జేకడెంబు పదిలంబుగ
గుమ్మెతకాని కండెలుల్, బెండెము బాడుగో
లునకు భృత్యునకు న్మైడనూలు చాటుకో, దం
డున కుంగరాలు మొలత్రాడులు గుంటెనకాని
కియ్యఁగల్. హంస. ౫. ౧౩౬.

సీ. ఆకతాయ బికారి యడిబండ గుండఁడు మొం

డికట్టై గులాము మెప్పె గోపు. హంస. ౨. ౧౧౩.

**గుండకము.** సం. విణ. (అ. ఆ. అ) మలిన మైనది. వి. అ. పుం. ౧. పొడి, గుండ. ౨. స్నేహపాత్రము, చమురుపాత్రము. ౩. అవ్యక్తమధురధ్వని.

**గుండక్రియ.** సం.వి.ఆ. స్త్రీ. ఒకానొకరాగము.

సీ. గుజ్జరి మలహరి గుండక్రియ వరాళి దేవగాంధారియు... ప్రబంధ. ౯౨.

**గుండగొయ్య.** వి. దుష్టుఁడు. (శ. ర-'మూర్ఖుఁడు' అని బ్రౌ)

**గుండము.** వి. (సం. కుండం. త. కుంటం.) నిప్పల గుంట.

ద్వి. ఈగుండములు సొచ్చి యెలమిఁ జుట్టియును, జాఁగిలిపడియుండు సర్పములు పెక్కు. రం. రా. యు. ౨౯౦ పా. ౨౦ పం.

సీ. అవలవ మండుసెట్టినిచంద్రమల్లెలచోద్యంపు గుండాలు చొచ్చువారు. క్రీడా. ౧౮౨.

౨. (నద్యాదుల)లోఁతుభాగము.

సీ. చామచన్నులతోడ సరివత్తు మని కోకములు దండిగుండాన మునిఁగెనేని, యతివమై దొరయుదు నని సువర్ణశిలాక వహ్నిలోపలఁ జొచ్చి వచ్చెనేని...విక్ర. ౨. ౧౭౦.

ఉ. గాములమేటి లోకములకన్న తమమ్ములమిత్తి యామినీ,భామ తొలంగుబావ సెకవాఁకల గుండము...కృ. శకుం. ౩. ౫౯.

**గుండము.** సం. వి. అ. పుం. వాసన గలయొకవిధ మైనగడ్డి.

**గుండా.** వి. ధీరుఁడు. (బ్రౌ, శ. ర.)

**గుండాడు.** స. క్రి. (గుండ[2] +ఆడు) గుండగాఁ జేయు, పొడిచేయు.

సీ. దుండగంబునఁ బూల గుండాడ వికలితవృత్తిఁ గల్పకవాటి వీటఁబోయె. వరాహ. ౧౦.౧౫.

**గుండారోచని.** సం. వి. ఈ. స్త్రీ. కాంపిల్యము, కంపిల్లము కీ.

**గుండారోచనిక.** సం. వి. ఆ. స్త్రీ=గుండారోచని.

**గుండాల.** సం. వి. ఆ. స్త్రీ. జలోద్భూశ, ఒకవిధ మైనగడ్డిదుబ్బు.

**గుండాసిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధ మగుగడ్డి.

**గుండికము.** సం. వి. అ. పుం. (బియ్యము మొదలగువాని) పిండి.

**గుండిగ.** వి. (సం. కుండికా. త. కుండిగై.)వెడల్పు నోరు గలలోహపాత్రము. (శ.ర)

**గుండితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧.పొడిసేయఁబడినది,పిండిసేయఁబడినది. ౨. కప్పఁబడినది.

**గుండీ.** వి. (క. గుండ.త.గొండి) బొత్తాము.(శ.ర.)

**గుండు.** వి. డౌ. (సం. గండః. క. గుండు. త. కుండు.) ౧. గుండ్రపురాయి; పెద్దఱాయి.

సీ. వర్తులశిలపేరు వఱలు గుం డనఁగను ... ఆం. భా. ౨. ౨౯.

గీ. కోపమున హలధరుఁ డొకగుండు వైవ. భాగ. ౧౦ ఉ. ౨౮౮.

గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు. ఉ. హరి. ౪. ౨౬.

గీ. అంటుకొనె నద్వరాశ్వ మగ్గుంటితోడ. శై. భా. ౪. ౭౬. పాండు. ౨. ౨౮౦.

౨. తూనికఱాయి. (శ. ర.)

౩. ఫిరంగి తుపాకిలోనగువానిగుండు.

వ...పౌండ్రభూపాలుండు యదువీరునగరంబు కలుకోట ... దంచనపుగుండ్లం బడసైచియు ...ఉ. హరి. ౩. ౩౬.

౪. ఉండ, గోళకము.

గీ...గుం డన నుండ నా నమరు గోళ, కాఖ్య... ఆం. భా. ౨. ౨౭౨.

**గుదులుపట్టు.** అ. క్రి. (గుదులు+పట్టు) కదలకుం డ కూర్చుండుటచే కాళ్లు స్తంభించు, స్తబ్ధమగు. (వ్యవ) చాలసేపు కూర్చుండుటచే నాకాళ్లు గుదులుపట్టినవి.

**గుదోద్భవము.** సం.వి. అ. పుం-గుదమునఁ బుట్టునది-మూలవ్యాధి.

**గుద్ద.** వి. (సం. గుదమ్. క. గొద్ద) ౧. అపానము, పాయువు, ముడ్డి.

సీ. భారతకథలోన బాలరా జొక్కఁడు కుంభకర్ణునిబట్టి గుద్ద సించె. వేణు. ౫౭.

సీ...గుద్ద పిఱ్ఱి యనంగ గుదము దనరు. సాం. ని. మాన. ౧౯.

౨. యోని, ఆఁడుగుఱి. (వా-చూ. గుద్దబిల్ల.)

జః గుద్దబిల్ల.

**గుద్దబిల్ల(ళ్ల).** వి. ఆఁడుపిల్లలమొలను గట్టెడిబిల్ల, అంగబిళ్ల. (వా

**గుద్దలి.** వి. ఔ. (సం. కుద్దాలః. క. తు. గుద్దలి. త. కుందాళం) వేళ్లు మొదలగునవి పెల్లగించెడిసాధనము, కుద్దాలము.

సీ. గుద్దండ్లనుం బెద్దగునపంబులను గోట యొండొండ త్రవ్వుట...హరి. ఉ. ౨. ౧౬.

చ. మును దమసీమ చేసికొని ముల్లిడి గుద్దట వెండి చేనిమెత్తన కయి వేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడుకర్షకునట్లు...ఆము. ౪. ౨౧౯.

జః గుద్దలించు, గుద్దలిగొను.

**గుద్దలించే.** స. క్రి.(√గుద్దలి.) ౧.గుద్దటితో త్రవ్వు; త్రవ్వు; త్రవ్వు, పెల్లడించు.

సీ...కొందలు తోడుగా గుద్దలించి. గీ. పెన్నిధులు గాంచి వెరవునఁ బెల్లగించి. దశకు. ౩. ౫౩.

సీ. గురుపయోధరభారపరిణాహవిస్ఫూర్తి గుద్దలింతుదు హేమకుంభగరిమ. భీమ. ౧. ౯౧. (ఇట ఔపమ్యవాచకము.)

గీ. ఏలయెన్నోఁతరంబుల నీడఁబడ్డ, పెద్దవావులు శోధించి గుద్దలింప, వారకాంతాజనములకు వావి గలదె. హర. ౭. ౧౨౭.

౨. వెదకు.

సీ....లోలార్కునగరిమోసాల వెదకి, దండపాణ్యాసవభాండేశ్వరంబులుఁ గుక్కుటస్థానంబు గుద్దలించి. కాశీ. ౨. ౪౧.

**గుద్దలిగొను.** స. క్రి. (గుద్దలి+కొను) గుద్దలి పెట్టి త్రవ్వు; త్రవ్వు.

క. వటుమానసనుక్షేత్రముఁ, గుటిలాలకచేష్టితముల గుద్దలిగొని యిట్టటు పాదు చేసి మోహపు,వటబీజము మరుఁడు నాటి పర్థిలఁజేసెన్. వైజ. ౨. ౧౩౬.

(వరాహము.) చ. మునుకొని సస్యసంఘముల మోరను గుద్దలిగొంచు నెల్లెడం,దనకుపుమైఁ జరించు...విక్ర. ౨. ౧౭౯.

అ. క్రి. హాని చేయఁ దలఁచు.

వ... కురుకులంబునకు గుద్దలిగొని దుర్వ్యాతంబు నీవ తొడరితి...భార. శల్య. ౨. ౩౨౭.

ద్వి. కులమున కెల్లను గుద్దలిగొనియోఁ,గుల మెల్లఁ గొనిపోయి జలములోఁ గలిపె. పండితా. దీక్షా. ౪౩ పొ.

**గుధితము.** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టుకొనఁబడినది, క్రమ్మఁబడినది.

**గుధేరుఁడు.** సం. విణ. (అ. ఆ.అ) రక్షకుఁడు.

**గునగున.** వి. (త. కుణుకుణు.) వేగముగా నడచుటయం దగుధ్వని కనుకరణము.

వ...కొందలు గునగున నేఁగి చేరువఁ బుట్టలఁ జేరువారును... ప్రబంధ. ౭౭౭.

(వరాహవర్ణనము.) చ. గునగున వచ్చి లావరులఁ గొమ్ముల ప్రక్కలువాఱఁ జీరుచున్...విక్ర. ౨. ౧౭౯.

క. ఈపగిది నతఁడు గునగున,గోపన వెనువెంట న
రిగెఁ గొంకక...వి.ప్ర. ౪. ౫.

**గునప(న్ప)నకోడి.** వి. వనకుక్కుటము.

సీ. గువ్వ గున్పనకోడి గోర్వంక కోయిల...ప్ర
బంధ. ౨౩౪.

**గునపము.** వి. గడ్డపార, ఖనిత్రము.

గీ...బలితంపుటెనుపకట్లమర నొప్ప, వెండిగున
పంబులో కాక వెండికట్ల, యినుపగునపంబు
లో యనఁ దనరి కురిసె, నెంతేయను జిత్తు
జల్లుగ నేదుముండ్లు. కళా. ౬. ౮. హరి.ఉ.
౨. ౧౬.

**గునామొలనూలు.** వి. బిడ్డలు కట్టుకొనుకటిసూ
త్రవిశేషము.

ఉ. కెంపులరావిరేక జుమికీల్ పులిగోరును జం
దమామ స్వర్ణంపుసరాలు గాజులు గునా
మొలనూల్ రవగజ్జె లందియల్. భానుమ
ద్విజయము. ౧. ౬౫. (బ్రౌ, శ. ర.)

**గునియు.** అ. క్రి. ౧. నర్తించు, ఆడు; చలించు;
ఊఁగు; చెదరు.

ద్వి. అంచితప్రీతిమై నాడెడివారు, కో యని
యార్చుచు గునిసెడివారు. పండితా. దీక్షా.
౫౫.

కవిరాజ... కుచాగ్రములన్, విరులు నటింపఁ
గురుల్ గునియన్ ... వ్రజసుందరు లంద
అమందగతిన్. (చని.) భాగ.౧౦ ఉ.౪౮౮.

సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక గు
నుకుపర్వున గూను గునియ నేఁగి. దశా. ౭.
౨. ౩.

వ.... కావళ్లు మోచికొని యొండొరులతోడం
బంతంబు లాడుచు గునిసి గునిసి నడుచువా
రును...వి. పు. ౭. ౧౪౭.

గీ. గునియుజార్సిగ చెక్కుట గోర దూవిఁ, గెం
పులత్తుక నుదుర గంధంపుఁజిటులు, వాడప
సుపంటువలువతో వచ్చినట్టి, పుత్ర యిది
కానినడతకుఁ బులుఁగుగాదె. ప్రబంధ ౬౫౩.

౨. కులుకు.

(ప్రమథవర్ణన) సీ. పులితోలు హొంబట్టుఁబట్ట
ము గ్గలవారు కొమ్ముతేజుల నెక్కి గునియు
వారు. పాండు. ౧. ౧౬౫.

జ: గునిసియాడు, గునుపు.

**గునిసియా(సా)డు=గునియు.** అ. క్రి. (గునిసి+
ఆడు)

(నర్తించు, ఆడు; చలించు.)

సీ. వేడుకతోఁ బోరు సూడంగఁ గంటి నే నని
నారదుఁడు వొంగి గునిసియాడ.కు.సం. ౧౨.
౮౮౪.

సీ. కనకాద్రి సానుసంగతకేకినులభాతిఁ గ్రొమ్ము
ళ్లు వీపుల గునిసియాడ. భాగ. ౧౦ ఉ.౮౦౩.
కాళ. ౩. ౭౫.

ఉ. క్రొన్నెలవంటినెన్నుదుటఁ గుంతలముల్ గుని
సాడుచున్నయా, చిన్నికుమారుఁ గాంచి...
బ్రహ్మో. ౪. ౧౧౩ పా. (శ. ర. పా)

సీ. అట్టు నిట్టు దువాళి హవణింప నాసులోఁ గ్రో
వి నా వలిమెట్టు గునిసియాడ. బహు. ౩. ౬.

**గునిసె=గొనిసె.** విణ. పొట్టివాఁడు, వామనుఁడు.

సీ...మట్టసి మట్టము మట్టసము గొనసప
గొనిసె గునిసె గిఱక తింగణా యనఁగను వా
మనాఖ్య దనరు. ఆం. భా. ౨.౧౨౩. (వ్రాత
ప్రతిపాఠము)

**గునుకు[1](న్కు).** అ. క్రి. మందముగా పరుగెత్తు;
పరుగెత్తు.

గీ. క్రొవ్వి నడగొండకై పడి గునుకునొక్క, యొం
టిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ.మనుచ.
౪. ౪౭.

గీ. వెదమొదవుకూడఁ బో లేనివెచ్చఁ గ్రొవ్వొ,
కల్ప మెడనూప వెడలెనో యనఁగ నెట్ట, శే
లకును గ్రుంగి తెచ్చుఁబంకాలు నిగుడఁగ, మం

దగతి గుస్కొ వృషభముల్ మందపిఱుఁద. ఆ
ము. ౪. ౧౬౯. (వ్రాతప్రతి. పా)

ద్వి. అని మడమలు మోవ కతిసంభ్రమమున, గు
నుకుచు...ద్వి. హరిశ్చ. ఉ. ౫౪౬ పం.

క. అని తలపోయుచుఁ దమలో, మునుకుచుఁ దిక
మకలుగొనుచు మురరిపుకడకుం, గునుకుచు
గునుకుచు నేఁగిరి,ఘనరాక్షసుఁ గన్నకన్నుఁ
గవ బెగ్గిలఁగన్. భాగ. ౬. ౩౨౫.

వి. అల్పధావనము, మెల్లనిపరువు.

సీ.గునుకు డనంగను గును కనఁగా నల్పధావనసం
జ్ఞయై తనరుచుండు. ఆం. భా. ౨. ౨౭౪.

జ: గునుకుడు, గునుకునడ, గునుకుపరువు, గునుకె
త్తు.

**గునుకు².** వి. తృణవిశేషము.

సీ. చీమలు ప్రాలీడ్వఁ జివికినవెలుగుపట్టునఁ బం
డి యెండి క్రుంగినగునుకుల. ఆము. ౬. ౧౩.
ప్రబంధ. ౨౦౦.

(బ). తృణధాన్యవిశేషము.

సీ...తృణధాన్యములు చెలంగు, గునుకులు దూస
రు ల్గాలివె లనంగను...ఆం. భా. ౨. ౨౩౯.
కాళ. ౩. ౧౫౧.

గునుకుఁబ్రాలు=గునుకుబియ్యము.

క. ఓలింగము విను నివ్వరి,ప్రాలును నొడిపిల్లు గును
కుఁబ్రాలును వెదురుం, బ్రాలును సవరపుమెక
ముల, పాలును గల పచట నీకుఁ బాయసము
నకున్. కాళ. ౩. ౬౭.

వ...చమరీమృగంబులపాలకు ననుకూలం బైనగు
నుకుంబ్రాలపాయసంబులకుండలు... కాళ.౩.
౩౬.

**గునుకుడు.** వి.(√గునుకు¹.) అల్పధావనము. ఆం.
భా. ౨. ౨౭౪.

**గునుకునడ, గునుకునడుపు.** వి. (√ గునుకు¹)
మెల్లనినడక, మందగమనము.

గీ. ఒనరుడుప్పట్లు కడ నిల్పి గునుకునడల, నుచిత
నిజభాషణంబుల నొంటియొంటి, హస్తమునఁ
బూని యొక్కొస్తిబెస్తబిడ్డ, లందలము నిల్పి
రవనిపాలాగ్రసీమ. రా. వి. ౨. ౪౪.

గీ. కోరమీసము మిడిగ్రుడ్లు గునుకునడుపు, బెద
రుఁజూపులుఁ గటిమేను గదురుకంపు, వలుఁద
యొరచ్చులును గల్గి వచ్చె నెఱుకు,పాళెగాఁ
డొక్కఁ డాచంద్రభానుకొలకు. చంద్ర.
౨. ౩.

**గునుకుపరువు(ర్వు).** వి. (గునుకు¹+పరువు.)మె
ల్లనిపరుగు, అల్పధావనము.

గీ. గోండ్రుగోం డ్రని గర్జించుఁగొంతతడవు, కో
రచూపుల వీక్షించుఁ గొంతతడవు, గునుకుప
రువునఁ దిరుగాడుఁ గొంత తడవు,కొయ్యారిన
మునఁ గోపించుఁ గొంతతడవు. వరాహ. ౧౧.
౭౬.

సీ. దురితాత్ము రాలు మంథర సహింపఁగ లేక గును
కుపర్వున గూను గునియ నేఁగి. దశా. ౭.
౨౦౩.

**గునుకెత్తు**=గునుకు¹.వి.(గునుకు¹+ఎత్తు)పరువెత్తు.

క. గునుకెత్తుచున్న గాడిదఁ, గనుఁగొని సింహంబు
వలికె ఘటకునితో సీ,చనుఖరముఁ దటిమికొ
న నా, తనువున వడి లేదు తెమ్ము దగ్గఱఁ జే
రన్. వేం. పంచ. ౪. ౫౭౧.

**గునుపము.** వి. ముద్గరము, గద.

సీ...కేరుచుండును.గీ.గుదె గుదియ దుడ్డు గునుప
ముగుడుప యనఁగ, ముద్గరము ... ఆం. భా.
౨. ౨౧౬.

**గునుపు.** వి. (√గునియు.)విలాసము.(విలాసవిశేష
ము-శ. ర.)

సీ...గునుపు గొనబు మురిపము మురువు సొగసు
...హొయ లనఁగ విలాస మొప్పచుండు.
ఆం. భా. ౧. ౧౩౯.

**గున్న.** వి. (సం. కుణకః. క. గున్న.) ౧.పంది ఏనుఁ
గు హంస మున్నగువానిపిల్ల.

వ... పిఱుందం దిరుగుచిఱుగున్నలకు వెన్నాడు తోడేళ్ల సివంగులం దిరిశి తిరిగి మొత్తిపోనొత్తి చరియించు నేకచరంబుల ...మనుచ. ౪. ౩౭. ద్వా. ౮. ౨౯. కకు. ౪. ౭౭.

గీ. మిన్ను ముట్టినయేనికగున్నలార. అచ్చ. రా. ఆర. ౮౬.

క...రాయంచల, గున్నలు...చిత్రభా. ౨. ౧౦౮.

౨. క్షుపము, కుఱుచయైనకొమ్మలును ఊడలును గలచెట్టు; గుబురుగాఁ బెరిఁగిన (మామిడి మొదలగువాని) మొక్క.

సీ... గున్న యంచనఁగను క్షుపసమాఖ్య. ఆం. భా. ౨. ౩౬.

రగడ. కొఱలెఁ జిగు రెలమావిగున్నలను ... రాఘవ. ౨. ౬.

వ ... మెఱుంగుఁబోఁడులు చిన్నిపొన్న గున్నలం గని...ఉ. రా. ౪. ౧౬౩.

విణ. వామనము, పొట్టిది.

సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు గున్న... తింగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩.

**గున్నంగి[1].** వి. పక్షివిశేషము.

సీ...గున్నంగి పోపిట్ట గూడబాతు...గీ. అనఁగనిట్లని పక్షి భేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౮.

హంస. ౩. ౧౨. ప్రబంధ. ౨౩౪.

**గున్నంగి[2].** వి. వృక్షవిశేషము.

గీ... గున్నంగి దిరిసెనంబు, మొదలుగాఁ గల్గు బహువిధభూరుహములు. హంస. ౪. ౧౧.

**గుపిలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) రక్షించువాఁడు. వి. అ. పుం. రాజు. (వాచ)

**గుప్త.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సురతగోపనముచేయుపరకీయనాయిక. ౨. అంతఃపురస్త్రీ. ౩. దూలగొండి.

**గుప్తగతి.** సం. విణ. (ఇ) రహస్యమైనసంచారము గలవాఁడు. వి. ఇ. పుం. వేగులవాఁడు, చారుఁడు. స్త్రీ. రహస్యసంచారము.

**గుప్తచరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) రహస్యముగా సంచరించువాఁడు. వి. అ. పుం. వేగులవాఁడు, చారుఁడు.

**గుప్తము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షితము, కావఁబడినది. ౨. గూఢము, దాఁపఁబడినది.

**గుప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. రక్షణము, కాపాడుట. ౨. దాఁచుట. ౩. మూయుట, కప్పుట. ౪. గొయ్యి త్రవ్వుట. ౫. పాఁతఱ; భూబిలము. ౬. చెఱసాల. ౭. రంధ్రము.

**గుప్తుఁడు.** సం. వి. అ. పుం. (ఇది సామాన్యముగా వైశ్యనామములతుదను జేర్పఁబడును.)

శ్లో. శర్మవద్బ్రాహ్మణస్యోక్తం వర్మేతి క్షత్రసంయుతమ్, గుప్తదాసాత్మకం నామ ప్రశస్తం వైశ్యశూద్రయోః. (విష్ణుపురాణము.)

**గుప్పళించు.** స. క్రి. ౧. (అడుగులు గంతులు) వేయు.

గీ. అప్పు డొప్పులకుప్ప కకుప్పవిభులఁ, దప్ప కందఱఁ బ్రభులఁ గందర్పనిభుల, గొప్పకన్నుల ఱెప్పలు విప్పి కనుచు, నిప్పుపూదండఁ గొని నడల్ గుప్పళించె. పాంచా. ౨. ౧౬.

వ... నిప్పుకలచొప్పున ఱెక్క లప్పళింపుచుఁ గుప్పిగంతులం గుప్పళించునవ్వులు గప్పికొనం జొప్పడుపూఁజప్పరమ్ముల... అచలా. ౨. ౬౪.

౨. చల్లు.

వ...ఇసుక మెదుపు నెలవులం బన్నినపసుపుటాకుంజప్పరంబులలోనం గుప్పళించినకప్పురంబుతోడికురువేరుపరిమళంబులును...పాండు. ౪. ౧౬.

౩. ఉప్పళించు, వస్త్రము మొదలగువానిని ఉసుము. (బ్రౌ, శ. ర.)

౪. కలిగించు, పుట్టించు.

సీ. కోడెమీలకు సిగ్గు గుప్పళించువినీలకైరవచ్ఛవిదాయి కన్నుదోయి. ఘటికా. ౧. ౨.

గీ. సోమబింబాస్యదశనవాసోమతల్లి, కొప్పుచంద్రిక నెఱడాలు గుప్పళించె, జిలుఁగుఁబలుచనివా

సోవిశేషములకుఁ, జెన్నొనఁగుఁ గాదె యెటు
వంటికన్నె కలిమి. పాండు. ౩. ౧౯౦.

అ. క్రి. ౧. అతిశయించు.

చ. అరిగెలబంట్లచా లరిగె నప్పుడు చప్పుడు గు
ప్పళింపఁగాన్. రా. వి. ౨. ౫౪.

౨. పుక్కిలించు, గండూషము చేయు.

సీ. నవనీట గుప్పళించెను గళావతి యోర్తు జిగి
మోవి బీటిక లెగయకుండఁ, బన్నీటిచాలు
లోపల నేఁగె నొక్కతె పదయుగంబున గా
సి యొదవకుండ. భాను. ౨. ౭౩.

గుప్పించే. స. క్రి. (గుప్పు1 + ఇంచు–స్వార్థమున)

౧. (అధికముగా) ఇచ్చు.

వ...కవినైగమికవాదివాంశిక వైతాళికాదు లగు
నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ...
హర. పీఠి. ౭.

౨. గుప్పు, (బాణాదులను అధికముగా) ప్రయో
గించు.

మ...కల్పాంతభై, రవభీమాకృతి నేచి భీష్ముఁడు
శరవ్రాతంబు గుప్పించినన్. భార. భీష్మ. ౩.
౩౧౯.

ఉ...కో,పించి శితాస్త్రము ల్గవలు భీముఁడు
సాత్యకియుం గడంక గు,ప్పించిన వానిఁ
ద్రుంచి శరపీడితదేహులఁ జేసె వారలన్.
భార. శల్య. ౧. ౧౯౨.

౩. కురియు, వర్షించు.

క. రప్పించి యధికసంభ్రమ, ముప్పొంగఁగ నం
దగోపుఁ డున్న వ్రజముపై, దెప్పరపుజాల
వర్షము, గుప్పింపుఁడు గోగణములు గోపులు
మడియన్. వి. పు. ౭. ౨౪౪.

గుప్పిలి. వి. ఔ. (√ గుప్పు1) పిడికిలి.

వ...విప్పుగ నాగొప్పకన్నుంగవం గప్పుకొనం
గప్పురంపురజం బొప్పుగ గుప్పుగుప్పున గుప్పి
ళ్లకొలందిగ గుప్పుచు...రసిక. ౩. ౧౪౩.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోదుమపిండి
వంటయున్, గుప్పెఁడుపంచదారయును గ్రొ
త్తగఁ గాఁచినయాలనేయి పెసర్పప్పును గొమ్మ
నల్లనఁటిపండ్లును నాలుగు నైదు నంజులున్,
లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్ష్మణయొజ్జల
యింట రూకకున్. క్రీడా. ౧౬౬.

గుప్పు[1]. స. క్రి. (క. గుప్పు.) ౧. (బాణాదులను
అధికముగా) ప్రయోగించు.

క. శరములఁ జక్రంబులఁ దో,మరములఁ గుంత
ముల గుప్పి మానుగ ఖడ్గ, క్షురికాహలపరిఘా
ము,ద్గరముసలపరశ్వధములఁ గప్పిరి కడిమిన్.
నిర్వ. ౩. ౧౬.

ఉ. తమ్మి నయమ్ము దప్పఁ గుముదమ్ము ముదమ్మున
నొప్పఁ జక్రవా,కమ్ములు జోడువిప్పఁ దమ
కమ్మునఁ జాంధులపై మరుండు పూ,టమ్ములు
గుప్పఁ జీకటి భయంబు గ దిక్కులఁ గప్ప
భాస్కరుం,డమ్మెయి నస్తమించె నుదయమ్మ
యి మించె నుడుప్రభావళుల్. కవిరా. ౫.
౧౭౩.

౨. (అధికముగా) పెట్టు, ఉంచు.

ఉ. చెప్పినఁ బ్రీతులై యతనిఁ జెచ్చెరఁ దోకొ
నిపోయి బూరెలుం,బప్పును నెయ్యిఁ బాయ
సముఁ బక్వఫలాదులు నేత్రతృప్తిగా, గుప్పి
రి ముక్ పథశ్రమము గూరినమేనికి దప్పి దీ
రునట్లు...భోజరా. ౭. ౨౨౬.

౩. (రోఁకలి రెండుచేతులఁ బట్టి బియ్యము లోన
గువానిని) గట్టిగా దంచు.

చ. ... చందనపుఁబోటను నేనుఁగుఁగొమ్మురోఁక
టన్, బ్రిదిలెడుకొప్పుతో నెదురుబియ్యము
గుప్పనిజప్రియాంగనన్. వాల్మీకి. ౨. ౧౦౫.

౪. చల్లు; చిమ్ము.

సీ. కుంకుమ నేను నీగుబ్బల గుప్పితి నతనిటొమ్మున
గుప్పనైతిఁ గాదె. పార్వ. ౬. ౪.

సీ. పూయరే క్రొమ్మావిపూఁ దేనె సతులార గుప్పరే
కపురంబు కొమ్మలార. చంద్రా. ౪. ౧౬౩.

గీ. కప్పురపుఁదావి గుప్పు బాగా లొసంగి. కువల. ౫. ౧౦౮.

౫. పొడుచు.

ఉ...ధేనువుం, డాయఁగఁ బోయి వేడుక నోడ ల్గదలించుచు వాల మార్చుచుం, బాయక గుప్పుచుం గుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్. భోజరా. ౬. ౨౧.

ఉ...వానియెద గబ్బిచనుంగవచేత నెప్పు డే,గుప్పదు గుప్పి వానిరతి కోరుట యెప్పు డటంచు నెంచుచున్. శుక. ౨. ౩౭౯.

౬. వర్షించు.

ద్వి. అప్పుడు దివినుండి యఖిలదేవతలు, గుప్పిరి మందారకుసుమవర్షంబు. ద్వి. శ. సా. ౩.౧౨౦ పా. ౧౦ పం.

జ: గుప్పించు, గుప్పిలి, గుప్పుడు, గుప్పు తెప్పున, గుప్పున, గుప్పేఁడు.

**గుప్పు².** వి. (త. కుప్పెనల్) ౧. వాసనగొట్టుట మ్రోయుట మున్నగువానియందగుననుకరణము.

వ...కప్పురంపుటనంటి గుప్పు మనన్ గప్పుతావులమఁ దావలం బగుతావుల...ఉ. రా. ౬. ౨౮.

ఉ...దేవదుందుభులు గ్రక్కున ధింధిమినాదవైఖరిన్, గుప్పున మ్రోసె...శశాం. ౧. ౩౬.

౨. గ్రద్దుట పొడుచుట త్రోయుట మున్నగువానియందగుధ్వనికి అనుకరణము.

ద్వి. తప్పక రత్నాంగి తనయునిఁ జూచి, గుప్పు గుప్పున బొమ్మ గ్రుద్దుకొంచు...ద్వి. శ. సా. ౨. ౭౨ పా. ౮ పం.

సీ. జడలచుట్ట కుదిర్చి మెడలపై మోఁచేత గుప్పు గుప్పున సారె గుమికి గుమికి.వాల్మీకి.౨.౯౬.

సీ. మిట్ట నెక్కించి బల్మిగ నూకి పల్లాల గుప్పునఁ ద్రోతురు కొంతసేపు. సానందో. ౨. ౨౮పా.

౩. దిగుట దూఁకుట లేచుట వెళ్లుట పడుట మొదలగువానియందగుఅనుకరణము.

క. అరదము గుప్పున డిగి సో,దరికిం బ్రణమిల్లి... జై. భా. ౮. ౧౫౮.

ఉ ... త్రిదశాధిపుఁ డెంతయు నాగ్రహంబునన్, గుప్పున గద్దె డిగ్గి...దశా. ౫. ౭౩.

చ. నలువురు గుప్పుగుప్పునను నాలుగుమూలలనుండి దూఁకి వి,చ్చలవిడిఁ బాఱి సాగినను ... హంస. ౩. ౧౧౦.

సీ. తలయూఁచు నెదలోనఁ దలఁకి గుప్పున లేచుఁ జిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ దిట్టు. రసిక. ౪. ౮.

క. అప్పుడమికాన్పు నెత్తుక, జిప్పునఁ జనునకు నెగసి తేసినకడఁకన్, గుప్పునఁ జనుతతి నొడయఁడు, తప్పక యొకకోల వానితలఁ దెగ నేసెన్. అచ్చ. రా. అర. ౫.

వ...గుప్పుగుప్పునం బడుపిడుగులవడిన్...గుహాకుహరశయాళుబిలేశయంబులు భయంపడి... సమీర. ౩. ౧౭౮.

**గుప్పుడు.** వి. (√గుప్పు¹) గుప్పుట, పోటు.

వ...ఇఱ్ఱికొమ్ముసింగోటలగుప్పుడులును...ప్రబంధ. ౭౮.

**గుప్పుతెప్పున.** క్రి. విశే. ద్రు. (√ గుప్పు¹.) అతిశీఘ్రముగా.

ఉ. అప్పుడు తద్వనాటి చలితాధర యై పరు గుప్పుతెప్పునన్,జప్పుడు గా నదల్చి పరసారసగంధులఁ బొంద నంచు నా, కొప్పునిబాసనిచ్చితి వహో యిటు లెంతకు నెత్తికొంటివి ...శుక. ౧. ౪౫౦.

**గుప్పున.** క్రి. విశే. ద్రు. ( √ గుప్పు¹.) శీఘ్రముగా, వేగముగా; అకస్మాత్తుగా.

ఉ. అప్పుచు లాడుచు న్నగవు లాడుచు బారలు చాఁచి చాఁచి మా,యప్పలు వచ్చి రంచు నయ ల్గనుఁదమ్ముల మోడ్చి పిల్వఁగా,గుప్పునఁ ద

ప్పుత ప్పుటదుగున్న డల న్గొమరుండు పైప దుర్యదప్పక చూచుతల్లికిని దండ్రికి ముచ్చ ట దీఱునట్లుగ౯. చంద్రా. ౨. ౬.

ద్వి. గుప్పనఁ దెమ్ము పేర్కొని గ్రుక్కఁ డను చు. బస. పు. ౭. ౬౭౬ పం.

ఉ. అప్పుడు వేళ గాఁ దెలిసి యచ్చెరువారఁగ మోడ్పుఁ గేలుతో, గుప్పన మ్రోల వ్రాలి రఘు కుంజరు నేమపువార్త మున్న గాఁ, జెప్పి... రామా. ౬. ౧౭౬.

**గుఫితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కూర్పఁబడి నది. (మాలికాది) ౨. రచింపఁబడినది. (కావ్యాది)

**గుబక.** వి. తలుపుగందప కైటిమీఁదిగుబ్బ. (బ్రౌ, శ. ర.)

**గుబగుబ.** వి. ౧. సముద్రతరంగములు మున్నగువా నియొక్కధ్వనికి అనుకరణము.

సీ. గుబగుబధ్వనుల బల్ గుట్టలపైఁ బొర్లి మిడిసి త్రేళ్లుటికి త్రుళ్లెడికిరుల్లు. ఉ. హరిశ్చ. ౨. ౧౨౬.

౨. నీరు మొదలగునవి వచ్చుటయం దగుననుకరణ ము.

సీ. గుబగుబఁ గన్నీరు కొలుకుల నానుచో హెచ్చి నమైకాఁక నింకఁజేయు. సుదంతా. ౨. ౧౪౯.

౩. కోవెలపలుకుటయందలిధ్వని కనుకరణము.

సీ. గుబగుబ మని పల్కు కోవెలపల్కులు విని యి వి నేర్తువా యనుచు నవ్వు. శశాం. ౨. ౮౬.

**గుబాళించే.** అ. క్రి. ౧. పరిమళించు; (సువాసన) కొట్టు.

శా. చెంగల్వల్ నెఱికొప్పునందు నొఱపై చెం తం గుబాళింపఁగా...విజ. వి. ౨. ౧౫౭.

శా. ... గుబాళించులేఁ, జెంగల్వ౯ ... సారంగ. ౧. ౧౩౨.

సీ. మిక్కిలి కస్తూరిమృగముచందంబున మంచివా సన గుబాళించుదాని. సురా. ౪౪.

**గుబిలి[1]**=గుమిలి. వి. (క. గుబిరి) కనకాక్షి, ఒకా నొకళకున పక్షి.

గీ. వెలయుఁ గనకాక్షి సకినాలపులుఁగు గుబిలి, పైడికంటి నా...ఆం. భా. ౨. ౯౧.

**గుబిలి[2]**=గులిమి.

సీ. కర్ణమలనామ మొప్పను గులిబి నా గుబిలి నా గులిమి యనఁగ. ఆం. భా. ౨. ౧౩౪.

**గుబిలిగాఁడు.** వి. ఒకానొకపక్షి. హంస. ౩. ౧౨. (దీనికి పిదప నీపద్యమునందే 'కనకాక్షి' అని యు న్నది. కావున నిది 'కనకాక్షి' గాక మఱియొక ప క్షియై యుండవలెను.)

**గుబుకు**=గుముకు. స. క్రి. (పిడికిటితో) పొడుచు. (శ. ర.)

**గుబురు**=గుమురు.

(సమూహము, గుంపు)

సీ...అత్తమ్ము దిమ్ము, గుబురు గుమురు గుంపు గుమి పిండు మొత్తము...గీ...వర్గు, వనఁగ వర్గము తగు...ఆం. భా. ౨. ౧౦౦.

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, వఱిముఱి గుబు రులకుఁ జనుచు హరిహరి యనుచు౯, మఱుఁ గుచు నులుకుచు దిరదిరఁ, గుబుమట్టుపుఁబొ ట్టిపడుగు గొంత నటించె౯. భాగ. ౧౦. ౫౩౧.

ద్వి. సరసమందారమంజరులు గోయుచును, గురి వెందపందిళ్లగుబురు డాయుచును. విష్ణు. పూ. ౨. ఆ. (శ. ర.)

సీ. తొలుకడ రాతాపసలు గెబ్బునర్తి తేఁ దెద్దడి గుబురుకాతీర్ల ప్రొద్దు. అచ్చ. రా. బాల. ౧.

జః గుబురుకొను.

**గుబురుకొను.** అ. క్రి. (√ గుబురు) ౧. గుంపుకట్టు. (చూ. గుబురులుకొను.) ౨. సాంద్రమగు.

గీ. గుబురుకొనునట్టినీడలఁ గొఱలి తెరువు, చెంతనొప్పారుఫలతరుశ్రేణు లొసఁగు, సుకృతగరిమంబునకుఁ జూడ జోడుగావు, సద్గుణాకరహయమేధశతము లయిన. జాహ్నవీ. 3. 3౨.

గుబురులుకొను=గుంపులుగట్టు.

క. మను రమ్యపదార్థంబులు, గొని వీథు లలంకరించుకొని జనులు గనం, గొనియెడువేడుకగుబురులు, కొని యున్న పురంబుఁ జొచ్చెఁ గొడుకుం దానున్. నిర్వ. ౫. ౧౪౧.

**గుబులు.** వి. ౧. గుప్పుమని కొట్టువాసన.

క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కాగుమగుమలు తట్టుపునుఁగుగుబులు నల్, దిక్కుల నిండఁగ నెంతయుఁ, జక్కనికాళింది యనెడుజవ్వని వచ్చెన్. చమ. ౧. ౧౨. (శ. ర. పా)

౨. భయము. (శ. ర.) 3. ఉన్మాదము, పిచ్చి.

(వ్యవ) వాఁడు గుబులెత్తి లేచిపోయినాఁడు.

జః గుబులుకొను.

**గుబులుకొను.** అ. క్రి. (గుబులు + కొను) - వాసన - గుప్పునకొట్టు; పరిమళించు.

గీ... కమ్మఁదావి, గుబులుకొనుచున్న విడియంబు సాబగుతోడ, రమణిఁ జూపట్టుపుష్పకరండకుండు. విక్ర. ౮. ౭.

చ. గుమగుమవాసనల్ గుబులుకొన్దనపుక్కిటిలో నివీడియం, బుమియ... సారంగ. 3. ౧౫౨.

వ... చంచలలోచనలమైదీఁగలం గదంబించుపరిమళంబుల గుబులుకొనుచు సమీపంబునం గూర్చున్న మన్నె రాజులభూషణరత్నకిరణరాజులచే విరాజితం బగుకొలువుకూటంబు సొచ్చి ...ప్రబోధ. ౧. ౨౫.

**గుబుసు.** వి. కపటము. (శ. ర.)

**గుబ్బ.** వి. ౧. కుచము.

ఉ. కుప్పసము ల్వదల్చి వలిగుబ్బల నొత్తిరి హత్తివేగుజా, మిప్ప లలర్చుగాడ్పుల కధీప...అము. ౫. ౧౧౪. ఆం. భా. ౨. ౧3౭.

గుబ్బలకొమరాలు=గుబ్బెత, యువతి.

గీ. ఎల్లచిగురాకుఁబోండ్లకు నెంత వేడ్క, యంత వేడుక దనలోన నతిశయిల్ల, నొక్కగుబ్బలకొమరాలు చక్క వచ్చి, కనియె నోడ లెల్లఁ గన్నులై మనుజవిభుని. నైష. ౬. ౬౬.

౨. తలుపుగందపట్టెలు మున్నగువానిమీఁదిబొగడ.

సీ. స్తనకవాటాంగము ల్దనరు గుబ్బ లనంగ ... ఆం. భా. 3. ౪౪. అము. ౨. ౧౦.

సీ. బలుకంచుగుబ్బబోర్తలుపులు తీనెలవాకిలి నడవ చావడియు మగులు. హంస. ౨. ౧3౭.

ద్వి. మెలి నున్నగంటలు వ్రాయఁ దాళంబు, లలియ నొడ్డణము గుబ్బలు గజ్జియలును, ధ్వనియింప...బస. పు. 3. ౫౨౦ పం.

3. గొడుగుమీఁదిగుబ్బ.

మ. హరిదోర్దండము గామ గుబ్బ శిఖరం బాలంబి ముక్తామణుల్, పరఁగం జాఱెడుతోయబిందువులు... భాగ. ౧౦ పూ. ౯౨౧.

గీ. గుబ్బ నెట్టిన తెలిపట్టుగొడుగు ...వరాహ. ౯. ౭౬. హరి. పూ. ౭. ౧౭౮.

౪. బాణమునలుఁగుక్రిందిగుబ్బ.

వ ... ఒకటి రెండు మూఁడు గొరకల నెఱకులు గాఁడ గుబ్బకొలందికిం దిగ వైచి...మనుచ. ౪. ౧౧౫.

౫. గ్రంథి, కంతి.

గీ...గుబ్బ, బుడిపి... అనంగను బొసఁగు గ్రంథి. ఆం. భా. ౨. ౭౪.

౬. పర్వతము, గుబ్బలి.

ఉ...వడంకుగుబ్బ పేరు బ్బడఁగించి పాల్కడలి నోర్చి హసించు హాళాహళిం దగన్, గొబ్బురివేంగళక్ష్మితిపకుంజరుమంజులకీర్తిమంజరుల్. రామా. ౧. ౨౬. (ప్రయోగాంతరము లేదు)

విణ. గుండ్రమైనది.

ఉ. గుబ్బమెఱుంకుఁజన్గవ గగుర్పొడువన్ మది లోనఁ గోరికల్, గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్. మనుచ. ౨. ౨౮.

సీ. కుదురునిండినమించుగుబ్బచన్నులమీఁద జిలుఁగుదువ్వలువకం చెలయుఁ దొడిగి. నైష. ౬. ౨౨.

జ: గుబ్బకాయ, గుబ్బలాఁడి, గుబ్బసరము, గుబ్బెత.

**గుబ్బకాయ.** వి. (గుబ్బ+కాయ.) వీణకు అమర్చెడిసొఱకాయ.

సీ. తళుకుసీలపుదట్టములువోలె నీడలు గానంగఁ దగుగుబ్బకాయ లమర ... గీ...వీణె యొకయింతి నిల్పెను వెలఁదియెదుట. వాల్మీకి. ౩. ౧౩౨.

సీ. వీణె వీణియ యన వీణాఖ్య రాజిల్లు... తంతి యనంగను దంత్రి వెలయు, నలరును గుబ్బకాయ యన నలాబువు...ఆం. భా. ౧. ౧౨౬.

**గుబ్బటిల్లు(లు).** అ. క్రి. ఘూర్ణిల్లు, తిరుగుడు పడు.

గీ. మంగలములోనిప్రేలాలమాడ్కిఁ జుక్క, లిక్కడక్కడ పడ దిక్కు లెనిమిదియును, బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె, శౌరి పూరింప నప్పాంచజన్యరవము. ఉ. హరి. ౪. ౨౧౬.

చ. కలఁగెఁ బయోనిధు ల్గిరులు కంపము నొందెఁ జలించె భూమి ది,క్కులు వడఁకన్ వియత్తలము గుబ్బటిలెన్ గ్రహతారకంబు లు,త్తలపడఁ జొచ్చె...భోజరా. ౪. ౭౭.

**గుబ్బతిల్లు(లు).** అ. క్రి. ౧. అతిశయించు.

ఉ...నీలకంఠములు మ్రోయు...షట్పదీ,మాలికఁ దోఁచునబ్బురపుమబ్బులయబ్బులు గుబ్బతిల్లఁగన్. వసు. ౧. ౧౩౭.

క. అబ్బావికిఁ జేయేతం,బుబ్బుచుఁ దంబళి యొనర్చి యుత్సాహంబున్, గుబ్బతిలఁ గొన్ని చెట్లకు, నిబ్బరముగ జలము లెత్తి నిస్త్రాణుం డై. హంస. ౧. ౧౮౬.

౨. ఉప్పొంగు, పొంగు.

క. బాలహరిణములఁ జూచిన, కోలుపులిగతిన్ మనంబు గుబ్బతిలఁగ...జై. భా. ౮. ౯౨.

చ. కులుకు లెసంగ నబ్బురపుగుబ్బలు గుబ్బతిలంగ...కంకణా,వళి గలుగ ల్లనంగఁ బఱవం గమకించెలతాంగి సిగ్గునన్. కృ. శకుం. ౩. ౩౫.

౩. ఉడుకు, పరితపించు.

ద్వి. ...చిత్తజునిబారిఁ బడి యింటిలోన, నెక్కడ నింటివా రెఱఁగెద రనుచుఁ, గ్రుక్కుచు లోలోనె గుబ్బతిల్లుచును, నుండితి నిన్నాళ్లు నొకరీతి...ద్వి. పరమ. ౫. ౪౨౦ పా.

ద్వి... మాపడుచు, గొందలపడుచు లోగుబ్బతిల్లుచును... అతనితోడిద లోకమని కూడు నీళ్లు,మతిఁ దలంపక నేలపై శయనించు. ద్వి. పరమ. ౪. ౩౧౧ పా.

౪. ప్రజ్వలించు, మండు.

క. తమకంబు లేక కారు,ణ్యముఁ జూపకతఁడు కులాంగనాముఖవీక్షా, విముఖత్వ మిట్లు చూపిన, గుమగుమ మని శోకవహ్ని గుబ్బతిలంగన్. నిరం. ౨. ౯౯.

క. విను చల్లనిమాటలలో, మునిఁగి యలుక గుబ్బతిలు సముద్రజలములో, నన యుండి యాఱు కప్పుడు,గనగన మను బాడబాగ్ని కరణి నరేంద్రా. భార. శాం. ౩. ౨౬౩.

**గుబ్బన.** క్రి. విణ. ద్రు. శీఘ్రముగా, వేగముగా.

చ...గు,బ్బనఁ బతిచిత్తవృత్తిఁ గని భట్టి విదర్భుఁ

డు దాను వేడుకన్. విక్ర. ౪. ౧౩౪.(శ.ర.పా.)

చ...గు,బ్బనఁ బతిదివ్యభవ్యమణిపాదుక లంఘ్రుల సంఘటించి య,క్క_నకపురంబు చొచ్చి... విక్ర. ౨. ౧౦౫.

**గుబ్బలాఁడి.** వి. (గుబ్బలు+ఆఁడి)-పెద్దగుబ్బలు గలది-యువతి.

ఉ. చక్కెర పెట్టవే వికచసారసలోచన మాటసేర్పవే,చొక్కపుగుబ్బలాఁడి ననుఁ జొప్పడఁ బాణితలంబుఁ జేర్పవే, చెక్కులనిగ్గులాఁడి యని చిల్కలు వల్కు నృసింహ పూర్వపు, న్నక్కవ నీవిరోధినృపమందిరచిత్రవధూపరంపరన్. నరస. ౫. ౧౭౭.

**గుబ్బలి.** వి. పర్వతము, కొండ. ఆం. భా. ౨. ౨౭.

గుబ్బలిపట్టి=కొండకూఁతురు, పార్వతి. దశా. ౨. ౯౯.

గుబ్బలిరాకన్నియ=హిమవత్పుత్రి,పార్వతి. అచ్చ. రా. బాల. ౧౭౦.

గుబ్బలిఱేఁడు=హిమవంతుఁడు. రామా. ౧.౮౪.

గుబ్బలివిలుకాఁడు=మేరుధన్వుఁడు, శివుఁడు. అచ్చ. రా. యు. ౫౦౧.

**గుబ్బసరము.** వి. (గుబ్బ+సరము.) ఒకవిధమైన హారము.(పెక్కుదినుసుమణులు గ్రుచ్చినసరము. శ.ర.)

ఉ. ఏనికతోలుపచ్చడము సెమ్మలగుబ్బసరంబు ...పూనిన ప్రాఁతవేల్పుఁ గని ... ఉ. హరి. ౨. ౧౭౨. కళా. ౩. ౨౦౪.

**గుబ్బిక.** వి. పక్షులను పట్టుటకై యొగ్గెడుఒకవిధమైన ఉచ్చు.

గీ. జారకీరిపంక్తుల మాటు సరసశశక,ములకుఁ గట్టువ యుపకాంతముఖ్యచటక, సంఘములకును గుబ్బిక శంబరారి, ఘోరరణహారిజయభేరి ఘోషనారి. హంస. ౨. ౮౩.

**గుబ్బిరి.** వి. వృక్షవిశేషము.

సీ...ఉత్తరేను గుబ్బిరి సంబరేను...గీ... మొదలు,గాఁ గలుగునట్టిచిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

**గుబ్బిలికాఁడు.** వి. పక్షివిశేషము. (శ.ర)

**గుబ్బు.** వి. గుండె యదురుటయందగుననుకరణము.

ఉ...దానన గుండె గుబ్బు మన ... కళా. ౪. ౨౦.

గీ.దండు సులభంబె పురుషవేదండులకును, గూచి గావింప గుండియల్ గుబ్బురనఁగ, దిగినదివసంబుసరిప్రొద్దుదీఱువేళ,కోదనాదరదూరుడై యుండు టరుదె. రా. వి. ౨. ౬౮.

౨. సముద్రఘోషమున కనుకరణము.

ఉ. పారి సంభోనిధి గుబ్బుగుబ్బురనుచున్ బోర్కల్గ దేవాసురుల్,ఖరశౌర్యోన్నతి గర్జితర్చిరి సుధాకల్లోలినీవల్లభున్. వీర. ౩.౨౧౦.

౩. పగులునప్పటిధ్వని కనుకరణము.

వ...పెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరం బయి గుబ్బుగుబ్బని యురల...భాగ. ౮. ౨౦౮.

**గుబ్బెత**=గుబ్బలాఁడి. వి. (గుబ్బ+ఎత) యువతి.

సీ. జవరాలు గుబ్బెత జవ్వని యనఁగను యువతిసమాఖ్యలై యొప్పు...ఆం. భా. ౨. ౧౦౬.

ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ జిత్తములోపలికాంక్ష దీఱఁ జ,న్గుబ్బల నొత్తి యేనె మనుగ్రుచ్చి కవుంగిటఁ జేర్చెద న్విభున్, గొబ్బునఁ బట్టి దంతశిఖ నొక్కెద మోవియు నంచుఁ గోరు నా,గుబ్బెత రేపు లెల్లఁ దటఁ గొంకు నిరంకుశలజ్జపెంపునన్. ప్రభా. ౫. ౯౯.

మ...కాఁపుగుబ్బెతల పెన్గుబ్బల్ ... ఆము. ౪. ౧౩౩.

**గుభాలు**=గుభేలు, గుభిల్లు, గుభులు. (చూ. గుభులు. రూ. గుబాలు. బ్రా.)

వి. ౧. పడుట పగులుట దుముకుట మొదలగువాని యం దగుధ్వనికి అనుకరణము.

మ...గుభాలునన్ లకుముకుల్ క్రందై పడున్ లేచు...ఆము. ౧. ౫౭. ('గుబాలునన్'శ. ర. పా.)

ఉ. భంగముతై నగంబులు గుభాలునఁ ద్రెళ్లఁ గ రళ్లదాఁటుతో, నింగికిఁ బొంగువారిధి మునిం గినభూవలయంబు...వరాహ. ౬. ౧౬.

చ. దరులు గుభాలునం బగుల... శేష. ౧ ఆ. ('గు బాలునన్' శ. ర. పా.)

చ. అని మొలవంకి దుస్సి సమరార్భటిఁ జావడి క్రిందికిన్ గుభా, లన దుముకన్...అహ. ౧. ౧౦౪.

౨. వాసనవ్యాపించుటయం దగుననుకరణము.

చ...ముద్దుగాబుప, ల్కులఁ జవికమ్మచేఁ దపుత ఘుక్కను చెక్కులఁ బట్టెఁ దేసిగు, బ్బలఁ గ నుచూపు మేరకు గుభా లనుతావులు దీనికే త గున్. కువల. ౩. ౩౨.

గుభిల్లు=గుభాలు.

(వ్రాలుటయం దగుననుకరణము.)

ఉ...దిక్కటాహముల్, పిక్కటిలంగఁ బెల్లున గుభిల్లున శుక్తిమతీ స్రవంతిపే, రక్కన వ్రాలి యాఁగె భువనావళి...వసు. ౨. ౧౪౬.

గుభులు(ల్లు)=గుభాలు.

(నీరు మొదలగువానిలోరాయి మొదలగునవి ప డుటయందలిధ్వని కనుకరణము.)

క. చని నూతిలోపల గుభు, ల్లన నొకగుం డెత్తివై చి యల్లనఁ గనుచా, టున నిలువఁబడియె నిజ మని, జనవల్లభుఁ డాత్మలో విచారము మీ ఱన్. శుక. ౨. ౧౩౫.

(దుముకుటయం దగుధ్వని కనుకరణము.)

చ. రభసగతు ల్సెలంగ నతిరాజిత కేళిసరోవరం బులో, గుభులుగుభుల్లునం దుమికి ... భాను. ౨. ౭౦.

(భేరి తుపాకి లోనగువానిధ్వని కనుకరణము.)

సీ. గంధవాహములు సుగంధంబు వెదచల్లె గుభులు న దేవదుందుభులు మొరసె. జాహ్న వీ.౧౯౪.

చ. ఉభయరగండ తావకరణోగ్రజయానకము ల్గుభుల్గుభు, ల్గుభు లని మ్రోయఁగా భవదకుంఠిత వీరభటు ల్ప్రభుప్రభు, ల్ప్రభు లని శత్రు భూపతులపైఁ జొరఁ, జాఱ నెడ ల్విభుల్విభు, ల్విభు లని సంభ్రమింపుదురు వేడ్క నఖర్వ సువర్వభామినుల్. నరస. ౨. ౭౮.

వ... పెట్లుఁ గ్రోవులవరుసలఖుంగు పెఠీల్ ధిమిరిం గు కఠీల్ ఢమిాల్ ఢాంగు ఖణీల్ గుభుల్ చఠాల్ ఢాంఢంకరణశబ్దంబు లబ్దంబులగర్జ లఁ దర్జించి... ప్రబంధ. ౭౮౭.

(గుండెలు అదురుటయం దగుననుకరణము.

సీ. ఆసుకుమానుసులగుండెలు గుభు ల్లన...సారం గ. ౩. ౨౮.

గుభేలు=గుభాలు.

(ఉఱుకుట మొదలగువానియందగుఅనుకరణము)

క. సలసలఁ గ్రాఁగెడు తైలము, కొలఁది యెఱుఁగఁ దలఁచు భంగి గుణరత్నసము, జ్జ్వలుఁడు గుభే లున నుఱికెను, జలనిధిలో నస్తమించుజలజా ప్తుక్రియన్. ద్వా. ౬. ౧౩౫.

సీ. చిమ్మనఁ గ్రోవులఁ జిమ్ములాడుచుఁ దటంబునకు వెల్వడి గుభేలున నుఱుకుచు. పరమ. ౪. ౧౦౩.

క. చని సేలఁ గాఁడి క్రమ్మఱ, మనుకులమణి దొ నకు వచ్చె మఘవాహితుఁడున్, దనపాటునఁ దేరొరగఁగఁ, బెనుగుబ్బలి పడినగతి గుభే లునఁ బడియెన్. రామా. ౬. ౨౯౯. ('గుబే లున' శ. ర. పా.)

(శిలాదులు కూలుటయం దగుధ్వని కనుకరణము.)

సీ. నగశిఖాశిల లెగసి గుభేలు రనఁ గూలి ... రా మా. ౬. ౯౯.

గుమంజి. వి. సుగంధిద్రవ్యవిశేషము.

రగడ. సంకుమదంబు గుమంజియుఁ బూతియుఁ

జందనఖండంబులుఁ గర్పూరము. కవిక. ౩. ౧౯౫. (ప్రయోగాంతరము లేదు.)

**గుమగుమ.** వి. (క. గుమగుమ) ౧. సువాసనకొట్టుటయందలియనుకరణము.

చ. గుమగుమ వాసనల్గుబులుకొన్దనపుక్కిటిలోని వీడియం,బుమియు... సారంగ. ౩. ౧౫౨.

క. గుమగుమ యనునెత్తావులు, కోమ రము రేఁ... విప్ర. ౧. ౭౮.

౨. గుమగుమ యనువాసన.

క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కాగుమగుమలు తట్టుపునుఁగుగుబులు నల్, దిక్కుల నిండఁగ నెంతయుఁ, జక్కని కాళింది యనెడి జవ్వని వచ్చెన్. చమ. ౧. ౫౨. (శ.ర.పా.)

౩. అగ్ని మండుటయం దగుననుకరణము.

క... గుమగుమ మని శోకవహ్ని గుబ్బతిలంగన్. నిరం. ౨. ౯౯.

**గుమి¹.** వి. ౧. సమూహము, గుంపు; రాశి, ప్రోవు.

ద్వి. వేడుకతో వినువీథిఁ జన్వారు, నాడకాడకు గుములై యేఁగువారు. రం. రా. యు. ౩౧౪ పా. ౨౧ పం. ఆం. భా. ౨. ౧౦౦.

సీ. చిమ్మఁజీకటి గ్రమ్ముక్రొమ్మావిగుమి నల్లిబిల్లిరు ద్రాక్షపందిళ్లనడుమ. ఉ. రా. ౩. ౬౬.

మ... వేళామాతి తత్కాలసం, భ్రమసంకీర్ణతరోరుహారమణివారం బేటి తానొక్కచో, గుమిగాఁ బోసెనొ నా మినుక్కరను వేగుంజొక్కఁ గంటే చెలీ. వసు. ౮. ౧౨౭.

౨. గుది.

సీ. తిమితిమింగిలముఖ్యదీర్ఘమత్స్యంబులఁ గొమ్మ న గుములుగా గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౭౯.

౩. పొద.

వ... ఫలవృక్షంబులు వ్రేయ నమకట్టిన నేము వలదని యవ్వెదురుగుమి చూపినం బడ వ్రేసె.. . భా. రా. అర. ౧. ౧౨౫.

జ: గుమికట్టు, గుమికాఁడు, గుమిగూడు, గుమిగొను.

**గుమి².** వి. మడుఁగు.

తోటకము. జమునన్ గుమిఁ బా మని జంకక వే, దుముకన్... అచ్చ. భా. ౧. ౨౧ పా. (చూ. భాగ. ౧౦ పూ. ౬౩౫.)

**గుమికట్టు=గుమిగూడు.** అ. క్రి. (√గుమి¹) గుంపుగూడు, సంఘ మగు.

సీ. గోడలదాపున గుమికట్టి నిలిచిన... వకపు. ౫. ౧౨౩.

గుములుగట్టు=గుంపులుగూడు.

వ... కురుపతిప్రేటిజనంబులు గిరీటిపరాక్రమప్రకారంబులం దము దెస నానాదేశంబులచతురంగబలంబులు వొలిసినపెల్లును నంతంత గుములుగట్టి చెప్పుకొను చుండ... భార. భీష్మ. ౨. ౧౬౬.

వ... పసులు పసులు మూఁకలు మూఁకలు వేలు వేలు గుములుగట్టి... మనుచ. ౮. ౩౪.

**గుమికాఁడు.** వి. (గుమి¹+కాఁడు.) కాకి, వాయసము.

సీ. గుమికాఁడు కాకి నాఁ గొఱలుఁ గాకము పేళ్లు... సాం. ని. తిర్య. ౭౨.

**గుమిగూడు=గుమికట్టు.** అ. క్రి. (√గుమి¹) గుంపు గూఁడు; ప్రోగగు.

చ. ఆటదిభదానవారిఁ బదనైనమహిం గుమిగూడి పందు లం, తట వెస బుడ్డగింప బెడిదం బగు లోయలఁ బర్వి... చంద్రా. ౨. ౬౨.

వ... దైవనమస్కారంబులు దూరంబు చేసి పదుగు రైదుగురు గుమిగూడుకొని కోడెకాంద్రరూపాధిక్యహైన్యంబు లుపన్యసించుసామాన్యకన్యకలును... శుక. ౨. ౧౦.

క. క్రొక్కారు మెఱుఁగు లన్నియు, నొక్కెడ గు

మిగూడి నిల్చి యున్నవిధముగా ... ఉండె
లచ్చిమేనిమెఱుంగుల్. వేం. మా. ౧. ౧౩౧.

గుములుగూడు=గుంపులుగూడు.

గీ. ఏఱులై పాఱునెత్తురు లెందుఁ జూడఁ, గొండ
లై పడుకండలు గుములుగూడి, దానికై పో
రుభూతబేతాళతతులు, గలిగి భీకర మయ్యె
సంగరము గరము. దశా. ౨. ౪౩౪.

**గుమిగొను**=గుమిగూడు. అ. క్రి. (గుమి [1] + కొను) గుంపుగూడు.

చ. గుమిగొని పైపైఁ బడికొంచు భటావళి
చూడఁ బోవ వెచ్చము గొనిపోవుదాదులు ని
జంబు గనుంగొని...శుక. ౨. ౪౦.

**గుమితి**=గుమ్మితి. వి. ఆయుధవిశేషము.

శా. బాణా వంకిణిఁ బెద్దకత్తి గుమితిన్ బాణాసన
ప్రౌఢిమన్...శశాం. ౨. ౧౭. (శ. ర. పా.)

**గుమిలి**=గుబిలి. వి. పక్షివిశేషము, కనకాక్షి. (శ. ర.)

**గుముకు.** స. క్రి. (త. కుముక్కు) పిడికిలి మోఁచేయి మొదలగువానితోఁ బొడుచు.

క. తముఁ దామె బెదరి పులుఁగులు, గుములై పై
కెగసి యల్లుకొని కొమ్మతుదల్, గమకముగఁ
దాఁకి తొటతొట, గుమికినక్రియఁ ద్రెళ్లు నే
లకును వ్రేఁగగుచున్. చంద్రా. ౨. ౬౩.

సీ. జడలచుట్ట కుదిర్చి మెడలపై మోఁచేఁత గు
ప్పుగుప్పన సారె గుమికి గుమికి. వాల్మీకి. ౨. ౯౬.

**గుముడు**=గుమ్మడు.

(ఒకవిధ మగు తేఁకుకీ.)

ద్వి. గొన బైన తేఁకులు గుముడు తేఁకులును. ద్వి. పరమ. ౨. ౫౪ పా. ౪ పం.

**గుమురు**=గుబురు. వి. సమూహము, గుంపు.

గీ. అచటిమణిచిత్రభూములు నచట నమరు, నమ
రతరువులగుమురులు నచటితీవ, లు...వసు. ౨. ౫.

ద్వి...మము వృథా చంప నిచ్చోట, సమకట్టితే
యంచు సకలవానరులు, గుములు గుమురులై
కూడి యొండొరులు. రం. రా. కిష్కిం. ౨౩౧
పా. ౯. పం. చం. రా. ౪. ౬౩. ఆం. భా. ౨.
౧౦౦.

౨. కొమ్మలు చిగుళ్లు ఆకులు మొదలైనవానిసమూహము, విటపము.

వ... మొగలిగములగుమురులనడుమఁ బొడవులుగ
దీపించుతోఁపుగుడారంబులచెలువు నలరించు
చివురుటెలమావితండంబులును ... కళా. ౬.
౨౨౪.

విణ. సాంద్రము, దట్టము.

రగడ. గుమురు లగు లేమావిచిగురులు గోయఁ గో
యనికూసెఁ బికములు...పారి. ౪. ౧౬.

జ: గుమురుకొను, గుమురుగట్టు.

**గుమురుకొ(ర్కొ)ను**=గుమురుగట్టు.

సీ. కుఱుచ లై గుమురు లై గొనబు లై లేఁబాఁప
కొమ్మఁ జుట్టినజడల్ గుమురుకొనఁగ. పాం
డు. ౨. ౯౧.

చ. కరఁగినడెందముల్ విడువుఁ గానని కోర్కు
లు పారవశ్యమును, బొరసిననిట్టచూపులు గు
ముర్కొనుముత్పులకాంకురావళుల్, చిరిఁగి
నసిగ్గులుం గలిగి...పాండు. ౩. ౬౯.

**గుమురుగట్టు.** అ. క్రి. (√గుముఱు.) గుంపుగట్టు, గుంపగు.

క. హయముల మరల్పుమీ త, ల్లియు బంధులు నె
డలు సంచలింప గుముఱుగ, ట్టి యొఱుఱుసూఱు
రు...భార. విరా. ౫. ౨౨౩.

గుమురులు(ర్లు)గట్టు=గుంపులుగట్టు.

చ. గుమురులుగట్టి యీరికలు గుట్టి ప్రవాళము వ
ట్టి కింకతో, నమలక మ్రింగి ...ఆమనిని రేయి
పవల్ వడిఁ గూయుఁ గోవెలల్. కు. సం. ౪.
౪౬౩.

వ...గుమర్లుగట్టి వీరభద్రరణంబుఁ జూచి భీతచి

త్తులై ప్రాణంబులు విడుచువారును...వీర.ర. ౧౬౨.

**గుమ్మ[1].** వి. పాలు పిండునప్పుడు వచ్చెడుధార.

సీ...పాలు నాఁ బొల్చు బహుతే.గీ. క్షీర మను గుమ్మయనఁగఁ దద్ధార వెలయు. ఆం. భా. ౨. ౨౩౮.

సీ. కామధేనువు నడ్డకట్టి గుమ్మలు గ్రోలి యాఁ బెయ్యా యిది మంచి దనెడువారు. రంగా. ౧. ౬౨.

క. వేలుపుటావును గుమ్మెఁడు,పా లడిగెడురీతి ధరణిపాల...అల్పదానము...అడుగ వచ్చితి నిన్నుఁ. హరిశ్చ. ౪.౧౯౯.

జ: గుమ్మకాంభోజి.

**గుమ్మ[2].** వి. (త. కుమ్మలి.) ఆఁడుది, స్త్రీ.

గీ. చెలువ దనచెల్మికత్తెలఁ బిలిచి నాకుఁ, గూర్చు గుమ్మ లెవ రెవ రీకొమ్మలందు, వారు నేకొని రక్షింప వలయు వీని. కు. సం. ౬. ౬౨౪.

ఉ. రంగమహీశుకొమ్మ జిగిరంగులబంగరుబొమ్మ సంపదల్,పొంగుచు నిచ్చుగుమ్మ పతిఁబ్రొమ్మెడఁబాయనిముద్దుగుమ్మ...అహ. ౧. ౨.

**గుమ్మ[3].** వి. గాదె,కుసూలము; బొట్ట, కుసూలవిశేషము.

సీ. గాదె బొట్టయును దుగ్ధాసారమును ముద్దుగుమ్మయు వెలయును గుమ్మ యనఁగ. ఆం. భా. ౩. ౬౪.

**గుమ్మఁడు.** విణ. అలంకరించుకొనువాఁడు, అలంకారి.

సీ...గుమ్మఁడంచనఁగను జికిలికాఁ డనఁగ సొగసు,కాఁ డనంగను వన్నెకాఁ డనంగను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు. ఆం. భా.౩. ౧౦.

**గుమ్మకాంభోజి.** మి. వి. (గుమ్మ[1] + కాంభోజి) ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి.

సీ. కాంభోజియును గుమ్మకాంభోజియును సింధురామక్రియయు నాదనామక్రియయు. ప్రబంధ. ౯౬. హంస. ౫. ౧౨౪.

**గుమ్మటము.** వి. (క. గుమ్మట. త. కుమ్మట్టం.) రాయి కాగితము మొదలగువానితో నిర్మించినదీపము గూఁడు.

మ. కుసుమ వేరుల్ జగజంతక్రొందెఁఅఁగురంగుల్ మీఁజుమేల్ బొమ్మచి, త్తరుబంగారుపటాలు నిచ్చలపునిద్దాకెంపుఠాగుమ్మటాల్, ముదుపంపున్విరిమల్లెపూసరులు చల్వాల్ చిల్కుపందిళ్లు ...సానందో. ౩. ౪౬.

**గుమ్మడి.** వి. (సం. కూశ్మాండః. ప్రా. కుమ్హాండే.) కూశ్మాండము ౯.

శా...గుమ్మడికాయయంత యగుము త్తెంబై మనం బేర్ప... ఆము. ౪. ౨౨౨. (గుమ్మడికాయయంత యగుము త్తెంబై:-అస్వాధీనుఁడై అని భావము.)

క. అమ్మగువ గనుంగొనియెఁ, ముమ్మరముగఁ బట్టైనామములు మైనెల్లఁ, గ్రమ్మికొన నుట్టిఁ బెట్టిన, గుమ్మడి కాయయును బోలెఁ గూర్పున్నతనిఁ. వైజ. ౨. ౫౬. హర. ౨. ౯౯.

గుమ్మడికాయలో నావగింజయుఁ బోదు=గుమ్మడికాయలో ఆవగింజంతయుఁ బోలేదు:-కావలసిన దానిలోఁ గొంచె మైనను గాలేదు అనిభావము.

సీ. ఇపు డేమి గంటి నా కెక్కడిసిద్ధసంకల్పత గుమ్మడికాయలోన, నావగింజయుఁ బోదు హంసి నాచింతాభరంబులో లేశమాత్రము నుడుగుట, గలదె యీవేళకుఁ దలపోసి చూచిన... ప్రభా. ౪. ౫౨.

గుమ్మడిమూట=గుమ్మడిపండువలె నుండుమూట.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లును బండ్లను రాచు రాచి రొ,మ్మక్కలఁజేయుఁ జేసి తల యల్లనఁ గాళుల నందు సంది లో,చక్కికి నొక్కు నొక్కి యిరుచంబన గుమ్మడిమూట

గట్టి వీ, పెక్కు దువాళిచేసి చలి యిక్కడ న
క్కడఁ బెట్టు వేసవన్. క్రీడా. ౪౬.

జః గుమ్మడిగింజనామము.

**గుమ్మడిగింజేనామము.** వి. (√గుమ్మడి) తిలకవిశేషము, గుమ్మడిగింజవలె నుండుబొట్టు.

సీ. గీఱుచు గుమ్మడిగింజనామము దీర్చు... కువల. ౪. ౧౫౫.

ఇట్లే 'గుమ్మడివిత్తునామము' ప్ర భా. ౪. ౧౩౭.

**గుమ్మతీలు.** వి. బ. కర్ణభూషావిశేషము, చెవిలోమ్మెల నుంచెడిసొమ్ము. (శ. ర.)

**గుమ్మము.** వి. వాకిలి, ద్వారము. (చి.ని, శ.ర.)

**గుమ్మసరులు.** వి. బ. ధాన్యవిశేషము.

వ...షష్టికములు గుమ్మసరులు ననునూటనాలుగువ
గలపైరుల చేరుదుబియ్యంపువట్టివసాదంబులు
...ప్రబంధ. ౧౧౨.

**గుమ్మితి(తీ)**=గుమితి. వి.ఆయుధవిశేషము.

క... మొగలి రేకుగుమ్మితిఁ జిమ్మెన్. ఉ. హరిశ్చ. ౪. ౧౧౪.

ఉ...మరుఁడంతట నంతటఁ దమ్మిగుమ్మితిం, జేకొ
ని వీఁకమై మొనలఁ జిమ్మఁ దొడంగెను గొమ్మ
లొమ్మనన్. శశాం. ౨. ౭౦.

చ. మదనునిగుమ్మితీమొనలు మాటికి మర్మములం
టఁ బాఁటినన్...అహ. ౩. ౪౧.

**గుమ్ము**=ఘుమ్ము. వి. ౧. పరిమళించుట త్రిప్పుట మొదలగువానియందగుననుకరణము.

సీ. పుణ్యవాసన పొంగి పొదలె నాఁ జెమట పైకొ
నఁ గప్పురపుఁబూఁత గుమ్ము రనఁగ. చంద్రి. ౬. ౫౦.

ఉ. గుమ్మనుకమ్మఁదెమ్మెరలకుం దులకించి... కృ. శకుం. ౧. ౭౩.

ఉ. వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁ
గొండ వార్ధిలోఁ, దేలిచి గుమ్ముగు మ్మనఁగఁ
ద్రిప్పఁగఁ జొచ్చిరి...హర. ౬. ౭౪.

ద్వి. సెమ్మెనఁ బొదలలో నిండినవిరుల, గుమ్మున జ
డివాన గురియించుదాని. అభిమన్యుద్విపద.
(శ. ర)

గీ... కోదండకాండరవ మ,జాండభాండంబు గు
మ్మని నిండుకొనియె. చం. రా. ౩. ౧౦౩.

సీ. అనిలాభిహతదక్షిణావర్తశంఖంబు గుంఫితం
బై కేల గుమ్ము రనఁగ. (మొల్లచాటువు.)

**గుమ్ముడు**=గుముడు. వి. ౧. కుముదిక, పేఁకు చె.

గీ. గుమ్ము డనఁగను గుముదిక సమ్మతిపడు.ఆం.భా. ౨. ౪౬.

౨. ఒకవిధమగుపేఁకు, కాశ్మర్యము చె.

**గుమ్మెట**=గుమ్మెత. (త. కుమ్మట్టం.) వి. కుంభవాద్యము, తుడుము.

వ...హూరి భేరి గౌరు గుమ్మెటతమ్మటంబు...లో
నగుగసంఖ్యాతవాదిత్రత్రితయపరంపరలు...
ఆము. ౪. ౩౫.

సీ.తటపెటదిమికిటధ్వను లోలిఁ బుట్టింపఁ జాలు
గుమ్మెట చంక వ్రేలుచుండ. క్రీడా. ౨౨౬.
కాళ. ౩. ౩౬.

**గుమ్మెత**=గుమ్మెట.

సీ. గుమ్మెత యనఁగను గుంభవాద్యము దోఁచు...
ఆం. భా. ౧. ౧౨౫. హంస. ౩. ౧౫౫.

జః గుమ్మెతకాఁడు, గుమ్మెతగుడారము.

**గుమ్మెతకాఁడు.** వి. (గుమ్మెత+కాఁడు.) తుడుము వాయించువాఁడు.

ఉ. గుండనికిం బసిండిపనిగొ రడిబండను వెండి
తాయెతుల్, లండికిఁ జేకడెంబు వదిలంబుగ
గుమ్మెతకాని కంచెలున్...హంస. ౫. ౧౩౬.

**గుమ్మెతగుడారము.** వి. (గుమ్మెత+గుడారము.) గుమ్మెతవంటిఆకారము గలగుడారము.

చ. తిరిగి యతండు వచ్చి... గుమ్మెతగుడారమునం
గొలువుండి...కువల. ౨. ౧౬.

క...రంభోర్వసులుక్, గుమ్మెతగుడారములకడ, ఘుమ్మనుకపురంపుజగతిఁ గూర్చుండితగక్. వాల్మీకి. 3. ౧౦౧.

**గుయ్యారము.** వి. (సం. గుహ్యాగారమ్) కారాగృహము.

గీ. అడరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ, సాల బందిగ మనఁగను...ఆం. భా. ౨. ౨౨౯.

**గురగుర.** వి. ౧. పందికూఁత కనుకరణము.

సీ. గురగురధ్వనులు నిర్భరముగఁ బర్విన నెలసి బ్రహ్మాండంబు నెదురుమ్రోయ. హరి. పూ. ౪. ౧౬. (శ. ర. పా)

ద్వి. గరువునేలలఁ దుంగగడ్డలు త్రవ్వి, గురగుర మనుపందిగున్నలబార్లు. ద్వి. శ. సా. ౨. ౬౦ పా. ౧౪ పం. చెన్న. ౨. ౨౦.

౨. ఇట్టి చేసెడిధ్వని కనుకరణము.

ఆ...గురగుర, మనుచు వేఁటయిఱ్ఱు లరుగుదెంచె. చంద్ర. ౨. ౨౧.

**గురణము.** సం. వి. అ. న. యత్నము, పూనిక.

**గురస్తు.** వి. (సం. గృహస్థః) గృహస్థుఁడు, గేస్తు.

గీ. అమ్మనేఁజెల్ల బాఁపనయ్యా మఱేమి, రజ్జులాడెదు మంచిగురస్తు వగుదు. శుక. ౨. ౪౭౩.

సీ. రమ నేలినట్టిగురస్తు నందు రదేమొ నేలమిన్నులు గొల్వ నేర్చు టరుదె. శుక. 3. ౨3.

**గురి.** వి. అర్బుదఫలి, ములకకీ.

సీ... గురు గటం చన్నను గురి యనంగ, ముల కటం చన్న నర్బుదఫలి మనుచుండు ... ఆం. భా. ౨. ౬౪. ('అర్బుదఫలి' అనునది సంస్కృత నిఘంటువులలోఁ గాన రాదు.)

**గురిగి**=గురియ. ఆం. భా. ౨. ౨౪౭.

**గురిగింజ.** వి. (గురిజ + గింజ-త. కురువిందమ్.) గురిజపూస. (బ్రౌ, చి.ని, శ. ర.)

**గురిజ.** వి. (సం. గుంజా.) ౧. గురివెంద కీ.

సీ...గురిజ, గురివెంద నాఁగను గుంజాఖ్య విలసిల్లు...ఆం. భా. ౨. ౩౨.

సీ. భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు గురిజపూసలగుబ్బసరులు గాఁగ... గీ...శంకరుండు కిరాతవేషఁబు దాల్చి. హర. ౭. ౪౧.

౨. గురిగింజ.

సీ...ఈయచ్చగురిజపే రెందుఁ గలిగె. యయా. ౧. ౪౭.

ఆ. గురిజపేరు లఱుతఁ గొమరార ధరియించి, యడవిమొల్లలఁ గురులందుఁ జెరివి. ద్వా. ౧౧. ౬.

జ: గురిగింజ, గురివెంద.

**గురియ**=గురిగి, గురుగు3. వి. అత్యల్పభాండము, ఆఁడుపడుచులుఆడుకొను చిన్న పిడుత.

సీ...అత్యల్పభాండం బొప్ప గురిగి యంచనఁగను గురియ యనఁగ. ఆం. భా. ౨. ౨౪౭. (బ్రౌ, వ్రాఁత ప్రతిపా.)

**గురివె(ర్వె)ంద.** వి. (గురిజ + వెంద-శ. ర.) గుంజాలత, గురిజకీ.

రగడ. వెల్లి యై తొఱఁగె గురివెందలమరందములు. ఉ. రా. ౬. ౬౧.

గీ. ప్రమదదిక్కాంత కెంగేలఁ బట్టి యాను, క్రొత్త గురివెందపూసలగుత్తి వోలె. హర. ౭. ౧౪౦.

ఉదా: బండిగుర్వెంద.

**గురు.** వి. గవయమృగము.

సీ. కాఁచినగురుని నెయ్యి చేచాఁపఁ జాలినంతయుఁ గుమ్మరించి...పాండు. 3. ౭౭.

ద్వి. గురువులువా ఆడిగురు మెకంబులును. నవ. ౧. ౪౭ పా. ౬ పం. రుక్మా. 3. ౯.

జ: గురుపోతు.

**గురుకారము.** సం. వి. అ. పుం. పెద్దచేయుట, గొప్పగా భావించుట; పూజనము, ఆరాధనము.

**గురుగు**[1]. వి. భక్ష్యవిశేషము.

వ...చాఁపట్టు లిడ్డెనలు తేనెతోలఁబు గురుగు లేల
కికాయలు...ప్రబంధ. ౧౧౨.

**గురుగు**[2]. వి. ఒకవిధ మైనకూరాకు. (శ. ర,బ్రా.)

**గురుగు**[3]=గురియ. (బ్రా, వా)

**గురుగు**[4]. వి. ౧=గురి. ౨. శ్రీహస్తిని,భూరుండికీ.

సీ...శ్రీహస్తినీసంజ్ఞ చెలఁగు గురుగు,నాఁగ ...
ఆం. భా. ౨. ౫౨.

3. గురుకటము, ఒకజాతికూరాకు చెట్టు.

గీ. గురు గనంగను జెలఁగురు గురుకటాఖ్య. ఆం.
భా. ౨. ౭3. ('గురుకటము' సంస్కృతనిఘం
టువులలోఁ గాన రాదు.)

మ. గురుగుంజెంచలిఁ దుమ్మి...ఆము. ౪. ౧3౪.

**గురుఘ్నము**. సం. వి. అ. పుం-గురుత్వము పోఁగొ
ట్టునది- తెల్లఆవకీ.

**గురుజే**. వి. ఒకజాతికూరాకుచెట్టు, ఉత్తుండికీ.(శ.
ర.)

ఆ.కటియజీలకఱ్ఱ గటివేము గురుజ యిం,గువ ప్ర
వర్జనీయకోటి యగుట. భార. అను.3.౧౮౯.

**గురుజా**. వి. వజ్రము. (బ్రా, చి. ని.)

సీ. పాలుచును వజ్రంబు మూలరా లన మగరా
లనంగను గురుజా లనంగ.ఆం. భా. ౨.౨౭౮.

**గురుజో**. వి. తిరుగటికి కొట్టెడిపుజ్జువంటికొయ్య.
(వా)

**గురుదైవతము**. సం. వి. అ. పుం-బృహస్పతి దేవ
తాకము-పుష్యనక్షత్రము.

**గురుపత్త్రా**. సం. వి.ఆ. స్త్రీ-తొందర గా పక్వము
కానిఆకులు గలది- చింతచెట్టు.

**గురుపత్త్రము**. సం. వి. అ.న. వంగము, తగరము.

**గురుపోతు**. వి. (గురు+పోతు.) పురుషగవయము.

సీ. తెరఁ మాటి వెఱఁ బాఱు గురుపోతుపై నైనఁ
బడి యెక్కి పొడుతు నీపాద మాన. మనుచ.
౪. 3౫.

మ...కోర్లగండ్లు గురుపోతుల్ కొండగొఱ్ఱెల్
కురంగులు నెం డెందుఁ గనుంగొనంగ వని
లోఁ గోటానఁగోటుల్ నృపా. ఇందు. ౨.
౫౧. ఆం. భా. ౨. ౧౫.

**గురుమర్దలము**. సం. వి.అ.పుం.డిండిమవాద్యము.

**గురురత్నము**. సం. వి. అ. న. ౧- బృహస్పతికి
ప్రియ మగురత్నము - గోమేదకము. ౨. పుష్య
రాగమణి. 3. శ్రేష్ఠుఁ డగుగురువు.

**గురువారము**. సం.వి. అ.పుం. బృహస్పతివారము.

**గురువు**. వి. పరుగు, ధావనము. (బ్రా-వేగపుపరుగు.
శ. ర.) ఉదా: గురువు దేలు, గురువులువాఱు.
జ: గురువు దేఱు, గురువులువాఱు.

**గురువు**. సం. విశ. (ఉ. ఉ, ర్వీ. ఉ.) ౧. బరు వై
నది. (వ్యతి. లఘువు) ౨. గొప్పది, పెద్దది. 3.
దీర్ఘ మైనది.(కాలాది) ౪.దుర్భరము,భరింప రా
నిది. (విరహాది) ౫.పూజింపఁదగినది.౬. (ఛంద)
లఘువు కానిది. (అక్షరము) ౭. బలీయ మైనది.
౮. దుష్పాకము,తొందరగా పక్వము కానిది. వి.
ఉ. పుం. ౧. తండ్రి. ౨. కులజ్యేష్ఠుఁడు, కుల
ముపెద్ద. 3. తాత. (మాతామహపితామహులు)
౪. తండ్రితోడఁబుట్టినవాఁడు. ౫. అన్న. ౬.
మేనమామ. ౭. ఉపాధ్యాయుఁడు.౮. ఆచార్యుఁ
డు, మంత్రోపదేశము చేసినవాఁడు. ౯. రాజు.
౧౦. కాపాడువాఁడు. ౧౧. బృహస్పతి, దేవగురు
వు. ౧౨. (మీమాంసకుఁడగు) ప్రభాకరుఁడు.
౧3. పుష్యనక్షత్రము. ౧౪. మాలగొండికీ .(వా
చ.)

**గురువుదేఱు**. అ.క్రి.(గురువు+తేఱు)-పరుగిడు-
రక్తము మొదలైనది జిఱ్ఱున పైకి ఉబుకు.

ఉ. త్రైవ్వెడుగంటులన్ గురువు దేఱుచు నెత్తురు
రాకమున్న...భా. రా. యు. ౨౧౭౫.

**గురువులువాఱు, గురువువాఱు.** అ. క్రి. (గురు
వులు + పాఱు) ౧. పరుగెత్తు.

చ ... తల్లిముందఱన్, గురువులువాఱు వ్రేకడు
పుఁగుఱ్ఱఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.
వీర. ౧. ౫.

సీ. విరులగుత్తులమీఁద గురువులువాఱుచు ముద్ది
చ్చు తేఁటులమొరపములకు. మార్క. ౫. ౭.

ద్వి. కరములఁ గొఱవులు గైకొని పేర్చి, గురువు
వాఱెడు పెద్దకొఱవిదయ్యములు. ద్వి. హరి
శ్చ. ఉ. ౧౬౭౩ పం.

౨. అతిశయించు; విజృంభించు.

క. నరుఁడును రాధేయుఁడు నొం,డొరువులతోఁ
బెనఁగువేడ్క లుల్లంబులలో,గురువులువాఱఁ
గ నిల్చిరి...భార. ద్రో. ౧. ౧౩౫.

చ...క్రొవ్వనం, గురువులువాఱుకంటపులఁ గొం
డగపుల్ చొరఁ దోలి పౌరుషం, బటిమటిఁ
గ్రాలఁ బింగళకుఁ డన్ మృగరాజు చరించు న
చ్చటన్. వేం. పంచ. ౧. ౧౧౧.

౩. హర్షముచే ఉప్పొంగు, ఉబుకు.

చ ... మై,గురువులువాఱఁ గేలఁ బుడుకన్
బెరమోముల నవ్వు నింపు వొం,పిరిగొనఁ
గార్తికేయుఁడు కుభృత్సుత కుల్లము పల్లవిం
పఁగన్. కు. సం. ౧౦. ౭౭౬.

**గురుసు.** వి. ౧. మర్మము, ఆయువుపట్టు.

క. తురగముల సూతుఁ జంపినఁ, గురుపతి పాలి
వోక యతని గురుసున నేయన్. భార. ద్రో.
౫. ౧౨౫.

సీ. తాతగా రనువారిఁ దనవారితన మొప్పు గు
రుసు మోపకయుండ సరసమాడు. కాశీ. ౬.
౬౦. (గురుసుమోపకయుండన్:- మనస్సు
నొవ్వకుండ అని భావము.)

౨. మూలము, కుదురు.

చ...గుండులెత్తి సత్వరగతిఁ గుంభముల్ వగు
ల దంతుల నైచుచు దంతకాండముల్, గురు
సులఁ గూడి రాఁ దిగిచి ఘోరనిశాచరకోటి
మోఁదుచున్...భా. రా. యు. ౬౭౪.

౩. పశురోగవిశేషము.

సీ. గురుసురోగము గొన్నగోవుల మాన్పంగఁ గ
లబందపలుకులు కడఁగి తెచ్చి. గోచికిత్స. ౧.
(చి. ని) నవ. ౧. ౪౧ పా. ౧ పం.

**గుర్గురింత.** వి. అడవిపంది.

గీ. ఏకలము గుర్గురింతన నెసఁగు దంష్ట్రి. సాం.
ని. తిర్య. ౭౫.

**గుర్జరము.** సం. వి. అ. పుం. ఘూర్జరము, గుజరాతి
దేశము.

**గుర్వణఁగించు.** స. క్రి. (గుర్వు + అణఁగించు)
-ఆధిక్యమణఁచు-నశింపఁజేయు.

ద్వి. పూర్వజన్మార్జితభూరికర్మములు, గుర్వణఁగిం
చునాకొడుక రావయ్య. బస. పు. ౪. ౪౩౧
పం.

**గుర్వి.** సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

శ్లో. ఆపన్నసత్త్వా గుర్వీ స్యాదంతర్వత్నీ చ గర్భి
ణీ. (హలా. ని.)

**గుర్విణి.** సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

**గుర్వు.** వి. ఆధిక్యము,అతిశయము. (చూ. గుర్వణఁ
గించు.)

విణ-అగుర్వు. (సం. గురు.) ౧. అధికము.

ఉ...మాలి యడ్డమై,బోరన వచ్చి యవ్విహగపుం
గవకేతను నేసె నెంతయున్, గ్రూరము లైన
యమ్ములను గుర్వుగ దానవు లుత్సహింపఁ
గన్. నిర్వ. ౩. ౨౫.

ద్వి. సర్వాంగసుందర శంకర యీశ,గుర్వుగుసడి
దొరకొనె నయ్య నీకు.బస. పు. ౩. ౭౫-౩పం.
(ప్రాత ప్రతి. పా.)

౨. పూర్ణము.

ద్వి. సర్వమాన్యము నీకు గుర్వగా నిత్తు, శర్వభ
క్తుండ వై చరియింపు మనుడు. బస. పు. ౪.
౨ పం. (గుర్వగా:-సర్వాధికారములతో.)

**గుఱక.** వి. (క. గుఱకె) ౧. నిద్రయందలిధ్వని, గుఱ్ఱు.

సీ. గుఱక యనంగను గుఱుపెట్టనంగను శోభిలు చుండును సుప్తరవము. ఆం. భా. ౧. ౧౪౨.

క. సతి ప్రక్కఁ జేఁడినప్పుడు, రతి కౌఁగిక నిదురవోదురా యయ్యో నా,చతురుఁడ గుఱకలు చాలుక్, గతి చెప్ప మటంచు వానిఁ గడు బాధించుక్. శుక. ౨. ౧౦౭.

౨. కోపభయాదులు కలిగినపుడు వ్యాఘ్రాదులు చేసెడిధ్వని.

క. అని తెంపు చేసి కనకనఁ,గనుఁగొనల న్నిప్పు లురలఁగా వాలము భూ,మిని దాటించుచుఁ దద్గళ,మును జూచుచు గుఱక నుఱుకఁబోన టు లున్నక్. శుక. ౨. ౨౫౨.

జ: గుఱకలిడు, గుఱకపెట్టు.

**గుఱకలిడు.** అ. క్రి. (గుఱకలు + ఇడు) గుఱకలుపెట్టు.

సీ...కోల్పులు లొప్పదరిండ్ల గుఱకలిడఁగ.మనుచ. ౨. ౭.

గీ...గుఱక,లిడుచు నిదురించు లేచు నల్గడలఁ దిరుగుఁ, గుంభకర్ణుండు నడయాడుకొండకరణి ఉ. రా. ౨. ౧౮౮.

**గుఱక(లు)పెట్టు.** అ. క్రి. (గుఱక + పెట్టు.) గుఱకలిడు, గుఱుపెట్టు.

గీ...పులివోలె గుఱకపెట్టి,నిదురవోవఁగ ...ఉ. హరిశ్చ. ౪. ౧౫.

సీ. దిక్కరుల్ సెవు డొంద దేవతల్ వెఱ సెంద బెట్టుగా గుఱకలుపెట్టుకొనుచు. ఉ. రా.౨. ౨౯౫.

**గుఱగుఱ=గులగుల.** వి. (త. కుఱుకుఱుత్తల్.)ఒక విధ మైనదురద. (శ. ర.)

విణ. దురద గలది.

చ. కరినివహంబు రాచుకొనఁగాఁ జలియింపదు బొడ్డుబంటిగాఁ, బెరిఁగినపుట్టలో వెడలుభీకరభోగికులంబు ప్రాఁకఁగా, గుఱగుఱ గాదు గడ్డమున గూఁడులు పెట్టినపక్షికోటిపెక్, మొరప మెఱుంగ దెట్లు మునిముఖ్యునియా తను వంచుఁ దాపసుల్. వరాహ. ౧౦. ౫౩.

**గుఱము=గుఱ్ఱము.** వి. (√గుఱ్ఱము) అశ్వము.

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావఁతులుక్ ...యయా. ౪. ౧౫౫.

క...నలువగుఱాలక్...పాండు. ౨. ౩౭.

**గుఱాలగోచే.** వి. (√గుఱము) అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱాలగోచనఁగా గులప యనంగఁ దగు నశ్వపాలకుండు. ఆం.భా.౨.౨౦౪.

(గోచి, గోచు అనియు ఛేదింపవచ్చును. గుఱాలగోవనంగా. వ్రాతప్రతిపా. ఇంకను విచార్యము.)

**గుఱి.** వి. (క. తు. గుఱి. త. మ.కుఱి) ౧. లక్ష్యము.

చ...పువ్వు లఁటె చిక్కనిచక్కనియమ్ము లేయుచో, గుఱి యఁటె చిత్తముల్... దశకు. ౩. ౧౨౯.

చ. తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే,త్తెఱ నడతేరఁ గాంచి చనుదెంచి యలంబసుఁ డమ్మహాసురుక్, గుఱి యొఁగఁ జేసె శాతశరకోటికి ...భార. ద్రో. ౩. ౨౬౨. ఆం. భా. ౨. ౨౧౨.

౨. విశ్వాసము, నమ్మిక.

గీ. పఱలుకఱిమేల్పు మది నెంతు గుఱి దలిర్ప. నీలా. ౧. ౩.

(వ్యవ) వైద్యునిమీఁద గుఱి లేనివానికి వ్యాధి కుదురదు.

౩. గుఱుతు, చిహ్నము.

గీ. వసుధలో సెట్టిశ్రీగలవారి వేని, కరభములు దాస్యములు చేయు సరసిజాక్షి,యూరువుల

కొట్లటన్నఁ బైఁ దారు మోమ, గొడుగులును నల్లకలశము ల్గుఱులు గావె. ఆము. ౫. ౩౧.

౪. దృష్టాంతము, నిదర్శనము.

ఆ. గాలవుండ గుఱియుఁ గాఁడె మనకు. భార. ఉద్యో. ౩. ౩౦౫.

గీ. క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు గాంచె మింట, నవి యహంసచ్ఛదాచ్ఛాదనానుభూతి, హంసతతు లయ్యెఁ గావన్న నరుణ మాడ, గుప్తభుజగాళనాండము ల్గుఱులు గావె. ఆము. ౪. ౧౭.

౫. సాక్షి.

మ. నిజ మేఁ బల్కెద బాహు లెత్తి శ్రుతివాణీజాహ్నవీగోపతి, ధ్వజధుంఠీశగణేశ్వరు ల్గుఱిగ నోవారాణసీదేవి... నిన్ బోల నం, బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీర్థరాజంబులున్. కాశీ. ౨. ౧౩౬.

తరళ. కడఁగి విన్న వెలుంగు దా గుఱి గాఁగ నబ్బలుకానలో, నడలుచున్న ననుం గనుంగొని యప్పు డర్మిలి నూతిలో, వెడలఁదీయుచుఁ గేలు వట్టితి వే కదా యిఁకఁ బెండ్లికిన్, గడమ లెల్లను సొంపులు... యయా. ౪. ౬౦. భా. రా. యు. ౨౩౬౬.

౬. నిర్ణయము, ఏర్పాటు.

క. నానెమ్మనమునఁ గలయను, మానము పరతత్త్వబోధమహిమ నుడుపు ప్ర, జ్ఞానిధి యీసల్కము నిం, పూనఁగఁ గైకొనుట యనుచు నొక గుఱి చేసెన్. పరమ. ౪. ౧౯. (శ. ర. పా.)

౭. యుక్తి, ఉపాయము.

చ. కటకట మీర లాడు పెనుఁగష్టపువిద్దెలు చూడఁ డాయెము, చ్చటకుఁ బ నేమి పోద మని చామయ పల్కినఁ దత్తనూజ మా, ఱటనుర వేశ్యయో యనఁగ రాజిలుచుండెడి చెన్న సాని నీ, విటు వగఁ జెంద నేమిటికి నే గుఱిఁ జెప్పెద నంచు నిట్లనున్. చెన్న. ౨. ౨౩౦.

౮. పరిమితి, మితి; హద్దు; మర్యాద, గౌరవము.

ద్వి. అప్పఘనం బింత యని గుఱి నాకుఁ, జెప్ప ము చెల్లింతుఁ జేకొను మనిన. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౭౯ పం.

సీ. ఏ దేవుఁ డింతకు నింత యై యంతకు నంత యై గుఱి లేక యతిశయిల్లు. పాండు. ౫. ౫౭.

సీ. గుఱి మీఱి రోదసీకుహర మొక్కటఁ ముంప నుప్పొంగు ప్రళయపయోధికంటె. ఉ. రా. ౫. ౧౪౧.

మ. మరుజాలిన్ గుఱి దప్పి శూర్పణఖ పల్మాఱి ట్లు నిర్లజ్జ యై... చం. రా. ౫. ౩౯.

౯. (=గిఱి) వలయాకారపు రేఖ.

గీ. ఎలమి నిన్నాళ్లు సైఁచితి నింక నైనఁ, బుమ్మ కొన్నట్టియ ప్పిచ్చి పొమ్మటంచు, హరిహయుఁడు భానుఁ జుట్టినగుఱి యనంగ, భీషణాటోపతను బరివేష మడరె. ఘటికా. ౨. ౪౧.

౧౦. కళంకము, మచ్చ.

సీ... గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె, లక్కనం బనఁగఁ గలంకు... ఆం. భా. ౧. ౮౦.

జ: గుఱించి, గుఱించు, గుఱికట్టు, గుఱికాఁడు, గుఱికొండి, గుఱికొను, గుఱిచేయు, గుఱిపడు, గుఱియగు.

**గుఱించి, గుఱియించి**=కూరిచి. (√గుఱించే)

చ. అన విని యన్న రేశ్వరుఁడు హాసముతో నతనిన్ గుఱించి యిట్లను ... భార. శల్య. ౨. ౭౩. ముకుంద. ౩. ౨౭౯.

మ. నిరవద్యస్థిరభక్తితోడ ననుఁ గానీ శంభుఁ గానీ రమేశ్వరుఁ గానీ గుఱియించి యెవ్వరట యీసారస్తవంబున్ జపింతురు... కాశీ. ౨. ౯.

**గుఱించే, గుఱియించే.** స. క్రి. (√ గుఱి) ౧. లక్ష్యముగా నుంచుకొను, గుఱిగాఁ జేసికొను.

వ ... అశేషమనీషిహృదయంగమంబుగా శబ్దం బనుసరించియు నభిప్రాయంబు గుఱించియు భా

వం బుపేక్షించియు రసంబు పోషించియు ...నైష. ౮. ౨౦౨.

క. అన మరలి చనిరి నమ్ర,వన లైనన లైదు నే ర్పునను శరములఁ జే, సినవిలుకాఁడు గుటించి న, తనువుల హేతిప్రహేతితనయులు సన యల్. వరాహ. ౩. ౧౩౦.

౨. మితియిడు.

క. నగరిపురిపునగరుం ద,న్నగరీరథయూథసౌధ నానావిధరు,గ్గగధగలుఁ జూచు వేడుక,చిగిరిం ప గుటింప రానిచిడిముడి పొడమన్. కువల. ౩. ౧౫.

౩. క్రి. సంకల్పము చేయు, తలపెట్టు.

గీ. అట్లు వైవాహికార్థకృత్యములు నెఱపి, నా లుగవనాఁడు సకలబాంధవులు చెలఁగ, నరవ రాగ్రణి లోచనానంద మొదవ, నాగవల్లి యొనర్చుటకై గుటింప. రాజ. చ. ౩. ౧౮౪.

**గుటికట్టు.** వి. (గుటి + కట్టు) ౧. అంచు. (శ. ర.) ౨. మితి. (శ. ర.) ౩. కట్టుపాటు, ఏర్పాటు.

సీ. ఎఱుకవారల కెల్ల గుటికట్టుగా నిల్వ నొక్క చోటున్నది నిక్కముగను. వేం. మా. ౫. ౨౦. దశా. ౮. ౧౩౭.

**గుటికాఁడు.** విశే. (గుటి+కాఁడు) లక్ష్యము తప్ప కుండ కొట్టువాఁడు, కృతహస్తుఁడు. (శ. ర.) వి. శూరుఁడు, పతి.

క. చలిగుటికాఁడై నిగనిగఁ, గలువలచెలికాఁడు పుట్టెఁ గలశపయోధిన్. హర. ౬. ౮౯.

క. గుటికాఁడు రాక మన మీ,తరుణీభూసురులఁ బట్టఁ దగ దని చుట్టుం,బురిగొనుచుండిరి యా తల,వరు లంతట నదియు నతనివాంఛలు దీ ర్చెన్. శుక. ౨. ౪౯౦.

**గుటిక్రొండి.** వి. (గుటి+కొండి) ౧. ఆయము, జీవ స్థానము. (శ. ర.) ౨. గుఱుతునకై కొండివలె క ట్టినత్రాడు, మొ.

ద్వి. పెడబొబ్బ లిడునీదు పెడకట్టెబిడ్డ,కట్టినగుటి కొండ్లు కట్టిన ట్లుండ,నే యెల్లఁ ద్రావు దంతి మెసంగువెలఁగ,కాయలగతి రిత్తకడవలే చి క్కు. అ. మ. క. ౧. ౩౫ పా. ౧౮ పం.

**గుటికొను.** స. క్రి. (గుటి+కొను) లక్ష్యము గాఁ జేయు.

చ. తటి యనులోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమ శైలశృంగమున్, గుటికొని వేలుపుందెరువు గొప్పపిరంగిని జాయమందులోఁ, గొఱలెడు విన్నమానికపుగుండు ఘటించి యగాదుచేసి నన్, దఱచుగఁ గ్రమ్ముక్రొంబొగ లనంగ జ గంబునఁ బర్వెఁ జీకటుల్. రసిక. ౪. ౯౫.

**గుటిచి**=కూరిచి. (√గుటించు?)

క. మధుమథనుఁ డాక్షణంబున, మధుర గుటిచి కదలి...హరి. ఉ. ౧. ౧౬౯.

మ. అతఁ డొక్కించుక నవ్వి నన్ గుటిచి యి ట్లాశ్చర్యతాధన్యతా,మతికిం గారణ మేమి ...హరి. ఉ. ౫. ౨౫.

సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితో గుటిచి యజిం చుట గోరి సృజించె సురల. హరి. పూ. ౨. ౯౮.

**గుటిచే(సే)యు.** స. క్రి. (గుటి+ చేయు) ౧. లక్ష్య ముచేయు; ఉద్దేశించు.

సీ. గుత్తంపుగుబ్బలు గుటిచేసి వైచెఁ బయోజకు ట్మలముల నొకతె నొకతె. కవిరా. ౪. ౯౫.

గీ. అన్యరాజన్యు గుటిసేసి యరిగె వాణి. నైష. ౫. ౧౪౬.

౨. దృష్టాంతము గాఁ జేయు.

సీ. నీచందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్త లగుదురు మత్పురులకు, గుటిసేయ నీవ యో గ్యుఁడ వైతివి...భాగ. ౮. ౩౮౯.

౩. లక్ష్యపెట్టు, సరకుగొను.

సీ. ఇది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్ గు టిసేసి మనకేలి మఱవ నేల. కళా. ౩. ౨౧౩.

క...ని,నొన్నెకయించుకయును గుటిసేయక యి

మ్మెయిఁ జెనకి తలఁకఁ డతఁడు సెడుమదిఁ౯.
రాఘవ. ౪. ౪౨.

**గుఱిపడు.** అ. క్రి. (గుఱి+పడు) పేరుపడు, ప్రసిద్ధి కెక్కు.

ద్వి. కోకోక్కకమునఁ జాల గుఱిపడ్డరాతు, చ
క్కరఖాణంపుసామ్రాణి నెక్కి. రఘునా.
౧౭ పా. ౧౩ పం.

**గుఱియగు.** అ. క్రి. (గుఱి+అగు) సమర్థుఁడగు.

మ. సరసీజాక్షునికూర్మి భక్తుఁడవు సంసారాబ్ధికి
న్నావ యై, దరిఁ జేర్ప౯ గుఱి యైనవాఁడు
మురవిధ్వంసుండు ని౯ బ్రోవఁడే...కుచేల.
౧. ౫౧.

**గుఱు.** వి=గుఱ్ఱు. (√గుఱ్ఱు-చూ. గుఱుపెట్టు, ము)

**గుఱుకు.** వి. పశురోగవిశేషము.

సీ...పశువ్యాధిభేదాభిధ యొప్పచుండును నుం
గిడి యనఁ,జరుక నా గుఱుకు నా ... ఆం.
భా. ౨. ౧౨౫. (బ్రౌ. పా. గుఱుక. ముద్రి)

**గుఱుకొను.** (శ.ర, చి.ని,బ్రౌ.) అ.క్రి. (ఇది క్త్వార్థకముగానే ప్రయోగములందుఁ గనఁబడుచున్నది.) ౧. యత్నించు, పూను.

క...విష మన్నముతో, గుఱుకొని పెట్టించె గా
ద్పుకొడుకున కలుక౯.భార.ఆది.౫.౧౭౮.
(గుఱుకొని:-బుద్ధిపూర్వకముగా అని భావము.)

చ. గుఱుకొని నేల వ్రక్కలుగఁ గ్రొచ్చియు మ
న్నులు మ్రింగియు౯ శిలల్, వెఱికియు...
భా. రా. బాల. ౪౧౯. భార. అశ్వ. ౨.
౧౬౩.

౨. అతిశయించు.

క...నలుగడలఁ బడ నవారితవృష్టుల్, గుఱుకొ
ని కురియఁగఁ బంచెను, మఱియును నయ్యన
లుమీఁద మఘవుం డలుక౯. భార. ఆది. ౭.
౨౭౦.

క. నెఱసంజఁ గ్రుంకపుగుబ్బలి,చఱి జఱజఱ ని
నుఁడు డిగ్గజాలు మఁ జనునా,శఱి నఱిమఱి
నెగసినజే,గుఱు మూలి యనంగఁ గెంపు గుఱు
కొని పర్వె౯. ద్వా. ౪. ౯౭.

**గుఱుగుఱ్ఱు.** వి. (గుఱు + గుఱ్ఱు-శ. కుఱుకుఱుత్తల్.)-పాము-ఒఱలుటయందగుననుకరణము.

మ ... ఓ దేవ నీ,యఱకా లుద్ధతి రాహుమండల
ము బ్రహ్మాండమ్ముతో నొత్తినఁ౯, గుఱుగుఱ్ఱం
చెడసంది బిట్టొఱలునఘోరాహి నీయంఘ్రి
కి౯, గిఱుఁజె పైపైనవిధంబు నామనను
లోఁ గీలించిన ట్లయ్యెడు౯. నైష. ౭.౧౨౫.

**గుఱుతి(ర్తి)ంచు.** స. క్రి. (√ గుఱుతు) ౧. ఆలోచించు.

సీ...తూమెఁ డిక్షురసమ్మున కన్నివలయుఁ, జే
గాను గాడంగఁ జెఱకుదండము లని గుఱుతిం
పఁగా నూఱుకోల లైనఁ, జాలుఁ బొమ్మను
బుద్ధి సంభవించెను...హర. ౧. ౨౦.

౨. ఆనవాలుపట్టు.

(వ్యవ) వాఁడు నన్ను గుర్తించినాఁడు.

**గుఱుతిడు.** స. క్రి. (గుఱుతు+ఇడు.) అపేక్షించు, కోరు.

ద్వి. ఫలములు గుఱుతిడుభక్తుల కెట్టు,లలవడు లిం
గనిరంతరసుఖము. బస. పు. ౪. ౧౯౯ పం.

**గుఱుతు(ర్తు).** వి. (క. గుఱుతు, గుర్తు.) ౧. ఆనవాలు, చిహ్నము.

క... లెస్సగ గుఱుతులు, కనుఁగొని ... దశా.
౭. ౨. ౯౧.

ఆ... విశ్వనాథదేవుతరుణి, గుఱుతు చెప్పి త
న్నుఁ గొలువంగఁ బుత్తేర,వచ్చినాఁడ నేలవ
లదె తనకు. భీమ. ౩. ౯.

౨. ప్రసిద్ధి, కీర్తి.

గీ. గుఱుతు గలరాజు మంగయగురవరాజు. పాం
డు. ౧. ౭౦. (చూ. గుఱుతుపడు.)

౩. సాక్షి.

క. నను\ జూడ రాఁడ దేహా, యని నిను దూతి
కొను చుందు నవయము నాపై, నెనరు గలం
దుకు గుఱు తిదె,కనిపించెను మనము వేసుక
లు గనఁ గల్గెన్. సారంగ. ౨. ౬౧.

౪. పరిమితి.

సీ. దిక్కెవ్వరును లేనిదీనుల సురలఁ గైకొన్ననీ
కరుణకు గుఱుతు గలదె. నృసిం. ౫. ౧౪౨.

గీ...కఱకుఁదనమున దుర్భాష లఱచెనేని, విధవ
పెనిమిటితోఁగూడ వివిధనరక, కూపబాధ
లఁ బడుఁ గడు గుఱుతు లేక. జై. భా.౩.౩౪.

౫. అస్పదము, స్థానము.

చ...ని,స్నెఱుకపడన్ మృగేంద్రునకు నింపుగఁ
జెప్పి తదీయభక్తికిన్, గుఱుతుగ నిన్నుఁ జే
సి...నా. పంచ. ౧. ౩౬౮.

క. విను వేఁకగొటియలు మొదవు, లెనుములు తు
రగములు గజములిం దొకటియు రెం,డును
మూఁడును నేనును నా,ఱును నేడును నుం
డునది గుఱుతు నీ కుండన్. మార్క. ౪.
౮౪. (చూ. ౮౩, ౮౫.)

౬. విధము.

వ...కొందఱు దొమ్మరులగుఱుతున నహహా యని
బరితీఁగెలవెంబడి నెగఁబ్రాఁకువారును...ప్ర
బంధ. ౭౮౮. ('బడితీఁగె' ముద్రి.)

౭. లక్ష్యము, లెక్క, సరకు.

ఉ. ఈ విటు రమ్ము పొమ్మనుటయే గుఱు తింతియ
కాక మాకు నీ,యీవు లదేమి గుర్తు విడెమే
పదిలచ్చలు...వైజ. ౨. ౯౬.

క...ముదిమది వెనఁదప్పి కోపమున నాడిన నీ,
వది యెఱుక చేసికొని యఌ,గుమవా నేఁ
గాక యామె గుఱుతా నీకున్. వైజ. ౪.
౫౩.

౮. కళంకము, మచ్చ.

గీ...గుటి మచ్చ మచ్చము గుఱుతు చిన్నె,లక్క
వం బనఁగఁ గళంకు...ఆం. భా. ౧. ౮౦.

గుఱుతగు=ఘనమగు.

ద్వి. గుఱు తైననెలయేటిఘుమఘుమధ్వనుల,గుఱు
ము లటంచుఁ జెల్లుబ్బి... నెమలి, పొరిఁబొరి
నాడెడు...రం. రా. అయో. ౧౩౫౪పా. ౨౬
పం.

గుఱుతుగ (గా)=౧. స్పష్టముగా.

ద్వి. నెఱతనంబును గల్గునేర్పరి యనుచు, గుఱు
తుగ నలపరాంకుశముఖ్యమునులు, పలికినది
వ్య ప్రబంధరత్నముల, వలన నిచ్చలు విని...
ద్వి. పరమ. ౩. ౨౩౭ పా.

౨. నిజముగా.

చ. గుఱుతుగ స్త్రీలకున్ మగలకున్ మది నిల్క
డ లెందు లేవు నీ,వెఱుఁగనినీతియుం గలదె
యేటికిఁ దత్త అపాటు...సారంగ. ౨. ౧౪.

౩. శ్రద్ధతో, బాగుగా.

క. గుఱుతుగ విని యభిమన్యుని, వరతనయుఁడు
శుకునిఁ జూచి వాంఛలు నిగుడన్, బరికింపఁ
గ నె ట్లయ్యెడుఁ, దరువాతిమహాకథావిధా
నం బనినన్. కుచేల. ౧. ౧౨౨.

జ: గుఱుతించు, గుఱుతిడు, గుఱుతుపడు, గుఱు
తుపెట్టు, గుఱుతుమాట, గుఱు తెఱుఁగు.

**గుఱుతుపడు.** అ. క్రి. (గుఱుతు+పడు) ౧. తెలి
యు, విదితమగు,

ఆ. పర్వతవనవాసిపరిణామవర్తన, కూపవాసి కె
ట్టు గుఱుతుపడును, బ్రహ్మనిష్ఠవెంటఁ బ్రాకృ
తుఁ డరుగునా...వేమన. ౧. ౧౫౩.

**గుఱుతు(ర్తు)పెట్టు.** స. క్రి. (గుఱుతు+పెట్టు.)
చిహ్నితము చేయు.

(వ్యవ) పుస్తకములోఁ జదువ వలసినభాగములు
గుర్తుపెట్టుము.

**గుఱుతుమాట.** వి. (గుఱుతు + మాట)-ప్రసిద్ధి
గలమాట-లోకోక్తి, నానుడి.

గీ. ఎఱుక పిడికెఁడుధన మన్న గుఱుతుమాట, త

ధ్యమా గాదె యెందైనఁ దాపసేంద్ర.కుచే
ల. ౧. ౪౬.

**గుఱుతెఱుఁగు.** స. క్రి. (గుఱుతు + ఎఱుఁగు) ఆనవాలుపట్టు, తెలిసికొను.

ఆ. అట్టియెడను బచ్చపట్టుదట్టీచేత, నొప్పుతనదు ప్రియుని నుజ్జ్వలంపు, కీవి నెఱపుచంద్రకావిదట్టీచేతఁ, బరుని గుఱుతెఱింగె సురవధూటి. కళా. ౩. ౨౬౭.

క... తుములమునను గుఱుతెఱుఁగక డా,సినసీ పెనిమిటిఁ దునిమితి, వెనుక నెఱిఁగి పొక్కిపడితి నెలఁదిరో యచటన్. ఉ.రా.౪.౧౦౪.

**గుఱుపె(వె,ర్పె,ర్వె)ట్టు.** అ. క్రి. (గుఱు + పెట్టు.) గుఱకపెట్టు.

సీ. బెట్టుగఁ బలుమాఱు నిట్టూర్పులిచ్చుచు భీకరంబుగ గుఱుపెట్టుకొనుచు...గీ... బ్రాహ్మణి సుప్తిఁ బొందె. హరిశ్చ. ౫. ౫౫.

మ...అజుండు...శేల్దలగడై యుండంగ నిద్రించుచున్, గుఱువెట్టం దొడఁగెన్ గలల్గనుచు నిర్ఘోషంబుతో భూవరా. భాగ.౮.౭౧౩.

శా...కాలుం జేలు నెఱుంగకున్నకరణిం గన్మోడ్చి గుర్పెట్టుచున్...భాగ. ౧౦ పూ. ౨౧౯. అచ్చ. రా. యు. ౨౨౫.

వి. గుఱక, సుప్తరవము.

సీ. గుఱక యనంగను గుఱుపెట్టనంగను శోభిలుచుండును సుప్తరవము. ఆం. భా. ౧. ౧౪౨.

**గుఱుపాడుచే.** అ. క్రి. (గుఱు + పాడుచు) గుఱకపెట్టు.

సీ. లంక సొచ్చితి మంచు హుంకారములు సెల్లఁ గలవరించుచు బిట్టు తెలియువారు,వీచులతాఁకున సేచునర్ణవరవ మడఁగిపోవఁగ గుఱుపాడుచువారు. భా. రా. యు. ౨౭౬.

**గుఱుము.** వి. బీజము, గింజ. (శ. ర-గుఱుమ. చిని.)

క. జీవుఁడు శుక్లచ్ఛాయా,భావితుఁ డైనప్పుడు విష్ణుభావించుటకున్, దా నెరవరి యగుఁ దద్గత,భావ మొసఁగు గుఱుము లేనిపండగుచాలవున్. భార. శాం. ౫. ౪౨౧. (గుఱుము ముద్రి.)

సీ. కొందఱు పండులఁ గొటికి కొందఱు గన్నగుఱుముల గువ్వలతెఱఁగు దోఁప,నప్పటి కప్పటి కాననంబున నైచికొని...భార. అను.౫. ౨౮.

**గుఱ్ఱపుఁజుక్క.** వి. (గుఱ్ఱము + చుక్క) అశ్వినీనక్షత్రము. (శ. ర.)

**గుఱ్ఱపుఁదోఁకలు.** వి. బ. (గుఱ్ఱము + తోఁకలు) ధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

**గుఱ్ఱపుఁబీఁట.** వి. (గుఱ్ఱము+పీఁట) ద్వారబంధముమీఁద నుంచెడుగుఱ్ఱపుమూతికొయ్య. (శ. ర.)

**గుఱ్ఱపుఁబెరజె.** వి. (గుఱ్ఱము + పెరజు) ఒకానొకజాతిసర్పము.

సీ...చిల్వగుదియలు ద్రాఁచులు పెరజులు గుఱ్ఱపుఁబెరజులచటఁ, గలవు...ద్వా. ౮. ౯౮.

**గుఱ్ఱపుసారము.** వి. (గుఱ్ఱము+సారము) సప్తస్వరములలో నొకటి, ధైవతము. (శ. ర.)

**గుఱ్ఱము=గుఱము.** వి. అశ్వము.

సీ. కళ్యాలఁ బదిలంబు గానిగుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపువెరవు. భార. విరా. ౧. ౯౫.

గీ...ఎంచి చూడ, లక్షగుఱ్ఱంబు గాదె బలంబు మనకు. కృష్ణ. ౩. ౨౪.

చూపుగుఱ్ఱము=చూపులకు మాత్రమే గుఱ్ఱమువలె కనఁబడి పనికి ఉపయోగింపనివాఁడు.

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజు, సుకేవాసి పనిపంద చూపుగుఱ్ఱంబు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౯౬ పం.

గుఱ్ఱపుఁజదువు=నెమరునకు రానిచదువు, స్మృతికి

రాని చదువు. (వా- గుఱ్ఱములు నెమరువేయుజంతువులలోనివి కావు.)
జ: గుఱ్ఱము, గుఱ్ఱాలగోచ, గుఱ్ఱపుఁజుక్క, గుఱ్ఱపుఁదోఁకలు, గుఱ్ఱపుఁబీఁట, గుఱ్ఱపుఁబెరజా, గుఱ్ఱపుసారము, గుఱ్ఱమెక్కుడు.

**గుఱ్ఱమెక్కుడు.** వి. (గుఱ్ఱము+ఎక్కుడు) బాల్యక్రీడావిశేషము.
సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానఁగ త్రిప్పుట్లు గుఱ్ఱమెక్కుడు మంటిగూండ్లు...హంస. ౩. ౧౪౬.

**గుఱ్ఱు.** వి. ౧. కోపించుటయం దగుననుకరణము.
చ. కదిసిన నోరవోయి యొరుకబ్బపుపొంతులసత్పదార్థముల్, గదుకుచు నెట్టివారిఁ బొడగన్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్, మదికి నసహ్యమై శునకమార్గమునం జరియించుచున్న దుష్పదకవులెల్ల...వాసిష్ఠ. ౧. ౭.
౨. నిద్రాధ్వని, గుఱక.
ఉదా: నేను గుఱ్ఱు పెట్టి నిద్రపోవుదును. శ్లేష్మతత్త్వము గలవారలకు నిద్రలో గుఱ్ఱు ఎక్కువ.
జ: గుఱు, గుఱుగుఱ్ఱు, గుఱుపెట్టు, గుఱుపాడుచు, గుఱ్ఱుగుఱ్ఱు.

**గుఱ్ఱుగుఱ్ఱు.** వి. ('గుఱ్ఱు'నకు ఆమ్రేడితరూపము) ౧. దగ్గునపుడు వచ్చెడిధ్వని కనుకరణము.
సీ. గుఱ్ఱుగుఱ్ఱని కొల్లుకొల్లున దగ్గుచోఁ దవిలినచెవులు చిందర్లువోవ. విప్ర. ౪. ౧౫.
౨. మూలుగుటయం దగుధ్వని కనుకరణము.
వ...గుఱ్ఱుగుఱ్ఱున మూల్గుచు... ప్రబంధ. ౭౦౭.

**గుల.** పం. వి. ఆ. స్త్రీ. స్నుహి కీ.

**గుల.** వి. దురద, గులగుల. (బ్రా, వా.)

**గులక.** వి. ఒకవిధమైనఱాయి, గులకఱాయి.
ఉదా: సన్నగులకభూమి. గులకరేగడభూమి. (బ్రౌ.)

**గులకరములు.** వి. బ. మొలకలు. (చూ. గులకరములుగొను.)
జ: గులకరములుగొను, గులకరించు 2.

**గులకరములుగొను.** అ. క్రి. (గులకరములు+కొను) మొలకలెత్తు, గులకరించు.
వ...సునుఁజెమటం దడంబడి పులకరములు గులకరములుగొన హృదయానందకందం బగుకందుకంబు కరారవిందంబునం దమర్చి ... అనంతవిభ్రమంబుల జగన్మోహిని యై విహరించుచు నున్న సమయంబున...భాగ. ౮. ౩౯౬.

**గులకరించు[1].** అ. క్రి. ధ్వనిచేయు, శబ్దించు.
సీ. సరసిజద్వయముపై మొరయుతుమ్మెదపిండువలెఁ గాళ్లగజ్జెలు గులకరింప. వరాహ. ౪. ౧౨౦.
గీ...అందియలు గులకరింపఁ గొంత దవ్వరిగి యరిగి. వరాహ. ౩. ౧౨౬. గంధ. ౧౯౬.
జ: గులకరింత.

**గులకరించు[2].** అ. క్రి. అంకురించు; వ్యాపించు; వెలువడు, నిర్గమించు.
వ...మేనం బులకలు గులకరింప...సురా. ౯౬. (బ్రా. పా.)
గీ. మొలకనగవులు మొగమున గులకరింప. చంద్రా. ౩. ౯౨.
సీ. ఆణిముత్తెపుసరు లల్లనఁ జలియింపఁ గుండలంబులకాంతి గులకరింప. మల్లుపు. ౩. ౬.
సీ. మునుఁగువెట్టిన నేమి ముత్యాలకమ్మలక్రొమ్మించులీలలు గులకరించె. క్రీడా. ౯౫.
స. క్రి. వెలార్చు, బయలుపఱుచు.
వ...నిజాననాంభోజభాజనంబులం జిట్టినమైరేయంబు మగలకుఁ ద్రావించునెడ వారు వాసనార్పితసహకారపల్లవం బని చక్కెరమోవి చుఱుక్కున నొక్కినన్...కమనీయసీత్కారకంఠనాదభేదంబులం గులకరించుచున్...వసు. ౪. ౨౩.

**గులకరింత.** వి. (√గులకరించు[1]) క్షుద్రజలజంతువిశేషము. హంస. ౪. ౧౯౬.

**గులగుల[1].** వి. ౧. ఎలుఁగుబంటి పుట్ట కోరాడుటయం దగుననుకరణము.

వ...చీమకుక్ జెదలునకు నెలుంగులు గులగులక్ బుట్టలు నిశితనిజనఖరకులిశకోటుల న్గోరాడ ...మనుచ. ౪. ౩౭.

౨. వత్తులకూఁత కనుకరణము.

క. కలవింకకలకలాకుల, వలభీగర్భములు సౌధవాటములు పురం,బులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులఁ గూయుసట్టిచందం బొందెన్. శివరా. ౪. ౨౧.

వ...బిడ్డలారా యేలాగున నతిక్షుత్పిపాసాకులం బులై కులాయకూలంబులం గులగులం గూసెదరని విలాపంబు సేయుచు...నైష.౧.౧౦౭.

౩. దురద. (శ. ర, బ్రౌ.)

**గులగుల²**. వి. చూర్ణము.

చ. వెలఁదినిఁ జూపు మంచుఁ దొలివేలుపురాయ నియెమ్ము లొక్కటన్, గులగులగా నడంతునొ...అచ్చ. రా. సుం. ౨౨.

(బ.) ముక్కముక్కలు.

స్రగ్ధర. క్రుద్ధున్ గోత్రాచలంబుల్ గులగుల లయి పో గోతముల్లుద్దులీలన్. మనుచ. ౪. ౮.

వ...మిట్టకోలల గులగుల లైనకిరీటంబులనుండి రాలినవజ్రమౌక్తికరజోగణంబుచవి మరగి ముఱుగకుండ నుప్పఁగండలు పెట్టఁ జూచుపిశాచమందగామినులక్రందును... కాశీ. ౨. ౬౨.

వ... గులగుల లై పడుకిరీటంబులును డొల్లుతలలును...భా. రా. యు. ౧౯౬౬.

గులగులయగు, గులగులలగు=శిథిల మగు, నలఁగిన దగు.

చ... గులగులయయ్యె గబ్బినునుగుబ్బలు ముద్దుమొగంబు వాడెఁ గెం,దలిరుకటారివాని బెడిదంపుదురంబు విభుం డొనర్పఁగన్. శుక. ౧. ౨౧౫.

క. అని శ్రీపతి యానతియి,చ్చిన మందల విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ,డును గులగుల లై లావగ,లినమై విదిలించుకొనుచు లేచెఁ గిదుకుచున్. పాండు. ౪. ౫౭.

సీ. కూర్మాధిపునివెన్ను గులగులల్గా బిట్టు మట్టుదు మే మాటమాత్రలోన. రాజ. చ. ౨. ౫౭.

**గులవ**. వి. అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱ్ఱాలగో చనఁగా గులవ యనంగఁ దగు నశ్వపాలకుండు. ఆం. భా. ౨. ౨౦౪.

**గులము**. సం= గుడము.

**గులాబి**. వి. (హిం. గులాబ్) పుష్పవిశేషము. (శ. ర)

**గులాము**. వి. (హిం. ఘులామ్. క. గులామ. తు. గులామె.) ౧. దాసుఁడు, బానిస; దాసి.

క. ఇత్తడి పుత్తడి యగునే, తొత్తుది నగ లెన్నియిడిన దొరసా నగునే, యుత్తమకులుఁ డవునాడొ, లత్తుకు సరి చేరినను గులాము గులామే. (అడిదమునూరనచాటువు.)

౨. బిచ్చము.

గీ. ధాన్యముష్టి గులామెత్తి దాన నిత్య,మేకరంబునఁ దా స్వయంపాక మాచ, రించి సాపాటుఁ జేయుదు నంచు నతని, మొఱఁగి తేనయింటి కేఁగి ముష్టు భుజించు. వైజ. ౨.౧౨౨.

చ. లలనరొ యెందు నీ వికఁ గులామునకున్ జన వద్దు...వైజ. ౨. ౧౨౭.

విణ. హీనుఁడు.

సీ. చెల్లుసెల్లముల కీక్షింప నిచ్చినసొమ్ము మగుడ నీ లేనికోమటిగులామ. వేం. పంచ.౧. ౭౬౩.

సీ. మానాభిమానముల్ మాని ప్రవర్తించుమంకు గులాములు మంత్రు లైరి. వేణు.౩౫.

**గులి**. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉండ, మాత్ర; గోలీ, బాలు రాడుకొను చిన్నజాతియుండ. ౨. రోగభేదము.

**గులింకము**. సం. వి. అ. పుం. పిచ్చిక. (విల్యమ్స్.)

గులిబి=గులిమి. ఆం. భా. ౧. ౧౩౪.

గులిమి=గుబిలి², గులిబి. వి. కర్ణమలము, పింజూషము.

సీ... కర్ణమలనామ మొప్పును గులిబి నా గుబిలి నా గులిమి యనఁగ. ఆం. భా. ౨. ౧౩౪.

జ: గులిమికదురు.

గులిమికదురు. వి. (గులిమి + కదురు) గులిమి తీసి కొనెడుకదురు, గులిమి తెడ్డు. (శ. ర.)

గుల్ఫము. సం. వి. అ. పుం. చీలమండ.

గుల్మకేతువు. సం. వి. ఉ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలికీ.

గుల్మము. సం. వి. అ. పుం. న. ౧. బోదె లేనితీఁగ, తుప్ప, మొ. ౨. పొద, గుల్మిని. ౩. ప్లీహము, ఎడమపార్శ్వమున నుండుపచ్చనిమాంసఖండము. ( వై. ని. ) ౪. ప్లీహము పెద్ద దగురోగము. (వై. ని.) ౫. తొమ్మిది రథములును తొమ్మిది యేనుఁగులును ఇరువదేడు గుఱ్ఱములును నలువదేవురు కాల్వురును గలసేన. ౬. సైన్యరక్షణము. (మే.ని) ౭. గ్రామరక్షకభటస్థానము, పల్లెయందలిఠాణా. (ఆ. ని.)

గుల్మమూలము. సం. వి. అ. న. అల్లముకీ.(వాచ)

గుల్మి. సం. విశ. (న్. నీ. న్) గుల్మరోగము గలవాఁడు.వి. ఈ. స్త్రీ. ౧. ఆమలకి, ఉసిరికకీ. ౨. లవలి, ఒకానొకతీఁగ. ౩. ఏలకి కీ. ౪.గుడారము, డేరా.

గుల్మిని. సం. వి. ఈ. స్త్రీ. ఉలపము, పొద.

గుల్యము. సం. విశ. (అ. ఆ.అ) మధురము, తియ్యనిది.

గుల్ల. వి. (సం. క్షుల్లకః) ౧.జలజంతువిశేషము,క్షుద్రశంఖము.

గీ. క్షుద్రశంఖము దనరారు గుల్ల యనఁగ. ఆం. భా. ౧. ౧౬౧.

సీ...ఉలుచలఁ జిఱుతగుల్లల నమలుచు...గీ.తనరుబకవంక్తులకు...ఆము. ౨. ౫౩.

౨. చింతపండు మొదలగువానిమీఁద నాచ్ఛాదకముగా నుండి కోశమువలె బోలుగా నుండుపదార్థము. (ఉదా: చింతగుల్ల, మొ.)

గీ...అన్నిశాచరుని నొడిసి, కాలు వట్టి మీఁదికి నెత్తి నేలతోడ, నొడలు గుల్లలతిత్తిగా నుదికి చంపె. భా. రా. యు. ౬౫౦. ప్రబోధ. ౫. ౯౯.

౩. బొబ్బ, పొక్కు. (శ. ర.)

౪. కప్పచిప్ప, శంబూక. (శ. ర.)

విశ. ౧. అల్పము.

క. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు పతికిఁ గొండం తైనన్, ఇల్లాలు మెలఁగుచున్నను, గొల్లా సౌఖ్యంబు పతికి గోరం తైనన్. శేష. ౧. ౧౩౯.

౨. బోలు, గట్టిది కానిది.

ఉదా: గుల్లకంటె, గుల్లమురుగులు.

పెనుగుల్ల=శంఖము.

సీ. పునుకయుం బెనుగుల్లయును గేలుదమ్ముల నంచలమాడ్కిఁ బాటించువాఁడు. గీ...ముక్కంటియును వెన్నుఁడును నవంగఁ, బొల్చునావేల్పు కబ్బంబుఁ బ్రోచుఁ గాత.ద్వా.౧.౪౦.

జ: గుల్లకాఁడు, గుల్లకావి, గుల్లకాసు,గుల్లనేఁత, గుల్లపడు, గుల్లపఱచు.

గుల్లకాఁడు. విశ. (గుల్ల + కాఁడు)-అంతస్సారము లేనివాఁడు - ఏమియు లేనివాఁడు, అకించనుఁడు.

'గుల్లకాఁడై మనయింటికిఁగుఱుతు లడుగ వచ్చీని' క్షే త్రయ. (శ. ర.)

గుల్లకావి. వి.(గుల్ల+కావి.) కొంచెము నీలపుడాలుగల ఎఱుపు. (చి. ని.)

సీ. నిజకటీతటిఁ జెక్కునీలంపుఁబిడిబాఁకు కనకశాటిక గుల్లకావి గట్ట. బహు. ౪. ౧౩౧.

సీ. తనతనూరుచి పైని౯ దగ నుల్లసిలుగుల్లకావి నాఁ
గనకాంశుకంబు దనర. రా. వి. ౧. ౧౫.

**గుల్లకాసు.** వి. (√ గుల్ల.) ౧. బోలుగాఁ జేసినకాసు. (వా) ౨. అల్పమైననాణెము, వెల తక్కువ నాణెము.

ఆ. ...వెంట గుల్లకాసును రాదు. వేమన. ౧. ౧౫౦.
సీ. ఆటమటించినఁ బట్టెఁడంత సాదము గాక కాదేని యొకగుల్లకాసు గాక...గీ ... ఈగి
స్నె మమ్ము, వంటివారలు గొన నెంతవార లయ్యె. విప్ర. ౫. ౧౯.

**గుల్లనేఁత.** వి. ( √ గుల్ల.) పలుచగా నేసిననేఁత, బాగుగా గట్టన లేనినేఁత. (వా.)

**గుల్లపడు.** అ. క్రి. (గుల్ల+పడు) అవమానపడు. (చూ. గుల్లపఱచు. )

**గుల్లపఱ(ఱు)చు.** స. క్రి. (√గుల్లపడు) అవమానపఱచు.

ద్వి. నిను నేఁడు ముఖమున నెత్తురు ప్రామి,కొని గుల్లపఱుపక కొలికికి రావు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౭ పం.

**గుల్లాము.** వి. ౧. అశ్వపాలకుఁడు.

సీ. గుల్లా మన గుఱ్ఱాలగో చనఁగా గులప యనం గఁ దగు నశ్వపాలకుండు. ఆం. భా. ౨. ౨౦౮.
౨. (=గులాము) దాసుఁడు.
ఆ. కూలి నాలి చేసి గుల్లాముపని౯ జేసి, తెచ్చి పెట్ట నాలు మెచ్చ నేర్చు. వేమన. ౧. ౬౩.

**గుళి(లి)క.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉండ; మాత్ర; గోలీ. ౨. క్రీడాకందుకము, ఆటబంతి. ౩. ముత్తెము. (విల్యమ్సు)

**గుళిగ.** వి. (సం. గుళికా) ఘుటిక, ఉండ.

క. గుళిగ లోవరించి సీడం, గిలగిలలుగ నార్చి నారికేళపుబుఱ్ఱం, జెలు వొంద దాఁచి మేహం,బుల ననుపానముల నీయఁ బోవు౯...
చికి. ౨. (చి. ని.)

**గుళుంచ్ఛము.** సం=గుచ్ఛము. (కల్ప)

**గుళుచ్ఛము.** సం. వి. అ. పుం. గుచ్ఛము, పువ్వులు లోనగువానిగుత్తి.

**గుళ్లు.** వి. బ. కుందెనగుడి యను బాలక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు. గీ. గుళ్లు దాఁగిలిమ్రుచ్చులు గోడిపట్టె,లు...వి. పు. ౭. ౨౦౩.

**గువాకము.** సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

**గువ్వ.** వి. ౧. కపోతభేదము, అడవిపావురము. (శ-దీని భేదములు :- కుకుకుటుగువ్వ, పొడగువ్వ, పచ్చగువ్వ, చిటిగువ్వ, రాగువ్వ, ఎలుబొంతగువ్వ. బ్రౌ) హంస. ౩. ౧౩.
౨. పక్షి, పిట్ట.
సీ. పిట్ట పక్కి పులుఁగు జిట్ట గువ్వ యనంగఁ బక్షిసామాన్యమై పరఁగుచుండు. ఆం. భా. ౨. ౯౬.

జః గువ్వకరి, గువ్వకరిగొను, గువ్వకుత్తుక, గువ్వకుత్తుకపడు, గువ్వకోలుకొను, గువ్వగుత్తి, గువ్వగుత్తుక, గువ్వరాయి.

**గువ్వకరి.** వి. (గువ్వ+కరి) విజృంభణము.

మ. తరుణి యొకర్తు పాదమునఁ దన్నినఁ గ్రొన్నగుంపునుజ్జగి౯, మెఱసి యశోకభూజము విమిశ్రితతత్పదయావకద్రవ,స్ఫురణ మెచూపఁ దోడివిరిబోణులకుం బువు లంచుఁ దెల్పెని,ర్భరగతి వ్రాలునమ్మధుకరమ్ములు గువ్వకరి౯ నటింపఁగ౯. భోజసుతా. ౩. ౨౬.

**గువ్వకరిగొను.** అ. క్రి. (గువ్వకరి + కొను.) విజృంభించు, రేఁగు.

సీ. పిడికెఁడుపూరికై బెడిదంపుసాహసం బెట్టు చేసితి వని తిట్టువారు. గీ. నై దినంతులు గొట్టుచు నమ్మునీంద్రు, గువ్వకరిగొని కడు వెళఁ గుడువఁబఱచి...వరాహ. ౧౦. ౮౧.

ద్వి. కలయఁ బౌరులు గువ్వకరిగొని దూఱఁ, దల వంచుకొని పీడు దడయక వెడలి. ద్వి.హరిశ్చ. పూ. ౧౬౮౫ పం.

క. అచ్చోటితీర్థవాసులు, వచ్చి తగునె నీకుఁ బుణ్యావాహిని నిటు వా, క్రుచ్చితి వని వడి నందలు, గచ్చ కడలినట్లు గువ్వకరిగొని తిట్టన్. జై. భా. ౮. ౭౨.

**గువ్వకుత్తుక.** వి. (గువ్వ + కుత్తుక.) ఆఁకలిచేత కలుగుహీనస్వరము.

క. మితి గడచిన ఋణదాతలు, వెతవెట్టఁగ నూరు చొరక వెలివెలిఁ దిరుగన్, దలఁ గూడు లేక యాఁకటఁ, గుతిలపడు నతండు గువ్వకుత్తుకతోడన్. పాండు. 3. ౨౦.

**గువ్వకుత్తుకపడు.** అ. క్రి. (గువ్వకుత్తుక + పడు) -ఆఁకలిచేత హీనస్వరము గలవాఁ డగు-కృశించు.

ద్వి. నెవ్వగఁ గుందుచు నీరసాన్నములఁ, గ్రొవ్వి బల్తురె గువ్వకుత్తుకపడక. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౦ పం.

**గువ్వకోలుకొ(ల్కొ-)ను=గువ్వకరిగొను.**

గీ. కడుపు చుమ్మలుచుట్టఁగాఁ గన్నకన్నె, చిలుక నెడఁబాసి యేరీతి నిలుచువాఁడ, నెక్కుడివివేక మన మంత్రు లెల్లఁ గదిసి, కువలయేంద్రునితో గువ్వకోలుగొనుచు.

గీ. మాను మీమోహ మని తెల్పి ... శుక. ౧. 3౭౨, 3౭౮.

గీ. గొంట వనిరెుఁ దిలోత్తమ గూర్మిఁ గొసరె, ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె, దివిజకామిను లీరీతిఁ దిరుగువాఱె, గువ్వకోల్కొంచుఁ దమలోన నవ్వుకొంచు. మనుచ. 3. ౧౦౯. శుక. ౨. ౧౦౯.

**గువ్వగుత్తి(క).** వి. (√గువ్వ) కపోతాంఘ్రి శి.

సీ. గువ్వగుత్తిక యన గువ్వగుత్తి యనంగఁ జనుఁ గపోతాంఘ్రి...ఆం. భా. ౨. ౬౪. (బ్రౌ-పా.) హంస. ౮. ౧౦.

**గువ్వగుత్తుక.** వి.(గువ్వ + గుత్తుక) కపోతాంఘ్రి శి. (శ. ర.)

**గువ్వరాయి.** వి. (గువ్వ + రాయి) మొరపరాయి. (బ్రౌ)

**గుసగుస.** వి. ౧. రహస్యపుమాటలచప్పుడు (శ.ర.) ౨. సల్లాపము; గుసగుసధ్వనితోఁగూడినరహస్యపుమాట.

సీ... గుసగుస ముచ్చట యన, సల్లాపసంజ్ఞమై యుల్లసిల్లుచు నుండు... ఆం. భా. ౧. ౧౧౭.

గీ. చేరి చెవిలోన గుసగుస ల్చెప్పినట్లు, మోహమున వాని చెక్కిట మోముఁ జేర్చు. శశాం. ౨. ౭౭.

జ: గుసగుసలఁబోవు, గుసగుసలాడు.

**గుసగుసలఁబోవు, గుసగుసలువోవు=గుసగుసలాడు.** (√గుసగుసలు)

వ... నిన్న మనము విన్నది నిజంబై తోఁచుచున్నది చూడుఁడు చూడుం డని గుసగుసలంబోవువారును... ఉ. రా. ౬. 3౮3.

క. పొసఁగ దది యనుచు మంత్రులు, గుసగుసలం బోవ రాజకుంజరులోడన్. శుక. ౧. 3౧౫. విజ. వి. 3. 3౭.

సీ. అపుడు వచ్చినవార లౌఁ జెలి యెవతె యీ కొమ్మ యంచును గుసగుసలువోవ. కువల. ౨. ౭౯.

**గుసగుసలాడు=గుసగుసలఁబోవు.** అ. క్రి. (గుసగుసలు + ఆడు.) ౧. రహస్యముగా మాటలాడు.

(వ్యవ) వా రిద్దఱు గదిలో గుసగుసలాడుచున్నారు.

వ... మాటిమాటికిఁ గొరవివిరిగుత్తిపై వ్రాలి యొగయుభసలపంక్తిఁ గొమ్మ పుష్పమంజరులు గ్రా

యుముసలం బని గుసగుసలాడుచు... రా. వి. ౩. ౧౧౪.

చ. ముసిముసినవ్వు మోమునను ముచ్చటలాడ రవంది ప్రోఁతతో, గుసగుసలాడ నంచగమి గూడఁ జనెన్ జెలి శౌరిప్రోలకున్. ముకుంద. ౩. ౨౪౩.

**గుహా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కొండయందలిబిలము. ౨. దాఁగుట. ౩. పల్లము. ౪. హృదయము. ౫. బుద్ధి, మనీష. ౬. ముయ్యాకుపొన్న ?.

**గుహాము.** సం. వి. అ. పుం. గుజ్జము.

**గుహాషష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ-కుమారస్వామి జన్మించినషష్ఠి-మార్గశీర్షశుక్లపక్షషష్ఠీతిథి, కుమారషష్ఠి.

**గుహాశయము.** సం. విశే. (అ. ఆ. అ) గుహయందు శయనించునది. వి. అ. పుం. ౧. పరమాత్మ. ౨. సింహము, మొ.

శ్లో. సింహవ్యాఘ్రవృకా ఋక్షతరక్షుద్వీపిన స్తథా, బభ్రుజంబుకమార్జాలా ఇత్యాద్యాస్స్యుర్గుహాశయాః. (కల్ప)

**గుహినము.** సం. వి. అ. న. అడవి. (కల్ప.)

**గుహుఁడు.** సం. వి. అ. పుం. ౧. కుమారస్వామి. ౨. ఒకనిషాదరాజు. (రామునికి మిత్రుఁడు. శృంగిబేరపురమునకు రాజు.)

**గుహేరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) రక్షకుఁడు, కాచువాఁడు. వి. అ. పుం. కమ్మరి.

**గుహ్యకుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము. (వీరు కుబేరునియనుచరు లై యతనినిధులను రక్షింతురు)

**గుహ్యకేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**గుహ్యదీపకము.** సం. వి. అ. పుం-తాను గనఁబడకుండ వెలుతు రిచ్చునది-మిణుఁగుఱుఁబురుగు.

**గుహ్యపుష్పము.** సం. వి. అ. పుం-అంతఃకుసుమము, దాఁగినపువ్వులు గలది-అశ్వత్థము, రావి ?.

**గుహ్యము.** సం. విశే. (అ. ఆ. అ) రహస్య మైనది. వి. అ. పుం. ౧. వంచన, దంభము. ౨. తాఁబేలు. న. ౧. ఏకాంతము, రహస్యవిషయము. ౨. మగగుఱి. ౩. ఆఁడుగుఱి.

## గూ

**గూండ్ర**=గుండ్ర[3]. వి. గ్రుడ్లగూబకూఁత. (శ.ర.) జ: గూండ్రించు.

**గూండ్రించే.** అ. క్రి. (√ గూండ్ర)-గ్రుడ్లగూబ-కూయు. (శ. ర.)

**గూఁటి.** వి. (సం. ఘృష్టిః) పంది, సూకరము. (శ. ర.)

**గూఁటిగువ్వ.** వి. (గూఁడు+గువ్వ) ఈఁకలు రాల్చినపక్షి.

గీ... గూఁటిగువ్వన నణఁ జనఁ గురు జనంగ, నీఁకరాల్చినపక్షి యూ నిందుమాళి. ఆం. భా. ౨. ౯౭.

**గూఁడు.** వి. ఔ. (బ. గూండ్లు, గూఁడులు. క. తు. గూడు. త. మ. కూడు) ౧. కులాయము, పక్షిగృహము.

క. తనరె బలిభుక్తతులు నిం, డినగ్రామశ్రీలకటిరీనీలము లగుటన్, గనియోఁ దృణగ్రాహిత ననఁ, గొనుకసవులఁ జైత్యతరుల గూండ్లిడుభ్రమలన్. ఆము. ౪. ౧౩౨.

ఉ. క్రూరవనేభదంతహతకుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ బొల్పారుమిడుంగుఱుంబురువు లంచు వెసన్ గొనిపోయి పొంత శృంగారవనద్రుమాళి గిజిగాఁడులు గూఁడులఁ జేర్చు దీపికల్, గా రహిఁ గృష్ణరాయమహికాంతునిశాత్రవపట్టనంబులన్. మనుచ. ౧. ౩౬.

సీ. చెవిగూఁటు నెలకొన్న కవపిట్టకివకివల్ మొనసి

నాదబ్రహ్మ మినుమడింప. చంద్రా. ౩. ౯౯. ఆం. భా. ౨. ౯౯.

౨. గోడయందు దీపము మొదలగునవి యుంచుట కేర్పఱుపఁబడినగుంట.

గీ. తనగృహంబున గూఁటిలోఁ దలుపుమూలఁ, బిడుతలో నాయకుఁడు దాఁచి పెట్టినట్టి,మాడ లర్పించి...శుక. ౩. ౧౩౧.

౩. పంజరము.

సీ...గూఁడు, చాట పంజర మనఁ జను...ఆం. భా. ౨. ౧౬౮.

క. అలనాఁటినన్ను మఱచితె, నిలు నిలుమీ తగ నయాజ్ఞ నీకిదె యనుచుం, బులుఁగుల ఱేని మహేంద్రుం, డలుఁగుల పెనుగూఁటఁ జిక్కునట్టుగఁ జేసెన్. పారి. ౫. ౨౭.

౪. ఆకుగుడిసె. (శ. ర.)

౫. సులోచనము, మొ. పెట్టుకొనెడిగొట్టము.

ఉదా: సులోచనముగూఁడు, కత్తులగూఁడు. (బ్రౌ)

లక్కగూఁడు=౧. ఇంటిదూలము మొదలగువానియందు పురుగులు నివసించుటకు మంటితో ఏర్పఱచుకొనెడిగూఁడు. (ఇది శుభసూచక మని వాడుక.) ౨. కుండలము మొదలగువానిలో రత్నములు స్థాపించుటకు ఏర్పఱిచినగుంట.

చ. తొలుమలరాతితో నొరయుతూరుపుఁదొయ్యలిముత్తియంపుఁగుం, డలమునమానికంబు పడినం గనుపట్టెడులక్కగూఁడు నాఁ, జలువల ఱేనియప్పొడుపుఁ జాయఁ దొఱంగినకందు దోఁచె...పారి. ౨. ౪౫.

వాడుకలోని ప్రయోగవిశేషములు:-బండిగూఁడు గట్టిగా లేదు. కోళ్లగూఁడు. కుఱుపు గూఁడు పోసినది. అక్కగూఁడు విఱుగఁ దన్నెను.

జ: గూఁటిగువ్వ, గూఁటికానుపు, గూఁడుపుట్టువు, గూఁడుబండి.

గూఁడుకానుపు(న్పు). వి. (గూఁడు+కానుపు) నీడోద్భవము, పక్షి.

దండకము...రాచూలి దానప్పు డాగూఁడుకాన్పుం దొరం గూర్చి డెందంబునన్ నిల్పుడున్...అచ్చ. రా. యు. ౧౬౧, సుం. ౫౭.

గూఁడుపుట్టువు=గూఁడుకానుపు. (గూఁడు + పుట్టువు.)

గీ. అట్టు లెడ లేనికడిమిఁ గయ్యం బొనర్చు,జడ బ్రతుకుగూఁడుపుట్టువుసామిమీఁదఁ, గినిసి క్రైదువ కేల నంకించి రక్కసుండు గాల్గను జెక్కలుఁ జెండివైచె. అచ్చ. రా. అర. ౭౫.

గూఁడుబండి. వి. (గూఁడు+బండి) గూఁడువలె చాఁప కట్టినబండి. (శ. ర.)

గూటము=గూటాము. వి. (సం. కూటః. క. తు. గూట) ౧. డేరామేకు.

చ. సమముగ మిట్టపల్లములు చక్కఁగఁ జేయుచుఁ జొట్టునీరువా,టముఁ గని నాల్గువంకల గుడారము లెత్తిరి జీనిపట్టువ,గ్గములు బిగించి గూటములఁ గట్టి సరాతులఁ గూర్చి ముందటం, గొమరగుపైఁడితీవపనికట్టుఁజప్పరముల్ చెలంగఁగన్. వాల్మీకి. ౩. ౯౬.

౨. గుంజ. (శ.ర.) ౩. వడ్లవాఁడు మాదిగవాఁడు దూదేకులవాఁడు మొదలగువారు ఉపయోగించెడుపనిముట్టు. (శ. ర, బ్రౌ.)

గూటాము=గూటము. (శ. ర.)

గూటిపఱచు. స. క్రి. కప్పిపుచ్చు.

గీ. ఆకటుకు గూటిపఱచి గయ్యాళితపసి, యెంత ప్రియములు సెప్పిన నియ్యకొనక, చంద్రభానునిపేరన్న సైఁప కట్లు, పక్షపాతంబు మీ

అనుపేక్షసేసె. చంద్ర. ౧. ౧౩౪. (ప్రయోగాంతరము లేదు)

**గూడ.** వి. (క. తు. గూడె. త. మ. కూడై) ౧. పుష్పములు మొదలగునవి యుంచెడిబుట్ట, సజ్జ.

సీ...విరుల,తోమాలెలు... గూడ నునుచు ...ఆము. ౫. ౩౮.

౨. భక్ష్యములు మొదలగునవి పెట్టికొనుబుట్ట.

క...పూరీలు...ఆదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి...హంస. ౧. ౧౦౫.

౩. వానకు తడియకుండ తలపైని వేసికొనెడిగూడ.

మ. వసతు ల్వెల్వడి వానకై గుడిసె మోవఁగా రాక తా నానియే,వసగా నిల్చినజమ్ముగూడ... ఆము. ౪. ౧౩౩.

౪. దొప్ప.

చ...ఒకయోగికి భిక్షము తోలుగూడచేఁ, దివిచిన వేఁడిపాయసముఁ దెచ్చి రయంబునఁ బెట్టె...భోజరా. ౩. ౫౫.

౫. పల్లమునుండి మెరకకు నీళ్లు తోఁడెడివెదురుగూడ. (వా)

౬. జలసముత్క్షేపపాత్రము, ఓడలోఁ చొచ్చిననీళ్లను తీసివేయుపాత్రము.

గీ...విలసిల్లు గూడ యనఁగ, జలసముత్క్షేపపాత్రంబు చంద్రమౌళి. ఆం. భా. ౧. ౧౫౭.

౭. వైష్ణవులు తిరుమణిపెట్టె మొదలైనవి ఉంచి చంకను తగిలించుకొనెడుతాటాకులబుట్ట, తిరుపగూడ. (శ. ర.) ౮. మత్స్యములను బట్టెడుసాధనవిశేషము. (శ. ర)

చెప్పుగూడ=చెప్పుట్టలమీఁద దొప్పవలె నుండు భాగము.

గీ. అనుచు నాల్గుదెసలు నరసి యెద్దియు సమ,కూడకున్నఁ జెప్పుగూడ యొకటి, తెచ్చి దానఁ దిగిచి తిగిచి మూఁకుటఁ బోసి,పెట్టెఁ బాయసంబు భిక్షుకునకు. భోజరా. ౩. ౪౬.

జ: గూడకట్టు, గూడకొంగ, గూడబాతు.

**గూడకట్టు.** వి. (గూడ + కట్టు) కచ్ఛము లేకుండ కట్టినబట్టకట్టు. (శ. ర, వా.)

**గూడకొంగ.** వి. (గూడ + కొంగ) పెద్దకొంగ. (బ్రా)

**గూడపాల.** వి. మామెన, శారిబ కీ. (శ.ర.)

**గూడబాతు.** వి. (గూడ + బాతు) పెద్దకొంగ. (బ్రా-బకవిశేషము. శ. ర.)

సీ...సాళ్వము డేగ గూడబా తుల్లంగి కుందటీల ...ఆది యైనపక్షు లతఁడు దీర్చు. హంస. ౩. ౧౩. ఆం. భా. ౨. ౯౭.

**గూడారము**=గుడారము. (త. కూడారమ్.)

సీ. కోఁఅలు గుడారము గూడారము గుడారు గూడారనఁగను నాల్గు పటగేహ, నామధేయంబులు...ఆం. భా. ౨. ౧౫౯.

ద్వి. గూడారములు దెరల్గొల్లెన ల్వన్ని, వేలముల్దప్పక విడిసె నుత్సుకత. పండితా. పర్వ. ౩౫౦ పా. కు. సం. ౧౧. ౬౦౦.

**గూడారు**=గుడారము. ఆం. భా. ౨. ౧౫౯.

**గూడెము**=గోడెము. వి. బోయపల్లె, పక్కణము; పల్లె.

గీ. గూడె మని గోడె మని యనుకొందు రార్యు,లెల్లఁ బక్కణమునకు బాలేందుమౌళి. ఆం. భా. ౨. ౨౩.

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁగిరాతుల్ ...వేం. పంచ. ౨. ౧౯౨.

సీ. విన్నుక్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోని మేలువాఁడు. అచ్చ. రా. బాల. ౧౩.

ఉదా: గొల్లగూడెము, ఈంద్రగూడెము, మొ.

గూఢచారి. సం. విశ. (న్. ణీ. న్) గూఢముగా సంచరించువాఁడు.

గూఢచారుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు, వేగులవాఁడు.

గూఢనీడము. సం. వి. అ. పుం-గూఢమగుగూఁడు కలది-కాటుకపిట్ట.

గూఢపథము. సం. వి. అ. పుం. ౧. రహస్యమార్గము. ౨. అంతఃకరణము.

గూఢపాత్తు. సం. వి. త్. పుం=గూఢపాదము.

గూఢపాదము. సం. వి. అ. పుం-కానరానికాళ్లు గలది-పాము.

గూఢపురుషుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు, వేగులవాఁడు.

గూఢపుష్పకము. సం. వి. అ. పుం. వకుళము, పాగడకి.

గూఢఫలము. సం. వి. అ. పుం. రేఁగుకి.

గూఢమణి. సం. వి. ఇ. స్త్రీ. బాలికాక్రీడావిశేషము.

శ్లో. రత్నాదిభిర్వాలుకాదౌ గుప్తైర్దృష్టవ్యకర్మభిః, బాలికాభిః కృతా క్రీడా నామ్నా గూఢమణిస్తు స్మృతా.

గూఢమార్గము. సం. వి. అ. పుం. ౧. సొరంగము. ౨. రహస్యమార్గము.

గూఢము. సం. విశ. (అ. ఆ. అ) రహస్య మైనది.

గూఢమైథునము. సం. వి. అ. పుం-గూఢమైనమైథునముకలది-కాకి.

గూఢవర్చస్కము. సం. వి. అ. పుం- గూఢమైనపురీషముకలది-కప్ప.

గూఢవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. అంకోలము, ఊడుగుకి.

గూఢసాక్షి. సం. విశ. (న్. ణీ. న్) గుట్టుసాకిరి, ప్రతివాది చెప్పునది రహస్యముగాఁ బొంచియుండి వినుటకై ఏర్పఱుపఁబడినసాక్షి.

గూఢాంగము. సం. వి. అ. పుం. తాఁబేలు.

గూఢాంఘ్రి. సం. వి. ఇ. పుం- కానరానికాళ్లు కలది-పాము.

గూఢోత్పన్నుఁడు. సం. వి. అ. పుం. ఒకనిభార్యయందు మఱొకనికిరహస్యముగాఁబుట్టినకొడుకు. (ఇట్లే: గూఢజుఁడు, మొ.)

గూఢోత్ముఁడు. సం. వి. న్. పుం. పరమాత్మ.

గూథము. సం. వి. అ. న. విష్ఠ, పురీషము.

గూద. వి. (సం. గుదమ్.క.గూదె) క్రిందికి దిగినగుదము. (బ్రా)

గూన. వి. నతభాండము, లోఁతుకుండ.

సీ...నతభాండసంజ్ఞ గూన యనఁ బరఁగు. ఆం భా. ౨. ౨౮౭.

చ...ఓపుగతి గూనల నూనియ నించి ... ఆము. ౧. ౮౩.

గూనివాఁడు. వి. (√గూను) గూను గలవాఁడు.

గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జు...భార. అను. ౫. ౧౦౪.

గీ...గూనివాఁ డనంగఁ, బరఁగుఁ గుబ్జుండు... ఆం. భా. ౨. ౧౨౧.

గూను. వి. దే. (క. తు. గూను.త.మ. కూన్)వీపుమీఁద వంపుగా నున్నభాగము.

సీ. దురితాత్మురాలు మంథర సహింపఁగ లేక గునుకుపర్వున గూను గునియ నేఁగి.దశా. ౮.౩.

సీ. బొక్కిబొమ్ములు లోఁతుపొట్టలు మిడిగ్రుడ్లు గూనివీపులు నిడుఁగ్రొంకి వ్రేళ్లు. ఉ. హరి. ౨. ౧౨౨. కాశీ. ౩. ౧౩౮. ఆం. భా. ౨. ౧౨౪.

జ: గూనివాఁడు, గూనుగిలు, గూనువోవు.

**గూనుఁడు.** సం. విణ. (అ. ఆ.అ) విష్మించినవాఁడు.

**గూనుగిలు(ల్లు).** అ. క్రి. (√గూను) వంగు.

గీ. అతివ దిరుగుఁ బ్రదక్షిణం బభవుగుడికిఁ, గుచ భరంబున నరగౌను గూనుగిలఁగ. శివరా. ౨. ౨౧.

ద్వి...తత్కంధరమున, గూనుగిల్లఁగ నెత్తుకోలు గుం డొకటి,గట్టి...నవనాథ. ౫. ౨౩౯పా. ౨పం.

వ... చరణఘట్టనంబున ... కపటకిటిజరఠకమఠ భుజగపరివృఢులు గూనుగిల్లఁబడన్ ...కాశీ. ౬. ౧౭౫. (ఇట 'పడు' స్వార్థమున.)

**గూనువోవు.** అ. క్రి. (గూను+పోవు) గూను కలది యగు.

సీ. అనిశంబు వీఁడు వాఁ డనక యెక్కఁగ వేల్పు టేనుఁగునకు వీపు గూనువోయె. వరాహ. ౧౦. ౧౫.

**గూబ[1].** వి. (సం. ఘూకః. క. గూబె.) ౧. గ్రుడ్లగూబ.

క. ఎఱసంజ దాసనంబుల, తెఱఁ గయ్యెను గూబ లెల్లదెసలఁ జెలంగెన్,వఱదు లఱచె నుల్కలు వడె, నెతి చెడి సురగాలి విసరె నిలువక పెలుచన్. ఉ. హరి. ౨. ౨౪.

సీ. చీకటితప్పు సేసినసరోరుహనేత్ర, గూబ యై వసియించుఁ గోటరమున. కాశీ. ౨. ౭౦.

సీ. ఇరుగింటిదయ్యంబు పొరుగింటికిని గూబ యెదురింటివారల కెదురుచుక్క. శుక. ౩. ౨౦. (ఇట గూబవలె అశుభదాయకురా లని భావము.)

గూబజంకెన = గూబబెదరింపువంటి బెదరింపు, వ్యర్థమైనబెదరింపు.

ద్వి. కటకటా వెఱచునె కాలకాశికుఁడు, కుటిల విచార నీగూబజంకెనల. ద్వి. హరిశ్చ. ఉ. ౭౬౭ పం.

**గూబ[2].** వి. కర్ణమూలము.

ఆ...అతనిచెవులు గూబ లంటఁ బెఱికి. రామా. ౭. ౧౪౭. ఆం. భా. ౨. ౧౪౪.

**గూబతెడ.** వి. మహాబలకీ. (దీనిపువ్వులు పసుపుపచ్చగా నుండును-బ్రౌ)

గీ... గూబతెడ నులితడ, యన మహాబల దనరు వృషాధిరూఢ. ఆం. భా. ౨. ౫౬.

**గూబరి.** వి. మాదిగవాఁడు.

సీ...ఆసాది గోసంగి మాదిగ గూబరి యన, మాతంగుఁ డగు...ఆం. భా. ౨. ౨౭౯.

**గూబు.** వి. అశ్వవిశేషము.

గీ. ఘోటకవిశేష మెసఁగును గూబు నాఁగ ... ఆం. భా. ౨. ౧౯౬. (ప్రమాణాంతరము లేదు.)

**గూరణము.** సం=గురణము.

**గూర్జరము.** సం=గుర్జరము.

**గూర్దము.** సం. వి. అ. పుం. దాఁటు, దుముకు, గంతు. (విల్యమ్సు)

**గూవనాలు.** వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడి గ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు...గీ...ఆదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౮. ౨౦౨.

**గూవాకము.** సం=గువాకము.

**గూషణ.** సం. వి. ఆ. స్త్రీ. చంద్రకము, నెమిలిపురికన్ను.

**గూహనము.** సం. వి. అ. న.గోపనము,దాఁచుట.

# గృ

**గృంజనము.** సం. వి. అ. పుం. ౧. వెల్లుల్లికీ. ౨. మధుశిగ్రువు, కారుమునగ కీ. ౩. గంజాయి కీ. న.

విషదిగ్ధబాణముచేత చంపఁబడినమృగముయొక్క మాంసము.

గృండివము. సం=గృండీవము.

గృండీవము. సం. వి. అ. పుం. ఒకజాతినక్క.

గృత్సుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (కల్ప)

గృధువు. సం. విశ. (ఉ) అభిలషించువాఁడు. వి. ఉ. పుం. కాముఁడు, మన్మథుఁడు.

గృధ్నువు. సం. విశ. (ఉ) లోభి.

గృధ్యము. సం. విశ. (అ. ఆ. అ) కోరఁదగినది. వి. అ. న. ఇచ్ఛ, కోరిక.

గృధ్రము. సం. విశ. (అ. ఆ. అ) కోరిక గలది. వి. అ. పుం. గద్ద.

గృధ్రసీ. సం. వి. ఈ. స్త్రీ. ఊరుసంధియందు కలిగెడువాతరోగము.

గృధ్రాణి. సం. వి. ఈ. స్త్రీ. పొగాకు ?.

గృష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. తొలియీఁతఆవు. (ఇది జాతివాచకములతో సమసించునపుడు విశేషణమై 'తొలియీఁతది' అనునర్థమిచ్చుచు ఉత్తరపదముగా నుండును. ఉదా: గోగృష్టి=ఒకసారి ఈనిన ఆవు. వాశితాగృష్టి=ఒకసారి ఈనినఆఁడేనుఁగు.) ౨. ఒకబిడ్డను గన్నయాఁడుది. ౩. బదర, వారాహీకందము ?.

గృహకచ్ఛపము. సం. వి. అ. పుం-కచ్ఛపాకారముగ ఇంట నుండునది-సన్నెకల్లు.

గృహకర్త. సం. వి. ఋ. పుం. ధూసరవర్ణము గలచిన్నపిచ్చుక.

గృహకారి. సం. వి. న్. పుం. ఒకజాతికణుఁదురీఁగ.

గృహగోధ. సం. వి. ఆ. స్త్రీ. ముసలి, బల్లి.

గృహగోధిక. సం=గృహగోధ.

గృహగోలిక. సం=గృహగోధ.

గృహచ్ఛిద్రము. సం. వి. అ. న. గృహకలహము. (విల్యమ్సు)

గృహదేవత. సం. వి. ఆ. స్త్రీ. ఇలువేల్పు.

గృహద్రుమము. సం. వి. అ. పుం. మేషశృంగి ?. (వాచ)

గృహనాశనము. సం. వి. అ. పుం. అడవిపావురాయి. (ఇది యింట ప్రవేశించిన అశుభము కలుగును)

గృహనీడము. సం. వి. అ. పుం-ఇంటిలో గూఁడు కట్టుకొనునది-పిచ్చిక.

గృహపతి. సం. వి. ఇ. పుం. ౧. మంత్రి. (మే. ని.) ౨. ఎల్లప్పుడును అన్నాది దానములను చేయుగృహస్థుఁడు. (అమరసుధ.) ౩. యజమానుఁడు. ౪. సత్రయాగముచేయువారలలో ప్రధానుఁడు. ౫. అగ్నిహోత్రభేదము, గార్హపత్యము. ౬. కృషీవలుఁడు. ౭. గూఢచారుఁడు. విశ. (ఇ. ఇ, తీ. ఇ) గృహమునకు అధిపతి. (కే. ని.)

గృహప్రవేశము. సం. వి. అ. పుం. గృహమున ప్రవేశించునపుడు చేయుకర్మవిశేషము.

గృహబలి. సం. వి. ఇ. పుం. కాకాదులకు వేయు బలి.

గృహబలిప్రియము. సం. వి. అ. పుం. ౧. బకము, కొంగ. ౨. కాకి. ౩. పిచ్చిక.

గృహబలిభుక్కు. సం. వి. జ్. పుం=గృహబలిప్రియము.

గృహభూమి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ఇల్లుకట్టుకొనుటకు ఏర్పడినభూమి, వాస్తువు. (హలా. ని)

గృహమణి. సం. వి. ఇ. స్త్రీ- ఇంటికి మణివంటిది-దీపము, దివ్వె. (వాచ)

గృహమాచిక. సం. వి. ఆ. స్త్రీ. జతుక, అజినపత్త్ర, గబ్బిలము. (త్రి. ని)

**గృహము.** సం. వి. అ.న.౧.ఇల్లు, ఉనికిపట్టు. ౨. గృహిణి,పెండ్లాము.౩. పేరు.(కల్ప) ౪.గార్హస్థ్యము, గృహస్థాశ్రమము. ౫. (జ్యోతి) రాశి; లగ్న చతుర్థరాశి. ౬. ఔపాసనాగ్ని. ౭. శైలేయము, శిలాజిత్తు. పుం. బ. ౧. భార్య. ౨. ఇల్లు. (కే. ని)

**గృహమృగము.** సం. వి.అ.పుం.శ్వానము,కుక్క. (కల్ప)

**గృహమేధి.** సం. వి.న్. పుం. గృహస్థుఁడు.

**గృహమేధిని.** సం. వి. ఈ. స్త్రీ. గేస్తురాలు.

**గృహయాయ్యుఁడు.** సం. వి. అ. పుం. గృహస్థుఁడు.

**గృహయాళువు.** సం. విశే. (ఉ) గ్రహీత, గ్రహించువాఁడు.

**గృహవాటి.** సం. వి. ఈ. స్త్రీ. గృహారామము, ఇంటితోఁ జేరినతోఁట, నిష్కుటము.

**గృహస్థు.** సం=గృహస్థుఁడు. (ఇది 'వృద్ధు' వంటిది)

**గృహస్థుఁడు.** సం.వి. అ. పుం.సాంగ వేదాధ్యయనమునలిపి గురువనుమతి గొని భార్యను పరిగ్రహించి ధర్మార్థకామముల నడపుచు వేదపాఠము వైశ్వదేవాదిహోమము అతిథిపూజ పితృతర్పణము భూతబలియు ననెడిపంచయజ్ఞములను చేయుచు ప్రవర్తించువాఁడు, రెండవయాశ్రమము నాశ్రయించినవాఁడు.

**గృహస్థూణము.** సం. వి. అ. న. నిట్రాడు, ఇంటిని డిమికంబము.

**గృహాగతుఁడు.** సం. వి. అ. పుం- ఇంటికి వచ్చిన వాఁడు-అతిథి.

**గృహామ్లము.** సం. వి. అ. న. కాంజికము, కలి.

**గృహావగ్రహణి.** సం. వి. ఈ. స్త్రీ. దేహళి,గడప.

**గృహాశయ.** సం. వి. ఆ. స్త్రీ. తాంబూలి, తములపాకుతీఁగ.

**గృహాశ్మము.** సం. వి. న్. పుం. సన్నెకల్లు.

**గృహాశ్రమము.** సం. వి. అ. పుం. గృహస్థాశ్రమము.

**గృహాళిక.** సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

**గృహి.** సం. వి. న్. పుం.గృహస్థుఁడు.

**గృహిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఇల్లాలు, భార్య. ౨. కణుఁదుతీఁగ. ౩. కలి,కాంజికము. ౪. దేహళి,గడప. (వై. ని)

**గృహీతము.** సం. విశే. (అ. ఆ. అ)- గ్రహింపఁబడినది-౧. పట్టుకొనఁబడినది. ౨. స్వీకరింపఁబడినది, తీసికొనఁబడినది. ౩. తెలిసికొనఁబడినది. ౪. ఒప్పుకొనఁబడినది. ౫. ధరింపఁబడినది. వి. అ.న. గ్రహించుట.

**గృహీతి.** సం. విశే. (న్.నీ.న్) గ్రహించువాఁడు. వి. ఇ. స్త్రీ. గ్రహించుసామర్థ్యము గలబుద్ధి.
శ్లో. ఊహాపోహక్షమా చార్వీ గృహీతిర్గ్రహణక్షమా. (అమరపదపారిజాతము. శ. ర)

**గృహ్ణత్.** సం. శత్రం. గ్రహించుచున్న.

**గృహ్ణానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గ్రహించుచున్నవాఁడు.

**గృహ్యా.** సం. వి. ఆ. స్త్రీ. పట్టనమునకు చేరువనున్న పల్లె, శాఖానగరము, పేఁట. (హేమ. ని.) విశే. ఆ. స్త్రీ. వెలుపల నుండునది. (సేన, మొ.)
ఉదా: గ్రామగృహ్యా సేన.

**గృహ్యకము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ఇంట నుండునది, పెంపుడైనది. (పక్షిమృగాది) ౨. పరాధీనము.

**గృహ్యమాణము.** సం. విశే. ( అ. ఆ. అ. ) గ్రహింపఁబడుచున్నది.

**గృహ్యము.** సం. విశే. (అ.ఆ. అ)- గ్రహింపఁ దగినది-౧. పట్టుకొనఁ దగినది. ౨. స్వీకరింపఁ దగినది, తీసికొనఁ దగినది. ౩. తెలిసికొనఁ దగినది. ౪.

ఒప్పుకొనఁ దగినది. ౫. ధరింపఁ దగినది. ౬. గృహాసక్తము, పెంపుడైనది. (పక్షిమృగాది) ౭. ఇంట నుండునది. (పదార్థము) ౮. అధీనము, ఆయత్తము. వి. అ. పుం. ౧. పెంపుడుమృగము లోనగునది. ౨. ఇంటియందలి అగ్నిహోత్రము. న. ౧. స్మార్తకర్మబోధకమగు గ్రంథము. ౨. గుదము.

## గె

**గెంటరి.** విణ. (గెంటు+అరి) వీరుఁడు.

రగడ. నెఱబిరుదుశూరులును నెనకెనయుగెంటరులు...పి. శకుం. ౩. ౨౨౫.

**గెంటసము.** వి. ౧. స్ఖలితోక్తి.

గీ. ఒప్ప గెంటస మన స్ఖలితోక్తిసంజ్ఞ. ఆం.భా. ౧. ౧౧౭.

౨. పరుషవచనము, నిష్ఠురోక్తి.

క. ...నన్నుఁ జన నీకున్నన్, జనవర నీమీఁద నభో,జన ముండుదు ననుచు గెంటసము లాడుటయున్. భోజరా. ౬. ౩౩౦.

గీ. అనుచు ననవింటి పెనుదంట నాడ రాని,గెంటసము లాడి...వసు. ౪. ౪౪.

ఉ. ...నా,వెంటనె రమ్ము నమ్ము మిది వేయివిధంబుల మేలు గల్గు ని,ష్కంటక మైననాపలుకుఁ గైకొన వేని హితంబు గూడ దీ,గెంటస మేల మీఁద బలుకీడు సుమీ వివరించి చూడఁగన్.కంచిశరభయ్య. హరిశ్చ.౩.౨౪౭.(బ్రౌ)

విణ. తీక్ష్ణము, వాఁడి.

సీ. పరఁగించు నప్పటప్పటికిని గద్దెపై గెంటసంబైన క్రేఁగంటిచూపు. వైజ. ౧. ౧౧౮.

**గెంటించు.** స. క్రి. (√గెంటు)౧. చలింపఁజేయు, కదల్చు.

వ. ఇవ్విధంబునఁ బ్రతిఘటించి గెంటింప రాని మగంటిమిం బెచ్చుపెరిఁగి ... కాశీ. ౪. ౨౨౧.

౨. తొలఁగించు.

క. ...ప్రభు వై, యంటకు నార్తులయాపద, గెంటింపఁగ ఫలము గాదె కీర్తి మృగాక్షీ.భాగ. ౮. ౨౩౩.

మహాస్రగ్ధర...జిలుజిలన్ ద్రిప్పి వైచెన్ గదన్ వై, చినఁ దేజిన్ రాజు గెంటించెఁ దొలఁగ నది యచ్చెంతకాంతార మేర్చెన్. మనుచ. ౪. ౯౯.

౩. పాడుచేయు, నాశనము చేయు.

శా. ...ఖాండవప్రస్థ మే,నుంటం జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయు లై మత్పురిన్, గెంటింపం జను దేరఁ బోలుదుర పోనీ తేరు వేగంబునన్. భాగ. ౧౦. ఉ. ౮౮౭.

శ్లో. అహ చాహమిహాయాత ఆర్యమిత్రాభిసంగతః,రాజన్యాశ్చైద్యపక్షీయా నూనం హన్యుః పురీం మమ. సం. భాగ. ౧౦. ౭౭. ౮.

౪. కొట్టు.

క. కంటకులు నృపులు నూడఁగ,మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్, గెంటించి మనము వాలుం,గంటిం జేకొంటి మఱనికరుణన కాదే. భాగ. ౧. ౩౪౯.

**గెంటు.** అ. క్రి. (క. గెంటు) ౧. చలించు, కదలు; తొలఁగు.

మ. ధరణీమండల మమ్మహాంబునిధిమీఁద న్నిల్పి నల్దిక్కులన్,ధరణీధ్రంబులు గెంటకుండ నిడి యాధారంబుగాఁ గచ్ఛపేశ్వర శేషాహులఁ గ్రిందఁ బూన్చి...వి. పు. ౧. ౭౦.

ఉ. గెంటనిప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బాలొసంగి వా,ల్గంటి గిలుక్కునం దిసగ... విజ. వి. ౨. ౧౩౪.

గీ. అవని యెల్లను నలువదియాఱువేలు,వత్సరంబులు నూత్నయౌవనము దనకు, గెంటి పోకుం

డఁ బాలించెఁ గీర్తి వెలయ ... వి. పు. ౬. ౧౪౭.

చ... కుంతలుం,డు నిజపురోధ గాలవుఁ గనుంగొ ని రాజ్యమునీఁదికోర్కి గెం,టినది నిజంబు గాఁ దనువునీడకు మూర్ధము గానరాదు... జై. భా. ౮. ౯౬.

౨. చెడు, భగ్నమగు.

మత్తకోకిల. వెంటవచ్చిన నీవు నాపయివేడ్కఁ జిక్కి తపఃక్రియల్, గెంటఁజేయ నెఱుంగ కుండినఁ గీడు వాసవుచేత... కళా. 3. ౨౩౭.

3. తప్పిపోవు; తప్పు.

క. అంటలుగట్టుచు నొకటియు, గెంటక తల బో డి గాఁగఁ గేశము లూడన్ . వరాహ. ౧౨. ౧౪.

మ... భవత్కుమారి పదివే ల్వర్షాలు జీవించు గెం, టక పద్మాల్గవయేటఁ జెందుఁ బతిగండం బం చు వాచించినన్. చంద్రా. 3. ౧౪.

సీ. వనిత నీముఖకాంతి కెన యెందు లే దని గెం టక ద్విజరాజు నంట వచ్చు. సారంగ. ౨. ౨౦౪.

౪. వెనుదీయు, సంకోచించు.

ద్వి. దంటమాటలు గొన్ని తడవాటు వన్ని, గెంట క నోరార్చి గెల్వఁ జూచెదవు. ద్వి. హరిశ్చ. పూ. 300 పం.

స. క్రి. నెట్టు, త్రోయు; (అప్పు, మొ.) తీర్చు.

గీ. మేటిరేద్రిమ్మరుల గెంటుపోటుబంటు. ఉ. రా. ౧. ౮౦. ('జయించు' అని భావము.)

ద్వి. గెంటక యీయప్పు గెంటి యీతులువ, బం టుగా నేలక పాయదు కోప,ము... ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౭౭ పం.

౨. (అస్త్రము, మొ.) ప్రయోగించు.

చ. అరదం బొండొక పెక్కి విల్లు గొని పంచాస్త్రంబులం గెంటి భాస్కరపాత్రుం దెర లించి చాప మలుకన్ ఖండించి ... జై. భా. ౫. ౧౧.

వి. చలనము, కదలిక.

ఆ. పడఁతి కలదె జాతి ప్రతిమకుఁ జక్కిలి, గింక నాదుధృతికి గెంటు లేదు. కళా. 3. ౪౫.పాం డు. ౨. ౫౫.

జ: గెంటించు, గెంటుపడు.

గెంటుప(వ)డు. అ. క్రి. (గెంటు + పడు) పోవు; తప్పిపోవు.

గీ. జంట వదలక తిరుగునీవంటి చెలుల, వెంటఁ దిరిగెడిభాగ్యంబు గుంటువడియె, గెంటుపడఁ జూడుఁ డింకఁ దొల్లింటి నెయ్య,మింటి కేఁ గుడు మీరు వాల్గంటులార. చంద్రా. ౪. ౧౬౯.

క... పవనజుఁడుగదాహతి నొకఁడున్, గెంటువ డకుండఁ బీమఁగుఁ, బెంటలు గావించె దివిజ బృందము వొగడన్. జై. భా. 3. ౧౦౫.

గెంటెము. వి. జంటనేతవస్త్రము, రెంటెము.

సీ... హొంబట్టుజిలుఁగుగెంటెంబుతోడ. మను చ. ౬. ౧౦౨.

సీ. పులితోలురెంటెంబు వెలిపట్టుగెంటెంబు కటి మండలంబున గరిమఁ దనర. రుక్మా. ౧. ౨౯.

విణ - రెట్టి అయినది - అధికము.

శా... మదిన్, గెంటెంపుంజల ముప్పతిల్ల... మను చ. ౫. ౧౪.

గెండె = గండె. వి. (సం. గండకః.) మత్స్యవిశేషము.

సీ... గెండె యం చనఁగను గండకంబు. ఆం.భా. ౧. ౧౫౯.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకల కిచ్చె ... గెండెల బలుదుండగీల కిచ్చె. ద్వా. ౧. ౨౪౦. హంస. ౪. ౧౮౭.

గెగ్గలు. వి. గేలి, పరిహాసము. (అప్ర.శ.ర.-'గెగ్గిలి' ప్రా)

గెచ్చె. వి. మత్స్యవిశేషము. (ప్రా)

గీ. పుల్లరుజు గెచ్చె గెండెయు బొమ్మడాయ.హం
స. ౪. ౧౫౭. (గజ్జె. ముద్రి)

**గెడ[1]**. వి. ౧. కడ, సమీపము; పార్శ్వము.

ఉ. ఆడెదునమ్మిఁ గన్గొనకుమమ్మ... తేఁటిగెడ నా
లతి నేయకుమమ్మ ... కు. సం. ౫. ౬౧౦.

క. విను ప్రద్యుమ్నాదిభవ,త్తనయులగెడ నైన నే
కతంబున నేకా,సనమున నుండుట దూష్యం,
బని యెఱుఁగుము...భార. ఆర. ౫. ౩౨౦.

౨. జత. (చూ. గెడకత్తియ, మొ.)

సీ. వత్షస్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావుగెడ
లవాగెలు ధరించి, నొగలపై హరి యొప్ప...
భార. ఉద్యో. ౪. ౧౨౫.

క. కడు వేడ్కలతోడ నీకుం, గొడు కయ్యెడునం
తకంటెఁ గోర్కియుఁ గలదే, జడుఁ డనక
నన్నుఁ గైకొని, గెడనేయుము నన్నుఁ గార్తి
కేయునితోడన్. ఉ. హరి. ౫. ౧౩. (చి. ని,
శ. ర. పా.)

౩. పోలిక, పగిది. (ఉపమావాచకము)

క. దొరయు గెడ జోడు పోలిక,సరి సంగడి యు
ద్దియాడు సాటి పగిది నాఁ,గరణి యనఁ జా
డ్పు చందం,బొరను పరుసు నాఁగ నుపమ
కొప్పన్ జెప్పన్. కావ్యా. ౫. ౧౬.

జ: గెడకత్తియ, గెడగూడు.

**గెడ[2]**. వి. వేఁటకుఁ దగినసాధనవిశేషము.

క. పడదోల్లను ముప్పిల్లను, నడిదంబులు వెడఁద
వాతియలుఁగులు పాదులున్, దడవిండ్లుఁ బం
దిగోల్లను,గెడలున్ ధరియించి భటులు కెలఁ
కులఁ గొల్వన్. భల్లా. ౩ ఆ. (శ. ర.)

**గెడకత్తియ**. వి. (గెడ[1] + కత్తియ) చెలికత్తె,
జతకత్తె.

చ. మెలపొదవించి తీవలకు మేనుల... పెక్కురే,
ఖలుఁ దమతోడ నామగెడకత్తియ కాఁ గయి
సేసి రామనిన్. కు. సం. ౯. ౩౦౭.

**గెడగూడు**. అ. క్రి. (గెడ[1] + కూడు) జతగూడు,
జతయగు; రతియందు కలియు.

క...పాపపుఁ, బోడ వగునిది గాదె యిశేనిఁ బొ
డవడఁగించెన్, గెడగూడ దీని నీతని, యొడ
లిపయిం బెట్టి కాల్చు టుచితం బరయన్.భా
ర. విరా. ౩. ౧౨.

క. మిన్నుదలఁ బాఱె. ఖగపతి, యన్నదియును
బాఱెఁ దొడఁగె నవని యద్రువ నే,మున్నో
తా మున్నో యని, పన్నిదమునకు గెడగూడి
పాటినభంగిన్. భోజరా. ౭. ౪౨.

గీ. ఉష్ణశీతాన్నకబళము లొక్కఁడు నూపఁ,బవలొ
రాత్రియొ గెడగూడ నవసర మని,దాని కుత్త
రమొకలతాతన్వి యిచ్చె, నధరబింబంబు వి
డిచి సంధ్యాగమ మని. నైష. ౬. ౧౩౭.

**గెదుము**=గదుము.

మ...మృత్యువున్, గెదుమంగాఁ గలబాహువి
క్రముఁడు సుగ్రీవుండు సామాన్యుఁడే. సీ
తావి. ౧. ౧౦౩.

**గెనయు**. అ. క్రి. వర్ధిల్లు.

చ...ఆపృథుండు దా,జననము నొందు పెట్టులు
రసాసతి ధేనువుఁ జేసి లోకముల్,గెనయఁగ
నేల పాలు పిదికన్ వినిపింపుము నాకు నేర్ప
డన్. వి. పు. ౨. ౯౫.

**గెనుసు**. (చి. ని, బ్రౌ-గెనసు.శ. ర) వి.(క.గెణసు)
ఒకానొకదుంప.

గీ. తనునుమధ్యమ గెనును చందనసుగంధి, పనస
కాయ సునాస రంభాశలాటు,బిసరుహేక్షణ
పెసరుఁబ ప్పుసదృశాంగి,పసిమిఁ గందనివంకా
య బంతి కిడియె. బహు. ౪. ౧౫. హంస. ౪.
౧౩౧.

**గెబ్బు**. స. క్రి. ౧. గెంటు. (బ్రౌ)

గీ. బొబ్బ మెకమును నీరింకుమబ్బునుబ్బు, గెబ్బు
సంతతవిజయ బేగీయమాన, మసుముఁ జాళుక్య

నారాయణాంశుఁ డైన, బుక్కరాజేంద్రురా
మభూభుజునియశము. రామ. ౨౧౩.

గీ. మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి, మెఱపు
నొఱపుఁ బఱపుఁ దెలవమేను. విజ. వి. ౧.
౮౪.

౨. చంపు.

గీ. వానకందువ మలలపై వ్రాలుమొగులు, చాలు న
రికట్టఁ జాల్చెంచుజవ్వనులకు, నిబ్బరపుఁదూ
పు తడవింటఁ బ్రబ్బఁజేసి, మబ్బుపైఁ బాఱు
మెకముల గెబ్బు బెంత. ఉ. రా. ౭. ౩౯౧.

సీ. అలమబ్బు వెలిఁ ద్రొబ్బుపాలగబ్బు గలయుబ్బు
తలబెబ్బులుల గెబ్బుఁ దరల కొకఁడు, పెను
వంకలను డొంకలను బంక మనుశంకఁ జనుజిం
క మను వింకఁ జదుపు నొకఁడు. చంద్రా. ౨.
౮౮.

వి. (సం. గర్వః. ప్రా. గవ్వో. పా. గబ్బో) గర్వ
ము.

సీ...గరువము పొగరు కావరము గెబ్బు. గీ. త్రు
ళ్లు క్రొవ్వు తిమురు త్రుక్కు మల్లరమ్ము, పోత
రం బేపు నా గర్వ మొప్పచుండు. ఆం. భా.
౧. ౧౩౩.

గెఱ. వి. (శ. ర-క. గెఱ. తు. గెరె) రేఖ. ('కెఱ'
అని పరుషాదిగా. అప్పకవి. ౨. ౧౯౬.)

సీ. గెఱ వ్రాసి మాయ నంగీకరించినభంగి వసనంబు
గట్టక వచ్చువాఁడు. భాగ. ౧. ౫౧౭.

(కోడిపందెమువర్ణన) చ. చొరఁబడి కాంచి ప్రాఁ
తలను జుట్టియుఁ గత్తులు వేసి సందిటం, బెర
యఁగఁ బట్టి చెక్కు గఱపించి గ ఱేర్పడ
గీఁచి...సల్లిరి మటి పో యటంచును ఖుళీఘళిఁ
బుంజులు దన్నులాడఁగన్. హంస. ౩. ౨౧౭.

గెఱకట్టు=ఏర్పడినమండలరేఖ కలది యగు.

(కుచవర్ణనము) సీ. గెఱకట్టి కపుకు లై కరలి పోఁ
కంత లై వింత లై చెంతల విరివిఁ జెంది. నరస.
౫. ౧౧౩.

సీ. గెఱకట్టుకొని బిట్టు నెటఁ జూపుచనులతోఁ
గడు సన్నగిలు చున్న కౌనుతోడ. రాధికా.
౧. ౯.

గెల=గొల. వి. (త. కులై) పండ్లయొక్కయు పూవు
లయొక్కయు గొల.

సీ. గెలలతీవియలమాడ్కి నిడి వ్రాసినపైఠాణివలి
పంపుఁబాగఁ జుట్టి. చంద్రా. ౨. ౬౮. (చి.
ని. పా)

ఉ...గెల ల్సుగంధికదళీవనపంక్తుల నొప్పు నప్పు
రిన్. ఆము. ౧. ౬౯.

గెలిపి(ల్పి)ంచే. స. క్రి. ( √ గెలుచే ) గెలువ
జేయు.

(జయింపఁజేయు.)

క...తత్కారము న,వ్వి నిజంబుగ గెలిపించెద,ని
ను నెఱవకు మనియె...శుక. ౩. ౪౨.

ఉ...మదుక్తి తెఱంగు నేఁడు గె,ల్పించితివి...
ప్రభా. ౩. ౫౬.

గెలివి=గెలివిడి. వి. (త. కెలిప్పు) సంతోషము.

మ... ప్రియునిం గూర్ప న్మరుం డెంతయున్,
గెలివిం దానికిఁ బెండ్లివీడియము సాగింప న్న
దిం జూచెనో...చంద్రా. ౪. ౧౫౪.

క...వనితా యేమందు దానివగలో త్రుళ్లో,చెఱు
కో తెలివో గెలివో, విను వెన్నకుఁ బండ్లు వ
చ్చువిత మాయెఁ గదే. రాధికా. ౩. ౧౭.

గెలివిడి=గెలివి. వి. ఉల్లాసము, సంతోషము. (చి.
ని, ౬. ౪)

గెలివివాఁడు. విణ. (√ గెలివి.) రవణుఁడు, గోల
చేయువాఁడు.

సీ...గెలివివాఁ డనఁగను జెలఁగు రవణుఁడు...
ఆం. భా. ౩. ౧౨.

గెలుచే(ల్చే). స. క్రి. (క. గెల్. త. కెలి.)౧.జ
యించు; నిగ్రహించు.

గీ. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప,నీవు దక్క

నిం దొక్కరు నీవ యరసి, చెప్పుమా కలఁ డేని రక్షింపు మమ్ముఁ, బూని పట్టంబు దాల్పుము పొడిచి గెలుము. భార. ఉద్యో. ४. ౧౪౬.

మ...మాధవుఁ డమ్మగాఁ బురము లక్ష్మీకైక దోశ్శక్తి గెల్చినజో దీశ్వరుఁడు...నైష. ౧. ౨.

గీ. వాద మొనరించి గెలిచి...ఆము. ౨. ౭౫.

ఉ...వసంతకంతులకై, జక్కఁదనంబునం గెలువఁ జాలెడువాఁడు...మనుచ. ౨. ౩౫. (ఇట ఔపమ్యవాచకము.)

క. రోషము గెలిచినజనుఁడు వి, శేషస్థితి దివిజపదముఁ జేరుకై...జాహ్నవీ. ౩. ౭౭.

౨. కడపు, పుచ్చు.

క. కంకుఁ డయి ధర్మజుఁడు వల, లాంకుం డై వాయుజుఁడు బృహన్నల యై ని, శ్శంకుఁడు పార్థుఁడు హయగో, కింకరు లై కవలుఁ దొల్లి గెలుపరె దినముల్. భోజరా. ౭. ౨౦౭. (శ. ర. పా.)

అ. క్రి. ౧. జయమును పొందు, సర్వోత్కర్షమున పరిల్లు.

మ. వినవచ్చెకై వినువీథిదిక్కున సుధీవేద్యంబులై యింద్రవాహన వర్ధిల్లు పురంజయా మనుకథుత్థాన గెల్వు మన్వాక్యముల్. కవి. ४. ౩౫.

౨. పోవు, వెల్లు.

(సీత) గీ...జడలో నిరత్న మింద మనుచు, నిచ్చి తెలతెలవాఱఁగ వచ్చె గెలువు, మనిలజా యంచు దీవించి యనుపుటయును. రామా. ౬. ౧౮౭.

జ: గెలిపించు, గెలుపు, గెలుపుఁగంబము, గెలుపుకాఁడు, గెలుపుకొను, గెలువడి, గెలువము, గెల్పరి.

**గెలుపు(ల్పు).** వి. (√ గెలుచే) జయము.

గీ. ...జయము, గెల్పు గెలువడి గెలువము గెలుపనఁ దగు...ఆం. భా. ౨. ౨౨౩.

క. తోడు దొన లేనియప్పటి, క్రీడికొలఁది యట్టి దధిప కినియక విను మేఁ, దోడై రా నెదురట గదుఁ, గీడు వలవ దుడుగవయ్య గెలు పరిది సుమీ. భార. ఉద్యో. ౩. ౩౪౦.

గెలుపుపేరవజీరు=విజయుఁడు, అర్జునుఁడు.

సీ. గెలుపుపేరవజీరుఁ గినిసినకప్పమైదువరాచసెంచు మాదొడ్డివేల్పు. ప్రబంధ. ౧౬౦.

గెలుపులచ్చి=జయలక్ష్మి. ప్రబంధ. ౧४౨.

గెలుపోటములు = జయాపజయములు. పి. శకుం. ౧. ౧౬४.

**గెలుపుఁగంబము.** వి. (గెలుపు+కంబము.) జయస్తంభము.

వ...గుండ్రాజు దుండగపురాచతండంబులఁ జెండి మండలగ్రావంబుకెలంకుల గెలుపుఁగంబములు నిలిపె...వరాహ. ౧. ౨౦.

**గెలుపుకాఁడు.** విణ. (గెలుపు+కాఁడు) జేత, జయించువాఁడు.

ఆ. పగ యడంగె నంచు మిగుల డెందములోన, నలరి వేల్పురాచగెలుపుకాఁడు, దీవి కేఁగి గెలుపు తెఱఁ గెల్లఁ దండ్రికిఁ, దెలియఁ జెప్పి యెలమి నెలయఁజేసె. అచ్చ. రా. యు. ౧౫౨.

(వేల్పురాచగెల్పుకాఁడు=ఇంద్రజిత్తు)

**గెలుపుకొను.** స. క్రి. (గెలుపు+కొను) గెలుచు, జయించు.

చ. కలువల గండుమీలఁ దొలుకారుమెఱుంగుల నిండువెన్నెలకై, వలపులరాజుతూపులగు వారిరుహంబుల నొక్కయెత్తునకై, గెలుపుకొనంగఁ జాలుమృగనేత్రయపాంగనిరీక్షణమ్యుతుల్...విక్ర. ౬. ౨౬.

**గెలువడి.** వి. (గెలుచు+వడి-త. కలిప్పు.) జయము, గెలుపు.

గీ...జయము, గెల్పు గెలువడి గెలువము గెలుపనఁ దగు...ఆం. భా. ౨. ౨౨౩.

**గెలువము.** వి. (√గెలుచే) గెలుపు.

క. తలఁకిరి తల లూఁచిరి... ఈ,నిలుకడ్డయీ తా లిమి యీ,గెలువం బీబుద్ధి యేరికిం గల దను చుకా. కకు. ౧. ౧౫౭. ఆం. భా. ౨. ౨౨౩.

**గెల్వరి.** విణ. (గెల్వ+అరి) గెల్చువాఁడు.

సీ. భక్తుండు గెల్వరి పరమేశుఁ డోటరి యనుట కు శ్వేతవాహనుఁడుసాక్షి. చెన్న. ౨. ౧౩౮.

(బ్రా. పా-గెల్వరి. ముద్రి.)

**గెల్లి.** వి. ఉప్పుకుప్ప. (బ్రా, శ. ర.)

**గెల్లు.** వి. కలకలధ్వని, గొల్లు.

సీ...కలకలధ్వని దోఁచు నలబలం బన హాళాహళి యనంగ,గొల్లన గొలకన గెల్లన రొద యన ...ఆం. భా. ౧. ౧౨౧.

జ: గెల్లుపడు.

**గెల్లుప(వ)డు.** అ. క్రి. (గెల్లు + పడు) బంకెవే యు.

క. వల్లియలు ద్రెంచుకొని బల,మెల్లం బెల్లగిలఁ జొచ్చి యెంతయు నలుకకా, గెల్లువడి సురభి హుంకృతి,మల్లడిగొనఁ బ్రజల మారిమసఁగఁ దొడంగెకా. పద్మ. ౭. ౨౩౮.

## గే

**గేందుకము.** సం=గేందుకము.

**గేందుకము.** సం. వి. అ. పుం. కందుకము, బంతి.

**గేడెకాళ్లవాఁడు.** విణ. కొంగకాళ్లవాఁడు, సన్న ముగాను పొడుగుగాను ఉండుకాళ్లు గలవాఁడు. (శ. ర-గేడికాళ్లవాఁడు. బ్రా)

**గేదఁగి.** వి. (సం. కేతకీ. క. గేదగి) ౧. మొగలిచె.

ఉ. కేరును కేతకిన్మొగలి గేదఁగి యంచను పేరులు ...ఆం. భా. ౨. ౭౯.

(చంద్రకిరణవర్ణనము) సీ. చదలుగేదఁగితూర్పు తుదకొమ్మ నరవిరి యై కానుపించుపూ రేకు ల నఁగ. పారి. ౨. ౩౭.

౨. పచ్చపువ్వుల మొగలిచె.

ద్వి. మోదుగు కలుజువ్వి మొగలి సంపెంగ,గేదం గియును నారికెడము వారిజము. ద్వి.శ. సా. ౨. ౭౯ పా. ౧౯ పం.

౩. మొగలిపూవు.

ఉ. భంగములై నగంబులు గుభాలునఁ ద్రెళ్లఁ గర ళ్లదాఁటుతో,నింగికిఁ బొంగువారిధి మునింగిన భూవలయంబు కన్నె గే, దంగితుద న్వసించిన మద ప్రదసౌరభనిశ్చలీభవ,ద్భృంగముఁబోలఁ గొమ్ముకొన నెత్తె మురారి వరాహరూప మై. వరాహ. ౭. ౧౬.

సీ. క్రేఁగంటిచూపున గెలగొన్న సన్న గేదంగి రే కుల కన్నదమ్ము లగుచు. ఉ. హరి. ౧. ౧౫౧. ఆము. ౪. ౧౧౪.

**గేదె(గేదియ—చి. ని).** వి. ౧. బఱ్ఱె, మహిషి.

గీ. పరఁగు నెనుపెంట్లు గేదెలు బఱ్ఱె లెనుము, లనఁగ మహిషీసమాఖ్యలు ధనదమిత్ర. ఆం. సం. తిర్య. ౧౦.

౨. పొట్టిబఱ్ఱె.

సీ. వామనమహిషి యై వరలు గేదె యనంగ ... ఆం. భా. ౨. ౨౬౪.

జ: గేదెచెలప, గేదెపడ్డ, గేదెపెయ్య.

**గేదెచెలప.** వి. (√ గేదె) మూఁడేండ్లయెనుపదూ డ. (బ్రా, శ. ర.)

**గేదెపడ్డ.** వి. (గేదె+ పడ్డ.) ఇంచుమించుగా నా లుగేండ్లఎనుపదూడ. (బ్రా.)

**గేదెపెయ్య.** వి. (√ గేదె.) ఇంచుమించుగా రెం డేండ్లఆఁడుగేదెదూడ. (బ్రా.)

**గేయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గాతవ్యము, పాడఁ దగినది. ౨. గాత,పాడునది. వి. అ. న. గా నము, పాట.

**గేలి.** వి. (సం. కేళీ. క. గేలి. త. కేలి.) అపహాసము, పరిహాసము.

క. ఈగేలి వెలార్చెద బా,హాగర్వము మెఱయ మిమ్ము నందఱను మహీ,భాగమునఁ గూల్చి... భార. శల్య. ౨.౧౦౦. (చూ. గా.)

గీ...పిడుగులకడిమి యెంత,యనుమ గేలిగ రచ్చల నాడుకొనుచు, నేచి పచరింతు రచ్చటిరాచవారు...యయా. ౧. ౧౪.

జ: గేలించు, గేలికొట్టు, గేలిగొను, గెలిపెట్టు, గేలిసేయు.

**గేలించే.** స. క్రి. ( √ గేలి ) గేలిచేయు, అపహసించు.

ద్వి. కృతశబ్దతంత్రధురీణుఁడై చంద్ర, శతముల గేలించుచాయఁగైనేసి ... పొలుపారుశేషుని భోగంబునందు. ద్వి. పరమ. ౧. ౧౫ పా. ౬ పం.

**గేలికొట్టు**=గేలిగొను.

ఉ...రాజుల గణింపక తిట్టుచు గేలికొట్టుచున్. పాంచా. ౨. ౫౨.

**గేలిగొను**=గేలికొట్టు. స. క్రి. పరిహసించు, పరిహాసముచేయు.

సీ... ఇంద్రుఁడు సనుదెంచి యేల యిచట, దుని యెద వనిన వమ్మను జాధిపతి తనకోర్కి సెప్పిన గేలిగొనుచుఁ జనియె ... భార. శల్య. ౨. ౨౧౫.

శ్లో. అపహస్య తతః శక్రో జగామ త్రిదివం పునః. సం. భార. శల్య. ౫౪. ౩.

సీ. కోకిలారవములు గోమలకిన్నరీగీతులు నొండొంటి గేలిగొనఁగ. హరి. ఉ. ౩. ౫౩.

(భార్గవవనవర్ణనము.) ద్వి. ఎలుకపిల్లలకుఁ జన్నిచ్చు పిల్లులును, గలిగి యన్యోన్యరాగములతో వైరములు మాని సురవనమును గేలిగొనుచు ...ద్వి. పరమ. ౨. ౫౩ పా. ౪ పం. (ఇట ఔపమ్యవాచకము)

**గేలిపెట్టు.** స. క్రి. (గేలి+పెట్టు.) పరిహసించు, వేళాకోళము చేయు.

చ...హాసముల్, సలిపిరి గేలిపెట్టుచును జంపె తులన్ వెలిపిండు వేసవన్.కవిక. ౪. ౯౧.

**గేలిసే(చే)యు**=గేలిగొను. (గేలి+చేయు.)

ద్వి. పా లెల్లఁ బెంట్రుకపైఁ బోయఁ దండ్రి, గేలిసేయుచు వచ్చికాలఁ దన్నుఁడును...బస.పు. ౨. ౪౧౭ పం.

చ. అనుదితసూర్యహోము లగుయజ్వలప్రజ్వలిదగ్నిదీప్తులో,ద్దనమరుసోమిదమ్ములమిథఃకషణోల్లసితస్తనంబులన్, దనరుచు గేలిచేసెఁ గడుఁ దత్సమయాత్తపరస్పరోపగూ,హనరసరంగదంగకరథాంగవతంగతతారుణమ్యతిన్. ప్రభా. ౫. ౯౯. ఆము. ౪. ౪౫.

ఇక్లే:- గేలియొనర్చు.

క. మైలైవచ్చిన మెత్తురు,కాలవశతఁ జేసి కీడు గదిరిన నతనిం, గేలియొనర్చుచుఁ జూతురు, నాలిసతులమాట లంతె నమ్మం గలదే. భోజరా. ౪. ౧౪.

**గేష్ణువు.** సం. విణ. (ఉ) ౧. పాడెడివాఁడు. ౨. నాట్యముచేయువాఁడు. (మే. ని.)

**గేస్తు, గేస్తుఁడు.** వి. (సం. గృహస్థః. క. గేస్త) ౧. గృహస్థుఁడు.

గీ. దినముఁ బోరిడు గాయకుఁ గనిన గేస్తు. దశా. ౨. ౬౨.

సీ...గృహస్థాభిధానం బిలుబోర గేస్తు నా... ఆం. భా. ౨. ౧౩౬.

సీ. కఱవు గేస్తులయిండ్లకప్పు నేఁతలయంద సుడివడి కలఁగుటల్ మఱుఁగులంద. అచ్చ. రా. బాల. ౪౩.

౨. యజ్వ, సోమయాజి.

క. కలువలదాయము నగ్గియు,నెలయును గేస్తుండుఁ జదలు నేలయు నీరున్, జలినట్టును రూపులుగాఁ, బొలుపొందెడువన్నెకాఁడ బూచులఱేఁడా. అచ్చ. రా. బాల. ౨౧౫.

గీ. మన్ను గేస్తుఁడు నగ్గియు మిన్ను నీరు,ప్రొద్దు
నెల గాడ్పు లెవ్వానిరూపు లయ్యె.నీలా. ౧.
౧౨.

3. భర్త.

సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లి గేస్తుఁడు
సిగఁ దాల్చుపువ్వు. రామ. ౩౫౧.

మ...పల్కుంబోటి గేస్తుండు...నీలా.౨.౧౧౯.

జ: గేస్తురాలు.

**గేస్తురాలు.** వి. (గేస్తు+ఆలు) ౧. ఇల్లాలు, మగ
నాలు, కులస్త్రీ.

మ...దర్పకజన్యంబున గేస్తురాల నయితిం బ్రా
వీణ్యహైన్యంబునన్. కువల. ౫. ౩౦.

గీ. అనఘచారిత్ర యెవ్వ రే మన నొకింత, కెరల
నిసుశీల సంపన్న గేస్తురాలు, అత్తరుణిఁ జూ
చి యపుడు నో రెత్తి పలికె. సారంగ.౩.౮౬.

౨. గృహిణి, భార్య.

గీ. తమ్ముఁడును గేస్తురాలును దాను నగరు, వెడలి
...అచ్చ. రా. అయో. ౮౨.

గీ. ఆలరు మెం డైననిండుఁబ్రాయంబుకలిమి, రస్తు
మీఱుచు నాతని గేస్తురాలు. శుక. ౨. ౧౦౦.

**గేహము.** సం. వి. అ. న. గృహము, ఇల్లు.

**గేహి.** సం. వి.న్. పుం. గహస్థు, గేస్తు.

**గేహిని.** సం. వి. ఈ. స్త్రీ. గృహిణి, ఇల్లాలు.

**గేహేక్ష్వేడి.** సం. విణ. (న్. నీ. న్)-ఇంట మాత్ర
మే గర్జించువాఁడు-పిఱికివాఁడు, పంద.

**గేహేదాహి.** సం. విణ. (న్. నీ. న్.)=గేహే
శూరుఁడు.

**గేహేనర్ది.** సం. విణ. (న్. నీ. న్)=గేహేక్ష్వేడి.

**గేహేమేహి.** సం. విణ.(న్. నీ. న్) -గృహమందే
మూత్రవిసర్జనము చేయువాఁడు - సోమరి, అల
సుఁడు.

**గేహేశూరుఁడు.** సం. విణ. (అ.ఆ.అ) -ఇంటనే
బింకము లాడువాఁడు-పంద,పిఱికివాఁడు. (విల్స
ము)

## గై

**గైత.** వి. కిరాత భేదము. (మిశ్రశ్రె)

సీ. వేసమన్నించెడ నీ వీకాన వెరఁజూము గైత నీ
వాజాడ గనఁగఁ జూపు. ప్రబంధ. ౧౯౩.

**గైరము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. కొండయం
దైనది. ౨. గిరిసంబంధ మైనది.

**గైరికము.** సం. వి. అ. పుం. న-కొండయందు పుట్టి
నది-పర్వతధాతువిశేషము,జేగుఱు. న. బంగారు.

**గైరికుఁడు.** సం. వి. అ. పుం. పర్వతీయుఁడు, కి
రాతుఁడు.

**గైరేయము.** సం. విణ. (అ. ఈ. అ.) కొండయం
దు పుట్టినది. వి. అ. న.౧. సిలాజిత్తు. ౨. జేగుఱు
రాయి.

## గొ

**గొంగ.** వి. పగతుఁడు, శత్రువు; సంహారకుఁడు.

సీ...వైరి. గీ. మనును...కంటనఁగ గొంగ యన
నూఁడుకాఁ డనంగ...ఆం. భా. ౨. ౧౫౫.

చ. కువలయపర్వ మబ్జములగొంగ చకోరమనోర
థంబు...నిశామణి తూర్పునఁ దోఁచె...భా.
రా. సుం. ౧౭౦.

మ ... వైరిమనుజేంద్రశ్రేణికిం గొంగ. నిర్వ.
౧. ౩౯.

**గొంగడి**=గొంగళి. (మహా. ఘోంగడె. క. గొంగ
డ) వి. కంబళి.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁ
టుచును జెలఁగి చప్పట లిడుచున్, బొంగు
చుఁ గృష్ణునిఁ బొగడుచు... భాగ. ౧౦ పూ.
౮౩౭.

ద్వి. భృంగకాంతుల జడిపించుపన్నియలు, గొంగ

డి ముసుఁగిడికొని యిల్లు వెడలి. ద్వి. పరమ. ౫. ౩౫౩ పా.

క. శాకపుసరకులుఁ బోఁకలు, నాకులు గొంగళ్లు ...ప్రియ మయ్యె శీతకాలమునందున్. వేం. పంచ. ౧. ౬౭౬. ఆం. భా. ౨. ౧౫౭.

౨. పక్షివిశేషము.

సీ. గొంగడి కక్కెర గొక్కెర గొరవంక...హం స. ౩. ౧౨.

జ: గొంగడిగాఁడు.

గొంగడిగాఁడు=గొంగడి. వి.(గొంగడి+కాఁడు-స్వార్థమున) పక్షివిశేషము.

వ. మఱియుఁ గైదు కక్కెర కారుకోడి లావుక వెలిచె నేలనెమిలి డాబ గొంగడిగాఁడు మొదలగుపక్షులు...చంద్రా. ౨. ౭౪.

గొంగళి=గొంగడి.

(కంబళి)

క. గొంగళి ముసుంగుతో నయ,సంగతి నిలు వెడలి పౌరజనవర్తన లెల్లం గనుఁగొనుచును... పరమ. ౪. ౬.

గొంగళిపురుగు. వి. (గొంగళి+ పురుగు) కంబళి పురుగు. (శ. ర, వా.)

గొంజె. వి. గొడ్డుటావు, వంజ.

గీ. గొడ్డన వంజ నా గొంజ నా వంధ్య యనా... ఆం. భా. ౨. ౨౬౩.

గొంజి. వి. ఒకానొక ఫలవృక్షము.

గీ. కొమ్మిపం డ్లీఁతపండ్లును గొంజిపండ్లు, మేడిపండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచెతలు తెత్తు రిత్తు విచ్చేయవయ్య. కాళ. ౩. ౬౯.

గొంటరి=గొంటు[1]. విశే. (గొంటు[1]+ అరి-స్వార్థమున) ౧. దిట్ట.

ఉ. కోయిలపేరి గారడపుగొంటరి తా బుతురాజుముందటన్, మాయ వహించి లేఁజిగురుమారునికత్తులు మ్రింగ...శశాం. ౨. ౧౧౬.

౨. దుష్టము; దుష్టురాలు.

గీ. పెంపెడల నిట్టియెడ నీవు సొంపు సడలి,తుంటవిలుదంటగొంటరితంటలకును, దిన్నఁదన మణి విన్ననై ఖిన్న వగుచు, వేడ్క దొలఁగంగ నేటికే వెలఁదిమిన్న.ఇందు. ౩. ౬.

వ...ఆగొంటరివెంటఁ దలవరులఁ గూర్చి మీ రిది చూపినజాడ వేశ్యమందిరంబున కరిగి కనకపాత్రం బిచ్చినవానిం బుచ్చుకొన్నదానిం బట్టి తెండని పనిచిన...విప్ర. ౫. ౩౧.

౩. కఠినుఁడు.

సీ. గొంటరి ధాతకీకుసుమకోమలయంగ మలయంగఁజేయ నేచల మటంచు. హ. న. ౪. ౪౧.

ద్వి. ఇచ్చోటి కుండుండి యేల వచ్చితివి,వచ్చితింబో యిటువంటిగొంటరిని, గనుఁగొంటి నేలకో...ద్వి. పరమ. ౪. ౨౮౯ పా.

గొంటు[1]=గొట్టు[1]. విశే. (సం. కుంఠః) ౧. దుష్టము.

ఉ...ఈతఁడా, గొంటునిశాచరి వ్వసుధఁ గూల్చుట వింటిమి కాదె యేర్పడన్. హరి. ఉ. ౪. ౨౩౩.

౨. వంచకుఁడు.

చ. కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ,బడుగును బట్టి చంపు టిది భావ్య మటంచుఁ గృపాణపాణి యై,వడి వసుదేవునిం దునుమ వచ్చినకంసునిఁ జూచి...భాగ. ౧౦ పూ. ౧౧౪౯.

౨. కఠినుఁడు, క్రూరుఁడు; ఘాతుకుఁడు.

సీ. నీపట్టు వదల వన్నిట గొంటు వని తిట్టునువిద బల్లిలిగింత నుబుకఁజేసి. మృ. వి. ౧. ౪౫.

లయగ్రాహి...వెంటఁ బడి పట్టుకొని గొంటుతన మేర్పడఁగ గంటి పడఁ దాఁచుమ మగంటిమి దలిర్పన్. భా. రా. యు. ౧౪౩౦.

ద్వి. మిండత ల్కత్తికి మిగిలినగొంట్లు. పండితా. పురా. ౧౧౬ పా.

౩. దిట్ట.

గీ. కనకకశిపుని జనుప్రోలి కనుపుగొంటు, చాలి తానేకఘూకాంధ్య సంధ్య దోలఁగె. రా.వి. 3. 3.

జ: గొంటులి, గొంటుకాఁడు.

**గొంటు**[2]. వి. (సం. ఘోంటా) మొద్దువక్క, బంధన లేనివక్క.

క. పచ్చనియాకుం దానికిఁ, బుచ్చినగొం టౌక టి నమలు...బహు. ౫. ౯.

సీ. కపురవీడెము వెల్తి గానియానోరికిఁ గొఱమా లినట్టియాగొంటువక్క. వైజ. 3. ౭౨.

**గొంటు**[3]. ప్ర. 'కలది, కలవాఁడు' అనునర్థమును దెలుపును. (చూ. తెవులుగొంటు.)

**గొంటుకాఁడు.** విశ. (గొంటు[1] + కాఁడు- స్వార్థమున.)

(కఠినుఁడు.)

'గొంటుకాఁడు మువ్వగోపాలరాయఁడు' క్షేత్రయ. (శ. ర.)

**గొండము.** వి.(సం.కుండః) కుండము, నిప్పులగుంట.

సీ...కుండాఖ్య వెలయుచుండు గుండ మనంగను గొండ మనఁగ...ఆం. భా. ౨. ౨౪౧.

**గొండి.** ప్ర. తాచ్ఛీల్యమున వచ్చును.

ఉదా:-లంచగొండి, మొ.

ద్వి. బొంకులపిడుగులు ఱంకులగొండ్లు ...వన్నెకత్తెలు వారవనితలు ... పండితా. పురా. ౧౧౬ పా.

**గొండిలి(ల్లి).** వి. (సం. క్రీడా.) ౧. ఆట.

గీ. గొండ్లి సలుపంగ ననుఁగుఁబూఁబోండ్లు గారు, తులువపాలయోగిరపుఁబొలంతుకలు గాని... అచ్చ. రా. అయో. ౭౭.

షే. త్రుళ్లాట గొండ్లి నాఁ దోఁచును గ్రీడాఖ్య... ఆం. భా. ౧. ౧౪౦.

౨. కుండలాకారనృత్యము; నృత్యము.

ద్వి. కోలాటమును బాత్ర గొండ్లి పేరణియుఁ, గేళిక జోకయు లీల నటింప. బస. పు. ౧. ౫౯౯ పం.

సీ. తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ వరుఱుండు గొండిలి పరిఢవింప, మొకములచాయ వేల్పొకచందముగ నిల్చి కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప. ఉ. హరి. ౪. ౨౧౬.

సీ. జలదేవతాహస్తచామరానిలములు కుటిలాలకములకు గొండ్లి గఱపఁ. కాశీ. ౫. ౫౨. నైష. ౧. ౯.

3. నర్తకి.

క. లలితగగనరంగంబున, నలయక క్రొమ్మెఱుగు గొండ్లి యై యుండెడుచో, నలవడియె మొగులు తెరలును, బొలు పగువడగండ్లగములపుష్పాంజలులుల్. హరి. పూ. ౬. ౧౦౭.

గీ. కుంతలాధీశుఁ డైనయవంతిదేవు, ననుగలంబగునొకవారిజాక్షి మంచి, గొండ్లి యన విని పిలిచి యక్కొమ్మనృత్త, మెంతయును వేడ్కఁ జూచె ననంతవర్మ. దశకు. ౧౧. ౧౨3.

జ: గొండ్లికాఁడు.

**గొండీలు.** వి. బ. నతివిశేషము.

వ... కాళియహ్రదగోవిందునకు గొండీలు గోవర్ధనమందరిగోపవేషునకుఁ డెంకణాలు ...ప్రబంధ. ౨౨౦.

రగడ. ఆలరఁగఁ గాళియహ్రదతలమునఁ గలగోవిందునకును గొండీ లెన్నుచు... హంస. ౪. ౨౧3.

**గొండెము=గొండ్లెము**[1].

సీ. కొట్లు బేహారులగొనబుటంగడులంద లేటుచుగా గొండెముల్ తలుపులంద... అచ్చ. రా. బాల. ౪౭.

**గొండ్లికాఁడు.** వి. (గొండ్లి + కాఁడు.)

(నటుఁడు)

సీ. కలగూటు లొక్కవంకను దొలంగుచు నుండ గొండ్లికాండ్రును గెలంకుల నటింప.... విప్ర. ౫. ౧౦.

గొండ్లెము[1]=గొండెము. వి. ౧. తలుపుదిలుకు, తలుపు రాకుండ తగిలించుఇనుపగొలుసు.

ద్వి. లోని కేఁగెడునంతలోఁ దల్పు మూసి,పూని
గొండ్లెముఁ బెట్టి పోయె నాశిష్యుఁడు...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౭౮ పం. ఆం. భా. 3. ౫౧.

గొండ్లెము[2]. వి. బండికుంపటి,ఒకచోటనుండి మఱియొకచోటునకుఁ దీసికొనివెళ్లుటకు ఉపయోగించు కుంపటి.

సీ. బండికుంపటి చిల్కు పరఁగు గొండ్లె మనం
గ...ఆం. భా. 3. ౫౧.

గొంతరించు. అ. క్రి. అతిశయించు.

ఉ. కై పు వహించుఁ గోకనదకాంతులు చెంతల
గొంతరింపఁగా, నాపుటభేదనంపుఁగమలాక
రముల్...ల. వి. 3. ౫౭. (ప్రయోగాంతరము లేదు.)

గొంతి. వి. (సం. కుంతీ. క. కొంతి) పాండురాజు పెద్దభార్య.

సీ. గొంతిమూఁడవపట్టికోడలినిండు వేఁకటిఁ గా
చినట్టిచేకత్తివాఁడు. రా. వి. ౧. ౭౧. భార.
ఆశ్ర. ౨. ౭౨.

జ: గొంతెమ.

గొంతు=గొంతుక. వి. ౧. కంఠము.

గీ. గొంతు గొంతుక కుత్తుక కొలికి బొండు,గనఁ
గఁ గంఠంబు...ఆం. భా. ౨. ౧౮౧.

గీ. పెదవి పేఁ బెత్తు నాలుక పిడుచగట్టు,గొంతు
తడిలీయు...దశా. ౨. ౧౩౬.

౨. కంఠధ్వని.

సీ. పెట్ట నేరనిరండ పెక్కువిద్యలఁ బెద్ద గొడ్రా
లినుండకు గొంతు పెద్ద. వేణు. ౨౦. హంస.
3. ౨౨౨.

గొంతుకూర్చుండు(కూర్చుండుకొను)=మోఁకాళ్లు గొంతుదాఁక అనునట్లు కూర్చుండు.

(వ్యవ) వాఁడు గొంతు కూర్చుండి భుజించును.

సీ. కొర్తిమీఁదను గొంతుకూర్చుండుకొనినట్లు
నూతిపైఁ పసిబిడ్డ నునిచినట్లు. వేణు. ౫౦.

తడిప్రాతగొంతుఁగోయు=తెలియకుండ అపకారము చేయు.

క. ఉడుపతి హిమఘృణి చేఁబలెఁ, దడిప్రాఁతన్
గొంతుగోయుతగ వెచేఁగితివో, కడు మెత్త
నితలిరాకులఁ, బడఁతులమెడఁ గోసె దీవు
బాపురె మదనా. పాంచా. 3. ౬౫.

జ: గొంతుక, గొంతుకపోఁక,గొంతుమాఱు,గొంతుముడి.

గొంతుక=గొంతు. (గొంతు+ఉక.)

ఉ...బిట్టు గొంతుక, ల్గోసితి నల్లపూసకొఱకుం
బదివేవురు పుణ్యభామలన్. వరాహ. ౭. ౭౫.
జై. భా. ౬. ౧౭౫.

గొంతుకపోఁక. వి. (గొంతుక+పోఁక) గొంతుక ముందఱివైపు పోఁకవలె నుండెడియెముక, గొంతుముడి. (శ. ర.)

గొంతుమాఱు. వి. (√గొంతు) ముప్పదిరెండువిన్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము.

సీ. కన్నాత చాంగణ కందణంబు తిణింగి గొం
తుమాఱును జేబ కుమ్మరింపు...గీ...నాఁగఁ
జెన్నలరుమండు, ముప్పదియురెండువిన్నాణ
ములకుఁ బేర్లు. ఆం. భా. ౨. ౨౧౯. హంస.
౧. ౨౦౬. మల్లుపు. 3. ౬౯.

గొంతుముడి=గొంతుకపోఁక. (√గొంతు-శ.ర.)

గొంతెమ(మ్మ). వి. (గొంతి+అమ) ఒకానొకగ్రామదేవత. (బ్రా)

(వ్యవ) గొంతెమ్మపండుగు.

గొంతెమకోరిక=అసాధ్యపుఁగోరిక.

గీ. చాలకుండిన నగుఁ బెట్ట బాలుఁ డితఁడు,కొస
రి గొంతెమకోరికల్ గోరనేని, యిడకపోక
భోల దిడఁ బోల దీరు దివియఁ, బేను రాకన్నె
తైర్థికుల్ పెరుచు లండ్రు. పాండు. ౪. ౧౬౬.

**గొంతెమగోరు.** వి. (గొంతెమ + కోరు. శ. ర.) సారణి, లంజెసవరము కీ.

సీ... సారణి గొంతెమగోరు లంజెసవర మన నగు ...ఆం. భా. ౨. ౭౦.

**గొంది.** వి. (క. గొంది) ౧. కొండయొక్క చిన్న మఱుఁగుచోటు, గిర్యల్పకోణము; మూల.

గీ. గొంది యనఁగను గిర్యల్పకోణ మొప్పు. ఆం. భా. ౨. ౩౧.

ఉ... ఉదయార్కు నిరాక నడంగెఁ జీకటు, ల్గొందుల సందుల న్గుహల గుట్టలఁ జెట్టులఁ జాటు మాటులన్. అని. ౩.౮౫.

క. పులి నమలెడుమాంసము వెర, వలవడఁ దా మపహరించి యానక్క కుని, మ్ముల నిల్వం గావించిన, నిలయంబునగొందిఁ బెట్టి నేర్పారంగన్. భార. శాం. ౩. ౬౨.

చ. వెడలఁగనీక గొంది నిడి వేయువిధంబుల భంగపెట్టుచుం, జడకలు గట్ట నిచ్చి నిజసంపదకుం జొర నీక నిచ్చలుం, గడ నిడి కూడు వెట్టుచును గాసి యొనర్చుచు నేలతెంకిమై, నిడుగడ సేయఁగా వలయు నీలువు మాలినబంటు టాండ్రకున్. విజ్ఞా. ఆచా. ౧౧. (చి.ని.పా)

౨. చిన్న సందు. (బ్రౌ, వా.) ౩. స్థానము.

గీ. కట్టివేల్పుమఱంది భోగములగొంది, రిక్కగమి మక్కువబొజుంగు రేవెలుంగు. కృ. శకుం. ౧. ౨౨.

చ. హరివిముఖాత్మ లన్యవిషయస్పృహచిత్తులఁ బాపవర్తులు, న్నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైనదుష్కథా, నిరతిఁ జరించువారలను నేరరు పొందఁగ నిందిరామనో, హరచరణారవిందభజనాత్మకు లుండెడుగొంది నారయన్. భాగ. ౩. ౫౦౮. (చి. ని. పా.)

౪. మహానసము, వంటయిల్లు. (చి. ని.)

**గొగ్గి**=కొక్కి. విణ. ఎచ్చుతగ్గులు కలది.

గీ. డొప్ప చెవులును గొగ్గిపండులును గలిగి, యున్న మర్దిత్రివుఁడై వచ్చుచున్నవానిఁ, గలిమహారాజుఁ గనిరి దిక్పాలవరులు. నైష. ౭. ౯౩.

వి. ౧. ఎచ్చుతగ్గులుగా నుండుట, వైషమ్యము.

ఉదా: తాటియాకు గొగ్గి లేకుండ గీయవలయును.

౨. శిరస్త్రము.

గీ... చను శిరస్త్రంబు గొగ్గి సీసకము బొమిడి, కం బనంగను ...ఆం. భా. ౨. ౨౦౪.

౩. ఎచ్చుతగ్గులు గలముత్తెము. (కొస గలముత్తెము. బ్రౌ)

సీ... మౌక్తికం బొప్పును...ముత్తియ మన...గీ. అదియ నెర డైన గొగ్గి యం చనఁగ నెలయు ...ఆం. భా. ౨. ౨౭౬.

**గొజ్జెఁగ**=గొజ్జఁగి, గొజ్జెఁగ. వి. (సం. కుబ్జకః. ప్రా. కుజ్జగో. క. గొజ్జగె) కుబ్జకముకీ. (సేవంతికావిశేషము, ఈకులచేమంతి కీ.చి. ని—పచ్చపువ్వుల మొగలి, ఆఁడు మొగలి కీ. బ్రౌ.)

సీ. గోరంటులును గొండగోఁగులు దేవకాంచనకుసుమములు గొజ్జంగవిరులు. ఉ. రా.౩. ౨౦౧.

రగడ. చిఱుదేంట్లు కొసఁగెఁ గుజ్జెనగూర్లు గొజ్జంగ, యెఱుఁగ కది పూ వంద నేల యిటు రజ్జంగ. మనుచ. ౩. ౮౪.

జ: గొజ్జఁగనీరు.

**గొజ్జెఁగనీరు.** వి. దే. (గొజ్జఁగ + నీరు.) పన్నీరు.

గీ. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు, చంద్రకాంతపుగిండిగొజ్జంగనీటఁ, బసిఁడిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి, తనదు మేనల్లునకుఁ గన్యధారవోసె. విజ. వి. ౩. ౧౧౧.

ఉ... పెన్నెఱుల్, వేమఱుఁ జేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం, గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగనీ రెడఁ జల్లి చల్లి ... పారి. ౨. ౧౦.

**గొజ్జెఁగి**=గొజ్జెఁగ.

సీ. గొజ్జంగి యిజ్జాజిపజ్జం గిసల మొందు నెలకెక కస్తురియు గన్నెరయుఁ బూచె.బహు. ౨.౨౧.

సీ... కుబ్జంబు గొజ్జంగి గొజ్జెంగ నాఁ జను...ఆం. భా. ౨. ౫౨.

జ: గొజ్జఁగిమంచు.

గొజ్జెఁగిమంచు=గొజ్జెఁగనీరు.

ఉ. గొజ్జఁగిమంచులన్ గలపి కూర్చినపుప్పొడిలిన్నెమీఁద...పూ,సెజ్జ ఘటించి...వసు. 3. ౧౬౭.

గొజ్జెఁబ్రాలు. వి. బ. ధాన్యవిశేషము.

సీ...గౌరి,కుంకుమల్ రణపెండ్లికొడుకులు పిచ్చుకగోల్లు ప్రయాగలు గొజ్జుఁబ్రాలు. హంస.ర. ౧౨౭.

గొజ్జెఁగ=గొజ్జెఁగ.

ఉ. చెంగలువల్ సురంగములు శ్రీతులసీనిచయంబుఁ గమ్మగొ,జ్జెంగలు లోనుగాఁగలవి శ్రీపతి కర్పణసేయు నిచ్చలున్. పరమ. 3. ౧౪౯.

గీ. సికను సెత్తావిక్రొత్తగొజ్జెంగసరులు, చుట్టు నొకనీలవేణి యాక్షోణిపతికి. రసిక. ౧. ౭౧.

జ: గొజ్జెఁగనీరు.

గొజ్జెఁగనీరు=గొజ్జెఁగనీరు.

గీ. బహుళకస్తూరికామేఘపటలమునకు,శీకరాసారమయ్యె గొజ్జెంగనీరు. భీమ. ౫. ౧౨౧.

గొటగొట. వి. పులి గోండ్రించుట మొదలగువాని యందలిధ్వని కనుకరణము.

ద్వి. గొటగొట గోండ్రించి కోఱ లొండొంటి,గటగటఁ దాఁకింప గర్భంబు నలఁగి. నవనాథ. 3 భా. (శ. ర)

సీ. కోల్పులుల్ మంపిల్లి గొటగొట మని రొప్పె బలుసింగముల నైనఁ బట్టఁ జూచు. సారంగ.౧. ౬౭.

ద్వి. పడి బొల్లు సెలవుల వడియ నూరుపులు, నిమదమై గొటగొట నిగుడ ... ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౮౫ పం.

గొట్టము. వి. (క. గొట్ట) ౧. వెదురు మొదలగువాని క్రోవి.

ఉదా: తుపాకిగొట్టము, వెదురుగొట్టము, మొ.

గొట్టి. వి. ఒకదినుసుగడ్డ, కశేరువు. (శ. ర.)

గొట్టు[1]=గొంటు[1]. వి. ౧. దౌష్ట్యము.

ద్వి.గొట్టు సేయఁగ దొరఁకొంటివే యనుచుఁ,బట్టని కది పాణిపద్మంబుఁ దట్టె. విష్ణు. ఉ. ౪ ఆ. (శ. ర.)

౨. అల్లరి.

గీ. ఆలు మగఁడును నియ్యారియఖుత నిలిచి, చలిది భుజియింప నాసొమ్ము సంగ్రహించె,గొట్టుసేయక వీనిఁ జూపెట్టుకొనుచు,నిచ్చటికిఁ దెచ్చితిమి పట్టుఁ డిప్పు డితని.శుక.3.౫౭౬.

సీ. చెవు డనఁగా రాదు చేట యెత్తుక వచ్చు గ్రుడ్డిక న్నన రాదు గొట్టుసేయు. గీ. వెఱ్ఱి యన రాదు పైఁబడి వెక్కిరించు...శుక. 3. ౨౧.

విశ. (క. గొట్టు) ౧. కఠినము.

వ... నట్టడవులలో మీపట్టపుదేవిని విడిచిపెట్టి వచ్చితి నని యీగొట్టుమాట దిట్టతనంబులో నధిపతిం జేరి యింక నెట్టు విన్నపంబుసేయుదు...ఉ. రా. ౬. 3౪3.

౨. భీకరుఁడు.

మత్త. అట్టివృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెను మూఁకలై, చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు నూపి యేపున నేయ నా,గొట్టువీరుఁడు వారలేసిన క్రూరశస్త్రము లన్నియుం,జట్టిపట్టుక మ్రింగి శూరత జోక నార్చె మహోగ్రుఁడై. భా. ౫. ౬. 3౨౧

3. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

ఉ. గొట్టుఁదనానఁ దగ నెడలఁగొట్టినదిట్టను ర ట్టడంచుఁ దో,బుట్టువ నాట నొం డనక పో యితి...ఉ. రా. ౨. ౩౦౯. (శ. ర. పా.)

౪. విరోధి.

(చంద్రవర్ణనము) చ... జక్కవలగొట్టు చకోరు లమేలియట్టు లే,పాలఁదుకతాళిబొట్టు...రా వి. ౩. ౭.

గొట్టుగ(గా)=కఠోరముగా; పూర్ణముగా.

రగడ. గోర గోరఁట నించితివో కలిగొట్టు గొ ట్టుగఁ గోయఁ బోసఁగవు...వసు. ౩. ౧౪౯.

గొట్టు². ప్ర. తాచ్ఛీల్యాద్యర్థమున వచ్చును.

ఉదా: గోడవగొట్టు (ఇట తాచ్ఛీల్యమున)

పిసినిగొట్టు. (ఇట స్వార్థమున.)

గొట్టు³. (బ్రా). వి. గాలి, వాయువు.

క. మరుదాఖ్య లొప్పుచుండును, ధర వినుచూలి యన సోఁకుదయ్య మనం బ,య్యెర యన గొ ట్టన నీఁ దనఁ, గరువలి యనఁ దెమ్మె రనఁగ గాలి యనంగన్. ఆం. సం. దేవ. ౨౩.

గొట్టె. వి. ఘోటజటి ?. (శ. ర.)

గొల్లె. వి. (సం. ఘోంటా) రేఁగుచెట్టు. (శ. ర.)

గోడఁగు=గొణఁగు. అ. క్రి. స. క్రి. ౧. ఎదుటివారికి వినఁబడకుండ నోటిలో నుచ్చరించు.

ఆ. అనుచు వేఁడుకొనిన హనుమంతునకుఁ గడు, న గ్గిచల్లనయ్యె నాతఁ డంతఁ, గడఁకఁ బ్రాఁత మినుకునుడువులు గోడఁగినఁ, గడిఁది మీఱ బమ్మకట్లు వీడె. అచ్చ. రా. సుం. ౧౮౦.

చ...కకుత్థ్సుఁ డేటు నే,మఱక యిదే మొకో కు లిశమంత్రము తప్ప గోడంగినాఁడనో, కొఱఁ తలు పుట్టెనో శుచితకున్...కవు. ౫. ౧౩౦.

౨. కసరు.

సీ. కోరి కూడినభర్తఁ జేరుమింత నటంచు గొ డఁగి పంచిరి పెంచుకొన్నవారు. కృ. శకుం. ౩. ౧౪౮.

సీ. గోడఁగుచుఁ దిట్టి పెంపుడుకీరముల రేఁచి వె డతిట్లు తిట్టించెఁ బడఁతి యొకతె. చంద్రా. ౩. ౯౮.

౩. (పావురములు) కూయు.

చ. గోడఁగెడుపావురాలరొదఁ గూడి ప్రతిధ్వ ను లిచ్చుకెంపుటా, కొడిగల వ్రేలుబంగరపు గూఁడులఁ బల్కెడుచిల్కచాలుచే ... చం ద్ర. ౪. ౪౯.

ముచ్చటల్ గోడఁగుకొను=ముచ్చలాడుకొను.

సీ. అగుదురా తోఁబుట్టు లళికుమారకులార కుసు లతో ముచ్చటల్ గోడఁగికొనుఁడు. కవు. ౧. ౧౪౦.

గోడగ. వి. (సం. కూటకమ్)ఏడికోల లేనినాఁగలి. (శ. ర.)

గోడగర. వి. చెప్పులు కుట్టి జీవించెడుజాతి.

ఉదా: గోడగరవాఁడు, గోడగరది. (శ. ర.)

జ: గోడగరి.

గోడగరి=గోడారి. వి. (గోడగర + ఇ) చర్మకారుఁడు, మాదిగవాఁడు.

ఆ. చాకి బోయవాఁడు జలగరి గోడగరి, కుక్క నూనగాఁడు కోడి పంది, బొడ్డుక్రిందియంగ ముల విప్రు సోఁకిన, నచటు గడుగ వలయు నండ్రు బుధులు. విజ్ఞా. ఆచా. ౫౭.

గోడవ. వి. (క. గోడవె.) ౧. జోలి, సంబంధము.

గీ. అమ్ముగోడ వేల యాగవయమ్ములకును, ఖడ్గమం కింపఁగా నేల ఖడ్గములకు, భల్ల మది యేల యీయచ్ఛభల్లములకు, నయ్యె యీబంతి సికబంతి యయ్యె నేని. చంద్రా. ౨. ౪౩.

వ. ఇట్లు తమకు వలయునెడఁ బడఁతులగోడవ త డవనితమమొడయఁడు తమ్ము మిగులఁ గూడి మాడి యుండమికి. హంస. ౫. ౬౨.

ద్వి ... మునులకు ఖడ్గతూణీర,కోదండశరముల

గొడవ యేమిటికి. రం. రా. కిష్కి. ౧౮౭ పా. ౮౯ పం.

౨. కయ్యము, యుద్ధము; కలహము, తంపి.

సీ. గొడవ బవరము జగడ మాల మని యన యుద్ధ వాచకములై యొప్పచుండు. ఆం. భా. ౨. ౨౨౨.

(నారదుఁడు) సీ. పూసిగొండితనానఁ బోయి యెవ్వరికైన గొడవలు కావించుకొండెగాఁడు. వరాహ. ౯. ౨౬.

3. అశుభము, కీడు.

గీ. పేలు గలవాఁడు మురియుచు మెసవ నేర్చి, గొడవ లాదవెడుతఱిఁ బోవ విడువఁ దగునె, తలఁప నుసురులయొడయఁడై తనరుమగని, వెరవెఱింగిననా డెంపు నెలఁదుకలకు.అచ్చ. రా. అయో. ౭౧.

౪. ఆపద, ఇడుమ.

క...ఇత్తఱి నగునిమిత్తములు నృప,కొఱగా విదమనకుఁ బెద్దగొడ వగు ననినన్. మనుచ. ౪. ౬3.

౫. దుఃఖము, బాధ, పీడ.

గీ. మొదలివెన్నుఁడు పంటలముగుడగొడవ, లుడుపుకొఱ కిర్లగొంగవంగడమునందు, రాముఁడై పుట్టె...అచ్చ. రా. యు. ౧౯.

క. చంచలలోచన యెం దరు, దెంచెనొ ననుఁ గానలేక దృఢబలవిలస, త్పంచశరనిశితవిశిఖా,కుంచితహృత్కమల యగుచు గొడవలు బెరయన్. రసిక. ౬. ౪౪.

౬. దోషము, తప్పు.

చ.అడుగక కాని డాఁచినపదార్థము లిచ్చుట నీతిగాదు నీ,వడిగితి కాన నిప్పుడు సమర్పణచేసితి నింక నాయెడన్, గొడవలు లేవు ... వి. పు. ౬. 33౯.

౭. అల్లరి.

(వ్యవ)ఇక్కడ గొడవ చేయవలదు. పామ్లు.

౮. కలఁత. (శ. ర.) ౯. అడ్డి, నిరోధము.(శ.ర.)

జ: గొడవగొట్టు.

గొడవగొట్టు. విశే. (గొడవ+గొట్టు[2]) గొడవ చేయుస్వభావము గలవాఁడు.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల,గడుసరుల్ కయ్యంపుఁగ్రచ్చలు ... వారవనితలు ...పండితా. పురా. ౧౧౬ పా.

గొడారి=గొడగరి.

ద్వి. మాలకు మాంసంబు మతి గొడారికిని,దోలును నన్నట్లు...బస. పు. ౪. ౧౦౦ పం.

గొడిగ. వి. గులకఱాయి. (శ. ర.)

గొడియ(డె). వి. ౧. అందలముయొక్క ఒకానొక యవయవము.

సీ. సింహలలాటంబు జీవదంతంబులగొడియలు... దశా. ౭. ౧. ౭౯.

సీ. ఉదిరికంకణము లింపానఁగుదంతపుగొడెల్ నయము మించినముసనాబు పడను. రా.వి. ౨. ౪3. చంద్రా. 3. ౬౭.

౨. నేరము చేసినవానిచేతులకు వేయుబంధనసాధనము.

సీ. వీరభద్రారెడ్డివిద్వాంసుమంజేత విద్యామందెను గదా నెదురుగొడియ. వీథి. ౪౭.

కోలాటగొడియలు=కోలాటపుకఱ్ఱలు.

ద్వి. నీలరుద్రులు వారికోలెమ్మ లెలమిఁ, గోలాటగొడియలకొమరున నేయ. పండితా. వాద. ౨౩౯ పా.

గొడివె. వి. ఇడుము, కష్టము.

చ. అరదము దోలి వింట గొనయంబు దవిల్చి మెఱుంగుటమ్ము ల,బ్బరముగఁ బూన్చి యయ్యెఱయబంటులనిద్దపుమేను లెల్ల వా,విరి వలియంగ నేసి గొడివెల్బెరయించిన సైఁప నోప క,బ్బిరుదుమగల్ పడిం బరువువెట్టఁ దొడంగిన నంగదుం డొగిన్. అచ్చ. రా. యు. ౧౮౯.

క. అడవులఁ బడునాల్గేఁడులు, గొడిపెల కొడిగట్టి
సాఁకుకొంటివి మమ్మా,బడలిక నిపు డిజ్జగడ
పుఁ,బుడమిం బవళించి నిదురవోయితొ తం
డ్రీ. అచ్చ. రా. యు. ౩౯౩.

గొడిసె. వి. ౧ (=గుడిసె[1].) పండినచింతకాయలో
ఒకగింజ యుండుభాగము.

(వ్యవ) ఒకగొడిసె తీసి నోటిలో వేసికొని రుచి
చూచినాను. ఈచింతపండు చాల రుచిగా
నున్నది.

౨. చింతకాయ.

క. ఉడుపతి తనలో నమృతము, గడలుకొనియుఁ
జెక్కు చవులు గానక కృశుఁడై, విడిచినకళ
లన్నియు నీ,గొడిసెలరూపమునఁ జింతఁ గొ
లువగఁ బోలుఁ. ద్వా. ౩. ౧౪౯.

గొడుగు(వు). వి. (క. కొడె. త. కుడై. మ. కుట)

౧. ఛత్త్రము, ఆతపత్త్రము.

సీ...గొడుగన గొడుపన ఛత్త్రాఖ్య యడరుచుం
డు. ఆం. భా. ౨. ౧౯౩.

క. జడి దాఁకి వడఁకుపసులకు, గొడుగుగ దివసం
బు లేదు గోవర్ధనముఁ, వడిఁ బెఱికి యట్లు
దాల్చిన,కడిఁదిబలం బరయ హరికిఁ గలరే స
దృశుల్. హరి. ఉ. ౮. ౨౩౭.

సా: ఏయెండ కాగొడుగు పట్టుట=సమయాను
కూలముగా సంచరించుట.

౨. పావకోళ్ల బొంగరము మున్నగువానికి గొడు
గుపలె నుండుగుబ్బ.

వ...అబ్బోటి హాటకమయం బైనగొడుగుపావ
లగిలకలు గులకరింప... భీమ. ౨. ౧౨౭.

క. అసమలసమానజసరుహ, విసరలసద్ధూళికలితవి
భ్రమదావ, ర్తసముదయం బానదిలోఁ, బొసఁ
గుం జలనరులగొడుగుబొమ్మరము లనఁ.శుక.
౩. ౩౨౫.

౩. హస్తతలమం దుండుఛత్త్రాకార రేఖావిశేషము.

గీ. వసుధలో నెట్టిశ్రీ గలవారి వేని,కరభయులు
దాస్యములుచేయు సరసిజాక్షి, యూరువుల
కట్లటన్నఁ బైఁ దాను మోచు, గొడుగులును
నల్లకలశముల్ గుఱులు కావె. ఆము. ౫. ౩౧.

౪. కోటకొమ్మలు మున్నగువానిపై కట్టఁబడినగొ
డుగువంటికట్టడము.

ద్వి. క్రొత్తడంబులఁ గోటకొమ్మల గొడుగు, లె
త్తించి...బస. పు. ౩. ౫౦౮ పం.

జ: గొడుగుగడ్డి, గొడుగుబల్ల, గొడుగు మెట్టెలు.

గొడుగుగడ్డి. వి. (గొడుగు+గడ్డి) గ్రుడ్డికామంచి,
అతిచ్ఛత్త్రము కీ. (శ. ర.)

గొడుగుబల్ల. వి. (గొడుగు + బల్ల) తలుపుమీఁది
కుబుసము లికిగెడుపట్టె. (శ. ర)

గొడుగుమెట్టెలు. వి. బ. (గొడుగు + మెట్టెలు)
వాటనుపెట్టి ఓరలు సన్నగాఁ దీర్చినవెడలుపు
మెట్టెలు. (శ. ర)

గొడ్డ. విశ. బిఱుసైనవాఁడు.

ద్వి. ఘుటికసిద్ధుఁడు తాయికొట్టినగొడ్డ,యటమట
కాఁడు మహామాయలాఁడు. ద్వి. పారిశ్చ. ఉ.
౬౮౭ పం. (శ. ర.)

వి. బిఱుసు. (శ. ర.)

బ. బిఱుసుమాటలు,సోత్కర్షమును తెలుపుమా
టలు.

ద్వి. తర మెఱుంగక నీవు తెఱచుగా నిట్లు, గురు
వుఁ దుటారించి గొడ్డ లాడెదవు. ప్రభు. ౩.
౦౪ పా. ౭ పం.

గీ. నాఁడు నేఁడును దమ కీడు లేఁ డటంచు,గొడ్డ
లాడుదు రొండొరు లొడ్డు లేక. రా. వి. ౧.
౫౮.

జ: గొడ్డతనము.

గొడ్డగము. వి. దుండగము, దుశ్చేష్ట.

గీ. స్వామి గుడియుంచి పెక్కుయజ్ఞములు సల్పి,
భూమిప్రజ లెల్ల నింద్రులై పోతరమున,
గొడ్డగము లిట్లు చేయుంగ నడ్డపెట్ట, రాక బ

హునాయకం బయ్యో నాకపురము. వరాహ. ౧౦. ౧౫.

విశ. బాధకము.

క. గొడ్డగపుజరావ్యాధుల,కడ్డ మగుల వృత్యు దుఃఖహర మై మిగులన్,దొడ్డగు ముక్తిసుఖద మగు, నొడ్డాణపుబంధ మెలమి యోగీంద్రుల కున్. శివయో. 3. ౭౮.

గొడ్డతనము. వి. (గొడ్డ+తనము) బిఱుసుఁదనము.

సీ. మఱచిరే సత్యభామామురారుల బండిగొడ్డులఁ జేసినగొడ్డతనము. చంద్ర. 3. ౧౭.

గొడ్డలి. వి. జా. (సం. కుఠారః.) ౧. చెట్లు మున్న గువానిని నఱకెడిసాధనము.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దగినప్రా నఁ జిగురు వొడము...భార. ఉద్యో. ౨. ౬౧.

గీ...తగుం గుఠారము గొడ్డలి యన. ఆం.భా.౨. ౨౧౬.

సీ. పిడుకకుంపటు లాకుతెడికలు ప్రోఁగుఁద్రా క్ష్వాఁడిగొడ్డండ్లు మవ్వంపుటురులు.శుక. ౧. ౧౬౫.

౨. పరశువు, గండగొడ్డలి.

చ.పొలుపుగఁ గొండకట్టెలకుఁ బోయెడివానివిధం బు దోఁప గొ,డ్డలి యిది యేమి దీన జగడం బొనరింపఁగ వచ్చితే బళీ,బళి భృగురామ ...దశా. ౬. ౧౧౯.

గొడ్డు[1]. వి. (క. గొడ్డు.) ౧. గొంజ, సంతతి లేని యావు.

సీ. గొడ్డన వంజ నా గొంజ నా వంధ్య యా... ఆం. భా. ౨. ౨౬3.

వ. ఆఁబోతుపంచితంబు మూర్కొనినను బై గాలి వీచినను గొడ్డున కైనం జూలు నిలుచు ... భార. విరా. ౧. ౨౬.

౨. గొడ్రాలితనము.

మత్త...నిను మేదినీ,గుప్తి కై కని యెట్టకేనియు గొడ్డు వీఁగితి నంచు నే,సప్తవింశతివత్సరం బులు సంతసంబున నుండితిన్. భా. రా.అయో. ౭3.

గీ. గొడ్డు వీఁగి కనియెఁ గొడుకు నెంతయు మూ ర్తి,మంతు నెలఁతలందు మహితభార్య, యొ క్క-తియ యశోద యుర్విపై ననుచు వ్రే, పల్లెఁ బొగడి రెల్లపడఁతుకలును. హరి.పూ. ౫. ౧౬౫. కాశీ. ౪. ౭౭.

విశ.౧.వంధ్య,సంతతి లేనిది.(స్త్రీ,పశువు,మొ.)

ఉ...నాయెడఁ దప్పుఁ బట్టదు మనంబున నాసతి గొడ్డు గావునన్. వి. పు. ౬. ౨౨౧.

క. ఒడ్డును బొడువును రూపును,దొడ్డతనము గలి గి ప్రజతో మెలఁగని యా,బిడ్డను గనుకం బె ను సతి,గొడ్డైనను మే లనంగఁ గుందుట గలి గెన్. ద్వా. ౮. ౧3౬.

౨. ఫలింపనిది. (చెట్టు, మొ.)

గీ...వంధ్యసంజ్ఞ, యగును గొడ్డన... ఆం. భా. ౨. 3౫.

3. ఫలము లేనిది, ప్రయోజనము లేనిది.

ఉదా: గొడ్డుమాటలు.

౪. కావలసినయితరవస్తువులు లేనిది.

ఉదా: గొడ్డన్నము, గొడ్డంబలి.

౫. శూన్యము, వట్టిది.

ఉదా: గొడ్డేఱు=నీళ్లు లేనియేఱు. (వ్రా, శ. ర.)

జ: గొడ్డుఁగాఁకర, గొడ్డుఁబోతు, గొడ్డురాలు, గొడ్డువోవు, గొడ్డేఱు[2], గొడ్రాలు.

గొడ్డు[2]. వి. పశువు. (ఆవు, ఎద్దు, మొ.)

ద్వి. ఎండినమ్రాఁకుల నిగురులు వొడమెఁ, గుంజ నిండఁగఁ బాలు గొడ్డులు పితికె. ప్రభు. ౨. ౪౧ పా. ౧3 పం.

సీ. అనివిలాపింప నూరార్చి యేటికిఁ గ్రేపుఁ బా సి గొడ్డొఱలెడిపగిది నడలె,దు...భై. భా. ౬. ౨౬౫.

గీ. అహహా ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుఁ,

జేయఁ బోవుట యదియు మేల్బాయ చువ్వె. హర. ౪. ౫.

చ. మడఁగి పసుండఁ బ్రానులక మంచపుఁగుక్కకి నిల్వ జెల్లుపు,గ్గుడిసెకు నొండు రెం డెనుప గొడ్లకు నోరికిఁ బోఁక ప్రక్కకుఁ, గుడు వఁగఁ గూటికి న్గొలకుఁ గోకకు సీదిరము... వేం. పంచ. ౧. ౪౩౩.

**గొడ్డుఁగాఁకర.** వి. (గొడ్డు[1] + కాఁకర.)-గొడ్డు తనమునుపోఁగొట్టుకాఁకర-వంధ్యాకర్కోటకికీ. (సాల. ని. ౪౬౭ పా. చూ)

**గొడ్డుఁబోతు.** విణ. (గొడ్డు[1] + పోతు[2]) ౧. పిల్లలు లేనివాఁడు;పిల్లలు లేనిది;కాపు లేనిది,ఫలింపనిది. ఉదా:- గొడ్డుఁబోతువాఁడు, గొడ్డుఁబోతుది, గొడ్డుఁబోతుచెట్టు, మొ.

౨. అప్రయోజకుఁడు. (శ. ర.)

**గొడ్డురాలు=గొడ్రాలు.** వి. ఔ. (గొడ్డు[1] + ఆలు) వంధ్య యగుస్త్రీ.

చ...గొడ్డురాలి కిల నెక్కుడిమోహము లెంచి చూడఁగన్. సారంగ. ౩. ౫౦. ప్రబంధ. ౨౬౦.

**గొడ్డువోవు.** అ. క్రి. (గొడ్డు[1] + పోవు) ౧. గొడ్రాలగు.

క. అని చదివి లవుఁడు రాఘవ, మనుజేశునితల్లి వీరమా తఁట సీతా,జనని కుశలవుల నిరువు రఁ, గనియు నకట గొడ్డువోయెఁ గడపట ననుచున్. జై. భా. ౬. ౧౧౫.

౨. పౌరుషహీనుఁ డగు.

వ...వీర లందఱును గొడ్డువోయినవారలు పౌరు షంబు గలమానిసి యిం దెవ్వఁడు ...భార. ఉద్యో. ౧. ౩౫౨.

చ. మును మము గొడ్డువోయి రని ముష్కరతం జెడనాడినట్టిదుర్జనుల ... భార. శల్య. ౨. ౨౮౫.

౩. వ్యర్థ మగు.

చ...వీనిఁ బట్టి క్రవ్యభుఁ బరిమార్పఁ జేసిన యుపాయము లన్నియు గొడ్డువోయె. నృసిం. ౪. ౧౩౫.

౪. సృష్టిలేక యుండు, ఉత్పత్తి లేని దగు.

గీ...సప్తార్ణవములు,నిండుకొని యుండఁగా రిత్త నింగితోడఁ, గొంతకాలంబు శూన్య మై గొడ్డువోయె. శివరా. ౧. ౫౧.

**గొడ్డేఱు[1].** స. క్రి. గుత్తకు తీసికొను, గుత్తయెత్తు. (బ్రౌ,శ.ర-దీనికి క్త్వార్థమందే ప్రయోగము కనఁబడుచున్నది.)

గీ. బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి,నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు. వీథి. ౪౮.

**గొడ్డేఱు[2].** విణ. వ్యర్థము. (గొడ్డు[1] + ఏఱు?)

వ...రాకుండె నేని నేమును నీముపలి మవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు వలికి నీపడ్డపాటు గొడ్డేఱు గా జిడ్డుపఱపం గలవా ర మె...హర. ౨. ౧౩౨.

శా...బిడ్డలు లేనియీబ్రతుకు గొడ్డే యయ్యెఁ జింతింపఁగన్. కవిక. ౧. ౩౮.

క్రి. విణ. ౧. వ్యర్థముగా.

గీ.... చెలియలికి నాకు గొడ్డేఱు కలఁక పుట్టె. క్రీడా. ౨౪౮. ప్రభ. ౮౩ పా. ౫ పం.

౨. దిక్కు లేకుండఁగా.

క. ఒడ్డారించి విషంబున,కడ్డము చను దెంచి కావ నధికులు లేమిన్,గొడ్డేఱు మ్రంది రా లన,బిడ్డన నెడ లేక జనులు పృథ్వీనాథా. భాగ. ౮. ౨౧౭. (చి. ని. పా)

**గొడ్డేఱు[3].** వి. ఒకయడవి చెట్టు. (చి. ని.)

**గొడ్రాలు=గొడ్డురాలు.**

సీ. యతి మాచకమ్మ గొడ్రాలు దీక్షాపత్ని మగనిఁ
బాసినయింతి మరునిపాలు. నైష. ౭. ౧౩౭.

శా. గొడ్రా లైనవధూటిజన్మ మది పేర్కొ నిష్ఫ
లం బిమ్మహిన్. వైజ. ౧. ౬౩. ఆం. భా. ౨.
౧౦౬.

గొణఁగు=గొడఁగు.

(మాట వెడలనీక నోటనే ఉచ్చరించు.)

సీ. పిలిచి పెట్టనివన్యభిక్షు గైకొనువాఁడె కోరి
పెట్ట రటంచుఁ గొణఁగ సాగె. కువల. ౨. ౨౪.

ఉ... నాథు లో,లోన గొణంగి తిట్టుచు ... చె
న్న. ౨. ౪౬.

గీ. నోర జగములదొకిమాని పేరు సారె, గొణఁగు
చును వచ్చె జగడంపుఁగూటితపసి. అచ్చ.
రా. యు. ౧౫౪.

గొణగ=గొడగ. వి. ఏడికోల లేనినాఁగలి. (శ. ర.)

గొణగొణ. వి. గొణఁగుటయం దగుధ్వనికి అనుక
రణము. (శ. ర.)

జ: గొణగొణలాడు.

గొణగొణలాడు. అ. క్రి. (గొణగొణలు+ఆడు)
గొణగొణయను. (శ. ర.)

గొణిజే=గొణిద. (శ. ర)

గొణిద. వి. తలుపుగ్రంది తగిలించుటకై దారబం
దము లోనగువానినిలువులయందు బిగఁగొట్టినచీ
ల. (శ. ర-గొడిసె. వా)

గొతుపు. వి. నీలమణివిశేషము.

సీ. కప్పురా లనఁగను గనుపట్టు నీలము ల్గొతుపు
నాఁ దద్భేద మతిశయిల్లు. ఆం. భా. ౨. ౧౭౭.

గొత్తు[1]. వి. (సం. గుచ్ఛః.) గుత్తి. (బ్రౌ, చి. ని.)

గీ. జలరుహాము పువ్వుగొత్తులు షట్పదాళి,లవలిద
ళములఁ జూపితో యివి సహింప, నన్యవని
తాంగతులితంబు లౌటఁ దావ, తాంగసమము
లుగామి నోహంసయాన. దశా. ౭. ౨. ౬౭.

గొత్తు[2]. వి. ౧. క్రమము, వరుస. ౨. నిశ్చయము.
(బ్రౌ)

గొత్తు[3]. వి. పాసిపోయినవెన్న పాలు మొదలగువా
నికంపు. (బ్రౌ, శ. ర.)

గొద[1]. వి. (సం. క్షుధా. ప్రా. ఖురా. త. కుఱై) ఆఁ
కలి, క్షుత్తు.

సీ. ఆఁకలి యన గొద యనఁగ నాకొంట నాఁగను
క్షుత్తుపేరు గాఁ దనరుచుండు. ఆం. భా. ౨.
౨౬౦.

జ: గొదగొను[1].

గొద[2]. వి. (క. గొద) ౧. అతిశయము. ౨. త్వర.
(చూ. గొదగొను[2].)

జ: గొదగొను[2].

గొదగొద. వి. పగ, విరోధము.

క. నా విని విహగము లను నయ,కోవిద యాశంటి
శేల గొదగొద పాడమెన్,జా వేల వచ్చె నో
తువు,చే వానికి నింతపట్టు చెపుమా తెలి
యన్. వేం. పంచ. ౩. ౯౯.

గొదగొను[1]. అ. క్రి. (√గొద[1]) ఆఁకలిగొను.

సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు నుఱుకు తె
ఱంగునఁ దఱియఁ జొచ్చి. భార. ఉద్యో. ౨.
౧౩౯.

ద్వి. అలమట చేతఁ జిత్రాంగి రాజించి,గొదగొన్న
పులివలెఁ గొలువుకూటంబు, సదరంగ బిట్టు
అం తడరఁ గోపమునఁ,గాంతను జూచి భూ
కాంతుఁ డిట్లనియె. ద్వి. శ. సా. ౩. ౧౦౧
పా. ౧౨ పం.

క. గొదగొని సారంగంబుం, బొదివినసింగంబుక
రణి... హరి. పూ. ౯. ౧౩౯.

గొదగొను[2]. అ. క్రి. (√గొద[2]) ౧. విజృంభించు.
అతిశయించు; చెలరేఁగు.

క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ
నీక గాండీవి వెసం,బొదివి యటు గడపె నవి
యును, గొదగొని తమపాలము సొచ్చె గోపా
లురతోఁ. భార. విరా. ౪. ౨౭౧.

ఉ...చను దెమ్మె లె మ్మనఁ, బ్రీగరిమంబు వాపు
చు నొకించుక లేవఁగఁ బూను మాను నా,లో
గొదగొన్నసిగ్గునఁ జెలుల్ బలిమిం దను దివ్వఁ
గోరుచుఁ. కళా. ౭. ౧౧౭.

క. ఒదవినకినుకం గొదగొని, గదగొని హలధరుఁ
డు రథముకఁడ్లును నొగలుఁ, జదిపి పతాక
యు సారథి,విదారణముచేసి మిన్ను ద్రీలఁగ
నార్చెఁ. ఉ. హరి. ౪. ౨౪౬.

౨. త్వరపడు.

వ... రేయింటియాకఁటిపెల్లిన గొదగొని కమిచి
చంచువులం దిగిచి త్రుంచి యానుచు...భార.
విరా. ౨. ౨౪౦.

గొదగొను[3]. స. క్రి. వహించు, తాల్చు.

సీ...పూనెఁ దాల్చెఁ దొడిగె మోచె నాఁగఁ.
గీ. దాల్చె నా గొదగొనె ననఁ దనరు నా వ,హిం
చె ననుమాట గా... ఆం. భా. ౩. ౧౧౯.

గొనకొను. (చి. ని, బ్రా.) అ. క్రి. ౧. ఉద్యమిం
చు, పూను. (ఈయర్థమున 'కొనకొను' అనురూ
పము గూడ శ. ర. లో కలదు.)

క. తనబలము నెదిరిబలమును, మనమునఁ జింతిం
ప కరుల మర్దించుటకై, గొనకొనినవాని కొ
ప్పమి, జనియించుట తప్ప దండ్రు శక్రుని
కైనఁ. నా. పంచ. ౩. ౪౬.

చ...సధర్మవృత్తికిం, గొనకొనఁ డేని... భార.
శాం. ౬. ౨౪౩. విక్ర. ౨. ౧౩౦.

౨. సమ్మతించు.

చ. జననముఁ జెప్పి యేఁ దెలుప సత్యము నమ్మర
కుంతిభాషణం,బని తనుజత్వజాతకృప నంబు
జమిత్రుఁడు పల్కఁ డేమిటం, గొనకొన నేరఁ
డయ్యె నినుఁ గూడ సుయోధనుఁ బట్టి యట్టి
క,ర్ణునకయి నీకు నేటికి మనోవ్యథఁ బొందఁ
గ నిట్లు పుత్రకా. భార. శాం. ౧. ౩౯.

౩. అతిశయించు.

ద్వి. గొనకొన్నప్రేమమైఁ గొలువు చాలించి. రం.
రా. అర. ౧౭౦ పా. ౩ పం.

చ...ధ్వనుల్, గొనకొని పర్వ ... హరిశ్చ. ౩.
౯౦. రం. రా. ఉ. ౨౩ పా. ౧౭ పం.

౪. నెలకొను.

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున
నున్నవాఁడు...భాగ. ౩. ౬౨౨.

౪౭ డ. కుంభకోణమున గొనకొని కదలనిశార్ఙ్గధరు
నుపాసనచేసెద...హంస. ౪. ౨౧౩.

౫. తటస్థించు, సంభవించు.

ద్వి. పెను పొందఁగా సామభేదదానములఁ, గొన
రానికార్యంబు గొనకొనె నేని,మఱి గదాదం
డంబు...రం. రా. యు. ౨౮౯ పా.౧ పం.

౬. ఇది కొన్నిచోట్ల క్త్వార్థకరూపముతో వా
క్యాలంకారముగా నుండును.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనం
దనుండు చే,కొని భరియింపుము ... భార. ఆ
ది. ౪. ౧౦౪.

చ...గొల్లఁడుం,గొనకొని ముద్దుఁగన్నియకుఁ గో
రినయట్టిమగండు గల్గె నం,చును దనయాలుఁ
దాను నెదఁ జొక్కుచు నుండె ... నీలా. ౧.
౧౦౦.

చ. గొనకొని శోకవేగమునకుఁ...భా.రా. యు.
౧౫౫.

జః గొనకొలుపు.

గొనకొలుపు. స. క్రి. (√గొనకొను)
(పురికొల్పు, ప్రేరేచు)

క...విక్రమమునకుం, గొనకొల్పి తిట్లు వీరల...
భార. ఆశ్ర. ౧. ౧౬౧.

గొనను=గొనప[2]. ఆం. భా. ౨. ౧౨౩.

**గొనప**[1]=గొనమ. వి. అవిగిన నాఁగేలు, జీర్ణలాంగలము. (శ. ర.)

**గొనప**[2]=గొనను. విశే. పొట్టివాఁడు, వామనుఁడు.

సీ... గొ,నను గొనప గొనిసె గునిసె గిటక టెంగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩.

ఉదా: గొనపకోడి. (శ. ర.)

**గొనబారు.** అ. క్రి. (గొనబు+ఆరు) మనోజ్ఞమగు, సొగసగు.

సీ.కోకనదాకృతి గొనబారె నీకొమ్మ స్తననాభిబిలములు చరణయుగము. రసిక. ౩. ౬౨.

సీ. గొనబారునూఁగారు కొదమతుమ్మెద బారు... నీలా. ౧. ౫౬.

**గొనబు.** విశే. ౧. మంజులము, సొగసైనది,

చ...గొన బగుముద్దుమోము సమకొన్న మెఱుంగులకట్లదండయున్...శుక. ౩. ౧౦౫.

క...గొనబుమ్మెఱుఁగుంగరములు, చన వమరఁగ నిచ్చి...హంస. ౧. ౬౯.

గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు,చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య. ఆం. భా. ౩. ౧౪. నీలా. ౩. ౯౦.

౨. మధురము.

గీ. కుసుమరసమును గాదిది గొనబుజున్ను...శశాం. ౩. ౪౩.

౩. శ్రావ్యము.

గీ.గొనబుఁగోకిలరవములఁ గొంతసేపు.శశాం. ౪. ౬౭.

సీ. గొనబుఁబాటల నేర్పుఁ గుముదరసామోదసామోదమధుపశుద్ధాంతసమితి. వసు. ౩. ౨౭.

౪. సురభి, పరిమళించునది.

సీ. గొన బైనతట్టుపుణుగునను గోడలు వైచి మంచి గందంపుఁగంబములు నిల్పి. దశా. ౭. ౩౯.

౫. సొగసు, విలాసము.

సీ...గొనబు మురిపము మురువు సొగసు...హొయలనఁగ విలాస మొప్పమును. ఆం. భా. ౧. ౧౩౯.

జ: గొనబారు, గొనబుకాఁడు.

**గొనబుకాఁడు.** విశే. (గొనబు+ కాఁడు) సొగసు కలవాఁడు.

క. ఎన లేనిగొనబుకాఁడా, పెనుమినుకుం దెగలు వొగడు పేరిమివాఁడా. అచ్చ.రా.సుం.౧౭౧.

**గొనమ**=గొనప[1]. (ప్రా, శ. ర)

సీ...జీర్ణలాంగలసంజ్ఞ చెలఁగు గొనమ. గీ. యనఁగ...ఆం. భా. ౨. ౨౩౨.

**గొనము**[1]. వి. (సం. గుణః) సౌశీల్యాదిగుణము.

చ. గొనములప్రోక నీయనుఁగుఁగూఁతురు దీనితలంపు మాన్పఁగా,మనకు నశక్యము...భార. ఆర. ౬. ౧౭౪.

సీ. జడదారిరాయ యిజ్జగమున నాడెంపుగొనమును వాఁడియుఁ గనికరమును. అచ్చ. రా. బాల. ౨౭. ఆం. భా. ౧. ౯౭.

**గొనము**[2]. వి. (సం. గుణః.) గొనయము, వింటినారి.

సీ...గొన మల్లె నారి నా గుణము పరఁగు. సాం. ని. మాన. ౪౪. (ప్రమాణాంతరము లేదు)

**గొనయము.** వి. (సం. గుణః.) ౧. వింటినారి, మౌర్వి.

క. అని వెస నాదివ్యశరం, బనూనమంత్రప్రకాశ మగునట్టులుగా, గొనయమునఁ జేర్చి తిగిచినఁ,గని యశ్వత్థామ బాహుగర్వం బలరన్. భార. ద్రో. ౩. ౨౦౪.

క...సింగిణి,గొనయం బెక్కించి ముల్కిఁ గూరిచి కడిమిన్. అచ్చ. రా. బాల. ౧౧౪. ఆం. భా. ౨. ౨౧౧.

౨. ధనురగ్రము, గనయము, వింటికొప్పు.

సీ. ధనురగ్రగుణములు దను గొనయం బన...ఆం. భా. ౩. ౫౧.

**గోనిసె**=గోనను. ఆం. భా. ౨. ౧౨౩.

**గోనుగు**=గోలుగు. వి. గుడఫలము. (శ. ర.)

**గొప్ప.** విశే. (కాల పరిమాణము మున్న గువానిలో) ఘనము, పెద్దది.

చ...పల్మఱుఁ గైకొని గొప్పతమ్మికం,పులు...నీలా. ౧. ౬౧.

సీ...కప్పులు గొప్పలు గలవు మ్రింగ. దశా. ౧. ౧౩౭.

సీ.గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాంకము లైనముంజేతు లమరువాఁడు. విజ. వి. ౨. ౧౬౪.

ఉదా:-ఆతఁడు అదృష్టమువలన గొప్పపదవికి వచ్చినాఁడు. వారికి గొప్ప పాండిత్యము కలదు.ఆ యూరిలో గొప్పపెండ్లి జరిగినది.ఆయనమనస్సు చాల గొప్పది.

వి. గొప్పతనము.

(వ్యవ) వాఁడు గొప్పకోసము తంటాలుపడుచున్నాఁడు.

జః గొబ్బండు.

**గొప్పలు.** వి. బ. ౧. మిరెపతోఁటమున్న గువాని యందు కొంచె మెత్తుగా నుండెడుచోట్లు. (శ. ర.) ౨. గోపానసి, చూరుపట్టె. (చి. ని, శ. ర.)

**గొబ.** వి. (సం. గుహా. త. కెపి.) ౧. గుహ.

గీ. పఱచునురవడిఁ బోడమునిబ్బరపుమ్రోత, కొండగొబ లెల్లఁ జొచ్చి యొండొండ పెరుఁగు. హరి. ఉ. ౫. ౧౬౧.

౨. గొంది, మూల.

క. మార్జాలంబులు చెలఁగుచు, గర్జించెను గొబల నుండి...ఉ. హరి. ౫. ౩౬.

**గొబడి.** వి. పక్షివిశేషము, ఒకానొకపక్షి.

సీ. జిట్ట గొబడి డాబ జీనువ పద్రంగి గున్నంగి ...ఆం. భా. ౨. ౯౭.

**గొబ్బండు.** వి. (గొప్ప+పండు) పెద్దపండు.

సీ. పాకవేగారంభపరిపాటిఁ దమయంతిఁ బగిలిన పనసగొబ్బండ్లచేస,ము...పాండు. ౧.౧౧౮. (శ. ర. పా.)

**గొబ్బున**=గొబ్బువ. అవ్య. ద్రు. (త. గొబ్బెనల్) (శీఘ్రముగా.)

చ. విని సరసీరుహాక్షుఁ డతివిస్మితుఁ డై జలజూన్యకూప మల్లన కదియంగ నేఁగి కృకలాసము నొక్క తృణంబుఁబోలె గొ,బ్బన వెడలించె వామకరపద్మమునన్ ... భాగ. ౧౦ ఉ. ౮౫౬.

చ...శుభస్య శీఘ్ర మనుపల్కు నిజం బొనరింపుమన్న గొ,బ్బునఁ బతిచిత్తవృత్తి గని భట్టి... క ... శుభలగ్నము నిర్ణయించి ... విక్ర. ౮. ౧౩౮, ౧౩౫. భోజరా. ౮. ౧౬౭.

**గొబ్బరము.** వి. (క. గొబ్బర.) ఎరువు, చేలకు వేసెడిపెంట. (బ్రౌ, శ. ర.)

**గొబ్బి**[1]. వి. (త. కొప్పి.) ౧. ధనుర్మాసదినములసాయంకాలములయందు గడపలకు ముందు బాలికలు పాటలు పాడి చేతులు తట్టుచు చుట్టివచ్చి జరిపించెడునొకవేడుక. (శ.ర.)

సీ...పొంగలికిఁ దేవలకుసు గొబ్బికిని...గీ...కొఱతపడకుండఁ గుండ లాకుమ్మ రిచ్చు.హంస. ౫. ౧౮.

౨. సమర్తాడినపుడు బాలికలు పాటలుపాడి చేతులు తట్టుచు చుట్టివచ్చి జరిపించెడునొకవేడుక. (శ. ర.)

**గొబ్బి**[2]. వి. క్షురము, గొలిమిడి చె. (దీనిపువ్వులు పచ్చగా నుండును.)

సీ...క్షురము విరాజిల్లు గొబ్బి యనంగను గొలిమిడి యన. ఆం. భా. ౨. ౫౬.

జ: గొబ్బికాయలు.

గొబ్బికాయలు. వి. బ. (గొబ్బి² + కాయలు) ధాన్యవిశేషము.

సీ. గొబ్బికాయలు బలుగుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు...గీ ...ఆదియగు పేళ్లు గలుగు వడ్లు...హంస. ౪. ౧౨౭.

గొబ్బిలి. వి. ఉపయోగము లేని ఒకానొక చెట్టు. (బ్రౌ)

గొబ్బిళ్లు¹. వి. బ. ౧. బాల్యక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు. గీ... ఆదిగా శైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు...వి. పు. ౭. ౨౦౨.

సీ...బొమ్మరిండ్లు గుజగుజరేకులు గొబ్బిళ్లు... హంస. ౫. ౧౫౫.

(వీనుఁగు)మ...పులులం గారెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచున్, గొలఁకు ల్లొచ్చి కలంచుచు న్గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్. భాగ. ౧౦. ౩౫. (గొబ్బిళ్లకోరాడు=గొబ్బిళ్లవలె-బాల్యక్రీడావిశేషమువలె-కోరాడు అని తోఁచుచున్నది. శ. ర)

౨. ఒకానొకపాట.

సీ. బెసకునందములు గొబ్బిళ్లపాటలు కొప్పుసవరించు నేర్పు చేసన్నవగలు. శుక. ౨. ౪౩౩.

ద్వి. చెలఁగి వీనులఁ గేలు సేర్చి గొబ్బిళ్లఁ, బలుతెఱంగులఁ గూడి పాడెడువారు. అ. మ. క. ౨. ౧౪ పా. ౩ వం.

గొబ్బిళ్లు². వి. బ. నమస్కారభేదము.

సీ... మ్రొక్కు దండము కేలుమోడ్పెఱఁగుడు, నాఁగఁ జెన్నొందును నతి తద్విశేషముల్ చేవిప్పు వెన్నెలచిన్ని పువ్వు, జోహారును జోహారు జోడాలు చెంగనాల్ డింగిళ్లు గొబ్బిళ్లు డెంకణాలు....అం. భా. ౨. ౧౬౫.

రగడ. వజ్రపురిని దావలమై చిక్కన, గోపప్రియునకు గొబ్బిళ్లనుచును. హంస. ౪. ౨౧౩.

గొబ్బున=గొబ్బన. అవ్య. ద్రు. ౧. శీఘ్రముగా.

సీ. తతవయోవిభవ కీలితకూన కాసన్న పున్నాగవిహృతి గొబ్బునసె యబ్బు. వసు. ౨. ౫౯.

మ...లే లెమ్మటం,చమితోత్సాహము మీఱ నెత్తె సురరాజ్యశ్రీసమాకర్షణ,క్రమపాండిత్య కలాపిచండిలభుజాకాండంబులన్ గొబ్బునన్. దశా. ౨. ౧౨౪.

సీ. జడితి గొబ్బున వేగ సరగు గ్రక్కున వడి వేగిర మనఁ దగు వేగమునకు. సాం.ని.మాన.౨౧.

౨. ఆకస్మికముగా.

ఉ...ఘృత మతిమాత్రఁ బోసినన్, గూరికి కూర్కి యాక్షణమ గొబ్బున మండినదీపమో యనన్. నైష. ౩. ౧౧౬.

సీ. మఱుఁగునెట్టక డెంద మెటిఁగించుకై పడి గొబ్బునఁ బయ్యెదకొంగు సడల. విక్ర. ౧.౧౨౨.

గొబ్బుగొబ్బునన్=అతిశీఘ్రముగా, వేవేగ.

గీ. గొబ్బుగొబ్బునఁ దలలెత్తి కొండ ఱందుఁ, జాడఁ జూడంగఁ బాగలు వీడి పడిన... సారంగ. ౧. ౧౨౩.

గొమలిరేకు. వి. మొగలిరేకు. (మొగలి-వర్ణవ్యత్యయముచే 'గొమలి' అయినదా?)

గీ. జాణవిప్రుండు సిగఁ దాల్చెఁ జందమామ, కొండనాలుక యగునొక్క గొమలిరేకు. క్రీడా. ౧౭౬.

గొయి=గోయి. (దీనికి ప్రథమైకవచనమందే ప్రయోగము.)

చ...అతఁ డప్పుడు ముందట నుయ్యి వెన్కలోఁ, తగుగొయి యున్నలా గయినఁ దల్లడ మంద వణంకు మేనితోన్. విక్ర. ౩. ౧౧.

గొయ్యి=గోయి.(దీనికి ప్రథమైకవచనమందే ప్రయోగము. ఇది 'నుయ్యి'వంటిది)

**గౌరక¹.** వి. (సం. ఖురాలకః.) ౧. ఇనుపబాణము, అమ్ము.

గీ... ఒక్క, యొంటిగాని మహీనాథుఁ డొడిఁగి యేయ, గౌరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె, లేదసృక్పాన మనుచుఁ దెల్పెడు నవం గ. మనుచ. ౪. ౪౭.

సీ. చిన్న నేజయు నమ్ము చెలఁగును గౌరక నా... ఆం. భా. ౩. ౪౪. మనుచ. ౨. ౬౧.

౨. చిన్నయీఁటె.

క... రాజు... ఉరస్థలినపుడా పిడికిటిగౌరకన్ వేయం, బిడికిటి బిట్టైగసి బిల్లమీటుగఁ బడియెన్. సారంగ. ౧. ౯౬. ఆం. భా. ౩. ౪౪.

జః గౌరకకట్టె.

**గౌరక².** వి. (సం. ఖురాకః.) మృగవిశేషము. (శ. ర-కారెనుము, వనమహిషము. బ్రౌ.)

**గౌరక³.** విణ. చింపిరి ?

వ. వికృతముఖంబును గౌరకవెండ్రుకలును మిడిగ్రుడ్లును... జాహ్నవీ. ౪. ౨౦.

ఆ... గౌరకవెండ్రుకలును గుఱుచచేతులు నయ్యెఁ, దరుణులకుఁ బిశాచతనువు లాదవె. పద్మ. ౩. ౧౮౯.

**గౌరకకట్టె.** వి. (గౌరక¹ + కట్టె.) అలుఁగు గలచేతికఱ్ఱ. (శ. ర. చేతియీఁటె, చిన్నయీఁటె-బ్రౌ)

**గౌరగ.** వి. (క. గొరగ=శైవభిక్షువు.) ౧. మైలారు అనుక్షుద్రదేవతను గొలిచెడియొకానొకమతము వాఁడు; ఆమతముది.

సీ. గౌరగయై మైలారుఁ గొనియాడు నొకవేళ నొసలిపై బండారుపసుపుఁ దాల్చి. కాశీ. ౭. ౨౩౦.

గీ. వీరమైలారుదేవరవీరభటులు, గొండ్లియాడుచు నున్నారు గౌరగపడుచు, నాడుచున్నది చూడు మర్థాభినయము, తాను నెట్టికనీలంత గాని లేదు. క్రీడా. ౧౪౩.

౨. భిక్షుకుఁడు.

క. పులిహూమతిండిగౌరగం, గలిచియు నోఁచెల్ల యింత గల్పించెదు ... కు. సం. ౭. ౧౭౪, ౧౬౯.

౩. శివభక్తుఁడు.

ద్వి. గౌరగ లుమ్మెత్తవత్తిరిఁ బూజసేయు, మరులెత్తి వచ్చితో యురుతరాటవికి. బస. పు. ౩. ౬౪౫ పం.

(శివభక్తుఁ డగురాజుశివమును చూచి ముసిఁడి చాడయ్య అన్నమాటలు.) ద్వి. డిగుడిగు గౌరగ నాకగపడి తింక. బస. పు. ౫. ౪౪౭ పం.

**గౌరగౌర.** వి. వేగము. (శ. ర)

క. ఇరువంకలఁ దన్నుఁ బొదివి, గొరువంకలుఁ దుమ్మెదలును గోయిలలుం డక్కరిబిలుకలుఁ బురిపులుఁగులు, గౌరగౌర రా మరుఁడు వెసలెఁ గొమ్మఁ గలంపన్. నీలా. ౩. ౧౧.

సీ. గౌరగౌరఁ బరువిడి... రసిక. ౧. ౧౧౩.

**గౌరజే(ర్జె).** వి. కాలిత్రోవ. (బ్రౌ)

**గౌరమ.** వి. మిట్ట.

ద్వి... వాఁగుల మడులఁ బల్లముల, గౌరముల మడుఁగులఁ గొండలవరిని. నవనాథ. ౪౬. (బ్రౌ)

**గౌరవంక=గోరువంక.**

సీ... శారికాఖ్య, గోరింక గోర్వంక గౌరవంక గోరంక గోరువంక యనంగ మీఱుచుండు. ఆం. భా. ౨. ౧౯. (వ్రాతప్రతిపా.)

క. గౌరవంకయాసమాటల, మరువంకఁ దలంకు గలిగె మగువకుఁ దమలో, వెర వింక నేమి కలదని, యిరువంకలఁ బొగిలి రవ్వ డెంతయు వంతన్. విక్ర. ౭. ౬౧. (గొరువంక ... వెరువింక. శ. ర. పా) విక్ర. ౭. ౪౯. యయా. ౨. ౨౪.

జః గౌరవంకరాజనాలు.

**గౌరవంకరాజనాలు.** వి. బ. (√ గౌరవంక) ధాన్యవిశేషము.

వ...సుఖభోగులు సన్ననూదులు గొరవంకరాజనాలు కాటుకరేకులు ...ప్రబంధ. ౧౧౨.

గోరిజే=గోరిసె.

చ. గోరిజలత్రొక్కనం బ్రిదిలి కుండలిభర్త యొదుంగ...పోత్రివై,ధర వదలంబుగా నిడిన తావకలీలఁ దలంతు మవ్యయా. నృసిం. ౩. ౩౬.

చ...ధరకా, గోరిజలు మోపి మోప వన ఘోటకముల్ పడిఁ బాఱుచున్నవి... ప్రబోధ.౪. ౩౯. అం. భా. ౨. ౧౯౭.

గీ... మేకములు గెరలి బెదరి, గోరిజదాఁటుగఁ బరుగెత్తి తిరిగి చూచె.... కువల. ౧. ౯౫.

గోరిసె=గోరిజే. వి. (సం. ఖురః. క. గొరిసె.)

చ. గోరిసెలయందముకా గుఱుచకొమ్ములచందము వెన్నుమందముకా... పారు వగుకామధేనువు ...దశా. ౨. ౨౪.

జః గోరిసెగాలి.

గోరిసెగాలి. వి. (గోరిసె + గాలి.) పసువుల గోరిసెలనడుమ పుండై పురుగులు పడెడివ్యాధి. (శ. ర.)

గోఱక. వి. ౧. అడవిదున్న, కారుపోతు. (బ్రౌ.)

౨. కారుపోతుయొక్క అఱపు.

గీ.ఒక్కఁ డడుగెత్తి గోఱకవేయుచును డాఁచి, నట్టరిగి పెంకిఁ గని వీఁకఁ బట్టుటయును,మృగయు లందఱుఁ జని వెల్వరించి నిశిత, కాండములఁ జెండి రొకపెద్దకారుపోతు.మనుచ. ౪. ౪౮.

గోఱకు. విణ. (సం. క్షుల్లకః) నీచుఁడు, దుష్టుఁడు.

గీ. తాను జెడుట గాక తక్కినవారినిఁ, జెఱుపఁ జూచె నార గోఱకుఁబడుచు, వీని నెట్టులైన విసువక పాలియింప,వలయు ... నృసిం. ౪. ౯౬.

చ. గోఱకుఁదనంబు మీఱ ధరఁ గ్రుమ్మరుచుండుదు ...దశకు. ౩. ౧౧. విజ్ఞా. ఆచా. ౧౩౯.

గోఱపము=కోఱపము. వి. ౧. గుఱ్ఱమును తోముట కుపయోగించు పనిముట్టు.

వ...పిడుకగోఱపంబుతోమకంబునఁ బుటపుటనై...కొడమతట్టువగుంపు...ఆము. ౪. ౩౫.

గీ. గోఱపమా లేదు నీరార్చుగొడవ యెఱుఁగ, గడ్డి వేయఁడు...శుక. ౩. ౪౦౮.

౨. (సం. క్షురప్రః.) కోఱపము, అర్ధచంద్రాకారబాణము.

ద్వి. కరగసంబులఁ ద్రెంచి కత్తులఁ గోసి, గోఱపంబులను డుస్సి కోఱవులఁ జాఁడి... రం. రా. ఉ. ౫౨ పా. ౭ పం.

గోఱియపోతు. వి. (గోఱియ+పోతు) మేషము, మగగొఱ్ఱె.

గీ. మేర మీఱినగొఱియల మేఁకగముల, గొఱియపోతుల నతికి ప్రోగులుగ నిడ్డ,వెగ్గలపుఁబచ్చి నంజుళ్లు...కడుపార మెసవి...అచ్చ. రా. యు. ౨౩౧.

గోఱుగు(ర్గు). స. క్రి. (సం. క్షుర్.) క్షౌరము చేయు.

క. అలరుక్మి రుక్మవసనుఁడు, తలయును మీఁతియును గొర్గి తను విడుచుటకుకా ... భోజను తా. ౪. ౧౪౪.

చ...ధరణీపతి...నిష్ఠురభాష లాడి... తల గొఱిగింపఁ బంచె నొకతప్పను గావరుగా నృపాలకుల్. కాళ. ౧. ౪౫. భాగ. ౧౦ పూ. ౧౭౭౦. ఆము. ౬.౭౧. భార. ఆర.౬. ౨౯౦.

వి. గోఱుగుట, వపనము.

గోఱుగులుపడు=గోఱఁగఁబడినవగు.

చ. గోఱుగులువడ్డవెండ్రుకలు గ్రూరపుఁజూపులుఁ గోరదాడలున్...కల్గినబ్రహ్మరాక్షసుం,డు... పద్మ. ౨. ౧౯౧.

గొఱుపడము=గోరుపడము. వి. నల్లకంబళము.

ద్వి. వఱదఁ బోవు నెఱుఁగు గొఱుపడం బదుమ, నెఱుఁగక యీఁత కాఁ డేఁగి పట్టుమును. బస. పు. ౩. ౧౧౩౭పం.

ద్వి. నెఱి నెన్నిమాఱులు నీళ్లలోపలను, గొఱుపడం బుదికిన మఱి తెల్ల నగునె. బస. పు. ౭. ౮౬౫పం. చెన్నబ. ౩. ౩౧.

గొఱె(ఱియ)=గొఱ్ఱె. వి. ౧. (సం. కురరీ. క. తు. కుఱి) మేషి; మేషము.

చ...గొఱెతోళ్లు...చట్టులు చట్టిమూఁతలుం, గలుగుములాల గేహము ప్రఘాణము చేరిరి పాండునందనుల్. పాంచా. ౨. ౪. భార. భీష. ౧. ౨౯౬.

క...గొఱియలపాఁడియును దఱ చగుఁ...భార. ఆర. ౪. ౨౯౫.

చ. గొఱియల మేఁకపోతులను గొమ్ముపొటేళ్లను గావుకొందు, వు...కాళికేశ్వరీ. వీథి. ౪౧.

౨. మూర్ఖప్రాణి, తెలివిమాలినజంతువు.

ద్వి. కొఱగానిజఱభులకొయ్యన గాండ్ర, గొఱియలవార్తలు గూడునే త్రవ్వ. బస. పు. ౫. ౯౧ పం.

గొఱియలనూడు, గొఱియగొంగ=తోడేలు.

సీ...తోడేలు గొఱియలనూడన వృక మొప్ప...సాం. ని. తిర్య. ౭౬. వేంక. తిర్య. ౯౫.

జ: గొఱియపోతు.

గొఱ్ఱు. వి. దే. ౧. దున్నినపొలమును చదును చేయుసాధనము.

సీ. కోళ్లగూండ్లును గొఱ్ఱు కుఱుగాఁడి యేడికోలలు కాఁడి పలుపులు గలుగునటుక. శుక. ౨. ౪౦౮.

సీ. గుంటక నాఁగను గొఱ్ఱు నా... కృషి, సాధన భేదముల్ ...ఆం. భా. ౨. ౨౩౩.

౨. ముప్పదిరెండుకుంటలకొలఁది. (శ. ర.)

గొఱ్ఱె(ఱ్ఱియ)=గొఱె.

సీ. కోకలుఁ రూకలుఁ గొఱ్ఱెలుఁ బఱ్ఱెలుఁ ...నీలా. ౨. ౪౧.

గీ. గొఱ్ఱె గొఱ్ఱియ యనఁగను గొఱలు మేషి. ఆం. భా. ౨. ౨౬౫.

(గొర్లు అనుబహువచనాంత మొక్కచోఁ గనఁబడుచున్నది.)

సీ. తొట్రించి గొర్లలోఁ దోడేలు సొచ్చిన ట్లీగబ్బి లేళ్ల నట్టిట్టు సేయు. సారంగ. ౧. ౯౨.

గొల=గెల, గొలక[1]. వి. (బ. గొలలు, గొళ్లు-సం. గుచ్ఛః. క. గొలె. త. కులై.)

(పూవులు పండ్లు మొదలగువాని) గుత్తి.

చ...తొలుగుబ్బలిఁ గొండగోఁగుపూ, గొల యలరించె నాఁ బొడిచెఁ గోకనదాప్తుఁడు... పారి. ౨. ౬౯.

గీ. వారు చెట్టునఁ దనుదాన యూరఁబండి, నట్టిపరువంపురసదాడి యరఁటిపంటి, గొలలు చక్కెర నెయ్యి మక్కువ నొసంగ. శుక. ౨. ౩౭.

సీ...మనసింహమధ్య గోరనె పూనుకొని కబంధము వాపె నీగజగమనఁ బొదివి. గీ. రాజముఖులార వరముఖాంభోజలార, చారుబిసబాహులార రంభోరులార, కందఁగా నేల ముడుఁగుచుఁ గుంద నేల, కుళ్లఁగా నేల తలవంపుగొళ్ల వేల. చంద్రా. ౪. ౨౫౮.

గొలక[1]=గొల.

(పూలగుత్తి.)

గీ. పొడుపుమలపొన్నపై నెలపువ్వుగొలక, నెలకొన నొకింత నగియె నాఁ దెలుపు దోఁచె. హ. న. ౪. ౧౪.

బ. తాటిచన్నులు (శ. ర-గులకలు. వా)

గొలక[2]. వి. కలకలధ్వని, గొల్లు.

సీ...కలకలధ్వని దోఁచు నలబలం బన హాళాహాళి యనంగ, గొల్లన గొలకన గొల్లన రొదయనె ...ఆం. భా. ౧. ౧౨౧.

గొలగొల=కొలకొల. వి. ౧. కలకలధ్వని.

సీ. జమిలిముక్కాలిపిసాళిబల్లోతకుఁ గొదవ కోయిలచాలుగొలగొలలకు. గీ... మిగుల నెద నోడి యాడు నమ్మించుఁబోఁడి. నీలా.౩.౧౫.

౨. ధ్వన్యనుకరణము.

వ...కలికినుసుపోగపలుకులకలకలంబున గొలగొల మనుకా తుకాగారంబు సొత్తెంచి. మనుచ.౫. ౭౫.

గొలిమిడి. వి. క్షురము కీ.

సీ...గొలిమిడి నీరుబచ్చలి...హంస. ౪. ౧౦.

సీ...క్షురము విరాజిల్లు గొబ్బి యనంగను గొలిమిడి యన. ఆం. భా. ౨. ౫౬.

గొలివె. వి. తృణవిశేషము. బ.తృణధాన్యవిశేషము.

సీ...తృణధాన్యములు చెలంగు, గునుకులు దూసరుల్ గొలివె లనంగను ... ఆం. భా. ౨. ౨౩౯.

గొలుగు=గొనుగు. (బ్రౌ, శ. ర)

గొలుసు. వి. (క. గొలసు.) ౧. కుక్క మొదలగువానిని గట్టెడుశృంఖల; సంకెల.

(జాగిలముయొక్కవర్ణన) వ...పసుపార్చి కట్టుఁగంబంబులకుం దార్చి బంధించినకుందనంపు గొలుసులు గల్లుగల్లుమనంగ. మనుచ.౪. ౨౭.

సీ. శుకకదంబము గొలుసులచే నిబద్ధమై వారాంగనాగారకారఁ బడఁగ. ఆము. ౨. ౪౩.

౨. గొలుసువలె నుండి మెడ చేతులు మున్నగువానియందు ధరింపఁబడెడి యాభరణవిశేషము.

సీ...గొలుసనలలంతికావిశేషం బగు ... ఆం. భా. ౨. ౧౪౯.

(వ్యవ) వాఁడుచేతిగొలుసులు తాకట్టుపెట్టినాఁడు.

గొలుసుకట్టువ్రాఁత, గొలుసుమోడివ్రాఁత=గొలుసువలె అక్షరములు కలిసియుండువ్రాఁత. (చి.ని.)

జ: గొలుసుగొను.

గొలుసుగొను. అ. క్రి. (గొలుసు+కొను) గొలుసువలె నుండు,ఒకదానితో నొకటి యంటి యుండు.

గీ. ఆదిశబ్దంబునకు మీఁద నడరుపదము, దగువిశేషణములతోడఁ దగిలి వరుస, గొలుసుగొని యర్థసంగతిఁ గూడెనేని, నదియు నేకావళీసంజ్ఞ నడరు నండ్రు. కావ్యా. ౬. ౨౧.

గొల్ల[1]. వి. (సం. గోపాలః. ప్రా. గోఆలా.క. గొల్ల) ౧. పసులమేపియు పాలు నెయ్యి అమ్మియు జీవించుజాతి.

ఉదా: గొల్లది. గొల్లవాఁడు.

సీ. గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి పరకామినీసహోదరతఁ బూన. పారి. పీఠి. ౧౭.

౨. గొల్లజాతివాఁడు, గోపుఁడు.

క...తా నప్పుడు గొల్ల మెచ్చెఁ దనకులకాంతల్ నా. పంచ. ౧. ౪౧౫.

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుకయేనియు లేదు నీదెసల్...భార. విరా. ౧.౨౫౧.ఉ.రా. ౨. ౨౨౧.

జ: గొల్లఁడు, గొల్లత, గొల్లపల్లె, గొల్లసివాలు, గొల్లెత.

గొల్ల[2]. వి. ౧. ద్వారపాలుఁడు.

క. ఇదియే మించక వారిం, చెద మనుచుఁ గడంగ నీదు చిత్తమునకు రా,దదరిపడి మొన్న గొల్లల, నదటుఁ బొడిపించువాఁడ వైతి నరేంద్రా. పరమ. ౩. ౬౪.

సీ. వెలిహజారంబున నిలిచి గొల్లలు నిల్పఁ బలికి నే వచ్చుట దెలుపుఁ డనుచు, నవసరంబులవారి ననుసరించిన వారు సమయంబు గా దని జాగుచేయ. దశా. ౨. ౯౭.

౨. ధనపాలుఁడు, కోశాగారమును కాపాడువాఁడు. (శ. ర, బ్రౌ)

ద్వి. తొలుత మంత్రి పురోహితులు యువరాజు, దళవాయి గొల్ల లంతఃపురీకర్త. రం. రా. అయో. (శ. ర)

**గొల్లఁడు.** విణ. (√ గొల్ల[1]) మూర్ఖుఁడు.(గొల్లవాఁడు మూర్ఖుఁ డగుట లోకప్రసిద్ధము)

క. ఒల్లనిసతి నొల్లనిపతి, నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే, గొల్లండు కాక ధరలో, గొల్లండును గొల్లఁ డౌనె గుణమున సుమతీ. సు. శ. ౨౩.

వి. ఆలకాపరి, వ్రేఁడు.

క. గొల్లఁడు వ్యాధుఁడు రజకుఁడు, కల్లమ్మెడు వాఁడు లోనుగాఁ గొందఱు దా, రిల్లాల ప్పరువం దగు,నిల్లు నడపుచనవు దాని కిచ్చినకత నక్. విజ్ఞా. వ్యవ. ౭౦. వేమన. ౨. ౨౯౪.

**గొల్లజిడ్డు.** వి. నాగిని *.

గీ...నాగిని యగు, గొల్లజిడ్డన... ఆం. భా. ౨. ౬౬.

సీ...దొండతీఁగె ముల్లంగి గొల్ల,జిడ్డు... హంస. ౪. ౧౦. ('గొల్లజీఁడు' అని ముద్రి, శ్రౌ.పా)

**గొల్లత.** వి. (గొల్ల[1] + త) గొల్లది, గోపిక.

ఉ. గొల్లతల న్విరాళి తగఁ గొల్చెడు కృష్ణుఁడు ...మొ. రా. పీఠి. ౩. హరి. పూ. ౫.౨౨౩.

**గొల్లదొండు.** వి. మత్స్యవిశేషము.

గీ. అల్లెద మ్మప్పఁజేఁపయు గొల్లదొండు, పరిగె రొయ్యాగియగుమీలఁ బట్టు నతఁడు. హంస. ౪. ౧౯౭.

**గొల్లపల్లె(ల్లియ).** వి.(గొల్ల[1] + పల్లె.) ఘోషము వ్రేపల్లె.

గీ...వ్రేపల్లె యనిన,గొల్లపల్లె యనంగను ఘోషమగును. ఆం. భా. ౨. ౨౩.

**గొల్లము.** వి. (చి. ని, శ. ర–క. కొళ) ౧. పడియ, నీళ్లగుంట.

గీ. కూడి గిరులుఁ దరులు గొల్లంబుఁ బల్లంబు, నరసి మిట్టపుట్ట లడవిఁ దడవి, యోపి లోలులు గొలులు నోలంబు సాలంబు, నూది క్రంతగుంతఁ జొచ్చి వచ్చి. ఉ. హరి. ౫. ౩౧౧. (శ. ర. పా.)

౨. (క. కొళ్ల) పల్లము.

ద్వి. మెల్లన సాగుచు మెట్టు మెట్టుచును, గొల్లముల్ డిగ్గుచుఁ గురువ లెక్కుచును. పండితా. పర్వ. ౩౪౭ పా.

ఆ...ఎల్లగుహలయందు, వెదకి యోలములు వివేకించి చఱుల భావించి గొల్లములకుఁ బంచె దృష్టి. భోజరా. ౪. ౫౩.

**గొల్లసివాలు.** వి. బ. (గొల్ల[1] + సివాలు.) గొల్లవాఁడు సివమెత్తి పాడెడుపాటలు.

సీ. ఒక్కఁడు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుపాటు గొల్లసివాలు పాడుకొనుచు. కువల. ౨. ౧౧౪.

**గొల్లియన,గొల్లెన.** వి. ఒకవిధ మైనగుడారము.

క. పసిఁడిజలపోసనంబుల, నసమురుచిం బొలుచు గొల్లియన లున్నతిఁ బెం,పెసఁగెం బసిండిగుబ్బలి, పసినిసుఁగులగతిఁ దదంకభాగస్థములై. కవిక. ౨. ౯౬. (శ. ర. పా)

మ...పుష్కరసరఃపార్శ్వంబునం దెల్లి గొ,ల్లెనలెత్తింతు...ఉ. హరి. ౪. ౨౦౬.

ద్వి. గూడారముల్ డెరల్ గొల్లెనల్ బన్ని. పండితా. పర్వ. ౩౫౦ పా.

జ: గొల్లెనబండి.

**గొల్లు.** వి. ౧. కలకలధ్వని, గెల్లు.

సీ...కలకలధ్వని దోఁచు వలబలం బన హాహాళి యనంగ, గొల్లన గొల కన గెల్లన రొద యన...ఆం. భా. ౨. ౧౨౧.

గీ. గొల్లుగాఁ గూఁక లిడుచు గగ్గోలునేసి ...అచ్చ. రా. యు. ౨౨౭.

౨. నవ్వుట నక్క కూయుట మొదలగువానియం దగుధ్వనికి అనుకరణము.

ఉ... గొల్లున నవ్విరి ప్రౌఢభామినుల్. భాను. ౨. ౭౮. ఉ. హరిశ్చ. ౩. ౩౦.

క. గొల్లునఁ గూసెడినక్కలు, పెల్లార్చి యదల్చు భూతబేతాళంబుల్. సానందో. ౨. ౯.

గొల్లుమను=౧. మిక్కుటమగు, అతిశయించు.

సీ. పాదుక ల్మెట్టుచోఁ బటువేత్రధరసౌవిదల్లసాహోధ్వనుల్ గొల్లుమనఁగ. ఇందు. ౨.౧౨౩.

౨. ఏడ్చు.

ఉ...కానకు రాఘవుండు పోఁ,గా నిపు డెంత పుట్టెఁ గడగండ్లనువార్తలు మిన్నుముట్టి బి, ట్టైనగ కెల్ల గొల్లుమన నాగత మయ్యెఁ బ్రభాత మంతటన్. చం. రా. ౪. ౯౫.

(వ్యవ) వానిప్రాణము పోయినతోడనే యింటిలో నందఱు గొల్లుమన్నారు.

**గొల్లెత**=గొల్లత. వి.(గొల్ల[1] + ఎత)గొల్లది,గోపిక.

ద్వి.గొల్లెతరూపంబు గొల్లెతయిల్లు,గొల్లెతయున్నయుంకువయుఁ జెప్పుటయు. బస. పు. ౨. ౫౨౫ పం. పండితా. దీక్షా. ౭౩ పా. వేం. పంచ. ౧. ౫౯౪.

**గొల్లెనబండి.** వి. (గొల్లెన + బండి) గూఁడుకట్టిన బండి.

ఉ. పల్లకులన్ మహోక్షముల భద్రగజంబుల నందలంబులన్, గొల్లెనబండులన్ నడకగుఱ్ఱపుమోటులవేసడంబులన్, బెల్లుగ నెక్కి పౌరజనబృందము వోఁ బురినైదునాళ్లు భూ,వల్లభుఁ డుండి తాఁ గదలె వాయుజముఖ్యుల తోడ వేడుకన్. జై. భా. ౨. ౧౧౩.

**గొవరు.** వి. తాపము. (చూ. గొవరువోవు.)

జ: గొవరువోవు.

**గొవరువోవు.** అ. క్రి. (గొవరు+పోవు)తపించు.

గీ. కొన్ని దేశంబు లెండచే గొవరువోయె. కాశీ. ౧. ౧౩౭. (శ.ర)

**గొహరు.** వి. ౧. అంతు, పెద్దప్రోత.

సీ...అంతు గొహరు గోర పన వెలయు,నాఘూర్ణనసమాఖ్య...ఆం. భా. ౧. ౧౧౫.

౨. బాధ.

పంచచామరము. జొహారు మీకుఁ జల్లఁగాఁగఁ జూడుఁ డోసమీరకం, జహారులార మంట మారి శంబరారిఁ గూడి నన్, గొహరు నేయ నేల సారెకున్...సారంగ. ౨. ౧౮౦. (గొహరునేయు=బాధించు) కువల.౫. ౧౯.విజ. వి. ౩. ౪౯.

## గో

**గోండము.** సం. వి. అ. పుం- వృషభమునొక్క- అండమువంటిది-ఉబుకుబొడ్డు, పెద్దబొడ్డు.

**గోండుఁడు.** సం. విణ. (అ. ఆ.అ)-వృషభము యొక్క అండమువంటి బొడ్డు గలవాఁడు-ఉబుకుబొడ్డువాఁడు, పెద్దబొడ్డువాఁడు. వి. అ. పుం. కొండలందు నివసించునొకపామరజాతివాఁడు.

**గోండ్రించే**=గోండ్రిలు. అ. క్రి. (√గోండ్రు.) -ఎలుఁగు మొదలనవి-కూయు.

ద్వి. గొటగొట గోండ్రించి కోఅ లొండొంటిఁ, గటకటఁ దాఁకింప గర్భంబు గలఁగి. నవనాథ.3భా. (శ.ర)

**గోండ్రింపు**=గోఁడిరింపు. వి.(√గోండ్రించే)-పులి మున్నగువాని-కూఁత. (వా)

**గోండ్రిలు(ల్లు)**= గోండ్రించే. అ.క్రి.(√గోండ్రు.)-పులి మొదలగునవి-కూయు.

ద్వి. బిలముల గుహలందు బెబ్బులుల్ చిఱుత, పులులు గోండ్రిలుచుండు...ద్వి. నల. ౩.౧౧౭ పా. ౧౭ పం.

సీ. కినిసి గోండ్రిలుచుఁ బైకొనుపంచనఖములు బాపటిఁ బెల డింపపతేచి పతేది.కృ.శకుం. ౧. ౬౧.

**గోండ్రు.** వి. (ఎనుపోతు, మొ.) అఱచుటయందు గుధ్వనికి అనుకరణము.(ఆమ్రేడితరూపము-గోండ్రుగోండ్రు.)

చ... ఆ,కెళవుల నాడువాలభుజగిం గని గోండ్రని యంగలార్చుచుక్...ఆము. 3. ౧౯.

గీ. గోండ్రుగోండ్రని గర్జించుఁ గొంతతడవు,కోరచూపుల వీక్షించుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౭౬.

జ: గోండ్రించు, గోండ్రింపు, గోండ్రిలు.

**గోఁకు.** స. క్రి. గీఁకు, బరుకు. (శ. ర, చి. ని, బ్రా.)

గీ...శిరము గోఁకంగఁ దగ దిరుసేత...భార. అను. ౪.౧౦౨.

జ: గోఁకుడుపాఱ.

**గోఁకుడుపాఱ.** వి. దోఁకుడుపాఱ. (శ. ర, చి.ని)

**గోఁగు**=గోను. వి. (క. గోగి) ౧.కర్ణికారము,కొండగోఁగు.

చ...కోంకణంబు గోఁ,గును గనకంబు కేసరము గ్రోవియు వావిలి పొన్న మావియుక్. వసు. 3. ౧౪౬.

శ్లో. సల్లాపతః కర్ణికారః.

౨. ఊరగోఁగు, పీలువు.

సీ...గోఁగు బొట్టుగు చిక్కి-గోఁగు కొండగోఁగు ...హంస. ౪. ౧౧. ఆం. భా. ౨. ౪3.

జ: గోఁగులమ్మ.

**గోఁగులమ్మ.** వి. (గోఁగులు+అమ్మ)ఒకానొకగ్రామదేవత

గీ. దక్షవాటికపశ్చిమద్వారభూమిఁ, బ్రతివసించును సర్వాంగరమ్య యగుచు ... కోమలార్ధేందుధరుకొమ్మ గోఁగులమ్మ. భీమ. ౧. ౯౭.

**గోఁచి.** వి. కాపీనము, కచ్చడము.

గీ. గోఁచి యనఁ గచ్చడం బన గోణ మనఁగ,బొట్ట మంచనఁ గౌపీనము దనరారు. ఆం. భా. ౨. ౧౫౭.

సీ. ముందటిది కూ్కడి మొలత్రాటఁ దవిలినతోఁక గోఁచులనెంటఁ దూలువారు. ఉ. హరి. ౧. ౧౦౨. ప్రభా. ౧. ౧౦౨.

జ: గోఁచికట్టు, గోఁచికాఁడు,గోఁచిపాఁత,గోఁచిబాఁపఁడు, గోఁచివాఁడు.

**గోఁచికట్టు.** వి. (√ గోఁచి.) కాపీనధారి, బ్రహ్మచారి.

గీ. ఆస లన్నియు మొద లంటఁ గోసియున్న,గోఁచికట్టున కటువంటిగొడవ గడప,రాక మెడఁ జుట్టుకొనియె నూరక యకార్య, కరణశీలుర కప్పాటఁ గలదె సుఖము. పాండు. ౫. ౨౩౭.

**గోఁచికాఁడు.** వి. (గోఁచి+కాఁడు) బ్రహ్మచారి. (శ. ర.) విణ. గోఁచిమాత్రము మిగిలినవాఁడు, దరిద్రుఁడు.

ద్వి. రాచకూఁతును గొని రవ్వ గాకుండ, దాఁచినమీమూలధన మెల్లఁ బెట్టి, గోఁచికాఁడై దానిఁ గొనుచు నేతెంచి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౫౧౪౦.

గీ. అరివేరంబురీతి నిం దందుఁ దిరిగి, గోఁచికాఁడయ్యెబాఁపనకోడెకాఁడు. ప్రబంధ.౭౫౪. భల్లాణ. ౨౫ (శ. ర.)

**గోఁచిపాఁత.** వి. (గోఁచి+పాఁత) గోఁచిగుడ్డ.

గీ. కుక్కిమంచము బొంతయు గోఁచిపాఁత, యూఁతకోలయుఁ గుంపటియును...శివధ. ౫. ౬౭.

గోఁచిపాఁతరాయఁడు=దరిద్రుఁడు.

ఆ. పేర్మి నదరుకుండె పిక్కచెనకు లేక,యుండ వచ్చుఁ బేద యులుకు దక్కి, రమణ గోఁచిపాఁతరాయఁడు దొంగల,మిండఁ డనెడిమాటమేలు చెలిసి. కుచేల. 3. ౪౭.

**గోఁచిబాఁపఁడు.** వి. (గోఁచి+బాఁపడు) బ్రహ్మచారి.

సీ. వడుగు నా గోఁచిబాఁపఁడు నాఁగ బ్రహ్మ

చారికిఁ జేర్లు నడచు ధరిత్రియందు.ఆం. సం. మా న. ౨. ద్వి. హరిళ్చ. ఉ. ౧౮౦౫ పం.

గోఁచివాఁడు=గోఁచికాఁడు. (గోఁచి+వాఁడు) (బ్రహ్మచారి)

(ఆంజనేయునిమాటలు.) గీ. ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత, పోబలంబునఁ గడు బీఱువోని గోఁచి,వాఁడ ననుచు నిజానుభావంబుఁ దెలిపె. హ. న. పీఠి. ౧౧.

గోఁజాట. వి. (√గోఁజా) గోఁజాడుట.(ఉదా: ఇదేమి ఎప్పుడు చూచినను ఈగోఁజాట_శ. ర.)

గోఁజాడు. స. క్రి. (గోఁజు + ఆఁడు-స్వార్థమున) పీడించి అడుగు. (ఉదా: ఏల ఊరక గోఁజాడుచున్నావు. శ. ర, బ్రౌ)

గోఁజు. వి. ౧. పీడ, బాధ.

ఉ. శైలవరేణ్యగర్భకలశాంబుధిరత్నమ కోడె ప్రాయపు,స్వేళఁ దపం బటంచుఁ దలపెట్టెడిగోఁజులు చూడఁ జాల...పార్వ. ౪. ౧౩౧.

౨. గోఁజాట, పీడించి అడుగుట. (శ. ర.)

స. క్రి. పీడించి యడుగు. (శ. ర.)

జ: గోఁజాట, గోఁజాడు.

గోఁటు. వి. ౧. కోకయంచున చేర్చి కుట్టెడుసన్నని సరిగపట్టె. (బ్రౌ, శ. ర.) ౨. ఒయ్యారము. (శ. ర.) ౩. రేఖ. (శ. ర.) ౪. వస్త్రభూషావిశేషము.

గీ...గోఁటు ముంగాముఱు వన,వస్త్రభూషావిశేషంబు లలరుచుండు. ఆం. భా. ౨. ౧౮౯.

జ: గోఁటుకత్తె, గోఁటుకాఁడు.

గోఁటుకత్తె. విశ. (గోఁటు+కత్తె) ఒయ్యారము కలది. (శ. ర.)

గోఁటుకాఁడు. విశ. (గోఁటు+కాఁడు) ఒయ్యారము కలవాఁడు. (శ. ర.)

గోఁదు. వి. బందన, బంక. (శ. ర.)

గోఁదురు=గోఁదురు కప్ప. (శ. ర)

గోఁదురుకప్ప. వి. పెద్దజాతికప్ప, మండూకభేదము.

సీ...గోఁదురుకప్ప కప్ప...హంస. ౪. ౧౪౬.

గోకంటకము. సం. వి. అ. పుం. న. ౧. స్థపుటము, నిమ్నోన్నతప్రదేశము. ౨. గోవుగొరిజ,గోవుడెక్క. ౩. పల్లేరుకే.

గోకర్ణము. సం. వి. అ. పుం. ౧. సర్పవిశేషము. ౨.జుత్తె,చాఁప: బడినబొటనవ్రేలిఉంగరపువ్రేలి నడిమికొలత. ౩. దక్షిణదేశమందలి ఒకశివక్షేత్రము. ౪. కణుఁజు, మృగభేదము. ౫. అశ్వతరము, కంచరగాడిద. ౬. గణదేవతావిశేషము. ౭. ఆవుచెవియాకారము గలపాత్ర.

గోకర్ణి. సం. వి. ఈ. స్త్రీ- ఆవుచెవులవంటియాకులు గలది-మూర్వ, చాఁగకే.

గోకిరాట. సం=గోకిరాటిక.

గోకిరాటిక. సం. వి. ఆ. స్త్రీ-కూయుచు పరువెత్తునది-శారిక, గోరువంకపిట్ట.

గోకిలము. సం=గోకీలము. (కల్ప)

గోకీలము. సం. వి. అ. పుం-భూమికి మేకువంటిది-౧. రోఁకలి. ౨. నాఁగలి. (కల్ప.)

గోకులము. సం. వి. అ. న. ఆవులమంద. ౨. గోష్ఠము, పసులసాల. ౩. వ్రేపల్లె.

గోకులికుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ౧. అడుసునఁ బడినయావునకుఁ దోడ్పడనివాఁడు. ౨. కేకరుఁడు, మెల్లకంటివాఁడు. (మే. ని.)

గోకృతము. సం. వి. అ. న. గోమయము, ఆవుపేడ. (వాచ.)

గోక్షురము. సం. వి. అ. పుం. ౧. ఆవుగొరిజ. ౨. పల్లేరుకే.

గోగృష్టి. సం. వి.ఈ. స్త్రీ.ఒకమాఱు ఈనినయావు.

గోగ్రంథి. సం. వి. ఇ. పుం. ౧. గోష్ఠము, పసులసాల. ౨. ఏఱుపిడుక. ౩. బెండకే.

**గోఘృతము.** సం. వి. అ. న. ౧. ఆవునెయ్యి. ౨. -భూమికి నేయివంటిది-వాననీరు. (త్రి. ని.)

**గోఘ్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) గోవును చంపినవాఁడు. (అమనుష్యకర్తృకమైనపుడు స్త్రీలింగమున ఈకారాంతము అగును.) వి. అ. పుం-అతిథ్యమున ఎవరికొఱకు గోవు చంపఁబడునో వాఁడు-అతిథి.

**గోచందనము.** సం. వి. అ. న. గోశీర్షమనుచందనము, పచ్చచందనము.

**గోచరము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. భూచరము, భూమియందు తిరుగునది. (మనుష్యాది) ౨. పసులు మేయునది; పసులు తిరుగునది.) పొలము, మొ.) వి. అ. పుం. ౧. ఇంద్రియార్థము, ఇంద్రియములచే గ్రహింపఁబడువిషయము. (రూపరసాది) ౨. జ్ఞానాదివిషయము.

శ్లో. అవాఙ్మనసగోచరం. సం. రఘు. ౧౦. ౧౫. ౩. స్థానము.

శ్లో...పితృసద్మగోచరః. సం. కుసం. ౫. ౭౭.

**గోచరించే.** సం. అ. క్రి. ౧. అగపడు.

చ...క్రీడసేయుమ, ర్కటమిథునంబుమన్మథసుఖస్థితి దృష్టికి గోచరించినన్. సమీర. ౧. ౧౩౩. ఉ. రా. ౩. ౨౪౬.

౨. స్ఫురించు, తోఁచు.

సీ...భక్తు లెంచుమాట. గీ. దనమనంబున గోచరించిన నొకించు, కేనియు వివేక మెంచక ... సమీర. ౬. ౧౨౪.

వ...నామదికి గోచరించినంతయు వినిపించెద... భాగ. ౧. ౭౪.

**గోచర్మము.** సం. వి. న్. న. ౧. ఆవుతోలు. ౨. భూపరిమాణభేదము.

**గోచారకుఁడు.** సం. వి. అ. పుం. పసులకాపరి.

**గోచారణము.** సం. వి. అ. న. పసులను మేపుట.

**గోచారము.** సం. వి. అ. పుం. మేషాదిరాసులయందు సూర్యాదిగ్రహములసంచారము.

**గోజరము.** సం. వి. అ. పుం. ముసలియెద్దు. సం. భాగ. ౩. ౩౦. ౧౩.

**గోజాగరికము.** సం. వి. అ. న. కల్యాణము, మంగళము. పుం. వాఁకుడుకీ.

**గోజిహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గోవుయొక్క-నాలుక. ౨. బెండ, ఎద్దునాలుకచెట్టు.

**గోటదొర్లుడుకాయ.** వి. (√గోరు) బాలక్రీడావిశేషము. హంస. ౩. ౧౪౬.

**గోటాపన.** వి. (పక్షి) ఈఁక. (శ. ర.)

క. నేటుకొని పండ్లుకొఱుకుచుఁ, జీటికి మాటికిని గసరుచిలుకన్ జిలుకా, బోటుల నలయించెదు నీ, గోటాపన యెన్నఁడింక గూఁటం బడునో. నీలా. ౩. ౨౬.

**గోటిచెనకు.** వి. (గోరు + చెనకు) గోటినాటు, నఖక్షతము. ఉ. రా. ౪. ౨౨౧.

**గోటినాటు.** వి. (గోరు + నాటు) నఖక్షతము.

ఉ...చిక్కులువడ్డహారములు సిబ్బెపుగుబ్బలగోటినాటు లాచక్కెరబొమ్మకున్ రతిరసస్ఫుటచిహ్నములొప్పె వేకువన్. కవిరా. ౫. ౨౩౦.

**గోడ.** వి. (సం. కుడ్యమ్. క. గోడె) భిత్తి.

సీ...మేడలు గోడలు పాడుచేసి. అచ్చ. రా. సుం. ౯౫.

సీ. గోడదొల్చెడిజాఁగగుఱ్ఱపునెఱవోదు గాటంపుటక్కటికములపాదు. అచ్చ. రా. బాల. ౭. (గోడదొల్చెడిజాఁగ=ఎలుక) ఆం. భా. ౨. ౧౨.

సా:-౧. గోడకు పెట్టినసున్నము లంజెకు పెట్టిన సొమ్మును మరల రావు. ౨. గోడ పెట్టును చెంపపెట్టును కూడనా ? ౩. గోడయున్న చిత్రము వ్రాయవచ్చును. ౪. గోడమీఁదిపిల్లివాటము.

జ: గోడకాలు, గోడచేర్పు.

గోడకాలు. వి. (√ గోడ) కరగోడ, పెలుగు నాటుటకై పాడిమట్టితో నేర్పఱచినగోడ. (శ. ర.)

సీ. కమ్మఁదేనియసీల్లు గట్టి పుప్పొడిమట్టి గోడకాల్దీర్చినప్రోడతనము. రా. వి. ౩. ౮౧.

గోడగించు. అ. క్రి. (త. గోడమై=ధ్వని.) శబ్దించు.

ఉ. వారణరాజయాన కనువారముఁ గుంతలమధ్యవీథి సిం,దూరము దూరమయ్యె మగతుమ్మెదప్రోడలు గోడగించుర్చుం, కారము కారమయ్యె...కవిక. ౩.౮౭.(ప్రయోగాంతరము లేదు.)

గోడచేర్పు. విశే. (√ గోడ) జడుఁడు.

ద్వి. ఈరాజు...మొండరి చల్లచప్పుడు గోడచేర్పు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౯౫ పం.

గోడా(డ). వి. (సం.ఘోటః. హిం.ఘోడా) గుఱ్ఱము.

క. జోడనలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱయ రాజు వేడుకతోడన్, గోడా దుమికింపఁగ జత,గూడిరి దొర లెల్ల భటులగుమి వెనుకొనియెన్. ఉ. రా. ౭. ౩౯౫.

చ... సెబా సగుగోడ యటంచు మెచ్చుచున్. ఇందు. ౨. ౫౬.

గోడాడు. అ. క్రి.(√గోడు)దుఃఖించు,విలపించు.

వ...కనకపతియుఁ గనుఁగవ నశ్రుపూరంబు దోరంబుగాఁ బెదవులం దదుపుచు మొగము వెలవెలఁబుచ్చుచుఁ గోడలిం గూడి గోడాడుచు. ద్వా. ౭. ౨౩౬.

ఉ. ఏడువ నేల తండ్రి తను వేమఱు కుండుఁడు తోడులార నేనూ డిదె తీర్తు నంచుఁ బరఁకు ద్యుతిభీముఁడు రాముఁ డుగ్రుఁడై,యోడక యర్జునాత్మభవు లున్నపురంబున కేఁగి చొచ్చి గో,డాడఁగఁ బట్టి చంపె వడి సర్జునజాతుల బ్రహ్మఘాతుకల్. భాగ. ౯. ౪౮౩.

ద్వి.కూ డెఱుంగక దగ గొంటిది చాలు, గోడాడ కిచ్చోటఁ గూర్చుండు మనుచు.అభిమన్యు ద్విపద. (శ. ర)

గోడి. విశే. ౧. ఒడ్డగెడవు, ఒకప్రక్క క్రింది కొఱిగి రెండవప్రక్క పైకి లేచినది. (చూ. గోడివడు) ౨.మొన పై కున్నది, కొనమీఁది కున్నది.

(పిశాచవర్ణనము) సీ. గూనివీపులమీఁద గోడియై బోఁజెత్తి తటిపడ్డకంకాళతండములును...గీ. కలిగి యిదె కొఁద యున్నారు గగనవీథి.కాశీ. ౩. ౧౩౮.

(వ్యవ) వాఁడు గోడిగా కాలక్షేపము చేయుచున్నాఁడు.(గోడిగా=జాగ్రత్తగా, మెలఁకువతో.)

జ: గోడివడు, గోడివెట్టు.

గోడిగ. వి. (సం. ఘోటికా) ఆఁడుగుఱ్ఱము.

సీ...బడబ గోడిగ నాఁగఁ బరఁగు చుండు.ఆం. భా. ౨.౧౯౭.

సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి మావుల హత్తించుమూర్ధవంబు. భార. విరా. ౧. ౯౫.

చ...తఱచుగ నీనుగోడిగలఁ దత్పురిశూద్రుల కొప్ప సెప్పఁదున్. విక్ర. ౧. ౭౬.

గోడిపట్టెలు. వి. బ. బాలక్రీడావిశేషము.(శ.ర.-కోడిపట్టులు=కోడియు పిల్లలు అనుఆట. బ్రౌ.)

గీ. గుల్లు దాఁగిలిమచ్చులు గోడిపట్టె, లేలపాటలు సరిబేసు లీలకూఁత, లాదిగా శైశవక్రీడ లాడిరచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

గోడివడు. అ. క్రి. (గోడి+పడు) ఒడ్డగెడ వగు,ఏటవాలగు.

సీ. తారకసుతుఁడు మందారుఁడు నా మహావీరుఁ
డు...ధారణీతలము గోడి,వడ నెత్తి వచ్చి...
కు. సం. ౧౨. ౭౦౭.

గీ. గోగణము ముంగలిగ నేల గోడివడఁగ, నడ
చు కౌరవరాజసైన్యంబు గనియె. భార. విరా.
౮. ౫౦.

చ.ఒకయడు గొక్కచక్కి నిడి యాఁదినఁదచ్చ
రణంబు నిర్ఘరో,దకములముంపునం దడియఁ
దద్గిరి గోడివడంగ లేచి యొం,డొకయడు గ
వ్వల న్నిలుప నుండె యథాస్థితి నర్ఘ్యపాద్య
పూ,ర్వకముగ రాఘవాప్తునకు వచ్చి యెదు
ర్కొనిపోయెనో యనన్. రామా. ౬. ౭౬.

(కలహంసము) వ... ఝాంకారితపతత్త్రధారావి
హారంబుగ గోడివడి డిగ్గునప్పుడు...నైష. ౨.
3౫.

గోడివెట్టు. స. క్రి (గోడి+పెట్టు) వంచు.(శ.ర)

గోడు=గోలు. వి. ౧. ఏడ్పుటయందగుధ్వని కనుక
రణము. (ఆమ్రేడితరూపములు 'గోడుగోడు, గో
డ్గోడు')

ఉ. మాడలు సంతరించుకొని మచ్చిక నెవ్వరి కీఁగ
లేక ప,ల్పీడలు మేనులం బొరయఁ బెక్కురు
చోరులు బాధపెట్టఁగా,గోడని యేడ్చుచున్
భ్రమలఁ గుందుశరీరుల నేను మెత్తునే...కు
చేల. 3. ౧౦౨.

క... సెంజిలిం గృశించుచుఁ జిత్తం,బునఁ బట్టలే
క గోడ్గో,డున నేడ్చెన్ బాష్పములు క
డున్ వెడలంగాన్. పరమ. ౮. ౧౧3.

క. ఆమాయలాఁడి యపు డా,కోమలి మొగముఁ
గని గోడుగోడున నేడ్వన్. శుక. ౨. ౮౨.

౨. (క. గోడు, గోళు) దుఃఖము,పీడ; రోదనము,
ఏడ్పు.

క...అలమ టడరు గో డు,మ్మలిక వనట కుందు
నా నమరు దుఃఖాఖ్యల్. ఆం. శే. ౧౦.

క.పరమమునీంద్ర సమరమృత,కుకువీరుల మామన
ములగోడుడుగ భవ,త్కరుణ వెలయ లోకం
బ,చ్చెరు వందఁగఁ జూపవే విచిత్రపుమహి
మన్. భార. ఆశ్ర. ౨. ౯౨.

గీ. వనట యంగలారుపు వెత వంత గోడు,బాద
యంగద వగ పనఁ బరఁగుఁ బీడ. సాం. ని.
మాన. 33.

సీ...కొఱలు రోదన మేడ్పు గోడు నాఁగ. ఆం.
భా. ౧. ౧౮౧.

సీ. ఎండినయాళ్లగో డెత్తిఁగింపఁ డెవ్వఁడుఁ బం
డినయూ ళ్లెన్నఁ బ్రాభు లంద,ఱు...రామ
లిం. ౮.

వ... ఈక్రూరునిచేతులు వెండికొండ క్రిందఁ జి
క్కినవాఁ డట్టె యడంగఁ ద్రొక్కి నుగ్గునూ
చంబుసేయక మరల వరంబు లిచ్చి హరుండు
దమగోడుపోసికొనె ననువారును...ఉ. రా.
౮.౯౮. (తమగోడుపోసికొనె=తమ్ము ఏడ్పిం
చిన పాపము గట్టికొనియె.)

గీ. లంజెతల్లు లనఁగ లక్షింపఁగా నిట్టి,కట్టిఁడుల
కు నలువ కరుణ లేక, బ్రాఁతిమాలినట్టి బ్రతు
కులు నిడుపుగాఁ, జేసి విటులగోడువోసికొని
యె. కవిక. ౮. ౧౧౦. (విటులగోడుపోసికొ
నియె=విటులను క్షోభపెట్టినపాపముగట్టికొని
యె.) వైజ. ౨. ౯౫.

గోడుసేయు=బాధపెట్టు.

సీ. కోటిచంద్రులడాలు గోడుసేయఁగఁ జాలు
మొగముకుంకుమచుక్క సొగసు గుల్క. వీ
థి. ౯. (ఇట ఔపమ్యద్యోతకము)

జ: గోడాడు.

గోడు(తు)౦బ, సం. వి. ఆ. స్త్రీ. ౧. పిన్నపాఁ
పర కీ. ౨. కర్కటీవిశేషము, నక్కదోస కీ.(వి.
ని.)

గోడెము=గూడెము. వి. బోయపల్లె, శబరాలయ
ము.

గీ. గూడె మని గోడె మని యనుకొందు రాఖ్య,

లెల్లఁ బక్కఁణమునకు శాలేందుహూరి. ఆం. భా. ౨. ౨౩.

గోణము, గోణాము=గోపణము. వి. (సం. కాపీనమ్. ప్రా. కోపీనం) ౧. గోఁచి, కాపీనము; రెండువైపులను త్రాళ్లు గలకాపీనము.

గీ. గోఁచి యనఁ గచ్చడం బన గోణ మనఁగ, బొట్టమంచనఁ గాపీనము దనరారు. ఆం. భా. ౨. ౧౫౭.

ఉత్సాహ...కావిగోఁణములు గట్టువారి నైన నగుచుఁ జిత్తజుండు చి,త్తములు గలఁచి చెఱచు...శివ. ఉ. ౨. (శ. ర)

ద్వి. ఉంకించి యప్పు డయ్యొసపరిపువ్వు, కంకటిమీఁద దిగ్గన డిగ్గ నుఱికి, గోణంబుతో నె మిక్కుటపు వేగమున. ద్వి. పరమ. 3. ౧౯౪పా. ౯ పం. వరాహ. 3. ౧౦౯.

సీ. బంగారువ్రాఁత చెఱంగులగోణాము గళమున రుద్రాక్షకంఠమాల. కాళ. ౧. 30.

జః గోణముదారి.

గోణముదారి. వి. (గోణము+దారి) కాపీనధారి, సన్న్యాసి. (ప్రా)

గోణి. వి. ఎద్దు. (శ. ర.)

గోణి. సం. వి. ఈ. స్త్రీ. గోనె.

గోణిక. సం. వి. ఆ. స్త్రీ=గోణి.

గోత(తా)ము. వి. ౧. అల్పగోణీవిశేషము, ఒకవిధ మైనచిన్నగోనె.

సీ... ఆసిమి గోతము సంచి యనఁగ నల్ప, గోణీవిశేషముల్ గొఱలు...ఆం. భా. ౨. ౨౬౬.

సీ. చిక్కఁము ల్మొలలు మాసినచింపిబొంతలు దామెనత్రాళ్లు గోతములు వెండ్రు,కలమోపులును...చెన్న. ౨. ౨౦౪.

సీ...గోనెలు తణగాలు గోతములును. హంస.౪. ౮౪.

౨. మల్లసాధనవిశేషము.

స్రగ్ధర. స్రుస్రుక్ గోత్రాచలంబుల్ గుబగుబలయిపో గోతముల్ గ్రుద్దులీలన్. మనుచ. ౪.౮.
(జెట్టులు సాధనచేయునప్పుడు జనపనారసంచులలో రాలు పోసి కట్టి పిడికిళ్లతో పొడుతురు. వ్యాఖ్య.)

సీ. మనుచు జెట్టి యనంగ మల్లాభిధానంబు ... తత్సాధనంబులై తగుఁ గంబము కొణత కటికనలోడి సంగడము బాల. గీ. సంగడము నీలి గోతా మనంగఁగొన్ని...ఆం. భా. ౨. ౨౦౩. ప్రబంధ. ౮౨, ౭౮.

గోతి. వి. (త. కోదై) ఆఁడుది, స్త్రీ.

క. జ్ఞాతులయెడ గోవులయెడ, గోతులయెడ ధర్మమెడలి క్రూరుఁ డగుట కా,ర్యాతురవిప్రోపేక్షా,నీతి బిసము లపహరించునిపుణతే యతయన్. భార. అను. 3. ౨౩౪.

క. రోగికి సుహృదులఁ గన్గొనఁ,గా గుణ మెట్టిద గు నట్టి కైవడిఁ జేతో,రాగ మెలర్పఁగ నునికికి,నా గోతులు ప్రీతి నొంది యాతనితోడన్. భోజరా. 3. ౨౮౪. ఆం. భా. ౨. ౧౦౪.

గోత్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి. ౨. గోవులసమూహము.

గోత్రకీల. సం. వి. ఆ. స్త్రీ-పర్వతములు కీలములుగా కలది-భూమి.

గోత్రపటము. సం. వి. అ. పుం. వంశవృక్షమును తెలుపుపటము.

గోత్రప్రవరుఁడు. సం. వి. అ. పుం. మూలపురుషుఁడు, వంశమునకు కూటస్థుఁడు.

గోత్రభిత్తు. సం. వి. ద్. పుం-పర్వతములను భేదించువాఁడు-ఇంద్రుఁడు.

గోత్రభిదుఁడు. సం=గోత్రభిత్తు.

గోత్రము. సం. వి. అ. న. ౧. వంశము. ౨. విత్త

ము,ధనము. ౩. గుంపు, సమూహము. ౪. పేరు. ౫. అడవి. ౬. పొలము, పరిమడి. ౭. దారి, బాట. ౮. గొడుగు. ౯. బలము. పుం. ౧. కొండ. ౨. మేఘము. (కే. ని.)

గోత్రస్ఖలనము. సం. వి. అ. న. ఒకరిని మఱియొకరి పేరితో పిలుచుట.

గోత్రస్ఖలితము. సం=గోత్రస్ఖలనము.

గోత్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. గోవులను గాచువాఁడు. ౨. భూమిని రక్షించువాఁడు.

గోద. వి. ఎద్దు, వృషభము.

(కన్నప్ప అడవిలో నున్నశివలింగమును చూచి అన్నమాటలు.) ద్వి. ఎక్కుడుగోద నిన్నిక్కడ
వైచి, యెక్కడఁ బాఱెనో యేఁగెదఁ జెపుము. బస. పు. ౩. ౬౫౩ పం. (ఎక్కుడుగోద=వాహనమైనవృషభము.)

ద్వి. కోటయుఁ బడ్డదిగూడ నయ్యెక,వాటంబులు
నుజివ్కి వసుధఁ ద్రెళ్లినవి,యొడల నర్ధముగొ
న్నయుమబోటి పుట్టు, పాడ లేదు శివునంద
యడఁగెనో కాక, భయ మంది యొంటి గోద
యు మీఁదఁ గసవు,వయిచుక యున్నది వన
రుచు నెదుర. బస. పు. ౩. ౪౯౩ పం.

జ: గోదరి.

గోద. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోదావరి. ౨. శూడికొడుత్తనాచ్చియారు, ఆముక్తమాల్యద. (ఈమె వైష్ణవులకు ఉపాస్య యగునొక దేవత)

గోదంతము. సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

గోదము. సం. విణ. (అ. ఆ. అ)గోవుల నిచ్చునది. వి. అ. పుం-దృష్టిని బాగుగా నుంచునది-మస్తిష్కము, మెదడు.

గోదరి. వి. (√ గోద) ముచ్చెవాఁడు, చర్మకారుఁడు.

సీ...చర్మకారాఖ్య పరఁగు గోదరి ముచ్చెవాఁ
డనంగ. ఆం. భా. ౨. ౨౮౩.

గోదానము. సం. వి. అ. న. బ్రాహ్మణునకు పదియాఱవయేఁటను క్షత్త్రియునకు ఇరువదిరెండవయేఁటను వైశ్యునకు ఇరువదినాల్గవయేఁటను చేయఁదగినసంస్కారవిశేషము, కేశాంతము. మను. ౨. ౬౫.

గోదారణము. సం. విణ. (అ. ఈ. అ) ౧. నాఁగలి. ౨. గుద్దలి.

గోదారి. వి. వెన్నకాఁచినమడ్డి. (బ్రౌ, శ. ర)

గోదావరి. సం.వి. ఈ. స్త్రీ. ఒకానొకనది,గౌతమి.

గోదావరిఁగలుపు=పాడుచేయు.

సీ. కులము గోదావరిఁగలిపి వేశ్యాసంగ మాసచేఁ
గావించితే సుపుత్ర. నిరం. ౨. ౮౩.

గోదుమ. (సం. గోధుమః. క. గోదుమె) వి. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. ఆం. భా. ౨. ౨౩౪.

జ: గోదుమపూసలు.

గోదుమపూసలు. వి. బ. (గోదుమ+పూసలు) స్త్రీకంఠభూషావిశేషము. (శ. ర.)

గోదుహుఁడు. సం. విణ. (-హ్-అ.ఆ.అ) ఆవులను పాలు పితుకువాఁడు. వి. హ్, అ. పుం. గొల్లవాఁడు.

గోదోహని. సం. వి. ఈ. స్త్రీ. ఆవుపాలు పితుకుటకుపయోగించుపాత్ర.

గోద్రవము. సం. వి. అ. పుం. గోమూత్రము.

గోధ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉడుము. ౨. అల్లెత్రాటిదెబ్బ తాఁకకుండుటకై ఉడుముమొక్కతోలితో కుట్టి చేతికి తొడిగికొనుకవచము. (కే. ని)

గోధనము. సం. వి. అ. న. గోకులము,గోవులగుంపు. పుం. స్థూలాగ్రము గలబాణము. (కల్ప)

గోధము. సం. వి. అ. న. గోధ, అల్లెత్రాటిదెబ్బ

లాఁకకుండుటకై చేతికి తొడుగుకొనుఉడుప తోలికవచము.

గోధాపది. సం. వి. ఈ. స్త్రీ. చెప్పుతట్టకీ.

గోధి. సం. వి. ఇ. పుం. ౧. అళికము, నొసలు. ౨. ఉడుము.

గోధుక్కు. సం. విణ. హ్, వి. హ్=గోదుహుఁడు.

గోధుమము. సం=గోధూమము. (కల్ప)

గోధూమము. సం. వి. అ. పుం. ౧. గోదుమలు, ధాన్యభేదము. ౨. నారింజకీ.

గోధూళి. సం. వి. ఇ. స్త్రీ. గోవులు పొలమునుండి ఇండ్లకు వచ్చునపుడు దుమ్ము రేఁగెడి వేళ, సాయంసంధ్యాకాలము.

గోధేనువు. సం. వి. ఉ. స్త్రీ. క్రొత్తగా ఈనినయావు.

క...కొను మిచ్చెద నీకు లక్షగోధేనువుల౯. భా ర. ఆది. ౭. ౯.

గోధేరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) రక్షకుఁడు, కాచువాఁడు.

గోనంది. సం. వి. ఈ. స్త్రీ. బెగ్గురుపక్షి.

గోనర్దము. సం. వి. అ. పుం. ౧. సారసము, బెగ్గురుపక్షి. ౨. దేశవిశేషము. న. కయివడిముస్తెకీ.

గోనర్దీయుఁడు. సం. వి. అ. పుం-గోనర్దదేశమున పుట్టినవాఁడు-మహాభాష్యకారుఁ డగుపతంజలి.

గోనసము. సం. వి. అ. పుం. ౧. కొండచిలువ. ౨. వైక్రాంతమణి.

గోనాసము. సం=గోనసము. (రా. ని.)

గోనియ=గోనె. (శ.ర.)

గోను=గోఁగు. (దీని 'ను' వర్ణకమునకు ఏకవచనమున వికల్పముగాను బహువచనమున నిత్యముగాను బిందుపూర్వకగువర్ణముఆదేశ మగును.) వృక్షవిశేషము, పీలువుకీ.

గీ...తగు గోను గోఁగనఁగను సుపీలు. ఆం. భా. ౨. ౮౩.

సీ. పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప గుము డందు గురివెంద గోను రేను. వేం. పంచ. ౪. ౫౨౨.

గోనె=గోనియ. వి. (సం. గోణీ. ప్రా. గోణి. త. కోణి.) ధాన్యము మున్నగునవి నించెడిజనపనార సంచి.

సీ. హేరాదియొడ్డాదిభారాదులను వచ్చుగోనెలు తణగాలు గోతములును. హంస. ౪. ౮౪.

'కప్పురపుగోనెలు' కళా. ౭. ౨౫.

గోపకము. సం. వి. అ. పుం. బాలెంతబోళము.

గోపకుఁడు. సం. విణ. (అ. పికా. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు. ౩. గోవులను కాచువాఁడు. వి. అ. పుం. ౧. బహుగ్రామాధిపతి. ౨. గొల్లవాఁడు.

గోపతి. సం. వి. ఇ. పుం. ౧. ఆఁబోతు. ౨. స్వర్గాధిపతి, ఇంద్రుఁడు. ౩. భూపతి, రాజు. ౪. పశుపతి, శివుఁడు. ౫. అంశుమంతుఁడు, సూర్యుఁడు. ౬. దిక్పాలకుఁడు. ౭. గోవుల కధిపతి.

గోపదలము. సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

గోపన. సం. వి. ఆ. స్త్రీ=గోపనము.

గోపనము. సం. వి. అ. న. ౧. కాపాడుట, కాచుట. ౨. దాఁచుట, కప్పిపుచ్చుట. ౩. దూఱుట, నిందించుట. ౪. కాంతి. ౫. ఈర్ష్య. ౬. కలఁత.

గోపనీయము. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షింపఁదగినది, కాపాడఁ దగినది. ౨. దాఁపఁ దగినది, కప్పిపుచ్చఁ దగినది.

గోపము. సం. వి. అ. పుం. ౧. బాలెంతబోళము. ౨=గోపనము.

**గోపానసి.** సం. వి. ఈ. స్త్రీ. చూరుపట్టె, గొవ్వలు.

**గోపాయకుఁడు.** సం. విశే. (అ. యికా. అ) ౧. కాపాడువాఁడు, కాచువాఁడు. ౨. కప్పిపుచ్చువాఁడు, దాఁచువాఁడు.

**గోపాయనము.** సం. వి. అ. న. ౧. రక్షణము, కాచుట. ౨. దాఁచుట, కప్పిపుచ్చుట.

**గోపాయిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) ౧. కాచువాఁడు, కాపాడువాడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు.

**గోపాయితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. రక్షితము, కావఁబడినది, ౨. దాఁపఁబడినది, కప్పిపుచ్చఁబడినది. వి. అ. న=గోపనము.

**గోపాయితవ్యము.** సం=గోపితవ్యము.

**గోపాలము.** సం. వి. అ. పుం. దాసరులు బిచ్చమెత్తునపుడు ఉపయోగించుపదము.

గీ...గోపాల మనుచు, వీథి కెవ్వారు సుడిసిన వెక్కిరించు, నయ్యా ననుఁగన్న కొయ్యా గయ్యాళితల్లి. విప్ర. ౩. ౧౫.

గోపాలమెత్తు=బిచ్చమెత్తు. (బ్రౌ)

**గోపాలకుఁడు.** సం. విశే. (అ. లికా. అ) వి. అ. పుం=గోపాలుఁడు.

**గోపాలధాని.** సం. వి. ఈ. స్త్రీ. ౧-గోవులను గాచువా రుండుచోటు-గొల్లపల్లె. ౨. గోష్ఠము, పసులసాల.

**గోపాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గోపాలునిభార్య. ౨. బుడమ కీ. ౩. వివాహదినములలో పెండ్లికొమరుఁడు పెండ్లికూఁతునకును పెండ్లికూఁతురు పెండ్లికొమరునకును పసుపు మున్నగువానితో పెట్టునలుఁగు. (వై. ని)

**గోపాలిక.** సం. వి. ఆ. స్త్రీ=గోపాలి.

**గోపాలుఁడు.** సం. విశే. (అ.ఆ.అ) గోవులను కాచువాఁడు. వి. అ. పుఁ. ౧. గొల్లవాఁడు. ౨. భూపాలుఁడు, రాజు. ౩. పశుపతి, శివుఁడు. ౪. కృష్ణుఁడు.

**గోపి.** సం. వి. ఈ. స్త్రీ. గొల్లది; గొల్లవానిభార్య.

**గోపించు.** సం. అ. క్రి. (సం. గుప్) ప్రచ్ఛన్నమగు, డాఁగు.

ద్వి. వనమునఁ బండ్రెండువత్సరంబులును, జనగోప్యమై యొక్కసంవత్సరమును, నియతితో గోపించి నేఁ డెల్లి వారు, రయ మొప్పఁ గోపించి రా నున్నవారు. ద్వి. భార. విరా. ౧. ౧౧ పా.

**గోపిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వ్రేత, గొల్లది. ౨. కాపాడెడిస్త్రీ.

**గోపిత.** సం=గోపాయిత.

**గోపితవ్యము.** సం=గోపనీయము.

**గోపిత్తము.** సం. వి. అ. న. గోరోజనము.

**గోపిలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు.

**గోపీచందనము.** సం. వి. అ. న. ఒకజాతిసుద్దమన్ను. (విల్యమ్సు)

**గోప్రీతము.** సం. విశే. (అ. ఆ. అ) గోవులచే త్రాగఁబడినది. వి. అ. పుం. ఖంజనవిశేషము, ఒకజాతి కాటుకపిట్ట.

**గోపీథము.** సం. వి. అ. న. జలాశయము. (కల్ప)

**గోపు.** విశే. మూఢుఁడు?

సీ. ఆకతాయ బికారి యడిబండ గుండఁడు మొండికట్టై గులాము మొప్పె గోపు. హంస. ౫. ౧౧౩.

**గోపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు. ౩. గోవులను రక్షించువాఁడు. వి. అ. పుం. ౧.

గొల్లవాఁడు. ౨. భూపాలుఁడు, రాజు. ౩. గోవుల కధిపతి. ౪. బహుగ్రామాధిపతి.

గోపుచ్ఛము. సం. వి. అ. పుం. ౧. కొండముచ్చు. ౨. నలువదిపేటలు గలహారము. ౩. ఆవుతోఁక.

గోపురము. సం. వి. అ. న. ౧. పురద్వారము, గవను. ౨. దేవాలయద్వారము, దేవాలయముఖమున ఎత్తుగా కట్టినద్వారము. ౩. కైవడిముస్తె.

గోప్తృ. సం. విశ. (ఋ. స్త్రీ. ఋ) ౧. రక్షకుఁడు, కాచువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు.

గోప్తవ్యము. సం=గోపితవ్యము.

గోప్యము. సం=గోపనీయము.

గోప్యుఁడు. సం. వి. అ. పుం. ౧. భృత్యుఁడు, సేవకుఁడు. ౨. దాసీపుత్త్రుఁడు. (కల్ప)

గోప్రచారము. సం. వి. అ. పుం. పసులు మేయు చోటు. యాజ్ఞ. ౨. ౧౬౬.

గోప్రతారము. సం. వి. అ. పుం. ౧. పసువులరేవు. ౨. సరయూతీరమందలియొక క్షేత్రము.

గోప్రవేశము. సం. వి. అ. పుం. గోవులు పొలము నుండి మరలివచ్చి యింట ప్రవేశించుట. ౨. గోవులు ఇంటికి వచ్చువేళ, సాయంసంధ్యాకాలము, మలుసంజవేళ.

గోమంతుఁడు. సం. విశ. (త్. మతీ. త్) గోవులు కలవాఁడు.

గోమక్షిక. సం. వి.ఆ. స్త్రీ-పసువులకు బాధ కలిగించుఈఁగ-జోరీఁగ.

గోమతి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది.

గోమయచ్ఛత్త్రము. సం. వి. అ. న. కుక్కగొడుగు.

గోమయప్రియము. సం. వి. అ. న. కుక్కగొడుగు.

గోమయము. సం. వి. అ. పుం. న. ౧. పేఁడ. ౨. పిడుక.

శ్లో...ఉపలశకలమేతద్భేదకం గోమయానాం. ముద్రారా. ౩. ౧౫.

గోమయోత్థ. సం. వి. ఆ. స్త్రీ. పేఁడపురుగు.

గోమాయువు. సం. వి. ఉ. పుం-వికృతముగా అఱచునది-జంబుకము, నక్క.

గోమారి. సం. వి. ఈ. స్త్రీ-పసువులను బాధించునది-పసువులకు పట్టెడిచెక్కపిడుఁదు. (ఈశబ్దము జంతుమారీశబ్దమువంటిది. కాని సంస్కృతనిఘంటువులలో కన్పడదు. మి. వి. అని శ. ర.)

గీ...పిడుఁదు నాఁగ,పఱలు గోమారి కైలాసపురవిహారి. ఆం. భా. ౨. ౭౭.

గోమి. సం. విశ. (న్. నీ. న్) గోవులు కలవాఁడు. వి. న్. పుం. నక్క. (మే. ని)

గోమించె. స. క్రి. (√గోము) గోముచేయు. (గారాముచేయు, ప్రేమించు.)

క. ఈమాడ్కి నమితభోగ, శ్రీ మెఱయఁగ నొక్కనాఁడు చిత్తమున నిజ,స్వామియుఁ దలిదండ్రులుఁదను,గోమించిన నడత దెలిసికొని యతఁ డెలమిన్. శుక. ౧. ౩౩౭.

గోమిడి. వి. ఒకజాతిపూరేడుపిట్ట. (బ్రౌ)

గోము. వి. ౧. సౌకుమార్యము.

క. కాకుండిన నీగోమును, నీకళలకు నైమిటార మీ తేటకళల్, లోకములఁ గలవె చెలువల, కాకమలజునేర్పు పొగడఁగాఁ దర మగునే. ఉ. హరిశ్చ. ౩. ౫౫.

సీ. చెలువ నీజిగిగోము గలమోము మఱివాని తొట్టినోరున ముద్దువెట్టఁ దగునె. హంస. ౧. ౯౧.

౨. వికాసము.

చ. కుముదిని పొంగెఁ బద్మినులగోము దొలంగె న
భస్థలిం జక్కోరములు చెలంగెఁ గోకనికరమ్ము
గలంగె విభుండు పూర్వభూగమున వెలింగె
...కృ. శకుం. ౨. ౧౯౫.

3. గారాబము.

గీ. వానితలిదండ్రు లత్యంతవత్సలతను, బూఁట
పూఁటకు గోముచేఁ బొసఁగఁ బెంచి...హం
స. ౧. ౧౫౪.

క. గోము మిగుల వ్రేపల్లెను, ధీమంతులు రామ
వాసుదేవులు బాల్య,శ్రీ మెఱసి...హరి.పూ.
౫. ౨౫౦.

క... ఆయమయును జేఁ,పునిజస్తన్యంబులచేఁ,
బెనిచెం గో మొప్ప నిట్లు పెరుఁగఁ గ్రమ
మునన్. ఆము. ౫. ౬.

౪. విధము, రీతి.

వ... పుష్పంధయస్తనంధయస్తోమంబుహోమధూ
మంబుగోమున నెసంగ...ఇందు. ౨. ౪౪.

౫. గౌరవము.

శా. దీపింపం గలయట్టిపుత్రుఁ గనుటన్ దీవ్యత్త
పశ్శీలుఁడీ, గోపాలుం డనఁ గీర్తితుండ నగు
వాగోమిమ్మెయి నవ్వుమ్ము గాఁ,జూ పాత్మన్ గ
ణుతింప దైవము గడుం జూపోపదయ్యెం జూ
మీా. హరి. పూ. ౭. 33.

౬. గర్వము.

మ. అనిలో నింద్రునిగోము మాన్పి పెఱదేవానీక
ముం జీరికిం, గొన కీమూఁడుజగంబులం గలఁ
చియత్క్షోభ్యుండనై యెందుఁ జేర్చినవాఁ
డన్...హరి. ఉ. ౪. ౧౩౯.

విశ. ౧. మృదువైనది, సుకుమారము.

సీ. మను మెత్తనిది గోము మవ్వ మనంగను మృదు
సంజ్ఞ...ఆం. భా. 3. ౨౪.

౨. సుందరము, అందమైనది.

సీ. గోముగా నాకుపుల్ గొవ్వవెట్టినవార్త సకి
యు చెప్పిన బన్నసరము లొసఁగె. కలు.౪.
౨౬.

జ: గోమించు.

గోముఖము. సం. వి. అ. పుం. న.వాద్యవిశేషము.
పుం. ౧. మొసలి. ౨. సురంగావిశేషము; గోడ
యందు దొంగ లొకతీరుగాఁ ద్రవ్వినకన్నము.
(విల్యమ్సు) న. ౧. ఆలుసుట. ౨. లోపల చేయి
పెట్టి జపమాలతో జపము చేయుటకు సాధనమైన
గోముఖాకారమా సంచి. (కల్ప)

గోముఖి. సం. వి. ఈ. స్త్రీ. హిమాలయమున గంగ
ప్రవహించెడు కనుమ.

గోమూత్రిక. సం. వి. ఆ. స్త్రీ. చిత్రకవిత్వము
లోని యొకానొక బంధము.

శ్లో. వర్ణానామేకరూపత్వం యద్యేకాంతరమర్థ
యోః, గోమూత్రికేతి తత్ప్రాహుః దుష్క
రం తద్విదోవిదుః. (కల్ప)

గోమృగము. సం. వి. అ. పుం. గవయము, గురు
పోతు.

గోమేదకము. సం.వి.అ.న.పుం.పీతమణి, పసుపువ
న్నె గలరత్నవిశేషము. (మే.ని-రా. ని)

గోమేదము. సం. వి. అ. పుం=గోమేదకము.(రా.
ని.)

గోమేదికము. వి. (సం.గోమేదకమ్)పసుపువన్నె
గలరత్నవిశేషము.

గీ. రమణ మీాఱఁగ గోమేదికములు చాలఁ, జెలువ
మొప్పార నంచులఁ జేర్చి చేర్చి.యయా. ౪.
౧౧౬.

గోమేధము. సం. వి. అ. పుం. యజ్ఞవిశేషము.

గోయానము. సం. వి. అ. న. ఎడ్లబండి.

గోయి=గొయ్యి, గొయి. (సం. గర్తః) వి. ఔ. గ
ర్తము.

సీ... తెలిపుల్గు బురదగోతులకుఁ జపునె. నీలా.
౨. ౭౬.

గోయుగము. సం. వి. అ. న. ౧. గోద్వంద్వము, గోవులజత. ౨. ద్విత్వమున వచ్చు నొకానొక ప్రత్యయము. (ఉదా: గోగోయుగము=గోద్వయము. అశ్వగోయుగము=అశ్వద్వయము.)

గోర=గోరువంక[1].

సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చికల్ పసుపుముద్ద. గీ. లాదిగాఁ గలపులుఁగులు...రసిక. ౧. ౬౭.

గోరంక=గోరువంక[1]. ఆం. భా. ౨. ౮౯. సాం. ని. తిర్య. ౭౮. వేంక. తిర్య. ౯౮.

గోరంకువు. సం. వి. ఉ. పుం. ౧. గోరువంకపిట్ట. ౨. దిసమొలవాఁడు. ౩. బట్టువాఁడు.

గోరఁట. వి. (సం. కురంటకః) ౧. ఒకజాతిచెట్టు.

సీ. మైదగోరంట నా మనుఁ గురంటకసంజ్ఞ ... ఆం. భా. ౨. ౫౩.

రగడ. కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము...పారి. ౪. ౧౬.

రగడ...తమి నీగోరంటకు నీగోరంటకు ... ఇందు. ౩. ౩౫. పారి. ౩. ౫౭.

౨. గోరంటాకు నూఁటి పెట్టుటచేఁ గలిగినఎఱుపు.

సీ. గోరంటా గోళ్లనిక్కు వపుఁగెంపో యని చెయి పట్టి నయమున సెజ్జ సేర్చె...మనుచ. ౬. ౮.

సీ...గోరంటఁ బోలుచు గోళ్లు. శుక. ౨. ౪ ౨౬.

గోరక్షకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. చిర్భటి, బుడమకీ.

గోరక్షకుఁడు. సం. విణ. (అ. క్షికా. అ) వి=గోరక్షుఁడు.

గోరక్షణము. సం. వి. అ. న. పాశుపాల్యము, గోవులను రక్షించుట.

గోరక్షతుంబి. సం. వి. ఈ. స్త్రీ. కుండానుగుకీ.

గోరక్షము. సం. వి. అ. పుం. ౧. పాశుపాల్యము, పసులను కాచుట. ౨. నారింజకీ. ౩. ఋషభ మను ఓషధి.

గోరక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ) గోవులను రక్షించువాఁడు. వి. అ. పుం. ౧. గొల్లవాఁడు. ౨. శివుఁడు, పశుపతి.

గోరగించే. అ. క్రి. (√గోరము) భయంకర మగు. (చూ. గోరగింత.)

గోరగింత. వి. (√ గోరగించే) భయంకరత్వము, ఘోరకృత్యము.

గీ. గోరగింత యనంగను ఘోరత దగు. ఆం. భా. ౧. ౧౩౨.

గోరడి. వి. నఖక్షతము ? (√ గోరు?)

క. వెడలి సతి రతిఁ జెనంగిన, బడలిక నిట్టూర్పు తొట్రుపాటును జనుగో,రడి మోవికాటు చిమచిమ, జడిచెమట నటింపఁ జూపె సౌపానగతుల్. పాంచా. ౫. ౩౨.

గోరణము. సం. వి. అ. న. ఉద్యమము, పూనిక.

గోరతనము. వి. (గోరము + తనము) దౌష్ట్యము, దుశ్చేష్ట.

గీ. గోరతనములు మానరా కొడుకుఁగుట్టి. కాశీ. ౪. ౯౧.

గోరప. వి. ఆఘోషణము, పెద్దధ్వని.

సీ. రట్టు రట్టడి అవ్వ రద్ది ర ద్దుప్పతె అంటు గోహరు గోర పన వెలయు, నాఘోషణసమాఖ్య... ఆం. భా. ౧. ౧౧౫.

గోరపడు. అ. క్రి. (గోరము + పడు) విసుగుకొను?

క...కాసారాఖ్యుఁడు, రార మ్మని మిగులనాదరమ్మునఁ జోటిం, పార నొసఁగెఁ గక్కస మని, గోరపడక యివి సుసాత్త్వికులచరితంబుల్. పరమ. ౧. ౮౪.

గోరము. విణ. (సం. ఘోరం.) ఘోర మైనది, భయంకర మైనది.

సీ. ఘోరాభిధానంబు గోర మనంగను ... ఆం. భా. ౧. ౧౩౨.

క... ఇదె నా, గోరంపుటుక్కు గదఁ గొని, బోర నఁదల వ్రయ్య నడిచి పారిగొని విడుతుణ్. నృసిం. ౪. ౩౯. శుక. ౩. ౭౮.

వి. ౧. ఆపద, ఇడుమ.

క. నగి యతఁడు వదినె కనియెణ్, మగువా బెగడంగ నేల మాయన్న కుఁ జే,టగపడియె నేని జేజేల్, ముగురును గడ లేనిగోరములపాల్గా శే. అచ్చ. రా. ఆర. ౪౭. ఆం. సం. మాన. ౫౯.

౨. ఘోరకృత్యము, దారుణకార్యము.

సీ.కొడుకునకై యిట్టిగోరంబు నేసినయింతి యీ కైకేయి యేమి గనియె. భా. రా. యు. ౨. ౬౧౧.

క... కొఱకొఱలాడెద వదేమి గోరము మే ల్మేల్...రసిక. ౫. ౧౬౩.

౩. బాధ.

చ. కలిగినవాఁడు గా మరునికన్నను వన్నియ గల్గువాఁడు గా, కులమున మేటి గా సవతిగోరము గాన మటంచు నెంచి వేడ్కల కెదురేఁగుదుణ్...శుక. ౨. ౧౧౨.

జ: గోరగించు, గోరగింత,గోరతనము,గోరపడు.

గోరవంక=గోరువంక[1]. వేంక. తిర్య. ౯౭.

గోరవము. సం. వి. అ. న. కుంకుమపువ్వు *. (విల్యమ్సు.)

గోరసము. సం. వి. అ. పుం. ౧. ఆవుపాలు. ౨. దధి, పెరుఁగు. ౩. కాలశేయము, మజ్జిగ, చల్ల.

గోరాటి. సం. వి. ఈ. స్త్రీ. శారిక, గోరువంక.

గోరింక=గోరువంక[1]. (సం. గోరికా) ఆం. భా. ౨. ౮౯. సాం.ని. తిర్య. ౭౮.

గోరించే. అ. క్రి. ఎగయు. (చూ. గోరింపు.)

సీ. చెండు గోరించినచెలువున లివ మీఱి నొయ్యారమునఁ గొంత యుబికి యుబికి. శశాం. ౩. ౧౧౧.

జ: గోరింపు, గోరింపుబంతులు, గోరింపులాడు.

గోరింపు. వి. (√ గోరించే.) ఎగపు. (శ.ర.)

సీ. కసిడీఱకటు లేచి గ్రక్కునఁ దమి రేఁచి కుఱుచగోరింపులఁ గొంత సేపు. శశాం. ౪.౬౭.

గోరింపుబంతులు=చెండుగోరింపులు. వి. బ.(గోరింపు + బంతులు) బాల్యక్రీడావిశేషము.

సీ. పాదరింటిపట్టులఁ జదరంపునట్టులఁ బంతు గా గోరింపుబంతు లాడు. ఉ. హరిశ్చ. ౩. ౧౫.

గోరింపులాడు. స. క్రి. (గోరింపులు + ఆడు)-ఎగురఁగొట్టు-సంహరించు, చంపు.

సీ. తొలివేలుపులమూఁక దురముల్లో గోరింపులాడి తాండవ మాడునట్లు గాదు. నిరం. ౩. ౯.

గోరిక. సం. వి. ఆ. స్త్రీ. రాజశారిక. (రాజని,కల్ప)

గోరు. వి. జా. (సం. ఖురః. ప్రా. ఘోరు. క. ఉగిర్) ౧. నఖము.

సీ. రవయుంగరంబులరత్నాలదీప్తులు వాలారుగోళ్లపై జాలువాఱ. హర. ౫. ౪౪.

సీ. గోర నొక్కినఁ బాలు గాఱుకెంజెక్కుల... దశా. ౬. ౧౫.

ఉ...పూవులుగోట మీటుతటి...ఆము.౧.౬౨.

౨. గద్దగోరు,చోరసాధనవిశేషము. ఆము.౫.౩౦.

౩. కదళీకేసరాగ్రవృత్తాంశము, అరఁటిపువ్వులలో కేసరములపైని గుండ్రముగా నుండుఉల్లిపొరవంటిపదార్థము.

గీ. కదళి దివియించె నాగ్రాంఘ్రికంబు లొడల, పెనుపు నెట్లన్నఁ బొరలసోవన నడంచ,కొన్నయాఁదోఁక పాటును గొప్ప విప్ప, మెఱయుగోర్మొచ్చలును గెంపు గుఱులు గావె. ఆ. ము. ౫. ౩౦. (పైరెండవయర్థమునకు గూడ నిదియే ఉదాహరణము.)

సీ...అనంటి నాఁ గదళికాహ్వయము లై పొదలు
చుండు...తత్కేసరాగ్రవృత్తాంశంబు గోర
నఁ...ఆం. భా. ౨. ౫౭.

౪. తంతి మీటుటకు బంగారు లోనగువానితో
చేసి వ్రేలికి తగిలించుకొనెడు ప్రతినఖము.

ఉ. కీరమనోజ్ఞవాణి యొక కిన్నరి కిన్నెర మీటి
మీటి యొ, య్యారపులీల నేఁగి వసుధాధి
పుఁ గన్గొనె జిల్గుఁబయ్యెదఁ, హారముఁ జ
క్కఁ బెట్టెడు కుచాహితహస్తము పైఁడిగోళ్లు
హిం,సారతి సేయుదర్పకునిసంపఁగెముల్కు
లువోలె మించఁగఁ. మనుచ. ౫. ౬౪.

విణ. అల్పము, చిన్నది. (శ. ర.)
ఉదా: గోరుచిక్కుడు, గోరువెచ్చ.

గోరంత=కొంచెము.

క. క్షారము రసమును జమురును,గోరంతయు నా
సపడక గోధూమమయా,హారములఁ జేయవ
లయుం, బారణ ధరణీతలంబె పళ్లెము గాఁ
గఁ. వరాహ. ౯. ౬౦.

క...గో,రం తాలస్యంబునఁ గొం,డంత ప్రయో
జనము దప్పు ననఁగా వినమే. కళా.౨.౧౮౦.

ఉ...గో,రంతలు కొండలంత లగునట్టుగఁ జేసితి
మంచు...ఆము. ౫. ౮౮.

(వ్యవ) వాఁడు ఎప్పుడును గోళ్లు గిల్లుకొనుచుఁ
గూర్చుండును=గోళ్లుమీటు. (వా)

గోళ్లుమీటు:-ఏపనియు చేయకుండ సోమరిగా
నుండుటను సూచించును.

క. పనుల కొడల్వంగక కా,మిను లిద్దఱుఁ గూడి
గోళ్లుమీటుచు దాదుల్, దినదినము మిసిమి
యిడఁగాఁ, గనిపింతురు నున్నగచ్చకాయల
కరణిఁ. శుక. ౨. 333.

సా:-గోట నాపనికి గొడ్డలి ఏటికి.

చ. అన విని యట్ల చేయఁ దగు నం చనె నైర్మతి
కార్య మిందునఁ, గొనకొన గోట నాపనికి
గొడ్డలి యేటి కటంచుఁ బల్కె,న,య్యనిలుఁడు
...శశాం. ౪. ౧౬౦.

గీ...ఇంతమాత్రమునకు నీతపం బేటికి,గోట నై
నపనికి గొడ్డ లేల...తపతీ. ౪. ౧౧.

క...గోరం గడ తేఱుపనికి గొడ్డలి యేలా... రు
క్మా. ౨. ౧౨౮.

గోరుముక్కు=గోటికొన.

గీ. ఎలయుసీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి,యం
టుసొంటులు పరికించి యంట్లఁ బొడిచె,గోరు
ముక్కుల దిగ దువ్వి తూరుపెత్తి,నెఱులఁ గ
లిగినపేల నన్నింటిఁ దిగిచె. పాండు. 3. 30.

గోళ్లునాకు=సంతోషించు. (ఇది చంకలు కొట్టు
కొనువంటిది.)

వ...అని చెప్పి నారదుండు సఫలమనోరథుండై
గోళ్లునాకుచు నాకసంబున నదృశ్యుండై చని
యె...వరాహ. ౧౧. ౯౫.

జ: గోటదొర్లుడుకాయ, గోటిచెనకు, గోటినా
టు, గోరుగల్లు, గోరుగాలము, గోరుగొండి,గోరు
చిక్కుడు, గోరుచీరణము, గోరుచుట్టు,గోరుము
ద్ద, గోరురాజనాలు, గోరువంక[2], గోరువెచ్చ,
గోరొత్తు.

గోరుగల్లు=గోరుగొండి. (√ గోరు)వి.జా. (మం
గలి గోళ్లు తీసెడి) ఇనుపసలాక.

ఆ. పదనుగోరుగండ్లఁ బదరక కొందఱు, కండ్లు వె
తికి నిమ్మపండ్లు గ్రుచ్చి...సానందో.3.౫౭
పా.

సీ. దూరవీక్షార్థి యాగోరుగంటు వ్యాతాక్షుఁ డ
య్యె...కళా. 3. ౧౦౭.

గోరుగాలము. వి. (గోరు + గాలము) చేఁపలను
బట్టుటకు ఉక్కుతో గోటివలె చేసినపనిముట్టు,
బడిశభేదము. (శ. ర.)

గోరుగొ(గ్గొ)ండి. వి. (√గోరు) గోరుగల్లు.

ద్వి. బెదరుచు జనులు విభీతులై చూడ,గోరుగొం
డ్లను యామికులు గొని చేర.పండితా. మహి
మ. ౨౫౦ పా.

ద్వి. దండిరై యామ్యహస్తంబున గోరు,గొండి పల్పటికంటికొల్కి లో నునిచి. పండితా. మహిమ. ౨౫౧ పా.

సీ. మెడ మెట్టి గోర్గొండి మెటికి పుచ్చుడు వీని గ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింప. కాశీ. ౩. ౧౫౨.

**గోరుచిక్కుడు.** వి. (గోరు + చిక్కుడు) ఒకచిన్నజాతిచిక్కుడుకే. (శ. ర.)

**గోరుచీరణము.** వి. (గోరు+చీరణము) గోటివలె కొనయందు వంపు గలయులి. (శ. ర.)

**గోరుచే(ర్చు).** స. క్రి. (బంతిని) కొట్టు.

మ. తరుణుల్ వీటిశిరోగృహాళి నిసి ముక్తాకందుకం బాడుచోఁ, గరకంజంబున జాఱి బంతి కడ కేఁగం దత్స్మృతిం జేరుచం,దురుఁ దద్బుద్ధి గ్రహించి గోర్పఁగఁ దదస్తోకాహతిం గందెఁ గా,కురుమాలిన్యము సత్కలాధిపతి కట్లొందున్ మదిన్ జూడఁగన్. చంద్రి. ౧. ౧౦౨.

మ...రఘువీరుఁడు...మారీచము,ష్కరు మే నాఱుగయుక్తి గాలిపటముంగా వింట నాడించుచున్, సారిదిం దక్కినదైత్యకోటితలబంతులోర్చి మెప్పించె ... విశ్వామిత్రమానీశ్వరున్. చంద్రా. పీఠి. ౨౧.

జః గోరుపు, గోరుపులాడు.

**గోరుచే(ర్చు)ట్టు.** వి. (గోరు+చుట్టు) గోటిచుట్టును లేచుకురుపు.

ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటి, పోటు దాఁకినట్లు పో తలంప, మొదల శోకజలధి మునుఁగంగ నందుపై, నీవు పల్కినట్టినిష్ఠురోక్తి. హరిశ్చ. ౫. ౭౯.

క. వీఁక చెడ నీదుదూతలు, ప్రాఁకంగా నిప్పు డప్పుపైక మడుగునీ, తేఁకువ గోర్చుట్టుపయిన్, రోఁకటిపోటనెడుమాట రూఢం బయ్యెన్. శేష. ౩. ౨౬౩. తపతీ. ౪. ౪౯.

**గోరుతము.** సం. వి. అ. న-గోవుఱఱపు వినిపించునంత దూరము-రెండుకోసులదూరము.

**గోరుప(ర్ప)డము**=గొఱుపడము. వి.కంబళి;నల్లకంబళి; ఒకవిధమైనకంబళి.

సీ...కంబ. గీ. లంబు గొంగడి యనఁగను గంబళి యన,గోరుపడ మనఁగా ... ఆం. భా. ౨. ౧౫౮.

ఉ. భూరినదీప్రవాహమునఁ బోయెడినల్లని యచ్ఛభల్లమున్, గోరుపడంబుగాఁ దలఁచి... చెన్న. ౩. (శ. ర.)

(గొల్లనివర్ణనము) సీ. ఒడిసెల పాలకావడి నుచ్చుప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగోర్పడంబు. వేం. పంచ. ౧. ౫౯౮.

ద్వి...గద్దె,కంబళ్లు కప్పడికంబళ్లు గోర్ప,డంబులు ...పండితా. పర్వ. ౩౪ పా.

**గోరుపు.** వి. (√ గోరుచే.) గోర్చుట. (చూ.గోరుపులాడు.)

**గోరుపులాడు.** స. క్రి. (√ గోరుపు)-బంతి-కొట్టు.

చ. గురుకుచ గుబ్బచన్నుఁగవ గోరుపులాడును బుట్టచెండ్ల...చంద్రా. ౨.౧౨౨. (ఇట ఔపమ్యవాచకము.)

**గోరుముద్ద.** వి. (√గోరు) గోటిమీఁదికి తీసికొని పిల్లలకు పెట్టు అన్నముముద్ద. (వా.)

**గోరురాజేనాలు.** వి. బ. (గోరు+రాజనాలు)ధాన్యభేదము.

సీ. జిలకఱరాజనా ల్చింతపువ్వులు గోరురాజనాలు...హంస. ౪. ౧౨౮.

వ... కస్తూరిపట్టెలు చెన్నంగులు శ్రీరంగాలు చింతపూలు గోరురాజనాలు ... ప్రబంధ. ౧౧౨.

గోరువ(ర్వ)ంక[1]=గొరవంక, గోర, గోరంక,గోర వంక, గోరింక.(సం. గోరంకుః)వి. శారిక,గోర.

వ...జాళువాపంజరంబులఁ జిలుకపలుకులకు మాఱుపలుకుగోరువంకలవంకఁ జెలరేఁగి... ఉ. రా. ౬. ౧౫౮.

సీ...శారికాఖ్య, గోరింక గోర్వంక గొరవంక గోరంక గోరువంక యనంగ మీఱుచుండు. ఆం. భా. ౨. ౮౯.

గీ.గోరవంక గోరంక నా గోరువంక,యనఁగ శారికాహ్వయములు... వేంక. తిర్య.౯౮.సాం. ని. తిర్య. ౭౮.

గోరువంక[2]. వి. (గోరు+వంక.) నఖక్షతము.

గీ. నఖక్షతశారికాభి, ధానములు గోరువంక నా ...ఆం. భా. ౩. ౬౦.

గోరువె(ర్వె)చ్చ. వి. (గోరు+వెచ్చ.) అల్ప మైనవెచ్చఁదనము. (చూ. వెచ్చ) విణ. కొంచెము వెచ్చనిది.

సీ. ఉష్ణాంబువు లటంచు నొడ్డుకో గోర్వెచ్చజలముల నొకకల్కి జలకమార్చె. దశా. ౬.౨౭.

సీ. గోర్వెచ్చచము రంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళితవారి. పాండు. ౩. ౭౮.

గోరొత్తు. అ. క్రి. (గోరు + ఒత్తు.) నఖక్షతము చేయు.

ద్వి. మునియేఁటనే పైఁడి ముడిచినపడుచు, చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు. అ. మ. క. ౧. ౩౮ పా. ౧౧ పం.

సీ. గుజ్జుమామిడిబావ గోరొత్తనీవుగా యని చేతఁ జెనకె గయ్యాళి యొకతె. రామా. ౨. ౧౦౦.

ఇట్లే: గోరిడు, గోరులుంచు.

గీ.నాగవల్లీదళంబు లెన్నడుమఁ జీరి,మడఁచి యందిచ్చినపుడు గోరిడుమఁ గేల ... నైష. ౮. ౮౮.

సీ. చెలులలోతొడఁ బిఱుందుల గోరు లుంచుచు మురువుతో నొకతెకు ముద్దొసంగు. దశా.౮. ౪౧.

వి. నఖక్షతము.

సీ...గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి. కళా.౭. ౧౬౧.

సీ. ఒఱ పైన మెఱుఁగు గోరొత్తుసందులతోడ రాలుచుండెడిగంధరజముతోడ. భాను. ౨. ౩౯.

గోరోచన. సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.(పశువులపిత్తరసమునుండి తీయఁబడినయొకానొకపసుపుపచ్చనిపదార్థము-విల్యమ్సు- పీతవర్ణము కల గోమస్తకస్థశుష్కపిత్తము- కల్ప.)

గోరోచము. సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

గోరోజనము. వి. (సం. గోరోచనా) గోరోచన.

సీ. గోరోజన మనంగ గోరోచనాభిధ ... ఆం. భా. ౨. ౧౬౩.

గోర్దము. సం. వి. అ. న. మస్తిష్కము, మెదడు.

గోర్పిళ్ళాడు. అ. క్రి. బంతివలె ఎగురు.

శా...అతండు...దంతిరథరథ్యవ్రాతము ల్చేతులన్,గోర్పిళ్లాడ్చుచు వచ్చుచున్నఁ గని రక్షోనాథసేనాధిపుల్. రామా. ౬. ౨౦౬.

గోలజేము. వి. కస్తూరి, ఇట్టిగోలజము.

వ...అలికమ్ముల గోలజంపుటారజంపుఁదిలకంబులు...ప్రబంధ. ౭౮.

గోల[1]. విణ. ౧. ముగ్ధ; ముగ్ధుఁడు, తెలివిమాలినవాఁడు.

సీ. ముగ్ధకుఁ బేళ్లగు ముగుద యన స్నిగ్ధరాలు నా గోల నా బేల యనఁగ. ఆం. సం. మాన. ౪.

ఉ...విప్రవరుండు గోలయుఁ, బాలుఁడుఁ గాన నప్పటికిఁ బైఁ బడఁ గొంకెను...మనుచ. ౩. ౬౪.

సీ. ఖేదమోదంబులభేదంబు తెలియక గోలనై క
డపితిఁ గొన్నినాళ్లు. వేణు. 33.

వి. ఆఁడుది, స్త్రీ.

గీ... లేమ గోల యువిద చామ చాన ... ఆఁ.
భా. ౨. ౧౦౪.

గీ. గోల లెచ్చట గాటంపుఁగోన లెచట, వలవ
దుడుగుము పయనంబు తెలిరఁబోఁడి. అచ్చ.
రా. అయో. ౭౭.

జ: గోలతనము.

గోల[2]. వి. కలకలము.

(వ్యవ) ఏదియో గోల వినఁబడుచున్నది. పిల్లలు
గోలచేయుచున్నారు.

గోల. సం. వి. ఆ. స్త్రీ. ౧. పట్రువ యగునీటికాఁ
గు. ౨. గుండ్రనిపదార్థము. 3. గోలీ; చెండు.
౪. సిరా. (విల్యమ్సు.) ౫. మణిసిల, ఎఱ్ఱపాషాణ
ము. ౬. చెలికత్తె. ౭. దుర్గ. ౮. గోదావరీనది.

గోలతనము. వి. (గోల[1]+తనము.) ముగ్ధత్వము,
మౌగ్ధ్యము.

గీ... ఇవ్వేళ యింత, గోలతన మేల నను నేలుకొ
నవె బాల. రసిక. ౫. ౧౭౨.

ఉ. గోలతనానఁ బల్కెదవు కుంభకుచాపరిరంభ
గుంభనో,ద్వేలసుఖోదయంబనుభవింపనివాఁ
డవు గాన ... శశాం. 3. ౭౦. విజ. వి. ౨.
౨౮.

గోలత్రికా. సం. వి. ఆ. స్త్రీ. ఖంజరీటి,ఆఁడుకాటు
కపిట్ట. (వై. ని)

గోలాంగు(గూ)లము. సం. వి. అ. పుం–ఆవు
తోఁకవంటితోఁక కలది-కొండముచ్చు, ఒకజా
తికోఁతి.

గోలాసము. సం. వి. అ. పుం. కుక్కగొడుగు.

గోలించే. స. క్రి. చమురు పోసి వేచు. (శ. ర)

గోలిహము. సం. వి. అ. పుం. ముష్కకము శి.(కల్ప)

గోలీ. వి. (సం. గోలకః.) బాలురాడుకొను చిన్నరా
తియుండ. (శ. ర.)

గోలీఢము. సం. వి. అ. పుం. ముష్కకము, మొక్క
పుఁజెట్టు.

గోలు[1]=గోడు. వి. ఏడ్పుటయందగుధ్వనికనుకర
ణము. (దీనియామ్రేడితరూపము 'గోలుగోలు.')

వ... దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలు
గోలున నేడ్చినక ... నైష. ౧. ౧౦౮.

గోలు[2]. వి. పేఁపబొద్దునకు ప్రక్క నేర్పఱచెడు
సన్నని పేఁపబొద్దు. (శ. ర.)

గోలురించే. అ. క్రి. (పులి) కూయు. (శ.ర)

జ: గోలురింపు.

గోలురింపు. వి. (√ గోలురించే) వ్యాఘ్రగర్జా
ధ్వని, పులికూఁత.

సీ... అగు గోలురింపన వ్యాఘ్రగర్జాధ్వని. ఆం.
భా. ౨. ౮౨.

గోలెము. వి. బాన.

ఆ. మగనిరాక యెటిఁగి మగువ యొయ్యన అంకు,
మగనిఁ దెచ్చి యింటిమఱుఁగునందుఁ, గల్లు
గోలెముననుగదియించి యామీఁద, గంప
దబ్బునెత్తెఁ గదలకుండ. భల్లా. ౧. (శ.ర)

గోలోకము. సం. వి. అ. పుం. వైకుంఠమునకు మీఁ
దుగా నుండి శ్రీకృష్ణునకు నిత్యస్థానమగు నొక
లోకము.

గోలోమి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వేశ్య,వెలయాలు.
౨. తెల్లగఱికశి. 3. మరులుమాతంగిశి. ౪. వసశి.
౫. నేలగొలిమిడిశి.

గోళ(ల)కము. సం. వి. అ. పుం=గోళము.

గోళ(ల)కుఁడు. సం. వి. అ. పుం. గోళుఁడు, పె
నిమిటి మరణించినతర్వాత అన్యపురుషునివలన క
లిగినకొడుకు.

గోళ(ల)ము. సం. వి. అ. పుం.న.౧.గోలీ,ఉండ; అచ్చనగాయ. ౨. భూమ్యాదిమండలము. ౩. వ ట్రువ, వలయము. పుం. ౧. బాలెంతబోళము. ౨. (జ్యోతి) ఒకరాశియందు ఆఱు గ్రహములు కూడుట అనుయోగము.

గోళాయంత్రము. సం. వి. అ. న. ఒకజ్యోతిష యంత్రము.

గోళి. వి. (సం. ఘోలీ.) ఒకానొకఆకుకూర.

గీ... కొయ్య,గూర చక్రవర్తము చిల్కకూర గోళి,కూర దుంపబచ్చలి తోటకూర...హంస. ౪. ౧౩౩.

సీ. కుచ్చలి యంచనఁ గుచ్చెలి యనఁగను గోళి యటన్నను ఘోలి యొప్పు. ఆం. భా.౨.౩౪.

గోళుఁడు. సం. వి. అ. పుం. విధవకు జంకుమగనివలన పుట్టినకొడుకు. (వ్యతి. కుండుఁడు.)

గోళ్లకుతికంటు. వి. స్త్రీకంఠభూషావిశేషము.(శ. ర.)

గోళ్లగొండి. వి. తృణవిశేషము.బ.ధాన్యవిశేషము.

గీ. గునుకు లూదర్లు ఒరపటల్ గోళ్లగొండు, లల్లి బియ్యంబు వెదురుబియ్యంబు ... కాళ. ౩. ౧౫౧.

గోవ[1]. వి. పురుషగవయము, గురుపోతు.

గీ...గవయమ్ము గోవ,నాఁగ గురుపోతు నాఁగఁ దనర్చు...ఆం. భా. ౨.౭౫.

గోవ[2]. వి. యౌవనము. (చూ. గోవాళ్లు) విశ. ౧. మనోజ్ఞము. (ఉదా: గోవపని, మొ. శ. ర.) ౨. పొగరుఁబోతు, అసాధువు.

వ. దూడలం గుడువ విడిచి దుగ్ధదోహనంబునకుఁ జేర వచ్చిన బెదరి పసులసందునం బాటిపోవుగోవావుల వెనుదగిలి సాధుపశువులచాటునఁ బొంచి కూడముట్టి తలకోలలు వెట్టి యాఁగువారును...వి:పు. ౭.౧౪౭.

ఉ. గోవపిక వ్రజంబునునుఁగూఁతకు ... దశకు. ౬. ౩౩.

గోవమీఱు=అడ్డము లేక తిరుగు. (చి. ని.)

గోవమొలత్రాడు,గోవత్రాడు=పురుషులు మొలను ధరించుటకై వెండితీఁగెతోఁ గాని బంగారుతీఁగెతోఁ గాని అల్లఁబడినమొలత్రాడు. (బ్రౌ. వా.)

జ: గోవతనము, గోవాళ్లు.

గోవ[3]. వి. పశ్చిమసముద్రతీరమందలి యొకపట్టనము. (బ్రౌ)

గోవతేజీ=గోవపట్టనపుగుఱ్ఱము.

సీ. నవవిధదివ్యరత్నంబు లేనుంగులు గోవతేజీల్వచ్చికుంకుమంబు. శుక. ౧. ౧౦౫.

గోవజవ్వా(వా)ది=గోవపట్టనపుజవ్వాది.

గీ. గోవజవ్వాది మొదలుగాఁ గొన్ని గలుగు, పరిమళద్రవ్యములు పెట్టె బంధురముగ. ధనా. ౩. ౩౯.

ఉ. గోవజవాది కస్తురియుఁ గుంకుమ గందము పైఁడిగిన్నెలన్. విజ. వి. ౩. ౧౯౧.

గోవంది(ద)ని. సం. వి. ఈ. స్త్రీ.ప్రేంకణము ౯.

గోవణము=గోణము. వి. (క. కోవణ.త. కోమణమ్.) కౌపీనము.

సీ. తాళవృంతమును వస్త్రములు గోవణములు నొసఁగి రోగార్తుల నుపచరించు. కాశీ.౪. ౬౧.

గీ. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న, కోటిసంఖ్యలనీర్కావిగోవణములు ... కాశీ. ౨. ౫౫.

గోవతనము, వి.(గోవ[2] + తనము) పొగరుఁబోతుఁదనము.

క. మీవీటిముచ్చు లేవుయ, మావీటం గన్న పెట్టి. మణిభూషణముల్, గోవతనంబునఁ దెచ్చిరి, నీ విటు సేయించు పెల్ల నేరమ కాదే.దశకు. ౪. ౨౪.

**గోవత్సము.** సం. వి. అ. పుం. ఆవుదూడ.

**గోవత్సాది.** సం. వి. న్. పుం-ఆవుదూడలను తిను నది-తోఁడేలు. (కల్ప)

**గోవర్ధనము.** సం. విణ. (అ. ఆ. అ) గోవులను వృద్ధి నొందించునది. (అ. ఈ. అ) గోవులను వృద్ధిబొం దించుటకు సాధన మైనది. వి. అ పుం. ఒకానొక కొండ. (ఇది బృందావనమందలిది. దీనిని కృష్ణుఁడు వ్రేలిపై ధరించె నని భాగవతకథ) న. ౧. గోవు లను వృద్ధినొందించుట ౨. గోవృద్ధి.

**గోవశ.** సం. వి. ఆ. స్త్రీ. గొడ్డావు.

**గోవాల్లు(ళ్లు).** వి.బ. (గోవ² + వారలు. శ.ర.)
 ౧. యౌవనవంతుఁడు; యౌవనవంతులు.
 ఆ. కోడెకాఁడనంగ గోవాల్లు నాఁగను, యువ జనాఖ్య లొప్పుచుండు రెండు. ఆం. సం. మాన. ౮.
 క. తిమిరంపువయసుగుబ్బల, కొమరాలవు నీకుఁ దగినగోవాల్ల మహిన్, నెమకి నగ రాదె ము దిసిన, మముఁ జెనకిన నేమి గలదు మద మే మిటికిన్. మనుచ. ౪. ౮౩.
 మ...ఎఱుకుగోవాళుల్ ప్రసూనాశుగ, ప్రదర ప్రేరితచిత్తవృత్తు లగుచున్ భ్రాంతమ్ములం ద్రిమ్మరన్. కాళ. ౩. ౧౧.
 ౨. విటుఁడు; విటులు.
 సీ. విటనామధేయ మా విటకాఁడు వేడుకకాఁడు బొజుఁగు నన్నుకాఁడు లంజె, కాఁడనఁగ నివి యుఁ గాక గోవాళ్లనఁగా నొక్కశబ్దంబు గ లదు బహుళ...ఆం. భా. ౨. ౧౧౬.
 వ...తమతమచెంగటికో డెప్రాయంపుగోవాళ్లకుఁ దిరునాళ్లఁ జూచువేడుకలలోఁ బిసికిళ్లఫల ము కల్పింప నుపాయంబు లెంచి...ప్రబంధ. ౭౮. వేంక. మాన. ౨౮. సాం. ని. మాన. ౮.

**గోవిందద్వాదశి.** సం. వి. ఈ. స్త్రీ. పుష్యనక్షత్ర ముతో కూడినఫాల్గునశుద్ధద్వాదశి. (కల్ప)

**గోవిందుఁడు.** సం.వి.అ.పుం.౧. శ్రీకృష్ణుఁడు. ౨. గవాధ్యక్షుఁడు, గోసమూహాధిపతి. ౩. బృహస్పతి. (మే. ని.) ౪. గోవిందపాదుఁడు, శ్రీశంకరాచా ర్యులగురువు.

**గోవికర్తుఁడు.** సం. వి. అ. పుం. ౧-భూమిని చీ ల్చువాఁడు-సేద్యగాఁడు, కృషీవలుఁడు. ౨. గో ఘాతుకుఁడు, కసాయివాఁడు.

**గోవిట్టు.** సం. వి. ష్. స్త్రీ=గోవిష్ఠ.

**గోవిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. గోమయము, ఆవు పేఁడ.

**గోవిసర్గము.** సం=గోసర్గము.

**గోవు.** సం. వి. ఓ. పుం. ౧. ఆదిత్యుఁడు. ౨. వృష భము. ౩. ఒకానొకయజ్ఞము. ౪. ఒకానొకఋషి. ౫. గుఱ్ఱము. స్త్రీ. ౧. వాక్కు. ౨. దిక్కు. ౩. భూమి. ౪. ఆవు. ౫. ఆఁడుగుఱ్ఱము. పుం. స్త్రీ. ౧. స్వర్గము. ౨. వజ్రము. ౩. ఉదకము. (ఈయర్థ మున బ. అని త్రి. ని.) ౪. కిరణము. ౫. నేత్ర ము. ౬. బాణము. ౭. రోమము, వెండ్రుక. ౮. ప గ్గము. ౯. నారి, అల్లెత్రాడు-కే. ని-(దీనికి స్త్రీ లింగమున తత్పురుషసమాసాంతమందు 'గవి' య నురూప మగును. ఉదా: పన్నగగవి = పతంజలి వాక్కు. కామగవి=కామధేనువు. పుంలింగమున తత్పురుషసమాసాంతమందు 'గవ' అనురూప మ గును. ఉదా: దృఢగవము. తీక్ష్ణగవుఁడు=తీక్ష్ణ మైనసూర్యుఁడు. ఇది సమాహారద్విగువునందు 'గవ' అనురూపము నొందును. ఉదా: పంచగవ ము. ఇది ఉపసర్జన మైనప్పుడు-బహువ్రీహి మొ దలగువానియందు-'గు' అనురూపము నొందును. ఉదా: చిత్రగుఁడు. అతిగువు=గోవు నతిక్రమిం చినవాఁడు. గవాధ్యక్షుఁడు, గోఅధ్యక్షుఁడు, గోధ్యక్షుఁడు, గవేంద్రుఁడు మొదలగుపట్ల నితర విశేషములు వ్యాకరణమును బట్టి యెఱుంగునది.)

**గోవృషభము.** సం. వి. అ. పుం. ఆఁబోతు.

**గోవృషము.** సం=గోవృషభము.

**గోవ్రజము.** సం. వి. అ. పుం. ౧. పసులసాల. ౨. పసులమంద.

**గోశకృత్తు.** సం. వి. త్. న.గోమయము,ఆవుపేఁడ.

**గోశీర్షము.** సం. వి. అ. న. చందనవిశేషము.

**గోషా**=ఘోషా.వి. (హిం. గోషా.) అంతఃపురము, రాణివాసము. (శ. ర.)

**గోష్ఠము.** సం. వి. అ. పుం. న. ౧.గోవులుండుచోటు, పసులసాల. ౨. వ్రేపల్లె, గొల్లపల్లె.

**గోష్ఠశ్వము.** సం. వి. అ. పుం. గోష్ఠమందలికుక్క. విణ. (అ. ఆ. అ)-పసులకొట్టమందలి కుక్కవంటి వాఁడు-స్వస్థానమం దుండి పరులను తిట్టుచు ద్వేషించుచు నుండువాఁడు. (త్రి. ని.)

**గోష్ఠి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పరిషత్తు, సభ. ౨. సంఘము, సమాజము. ౩. సల్లాపము. ౪. కుటుంబములోఁ జేరినపోష్యవర్గము. ౫. (అలం) ఒక్క అంకముతో ముగియురూపకవిశేషము.

**గోష్ఠీపతి.** సం. వి. ఇ. పుం. ౧. సభాధ్యక్షుఁడు. ౨. గృహాధిపతి, ఇంటిపెద్ద.

**గోష్పదము.** సం. వి. అ. న. ౧ గోవుయొక్క అడుగులోఁది గలప్రదేశము;గోవుగొరిసెచే నేర్పడినగుంట. ౨. గోవులు తిరిగెడిచోటు. (ఆవుపాదము మొదలగు అన్యార్థములందు 'గోపదము' అనియే రూపము.)

**గోసంఖ్యుఁడు.** సం వి. అ. పుం. గొల్లవాఁడు.

**గోసఁగి.** వి. (సం.గోహింసకః) ౧. మాదిగవాఁడు.

సీ...గోసంగి మాదిగ గూబరి యన,మాతంగుఁ డగు...ఆం. భా. ౨. ౭౯.

క. సంగీతఫలంబున గో,సంగీ సగ మైనదయ పొసఁగ నీవే...ఆము. ౬. ౬౪. ద్వి.పారిజ్ఞా-ఉ. ౧౫౭౧ పం.

**గోసదృక్షము.** సం. విణ. (అ. ఆ. అ) గోవుతో సమాన మైనది. వి. అ. పుం. గవయము,గురుపోతు.

**గోసన**=గోసు. వి. (సం. ఘోషణా. ప్రా. ఘోసణా. క. గోసనె.) ౧. చాటించుట. ఆం. భా.౧.౧౧౪. ౨. గోల, ఘోషము.

క. మాసొమ్ము మాకు నొసఁగిన, మీసొమ్ము నీకు మఁగుడ మీమాసొమ్ముల్ వాసి పడకుండ నూరక, గోసన యేమిటికి మార్చుకొనియెద మెంఁడెన్. పి. శకుం. ౩. ౭౨.

గోసనపుచ్చు=౧. చాటించు, ప్రకటించు.

చ...దాసియుఁ, గొఱగొఱ వీట నెల్లెడల గోసనపుచ్చిన నర్థలుబ్ధుఁడై, యఱమర మాని తద్విభుఁడు నాబలభద్రునిఁ బట్టఁ బంచినన్. దశకు. ౧౦. ౧౨౬.

౨. స్తుతించు, పొగడు.

మ. తనదుర్వారతరప్రతాపమునఁ జిత్తస్నేహము ల్గట్టి సే,యనితం డెట్టివిదగ్ధుఁడో తలఁపనోహో యంచు లోకంబు గో,సనపుచ్చంగ రమొప్పు దర్పకుఁడు రాజత్సుందరాకారు శ్రో, భనసంపన్నుఁ గృతీశ్వరుం బ్రచురసౌభాగ్యాన్వితుం జేయుతన్. దశకు. ౧. ౭.

**గోసము.** సం. వి. అ. పుం. ౧. బోలము, శాలెంత బోళము. ౨. ప్రభాతము, వేకువ.

**గోసర్గము.** సం. వి. అ. పుం-ఆవులను మేఁతకు విడుచువేళ-గోవిసర్గము, ప్రభాతము.

**గోసు.** వి. (సం. ఘోషః) ౧. చాటింపు, గోసన.

గీ. గోసన యనంగ గోసు నా ఘోషణ మగు ... ఆం. భా. ౧. ౧౧౪.

౨. దూఱు, నింద.

మ...ఈగో నేల చుట్టాలలోన్. హరి. పూ. ౫. ౨౩౪.

గోసడుచు=నిందించు.

మ. మనలన్ ధూర్జటితోడ గోసడిచి కామధ్వంసి పట్టీక పొం,డని చంక్రాంకునిఁ జూపి పోవిడ సురేంద్రాదు ల్సరోజాక్షునిం,గని యెగ్గు ల్ప్రకటించినం గినిసి లోకంబు ల్వినంగా నతం, డనుమానింపక పూనె దైత్యకులసంహారంబు గావింపఁగాన్. నిర్వ. ౨. ౯౩.

గోసెక్కెఁగఁజేయు=తప్పుగా నెంచు ?

ఉ. అక్కట యేను వేడ్క-పడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో,సెక్కెఁగఁజేసి నిన్ను నతిహీనవిధాననియుక్తఁ జేత గా,నిక్కమ యుమ్మలించి తిది నెయ్యమతియ్యము కల్మియే సఖీ. భార. విరా. ౨. ౯౫.

గోసెక్కించు=స్తుతించు, పొగడు.

క. కఱుదులమాటల మమ్మం, గుఱుచవడుగ యేల యింత గోసెక్కింపన్, నెఱయఁగ నీయిష్టము మా, కెఱిఁగింపుము వేడ్క నిత్తు మెయ్యది యైనన్. హరి. ఉ. ౧౦. ౨౮౩.

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళి ప్రదేశంబునం, దరశే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం,డిరువైనాలుగుమూళ్లమేర యని గోసెక్కింపఁగా నేలయ,ద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్. కాశీ. ౧. ౫౩. (చి. ని. పా.)

గోసూత్రిక. సం. వి.ఆ.స్త్రీ.దామెన త్రాడు,పశువులను కట్టువేర్వేఱుపలుపులు గలనిడివిత్రాడు.

గోస్తనము. సం. వి. అ. పుం. ౧. ఆవుచన్ను. ౨. నలుపది పేటలు గలముత్యాలహారము.

గోస్తని. సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష ౕ.

గోస్వామి. సం. వి. న్. పుం. ౧. గోవుల కొడయఁడు. ౨-జితేంద్రియుఁడు - కొన్ని పురుషనామములచివరఁ జేర్పఁబడుగౌరవనామము.(ఉదా:- బోపదేవగోస్వామి, మొ.) ౩. (నాట్యపరిభాష యందు) రాజకుమారుఁడు. (వై. ని, శే. ని.)

గోహత్య. సం. వి. ఆ. స్త్రీ. గోవును చంపుట.

గోహత్యగాఁడు. మి.విణ.గోహత్య చేసినవాఁడు.

సీ....న న్నెట్లుగా నిట్టిగోహత్య గానిఁ జేసి,రను చు...వరాహ. ౧౦. ౬౫.

గోహరి. వి. పరాక్రమము. (శ. ర)

సీ. హరికిశోరములగోహరికి శోషిలనిమ ర్వారగర్వాటోపవీరభటులు. వై. భా. ౬. ౧౫౮.

గోహరీతకి. సం. వి. ఈ. స్త్రీ-మనుజులకు కరక కాయలవలె పసువులకు హితమును చేయునది-బిల్వము, మారేడు ౕ.

గోహిరము. సం. వి. అ. న. కాలిమడమ, పాదమూలము. (కల్ప)

## గౌ

గౌండ్లవాఁడు=గవుండ్లవాఁడు. (సం. గోండః.)

గౌఁడు=గవుఁడు. వి. ౧.సారాయిఅమ్మువాఁడు.౨. కాఁపువారిపట్టపుపేరు. (శ. ర.)

గౌఁడుగీతములు=కల్లు దింపెడివారిపాటలు. (కు. సం. వ్యాఖ్య)

ఉ. జీతికకల్లు ద్రావి మదసింధురగామిను లన్ని శేరియ,ల్వాఱుచు గౌఁడుగీతములు వాడుచుఁ బొల్పుగఁ గ్రాలియాడుచున్. కు. సం. ౬ ౭౦౨.

గౌడ(ళ). సం. వి. ఆ. స్త్రీ. (సంగీ) స్త్రీరాగములలో నొకటి.

గౌడపేరు=గవుడపేరు.

గౌడము. సం. వి. అ.పుం.ఒకానొక దేశము. న. ౨ కానొకపిండివంట, బెల్లముతో చేసినభక్ష్యము.

గౌడసరము=గవుడసరము. వి. స్త్రీభూషావిశేషము. ('చెంపసరము' అని శ.ర-కాని ఈక్రింది ఉదా

హరణమునుబట్టి 'స్త్రీ హస్తభూషావిశేషము' అని తోఁచుచున్నది.)

గీ. మెఱుఁగుఁదీఁగెయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి, దండతాయెతులును సందిదండ లునిచి, కేల గాజులు గాడసరాలు దొడిగి, ప్రేమఁ గైసేసి...వైజ. ౪. ౩౦.

సీ...అణిముత్తెపుఁబేర్లు సందిదండలు నూడిగములు గాడసరములును. కళా. ౭. ౬౬.

గాడి. సం. వి. ఈ. స్త్రీ. ౧. బెల్లమునుండి తీసినసారాయి. ౨. (అలం) రీతులలో నొకటి. (ఇది పరుషాక్షరబహుళమై సమాసబహుళముగా నుండును) ౩. (సంగీ) స్త్రీరాగవిశేషము. (కల్ప)

గాడికము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. బెల్లమున కుపయోగించునది. ౨. బెల్లముతో చేయఁబడినది. వి. అ. పుం. చెఱుకు కీ. న. మద్యవిశేషము.

గౌణము. సం. విశ. (అ. ఈ. అ.) ౧. అముఖ్యము, అప్రధానము. ౨. ఔపచారికము, లాక్షణికము ౩. గుణసంబంధమైనది.

గౌణికము. సం. విశ. (అ. ఈ. అ) ౧. సత్త్వాదిగుణములచేత కలిగినది. ౨.అముఖ్యము. ౩.గుణములకు సాధనమైనది, గుణములను కలిగించునది. ౪. గుణముల నెఱిఁగినది. ౫. గుణములను చెప్పుగ్రంథమును చదివినది. (వాచ)

గౌణ్యము. సం. వి. అ. న. అప్రాధాన్యము, అముఖ్యత.

గౌతమి. సం. వి. ఈ. స్త్రీ. ౧.కృపి,ద్రోణునిభార్య. ౨. గోదావరి. ౩. బుద్ధునిబోధనము. ౪. గౌతమునిన్యాయశాస్త్రము. ౫. పసుపు. ౬. దుర్గ. ౭. గోమతీనది. ౮. గోరోజనము.

గౌతముఁడు. సం. వి. అ. పుం-గోతమవంశమున పుట్టినవాఁడు-౧. అహల్యాపతియు శతానందజనకుఁడు నగునొకఋషి. ౨. శతానందుఁడు. ౩. భరద్వాజుఁ డనుముని. ౪. కృపాచార్యుఁడు. ౫. మాయాదేవీపుత్త్రుఁ డగుశాక్యబుద్ధదేవుఁడు.

గౌద=గవుద. వి. ౧. చుబుకము, గడ్డము;దవుడక్రింది భాగము.

సీ...ప్రసన్నత నొంది కుబ్జ మువ్వంకలయొడలు సక్కఁగ నొత్తి యుసుపఁ దలఁచి, తత్పదంబులమీఁదఁ దనపదంబులు ద్రొక్కి హస్తాంగుళిద్వయ మబలగౌద,క్రింద విప్పగ నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రత లెల్ల మాని ...భాగ. ౧౦ పూ. ౧౨౭౭.

ఉదా: గౌదబిళ్లలు.

౨. గండస్థలము, చెంప.

సీ. చెక్కుచెక్కిలిచెంక చెంప గౌదయనంగ గండస్థలాఖ్యయై యుండు ... ఆం. భా. ౨. ౧౪౩.

జ: గౌదకట్టు.

గౌదకట్టు=గవుదకట్టు. వి. (గౌద + కట్టు) చెంపలను మూసి కట్టుట; చెంపలను మూసికట్టినకట్టు.

గీ. చెంపలను మూసి కట్టుట చెలఁగు గౌదకట్టనంగను...ఆం. భా. ౩. ౩౭.

చ...గౌదకట్టు గసచేరులకెక్కియు దోఁపు నొల్చి పోఁ. ఆము. ౬. ౮౧.

గౌధారము. సం. వి. అ. పుం. ఉడుముయొక్కపిల్ల.

గౌధూమీనము. సం. వి. అ. న. గోదుమలు పండెడుపొలము.

గౌధేయము. సం=గౌధారము.

గౌధేరము. సం=గౌధారము.

గౌనర్దుఁడు. సం=గోనర్దీయుఁడు.

గౌపుచ్ఛికము. సం. విశ. (అ. ఈ. అ) ౧. ఆవుతోఁక యిచ్చి కొనఁబడినది. ౨. ఆవుతోఁక పట్టుకొని దాఁటునది.

గౌర=గవురు. వి. పర్తకుఁడు, బేహారి.

గీ. ఈడము వళంద బందర యింగిలీసు,కళము
మొదలైనపేఁటఁ గౌర లెల్ల, సౌరభద్రవ్యము
లు బేరసారమాడఁ, బిలువనంపిరి తమతమ
పేఁటలకును. హంస. ౧. ౧౧౨.

క. ఈరీతి సకలధర్మవి,చారుం డగునతనిమాట జ
వదాఁటక య,గ్గౌర మనుచున్నఁ దన్నగ,రీర
త్నం బేలునట్టినృపవరుఁ డెలమిన్. శుక. ౧.
౯౦.

గౌరక్ష్యము. సం. వి. అ. న. పాశుపాల్యము, పసు
లను కాచుట.

గౌరము. సం. విణ. (అ. ఈ. అ) ౧. తెల్లనిది. ౨.
ఎఱ్ఱనిది. ౩. పీతము, పసుపుపచ్చనిది. ౪. స్వచ్ఛ
మైనది. వి. అ. పుం. ౧. తెలుపు. ౨. ఎఱుపు. ౩.
పసుపు. ౪. తెల్లావచె. ౫. ఏకశఫము గలఒకజాతి
మృగము. న. ౧. పద్మకేసరము, అకరువు. ౨. కుం
కుమపువ్వు. ౩. బంగారు.

గౌరవము. సం. విణ. (అ. ఈ. అ) గురుసంబంధ
మైనది. వి. అ. న. ౧. గురుత్వము, బరువు. ౨. గొ
ప్పతనము. ౩. బహూకారము, మన్నన.

గౌరవించు. సం. స. క్రి. గౌరవము చేయు.

వ... ఐరావణకుంభికుంభాస్ఫాలనకర్కశం బగు
కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌ
రవించిన మన్మథుండు మధుసహాయుండై హి
మవత్పర్వతంబు చేరం జనియె. హర. ౩. ౫౩.

గౌరవితము. సం. విణ. (అ. ఆ. అ) పూజ్యము,
గౌరవము కలది.

గౌరసర్షపము. సం. వి. అ. పుం. ౧. తెల్లావచె. ౨.
పరిమాణ భేదము.

గౌరాస్యము. సం. వి. అ. పుం. తెల్లమొగమును
నల్లదేహమును గలకొండముచ్చు.

గౌరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పార్వతి. ౨. ఎనిమిదేం
డ్లచిన్నది. (శ్లో. అష్టవర్షా భవేద్గౌరీ నవవర్షా తు
రోహిణీ.) ౩. సమర్తాడనికన్యక. ౪. భూమి.
౫. పసుపు. ౬. మ్రానిపసుపు. ౭. గోరోజనము.
౮. వరుణునిభార్య. ౯. మల్లెతీఁగ. ౧౦. తులసిచె.
౧౧. మంజిష్ఠ, మంజిటిచె. ౧౨. తెల్లగటికచె. ౧౩.
వాక్కు. ౧౪. సువర్ణకదళిచె. ౧౫. ఒకానొకరా
గము. (వాచ)

ఉ... భైరవి నాట తోడి... గౌరి బిళాహరీ ల
లితకన్నడగౌళ ముఖారి... చెన్న. ౨. ౨౩౬.

గౌరికుంకుమలు. మి. వి. బ. ఒకజాతివడ్లు.

సీ... సీతాభోగసరులు గౌరి,కుంకుమల్ రణపెం
డ్లికొడుకులు... గీ... అది యగుపేరు గలుగు
వడ్లతనియింట,నుండు... హంస. ౪. ౧౨౯.

వ... సీతాభోగాలు గౌరీకుంకుమలు నాగమల్లెలు
... ప్రబంధ. ౧౧౨.

గౌరిలము. సం. వి. అ. పుం. ౧. తెల్లావచె. ౨. అ
యశ్చూర్ణము, ఇనుపపొడి.

గౌరీజము. సం. వి. అ. న. అభ్రకము.

గౌరీపట్టము. సం. వి. అ. పుం. శివలింగము నెలకొ
నియుండుపళ్లెరమువంటిపీఠము, పానపట్టము.

గౌరీలలితము. సం. వి. అ. న. హరితాళము, అరి
దళము.

గౌరు[1]=గవురు. వి. ౧. ఏనుఁగు.

సీ... ఏనుంగు హత్తి గౌ రేనుఁ గేన్గు, నాఁగ
దంతావళ నామ మూ... ఆం. భా. ౨. ౯౫౪.

ఉ... నీరు ద్రావుగౌ,రుం దెగి యుండు నిట్ల పగ
రోప మెలర్పఁగ నాఁడు నాఁటికిన్. భార.
అను. ౧. ౨౨౧.

గౌరుమోముదొర = గజాననుఁడు, విఘ్నేశ్వ
రుఁడు.

చ. ... నిచ్చలుం, బలితపుగౌరుమోముదొరపాద
యుగంబు శుభంబు లీవుతన్. చం. రా. ౧. ౭.

గారు². వి. కాహళి, బాకా.

వ...మూరి భేరి గారు గుమ్మెటంబు ... లోనగున సంఖ్యాతవాదిత్ర త్రితయపరంపరలు ... ఆము. ४. ३५.

సీ. గా రన నేనుఁగు కాహళి విలసిల్లు ... ఆం. భా. ३. ४४. హంస. ३. ७८.

గారు³. వి. కపటము.

సీ...కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు ... ఆం. భా. ౧. ౧३७.

గారుఁడుం. సం. వి. అ. పుం. ౧. చంద్రుఁడు. ౨. బ్రహ్మదేవుఁడు. (శే. ని)

గాలక్షణికుఁడు. సం. వి. అ. పుం. గోలక్షణము లు తెలిసినవాఁడు. ౨. గోలక్షణములను దెల్పుశాస్త్రమును చదివినవాఁడు.

గాలికము. సం. వి. అ. పుం. ముష్కకము, మొక్కపుఁజెట్టు.

గాలు=గవులు. వి. ౧. గంధము, వాసన.

చ...లేఁగపులితండము నెత్తుటిగాలుకై హాళా, హాళి మెయి రాఁగ...సారంగ. ३. ౧౧२.

ద్వి. మానిసిగాలుఁ బల్మఱు పసిగొనుచు...ద్వి. హరిశ్చ. పూ. ౨౦७ పం.

౨. దుర్గంధము, దుర్వాసన.

గీ. మూఁడువేళలఁ బురువులఁ దోఁడివేసి, నీళ్ల చేగాలు వోవంగ నెమ్మిఁ గడిగి. భల్లా. ౨ఆ. (శ. ర.)

గాళము=గవిలెము? వి. వాసనకై ఆఱుగఁదీసి గంధములో కలిపెడుఒకానొకగింజ.

సీ. గాళము ల్పచ్చాకు కచ్చూరములు...హంస. ౧. ७౧.

గాళి=గవులి. వి. గృహగోధిక, బల్లి. (ఇది శకునము ను సూచించును.)

వ...కాశికంబు డబ్బు గబ్బులుఁగు గాళి కనుఁ బెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులై యున్నయవి. ఆము. ౬. ౬౬.

గీ. బల్లి గాళిన ముసలికిఁ బరఁగు సాంజ. సాం. ని. తిర్య. २५. వేంక. తిర్య. ౯५.

గాళి. సం=గాడి.

గాశతికుఁడు. సం. విశే. (అ. ఈ. ఆ) నూఱుగోవులు కలవాఁడు.

గాష్ఠీనము. సం. వి. అ. న. మునుపు గోవులమంద యుండినపట్టు.

గాసహస్రికుఁడు. సం. విశే. (అ. ఈ. ఆ) వేయి గోవులు గలవాఁడు.

గాసెన=గవుసెన. (సం. కోశః. త. కొచనై.)

క...నాదగు,కడిమియ నీసైన్యమునకు గాసెన గాదే. భార. ఉద్యో. ४. ౨౧४. (గవుసెన వలె రక్షక మని భావము.)

ఉ. కట్టినసీలిదిండ్లు సెలకట్టియువిండ్లును విండ్లగాసెనల్. మనుచ. ४. ३३. కువల. ५. ३२.



గ్రంథకుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పుస్తకభాండాగారము. ౨. వ్రాసికొ నెడిగది. (త్రి. ని.)

గ్రంథన. సం. వి. ఆ. స్త్రీ=గ్రంథనము.

గ్రంథనము. సం. వి. అ. న. ౧. కూర్పు, రచన. ౨. (పుష్పమాలిక, మొ. వానిని) గ్రుచ్చుట.

గ్రంథము. సం. వి. అ. పుం. ౧. కూర్పు, రచన. ౨. (పుష్పములు, మొ. వానిని) గ్రుచ్చుట. ३. కావ్యాది. ४. ధనము. ५. అనుష్టుప్పు, ముప్పదిరెండక్షరములశ్లోకము. (వాచ)

గ్రంథి. సం. వి. ఇ. పుం. ౧. కంతి. ౨. గనుపు. ३. ముడి. ४. ముల్లె, బట్టకొంగున ముడివేయఁబడిన ధనము. ५. అవయవసంధి, కీలు. ౬. గండివనము,

గ్రంథిపర్ణము ౕ. ౬. కాటిల్యము. న్. పుం. ౧. గ్రంథములు కలవాఁడు. ౨. గ్రంథములు చదువు వాఁడు.

గ్రంథికము. సం. వి. అ. న. ౧. పిప్పలీమూలము, పిప్పలికట్టె. ౨. గ్రంథిపర్ణము ౕ. ౩. గుగ్గులువు, మహిషాక్షము. ౪. కరీరము, వెదురుమొలక. (మే. ని.)

గ్రంథికుఁడు. సం. వి. అ. పుం. ౧. జోస్యుఁడు. ౨. సహదేవుఁడు, యుధిష్ఠురునితమ్ములలో నొకఁడు. (మే. ని.)

గ్రంథిచ్ఛేదకుఁడు. సం. వి. అ. పుం. ముడియవిడుపుదొంగ, మూట విప్పి దొంగతనము చేయువాఁడు.

(ఇట్లే గ్రంథిచ్ఛేదుఁడు, గ్రంథిమోచకుఁడు, మొ.)

గ్రంథితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కూర్పఁబడినది. (మాల్యాది) ౨. రచింపఁబడినది. (గ్రంథాది.)

గ్రంథిపర్ణము. సం. వి. అ. న. ౧. గండివనము ౕ. ౨. పచ్చాకుౕ. ౩. మాచిపత్రి ౕ.

గ్రంథిబంధనము. సం. వి. అ. న. ౧. ముడివైచుట. ౨. వివాహమున వధూవరులచెఱఁగులు ముడివైచుట.

గ్రంథిమూలము. సం. వి. అ. న. లశునము, వెల్లుల్లిౕ. (రా. ని.)

గ్రంథిలము. సం. విణ. (అ. ఆ. అ) గనుపులు గలది. వి. అ. పుం. వెణుతురు ౕ. న. ౧. పిప్పలివేరు. ౨. అల్లముౕ.

గ్రంథిహరుఁడు. సం. వి. అ. పుం. మంత్రి.

గ్రందె. వి. దారబందము లోనగువానినిలువులయందు బిగఁగొట్టినచీలకు తగిలించెడుతలువులయందలియినుపపట్టె. (శ. ర.)

గ్రక్కతిలు(ల్లు). అ. క్రి. (భయాదులచే) వ్రడఁకు, కంపించు, అదరు.

క. మ్రొక్కెదము సామి నీదయ, నెక్కడనుం బ్రొద్దుపొడుచు టెఱుఁగక నీవే, దిక్కని యుందుము దాయలు, గ్రక్కతిలం గడుపుచల్ల గదలక యుండఁ౯. రామా. ౨. ౬.

ఉ...ధరిత్రియుం, గ్రక్కతిలంగఁ జొచ్చె నధికంబుగ నొక్కత ముక్తకేశ యై, మిక్కిలి యేడ్చు చున్నయది మీఁదటికీ డది యేమి పుట్టునో. భా. రా. యు. ౧౩౩౪.

సీ. నిజవేగజితమనోనిలజవవాజిసంహతి ధరాతలము గ్రక్కతిలఁ బర్వ. చిత్రభా. ౬. ౩౦. సుద. ౫. ౫౭.

గ్రక్కదలు. అ. క్రి. (గ్రక్కు + అదలు - ఉభయతులలోనిది.) ౧. కంపించు, అదరు.

చ. గదఁ గొని భీముఁ డంత్యలయకాలకృతాంతుఁడపోలె నేల గ్రక్కదల నదల్చి నిల్చిన నకంపితుఁడై మణిమంతుఁడు... భార. ఆర. ౪. ౧౭.

(అసురేంద్రసైన్యములు) క. పదపదఁ డంచు దిశలు గ్రక్కదలఁగ లేయెండచాయఁ గడు నుగ్రములై, యెదురం గొందఱు గల రని, మదినించుక సరకుగొనక మదమున నడచె౯. నిర్వ. ౬. ౯౨.

(లక్ష్మణుఁడు.) క. కదలె రభసమున ధర గ్రక్కదలఁగ శేషుండు శిరము లల్లన వంప౯. భా. రా. యు. ౧౩౧౦.

౨. భగ్నమగు.

చ...కలాపకుంతలలు కంతుశరవ్యథ మాన మెల్ల గ్రక్కదలి కలంగకుండఁ దమకాంతునిఁ దచ్చెదమన్న...పరాహ. ౪. ౪౨.

గ్రక్కన=గ్రక్కున. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా.

చ...పైచెఱంగు గ్రక్కనఁ జనునోయిఁ జేర్చు

చు మొగంబున లేఁజెమ రంకురింప... పారి. ౧. ౧౨౪.

మ...ధాత... గ్ర,క్కన లంకాపురి కేఁగెఁ జా రణముఖుల్ గైవారము ల్సేయఁగన్. ఉ. రా. ౫. ౧౨.

మ. అని యూహించుసమీరపుత్రుని రయం బా రన్ భుజంగాంబ గ్ర,క్కన మ్రింగ న్దలయో జనాయతముగా నాస్యంబు వే పెంచినన్. భా. రా. సుం. ౪౭.( చి. ని. పా.)

మ...ఆచంద్రహాసుండు...దే,వునిఁ జక్రాబ్జగదా సిహస్తు...కాంచి గ్ర,క్కన మాణిక్యరథం బు డిగ్గి చని సాష్టాంగంబుగా మ్రొక్కినన్. జై. భా. ౮. ౧౩౦. దశా. ౧. ౩౦౪.

గ్రక్కు=కఱుక్కు. వి. తెగుట మొదలగువానియం దగుఅనుకరణము.

ఆ. అన్నినెడఁదవాతియమ్ము లద్భుతముగ,నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కనంగ,నతఁడు లీలఁ దు నిమె నందఱతలలును...భార.విరా.౫.౧౪౯.

జ: గ్రక్కదలు.

గ్రక్కున=గ్రక్కన. క్రి. విశ. ద్రు. ౧. శీఘ్ర ముగా.

చ. కరము సలంబు మీఱ దశకంఠునిమంత్రి ప్ర హస్తుఁ డుగ్రుఁడై, కరముసలంబునం గడపె గ్రక్కున వేవురు యతులన్...ఉ. రా. ౩. ౩౬.

చ...దైవకృతంబులు మాన వంచు గ్ర,క్కున న నలప్రవేశమునకుం గృతనిశ్చయ యయ్యా నం తటన్. విక్ర. ౬. ౧౨౬.యయా. ౩.౯. ఆం. భా. ౩. ౭౧. దశా. ౨. ౬౫.

౨. వెంటనే.

సీ. గ్రక్కున సప్తపారావారవలయితక్షోణిమం డలి వాన గురియదయ్యె. వరాహ. ౭. ౫౨. (చూ. ౫౦, ౫౧.)

౩. నిరంతరము, ఎడతెఱపి లేకుండఁగ.

ఉ. అక్కట నీయుదగ్రచరణాహతి కోరువ లే క యేగతిన్,స్రుక్కినొ గట్టురాచకొమరుం డలనాఁడు కపోతహుంకృతిన్, గ్రక్కున మూల్గుచున్ బిలముఖంబున నేఁడును గంపె నెత్తురుల్,గ్రక్కెడు ధాతువు ల్సెదరఁగా నరుణాంబుఝరీమిషంబునన్. వసు. ౨. ౯.

గ్రచ్చ=గచ్చ.

సీ. గ్రచ్చ గచ్చునఁ జెల్వుఁ గాంచుఁ గాచస్థాలి ...ఆం. భా. ౨. ౪౯.

క. అచ్చోటితీర్థవాసులు, వచ్చి తగునె నీకుఁ బు ణ్యవాహిని నిటు వా,క్రుచ్చితి వని పడి నంద ఱు,గ్రచ్చ గదలినట్లు గువ్వకరిగొని తిట్టన్. జై. భా. ౪. ౭౨.

జ: గ్రచ్చకాయ.

గ్రచ్చకాయ. వి. (గ్రచ్చ + కాయ) గ్రచ్చతీఁ గెకాయ.

సీ. కలి వోసి నాన్పినగ్రచ్చకాయలభంగిఁ గొఱ మాలినట్టిదృగ్గోళకములు. కాశీ. ౩. ౧౩౮.

బ. బాలక్రీడావిశేషము.

సీ. డాఁగిలిమ్రుచ్చులాటలు గ్రచ్చకాయలు వె న్నెలకుప్పలు తన్నుబిల్ల. కాశీ. ౩. ౩౩.

గ్రచ్చ=గచ్చ². విశ. (సం. గ్రస్తమ్-శ. ర)

గ్రథన. సం. వి. ఆ. స్త్రీ=గ్రథనము. (విల్యమ్సు)

గ్రథనము. సం. వి. అ. న. ౧. రక్తాదులు పేరుట, గడ్డకట్టుట. ౨. కూర్పు; గ్రుచ్చుట. ౩.(గ్రంథాదులు)రచించుట. (విల్యమ్సు)

గ్రథితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. రచింపఁ బడినది. (గ్రంథాది) ౨. గ్రువ్వఁబడినది. (హారాది) ౩. కూర్పఁబడినది. ౪. పేరినది, గడ్డకట్టి నది.

గ్రద్ద=గద్ద. వి. (సం. గృధ్రః. ప్రా. గద్ధో) గద్ద.

